సదానందో విజయతే

# శ్రీమద్భాగవత మహాపురాణ సంహిత

## శ్రీధరీయ భావార్థ దీపికా వ్యాఖ్య-ఆంధ్రానువాదము

## దశమ స్కంధము-పూర్వభాగము



పరమహంస పరివ్రాజకాచార్య
శ్రీశ్రీశ్రీమదనానంద సరస్వతీస్వామివారు



పీఠాధీశ్వరులు
పరమహంస పరివ్రాజకాచార్య
శ్రీశ్రీశ్రీ మాధవానంద సరస్వతీ స్వామివారు



కృష్ణం వందే జగద్గురుమ్



శ్రీకృష్ణశ్శరణం మమ



పరమహంస పరివ్రాజకాచార్య
శ్రీశ్రీశ్రీ కృష్ణానంద సరస్వతీస్వామివారు


సంపాదకులు
మదనానంద సాహితీ సరస్వతి
బ్రహ్మశ్రీ దోర్బల విశ్వనాథశర్మగారు


సాధనాత్ సాధ్యతే సర్వమ్

# శ్రీమద్భాగవత మహాపురాణ సంహిత (శ్రీధరీయ భావార్థ దీపికా వ్యాఖ్య-ఆంధ్రానువాదము)

## సంపాదక వర్గము



ప్రధాన సంపాదకులు
బ్రహ్మశ్రీ
దోర్బల విశ్వనాథశర్మగారు



ప్రథమ స్కంధము
బ్రహ్మశ్రీ డా॥
శివునూరి విశ్వనాథశర్మగారు



పంచమ స్కంధము
బ్రహ్మశ్రీ
గౌరీభట్ల బాలముకుందశర్మగారు



నవమ స్కంధము
బ్రహ్మశ్రీ
ఆదరాసుపల్లి వేంకటరామశర్మగారు



ద్వితీయ స్కంధము &
దశమ స్కంధము-పూర్వభాగము
బ్రహ్మశ్రీ
ఉమాపతి పద్మనాభశర్మగారు



షష్ఠ స్కంధము
బ్రహ్మశ్రీ
దోర్బల కుమారస్వామిశర్మగారు



దశమ స్కంధము - ఉత్తర భాగము-1
బ్రహ్మశ్రీ
ములుకుట్ల రామకృష్ణశాస్త్రిగారు



తృతీయ స్కంధము
బ్రహ్మశ్రీ
మేడిపల్లి కృష్ణమూర్తిశర్మగారు



సప్తమ స్కంధము
బ్రహ్మశ్రీ
వెల్మకన్న హనుమచ్ఛర్మగారు



ఏకాదశ స్కంధము
బ్రహ్మశ్రీ
పురాణం మహేశ్వరశర్మగారు



చతుర్థ స్కంధము
బ్రహ్మశ్రీ
మంగళంపల్లి వేణుగోపాలశర్మగారు



అష్టమ స్కంధము &
దశమ స్కంధము- ఉత్తర భాగము-2
బ్రహ్మశ్రీ డా॥
తలముడిపి బాలసుబ్బయ్యశర్మగారు



ద్వాదశ స్కంధము
బ్రహ్మశ్రీ
అయాచితం నటేశ్వరశర్మగారు

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

# శ్రీమద్భాగవతమహాపురాణ సంహిత

## శ్రీధరీయభావార్థ దీపికావ్యాఖ్య - ఆంధ్రానువాదము

## దశమ స్కంధము (పూర్వ భాగము)


**అనువక్త :**

**శ్రీమదనానంద సాహితీసరస్వతి, మధురకవి**

**బ్రహ్మశ్రీ ఉమాపతి పద్మనాభ శర్మ గారు** విశ్రాంతోపన్యాసకులు.

**సంపాదకులు :**

**శ్రీమదనానంద సాహితీసరస్వతి, అభినవ మల్లినాథసూరి**

**బ్రహ్మశ్రీ దోర్బల విశ్వనాథశర్మ గారు** విశ్రాంత ప్రధానాచార్యులు



**ప్రచురణ:**

**శ్రీగురు మదనానందసరస్వతీ పీఠము, రాంపురం - తొగుట.**

ఈ గ్రంథము **తిరుమల తిరుపతి** దేవస్థానం, **తిరుపతి** వారి ఆర్థిక సహాయంతో ముద్రించబడినది.

**జయ మదనానంద** **సదానందో విజయతే** **జయ కృష్ణానంద**

## రసోవై సః

ఆనంద సరస్వతీ సంప్రదాయ ప్రవర్తకులు **శ్రీ సదానందస్వామి,** మా పీఠ మూలపురుషులు, పరమగురువరేణ్యులు పరమహంస పరివ్రాజకాచార్య **శ్రీశ్రీశ్రీ మదనానందసరస్వతీస్వామి** మరియు పీఠవ్యవస్థాపకులు అస్మద్గురువరేణ్యులు పరమహంస పరివ్రాజకాచార్య, మహంత పద్మవిభూషణ **శ్రీశ్రీశ్రీ కృష్ణానందసరస్వతీస్వామి** వారి దివ్యాశీరనుగ్రహ విశేషముచే నేడీ ఉత్కృష్టమైన గ్రంథము మనందరికీ అందుబాటులోనికి వచ్చింది. నిగమకల్పతరోరుగలితమైన శ్రీమద్భావతాన్ని పూర్తిగా అర్థం చేసుకోవడం, అవగతం చేసుకోవడం అంత సులభమైన అంశముకాదు. **'రస'** పిపాసులకు శుక ముఖామృతమైన ఈ అద్వైత తత్త్వ నిరూపక గ్రంథాన్ని శ్రీధరులు అమర భాషలో అత్యంత సుమనోహరముగా మనకోసము వ్యాఖ్యానించారు. మా గురువరేణ్యుల ఆజ్ఞానువర్తనులమై మేము శ్రీమద్భాగత ప్రవచనము చేసే వేళలలో ఆంధ్రభాషలో వ్యాఖ్యానాలు తృప్తి కలిగించేరీతిలో లేవని గ్రహించడము జరిగింది. గురుదేవుల ఆదేశానుసారమే, శ్రీవారి ఆశీస్సులతో పీఠకార్యవర్గముచే ఈ బృహత్తర అనువాద ప్రక్రియ సాధించి ముద్రించబడుచున్నది.

శ్రీమదనానంద సాహితీ సరస్వతి పురస్కార గ్రహీతలు, మా పీఠానికి అత్యంత ఆదరణీయులు, మూర్తీభూత అద్వైతరసమైన బ్రహ్మశ్రీ దోర్బల విశ్వనాథశాస్త్రి గారి పావన సంపాదకత్వమువల్ల **'బంగారానికి తావి'** అబ్బినట్లు అనువాద ప్రక్రియకు **'వన్నె'** చేకూరింది. ఈ బృహత్కార్యములో ప్రత్యక్షముగా పాలుపంచుకొన్నవారికి, గ్రంథాన్ని అక్షరాకృతిలో అందించినవారికి, పఠితలకు, జిజ్ఞాసువులకు అందరికీ **"భాగవతం"** వల్ల ఏ ఫలితంరావాలో అది వచ్చితీరుతుంది. అది అందరికీ అందేలా చేయాలని తమ కృపాకటాక్షాలను, ఆనందత్వసిద్ధి ద్వారా అమృతత్వాన్ని పొందేలా అనుగ్రహించాలని సిద్ధపరబ్రహ్మ స్వరూపులు గురు, పరమగురువరేణ్యులను నారాయణస్మరణపూర్వకముగా అర్థిస్తున్నాను.

### సాధనాత్ సాధ్యతే సర్వమ్

**– స్వామిమాధవానందసరస్వతీ.**

**సదానందో విజయతే**

**జయ కృష్ణానంద** **శ్రీమదనానందో విజయతే తరామ్** **జయ మాధవానంద**

## " సమర్చనమ్ "

నిరతాన్నదానతత్పరులు, అపారతపస్సంపన్నులు, అపర శివావతారులు పరమహంస పరివ్రాజకాచార్య శ్రీశ్రీశ్రీ మదనానందసరస్వతీస్వామివారి ఆజ్ఞానుసారము శ్రీగురుమదనానందసరస్వతీ పీఠము ఆవిర్భవించినది. ఈ పీఠ వ్యవస్థాపక పీఠాధీశ్వరులు మహంత పద్మవిభూషణ పరమహంస పరివ్రాజకాచార్య శ్రీశ్రీశ్రీ కృష్ణానందసరస్వతీస్వామివారు. తత్ కరకమల సంజాతులు ప్రస్తుత పీఠాధీశ్వరులు పరమహంస పరివ్రాజకాచార్య శ్రీశ్రీశ్రీమాధవానందసరస్వతీ స్వామివారు. వీరు తమ పూర్వాశ్రమములో గజ్వేల్ పట్టణములో శ్రీమద్భాగవత ప్రవచనము చేసియుండిరి. ఆ సందర్భములో శ్రీమద్భాగవత పురాణము యొక్క శ్రీధరీయ టీకకు ఆంధ్రానువాదము లేకపోవడము లోటుగా గమనించి, అప్పటి పీఠాధీశ్వరులు **శ్రీశ్రీశ్రీకృష్ణానందసరస్వతీస్వామి** వారితో విన్నవించగా, పీఠముద్వారా ఆంధ్రానువాదము జరిపించవలెనని శ్రీస్వామివారు అభిప్రాయపడినారు. తరువాత కాలములో **శ్రీశ్రీశ్రీమాధవానందసరస్వతీస్వామి** వారు వరిగుంతము, లింగాపురము గ్రామములలో చేసిన శ్రీమద్భాగవత ప్రవచనముల సందర్భముగా కూడా శ్రీధరీయ టీక యొక్క ఆంధ్రానువాదము యొక్క ఆవశ్యకతను గమనించి, స్వామివారు పండిత సభను ఏర్పాటుచేసి తమ అభిప్రాయమును వెల్లడించినారు.

ఎంతో శ్రమతో కూడిన ఈ మహాకార్యాన్ని నిర్వహిచుటకు పండితులు సంతోషముగా అంగీకరించి, అనువాద కార్యక్రమమును ప్రారంభించినారు. ఈ బృహత్ అనువాద కార్యక్రమమునకు సంపాదకులుగా శ్రీమదనానంద సాహితీ సరస్వతి బ్రహ్మశ్రీ దోర్బల విశ్వనాథ శర్మగారు వ్యహరించుచున్నారు. వారి సూచనలు సలహాలతో పండితులు ఈ అనువాద కార్యక్రమాన్ని ఎంతో పట్టుదలతో నిర్వహించినారు.

ఈ అనువాద కార్యక్రమమును నిర్వహించిన పండితులకు, ఆర్థిక సహాయము అందించిన తిరుమల తిరుపతి దేవస్థాన కార్యనిర్వాహక మండలికి, ముద్రణాప్రతులను సరిచూచిన పండితులకు, బ్రహ్మశ్రీ దోర్బల ప్రభాకరశర్మ గారికి, సద్విమర్శనలను అందించిన విద్వద్వరేణ్యులకు, ముద్రణలో సహకరించిన ఆకృతి ప్రింటర్సువారికి, శ్రీపబ్బా శివరాజయ్యగారికి పీఠాధీశ్వరులు శ్రీశ్రీశ్రీమాధవానందసరస్వతీ స్వామివారు నారాయణస్మరణ పూర్వక ఆశీస్సులు అందజేస్తున్నారు. పీఠ కార్యవర్గము కృతజ్ఞతాసుమాలను సమర్పిస్తున్నది. అన్నీ చూచుకున్న శ్రీ శ్రీవాండ్ల సాయిబాబ గారికి, శ్రీ రావికోటి సోమశేఖరశర్మ గారికి ప్రత్యేకముగా కృతజ్ఞతలు .

ఈ అనువాద ప్రక్రియను మా పీఠ వ్యవస్థాపక గౌరవాధ్యక్షులు కీ ॥ శే ॥ బ్రహ్మశ్రీ రావికోటి సుధాకరరావు గారి స్మృతిలో సమర్పిస్తున్నాము.

ధర్మాధికారి

**శ్రీగురు మదనానంద సరస్వతీ పీఠము,** రాంపురం – తొగుట.

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.



## పీఠవ్యవస్థాపక గౌరవాధ్యక్షులు స్వర్గీయ (కీర్తిశేషులు)

# బ్రహ్మశ్రీ రావికోటి సుధాకరరావుగారు

సనాతన భారతీయ సంస్కృతి నిస్తేజమై, నిర్వీర్యమై దాని అస్తిత్వానికి ప్రమాదం ఏర్పడినపుడు, దాని ప్రాశస్త్యాన్నీ, అజరామరతనూ నిలిపేందుకు (చిజ్జ్యోతి) జ్యోతిర్మయచైతన్యము తానే నిటారుగా నిలబడి తన అస్తిత్వాన్ని బహుముఖంగా చాటుతుండటం ఈ జాతిలోని లక్షణం. అదే దీని అర్వాచీనతకు కారణం. ఆ మహాజ్యోతి శ్రీమదనానందసరస్వతీస్వామివారైతే దాని సార్వదేశిక కిరణ ప్రసారం **బ్రహ్మశ్రీ రావికోటి సుధాకరరావు గారు.**

## శ్రీసుధాకరుని జీవితం తెరచిన పుస్తకమే

వీరు యువ వైశాఖ కృష్ణ ఏకాదశి(27.5.1935) నాడు టేక్మాలు గ్రామములో సరస్వతీబాయి శంకరశాస్త్రి, దంపతులకు మొదటి సంతానముగా జన్మించిరి. వీరు తమ పెదనాన్నగారైన బ్రహ్మశ్రీ లక్ష్మీనారాయణశాస్త్రిగారి (శ్రీశ్రీశ్రీ మదనానందసరస్వతీ స్వామివారి పూర్వాశ్రమ నామధేయము) పర్యవేక్షణలో పెరిగినారు. విద్యార్థి దశనుండే పరోపకారిగా ఉంటూ నిస్వార్థ జీవితాన్ని గడిపారు. నీటిపారుదల శాఖలో ఇంజనీరుగా పనిచేస్తూ తన కార్యదక్షతతో అధికారుల, ప్రజల మన్ననలు చూరగొన్నారు. పదవీ విరమణ తరువాత బ్రాహ్మణ సంఘములో జిల్లా,రాష్ట్ర, దేశ స్థాయిలో పనిచేస్తూ బ్రాహ్మణ సంఘ పటిష్టతకు కృషి చేశారు. శ్రీశ్రీశ్రీ మదనానంద సరస్వతీ స్వామివారి వద్ద ఉపదేశము స్వీకరించి వారి ఆశయ సాధనకు విశేషంగాకృషి చేసినారు. విద్యార్థిగా, స్నేహితునిగా, కుమారునిగా, తండ్రిగా, అధికారిగా, నాయకుడుగా, శిష్యునిగా ఆదర్శవంతమైన జీవితాన్ని గడిపిన వీరు, శ్రీగురు మదనానంద సరస్వతీ పీఠం వ్యవస్థాపక గౌరవాధ్యక్షునిగా ఉంటూ తన 73వ ఏట సర్వజిత్‌నామ సం. పుష్య శుద్ధ సప్తమి(15.01.2007) నాడు ఉత్తరాయణ పుణ్యకాలములో గురుసన్నిధిని చేరుకొనినారు.

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.



# కృతజ్ఞతాంజలి

శ్రీగురు మదనానందసరస్వతీ పీఠ మూలపురుషులు **శ్రీశ్రీశ్రీ మదనానందసరస్వతీస్వామివారు,** పీఠ వ్యవస్థాపకులు **శ్రీశ్రీశ్రీ కృష్ణానందసరస్వతీస్వామివారు,** పీఠాధీశ్వరులు **శ్రీశ్రీశ్రీ మాధవానంద సరస్వతీస్వామివారు** లోకానికి ఉపయోగకరమైనరీతిలో గ్రామ ప్రాంతాలలో ఎన్నో ధర్మకార్యాలుచేసి, చేస్తూ తాము తరించి, అందరినీ తరింపచేస్తున్న విషయము అందరికీ తెలిసిందే.

ఈ నా గురువుల ఆశీస్సులతో లోకానికి సేవచేసుకొనే అవకాశము నాకు లభించింది. ఇది నా అదృష్టము. మన కళ్ళు తెరిపించి, దారిచూపి, దేవాధిదేవుడు శ్రీకృష్ణుని దయను అందిస్తుంది శ్రీమహాభాగవతము.

ఈ భాగవతాన్ని చదివి అర్థం చేసికొని లోకంలో అన్ని జీవులలో దేవున్నే చూస్తూ అందరూ తరిస్తారని ఆశిస్తున్నాను. ఈ పీఠం ద్వారా జరిగే లోక కళ్యాణ కార్యక్రమాలలో పాలుపంచుకొంటున్న అందరికీ సహృదయ పూర్వకంగా కృతజ్ఞతాభి వందనాలు పీఠ సభ్యునిగా తెలియచేస్తున్నాను.

ఈ సదవకాశాన్ని కల్పించిన గురుమూర్తులకు మరొక్కసారి నమస్కారాలు అర్పిస్తున్నాను.

సదా సేవలో

**చెఱుకు ముత్యంరెడ్డి**

దుబ్బాక శాసనసభ్యులు

పీఠకార్యనిర్వాహక సమన్వయకర్త

" అద్వైతమ్ "

శ్రీమద్భాగవత మహాపురాణ సంహిత

శ్రీధరీయభావార్థదీపికావ్యాఖ్య ఆంధ్రానువాద సంపాదకులు :

# బ్రహ్మశ్రీ దోర్బల విశ్వనాథశర్మగారు.



శ్రీమతి అనంతలక్ష్మి, బ్రహ్మశ్రీ రత్నయ్యదీక్షిత (పరాశ్రమమున శ్రీశ్రీశ్రీ చిదానంద భారతీ స్వామివారు) దంపతులకు రామాయంపేటలో ప్రమోదూత ఫాల్గుణ శుక్ల ద్వితీయ (19-02-1931) నాడు జన్మించిరి. సంస్కృత విద్యాధర్మజీవనులైన వీరు జూనియర్ కళాశాలలలో ప్రధానాచార్యులుగా పనిచేసిరి.

వీరి స్వతంత్ర రచనలు, పరిష్కృత గ్రంథములు, వ్యాఖ్యానములు, ఆంధ్రానువాద ములు తెలుగు రచనలు సుమారు 35 గ్రంథములు సాధన గ్రంథమండలి తెనాలి వారి ద్వారా ప్రచురించబడినవి. వీరి రచనలలో శ్రీ లాలిత్యము, చండీశతకవ్యాఖ్యమున్నగునవి శాక్తేయాది తంత్రశాస్త్రములలో వీరి పరినిష్ఠితిని పరిశ్రమను తెలియచేయుచున్నది. లలితా విష్ణు సహస్రనామాల ప్రతినామానికి వ్యాఖ్యారూప శ్లోకములు పద్యములు వీరి పాండితికి నికషోపలములు.

వీరి సంస్కృతాంధ్ర పాండిత్యాన్ని గుర్తించిన ఎన్నో సంస్థలు, శ్రీమదనానంద సాహితీ సరస్వతి, అభినవ మల్లినాథసూరి మొదలైన బిరుదులతో సత్కరించినవి. అసంఖ్యాకంగా శ్రీమద్భాగవత, దేవీభాగవత, భగవద్గీత, బ్రహ్మసూత్రములు మొదలగు అనేకాంశాలలో ప్రవచనలందించి జిజ్ఞాసువులకు మార్గనిర్దేశకులుగా ఖ్యాతిగడించినారు.

వీరు ప్రస్తుతము మెతుకుసీమలో రామాయంపేట గ్రామమున నివసిస్తూ ఆధ్యాత్మిక శ్రవణ మననముల నొనర్చు, నొనరించు తత్త్వమునాస్వాదించుచు కాలక్షేపమును, సాహితీసేవను చేయుచున్నారు.

**వీరిని గూర్చి తెలపడమంటే అద్వైతాన్ని పలకడమే.**

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.



**శ్రీమద్భాగవత మహాపురాణ సంహిత శ్రీధరీయభావార్థదీపికావ్యాఖ్య దశమస్కంధ(పూర్వభాగము)**

**ఆంధ్రానువాద అనువక్తకులు**

## బ్రహ్మశ్రీ ఉమాపతి పద్మనాభ శర్మగారు

వీరు శ్రీధాత నామ సంవత్సర జ్యేష్ఠ బహుళ ఏకాదశినాడు సిద్దిపేట గ్రామములో జన్మించినారు. వీరి మాతా పితరులు శ్రీమతి రాధమాంబ బ్రహ్మశ్రీ నారాయణ శాస్త్రి గారలు. చిన్ననాటి నుండే తమ అద్భుత ప్రతిభాపాటవాలతో గురువుల, పెద్దల అభిమానాన్ని చూరగొన్నారు. అధ్యాపక వృత్తిలో ప్రవేశించి ఎందరో విద్యార్థులను తీర్చిదిద్ది వారికి మార్గదర్శకముగా నిలిచారు. వృత్తితోపాటు తన ప్రవృత్తియైన సాహిత్య రంగంలో కూడా నిరంతరము శ్రమిస్తూ ఎన్నో పద్యకావ్యములు, వచన గ్రంథములు, ఆంధ్రానువాదములు, చేశారు. వీరి కవితలు ఎంతో మధురముగా ఉంటూ వీరికి లభించిన మధురకవి అను బిరుదమునకు సార్థకతను చేకూర్చునట్లుగా ఉన్నవి. వీరి సాహిత్యము పండిత, పామరజన రంజకముగా ఉంటుందనడములో ఎంతమాత్రము అతిశయోక్తి లేదు.

వీరు రచించిన బ్రతకనేర్చిన మృత్యువు, చంక్రమణం మొదలైన కథానికలు ఆంధ్రప్రభ మొదలైన పత్రికలలో ప్రచురితమైనవి. అలంకారము ఛందస్సు మొదలైన వ్యాసములు భారతి మాసపత్రికలో ప్రచురితమైనవి. వివిధ కవితలు కథానికలు ఆకాశవాణి హైదరాబాద్ కేంద్రమునుండి ప్రసారమయినవి.

శ్రీదేవీ మానసపూజ, తేజోవల్లరి ( పద్యకావ్యములు ) వాస్తవస్తవమ్, నిశ్శ్రేయసమ్, హంసనాదమ్, శివాద్వైతమ్ (వచనగ్రంథములు) మొదలైన గ్రంథములు విద్వాంసులను, విమర్శకులను కూడా మెప్పించినవి.

అద్వైత వేదాంతాన్ని అభిమానించే వీరు యోగవాసిష్ఠం మొదలయిన గ్రంథాల ప్రవచనాలు చేస్తున్నారు. వీరి ప్రవచనాలు, సాహిత్యము ఎంతోమంది పండితులను, సాహితీప్రియులను వీరికి అభిమానులుగా

మార్చినవి. వీరి ప్రతిభను గుర్తించి ఎన్నో సంస్థలు మధురకవి, శ్రీమదనానంద సాహితీసరస్వతి మొదలైన బిరుదులతో సత్కరించినవి.

వీరి రచనలలో వేదాంత గ్రంథమైన నిశ్శ్రేయసమ్ జీవన్ముక్తులను సైతము మెప్పించినది. శ్రీమద్భాగవత మహాపురాణ సంహిత యొక్క శ్రీధరీయ టీక దశమ స్కంధ పూర్వభాగాన్ని వీరు అనువదించిన తీరు అద్వితీయము, అనితరసాధ్యము.

ఆచరణాత్మకమైన అద్వైత భావనలోని సాధ్యాసాధ్యాల పరిశీలనను ఇష్టపడే వీరు, వృద్ధాప్యము వలన కలిగిన అనారోగ్యము శరీరమునకే గాని **"నాకు"** కాదు అని ఋజువుచేస్తూ ఎంతో శ్రమకోర్చి ఈ గ్రంథాన్ని స్వల్పకాలములోనే అనువదించి పీఠమునకు అందచేసినందులకు పీఠము కార్యవర్గము ప్రత్యేక కృతజ్ఞతలు తెలియచేస్తున్నది.

ఇదే విధముగా ద్వితీయస్కంధవ్యాఖ్య అనువాదము ద్వారా వీరి పాండితీ ప్రకర్శను రుచిచూసే అవకాశము మనకు ప్రసాదించినారని తెలియచేయుటకు సంతోషిస్తున్నాము.

ధర్మాధికారి

**శ్రీగురుమదనానందసరస్వతీ పీఠము**

రాంపురం తొగుట మం. మెదక్ జిల్లా.

# సాధనాత్ సాధ్యతే సర్వమ్

**---శ్రీశ్రీశ్రీకృష్ణానందసరస్వతీస్వామివారి ప్రబోధం**

# స్పందనమ్

ఎంతో దుర్లభమైన మానవజన్మ మనకు లభించినది. దీనిని సార్థకము చేసికొని జన్మరాహిత్యాన్ని (ముక్తిని) పొందటము మన ప్రథమ కర్తవ్యము. ముక్తిని పొందటానికి భక్తితో కూడిన జ్ఞాన వైరాగ్యాలు ప్రధాన భూమికను పోషిస్తాయని సకల వేద పురాణ ఇతిహాస ప్రబంధాదులు ప్రబోధిస్తున్నాయి.

వేదవ్యాస మహాముని మనలను తరింపజేయడానికి అందించిన సారస్వతంలో శ్రీమద్భాగవతము ఉత్తమోత్తమమైనది, అనల్పార్థ భాసురమైన దీనకి శ్రీధర పండితుల వ్యాఖ్య ఉత్కృష్టమైనది. వీరి వ్యాఖ్యానము అమరభాషలో ఉన్నది. శ్రీధర పండితుల వ్యాఖ్యానము తెలుగు వారికి అందుబాటులోకి రావాలనే **శ్రీశ్రీశ్రీ మాధవానందసరస్వతీస్వామి**వారల ఆకాంక్షతో, శ్రీగురు మదనానందసరస్వతీ పీఠము వారు అనువాద ప్రక్రియను చేపట్టడము ఎంతో ఆనందదాయకము.

శ్రీమద్భాగవతములోని 12 స్కంధముల వ్యాఖ్యానములను ఉద్దండ పండితులు సరళమైన తెలుగులోకి అనువదించడము ఎంతో ముదావహము. ఈ బృహత్ కార్యక్రమములో తిరుమల తిరుపతి దేవస్థానమువారి ధార్మిక ధర్మ పరిరక్షణ మండలి చేరడము శ్రీనివాసుని దయకు నిదర్శనము.

జిజ్ఞాసువులు ఈ గ్రంథాన్ని పూర్తిగా అవగతం చేసికొని ఆనందిచాలని మనస్ఫూర్తిగా కోరుకుంటున్నాను. శ్రీగురు మదనానందసరస్వతీ పీఠము వారు ఇదే విధముగా ఇంకా అనేక వ్యాఖ్యానాలను తెలుగు భాషలో అందరికి అందించాలని ఆకాంక్షిస్తున్నాను.

సదా సేవలో

**ఐ. వై. ఆర్. కృష్ణారావు** ఐ. ఏ. ఎస్.

**కార్యనిర్వాహణాధికారి, తిరుమల తిరుపతి దేవస్థానములు.**

# ప్రాక్కథనము

**- ఉమాపతి పద్మనాభశర్మ.**

మోక్షమే జీవనగమ్య పరమావధియని ప్రాచీన భారతీయుల విశ్వాసము. అందునను సాలోక్యాది స్థితులన్నిటికంటెను కైవల్యమే పారమార్థికమైనదని ముక్తికోపనిషత్తు ఉద్ఘాటించినది. కావున జీవుని పారలౌకికోద్యమమంతయు కైవల్యమే లక్ష్యమను దిశగా సాగవలయునని ఈ సంప్రదాయము నిర్దేశించుచున్నది. కాని యిది కాదనియు కొందరు దీనికి భిన్నమగు విచార సరళిని సూచింతురు, శ్రీమద్భాగవత సంప్రదాయ మట్టి వానిలోనొకటి.

పరమ ప్రేమ రూపమగు భక్తికి ప్రాధాన్యముగల భాగవత గ్రంథమునందు కర్మలు, కర్మఫలములు, స్వర్గాదిలోకములు మున్నగువాని మాట యెట్లున్నను జ్ఞానము దానివలన కలిగెడు మోక్షము, వాని నైపథ్యమగు క్లేశము, మొదలగునవి కూడ తిరస్కరింపబడును, భగవత్ప్రాప్తి వలన లభించు పరమప్రేమానందానుభూతియే మహత్తరమైనదనియు, అంతకన్న జీవుడు పొందదగిన ఫలము వేఱేదియు లేదనియు భాగవతజ్ఞుల అభిప్రాయము. ప్రామాణికుల ప్రవచనములలో ఈ విషయము తఱచుగ ప్రకటమగుచుండును.

ముక్తిపదము నందియు భగవద్భక్తి లేనివారు అధః పతనమగుదురనునిట్టి భావములు గల సన్నివేశములు భాగవతమున గలవు. వీని నాధారముగ జేసికొని సగుణభక్తికి పట్టము గట్టుటయో జ్ఞానమును దానినున్నత శ్రేణినుండి తప్పించుటయో జరుగుచుండును. మోక్షశబ్దమునకు సంసారమునుండి విడుదల పొందుట యని యధాక్షరమగు నర్థముచేసి భగవత్ప్రాప్తి అనంతర కార్యమనియు అది భక్తి వలననే సాధ్యమగుననియు చెప్పుచుందురు. భగవత్ప్రాప్తి యనగా ఆనందానుభూతి యని వివరించుచు, అనుభూతి కొఱకు మనస్సును, దాని కొఱకు శరీరమును తద్ద్వారమున జీవ తత్త్వమును కాపాడుచుందురు. అస్తు, పద్మపురాణము నందలి భాగవత మాహాత్మ్యమున గల ఒక సందర్భమున శౌనక మహర్షికి ఒక ఆశ్చర్యముతో కూడిన ప్రశ్న కలిగెను. 'జీవుని నిః శ్రేయసమునకు జ్ఞానాది సాధనములను తిరస్కరించి భక్తి యెట్లు ప్రధానమయ్యెను?' అని. **"భక్తార్థం సగుణో జాతో నిరాకారోఽపి చిన్మయః"** నిర్గుణోపాసన యందలి క్లిష్టతను గుర్తించి భగవానుడగు సగుణ రూపమును ధరించి భక్తసులభుడయ్యెను. అప్పటినుండియు కలియుగమున భక్తికి ప్రాచుర్యము కలిగెనని సూత మహర్షి సమాధానము చెప్పెను. **"న తపోభిర్నవేదైశ్చ న జ్ఞానేనాఽపి కర్మణా హరిర్హి సాధ్యతే భక్త్యా ప్రమాణం తత్ర గోపికాః"** అని నారద వాక్యము, అంతేకాక **"ఇదం భాగవతం నామ పురాణం బ్రహ్మ సమ్మితం. భక్తి జ్ఞాన విరాగాణాం స్థాపనాయ ప్రకాశితమ్"** అని సనకాదుల వాక్యము ననుసరించి, వ్యాసభగవానుడు భక్తి జ్ఞాన వైరాగ్యముల స్థాపనము కొఱకే, ఈ భాగవతమును ప్రకటమొనరించెను.

పరమానందమును ఎంత 'అనుభూతి'గ మలచుకొనదలచినను, దాని కొఱకు భక్తి ఎంత సులభ మార్గమైనను, భాగవత రచయిత, వ్యాసభగవానుడగుటచే, ఆత్మ, మాయ, నిర్గుణము, అద్వయము వంటి గాఢమైన భావములు, శబ్దములు ఇందు చోటు చేసికొని యుండుటలో వింత లేదు. అంతేకాక ద్వైతాద్వైత విశిష్టాద్వైతాది విచారధారలకు మూలములుకూడ ఇందు పరచుకొని యున్నవి. లేనిచో శ్రీధరాచార్యుడు అద్వైతపరముగ, శ్రీవేంకటకృష్ణనామకాచార్యుడు విశిష్టాద్వైత పరముగను, శ్రీమద్విజయధ్వజాచార్యుడు ద్వైత పక్షముగను వ్యాఖ్య లెట్లు వ్రాయగలిగిరి ?

ఇక ఈ ద్వితీయ స్కంధమున కూడ అద్వైత భావనలు, పరిభాషలు పెక్కులు గలవు. " సంసార హేతువగు అవిద్య ఎచట ఉపరమించి పోవునో అట్టి స్వచిత్తమున, స్వతస్సిద్ధమైన ఆత్మరూపమున అనంతుడై నెలకొని యున్న భగవానుని నిఃశ్రేయసము కొఱకు భజింపవలెను. " " అనాత్మ పదార్థములను 'నేతి నేతి యని విడిచి, దేహాత్మభావమును వదలి, సర్వవ్యాపియైన భగవానుని నిరంతరముగా మనస్సుతో నాలింగనము చేసికొని చింతన చేయుచుందురు." " ఆతడు ధీరులకు ఉపాసించదగిన 'ఆత్మ' పదార్థము." "ఉపాదానరూపమైన ద్రవ్యము, జన్మనిమిత్తమగు కర్మ, దానిని క్షోభింపజేయు కాలము, భోక్తయైన జీవుడు ఇవి అన్నియు ఉన్నట్లు కన్పట్టుచున్నను, నిజమునకు వాసుదేవునకన్న ( బ్రహ్మము కన్న ) వేఱైన పదార్థమేదియు లేదు." " విషయాకార శూన్యమై, త్రికాలాబాధ్య సత్యమై, సర్వమునందును అంతఃస్థితమై బుద్ధి విపరిణామాది ద్వైత ప్రతీతి లేనిదై, గుణరహితమై యుండునది భగవత్తత్వము." స్వప్నమును చూచువారికి స్వప్నగత పదార్థములతో తత్త్వతః సంబంధము లేనట్లు, దేహగతమైన ప్రత్యగాత్మకు ప్రపంచ దృశ్య సంబంధము వస్తుతః ఘటింపదు. ఈ దృశ్య వ్యవస్థ మాయా మాత్రమే. "భగవానుడు అరూపుడు " "సృష్టి యనునది ఆభాస"

ఇట్టి భావనల మాటయెట్లున్నను ద్వితీయ స్కంధమునందలి "చతుశ్శ్లో కి" మిక్కిలి ప్రధానమైనది. ఇందలి తొమ్మిదవ అధ్యాయము నందలి ముప్పది రెండవ శ్లోకము మొదలుకొని నాలుగు శ్లోకములు "భాగవత చతుశ్శ్లోకి లేక చతుశ్శ్లోక భాగవతము" అనబడును. పదునెనిమిది వేల శ్లోకములలో ఈ నాలుగింటిని ప్రత్యేకముగ భాగవత సర్వస్వ మూల్యముతో గ్రహించి మొట్టమొదట లోకమునకు చెప్పిన వారెవరో కాని వారికి ఆ మహాత్ములకు సహస్రాధిక ప్రణామములు, ఇది తత్త్వ జిజ్ఞాసువులకు మహాప్రసాదము. "ఏతావదేవ జిజ్ఞాస్యం " అని చెప్పదగినంత మహాశక్తివంతమైనది. శ్రీమన్నారాయణ ముఖనిర్గళితము. అందువలననే కాబోలు బ్రహ్మము సాకారమా? నిరాకారమా? పరమాత్మ, ఆత్మ, ప్రత్యగాత్మ, జగత్తు, అహం, మాయ, మొదలగు వాని స్వరూపమేమి ? లేకున్నను కనబడుట ఉండియు కనబడకుండుట యెట్లు? మొదలగు విశేషములతో, తత్త్వమంతయును ఈ నాలుగు శ్లోకములతో అవగతమైపోవును. అవగతమైనవారికి నిష్కృతి కరతలామలకమగును. భక్తికి దేశకాలావచ్ఛిన్నమైన ఆశ్రయముకాక స్వస్వరూపాను సంధాన రూపమగు ప్రత్యగ్బ్రహ్మ సాన్నిహిత్యము కలుగును.

శ్రీధరీయటీక ఎంత నిపుణముగ సాగినదో తెలియుటకు విశాలమైన పాండిత్య పటిమ, సూక్ష్మమైన అవగాహన, సమగ్రమగు పరిశీలనము కావలయును. అయినను ద్వితీయ స్కంధ పరిమితిగ ఒకటి రెండంశములను ప్రస్తావింప బూనుట అప్రస్తుతము కాదు. సందర్భమును బట్టి, ఔచిత్యమననుసరించి కొన్ని ప్రసిద్ధ శబ్దములకు అపూర్వార్థములను చెప్పి పాఠకునిలో ఒక తటిద్రేఖను మొలపించుట టీకాకారుని శైలి.

" రహస్య శబ్దమునకు 'భక్తి' యని 'వికార' శబ్దమునకు అహంకారమని దృక్ అనుమాటకు జ్ఞానమనియు 'అనిలం' అను పదమునకు 'ప్రాణమనియు ఊహింపలేము. అయినను శ్రీధరాచార్యుని మాటలను కృతజ్ఞతా పూర్వకముగ అంగీకరింతుము. ఒక్కొక్కప్పుడు పఠితలకు తలకు మించిన సందేహములు కలుగుచుండును. **"ప్రాయేణ మునయో రాజన్నివృత్తా విధిషేధతః. నైర్గుణ్యస్థా రమంతేస్మగుణాను కథనే హరేః."** విధి నిషేధములనుండి నివృత్తులై ఆత్మ తాదాత్మ్య స్థితియందున్నవారు శ్రీహరి గుణానుకథనమునందు రమించుచుందురట. ఆత్మతాదాత్మ్యము పరమార్థ ఫలము కాదా? అని సంశయము కలుగగా 'ఆత్మ సదాచారం ప్రమాణయతి' అను అవతారికతోను, 'స్మ' ప్రసిద్ధౌ అను శబ్దార్థములతోను శంకానివృత్తి చేయుట శ్రీధర పద్ధతి. మూలమునందుగల 'అను కథన' మునాధారముగ గొని, మహాత్ముల ప్రసిద్ధమగు సదాచారప్రవృత్తిని లోక సంగ్రహత్వమును ఊహించుకొనినచో సందేహము తొలగిపోవును. ( ఈ అవతారికా వాక్యము వావిళ్లవారి ప్రతి లోనిది ) అభివ్యక్తి ఒక్కొక్కప్పుడు వాచ్యాతీతముగ నుండి తన ఆంతర్యమును స్ఫురింపజేయుట తద్‌జ్ఞులకు అనుభవ సిద్ధమే. పాఠకుని ఊహకు వదిలివేయుట ఒక పద్ధతికాగా ఒక్కొక్కప్పుడు ఒకటి రెండు శబ్దములకే పిండీకృతార్థమును వివరించుచు, ఆ శబ్దము(ల) తో ఏమిచెప్పిపట్లైనదో విపులీకరించుట మఱియొక పద్ధతి. 'అహమేవ' (నేనే) అను మాట(ల)ను 'అనాద్యనంతత్వాదద్వితీయత్వాచ్చ పరిపూర్ణోఽహమిత్యుక్తం భవతి" అనురీతిని మూల రచయిత ఆంతర్యమును ఆవిష్కరించును. ఇట్టి విశేషములిన్ని యన్నియని ఇదమిత్థముగా చెప్పలేకున్నను పాఠకుని మానసికస్థితి యందొక అపూర్వమైన వెలుగును ప్రసరింపజేయు లక్షణము శ్రీధరీయ ప్రతిభా విశేషమని చెప్పనగును.

పీఠాధీశ్వరులు పరమహంస పరివ్రాజకాచార్య శ్రీశ్రీశ్రీమాధవానందసరస్వతీస్వామి (రాంపురం తొగుట) వారి కృపాకటాక్షముచే ఈ భాగవత శ్రీధరీయ టీకాంధ్రానువాద మహాభాగ్యమబ్బినది. వారిసన్నిధికి నా హార్దికమైన నమోవాకములు సమర్పించుచున్నాను.

ఈ అనువాద కార్యక్రమునకు ప్రధాన పర్యవేక్షకులు, మహాపండితులు, సహృదయులు అగు శ్రీ దోర్బల విశ్వనాథశర్మగారు ఈ అనువాదము నామోదించి నన్ను ప్రోత్సహించిరి. వారి దయా హృదయమునకు నా కేల్మోడ్పులర్పించుచున్నాను. దీని ప్రచురణ కార్యక్రమములందు ఉత్సాహముగ పాల్గొనుచున్న శ్రీ శ్రీవాండ్ల సాయిబాబగారికి, శ్రీ రావికోటి సోమశేఖర్‌గారికిని హృదయపూర్వకమైన కృతజ్ఞతలు, శుభాశంసలు.

ॐ

సదానందో విజయతే

జయ కృష్ణానంద శ్రీమదనానందో విజయతే తరామ్ జయ మాధవానంద

పీఠ మూలపురుషులు

## పరమహంస పరివ్రాజకాచార్య **శ్రీశ్రీశ్రీమదనానందసరస్వతీస్వామివారి** సంక్షిప్త జీవనము.

అఖిల ప్రపంచానికి ఆనందమే హద్దు. ఆనందం కోసం ప్రతిజీవి అనుక్షణం అన్వేషిస్తూనే ఉంటుంది. ఆనందరసాన్ని సదా అనుభవంలోకి తెచ్చుకొని లోకానికి అందించేవారు మహాత్ములౌతారు. కర్మభూమిగా ప్రసిద్ధిగాంచిన భారతావనిలో ఈ విధమైన మహాత్ములు ఉద్భవించి లోకోపకారము గావిస్తున్నారు. ఈ పరంపరలో ఆవిర్భవించిన మహా పుణ్యమూర్తి పరమహంస పరివ్రాజకాచార్య **శ్రీశ్రీశ్రీ మదనానందసరస్వతీ స్వామి** వారు వీరు అత్యంత నిరాడంబరులు, ఆనందస్వరూపులు, అపారతపోధనులు, నిష్కామధనులు, నిరంతర త్యాగశీలురు, అపరిమిత అన్నదాన తత్పరులు, అనేకానేక పురాతన దేవాలయాల జీర్ణోద్ధారకులు, ధర్మజీవనులు, నిష్ఠాగరిష్ఠులు.

అన్నపూర్ణగా ప్రశస్తిగాంచిన మన రాష్ట్రములో మెతుకుసీమలో టేక్మాల్ గ్రామములో శ్రీవిశ్వావసునామ సంవత్సర శ్రావణ కృష్ణ దశమి (1905లో) నాడు, రావికోటి వంశములో శ్రీస్వామివారు జన్మించినారు. వీరి మాతాపితరులు శ్రీమతి లక్ష్మీనర్సమ్మ, బ్రహ్మశ్రీ రావికోటి నరహరి శ్రౌతి గారలు. వీరి పూర్వాశ్రమ నామధేయము రావికోటి లక్ష్మీనారాయణగారు. వీరు జన్మించినది మొదలు ఆజీవనం అహరహం ధర్మసముద్ధరణకు, నిరంతర అన్నదానానికి నడుముకట్టినారు. ఆశ్రితులకు రక్షకులుగా నిలిచినారు. పూర్వాశ్రమములో నిరంతరశ్రమజీవిగా, తనకోసం ఎవరినీ చేయిచాచి యాచించని ధర్మమూర్తిగా, పరోపకారపరాయణులుగా, కీర్తించబడినారు. వ్యవహారదక్షతగల స్ఫురద్రూపముతో, సద్యస్ఫూర్తితో మాట్లాడేవారు. ఉర్దూలో చమత్కారముగా మాట్లాడేవారు. ఒకసారి న్యాయస్థానములో ఉర్దూలో వాదించి తమ వ్యాజ్యాన్ని గెలుపొందిన మేధామూర్తి. న్యాయబద్ధముగా తను గెలుచుకొన్న భూమిని సైతము అదే వ్యక్తికి వెంటనే దానమిచ్చిన ఘనుడు. వ్యవసాయాన్ని చేసిన రోజులలో పండించిన ధాన్యాన్నంతా పంచిపెట్టి పంచె దులుపుకొని పరమానందముగా గూటికి చేరుకొనేవారు. జీవితాన్ని తపస్సుతో గడుపుతూ ఆహార నియమాన్ని అలవరుచుకొన్నారు. ఎక్కడికి వెళ్ళినా సైకిలు ప్రయాణము, వెంట బొగ్గుపొయ్యి, చేతాడు, ఒక లోటా, కొంచము బియ్యము, పప్పు మొదలగు పదార్థములు, బిల్వదళాలు, పూజపెట్టె, మడి పంచెలతోనే ప్రయాణము. సకాలములో సంధ్యావందనాది కర్మలు చేసేవారు. ఎవరికైనా ఆకలి అవుతున్నట్లు వీరికి తోచినదంటే వంటచేసి అన్నం పెట్టేవారు.

స్వధర్మపరిపాలనలో సాటిలేని వీరు త్యాగమే ఊపిరిగా జీవితాన్ని మలుచుకొన్నారు. 1972వ సంవత్సరములో సర్వప్రాయశ్చిత్తము చేసికొని, కర్ణాటక రాష్ట్రములోని బీదర్ ద్వారా బసవకల్యాణ్ చేరుకొని సదానంద మఠాధీశులైన పరమహంస పరివ్రాజకాచార్య **శ్రీశ్రీశ్రీ మాధవానందసరస్వతీ స్వామి** వారిని చేరి, బ్రహ్మచర్యాశ్రమము నుండి నేరుగా సన్యాసాశ్రమము స్వీకరించి, **శ్రీశ్రీశ్రీ మదనానందసరస్వతీ స్వామి** వారు అని యోగపట్టాను పొందినారు. సన్యాసాశ్రమము స్వీకరించడానికి ముందే పైతర, టేక్మాలు, కొప్పోలు గ్రామములలో అనేక ధార్మిక కార్యక్రమములు నిర్వహించినారు. తదుపరి కొప్పోలులో కొంతకాలము తపస్సునాచరించి శ్రీఉమాసంగమేశ్వరస్వామి దేవాలయాన్ని సముద్ధరణ చేసినారు. అనేక రుద్రయాగములు నిర్వహించినారు. మహాక్రతువులు చేసినారు. అనేక గ్రామములు పర్యటించినారు. భగవంతుని ఆదేశం ధర్మపత్రం ద్వారా నిర్ణయించుకొని సిద్దిపేటకు చేరినారు. సదానందాశ్రమాన్ని స్థాపించి విరివిగా గ్రామపర్యటనలుచేస్తూ భక్తులకు **"కలౌ పార్థివ లింగ పూజనమ్"** అనే అంశాన్ని విపులీకరిస్తూ పార్థివ లింగాలు చేయించి కోటి లింగములతో ఉమాపార్థివ స్వామి ఆలయ సముదాయాన్ని నిర్మింపచేసినారు. గురువుగారి ఆదేశానుసారము 1990వ సంవత్సరములో బసవకల్యాణ్‌లోని సదానంద మఠానికి అధిపతి అయినారు. సదానంద మఠాన్ని ఆర్థికంగా అత్యంత పరిపుష్టం చేసినారు. ఒకసారి మతసామరస్యము గురించి బసవకళ్యాణ్‌లో ఏర్పాటు చేసిన మానవీయత మహాసభలో అశేష జనవాహినిని ఉద్దేశించి ఉర్దూలో ప్రవచించి మతమంటే మానవతాపూర్వక జీవన విధానమని, ప్రజలు అనవసరంగా ఆందోళనలతో అలమటించకూడదని, తాము పుట్టిన మతంలోనే సత్యవంతులుగా పేరుపొందాలని ఉద్బోధించినారు. ఆనాడు ప్రజలలో ఉట్టిపడ్డ ఆనందాన్ని చూచితీరాలి. నిజంగా మహనీయుల మాటలకు ఎంత శక్తి ఉంటుందో ప్రస్ఫుటమైనది.

సిద్దిపేట సదానందాశ్రమములో సదానంద వైదిక పాఠశాల, మిడిదొడ్డి, నాదులాపూర్, పోచారం, తాడుమనూర్, టేక్మాల్, పైతర, నాగ్‌సాన్‌పల్లి, పోతులగూడెం, ధన్నారం, నేరడిగుంట, మన్సాన్‌పల్లి, బస్వాపూర్ మొదలగుచోట్ల సదానందాశ్రమాలను స్థాపించారు. గ్రామీణ ప్రాంతములో సన్యాస సంప్రదాయ పీఠాన్ని నెలకొల్పాలనే సదుద్దేశ్యముతో మెదక్ జిల్లా తొగుట మండలములోని రాంపురము గ్రామమువద్ద శ్రీగురు మదనానంద శారదా క్షేత్రము పేరుతో తామే మూలపురుషులై పీఠాన్ని ఏర్పాటు చేయించినారు. ఇక్కడ ప్రపంచములోనే మొట్టమొదటి నవగ్రహ మండలి (64విగ్రహాలతో) దేవాలయాన్ని, కోటి పార్థివ లింగాల స్థాపనతోసహా పెద్దదయిన స్ఫటిక లింగేశ్వర ఆలయాన్ని, శంకరాచార్య, దత్తాత్రేయ, పంచముఖాంజనేయాది దేవతామూర్తులతో కూడిన దేవాలయ సముదాయాన్ని నిర్మింపజేసినారు. దేవాలయం, విద్యాలయం, వైద్యాలయాలను నెలకొల్పాలనే సదుద్దేశ్యముతో ఈ పీఠాన్ని ఏర్పరచినారు.

ఎందరో శిష్యులకు వివిధ ఉపాసనలను ఉపదేశించినారు. గృహస్థ శిష్యులే కాకుండా లోకసముద్ధరణకు నలుగురు యతీశ్వరులను కూడా తీర్చిదిద్దినారు. తెనాలికి చెందిన **శ్రీశ్రీశ్రీ రామానందసరస్వతీ స్వామి** వారు మొదటివారు. **శ్రీశ్రీశ్రీ బ్రహ్మానందసరస్వతీ స్వామి** వారు రెండవవారు (వీరు శ్రీవారి పూర్వాశ్రమములో, వరుసకు కుమార సమానులైన బ్రహ్మశ్రీ రఘురామ శర్మ గారు) తరువాత శ్రీగురు మదనానంద సరస్వతీ పీఠ వ్యవస్థాపకులు **శ్రీశ్రీశ్రీ కృష్ణానందసరస్వతీ స్వామి** వారు (రాంపురము తొగుట మండలము మెదక్ జిల్లా) భీమ్‌గల్‌కుచెందిన **శ్రీశ్రీశ్రీ సహజానందసరస్వతీస్వామి** వారు నాల్గవ వారు. వీరిలో శ్రీశ్రీశ్రీ కృష్ణానంద సరస్వతీ స్వామి వారి ద్వారా తురీయాశ్రమాన్ని స్వీకరించిన **శ్రీశ్రీశ్రీ మాధవానందసరస్వతీ స్వామి** వారు (ప్రస్తుత పీఠాధీశ్వరులు శ్రీ గురు మదనానంద సరస్వతీ పీఠము రాంపురము) వీరి ప్రశిష్యులై శ్రీగురు మదనానంద సరస్వతీ సంప్రదాయాన్ని లోకానికి చాటుతున్నారు. ధర్మసముద్ధరణకు పాటుపడుతున్నారు**. శ్రీశ్రీశ్రీ మదనానందసరస్వతీ స్వామి** వారు ఆవిర్భావము నుండి నిత్య చైతన్య పరబ్రహ్మ స్థితులుగా మారే వరకు అనునిత్యము అందరి మేలు కొరకు పరితపించిన పరిపూర్ణ పుణ్యమూర్తి. స్వామి వారు శ్రీవిక్రమనామ సంవత్సర కార్తిక కృష్ణ ఏకాదశి (21-11-2000) నాడు బ్రహ్మీభూతులై నిత్య జీవులైనారు.

## శ్రీవారి ఉపదేశ పంచామృతము

1) ఎప్పుడూ ఎవ్వరూ నా (దేని) కోసం దుఃఖించవద్దు నేను మీలోనే ఉన్నాను.

2) నిరంతరము మృత్యుంజయ భజన చేయాలి.

3) ఉపదిష్ట మంత్రాన్ని కోట్ల సంఖ్యలో జపించాలి.

4) నిరంతరము అన్నదానము చేయాలి.

5) ప్రతి చోట పరమాత్మను దర్శించండి.

సదానందో విజయతే

జయ కృష్ణానంద　　శ్రీమదనానందో విజయతే తరామ్　　జయ మాధవానంద

పీఠ వ్యవస్థాపకులు

## పరమహంస పరివ్రాజకాచార్య **శ్రీశ్రీశ్రీకృష్ణానందసరస్వతీ స్వామి వారి** సంక్షిప్త జీవనము

శ్రీగురు మదనానందసరస్వతీ పీఠమూలపురుషులు శ్రీశ్రీశ్రీ మదనానందసరస్వతీస్వామివారి కరకమల సంజాతులు పరమహంస పరివ్రాజకాచార్య శ్రీశ్రీశ్రీ కృష్ణానందసరస్వతీస్వామి పూర్వాశ్రమ నామధేయము బ్రహ్మశ్రీ పార్నంది జానకిరామశర్మగారు. మెదకు జిల్లా తొగుట (మం) గ్రామములో వీరు జన్మించినారు. వీరి జననీ జనకులు శ్రీమతి లక్ష్మమ్మ, బ్రహ్మశ్రీ పార్నంది శ్రీరామశర్మ గారలు. శ్రీమతి శేషమ్మ, బ్రహ్మశ్రీ పార్నంది పట్టాభిరామయ్య దంపతులకు దత్తపుత్రునిగా వెళ్ళినారు. చిన్ననాటి నుండి స్నేహ, సౌశీల్య స్వభావముతో, కార్యకుశలత్వముతో కార్యసాధకులుగా పేరుపొందినారు. జీవితములో ఎదురైన ఎన్నో ఒడిదుడుకులను సమర్థవంతముగా, ధర్మబద్ధముగా సానుకూలముగా మలచుకున్నారు. నిత్యము శ్రీవిద్యాసమర్చనముతో ఏకాదశరుద్రాన్ని, ప్రతి నెలకు ఒక పర్యాయము శతరుద్రీయాన్ని చేసేవారు. నిరంతరము దైవచింతననూ చేసేవారు.

పూర్వాశ్రమములో తెలుగుపండితులుగా వివిధ పాఠశాలలలో ఉద్యోగము చేసి ఎందరో విద్యార్థులకు విద్యాబోధన చేసినారు. నేటికీ ఆ కాలము విద్యార్థులకు “ శర్మసార్ ” అంటే హృదయము పులకరిస్తుంది వారి పాండితీ ప్రకర్ష బోధనా చమత్కృతి అంత బాగా విద్యార్థులను ఆకట్టుకునేది. ప్రస్తుత పీఠాధీశ్వరులు కూడా తమ పూర్వాశ్రమములో శ్రీవారి శిష్యులే. గృహస్థాశ్రమ జీవనం పూర్వభాగములో జగదేవపూర్ గ్రామానికి చెందిన శ్రీమతి వర్ధనమ్మ గారు వీరికి ధర్మచారిణియైనారు. దురదృష్టవశాత్తు ఈమె అకాలమరణము చెందుటచే సిద్దిపేట గ్రామానికి చెందిన శ్రీమతి సరస్వతీబాయి గారు కళత్రముగా వచ్చినారు. తదుపరి వీరికి ముగ్గురు పుత్రులు శ్రీరామశైలేశ్వర శర్మ, రఘురామ శర్మ, ప్రసాద శర్మలు కలిగినారు. వరంగల్ జిల్లా చుంచనకోటలో శ్రీ విఠాల చంద్రమౌళి శాస్త్రి గారి వద్ద శ్రీవిద్యా దీక్షను పొంది శ్రీభువనేశ్వరీ మాతను కొంత కాలము సేవించినారు. జీవితములో అనునిత్యము ఇతరుల కోసమే శ్రీస్వామివారు శ్రమించినారు. తమచేత బాగుపడ్డవారే చెడుచేయడము ఎన్నోమార్లు వీరి అనుభవములోకి వచ్చినది. ఈ విషయములో వీరు వీరి గురువు గారివలెనే ఎంతో ధైర్యముగా తమ దృష్టిని ధర్మపథము నుండి విడిపోనీ కుండా కష్టాలను ఎదుర్కొన్నారు.

విధివశాత్తు వీరి ధర్మపత్ని శ్రీముఖనామ సంవత్సరములో దైవసన్నిధికి చేరుకున్నది. పిదప వీరు తీవ్ర వైరాగ్యములో మునిగి నిరంతరము దైవపద ధ్యాసలో పడిపోయినారు. శ్రీమదనానందసరస్వతీ సద్గురువుల ఆజ్ఞానుసారము చేస్తున్న ప్రభుత్వోద్యోగమును వదిలి, రాంపురములో శ్రీగురు మదనానందసరస్వతీ పీఠానికి శంకుస్థాపన చేసినది మొదలు పూర్తి స్థాయిలో నిర్మాణ పర్యవేక్షణలో కాలము గడిపినారు. శ్రీమదనానందసరస్వతీస్వామివారిని సేవిస్తూ దాదాపు రెండు సంవత్సరాల పర్యంతం వివిధ గ్రామాలలో పర్యటించినారు. శ్రీ భవానీ రామలింగేశ్వర సేవాసమితి పేర సంస్థను స్థాపించి, కుల భేదం లేకుండా దాదాపు నలుబది మంది సభ్యులను చేర్చుకున్నారు. దాదాపు 4 సంవత్సరాలు ప్రతినెలా ఒకచోట సమావేశము, రుద్రాభిషేక పూజలు, ధార్మిక ప్రవచనాలు నిరాటంకంగా నిర్వహించినారు. వీరి దీక్షా దక్షతలకు సంతృప్తిని పొందిన శ్రీమదనానందసరస్వతీస్వామివారు శ్రీఈశ్వర నామ సం॥ జ్యేష్ఠ బహుల ఏకాదశి తేది.30-6-1997 నాడు వీరికి మహావాక్యోపదేశం చేసి **"శ్రీకృష్ణానందసరస్వతీస్వామివారు"** అని యోగపట్టాను ఇచ్చినారు. స్థానికులగు సాధువులు బ్రహ్మీభూత శ్రీనిర్వికల్పానందసరస్వతీ స్వామి వారి సహకారంతో, స్థానిక నాయకులు, భక్తులు అనేక గ్రామ ప్రజల సహాయతతో క్షేత్ర నిర్మాణంలో, దేవతామూర్తుల నిర్మాణంలో ఏమాత్రం లోపం లేకుండా బాధ్యత వహించినారు. శ్రీగురుమదనానందశారదా క్షేత్రంలో దేవతా ప్రతిష్ఠ బహుధాన్య నామ సం॥ (1999) లో శ్రీమదనానందసరస్వతీస్వామివారి సారథ్యంలో, వీరి పర్యవేక్షణలో అతి వైభవముగా జరిగినది. తరువాత బసవకల్యాణ్‌లో శ్రీరుద్రయాగము, క్షేత్రంలో నవగ్రహ మహాయాగము, శ్రీరుద్రయాగము, రామకోటి, శివకోటి నిర్వహించినారు. లోకోద్ధరణే ప్రధాన ధ్యేయముగా శతకోటి గాయత్రీ, శతకోటి హరేరామ నామజప మహాయాగాన్ని సంకల్పించి, నిర్వహించినారు. ఈ యజ్ఞము 400 మంది ఋత్విక్కులతో 18 రోజులు 108 హోమకుండాలలో జరిగినది. శ్రీశ్రీశ్రీమదనానందసరస్వతీస్వామివారి అడుగుజాడలలో నడుస్తూ అచ్చుపోసిన తమ గురువుగారివలె త్యాగమూర్తులై, నిరాడంబరులై నిరతాన్నదాన శీలురై వెలుగొందినారు.

పల్లెపహాడ్‌లో పంచాయతనమూర్తులను, కొడువటూరులో శ్రీదత్తాత్రేయ సదానంద సిద్ధ మఠాన్ని, జగదేవ్‌పూర్‌లో శివపంచాయతన మందిరాన్ని, సంగారెడ్డిలో శ్రీమదనానంద మఠాన్ని, శ్రీమదనానందసరస్వతీస్వామివారి శిష్యులతో ప్రారంభింపజేసినారు. లకుడారంలో హరిహర ఆలయముల జీర్ణోద్ధారమును, అనేకానేక దేవాలయముల ప్రతిష్ఠలను, వైద్యశిబిరములను. భక్తసంఘాల స్థాపనములను విరివిగా గావించినారు.

శ్రీగురు మదనానంద సాంగ వేద విద్యాలయము, గాయత్రీ శ్రీగురుమదనానందసరస్వతీ నిత్యాన్నదాన సత్రాన్ని (నాచగిరి) శ్రీగురు మదనానందసరస్వతీ విద్యాలయాన్ని, ఆనందసాధనమ్ అను పత్రికను స్థాపించినారు.

అనేకమార్లు సహస్ర సత్యనారాయణ వ్రతములు, లక్షబిల్వార్చనలు, శ్రీహనుమద్‌యాగము, శ్రీరుద్రయాగము కోటిబిల్వార్చనము, శ్రీకాశీ మహాక్షేత్రములో 60 మంది బ్రాహ్మణులతో 2 నెలలపాటు నిరంతర అన్నదానసహిత మహారుద్రయాగము, శ్రీవిష్ణుయాగము, శ్రీశతచండీ యాగము మొదలగు లోకోపకారకార్యములను నిర్వహించినారు.

తమ అవతార సమాప్తిని గుర్తించిన శ్రీస్వామివారు తమ గురువుగారి ఆదేశానుసారము, తమ పూర్వాశ్రమ పుత్రులు, సంస్థ ధర్మాధికారిని అప్పటికే 2 సంవత్సరాలుగా పరీక్షించి ఉండుటచే పార్థివనామ సంవత్సర(2005) దత్తజయంతి నాడు సవిధిగా సన్యాసదీక్షను అనుగ్రహించి **శ్రీశ్రీశ్రీమాధవానందసరస్వతీస్వామి** అని యోగ పట్టాను ప్రదానము చేసి, తమ ఉత్తరాధికారిగా నియమించినారు. శ్రీస్వామివారి అంతిమసమయము నిరంతర నారాయణ స్మరణలో జరిగినది. సంస్థ అభివృద్ధికి అమూల్యమైన ఆశీస్సులు అందించి మౌనదీక్ష పూనుకొని శ్రీపార్థివ నామ సంవత్సర మార్గశీర్ష బహుళ చతుర్దశి 'మాసశివరాత్రి' ప్రదోష సమయములో దివ్యజ్యోతి రూపకముగా నిత్యచైతన్య స్వరూపులైనారు.

ధర్మకార్య నిర్వహణలో వీరికి వీరి పూర్వాశ్రమ బంధువులు, స్నేహితులతోపాటు శ్రీమదనానందసరస్వతీస్వామివారి శిష్యులు తమ తను, ధన, మనములతో సహకరించినారు. ప్రతినోటా భగవన్నామ సంకీర్తనము, ప్రతిఇంటా విరివిగా అన్నదానము జరగాలని శ్రీస్వామివారి ఆకాంక్ష.

## సాధనాత్ సాధ్యతే సర్వమ్

అనేది వీరి ప్రోత్సాహక సందేశము.

## శ్రీమద్భాగవత వైశిష్ట్యము

**బ్రహ్మశ్రీ దోర్బల విశ్వనాథశర్మా**

అష్టాదశ మహాపురాణములలో శ్రీమద్భాగవతము చేరునా, చేరదా అనునదొక మహాప్రశ్నము. ఒక మహాసంశయము. దాని రెండువైపులును మిక్కిలి పదునైననవి. కత్తెర అంచుల నడుమ చిక్కిన వాడు తెగుట నిక్కము. కాని వాని పదును మాత్రము ఇప్పటికిని తగ్గలేదు. శ్రీదేవి భాగవతము శైలి విషయమున ఇతర మహాపురాణములతో మిక్కిలి సామ్యము నొంది యున్నందున దానికే అష్టాదశత్వము (అష్టాదశాన్యతమత్వము) అనునది ఆ సంశయమందొక పక్షము. శ్రీమద్ (విష్ణు) భాగవతమునకు చెందినదియే అదియనునది మఱొక పక్షము. శైలిలోని ఇతర పురాణ వైలక్షణ్యమునకు కారణము శ్రీ వ్యాసుల మహాపురాణములలో అది చరమమగుటయే వారి ప్రతిభా ప్రౌఢత్వ ప్రాగల్భ్యముల పరాకాష్ఠ అందులో గోచరించిన కారణముగా దానిని అష్టాదశ మహాపురాణములలో చేరదనుట అసంగతమనునది వారి వాదము యొక్క సారము. శ్రీ దేవీ భాగవతమే వానిలో ఆ మహాపురాణములలో చేరకున్నను, శ్రీమద్భాగవతము అష్టాదశ మహాపురాణ బహిర్భూత మహాపురాణమని నిర్ణయించుకొని ఈ వాదమును పరిష్కరించు కొననగునని సమన్వయ వాదులు ఆ వాదద్వయము నుండి తప్పుకొని ఉన్నారు.

పురాణములు పంచ లక్షణములు గలవి అవి సర్గము, ప్రతిసర్గము, వంశము, మన్వంతరములు, వంశానుచరితము అనునవి. శ్రీమద్భాగవతము దశలక్షణ సమన్వితము." యత్ర సర్గో విసర్గశ్చ స్థానమ్ పోషణమ్ ఊతయః మన్వంతరేశాను కథే నిరోధో ముక్తి రాశ్రయః "

1. సర్గము 2. విసర్గము 3.స్థానము 4.పోషణము 5. ఊతులు 6.మన్వంతరములు 7. ఈశానుకథ 8. నిరోధము 9. ముక్తి 10. ఆశ్రయము.

ఇవి కూడా శ్రీమద్భాగవతమునకు ఇతర మహా (ఉప) పురాణ వైలక్ష్యణము కలిగించు కారణములు. శైలి అనునది ఈ వఱకే ప్రస్తావింపఁ బడినది. పై రెండు పఠనము చేతనే గ్రహింపఁబడ దగిన వగుటచే బహిరంగ ( ప్రాయ )ములు.

పురాణములన్నియు మోక్షసాధనములుగా కర్మ, భక్తి , జ్ఞానములను ప్రతిపాదించుననుట నిర్వివాదము. వానిలో జ్ఞానము సాక్షాత్సాధనము. మిగిలిన రెండు పరంపరా సాధనములు. ఈ అంశము దాదాపు సర్వ మహా (ఉప) పురాణ ప్రతిపాదితము. శ్రీమద్భాగవతము భక్తి, జ్ఞానముల రెండింటిని దాదాపు సమీక్షగా ఉంచినది. ముక్తి పరమ పురుషార్థమనుట దాదాపు సర్వమహా (ఉప) పురాణ సమ్మతమై ఉండగా. " **యే ముక్తావపి నిస్పృహాః** " (భక్తులు ముక్తియందును నిస్పృహులు) అని భక్తికి పరమపురుషార్థత్వమును నిరూపించినట్లుండుట శ్రీమద్భాగవతమునకు వైశిష్ట్యాపాదకములలో మరొక అంశము. శ్రీమధుసూదన సరస్వతి ప్రతిపాదించిన జ్ఞానోత్తర భక్తి యోగము యొక్క పరమ పురుషార్థత్వమునకు సర్వోత్కృష్టత్వమునకు పై వాక్యము వంటి వాక్యములు శ్రీమద్భాగవతగతములై ఉండుటయే ప్రమాణము.

శ్రీమద్భాగవతమున భక్తి మిక్కిలి సహజముగా సులభముగా నిర్వచింపబడినది. '**యాప్రీతిరవివేకానాం విషయేష్వనపాయినీ, త్వామనుస్మరతః సా మే హృదయాన్మాపసర్పతు** ' నిత్యానిత్య వస్తు వివేకము లేనివారు అనిత్య (సాంసారిక) విషయములందు ప్రీతి కలిగి యుందురు.

ఆ వివేకము గలవారికిని అది పూర్వానుభూతము. ఆ వివేకము నొందిన పిదప పూర్వము వానిని ఏల, ఎట్లు ప్రేమించియుంటినో అని ఆశ్చర్యము కలుగును. పూర్వానుభూత వాసన మరల ఆ వైపునకు తన ప్రీతిని మరల్చునేమో అని భయపడుచుందురు. పై శ్లోకమున అట్టి పరిస్థితి రాకుండా రక్షింపుమని భగవానుని గూర్చి చేయు ప్రార్థనమున్నది. దానితో పాటు అవివేక విషయప్రీతి వంటిదే వివేకుల భగవత్ప్రీతి అని భక్తి స్వరూపము సులభముగా సహజముగా నిర్వచింపబడిన ప్రేమ లక్షణమిందు సాక్షాత్కరించును. ఆ ప్రేమ భగవద్గతమైనప్పుడే అది ఉపాదేయమై ఆనంద హేతువగుననుట స్పష్టీకరించబడినది.'**సాత్వస్మిన్ పరమ ప్రేమరూపా**' అను శ్రీనారద భగవానుని నిర్వచనము భాషా రూపాంతరమున ఇందు గోచరించును. అవివేకులకు భగవానుడు పట్టడు. వివేకులకు విషయములు పట్టవు, అని భగవత్ ప్రేమకు వివేకముతోడి అవినాభావము ఇందు సూచింపబడినది. భగవద్భక్తిలేని వారు అవివేకులనుటకు సంశయమక్కర లేదనియు సూచింపబడినది. ఇంత సులభ సహజ నిర్వచనమీ శ్లోకమున గోచరించుచున్నను జ్ఞానరూపముగా ఇందు గోచరించదు.

బ్రహ్మసూత్ర భాష్య మంగలాచరణ శ్లోకమున 'శేముషీ భక్తి రూపా' అని చెప్పినభగవద్రామానుజులు వివరించిన సప్తాంగ భక్తి ఈ శ్లోకమున గోచరింపదు. కర్మ జ్ఞాన పక్షద్వయముకల భక్తి (పక్ష) స్వరూపము కూడా ఇందు గోచరింపదు. వారు భక్తికి అంగము, జ్ఞానము (జీవస్వరూప జ్ఞానము) అని చెప్పినను తైల ధారవలె అవిచ్ఛిన్నమైన జ్ఞాన ధారయే భక్తిగా అభిప్రాయపడినట్లు తెలియవచ్చును. బహుశః అది దాసోహం వృత్తిసాంతత్యము కావచ్చును.

శంకర భగవత్పాదులు చెప్పిన స్వస్వరూపానుసంధాన రూప భక్తియు పై శ్లోకమున గోచరింపదు. స్వస్వరూపానుసంధానము పరోక్ష జీవ బ్రహ్మైక్య జ్ఞాన ధార (ధ్యానము) పై శ్లోకమున గోచరింపదు. పరోక్ష జీవ బ్రహ్మైక్య జ్ఞానధార (సోహం) ధ్యానరూపమే కాని అపరోక్ష సోహమ్ చరమ వృత్తి రూపము కాదు. చరమ వృత్తి ఏకమే గాని అది జ్ఞానధారా రూపము కాదు. ఈ శ్లోకమున చెప్పబడిన ప్రీతి శ్రీనారదుల నిర్వచనమునకు భాషా రూపాంతరమే అని మరల గుర్తు చేసికొనవలెను.

శ్రీమద్భాగవతమున భక్తి యొక్క నవధాత్వము చెప్పబడినది. **"శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనం అర్చనం వందనం, దాస్యం సఖ్యమాత్మనివేదనమ్"** అను శ్లోకమున చెప్పబడిన నవ విధభక్తి ( ప్రీతి) కర్మలు (లేక అనుభావములు) అనుట సముచితముగా ఉండును. ఒకని యందే ఈ అన్ని కర్మలు ఉండనక్కర లేదు. వీనిలో ఒకటో రెండో అంతకు ఎక్కువగానో ఉండవచ్చును.

ఇట్టి భక్తి పూర్వజన్మములలోని వైదిక కర్మాపూర్వ ఫలముగా చరమ జన్మమున ఏర్పడునట్టిది లేక నిర్వ్యాజ భగవత్కృప వలన చరమ జన్మమున ఏర్పడునట్టిది. దీని వలన కోరక పోయినను దేహపాతానంతరము ముక్తి లభించును. అందుచేతనే భక్తులు ముక్తిని కోరరు ( కోరక పోయినను లభించుచు దానిని కోరుట ఎందులకు? ) సాధన చతుష్టయ సంపత్తిలో ముముక్ష చేరవచ్చుగాక. భగవత్ ప్రీతిరూప భక్తి ఉదయించిన వారికి భక్తి సమకాలముననే ఆనందోదయముండుటచే దుఃఖనాశనమును ఉండుటచే ముముక్ష ఉండకపోయినను ఇబ్బంది లేదు.

వాస్తవమున ఈ ప్రీతిలో సోహం భావమంతర్గర్భితమై ఉన్నది. ఈ ప్రీతి స్వగతము ఈ స్వగత ప్రీతి శాశ్వతము. స్వసంబంధిస్వేతరగత ప్రీతి స్వసంబంధమున్నంత వఱకే కావున అది అశాశ్వతము. అసంపూర్ణము. ఆ సంబంధము కూడా భావనామాత్రము కల్పితమునైన మమకారముతో పెనవేయబడినది. స్వగత ప్రీతి యొక్కటే సంపూర్ణము. దేహములందలి అహంకారము కూడా కల్పితమే ఐనందున అశాశ్వతము. శాశ్వతమైన ఆత్మకు అభిన్నమైనది. ఆత్మ జ్ఞాన రూపము. పరమాత్మయు జ్ఞానరూపము. ఉపాధులైన కించిజ్జ్ఞత్వ సర్వజ్ఞత్వాదులును కల్పితములే. కావుననే ఉపనిషత్తు **'సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ'** అని చెప్పగా తదుపబృంహకముగా శ్రీమద్భాగవతము **' వదంతి తత్తత్త్వవిదస్తత్వం యద్ జ్ఞానమద్వయం బ్రహ్మేతి పరమాత్మేతి భగవానితి శబ్ద్యతే'** ( ఏ జ్ఞానమును అద్వయ తత్త్వముగా చెప్పిరో ఆ (తత్త్వ) జ్ఞానమే బ్రహ్మ, పరమాత్మ, భగవానుడు అని చెప్పబడును.) అని చెప్పినది.

ఒక విధముగా శ్రీమద్భాగవతము నందలి భక్తి కుండలినీ శక్తి వంటిది. అది అధిక గుణ శక్తులు కలిగి తనకు భిన్నుడుగా తెలియబడిన పరమాత్మయందు స్వక్షేమమునకై ఆరంభింపబడి పరమాత్మకన్న మరేమియు లేదు, అన్న అభిన్నమైన పరమాత్మ(భావన) యందు తనను ప్రవిలాపనము చేసికొనుటతో ముగియును. జీవ స్వరూపమూలాధారగత కుండలినీ సహస్రారగత శివుని యందు తాదాత్మ్యము చెందినట్లు భక్తియు జీవగతముగా ఆరంభిపబడిన అద్వయ జ్ఞానరూపముగా పర్యవసించును. అదియు తదైక్యము నొందును.

అద్వయ జ్ఞానరూపమునందగలిగిన ఈ భక్తి జీవన కాలమున చాలా వఱకు భేదాభేద రూపజ్ఞాన ప్రేమ రూపముననే ఉండును. ప్రేమగల వ్యక్తులందరు మనము అందరమొకటే అని అనుకొనుచుందురు. వెనుక చెప్పినట్లు ప్రేమ స్వాత్మాభిన్న పరమాత్మ పర్యవసాయియై పరమ ప్రేమ అనబడును. సర్వం ఖల్విదం బ్రహ్మ అను ఉపనిషదుక్త జ్ఞాన రూపమై జీవన్ముక్తునిగా జీవునొనరించి దేహావసానమున కైవల్యరూపమగును. ఇట్టి పరమ భక్తికి గోపికలు దృష్టాంతరూపులు. కాని వారు సాధారణులు భావించునట్లు అజ్ఞానులు కారు. " అఖిల దేహినామంతరాత్మ దృక్ " అనగలిగిన జ్ఞాన నిష్ఠలు జ్ఞాన్యగ్రగణ్యలు. ఈ దృశ్యభక్తి నిరూపణము శ్రీమద్భాగవత విశిష్టతయే.

ఇట్టి అద్వైత ప్రతిపాదకమైన భాగవతానికి ఎన్నో వ్యాఖ్యానాలు వెలుబడ్డాయి. అందులో భక్తితో, ఎంతో నిపుణతతో సంస్కృతములో వ్రాయబడ్డ శ్రీధరుల భావార్థదీపికావ్యాఖ్య విశిష్టమైనది. అయితే ఈ వ్యాఖ్యకు ఆంధ్రానువాదము లేకపోవడము కొంత లోటుగానే ఉన్నది. ఈ వ్యాఖ్య ఆంధ్రానువాద కార్యక్రమాన్ని శ్రీగురుమదనానందసరస్వతీపీఠము చేపట్టడము హర్షణీయము. ఇట్టి కార్యక్రమానికి సంపాదకునిగా వ్యవహరించమని పీఠము నన్ను కోరడము నా మహాభాగ్యముగా, కర్మవిపాకముగా తలుస్తున్నాను. ఈ కార్యక్రమములో కృషిసల్పిన అనువక్తలకు, పఠితలకు నిశ్శ్రేయసాన్ని చేకూర్చాలని ఆ భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నాను.

**" ఇతిశమ్ "**

శ్రీగణేశాయ నమః శ్రీహయగ్రీవాయ శ్రీ శ్రీధరాయనమః

శ్రీమన్మదనానందసరస్వతీ స్వామినే నమః

# శ్రీమద్భాగవతము

## ఉపోద్ఘాతము

శ్రీ వేదవ్యాసమహర్షి రచించిన అష్టాదశ మహాపురాణాలలో అత్యంత ప్రధానమైన శ్రీమద్భాగవత మహాపురాణము శ్రీకృష్ణ తత్త్వ ప్రతిపాదకమైన మోక్షగ్రంథము. 84 లక్షల జీవరాశులలో ఉత్తమునిగా పేర్కొనబడుచున్న మానవుడు సాధించవలసిన పురుషార్థములగు ధర్మార్థ కామమోక్షములలో చివరిది, ముఖ్యమైనది మోక్షపురుషార్థము. పునర్జన్మరహితమై శాశ్వతానందదాయకమైన మోక్షము కేవలము బ్రహ్మజ్ఞానముతోడనే లభించును. అట్టి జ్ఞానమువిచారణము వలన కలుగును. జ్ఞానము, వైరాగ్యముతోడనే దృఢమగును. ఈ రెండునూ భక్తి వలన కలుగును. అట్టి భక్తిని బోధించునది శ్రీమద్భాగవతము. సర్వోపనిషత్తుల బ్రహ్మసూత్రముల, భగవద్గీతలసారము. శ్రీమచ్ఛుకయోగీంద్ర శ్రీ పరీక్షిన్నరేంద్ర సంవాద రూపము శ్రీమద్భాగవతము. ఇది 12 స్కంధములతో 18000సంస్కృత శ్లోకములతో ఒప్పారుచున్నది. సాక్షాత్తుగా శ్రీమహావిష్ణువు యొక్క వాఙ్మయ స్వరూపము. ఇందలి స్కంధములన్నీ భగవంతుని శరీరావయవములుగా వర్ణింపబడినవి.

శ్లో. ప్రథమశ్చ ద్వితీయశ్చ పాదౌ ద్వౌ పరికీర్తితౌ
తృతీయశ్చ చతుర్థశ్చ ద్వావూరూ పరమాత్మనః
పంచమో నాభిదేశశ్చ షష్ఠో హృదయముచ్యతే
సప్తమశ్చాష్టమశ్చైవ ద్వౌ బాహూ పరికీర్తితౌ
నవమః కంఠ దేశశ్చ దశమో ముఖముచ్యతే
ఏకాదశో లలాటంచ ద్వాదశస్తు శిఖోచ్యతే ॥
ఏవం భాగవతం సర్వం శ్రీహరే రంగముచ్యతే. అని ఒక వర్ణన కలదు.

వేదవ్యాస మహర్షి లక్ష శ్లోకాత్మమగు శ్రీమన్మహాభారతమును ఇతర పురాణములను రచించియు మనః శాంతిని పొందక సరస్వతీనదీ తీరాన చింతాక్రాంతుడై ఉన్న సమయాన దేవర్షి శ్రీమన్నారద మునీంద్రుడరుదెంచి వ్యాసమహర్షి చింతను గుర్తించి, భగవద్గుణానువర్ణన ప్రధానమైన శ్రీమద్భాగవతమును రచించుమని దాని వలన మనః శాంతి కలుగునని ఆ మహర్షికి చెప్పెను. అపుడు వ్యాసమహర్షి శ్రీకృష్ణ కథామృతమను భక్తి ప్రతిపాదక శ్రీమద్భాగవతమును రచించెను. దానిని తన కుమారుడగు శ్రీ శుకయోగీంద్రునకు నేర్పగా శుకయోగీంద్రుడు పరీక్షిన్మహారాజుకు బోధించెను.

పాండవ వంశాంకురము ఉత్తరాభిమన్యుల కుమారుడగు పరీక్షిన్మహారాజు పరమధార్మికుడు, భగవద్భక్తుడు, కలి నిగ్రహము చేసిన మహారాజు. విధివశమున ఒకనాడు వేటకు వెళ్ళి శమీక మహర్షి తనకు ఆతిథ్యమివ్వలేదని ఆగ్రహించి మృతసర్పమునాతని మెడలోవైచెను. ఆ మహర్షి కుమారుడగు శృంగి తన తండ్రి మెడనున్న మృతసర్పమును చూచి అట్టి దుష్కార్యమును చేసిన మహారాజు ఆనాటికి ఏడవ రోజున తక్షక సర్పదష్టుడై మృతి నొందుగాకయని శపించెను. ఆ విషయము తెలిసిన శమీకుడు కుమారుని కోపగించి తద్విషయము పరీక్షిత్తుకు తెలియచెప్పుడని శిష్యుల నియోగించెను. పరీక్షిన్మహారాజు తాను క్రోధావేశమున జేసిన పనికి చింతించి పశ్చాత్తప్తుడై, విప్రశాపమనివార్యమని ప్రాయోపవిష్టుడయ్యెను. తక్షకుడచటికి రాకుండగ ఆ మహారాజునకు మంత్రులు, పరివారజనము ప్రాసాదము చుట్టూ కాపలా, రక్షణ కల్పించిరి.

ఆ సమయమున శ్రీ శుకయోగీంద్రుడు పరీక్షిత్తు అదృష్టవశమున అచటికి విచ్చేసి విషయమునంతటినీ తెలిసికొని ప్రాయోపవిష్టుడగు ఆతనికి, పుట్టిన ప్రతి ప్రాణికిని మరణము తథ్యమని, దానికి వగవకూడదనీ, పునర్జన్మ రహితమగు మోక్షానికి ప్రయత్నించవలెనని, పలికి పరీక్షిన్మహారాజును ముక్తునిగావించుటకు ఏడురోజులు శ్రీమద్భాగవతమును సప్తాహ దీక్షతో భాద్రపద శుక్ల నవమి నుండి పూర్ణిమ వరకు బోధించి తరింపజేసెను

శ్రీమద్భాగవత పురాణమును విన్నవాడు మహాపాపాత్ముడైనను మోక్షమునొందునని ధుంధుకారుని గోకర్ణుడు ఉద్ధరించెననియు పద్మపురాణమునందలి ఉపాఖ్యానము వివరించుచున్నది. వాయురూపమున ఉన్న ధుంధుకారుని ఏడు కణుపులుగల వెదురు బొంగులో ప్రవేశించుమని గోకర్ణుడు చెప్పి, ఏడు రోజులు శ్రీమద్భాగవతమును వినిపించగా ఆతనికి ప్రేతము తొలగి మోక్షము కలిగెను. అద్వైత వేదాంతతత్త్వ ప్రతిపాదకమగు శ్రీమద్భాగవతము మిక్కిలి జటిలము. ఇతర పురాణాలవలె సులభముగా అర్థముగాదు. ఇది పండితులకే పరీక్ష వంటిది.

అందుకే శ్లో॥ ధనంజయే హాటక సంపరీక్షా. రణాంగణే శస్త్రభృతాం పరీక్షా
విపత్తికాలే రమణీ పరీక్షా. విద్యావతాం భాగవతే పరీక్షా ॥

శ్లో॥ కాశీఖండమయః పిండం నైషధం విద్వదౌషధమ్ ।
భక్త్యా భాగవతం జ్ఞేయం న వ్యుత్పత్యా న టీకయా ॥

అన్నారు పెద్దలు. భాగవతము భగవద్భక్తి చేతనే తెలుస్తుంది. కాని పాండిత్య ప్రకర్షచే ఎంతటి విద్వాంసులకును, తెలియ శక్యముగాదని భావము."భాగవతము తెలిసి పలుకుట కష్టంబు శూలికైన తమ్మి చూలికైన" అని శ్రీమద్భాగవతాంధ్రానువాదకర్త పోతన అంటాడు.

వ్యాసమహర్షి రచించిన భాగవతములు రెండూ ప్రసిద్ధములుగా ఉన్నవి. ఒకటి కృష్ణ పరమైన శ్రీమద్భాగవతము. రెండవది శక్తి పరమైన శ్రీ దేవీ భాగవతము. ఈ రెండింటిలో అష్టాదశ మహాపురాణాంతర్గతమైనది, మొదటిదని కొందరు, రెండవదని కొందరు వాదోపవాదాలు చేస్తున్నారు కానీ, శ్రీమద్భాగవతమే అష్టాదశ పురాణాంతర్గతమగుట యుక్తమని తోచును. భక్తి ప్రధానమగు భాగవతాన్ని గురించి యుక్తి ప్రధానమగు వాదోపవాదములు అనవసరము.

"బుధ జనైర్వాదః పరిత్యజ్యతామ్" అని శంకర భగవత్పాదులవారు సాధన పంచకమున తెలిపిన మాట అనుసంధేయము. శ్రీమద్భాగవత లక్షణము మత్స్యపురాణమున చెప్పబడినది

శ్లో ॥ యత్రాధికృత్య గాయత్రీం వర్ణ్యతే ధర్మ విస్తరః
వృత్రాసుర వధోపేతం తద్భాగవతమిష్యతే ॥
లిఖిత్వా తచ్చయో దద్యాద్ధేమసింహసమన్వితమ్ ।
ప్రోష్ఠపద్యాం పౌర్ణమాస్యాం స యాతి పరమం పదమ్ ॥
అష్టాదశ సహస్రం తత్పురాణం పరికీర్తితమ్ ॥

ఇటులనే స్కాంద పురాణమున కూడా వివరించబడినది. ( విశేషముగా ఈ భాగవతము హయగ్రీవ బ్రహ్మ విద్యగా పేర్కొనబడినది.) భాగవతమునందలి ఆరవ స్కంధములోని తొమ్మిదవ అధ్యాయమున బ్రహ్మవేత్త, నారాయణ కవచోపాసకుడగు దధీచి అశ్వినీ దేవతలకు హయవదనముతో బ్రహ్మవిద్య బోధించినట్లు కలదు. కావున భాగవతము హయగ్రీవ బ్రహ్మవిద్య అనబడుచున్నది. ఇది పారమహంస్యమని కూడా చెప్పడినది. పరమహంసలు, యతీశ్వరులు బ్రహ్మ జ్ఞానమునొంది ముక్తులగుటకు సేవించునది ఈ భాగవతము.

గ్రంథోऽష్టాదశ సాహస్రో ద్వాదశ స్కంధ సమ్మితః
హయగ్రీవ బ్రహ్మవిద్యా యత్ర వృత్రవధస్తథా
గాయత్ర్యా చ సమారంభస్తద్వై భాగవతం విదుః ॥

అని 18000 శ్లోకాలు కలది. పన్నెండు స్కంధములతో ఒప్పారుచూ గాయత్రీ మంత్రార్థముతో ప్రారంభమై హయగ్రీవ బ్రహ్మవిద్యగా పేర్కొనబడినది భాగవత గ్రంథము అని పెద్దలు అన్నారు. (సంస్కృత భాషాపదాలు అనేకార్థములు కలిగినవగుటచే, ఆ భాష అత్యంత విస్తృతమైనదగుటచే, వాదోపవాదలకు దారితీయుచున్నది.) పై లక్షణాలు శ్రీకృష్ణ, దేవీ భాగవతాలలో సమానముగా కనిపించుచున్నవి. (కాని శ్రీకృష్ణ భాగవతమే అష్టాదశ పురాణాంతర్గతముగా ప్రసిద్ధమైయున్నది.) సప్తాహ శ్రవణ పరిపాటి శ్రీకృష్ణ భాగవతమునకే కలదు.

## సప్తాహ శ్రవణము

శ్రీకృష్ణ భాగవతము మోక్ష గ్రంథము. బమ్మెర పోతన మహాకవి కూడా తన శ్రీమదాంధ్ర మహాభాగవతారంభమున “శ్రీకైవల్యపదంబు జేరుటకునై చింతించెదన్” అంటాడు. సప్తాహ దీక్షతో భాగవతము వినువారికి పునర్జన్మరహిత శాశ్వతానందరూప మోక్షప్రాప్తి కలుగుననుటలో సందేహములేదు. ఏడు రోజులలో 18000 శ్లోకాలు మూలం చదువుతూ వివరించడం పౌరాణికునికి సాధ్యం కాదు. కావున సప్తాహంలో మరో బ్రాహ్మణుని కేవలం శ్రీమద్భాగవత పారాయణానికి నియోగించుకోవచ్చు “వాసుదేవ ద్వాదశాక్షరి” మంత్ర జపానికి కూడా బ్రాహ్మణులను నియోగించాలి. యథావకాశముగా కొంతమంది ముఖ్య శ్రోతను గూడా ఒకరిని నియమిస్తారు. యజమానుడు శ్రద్ధగా వినేవాడైతే ఇది అవసరంలేదు.

సప్తాహ శ్రవణం చేసే వ్యక్తి మంగలస్నానము చేసి ఆచమనము చేసి, దేశకాలాదుల కీర్తించి శుభసంకల్పం చేసిన తరువాత

' శ్రీకృష్ణపరబ్రహ్మ ప్రీత్యర్థం కైవల్య ప్రాప్త్యర్థం సప్తాహ దీక్షయా శ్రీమద్భాగవత శ్రవణం కరిష్యే" అని సంకల్పించి, నిర్విఘ్న పరిసమాప్తికి గణపతి పూజ, అఖండదీపారాధన, గౌర్యాదిమాతృకాపూజా, నవగ్రహారాధన, చేయాలి. వ్యాస, శుక, వసుదేవ, శ్రీమద్భాగవత గ్రంథపూజ సలపాలి. తదుపరి "ఓం నమో భగవతే వాసుదేవాయ" అనే వాసుదేవ ద్వాదశాక్షరి మంత్రాన్ని యథాశక్తి జపించాలి. లేదా "ఓం క్లీం కృష్ణాయ గోవిందాయ గోపీజన వల్లభాయ స్వాహా" అను గోపాల మంత్రాన్ని 108 మార్లు జపించాలి. ఆ తరువాత పార శ్రవణాదులు చేయాలి.

| **కరన్యాసః.** | **అంగన్యాసః** |
|---|---|
| ఓం క్లాం అంగుష్ఠాభ్యాం నమః. | ఓం క్లాం హృదయాయ నమః. |
| ఓం క్లీం తర్జనీభ్యాం నమః. | ఓం క్లీం శిరసే స్వాహా |
| ఓం క్లూం మధ్యమాభ్యాం నమః. | ఓం క్లూం శిఖాయై వషట్. |
| ఓం క్లైం అనామికాభ్యాం నమః. | ఓం క్లైం కవచాయహుం |
| ఓం క్లౌం కనిష్ఠికాభ్యాం నమః. | ఓం క్లౌం నేత్రత్రయాయ వౌషట్. |
| ఓం క్లః కరతల కరపృష్ఠాభ్యాం నమః. | ఓం క్లః అస్త్రాయ ఫట్. |

**ధ్యానమ్.**

శ్లో ॥ కస్తూరీ తిలకం లలాట ఫలకే వక్షస్థలే కౌస్తుభమ్ ।
నాసాగ్రే నవ మౌక్తికం కరతలే వేణుం కరే కంకణమ్ ।
సర్వాంగే హరిచందనంచ కలయన్ కంఠే చ ముక్తావలీమ్ ।
గోపస్త్రీపరివేష్టితో విజయతే గోపాలచూడామణిః ॥

శ్లో ॥ అస్తి స్వస్తరుణీకరాగ్రవిగలత్కల్పప్రసూనా ప్లుతమ్ ।
వస్తు ప్రస్తుతవేణునాదలహరీనిర్వాణనిర్వ్యాకులమ్ ।
స్రస్తస్రస్తనిబద్ధనీవివిలసద్గోపీసహస్రావృతమ్ ।
హస్తన్యస్తనతాపవర్గమఖిలోదారం కిశోరాకృతి. ఇది ధ్యాత్వా ఆరభేత ॥

నియమముగా ఉండి మితాహారియై, జితేంద్రియుడై, భక్తితో భాగవత పార, శ్రవణాదులు చేయాలి. సమాపనముగా వస్త్రాలంకార ద్రవ్యములచే పాఠకుని, పౌరాణికుని పూజించి, రుక్మిణీ కల్యాణము చేయించి, బ్రాహ్మణులకు, అన్నసంతర్పణ చేయాలి. బంగారు సింహాసనమును చేయించి దానిమీద చేతితో వ్రాసిన భాగవత గ్రంథమును ఉంచి పౌరాణికునికి దానం చేయడం వలన మోక్షప్రాప్తి కలుగుతుంది. భాగవత సప్తాహ శ్రవణము భాద్రపద నవమి నుండి పౌర్ణమి వరకు సమాప్తి చేయాలి. శ్రీశుక ముఖతః పరీక్షిత్తు ఇదే సమయములో శ్రవణము చేశాడు.

శ్లో ।

మనుకర్దమసంవాదపర్యంతం ప్రథమే ऽ హని ।
భరతాఖ్యానపర్యంతం ద్వితీయేऽహని ।
తృతీయే చ దినే కుర్యాత్ సప్తమస్కంధపూరణమ్ ।
కృష్ణావిర్భావ పర్యంతం చతుర్థే దివసే పఠేత్ ।
రుక్మిణ్యుద్వాహపర్యంతం పంచమేऽ హని శస్యతే ।
శ్రీ హంసాఖ్యాన పర్యంతం షష్ఠేऽహని పఠేత్సుధీః ।
సప్తమే తు దినే కుర్యాత్ పూర్తిం భాగవతస్యవై ।
ఏవం నిర్విఘ్నతా సిద్ధిర్విషయస్య న చాన్యథా ॥

మరి కొందరి మతంలో. శ్లో ॥

ఆద్యే హిరణ్యాక్ష వధో ద్వితీయే భరతావధి ।
తృతీయేత్వబ్ధి మథనం చతుర్థే కృష్ణ జన్మ చ ।
పంచమే రుక్మిణ్యుద్వాహః షష్ఠేచోద్ధవ వాచకమ్ ।
సప్తమే ऽ హ్ని సమాప్తిః స్యాత్ సప్తాహం మునిరబ్రవీత్ ॥

అని శ్రీమద్భాగవత మాహాత్మ్యం స్కాంద పురాణంలో వైష్ణవ ఖండంలో వివరించబడినది." శ్రీమద్భాగవతాఖ్యోయం ప్రత్యక్షః కృష్ణ ఏవహి". అని పద్మపురాణమున కలదు. శ్రీమద్భాగవతము అక్షరరూప శ్రీకృష్ణ స్వరూపము. పద్మ పురాణములో ఉద్ధవుడు శ్రీకృష్ణ నిర్యాణ సమయమున "స్వామీ ! కలి కాలమున మానవులెలా ఉద్ధరింపబడగలరు. పాపాత్ములు, అల్పాయుష్మంతులు, ఉగ్రరోగబాధితులు బాగుపడే మార్గము చెప్పుము." అని ప్రార్థించగా తన తేజస్సును శ్రీకృష్ణపరమాత్మ శ్రీమద్భాగవతమున ఉంచెను. ద్వాదశ స్కంధాత్మక శ్రీభాగవతము ద్వాదశాదిత్య సమానము. సూర్యుడు తమస్సును రూపుమాపి వెలుగును ప్రసరింపజేసినట్లు శ్రీమద్భాగవతము అజ్ఞానమనెడి చీకటిని తొలగించి భక్తి, జ్ఞాన, వైరాగ్యములనెడి వెలుతురు కలిగించెడి గొప్ప కల్పతరువు. "కలౌ నష్ట దృశామేష పురాణార్కో ऽ ధునోదితః". అన్నారు. భక్తి జ్ఞాన వైరాగ్య జనకమగు భాగవతము త్రివిధగతి గల సూర్యునితో సమానమేగాక సూర్యునికన్న మిక్కిలి విశిష్టమైన వ్యతిరేకాలంకారాలలో వివరించబడినది. సూర్యుడు పగలు మాత్రమే ప్రకాశిస్తాడు, కాని శ్రీమద్భాగవతము రాత్రింబవలు కూడా వెలుగుతుంది. సూర్యుడు మనోగుహలోని అంధకారాన్ని తొలగించలేడు, కాని భాగవతము మనోగుహాగతమైన అజ్ఞానమనెడి మాలిన్యాన్ని కూడా తొలగించగలదు. భాగవత పురాణ ప్రవచనము జరిగినచోట సర్వ శ్రేయస్సులు చేకూరుతాయి. భాగవత సప్తాహ శ్రవణము వలన ఈ లోకమున ఆయురారోగ్య ఐశ్వర్యాది సత్ఫలితములే కాక అంత్యమున మోక్షము కూడా లభించును. "నాన్యః పంథా విద్యతేయనాయ" అని శ్రుతి. మోక్షానికి జ్ఞానమే కారణము.

భాగవత సప్తాహము సర్వోత్కృష్టమగు జ్ఞాన యజ్ఞము. ఇది భక్తుల పాలిటి పెన్నిధి.

శ్లో ॥ శ్రీమద్భాగవతం పురాణ తిలకం యద్వైష్ణవానాం ధనమ్ ।
యస్మిన్ పారమహంస్యమేకమమలం జ్ఞానం పరం గీయతే ॥
యత్ర జ్ఞానవిరాగభక్తిసహితం నైష్కర్మ్యమావిష్కృతమ్ ।
తచ్ఛృణ్వన్ ప్రపఠన్ విచారణ పరో భక్త్యా విముచేన్నరః ॥

శ్రీమద్భాగవతము 12 స్కంధములు కలది. 12 అక్షరములు గల వాసుదేవ ద్వాదశాక్షరీ మహామంత్రమునకు సమానమని భావింపబడుచున్నది. శ్రీమద్భాగవతము గహనము. అంత సులభముగా అర్థముగాదు. భాగవతార్థము వ్యాఖ్యాగమ్యము. అనేకమంది పండిత ప్రకాండులు భాగవతానికి వ్యాఖ్యలు రచించారు.

వ్యాఖ్యానాలకు వ్యాఖ్యలు కూడా వెలుబడినవి. అన్నిటికన్నా శ్రీధరీయ వ్యాఖ్యానము ముఖ్యమైనది. శ్రీధరస్వామి రచించిన భావార్థ దీపిక అను అద్వైత సిద్ధాంతపరమైన వ్యాఖ్యానము మిక్కిలి విశిష్టమైనది. శ్రీమద్భాగవతము అద్వైత వేదాంత సిద్ధాంతముతో నిండియున్నదనుటకు సందేహము లేదు. దాన్ని ప్రతిపాదించునది భావార్థదీపిక. యథార్థమైనభావమును ప్రకాశింపజేయునది. శ్రీధరస్వామి గొప్ప నృసింహ భక్త్యుపాసనలు కల మహాపండితుడు. అంతటి ఉపాసకునికి గూడా భాగవత శ్లోకాలకు సరియైన అర్థము కొన్నిచోట్ల గోచరించకపోతే ఆయన ముఖముపై వస్త్రం వేసుకొని నృసింహ ధ్యానం చేస్తూ కూర్చొనేవాడనీ, కొద్ది సేపటికి ముఖవస్త్రం తీసి చూడగా అచట కొన్ని పంక్తులు చక్కని అర్థమును వివరించేవి వ్రాసియుండెడివని చివరన "అయం భావః" అని ఉండిందనీ, ఆ అర్థాలను స్వయంగా నృసింహస్వామి తెల్పినాడని ప్రతీతి. శ్రీధరీయ వ్యాఖ్యానాన్ని ఇతర వ్యాఖ్యానాలను పరికించి పండితులు ఏది గొప్పదని ఆలోచించి శ్రీధర వ్యాఖ్యలేనిచో, భాగవత నిగూఢార్థము ఎవ్వరికినీ తెలిసేది కాదని నిర్ధారించారు.

అట్టి శ్రీధర వ్యాఖ్య భావార్థదీపికకు వంశీధర వ్యాఖ్యానం కూడా వెలుబడింది. అంతేకాక ఈ వ్యాఖ్యానాలనన్నింటినీ జగన్నాథస్వామి గుడిలో ఉంచితే దేనిని స్వామి పరిగ్రహించునో అది గొప్పదని, తెలుసుకుందామని ఆ విధముగా గుడిలో ఉంచితే శ్రీధర వ్యాఖ్య జగన్నాథస్వామి చేతిలో కనిపించినదని ప్రతీతి.

శ్రీధర వ్యాఖ్యానము ప్రతులలో అనేక పాఠభేదాలు కలవని వాటిని శోధించి సుష్ఠు పాఠములను పండితవర్య నారాయణ శాస్త్రి ప్రభృతులు నిర్ణయించి ముద్రించారు. అందుకే........"వ్యాసో వేత్తి శుకో వేత్తి సంజయో వేత్తి రాజా వేత్తి న వేత్తి వా న వా శ్రీధరః సకలం వేత్తి శ్రీనృసింహప్రసాదతః". అని ఆభాణకం వెలుబడినది. శ్రీధర వ్యాఖ్య గూడా చాలా జటిలం, వంశీధరవ్యాఖ్యయేకాక శ్రీధరీయానికి చాలా వ్యాఖ్యానాలు వెలుబడినవి. అట్టి శ్రీధరస్వామి భావార్థదీపిక సంస్కృత వ్యాఖ్యానానికి తెలుగు అనువాదం పండితులచే వ్రాయించి ప్రచురించాలని శ్రీగురు మదనానంద సరస్వతీ పీఠం సంకల్పించినది. శ్రీధరులు కఠిన పదాలకు మాత్రమే అర్థం వివరించారు. అనువాదం అటులనే చేసిన పాఠకులకు అగమ్యగోచరమగును. కావున శ్రీమద్భాగవతమునకు శ్రీధరవ్యాఖ్యానుసార ఆంధ్రానువాదము ఈ గ్రంథ ధ్యేయము.

డా॥ బ్రహ్మశ్రీ శివునూరి విశ్వనాథశర్మ
పీఠకార్యనిర్వాహక సభ్యులు

**శ్రీమద్భాగవతము**

**దశస్కంధః - పూర్వభాగః (ప్రథమోஉధ్యాయః)**

*రాజోవాచ*

**శ్లో॥** కథితో వంశ విస్తారో భవతా సోమ సూర్యయోః ।
రాజ్ఞాంచోభయ వంశ్యానాం చరితం పరమాద్భుతమ్ ॥ (1)

**టీ॥** తత్ర తు ప్రథమే కంసః స్వం మృత్యుం దేవకీసుతాత్ శ్రుత్వా భీతోஉవధీత్త స్యా ష్షడ్గర్భావితి వర్ణ్యతే. కృష్ణావతారచరిత శ్రవణామృతనిర్వృతః, ఉక్తానువాదేనౌత్సుక్యాద్రాజా పృచ్ఛతి తత్పునః, కథితో వంశవిస్తార ఇత్యాదినా. (1)

**శ్రీ మద్భాగవతము**

**దశమస్కంధ - పూర్వభాగము (ప్రథమాధ్యాయము)**

***శ్రీధరీయ టీకాంధ్రానువాదము***

*రాజు ఇట్లనెను*

**తా॥** (భగవానుడగు శ్రీకృష్ణుని వివిధములైన విచిత్ర లీలా విశేషముల వర్ణనముల వినుట కొరకు పరీక్షిన్మహారాజు శుక యోగీంద్రుని అడుగుచున్నాడు). పరీక్షిన్నరేంద్రుడిట్లనెను. చంద్ర సూర్యులు అను ఉభయ వంశములందు జన్మించిన రాజుల యొక్క మిక్కిలి అద్భుతమైన చరిత్ర, విస్తారముగ మీచే చెప్పబడినది. (1)

**టీ॥** దేవకీ తనయుని వలన తనకు మరణము సంభవించునని విని భయపడిన కంసుడు ఆమె యొక్క ఆఱు గర్భములను (శిశువులను) సంహరించెనని మొదటి అధ్యాయమున వర్ణింపబడును. ఇక శ్రీకృష్ణావతార చరితమును వినుటలోని అమృతత్వమున సుఖింపనిచ్చగల వాడైన పరీక్షిత్తు, చెప్పిన అంశమునే వివరించుట చేత కలుగు ఉత్కంఠ వలన, మరల 'కథితో వంశ విస్తిరః' ఇత్యాదిగ అడుగుచున్నాడు. (1)

**శ్లో॥** యదోశ్చ ధర్మ శీలస్య నితరాం ముని సత్తమ! ।
తత్రాంశేనావతీర్ణస్య విష్ణోర్వీర్యాణి శంస నః ॥ (2)

**తా॥** యదువంశీయుడును, ధర్మమే స్వభావముగ గలవాడును, విష్ణుదేవుని అంశచేత అవతరించిన వాడును అయిన శ్రీకృష్ణుని పరాక్రమములఁ గూర్చి ఓ మునిశ్రేష్ఠుడా! మాకు వివరముగా వర్ణించి చెప్పుడు. (2)

**టీ॥** యదోరితి, అంశేనేతి ప్రతీత్యభిప్రాయేణోక్తం (2)

**టీ॥** 'అంశేన' అనుమాట ఇది ప్రసిద్ధమను అభిప్రాయముతో చెప్పబడినది. (2)

**శ్లో॥** అవతీర్య యదోర్వంశే భగవాన్ భూత భావనః ।
కృతవాన్ యాని విశ్వాత్మా తాని నో వద విస్తరాత్ ॥ (3)

**తా॥** ప్రాణులన్నింటికి ఆత్మయైన వాడును, షడ్గుణైశ్వర్య సంపన్నుడును, విశ్వమంతయు తానే యైన వాడునగు కృష్ణుడు, యదువంశము నందవతరించి ఏయే లీల లొనరించెనో వాని నన్నింటిని మాకు విస్తరించి చెప్పుడు. (3)

**టీ॥** ననూక్తాని కర్మాణి శ్లో. జాతో గతః పితృగృహాద్వ్రజమేధితార్థ ఇత్యాదినా, సత్యం, పునర్విస్తరేణ వదేత్యాహ, - అవతీర్యేతి, (3)

**టీ॥** నందగోకులము నందలి గోవులు, గోపాలురు, గోపికలు మున్నగు వారిని సుఖింపజేయుటయే ప్రయోజనముగా కలవాడై, శ్రీకృష్ణుడు పుట్టెను. తన తండ్రి స్థానమగు మధుర నుండి గోకులమునకు బోయెను. ఇత్యాదిగ అతడు చేసిన కొన్ని కృత్యములు నిశ్చయముగ చెప్పబడియుండెను. సత్యమే, అయినను మఱల వివరముగ చెప్పుడు అని పరీక్షిత్తు అడిగెను. (3)

**శ్లో॥** నివృత్త తర్షై రుపగీయమానా
ద్భవౌషధాచ్ఛ్రోత్ర మనోభిరామాత్ ।
క ఉత్తమ శ్లోక గుణాను వాదా
త్పుమాన్ విరజ్యేత వినాఽ పశుఘ్నాత్ ॥ (4)

**టీ॥** అత్ర లోకే త్రివిధా జనాః, ముక్తాః, ముముక్షవః. విషయిణశ్చ, తేషాం మధ్యే అత్ర న కస్యాప్యలం ప్రత్యయఇత్యాహ – నివృత్తతర్షైరితి, నివృత్తతర్షైః గత తృష్ణైః ముక్తైరిత్యర్థః, ముముక్షూణామయ మేవోపాదేయ ఇత్యాహ – భవౌషధాదితి, విషయిణామపి పరమో విషయోఽయమేవేత్యాహ – శ్రోత్రమనోభిరామాదితి. అపగతా శుక్ యస్మాత్తమాత్మానం హంతీత్యపశుఘ్నః తస్మాత్, పశుఘాతిన ఇతి వా. 4

**తా॥** సాంసారికమైన ఆశ సంపూర్ణముగ శమించిపోయిన ముముక్షువుల చేత గానము చేయబడుచుండుట వలనను, ప్రాపంచిక విషయ వ్యాధికి చికిత్స చేయగల ఔషధమగుట వలనను, చెవులకును మనస్సునకును సుఖము నిచ్చు రసవత్తరమైనదగుట వలనను, ఉత్తమ శ్లోకుడగు శ్రీకృష్ణుని గుణ కీర్తనము చేత అందఱును ప్రీతులయ్యెదరు. పశుహింసకుడు లేక ఆత్మహింసకుడు తప్ప ఏ మనుష్యుడు అతని లీలా వర్ణనమున ఆనందింపక ఉండగలడు? (4)

**టీ॥** ఇచట లోకము నందు ముక్తులు, ముముక్షువులు, సంసారులు అని మూడు విధములగు జనులు ఉందురు. వారిలో ఏ ఒక్కరికైనను, చాలినంత తత్త్వజ్ఞత లేదని చెప్పుచున్నాడు "నివృత తర్షైః" అని – నివృత్త తర్షైః – ఆశ గడచిన వారిచేత, ముక్తులచేత అని యర్థము. మోక్షమును కోరు వారికి కూడ ఇదియే (గుణ కీర్తనమే) స్వీకరింప దగినది అని చెప్పుచున్నాడు – " భవౌషధాత్" అని. సంసారులకు కూడ ఉత్కృష్టమగు విషయ మిదియే (గుణకీర్తనమే) అని చెప్పుచున్నాడు.– " శ్రోత్ర మనోభిరామాత్" అని. అపగత శుక్ యస్మాత్తమాత్మానం హంతీత్యపశుఘ్నః – ఎవని నుండి శోకము దూరమగునో అట్టి ఆత్మ హననము చేయువాడు అపశుఘ్నుడు, వానిని మినహాయించి – లేక పశువులను హననము చేయు కసాయి వానిని మినహాయించి (మనుష్యుడెవడానందింపకుండును?) (ఇచట

**శ్లో॥** పితామహా మే సమరేఽమరం జయై
ర్దేవ వ్రతాద్యాతిరథైస్తిమింగిలైః ।
దురత్యయం కౌరవసైన్య సాగరం
కృత్వా తరన్ వత్సపదం స్మ యత్ప్లవాః ॥ (5)

**టీ॥** కించ అస్మత్కులదైవతం శ్రీకృష్ణః, అతస్తథైవ నిత్యం శ్రోతవ్యేత్యాశయేనాహ - పితామహా ఇతి. అమరాన్. జయంతియే. తైః, దేవవ్రతో భీష్మః తదాద్యైరతిరథైరేవ తిమింగిలైః దురత్యయం, వత్సపదమివ అత్యల్పం కృత్వా తుచ్ఛీకృత్య అతరన్ స్మ, యః శ్రీకృష్ణ ఏవ ప్లవో యేషాం తే తస్య వీర్యాణి పదస్వేతి తృతీయశ్లోక గతపదేనాన్వయః (5)

అపశుఘ్నః అనగా ఆత్మ హంతకుడు. ఆత్మ శబ్దము జీవాత్మపరము, సోపాధికుడైన జీవుడు అపశుక్ అని వ్యవహరింపబడినాడు). (4)

**తా॥** మా తాతలైన పాండవులు యుద్ధము నందు, భీష్ముడు మొదలగు అతిరథులగు తిమింగిలముల వంటి యోధులతో, కౌరవ సైన్యమనెడు దాటరాని సముద్రమును వత్సపదముగ జేసి (అల్పీకరించి) ఏ శ్రీకృష్ణుడను నావతో దాటి యుండిరో (అట్టి శ్రీకృష్ణుని పరాక్రమములను గూర్చి మాకు చెప్పుడు). (5)

**టీ॥** అదియును గాక మా కులదైవతము శ్రీకృష్ణుడు-అందువలన ఆ విధముగ కూడా నిత్యమును అతని గూర్చి వినవలయుననియెడి ఆశయముతో చెప్పుచున్నాడు, " పితామహాః" అని-దేవతలను జయించు వారు అమరంజయులు. వారితో-దేవవ్రతుడు- భీష్ముడు - అతడు మొదలగు అతిరథులతో-అతిరథులనెడు తిమింగిలములతో (మిక్కిలి పెద్ద చేపలతో)-దురత్యయం-దాటుటకు శక్యముకానిది) వత్సదమివ అత్యల్పం కృత్వా-శిశువు పాదము వలె మిక్కిలి చిన్నదిగ చేసి-తుచ్ఛముగ చేసి-అతరన్ స్మ-దాటిరి. ఏ శ్రీకృష్ణ భగవానుడే ఎవరికి నావగా నుండి సైన్య సాగరమును దాటించెనో వారు, 'యత్లవాః అట్టి శ్రీకృష్ణుని వీర్యములను చెప్పవలసినదని మూడవ శ్లోకము నందలి పదముతో అన్వయము (5)

**శ్లో॥** ద్రౌణ్యస్త్ర విప్లుష్ట మిదం మదంగం
సంతాన బీజం కురు పాండవానామ్ ।
జుగోప కుక్షిం గత ఆత్త చక్రో
మాతుశ్చ మే యశ్శరణం గతాయాః ॥ (6)

**తా॥** శ్రీకృష్ణుని శరణు పొందిన మా తల్లి గర్భమున గల కౌరవ పాండవుల సంతాన బీజమగు ఈ నా శరీరము, అశ్వత్థామచే ప్రయోగింపబడిన బ్రహ్మాస్త్రముచే దగ్ధము కాగా అతడు (కృష్ణుడు) చక్రధారిగ గర్భ ప్రవిష్టుడై రక్షించెను. (6)

**టీ॥** న కేవలం పాండవానేవారక్షత్. ఇదం మమ శరీరమపి యో రక్షితవానిత్యాహ – ద్రౌణ్యస్త్రవిప్లుష్టమితి. ద్రౌణేరశ్వత్థామ్నః బ్రహ్మాస్త్రేణ దగ్ధం ఇదం మచ్ఛరీరం కురూణాం పాండవానాం చ సంతానస్య బీజం నిదానం మే మాతుః కుక్షౌ ప్రవిష్టో యో ధృత చక్రోఁజు గోపేతి. (6).

**టీ॥** కేవలము పాండవులనే రక్షింపలేదు. ఈ నా శరీరమును కూడా రక్షించెనని 'ద్రౌణ్యస్త విప్లష్టం" అనుచు చెప్పుచున్నాడు. ద్రౌణేః –అశ్వత్థామ యొక్క బ్రహ్మాస్త్రేణ దగ్ధం – బ్రహ్మాస్త్రముచే కాల్చబడినది. ఇదం – ఈ– మచ్ఛరీరం– నాదేహము– కౌరవుల పాండవుల సంతానము యొక్క బీజము–నిదానము. మే మాతుః – నా తల్లియొక్క కుక్షౌ ప్రవిష్టః– గర్భమున ప్రవేశించిన వాడై, ఎవ్వాడు చక్రము ధరించి యుండెనో (అట్టి కృష్ణుడు గర్భమున ప్రవేశించి– జుగోప ఇతి– రక్షించెను–అని (6)

**శ్లో॥** వీర్యాణి తస్యాఖిల దేహ భాజా
మంతర్బహిః పూరుషకాల రూపైః ।
ప్రయచ్ఛతో మృత్యుముతా మృతం చ
మాయా మనుష్యస్య వదస్వ విద్వన్! ॥ (7)

**తా॥** ఓ తత్త్వజ్ఞా! సమస్త ప్రాణుల లోపల ఆత్మగను, వెలుపల కాలచోదిత పదార్థముల తోను నెలకొని యుండి, అటు ముక్తిని, ఇటు మృత్యువును ఇచ్చుచుండు మాయా మానుష స్వరూపుని పరాక్రమము లను గూర్చి చెప్పుడు.(7)

**టీ॥** వీర్యాణీతి, అఖిలదేహభాజాం సర్వప్రాణినాం. అంతః పురుష రూపేణ బహిః కాలరూపైశ్చ అంశాభిప్రాయేణ బహువచనం అమృతం ముక్తిం, మృత్యుం సంసారం. ఉత అపి. ప్రయచ్ఛతో వీర్యాణి. వదస్వ బ్రూహి అయం భావః. అంతర్యామిరూపేణ అంతర్దృష్టీనాం ముక్తిం బహిర్దృష్టీనాం. కాలరూపేణ మృత్యుం సంసారం ప్రదదాతి, యతః అతోఽంతర్దృష్ట్యా తద్వీర్యాణ్యేవ శ్రోతవ్యానీతి. (7)

**శ్లో॥** రోహిణ్యాస్తనయః ప్రోక్తో రామ స్సంకర్షణ స్త్వయా ।
దేవక్యా గర్భ సంబంధః కుతో దేహాంతరం వినా ॥ (8)

**టీ॥** రోహిణ్యా ఇతి, నను శ్లో. "బలం గదం సారణం చ దుర్మదం విపులం ధ్రువం, వసుదేవస్తు రోహిణ్యాం కృతాదీనుదపాదయది"తి రోహిణ్యా స్తనయో బలః ప్రోక్తః, " వసుదేవస్తు దేవక్యామష్టపుత్రా

**టీ॥** అఖిల దేహభాజాం-సర్వప్రాణినాం-అంతః పురుష రూపేణ-లోన ప్రత్యగాత్మ రూపముతో - బహిః కాల రూపైశ్చ - వెలుపల కాల రూపములతోను, అంశాభిప్రాయేణ బహువచనం-విభాగ దృష్టిచేత బహువచనము. అమృతం-ముక్తిని, మృత్యుం-సంసారమును -ఉత-మరియు ప్రయచ్ఛతః వీర్యాణి-ఇచ్చువాని పరాక్రమములను-వదస్వ-చెప్పుము- దీని భావమిది అంతర్దృష్టిగల వారికి అంతర్యామి రూపముతో ముక్తిని, బయటి చూపుగల వారికి కాలరూపముతో మృత్యువును - సంసారమును ఇచ్చును, అందువలన - అంతర్దృష్టి తోడనే అతని లీలలను మాత్రము వినవలెను. అతని వీర్యములే వినదగినవి- అని. (7)

**తా॥** సంకర్షణుడను పేరు గల బలరాముడు, రోహిణీ పుత్రుడని మీరు చెప్పితిరి. పిదప దేవకీ పుత్రులలో కూడా అతనిని పేర్కొంటిరి. మఱియొక శరీరమును ధరింపక అతనికి దేవకీ గర్భసంబంధమెట్లు పొసగును? (8)

**టీ॥** 'వసుదేవునకు రోహిణీ గర్భమునందు బలరాముడు, గదుడు, సారణుడు, దుర్మదుడు, విపులుడు, ధ్రువుడు, కృతుడు మొదలగు పుత్రులు కలిగిరి''. (9-24-46) అని బలరాముడు రోహిణీ

నజీజనత్, కీర్తిమంత సుషేణం చ భద్రసేనముదారధీః, మృదుం సంమర్దనం భద్రం సంకర్షణమహీశ్వరం, అష్టమస్తు తయోరా సీత్స్వయమేవ హరిః కిలే"తి. పునర్దేవక్యా గర్భసంబంధస్తస్యైవోక్తః స కుతో ఘటత ఇత్యాక్షేపః. (8)

తనయుడగా చెప్పబడెను. "దేవకి యందు వసుదేవుడు ఎనమండుగురు పుత్రులను కనెను. (9-24-53) కీర్తిమంతుడు, సుషేణుడు, భద్రసేనుడు, ఋజు, సంమర్దనుడు, భద్రుడు, మరియు శేషావతారు డగు బలరాముడు, (9-24-55) అని ( నిశ్చయముగ చెప్పబడెను.) అతనికే (బలరామునకు) దేవకీ గర్భ సంబంధము చెప్పబడినది ఇది యెట్లు సంభవించునని ఆక్షేపము. (8)

శ్లో॥ కస్మాన్ముకుందో భగవాన్ పితృగేహాద్వ్రజం గతః ।
క్వ వాసం జ్ఞాతిభిస్సాకమకరోత్సాత్వతాం పతిః ॥ (9)

తా॥ యదువంశ శిరోమణి, సుందరుడు, భగవానుడునైన శ్రీకృష్ణుడు తన తండ్రి ఇంటి నుండి నందగోకులమున కెందులకు పోయెను. తన జ్ఞాతులగు వారితో కలిసి ఏల నివసించెను. (9)

టీ॥ కస్మాదితి భగవతః కంసభయశంకా సంభవాదిత్యర్థః (9)

టీ॥ భగవతః కంస భయశంకాసంభవాదిత్యర్థః – భగవానునకు కంసుని వలన కలుగు భయము, అనుమానము కలుగకుండుటకని యర్థము. లేక కంసునకు తన వలన కలుగు భయ శంకాదులు కలుగకుండుటకు అనియు అర్థము. (9)

శ్లో॥ వ్రజే వసన్ కిమకరోన్మధుపుర్యాం చ కేశవః ।
భ్రాతరం చావధీత్కంసం మాతురద్ధా తదర్హణమ్ ॥ (10)

తా॥ శ్రీకృష్ణుడు గోకులమున నివసించుచు, అచ్చటను మరియు మధరలోనను ఏమి చేసెను, సాక్షాత్తుగ తన తల్లికి అన్నయును, అవధ్యుడును అయిన కంసుని చంపెను కదా! (10)

**టీ॥**–అద్ధా సాక్షాత్ మాతుర్భ్రాతరం కంసం తస్మాదతదర్హణం . వధానర్హం – కస్మాదవధీత్. (10)

**శ్లో॥** దేహం మానుష మాశ్రిత్య కతి వర్షాణి వృష్ణిభిః ।
యదుపుర్యాం సహావాత్సీత్పత్న్యః కత్యభవన్ ప్రభోః ॥ (11)

**శ్లో॥** ఏతదన్యచ్చ సర్వం మే మునే కృష్ణ విచేష్టితమ్ ।
వక్తు మర్హసి సర్వజ్ఞ! శ్రద్దధానాయ విస్తృతమ్ ॥ (12)

**శ్లో॥** నైషాతి దుస్సహా క్షున్మాం త్యక్తోదమపి బాధతే ।
పిబంతం త్వన్ముఖాంభోజాచ్చ్యుతం హరి కథామృతమ్ ॥ (13)

**టీ॥** నను క్షుత్తృడ్భ్యాం పీడితస్య తవ కుతః శ్రవణావకాశస్తత్రాహ – నేతి. త్యక్తోదకస్యాపి మే జీవనం హరికథామృతపాన నిమిత్తం. తదుపరమే సత్యేవ జీవనం స్యాదిత్యర్థః. (11 – 13)

**టీ॥** అద్ధా సాక్షాత్ మాతుర్భ్రాతరం – కంసుని – తస్మాదతదర్హణం అందువలన చంపకూడని వానిని – కస్మాదవధీత్ – ఎందువలన చంపెను? (10)

**తా॥** మనుష్య దేహము నాశ్రయించి, యదు వంశీయులతో కూడి ద్వారకాపురిలో నాతడెన్ని సంవత్సరములు నివసించెను? ఆ కృష్ణ విభునకు ఎందఱు భార్యలైరి? (11)

**తా॥** సర్వజ్ఞుడవైన ఓ మునీశ్వరా ! కృష్ణ సంబంధముగ నేనింతవఱకు అడిగిన అతని లీలలను, ఇంకను ఇతరములైన వానిని కూడ, నాలో భక్తి పెంపొందుటకు వివరముగ చెప్పుడు. (12)

**తా॥** మీ ముఖపద్మము నుండి జాల్వారు విష్ణుకథ యనెడు అమృతమును త్రావుచున్న నన్ను సహింప శక్యముకాని ఆకలి, దప్పియును బాధించుట లేదు. (13)

**టీ॥** ఆకలి దప్పులతో పీడింపబడు నీకు ఈ వినుట యందలి అవకాశమెందులకో ఇట చెప్పుచున్నాడు–"నైషా" అని–నీరు త్రాగుట మానినను (దాహముతోనున్నను) నా జీవితము హరికథామృతమును గ్రోలుట కొఱకై యున్నది. ఆహారపానీయములు లేకున్నను నా జీవిత మున్నది" అని అర్థము. (11–13)

**శ్రీసూత ఉవాచ**

**శ్లో॥** ఏవం నిశమ్య భృగునందన! సాధువాదం
వైయాసికిస్స భగవానథ విష్ణురాతమ్ ।
ప్రత్యర్చ్య కృష్ణ చరితం కలి కల్మషఘ్నం
వ్యాహర్తు మారభత భాగవత ప్రధానః ॥ (14)

**టీ॥** ఏవమితి. ఏవం సాధువాదసమీచీన ప్రశ్నం. భాగవతప్రధానః భాగవతేషు శ్రేష్ఠం, (14)

**శ్రీ శుక ఉవాచ**

**శ్లో॥** సమ్యగ్వ్యవసితా బుద్ధిస్తవ రాజర్షిసత్తమ! ।
వాసుదేవ కథాయాం తే యజ్జాతా నైష్ఠికీ రతిః ॥ (15)

**టీ॥** సమ్యగితి, వ్యవసితా నిశ్చితా, యత్ యతో బుద్ధిః, (15,16)

**శ్లో॥** వాసుదేవ కథా ప్రశ్నః పురుషాం స్త్రీన్ పునాతి హి ।
వక్తారం పృచ్ఛకం శ్రోతౄం స్తత్పాద సలిలం యథా ॥ (16)

**శ్రీసూత భగవానుడిట్లనెను**

**తా॥** ఓ శౌనకమునీ! సమంజసమగునిట్టి ప్రశ్నములను విని భగవానుడగు శ్రీ శుకుడు పరీక్షత్తునభినందించి, కలి కల్మషములను హరంచివేయునదియు, భగవద్భక్తులకు ప్రధానమైనట్టిదియును అగు శ్రీకృష్ణుని చరిత్రమును చెప్పుట కారంభించెను, లేక భాగవతులలో శ్రేష్ఠుడగు శుకుడు కృష్ణ చరితమును చెప్పుట కారంభించెను. (14)

**టీ॥** ఏవం సాధువాదం–ఇట్లు సమీచీనమగు ప్రశ్నమును–భాగవత ప్రధానః – భాగవతుల యందు శ్రేష్ఠుడు. (14)

**శ్రీ శుక డిట్లనెను**

**తా॥** ఓ రాజర్షి సత్తమా! కృష్ణ దేవుని కథయందు నీకు ఏ నిష్ఠాపూర్వక మైన కోరిక కలిగినదో అట్టి నీ బుద్ధి లెస్సగా నిశ్చితమైయున్నది.(15)

**టీ॥** వ్యవసితా–నిశ్చితా, యత్ – ఏ బుద్ధి కలదో. (15,16)

**తా॥** శ్రీకృష్ణుని కథలను గూర్చిన ప్రశ్న, చెప్పెడి వారిని, అడిగెడి వారిని, వినెడి వారిని, ఈ ముగ్గురిని, పురుషులను, స్త్రీలను గంగా జలమువలె పవిత్రీకరించును. (16)

**శ్లో॥** భూమిర్దృప్త నృప వ్యాజ దైత్యానీక శతాయుతైః ।
ఆక్రాంతా భూరి భారేణ బ్రహ్మాణం శరణం యయౌ ॥ (17)

**తా॥** గర్వితులైన రాజుల రూపమున ఒకప్పుడు భూమి, అనేక నూర్లవేల రాక్షసుల చేత ఆక్రమింపబడెను. అట్టి గొప్ప బరువుచే, భూమి, బ్రహ్మదేవుని శరణు వేడెను. (17)

**టీ॥** తత్ర తావత్ ప్రథమం భగవదవతార కారణమాహ నవభిశ్శ్లోకైః భూమిరితి. వా దృప్తనృపవ్యాజా యే దైత్యాస్తేషామనీక శతానా మయుతైర్యో భూరిభారః తేనాక్రాంతా. 17

**టీ॥** ఇట మొదట తొమ్మిది శ్లోకములతో భగవానుని అవతారములకు కారణమును చెప్పుచున్నాడు. 'భూమిః' అను నీ శ్లోకముతో – గర్వితులగు రాజుల వ్యాజముచేత ఏ రాక్షసుల యొక్క వేల వేల సంఖ్యలచే ఏ మిక్కిలి బరువు ఏర్పడినదో దాని చేత ఈ భూమి ఆక్రమింపబడినది.(17)

**శ్లో॥** గౌర్భూత్వాశ్రు ముఖీ ఖిన్నా రుదంతీ కరుణం విభోః ।
ఉపిస్థితాంతికే తస్మై వ్యసనం సమవోచత ॥ (18)

**తా॥** భూమి, గోరూపిణియై, కన్నీటి మోము గలదియై, ఖిన్నురాలై ఏడ్చుచు బ్రహ్మదేవుని సమీపమున గూర్చుండి జాలిగొల్పునట్లుగా అతనికి తన గోడును విన్నవించుకొనెను. (18)

**టీ॥** గౌరితి, విభోరంతికే ఉపస్థితా సతీ. (18,19)

**టీ॥** విభోరంతికే ఉపస్థితా సతీ – ప్రభువుసమీపమున కూర్చున్నదై (18,19)

**శ్లో॥** బ్రహ్మా తదుపధార్యామథ సహ దేవై స్తయా సహ ।
జగామ స త్రిణయన స్తీరం క్షీర పయోనిధేః ॥ (19)

**తా॥** బ్రహ్మదేవుడు, భూదేవి చెప్పిన దంతయును సావధానముగ విని, ఆమెను తోడ్కొని, దేవతలను వెంటగొని, ముక్కంటి యగు శివునితో సహ పాలసముద్రము యొక్క ఒడ్డునకు పోయెను. (19)

**శ్లో॥** తత్ర గత్వా జగన్నాథం వాసుదేవం వృషాకపిమ్ ।
పూర్ణం పురుషసూక్తేన హ్యుపతస్థే సమాహితః ॥ (20)

**తా॥** బ్రహ్మ, అచటికి వెడలి, జగత్తులకు పతియును, సర్వలోకములలో నిండియుండు వాడును, దేహములలో అంతర్యామి రూపమున ప్రవేశించి చైతన్యపరచువాడును అయిన నారాయణుని, పురుష సూక్తముతో స్తుతించుచు సమాధిగతుడయ్యెను. (20)

**టీ॥** తత్రేతి, వృషాన్ దేహాన్ జీవరూపేణ ప్రవిశ్య ఆకంపయతీతి వృషాకపిః (20)

**టీ॥** వృషాన్ దేహాన్ జీవరూపేణ ప్రవిశ్య ఆకంపయతీతి వృషాకపిః –శరీరముల యందు జీవ రూపముతో ప్రవేశించి అంతటను కదలిక కలిగించువాడు వృషాకపి. (20)

**శ్లో॥** గిరం సమాధౌ గగనే సమీరితాం
నిశమ్య వేధా స్త్రిదశానువాచ హ ।
గాం పౌరుషీం మే శృణుతామరాః పున
ర్విధీయతామాశు తథైవ మా చిరమ్ ॥ (21)

**తా॥** బ్రహ్మ దేవుడు తన ఏకాగ్ర స్థితిలో, ఆకాశమునందు గాలి వాటముగ నేరుగా వచ్చిన వాక్కును విని దేవతలనుద్దేశించి యిట్లనెను. “దేవతలారా! నా ద్వారా భగవద్వాక్యమును, వినుడు. విని, వెంటనే ఆలస్యము కాకుండ ఆ మాట ప్రకారము నడచుకొందురుగాక. (21)

**టీ॥** గిరమితి. పౌరుషీం పురుషస్య భగవతో గాం వాచం. మే మత్తః ఆశు శృణుత మాచిరం అవిలంబితం విధీయతాం చేతి. (21)

**టీ॥** – పౌరుషీం–పురుషుని యొక్క, భగవానుని యొక్క, గాం–వాక్కును మే–నానుండి, ఆశ శృణుత– త్వరగా వినుడు, మాచిరం–ఆలసింపక తథైన విధీయతాంచ–ఇతి– అట్లే చేయుదురు గాక– అని (21)

**శ్లో॥** పురైవ పుంసావధృతో ధరాజ్వరో
భవద్భి రంశైర్యదుషూప జన్యతామ్ ।
స యావదుర్వ్యా భర మీశ్వరేశ్వరః
స్వకాల శక్త్యా క్షపయంశ్చరేద్భువి ॥ (22)

**తా॥** మన విజ్ఞాపన కంటె ముందే పరమపురుషునకు భూదేవి అనుభవించు కష్టము తెలియును. ప్రభువులకు ప్రభువైన ఆ పరమాత్మ తన కాలశక్తి చేత భూభారము హరించుచు భూమిపై ఎంతవఱకు చరించుచుండునో అంతవఱకు మీరు కూడా మీమీ అంశలతో యదుకులమున జన్మించి అతని లీలలకు సహకరింపుడు. (22)

**టీ॥** – పురేతి, విజ్ఞాపనాత్ పురైవ పుంసా ఈశ్వరేణ ధరాయాః జ్వరః తాపః, (22, 23, 24)

**టీ॥** విజ్ఞాపనకు పూర్వమే పురుషునిచే-ఈశ్వరునిచే-ధరాయాః జ్వరః- భూమి యొక్క తాపము, (తెలియబడినది). (22,23,24)

**శ్లో॥** వసుదేవ గృహే సాక్షాద్భగవాన్ పురుషః పరః ।
జనిష్యతే తత్ప్రియార్థం సంభవంతు సురస్త్రియః ॥ (23)

**తా॥** వసుదేవుని యింటిలో స్వయముగ భగవానుడగు పురుషోత్తముడు అవతరించును. అతనిని సేవించుటకు దేవతాస్త్రీలు కూడా జన్మింతురు. (23)

**శ్లో॥** వాసుదేవ కళానంత స్సహస్ర వదన స్స్వరాట్ ।
అగ్రజో భవితా దేవో హరేః ప్రియ చికీర్షయా ॥ (24)

**తా॥** స్వయం ప్రకాశుడు, వేయి ముఖములు గలవాడు, నారాయణాంశతో నున్నవాడునగు అనంతుడు (శేషుడు) భగవానునకు ప్రియముచేయ గోరి అతనికి అన్న, బలదేవుడుగా జన్మింపగలడు.(24)

**శ్లో॥** విష్ణోర్మాయా భగవతీ యయా సంమోహితం జగత్ ।
ఆదిష్టా ప్రభుణాంశేన కార్యార్థే సంభవిష్యతి ॥ (25)

**తా॥** జగత్తునంతయు సమ్మోహన పరచిన భగవతియగు విష్ణుమాయ ఈశ్వరునిచే ఆజ్ఞాపింపబడినదై అతని లీలా కార్యములు సాగుట కొఱకు ఆవిర్భవించును. (25)

**టీ॥** విష్ణోరితి. దేవకీగర్భ సంకర్షణ యశోదామోహనాది కార్యార్థే యశోదాయాం సంభవిష్యతి (25. 26)

**టీ॥** దేవకీ గర్భ సంభూతుడగు బలరాముడు యశోదాదేవిని భ్రమింపజేయుట మొదలగు కార్యముల కొఱకు- యశోద యందు పుట్టును. (25,26)

*శ్రీ శుక ఉవాచ*

**శ్లో॥** ఇత్యాదిశ్యామరగణాన్ ప్రజాపతి పతిర్విభుః ।
ఆశ్వాస్య చ మహీం గీర్భి స్స్వధామ పరమం యయౌ॥ (26)

*శ్రీ శుకభగవానుడిట్లనెను*

**తా॥** "ఇట్లు దేవతా గణముల నాదేశించి, మాటలతో భూమిని ఓదార్చి ప్రజాపతులకు పతియగు బ్రహ్మ నిజావాసమగు సత్య లోకమునకుఁ బోయెను. (26)

**శ్లో॥** శూరసేనో యదుపతిః మధురామావసత్పురీమ్ ।
మాథురాన్ శూరసేనాంశ్చ విషయాన్బుభుజే పురా ॥ (27)

**తా॥** మధురా పట్టణమున శూరసేనుడను యదు వంశపురాజు పూర్వకాలమున మధురా మండలవాసులను, శూరసేనులను, వారి ప్రాంతములను పాలించెను. (27)

**టీ॥** భోజేంద్రబంధనాగారే అవతారాయ ప్రస్తావకథామాహ - యావదధ్యాయ పరిసమాప్తి, శూరసేన ఇతి, విషయాన్ దేశాన్. (27,28)

**టీ॥** - భోజ నరేంద్రుడైన కంసుని కారాగారమునందు కృష్ణ భగవానుని అవతార పద్ధతికి సంబంధించిన కథను చెప్పుచున్నాడు. 'శూరసేనః' అను నీ శ్లోకము నుండి అధ్యాయ పరి సమాప్తి వఱకు, విషయాన్-దేశాన్ (27,28)

**శ్లో॥** రాజధానీ తతస్సాఽభూత్సర్వ యాదవ భూభుజామ్ ।
మధురా భగవాన్ యత్ర నిత్యం సన్నిహితో హరిః ॥ (28)

**తా॥** అప్పటి నుండి యాదవరాజుల కెల్లరకును మధురా నగరమే రాజధానిగా నుండెను. శ్రీకృష్ణ భగవానుడచట ఎల్లప్పుడు విరాజమానుడై యుండెను. (28)

**శ్లో॥** తస్యాం తు కర్హిచిచ్ఛౌరిర్వసుదేవః కృతోద్వహః ।
దేవక్యా సూర్యయా సార్ధం ప్రయాణే రథమారుహత్ ॥ (29)

**తా॥** ఒకానొక సమయమున మధురా పట్టణమున శూరపుత్రుడగు వసుదేవుడు వివాహమాడి, దేవకియను తన నూతన వధువుతో కూడ ప్రయాణము చేయుటకు రథము నెక్కెను. (29)

**టీ॥** తస్యామితి, సూర్యయా నవోఢయా సాకం ప్రయాణే ప్రయాణార్థం, (29)

**టీ॥** సూర్యయా – క్రొత్తపెండ్లి కూతురుతో – సార్ధం – కూడా – ప్రయాణే – ప్రయాణము చేయుట కొఱకు (29)

**శ్లో॥** ఉగ్రసేన సుతః కంసో భగిన్యాః ప్రీతి మావహన్ ।
రశ్మీన్ హయానాం జగ్రాహ రౌక్మై రథ శతైర్వృతః ॥ (30)

**తా॥** ఉగ్రసేనుని కుమారుడు కంసుడు తన సోదరియగు దేవకికి ప్రీతి గూర్చుట కొఱకు ఆ రథాశ్వముల పగ్గములను గ్రహించెను. (నడుపుటకుపక్రమించెను). అతడు నూర్లకొలదిగ బంగారు రథములతో ఆవరింపబడియుండెను. (30)

**టీ॥** ఉగ్రసేనేతి. రశ్మీన్. ప్రగ్రహాన్, అగ్రహీత్. (30)

**టీ॥** రశ్మీన్ – పగ్గములను – అగ్రహీత్ – గ్రహించెను. (30)

**శ్లో॥** చతుశ్శతం పారిబర్హం గజానాం హేమ మాలినామ్ ।
అశ్వానామయుతం సార్ధం రథానాంచ త్రిషట్ శతమ్ ॥ (31)

**తా॥** సువర్ణ హారములతో నలంకరింపబడిన నాలుగు వందల ఏనుగులు, పదివేల గుఱ్ఱములు, పదునెనిమిది వందల రథములు (31)

టీ॥ చతుశ్శతమితి, పారిబర్హం ఉపస్కరం.(31)

టీ॥ - పారిబర్హం - కానుక - (31)

శ్లో॥ దాసీనాం సుకుమారీణాం ద్వే శతే సమలంకృతే ।
దుహిత్రే దేవకః ప్రాదాద్యానైర్దుహితృ వత్సలః ॥ (32)

తా॥ కూతురుపై మిక్కిలి ప్రేమగల ఉగ్రసేనుడు, తన కూతురగు దేవకీదేవి కొఱకు, రెండు వందల మంది సాలంకృతలగు సుకుమార దాసీ స్త్రీలను, వాహనములతో కూడ ఇచ్చెను. (32)

టీ॥ దాసీనామితి. దేవకః - ఉగ్రసేనః. (32,33)

టీ॥ దేవకః - ఉగ్రసేనుడు (32,33)

శ్లో॥ శంఖతూర్య మృదంగాని నేదుర్దుందుభయస్సమమ్ ।
ప్రయాణోపక్రమే తాత వర వధ్వోస్సుమంగళమ్ ॥ (33)

తా॥ వధూవరుల శుభ ప్రయాణ సందర్భమున, ఒకేసారి శంఖములు, వాద్యములు, భేరీలు, మృదంగములు, మ్రోగుచుండెను. (33)

శ్లో॥ పథి ప్రగ్రహిణం కంసమాభాష్యాహాశరీర వాక్ ।
అస్యా స్త్వామష్టమో గర్భోహంతా యాం నయసేఽబుధ!(34)

తా॥ గుఱ్ఱముల పగ్గములు పట్టుకొని రథమును నడుపుచున్న కంసునితో-మార్గ మధ్యమున-అశరీరవాణి మాట్లాడుచు ఇట్లనెను. " ఓరీ అవివేకీ! నీవు తోడ్కొని పోవుచున్న ఈ దేవకి యొక్క ఎనిమిదవ సంతానము, నిన్ను హతమార్చును. (34)

టీ॥ పథీతి, ఆభాష్య రే రే కంసేతి సంబోధ్య, హంతా హనిష్యతి.(34)

టీ॥ ఆభాష్య-" ఓరీ కంసా" అని పిలిచి, హంతా-చంపును. (34)

**శ్లో॥** ఇత్యుక్తస్స ఖలః పాపో భోజానాం కులపాంసనః ।
భగినీం హంతు మారబ్ధః ఖడ్గపాణిః కచేఽగ్రహీత్ ॥ (35)

**టీ॥** ఇతీతి, కులపాంసనః కుల దూషణః ఆరబ్ధః ఉద్యుక్తః కచే కేశబంధే. (35)

**శ్లో॥** తం జుగుప్సిత కర్మాణం నృశంసం నిరపత్రపమ్ ।
వసుదేవో మహాభాగ ఉవాచ పరిసాంత్వయన్ ॥ (36)

**టీ॥** తమితి, నృశంసం క్రూరం మహాభాగ ఇతి, అయం భావః, స్వజన్మని, దేవైర్వర్షేణ ఆనక దుందుభినిర్ఘోషేణ, భావి భగవవదతారేణా శంక్య ప్రతికారతా సంభవతీతి సాంత్వయన్, స్తుత్యా కృపావిషయత్వే నోపపత్తి భిశ్చ సన్మార్గేణ సంబోధయన్. (36)

**తా॥** అశరీరవాణిచే నిట్లు చెప్పబడిన దుర్మార్గుడు, పాపాత్ముడు, భోజ వంశమును కళంకితము చేయు వాడునైన ఆ కంసుడు, ఖడ్గమును చేతగొని తన చెల్లెలి సిగముడిని పట్టుకొని ఆమెను చంపుటకుద్యుక్తుడయ్యెను. (35)

**టీ॥** కుల పాంసనః – కులమును చెఱుపువాడు – ఆరబ్ధః – ఉద్యుక్తుడయ్యెను – కచే – కేశ బంధమునందు. (35)

**తా॥** అసహ్య కరములగు పనులు చేయువాడును, క్రూరుడును, సిగ్గులేని వాడును అయిన కంసుని గౌరవించుచు మహాభాగా (అదృష్టవంతుడా!) అని సంబోధించెను. ఉపలాలించుచు మహాభాగా! అని పలికెను. (36)

**టీ॥** నృశంసం – క్రూరుని మహాభాగ! ఇతి – అదృష్టవంతుడా అని – దీని భావమిది– తన పుట్టుక సందర్భమున, అతిశయించిన సంతోషముతో దేవతల చేత మ్రోగింపబడిన తప్పెటలు, భేరీ వాద్యములు మున్నగు వాని ధ్వనులచేత, భావికాలమున కలుగబోవు భగవానుడగు కృష్ణుని అవతారముచేత సాధ్యము కాబోవు ప్రతీకార కర్మలు సంభవింపగలవని–కంసుని అనునయించురీతిగ లాలించుచు,

వసుదేవ ఉవాచ.

**శ్లో॥** శ్లాఘనీయ గుణశ్శూరైర్భవాన్ భోజ్య యశస్కరః ।
స కథం భగినీం హన్యాత్స్త్రియ ముద్వాహ పర్వణి ॥ (37)

**టీ॥** కించ వసుదేవః కంసం సామభేదాభ్యాం సంభేదయన్నాహ – శ్లాఘనీయేతి. తత్ర సామ పంచవిధం, శ్లో 'లాభోపకృతి సంబంధా హ్యాభేదో గుణకీర్తనం, సామ పంచవిధం భేదో దృష్టాదృష్టభయం వచ' ఇతి శ్లాఘనీయగుణ ఇతి గుణకీర్తనం. భగినీమితి సంబంధకథనం. పుత్రికోపమేత్యభేదం వక్ష్యతి, హన్యాదితి స్త్రీవధనివృత్త్యా యశోలాభం దర్శయతి – ఉద్వాహపర్వణీతి సంతానవృద్ధ్యోపకారం దర్శయతి (37)

స్తోత్రము చేత, జాలిగొలుపు భావముల చేతను, కారణముల చేతను, సన్మార్గమున ప్రబోధించుచును (అతనిని ఆ దుశ్చర్యనుండి వారించెను) (36)

వసుదేవుడిట్లనెను.

**తా॥** తమరు శూరులచేత కొనియాడదగిన గుణములు కలవారు, భోజ వంశమునకు కీర్తికారకులు, అట్టి మీరు సోదరిని, ఆడుదానిని, పెండ్లి సంబరపు సమయమున ఎట్లు చంపెదరు? (37)

**టీ॥** వసుదేవుడు, కంసునకు ఆతనిని శాంతింపజేయుటకునైన సామ భేదములను విభజనతో సూచించుచు చెప్పుచున్నాడు. 'శ్లాఘనీయ" అనెడు ఈ శ్లోకమున సామము (శత్రువును శాంతింప జేయునుపాయము) ఐదు విధములు. "లాభోపకృతిసంబంధాహ్యాభేదో గుణకీర్తనం, సామ పంచవిధం భేదోదృష్టాదృష్టభయం వచః" ఇతి. ప్రత్యక్ష, అప్రత్యక్ష ఫలములవలని భయమును సూచించు మాటలతో సామోపాయము ఐదు విధములు. 1. లాభము. 2. ఉపకృతి. 3. సంబంధములు. 4. అభేదము. 5. గుణకీర్తనము అని. "పొగడదగిన గుణములు కలవాడవు" అనుట గుణకీర్తనము. "సోదరిని" అనుట సంబంధ కథనము 'కూతురితో సమానమైనది' అనుటతో అభేద కథనము. 'ఎట్లు చంపెదవు' అనుటతో స్త్రీ హత్యను నివారించుట

ద్వారా యశోలాభమును చూపుచున్నాడు. 'పెండ్లి సంబరముల సందర్భమున' అని సంతానవృద్ధి యనెడు ఉపకారమును సూచించుచున్నాడు. (37)

**శ్లో॥** మృత్యుర్ధర్మవతాం వీర దేహేన సహ జాయతే ।
అద్య వాబ్దశతాంతే వా మృత్యుర్వై ప్రాణినాం ధ్రువః ॥ (38)

**తా॥** ఓ వీరుడా! ధర్మవంతులకు మరణమనునది శరీరముతో కూడ పుట్టును. నేడో, నూరేండ్ల తరువాతనో ప్రాణులకు మరణము నిశ్చయము. (38)

**టీ॥** మమ మరణభయేన హన్మీతి చేత్తథాపి మరణస్యా పరిహరణీయత్వాత్ దేహాంతరస్య చావశ్యంభావిత్వాత్తత్రాపి భోగ ప్రేమాస్పదత్వాదీనామవిశేషాత్తద్భయేన పాపాచరణ మయుక్తమిత్యభిప్రేత్యాహ – మృత్యురితి. దేహేన సహేతి. విధాత్రా లలాటే లిఖితత్వాదితి. దేహస్య క్షణభంగురత్వాన్నిత్యమాశంక్యో మృత్యురితి వా. తథాసి కాలవిలంబార్థం హన్మీతి చేత్తత్రాహ – అద్యవేతి. అవశ్యం భావిని మరణే, విలంబమాత్రాయ పాపాచరణమయుక్తమితిభావః. (38)

**టీ॥** 'నా మరణ భయము వలన చంపుచున్నానని చెప్పెదవేని అప్పుడైనను మరణము పరిహరింపరాని దగుటవలను, మఱియొక దేహము వచ్చుటయు ముందు తప్పకుండుటవలనను, ఆ మఱియొక దేహమునకైనను భోగానుభవములు, ప్రేమాస్పదత్వములు, రాగద్వేషాదులు, సుఖదుఃఖాదులు కలుగుటలో విశేషమేమియు లేకపోవుట వలనను – ఆ భయముచేతనైనను పాపము చేయుట సమంజసముకాదు అనునభిప్రాయమున 'మృత్యుః' అను నీ శ్లోకమున చెప్పుచున్నాడు. 'దేహేన సహ' – అనుటచే బ్రహ్మచేత నుదుట వ్రాయబడి యుండుట వలన అని – లేక శరీరము క్షణభంగురమగుటచే మృత్యువు నిత్యము శంకింపదగినదే అనియో – అట్లైనను కాల విలంబము (జాగుసేయుట) కొఱకు చంపుచున్నానని అంటివేని

– చెప్పుచున్నాడు. 'అద్యవా' అని – భవిష్యత్తులో ఎట్టైనను మరణము తప్పనప్పుడు కేవలము విలంబము కొఱకు పాపము చేయుట సమంజసముకాదు – అని భావము. (38)

**శ్లో॥** దేహే పంచత్వ మాపన్నే దేహీ కర్మానుగోఽవశః ।
దేహాంతరమనుప్రాప్య ప్రాక్తనం త్యజతే వపుః ॥ (39)

**తా॥** శరీరమునకు అంత్యకాలము వచ్చినప్పుడు, జీవుడు తన కర్మననుసరించి వివశుడై వేఱొక శరీరమును పొంది పూర్వ శరీరమును వదలిపెట్టును. (39)

**టీ॥** కించ తస్మిన్ దేహే గతే యది దేహాంతరం న స్యాత్, తదా పాపేనాప్యేతత్ఫాలనం యుజ్యేత న తు తదస్తీత్యాహ దేహ ఇతి. ఆపన్నప్రాయే కర్మవశాదయత్నత ఏవ ప్రథమం దేహాంతరం ప్రాప్య. పశ్చాత్ పూర్వం వపుస్త్యజతి. (39)

**టీ॥** మరియు, ఈ దేహము పోయిన పిదప మఱియొక దేహము లేనియెడల – అప్పుడు జీవుడు తన పాపము తోనైనను – దాని ఫలానుభవముకొఱకు కూడియుండవలసివచ్చును. కాని అట్టిది లేదని చెప్పుచున్నాడు. మరణ సమయము ఆసన్నమైనప్పుడు కర్మవశమున అప్రయత్నముగనే మొదట వేఱొక శరీరమును పొంది, ఆ తరువాత తన పూర్వశరీరమును విడిచిపెట్టును. (39)

**శ్లో॥** వ్రజంస్తిష్ఠ న్పదైకేన యథైవాన్యేన గచ్ఛతి ।
యథా తృణ జలూకైవం దేహీ కర్మ గతిం గతః ॥ (40)

**తా॥** మనుష్యుడు ముందుకు పోవునప్పుడు ఒకపాదము స్థిరముగ నుంచి, మఱియొక పాదము లేవనెత్తి ముందుకు వేయునో, గడ్డిజెలగ ముందునగల ఆధారమును పట్టుకొనిన పిదప వెనుకగల ఆధారమును విడుచునో, అట్లే జీవుడు కూడ తన కర్మననుసరించి ఒక దేహము ఆధారముగ గొని తన పూర్వదేహమును వదలి పెట్టును. (40)

**టీ॥** అత్ర దృష్టాంతః. వ్రజన్నితి. ఏకేన అగ్రతో నిహితేన పదా తిష్ఠన్ భువమవష్టభ్య దేహం బిభ్రత్, పశ్చాదన్యేన పూర్వప్రదేశాదుత్థాప్య, పురో నిహితేన గచ్ఛతి తద్వత్, అత్ర చ స్వీకారపరిత్యాగౌ నాత్యంతభిన్న విషయావితి స్పష్టం దృష్టాంతరమాహ - యథా తృణజలూ కేతి, సా హి తృణాంతరమవష్టభ్య పూర్వతృణం త్యజతి, ఏవం కర్మ పథే వర్తమానో జీవోऽపి (40)

**టీ॥** ఇచట 'వ్రజన్' అను శ్లోకమున దృష్టాంతము. ఒక అడుగు ముందునకువేయుచు వెనుకటి అడుగుతో భూమిని అంటిపెట్టుకొని నిలుచుచు దేహము ముందునకు కదలుచుండును. పిదప ఆ వెనుకటి అడుగుతో పూర్వ ప్రదేశమునుండి పైకి లేపి, ముందువేసిన అడుగుతో పోవును - ఆ విధముగనే - ఇచ్చట కూడ స్వీకరించుట విడుచుట అను రెండు క్రియలు అత్యంత భిన్న విషయములు కావు అని స్పష్టమైనది. మఱియొక దృష్టాంతము చెప్పుచున్నాడు. గడ్డి జెలగ వలె అని. అది కూడ ఒక గడ్డిపరకను ఆధారముగ తీసికొని పూర్వపు గడ్డిపరకను వదలిపెట్టును. ఈ విధముగ కర్మమార్గమున వర్తించు జీవుడు కూడ (40)

**శ్లో॥** స్వప్నే యథా పశ్యతి దేహ మీదృశం
మనోరథే నాభి నివిష్ట చేతనః ।
దృష్ట శ్రుతాభ్యాం మనసానుచింతయన్
ప్రపద్యతే తత్కిమపి హ్యపస్మృతిః ॥ (41)

**తా॥** తాను చూచిన రాజుగారి ఐశ్వర్యముగాని, తాను వినిన ఇంద్రుడు మొదలగు వారి వైభవములను గాని కోరికలుగా మార్చుకొని వానితో మనస్సునింపుకొనినవాడు ఏ విధముగ తనను తాను ఒక రాజుగనో ఒక ఇంద్రుడుగనో స్వప్నమున చూచు కొనునో అప్పుడు తన జాగ్రద్వాస్తవమును పూర్తిగ మరచిపోవును. అట్లే జాగ్రత్ప్ర పంచమున కూడ తాను వినిన తాను చూచిన గొప్పలను మనస్సులో అదే పనిగ ఆలోచించుచున్న వాడును వాస్తవమును బొత్తిగ మరచి యుండును. (41)

**టీ॥** దేహవిషయావేవ స్వీకారపరిత్యాగౌ దర్శయితుం దృష్టాం తాంతరమాహ - స్వప్న ఇతి. దృష్టం రాజాది దర్శనం. శ్రుతం ఇంద్రాది శ్రవణం. తాభ్యాం ఆహిత సంస్కారేణ మనసా, తదేవానుచింతయన్. ఈ దృశం జాగ్రద్ద ృష్ట శ్రుత సదృశం రాజాది దేహరూపం. కిమపి అతితుచ్ఛమనిరుక్తం పశ్యతి క్షణాంతరే చ తదేవాహమితి ప్రతిపద్యతే మన్యతే. తతశ్చ జాగ్రద్దేహాదపగతస్మృతిర్భవతి పురుషో యథేతి. జాగ్రత్యేవ దర్శయితం దృష్టాంతాంతరమాహ - మనోరథేనేతి. అత్రాపి దృష్టశ్రుతాభ్యామిత్యాది సర్వం యోజ్యం. తథా చ వక్ష్యతి. శ్లో. "జంతోర్వై కస్యచిద్ధేతోర్మృత్యురత్యంతవిస్మ ృతిః, జన్మత్వాత్మతయా పుంసస్సర్వభావేన భూరివ విషయస్వీకృతిం ప్రాహుర్యథా స్వప్న మనోరథౌ, స్వప్నే మనోరథే చేత్థం ప్రాక్తనం స స్మరత్యసా" విత్యాది. తద్వదత్రాపి కర్మ వశాద్దేహాంతరం ప్రాప్య ప్రాక్తనం త్యజతీతి. (41)

**టీ॥** దేహ విషయములగు స్వీకార పరిత్యాగములను చూపుటకు మరియొక దృష్టాంతమును చెప్పుచున్నాడు. దృష్టం - రాజు మొదలగు వారి దర్శనము - శ్రుతం - ఇంద్రుడు మొదలగు వారిని గూర్చి వినుట - వారితో స్థిరీకరింపబడిన సంస్కారము చేత - వారిని గూర్చియే ఆలోచించుచు - ఈదృశం - జాగ్రదవస్థలో చూచిన, వినిన రాజు మొదలగు వారితో సమానమగు రూపమును - ఏదైనను మిక్కిల తుచ్ఛమైన, చెప్పుటకు సాధ్యము కాని పదార్థములను చూచునో - క్షణములో - మరుక్షణమున అదియే నేను అని ప్రపద్యతే - భావించును. అప్పుడు జాగ్రదవస్థలోని తన శరీరసంబంధ విషయము నుండి విస్మృతిని పొందును. ఇక జాగ్రదవస్థలోనిదే యగు మరియొక దృష్టాంతమును చెప్పుచున్నాడు - ఇచట ఈ అవస్థలో కూడ "చూచిన, వినిన అంశముల కొఱకు" మొదలగు అన్ని విషయములను గూర్చియు ఆలోచింపదగినదే. అటులనే చెప్పుచున్నాడు - ప్రాణికి ఏదియో కారణము వలన సంభవించు మరణము 'అత్యంత విస్మృతి' రూపమైనది. పుట్టువను లక్షణము చేత మనుష్యునకు, సర్వభావేన ప్రపంచ విషయములను స్వీకరించుటయనునది ఒక స్వప్నస్థితి వంటిది. ఒక వాంఛాస్థితి వంటిదియని చెప్పుదురు. స్వప్నమునందును, కోరుచున్న స్థితి యందును అతడు తన పూర్వస్థితిని స్మరింపడు. (మరచియుండును) (41)

**శ్లో॥** యతో యతో ధావతి దైవచోదితం
మనో వికారాత్మక మాప పంచసు ।
గుణేషు మాయా రచితేషు దేహ్యసౌ
ప్రపద్యమానస్సహ తేన జాయతే ॥ (42)

**టీ॥** నను విచిత్ర దేహహేతూనాం కర్మణామకృతత్వాద్దేహవిశేష ప్రాప్తౌ కిం కారణమత ఆహ - యతో యత ఇతి. దేహస్య పంచత్వ సమయే పంచసు గుణేషు పంచభూతేషు మాయా విరచితేషు. మాయయా నానా దేహరూపేణ రచితేషు. దైవేన ఫలాభి ముఖేన కర్మణా చోదితం నానావికారాత్మకం మనో యం యం దేహం దేవతిర్యగాదిరూపం ప్రతిధావతి ధావచ్చ సత్ యం యమాప అభినివేశన ప్రాప్తం, తత్ర తత్ర అసౌ దేహీ జాయతే. నను మనసః కర్మ కర్తృత్వాత్తదేవ జాయతాం న త్వకర్తాత్మేత్యత ఆహ - ప్రపద్యమాన ఇతి. తదేవాహమితి ప్రపద్యమానస్తేన సహ జాయత ఇతి. (42)

**తా॥** మరణించు సమయమున ఈ జీవుడు కర్మఫలచోదితుడై, మాయచేత రచింపబడినవియు, గుణమయములును, పంచభూతాత్మకములును ఐన శరీరములలో ఎచ్చటెచ్చటికి తిరుగుచు, నానా వికారములతో కూడిన మనసున ఏయే శరీరములతో తాదాత్మ్యము చెందునో-అదియే నేనని తలచునో - దానితో కూడి జన్మించును.(42)

**టీ॥** విచిత్రమైన శరీర కారణములలో-కర్మలు చేయకుండగనే దేహవిశేషము ప్రాప్తించుటయందేమి కారణమో యిట చెప్పుచున్నాడు 'యతో యతో' అను ఈ శ్లోకమున.-దేహము, మృత్యువునొందు సమయమున-పంచసు గుణేషు - పంచభూతములందు-మాయా రచితేషు -మాయచేత వివిధ శరీరముల రూపమున రచింపబడినవాని యందు - దైవేన - ఫలాభిముఖమగు కర్మతో చోదితం (ప్రేరేపింపబడి) నానా వికారములతో కూడిన మనస్సు ఏ ఏ దేహమును - దేవతలు, జంతువులు మొదలగువాని రూపమును - ప్రతి ధావతి-గూర్చి పరుగెత్తుచు యం యమాప-అభినివేశముతో దేనిని పొందునో- తత్ర తత్ర-అచ్చటచ్చట అసౌ దేహీ జాయతే-ఈ జీవుడు పుట్టును-మనస్సుయొక్క కర్మకర్తృత్వము వలన అదియే (మనస్సే) పుట్టునా లేక అకర్తయగు ఆత్మయా? అని అను విషయమునిట చెప్పుచున్నాడు. 'అదియే నేను' అని తలచువాడే దానితో కూడ పుట్టును. (42)

**శ్లో॥** జ్యోతిర్యథైవోదక పార్థివేష్వద
స్సమీర వేగానుగతం విభావ్యతే ।
ఏవం స్వమాయా రచితేష్వసౌ పుమాన్
గుణేషు రాగానుగతో విముహ్యతి ॥ (43)

**టీ॥** నను సత్యం భవిష్యత్యేవ కిమపి దేహమాత్రం, తథాప్యస్య అతి ప్రియస్య రాజ దేహస్య రక్షణాయ, అకృత్యమపి క్రియత ఇతి చేత్తత్రాహ – జ్యోతిరితి. అదశ్చంద్రాది జ్యోతిః ఉదకయుక్తేషు పార్థివేషు ఘటాదిషు. యద్వా ఉదకేషు పార్థివేషు తైలఘృతాదిషు ప్రతిబింబేన స్థితం. సమీరస్య వాయో ర్వేగమనుగతం కంపాదియుక్తం ప్రతీయతే యథా. ఏవం స్వావిద్యా రచితేషు గుణేషు దేహేషు. అసౌ రాగేణానుగతః ప్రవిష్టో ముహ్యతి అభినివేశం ప్రాప్నోతి. అయం భావః. ఆత్మనస్తావద్దేహాద్యధ్యాసాజ్జన్మోక్తం సహ తేన జాయత ఇతి. తతశ్చాన్యో న్యధర్మాధ్యాసాద్యథా దేహధర్మాః కార్శ్యాదయః ఆత్మని ప్రతీయంతే స్థూలోఽహం కృశోఽహమితి. ఏవమాత్మ ధర్మాః ప్రేమాస్పదత్వ జ్ఞానాశ్రయత్వాదయోఽపి. దేహాదిష్వితి. అతః రాజ సూకరాది దేహయోర్విశేషాభావాత్. వ్యర్థో మృత్యు ప్రతీకార ఇతి.(43)

**తా॥** నీటితో నిండియున్న కుండలు మున్నగు వానియందు ప్రతిబింబ రూపమున కన్పట్టు కాంతి, గాలిననుసరించి ఎట్లు కదలాడు చుండునో, అట్లే తన అజ్ఞానము చేతనే కల్పితములగు శరీరములందు అనురాగవశుడై ఈ జీవుడు మోహమును పొందును.(43)

**టీ॥** ఏదైనను దేహమాత్రమైనది సత్యము కాగలదేనా? అట్లైనను తనకు మిక్కిలి ప్రియమైన రాజు దేహమును రక్షించుటకొఱకు చేయకూడని పనినైనను చేయును అనిన యెడల చెప్పుచున్నాడు, అదః – చంద్రుడు మొదలగువాని కాంతి – ఉదక యుక్తేషు పార్థివేషు – నీటితో కూడిన కడవలు మొదలగువాని యందు – లేక –ఉదకేషు పార్థివేషు – నూనె, నేయి మొదలగువానియందు ప్రతిబింబరూపముచే నున్నట్టిది. సమీరస్య – గాలియొక్క వేగముననుసరించి కదలుట మున్నగు వానితోనున్నట్లు ఏ విధముగా కన్పట్టునో – ఏవం – అట్లే – స్వావిద్యా రచితేషు – తన అజ్ఞానముచే కల్పింపబడిన – గుణేషు – దేహములయందు– ఇతడు రాగము ననుసరించిపోయి వానిలో ప్రవేశించి – ముంహ్యతి–మోహము చెందును. చొరవ పొందును. అభినివేశమునుపొందును. భావమిది –ఆత్మకు దేహాదుల అధ్యాసవలన పుట్టుక చెప్పబడినదికదా – ఏ దేహపు అధ్యాస కలుగునో దానితో కూడ పుట్టును. ఇంకను అన్యోన్య ధర్మాధ్యాస వలన ( ఒకదాని

ధర్మములు మఱియొక దానిపై పరస్పరముగ ఆరోపించు లక్షణము వలన) దేహ ధర్మములగు కృశించుట మొదలగునవి, – 'నేను బలసినవానిని, బక్కచిక్కినవానిని' అని ఆత్మయందు ప్రతీయమానములగును. అట్లే ఆత్మ ధర్మములగు ప్రేమాస్పదత్వము జ్ఞానాశ్రయత్వము మొదలగునని దేహాదుల యందును అధ్యసింప బడును. అందు వలన రాజు దేహము, పంది దేహము అను మున్నగు వానిలో విశేషమేమియు లేదు. కాబట్టి మృత్యు ప్రతీకారము వ్యర్థమైనది – అని. (43)

**శ్లో॥** తస్మాన్న కస్యచిద్ద్రోహమాచరేత్స తథా విధః ।
ఆత్మనః క్షేమమన్విచ్ఛన్ ద్రోగ్ధుర్వై పరతో భయమ్ ॥ (44)

**తా॥** అందువలన తన క్షేమము కోరువాడు –ఆ విధముగ – ఎవరికిని ద్రోహము చేయకూడదు. ద్రోహము చేయువానికి ఇటు శత్రువు వలనను, అటు యమలోకము వలను భయము కలుగును. (44)

**టీ॥** ఏవముక్తం సామోపాయముపసంహరన్భేదమాహ – తస్మాదితి. పరత ఇతి. అభిద్రుహ్యమాణాత్ తత్సంబంధినశ్చ యమాదితి. భయం ఇహాముత్ర చ భయమితి భేదో దర్శితః. (44)

**టీ॥** ఇట్లు చెప్పబడినది – సామోపాయమును పూర్తిచేయుచు, 'తస్మాత్' అను ఈశ్లోకమున ఇహపరములందు కలుగు భయమునకు భేదమును చెప్పుచున్నాడు. ద్రోహము చేయబడుచున్న వాని వలనను, ద్రోహసంబంధమగు పాపము వలనను భయము కలుగును. ఇహ లోకము నందును పరలోకము నందును భయము కలుగునని భయమునందలి భేదము చూపబడినది. (44)

శ్లో॥ ఏషా తవానుజా బాలా కృపణా పుత్రికోపమా ।
హంతుం నార్హసి కల్యాణీమిమాం త్వం దీనవత్సల ॥ (45)

తా॥ దీనులపై ప్రేమ చూపు వాడా! ఈ నీ చెల్లెలు చిన్నపిల్ల - దీనురాలు, నీకు కూతురి వంటిది. ఈ క్రొత్త పెండ్లికూతురిని నీవు చంపవలదు. (45)

టీ॥ పునస్సామైవాహ - ఏషేతి. పుత్రికోపమా దారుమయీ వా అచేతనప్రాయా. 45.

టీ॥ మఱల సామమునే చెప్పుచున్నాడు. 'ఏషా' అని. పుత్రికోపమా లేక దారుమయీ - అచేతన ప్రాయమైనది. (45)

**శ్రీశుక ఉవాచ**

శ్లో॥ ఏవం స సామభిర్భేదైశ్చోద్య మానోఽపి దారుణః ।
న వ్యవర్తత కౌరవ్య! పురుషాదాననువ్రతః ॥ (46)

**శ్రీశుకుడిట్లనెను**

తా॥ "ఈ విధముగ వసుదేవుడు ప్రశంసాది సామ నీతుల చేత, భయాది భేద నీతుల చేతను ఉపదేశించుచున్న వాడైనను, ఓ పరీక్షిన్మహారాజా! ఆ కంసుడు క్రూరుడై, రాక్షసుల ననుకరించుచు తన ఘోర సంకల్పమును విడువకుండెను. (46)

టీ॥ ఏవమితి, చోద్యమానః ఉపదిశ్యమానః స్వయం దారుణః పునః పురుషాదాన్ దైత్యాన్. అనువ్రతః అనుసృత ఇతి. (46)

టీ॥ చోద్యమానః - ఉపదేశింపబడినవాడై - స్వయం దారుణః - స్వయముగ క్రూరుడు. పునః-పైగా -పురుషాదాన్ - రాక్షసులను - అనువ్రతః - అనుకరించినవాడై అని. (46)

శ్లో॥ నిర్బంధం తస్య తం జ్ఞాత్వా విచింత్యానక దుందుభిః ।
ప్రాప్తకాలం ప్రతివ్యోఢు మిదం తత్రాన్వ పద్యత ॥ (47)

తా॥ వసుదేవుడు, కంసుని, అతని పట్టుదలను గమనించి, ఇట్టి కాలముదాపురించిన వానిని ఎదురించుటకు 'ఇట్లు చేయవలెను' అని తెలిసికొనెను లేక ప్రాప్తం కాలం - ఎదురించుటకు కాలము సమీపించినది. (47)

**టీ॥** నిర్బంధమితి, ఆనక దుందుభిరితి పదం మహాభాగ ఇత్యత్రోక్తాభిప్రాయం. ప్రతివ్యోఢుం ప్రతికర్తుమిత్యర్థః. ఇదం వక్ష్యమాణం ప్రత్యర్పణం అన్వపద్యత. జ్ఞాతవాన్. (47)

**టీ॥** 'ఆనక దుందుభిః' అను పదము మహాభాగుడు (వసుదేవుడు) అని ఇచట చెప్పబడిన అభిప్రాయము - ప్రతివ్యోఢుం - ప్రతిచర్య చేయుటకు అని అర్థము. ఇదం - ఈ చెప్పబోవు ప్రతిచర్య - అన్వపద్యత గ్రహించెను. (47)

**శ్లో॥** మృత్యుర్బుద్ధి మతాపోహ్యో యావద్బుద్ధి బలోదయమ్ ।
యద్యసౌ న నివర్తేత నాపరాధోఽస్తి దేహినః ॥ (48)

**తా॥** బుద్ధి, బలము వృద్ధి చెందుచున్నంత వఱకు బుద్ధిమంతునిచేత మరణము నిరాకరింపబడదగినదే - ఒకవేళ అటుల నిరాకరించుట సాధ్యము కాని యెడల అతని దోషమేమియును లేదు. (48)

**టీ॥** నను ఖలోఽయమేతన్న మన్యేతేత్యాశంక్యాహ - మృత్యురితి. (48)

**టీ॥** ఇతడు దుర్మార్గుడు ఈ నా చెప్పిన విషయమంగీకరింపక పోవచ్చునని శంకించి 'మృత్యుః' అను యీ శ్లోకమున చెప్పుచున్నాడు. (48)

**శ్లో॥** ప్రత్యర్ప్య మృత్యవే పుత్రాన్మోచయే కృపణామిమామ్ ।
సుతా మే యది జాయేరన్ మృత్యుర్వా న మ్రియేత చేత్॥(49)

**తా॥** నాకు కొడుకులు కలగినట్లైన వారిని ఈ మృత్యువు కొఱకు (కంసుని కొఱకు) అర్పణచేసి దీనురాలగు ఈ దేవకిని విడిపించెదను. ఇదియును ఆ వఱకు ఒకవేళ ఈ మృత్యువు (కంసుడు) మరణింపకున్న యెడలనే - (49)

**టీ॥** తస్మాదుపేక్షాదోషపరిహారాయైవం కరిష్యామీత్యాహ– ప్రత్యర్ప్యేతి. మృత్యవే కంసాయ, నన్విదమపి నైవ న్యాయ్యమిత్యాశంక్యాహ – సుతా ఇతి. అస్యాం యది మే సుతా జాయేరన్. తదా యద్భావి. తద్భవతు జీవితం తు తావద్భవేదేవ. తదంతరా యద్యయమేవ మ్రియేత తదా న కించిదన్యాయ్యం. (49)

**టీ॥** అందువలన ఉపేక్షా దోష పరిహారము కొఱకు ఈ విధముగ చేయుదును అని చెప్పుచున్నాడు, 'ప్రత్యర్ప్య' అని. మృత్యవే– కంసుని కొఱకు, ఇది కూడ నిశ్చయముగ న్యాయమే. కాదేమో అని శంకించి చెప్పుచున్నాడు. ఈమె యందు ఒకవేళ కొడుకులు కలిగిన యెడల, అప్పుడు ఎట్లు జరుగగలదో అట్లు జరుగునుగాక, జీవితము అంతవఱకు ఉండును. ఆ లోపల ఇతడే చనిపోయినచో అప్పుడు కొంచమైనను అన్యాయ్యము ఉండదు. (49)

**శ్లో॥** విపర్యయో వా కిం న స్యాద్గతిర్ధాతుర్దురత్యయా ।
ఉపస్థితో నివర్తేత నివృత్తః పునరాపతేత్ ॥ (50)

**తా॥** విపరీతముగ కూడ జరుగవచ్చును. ఏది సంభవము కాదు? బ్రహ్మయొక్క గమనము (విధానము) అర్థముకానిది, దాటరానిది, మృత్యువు సమీపించియును మరలిపోవును. మరలిపోయినది తిరిగి వచ్చి పడును. (50)

**టీ॥** యది చ సుతా భవిష్యంతి న చాయం మ్రియేత. తదా మత్పుత్రాదేవాస్య మరణమిత్యాహ – విపర్యయ ఇతి. నను ప్రౌఢస్య కంసస్య తవ బాలకాత్కథం మృత్యుస్స్యాత్తత్రాహ – గతిరితి. ధాతుః, శ్లో. "అస్యాస్త్వామష్టమో గర్భో హంతా యాం న యసేఽబుధే" త్యుక్తవతః అతః ఇదానీమపత్యార్పణ ప్రతిజ్ఞైవ మంత్రః, తథా సతి, ఉపస్థితో మృత్యురయం తావన్నివర్తేత, ఇదానీం నివృత్తః పునః కాలాంతరే ఆపతేచ్చేత్తదా నాపరాధో మమేత్యర్థః. అథవా మత్పుత్రాదుపస్థితో

**టీ॥** ఒకవేళ నాకు పుత్రులు కలిగినను– ఇతడు ఆ వఱకు చావకున్నను – అప్పుడు నా కొడుకు వలననే ఇతని మరణమని చెప్పుచున్నాడు. 'విపర్యయ' అని – కాని పెద్దవాడైన కంసుని మరణము బాలకుని వలన జరుగుట ఎట్లు? ఆ విషయమునే యిట చెప్పుచున్నాడు. 'బ్రహ్మ యొక్క విధానము' అని–'ఓ అవివేకీ ఎవరిని నీవు తోడ్కొని పోవుచున్నావో ఆ దేవకి యొక్క ఎనిమిదవ సంతానము నిన్ను హతమార్చును.' అని ఆకాశవాణిచే చెప్పబడి యుండిన

మృత్యురస్యావధాద్యో నివర్తేత న పునరనేన సన్మంత్రేణ భవేదేవేతి. యద్వా, గతిర్ధాతుర్దురత్యయేత్యేతస్య ప్రపంచ ఉపస్థిత ఇతి. (50)

వాడగుట వలన నిక ఇప్పుడు సంతానము నర్పించు ప్రతిజ్ఞయే ఉపాయము. అట్లయినచో –సమీపించియు ఈ కంసుడు (మృత్యువు) ఇప్పటి వఱకు మఱలి పోవునేమో. ఇప్పుడు నివర్తించిన వాడు తిరిగి కాలాంతరమున వచ్చి పడిన యెడల అప్పుడు నా దోషమేమియులేదు' అని యర్థము. లేక – నా పుత్రుని రూపమున సమీపించిన మరణము ఇతనిని చంపకుండ నివర్తించినచో నతడు మఱల ఈ సన్మంత్రముతో (దోషమేమియులేదు) అని మిన్నకుండును. అని – లేక – 'బ్రహ్మదేవుని విధానము దాటరానిది' అనెడు నియమముతో ఈ ప్రపంచము ఉండును– (50)

**శ్లో॥** అగ్నేర్యథా దారు వియోగ యోగయో
రదృష్టతోఽ న్యన్న నిమిత్తమస్తి ।
ఏవం హి జంతో రపి దుర్విభావ్య
శ్శరీర సంయోగ వియోగహేతుః ॥ (51)

**తా॥** అగ్నికి, కట్టె తగుల్కొనుట తగుల్కొనకుండుట అనువానికి దైవ సంకల్పమే కారణముగాని వేఱొక కారణమేమియులేదు. అట్లే జీవునకు శరీరము ఏర్పడుట, శరీరయోగము లేకుండుట అనువానికిని అదృష్టమే కారణము. దైవనిర్ణయము(లు) తర్కింపరానిది(వి) (51)

**టీ॥** ప్రాణినామదృష్టం దుర్వితర్క్యమితి సదృష్టాంతమాహ – అగ్నేరితి. వనే వృక్షాన్ ప్రదహన్ వహ్నిః సన్నిహితానపి వృక్షాన్ పరిత్యజ్య కదాచిత్ దూరస్థానే దహతి గ్రామే గృహాన్ వా, న హితస్య ప్రాణ్యదృష్టవ్యతిరేకేణ కించిన్నియామకమస్తి, యథా ఏవం జంతోర్జన్మ మరణయోరపి హేతుర్దుర్వి భావ్యః అచింత్యః, (51)

**టీ॥** ప్రాణులకు అదృష్టమనునది తర్కింపరానిదని దృష్టాంతముతో చెప్పుచున్నాడు 'అగ్నేః' అని. – అడవిలో చెట్లను కాల్చివేయుచు అగ్ని, ఒక్కొక్కపుడు దగ్గరగా ఉన్న చెట్లను కూడ విడిచిపెట్టి దూరముగ నున్నవానినే కాల్చివేయును. గ్రామములోని ఇండ్లనైనను అటులే – ప్రాణియొక్క అదృష్టమునకు వ్యతిరేకముగ నిర్ణయించునదేదియు లేదు,

**శ్లో॥** ఏవం విమృశ్య తం పాపం యావదాత్మని దర్శనమ్ ।
సాంత్వయామాస వై శౌరిర్బహుమాన పురస్సరమ్ ॥ (52)

**టీ॥** ఏవమితి, యావదాత్మ నిదర్శనం స్వప్రజ్ఞావధి, విమృశ్య విచార్య. (52)

**శ్లో॥** ప్రహృష్ట వదనాంభోజో నృశంసం నిరపత్రపమ్ ।
మనసా దూయమానేన ప్రహసన్నిదమబ్రవీత్ ॥ (53)

**టీ॥** ప్రహృష్టేతి, తస్య విశ్వాసాయ వికసితముఖాంభోజస్సన్ ప్రహసన్ అబ్రవీత్. (53)

**శ్లో॥** నహ్యస్యాస్తే భయం సౌమ్య యద్వైత్వాహాశరీరవాక్ ।
పుత్రాన్ సమర్పయిష్యేఽహం యతస్తే భయ ముత్థితమ్॥ (54)

అట్లే ప్రాణి యొక్క చావు పుట్టుకలకు కారణము దుర్విభావ్యము - అచింత్యము, (ఆలోచింపరానిది) (51)

**తా॥** ఈ విధముగ తన బుద్ధికి తోచినంత వఱకు తర్కించుకొని, ఆ పాపాత్ముడగు కంసుని గౌరవపురస్సరముగ ప్రశంసించెను. (52)

**టీ॥** యావదాత్మ నిదర్శనం - తన ప్రజ్ఞకు తోచినంత వఱకు, విమృశ్య - విచారించి- (52)

**తా॥** వసుదేవుడు మిక్కిలి సంతోషించు ముఖకమలముగలవాడై, క్రూరుడు, సిగ్గులేనివాడును ఐన కంసునితో - తపించుచున్న మనస్సుతో నైనను, నవ్వుచు ఇట్లనెను.(53)

**టీ॥** అతని నమ్మకము కొఱకు వికసించిన ముఖకమలము కలవాడగుచు నవ్వుచు పలికెను.(53)

**తా॥** ఓ సౌమ్యుడా! ఈ దేవకి వలన నీకు భయమేమియులేదు, నీకు భయము కలిగించిన అశరీరవాణి నీకు చెప్పిన దానిని బట్టి, నేను నా పుత్రులను సమర్పించు కొందును. (54)

**టీ॥** నేతి. యత్ యథా అశరీరిణీ వాగాహ - తథా వై నిశ్చితం. అస్యాస్సకాశాత్ తే భయం నాస్తి ఖలు. యతః యేభ్యః పుత్రేభ్యః తే భయం ఉత్థితం అష్టమో హంతేత్యుక్తే అన్యోన్యాపేక్షయా సర్వేప్యష్టమా భవేయురిత్యుద్భూతం. తాన్ అస్యాః పుత్రాన్ సమర్పయిష్యే. (54)

**టీ॥** దేనిని అశరీరవాణి చెప్పినదో - అదియే నిశ్చయమైనది కదా! ఈమెతో కూడా ఉండుట వలన నీకు భయము లేదు కదా! ఏ పుత్రుల వలన నీకు భయము కలిగినదో వారిలో ఎనిమిదవవాడు నిన్ను చంపువాడు అను మాటను బట్టి - అన్యోన్యాపేక్షచేత (ఎవరి నుండి ప్రారంభించి ఎవరి వఱకు లెక్కించినను) అందఱును 'ఎనిమిదవవాడు' కాగలుగుదురు అని సారాంశమగును. అందుచే ఈమె గారి పుత్రుల నందఱిని సమర్పించుకొనగలను. (54)

శ్రీశుక ఉవాచ.

**శ్లో॥** స్వసుర్వధాన్నివవృతే కంసస్తద్వాక్య సారవిత్ ।
వసుదేవోఽపి తం ప్రీతః ప్రశస్య ప్రావిశద్గృహమ్ ॥ (55)

శ్రీశుక భగవానుడిట్లనెను

**తా॥** కంసుడు వసుదేవుని మాటలలోని సారమును గ్రహించనవాడై, చెల్లెలిని చంపుట నుండి విరమించెను. వసుదేవుడు కూడ ప్రసన్నుడై అతనిని ప్రశంసించి తన యింటికి బోయెను. (55)

**టీ॥** స్వసురితి. నివవృతే నివృత్తః తద్వాక్యే సారః. ఉపపత్తిస్తద్వత్. (55)

**టీ॥** నివవృతే - విరమించెను, తద్వాక్యే సారః - సకారణత్వము వంటిది. (55)

**శ్లో॥** అథ కాల ఉపావృత్తే దేవకీ సర్వదేవతా ।
పుత్రాన్ ప్రసుషువే చాష్టౌ కన్యాం చైవానువత్సరమ్ ॥ (56)

**తా॥** అటుపిమ్మట సకల దేవతామయియగు దేవకి, ప్రతి సంవత్సరమునందును కాలము రాగానే ఎనమండుగురు పుత్రులను, ఒక పుత్రికను ప్రసవించెను.(56)

**టీ॥** అథేతి. కాల ఉపావృత్తే ప్రసూతికాలే ప్రాప్తే, సర్వః సర్వాత్మా భగవానేవ దేవతా యస్యాస్సా భగవదాశ్రయత్వాత్ సర్వదేతామయీతి వా. (56, 57)

**టీ॥** కాల ఉపావృత్తే - ప్రసవకాలము ప్రాప్తింపగ - ప్రతి వ్యక్తి యును సర్వాత్ముడగు భగవానుడే - దేవతయే ఎవరిలో ఉండెనో ఆమె-భగవానుని ఆశ్రయించి యుండుట వలన సర్వదేవతామయి- అని. లేక భగవానుడే ఆమెను ఆశ్రయించి యుండుట వలన. (56,57)

**శ్లో॥** కీర్తిమంతం ప్రథమజం కంసాయానక దుందుభిః ।
అర్పయామాస కృచ్ఛ్రేణ సోఽనృతాదతి విహ్వలః ॥ (57)

**తా॥** ఆ వసుదేవుడు, అసత్యము నుండి మిక్కిలి భయపడినవాడై, మొదట పుట్టిన కీర్తిమంతుడు అను తన పుత్రుని, మిక్కిలి బాధతో కంసున కిచ్చెను. (ఆనక దుందుభిః అననది వసుదేవునికి సంకేత విశేషణము) (57)

**శ్లో॥** కిం దుస్సహన్ను సాధూనాం విదుషాం కిమపేక్షితమ్ ।
కిమకార్యం కదర్యాణాం దుస్త్యజం కిం ధృతాత్మనామ్ ॥ (58)

**తా॥** సాధు పురుషులకు సహింపనలవి కానిదియేమి? జ్ఞానులకు కోరదగినది యేమి? నీచులకు చేయకూడనిది యేమి? ధీరులకు ఆత్మనిష్ఠులకు విడవరానిది ఏమి? - అనగా సాధుపురుషులు ఎట్టి సంఘటననైనను సహింపగలరనియు, జ్ఞానులకు కోరదగినది ఏదియు లేదనియు, నీచులు ఎట్టి భయంకరమగు అకృత్యమునైనను చేయుదుర నియు, జితేంద్రియులు ఆత్మను హృదయమున ధరించిన వారే దేనినైనను త్యాగము చేయుదురనియు భావము.(58)

**టీ॥** నను మృత్యవే పుత్రం కథమర్పితవానిత్యపేక్షాయామాహ - కిందుస్సహమితి, సాధూనాం సత్య సంధానాం నను పుత్రలాలన సుఖాపేక్షా కథం త్యక్తేత్యత ఆహ - విదుషామితి. భగవానేవ తత్త్వం నాన్యదితి జానతామిత్యర్థః. నను స్వయం నీతే సతి. కంసో బాలం న హన్యాదితి మత్వా, నీతవానితి కిం న స్యాత్ ? నేత్యాహ - కిమకార్య మితి, నను దేవకీపుత్రం కథంతత్యాజేత్యత ఆహ - కిం దుస్త్యజమితి. చిత్తే ధృత ఆత్మా హరిర్యైస్తేషాం. (58- 61)

**టీ॥** మృత్యురూపుడగు కంసునకు తన కొడుకును ఎట్లు సమర్పించెను అను ఆకాంక్షతో చెప్పుచున్నాడు. సాధూనాం - సత్యసంధులకు - కొడుకును లాలించుట యందలి సుఖాపేక్ష ఎట్లు వదలిపెట్టెను? చెప్పుచున్నాడు. ఆ భగవానునికే తప్ప తత్త్వమెవరికి తెలియదని యర్థము. తాను స్వయముగానే తీసికొనిరాగా కంసుడు బాలుని చంపకపోవచ్చును అని తలచి కొని తెచ్చెనేమో? ఏది జరుగ కుండును? ఏదైనను జరుగవచ్చును, కాదని చెప్పుచున్నాడు. నిజమునకు దేవకీపుత్రుని ఎట్లువదలెనో చెప్పుచున్నాడు. 'కిం దుస్త్యజం' అని - చిత్తమునందు ధరింపబడిన ఆత్మ - హరి, యెవరికో వారికి - ధృతాత్ములకు-(58-61)

**శ్లో॥** దృష్ట్వా సమత్వం తచ్ఛౌరే స్సత్యే చైవ వ్యవస్థితమ్ ।
కంసస్తుష్టమనా రాజన్ ప్రహసన్నిదమబ్రవీత్ ॥ (59)

**తా॥** రాజా! వసుదేవునియొక్క జీవన్మృత్యు సమభావన, సత్యసంధత చూచి కంసుడు తృప్తి చెందిన మనస్సు గలవాడై నవ్వుచు ఇట్లనెను. (59)

**శ్లో॥** ప్రతియాతు కుమారోఽయం నహ్యస్మాదస్తిమే భయమ్ ।
అష్టమాద్యువయోర్గర్భా న్మృత్యుర్మేఽభి హితః కిల ॥ (60)

**తా॥** వసుదేవా! ఈ పసి వానిని తీసికొనిపొండు. ఏలయన ఇతని వలన నాకు భయములేదు. మీ ఎనిమిదవ గర్భమువలన గదా నాకు మృత్యువు కలదని ఆకాశవాణిచే చెప్పబడినది. (60)

**శ్లో॥** తథేతి సుతమాదాయ యయా వానక దుందుభిః ।
నాభ్యనందత తద్వాక్య మసతోఽ విజితాత్మనః ॥ (61)

**తా॥** వసుదేవుడు, సరే! అని తన కొడుకును తీసికొని వెడలిపోయెను. కాని దుష్టుడును, మనస్సు స్వాధీనమున లేనివాడును అయిన కంసుని వాక్యమును విశ్వసించి, సంతోషింపకుండెను. (61)

**శ్లో॥** నందాద్యా యేవ్రజే గోపా యాశ్చామీషాం చ యోషితః ।
వృష్ణయో వసుదేవాద్యా దేవక్యాద్యా యదుస్త్రియః ॥ (62)

**తా॥** గోకులమునందున్న నందుడు మొదలగు గోపాలకులు, వసుదేవుడు మొదలగు వృష్ణి వంశీయులగు యాదవులు, వ్రజస్త్రీలు దేవకి మొదలగు యదు స్త్రీలును- (62)

**టీ॥** కంసస్య శాంతిర్దేవకార్యమనుగుణా న భవతీతి నారదస్య ప్రత్యవస్థానం తదాహ - నందాద్యా ఇత్యాది త్రయేణ. (62)

**టీ॥** కంసుని శాంతి దేవకార్యమునకు అనుగుణమైనది కాకుండునని నారదుని రాక - అదియే చెప్పుచున్నాడు. 'నందాద్యా' మొదలగు మూడు శ్లోకములచేత - (62)

**శ్లో॥** సర్వే వై దేవతాప్రాయా ఉభయోరపి భారత! ।
జ్ఞాతయో బంధు సుహృదో యే చ కంసమనువ్రతాః ॥ (63)

**తా॥** ఓ పరీక్షిన్మహారాజా! వసుదేవ నంద కులముల వారును, వారి జ్ఞాతులు, బంధువులు, స్నేహితులు, దేవతాప్రాయులు. ఇక కంసున నుసరించి యుండువారందఱును. (అసురాః అని తదుపరి శ్లోకముతో అన్వయము) (63)

**టీ॥** సర్వఇతి. ఉభయోః వసుదేవ నందకులయోః. (63 - 64)

**టీ॥** ఉభయోః - వసుదేవ నంద కులముల యొక్క - (63-64)

**శ్లో॥** అసురాస్సర్వ ఏవైతే లోకోపద్రవ కారిణః ।
ఏతత్కంసాయ భగవాన్ శశంసాభ్యేత్య నారదః ॥ (64)

**శ్లో॥** భూమేర్భారాయమాణానాం దైత్యానాం చ వధోద్యమమ్ ।
ఋషేర్వినిర్గమే కంసో యదూన్మత్వా సురానితి ॥ (65)

**టీ॥** భూమేరితి. దేవకృతమితి శేషః, (65)

**శ్లో॥** దేవక్యా గర్భ సంభూతం విష్ణ్వంశం స్వ
వధం ప్రతి దేవకీం వసుదేవం చ ।
నిగృహ్య నిగళైర్గృహే జాతం జాత
మహన్ పుత్రం తయోరజన శంకయా. (66)

**టీ॥** దేవక్యాఇతి. నిగళైశ్శృంఖలైః అజనోవిష్ణుః తచ్ఛంకయా. (66 - 69)

**తా॥** కంసునను సరించి యుండు వారందఱు లోకమునకు ప్రమాదములను కలిగించు రాక్షసులు. భగవానుడగు నారదుడు కంసుని వద్దకు వచ్చి ఈ విషయమును వివరించెను.. (64)

**తా॥** భూమికి భారమును కలిగించు వారిగనున్న రాక్షసులను సంహరించు ప్రయత్నము జరుగుచున్న దనికూడ నారదుడు కంసునకు చెప్పెను. నారదుడు వెడలిపోయిన తరువాత కంసుడు, యదు వంశీయులందరును దేవతలు అని భావించి– (65)

**టీ॥** భూమి దేవతలచే చేయబడినదని అధ్యాహారము. (65)

**తా॥** దేవకి యొక్క గర్భమునందు విష్ణుని అంశతో జన్మించువాడు తనను చంపువాడగునని, దేవకిని, వసుదేవుని కూడ సంకెలలతో బంధించి కారాగారమున నుంచి, వారికి పుట్టువాడు ఎవడైనను విష్ణువు కావచ్చునను అనుమానముతో పుట్టినవానిని పుట్టినట్లుగ చంపు చుండెను. (66)

**టీ॥** నిగలైః – శృంఖలములచే – అజనః – విష్ణువు – తచ్ఛంకయా – ఆ అనుమానముతో. (66–69)

శ్లో॥ మాతరం పితరం భ్రాతౄన్ పుత్రాంశ్చ సుహృదస్సఖీన్ ।
ఘ్నంతి హ్యసుతృపో లుబ్ధా రాజానః ప్రాయశో భువి ॥ (67)

తా॥ సాధారణముగ ఈ భూమిపైన లుబ్ధులైన రాజులు అసంతుష్టులై స్వార్థముతో తమ తల్లిని, తండ్రిని, అన్నలను, తమ్ములను, పుత్రులను, స్నేహితులను సఖీజనమును కూడ చంపుదురు. (67)

శ్లో॥ ఆత్మాన మిహ సంజాతం జానన్ ప్రాగ్విష్ణునా హతమ్ ।
మహాసురం కాలనేమిం యదుభిస్స వ్యరుధ్యత ॥ (68)

తా॥ కంసుడు, తాను పూర్వము కాలనేమియను రాక్షసునిగ జన్మించితిననియు, విష్ణుని చేత సంహరింపబడితిననియు తెలిసినవాడగుచు, యదు వంశీయులతో వైరము బూనియుండెను. (68)

శ్లో॥ ఉగ్రసేనం చ పితరం యదు భోజాంధకాధిపమ్ ।
స్వయం నిగృహ్య బుభుజే శూరసేనాన్ మహాబలః ॥ (69)

తా॥ మిక్కిలి బలవంతుడగు కంసుడు, యదు, భోజక, అంధకులకు రాజైన తన తండ్రియగు ఉగ్రసేనుని బంధించి, స్వయముగ శూరసేన దేశములను పరిపాలింపజొచ్చెను. (69)

**శ్రీ మద్భాగవతే, మహాపురాణే దశమస్కంధే,**
**ప్రథమోఽధ్యాయః**

**అని శ్రీమద్భాగవతమున దశమస్కంధమందు**
**మొదటి అధ్యాయము సమాప్తము.**

## ద్వితీయోఽధ్యాయః

**శ్రీశుక ఉవాచ**

**శ్లో॥** ప్రలంబ బక చాణూర తృణావర్త మహాశనైః ।
ముష్టి కారిష్ట ద్వివిద పూతనా కేశి ధేనుకైః ॥ (1)

**టీ॥** శ్లో. ద్వితీయే కంసాఘతాయ దేవక్యా గర్భగో హరిః, బ్రహ్మాదిభి స్స్తుతస్సా సాంత్వితేతి నిరూప్యతే. శ్లో. " యదుభిస్సవ్యరుధ్యంతేత్యుక్తం. తమేవ విరోధం ప్రపంచయతి – త్వరయా దేవకీ గర్భస్యాన్యత్ర సంచారేణ భగవతః ప్రవేశం వక్తుం సార్ధత్రయేనాహ – ప్రలంబేతి. మహాశనః అఘాసురః. (1–3)

**శ్లో॥** అన్యైశ్చాసుర భూపాలైర్బాణ భౌమాదిభిర్యుతః ।
యదూనాం కదనం చక్రే బలీ మాగధ సంశ్రయః ॥ (2)

## రెండవ అధ్యాయయు.

**శ్రీశుక భగవానుడిట్లనెను**

**తా॥** ప్రలంబుడు, బకుడు, చాణూరుడు, తృణావర్తుడు, అఘాసురుడు, ముష్టికుడు, అరిష్టుడు, ద్వివిదుడు, పూతన, కేశి, ధేనుకుడు మొదలగు వారి చేతను. (1)

**టీ॥** ద్వితీయాధ్యాయము నందు, కంసుని సంహరించుటకై శ్రీకృష్ణుడు దేవకీ గర్భమున ప్రవేశించి బ్రహ్మాది దేవతలతో స్తుతింపబడుటయు, దేవకి ఓదార్పబడుటయు నిరూపింపబడినది. యదు వంశీయులతో కంసుడు వైరముపూని యుండెనని ఈ వఱకే చెప్పబడినది. అదే వైరమును గూర్చి ఇందు చెప్పుచున్నాడు. ఆలస్యము లేకుండ దేవకి సంతానము ఇతరత్రకూడ సంచరించుట ద్వారా భగవానుని ప్రవేశమును గూర్చి మూడున్నర శ్లోకములతోను చెప్పు చున్నాడు. ప్రలంబ, అని మహాశనః – అఘాసురుడు. (1–3)

**తా॥** ఇతర రాక్షసరాజుల చేతను, బాణుడు, భౌముడు మొదలగు వారితో కూడిన వాడై, బలశాలయైన కంసుడు, జరాసంధుని అండకలిగి యదువంశీయులతో కయ్యము సాగించెను. (2)

**శ్లో॥** తే పీడితా నివివిశుః కురు పాంచాల కేకయాన్ ।
సాల్వాన్ విదర్భాన్నిషధాన్ విదేహాన్ కోసలానపి ॥ (3)

**తా॥** వారు పీడింపబడిన వారగుచు కురు, పాంచాల, కేకయ, సాల్వ, విదర్భ, నిషధ, విదేహ, కోసల దేశములను ప్రవేశించిరి. (3)

**శ్లో॥** ఏకే తమనురుంధానాః జ్ఞాతయః పర్యుపాసతే ।
హతేషు షట్సు బాలేషు దేవక్యా ఔగ్రసేనినా ॥ (4)

**తా॥** దేవకి యొక్క ఆరుగురు కొడుకులు కంసునిచే చంపబడగా, కొందఱు బంధుజనులు అతనిని అనుకూలించి ప్రవర్తించుచు సేవించుచుండిరి. (4)

**టీ॥** ఏక ఇతి . అనురుంధానాః అనువర్తమానాః (4)

**టీ॥** అనురుంధానాః– అనుకూలమగ వర్తించుచు. (4)

**శ్లో॥** సప్తమో వైష్ణవం ధామ యమనంతం ప్రచక్షతే ।
గర్భో బభూవ దేవక్యా హర్షశోక వివర్ధనః ॥ (5)

**తా॥** ఎవనిని అనంతుడని చెప్పుదురో విష్ణ్వంశభూతుడగు శేషుడు, దేవకికి ఒకవంక హర్షము, మరియొక వంక శోకమును పెంచుచు ఏడవ గర్భముగ నయ్యెను. (5)

**టీ॥** సప్తమ ఇతి. ధామ కళా, తదేవ సప్తమో గర్భో బభూవ, కిం తద్ధామేత్యత ఆహ – యమనంతమితి. హర్ష శోక వివర్ధనః ఆనంద రూపస్యా వతీర్ణ త్వాద్ధర్షః పూర్వగర్భ సాధారణ దృష్ట్యా శోక ఇతి.(5,6)

**టీ॥** ధామ – కళా – అదియే ఏడవగర్భమయ్యెను. ఆ కళ ఏమియో చెప్పుచున్నాడు. – 'యం అనంతం' అని. హర్షశోకవివర్ధనః – ఆనంద రూపముగ అవతరించుటవలన సంతోషము. వెనుకటి గర్భమువలె చంపబడునేమో అను దృష్టితో దుఃఖము – అని (5,6)

**శ్లో॥** భగవానపి విశ్వాత్మా విదిత్వా కంసజం భయమ్ ।
యదూనాం నిజ నాథానాం యోగమాయాం సమాదిశత్ ॥(6)

**తా॥** విశ్వాత్ముడైన భగవానుడు, తననే పతిగా భావించు యదు వంశీయులకు కంసుని వలన కలిగిన భయమును తెలిసికొని, యోగమాయను ఇట్లాదేశించెను. (6)

శ్లో॥ గచ్ఛదేవి వ్రజం భద్రే గోప గోభిరలంకృతమ్ ।
రోహిణీ వసుదేవస్య భార్యాస్తే నందగోకులే ॥ (7)

శ్లో॥ అన్యాశ్చ కంస సంవిగ్నా వివరేషు వసంతి హి. (8)

టీ॥ గచ్ఛేతి. నను సా గోకులే కిమిత్యాస్తే? అత ఆహ – అన్యా ఇతి. న కేవలం సైవ. అన్యా అపీతి. వివరేషు అలక్ష్యస్థానేషు. (7,8)

శ్లో॥ దేవక్యా జఠరే గర్భం శేషాఖ్యం ధామ మామకమ్ ।
తత్సన్నికృష్య రోహిణ్యా ఉదరే సన్నివేశయ ॥ (9)

టీ॥ దేవక్యాఇతి. జఠరే సంతం. నను గర్భ ఆకృష్యమాణః కథం జీవేదత ఆహ – మామకం ధామేతి. తత్ తతః. (9)

తా॥ దేవీ! కల్యాణీ! నీవు, గోపాలకులతోను, గోవులతోను అలంకరింపబడియున్న గోకులమునకు బొమ్ము. ఆ నందగోకులము నందు వసుదేవుని భార్యయగు రోహిణి యుండును. (7)

తా॥ ఇతరస్త్రీలు కూడ కంసునకు భయపడి గుప్త స్థానములలో నివసించుచున్నారు. (8)

టీ॥ ఆమె (రోహిణి) గోకులమున ఏమి కలదని నివసించుచున్నది? ఇట చెప్పుచున్నాడు. ఆమె ఒక్కర్తె మాత్రమే కాదు. ఇతరులు కూడ నివసించుచున్నారని– వివరేషు–చూచుటకు వీలుపడనిచోట్లలో. (7,8)

తా॥ దేవకి యొక్క ఉదరమునగల నా అంశరూపమగు, శేషుడు అను పేరుగల గర్భమును తీసికొని, రోహిణీ గర్భమున ప్రవేశపెట్టుము. (9)

టీ॥ జఠరే సంతం – ఉదరమున నున్నవానిని–గర్భమునుండి లాగి వేయబడినవాడు ఎట్లు జీవించును? చెప్పుచున్నాడు. అథ– తరువాతనే అని యర్థము. మామకం ధామేతి– నా అంశ స్వరూపమని–దానిని ప్రసవానంతరమున. (9)

**శ్లో॥** అథాహమంశ భాగేన దేవక్యాః పుత్రతాం శుభే ।
ప్రాప్స్యామి త్వం యశోదాయాం నంద పత్న్యాం భవిష్యసి॥(10)

**టీ॥** కిమర్థమేవం కార్యమిత్యత ఆహ – అథేతి. అథ అనంతరమే వేత్యర్థః, అంశభాగే నేతి, అంశైః శక్తిభిః భజతే అధితిష్ఠతి. సర్వాన్ బ్రహ్మాది స్తంబపర్యంతాన్ ఇత్యంశభాగః తేన పరిపూర్ణరూపేణేత్యర్థః యద్వా – జ్ఞానైశ్వర్యబలాదిభిః. భాజయతి యోజయతి, స్వీయానితి తేన యద్వా, అంశేన పురుషరూపేణ మాయాయా భాగో భజనం ఈక్షణం యస్య తేన. యద్వా అంశేన మాయయా గుణావతారాది రూపాః భాగాః భేదాః యస్య తేన. యద్వా, అంశా ఏవ మత్స్య కూర్మాదిరూపాః భజనీయాః, న తు సాక్షాత్స్వరూపం యస్య తేన యద్వా – అంశైః జ్ఞాన బలాదిభిః భజనం అనువర్తనం భక్తేషు యస్య తేన, యద్వా – అంశైః జ్ఞాన బలాదిభిః భజనం అనువర్తనం భక్తేషు యస్య తేన. సర్వదా పరిపూర్ణ రూపేణేతి వివక్షితం. శ్లో. "కృష్ణస్తు భగవాన్ స్వయమి" త్యుక్తత్వాదితి. తాం ప్రోత్సాహయతి – త్వం యశోదాయా మిత్యాదినా సార్ధ చతుష్టయేన. (10)

**తా॥** ఓ కల్యాణీ! నేను నా జ్ఞానైశ్వర్య బలాద్యంశలతో దేవకికి పుత్రత్వము నొందెదను. ఇక నీవు నందుని భార్యయగు యశోద గర్భమున జన్మింపుము. (10)

**టీ॥** ఇట్లు చేయుట యెందులకో ఇట చెప్పుచున్నాడు 'అథ' అని. అథ– తరువాతనే అని యర్థము. 'అంశభాగేన' అని – అంశైః – శక్తులచేత – భజతే – అధివసించి యుండును. సర్వాన్ – బ్రహ్మమొదలుకొని స్తంబపర్యంతములను – అనియే అంశభాగము – దానితో పరిపూర్ణమగు రూపముతోనని యర్థము– లేక జ్ఞానము ఐశ్వర్యము, బలము మున్నగు వాని చేత – కలిసియుండును. నిర్ణయించును – తన జగద్వస్తువులను – అందువలన – లేక – అంశేన– పురుషరూపముతో మాయాయాః – మాయ యొక్క – భాగః – భజనము – చూపు ఎవనికో– అందువలన – లేక – అంశా ఏవ – మత్స్య కూర్మాది రూపములు – భజింపదగినవి – సాక్షాత్స్వ రూపము కాదు. ఇట్టి స్థితి ఎవనికో – అందుచేత – లేక – అంశైః జ్ఞానము, బలము మొదలగు వానిచేత – భజనం – అనువర్తించుట – భక్తేషు – భక్తుల యందు. ఎవనికో – ఆ కారణమున అన్నివిధముల పరిపూర్ణరూపము చేతనని వివక్షింపబడినది, "కృష్ణుడే స్వయముగ భగవానుడు" అని చెప్పబడియుండుట వలన – అని మాయను

ప్రోత్సహించుచున్నాడు- 'నీవు యశోదయందు' అని మొదలుకొని నాలుగున్నర శ్లోకముల చేత (10)

**శ్లో॥** అర్చిష్యంతి మనుష్యాస్త్వాం సర్వకామ వరేశ్వరీమ్
నానోపహార బలిభి స్సర్వకామ వరప్రదామ్ ॥ (11)

**తా॥** అన్ని కోరికలకు, వరములకును ఈశ్వరివి, అన్ని కోరికలను, వరములను ఇచ్చు దానవగు నిన్ను వివిధములగు ఉపహారములతోను బలులతోడను మనుష్యులు పూజింతురు. (11)

**టీ॥** అర్చిష్యంతీతి. సర్వాన్ పుత్రాదీన్ కామయంతే యే. తేషాం వరాం ఈశ్వరీం నియంత్రీం అర్చకానాం సర్వకామవరాన్ ప్రదదాతి యా తాం. (11-13)

**టీ॥** సర్వాన్ - పుత్రుడు మొదలగు వారిని కోరువారికి -వరాం - ఈశ్వరీం-శ్రేష్ఠమైన-నియామకురాలు-పూజించువారికి- అన్ని కోరికలకు సంబంధించిన వరములిచ్చునట్టిది యెవరో ఆమెను. (11-13)

**శ్లో॥** నామధేయాని కుర్వంతి స్థానాని చ నరా భువి ।
దుర్గేతి భద్రకాళీతి విజయా వైష్ణవీతి చ ॥ (12)

**తా॥** ఈ భూమియందు మనుష్యులు నిన్ను దుర్గ, భద్రకాళి, విజయ, నారాయణి అనుచు పిలుచుచుందురు. ఆయా స్థానములు కూడ కల్పింతురు. (12)

**శ్లో॥** కుముదా చండికా కృష్ణా మాధవీ కన్యకేతి చ ।
మాయా నారాయణీశానా శారదేత్యంబికేతి చ ॥ (13)

**తా॥** కుముద, చండిక, కృష్ణ, మాధవి, కన్యక, మాయ, వైష్ణవి, ఈశాన, శారద, అంబిక అనియు నీకు నామధేయములుంచెదరు. (13)

**శ్లో॥** గర్భం సంకర్షణాత్తం వా ఆహు స్సంకర్షణం భువి ।
రామేతి లోక రమణాద్బలభద్రం బలోచ్ఛ్రయాత్ ॥ (14)

**తా॥** గర్భము నాకర్షించుట వలన అతనిని (శేషుని) సంకర్షణుడనియు, లోకమును రంజింపజేయు వాడగుటచే రాముడనియు, గొప్పబలము కలగియుండుటచే బలభద్రుడనియు జనులతనిని పిలిచెదరు. (14)

**టీ॥** త్వద్వికర్షణేన తస్య సంకర్షణ రామ బలభద్రేతి వ్యపదేశా భవిష్యంతీత్యాహ – గర్భేతి. రామేతి చ సంబోధనం, కరిష్యంతి, త్వయా సంకృష్టేన తేన లోకవ్య రమణాత్ రత్యుత్పాదనాత్. (14)

**టీ॥** అతనిని వికర్షణ చేయుటచేత సంకర్షణుడని, రాముడని, బలభద్రుడని పేర్లు కలుగునని చెప్పుచున్నాడు. రామ అనునది సంబోధన శబ్దము. రామ అని పిలిచెదరు – నీ చేత ఆకర్షింపబడుటచే (సంకర్షణుడని) లోకస్య రమణాత్ – లోకమునకు కోరిక బుట్టించుట వలన (రాముడని) (14)

**శ్లో॥** సందిష్టైవం భగవతా తథేత్యోమితి తద్వచః ।
పరిగృహ్య పరిక్రమ్య గాం గతా తత్తథా కరోత్ ॥ (15)

**తా॥** భగవానుని చే ఈ విధముగ ఆజ్ఞాపింపబడగానే యోగమాయ, 'చిత్తము' అని ఓంకారముతో తన అంగీకారమును తెలిపి, అతని మాటలను శిరసావహించి, అతనికి నమస్కరించి, భూ లోకమునకు చేరి చెప్పినట్లు చేసెను. (15)

**టీ॥** సందిష్టేతి, తథేతి పునరపి ఓమిత్యాదరేణ ప్రతిగృహ్య గాం పృథ్వీం. (15)

**టీ॥** 'అట్లే' అని మఱలకూడ 'ఓం' అని ఆదరముతో అతని ఆజ్ఞగొని గాం – భూమిని గూర్చి. (15)

**శ్లో॥** గర్భే ప్రణీతే దేవక్యా రోహిణ్యాం యోగనిద్రయా ।
అహో విస్రంసితో గర్భ ఇతి పౌరా విచుక్రుశుః ॥ (16)

**తా॥** యోగమాయచే దేవకి గర్భము తీయబడి రోహిణి యందు ప్రవేశపెట్టబడిన తరువాత పురజనులు అయ్యో దేవకి గర్భము 'నష్టమైనదని' మిక్కిలి బాధపడిరి. (16)

**టీ॥** గర్భ ఇతి. విస్రంసితః విస్రస్త ఇత్యేవం చుక్రుశుః న తు తద్విదురిత్యర్థః. (16)

**టీ॥** విస్రంసితః – స్రావమైనది. నిజము వారికి తెలియలేదని యర్థము. (16)

**శ్లో॥** ఆవివేశాంశ భాగేన మన ఆనక దుందుభేః ।
అంశేన భగవాన్ విష్ణుర్భువో భారాపనుత్తయే ॥ (17)

**తా॥** విష్ణుభగవానుడు తన కళాభాగముచేత వసుదేవుని మనుస్సును, భూమి యొక్క భారము తొలగించుకొఱకు తన కళలన్నిటి చేత భూమిని ఆవేశించెను. (17)

**టీ॥** ఆవివేశేతి. మనః ఆవివేశ మనస్యావిర్భభూవ, జీవానామివ న ధాతు సంబంధ ఇత్యర్థః. (17)

**టీ॥** మనః ఆవివేశ – మనస్సున అవతరించెను. జీవులకువలె 'ధాతు' సంబంధము కాదని యర్థము. (17)

**శ్లో॥** స బిభ్రత్పౌరుషం ధామ భ్రాజమానో యథా రవిః ।
దురాసదో ఽతిదుర్ధర్షో భూతానాం సంబభూవ హ ॥ (18)

**తా॥** వసుదేవుడు విష్ణు భగవానుని తేజస్సును ధరించి యుండుట చేత లోకులకు అజేయుడై, మిక్కిలి తిరస్కరింపరానివాడై సూర్యుని వలె ప్రకాశించుచుండు వాడయ్యెను. (18)

**టీ॥** – స ఇతి. ధామ శ్రీవిష్ణోః. (18)

**టీ॥** ధామ – శ్రీవిష్ణుదేవుని కళ. (18)

**శ్లో॥** తతో జగన్మంగళమచ్యుతాంశం
సమాహితం శూర సుతేన దేవీ ।
దధార సర్వాత్మకమాత్మ భూతం
కాష్ఠా యథా నందకరం మనస్తః ॥ (19)

**టీ॥** తత ఇతి. జగన్మంగళం అచ్యుతాంశం అచ్యుతాః చ్యుతిరహితాః అంశాః ఐశ్వర్యాదయో యస్య తం. యద్వా. అచ్యుతస్య అంశ ఇవాంశః భక్తానుగ్రహార్థం పరిచ్ఛన్నవపురిత్యర్థః, సమాహితం సమ్యగ్భూత మేవ ఆహితం వేద దీక్షయా అర్పితం. దేవీ ద్యోతమానా శుద్ధసత్త్వేత్యర్థః. సర్వాత్మకం సర్వస్యాత్మానం. అత ఏవాత్మ భూతం స్వస్మిన్నాదావేవ సంతం. మనస్తః మనసైవ. దధార ధారణయా ధృతవతీ. అత్రాను రూపం దృష్టాంతమాహ – యథా కాష్ఠా ప్రాచీ దిక్ ఆనందకరం చంద్రమితి. (19)

**తా॥** పిమ్మట జగత్తులకు శుభములను గూర్చునట్టి భగవానుని అంశ వసుదేవునిచే వేదదీక్షతో నర్పింపబడగా ఆ శుద్ధ సత్త్వయగు దేవకి ఆత్మభూతుడైన ఆ సర్వాత్మకుని – తూర్పుదిక్కు చంద్రుని వలె – మనస్సుతో ధారణచేసెను. (19)

**టీ॥** జగన్మంగళం – (జగత్తులకు మంగళములు కలిగించునట్టి) – అచ్యుతాంశం – అచ్యుతాః – నాశములేని ఐశ్వర్యము మొదలగు అంశములు గల వానిని – లేక – అచ్యుతుని అంశవంటి అంశగల వాడు – భక్తులను అనుగ్రహించు కొఱకు పరిచ్ఛిన్నమైన శరీరము గలవాడని అర్థము. సమాహితం సమ్యగ్భూతమేవ ఆహితం – వేద దీక్షతో అర్పింపబడిన వానిని – దేవీ – ప్రకాశించుచున్న – శుద్ధసత్త్వ అని యర్థము. సర్వాత్మకం – అందఱికి, అన్నిటికి ఆత్మయైన వానిని అందువలననే ఆత్మభూతుని – తనలో మొదటనే ఉన్న వానిని – మనస్తః – మనస్సుచేతనే – దధార – ధారణతో ధరించెను. ఇచట తగిన దృష్టాంతమును చెప్పుచున్నాడు. యథా కాష్ఠా – తూర్పుదిక్కు – ఆనందకరం – చంద్రునుని – అని . (19)

**శ్లో॥** సా దేవకీ సర్వజగన్నివాస
నివాసభూతా నితరాం నరేజే ।
భోజేంద్ర గేహేఽగ్ని శిఖేవ రుద్ధా
సరస్వతీ జ్ఞాన ఖలే యథా సతీ ॥ (20)

**టీ॥** సేతి, సర్వజగన్నివాసస్య శ్రీ హరేర్నివాసభూతా సత్యపి, నితరాం సర్వజనాహ్లాదకతయా న రేజే. కింతు. స్వయమేవానంద మన్వభూత్. యతః కంసస్య గృహే రుద్ధా అన్యైర్న దృశ్యతే ఘటాదిషు రుద్ధా అగ్నిశిఖా దీప ఇవ. తథా. సతీ శోభమానా. సరస్వతీ జ్ఞానఖలే జ్ఞానవంచకే రుద్ధా యథా. అన్యేషామనుపకారిణీ న రాజతే తద్వత్. (20)

**శ్లో॥** తాం వీక్ష్య కంసః ప్రభయా జితాంతరాం
విరోచయంతీం భవనం శుచిస్మితామ్ ।
ఆహైష మే ప్రాణ హరో హరిర్గుహాం
ధ్రువం శ్రితో యన్న పురేయ మీదృశీ ॥ (21)

**తా॥** ఆ దేవకి సర్వజగన్నివాసుడగు భగవానునకు నివాస స్థానముగ నైనను. ఆమె మిక్కిలిగ ప్రకాశింపజాలకుండెను. ఇతరులకు ఉపయోగపడజాలని విద్య గల జ్ఞానవంచకుడగు పండితుని వద్ద చదువుల తల్లియగు సరస్వతి ఏ విధముగ అణచిపెట్టబడి యుండునో అట్లే దేవకి కూడ కంసుని చెరసాలలో అగ్ని శిఖవలె నిరోధింపబడి యుండెను. (20)

**టీ॥** సర్వజగన్నివాసస్య – శ్రీహరికి, నివాసభూతగ అయియును – నితరాం – సర్వజనులకు ఆహ్లాదము కలిగించునట్లుగ – నరేజే. (ప్రకాశింపజాలకుండెను) కాని స్వయముగనే ఆనందము నను భవించెను – కంసుని కారాగృహమునందు నిర్బంధింపబడి యుండుట చేత – కుండ మొదలగువాని యందు నిరోధింపబడిన దీపము యొక్క జ్వాల, ఎట్లు ఇతరులచేత చూడబడజాలదో ఆ విధముగ ప్రకాశించుచు – జ్ఞానవంచకుడైనవానిలో సరస్వతి నిరోధింపబడినట్లు – అన్యులకు ఉపకరింపక ఎట్లు ప్రకాశింపదో ఆ విధముగనే – (20)

**తా॥** లోన కృష్ణుడు గలదియు, తన కాంతితో భవనమును ప్రకాశింప జేయుచున్నదియు, స్వచ్ఛమైన చిరునవ్వుగలదియునైన ఆదేవకిని చూచి, కంసుడు ఇట్ల (నుకొ) నెను. నా ప్రాణములు తీసెడు ఆ హరి ఈమె గర్భము నందు నిశ్చయముగ ప్రవేశించి యున్నాడు. ఏలయన ఇంతకు పూర్వము ఈమె ఈ విధముగ కన్పట్టలేదు." (21)

**టీ॥** తామితి. ప్రభయా భవనం విరోచయంతీం. అజితః శ్రీకృష్ణః అంతరా కుక్షిమధ్యే యస్యాస్తాం. ఏష విరోచమానః గుహాం శ్రితః గర్భే స్థితః. ధ్రువం హరిరేవ యత్ యస్మాదీదృశీయం పూర్వం నాసీత్. (21)

**టీ॥** ప్రభతో భవనమును మెరిపించుచున్న దానిని – అజితః – శ్రీకృష్ణుడు అంతరా – కుక్షిమధ్యముననున్న దానిని – ఏష విరోచమానః – ఇతడు ప్రకాశించుచు – గుహాం శ్రితః – గర్భము నందున్నాడు – ధ్రువం హరిరేవ – (నిశ్చయముగ హరియే) యత్ ఏ కారణమున ఈదృశీయం పూర్వం నాసీత్ – ఈ విధముగ, ఈమె పూర్వమిట్లు కన్పట్టుచు లేకుండెను. (21)

**శ్లో॥** కిమద్య తస్మిన్ కరణీయ మాశు
యమర్థ తంత్రో న విహంతి విక్రమమ్ ।
స్త్రియాస్స్వసుర్గురుమత్యా వధోఽయం
యశశ్శ్రియం హంత్యనువేలమాయుయుః ॥ (22)

**తా॥** ఈ సందర్భమున వెంటనే చేయదగిన కార్యమేమి? దేవకార్య ప్రధానుడగు ఈ కృష్ణుని పరాక్రమము మొక్కవోనిది. లేక ప్రయోజనమే ఉపాయముగాగల తన పరాక్రమమును తానే చంపుకొనడు. ఏలయన ఇప్పుడీ దేవకిని హతమార్చినచో స్త్రీ యొక్క, సోదరి యొక్క, గర్భవతి యొక్క వధగా ఇది కీర్తిని, లక్ష్మిని, ఆయువును నిరంతరముగ నశింపజేయుచుండును. (22)

**టీ॥** నను సంతి సామాదయ ఉపాయా నేతి స్వయమేవాహ – కిమితి. అయమర్థతంత్రో దేవకార్యప్రధానః. విక్రమం న విహంతి. మద్వధే పరాక్రమం కరిష్యత్యేవేత్యర్థః. యద్వా తర్హీయమిదానీమేవ హన్యతామితి విచింత్యాహ – అర్థతంత్రోఽపి పుమాన్. స్వవిక్రమం న విహంతి న నాశయతి స్త్రీ వధే తన్నాశస్స్యాదితి భావః. తదేవాహ

టీ॥ అయం అర్థతంత్రః – దేవకార్యప్రధానుడు – విక్రమం న విహంతి – తను పరాక్రమించుటలో తగ్గిపోడు – నన్ను చంపుట యందు పరాక్రమించుట నిశ్చయమే అని అర్థము. – లేక – అయినచో ఇప్పుడే ఈమెను చంపినచో అని ఆలోచించి చెప్పుచున్నాడు. ప్రయోజనమే ఉపాయముగా గల పురుషుడైనను తన విక్రమమును

– స్త్రియా ఇతి. గురుమత్యాః గర్భిణ్యాః. (22)

**శ్లో॥** నిహంతి కీర్తిం సుదురాసదాం పరా
స్త్యజంతి సంతో యశసా విహీనమ్ ।
స ఏష జీవన్ ఖలు సంపరేతో
వర్తేత యోఽత్యంత నృశింసితేన ॥ (23)

**టీ॥** విహంతీతి. కించ స ఏష జీవన్నేవ మృతస్స్యాత్. నృశింసితేన క్రౌర్యేణ యో వర్తేత. (23)

**శ్లో॥** దేహే మృతే తం మనుజాశ్శపంతి
గంతా తమోఽంధం తనుమానినో ధ్రువమ్ ॥ 24

**టీ॥** దేహ ఇతి. తం జీవంతమేవ మనుజాశ్శపంతి దుర్వాక్యైర్ధిక్కుర్వంతి. దేహే మృతే. తనుమానినః పాపినః. నరకం గచ్ఛంతి. అథవా. శాపప్రకారమాహ – తనుమానినో దేహాత్మాభిమానినోఽస్య

తాను నాశనము చేసికొనడు. ఆడు దానిని చంపుట వలన అది నశించునని భావము. – అదియే చెప్పుచున్నాడు. గురుమత్యాః – గర్భిణి యొక్క. (22)

**తా॥** గొప్ప అజేయుడైనను అతని కీర్తిని శత్రువులు నశింపజేయుదురు. కీర్తి చెడిన వానిని సత్పురుషులు వదలి పెట్టుదురు. ఎవడు మిక్కిలి క్రూరత్వముతో ప్రవర్తించుచుండునో అట్టివాడు బ్రతికియుండియూ చచ్చినవాడే కదా !. (23)

**టీ॥** ఇంకను అట్టివాడు బ్రతుకుచునే చచ్చినవాడగును – నృశంసితేన – క్రూరత్వముతో – ఎవడు ప్రవర్తించుచుండునో. (23)

**తా॥** జనులు అతనిని బ్రతికియుండగనే శపింతురు. ఇక చచ్చిన పిదప స్వాభిమానులైనవారు ఈతనిని ఇతడు నిశ్చయముగ అంధతామిశ్రమమను నరకమును పొందునందురు. (24)

**టీ॥** తం జీవంతమేవ మనుజాశ్శపంతి – అతనిని బ్రతికియుండగనే మనుజులు శపింతురు. చెడు వాక్యములచేత ధిక్కారము చేయుదురు. దేహే మృతే – శరీరము చనిపోయిన పిదప – తనుమానినః –

దేహే మృతే. అయం ధ్రువమంధం తమో గమిష్యతీతి. (24-25)

పాపులు - నరకం గచ్ఛంతి - నరకమును పొందుదురు. లేక శాప ప్రకారమును చెప్పుచున్నాడు. తనుమానినః - దేహాత్మాభిమానులు - అస్య దేహే మృతే - ఇతని శరీరము వెడలి పోవగా - ఇతడు నిశ్చయముగ అంధ తమస్సును పొందును అని. (24-25)

**శ్లో॥** ఇతి ఘోర తమాద్భావాత్స నివృత్తస్స్వయం ప్రభుః ।
ఆస్తే ప్రతీక్ష్య తజ్జన్మ హరేర్వైరాను బంధ కృత్ ॥ (25)

**తా॥** ఇట్టి మిక్కిలి భయంకరమగు విచారము నుండి కంసుడు స్వయముగనే విరమించి, కృష్ణునితో వైరభావము బూని, అతని జన్మ కొఱకు నిరీక్షించుచు ఉండిపోయెను. (25)

**శ్లో॥** ఆసీనస్సంవిశంస్తిష్ఠన్ భుంజానః పర్యటన్ పిబన్ ।
చింతయానో హృషీకేశమపశ్యత్తన్మయం జగత్ ॥ (26)

**తా॥** కూర్చుండియు, పరుండియు, తినుచు, తిరుగుచు, త్రాగుచును కృష్ణుని గుఱించియే ఆలోచించుచు, జగత్తంతయును అతనితో నిండియున్నట్లుగ చూచుచుండెను. (26)

**టీ॥** ఆసీన ఇతి. సంవిశన్ శయానః. (26)

**టీ॥** సంవిశన్ - పరుండుచు. (26)

**శ్లో॥** బ్రహ్మా భవశ్చ తత్రైత్య మునయో నారదాదయః ।
దేవైస్సానుచరైస్సాకం గీర్భిర్వృషణ మైడయన్ ॥ (27)

**తా॥** బ్రహ్మ, శివుడు, నారదుడు మొదలగు మునులు, దేవతలతోను, వారి వారి అనుచరులతోను దేవకీ వసుదేవులున్న కారాగృహమునకు వచ్చి కోరికలను వర్షించు కృష్ణభగవానుని మధురవాక్కులతో స్తుతించిరి. (27)

టీ॥ బ్రహ్మేతి. రమ్యాభిః గీర్భిః వృషణం కామవర్షిణం ఐడయన్ తుష్టువుః. (27)

**దేవా ఊచుః**

**శ్లో॥** సత్య వ్రతం సత్యపరం త్రిసత్యం
సత్యస్య యోనిం నిహితం చ సత్యే ।
సత్యస్య సత్య మృత సత్య నేత్రం
సత్యాత్మకం త్వాం శరణం ప్రపన్నాః ॥ (28)

**టీ॥** ప్రతిశ్రుతం సత్యం కృతమితి హృష్టాః. సత్యత్వేనైవ ప్రథమం స్తువంతి సత్యవ్రతమితి. సత్యం వ్రతం సంకల్పో యస్య తం. సత్యపరం శ్రేష్ఠం ప్రాప్తిసాధనం యస్మిన్ తం. త్రిసత్యం త్రిష్వపి కాలేషు సృష్టేః పూర్వం ప్రళయానంతరం స్థితిసమయే చ సత్యం అవ్యభిచారేణ వర్తమానం. తదేవాహుః. సత్యస్య యోనిమితి. సచ్ఛబ్దేన పృథివ్యప్తేజాంసి సత్యశబ్దేన వాయ్వాకాశా ఏవం సచ్చ త్యం చ సత్త్వం భూతపంచకం.

టీ॥ రమ్యమైన వాకుకలతో - వృషణం - కామములను వర్షించు వానిని- ఐడయన్ - స్తోత్రము చేసిరి. (27)

**దేవతలిట్లనిరి.**

**తా॥** సత్యమే సంకల్పముగ కలవాడవు, సత్యమునే శ్రేష్ఠమైన ప్రాప్తి స్థానముగ కలవాడవు, మూడు కాలముల యందు అనగా సృష్టికి పూర్వమున, స్థితి సమయమున, ప్రళయము తరువాతను సత్యమునందే వర్తించువాడవు, పంచభూతాత్మకమైన సృష్టికంతటికిని కారణభూతుడవు, దానియందే అంతర్యామిరూపమున నుండువాడవు, సత్యములలోకెల్ల పారమార్థిక సత్యస్వరూపుడవు, సూనృత వాక్కుతో సమదర్శనము కలవాడవు, సత్యమే నీవైనవాడవగు నిన్ను శరణు పొందియున్నాము. (28)

**టీ॥** సత్యమైన ప్రతిజ్ఞ చేయబడినది కావున దేవతాది ప్రముఖులు సంతోషించి సత్యత్వముతోడనే మొదట సత్య వ్రతమిత్యాదిగ స్తుతించుచున్నారు. సత్యమే వ్రతముగ, సంకల్పముగ ఎవరికి కలదో అట్టివానిని - సత్యమే పరముగ, శ్రేష్ఠమైన ప్రాప్తిస్థానముగ ఎవనియందు గలదో అట్టి వానిని - త్రిసత్యం - మూడు కాలములయందు - సృష్టికి పూర్వము, ప్రళయమునకు తరువాత, స్థితి సమయమున కూడ

శ్రు."తత్సత్యమిత్యాచక్షత" ఇతి శ్రుతేః. యోనిం కారణం. అనేన సృష్టేః పూర్వం వర్తమానతోక్తా. తథా సత్యే తస్మిన్నేవ నిహితం అంతర్యామి తయా స్థితం. అనేన స్థితిసమయేఽపి వర్తమానతోక్తా తథా చ సత్యస్య సత్యం సత్యస్యైకస్య సత్యం పారమార్థికం తన్నాశేఽవ్య వశిష్యమాణరూపం అనేన ప్రళయేఽప్యవధిత్వేన సత్యత్వం దర్శితం. ఏవం త్రిసత్యత్వముపపాదితం. తథా ఋతస్య నేత్రం ఋతం చ సూనృతవాణీ. సత్యం చ సమదర్శనం. తథా భగవతా వ్యాఖ్యాస్య మానత్వాత్. శ్లో. "సత్యం చ సమదర్శనం, ఋతం చ సూనృతవాణీ వాణీ కవిభిః పరికీర్తితే"తి. తయోర్నేత్రం నయనసాధనం నేతారం ప్రవర్తకమితి యావత్. ఏవం సర్వ ప్రకారేణ సత్యాత్మకం త్వా భగవన్ వయం శరణం ప్రపన్నాః ప్రాపా ఇతి. (28)

సత్యం - చలింపక వర్తించు వానిని 'సత్యస్య యోనిం' అని అదియే చెప్పుచున్నారు. సత్ అను శబ్దము చేత పృథివి, జలము, తేజము - (స)త్య శబ్దముచే వాయువు, ఆకాశము. ఈ విధముగ సత్, త్యం+సత్యం - పంచభూతములు, "అది సత్యమని చెప్పుదురు" అని శ్రుతి వలన, యోనిం - కారణమును. దీని చేత సృష్టికి పూర్వముననున్న లక్షణము చెప్పబడినది. తథా సత్యే - అట్లే దాని యందే - నిహితం - అంతర్యామిత్వముతో నున్న వానిని. దీనితో స్థితి సమయమున కూడ అతని ఉనికి చెప్పబడినది. తథా చ - అటులనే - సత్యస్య సత్యం ఒకే సత్యముయొక్క సత్యము-పారమార్థికము, సృష్టి నశించి పోయినను మిగిలి యందు రూపము. దీనితో ప్రళమయు వఱకు గాను సత్యత్వము చూపబడినది. ఈ విధముగ త్రిసత్యత్వము సమకూర్చబడినది. అట్లే ఋతస్య నేత్రం - ఋతం - సూనృతవాణి, సత్యం చ -సమదర్శనం. ఆ విధముగ భగవానునిచే వ్యాఖ్యానింపబడి యుండు లక్షణముచేత. "సత్యము సమదర్శనమని, ఋతం సూనృత వాక్కనియు తత్త్వవేత్తలచే కీర్తింపబడినవి". వాని యొక్క నయన సాధనము(నడిపించు సాధనము) నేతను - ప్రవర్తకుని అని సారాంశము. ఈ విధముగ అన్ని విధములుగ సత్య స్వరూపుడవైన నిన్ను, ఓ భగవానుడా! మేము శరణము ప్రాప్తాః - పొందినాము - అని. (28)

**శ్లో॥** ఏకాయ నోఽసౌ ద్విఫల స్త్రిమూలః
చతూరసః పంచ విధః షడాత్మా ।
సప్త త్వగష్ట విటపో నవాక్షో
దశచ్ఛదీ ద్విఖగో హ్యాది వృక్షః ॥ (29)

**తా॥** సంసారమనెడు ఈ ఆదివృక్షము, ప్రకృతియనెడు ఒక ఆశ్రయముగలది, సుఖ దుఃఖములనెడు రెండు ఫలములు గలది, సత్త్వరజస్తమో గుణములనెడి మూడు వేర్లు గలది, ధర్మ, అర్థ, కామ, మోక్షములు అను నాలుగు రసములు గలది, త్వక్ చక్షుశ్శ్రోత్ర జిహ్వాఘ్రాణములు అను ఐదు జ్ఞాన ప్రకారములు గలది, ఆకలి, దప్పిక, శోకము, మోహము, వృద్ధాప్యము, మరణము అను ఆఱు స్వభావములు లేక కోశములు గలది. (రసము, చర్మము, రక్తము, మేద, మజ్జ, అస్థి, మాంసము అను ఏడు ధాతువులు గలది) పంచ భూతములు మరియు మనోబుద్ధి అహంకారము అను ఎనిమిది శాఖలు గలది. నోరు, ముక్కు, కండ్లు, చెవులు, పాయూపస్థలు అను తొమ్మిది రంధ్రములు గలది. మరియు ప్రాణము, అపానము, వ్యానము, ఉదానము, సమానము, నాగము, కూర్మము కృకరము, దేవదత్తము, ధనంజయము అను పది ఆకులు గలది. ఈ సంసారరూప వృక్షము మీద జీవుడు ఈశ్వరుడు అనురెండు పక్షులు గలవు – ఇట్లు పది అంశములు గలది ఈ సంసారమనెడు ఆది వృక్షము. (29)

**టీ॥** నను భవంతోఽపి లోకేశ్వరాః మత్తుల్యా ఏవ. కిమితి మాం శరణం ప్రపద్యంతే? మైవం వాచ్యం. త్వ మేవైకస్సర్వేశ్వరః. సర్వసృష్ట్యాదికారణత్వాత్. వయం తు త్వదేకశరణా ఏవ. లోకాదిరూపం

**టీ॥** నిశ్చయముగ మీరు కూడ లోకేశ్వరులే – నాతో సమానులే – ఎందువలన నన్ను శరణువేడుచున్నారు. అట్లు చెప్పరాదు. నీవొక్కడవే సర్వేశ్వరుడవు – సకల సృష్ట్యాది కారణరూపుడవైనందున మేము

ఓం న మో భ గ వ తే వా సు దే వా య. ఓం న మో భ గ వ తే వా సు దే వా య. ఓం న మో భ గ వ తే వా సు దే వా య.

ద్వైతం చ సర్వం తద్వ్యతిరేకేణ నాస్తీతి వక్తుం ద్వైతప్రపంచం వృక్షరూపేణ నిరూపయంతి–ఏకాయన ఇతి. అసౌ ప్రపంచః ఆదివృక్షః వృశ్చ్యత ఇతి వృక్షః. సమష్టి వ్యష్టిదేహరూపః. కథంభూతః. ఏకాయనః ఏకా ప్రకృతిః అయనం ఆశ్రయో యస్య సః. ద్వే సుఖదుఃఖే ఫలే యస్య సః త్రయో గుణాస్సత్త్వాదయో మూలాని యస్య సః. ధర్మార్థకామమోక్షాశ్చత్వారో రసా యస్య సః. పంచ ఇంద్రియాణి శిఫా జ్ఞానప్రకారా యస్య సః. షడూర్మయః. శ్లో. "బుభుక్షా చ పిపాసా చ ప్రాణస్య మనసః స్మృతౌ, శోకమోహౌ శరీరస్య జరామృత్యూ షడూర్మయః" కోశా వా. త్వగ్రుధిర మాంసమేదోఽస్థిమజ్జా యే తే షట్కోశాః ఆత్మానః స్వభావాః యస్య సః షడాత్మా సప్త ధాతవః త్వచో యస్య సః. పంచభూతాని మనో బుద్ధ్యహంకారాశ్చేత్యష్టౌ విటపాః శాఖా విస్తరా యస్య సః. నవాక్షః నవద్వారాణి అక్షీణి ఛిద్రాణి యస్య. దశప్రాణాః. నాగ కూర్మ కృకర దేవదత్త ధనంజయ ప్రాణాపాన వ్యానోదాన సమానాః. ఛదాః పత్రాణి యస్య సః దశచ్ఛదః. ద్వౌ జీవేశ్వరౌ ఖగౌ యస్మిన్. సః. (29)

నిన్నొక్కనినే శరణు పొందిన వారము. ఈ ద్వైతాది రూపమున గల సర్వ లోకములును నీకన్న భిన్నముగలేవని చెప్పుటకు ద్వైత ప్రపంచమును వృక్ష రూపమున నిరూపించుచున్నారు. ఏకాయన అని. ఈ ప్రపంచము ఆదివృక్షము. ఛేదింపబడును కావున వృక్షము – సమష్టి, వ్యష్టి దేహ రూపమైనది. ఎట్టిది? ఏకాయనః ప్రకృతియే అయనముగ ఆశ్రయముదేనికి గలదో అది. సుఖ దుఃఖములు అను రెండు ఫలములు గలది. మూడు గుణములు మూలములుగ గలది – ధర్మార్థ, కామ, మోక్షములు అను నాలుగు రసములు గలది. ఐదు ఇంద్రియములు విధములుగ, జ్ఞాన ప్రకారములుగ గలది. ఆఱు ఊర్ములు (అలలు లేక ముడుతలు) లేక కోశములు ఆత్మలుగా – స్వభావములుగ గలది. ఏడు ధాతువులు తొక్కలుగ (బెరడులుగ) గలది. పంచ భూతములు మరియు మనస్సు, బుద్ధి, అహంకారము అను ఎనిమిది కొమ్మలుగ గలది. తొమ్మిది ద్వారములు ఇంద్రియ ఛ్ఛిద్రములు గలది. పదిప్రాణములు – ఛదాః – పత్రములు దేనికి కలవో అది దశచ్ఛదీ, ఇద్దఱూ జీవేశ్వరులు అను పక్షులు దేనిపైగలవో అది 'ద్విఖగః'. (29)

**శ్లో॥** త్వమేక ఏవాస్య సతః ప్రసూతి
స్త్వం సన్నిధానం త్వమనుగ్రహశ్చ ।
త్వన్మాయయా సంవృత చేతసస్త్వాం
పశ్యంతి నానా న విపశ్చితో యే ॥ (30)

**టీ॥** ఏవం రూపస్య సంసారవృక్షస్య సతః కార్యస్య త్వమేక ఏవ ప్రసూతిః ప్రకర్షేణ సూతిర్జన్మ యస్మాత్సః కారణమిత్యర్థః. త్వమేవ సన్నిధానం సమ్యఙ్నిధీయతేఽస్మిన్నితి లయస్థానం త్వమేవానుగ్రహశ్చ అనుగృహ్ణాతి పాలయతీతి. నను బ్రహ్మవిష్ణురుద్రాః ఏవం భూతాః ప్రసిద్ధాః–కథమహ మేవేతి చేత్తత్రాహుః. త్వన్మాయయేతి. సంవృతం పిహితం చేతో జ్ఞానం యేషాం తే త్వామేన నానా పశ్యంతి. యే తు విపశ్చితో విద్వాంసః. తే తథా న పశ్యంతి. (30)

**తా॥** ఈ విధమగు సంసారవృక్షమును సృజించు కార్యమునకు నీవొక్కడవే కారణము. నీవే దానిని నశింపజేయువాడవు. నీవే దయతో రక్షించువాడవు. నీ మాయ చేత కప్పి వేయబడిన జ్ఞానముతో నిన్నే వివిధ రూపములతో చూచుచున్నారు. విద్వాంసులు అట్లుచూడరు.(30)

**టీ॥** ఈ విధమైన సంసారవృక్షమునకు – సతః – కార్యమునకు నీవొక్కడవే ప్రసూతిః – ప్రకర్షేణసూతిః – జన్మఎవని వలననో – కారణమని యర్థము. నీవే – సన్నిధానం – సమ్యక్ నిధీయతే అస్మిన్ ఇతి – లయ స్థానమవు. నీవే అనుగ్రహః – దయ చూపువాడవు – పాలించువాడవు అని – బ్రహ్మవిష్ణురుద్రులే సృష్టిస్థితి లయ కర్తలని ప్రసిద్ధులు కదా! నేనే ఈ మూడింటికి కారణమని యెట్లందురు – అనినచో చెప్పుచున్నాడు. 'త్వన్మాయయా' అని. మూసివేయ బడిన జ్ఞానము గలవారు నిన్నే అనేక రూపములుగ చూచుచున్నారు. విశ్లేషింపగల విద్వాంసులు అటుల చూడరు. (నిన్ను ఒక్కనినే ఒక్కడు గనే చూచెదరు) (30)

**శ్లో॥** బిభర్షి రూపాణ్యవబోధ ఆత్మన్
క్షేమాయ లోకస్య చరాచరస్య ।
సర్వోపపన్నాని సుఖావహాని
సతామభద్రాణి ముహుః ఖలానామ్ ॥ (31)

**తా॥** పరమాత్మా! జ్ఞానైకస్వరూపా! జంగమస్థావరాత్మకమగు లోకమునకు క్షేమమును గూర్చుట కొఱకు, సత్పురుషులకు సుఖమును కలిగించునవియును మరియు దుర్మార్గవర్తనులకు అశుభమును కలిగించునవియు, అన్నింటిని కలిగించునవియునైన రూపములను ధరించుచుందువు. (31)

**టీ॥** నను దేవకీపుత్రం మాం కథమేవం వర్ణయథేతి, చేత్తత్రాహుః –బిభర్షీతి. ఆత్మన్ పరమాత్మన్ అవబోధ. అవబోధైకస్వరూప. చరాచరస్య స్థావరజంగమాత్మకస్య క్షేమాయ సత్త్వగుణయుక్తాని ఖలానాం అభద్రాణి సతాం సుఖావహాని రూపాణి మూ ర్తీర్బిభర్షి ధత్సే న తు త్వం కస్యాపి పుత్ర ఇత్యర్థః. (31)

**టీ॥** ఆత్మన్! పరమాత్మా – పరమాత్మా, అవబోధ! జ్ఞానైక స్వరూపుడా! స్థావర జంగమాత్మకమైన ప్రపంచమునకు క్షేమము కలిగించుట కొఱకు, సత్త్వగుణ యుక్తములైన వానిని; దుర్మార్గులకు, అభద్రములైన వానిని – సత్పురుషులకు సుఖావములైన రూపములను ధరింతువు – నీవు ఎవరికిని పుత్రుడవు కావు అని యర్థము. (31)

**శ్లో॥** త్వయ్యంబుజాక్షాఖిల లోకధామ్ని
సమాధినావేశిత చేతసైకే ।
త్వత్పాదపోతేన మహత్కృతేన
కుర్వంతి గోవత్సపదం భవాబ్ధిమ్ ॥ (32)

**తా॥** ఓ కమలనేత్రా! సమస్తమైన ఈ ప్రపంచస్థానము నందు కొందఱు నీ యందే ఆవేశించిన మనస్సుచేత ఏకాగ్రచిత్తముతో, మహాత్ములచే నుపదేశింపబడిన నీ పాదమనెడు నావ సహాయముతో ఈ సంసారసాగరమును లేగదూడ గిట్ట పరిమాణముగ జేసి కొను చున్నారు. (సులభముగ దాటుచున్నారు) (32)

**టీ॥** న కేవలమేతావత్ భక్తానాం మోక్షార్థమపీత్యాహుః–త్వయీతి. త్వయి సమాధినా ఆవేశితచేతసా నిమిత్తేన. త్వత్పాదపోతేనాశ్రితేన. ఏకే ముఖ్యాః వివేకినః మహద్భిః కృతేన సేవ్యతయా సంపాదితేన. యద్వా. ఇదమపి మాయామయమిత్యనాదరం పరిత్యజ్య ఇదమేవ మహత్సర్వోత్కృష్టమితి మనసి కృతేన బహుమతేనేత్యర్థః. భవాబ్ధిం తుచ్ఛీ కుర్వంతి. అనాయాసేనైవ భజనానునిష్పాదినీ తేషాం ముక్తిరి త్యర్థః. (32)

**టీ॥** ఇంతవఱకు మాత్రమే కాదు, భక్తులయొక్క మోక్షము కొఱకు కూడ అని చెప్పుచున్నారు. 'త్వయి' అని, నీయొక్క సమాధిచేత – నీయందు ఆవేశించిన మనస్సు చేత – ఆ కారణముగ – నీ పాదమనెడు నావను ఆశ్రయించుటచేత – ఏకే – ముఖ్యులు కొందఱు వివేకవంతులు – మహాత్ములను సేవించుట ద్వారా సంపాదించిన దాని చేత, లేక – ఇదికూడ మాయామయమేమో అనెడి అనాదర భావమును వదలి, ఇదియే సర్వోత్కృష్టమైనదని మనస్సు నందు

**శ్లో॥** స్వయం సముత్తీర్య సుదుస్తరం ద్యుమన్
భవార్ణవం భీమ మదభ్ర సౌహృదాః ।
భవత్పదాంభోరుహ నావమత్ర తే
నిధాయ యాతాస్సదనుగ్రహో భవాన్ ॥ (33)

**టీ॥** నను తేన పోతేన పూర్వే చేత్సారం గతాః. తర్హీదానీం జనానాం కాగతిస్తత్రాహుః. స్వయమితి. అయమర్థః. హే ద్యుమన్ స్వప్రకాశ త్వత్పాదపోతసామీప్య మాత్రేణ భవాంభోధౌ వత్సపదమాత్రే జాతే. అతస్తన్నిరపేక్షం. స్వయమేవ. అన్యేషాం భీమం సుదుస్తరమపి భవార్ణవం సముత్తీర్య. భవత్పదాంభోరుహ రూపాం నావమత్రైవ నిధాయ భక్తిమార్గ సంప్రదాయం ప్రవర్త్యేత్యర్థః. పారం యాతాః పారం గతాః. తత్కిం? యతోఽదభ్ర సౌహృదాః సర్వ భూతేషు. అదభ్రసౌహృదాః అతిప్రీతి యుక్తాః. అతస్తే. అన్యేషాం తరణాయ నిధాయేతి. కథం మత్పాదపోతేన తీర్ణాః అత ఉక్తం భవాన్ సదనుగ్రహః సతో భక్తాననుగృహ్ణాతీతి. యేన కేనచిత్ప్రకారేణ భగవతి చేతో నివేశనీయమితి భావః. (33)

చేసికొనిన గౌరవ భావముతో అని యర్థము. సంసారసాగరమును అల్పమైనదిగ చేయుచున్నారు. ఆయాసము లేకుండగ భగవత్సేవా ఫలమును పుట్టించునది - వారికి మోక్షమని యర్థము. (32)

**తా॥** ఓ ప్రకాశవంతుడా! అనల్పమైన సుహృద్భావముగల మహాత్ములు, దాటుటకు శక్యముకాని భయంకరమైన సంసారమనెడు సముద్రమును స్వయముగ దాటి, నీ పాదపద్మములనెడు నావను ఇచ్చటనే ఉంచి పోయిరి. నీవు భక్తులననుగ్రహించు వాడవు స్వామీ. (33)

**టీ॥** ఆ నావతో పూర్వులు నిశ్చయముగ తీరమును చేరిరి. అట్లైన ఇప్పటి జనులగతియేమి? ఇట చెప్పుచున్నాడు. 'స్వయం' అని - అర్థమిది. ఓ స్వప్రకాశా! నీ పాదములనెడు నావ, సమీపమున నున్న మాత్రముచేత భవసాగరమునందు లేగడూడల గిట్టలు మొలచినవి. ఇకదాని అపేక్షలేకుండగ స్వయముగనే - ఇతరులకు దాటుటకు శక్యము కానిదైనను దాటి - నీ పాదపద్మముల రూపమైన నావను ఇచ్చటనే ఉంచి భక్తిమార్గ సంప్రదాయమును ప్రవర్తింపజేసి - అనియర్థము. తీరమును చేరిపోయిరి, అదియెట్లు? అదభ్ర సౌహృదము గల వారగుట వలన - సర్వభూతముల యందు అనల్పమైన సుహృద్భావముగలవారు - మిక్కిలి ప్రేమతో కూడినవారు. అందువలన

**శ్లో॥** యే௨న్యేరవిందాక్ష విముక్త మానిన
స్త్వయ్యస్త భావాదవిశుద్ధ బుద్ధయః ।
ఆరుహ్య కృచ్ఛ్రేణ పరం పదం తతః
పతంత్యధో௨నాదృత యుష్మదంఘ్రయః (34)

**టీ॥** నను వివేకినాం కిం మద్భజనేన? ముక్తా ఏవ హి తే. తత్రాహుః –య ఇతి. విముక్తమానినః విముక్తా వయమితి మన్యమానాః. త్వయి అస్తో నిరస్తః అతఏవ ఆసన్. యో భావః తస్మాత్ భక్తేరభావాదిత్యర్థః. న విశుద్ధా బుద్ధిర్యేషాం తే తథా. యద్వా. త్వయి అస్తభా ఇతి ఛేదః అస్తభాః అస్తమతయః వాదేష్వేవ విశుద్ధబుద్ధయః. కృచ్ఛ్రేణ బహుజన్మ తపసా. పరం పదం మోక్షసన్నిహితం. సత్కులతపశ్రుతాది. పతంతి

వారు ఇతరులు దాటుట కొఱకు ఉంచిరి అని. నా పాదములు అను నావతో ఎట్లు దాటిరి? చెప్పబడుచున్నది. నీవు సదనుగ్రహుడవు – సతః భక్తాన్ అనుగృహ్ణాతి ఇతి. భక్తులను అనుగ్రహించువాడు సదనుగ్రహుడు – ఏదో ఒక విధముగ భగవానుని యందు మనస్సు చేర్చదగినదని భావము. (33)

**తా॥** తామరరేకుల వంటి కన్నులుగల ఓ దేవా! ఇతరులు కొందఱు నీయందు ప్రసరింపని మనస్సులుగల వారై యుండుటచేత మలినమైన బుద్ధులు గలవారై తమను తాము ముక్తులమని భావించుచుందురు. అట్టివారు అనేక జన్మల తపస్సు యొక్క ఫలముచేత మోక్షస్థితికి సన్నిహితముగ ఎదిగి కూడ నీ పాదపద్మములను ఆదరింపకపోవుట చేత క్రిందకు పడిపోయెదరు. (34)

**టీ॥** నన్ను భజించుటచేత వివేకవంతులకు ఏమి ఫలము? ముక్తులే కదా వారు! ఇట చెప్పుచున్నారు. “యే” అని, విముక్త మానినః – ‘మేము ముక్తులము’ అని భావించుచుండువారు. నీ యందు మిక్కిలిగ అస్తమించి యున్న ఏ భావము కలదో, అట్టి భక్తిలేని వారని యర్థము. అపరిశుభ్రమైన బుద్ధి ఎవరికి కలదో వారు అవిశుద్ధబుద్ధులు. – లేక – త్వయి అస్తభాః అని పదచ్ఛేదము – అస్తభాః – అస్తమించిన

విఘ్నైరభిభూయంతే. న ఆదృతౌ యుష్మదంఘ్రీ యైస్తే. (34)

మతులు గలవారు - వాదములందే శుద్ధమైన బుద్ధిగల వారు - కృచ్ఛ్రేణ–అనేక జన్మల తపస్సుచేత –పరం పదం – మోక్షమునకుదగ్గరైన స్థితిని - సత్కులము, తపస్సు - శ్రవణము మొదలగు వానిని - పతంతి - ఆటంకముల చేత అవమానింపబడుదురు. నీ పాద పద్మములు ఎవరిచే ఆదరింపబడవో వారు. (34)

**శ్లో॥** తథా నతే మాధవ తావకాః క్వచిత్
భ్రశ్యంతి మార్గాత్త్వయి బద్ధ సౌహృదాః ।
త్వయాభి గుప్తా విచరంతి నిర్భయాః
వినాయ కానీకప మూర్ధసు ప్రభో ॥ (35)

**తా॥** ఓ మాధవా! నీభక్తులట్లు ఎప్పుడును పతనమైపోవరు. వారు సన్మార్గమునుండి ఎప్పుడును భ్రష్టులుకారు. నీయందు బద్ధ మనస్కులై నీచేత రక్షింపబడుచున్నవారు విఘ్నకారకుల నేతల తలలపై నిర్భయముగ విహరించుచుందురు. ప్రభూ! (35)

**టీ॥** త్వదీయాస్తు న కదాచిదపి పతంతీత్యాహుః తథేతి. వినాయకాః విఘ్న హేతవః తేషామనీకాని స్తోమాః తాని పాంతి యే. తేషాం మూర్ధసు. విచరంతి విఘ్నాన్ జయంతీత్యర్థః. యద్వా. త్వద్రూపాః ప్రత్యేకం వినాయకానీకపమూర్ధసు గరుడానాం మూర్ధసు చరంతి.(35)

**టీ॥** నీ వారు ఎప్పుడును ఆ విధముగ పతనము కారని చెప్పు చున్నారు. వినాయకాః – విఘ్నముల కారకులు – వారి సమూహములు వినాయకానీకములు, తాని పాంతి యే - వారిని ఎవరు పాలించు చుందురో వారు వినాయకానీకపులు. వారి శిరస్సులయందు చరించుచుందురనగా విఘ్నములను జయింతురని యర్థము. లేక - నీ రూపముగల వారు ప్రత్యేకముగ వినాయకానీకప మూర్ధసు - గరుడుల యొక్క శిరో భాగమున చరించుచుందురు. (35)

**శ్లో॥** సత్త్వం విశుద్ధం శ్రయతే భవాన్ స్థితౌ
శరీరిణాం శ్రేయ ఉపాయనం వపుః ।
వేద క్రియా యోగ తపస్సమాధిభి
స్తవార్హణం యేన జన స్సమీహతే ॥ (36)

**టీ॥** సతాం సుఖావహాని రూపాణి ధారయసీత్యుక్తం బిభర్షి రూపాణీతి. తత్కేన ప్రకారేణ సుఖావహత్వమిత్య పేక్షాయామాహుః- సత్త్వమితి. సత్త్వం వపుః శ్రయత ఇత్యన్వయః. శ్రేయ ఉపాయనం కర్మఫలదాతృ. కథం యేన వపుషా. జనస్త్వర్హణం పూజాం. ఈహతే కరోతి. కైః. వేదశ్చ క్రియాయోగశ్చ తపశ్చ సమాధిశ్చ తైశ్చతురాశ్రమ ధర్మైరిత్యర్థః. వపుషోఽ నాశ్రయణే అర్హణాసంభవాన్న కర్మఫల సిద్ధిస్స్యా దితి. (36)

**తా॥** వేదము, క్రియాయోగము, తపస్సు, సమాధి అను వానిలో దేని చేత మనుష్యుడు నీ పూజను చేయగోరునో అట్టి దానికి తగినట్లు సాత్త్వికము, స్వచ్ఛము, శరీరులకు నిఃశ్రేయస కారకమునైన శరీరమును నీవు స్థితి కాలమున ధరింతువు. (36)

**టీ॥** సత్పురుషులకు సుఖావహమైన రూపములను ధరింతువు అని లోగడ చెప్పబడినది. 'బిభర్షి రూపాణి' అను శ్లోకము నందు - అవి ఏ విధముగ, సుఖావహత్వములను అపేక్షచేత చెప్పుచున్నారు 'సత్త్వం' అని. సత్త్వ శరీరమును ఆశ్రయింతువు అని అన్వయము, శ్రేయ ఉపాయనం - కర్మఫలమును ఇచ్చునట్టిది - ఎట్లు? ఏ శరీరముతో ఇచ్చునో (అట్టి శరీరమును) జనః తు - మనుష్యుడు - అర్హణాం- పూజను-ఈహతే-చేయునో- వేనిచేత? వేదము, క్రియాయోగము, తపస్సు, సమాధియు వాని చేత, నాలుగు ఆశ్రమ ధర్మముల చేత నని యర్థము, శరీరము నాశ్రయింపకున్నచో పూజ సంభవము కానందు వలన, కర్మఫలము కూడ సిద్ధింపజాలదు- అని. (36)

**శ్లో॥** సత్త్వం న చేద్ధాతరిదం నిజం వపు
ర్విజ్ఞాన మజ్ఞాన భిదాపమార్జనమ్ ।
గుణప్రకాశైరనుమీయతే భవాన్
ప్రకాశతే యస్య చ యేన వా గుణః ॥ (37)

**తా॥** సమస్తమును ధరించువాడా! సకలమును పోషించువాడా! ఈ నీ శరీరమునకు ఉనికిలేకున్నచో - అపరోక్ష (ఆత్మ) జ్ఞానముకాని, దానిని తెలసికొనజాలని అజ్ఞానముకాని, ఆ రెంటి భేదముకాని, అజ్ఞాన, భేదముల నివృత్తి కాని లేదు. ఏలయన నీవు గుణప్రకాశములచేతనే

**టీ॥** త్వయ్యంబుజా క్షేత్రాదినా శ్లోక త్రయేణ భగవద్భక్తానామేవ మోక్షో నాన్యేషామిత్యుక్తం. తత్ర కర్మఫలం భక్తిం వినా మాభూత్. మోక్షస్య తు జ్ఞానైక సాధ్యత్వాత్ కిం భక్త్యేతి సానుశయాన్ ప్రత్యాహుః – సత్త్వమితి. హే ధాతః ఇదం సత్యం నిజం తవ వపుః న భవేచ్చేత్తర్హి విజ్ఞానం విశిష్టమపరోక్షం జ్ఞానం న భవేదిత్యనుషంగః కథంభూతం అజ్ఞానభిదాపమార్జనం. అజ్ఞానం చ తత్కృతాభిదా చ. తయోరప మార్జనం నివర్తకం. యద్వా, అజ్ఞానం భినత్తీత్యజ్ఞానభిత్ విజ్ఞానం మార్జనం నిరాసం, ఆప. ప్రాపనను జడానాం బుద్ధ్యాదీనాం యతః ప్రకాశః. తద్బ్రహ్మేతి జ్ఞానం భవేదేవ స భవాన్ సర్వసాక్షీ పరిపూర్ణః . గుణప్రకాశైః గుణావచ్ఛిన్నైః ప్రకాశైః కేవలమనుమీయతే కల్ప్యతే. న తు సాక్షాత్క్రియత ఇత్యర్థః. అనుమాన ప్రకారమేవాహుః ప్రకాశతే యస్య చ యేన వా గుణ ఇతి. యస్య సంబంధి అయం బుద్ధ్యాదిగుణః ప్రకాశతే. యో గుణసాక్షీత్యేవం. యేన వా బుద్ధ్యాద్యా రూఢేన ప్రమాత్రా బాహ్యో గుణః ప్రకాశత ఇత్యనుమీయత ఇత్యర్థః. శుద్ధసత్త్వ వపుషి త్వయి సేవ్యమానే తు తదాకారేఽ ంతఃకరణే త్వత్ప్రసాదేన సాక్షాత్కారో భవేదితి భావః. (37)

కల్పింపబడుచున్నావు. ఆ గుణము ఎవనికి సంబంధించినదైనను, ఎవనిచే ప్రకాశింపచేయబడుచున్నదైనను గానిమ్ము. (37)

**టీ॥** త్వయి అంబుజాక్ష! (32) ఇత్యాదిగాగల మూడు శ్లోకములచేత భగవంతుని భక్తులకే మోక్షము కలుగుననియు, ఇతరులకు కాదనియు చెప్పబడినది. అట్టి వారి కర్మఫలమనునది భక్తి లేకుండ కలుగదు. ఇక జ్ఞానైక సాధ్యమైనదే మోక్షము అగుటవలన – భక్తి చేనెట్లు అని విచారించుచు సమాధానప్రాయముగ చెప్పుచున్నారు. 'సత్వం' అని. ఓ ధాతా! ఈ నీ శరీరము యొక్క ఉనికి లేనియెడల విజ్ఞానం – విలక్షణమగు అపరోక్ష జ్ఞానము కలుగదు అని సంబంధము – అజ్ఞానభిదాపమార్జనం ఎట్టిది? అజ్ఞానము మరియు దానిచే చేయబడిన భేదముకూడ అవి రెండింటి యొక్క నివర్తకము (తొలగించునది) – లేక – అజ్ఞానమును భేదించునది కావున అజ్ఞానభిత్ – విజ్ఞానము – మార్జనం – నిరాసము – ఆప – ప్రాప – జడములగు బుద్ధి మొదలగువానికి ఏ ప్రకాశము కలుగునో అది బ్రహ్మమే అను జ్ఞానము అగును. అట్టి నీవు సర్వమును చూచువాడవు. పరిపూర్ణుడవు. గుణములచే వేరుచేయబడిన ప్రకాశముల చేత కేవలము కల్పింప బడుచున్నావు. కల్పింపబడుచున్నదే కాని, సాక్షాత్కరించునది కాదని యర్థము. అనుమాన ప్రకారమునే చెప్పుచున్నారు. 'యస్య చ యేన

**శ్లో॥** న నామ రూపే గుణ కర్మజన్మభి
ర్నిరూపితవ్యే తవ తస్య సాక్షిణః ।
మనో వచో భ్యామనుమేయ వర్త్మనో
దేవ క్రియాయాం ప్రతియంత్యథాపి హి ॥ (38)

**టీ॥** ఏవం తావద్భక్తానామభ్యుదయాపవర్గార్థం రూపాణి బిభర్షీ త్యుక్తం. తాన్యపి భజనీయాని కేవలం. న తు జ్ఞాతుం శక్యంతే. అనంతత్వాదతర్క్యత్వాచ్చ మనోవచసోరగోచరత్వాదిత్యాహుః–న నామ రూపే ఇతి. గుణాశ్చ కర్మాణి చ జన్మాని చ తైర్నిరూపితవ్యే నిరూపణార్హే

వా గుణః' అని – ఎవని సంబంధమైన ఈ బుద్ధి మొదలగు గుణములు ప్రకాశించునో–ఎవడు గుణములకు సాక్షియో–అని యిట్లే ఎవని చేత బుద్ధి మొదలగునవి ఆరోహింపబడెనో అట్టి ప్రమాత చేత (తెలిసికొను వాని చేత) బాహిరమైన గుణము ప్రకాశించును అని అనుమానింప బడునని యర్థము. శుద్ధ సత్త్వ స్వరూపమైన శరీరముగల, నీవు సేవింప బడగా ఆ రూపమున, అంతఃకరణమునందు నీ అనుగ్రహముతో – సాక్షాత్కారము కలుగునని భావము. (37)

**తా॥** ఓ దేవా! సాక్షి మాత్రస్వరూపుడవగు నీ నామరూపములు, నీ గుణములచేతగాని, నీవు చేసిన, చేయుచున్న కర్మలచేతగాని, నీ అవతారములచేత గాని, నిరూపింప సాధ్యములు కావు. కేవలము మనస్సు మరియు వాక్కు అను రెండింటిచేత మాత్రమే అనుమానింప గలుగుటకు వీలగు మార్గము గల వాడవగు నిన్ను ఉపాసనాది క్రియలందు ఇప్పుడు కూడ సాక్షాత్కరించు కొనుచున్నారు. (38)

**టీ॥** ఈ విధముగ భక్తుల అభ్యుదయ నిశ్శ్రేయసముల కొఱకు రూపములను ధరింతువని చెప్పబడినది. అవి కూడ కేవలము భజింపదగినవిమాత్రమే కాని తెలిసికొనుటకు శక్యములు కావు. అనంతత్వము వలన, తర్కించుటకు సాధ్యముకానివియు నైనందువలన,

న భవతః. కుతః? అనుమేయం వర్త్మ మార్గో యస్య. తవేతి. తత్రాపి హేతుః.-తస్య సాక్షిణ ఇతి. న హి సాక్షిణస్తత్త్వం మనోవచో గోచర మిత్యర్థః. హే దేవ బహుధా ద్యోతమాన. అథాపి క్రియాయాం ఉపాసనాది లక్షణాయాం. త్వాం ప్రతియంతి ఉపాసకాస్సాక్షాత్పశ్యంతి. హి ప్రసిద్ధే. (38)

మనస్సునకు, వాక్కునకును అందని లక్షణములు గలవియగుటచేనని చెప్పుచున్నారు. 'న నామరూపే' అని. గుణములు, కర్మములు, జన్మములు అను వానిచే నిరూపణార్హములు కావు - ఎందువలన? - అనుమానింపదగి యుండుటయే నీ మార్గమైనందువలన - దానికి కారణములు - సాక్షులును - అని. ఇది చూచువానికి విషయముకాదు. మనస్సునకుగాని వాక్కునకుగాని గోచరమగునది కాదని యర్థము. ఓ దేవా! అనేక విధములుగ ప్రకాశించుచుండు వాడా! ఇప్పుడుకూడ క్రియ యందు-ఉపాసన మొదలగు లక్షణమునందు నిన్ను ఉపాసకులు ప్రతియంతిః - సాక్షాత్తుగ చూచెదరు. హి అనునది ప్రసిద్ధికి. (38)

**శ్లో॥** శృణ్వన్ గృణన్ సంస్మరయంశ్చ చింతయన్
నామాని రూపాణి చ మంగళాని తే ।
క్రియాసు యస్త్వచ్చరణారవిందయో
రావిష్ట చిత్తో న భవాయ కల్పతే ॥ (39)

**తా॥** శుభములను గూర్చు నీ నామములను రూపములను వినుచు కీర్తించుచు. స్మరించుచు, ధ్యానించుచు నాయా కర్మల యందును నీ పాదపద్మ సంలగ్నచిత్తుడగునేని అట్టివాడు సంసారమున తగుల్కొనడు. (39)

**టీ॥** తస్మాద్భక్త్యైవ మోక్ష ఇత్యుపసంహరంతి-శృణ్వన్నితి. అన్యానపి సంస్మరయన్. క్రియాసు దేవార్చనాదిషు. (39)

**టీ॥** అందువలన భక్తిచేతనే మోక్షమని ఉపసంహరించుచున్నాడు. "శృణ్వన్" అని ఇతరులనుకూడ సంస్మరింపజేయుచు - క్రియాసు - దేవుని పూజించుట మొదలగు వానియందు. (39)

**శ్లో॥** దిష్ట్యా హరేఽస్యా భవతః పదో భువో
భారోఽపనీతస్తవ జన్మ నేశితుః ।
దిష్ట్యాంకితాం త్వత్పదకైః సుశోభనైః
ద్రక్ష్యామ గాం ద్యాం తవానుకంపితామ్ ॥ (40)

**తా॥** ఓ భగవానుడా! మాకు శుభము కలుగనుగాక. ఈశ్వరుడవగు నీవు జన్మించుటచేత నీ పాదభూతమైన ఈ భూమియొక్క భారము తొలగింపబడినది. నీ సుందరమైన పాదములచేత ముద్రింపబడిన భూమిని, నీ అనుగ్రహముతోనిండిన స్వర్గమును చూచెదము. లేక స్వర్గమువంటి భూమిని చూచెదము. (40)

**టీ॥** విశేషతః కృష్ణావతారమభినందంతి. దిష్ట్యేతి. నః దిష్ట్యా భద్రం తవ పదః పాదభూతాయాః, ఈశ్వరస్య తవ జన్మమాత్రేణ భువో భారః అపనీత ఏవ. కించ. త్వత్పదకైః కోమలైః పదైః. సుశోభనైర్వజ్రాం కుశాది శుభలక్షణైః. గాం పృథ్వీం ద్యాం స్వర్గం చ తవ త్వయా నుకంపితాం. (40)

**టీ॥** ముఖ్యముగ కృష్ణావతారమును అభినందించుచున్నాడు. 'దిష్ట్యా' అని. మాకు దిష్ట్యా – భద్రం – తవ పదః, నీ పాదభూతమైన, ఈశ్వరుని యొక్క, నీ జన్మ మాత్రముచేత భూమియొక్క భారము తొలగింపబడినదే – మరియు – నీ కోమలమైన పాదముల చేత – సు శోభనైః – వజ్రము, అంకుశము మొదలగు శుభ లక్షణముల చేత – గాం –భూమిని, – ద్యాం – స్వర్గమును – తవ అనుకంపితాం – నీ చేత అనుగ్రహింపబడిన దానిని. (40)

**శ్లో॥** నతేఽభవస్యేశ భవస్యకారణం
వినా వినోదం బత తర్కయామహే ।
భవో నిరోధః స్థితిరప్యవిద్యయా
కృతా యతస్త్వయ్య భయాశ్రయాత్మని ॥ (41)

**తా॥** ఓ ఈశ్వరా! అయ్యో! పుట్టుకయే లేని నీ పుట్టుకకు కారణమును చమత్కారము కొఱకు తప్ప మేము ఊహించుటలేదయ్యా! ఏలయన సృష్టి, స్థితి, లయములు జీవాత్మయందుగల అవిద్యచే కల్పింపబడినవి ఆత్మవగు నీయందు అవిద్యచే రచింపబడినవి. నీవు అభయాశ్రయుడవు కదా ! (ఓ అభయాశ్రయా! ముక్తుడవగు నీకు నీ జన్మను గుఱించి ఊహించుట యేమి? వినోదము కొఱకు తప్ప) (41)

**టీ॥** తన జన్మనా భారోఽపనీత ఇత్యుక్త్వా మమాపి కిం జీవవత్సంసార ఉక్తః. న హి నహీత్యాహుః - నేతి. బత హే ఈశ అసంసారిణస్తే జన్మనః. కారణం క్రీడాం వినా న తర్కయామః. కించ. హే అభవాశ్రయ అభవశ్చ ఆశ్రయశ్చ. న భవమాశ్రయ ఇతి వా. అభవాశ్రయేఽపి పాఠాంతరే. న భయమాశ్రయత ఇతి తథా తత్సంబోధనం హే నిత్యముక్తేత్యర్థః. తవ జన్మ కారణం నాస్తీతి కిమువక్తవ్యం. యతః ఆత్మని జీవాత్మన్యపి. భవాదయః త్వయి విషయే యా అవిద్యా. తయా కృతా. న పరమార్థతస్సంతీతి. (41)

**టీ॥** నీ జన్మచేత భూమి భారము తొలగింపబడినది అని చెప్పి యుండుట చేత "జీవునకువలె నాకు కూడ సంసారము చెప్ప బడినదా యేమి"? కాదు కాదని చెప్పుచున్నారు. అయ్యో! ఓ ఈశ్వరా! అసంసారివగు నీకు - నీ పుట్టుకకు కారణము వినోదము కొఱకు తప్ప తర్కింపము. అదియుఁగాక ఓ అభవాశ్రయా! సంసారము నాశ్రయించని వాడా! - అభయాశ్రయ అను పాఠాంతరమున - భయము నాశ్రయింపనివాడు అని - ఆ విధముగ అభయాశ్రయ అనునది సంబోధనము. ఓ నిత్యముక్తుడా! అని యర్థము. నీ జన్మమునకు కారణములేదు అని చెప్పుటయేమి? ఆత్మయందు - జీవాత్మయందుకూడ - భవాదుల - సంసారము మొదలగునవి - నీ యందు ఏ అవిద్య గలదో దాని చేత చేయబడినవి. పరమార్థతః లేవు అని. (41)

**శ్లో॥** మత్స్యాశ్వ కచ్ఛప వరాహ నృసింహ హంస
రాజన్య విప్ర విబుధేషు కృతావతారః ।
త్వం పాహి నస్త్రిభువనం చ తథాఽధునేశ
భారం భువో హర యదూత్తమ వందనం తే ॥ (42)

**తా॥** ఓ ఈశ్వరా! నీవు, మత్స్య, హయగ్రీవ, కూర్మ, వరాహ, నారసింహ, హంస, రామ, వామన అవతారములను దేవ కార్యము లందు ధరించి రక్షించి యుంటివి. ఆ విధముగనే ఇప్పుడు కూడ మమ్ము, ఈ ముల్లోకములను రక్షింపుము. ఈ భూ భారమును తొలగింపుము. ఓ కృష్ణా! నీకు నమస్కారము. (42)

**టీ॥** ప్రస్తుతం ప్రార్థయంతే- మత్స్యేతి. నః అస్మాన్ త్రిభువనం చ మత్స్యాదిషు యథా. అపాః తథా అధునాపి. పాహీతి. వందనం త ఇతి వదంతః సర్వే శిరోభిః ప్రణేముః.(42)

**టీ॥** స్తుతింపబడిన ఆ భగవానుని ప్రార్థించుచున్నారు 'మత్స్య' ఇత్యాదిగ. - మమ్ము ముల్లోకములను కూడ మత్స్యము మొదలగు అవతారములందు వలె - ఎట్లు రక్షించితివో - అట్లే ఇప్పుడు కూడ రక్షింపుము అని - నీకు వందనము అని అందఱును తలలు వంచి ప్రణమిల్లిరి. (42)

**శ్లో॥** దిష్ట్యాంబ తే కుక్షి గతః పరః పుమాన్
అంశేన సాక్షాద్భగవాన్ భవాయ నః ।
మా భూద్భయం భోజపతేర్ముమూర్షోః
గోప్తా యదూనాం భవితా తవాత్మజః ॥ (43)

**తా॥** ఓ అమ్మా! అదృష్టవశమున నీ గర్భమునందున్నవాడు సాక్షాత్తుగ భగవానుని అంశచేత నున్న పరమపురుషుడు. మా క్షేమమునకై ఉన్నాడు. భయములేదు. మృత్యువు ఆసన్నమైయున్న కంసుని వలన నిక ఎట్టి భయమునులేదు. నీ కుమారుడు యదు వంశీయులను రక్షించువాడగును. (43)

**టీ॥** దేవకీం ప్రత్యాహుః.-దిష్ట్యేతి. నోఽస్మాకం భవాయ క్షేమాయ భవస్య ప్రపంచోత్పత్తేః. అయనః స్థానభూత ఇతి వా. సాక్షాత్పరః పుమాన్ తే కుక్షిం గతః అతో భయం మాభూదితి. యోఽంశేనాపి సదాస్మాకం భవాయ భవతి. స సాక్షాత్తే కుక్షిం గత ఇత్యేతదస్మద్భాగ్యం. యః అంశేన మత్స్యాద్యవతారేణ నోఽస్మాకం కల్యాణాయ ఆసీత్ స సంపూర్ణస్తవ కుక్షిం గత ఇతి. తవ దఃఖనాశే కో వా సందేహః. (43)

**టీ॥** దేవకిని ఉద్దేశించి చెప్పుచున్నారు 'దిష్ట్యా' అని. మా క్షేమము కొఱకు, భవస్య - ప్రపంచోత్పత్తికి - అయనః - స్థానభూతుడు - అనియైనను సాక్షాత్తుగ పరమ పురుషుడే నీ గర్భమునందున్నవాడు- అందువలన భయములేదు- అని. అంశతోనైనను ఎల్లవేళల మా రక్షణకొఱకు ఉండును. అతడు సాక్షాత్తుగ నీ గర్భమును పొంది యున్నాడు. ఇది మా భాగ్యము. ఎవడు మత్స్యాది అవతారములతో మా శ్రేయస్సుకొఱకు ఉండెనో అతడు సంపూర్ణుడై నీ గర్భమునగలడు. నీ దుఃఖము తొలగిపోవుననుటలో సందేహము (లేదు) ఏమి? (43)

శ్రీశుక ఉవాచ.

**శ్లో॥** ఇత్యభిష్టూయ పురుషం యద్రూపమనిదం యథా ।
బ్రహ్మేశానౌ పురోధాయ దేవాః ప్రతియయుర్దివమ్ ॥ (44)

**టీ॥** ఇతీతి. యస్య రూపమనిదం. సర్వప్రత్యగ్భూతం. యథా యథావత్ యద్రూపం మాయామనుష్యరూపమిదం. అనిదం. యథా అవిద్యాకృత జన్మ మరణాది రహితం. సర్వసాక్షి ప్రపంచ సృష్టి స్థితి లయ కారణమితి వా. అస్మాన్ వంచయిత్వా. ఏతావిహ స్థాస్యత ఇతి మన్యమానాః. బ్రహ్మేశానౌ పురోధాయ పురతః కృత్వా. దేవాః దివం యయురితి. (44)

శ్రీ మద్భాగవతే, మహాపురాణే దశమస్కంధే,
ద్వితీయోऽధ్యాయః

శ్రీశుక భగవానుడిట్లనెను

**తా॥** "ఓ పరీక్షిన్మహా రాజా ! దేవతలందఱును ఇట్లు అపూర్వమైన ఆ పురుషుని ఎప్పటివలెనే స్తోత్రముచేసి, బ్రహ్మ, శివుడు ముందునడువగా స్వర్గమునకు బోయిరి- (44)

**టీ॥** ఎవని రూపమింతకుముందు లేకుండెనో – (అనిర్వాచ్యుడో) గడచిన అన్నిరూపముల తరువాతి రూపమువాడు – యథా – ఎప్పటి వలెనే – యత్ రూపం – ఇది ఇతః పూర్వము కన్పట్టని మాయామనుష్య రూపము – ఎట్లన అవిద్య వలన ఏర్పడిన జనన మరణాదులు లేనిది. లేక సర్వసాక్షి – ప్రపంచము యొక్క సృష్టి, స్థితి, లయములకు కారణమైనది – మనలను వంచించి వీరలిరువురు ఇచటనే యుండెద రేమో అని అనుకొనుచు బ్రహ్మ శివులను ముందుండునట్లు చేసికొని దేవతలు స్వర్గమునకు పోయిరి. (44)

అని శ్రీమద్భాగవతమున దశమస్కంధమందు
రెండవ అధ్యాయము సమాప్తము.

## తృతీయోఽధ్యాయః

శ్రీశుక ఉవాచ.

**శ్లో॥** అథ సర్వ గుణోపేతః కాలః పరమ శోభనః ।
యర్హ్యేవా జన జన్మర్‌క్షం శాంతర్‌క్ష గ్రహతారకమ్ ॥ (1)

**టీ॥** "తృతీయే నిజరూపేణ సంభూతస్తు హరిస్స్వయం, పితృభ్యాం సంస్తుతో నీతః పిత్రా భీతేన గోకులం." అథేతి మంగళార్థః. యర్హి యదా సర్వగుణోపేతః కాలో బభూవ. తదా దేవక్యాం విష్ణురావిరాసీ దిత్యష్టమశ్లోకేనాన్వయః. పరమ శోభనత్వ మేవాహ.- యర్హీత్యాదినా. అజనాత్ నారాయణాత్. జన్మ యస్య ప్రజాపతేస్తస్య ఋక్షం రోహిణీనక్షత్రం కథంభూతం. శాంతాని ఋక్షాణ్యశ్విన్యాదీని గ్రహాస్సూర్యాదయః తారకాశ్చ యస్మిన్. తత్. (1)

## మూడవ అధ్యాయము.

శ్రీశుక మహర్షి యిట్లనెను

**తా॥** శ్రీమన్నారాయణుని వలన బుట్టిన బ్రహ్మదేవుని నక్షత్రమగు రోహిణి యున్నప్పుడు, తక్కిన నక్షత్రములు, గ్రహములు, తారకలు శాంతములైయుండగా కాలము సర్వశుభగుణములతో కూడి మిక్కిలి మంగళప్రదమైయుండెను. (1)

**టీ॥** మూడవ అధ్యాయమున తన స్వస్వరూపమున నారాయణుడే స్వయముగ జన్మించుటయు తలిదండ్రులగు దేవకీ వసుదేవులచేత స్తోత్రము చేయబడుటయు, భయపడిన తండ్రిచేత గోకులమునకు గొంపోబడుటయు వర్ణింపడినది. యర్హి - ఎప్పుడు - సర్వగుణోపేతః సకల శుభగుణములతోకూడి, కాలః - సమయము - బభూవ - అయ్యెనో - అప్పుడు దేవకి యందు విష్ణువు ప్రాదుర్భవించెనని ఎనిమిదవ శ్లోకముతో అన్వయము. 'యర్హి' అనిమొదలగు ఈ శ్లోకముచే మిక్కిలి శుభ లక్షణములు గలదనియే చెప్పుచున్నాడు. అజనాత్ - నారాయణుని వలన - జన్మ యస్య - ఎవని జన్మమో ఎట్టిది? శాంతములైన అశ్విన్యాది నక్షత్రములు, సూర్యాది గ్రహములు, తారకలును దేని యందు గలవో అది - (1)

**శ్లో॥** దిశః ప్రసేదుర్గగనం నిర్మలోడు గణోదయమ్ ।
మహీ మంగళ భూయిష్ఠ పురగ్రామ వ్రజాకరా ॥ (2)

**తా॥** దిక్కులు ప్రసన్నములయ్యెను. నిర్మలమైన ఆకాశమున నక్షత్రముల సమూహములు ఉదయించెను. పట్టణములు, పల్లెలు, గోపాలకుల యిండ్లు మున్నగు వానితో భూమి, శుభప్రదముగ నుండెను.(2)

**టీ॥** దిశ ఇతి. యర్థ్వీతి సర్వత్రానుషంగః. నిర్మలానాముడు గణానా ముదయో యస్మిన్ తత్తథా. మంగళభూయిష్ఠాః పురాదయో యస్యాం సా. (2)

**టీ॥** 'యర్థ్వీ' అను మాట అంతటను చేరును. స్వచ్ఛమైన నక్షత్ర సమూహముల ఉదయము దేని యందో అది అట్లు – పట్టణములు మొదలగునవి శుభములతోనిండి ఏది కలదో అది – భూమి.(2)

**శ్లో॥** నద్యః ప్రసన్నసలిలాః హ్రదా జలరుహశ్రియః ।
ద్విజాళి కులసన్నాద స్తబకా వన రాజయః. ॥ (3)

**తా॥** నదులు ప్రసన్నములైన నీటితో ప్రవహించుచుండెను. సరస్సులు తామరల సిరితో కళకళలాడుచుండెను. అడవుల సమూహములు, పక్షుల గుంపుయొక్కయు, తుమ్మెదల గుంపుల యొక్కయు కిలకిలా రావముల యొక్కయు ఝుంకారముల యొక్కయు ధ్వనులతోను, పూల గుత్తుల తోను నిండి యుండెను.(3)

**టీ॥** నద్య ఇతి. జలరుహాణాం శ్రీః శోభా యేషాం తే. ద్విజాళి కులానాం సన్నాదా యేషు తే స్తబకా యాసు తాః. (3)

**టీ॥** తామర పువ్వుల సిరి–సౌందర్యము వేని యుందు గలదో అవి 'జలరుహశ్రియః'. పక్షుల, తుమ్మెదల సమూహముల సునాదములు ఏ పూలగుత్తుల మీద గలవో అట్టివి గలవి వన రాజులు. (3)

శ్లో॥ వవౌ వాయుస్సుఖ స్పర్శః పుణ్య గంధవహ శ్శుచిః ।
అగ్నయశ్చ ద్విజాతీనాం శాంతాస్తత్ర సమేధితాః ॥ (4)

తా॥ పరిమళ భరితమైనదియు, పరిశుభ్రమైనదియు, శరీరమునకు హాయి నిచ్చునది యునైన గాలి వీచెను. అచట బ్రాహ్మణుల యొక్క అగ్నులు శాంతములై వెలుగుచుండెను.(4)

టీ॥ వవావితి. సమేధితాః సమ్యక్ దీప్తా బభూవురిత్యర్థః. సమింధతేతి పాఠే అడభావ ఆర్షః. (4)

టీ॥ సమేధితాః - చక్కగా దీప్తిమంతములయ్యెనని యర్థము. 'సమింధతాః' అను పాఠమున ఆడాగమము ఆర్షము.(4)

శ్లో॥ మనాంస్యాసన్ ప్రసన్నాని సాధూనా మసురద్రుహామ్ ।
జాయమానేఽ జనే తస్మిన్నేదు ర్దుందుభయో దివి ॥ (5)

తా॥ కంసాది రాక్షస వృత్తులకు వ్యతిరిక్తులగు సత్పురుషుల మనస్సులు ఆనందభరితములయ్యెను. పుట్టుకయే లేని భగవానుడు పుట్టబోవు ఆ శుభ సమయము నందు ఆకాశమున దేవతలు దుందుభులను మ్రోగించిరి. (5)

టీ॥ మనాంసీతి. అసురద్రుహాం కంసాదివ్యతిరిక్తానాం. సర్వ ప్రాణినాం దేవానాం చేతి. సర్గే తు విశేషమాహ.- జాయమాన ఇతి. అజనే జాయమానే జనార్దనే ఉదయోన్ముఖే సతి. ఆపన్నః ప్రసన్నో యస్మిన్ సమయే తస్మిన్. (5.6)

టీ॥ అసుర ద్రుహాం - కంసాదులకు వ్యతిరేకులైన వారి యొక్క- సర్వ ప్రాణుల యొక్క దేవతల యొక్కయు అని - శ్రీకృష్ణ ప్రాదుర్భావమున విశేషమును చెప్పుచున్నాడు. 'జాయమానే' అనుచు- అజనే జాయమానే-నారాయణుడు ఉదయించుటకు సిద్ధపడి యుండగా- ఆపన్నులైన వారిని అనుగ్రహించు వాడు ఉదయించుటకు సిద్ధపడిన సమయమునందు - (5,6)

**శ్లో॥** జగుః కిన్నర గంధర్వాస్తుష్టువు స్సిద్ధచారణాః ।
విద్యాధర్యశ్చ ననృతురప్సరోభిస్సమం ముదా ॥ (6)

**తా॥** కిన్నరులు, గంధర్వులు పాడు చుండిరి. సిద్ధులు, చారణులు స్తుతింపుచుండిరి. విద్యాధర స్త్రీలు అప్సరలతోగూడి సంతోషముగా నాట్యము చేయుచుండిరి. (6)

**శ్లో॥** ముముచుర్మునయో దేవా స్సుమనాంసి ముదాన్వితాః ।
మందం మందం జలధరా జగర్జురను సాగరమ్ ॥ (7)

**తా॥** మునులు, దేవతలు సంతోషముతో పూవులను గురిపించిరి. సముద్రము ననుసరించుచు వర్షామేఘములు మెలమెల్లగా గర్జింప సాగెను. (7)

**టీ॥** ముముచురితి. అనుసారం. (7)

**టీ॥** అనుసాగరం – సాగర ధ్వనిని అనులక్షించి – మెల్లగా గర్జించెను – అని. (7)

**శ్లో॥** నిశీథే తమ ఉద్భూతే జాయమానే జనార్దనే
దేవక్యాం దేవరూపిణ్యాం విష్ణుస్సర్వగుహాశయః
ఆవిరాసీద్యథా ప్రాచ్యాం దిశీందురివ పుష్కలః ॥ (8)

**తా॥** సర్వప్రాణులయొక్క బుద్ధిగుహలలో నుండువాడగు విష్ణుదేవుడు దేవరూపిణియగు దేవకియందు, రాత్రి చీకటియైన పిదప శ్రీకృష్ణుడుగ – శ్రేయస్కరుడగు చంద్రుడు తూర్పుదిక్కునందువలె – అవతరించెను. (8)

**టీ॥** తమసా ఉద్భూతే ఘనతమసి నిశీథే. దేవక్యామితి. యథా యథావత్. ఐశ్వరేణైవ రూపేణ. (8)

**టీ॥** దట్టమైన చీకటిగల రాత్రియందు. యథా – ఎప్పటివలెనే ఈశ్వర సంబంధమైన రూపముతోనే – (8)

**శ్లో॥** తమద్భుతం బాలకమంబుజేక్షణం
చతుర్భుజం శంఖ గదాద్యుదాయుధమ్ ।
శ్రీవత్సలక్ష్మం గళ శోభి కౌస్తుభం
పీతాంబరం సాంద్ర పయోద సౌభగమ్ ॥ (9)

**టీ॥** తమితి. తం అద్భుతం బాలకం వసుదేవ ఐక్షతేతి ద్వితీయ శ్లోకస్థేనాన్వయః. అద్భుతత్వే హేతుగర్భవిశేషణాని అంబుజేక్షణమిత్యాదీని శ్రీవత్స లక్ష్మ లక్షణం యస్య గళేన శోభతే గళశోభి కౌస్తుభో యస్మిన్. (9)

**తా॥** తామరరేకుల వంటి కన్నులుగల వాడును, నాలుగు భుజములు గలవాడును, శంఖము, గద మొదలగు పైకెత్తిన ఆయుధములు గలవాడును. శ్రీవత్స లాంఛనుడును, కంఠమునందు శోభించు కౌస్తుభ రత్నము గలవాడును, పీతాంబరము ధరించియున్నవాడును, దట్టమైన మేఘములను బోలిన శ్యామల వర్ణముతో సుందరమైనవాడు అగు ఆశ్చర్యకరమగు ఆ బాలకుని – (వసుదేవుడు చూచెను అని తరువాతి శ్లోకమున) (9)

**టీ॥** ఆ అద్భుతమైన బాలకుని వసుదేవుడు చూచెను అని రెండవ శ్లోకమునందలి అంశముతో అన్వయము. అద్భుతత్వమునకు కారణములగు విశేషణములు. తామరలవంటి కన్నులు గలవానిని, (మొదలగునవి) శ్రీవత్సము యొక్క గుర్తుతోడి లక్షణమెవరికో అట్టి వానిని శ్రీవత్సలక్ష్మం. ఎవని గళము చేత కౌస్తుభరత్నము శోభించునో అట్టి వానిని – (9)

**శ్లో॥** మహార్హ వైదూర్య కిరీట కుండల
త్విషా పరిష్వక్త సహస్ర కుంతలమ్ ।
ఉద్దామ కాంచ్యంగద కంకణాదిభి
ర్విరోచమానం వసుదేవ ఐక్షత ॥ (10)

**తా॥** అమూల్యములైన వైదూర్యములతో పొదగబడిన కిరీటము యొక్కయు, కుండలముల యొక్కయు కాంతిచేత ఆవరింపబడిన అసంఖ్యాకములైన వెంట్రుకల వలయములు గలవాడును, వైభవమును చాటుచున్న మొలనూలు, బాహుపురులు, కంకణములు మొదలగు వానితో ధగధగలాడుచున్నవాడునునైన ఆ అద్భుతబాలుని వసుదేవుడు చూచెను. (10)

**టీ॥** మహార్హేతి. పరిష్వక్త సహస్ర కుంతలం కిరీట కుండలాదీనాం. త్విషా కాంత్యా స్ఫురదపరిమిత కేశమిత్యర్థః. (10)

**టీ॥** కిరీట కుండలాదుల కాంతిచేత ఆవరింపబడిన కారణముగ స్ఫురించుచున్న అపరిమితమైన వెంట్రుకల చుట్టలు అని యర్థము. (కుటిలాలక సమూహములు) (10)

**శ్లో॥** స విస్మయోత్ఫుల్ల విలోచనో హరిం
సుతం విలోక్యానక దుందుభిస్తదా ।
కృష్ణావతారోత్సవ సంభ్రమోఽస్పృశ
న్ముదా ద్విజేభ్యోఽయుత మాప్లుతో గవామ్ ॥ (11)

**తా॥** ఆ వసుదేవుడు ఆశ్చర్యముతో విప్పారిన కన్నులు గలవాడై తన కుమారుడగు శ్రీమన్నారాయణుని చూచి, కృష్ణుడవతరించినాడను సంబరముతో, మిక్కిలి సంతోషముతో స్నాతుడై బ్రాహ్మణులకు దానము చేయుటకొఱకు ఆవుల సమూహమును స్పృశించెను. (మనసా దానమిచ్చెను) (11)

**టీ॥** సఇతి. విస్మయేనోత్ఫుల్లే వికసితే విలోచనే యస్య సః. గవామయుతమస్పృశత్ మనసా దత్తవాన్. కంస నిగృహీతస్య దానాసంభవాత్. స్పృష్టౌ హేతుః కృష్ణావతారేతి. ముదా ఆప్లుతో వ్యాప్తః స్నాత ఇతి. (11)

**టీ॥** ఆశ్చర్యముచేత వికసించిన కన్నులు గలవాడై – ఆవుల సమూహములను స్పృశించెను. మనస్సుతో దానము చేసెను. కంసుని చేత నిర్బంధింపబడి యుండుట చేత దానము సంభవము కానందు వలన–కృష్ణావతారోత్సవ సంభ్రమము, ఆవులను స్పృశించుటకు కారణము. ముదా – (సంతోషముతో) ఆప్లుతః – వ్యాప్తుడు, స్నాతుడు అని.(11)

శ్లో॥ అథైవ మస్తాదవధార్య పూరుషం
పరం నతాంగః కృతధీః కృతాంజలిః ।
స్వరోచిషా భారత సూతికా గృహం
విరోచయంతః గతభీః ప్రభావవిత్. (12)

టీ॥ అథేతి. కృతధీః శుద్ధ బుద్ధిః. (12)

<u>వసుదేవ ఉవాచ.</u>

శ్లో॥ విదితోఽసి భవాన్ సాక్షాత్పురుషః ప్రకృతేః పరః ।
కేవలానుభవానంద స్స్వరూప స్సర్వబుద్ధి దృక్ ॥ (13)

టీ॥ వసుదేవః ప్రథమం పుత్రబుద్ధ్యాపశ్యన్ తాం పరిత్యజ్యాహ– విదిత ఇతి. అహో విదితోఽసీతి. కథం విదితోఽస్మి. భవాన్ ప్రకృతేః పరః పురష ఇతి. నను కిమత్రాశ్చర్యం? పురుషస్య ప్రకృతేరన్యత్వా దేవేత్యత ఆహ. –సాక్షాదితి. ప్రత్యక్షత ఇత్యర్థః. నన్వక్షిసన్నికృష్టం ప్రత్యక్షత ఉపలభ్యతే. కిం చిత్రమత ఆహ. –కేవలేతి. కేవలశ్చా సావనుభవశ్చ ఆనందశ్చ. తదేవ స్వరూపం యస్య సః. శ్రు. "ఆనందో బ్రహ్మేతి వ్యజానాది" త్యాది శ్రుతేః. కించ సర్వబుద్ధిదృక్. న హ్యేవం భూతో

తా॥ ఓ పరీక్షిన్మహారాజా! శ్రీకృష్ణుని ప్రభావమును తెలిసినవాడు, అందుచే భయముపోయినవాడును అయిన వసుదేవుడు పరిశుద్ధమగు బుద్ధిగలవాడై, తలవంచి అంజలి ఘటించి, తదేక చిత్తుడై, తన కాంతి చేత ప్రసూతి గృహమును ప్రకాశింపజేయుచు ఆ పరమ పురుషుగు భగవానుని ఇట్లు స్తుతించెను. (12)

టీ॥ కృతధీః – శుద్ధమైన బుద్ధి గలవాడై. (12)

<u>వసుదేవుడిట్లనెను</u>

తా॥ "నీవు ప్రకృతి కంటె అతీతుడవగు సాక్షాత్తు పరమేశ్వరుడవుగ తెలియబడుచున్నావు. నీవు కేవలము అనుభవ రూపుడవు. ఆనంద స్వరూపుడవు. సర్వబుద్ధులకు సాక్షివి. (13)

టీ॥ వసుదేవుడు మొదట కృష్ణుని 'కొడుకు' అను భావమున చూచి, అట్టి బుద్ధిని వదలి చెప్పుచున్నాడు. అహో! తెలయబడుచున్నావు అని. ఎట్లు తెలియబడుచున్నావు. నీవు ప్రకృతికన్న భిన్నుడవైన (శ్రేష్ఠుడవైన) పురుషుడవు అని. ఏమిటి ఈ ఆశ్చర్యము? ప్రకృతి కంటె పురుషుని యొక్క అన్యత్వము వలననే అని చెప్పుచున్నాడు. ప్రత్యక్షత్వము వలననే అని యర్థము. కాని కన్నుల యొక్క సన్నికర్ష వలననే కద ప్రత్యక్షత లభ్యమగును? ఏమి చిత్రమో యిట చెప్పుచున్నాడు – ఇతడు కేవలుడు

దృశ్యో భవతీత్యర్థః. (13)

అనుభవ రూపుడు – ఆనందరూపుడు – అట్టి స్వరూపమే కలవాడు. "ఆనందమే బ్రహ్మము అని తెలియవలెను" అను శ్రుతి వలన తెలియు చున్నది. అదియును గాక అతడు సర్వబుద్ధి సాక్షి–ఇట్టి వాడు కన్నులకు కన్పట్టువాడుగ నుండడు అని యర్థము. (13)

**శ్లో॥** స ఏవ స్వ ప్రకృత్యేదం సృష్ట్వాగ్రే త్రిగుణాత్మకమ్ ।
తదను త్వం హ్యప్రవిష్టః ప్రవిష్ట ఇవ భావ్యసే ॥ (14)

**తా॥** అట్టి వాడవగు నీవు త్రిగుణాత్మకమగు ఈ నీ ప్రకృతి చేత మొదట దీనిని (ప్రపంచమును) సృష్టించి, వెనువెంటనే దానిలో నీవు ప్రవేశింపకున్నను, ప్రవేశించిన వాని వలె నిరూపించుచున్నావు. (14)

**టీ॥** నను దేవకీ జఠరే ప్రవిష్టస్య కిమియమితి స్తుతిః క్రియతే ఇత్యత ఆహ.–స ఏవేతి. స ఏవ ఉక్త స్వరూప ఏవ. త్వం న దేవకీ జఠరే ప్రవిష్ట ఇత్యర్థః. నను విశ్వం సృష్ట్వా తదేవానుప్రవిష్టస్య కిమేతద్బహు. అత ఆహ. స్వప్రకృత్యేతి. స్వమాయయా ఇదం సృష్ట్వా తదను. త్వమను ప్రవిష్ట ఏవేతి. నను తర్హి కథం శ్రుత్యోచ్యతే. శ్రు. "తత్సృష్ట్వా తదేవానుప్రావిశది"?తి అత ఆహ–ప్రవిష్ట ఇవేతి, యథా జలే ఆకాశం ప్రతిబింబితం చంద్ర సూర్యాదినా. అప్రవిష్టమేవ ప్రవిష్టమివ తద్వత్. భావ్యసే నిరూప్యసే. ప్రత్యక్షతో వా సద్రూపేణ లక్ష్యే ప్రవిష్ట ఇవ లక్ష్యసే. (14)

**టీ॥** దేవకి యొక్క గర్భమునుందు ప్రవేశించిన కృష్ణుని ఈ చర్య ఏమిటి? అని ప్రశ్నించుచు స్తుతింపుచున్నాడు – ఇట్లు స్తుతింపుచున్నా డేమి అని దాని గుఱించి చెప్పుచున్నాడు. స ఏవ – లోగడ చెప్పబడిన స్వరూపముగలవాడవే అగు నీవు దేవకీ గర్భమునందు ప్రవేశింపలేదు. విశ్వమును సృష్టించి దానిలోననే ప్రవేశించిన వానికి ఈ ప్రపంచము నందలి బహుత్వమేమి? చెప్పుచున్నాడు. 'స్వప్రకృత్యా' అని . తన మాయ చేతనే ఇది అంతయును సృష్టించి వెంటనే నీవు దాన ప్రవేశించితివనియే! అయినచో 'దానిని సృష్టించి దానినే ప్రవేశించెను' అను శ్రుతి వ్యాక్యముచే ఎట్లు చెప్పబడినది? ఇట చెప్పుచున్నాడు. 'ప్రవిష్ట ఇవ' అని. చంద్ర సూర్యాదులతో ఆకాశము, నీటిలో

ప్రతిబింబించి - ప్రవేశింపకున్నను - ప్రవేశించినట్లుగ ఎట్లు కనపడునో అట్లే భావ్యసే - నిరూపించెదవు, సాక్షాత్తుగ గాని, పదార్థ మాత్ర దర్శనమున గాని ప్రవేశించిన వాని వలె కన్పట్టుచున్నావు - (14)

**శ్లో॥** యథే మేవికృతా భావాస్తథా తే వికృతైస్సహ ।
నానావీర్యాః పృథగ్భూతా విరాజం జనయంతి హి ॥ (15)

**తా॥** అవికృతములగు మహత్తుమొదలగు కారణతత్త్వములు వివిధ ములైన శక్తులు కలిగి వేఱువేఱుగ నుండియును, షోడశ వికారములతో కూడి ఈ బ్రహ్మాండమును సృష్టించుచున్నవి గదా! అట్లే. (15)

**టీ॥** అత్ర దృష్టాంతః-యథేతి. ఇమే అవికృతాభావాః మహదాదయో యథా తథేతి దృష్టాంతం వివృణోతి-తే వికృతైరితి. తే వికృతైః షోడశ వికారైస్సహ సన్నిపత్య. విరాజం జనయంతి. సన్నిపతనే హేతుః. యతః. పృథగ్భూతాస్సంతో నానా వీర్యాః విశిష్టకార్యసమర్థాః న భవంతి. (15)

**టీ॥** ఇచటనొక దృష్టాంతము-ఈ అవికృతములైన మహత్తు మొదలగు భావములు ఎట్లో అట్లే అని దృష్టాంతమును వివరించు చున్నాడు. అవి - వికృతైః - పదునాఱు వికారములతో కూడి విరాట్టును సృష్టించుచున్నవి - కలయికకు కారణము-అవి విడివిడగ నుండిన యెడల వివిధములగు విశిష్ట కార్యములను చేయుటకు సమర్థములు కాజాలవు - (15)

**శ్లో॥** సన్నిపత్య సముత్పాద్య దృశ్యంతేఽనుగతా ఇవ ।
ప్రాగేవ విద్యమానత్వాన్న తేషామిహ సంభవః ॥ (16)

**తా॥** ఇట్లు మహదాదులు వికృతులతో ఐక్యభావమునుపొంది విరాట్టును సృష్టించి, వానిలో ప్రవేశించినట్లు కనబడుచున్నవి. విరాట్ సృష్టికి పూర్వమే వాని ఉనికి, ఉండియే యున్నందున అవి మఱల పుట్టుట సంభవింపదు. (16)

**టీ॥** అతః. సన్నిపత్యేతి. ఏవం సముత్పాద్య అనుగతాః ప్రవిష్టా ఇవ దృశ్యంతే. న పునః ప్రవిష్టాః కుతః ఉత్పత్తేః ప్రాగేవ కారణతయా విద్యమానత్వాన్న తేషామిహ సృష్టేః కార్యే పశ్చాత్సంభవః ప్రవేశ ఇతి. (16)

**టీ॥** అందువలన–కూడి అని–ఈ విధముగ సృష్టించి–ప్రవేశించిన వానివలె కనబడుచున్నవి. (విరాట్ సృష్టితరువాత) మఱల ప్రవేశించి యుండలేదు. ఎందువలన? విరాట్ సృష్టికి పూర్వమే అవి కారణ రూపముతో ఉండియే యున్నవి. ఇక సృష్టి తరువాత సృష్టి కార్యము నందు వానికి మఱల 'సంభవించుట' జరుగదు ప్రవేశము' అని.(16)

**శ్లో॥** ఏవం భవాన్ బుద్ధ్యనుమేయ లక్షణై
ర్గ్రాహ్యై ర్గుణై స్సన్నపి తద్గుణా గ్రహః ।
అనావృతత్వా ద్బహిరంతరం న తే
సర్వస్య సర్వాత్మన ఆత్మ వస్తునః ॥ (17)

**తా॥** ఈ విధముగ నీవు బుద్ధిచేత ఊహింపదగిన లక్షణములతోను, ఇంద్రియములచేత గ్రహింపదగిన లక్షణములతోను ఉన్నను. వానిని నీవు గ్రహించుటలేదు. ఆవరణములేని వాడవగుట వలన సకలమవు, సర్వాత్మకుడవు. ఆత్మపదార్థమవు అయిన నీకు 'బయట', 'లోపల' అనునవి లేవు. (17)

**టీ॥** దార్ష్టాంతినే అతిదిశతి.–ఏవం భవానితి. నను యద్యహమ ప్రచ్యుతస్వరూప ఏవ కారణతయా కార్యేషు వర్తే. తర్హి, తేష్వింద్రియై ర్గృహ్యా మాణేషు మమ గ్రహణం కిం నాస్తీత్యత ఆహ.–బుద్ధ్యనుమేయ లక్షణైరితి. బుద్ధ్యా రూపాది జ్ఞానేన. అనుమేయం లక్షణం స్వరూపం యేషాం తైః గుణైరింద్రియైః. గ్రాహ్యైర్గుణైస్సహ సన్నపి వర్తమానోఽపి తద్గుణాగ్రహః తైర్గుణైస్సహ న గృహ్యాసే. అయం భావః. న హి గ్రాహ్యైస్సహ భావమాత్రం గ్రహణే కారణం కింతు. ఇంద్రియాణాం శక్తిః. సా చ కార్యైక సమధిగమ్యా. యథా కార్యమేష కల్ప్యతే అతో యథా చక్షుషా రూపగ్రహణే రసాదిగ్రహణం నాస్తి. తథైవ విషయ

**టీ॥** దార్ష్టాంతికమునందు సామ్యమును చెప్పుచున్నాడు. "ఏవం భవాన్" అని. అవినాశి రూపుడనగు నేను ఒకవేళ కారణత్వముతో కార్యములందు ప్రవేశింతుననియే అనుకొనుము – అయినచో నన్ను గ్రహించుచున్న ఆ ఇంద్రియములయందు నా యొక్క ప్రవేశము ఏమియు లేదు. అదియే చెప్పుచున్నాడు 'బుద్ధ్యనుమేయ లక్షణైః' అని – బుద్ధ్యా – బుద్ధితో సహేతుకముగ నిర్ణయింపబడిన జ్ఞానముచేత. అనుమానింపదగిన లక్షణము – స్వరూపము వేనికో అట్టి గుణైః – ఇంద్రియములచేత – గ్రహింపదగిన ఇంద్రియములతో కూడి యున్న ప్పటికిని – వర్తించుచున్నప్పటికిని – తద్గుణాగ్రహః – ఆ ఇంద్రియము

గ్రహణే త్వద్గ్రహణమపీతి. అవిషయత్వేన చ గ్రహణానర్హత్వముక్తమేవ ఆమ్రగ్రాహ దృష్టేస్తన్నివిష్ట పీత రక్త రూపాది గ్రహణ సామర్థ్యం. న మాధుర్యాది గ్రహణ సామర్థ్యం. రసస్య సహవర్తమానత్వేఽపి అచక్షుర్విషయత్వాత్. సర్వబుద్ధిదృగిత్యత్ర ఏవం తావత్ప్రాగేవ విద్యమానత్వాత్ప్రవేశో నాస్తీత్యుక్తం. కించ పరిచ్ఛిన్నస్య నీడే పక్ష్యాదేరివ ప్రవేశో భవేత్. తవ త్వనావృతత్వాదపరిచ్ఛిన్నత్వేన బహిరంతరే చ భేదో నాస్తి కుతః ప్రవేశ ఇత్యాహ–అనావృతత్వాదితి. అనావృతత్వే హేతూనాహ.–సర్వస్యేతి. న హి సర్వస్వరూపస్య అన్యదావారకమస్తి సర్వాత్మనః న హ్యేకేనావృతోఽన్యస్యాత్మా భవేత్. ఆత్మవస్తున ఇతి ఆత్మవస్తునశ్చేతి హేతుద్వయం. అత సాతత్యగమన ఇత్యస్మాత్ అతతీతి వ్యాప్నోతీత్యాత్మా. న హి వ్యాపకస్యావరణం ఘటతే. యథా వస్తునః పరమార్థస్య అవస్తునా ఆవరణం న ఘటత ఇత్యర్థః తస్మాత్తవాంతర్యామి శయాఽపి ప్రవేశో న ముఖ్యోఽస్తి కుత స్తరాం గర్భే ప్రవేశః. అతః కేవలానుభవానందస్వరూప ఏవ త్వం విదితోఽసీత్యాశ్చర్యం.మమ భాగ్యమిత్యర్థః.(17)

లతో కూడ గ్రహింపబడక ఉన్నావు. భావమిది. ఇంద్రియములతో కూడి కాదు. భావమాత్రము. గ్రహించుటయందు కారణము కాని ఇంద్రియముల శక్తి. అదియును కార్యమును మాత్రము తెలిసికొనజాలియున్నది. ఈ కార్యము కల్పింపబడియున్నప్పుడు – అందువలన. కన్నుతో రూపమును గ్రహించునప్పుడు, రుచిమున్నగువానిని గ్రహించుట యండదు. అట్లే విషయమును గ్రహించునప్పుడు నిన్ను గ్రహించుటకూడ అని. ఇక అవిషయత్వము చేత గ్రహణము యొక్క అనర్హత్వము చెప్పబడియే యున్నది. మామిడి పండును గ్రహించు (ఆస్వాదించు) దృష్టికి ఆ పండునందలి పచ్చదనము, ఎఱ్ఱదనము, దాని రూపము మొదలగునవి గ్రహించు సామర్థ్యము కలదే కాని దాని తీపి మొదలగు రుచులను గ్రహించు సామర్థ్యము కాదు, రసముతో కూడియే యున్నప్పటికిని రంగు రూపముల వలె రసగ్రహణమనునది కన్నుల విషయము కానందు వలన, 'సర్వబుద్ధిదృక్' అని యిచట ఈ విధముగ ఇంతకు ముందే ఉండి ఉండుట చేత ప్రవేశించుట అనునదిలేదని ముందేచెప్పబడినది. కాని పరిచ్ఛిన్నునకైనచో గూటి లోనికి పక్షులు మున్నగునవి చేరునట్లు ప్రవేశము అనునది జరుగును. ఇక నీకు (భగవానునకు) ఆవరణము లేనందు వలన – అపరిచ్ఛిన్నత్వముచేత – అంతర్బహిస్సుల భేదము లేదు. ఇక ప్రవేశమెక్కడిది? అని, 'అనావృతత్వాత్' ఇత్యాదిగ

చెప్పుచున్నాడు. అనావృతత్వమునకు కారణములు చెప్పుచున్నాడు. 'సర్వస్య' అని. అన్ని రూపములు తానేయైన వానికి వేఱొక ఆవరణము లేదు.(హద్దుగ కప్పియుంచునది లేదు) సర్వాత్మకునకు ఒక దానితో ఆవరింపబడి యున్ననే కదా ఇంకొక దానికి ఆత్మయగుట - ఆత్మ వస్తునః - ఆత్మ, వస్తునః అని రెండు కారణములు, అందువలన - ఎల్లప్పుడు పొందియుండునది అను అర్థము వలన - అతతీతి - వ్యాప్నోతీత్యాత్మా - వ్యాపించియుండునది ఆత్మ - (1) వ్యాపించి యుండు దానికి ఆవరణము ఘటింపదు (2) ఇక వస్తువునకు పరమార్థ వస్తువునకు - అనగా 'అస్తువునకు' కూడ ఆవరణము ఘటింపదు అని యర్థము. అందువలన నీకు అంతర్యామిగ ప్రవేశించుట కూడ ముఖ్యమైనది కాదు. ఇట్టితఱి గర్భమునందు ప్రవేశించుట ఎటనుండి? అందుచేత నీవు కేవలము అనుభవానందస్వరూపుడవు మాత్రమే. ఆ విధముగనే నీవు తెలియబడు వాడవగుట ఆశ్చర్యము. నా భాగ్యమని అర్థము. (17)

**శ్లో॥** య ఆత్మనో దృశ్య గుణేషు సన్నితి
వ్యవస్యతే స్వ వ్యతిరేకతోఽబుధః ।
వినానువాదం న చ తన్మనీషితం
సమ్యగ్యతస్త్యక్త ముపాదదత్పుమాన్ ॥ (18)

**తా॥** ఆత్మకంటె అన్యమైనవియు, ఆత్మకు సంబంధించినవియునైన దృశ్య పదార్థములయందు అవి సత్యములను నిశ్చయముతో నుండు వాడు అవిద్వాంసుడు. వాచారంభణము వలన లేక లెస్సగా విచారింపక పోవుట వలన ఇట్లు జరుగును. అట్టి అవివేకియగు మనుష్యుడు -

**టీ॥** నన్వేతద్ధేతుచతుష్టయం ప్రపంచస్యా వస్తుత్వే ఘటేత. తత్తు న సంభవతి. సత్త్వేన ప్రతీతేరిత్యాశంక్యాహ–య ఇతి.ఆత్మనో దృశ్యేషు గుణేషు. దేహాదిషు స్వ వ్యతిరేకతః ఆత్మవ్యతిరేకేణ. పృథక్ సన్నయం దేహాదిరితి వ్యవస్యతే నిశ్చినోతి యః పుమాన్. సః. అబుధః అవిద్వాన్. వ్యతిరేకాదర్శనాత్. కించ. మనీషితం విచారితం సత్. దేహాదిసర్వం యతః వినానువాదం వాచారంభణమాత్రం వినా న సమ్యగ్భవతి. అతః అవస్తుత్వేన త్యక్తం బాధితమేతత్. వస్తుబుద్ధ్యా ఉపాదదత్ స్వీకుర్వన్. అబుధ ఇత్యర్థః. (18)

సత్య వస్తువులు కావని విడిచిపెట్టబడిన వానిని సద్వస్తువులుగ స్వీకరించును. (18)

**టీ॥** ఈ నాలుగు కారణములు ప్రపంచము యొక్క అవస్తుత్వము నందు ఘటించును. సత్యముగా ప్రతీతమగు చున్నందువలన అటుల సంభవింపదేమో అని ఆశంకించుకొని చెప్పుచున్నాడు. ఆత్మ వలన ఏర్పడిన దృశ్యవస్తువు లందు, గుణములందు – దేహము మొదలగు వానియందు – స్వవ్యతిరేకతః – ఆత్మకంటె వ్యతిరిక్తముగ –పృథక్ – వేరైన దానిని సత్+అయం – ఇది సత్యపదార్థము – దేహాదిః ఇతి – దేహము మొదలగునవి అని – వ్యవస్యతే – నిశ్చయించు ఏ పురుషుడుగలడో అతడు అవిద్వాంసుడు. సత్యమునకు వ్యతిరేకముగ కన్పట్టక పోవుట వలన–ఇక మనీషితం – సత్పదార్థ విచారణ చేసినచో – దేహము మొదలగు సర్వము – వినానువాదం – వాచారంభణ మాత్రము కాకున్నచో – సత్పదార్థము కాకుండును. అందువలన అవస్తు భావనతో వదలివేయబడిన లేక సత్పదార్థ లక్షణములకు బాధకమైన వానిని వస్తు బుద్ధిచేత గ్రహింపుచున్నవాడు అబుధుడు – అజ్ఞాని అని యర్థము. (18)

**శ్లో॥** త్వత్తోఽ స్య జన్మస్థితి సంయమాన్విభో!
వదంత్యనీహా దగుణా దవిక్రియాత్ ।
త్వయీశ్వరే బ్రహ్మణి నో విరుధ్యతే
త్వదాశ్రయత్వాదుపచర్యతే గుణైః ॥ (19)

**తా॥** ఓప్రభూ! ఈ జగత్తుయొక్క సృష్టి, స్థితి, లయములు నీ వలననే జరుగుచున్నవి. సంకల్ప, ప్రయత్న, క్రియా రహితుడవు, సత్త్వ రజస్తమో గుణాది రహితుడవు ఎట్టి వికారములకు లోనుకాని వాడవునగు నీ వలననే ఇది అంతయు జరుగుచున్నదని అందురు. బ్రహ్మవు ఈశ్వరుడవగు నీయందు ఇది విరుద్ధమేమియు కాదు. ఏలయన కర్తలగు గుణముల చేతనగు సృష్ట్యాది కర్తృత్వాదులన్నియు నిన్ను ఆశ్రయించి సేవించుచున్నవి. (19)

**టీ॥** ఏవం పరమేశ్వరాద్దృశ్యస్య సద్వ్యతిరేకేణాసత్త్వముక్తం పరమేశ్వరోపాదానత్వాదపి తద్వ్యతిరేకేణాసత్వమిత్యాహ.–త్వత్త ఇతి. న చైవం సత్యపి వికారిత్వమిత్యాహ.–అనీహాదితి. అగుణత్వాదనీహత్వం. తతో వికారిత్వమిత్యర్థః. సన్ననీహత్వే కథం కర్తృత్వం కర్తృత్వే వా కుతః అవికారిత్వం? తత్రాహ– త్వయీశ్వర ఇతి. బ్రహ్మత్వాదవికారిత్వం. ఈశ్వరత్వాత్కర్తృత్వమితి. నన్వేతదపి విరుద్ధమేవ నేత్యాహ.– తదాశ్రయత్వాదితి. గుణైః కర్తృభిః త్వయి సృష్ట్యాదికర్తృత్వముపచర్యతే. గుణాశ్రయత్వాత్. యథా భృత్యకృతం రాజనీతి. (19)

**టీ॥** ఈ విధముగ 'దృశ్యమునకు' సత్తారాహిత్యము వలన పరమేశ్వరుని కంటె 'అసత్తు'గా చెప్పబడినది. పరమేశ్వరునికి ఉపాదాన కారణత్వమున్నను ప్రపంచమును అతనికి వ్యతిరేక లక్షణము కలిగియున్నందున అసత్యమని చెప్పుచున్నాడు. ఇట్లుకాకున్నను వికారిత్వమని చెప్పుచున్నాడు. గుణములు లేనందు వలన కోరిక లేకపోవుట – దాని వలన వికారిత్వమని యర్థము. అయినను సంకల్పములేనిదే కర్తృత్వమెట్లు? లేక కర్తృత్వమునందు అవికారిత్వము ఎట్లు? 'త్వయీశ్వర' అని చెప్పుచున్నాడు. బ్రహ్మత్వము వలన అవికారిత్వము – ఈశ్వరత్వమువలన కర్తృత్వము. అని, ఇదికూడ విరుద్ధమే! – కాదని చెప్పుచున్నాడు, 'తదాశ్రయత్వాత్' అని, గుణైః – కర్తలచేత – నీ యందు సృష్టి మొదలగు కర్తృత్వము సేవించుచున్నది,

గుణముల యొక్క ఆశ్రయత్వము వలన - సేవకులచే పాటింపబడు కృత్యము రాజునందు ఆరోపింపబడునట్లు. (19)

**శ్లో॥** స త్వం త్రిలోక స్థితయే స్వమాయయా
బిభర్షి శుక్లం ఖలు వర్ణమాత్మనః ।
సర్గాయ రక్తం రజసోప బృంహితం
కృష్ణం చ వర్ణం తమసా జనాత్యయే ॥ (20)

**తా॥** ముల్లోకములను రక్షించు నిమిత్తము, నీ మాయ చేత, నీదేయగు సత్వగుణ చిహ్నమైన తెల్లని వర్ణమును, సృష్టి కొఱకు రజోగుణ చిహ్నమైన ఎఱుపు వర్ణమును, పుట్టియున్న వారిని లయింప జేయుట కొఱకు తమోగుణ చిహ్నమైన నల్లని వర్ణమును ధరింతువు.(20)

**టీ॥** ఏవం భూతస్యైవ యథా విశ్వ స్థితి సర్గలయార్థం త్రివర్ణ గుణావతారాః. ఏవమయం భూభారాపనయనార్థమవతారభావ ఇతి జ్ఞాతవ్య ఇత్యాహ - శ్లోకద్వయేన. సత్యమితి. (20)

**టీ॥** విశ్వము యొక్క సృష్టి, స్థితి, లయముల కొఱకు మూడు వర్ణముల గుణముల తోడి అవతారములు ఇట్టి వానివే. భూ భారమును తొలగించుట కొఱకే ఈ అవతారభావమని భావమని చెప్పుచున్నాడు. 'సత్వం' అని మొదలుగ రెండు శ్లోకములతో. (20)

**శ్లో॥** త్వమస్య లోకస్య విభో రిరక్షిషు
ర్గృహేఽవతీర్ణోఽసి మమాఖిలేశ్వర ।
రాజన్య సంజ్ఞా సుర కోటి యూథపై
ర్నిర్వ్యూహ్యమానా నిహనిష్యసే చమూః (21)

**తా॥** ప్రభూ! ఈ లోకమును రక్షించు నిచ్ఛగలవాడవై నాయింట అవతరించితివి, సర్వజగదీశ్వరా! రాజన్యుల నామములచేత కోట్లకోట్ల రాక్షస సమూహములు ఎవరెవరుగలరో వారిచేత చలింపజేయబడిన (ప్రేరేపింపబడిన) సేనలను నీవు సంహరింతువు. (21)

టీ॥ త్వమితి. రక్షితుమిచ్ఛురవతీర్ణోఽసి. కృష్ణేన వర్ణేన. అతస్సాధూనాం రక్షణార్థం. రాజన్యసంజ్ఞాః యే అసురకోటియూథపాః తైర్నిర్వ్యూహ్యమానాః తతస్తతశ్చాల్యమానాః. చమూః సేనాః నిహనిష్యసే సంహరిష్యసి. (21)

టీ॥ రక్షించు కోరికగలవాడవై అవతరించితివి. నీల వర్ణముతో - సాధుజనుల రక్షణకొఱకు - రాజన్య సంజ్ఞగల ఏ రాక్షసకోటి సమూహములు గలవో - వానిచేత అచ్చటచ్చట కదలింపబడిన సైన్య సమూహములను సంహరింతువు. (21)

శ్లో॥ అయం త్వసభ్యస్తవ జన్మ నౌ గృహే
శ్రుత్వాగ్రజాం స్తు న్యవధీ త్సురేశ్వర! ।
స త్వేఽవతారం పురుషైః సమర్పితం
శ్రుత్వాధునైవాభి సరత్యుదాయుధః ॥ (22)

తా॥ ఓ సురేశ్వరా! నీవు మా యింట జన్మింతువని విని ఈ దుష్టుడగు కంసుడు నీ అన్నలను వధించియున్నాడు. నీవు అవతరించిన సమాచారముకూడ చారులు చెప్పగా విని ఆతడు ఆయుధమును ఎత్తి పట్టుకొని ఇప్పుడే పరుగెత్తుకొని వచ్చును. (22)

టీ॥ కింతు తథాప్యప్రమత్తేన త్వయా భవితవ్యమిత్యాహ.- అయమితి. అసభ్యః ఖలః. సమర్పితం కథితం. (22)

టీ॥ కాని అట్లైనను నీవు భవిష్యత్తునను అప్రమత్తుడవై ఉండవలెనని చెప్పుచున్నాడు. 'అయం' అని - అసభ్యః - దుష్టుడు - సమర్పితం - చెప్పబడినది. (సమాచారము సమర్పింపబడినది.) (22)

శ్రీశుక ఉవాచ.

శ్లో॥ అథైన మాత్మజం వీక్ష్య మహాపురుషలక్షణమ్ ।
దేవకీ తముపాధావత్కంసాద్భీతా శుచిస్మితా ॥ (23)

శ్రీశుక మహర్షి యిట్లనెను

తా॥ "మహా పురుషుని లక్షణముతో శోభించు తన కొడుకునుచూచి దేవకి - కంసుని వలన భయపడియున్న దేవకి - స్వచ్ఛమైన చిఱునవ్వు గలదియై - కృష్ణుని స్తుతించెను. (23)

టీ॥ అథేతి. ఉపాధావత్ అస్తౌత్. (23)

టీ॥ ఉపాధావత్ - స్తుతించెను. (23)

దేవక్యువాచ

శ్లో॥ రూపం యత్త త్ప్రాహు రవ్యక్త మాద్యం
బ్రహ్మజ్యోతి ర్నిర్గుణం నిర్వికారమ్ ।
సత్తామాత్రం నిర్విశేషం నిరీహం
నిత్యం సాక్షా ద్విష్ణు రధ్యాత్మ దీపః (24)

టీ॥ దేవకీ కించిద్విజ్ఞాపయితుం త్వయి భయశంకైవ తావన్నాస్తీతి శ్లోకచతుష్టయేనాహ–రూపమితి. యత్తత్ కిమపి రూపం వస్తు. ప్రాహుః వేదాః కిం తద్వస్తు తదాహ.–అవ్యక్తం. అత్ర హేతుః. ఆద్యం కారణం. కిం పరమాణవః? న. బ్రహ్మ బృహత్. కిం ప్రధానం? న. జ్యోతిః. చేతనం. కిం వైశేషికాణామివ జ్ఞానగుణకం? న–నిర్గుణం కిం–మీమాంసకానామివ జ్ఞాన పరిణామి? న. సత్తామాత్రం, తర్హి కిం సామాన్యం న – నిర్వికారం. కిం పుష్కరా క్షాదీనామివ శక్తివిక్షేపణ పరిణామి? న– నిరీహం. సన్నిధి, మాత్రేణ కారణం. ఏవం భూతం కిమపి కార్యం కల్ప్యం. యద్వస్తు. స ఏవ సాక్షాత్త్వం విష్ణురితి. అపరోక్షశ్చేత్యాహ.–అధ్యాత్మదీప ఇతి. బుద్ధ్యాది కార్యకారణ సంఘాత ప్రకాశక ఇత్యర్థః. అథవా అవ్యక్తం న కేనాపి ప్రమాణేన వ్యజ్యత

దేవకి యిట్లనెను.

తా॥ అవ్యక్తము, (వ్యక్తముకానిది) ఆద్యం (మొట్ట మొదటిది) బ్రహ్మ, (బృహత్) జ్యోతిః (ప్రకాశ రూపము) నిర్గుణం (సత్వరజస్తమోగుణములులేనిది) నిర్వికారం (వికారము చెందనిది) సత్తామాత్రం (కేవలము ఉనికిగలది) నిర్విశేషం (ఎట్టి విశేషము లేనిది) నిరీహం (ఎట్టి కోరికయులేనిది) నిత్యం (త్రికాలములలో నుండునది) అని యిట్లు ఏ విష్ణుతత్త్వమును గుఱించి వేదములు ఉద్ఘోషించు చుండునో అట్టితత్త్వముగల నారాయణుడు ఆత్మ జ్ఞానదీపము. (24)

టీ॥ దేవకి ఇంచుక విజ్ఞాపన చేయుటకు నీ అవతారమునందునిక భయముగాని అనుమానముగాని లేనేలేదని నాలుగు శ్లోకములతో చెప్పుచున్నాడు. యత్ తత్ – ఏ రూపముగల వస్తువైనను దేనినిగూర్చి వేదములు చెప్పినవో అది – ఆవస్తువేదో దానినిగూర్చి చెప్పుచున్నాడు. అవ్యక్తం – దానికి కారణము – ఆద్యం – కారణము – పరమాణువులా? కాదు – బ్రహ్మ – గొప్పది ప్రధానమా – కాదు . జ్యోతిః – చేతనము, వైశేషికులు చెప్పిన జ్ఞానగుణమా, కాదు – నిర్గుణం–మఱి మీ మాంసకులు చెప్పెడు జ్ఞానపరిణామియా? కాదు, సత్తామాత్రము – అయినచో సామాన్యమా? కాదు–నిరీహం – సన్నిధి మాత్రము చేతనే కారణము. ఇట్టిది – ఏ కార్యమునైనను కల్పింపదగిన

ఇత్యవ్యక్తం. కథం? ఉత్పత్త్యా తావన్న వ్యజ్యత ఇత్యాహ. –ఆద్యం సర్వస్య కార్యస్యాద్యం. అనాదీత్యర్థః. తథా బ్రహ్మ జ్యోతిః. నిర్గుణం. నిర్వికారం ఇతి చతుర్భిః పదైః నిర్దేశేన చ. ప్రకాశేన చ. గుణేన చ వికారేణ చ వ్యక్తిం నిరాకరోతి. తథా సత్తామాత్రమితి విశేషేణ. నిర్విశేషమితి సామాన్యేన. నిరీహమితి క్రియయా చ. వ్యక్తిం నిరాకరోతి. అన్యత్స మానం. ఏవంభూతస్య తవ. న భయశంకేతి భావః. (24)

ఏ వస్తువుకలదో అట్టి సాక్షాత్ విష్ణువువు నీవు అని. అపరోక్షమనినచో చెప్పుచున్నాడు. అధ్యాత్మ దీపమని. బుద్ధి మొదలగు కార్య కారణ సమూహములను ప్రకాశింపజేయునదని యర్థము. లేక అవ్యక్తం – ఎవరిచేనైనను ప్రామాణికముగ తెలిసికొనబడజాలనిది. ప్రమాణముతో వ్యక్తముకానిది అవ్యక్తము. ఎట్లు? పుట్టుట అను ప్రక్రియచేత వ్యక్తము కానిది అని చెప్పుచున్నాడు ఆద్యం – కార్యరూపములన్నింటికంటె మొదటిది. అనాది అని యర్థము. అట్లే బ్రహ్మ, జ్యోతి, – నిర్గుణం – నిర్వికారం అని నాల్గు పదములచేత నిర్దేశించుటచే కూడ – ప్రకాశముచేకూడ – గుణముతోను, వికారముతోను ప్రకటమగుటను నిరాకరించుచున్నాడు. మరియు విశేషించి సత్తా మాత్రము అని. సామాన్యముచే నిర్విశేషముఅని, క్రియచేత నిరీహము అని అభివ్యక్తిని నిరాకరించుచున్నాడు. తక్కినది సమానము. ఇట్టి నీ రాకతో భయశంకాదులు తొలగినవని భావము. (24)

**శ్లో॥** నష్టే లోకే ద్వి పరార్ధావసానే
మహాభూతేష్వాది భూతం గతేషు ।
వ్యక్తేఽ వ్యక్తం కాలవేగేన యా తే
భవానేకః శిష్యతే శేష సంజ్ఞః ॥ (25)

**తా॥** రెండు పరార్ధముల అవసానమునందు (పరార్ధమనగా కోటి కోట్ల మానవ సంవత్సరముల కాలము) అనగా బ్రహ్మ ప్రళయము నందు, పంచ మహాభూతములు అహంకారమందును, అహంకారము మహత్తత్త్వమునందును, మహత్తత్త్వము ప్రకృతియందును లీనమై లోకము నష్టమైపోగా నీ వొక్కడవే మిగిలియుందువు. అందుచేతనే నీకు శేషుడు (మిగిలిన వాడు) అను నామము కలిగెను. (25)

**టీ॥** కించ. మహాప్రళయేఽ ప్యవశిష్యమాణస్య కుతో భయమిత్యాహ – నష్ట ఇతి. చరాచరే లోకే మహాభూతేషు లీనేషు తేష్వపి. ఆదిభూతం భూతసూక్ష్మం. ప్రవిష్టేషు. తస్మిన్నపి వ్యక్తే అవ్యక్తం ప్రధానం ప్రాప్తే అవశేషాత్మకే ప్రధానే. సంజ్ఞా ప్రజ్ఞా యస్య. ఏవమపి లీనమిదమస్తి పశ్చాదేవముద్బోధనీయమితి సః అశేషసంజ్ఞః శేషసంజ్ఞ ఇతి వా.(25)

**టీ॥** అదియుగాక మహా ప్రళయమున కూడ మిగిలియుండు వానికి భయమెక్కడిది? అని చెప్పుచున్నాడు. చరాచర లోకమునందు పంచ మహాభూతములు లీనము కాగా వాని యందును భూతసూక్ష్మములు ప్రవేశింపగా, వాని యందును అహంకారము దాని యందును మహత్తు లయముకాగా, అవశేషాత్మకమైన ఆ మహత్తునందు సంజ్ఞా – ప్రజ్ఞ ఎవనికో – ఇట్లుకూడ ఇది లీనమైయున్నది – తరువాత ఇట్లు తెలిసికొనదగినది అని – అతడు మిగిలియున్న వాడుగ సంజ్ఞ పొందిన వాడు, లేక అశేష సంజ్ఞ గలవాడని యో. (25)

**శ్లో॥** యోఽ యం కాలస్తస్య తేఽ వ్యక్త బంధో
చేష్టామాహుశ్చేష్టతే యేన విశ్వమ్ ।
నిమేషాది ర్వత్సరాంతో మహీయాం
స్తత్వేశానం క్షేమధామ ప్రపద్యే ॥ (26)

**తా॥** ఓ ప్రకృతి బంధూ! నిమిషము నుండి సంవత్సరము వఱకును అనేక విభాగములతో వ్యాపించయున్న ఏ గొప్పదైన నీ కాలము గలదో దాని కదలిక వలన విశ్వమంతయును చైతన్యవంతమగుచుండుటచే ఆ కాలమును చేష్టయందురు. అట్టి కాలతత్త్వమునకు ఈశ్వరుడవు, సమస్త జగత్తునకు కల్యాణ స్థానభూతుడువు అగు నిన్ను శరణు పొందుచున్నాను. (26)

**టీ॥** కించ య ఇతి. ఏవం ప్రళయహేతుః యోఽ యం కాలః. అవ్యక్తబంధో ప్రకృతిప్రవర్తకః తస్య ప్రళయావధి భూతస్య తే తవ చేష్టాం లీలాం చేష్టతే విపరివర్తతే పునః పునర్వత్సరావృత్త్యా మహీయాన్

**టీ॥** ఈ విధముగ ప్రళయమునకు కారణమైన ఏ యీ కాలమున్నదో – ఓ ప్రకృతిని ప్రవర్తింపజేయువాడా! –అట్టి ప్రళయమే అవధిగాగల కాలమునకు నీ లీలను ప్రవర్తింపజేయుటను – మఱల మఱల

ద్విపరార్ధ రూపః యస్య చేష్టామాహుః తం. త్వా త్వాం. క్షేమధామ అభయస్థానం ప్రపద్యే శరణం వ్రజే. (26)

సంవత్సరావృత్తితో రెండు పరార్ధముల రూపమున గల ఆ మహత్తర కాలము యొక్క చేష్టయందురో అట్టికాలమును, నిన్ను - అభయ స్థానమగు నిన్ను - శరణు పొందుదును. (26)

**శ్లో॥** మర్త్యో మృత్యువ్యాలభీతః పలాయన్
లోకాన్ సర్వాన్ నిర్భయం నాధ్య గచ్ఛత్ ।
త్వ త్పాదాబ్జం ప్రాప్య యదృచ్ఛయాద్య
స్వస్థః శేతే మృత్యు రస్మాదపైతి ॥ (27)

**తా॥** ఆద్యా! మనుష్యుడు మరణమను సర్పము వలన భయము నొందుచు అన్ని లోకములకు పరుగులెత్తుచు ఎచ్చటను నిర్భయముగ నుండుటలేదు. నీ పాదపద్మములను పొంది ఇక సుకృత విశేషమున స్వస్థుడై దిగులు దీరి నిదురించుచున్నాడు. అతని నుండి మృత్యువే దూరముగ పారిపోయినది. (27)

**టీ॥** క్షేమధామత్వమేవాహ - మర్త్య ఇతి. లోకాన్ ప్రతి యదృచ్ఛయా. కేనాపి భాగ్యోదయేన. అత్ర ఛందోభంగ ఆర్షః. హే ఆద్య. (27)

**టీ॥** క్షేమ స్థానమును గూర్చియే చెప్పుచున్నాడు. లోకములను గూర్చి యాదృచ్ఛికముగ, ఏదియో భాగ్యవిశేషమున - ఇచ్చట ఛందోభంగము ఆర్షము. ఓ ఆద్యా! (సంబోధన) (27)

**శ్లో॥** స త్వం ఘోరాదుగ్రసేనాత్మజాన్నః
త్రాహి త్రస్తాన్ భృత్య విత్రాసహాసి ।
రూపం చేదం పౌరుషం ధ్యాన ధిష్ణ్యం
మా ప్రత్యక్షం మాంస దృశాం కృషిష్ఠాః ॥ (28)

**తా॥** ఉగ్రసేనుని కుమారుడు, భయంకరుడునైన కంసుని వలన దిగులు చెందియున్న మమ్ము రక్షింపుము. నీవు నీ సేవకుల విశేష భయములను తొలగించువాడవు. ఈ నీ పురుషరూపము ధ్యానమునకు ఆస్పదమైయ్యుంది. భౌతిక చక్షువులతో చూచువారికి ప్రత్యక్షము చేయకుము. (28)

**టీ॥** ప్రస్తుతం విజ్ఞాపయతి–స ఇతి. భృత్యానాం విత్రాసం హంతీతి భృత్యవిత్రాసహా భృత్యవిదితి వా ఛేదః. పౌరుషం ఐశ్వర్యం ధ్యానధిష్ణ్యం ధ్యానాస్పదం. మాంసదృశాం మాంసచక్షుషాం. మాదృశామిత్యపి పాఠాంతరం ప్రత్యక్షం మా కృథాః. (28)

**టీ॥** స్తుతించిన వానిని ప్రార్థించుచున్నాడు. భృత్యుల యొక్క విశేష త్రాసమును హననము చేయువాడు కావున 'భృత్య విత్రాసహా' అని. భృత్యవిత్ అనియు పదచ్ఛేదము. పౌరుషం – ఈశ్వర సంబంధమైనది – ధ్యానధిష్ణ్యం – ధ్యానమునకు ఆస్పదమైనది. మాంస దృశాం – మాంసపు కన్నులు గలవారికి – 'మాదృశాం ' అని కూడ పాఠాంతరము. ప్రత్యక్షము చేయకుము. (28)

**శ్లో॥** జన్మ తే మయ్యసౌ పాపో మా విద్యాన్మధుసూదన ।
సముద్విజే భవద్ధేతోః కంసాదహమధీరధీః ॥ (29)

**తా॥** ఓ మధుసూదనా! నీ జన్మ నా గర్భమునందైనదని పాపియగు ఈ కంసునకు తెలియకుండుగాక, నీ కారణముగా నేను అధైర్య బుద్ధిగల దాననై మిక్కిలి భయపడుచున్నాను. (29)

**టీ॥** జన్మేతి. భవత ఏవ హేతోర్నిమిత్తభూతాత్కంసాత్సముద్విజే బిభేమి యతః. అధీరధీః అధీరచిత్తా. (29,30)

**టీ॥** నీ నిమిత్తముగనే కంసునివలన ఉద్విజే – భయపడుచున్నాను. ఎందువలననగా అధీర ధీః – ధైర్యములేని మనస్సుగలదానినైతిని. (29,30)

**శ్లో॥** ఉపసంహర విశ్వాత్మన్నదోరూప మలౌకికమ్ ।
శంఖ చక్ర గదా పద్మ శ్రియా జుష్టం చతుర్భుజమ్ ॥ (30)

**తా॥** శంఖ, చక్ర, గదా, పద్మముల శోభతో కూడిన నాలుగు భుజముల నీ ఈ అలౌకిక రూపమును, ఓ విశ్వాత్మా! అంతర్భాగమున నుపసంహరించుకొనుము. (30)

శ్లో॥ విశ్వం యదేతత్స్వతనౌ నిశాంతే
యథావకాశం పురుషః పరో భవాన్ ।
బిభర్తి సోఽయం మమ గర్భజోఽభూ
దహో నృలోకస్య విడంబనం మహత్ ॥ (31)

టీ॥ కిమిత్యుపసంహర్తవ్య ఏవం భూతేన పుత్రేణ తవ బృహతీ శ్లాఘా స్యాదితి చేత్తత్రాహ-విశ్వమితి. నిశాంతే ప్రళయావసానే. యథావకాశం అసంకోచతః. అసంభావితత్వాత్. అపహాస్యత్వైవ స్వాదిత్యర్థః. (31)

తా॥ పరమ పురుషుడవైన నీవు ప్రళయకాలమునందు ఈ విశ్వము నంతయును నిస్సంకోచముగ నీశరీరమునందు భరించియుందువు. అట్టి నీవు నా గర్భమున జన్మించినవాడవయితివి. ఓహో! ఇది మానవలోకమునకు గొప్ప చమత్కారము గదా! (31)

టీ॥ ఏమని ముగింపవలెను, ఇట్టి పుత్రునితో నీకు గొప్ప మెప్పు కలుగుననినచో - దాని గూర్చి చెప్పుచున్నాడు. నిశాంతే - ప్రళయ సమాప్తి సమయమున - యథావకాశం - సంకోచము లేకుండ - అసంభవత్వము వలన - అపహాస్యత్వము వలననైనను కాబోలునని యర్థము. (31)

శ్రీభగవానువాచ.

శ్లో॥ త్వమేవ పూర్వసర్గేఽభూః పృశ్నిః స్వాయంభువే సతి ।
తదాఽయం సుతపా నామ ప్రజాపతిరకల్మషః ॥ (32)

టీ॥ చతుర్భుజ రూపేణావిర్భావే. కారణం తావ దాహ-చతుర్భిః శ్లోకైః. త్వమితి. పూర్వసర్గే ప్రథమజన్మని. అభూః ఆసీః.పృశ్నిర్నామ. స్వాయంభువే. స్వాయంభువమన్వంతరే. తదా అయం వసుదేవః (32)

శ్రీభగవానుడిట్లనెను

తా॥ "పూర్వ సృష్టియందు, స్వాయంభువ మన్వంతరమున నీవు పృశ్నియను నామమున నుంటివి. ఈ వసుదేవుడు సుతపుడను పేరున స్వచ్ఛమైన హృదయముగల ప్రజాపతిగ నుండెను. (32)

టీ॥ నాలుగు భుజముల రూపమున (తాను) జన్మించుటకు కారణమును నాలుగు శ్లోకములలో చెప్పుచున్నాడు. పూర్వసర్గే - మొదటి జన్మయందు - అభూః - ఉంటివి. పృశ్నియను పేరున - స్వాయంభువే - స్వాయంభువ మన్వంతరమునందు తదా అయం (అప్పుడు) ఈ వసుదేవుడు. (32)

**శ్లో॥** యువాం వై బ్రహ్మణాదిష్టౌ ప్రజాసర్గే యదా తతః ।
సన్నియమ్యేంద్రియ గ్రామం తేపాతే పరమం తపః ॥ (33)

**తా॥** మీరు సంతానోత్పత్తిని కోరినప్పుడు బ్రహ్మచేత ఆదేశింపబడి, ఇంద్రియ సమూహములను నిరోధించి దుష్కరమైన తపస్సు చేసితిరి. (33)

**టీ॥** యువామితి. తేపాతే దుష్కరం తపః కృతవంతౌ యువాం. (33–35)

**టీ॥** తేపాతే – మీరు దుష్కరమైన తపస్సు చేసితిరి.– (33–35)

**శ్లో॥** వర్ష వాతా తప హిమ ఘర్మ కాల గుణా నను ।
సహమానౌ శ్వాసరోధ వినిర్ధూత మనో మలౌ ॥ (34)

**తా॥** వాన, గాలి, ఎండ, మంచు, వేడిమి మొదలగు కాల గుణములను సహించుచు ప్రాణాయామముల చేత మనోమాలిన్యములను కడిగి వేసితిరి. (34)

**శ్లో॥** జీర్ణ పర్ణానిలా హారా వుప శాంతేన చేతసా ।
మత్తః కామానభీప్సంతౌ మదారాధన మీహతుః ॥ (35)

**తా॥** ఎండిపోయిన ఆకులు, గాలి ఆహారముగ స్వీకరించుచు, ప్రశాంతమనస్కులై, నా నుండి అభీష్టములను తీర్చుకొనగోరుచు నన్నే ఆరాధింప గోరు చుండిరి. (35)

**శ్లో॥** ఏవం వాం తప్యతోర్భద్రే తపః పరమ దుష్కరమ్ ।
దివ్య వర్ష సహస్రాణాం ద్వాదశేయుర్మదాత్మనోః ॥ (36)

**తా॥** ఓ కల్యాణీ! ఈ విధముగ మీ యొక్క మిక్కిలి దుష్కరమైన తపస్సుతో – నాయందే చిత్తమునిలిపియుంచిన మీ తపస్సుతో పన్నెండు వేల దివ్య వత్సరములు గడచిపోయెను. (36)

**టీ॥** ఏవమితి. తప్యతోః ఆచరతోః ఈయుః గతాని మదాత్మనోః మచ్చిత్తయోః.(36)

**శ్లో॥** తదా వాం పరితుష్టోఽహ మమునా వపుషానఘే ।
తపసా శ్రద్ధయా నిత్యం భక్త్యాచ హృది భావితః ॥ (37)

**టీ॥** తదేతి. అమునా వపుషా. (37)

**శ్లో॥** ప్రాదురాసం వరదరాడ్యువయోః కామదిత్సయా ।
వ్రీయతాం వర ఇత్యుక్తే మాదృశో వాం వృతస్సుతః ॥ (38)

**టీ॥** ప్రాదురాసమితి. ప్రాదుర్భూతోఽస్మి. వరదరాట్ వరదేషు శ్రేష్ఠ ఇత్యర్థః. తేన సకృద్వరేణ చ వారం వారమావిర్భావకారణముక్తం మాదృశః మాయా సదృశః కామస్య దిత్సయా దాతుమిచ్ఛయా. (38)

**శ్లో॥** అజుష్ట గ్రామ్యవిషయా వనపత్యా చ దంపతీ ।
న వవ్రాథేఽపవర్గం మే మోహితౌ మమ మాయయా ॥(39)

**టీ॥** తప్యతోః - తపమాచరించు వారి - ఈయుః - గడచిపోయెను. మదాత్మనోః - నా యందే చిత్తము గల యిరువురి యొక్క. (36)

**తా॥** శ్రద్ధా భక్తులతో హృదయమున నన్నే భావించుచున్న మీ తపస్సుతో మిక్కిలి సంతసించి నేను ఇదే శరీరముతో - (37)

**టీ॥** అమునా వపుషా - ఇదే శరీరముతో - (37)

**తా॥** వరములిచ్చుటలో శ్రేష్ఠుడనగు నేను మీ కోరిక నిచ్చుటకొఱకు మీ ముందు ప్రకటమైతిని. వరమును కోరుదురు గాక అని అనగానే నన్ను బోలిన కొడుకు కావలెనని కోరితిరి. (38)

**టీ॥** ప్రకటమైతిని. వరదరాట్ - వరములిచ్చువారిలో శ్రేష్ఠుడని యర్థము. అందుచే ఒక్కసారి కోరినను మాటి మాటికి పుట్టుటకు కారణము చెప్పబడినది - మాదృశః - నాతో సమానుడు కామస్య దిత్సయా - ఇచ్చు కోరికచేత - (38)

**తా॥** ఇంతవఱకు మీకు గ్రామ్యములగు విషయ భోగములతో సంబంధములేదు. సంతానము కూడలేనివారు. అట్టి మీ యిరువురును నానుండి మోక్షమును కోరుకొనలేదు. నా మాయ చేతనే (మోక్షేతరమగు సంతానమును వరమడిగితిరి.) (39)

**టీ॥** అజుష్టేతి. మే మత్తోఽపి. యువాం అపవర్గం. న వవ్రాథే న వృతవంతౌ.(39)

**టీ॥** మే – నా నుండి కూడ – మీరు మోక్షమును – న వవ్రాథే – కోరుకొనలేదు. (39)

**శ్లో॥** గతే మయి యువాం లబ్ధ్వా వరం మత్సదృశం సుతమ్ ।
గ్రామ్యాన్ భోగానభుంజాథాం యువాం ప్రాప్త మనోరథౌ ॥(40)

**తా॥** నావంటి కుమారుని కనుటయను వరమునుపొంది కోరిక తీరినవారై, నేను పోయిన తరువాత, గ్రామ్య భోగముల ననుభవింప జొచ్చితిరి. (40)

**టీ॥** గత ఇతి. వరం దత్వా మయి గతే.. (40, 41)

**టీ॥** వరం దత్వా మయి గతే – వరమిచ్చి నేను అటునుండి వెడలి పోయిన తరువాత. (40,41)

**శ్లో॥** అదృష్ట్వాన్యతమం లోకే శీలౌదార్య గుణైస్సమమ్ ।
అహం సుతో వామభవం పృశ్నిగర్భ ఇతి శ్రుతః ॥ (41)

**తా॥** శీలము, ఔదార్యము, గుణము అనువానిలో నాతో సమానమైన ఇతురుని ఎవ్వరిని చూడనందువలన నేనే మీకు కొడుకునైతిని. పృశ్నిగర్భుడని పేరు వడసితిని. (41)

**శ్లో॥** తయోర్వాం పునరేవాహ మదిత్యామథ కశ్యపాత్ ।
ఉపేంద్ర ఇతి విఖ్యాతో వామనత్వాచ్చ వామనః ॥ (42)

**తా॥** భగవానుడు మఱల ఇట్లు చెప్పెను. "రెండవజన్మలో అదితివియైన నీయందు కశ్యపుడైన వసుదేవుని వలన మీకు మఱల పుత్రునిగ జన్మించి ఉపేంద్రుడని ప్రసిద్ధిపొందితిని. కుఱుచగ నున్నందున నన్ను 'వామనుడు' అనియు పిలిచిరి. (42)

**టీ॥** తయోరితి. అదిత్యాం కశ్యపాద్వామన ఆసేతి. యత్తదపి తద్రూపయోర్యువయోరహమేవ పునరాస మిత్యర్థః. (42, 43)

**టీ॥** అదితియందు కశ్యపుని వలన వామనుడు కలిగెను, అని. అప్పుడును ఆ రూపమునున్న మీకు నేనే తిరిగి కుమారుడనైతినని యర్థము. (42,43)

**శ్లో॥** తృతీయేఽస్మిన్ భవేఽహం వై తేనైవ వపుషానఘే! ।
జాతో భూయస్తయోరేవ సత్యం మే వ్యాహృతం సతి ॥ (43)

**తా॥** ఓ సతీ! పుణ్యచరితా! ఈ నీ మూడవ జన్మలో కూడ అదే శరీరముతో మఱల మీ దంపతులకు కుమారుడుగ పుట్టితిని, నా వాక్కు సర్వదా సత్యమేయగును. (43)

**శ్లో॥** ఏతద్వాం దర్శితం రూపం ప్రాగ్జన్మ స్మరణాయ మే ।
నాన్యథా మద్భవం జ్ఞానం మర్త్యలింగేన జాయతే ॥ (44)

**తా॥** నా పూర్వ జన్మమును స్మరించుకొఱకు ఈ రూపమును చూపితిని, లేకున్నచో సాధారణ మనుష్యునిగ జన్మించి యున్నచో 'నేనే' జన్మించిన జ్ఞానము కలుగదు గదా! (44)

**టీ॥** ఏతదితి. ప్రాక్ ప్రథమం. తావత్. ఏతద్రూపం మే జన్మేతి. స్మరణాయ జ్ఞానాయ. దర్శితం. మద్భవం మద్విషయం అనంతరం త్వదిచ్ఛయా. బాలోఽపి భవిష్యామీతి భావః. (44)

**టీ॥** ప్రాక్ – మొదట – తావత్ ఏతద్రూపం – ఈ రూపము వఱకు – నా జన్మయే అని స్మరించుట కొఱకు, జ్ఞానము కొఱకు చూపబడినది. మద్భవం – నా విషయమున తరువాత మీ ఇచ్ఛచేత బాలకునిగ కూడ కాగలనని భావము. (44)

**శ్లో॥** యువాం మాం పుత్ర భావేన బ్రహ్మ భావేన చాసకృత్ ।
చిన్తయంతౌ కృతస్నేహౌ యాస్యేథే మద్గతిం పరామ్ ॥ (45)

**తా॥** మీరు నన్ను పుత్రభావముతోను, నిరంతరము బ్రహ్మ భావనతోను, చింతన చేయుచు, వాత్సల్య స్నేహము నెఱపుచు ఉండుట ద్వారా నా సద్గతి యగు నిఃశ్రేయసమును పొందెదరు. (45)

**టీ॥** నను త్వయి ప్రసన్నేఽపి కథమావయోః పునః పునర్జన్మేతి. అతః పరం న భవిష్యతీత్యాహ. యువామితి. (45 - 48)

**టీ॥** నీవు అనుగ్రహించిన వాడవైనను, మాకు మఱల జన్మ ఎట్లు కలిగెను? అని. అందుకు, తరువాత మఱల (పుట్టుక) ఉండదని 'యువాం' అని చెప్పుచున్నాడు. (45-48)

**శ్లో॥** యది కంసాద్బిభేషి త్వం తర్హిమాంగోకులం నయ ।
యశోదాయాశ్చ తాం కన్యాం మన్మాయా మా నయ ద్రుతమ్॥ (46)

**తా॥** ఒకవేళ కంసుని వలన నీవు భయపడుచున్నచో నన్ను వెంటనే గోకులమునకు తీసికొని పొమ్ము. అట్లే యశోద నుండి కన్యయగు నా మాయను ఇటుకుఁదెమ్ము. (46)

**శ్లో॥** స్వయం స్యుర్వివృతా ద్వారో యమునా చ సుదుస్తరా ॥ (47)

**తా॥** ద్వారములు స్వయముగ తెఱువబడియే యున్నవి. కాని యమునా నది దాటుటకు శక్యము కానిదై యున్నది. (47)

*శ్రీశుక ఉవాచ.*

**శ్లో॥** ఇత్యుక్త్వా సీద్ధరిస్తూష్ణీం భగవానాత్మ మాయయా ।
పిత్రోః స్సంపశ్యతోస్సద్యో బభూవ ప్రాకృతశ్శిశుః ॥ (48)

*శ్రీశుక మహర్షి ఇట్లనెను*

**తా॥** ఇట్లు చెప్పి కృష్ణుడు మిన్నకుండెను. అటు పిమ్మట అతడు తన మాయచే (తండ్రిని చూచుచు) తండ్రి చూచుచుండగనే అప్పటి కప్పుడు ప్రాకృత శిశువయ్యెను. (48)

**శ్లో॥** తతశ్చ శౌరిర్భగవత్ప్రచోదిత
స్సుతం సమాదాయ స సూతికా గృహాత్ ।
యదా బహిర్గంతుమియేష తర్హ్య జా
యా యోగమాయా జని నంద జాయయా ॥ (49)

**తా॥** అప్పుడు భగవత్ప్రేరితుడైన వసుదేవుడు ప్రసూతి గృహము నుండి తన కుమారుని తీసికొని బయటకు వెడలుటకు సంకల్పించి నప్పుడు, పుట్టుకయే లేని ఏ యోగమాయ గలదో ఆమె, యశోద గర్భము నుండి జన్మించెను. (49)

**టీ॥** తత ఇతి. యది కంసాద్బిభేషి త్వమిత్యాదినా. ప్రథమమేవ భగవతా. ప్రచోదితో వసుదేవః యదా గంతుమైచ్ఛత్. తదైవ. అజాపి యా యోగమాయా. సా నందజాయయా. అజని జాతా. (49)

**టీ॥** 'ఒకవేళ నీవు కంసుని వలన భయపడుచున్నయెడల' అని మొదలగు వాక్యములతో - కృష్ణునిచే ప్రేరేపింపబడి వసుదేవుడు, (గోకులమునకు) పోవుటకు ఇష్టపడెనో అప్పుడే పుట్టుకలేనిదైనను ఏ యోగమాయ గలదో ఆమె యశోద యందు పుట్టెను. (యశోద చేత జన్మను పొందెను.) (49)

**శ్లో॥** తయా హృత ప్రత్యయ సర్వవృత్తిషు
ద్వార్థే ్వషు పౌరేషు చ శాయితేష్వథ ।
ద్వారస్తు సర్వాః పిహితా దురత్యయా
బృహత్కవాటాయ స శృంఖలైః కిల ॥ (50)

**తా॥** ద్వారముల వద్దనుండెడు వారియందును, పౌరులయందును, నిదురించుచుండు వారి యందును గల ఇంద్రియ వృత్తులనన్నింటిని ఆ మాయ హరించి వేసెను. దుర్భేద్యమైన పెద్దపెద్ద తలుపులు, గొళ్లెములతో సహా అన్నియు మూసివేయబడి ఉండెను. (50)

**టీ॥** తయేతి. హృతాః ప్రత్యయార్థాః. సర్వా వృత్తయో యేషాం అథవా హృతాః ప్రత్యయాః అన్యాశ్చ సర్వా వృత్తయో యేషాం జాగ్రతామపి. తథా భూతేషు ద్వార పాలేషు సత్సు. బృహత్కవాటేషు లోహ కీలక యుక్తశృంఖలైః. బృహద్భిః కవాటాదిభిర్దురత్యయా ఇతి వా. (50)

**టీ॥** హృతాః ప్రత్యయార్థాః - లేక - జ్ఞానార్థమైన అవయవము లన్నియు హరింపబడెను. వారి అన్నివృత్తులును - లేక - హృతాః ప్రత్యయాః అన్యాః చ సర్వాః వృత్తయః యేషాం-జాగ్రతామపి. జాగ్రత్తలో నున్నవారివి కూడ ఇతరమైన అన్నివృత్తులును హరింపబడినవి. ఆ విధముగ నున్న ద్వార పాలకుల యందును - బృహత్కవాటేషు లోహ కీలక యుక్త శృంఖలైః - ఇనుప మేకులు గల పెద్ద పెద్ద తలుపుల యందు వేసిన గొళ్లెములతో - లేక పెద్దపెద్ద తలుపులు మొదలగు వానితో నుండుటచేత దాటి పోరానివి అనియు. (50)

**శ్లో॥** తాః కృష్ణ వాహే వసుదేవ ఆగతే
స్వయం వ్యశీర్యంత యథా తమో రవౌ ।
వవర్ష పర్జన్య ఉపాంశు గర్జిత
శ్శేషోఽన్వగాద్వారి నివారయన్ ఫణైః ॥ (51)

**తా॥** కృష్ణుని మోసికొనుచు వసుదేవుడు రాగానే – సూర్యుడు రాగానే చీకటి విడిపోయినట్లు ఆ ద్వారములు తమంతట తామే తెఱచుకొనినవి. మెల్లగ తనలో తాను ఉరుముచు పర్జన్యుడు వర్షించెను. శేషుడు తన పడగలతో ద్వారములందలి అడ్డంకులను తొలగించుచు వసుదేవున నుసరించుచు వెడలెను. (51)

**టీ॥** తా ఇతి. స్వయమేవ వ్యశీర్యంత వివృతా ఇత్యర్థః. రవేర్నిమిత్త భూతాత్. (51)

**టీ॥** స్వయమేవ వ్యశీర్యంత – తమకు తామే తెఱచుకొనెను. రవౌ – సూర్యుడు నిమిత్త భూతుడగుచుండగా – (51)

**శ్లో॥** మఘోని వర్షత్యసకృద్యమానుజా
గంభీర తోయౌఘ జవోర్మి ఫేనిలా ।
భయానకావర్త శతాకులా నదీ
మార్గం దదౌ సింధురివ శ్రియః పతేః ॥ (52)

**తా॥** మాటి మాటికి (తఱచుగా) ఇంద్రుడు వర్షింప జొచ్చెను. యమునానది తన లోతైన నీటి సమూహముల బలిమిచే నేర్పడు అలల వలన నురగతో నిండినదయ్యెను. భయంకరమైన సుడుల సమూహములు గల ఆ ప్రవాహము – అలనాడు శ్రీరామునకు సముద్రము వలె – త్రోవ నిచ్చెను. (52)

**టీ॥** మఘోనీతి. గంభీరో యస్తోయౌఘః తస్య జవేన ఊర్మయః తైః ఫేనిలా. ఫేనవ్యాప్తాః. భయానకైరావర్తశతైర్వ్యాప్తాపి. శ్రియః పతేః సీతాపతేః. (52)

**టీ॥** లోతైన ఏ నీటిసమూహముగలదో – దాని బలముచేత కలుగు తరంగములు. వానిచేత నురుగులు గలది. నురుగుచే వ్యాపించినది. భయానకములైన సుడి గుండములతో వ్యాపించినది కూడ – శ్రియః పతేః – సీతాపతి యగు శ్రీరామునకు – (52)

**శ్లో॥** నందవ్రజం శౌరి రుపేత్య తత్ర తాన్
గోపాన్ ప్రసుప్తానుపలభ్య నిద్రయా ।
శిశుం యశోదా శయనే నిధాయ త
త్సుతాముపాదాయ పునర్గృహానగాత్ ॥ (53)

**తా॥** వసుదేవుడు నందగోకులమునకు చేరి అచ్చట నిద్రచే మత్తు నంది యున్న గోపాలకులను చూచి, తాను తెచ్చిన శిశువును యశోద యొక్క పడక యందు పరుండబెట్టి – ఆమె కుమార్తెను వెంటదీసికొని మఱల తన బందీ, ఇండ్లకుఁబోయెను.(కారాగృహమునకు) (53)

**టీ॥** నంద వ్రజమితి. నిద్రయా అజయా. (53)

**టీ॥** నిద్రయా – అజతో (మాయచేత) (53)

**శ్లో॥** దేవక్యా శయనే న్యస్య వసుదేవోఽథ దారికామ్ ।
ప్రతిముచ్య పదోర్లోహమాస్తే పూర్వవదావృతః ॥ (54)

**తా॥** కారాగృహమునకు చేరి వసుదేవుడు ఆ కన్యను దేవకి పడకపై పరుండబెట్టి, తన పాదములకు ఇనుప సంకెలలు తగిలించుకొని ఎప్పటివలె కారాగృహమున తనను తాను బంధించుకొనియుండెను. (54)

**టీ॥** దేవక్యా ఇతి. ప్రతిముచ్య ముక్త్వా. పదోః పాదయోః లౌహం నిగళం. ఆస్తే స్మ. (54)

**టీ॥** ప్రతిముచ్య – వదలి, – పదోః – పాదములకు – లౌహం నిగళం – లోహపు సంకెళ్లు ఆస్తే స్మ – ఉండెను. (54)

**శ్లో॥** యశోదా నందపత్నీ చ జాతం పరమబుద్ధ్యత ।
న తల్లింగం పరిశ్రాంత నిద్రయాపగత స్మృతిః ॥ (55)

**తా॥** నందుని భార్యయగు యశోద పుట్టిన తన బిడ్డ మిక్కిలి శ్రేష్ఠమైన దని తెలిసికొనెను. కాని మిక్కిలి అలసియున్నందునను, మాయచే మోహితురాలగుట వలనను విస్మృతి వలన తాను కనినది ఆడ శిశువో, మొగ శిశువో తెలిసికొనలేక పోయెను. (55)

**టీ॥** యశోదేతి. జాతం కించిదితి. కేవలం అబుద్ధ్యత. స తు పుత్రః కన్యా చేతి. యోగనిద్రయా చ మోహితేతి. (55)

**టీ॥** జాతం కించిదితి – పుట్టిన శిశువును కొంచెముగ – కేవలం అబుద్ధ్యత – తెలిసికొనుట మాత్రమే చేసెను. (పుట్టుట మాత్రమే తెలిసికొనెను) స తు పుత్రః – కన్యా చేతి – పుత్రుడా పుత్రికయా అని తెలిసికొనలేక పోయెను. యోగనిద్రయా చ మోహితేతి – యోగమాయ చేత మోహితురాలయ్యెను – అని. (55)

**శ్రీ మద్భాగవతే, మహాపురాణే దశమస్కంధే,**
**తృతీయోఽధ్యాయః**

**అని శ్రీమద్భాగవతమున దశమస్కంధమందు**
**మూడవ అధ్యాయము సమాప్తము.**

## చతుర్థోఽధ్యాయః

**శ్రీశుక ఉవాచ.**

**శ్లో॥** బహిరంతః పురద్వారస్సర్వాః పూర్వవదావృతాః ।
తతో బాలధ్వనిం శ్రుత్వా గృహపాలాస్సముత్థితాః ॥ (1)

**టీ॥** – "చతుర్థే చండికావాక్యమాకర్ణ్యాతి భయాకులః, దుర్మంత్ర్యభిహితం మేనే కంసో బాలాది హింసనం" (1)

**శ్లో॥** తే తు తూర్ణముపావ్రజ్య దేవక్యా గర్భజన్మ తత్ ॥
ఆచఖ్యు ర్భోజరాజాయ యదుద్విగ్నః ప్రతీక్షతే. (2)

**టీ॥** త ఇతి. తదష్టమం జన్మ. (2)

**శ్లో॥** స తల్పాత్తూర్ణ ముత్థాయ కాలోఽయమితి విహ్వలః ।
సూతీగృహ మగాత్తూర్ణం ప్రస్ఖలన్ ముక్త మూర్ధజః ॥ (3)

## నాలుగవ అధ్యాయము

**శ్రీశుకమహర్షియిట్లనెను**

**తా॥** (వసుదేవుడు తిరిగివచ్చిన పిదప) నగరియొక్క వెలుపలి, లోపలి తలుపు లన్నియును పూర్వము వలెనే మూసివేయబడినవి. అప్పుడు పసి బాలుని ధ్వని (ఏడుపు) విని ద్వారపాలకులందఱు మేల్కొనిరి.(1)

**టీ॥** ఈ నాలుగవ అధ్యాయమున అశరీరవాణి వాక్యములను విని మిక్కిలి భయముతో వ్యాకులుడైన కంసుడు దుష్టమంత్రుల చేత చెప్పబడినట్లు బాలురు మున్నగు వారిని చంపుటయే మేలని తలచెను. (1)

**తా॥** వారువెంటనే కంసుని వద్దకుపోయి అతనికి దేవకి యొక్క ఎనిమిదవ సంతానమును గూర్చి విన్నవించిరి. కంసుడు భయాకులుడై ఆ విషయము కొఱకే నిరీక్షించుచుండెను. (2)

**టీ॥** 'త'ఇతి – ఆ ఎనిమిదవజన్మ. (2)

**తా॥** అతడు పడకపైనుండి వెంటనేలేచి, 'ఇది మృత్యుసమయము' అని విహ్వలుడై చెదరి విడిపోయిన శిరోజములతో, తొట్రుపడుచు శీఘ్రమే సూతికా గృహమునకు పోయెను. (3)

**టీ॥** స ఇతి. కాలో మృత్యుః. (3.4)

**టీ॥** కాలః - మృత్యువు. (3,4)

**శ్లో॥** తమాహ భ్రాతరం దేవీ కృపణా కరుణం సతీ ।
స్నుషేయం తవ కల్యాణస్త్రియం మా హంతు మర్హసి ॥(4)

**తా॥** పరమసాధ్వియగు దేవకీదేవి దీనురాలై జాలిగొలుపుచు తన అన్నయగు కంసునితో నిట్లనెను. అన్నా! నేను నీ సోదరిని, శుభమును గోరువాడవగు నీవు స్త్రీని చంపుటకు సాహసింప వలదు. (స్త్రీని చంపుటకు తగిన వాడవు కాదు) (4)

**శ్లో॥** బహవో హింసితా హ్యంగ శిశవః పావకోపమాః ।
త్వయా దేవ నిసృష్టేన పుత్రికైకా ప్రదీయతామ్ ॥ (5)

**తా॥** అన్నా! అగ్నివంటి పసిపిల్లలను చాలమందిని హతమార్చితివి. దైవ వశమున (చావకుండ) మిగిలియున్న నీవు ఈ ఒక్క కుమార్తెనైనను నాకిమ్ము. (5)

**టీ॥** బహవ ఇతి. అంగ హే భ్రాతః. (5.6)

**టీ॥** హే అంగ - ఓ అన్నా!. (5,6)

**శ్లో॥** నవ్వహం తేహ్యవరజా దీనాహిత సుతాప్రభో! ।
దాతుమర్హసి మందాయా మమేమాం చరమ ప్రజామ్ ॥ (6)

**తా॥** నేను నీకు చెల్లెలిని, దీనురాలను, మేలు కలగింపజాలని కొడుకులు గల దానను. ప్రభూ! (నా కొడుకులందఱును చంపబడిరి.) మందభాగ్యురాలనగు నాకు ఈ చిట్టచివరి సంతానమైన పసి దానిని ఇచ్చుటకు తగియున్నావు. (ఇమ్ము) (6)

శ్రీశుక ఉవాచ

**శ్లో॥** ఉపగూహ్యాత్మజామేవం వదంత్యా దీన దీనవత్ ।
యాచితస్తాం వినిర్భర్త్స్య హస్తాదాచిచ్ఛిదే ఖలః ॥ (7)

శ్రీశుకమహర్షియిట్లనెను.

**తా॥** ఈ విధముగ తన బిడ్డను కౌగిలిలో దాచుకొని దీనాతి దీనముగ బిడ్డను యాచించు దేవకిని అదలించి ఆ దుర్మార్గుడగు కంసుడు ఆమె చేతి నుండి శిశువును విడిపించి లాగుకొనెను. (7)

**టీ॥** ఉపగూహ్యేతి. దీనదీనవత్ దీనాదపి దీనవత్. న తు తథా. పుత్రస్యాన్యత్ర నీతత్వాత్సా చ యోగమాయేతి జ్ఞాతత్వాచ్చ. యాచితోఽపి. ఆచిచ్ఛిదే ఆకృష్య జగ్రాహ. (7)

**టీ॥** దీనదీనవత్ – దీనునకన్నను దీనునివలె – అట్లుకాదు. తన కొడుకు ఇతర స్థలమునకు కొనిపోబడుట వలనను – ఉన్న శిశువు యోగమాయ అని తెలియుటవలనను – అడుగబడినవాడైనను – (వాడు తన కొడుకు కాదని) – ఆచిచ్ఛిదే – ఆకర్షించి తీసికొనెను.(7)

**శ్లో॥** తాం గృహీత్వా చరణయోర్జాతమాత్రాం స్వసుస్సుతామ్ ।
అపోథయచ్ఛిలాపృష్ఠే స్వార్థోన్మూలిత సౌహృదః ॥ (8)

**తా॥** స్వార్థము చేత పెకలించి వేయబడిన స్నేహ భావముగల కంసుడు తన చెల్లెలి కుమార్తెను, పుట్టిన మాత్రమైన పసి దానిని తీసికొని కాళ్ళు పట్టుకొని రాతి పైకి బలముగా విసరి కొట్టెను. (8)

**టీ॥** తామితి. అపోథయత్ బలేన చిక్షేప. (8)

**టీ॥** అపోథయత్ – బలముతో విసరెను. (8)

**శ్లో॥** సా తద్ధస్తాత్ సముత్పత్య సద్యో దేవ్యంబరం గతా ।
అదృశ్యతానుజా విష్ణోస్సాయుధాష్ట మహాభుజా ॥ (9)

**తా॥** కృష్ణుని సోదరియగు ఆమె కంసుని చేతినుండి పైకెగిరి ఆయుధములతో కూడిన ఎనిమిది మహాభుజములతో ప్రకటమగుచు అప్పటికప్పుడే ఆకాశము వైపుఁబోయి దృశ్యమానమయ్యెను. (కనపడెను) (9)

టీ॥ సేతి. సద్య ఏవ దేవీ భూత్వా. (9.-11)

టీ॥ అప్పుడే దేవియై. (9-11)

శ్లో॥ దివ్య స్రగంబరా లేప రత్నాభరణ భూషితా ।
ధనుశ్శూలేషు చర్మాసి శంఖ చక్ర గదా ధరా ॥ (10)

తా॥ దేవతా సంబంధములైన హారములు, వస్త్రములు, మైపూతలు, రత్నములతో కూర్చబడిన ఆభరణములు ధరించి యుండెను. ధనుస్సు, శూలము, బాణము, డాలు, ఖడ్గము, శంఖము, చక్రము, గదయును ఆమె ధరించి యుండెను. (10)

శ్లో॥ సిద్ధ చారణ గంధర్వైరప్సరైః కిన్నరోరగైః ।
ఉపాహృతోరుబలిభిః స్తూయమానేదమబ్రవీత్ ॥ (11)

తా॥ సిద్ధులు, చారణులు, గంధర్వులు, అప్సరలు, కిన్నరుల, నాగులు ఆమెకు వివిధములగు కానుకలు సమర్పించి ఘనమైన బలులతో కూడ ఆమెను స్తుతించిరి. అట్లు స్తుతింపబడుచున్న ఆమె (కంసునితో) ఇట్లనెను. (11)

దేవ్యువాచ.

శ్లో॥ కిం మయా హతయా మంద జాతః ఖలు తవాంతకృత్ ।
యత్ర క్వచిత్పూర్వ శత్రుర్మా హింసీః కృపణాం వృథా॥ (12)

దేవి యిట్లనెను.

తా॥ ఓరీ మూర్ఖా! నన్ను జంపినచో నీకేమి వచ్చును. నీకు పూర్వ శత్రువు, (వెవడో) నిన్ను మట్టుపెట్టువాడు ఎచ్చటనో పుట్టియేయున్నాడు గదా! నన్ను వ్యర్థముగా (దీనురాలను) హింసించితివి. (12)

టీ॥ కిమితి. మా మాం. కృపణాం వృథా అహింసీః హింసితవానసి. కృపణానితి పాఠాంతరే అన్యానపి శిశూన్ హనిష్యతీతి జ్ఞాత్వా వారయతీతి. (12)

టీ॥ మా – నన్ను దీననని వ్యర్థముగ హింసించితివి. 'కృపణాన్' అను పాఠాంతరమున ఇతర శిశువులను కూడ చంపగలడని తెలిసికొని వారించుచున్నది – అని. (12)

**శ్లో॥** ఏవం ప్రభాష్య తం దేవీ మాయా భగవతీ భువి ।
బహునామనికేతేషు బహునామా బభూవ హ ॥ (13)

**తా॥** భగవతియగు మాయాదేవి కంసుని ఇట్లు హెచ్చరించి భూమిపై అనేక నామములు గల స్థానముల యందు అనేక నామములతో విలసిల్లు చుండెను. (13)

**టీ॥** ఏవమితి. బహునామసు నికేతేషు వారాణస్యాది స్థానేషు. (13)

**టీ॥** బహునామ నికేతేషు-వారాణసి మున్నగు స్థానములందు. (13)

**శ్లో॥** తయాఽభిహిత మాకర్ణ్య కంసః పరమ విస్మితః ।
దేవకీం వసుదేవం చ విముచ్య ప్రశ్రితోఽబ్రవీత్ ॥ (14)

**తా॥** ఆమెచే చెప్పబడినది విని కంసుడు, మిక్కిలి ఆశ్చర్యపడి దేవకిని, వసుదేవుని బంధవిముక్తులనుచేసి అనునయముతో నిట్లనెను. (14)

**టీ॥** తయేతి. పరమవిస్మితః కథం దైవీ వాగనృతా జాతేతి. (14)

**టీ॥** మిక్కిలి విస్మితుడై – అశరీరవాణి వాక్కు ఎట్లు అసత్యమయ్యెను! అని. (14)

**శ్లో॥** అహో భగిన్యహోభావ మయా వాం బత పాప్మనా ।
పురుషాద ఇవాపత్యం బహవో హింసితాస్సుతాః ॥ (15)

**తా॥** అహో చెల్లెలా! అహో బావా! అయ్యో! పాపాత్ముడనగు నాచేత రాక్షసుని చేత వలె అనేకులగు మీ సంతానము హింసింపబడిరి. మీ పుత్రులు చంపబడిరి. (15)

**టీ॥** అహో ఇతి. భావ భగినీభర్తః. పురుషాదో రాక్షసో యథా స్వాపత్యమేవ హి నస్తి. తద్వత్.(15-17)

**టీ॥** భావ – చెల్లెలి భర్త – పురుషాదః – రాక్షసుడు – తన స్వీయ సంతానమును హింసించునట్లు – (15-17)

**శ్లో॥** స త్వహం త్యక్త కారుణ్యస్త్యక్త జ్ఞాతి సుహృత్ఖలః ।
కాంస్తు లోకాన్ గమిష్యామి బ్రహ్మహేవ మృతశ్శ్వసన్ ॥ (16)

**తా॥** నేను దయా భావమును వదలి పెట్టితిని. బంధువులను, స్నేహితులను వదలివేసితిని. దుష్టుడగు నేను ఏ లోకములకు పోవుదునో? బ్రహ్మహత్య చేసిన మహాపాపి వలె జీవచ్ఛవమునై యున్నాను. (16)

**శ్లో॥** దైవమప్యనృతం వక్తి న మర్త్యా ఏవ కేవలమ్ ।
యద్విస్రంభాదహం పాపః స్వసుర్నిహతవాన్ శిశూన్ ॥ (17)

**తా॥** కేవలము మనుష్యులేకాక దైవముకూడ అసత్యమునే పలుకును. ఆ పలుకులపై అతి విశ్వాసముతో పాపినగు నేను చెల్లెలి శిశువులను హతమార్చితిని. (17)

**శ్లో॥** మా శోచతం మహాభాగా వాత్మజాన్ స్వకృతం భుజః ।
జంతవో న సదైకత్ర దైవాధీనాస్సహాసతే ॥ (18)

**తా॥** మహాభాగులారా! దుఃఖింపకుడు, కొడుకులను గూర్చి విచారింపకుడు, వారు తమ ప్రారబ్ధకర్మను అనుభవించువారు. ప్రాణులు దైవవశమున మాత్రమే కలిసియుందురు. (18)

**టీ॥** మా శోచతమితి, హే మహాభాగౌ స్వకృతం భుజః స్వారబ్ధకర్మ భోక్తౄన్. కించ. జంతవః. ప్రాణినః సదా నాసతే. కింతు. అల్పకాలమే వాసతే, తథాపి ఏకత్ర నాసతే కింతు వియుజ్యంతే. యతో దైవాధీనాః (18)

**టీ॥** హే మహాభాగులారా! స్వకృతం భుజం – తమ ప్రారబ్ధకర్మను అనుభవించు వారినిగూర్చి – మరియు – ప్రాణులు ఎల్లప్పుడును ఉండరు. కొద్దికాలము మాత్రమే ఉండెదరు. అట్లైనను ఒక్కచోనుండరు. విడిపోవుదురు. ఎందువలననగా వారు దైవమునకు అధీనులు కనుక. (18)

**శ్లో॥** భువి భౌమాని భూతాని యథా యంత్యపయాంతి చ ।
నాయమాత్మా తథైతేషు విపర్యేతి యథేవ భూః ॥ (19)

**తా॥** లోకమునందు మట్టితో చేయబడిన ఘటాది పదార్థములు ఏర్పడుచును, వికారము చెందుచును ఉండును. అట్లే భౌతిక పదార్థము లన్నియును వచ్చుచు పోవుచునుండును. కాని ఆత్మ మాత్రమే ఎట్టి వికారమునందక 'మట్టి'వలె నిత్యమె యుండును. (19)

**టీ॥** సదా నాసత ఇతి యదుక్తం జన్మమరణాది. తదపి దేహానామేవ నాత్మన ఇత్యాహ.– భువీతి. భూతాని దేహా ఏవ యాంతి చ భవంతి. న భవన్తి చేత్యర్థః యథా భువి భౌమాని ఘటాదీని. తద్వత్. ఏతేషు భూతేషు. జన్మాదిభిర్విక్రియమాణేషు. అయమపరోక్షతయా ప్రత్యభిజ్ఞాయ మాన ఆత్మా న విపర్యేతి విపర్యయం న ప్రాప్నోతి ఏకరూప ఏవ వర్తత ఇత్యర్థః. భౌమేషు విక్రియమాణేషు యథా భూస్తథేతి. (19)

**టీ॥** భూతములు దేహములు ఏర్పడుచున్నవి. నశించుచున్నవి. ఈ భూమియందు మట్టితోచేయబడిన కుండలు మొదలగునవి– వానివలె. ఈ ప్రాణులయందు(కూడ) జన్మమొదలుకొని షడ్వికారములు చెందుచున్నవానియందు, ఈ అపరోక్షత్వముచేత (గుర్తించి) తెలియబడుచున్న ఆత్మ, వికారమును చెందదు. ఒకే రూపమున ఉండునని యర్థము. మట్టితో చేయబడిన వస్తువుల యందు 'మట్టి' యెట్లో అట్లే (ఆత్మ అవికారి) అని. (19)

**శ్లో॥** యథా నైవంవిధో భేదో యత ఆత్మ విపర్యయః ।
దేహ యోగ నియోగశ్చ సంసృతిర్న నివర్తతే ॥ (20)

**తా॥** ఈ భేదము నెఱుగని వాడైనప్పుడు ఆత్మను విపర్యయముగ భావించువాడగును. అనగా దేహమునే ఆత్మయని భావించువాడగును. అప్పుడు దేహముతో కలిసి యుండువాడు విడిపోవు వాడును (చావు పుట్టుకలలో కొట్టుమిట్టాడు చున్నవాడు) అగుటచేత వానికి (సుఖ దుఃఖ రూపమైన) ఈ సంసారము తొలగిపోవదు. (20)

**టీ॥** – ఏవం విచార్యమాణే సతి న శోకావకాశః. అజానతస్తు న నివర్తత ఇత్యాహ–యథేతి. యథావత్. నైవంవిదః. ఏవం అజానతః. ఆత్మవిపర్యయః దేహాత్మబుద్ధిర్భవతి. యతో విపర్యయాద్భేదో భవతి. దేహాహంకారేణ హ్యాత్మని పరిచ్ఛిన్నే సతి. అహంకారాస్పదం భిన్నం భవతి. యతో భేదాత్పుత్రాదిదేహైర్యోగశ్చ నియోగశ్చ తతస్సంసృతిః సుఖ దుఃఖే ఇతి యావత్. అజ్ఞానం న నివర్తత ఇత్యర్థః. (20)

**టీ॥** ఇట్లు విచారించుచున్న వాడైనచో శోకమునకు అవకాశ ముండదు. తెలియని వానికి నివృత్తి లేదని చెప్పుచున్నాడు–ఏ విధముగ – ఎప్పటి వలె – నైవం విదః – ఇట్లు తెలియని వానికి – ఆత్మవి పర్యయః – దేహమే ఆత్మ అను బుద్ధి కలుగును. విపర్యయము వలన భేదము కలుగుచున్నందు వలన – దేహాహంకారము చేత ఆత్మ యందు పరిచ్ఛిన్న భావము కలుగగా అహంకారమునకు ఆస్పదమై వేరగును. భేదము వలన పుత్రులు మొదలగు వారి దేహములతో కూడుకొనుట, విడిపోవుట దాని వలన సంసారము – సుఖ దుఃఖములు అని సారాంశము. అజ్ఞానము నివర్తింపదని యర్థము. (20)

**శ్లో॥** తస్మాద్భద్రే స్వతనయాన్ మయా వ్యాపాదితానపి ।
మానుశోచ యతస్సర్వే స్వకృతం భుంజతేఽవశాః ॥ (21)

**తా॥** ఓ కల్యాణీ! అందువలన నాచే చంపబడినవారైనను నీ కుమారులను గూర్చి దుఃఖింపకుము. ఎందుకనగా అందఱును అవశులై తమ కర్మననుభవింతురు. (21)

**టీ॥** ఏవముక్తప్రకారేణ. న తే తవ తనయాః. అహం తు తాన్ న హతవాన్. తథాప్యపజ్ఞానదృష్ట్యా స్వతనయాన్ మయా వ్యాపాదితానపి మానుశోచేతి సాంత్వయతి–తస్మాదితి. అజ్ఞానాశ్రయం కర్మ వాదమాహ–యత ఇతి. (21)

**టీ॥** ఇట్లు, చెప్పబడిన దాని ప్రకారము వారు నీ పుత్రులు కారు, నేను వారిని చంపనులేదు, అట్లైనను అజ్ఞానదృష్టితో నీ కుమారులు నాచే చంపబడినను నీవు శోకింపరాదు అని. ఓదార్చుచున్నాడు. 'తస్మాత్' అని. అజ్ఞానమునాశ్రయించి యుండు కర్మ వాదమును చెప్పుచున్నాడు. "యతస్సర్వే" అనుచు– (21)

**శ్లో॥** యా వద్ధతోఽస్మి హంతాస్మీత్యాత్మానం మన్యతేఽస్వదృక్ ।
తావత్తదభిమాన్యజ్ఞో బాధ్య బాధకతామియాత్ ॥ (22)

**తా॥** 'చంపబడితిని' 'చంపితిని' అని దేహాభిమాని తనను గుఱించి తాను ఎంత వఱకు భావించు చుండునో అంత వఱకు తదభిమాని అజ్ఞానియే, బాధింపదగినది – బాధించువాడు అనునీ రెంటి భేదమును తత్త్వతః తెలియవలెను. (22)

**టీ॥** కథం తర్హి బ్రాహ్మణాది హంతు స్తద్ధతస్య చ. ప్రాయశ్చిత్తాది శ్రవణం అజ్ఞాన మూలమేవేత్యాహ–యావదితి. అస్వదృక్ దేహాభిమానీ తదభిమానీతి తస్య దేహస్య హననమాత్మన్యభిమన్యమాన ఇత్యర్థః (22)

**టీ॥** – అయినచో బ్రాహ్మణాదుల చంపిన వానికిని, చంపబడిన వానికిని భేదమును తెలియుట ఎట్లు? ప్రాయశ్చిత్తములు మొదలగు వానిని గూర్చి వినుట అజ్ఞాన మూలమే అని చెప్పుచున్నాడు 'యావత్' అని. అస్వదృక్ – దేహాభిమాని, అని. అతని దేహమును హననము చేయుటయన ఆత్మ యందు అభిమానించుచుండు వాడని యర్థము. (దేహమే ఆత్మయని అజ్ఞాన వశమున భావించుచుండు వాని విషయమిది.) (22)

**శ్లో॥** క్షమధ్వం మమ దౌరాత్మ్యం సాధవో బంధువత్సలాః ।
ఇత్యుక్త్వాశ్రు ముఖః పాదౌ స్యాలస్స్వస్రో రథా గ్రహీత్ ॥ (23)

**తా॥** "మీరు సాత్త్విక స్వభావులు. బంధువుల మీద ప్రేమగల వారు. నా దుష్టత్వమును మన్నింపుడు". అని చెప్పి కన్నీరు కారుచున్న ముఖము గలవాడైన కంసుడు దేవకీ వసుదేవుల పాదములను పట్టుకొనెను. (23)

**టీ॥** క్షమధ్వమితి. స్యాలః కంసః. స్వసృశబ్దేన ద్వివచనానుపపత్త్యా మిథున గ్రహణ మిథునీ లక్షణయా స్వసృతత్పత్యోరభిధానం.

**టీ॥** స్యాలః కంసుడు. "స్వస్రోః" అని 'స్వసృశబ్దము యొక్క ద్వివచనము అనుపపత్తికమగుటచే (అచట దేవకి అను ఒక సోదరి

లింగసమవాయేన. ప్రాణభృత ఉపదధాతీతి వత్ దేవకీ వసుదేవయోః ప్రత్యేకం పాదావగ్రహీదిత్యర్థః. స్యాలశబ్దేన వా కథంచిద్వసుదేవాభిధానం యుజ్యతే. కంసస్వస్రోరితి పాఠే. తయోః కంస అథా గ్రహీదితి పాఠాంతరే చ. న కాప్యనుపపత్తిశంకేతి విద్వద్భి రూహ్యం. (23)

మాత్రమే ఉండగా స్వసృశబ్దమునకు ద్వివచనము 'స్వస్రోః' – ఇద్దఱు చెల్లెండ్రయొక్క అని ప్రయోగించుట సరికాదుగదా అని ఉద్దేశము) – 'జంట'ను గ్రహించి – 'మిథునీ' లక్షణముచేత చెలెల్లి యొక్క ఆమె భర్త యొక్క అను అభిప్రాయము, లింగ సమవాయముచేత, ప్రాణభృత్ ఉపదధాతి"వలె (ప్రాణ భృత ఉపదధాతి, అను మంత్రమున ప్రాణభృచ్ఛబ్దమును బట్టి ఆ శబ్దములేకున్నను దానిననుసరించియున్న తక్కిన మంత్రములన్నియు ప్రాణభృచ్ఛబ్దముచే చెప్పబడును. "ప్రాణ భృత ఉపదధాతి" మొదలగు మంత్రములచే చేయబడు ఇష్టకములును ప్రాణభృచ్ఛబ్దముననే చెప్పబడును. ఇచట లింగసమవాయము కలదు) దేవకీ వసుదేవుల యొక్క ప్రత్యేకముగ పాదద్వయము(ల) గ్రహించెనని అర్థము. లేక స్యాలశబ్దము వలన ఎట్లైనను వసుదేవుని పేర్కొనుట యోగించును. "కంస స్వస్రోః' అను పాఠమున, 'తయోః కంస అథా గ్రహీత్' అను పాఠాంతరమున కూడ ఏ విధమైన అనుపపత్తి శంకలేదని విద్వాంసుల చేత ఊహింపదగియున్నది. (23)

**శ్లో॥** మోచయామాస నిగళాద్విస్రబ్ధః కన్యకాగిరా ।
దేవకీం వసుదేవం చ దర్శయన్నాత్మ సౌహృదమ్ ॥ (24)

**తా॥** కంసుడు యోగమాయ యొక్క వాక్యముచేత, ఆ వాక్యమునందు విశ్వాసము గలవాడై, దేవకి, వసుదేవులపై, తన ఆప్యాయతను చూపుచు. సంకెలల నుండి విముక్తులను చేసెను. (24)

**టీ॥** మోచయామాసేతి. ఆత్మసౌహృదం ప్రియవాదాదినా దర్శయన్ (24-26)

**టీ॥** ఆత్మసౌహృదం - ప్రియ వాక్యములు మొదలగు వానిని చూపుచు. (24-26)

**శ్లో॥** భ్రాతు స్సమనుతప్తస్య క్షాంత్వా రోషం చ దేవకీ ।
వ్యసృజద్వసుదేవశ్చ ప్రహస్య తమువాచ హ ॥ (25)

**తా॥** దేవకి తాపమును పొందుచున్న తన అన్న మీది కోపమును క్షమాబుద్ధితో వదలి పెట్టెను. వసుదేవుడు కూడ నవ్వుచు కంసునితో నిట్లనెను. (25)

**శ్లో॥** ఏవమేతన్మహారాజ యథా వదసి దేహినామ్ ।
అజ్ఞాన ప్రభవాహం ధీస్స్వపరేతి భిదా యతః ॥ (26)

**తా॥** ఓ కంస మాహారాజా! నీవు చెప్పునది సరియైనదియే. శరీరధారులకు అజ్ఞానము వలన కలిగిన అహంకార బుద్ధియే 'తన', 'ఇతర' అను భేదమును కల్పించును. (స్వపర భేదమును సృష్టించును) (26)

**శ్లో॥** శోకహర్ష భయద్వేష లోభమోహ మదాన్వితాః ।
మిథోఘ్నంతం న పశ్యంతి భావైర్భావాన్ పృథగ్దృశః ॥ (27)

**తా॥** దుఃఖము, సంతోషము, దిగులు, పగ, ఆశ, మోహము (భ్రమ) అనువానితో కూడియున్నవారు, భిన్నభిన్నములుగ కన్పట్టుచున్న పదార్థములను పరస్పరముగ వాని తోడనే నశింపజేయు ఈశ్వరుని చూడజాలరు. (27)

**టీ॥** స్వపరభేదదర్శనేన. కిం భవతి తదాహ-శోకేతి. భావైః భేద నిమిత్తభూతైః. మిథోభవాన్. ఘ్నంతం భావమీశ్వరం. పృథక్ దృశః తే న పశ్యంతి. కిం త్వహమేవ హంతా హత ఇతి. మన్యంత ఇత్యర్థః (27)

**టీ॥** స్వపర భేద దర్శనము చేత ఏమి జరుగునో చెప్పుచున్నాడు - భావైః - భేదమునకు కారణములగు వాని చేత - మిథః - (పరస్పరముగ) భవాన్ - నీవు - ఘ్నంతం - చంపు వాడవుగ నున్న నిన్ను - భావం - ఈశ్వరుని - పృథక్ దృశః - వేర్వేఱుగ కనబడు

వానిని – తే న పశ్యంతి – వారుచూడరు. కాని నేనే చంపువాడను, చంపబడు వాడను అని భావింతురు అని. (27)

**శ్లో॥** కంస ఏవం ప్రసన్నాభ్యాం విశుద్ధం ప్రతిభాషితః ।
దేవకీ వసుదేవాభ్యామనుజ్ఞాతోఽవిశద్గృహమ్ ॥ (28)

**తా॥** కంసుడు ఈ విధముగ ప్రసన్నులైన దేవకీ వసుదేవులతో నిష్కపటముగ సమాధానమును చెప్పి వారి యాజ్ఞ తీసికొని తన భవనమునకుంబోయెను. (28)

**టీ॥** కంస ఇతి. విశుద్ధం యథా భవతి తథా. (28-29)

**టీ॥** విశుద్ధం – ఎట్లు కావలెనో అట్లు – (28-29)

**శ్లో॥** తస్యాం రాత్ర్యాం వ్యతీతాయాం కంస ఆహూయ మంత్రిణః ।
తేభ్య ఆచష్ట తత్సర్వం యదుక్తం యోగమాయయా ॥ (29)

**తా॥** ఆ రాత్రి గడచిన తరువాత కంసుడు మంత్రులను రావించి, వారితో యోగమాయచే చెప్పబడిన విషయము నంతయును చెప్పెను. (29)

**శ్లో॥** ఆకర్ణ్య భర్తృగదితం తమూచుర్దేవ శత్రవః ।
దేవాన్ ప్రతికృతామర్షా దైతేయా నాతికోవిదాః ॥ (30)

**తా॥** రాజు చెప్పిన మాటలు విని, దేవతలయెడ కోపము పూనియున్న, వారును దేవతల శత్రువులు, అల్పప్రజ్ఞులునగు రాక్షసమంత్రులు అతనితో నిట్లనిరి. (30)

**టీ॥** ఆకర్ణ్యేతి. నాతికోవిదాః దృష్టమాత్ర మతయః. (30)

**టీ॥** నాతికోవిదాః దృష్టమాత్ర మతయః – చూచినది మాత్రము గ్రహించు బుద్ధిగల వారు. (30)

**శ్లో॥** ఏవం చేత్తర్హి భోజేంద్ర పురగ్రామ వ్రజాదిషు ।
అనిర్దశాన్నిర్దశాంశ్చ హనిష్యామోఽద్యవై శిశూన్ ॥ (31)

**తా॥** ఓ భోజమహారాజా! అటులైనచో పట్టణములలోను, పల్లెలలోను, గొల్ల పల్లెలు మొదలగు జనావాస స్థానములందును గల పదిదినముల వయస్సు పైబడిన వారిని, పదిదినముల వయస్సులోనున్న శిశువులను చంపివేయుదుము. (31)

**టీ॥** ఏవమితి. న నిర్గతాని దశ దినాని యేషాం తాన్ అన్యాంశ్చ. (31,32)

**టీ॥** న నిర్గతాని దశదినాని యేషాం తాన్ – పది దినములు గడవని వారిని – అన్యాంశ్చ – ఇతరులను కూడ – (31,32)

**శ్లో॥** కిముద్యమైః కరిష్యంతి దేవాస్సమర భీరవః ।
నిత్యముద్విగ్న మనసో జ్యాఘోషైర్ధనుషస్తవ ॥ (32)

**తా॥** యుద్ధమునకు బయపడు ఆ దేవతలు యుద్ధ ప్రయత్నములతో మాత్రమేమి చేయగలరు? నీ ధనుస్సుల నారీ టంకార ధ్వనులతో వారెల్లప్పుడును భీత మనస్కులై యుందురు. (32)

**శ్లో॥** అస్యతస్తే శరవ్రాతైర్హన్యమానాస్సమంతతః ।
జిజీవిషవ ఉత్సృజ్య పలాయనపరా యయుః ॥ (33)

**తా॥** బాణ సమూహములచే నీవు పీడించుచుండగా అంతటను కొట్టబడిన వారలగుచు యుద్ధ భూమిని విడిచి, జీవించు నిచ్ఛ గల వారగుచు పలాయన పరాయణులై పారిపోవుదురు. (33)

**టీ॥** అస్యత ఇతి. అస్యతః విధ్యతః. ఉత్సృజ్య రణం త్యక్త్వా. (33-34)

**టీ॥** అస్యతః – తాడనము చేయుచున్న – ఉత్సృజ్య – యుద్ధమును విడిచిపెట్టి – (33-34)

**శ్లో॥** కేచిత్ప్రాంజలయో భీత్యా న్యస్తశస్త్రా దివౌకసః ।
ముక్తకచ్ఛ శిఖాః కేచిద్భీతాస్స్మ ఇతి వాదినః ॥ (34)

**తా॥** కొందఱు భయముచే అంజలి ఘటింపుచు ఆయుధములను క్రింద విడిచిన వారు కాగా మఱికొందఱు విడిపోయిన గోచులు, శిఖలు గల వారై భయపడితిమి అని కేకలు వేయుచుండిరి. (34)

**శ్లో॥** న త్వం విస్మృత శస్త్రాస్త్రాన్ విరథాన్ భయ సంవృతాన్ ।
హంస్యన్యాసక్త విముఖాన్ భగ్నచాపానయుధ్యతః ॥ (35)

**తా॥** శస్త్రములను, అస్త్రములను మరచిపోయిన వారిని, రథములపై లేని వారిని, భయపడియున్న వారిని, ఇతర విషయముల గూర్చి ఆలోచించు చుండువారిని, యుద్ధ విముఖులను ధనుస్సులు భగ్నమై యున్న వారిని, యుద్ధము చేయకుండ నున్న వారిని నీవు చంపవు.(35)

**టీ॥** నేతి. అన్యాసక్తాన్. విముఖాంశ్చేతి. న హింసి న హినత్సి.(35)

**టీ॥** అన్యాసక్తాన్ – యుద్ధము కన్న నితరములపై ఆసక్తి గల వారిని మరియు యుద్ధ విముఖులను నీవు చంపకుందువు. (35)

**శ్లో॥** కిం క్షేమశూరైః విబుధై రసంయుగ వికత్థనైః ॥ (36)

**తా॥** ఇక నిర్భయస్థానమున మాత్రము శూరులైనవారి గుఱించియు, యుద్ధేతర ప్రదేశములందు బీరములు పల్కు దేవతల గురించి చెప్పున దేమి? (36)

**టీ॥** కిమితి. క్షేమే నిర్భయదేశే. శూరైః సంయుగాదన్యత్ర వికత్థనం ప్రౌఢవాదో యేషాం తైః ॥ (36)

**టీ॥** క్షేమే – నిర్భయ ప్రదేశమున – సంయుగా దన్యత్ర వికత్థనం ప్రౌఢవాదో యేషాం తైః – యుద్ధము కంటె ఇతరమైన స్థలములందు ప్రగల్భములు మాట్లాడెదు వారితో – (కిం –ఏమి?) (36)

**శ్లో॥** రహోజుషా కిం హరిణా శంభునా వా వనౌకసా ।
కిమింద్రేణాల్పవీర్యేణ బ్రహ్మణా వా తపస్యతా ॥ (37)

**టీ॥** నను హరేర్బిభేమి. శంభోశ్చేతి చేత్తత్రాహుః – రహోజుషేతి. సర్వదాప్యంతః ప్రవిష్టేన. క్వచిదపి బహిరదృష్టేనేత్యర్థః. పురుషప్రవేశ రహిత మిళావృత వర్ష వనమేకో యస్య. తేన శంభువా. (37)

**తా॥** ఏకాంతమున నుండు విష్ణువుతో గాని, అరణ్యమున నుండు శంకరునితో గాని, అల్పపరాక్రముడగు ఇంద్రునితో గాని, తపస్వియగు బ్రహ్మతో గాని మనకేమి భయము? (37)

**టీ॥** విష్ణువు వలన భయపడెదమా? శంభుని వలననా? అనినచో చెప్పుచున్నాడు. "రహోజుషా" అని – ఎల్లప్పుడును లోపల ప్రవేశించి యుండు వానితో – ఎప్పుడును వెలుపలికి చూడని వాని చేత అని యర్థము – పురుష ప్రవేశము లేని ఇళావృతదేశ మునందలి ఒక వనము స్థానముగా గల శంభునితో – (37)

**శ్లో॥** తథాపి దేవా స్సాపత్న్యా నోపేక్ష్యా ఇతి మన్మహే ।
తతస్తన్మూల ఖననే నియుఙ్క్ష్వాస్మానను వ్రతాన్ ॥ (38)

**టీ॥** యద్యప్యుద్యమైర్దేవాః. కించిదపి కర్తుం సమర్థాః తథాపి నీతిరనువర్తితవ్యేత్యాహుః. –తథాపీతి. (38)

**తా॥** అట్లైనను దేవతలు మనకు శత్రువులు వారిని ఉపేక్షింపరాదని మా అభిప్రాయము. అందువలన వారి మూలములను పెకలించి వేయుటకు విశ్వాసపాత్రులగు మీ సేవకులమగు మా వంటి వారిని నియోగింపుము. (38)

**టీ॥** – అయినను దేవతలు తమ ప్రయత్నములతో ఏ కొంచెమైనను చేయుటకు సమర్థులు, అట్లైనను రాజనీతిని అనుసరించియే తీరవలెనని చెప్పుచున్నారు. "తథాపి" అని. (38)

**శ్లో॥** యథాऽऽమయోऽఙ్గే సముపేక్షితో నృభి
ర్న శక్యతే రూఢపదశ్చికిత్సితుమ్ ।
యథేంద్రియ గ్రామ ఉపేక్షితస్తథా
రిపుర్మహాన్ బద్ధబలో న చాల్యతే ॥ (39)

**తా॥** శరీరమునందు రోగమేదైనను ప్రవేశించినప్పుడు, దానిని నిర్లక్ష్యముచేసినచో, అది వేళ్ళు పాతుకొని, చికిత్స చేయుటకు మనుష్యులకు సాధ్యము కాకుండనగును. ఇంద్రియ సమూహములను అదుపు చేయక ఉపేక్షించినచో, తరువాతి కాలమున వాటిని అదుపు చేయుటకు సాధ్యము కానట్లు (పెద్ద) శత్రువు కూడా ఉపేక్షింపబడినచో మహాబలవంతుడై, వానిని కదిలించుటకు సాధ్యపడకుండును. (39)

**టీ॥** యథేతి. రూఢపదః బద్ధమూలః. (39)

**టీ॥** రూఢపదః – మూలము (వేరు) గట్టిపడినవాడు. (39)

**శ్లో॥** మూలం విష్ణుర్హి దేవానాం యత్ర ధర్మస్సనాతనః ।
తస్య చ బ్రహ్మ గో విప్రాస్తపో యజ్ఞాస్సదక్షిణాః ॥ (40)

**తా॥** దేవతలకు మూలము విష్ణువు, అతడు సనాతన ధర్మమున్నచోట నుండును. ఆ ధర్మమునకు మూలము వేదము, గోవులు, బ్రాహ్మణులు, తపస్సు, దక్షిణలతో కూడిన యజ్ఞములు. (40)

**టీ॥** మూలమితి. దేవానాం మూలం విష్ణుః. స చ యత్ర ధర్మ స్తత్రాస్తే. ధర్మస్య చ మూలం బ్రహ్మ గో విప్రాః. వేదగో బ్రాహ్మణాః (40–42)

**టీ॥** దేవతలకు ప్రధానుడు విష్ణువు. అతడును ఎచట ధర్మముండునో అచట నుండును. ధర్మమునకు మూలము వేదములు గోవులు బ్రాహ్మణులు. వేదములు తెలిసిన బ్రాహ్మణులు. (40 – 42)

**శ్లో॥** తస్మాత్సర్వాత్మనా రాజన్ బ్రాహ్మణాన్ బ్రహ్మ వాదినః ।
తపస్వినో యజ్ఞశీలాన్ గాశ్చ హన్మో హవిర్దుఘాః ॥ (41)

**తా॥** అందువలన ఓ రాజా! వేదవాదులైన బ్రాహ్మణులను, తపస్యులను, యాజ్ఞికులను, హవిష్యాదులనిచ్చు గోవులను అన్ని విధములుగ నాశనము చేసెదము. (41)

**శ్లో॥** విప్రా వేదాశ్చ గావశ్చ తపస్సత్యం దమశ్శమః ।
శ్రద్ధా దయా తితిక్షా చ క్రతవశ్చ హరేస్తనుః ॥ (42)

**తా॥** బ్రాహ్మణులు, వేదములు, గోవులు, తపస్సు, సత్యము, బ్రహ్మచర్యాది క్లేశములు సహించుట, కామక్రోధాదులు లేకుండుట,, శ్రద్ధ, దయ, ఓర్పు – ఇవి విష్ణు శరీరరూపములగు క్రతువులు. (42)

**శ్లో॥** స హి సర్వ సురాధ్యక్షో హ్యసురద్విడ్గుహాశయః ।
తన్మూలా దేవతాస్సర్వా స్సేశ్వరాస్సచతుర్ముఖాః ॥ (43)

**తా॥** ఆ విష్ణువే సకల దేవతలకును అధ్యక్షుడు, అతడే రాక్షసుల కందఱికిని శత్రువు. ఆతడే బుద్ధిగుహలలో నుండువాడు. దేవతలందఱు ఆతడే మూలముగ గలవారు. ప్రభువులందఱును అతడే బ్రహ్మలందఱును అతడే. (43)

**టీ॥** స ఇతి. కించ విప్రాదయో హరేరేవ తనవో యస్మాత్తస్మాదయ మేవోపాయ ఇత్యాహుః అయమితి. (43–45)

**టీ॥** మరియు బ్రాహ్మణాదులే విష్ణువు యొక్క శరీరములు కావున బ్రాహ్మణ హింసయే ఉపాయమని చెప్పుచున్నారు. (43–45)

**శ్లో॥** అయం వై తద్వధోపాయో యదృషీణాం విహింసనమ్. (43)

**తా॥** ఇదియే – ఋషులను సంహరించుటయే అతనిని వధించు నుపాయము. (43)

<u>శ్రీశుక ఉవాచ.</u>

<u>శ్రీశుకమహర్షి యిట్లనెను</u>

**శ్లో॥** "ఏవం దుర్మంత్రిభిస్సాకం కంసస్సంమంత్ర్య దుర్మదః ।
బ్రహ్మహింసా హితం మేనే కాలపాశ వృతోఽ సురః ॥ (44)

**తా॥** ఈ విధముగ తన దుష్టమంత్రులతో ఆలోచించి దుర్మదుడైన కంసుడు కాలపాశముతో ఆవరింపబడిన రాక్షసుడై బ్రాహ్మణులను హింసించుటయే మేలని తలచెను. (44)

**శ్లో॥** సందిశ్య సాధు లోకస్య కదనే కదన ప్రియాన్ ।
కామరూపధరాన్ దిక్షు దానవాన్ గృహమావిశత్ ॥ (45)

**తా॥** యుద్ధమున సాధు పురుష సమూహములను బాధపెట్టుటకు, యుద్ధప్రియులు, కామరూపధరులును అయిన రాక్షసులను ఆ యా

దిక్కులకు బోవుటకు ఆజ్ఞాపించి తాను (కంసుడు) భవనమున ప్రవేశించెను. (45)

**శ్లో॥** తే వై రజః ప్రకృతయః తమసా మూఢచేతసః ।
సతాం విద్వేష మాచేరు రారాదాగత మృత్యవః ॥ (46)

**తా॥** వారు రజోగుణము గలవారు. తమో గుణముచే మూర్ఖచిత్తులై, సత్పురుషులతో వైరము నెఱపజొచ్చిరి. వినాశకాలము దాపురించిన వారు! (46)

**టీ॥** త ఇతి. ఆరాత్సమీపమాగతో మృత్యుర్యేషాం తే.(46)

**టీ॥** ఆరాత్సమీపమాగతో మృత్యుర్యేషాం తే. మృత్యువునకు దగ్గరైన వారు. (46)

**శ్లో॥** ఆయుశ్శ్రియం యశో ధర్మం లోకానాశిష ఏవ చ ।
హంతి శ్రేయాంసి సర్వాణి పుంసో మహదతిక్రమః ॥ (47)

**తా॥** సత్పురుషుల నతిక్రమించి వర్తించువారి ఆయువు, సంపద, కీర్తి, ధర్మము, లోకములు, ఆశీస్సులు, మొదలగు సర్వశ్రేయములు నశించిపోవును. (47)

**టీ॥** సతాం విద్వేషో న మృత్యమాత్రహేతుః. కింతు బహ్వనర్థ కారీత్యాహ – ఆయురితి. (47)

**టీ॥** – సత్పురుషులతో విద్వేషము కేవలము మృత్యువునకు మాత్రమే కారణముకాదు. అనేక విధములగు అనర్థములను కలుగజేయునని చెప్పుచున్నాడు. 'ఆయుః' అని. (47)

**శ్రీ మద్భాగవతే, మహాపురాణే దశమస్కంధే,**
**చతుర్థోఽధ్యాయః**

**అని శ్రీమద్భాగవతమున దశమస్కంధమందు**
**నాల్గవ అధ్యాయము సమాప్తము.**

## పంచమోఽధ్యాయః

**శ్రీశుక ఉవాచ.**

**శ్లో॥** నందస్త్వాత్మజ ఉత్పన్నే జాతాహ్లాదో మహామనాః ।
ఆహూయ విప్రాన్ వేదజ్ఞాన్ స్నాతశ్శుచి రలంకృతః ॥ (1)

**టీ॥** "పంచమే జాతకం నందసూనోః కృత్వా మహోత్సవం, గత్వా తు మధురాం ప్రాపవసుదేవాగమోత్సవం". నంద ఇతి. మహామనాః ఉదారచిత్తః. (1, 2)

**శ్లో॥** వాచయిత్వా స్వస్త్యయనం జాతకర్మాత్మజస్య వై ।
కారయామాస విధివత్పితృ దేవార్చనం తథా ॥ (2)

**శ్లో॥** ధేనూనాం నియుతే ప్రాదాద్విప్రేభ్య స్సమలంకృతే ।
తిలాదీన్ సప్త రత్నౌఘ శాత కుంభాంబరావృతాన్ ॥ (3)

## ఐదవ అధ్యాయము

**శ్రీశుక మహర్షి యిట్లనెను**

**తా॥** నందునకు కుమారుడు జన్మింపగ నాతడు మిక్కిలి సంతోషముతో స్నానము చేసి పవిత్రుడై వస్త్రభూషణాదుల నలంకరించుకొని, ఉదారచిత్తముతో వేదవేత్తలైన బ్రాహ్మణుల నాహ్వానించి- (1)

**టీ॥** ఈ ఐదవ అధ్యాయమున నందునకు పుత్రుడు కలుగుటను పురస్కరించుకొని ఉత్సవమును పెద్దయెత్తున చేసి, మధురకు బోయి, అచట వసుదేవునిచేరి, అతనిని పుత్రోత్సవమునకు ఆహ్వానించుట మున్నగునని వర్ణింపబడినవి - మహామనాః-ఉదారచిత్తుడై - (1,2)

**తా॥** వారిచేత స్వస్తివాచనము జాతకర్మసంస్కారము, విధిపూర్వకముగ పితృదేవతల పూజ చేయించెను. (2)

**తా॥** చక్కగ నలంకరింపబడిన రెండులక్షల ఆవులు, ఏడు విధములైన రత్న సమూహములతోను, బంగారపు జరీలతోడి విలువైన వస్త్రములతో చుట్టబడిన నూవుల కొండలను బ్రాహ్మణులకు దానమిచ్చెను. (3)

**టీ॥** ధేనూనామితి. నియుతే ద్వే లక్షే సప్త తిల పర్వతాంశ్చ ప్రాదాత్ కథంభూతాన్ రత్నౌఘైః రత్నసమూహైః శాతకుంభాంబరైః సువర్ణరసాక్తైః వస్త్రైః ఆవృతాన్. (3)

**టీ॥** నియుతే – రెండులక్షలు – సప్తతిలపర్వతాంశ్చ – ఏడు నువ్వుల కొండలను కూడ ప్రాదాత్ – ఇచ్చెను. కథం భూతాన్– ఎట్టి వానిని – రత్నౌఘైః – రత్నసమూహములతో శాతకుంభాంబరైః – బంగారపు రసముతో అద్దబడిన వస్త్రములచే, చుట్టబడిన వానిని. (3)

**శ్లో॥** కాలేన స్నానశౌచాభ్యాం సంస్కారై స్తపసేజ్యయా ।
శుద్ధ్యంతి దానై స్సంతుష్ట్యా మన ఆత్మాత్మ విద్యయా ॥ (4)

**తా॥** కాలముచేత భూమి మొదలగునవి, స్నానముచేత దేహము మొదలగునవి, శుచిత్వముచేత మాలిన్యము మొదలగునవి, సంస్కారముల చేత గర్భము మున్నగునవి, తపస్సుచేత ఇంద్రియములు, యజ్ఞముచేత బ్రాహ్మణాదులు, దానములచేత ద్రవ్యములు, సంతృప్తిచేత మనస్సు, ఆత్మవిద్యచేత ఆత్మయును (మనస్సును) శుద్ధినొందును.(4)

**టీ॥** ద్రవ్యాణాం గో హిరణ్యాదీనాం మధ్యే కేషాం చిద్దానైరేవ శుద్ధిః .తథా దానాదియుక్తజాతకర్మాదిస్నానేన దేహాదిసంస్కారైరేవ గర్భాణాం శుద్ధిరితి దర్శయితుం ప్రతి నియతాని శోధకాని దృష్టాంతత్వేనో దాహరతి–కాలేనేతి. కాలేన భూమ్యాది. స్నానేన దేహాది. శౌచేన అమేధ్యలిప్తాది. సంస్కారైర్గర్భాది. తపసా ఇంద్రియాణి. ఇజ్యయా బ్రాహ్మణాది. దానైర్ద్రవ్యాణి. సంతుష్ట్యా మనః ఆత్మాత్మ విద్యయేతి.(4)

**టీ॥** గోవులు, బంగారము మొదలగు ద్రవ్యముల మధ్య కొన్ని దానముల చేతనే శుద్ధి మరియు దానములతో కూడిన జాత కర్మాది స్నానముచేత, దేహాదుల సంస్కారాదుల చేతనే గర్భములకు శుద్ధి కలుగునని చూపుటకు నిర్ణీతములైన శుద్ధికారకములను దృష్టాంతత్వ ముతో ఉదాహరించుచున్నాడు 'కాలేన'అని. కాలముచే భూమ్యాదులు; స్నానముచే దేహాదులు, శుచిత్వముచేత అంటిన మాలిన్యాదులు, సంస్కారములచేత గర్భాదులు, తపస్సుచే ఇంద్రియములు, యజ్ఞముచే బ్రాహ్మణాదులు, దానములచేత ద్రవ్యములు, సంతుష్టిచేత మనస్సు, ఆత్మ (బ్రహ్మ) విద్యచేత ఆత్మ అని. (4)

**శ్లో॥** సౌమంగళ్యగిరో విప్రాస్సూత మాగధ వందినః ।
గాయకాశ్చ జగుర్నేదుర్భేర్యో దుందుభయో ముహుః ॥ (5)

**తా॥** బ్రాహ్మణులు స్వస్తివాచానములను చెప్పుచుండిరి, సూతులు, మాగధులు, వందిజనులు, ఆశీస్సులను, ప్రశంసలను స్తోత్రములను చదువుచుండిరి. గాయకులు పాటలు పాడుచుండిరి. భేరివాద్యములు, దుందుభివాద్యములు మఱల మఱల మ్రోగుచుండెను. (5)

**టీ॥** సౌమంగళ్యేతి. సౌమంగల్య గిరస్స్వస్తివాచకా విప్రాదయో బభూవుః. తత్ర. శ్లో. సూతాః పౌరాణికాః ప్రోక్తాః మాగధా వంశశంసకాః వందినస్త్వమలప్రజ్ఞాః ప్రస్తావసదృశోక్తయ ఇతి. (5)

**టీ॥** సౌమంగల్యగిరః – స్వస్తివచనములు – బ్రాహ్మణాదులు స్వస్తి వాచకులైరి సూతులు పౌరాణికులు, మాగధులు వంశమును పొగడువారు (భట్టు రాజులు) స్వచ్ఛమైన ప్రజ్ఞగలవారు, సందర్భము నకు తగిన మాటలు చెప్పువారు. అని చెప్పబడినది. (5)

**శ్లో॥** వ్రజస్సంమృష్ట సంసిక్తద్వారాజిర గృహాంతరః ।
చిత్రధ్వజ పతాకా స్రక్ చైల పల్లవ తోరణైః ॥ (6)

**తా॥** ఆ గొల్లపల్లె అంతయును ఇండ్లయొక్క ద్వారములు, ముంగిళ్లు, మధ్యభాగములు సుగంధ కర్దమములతో తడుపబడి, అలుకబడి, చిత్ర విచిత్రములగు స్తంభముల పైన పకతాకములతోను పూల మాలలతోను, రంగు రంగుల బట్టలతోను, చిగుళ్లతోను తోరణములతోను అలంకరింపబడెను. (6)

**టీ॥** – వ్రజ ఇతి. సంమృష్టాని సంలిప్తాని. సంసిక్తాని చ ద్వారాణి. అంగణాని గృహాంతరాణి గృహ మధ్యాని చ యస్మిన్ సః తథా. చిత్రధ్వజేషు పతాకానాం స్రజశ్చ. చేలాని చ. పల్లవతోరణాని చ. తైర్భూషితాః. (6)

**టీ॥** సంమృష్టాని – చక్కగా అలుకబడినవి, ద్వారములు చక్కగా తడుపబడినవి. ముంగిళ్లు గృహ మధ్య భాగములు దేనియందు గలవో అట్టిది ఆ వ్రజము. విచిత్రములైన ధ్వజములందు పతాకముల యొక్క పూలదండలు, వస్త్రములు కూడ చిగుళ్ళ తోరణములును వానిచే అలంకరింపబడినవి.(6)

**శ్లో॥** గావో వృషాశ్చ వత్సాశ్చ హరిద్రాతైల రూషితాః ।
విచిత్ర ధాతు బర్హస్రగ్వస్త్ర కాంచన మాలినః ॥ (7)

**తా॥** ఆవులు, ఎడ్లు, లేగలు పసువు నూనెతో పూయబడెను. చిత్రములగు ధాతువులు, పింఛములు, హారములు, వస్త్రములు, బంగారు దండలు గలవియై అవి శోభిల్లుచుండెను. (7)

**టీ॥** – గావ ఇతి. రూషితాః లిప్తాః. విచిత్రా దావశ్చ బర్హస్రజశ్చ. వస్త్రాణి చ, కాంచన మాలాశ్చ. అలంకారతయా విద్యంతే యేషాం తే. తథాభూతాః గవాదయో బభూవురిత్యర్థః. (7, 8)

**టీ॥** రూషితాః–లేపనము చేయబడినవి. విచిత్రములైన పదార్థములు, ఈకెలు, పూలదండలు, వస్త్రములును, బంగారు హారములును అలంకారముగా వేనికి కలవో అవి అట్టివి, గోవులు మొదలగునని అట్టైనవని అర్థము. (7,8)

**శ్లో॥** మహార్హ వస్త్రాభరణాః కంచుకోష్ణీష భూషితాః ।
గోపాస్స మాయయూ రాజన్నానో పాయన పాణయః ॥ (8)

**తా॥** అమూల్యములగు వస్త్రములు ఆభరణములు, అంగరకాలు, తలపాగలు ధరించి వివిధములగు కానుకలు చేతబట్టుకొని గోపాలకులు (నందుని యింటికి) వచ్చిరి. (8)

**శ్లో॥** గోప్యశ్చాకర్ణ్య ముదితా యశోదాయాః సుతోద్భవమ్ ।
ఆత్మానం భూషయాం చక్రుర్వస్త్రా కల్పాంజనాదిభిః ॥ (9)

**తా॥** యశోదాదేవికి కొడుకు పుట్టిన వార్తను విని గోపికలు సంతోషించి తమను తాము వస్త్రములతోను, అలంకారములతోను, కాటుకలతోను, భూషణములతోను అలంకరించుకొనిరి.(9)

**టీ॥** గోప్య ఇతి. ఆకల్పాః అలంకారాః. (9)

**టీ॥** – ఆకల్పాః – అలంకారములు. (9)

**శ్లో॥** నవ కుంకుమ కింజల్క ముఖ పంకజ రాజయః
బలిభిస్త్వరితం జగ్ముః పృథుశ్రోణ్యశ్చలత్కుచాః ॥ (10)

**టీ॥** నవేతి. నవ కుంకుమ కింజల్కైః ముఖ పంకజేషు భూతిః శ్రీః యాసాం తాః. (10)

**శ్లో॥** గోప్యః సుమృష్ట మణి కుండల నిష్క కంఠ్యః
చిత్రాంబరాః పథి శిఖాచ్యుత మాల్య వర్షాః ।
నందాలయం సవలయా వ్రజతీ ర్విరేజుః
వ్యాలోల కుండల పయోధర హార శోభాః॥ (11)

**టీ॥** గోప్యఇతి. సుమృష్టాని మణిమయాని కుండలాని యాసాం తాః. నిష్కాని పతకాని కంఠేషు యాసాం తాః. శిఖాభ్యః చ్యుతాని

**తా॥** కొత్త కుంకుమమనెడు ఆకరువుల తోడి మోముదామరల సమూహములుగల గోపికలు, బలిష్ఠములైన పిరుదులుగల వారగుచు, కదలుచున్న కుచములుగల వారగుచును కానుకలతోసహా త్వర త్వరగా యశోద దగ్గఱకు వెడలిరి. (10)

**టీ॥** నవకుంకుమ కింజల్కైః క్రొత్త కంకుమయనెడు కేసరముల చేత ముఖ పద్మముల యందు – భూతిః – సిరి ఎవరికో వారు. (10)

**తా॥** చక్కగా శోధన చేయబడిన పద్మరాగాది మణులతో వలయాకారముగ చేయబడిన పతకములుగల స్వర్ణహారములతో నలరారు కంఠములు గల వారును, చిత్రములైన వస్త్రములు ధరించి యున్న వారును, మార్గమునందు తమ శిఖలలోని దండలు జార్చుచున్న పూల వానలు గలవారును, స్వర్ణ కంకణములతో నలరుచున్న వారును, విశేషముగ కదలుచున్న కుండలములును, స్తనములపైని హారములును కలిగి శోభించుచున్న వారును అయిన గోపికలు నందుని యింటికి వెడలుచు ప్రకాశించిరి. (11)

**టీ॥** చక్కగా శుద్ధిచేయబడిన మణిమయములగు కుండలములు ఎవరికోవారు – నిష్కాని – పతకములు కంఠముల యందు ఎవరికో

మాల్యవర్ణాణి యాసాం తాః నందాలయం వ్రజతీః వ్రజంత్యః ఆర్ష త్రాత్ప్రథమార్థే ద్వితీయా, పథి విరేజుః సవలయాః కంకణభూషితాః సబలయ ఇతి పాఠే గృహీత వివిధోపాయనా ఇత్యర్థః. వ్యాలోలైః కుంతలాదిభిః శోభా యాసాం తాః.(11)

వారు శిఖల నుండి విడిపోయిన దండల వర్ణములు ఎవరికో వారు - నందుని యింటికి పోవుచున్నవారు. ప్రథమా విభక్త్యర్థమున ద్వితీయా విభక్తి, ఆర్షత్వము వలన - పథి విరేజుః - మార్గమున ప్రకాశించిరి. సవలయాః - కంకణములతో భూషితులైనవారు. 'సబలయ' అను పాఠమున వివిధములైన కానుకలు పట్టుకొని యున్నవారని యర్థము - కదలుచున్న కుండలములు మున్నగు వానితో శోభ ఎవరికో వారు.(11)

శ్లో॥ తా ఆశిషం ప్రయుంజానాశ్చిరం పాహీతి పాలకే ।
హరిద్రాచూర్ణ తైలాద్భిస్సించంత్యోఽజనముజ్జగుః ॥ (12)

తా॥ వారు తమ రక్షకుడగు ఆ శిశువునాశీర్వదించుచు అతనిపై పసుపు, తైలముమున్నగు వానిని చల్లుచు, చిరకాల మీతని రక్షింపుమని పరమేశ్వరునితోననిరి. (ప్రార్థించిరి) (12)

టీ॥ తా ఇతి అజనం సించంత్యః. అజనం భగవంతం ప్రతి. ఉజ్జగురితి వా. (12-14)

టీ॥ అజనం సించంత్యః - కృష్ణుని తడుపుచు - అజనం - భగవంతుని - ప్రతి - భగవంతుని గూర్చి - ఉజ్జగుః ఇతి వా - లేక - వేడుకొనిరి అని. (12 -14)

శ్లో॥ అవాద్యంత విచిత్రాణి వాదిత్రాణి మహోత్సవే ।
కృష్ణే విశ్వేశ్వరేఽనంతే నంద వ్రజ ముపేయుషి ॥ (13)

తా॥ విశ్వమున కంతటికిని ఈశ్వరుడు, అనంతుడును అయిన కృష్ణుడు నందగోకులమున నవతరింపగా ఒక మహోత్సవమయ్యెను. అందు చిత్రవిచిత్రములైన వాద్యములు మ్రోగింపబడసాగెను. (13)

శ్లో॥ గోపాః పరస్పరం హృష్టా దధి క్షీర ఘృతాంబుభిః ।
అసించంతో విలింపంతో నవనీతైశ్చ చిక్షిపుః ॥ (14)

తా॥ పెరుగు, పాలు, నేయి, నీరు, మొదలగువానితో తడుపుకొనుచు, (చల్లుకొనుచు) ఒకరికొకరు వెన్నను పూసికొనుచు (విసరుకొనుచు) గోపాలకులు పరస్పరముగ కృష్ణ జన్మోత్సవమును ఆనందముగా జరుపుకొనుచుండిరి. (14)

శ్లో॥ నందో మహామనాస్తేభ్యో వాసోఽలంకార గోధనమ్ ।
దదౌ ప్రీత మనాస్తత్ర పుత్రజన్మ సుఖైధితః ॥ (15)

తా॥ పుత్రుడు జన్మించుట వలన కలిగిన సుఖముతో నెదిగినవాడైన నందుడు పెద్దమనసుతో వారికి వస్త్రములు, భూషణములు, గోసంపద సంతోషముతో నిచ్చెను. (15)

టీ॥ నంద ఇతి. తేభ్యః ప్రాదాత్. (15)

టీ॥ తేభ్యః ప్రాదాత్ – వారికిచ్చెను. (15)

శ్లో॥ సూత మాగధ వందిభ్యో యేఽన్యే విద్యోపజీవినః ।
తైస్తైః కామై రదీనాత్మా యథోచితమపూజయత్ ॥ (16)

తా॥ సూతులను, మాగధులను, వందిజనులను, ఇంకను ఇతర విద్యలయందు జీవించువారిని వారివారి కోరికలననుసరించి, నందుడు, యథోచిత రీతిగ సంతోషముగ సత్కరించెను. (16)

టీ॥ సూతేతి. యథోచితమన్యానపి అపూజయత్. (16–18)

టీ॥ వీరినేకాక ఇతరులను కూడ యథోచితముగ పూజించెను. (16–18)

శ్లో॥ విష్ణోరారాధనార్థాయ స్వ పుత్రస్యోదయాయ చ ।
రోహిణీ చ మహాభాగా నందగోపాదినందితా ॥ (17)

తా॥ తనకు పుత్రుడు కలిగినందుకు, ఆ సందర్భమున శ్రీహరి నారాధించుట కొఱకును నందుడు ఆ సత్కారములు దానములు

చేసెను. గొప్ప భాగ్యశాలిని యగు రోహిణియు, నందునిచేత గోపాలకుల చేతను అభినందింపబడెను. (రోహిణి వసుదేవుని భార్య –బలరాముని తల్లి, ఆమె రాక వలన తనకు పుత్రోదయమైనదని నందుని ఈ అభినందన) (17)

**శ్లో॥** వ్యచరద్దివ్య వాసస్స్రక్కంఠాభరణ భూషితా ।
తత ఆరభ్య నందస్య వ్రజస్సర్వ స్సమృద్ధిమాన్ ॥ (18)

**తా॥** ఆమె దివ్యమైన వస్త్రములు ధరించి, పూలదండలు, కంఠాభరణములు మున్నగు వాని నలంకరించుకొని, కృష్ణజన్మోత్సవ సంరంభమున ఆ యా పనులను నిర్వర్తించుచు అటు నిటు తిరుగ సాగెను. అది మొదలుకొని నంద వ్రజము సుభిక్షమయ్యెను. (18)

**శ్లో॥** హరేర్నివాసాత్మగుణై రమా క్రీడమభూ న్నృప! ।
గోపాన్ గోకుల రక్షాణాం నిరూప్య మధురాం గతః ॥ (19)

**తా॥** రాజా! శ్రీహరి నివాసమగుటచేత నందవ్రజము సర్వ ప్రేమాస్పదత్వ గుణములు గల లక్ష్మీదేవికి క్రీడాభూమిగ మారెను. కొందఱు గోపాలురను గోకులమును రక్షించుటకు నియమించి నందుడు మధారా నగరమునకుఁబోయెను. (19)

**టీ॥** హరేరితి. హరేర్నివాసేన యే ఆత్మని గుణాః సర్వప్రేమాస్పదత్వాదయః. తైః రమాయాః ఆక్రీడం విహారస్థానం. (19)

**టీ॥** హరేర్నివాసేన – శ్రీకృష్ణుని నివాసముచేత – యే ఆత్మనిగుణాః సర్వ ప్రేమాస్పదత్వాదయః – అందఱిని ప్రేమించుటకాస్పదమైన ఆత్మ యందలి ఏ గుణములు కలవో – వాని చేత – లక్ష్మీదేవి యొక్క విహారస్థానము. (నంద వ్రజమయ్యెను) (19)

**శ్లో॥** నందః కంసస్య వార్షిక్యం కరం దాతుం కురూద్వహ! ।
వసుదేవ ఉపాశ్రుత్య భ్రాతరం నందమాగతమ్ ॥ (20)

**తా॥** కురుకుల శ్రేష్ఠా! నందుడు కంసునకు వార్షికమగు కప్పమును చెల్లించుటకై మధురకు పోయెనుగదా! అచట, సోదరుడగు నందుడు మధురకు వచ్చెనని విని వసుదేవుడు. (20)

**టీ॥** నంద ఇతి. వార్షిక్యం ప్రతివర్షం దాతుం యోగ్యం ధనాది. భ్రాతరం సఖాయం.(20)

**టీ॥** భ్రాతరం – చెలికానిని ( భ్రాతా సహోదరే, మిత్రే పితృవ్యాది సుతేపి చ – అని ధరణి) (20)

**శ్లో॥** జ్ఞాత్వా దత్తకరం రాజ్ఞే యయౌ తదవమోచనమ్ ।
తం దృష్ట్వా సహసోత్థాయ దేహః ప్రాణమివాగతమ్ ॥ (21)

**తా॥** రాజునకు కప్పము చెల్లించినాడని తెలిసికొని వసుదేవుడు నందుని నివాసస్థానమునకు పోయెను. దేహరూపమున నున్న ప్రాణము వలె, వచ్చిన వసుదేవుని చూచి నందుడు వెంటనే లేచి – (21)

**టీ॥** జ్ఞాత్వేతి. తదవమోచనం తస్య నందస్య అవమోచనం నివాస స్థానం. (21)

**టీ॥** తత్ అవమోచనం – ఆ నందుని నివాస స్థానము. (21)

**శ్లో॥** ప్రీతః ప్రియతమం దోర్భ్యాం సస్వజే ప్రేమ విహ్వలః ।
పూజిత స్సుఖమాసీనః పృష్ట్వానామయ మాదృతః ।
ప్రసక్తధీ స్స్వాత్మజయోరిదమాహ విశాంపతే ॥ (22)

**తా॥** మిక్కిలి ప్రేమాస్పదుడైన వసుదేవుని ప్రేమ పరాధీనుడైన నందుడు బాహువులను చాచి ఆతని కౌగలించుకొని అతనిచే సమాదరింపబడి, ఆ పిదప సుఖముగ కూర్చుండి, అతనిని కూర్చుండ జేసి, స్వస్థుడైన ఆతనిని ప్రేమతో కుశలమడిగి – తదుపరి, రాజా! సంభాషించుటకుపక్రమించిన వసుదేవుడు తన కుమారుల క్షేమమును గూర్చి తెలిసికొని ఇట్లనెను. (22)

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

**టీ॥** ప్రీత ఇతి. సస్వజే ఆలింగితవాన్. ఆత్మజయోః రామకృష్ణయోః (22,23)

**టీ॥** స్వాత్మజయోః – బలరామకృష్ణులయొక్క (22,23)

వసుదేవ ఉవాచ.

వసుదేవుడిట్లనెను

**శ్లో॥** దిష్ట్యా భ్రాతః ప్రవయస ఇదానీమప్రజస్య తే ।
ప్రజాశాయా నివృత్తస్య ప్రజా యత్సమపద్యత ॥ (23)

**తా॥** వసుదేవుడిట్లనెను. అన్నా! సంతానము కలుగకుండగ, వయస్సు పైబడి ఇక సంతానము కలుగదను నిరాశతో ఉన్న నీకు ఇప్పుడు పుత్రుడు కలుగుట భాగ్య విశేషము. (23)

**శ్లో॥** దిష్ట్యా సంసార చక్రేఽస్మిన్ వర్తమానం పునర్భవః ।
ఉపలబ్ధో భవానద్య దుర్లభం ప్రియదర్శనమ్ ॥ (24)

**తా॥** (మరణ సదృశమైన నా పూర్వస్థితి నుండి మఱల జన్మించినట్లుగా) ఈ సంసార చక్రమునందు వర్తించుచున్న నాకు నీవు దొరకుట నా అదృష్టము, ప్రియమైన వారి దర్శనము లభించుట దుర్లభము సుమా! (24)

**టీ॥** దిష్ట్యేతి. పునర్భవః పునర్జాత ఇవ తత్ర హేతుగర్భ విశేషణం. సంసారచక్రే వర్తమాన ఇతి. (24)

**టీ॥** పునర్భవః – మఱల జన్మించినవానివలె ఇట హేతు గర్భ విశేషణము, సంసార చక్రమున వర్తించుచున్నవాడను – అని. (24)

**శ్లో॥** నైకత్ర ప్రియ సంవాసస్సుహృదాం చిత్ర కర్మణామ్ ।
ఓఘేన వ్యూహమానానాం ప్లవానాం స్రోతసో యథా ॥ (25)

**తా॥** నదీ ప్రవాహముచేత కొనిపోబడుచున్న గడ్డిపరకలు, కట్టెపుల్లలు ఏ విధముగ ఒక్కచోట నుండక చెదరి పోవుచుండునో అట్లే వివిధ ప్రారబ్ధ కర్మలు గల ప్రేమాస్పదులైన స్నేహితులు, బంధువులు ఒక్కచోట నుండజాలరు. (25)

**టీ॥** దుర్లభత్వమేవాహ–నైకత్రేతి. ప్రియశ్చాసౌ సంవాసశ్చ ప్రియ సంవాసః. హే ప్రియేతి వా. స్రోతసః ఓఘేన నీయమానానాం ప్లవంతీతి ప్లవాః. తృణకాష్ఠాదయః. తేషాం యథా ఏకత్ర నివాసః నాస్తి తద్వత్. (25)

**టీ॥** దుర్లభత్వమునే 'నైకత్ర' అను నీ శ్లోకమున చెప్పుచున్నాడు. ప్రియమైన సహవాసము ప్రియసంవాసము. లేక హే ప్రియ! అను సంబోధనమైనను కావచ్చును. నదీ ప్రవాహముచేత కొనిపోబడుచు నీటిపై తేలియాడు ప్లవములు, గడ్డిపరకలు, కఱ్ఱపుల్లలు మొదలగునవి. వాని ఉనికి ఒక్కచో ఉండజాలని విధమున. (25)

**శ్లో॥** కచ్చిత్పశవ్యం నిరుజం భూమ్యంబు తృణవీరుధమ్ ।
బృహద్వనం తదధునా యత్రాస్తే త్వం సుహృద్యృతః ॥ (26)

**తా॥** ప్రియమైన బంధుమిత్రులతో కూడి నీ విప్పుడు నివసించుచున్న పెద్దవనము, పశువులకు (గోవృషభాదులకు) అనుకూలముగ నున్నదా? అక్కడినేల, నీరు, గడ్డి, పొదలు మొదలగునవి నిర్దోషముగనున్నవి కదా! (26)

**టీ॥** కచ్చిదితి. పశ్వాదిరూపే తస్మిన్ వనే నిర్దోషే గో పయో దధ్యాది ప్రభూత గోపికాస్తన్యాదినా పుత్రక్షేమ వివక్షయా పృచ్ఛతి. శ్లో. "ప్రసక్తధీః స్వాత్మజయో" రిత్యుక్తత్వాత్. (26)

**టీ॥** పశువులకు అనుకూలమగు రూపముగల ఆ నిర్దోషమైన వనము నందు గోవులు, పాలు, పెరుగు, శిశూదయమైన గోపికా స్త్రీలకు పుష్కలమైన చనుబాలు మొదలగు వాని ప్రస్తావనచే పుత్రుల క్షేమమును గూర్చి తెలిసికొనగోరువాడై అడుగుచున్నాడు. "తన కొడుకుల యొక్క కుశల వార్తను ప్రస్తావించు బుద్ధి గలవాడై" అని లోగడ చెప్పి యున్నందు వలన – (26)

**శ్లో॥** భ్రాతర్మమ సుతః కశ్చిన్మాత్రా సహ భవద్వ్రజే ।
తాతం భవంతం మన్వానో భవద్భ్యాముప లాలితః ॥ (27)

**తా॥** అన్నా! మీ వ్రజమునందు నా కుమారుడు తల్లితో కూడ కుశలముగ నున్నాడు కదా! మీచేత గారాబముగ చూడబడుచు నిన్నే తండ్రిగ భావించుచున్నాడా? (27)

**టీ॥** భ్రాతరితి. భవద్భ్యాముపలాలితస్సన్ కచ్చిత్, వర్తత ఇతి శేషః (27)

**టీ॥** మీ చేత లాలింపబడుచు సుఖముగనున్నాడా అని ఊహ్యము (శేషము) (27)

**శ్లో॥** పుంసస్త్రివర్గో విహిత స్సుహృదో హ్యనుభావితః ।
న తేషు క్లిశ్య మానేషు త్రివర్గోఽర్థాయ కల్పతే ॥ (28)

**తా॥** పురుషునకు ధర్మార్థ కామములు అను పురుషార్థములు అతని బంధు మిత్రాదులను సంతోషింపజేయుట కొఱకు విధింపబడినవి. వారు కష్టములు పడుచుండగా నిర్వహింపబడు ఆ త్రివర్గము(లు) ప్రయోజనకారులు కావు. (28)

**టీ॥** పుత్రాదర్శనక్లేశేనాహ – పుంస ఇతి. సుషహృదో బంధూన్ ప్రతి. అనుభావితః సంభావితః యస్త్రి వర్గః స హి పుంసో విహితో యుక్తః శాస్త్రేణ వా ప్రోక్తః న స్వమాత్రపర్యవసితః అతస్తేషు క్లిశ్యమానేషు సుఖాయ న భవతీత్యర్థః. (28)

**టీ॥** పుత్రుని చూడకపోవుటవలన కలిగిన క్లేశముతో చెప్పుచున్నాడు. సుహృదః – బంధువులనుగూర్చి – అనుభావితః – సంభావించునట్టి –యః త్రివర్గః – ఏ ధర్మార్థ కామములనెడి మూడింటి వర్గము గలదో – అదియే పురుషునకు విధింపడినది – యుక్తమైనది. శాస్త్రముచేత చెప్పబడినదైనను తనకు మాత్రమే ఫలమిచ్చునది కాదు. అందువలన బంధువులు కష్ట పడుచుండగా తన సుఖము కొఱకు అది పర్యవసింపదు. అని యర్థము. (28)

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

నంద ఉవాచ.

**శ్లో॥** అహో తే దేవకీ పుత్రాః కంసేన బహవో హతాః ।
ఏకావశిష్టావరజా కన్యా సాపి దివంగతా ॥ (29)

**టీ॥** నందో వసుదేవం సాంత్వయన్నాహ - అహో ఇతి.(29)

**శ్లో॥** న్యూనం హ్యదృష్ట నిష్ఠో యమదృష్ట పరమో జనః ।
అదృష్ట మాత్మనస్తత్త్వం యో వేద న స ముహ్యతి ॥ (30)

**టీ॥** నూనమితి. అదృష్ట ఏవ నిష్ఠా సమాప్తిర్యస్య సః. యథైవ పుత్రాదిసుఖప్రదం అదృష్టం హీయతే తథైవ తే పుత్రాదయో న భవంతీత్యర్థః. అదృష్టపరమః. అదృష్టమేవ పరమం యస్య సః యద్యపి పుత్రాదయోఽపి- యుక్తాః తథాపి తానదృష్టమేవ పునస్సంగమయతీత్యర్థః. ఏవం అదృష్టమాత్మనస్తత్త్వం అవ్యభిచారికారణం సుఖదుఃఖయోర్యో వేద న స ముహ్యతి తస్మాదిదానీం త్వయా న దుఃఖం భావనీయం. మృతానాం వియుక్తానామపి చ. కాలాంతరే దర్శన యోగ వియోగ సంభవాత్. అస్మదాదిభిరపి కాలాంతరే తద్వియోగే సత్యపీతి.

నందుడిట్లనెను.

**తా॥** అహో! నీకును దేవకికిని కలిగిన చాలమంది పుత్రులు కంసుని చేత చంపబడిరి. చివరకు పుట్టిన కన్య మిగిలెను, కాని ఆమెకూడ స్వర్గమునకు పోయెను. (29)

**టీ॥** నందుడు వసుదేవుని ఓదార్చుచు 'అహో' అని ఈ శ్లోకమున చెప్పుచున్నాడు. (29)

**తా॥** ఈ మనుష్యుడు చివరి వఱకును అదృష్టము నందే ఆధారపడి ఉండువాడు. అదృష్టమే సర్వోపరిగా నుండువాడు. ఏలయన అదృష్టమ నునది ఆత్మతత్త్వము. ఈ విషయము నెవడు తెలిసికొనగలుగునో వాడు మోహమును చెందడు. (30)

**టీ॥** అదృష్టమే సమాప్తిగా కలవాడెవడోవాడు - పుత్రాది సుఖప్రదమైన అదృష్టమెట్లు కలుగదో అట్లే అట్టి పుత్రాదులు కలుగకుందురని యర్థము. అదృష్టమే పరమముగా గలవాడు అదృష్టపరముడు. పుత్రాదుల కలిగియుండుట యెట్లో అట్లే అదృష్టము వారిని మఱల కలిసికొనునట్లు చేయునని అర్థము. ఈ విధముగ అదృష్టమనునది ఆత్మయొక్క తత్త్వము. అన్యథా వర్తింపని కారణము. సుఖదుఃఖములలో ఎవడీ విషయము నెఱుగునో వాడు మోహమును పొందడు. అందువలన ఇప్పుడు నీవు దుఃఖమును పొందవలదు. చనిపోయిన

నందస్య దైవీ వాగేషా భావిసూచికా. (30)

వారిని గుఱించియు, విడిచియుండు వారి గుఱించియును. కాలాంతర మున దర్శనయోగము వియోగము సంభావ్యములగుట వలన – కాలాంతరమున మా వంటి వారిచే కూడ అట్టి వియోగము కలిగినను – అని, నందుని ఈ దైవీ వాక్కు భవిష్యత్తును సూచించునది. (30)

వసుదేవ ఉవాచ.

శ్లో॥ కరో హి వార్షికో దత్తో రాజ్ఞే దృష్టా వయం చ వః ॥
నేహ స్థేయం బహు తిథం సంత్యుత్పాతాశ్చ గోకులే ॥(31)

వసుదేవుడు ఇట్లనెను

తా॥ రాజుకు సంవత్సరమునకు చెల్లింపవలసిన కప్పము చెల్లంపబడినది. మనము ఒకరినొకరు చూచుకొనుట జరిగినది. ఇక నీవిక్కడ ఎక్కువ దినములుండ రాదు. గోకులమున ఉత్పాతములు కలుగుచున్నవి. (31)

టీ॥ తాం బుద్ధ్వా వసుదేవో దుఃఖం త్యక్త్వా నందమాహ–కర ఇతి. వః యుష్మాభిః. (31.32)

టీ॥ నందుని వాక్యమును తెలిసికొని వసుదేవుడు దుఃఖించుట మాని నందునితో చెప్పెను 'కరః' అని. వః – మీతో. (31,32)

శ్లో॥ ఇతి నందాదయో గోపాః ప్రోక్తాస్తే శౌరిణా యయుః ।
అనోభిరనడు ద్యుక్తైస్తమనుజ్ఞాప్య గోకులమ్ ॥ (32)

తా॥ అని యిట్లు వసుదేవుడు చెప్పగానే నందుడు మొదలుకొని గోపాలకులు, వసుదేవుని వద్ద సెలవుతీసికొని ఎడ్లను బూంచిన బండ్ల పైన, గోకులమునకు పోయిరి. (32)

**శ్రీ మద్భాగవతే, మహాపురాణే దశమస్కంధే, పంచమోఽధ్యాయః**

**అని శ్రీమద్భాగవతమున దశమస్కంధమందు ఐదవ అధ్యాయము సమాప్తము.**

## షష్ఠోఽధ్యాయః

**శ్రీశుక ఉవాచ.**

శ్లో॥ నందః పథి వచశ్శౌరేర్న మృషేతి విచింతయన్ ।
హరిం జగామ శరణ ముత్పాతాగమ శంకితః ॥ (1)

టీ॥ శ్లో. "షష్ఠే సఖ్యుర్గిరా నందో వ్రజం గచ్ఛన్ మృతాం పథి, దృష్ట్వా తు రాక్షసీం తస్యా మృత్యుం శ్రుత్వా తు విస్మితః". (1,2)

శ్లో॥ కంసేన ప్రహితా ఘోరా పూతనా బాలఘాతినీ ।
శిశూంశ్చచార నిఘ్నంతీ పురగ్రామ వ్రజాదిషు ॥ (2)

శ్లో॥ న యత్ర శ్రవణాదీని రక్షోఘ్నాని స్వకర్మసు ।
కుర్వంతి సాత్త్వతాం పత్యుర్యాతుధాన్యశ్చ తత్ర హి ॥ (3)

## ఆరవ అధ్యాయము

**శ్రీశుక ఉవాచ.**

తా॥ నందుడు మార్గము నందు, వసుదేవుని మాట అసత్యము కాదని ఆలోచించుచు, ఏవియైనను ఉత్పాతములు కలుగునేమో అను సందేహముతో శ్రీహరినే శరణుగోరెను. (1)

టీ॥ ఆఱవ అధ్యాయమున – మిత్రుని మాటతో నందుడు గొల్లపల్లెకు బోవుచు, మార్గమధ్యమున, రాక్షసిని, దాని మరణమును (చూచి) విని, ఆశ్చర్యపడెను. (1–2)

తా॥ కంసుని చేత పంపబడిన పూతనయను భయంకరమగు శిశువులను జంపు రాక్షసి ఆయా పట్టణములలో పల్లెలలో గూడెములలో శిశువులను చంపుచు తిరుగసాగెను. (2)

తా॥ తమ తమ కర్మలయందు ఎవరెవరు ఎచ్చటెచ్చట శ్రీకృష్ణప్రభువు యొక్క శ్రవణము, కీర్తనము మున్నగునవి చేయుదురో వారికి అచ్చట రాక్షసుల బాధలుఉండవు. దానవ పిశాచ యక్ష వేతాళ భూత ప్రేతాది బాధలును ఉండవు. శ్రవణకీర్తనాదులు లేనిచోటులందు ఈ విధములైన బాధలు ఉండునని భావము. (3)

**టీ॥** శ్రీకృష్ణ విషయే శంకమానం రాజానం ప్రతి. అవిషయే ప్రవృత్తా. సైవ మరిష్యతీతి సూచయన్నాహ – నేతి. యత్ర శ్రీకృష్ణస్య శ్రవణాదీని న సంతి. తత్రైవ తాసాం శక్తిః సాక్షాత్తస్మిన్నేవ సతి కా శంకేతి భావః. (3)

**టీ॥** శ్రీకృష్ణుని విషయమున శంకించుచున్న రాజును గూర్చి – అవిషయమందు శంక ప్రవర్తించుచున్నది. అతడెట్టి పరిస్థితిలోను మరణింపడని సూచించుచు చెప్పుచున్నాడు. ఎచట శ్రీకృష్ణుని శ్రవణాదులుండవో అచట ఈ శక్తులు ఉండును. – సాక్షాత్తుగ అతడే ఉండగా ఇక అనుమానమెందులకని భావము.(3)

**శ్లో॥** సా ఖేచర్యేకదోపేత్య పూతనా నందగోకులమ్ ।
యోషిత్వా మాయయాత్మానం ప్రావిశత్కామచారిణీ ॥ (4)

**తా॥** ఆకాశ సంచారిణియగు నా పూతన తన మాయచేత ఒక స్త్రీ రూపమును ధరించి, కామచారిణియై నందగోకులమును ప్రవేశించెను. ప్రవేశించి – (4)

**టీ॥** సేతి. యోషిత్వావేషతో వరాం నారీమివ ఆత్మానం విధాయ గోపిత్వేతి పాఠాంతరే ఆత్మానం తిరోధాయేత్యర్థః. నను తత్ర నిర్లజ్జా నిర్విశంకా చ సతీ కథం పరసద్మ ప్రవిష్టా. అత ఆహ–కామచారిణీతి. న హి కామచారిణీషు ఇదం చిత్రమిత్యర్థః.. (4)

**టీ॥** యోషిత్వావేషతః – శ్రేష్ఠమైన స్త్రీవలె తనను తాను మలచుకొని – 'గోపిత్వతా' అను పాఠాంతరమున, తనను తాను దాచుకొని అని యర్థము. అచట మఱి సిగ్గులేక – సందేహము లేకుండగా పర గృహమునందెట్లు ప్రవేశించెను? దానికి చెప్పుచున్నాడు. కామచారిణి అని. ఇష్టమైన చోటికి ఇష్టమైన రీతిగ పోవుట, వచ్చుట మున్నగునవి చేయ గల వారి యందు ఇట్టిది విచిత్రముకాదని యర్థము. (4)

**శ్లో॥** తాం కేశ బంధ వ్యతిషిక్త మల్లికాం
బృహన్నితంబ స్తన కృచ్ఛ్ర మధ్యమామ్ ।
సువాససం కంపిత కర్ణభూషణ
త్విషోల్లసత్కుంతల మండితాననామ్ ॥ (5)

**తా॥** సిగలో మల్లెపూవులను పెట్టుకొనినట్టిదియు, గొప్పపిరుదులు, స్తనములు గలిగి యున్నట్టిదియును, సన్నని నడుము గలదియును, విలువైన వస్త్రములు ధరించి యున్నదియు, కదలుచున్న కర్ణా భరణములు, నల్లని కాంతితో ప్రకాశించు తల వెంట్రుకలతో అలంకరింపబడి యున్న ముఖము కలిగి యున్న ఆమెను - (5)

**టీ॥** - తామితి. తాం వనితాం. పతిం ద్రష్టుం ఆగతాం అతి రూపవతీం శ్రియమివ. గోప్యాఉ మంసతేత్యుత్తరశ్లోకేనాన్వయః. శ్రీసామ్యార్థాని విశేషణాని. కేశబంధవ్యతిషిక్తమల్లికాం కేశబంధః కేశపాశః తస్మిన్ విన్యస్తమల్లికాకుసుమాం బృహతా నితంబేన స్తనాభ్యాం చ. ఉభయత ఆక్రాంతమివ కృచ్ఛ్రం కృశం మధ్య ముదరం యస్యాస్తాం సువాససం రమణీయే వాససీ యస్యాస్తాం. కంపితయోః కర్ణ భూషణయోః త్విషా. ఉల్లసద్భిః కుంతలైః మండితమాననం యస్యాస్తాం. (5)

**టీ॥** ఆ స్త్రీని - భర్తను చూచుటకు వచ్చిన మిక్కిలి సౌందర్యవతి యగు లక్ష్మిని వలె - గోపికలు 'అనుకొనిరి' అని ఉత్తర శ్లోకమునందలి పదముతో అన్వయము. లక్ష్మీదేవితో సామ్యముగల అర్థములు గలవి విశేషణములు. కేశబంధ వ్యతిషిక్త మల్లికాం - కేశబంధః - సిగ - దానిపై ఉంచబడిన మల్లెపూలు గలది. గొప్పనైన జఘనము చేత, స్తనముల తోను - ఇరువైపుల ఆక్రమించియున్నట్లు - కృచ్ఛ్రం - కృశించిన మధ్యం - కడుపు ఎవరికో అట్టి దానిని - సువాససం - అందమైన వస్త్రములు ఎవరికో అట్టిదానిని - కదలుచున్న కర్ణా భరణములు - కాంతి చేత ప్రకాశించు వెంట్రుకల చేత అలంకృతమైన ముఖము ఎవతెకు గలవో అట్టి దానిని- (5)

**శ్లో॥** వల్గుస్మితాపాంగ విసర్గవీక్షితైః
మనో హరంతీం వనితాం వ్రజౌకసామ్ ।
అమంసతాంభోజ కరేణ రూపిణీం
గోప్యః శ్రియం ద్రష్టుమివాగతాం పతిమ్ ॥ (6)

**తా॥** అందమైన చిరునవ్వుతో కూడి సారించు కొస చూపులతో, వ్రజవాసుల మనస్సులను చూరగొనుచున్న ఆ స్త్రీని, తామర పూవును చేత ధరించి యున్న ఆ సౌందర్యవతిని, తన భర్త యగు శ్రీమన్నారాయణుని చూచుటకు వచ్చిన లక్ష్మీదేవిగా అక్కడి గోపికలు భావించిరి. (ఊహించుకొనిరి) (6)

**టీ॥** వల్గ్వితి. వల్గుస్మితాపాంగవిసర్గ వీక్షితైః. వల్గు రమ్యం స్మితం యేషు తే తథాభూతా అపాంగ విసర్గా యేషు తైః వీక్షితైః. వ్రజౌకసాం మనః హరంతీం. అతో గోపాః. హృష్టమనసస్త్వే నాం న నివారిత ఇత్యుక్తం భవతి. గోప్యశ్చ శ్రియమివ మత్వా, తూష్ణీమాసన్. అతః కేనాప్య నివారితా సతీ. ప్రవివేశేతి భావః. (6)

**టీ॥** వల్గుస్మితాపాంగ విసర్గ వీక్షితైః – వల్గు – రమ్యమైన – స్మితం – (చిరునగవు) వేనియందో అవి అట్టివి. అపాంగ విసర్గాః – కొస చూపుల సారించునవి. వేని యందో అట్టి చూపులచే వ్రజవాసుల మనస్సును చూరగొనుచున్న దానిని. అందువలన గోపాలకులు సంతోషించిన మనస్సులు గలవారై ఈమెను నివారించలేదని చెప్పినట్లైనది. గోపస్త్రీలును లక్ష్మిని వలె భావించి ఊరకనుండిరి, అందువలన ఎవరి చేత కూడను నివారింపబడనిదై ప్రవేశించెనని భావము. (6)

**శ్లో॥** బాలగ్రహస్తత్ర విచిన్వతీ శిశూన్
యదృచ్ఛయా నంద గృహేఽసదంతకమ్ ।
బాలం ప్రతిచ్ఛన్న నిజోరు తేజసమ్
దదర్శ తం చాగ్నిమివాహితం భసి ॥ (7)

**తా॥** బాలగ్రహమైన పూతన, అచట శిశువులను వెదకుచు, నందుని గృహమున, దుష్టసంహారకుడు, చిన్నవాడును బాలనాట్యముతో, తన అద్భుతమైన తేజస్సును దాచి యుంచిన వాడును (భస్మమునందు దాగియున్న ఆహితాగ్నినివలె) అయిన అతనిని యాదృచ్ఛికముగనే చూచెను. (7)

**టీ॥** బాలగ్రహ ఇతి. బాలగ్రహః పూతనా. అసదంతకం బాలం దదర్శ. అసతామంతకం దృష్ట్వా. కథం న బిభేతి. తత్రాహ–ప్రతిచ్ఛన్న నిజోరు తేజసం బాల నాట్యేన ప్రతిచ్ఛన్నం తిరోహితం నిజం ఉరు తేజో యేన తం. కమివ. భసి భస్మని ఆహితమగ్నిమివేతి భావః. (7)

**టీ॥** బాలగ్రహః – పూతన – అసదంతకం – దుష్టశిక్షకుడైన – బాలం – చిన్నవానిని దదర్శ – చూచెను – అసతాం అంతకం – దుష్టులను సంహరించువానిని – దృష్ట్వా – చూచి భయపడకుండుట ఎట్లు? – చెప్పుచున్నాడు – ప్రతిచ్ఛన్ననిజోరు తేజసం – పసి వాని నాట్యముచేత – ప్రతిచ్ఛన్నం – దాచివేసిన తన గొప్పతేజస్సు ఎవని చేతనో అట్టి వానిని – భసి – భస్మమునందు – (దాగియున్న) ఆహితాగ్నిని వలెనని భావము. (7)

**శ్లో॥** విబుద్ధ్య తాం బాలక మారికా గ్రహం
చరాచరాత్మా స నిమీలితేక్షణః ।
ఆజ్ఞాయమానోఽథ హరిర్నిశాచరీం
నిసర్గ విజ్ఞాత జగద్విచేష్టితః ॥ (8)

**తా॥** చేతనములు జడములు తానేయైన ఆతడు ఆమెను బాలకులను జంపెడు గ్రహముగ తెలిసికొని, కనులుమూసికొని, స్వతస్సిద్ధముగ త్రికాలముల యందలి సర్వ జగత్సన్నివేశములను, సాకల్యముగ తెలిసియున్న ఆ శ్రీమన్నారాయణుడు ఆ రాక్షస స్త్రీని గూర్చిన పూర్వాపర విశేషములను అన్నింటిని సమగ్రముగ గ్రహించెను. (8)

**టీ॥** విబుద్ధ్యేతి. చరాచరాత్మత్వాదేవ. తాం విబుద్ధ్య నిమీలితేక్షణః. ఆసన్. (8)

**టీ॥** చరాచరాత్మత్వము వలననే ఆమెను తెలిసికొని – కనులు మూసికొనిన వాడయ్యెను. (8)

**శ్లో॥** మహేశ్వరత్వేఽపి చ బాలభావం
విభావయన్ కించిదువాచ న ప్రభుః ।
అనంతమారోపయదంకమంతకం
యథోరగం సుప్తమ బుద్ధి రజ్జు ధీః ॥ (9)

**తా॥** విశ్వప్రభుత్వమున్నను తనను తాను పసివానిగనే భావించుచు ఆప్రభువు ఏమియు పలుకక మిన్నకుండెను. నిదురించుచున్న పామును బుద్ధిహీనుడు త్రాడు అనుబుద్ధితో ఒడిలో పెట్టుకొనినట్లు ఆ పూతన, అనంతుడు, అంతకుడును అయిన కృష్ణుని ఒడిలో జేర్చుకొనెను.(9)

**టీ॥** మహేశ్వరత్వేఽపీతి. స్వయమనంతం. దుష్టానామంతకం సా అంకమారోపయత్. బాలమితి మత్వా. యథా ఉరగం సుప్తం. అబుద్ధిశ్చాసౌ రజ్జుధీశ్చ సః. అజ్ఞానతో రజ్జుబుద్ధ్యా గృహ్ణాతి యథా. తద్వదితి. (9)

**టీ॥** స్వయముగ అంతము (ఆదియు) లేని వానిని, దుష్టులను సంహరించు వానిని, పసివాడినని తలచి నిందురించుచున్న వానిని– ఆమె, ఒడిలోని కెక్కించు కొనెను. సర్పమును బుద్ధిహీనుడు, అజ్ఞానముతో త్రాడు అను బుద్ధితో, త్రాడను భావమున ఎట్లు తీసికొనునో – అట్లే – అని. (9)

**శ్లో॥** తాం తీక్ష్ణ చిత్తామతి వామ చేష్టితాం
వీక్ష్యాంతరా కోశ పరిచ్ఛదాసివత్ ।
వరస్త్రియం తత్ప్రభయా చ ధర్షితే
నిరీక్షమాణే జననీ హ్యతిష్ఠతామ్ ॥ (10)

**తా॥** ఒరలో దాగియున్న కత్తివలె, లోన తీక్ష్ణమైన మనస్సు, పైకి ఒప్పిదమైన చర్యలు కలిగి, ఉత్తమజాతి స్త్రీవలె కనబడుచున్న ఆ పూతనను తమ ఇంటిలోపల చూచిన యశోదా రోహిణులు అను ఇరువురు తల్లులు, ఆమె తళుకును తిరస్కార భావముతో గమనించుచు ఉండిపోయిరి. ఆమె ప్రభచేత తిరస్కరింపబడి చూచుచు ఉండిపోయిరి. (10)

**టీ॥** నను యశోదా రోహిణ్యౌ తాం కథం న న్యవారయతాం తత్రాహ.–తామితి. వామం వల్గు. జనన్యా ఇవ చేష్టితం యస్యాస్తాం. వరస్త్రియం చ. సహసైవ అంతరా గృహమధ్యే వీక్ష్య అంతస్తైక్ష్ణ్యేన బహిర్మార్దవేన. దృష్టాంతః. కోశపరిచ్ఛదాసివత్. మృదుచిత్రచర్మమయః కోశః పరిచ్ఛదః ఆవరణం యస్య అసేః ఖడ్గస్య తద్వత్ తత్ప్రభయా చ ధర్షితే అభిభూతే. అహమస్య జననీ ఇయం వేతి మోహితే చ సత్యౌ జనీజనన్యౌ. నిరీక్షమాణే ఏవ. కేవలమతిష్ఠతాం న తు నివారితవత్యౌ. 10

**టీ॥** వామం – రమ్యమైన – యశోదా రోహిణులు ఆమెను – ఎట్లు నివారించలేకపోయిరో ఇట తెలుపుచున్నాడు. తల్లివలె ప్రవర్తన ఎవరికో అట్టి ఆమెను. శ్రేష్ఠమైన స్త్రీని అనికూడ – సాహసించి – గృహ మధ్యమున వీక్షించి – లోపల వాడిమి చేత, పైకి మృదుత్వముచేత – దృష్టాంతము. 'కోశపరిచ్ఛదాసివత్' – మెత్తని, చిత్రవర్ణముగల చర్మముతో చేయబడిన ఒర – పరిచ్ఛదః – కప్పు – ఆవరణము ఏ ఖడ్గమునకో దానివలె. ఆమె కాంతి చేత తిరస్కరింపబడినవారై, నేను

ఇతని తల్లినేనా? లేక ఈమెయా? అని భ్రమపడుచు - జననీ - ఇద్దఱు తల్లులు (ఆర్షము) చూచుచునే ఉండిరి, కేవలము ఉండిపోయిరే తప్ప ఆమెను నివారింపలేకపోయిరి. (10)

**శ్లో॥** తస్మిన్ స్తనం దుర్జర వీర్యముల్బణం
ఘోరాంకమాదాయ శిశోర్దదావథ ।
గాఢం కరాభ్యాం భగవాన్ ప్రపీడ్య తత్
ప్రాణైస్సమం రోషసమన్వితోఽపిబత్ ॥ (11)

**తా॥** భయంకరమగు ఆ పూతన కృష్ణుని ఒడిలోనికి తీసికొని, శక్తివంతమైన విషముతో నతిశయించియున్న తన స్తనమును అతని నోటి కందించెను. భగవానుడును మిక్కిలి కోపముతో చేతులతో దానిని గట్టిగ పీడించుచు, ప్రాణములతో సహా ఆమె స్తన్యమును త్రాగెను.(11)

**టీ॥** తస్మిన్నితి. తస్మిన్ స్థానే దుర్జరం వీర్యం విషం యస్మిన్ తం. స్తనం. తం శ్రీకృష్ణం. అంకమాదాయ తస్మై శిశవే దదౌ. అథ అనంతరమేవ ప్రపీడ్య కేవలం విషమపథ్యమితి. మత్వేవ. తస్యాః ప్రాణైస్సహాపిబత్. (11)

**టీ॥** ఆ స్థానమునందు - మారకమగు విషము దేనియందో దానిని - స్తనమును - శ్రీకృష్ణుని ఒడిలోనికి తీసికొని - ఆ శిశువున కిచ్చెను. ఆ తరువాతనే - మిక్కిలిగ పీడించి, విషము అపథ్యమని భావించియే ఆమె ప్రాణములతో కూడ త్రాగెను. (11)

**శ్లో॥** సా ముంచ ముంచాలమితి ప్రభాషిణీ
నిష్పీడ్యమానా ఖిల జీవమర్మణీ ।
వివృత్య నేత్రే చరణౌ భుజౌ ముహుః
ప్రస్విన్నగాత్రా క్షిపతీ రురోద హ ॥ (12)

**తా॥** ఆమె "విడువుము! విడువుము! ఇక చాలును." అని బిగ్గరగా అరచుచు, జీవస్థానములన్నియు మిక్కిలిగ పీడింపబడుచున్నదై, కన్నులు తేలవేసి, కాళ్ళు చేతులు మఱల మఱల కొట్టుకొనుచు ఒడలంతయు చెమటతో తడిసిపోయినదై, క్రింద పడుచు ఏడ్చుచుండెను. (12)

**టీ॥** సేతి. చరణౌ భుజౌ చ ముహుర్ముహుః. క్షిపతి స్విన్నాని స్వేదయుక్తాని గాత్రాణి యస్యాస్సా. (12)

**టీ॥** కాళ్ళు చేతులు మాటిమాటికి పారవేయుచు చెమటతోకూడిన అవయవములు గలిగియుండినదెవరో ఆమె. (12)

**శ్లో॥** తస్యాస్స్వనే నాతి గభీర రంహసా
సాద్రిర్మహీ ద్యౌశ్చ చచాల సగ్రహా ।
రసా దిశశ్చ ప్రతినేదిరే జనాః
పేతుః క్షితౌ వజ్రనిపాత శంకయా (13)

**తా॥** లోంతైనదియు, త్వరపాటు గలదియునైన ఆమె ధ్వనిచేత కొండలతో కూడిన భూమియు, గ్రహములతో గూడిన ఆకాశము చలించి పోయెను. రసాతలము వఱకు గల అధోలోకములు, దిక్కులు ప్రతిధ్వనించెను. పిడుగు పడినదేమో అను భ్రమతో జనులు నేలపై పడిపోయిరి. (13)

**టీ॥** తస్యా ఇతి. రసాః రసాతలాని చ. (13)

**టీ॥** రసాః రసాతలములు కూడ. (13)

**శ్లో॥** నిశాచరీత్థం వ్యథిత స్తనావ్యసు
ర్వ్యాదాయ కేశాంశ్చరణౌ భుజావపి
ప్రసార్య గోష్ఠే నిజరూపమాస్థితా
వజ్రాహతో వృత్ర ఇవాపతన్నృప! ॥ (14)

**తా॥** ఇట్లు ఆ రాక్షసస్త్రీ మిక్కిల పీడింపబడిన స్తనములు గలదియై, నోరుతెరచి, తలవెంట్రుకలు కాళ్ళు, చేతులు ప్రసరింపజేసి, నిజ రూపమును పొంది, వజ్రాయుధముతో కొట్టబడిన వృత్రాసురునివలె ప్రాణములు విడిచి పశుశాలలో పడిపోయెను. (14)

**టీ॥** నిశాచరీతి. వ్యాదాయ ముఖం వివృత్య. నిజరూపమాస్థితా మరణసమయే. కాపట్యం న యుజ్యత ఇతి భావః. వికీర్యేతి పాఠాంతరే కేశాన్ వికీర్య చరణౌ భుజావతి ప్రసార్యేతి భావః. (14)

**టీ॥** వ్యాదాయ – నోరు తెరచి – మరణసమయమున తన నిజ రూపమును పొందినది కపటత్వము కుదరదని భావము. వికీర్య అను పాఠాంతరమున తలవెంట్రుకలను చెదరింపచేసి, కాళ్ళు చేతులు ప్రసరింపజేసి అని భావము. (14)

**శ్లో॥** పతమానోఽపి తద్దేహః త్రిగవ్యూత్యంతర ద్రుమాన్ ।
చూర్ణయామాస రాజేంద్ర! మహదాసీత్తదద్భుతమ్ ॥ 15

**టీ॥** పతమాన ఇతి. పతన్నపితస్యాః దేహః షట్క్రోశమధ్యవర్తినో ద్రుమాంశ్చ చూర్ణీచకార. (15)

**తా॥** రాజా ! పడిపోవుచున్నదైనను ఆ పూతన శరీరము మిక్కిలి (గొప్ప) ఆశ్చర్యము గొల్పుచూ ఆఱు కోసుల వఱకును గల చెట్లను చూర్ణములుగ చేసెను. (15)

**టీ॥** పడిపోవుచును కూడ ఆమె శరీరము ఆఱు కోసుల మధ్యన గల చెట్లను కూడ పిండి చేసెను. (15)

**శ్లో॥** ఈషామాత్రోగ్ర దంష్ట్రాస్యం గిరి కందర నాసికమ్ ।
గండశైల స్తనం రౌద్రం ప్రకీర్ణారుణ మూర్ధజమ్ ॥ (16)

**టీ॥** ఈషేతి. ఈషామాత్రోగ్ర దంష్ట్రాస్యం ఈషా లాగలదండః. తత్ప్రమాణా ఉగ్రా దంష్ట్రా యస్మిన్ తత్ గిరేః చ్యుతౌ స్థూలోపలౌ తావివ స్థూలౌ స్తనౌ యస్మిన్ తత్. రౌద్రం ఘోరం ప్రకీర్ణా అరుణా మూర్ధజా యస్మిన్ తత్. (16)

**తా॥** నాగలి కఱ్ఱ పరిమాణమునగల భయం కరమగు కోఱలతో గూడిన ముఖము, కొండ గుహల వంటి రంధ్రములు గల ముక్కు, కొండలపై నుండి జారిన పెద్దఱాతి గుండ్ల వంటి స్తనములు, చెల్లా చెదురుగ నుండి భయము కలిగించు ఎఱ్ఱని తలవెంట్రుకలు కలది.(16)

**టీ॥** ఈషా – లాగలదండము. నాగేటికొయ్య – దాని ప్రమాణమున భీకరమైన కోరలు దేనియందు గలవో అట్టి ముఖము దేనియందు గలదో అట్టి భయమును కలిగించు కారణముచే ఇంకను ఎనిమిది పదముల చేత విశేషించి చెప్పుచున్నాడు. – కొండగుహల వంటి రెండుముక్కురంధ్రములు దేనియందు గలవో అది. కొండపై నుండి జారి పడిన రెండు స్థూలములైన ఱాళ్ళవలె స్థూలములైన (లావైన) స్తనములు దేనియందో అది – భయము గొలుపు నట్టిది చెదురు చెదురుగనున్న ఎఱ్ఱని తలవెంట్రుకలు దేనియందో అది.(16)

**శ్లో॥** అంధకూప గభీరాక్షం పులినారోహ భీషణమ్ ।
బద్ధసేతు భుజోర్వంఘ్రి శూన్యతోయ హ్రదోదరమ్ ॥ (17)

**తా॥** చీఁకటి బావులవంటి లోఁతైన కన్నులు, ఇసుక తిన్నెలవంటి ఎత్తైన జఘన ప్రదేశములతో భయంకరమైనది, వానిచేత కట్టబడిన ఆనకట్టల వలె అటు భుజములు ఇటు తొడలు పాదములు గలది, నీరు లేని సరస్సు వంటి కుక్షిభాగము గలదిగ ఆ పూతనదేహము ఉండెను. (17)

**టీ॥** అంధకూపేతి. అంధకూపావివ గభీరే అక్షిణీ యస్మిన్ తత్. పులినవదారోహే జఘనే తాభ్యాం భీషణం బద్ధాః సేతవ ఇవ భుజౌ ఊరూ అంఘ్రీ చ యస్మిన్ తత్ శూన్యతోయ హ్రద ఇవ ఉదరం యస్మిన్ తత్. (17)

**టీ॥** చీకటి బావులవలె లోతైన రెండు కన్నులు దేని యందో అది. ఇసుక తిన్నెల వంటి రెండు భుజములు, రెండు తొడలు, రెండు పాదములు కూడ దేనియందో అది. నీరు లేని హ్రదమువంటి కడుపు దేనియందో అది. (ఆ దేహము) (17)

**శ్లో॥** సంతత్రసు స్తదుద్వీక్ష్య గోపా గోప్యః కళేబరమ్ ।
పూర్వం తు తన్నిస్స్వనిత భిన్న హృత్కర్ణ మస్తకాః ॥ (18)

**తా॥** ఆమె చనిపోవుటకు ముందు దాని ధ్వనిని వినిన గోపాలురు గోపికలు తమ హృదయములు బ్రద్దలై, చెవులు చిల్లులుపడి, మెదడులు ముక్కలు కాగా, ఇప్పుడు ఆ కళేబరమును ఆశ్చర్యమున చూచి భయపడిరి. (18)

**టీ॥** పూర్వమేవ తస్యాః శబ్దేన భీతాః పునర్దర్శనేనాతిత త్రసురిత్యాహ.-సంతత్రసురితి. తస్యాః నిస్స్వనితం అతి భయంకర శబ్దః తేన భిన్నాని హృత్కర్ణ మస్తకాని యేషాం తే. (18 - 20)

**టీ॥** పూర్వమే దాని శబ్దముచేత భయము చెందినవారై మఱల చూచుట చేత మిక్కిలి భయపడిరని చెప్పుచున్నాడు. తస్యాః నిస్స్వనితం - మిక్కిలిభయంకర శబ్దము-దానిచే పగిలిన హృదయములు, చెవులు, తలలు ఎవరికి గలవో వారు.(గోపాలురు - గోపికలు) (18-20)

శ్లో॥ బాలం చ తస్యా ఉపరి క్రీడంతమకుతో భయమ్ ।
గోప్య స్తూర్ణం సముత్పత్య జగృహుర్జాత సంభ్రమాః ॥ (19)

తా॥ నిర్భయముగా బాలకృష్ణుడు పూతన కళేబరముపై ఆడుచుండగా అతనిని గోపికలు సత్వరమే లేవనెత్తి ఆశ్చర్యము కలిగినవారై తీసికొనిపోయిరి. (19)

శ్లో॥ యశోదా రోహిణీభ్యాం తాస్సమం బాలస్య సర్వతః ।
రక్షాం విదధిరే తస్య గోపుచ్ఛ భ్రమణాదిభిః ॥ (20)

తా॥ యశోదా రోహిణులతో కూడి వారందఱును (సమానముగ) బాలునకు అన్నివైపుల నుండియు కలిగిన పీడల నుండి నివృత్తి కలిగించుటకై అతనికి చుట్టును ఆవు తోకను త్రిప్పుట మొదలగు రక్షా చర్యలను చేసిరి. (20)

శ్లో॥ గోమూత్రేణ స్నాపయిత్వా పునర్గో రజసార్భకమ్ ।
రక్షాం చక్రు ర్గోశకృతా ద్వాదశాంగేషు నామభిః ॥ (21)

తా॥ పసివానిని గో మూత్రముతో స్నానము చేయించి, గోధూళి ఒంటిపై చల్లి, ఆవు పేడతో శరీరమును శుభ్రముచేసి నొసలు మున్నగు పన్నెండు అవయములపై కేశవాదినామములచేత తుడిచి రక్షా చర్యలను నిర్వహించిరి. (21)

టీ॥ గోమూత్రేణేతి. ద్వాదశాంగేషు లలాటాదిషు కేశవాది ద్వాదశ నామభిః. (21)

టీ॥ ద్వాదశాంగేషు – నుదురు మొదలుకొని పన్నెండు అంగము లందు కేశవాది నామములతో – (21)

శ్లో॥ గోప్యస్సంస్పృష్ట సలిలాం అంగేషు కరయోః పృథక్ ।
న్యస్యాత్మన్యథ బాలస్య బీజన్యాసమకుర్వత ॥ (22)

తా॥ గోపస్త్రీలు నీటితో ఆచమనము చేసి, అంగన్యాస కరన్యాసములు విడిగాచేసి ఆపై బాలకుని శరీరముపై బీజాక్షరన్యాసము చేసిరి. (22)

**టీ॥** అనాచాంతా ఏవ ప్రథమ మతిసంభ్రమేణైవం రక్షాం కృత్వా కించిత్ లబ్ధాశ్వాసాః పునస్తాత్పర్యేణ బీజన్యాసమకుర్వతేత్యాహ –గోప్య ఇతి. సంస్పృష్టసలిలాః. ఆచాంతాః. ఆత్మని ప్రథమం. అంగేషు కరయోశ్చ పృథక్. అజాద్యేకాదశబీజానాం మధ్యే. కరశుద్ధౌ త్రీణి కరయోః సంధిషు చత్వారి చత్వారి. తథాంఘ్ర్యాదావేకైకస్మిన్నంగే. అజాద్యేకైకం బీజం విన్యస్య. బాలస్యాస్య అంగేషు తథైవాకుర్వత.(22)

**టీ॥** ఆచమనము చేయకయే మొదట మిక్కిలి సంభ్రమముతో నిట్లు రక్షాకార్యక్రమము చేసి, ఇంచుక ఊపిరి పీల్చుకొని మఱల నెమ్మదిగ బీజన్యాసము చేసిరని చెప్పుచున్నాడు. 'గోప్యః' అని – సంస్పృష్ట సలిలాః – ఆచమనము చేసిన వారై తమ యందు మొదట అంగముల యందు చేతుల యందును వేర్వేఱుగ 'అచ్' మొదలుకొని పదకొండు బీజముల మధ్య – కరశుద్ధి యందు – మూడు కర సంధుల యందు నాలుగు నాలుగు – అట్లే పాదములు మున్నగు ఒక్కొక్క అంగము నందు – అజాదులైన ఒక్కొక్క బీజము న్యాసము చేసి – బాలుని అంగముల యందును ఆ విధముగనే చేసిరి. (22)

**శ్లో॥** అవ్యాదజోఽంఘ్రి మణిమా తవ జాన్వథోరూ
యజ్ఞోఽచ్యుతః కటితటం జఠరం హయాస్యః ।
హృత్కేశ వస్త్వురర ఈశ ఇనస్తు కంఠం
విష్ణుర్భుజం ముఖ ఉరుక్రమ ఈశ్వరః కమ్ ॥ (23)

**తా॥** పుట్టుక లేని భగవానుడు నీ పాదములను, కౌస్తుభమణి ధరించినవాడు నీ మోకాళ్ళను యజ్ఞ పురుషుడు నీ తొడలను, అచ్యుతుడు నీనడుమును, హయగ్రీవుడు నీ జఠరమును కేశవుడు నీ హృదయమును, ఉరుక్రముడు నీముఖమును ప్రభువు నీశిరస్సును రక్షించుగాక" (అని యశోద, రోహిణి, గోపస్త్రీలు చిన్నికృష్ణునకు 'రక్ష' పలికిరి) . (23)

**టీ॥** అవ్యాదితి. అంఘ్రిమంఘ్రీ. జాను జానునీ భుజం భుజౌ. కం శిరః. (23)

**టీ॥** అంఘ్రిం – పాదములను, జాను – మోకాళ్ళను, భుజం – భుజములను, కం – శిరస్సును. (23)

**శ్లో॥** చక్ర్యగ్రత స్సహ గదో హరిరస్తు పశ్చా
త్త్వత్పార్శ్వయోర్ధనురసీ మధుహా జనశ్చ ।
కోణేషు శంఖ మురుగాయ ఉపర్యుపేంద్ర
స్తార్క్ష్యః క్షితౌ హలధరః పురుషస్సమంతాత్ ॥ (24)

**తా॥** "నీకు ముందు భాగమున చక్రియు; వెనుక భాగమున గదాధరుడైన హరియు; నీకు ఇరుప్రక్కల యందు ధనుస్సు, ఖడ్గము ధరించియున్న మధుసూదనుడు, అజనుడును; మూలల యందు శంఖధరుడు ఉరుగాయుడును; పైభాగమున ఉపేంద్రుడు తార్క్ష్యుడును; నేల మీద హలధరుడును; పరమపురుషుడు అంతటను ఉండి నిన్ను రక్షించుచుందురుగాక " (అని వారు కృష్ణునికి రక్ష పలికిరి)(24)

**టీ॥** తథా దిక్షు రక్షామకుర్వన్నిత్యాహ–చక్రీతి. చక్రీ పరితో హరిస్తవ పశ్చాదస్తు. త్వత్పార్శ్వయోర్ధనుర్ధరో మధుహా. అసిధరః అజనశ్చ శంఖధరః ఉరుగాయః. చతుష్కోణేషు క్షితౌ అధస్తాత్.(24)

**టీ॥** చక్రి చుట్టును, హరి నీ వెనక ఉండుగాక – నీ ప్రక్కలకు ధనుర్ధరుడైన మధుసూదనుడు ఖడ్గముధరించిన అజనుడు. శంఖధరుడు ఉరుగాయుడు నాలుగు మూలల యందును క్షితౌ – క్రింది భాగమున (భూమి యందు) (24)

**శ్లో॥** ఇంద్రియాణి హృషీకేశః ప్రాణాన్నారాయణోఽవతు ।
శ్వేత ద్వీపపతిశ్చిత్తం మనో యోగేశ్వరోఽవతు ॥ (25)

**తా॥** నీ ఇంద్రియములను హృషీకేశుడు రక్షించుగాక. నీ ప్రాణములను నారాయణుడు రక్షించునుగాక. నీ చిత్తమును శ్వేతద్వీపపతి కాపాడును గాక. నీ మనస్సును యోగేశ్వరుడు కాపాడును గాక.(25)

**టీ॥** ఏవం బహిః రక్షాం కృత్వాంతరంగామకుర్వన్ని త్యాహ– ఇంద్రియాణీతి. (25)

**టీ॥** ఇట్లు వెలుపలి రక్షను చేసి, లోపలి రక్షను చేసిరని చెప్పుచున్నాడు. (25)

**శ్లో॥** పృశ్ని గర్భస్తు తే బుద్ధి మాత్మానం భగవాన్ పరః ।
క్రీడంతం పాతు గోవింద శ్శయానం పాతు మాధవః ॥ (26)

**తా॥** పృశ్నిగర్భుడు నీ బుద్ధిని కాపాడుగాక. భగవానుడైన హరి నీ ఆత్మను,అహంకారమును కాపాడు గాక. ఆడుచున్న నిన్ను గోవిందుడు, నిద్రించుచున్న నిన్ను మాధవుడు కాపాడుగాక. (26)

**టీ॥** పృశ్నిగర్భ ఇతి. ఆత్మానమహంకారం.(26-30)

**టీ॥** ఆత్మానం - అహంకారమును. (26 - 30)

**శ్లో॥** వ్రజంతమవ్యాద్వై వైకుంఠ ఆసీనం త్వాం శ్రియః పతిః ।
భుంజానం యజ్ఞభుక్పాతు సర్వగ్రహ భయంకరః ॥ (27)

**తా॥** త్రోవ నడచు నిన్ను వైకుంఠుడు కాపాడుగాక. కూర్చుండి యున్న నిన్ను శ్రియఃపతి కాపాడును గాక. భోజనము చేయుచున్న నిన్ను సర్వగ్రహ భయంకరుడగు యజ్ఞభోక్త రక్షించునుగాక. (27)

**శ్లో॥** ఢాకిన్యో యాతుధాన్యశ్చ కూశ్మాండా యేஉర్భక గ్రహాః ।
భూతప్రేత పిశాచాశ్చ యక్షరక్షో వినాయకాః ॥ (28)

**తా॥** ఢాకినీ గ్రహములు (కాలేయములను తినునట్టివి) రాక్షసస్త్రీలు (ఇతరులను పీడించువృత్తిగలవి) కూష్మాండగ్రహములు (భూమిపై ఊష్మమును కలిగించునవి) బాలగ్రహములు (పసివారిని పట్టి పీడించునవి) భూతములు, ప్రేతములు, పిశాచములు, వినాయకములు (విఘ్నములను కల్పించు గ్రహములు) (28)

**శ్లో॥** కోటరా రేవతీ జ్యేష్ఠాః పూతనా మాతృకాదయః ।
ఉన్మాదా యే హ్యపస్మారా దేహ ప్రాణేంద్రియద్రుహః ॥(29)

**తా॥** "చెట్టుతొఱ్ఱల వలె ముఖములుగల గ్రహములు, రేవతులు. జ్యేష్ఠలు, పూతనలు, మాతృకలు, మతి భ్రమణ కారిణులు, స్మృతిని పోగొట్టువారు, దేహములను, ప్రాణములను, ఇంద్రియములను బాధించు గ్రహములు." (29)

శ్లో॥ స్వప్నదృష్టా మహోత్పాతా వృద్ధబాల గ్రహాశ్చ యే ।
సర్వే నశ్యంతు విష్ణోర్నామ గ్రహణ భీరవః ॥ (30)

తా॥ స్వప్నమున కనపడు గొప్ప ఉపద్రవములు, ముసలిగ్రహములు, పసి గ్రహములు ఇవి అన్నియును, నారాయణుని నామ ముచ్చరించిన భయపడు గ్రహ విశేషము అన్నియును నశించునుగాక." (30)

శ్లో॥ ఇతి ప్రణయ బద్ధాభిర్గోపీభిః కృష్ణ రక్షణమ్ ।
పాయయిత్వా స్తనం మాతా పర్యంకే సన్న్యవేశయత్ ॥ (31)

తా॥ అని యిట్లు ప్రేమభావముతో బంధింపబడియున్న గోపికలందఱు కృష్ణ రక్షణమునకు సంబంధించిన ప్రక్రియల నెన్నింటినో నిర్వహించిరి. అటు పిమ్మట, తల్లియగు యశోద చిన్ని కృష్ణునకు చనుబాలు కుడిపి అతనిని పర్యంకమున పరుండబెట్టెను. (31)

టీ॥ ఇతీతి. సన్న్యవేశయత్ శాయయామాస.(31, 32 )

టీ॥ సన్న్యవేశయత్ – శాయయామాస – పరుండబెట్టెను. (31,32)

శ్లో॥ తావన్నందాదయో గోపా మధురాయా వ్రజంగతాః ।
విలోక్య పూతనాదేహం బభూవురతి విస్మితాః ॥ (32)

తా॥ నందుడు మొదలగు గోపాలకులు అప్పటివఱకు మధుర నుండి గోకులమునకు వచ్చి, పూతన కళేబరమును చూచి మిక్కిలి ఆశ్చర్య చకితులైరి. (32)

శ్లో॥ నూనం బతర్షిర్జ్ఞానీ వా యోగీశో వా సమాస సః ।
స ఏవ దృష్టో హ్యుత్పాతోఽయం ప్రాహానక దుందుభిః ॥(33)

తా॥ ఆశ్చర్యము! నిశ్చయముగ ఆశ్చర్యము! వసుదేవుడు ఋషియో! జ్ఞానియో! యోగీశ్వరుడో! అతడు చెప్పినది జరిగినది. ఆతడే ఈ ఉత్పాతమును ముందే చూడగల్గెను, ఈ ఉత్పాతము సంభవించెను.(33

**టీ॥** విస్మయమేవాహ – నూనమితి. బతేతి. విస్మయే సాంప్రతం సః ఋషిః. తపఃప్రభావాత్. యోగీశో జ్ఞానీ వా సమ్యగాస. యతస్స ఏవ దృష్ట ఇతి.(33, 34)

**శ్లో॥** కళేబరం పరశుభిశ్ఛిత్వా తత్ర వ్రజౌకసః ।
దూరే క్షిప్త్వావయవశో దదహుః కాష్ఠ వేష్టితమ్ ॥ (34)

**శ్లో॥** దహ్య మానస్య దేహస్య ధూమశ్చాగురు సౌరభః ।
ఉత్థితః కృష్ణ నిర్భుక్తే స్సపద్యాహత పాప్మనః ॥ (35)

**టీ॥** విస్మయాంతరమేవాహ – దహ్యమానస్యేతి. కృష్ణేన నిర్భుక్తేః. అత ఏవ సపద్యాహతః పాప్మా యస్య. (35)

**శ్లో॥** పూతనా లోక బాలఘ్నీ రాక్షసీ రుధిరాశనా ।
జిఘాంసయాపి హరయే స్తనం దత్త్వాప సద్గతిమ్ ॥ (36)

**టీ॥** ఆశ్చర్యమునే చెప్పుచున్నాడు. 'నూనం' అని – ఆశ్చర్యము నందు – ఇప్పుడితడు తన తపస్సుప్రభావము చేనైన ఋషియా! యోగీశుడా! జ్ఞానియా! ఆతడూహించినది సరిగా జరిగినది. దీనిని ఆతడే ఊహించి యున్నందు వలన– (33 – 34)

**తా॥** పూతన శరీరమును అవయవముల పద్ధతిగ గొడ్డంద్రతో నరికి, గోకుల వాసులు, దూరముగ, కట్టెలతో చితులు పేర్చి వానిలో ఆ అంగములను వేసి కాల్చివేసిరి. (34)

**తా॥** కృష్ణుని చేత స్తన్యపానము చేయబడి యుండిన కారణముగ అప్పటికప్పుడే పాపము హరింపబడినందున, ఆ దేహము కాలుచు న్నపుడు దాని నుండి అగురు పరిళమును పోలిన పొగ పైకి లేచెను. (35)

**టీ॥** మఱియొక ఆశ్చర్యమునే చెప్పుచున్నాడు.'దహ్యమానస్య' అని కృష్ణునిచేత పూర్తిగ పానము చేయబడుటవలన –అందువలననే తత్కాల ముననే పోగొట్టబడిన పాపములు దేనికో అట్టి శరీరము యొక్క (35)

**తా॥** లోకము నందలి పసివారిని చంపునది, రాక్షసి, రక్తమే ఆహారముగ గలది యైన పూతన చంపు నిచ్ఛతో నైనను శ్రీహరికి స్తనమిచ్చి సద్గతిని పొందెను. (36)

**టీ॥** ప్రసంగాత్ కైముతికన్యాయేన భక్తివైభవమాహ-పూతనేతి. (36)

**టీ॥** ప్రసంగవశాత్తుగ కైముతిక న్యాయముతో భక్తి వైభవమును చెప్పుచున్నాడు. (36)

**శ్లో॥** కిం పున శ్ర్శద్ధయా భక్త్యా కృష్ణాయ పరమాత్మనే ।
యచ్ఛన్ ప్రియతరం కిం ను రక్తాస్తన్మాతరో యథా ॥ (37)

**తా॥** ఇక భక్తి శ్రద్ధలతో పరమాత్ముడగు కృష్ణుని కొఱకు, మిక్కిలి అనురాగము గల అతని తల్లుల వలె అతనికి మిక్కిలి యిష్టమైన ప్రేమను యిచ్చుచున్న వారిని గూర్చి చెప్పునదేమి? (37)

**టీ॥** కిమితి. శ్రద్ధయా ఆస్తిక్యేన. భక్త్యాయ ప్రేమ్ణా రక్తాః స్నిగ్ధాః తన్మాతర ఇతి. వత్సాపహరణ లీలాభిప్రాయేణ బహువచనం. గో గోపికాస్తన్మాతరోఽ భవన్నితి. (37-44)

**టీ॥** శ్రద్ధయా - ఆస్తిక్య భావనచేత - భక్త్యా - ప్రేమచేత - రక్తా- స్నేహముగల వారు. తన్మాతరః ఇతి - అతని తల్లులు-అని - దూడల వలె నేరుగ గోవుల పొదుగు నుండి పాలు త్రాగు కృష్ణుని లీలను దృష్టి యందుంచుకొని గోమాతలు కూడ అతని తల్లులే అను అభిప్రాయము చేత (మాతరః - తల్లులు) అని బహువచనము - గోవులు, గోపికలును అతనికి తల్లులైరి అని. ('వత్స' అను శబ్దమునకు వక్షః స్థలమనియు నర్థము - 'వత్సాహరణలీల' అను వ్యాఖ్యాత అభిప్రాయమును-'గో గోపికాస్తన్మాతరోఽ భవన్నితి' -గ్రహింపనగును. (37 -44)

**శ్లో॥** పద్భ్యాం భక్త హృదిస్థాభ్యాం వంద్యాభ్యాం లోకవందితైః ।
అంగం యస్యా స్సమాక్రమ్య భగవానపిబత్ స్తనమ్ ॥ (38)

**తా॥** లోకవంద్యులగు బ్రహ్మాది దేవతలచే నమస్కరింపదగినవియు, భక్తుల హృదయములలో స్థిరముగనుండునవియునైన తన రెండు పాదములచే పూతన శరీరము నాక్రమించి భగవానుడు కృష్ణుడు ఆమె స్తనమును పానము చేసెను. (38)

శ్లో॥ యాతుధాన్యపి సా స్వర్గమవాప జననీగతిమ్ ।
కృష్ణ భక్త స్తన క్షీరాః కిము గావో ను మాతరః ॥ (39)

తా॥ ఆమె రాక్షసియైనను స్వర్గమునొందెను, తల్లి స్థానమును పొందెను. కృష్ణునిచే త్రాగబడిన పాలు అవి గోవులవియైన నేమి? తల్లులవి యైన నేమి? (39)

శ్లో॥ పయాంసి యాసామపిబత్ పుత్రస్నేహ స్నుతాన్యలమ్ ।
భగవాన్ దేవకీ పుత్రః కైవల్యాద్యఖిల ప్రదః ॥ (40)

తా॥ భగవానుడు, దేవకి కుమారుడు, కైవల్యము మొదలుకొని సకలమును ఇచ్చువాడును ఐన కృష్ణుడు త్రాగిన ఏ చనుబాలైనను పుత్రవాత్సల్యము వలన స్రవించినవేయగుట నిక్కము. (40)

శ్లో॥ తాసామవిరతం కృష్ణే కుర్వంతీనాం సుతేక్షణమ్ ।
న పునః కల్పతే రాజన్ సంసారోఽజ్ఞానసంభవః ॥ (41)

తా॥ ఓ రాజా! ఏ స్త్రీలు నిరంతరముగా కృష్ణునియందు పుత్రుడను భావముననుందురో (పుత్రభక్తిని నెరపుదురో) వారికి మరల ఈ అజ్ఞాన జనితమగు సంసారము ఉండదు. (వారికి పునర్జన్మ ఉండదు) (41)

శ్లో॥ కటధూమస్య సౌరభ్య మాఘ్రాయ వ్రజౌకసః ।
కి మిదం కుత ఏవేతి వదంతో వ్రజమాయయుః ॥ (42)

తా॥ చితినుండివచ్చు పొగయొక్క పరిమళము నాఘ్రాణించి, ఇది యేమి? ఎచటి నుండి వచ్చుచున్నది? అని అనుకొనుచు నందునితో కూడ వచ్చుచున్న వ్రజవాసులు గోకులమునకు చేరిరి – (42)

శ్లో॥ తే తత్ర వర్ణితం గోపైః పూతనాగమనాదికమ్ ।
శ్రుత్వా తన్నిధనం స్వస్తి శిశోశ్చాసన్ సువిస్మితాః ॥ (43)

తా॥ పూతన వచ్చుట మొదలుకొని ఆమె చేష్టలు, ఆమె మరణము, పసివాడైన కృష్ణుడు క్షేమముగా నుండుట, ఇవి యన్నియును గోపాలురు చెప్పగా విని మిక్కిలి ఆశ్చర్యపడిరి. (43)

**శ్లో॥** నందస్స్వపుత్ర మాదాయ ప్రోష్యాగత ఉదారధీః ।
మూర్ధ్నుపాఘ్రాయ పరమాం ముదం లేభే కురూద్వహ ॥ (44)

**తా॥** పరీక్షిన్మహారాజా! పరస్థలము నుండి స్వస్థలమునకేతెంచిన ఉదారబుద్ధి గల వాడగు నందుడు తన కుమారునెత్తుకొని శిరస్సును ముద్దిడుకొని మిక్కిలి సంతోషించెను. ('ప్రేత్యాగతం' అను పాఠమున మృత్యు ముఖము నుండి తిరిగి వచ్చిన అని గ్రహింపదగును.) (44)

**శ్లో॥** య ఏతత్పూతనామోక్షం కృష్ణస్యాద్భుత మార్భకమ్ ।
నిశమ్య శ్రద్ధయా మర్త్యో గోవిందే లభతే రతిమ్ ॥ (45)

**తా॥** కృష్ణభగవానుని అద్భుతమైన శైశవలీలయగు పూతనా మోక్షమును ఎవడు శ్రద్ధగా వినునో అట్టి మనుష్యుడు గోవిందునిపై భక్తి కలిగిన వాడగును. (45)

**టీ॥** య ఇతి. ఏతత్పూతనామోక్షం, అర్భకం అర్భకచరితం. కింతత్పూతనా మోక్ష ఇతి. (45)

**టీ॥** ఈ పూతనామోక్షము అను చిన్నికృష్ణుని చరితము – అర్భకుని చరితయేమి? ఆ పూతనకు మోక్షమేమి? (ఆశ్చర్యము గదా!) (45)

శ్లో. అత్తుం దైత్యకులానీశః పూతనాయాశ్శిశుచ్ఛలాత్, స్తన్యాపోశనతః ప్రాణైః ప్రాణాహుతిమకల్పయత్. శ్రీధరీయోఽయం శ్లోకః.

"రాక్షసజాతులను భక్షించుటకై ప్రభువు, చిన్నవానిమిషతో పూతన యొక్క స్తన్యమును 'ఆపోశన' పట్టునెపము చేత ఆమె ప్రాణములనే ప్రాణాహుతులనుగా చేసికొనెను" ఈ భావముగల శ్లోకము వ్యాఖ్యానకారుడగు శ్రీధరస్వామి రచన.

**శ్రీ మద్భాగవతే, మహాపురాణే దశమస్కంధే,**
**షష్ఠోఽధ్యాయః**

**అని శ్రీమద్భాగవతమున దశమస్కంధమందు**
**ఆరవ అధ్యాయము సమాప్తము.**

**సప్తమో ఽ ధ్యాయః**

**విష్ణురాత ఉవాచ.**

**శ్లో॥** యేన యేనావతారేణ భగవాన్ హరిరీశ్వరః ।
కరోతి కర్ణరమ్యాని మనోజ్ఞాని చ నః ప్రభో! ॥ (1)

**టీ॥** "ఉత్క్షిపన్ శకటం వ్యోమ్ని తృణావర్తమధిక్షిపన్, దర్శయన్ విశ్వమాసే చ కృష్ణః క్రీడతి సప్తమే. కృష్ణార్భకసదా సింధుసంప్లవా నందనిర్భరః, భూయస్తదేవ సంప్రష్టుం రాజాన్యదభి నందతి"-యేనేతి. యేన యేన మత్స్యాద్యవతారేణాపి. యాని యాని కర్మాణి కరోతి తాని నః కర్ణరమ్యాని కర్ణసుఖావహాని మనోజ్ఞాని మనఃప్రీతికరాణి చ. భవంత్యేవ. (1)

**శ్లో॥** యచ్ఛృణ్వతోఽ పైత్య రతిర్వితృష్ణా
సత్త్వం చ శుధ్యత్యచిరేణ పుంసః ।
భక్తిర్హరౌ తత్పురుషేషు సఖ్యం
తదేవ హారం వద మన్యసేచేత్ ॥ (2)

**ఏడవ అధ్యాయము.**

**విష్ణురాత మహర్షియిట్లనెను**

**తా॥** పరీక్షిత్తు ఇట్లనెను, "యోగీశ్వరా! భగవానుడు, హరి, ప్రభువు ఏయే అవతారముల చేత వినుటకు సొంపైన ఏ యే లీలలను చేయునో అవి యన్నియును మాకు హృదయంగమములే యగుచున్నవి. (1)

**టీ॥** బండిని ఆకాశమునందు పైకి విసరి తృణావర్తునిఅధిక్షేపించుచు నోట విశ్వమును చూపుచు కృష్ణుడు ఈ సప్తమాధ్యాయమున క్రీడించును. బాలకృష్ణుని లీలలనెడు రససముద్రమున నిరంతరము మునిగితేలుచు ఆనందముతో అవశుడై మఱలనదే విషయమునుగూర్చి ప్రశ్నించుచు, పరీక్షిత్తు, మఱియొకదానిని అభినందించుచున్నాడు. - యేనయేన - మత్స్యాది అవతారముచేత కూడ ఏఏ కర్మలు చేయునో అవి మాకు చెవులకు సుకమును కలిగించునవి. మనస్సులకు ప్రీతిని కలిగించునవి అగుచునేయున్నవి. (1)

**తా॥** ఏది వినుచుండెడి మనుష్యునకు మనోగ్లానియు, తన్మూలమున జనించుచుండు వివిధములగు ఆశలును తొలగిపోవునో, వెంటనే సత్త్వశుద్ధియు కలుగునో, హరిభక్తి యేర్పడునో హరిభక్తులతో స్నేహముకలుగునో అదియే హరి చరితము. అదియే మనోహరము. తమరును ఇట్లు భావించినచో దానిని మాకు వినిపింపుడు. (2)

**టీ॥** తథాపి. యదితి. యత్ శృణ్వతః. పుంసః పురుషమాత్రస్య. అరతిః మనోగ్లానిః తన్మూలభూతా. వివిధా తృష్ణా చ. అపగచ్ఛతి. తథా సత్త్వశుద్ధిః హరిభక్తిః హరిదాససఖ్యాని చ. భవంతి తదేవ హారం హరేశ్చరితం. మనోహరం వా.వద. (2)

**టీ॥** ఏది వినెడు మనుష్యమాత్రునకు – అరతిః – మనోగ్లాని – దానిమూలభూతమగు వివిధములైన తృష్ణకూడ తొలగిపోవునో – అట్లే సత్త్వశుద్ధి, హరిభక్తి, హరిదాసులస్నేహములుకూడ ఏర్పడగలవో అదియే హారం – హరిచరితము – లేక మనోహరము, చెప్పుము.(2)

**శ్లో॥** అథాన్యదపి కృష్ణస్య లోకాచరిత మద్భుతమ్ ।
మానుషం దేహ మాసాద్య తజ్జాతి మనురుంధతః ॥ (3)

**తా॥** మనుష్యదేహమును ధరించి, ఆ జాతిని అనుకరించుచు(ను) శ్రీకృష్ణుడాచరించిన ఇతరమైన అద్భుతలీల యేదైనను ఇంకను (వినిపింపుము) (3)

**టీ॥** తథా అనుగ్రహం యది కరోషీతి. అత్యౌత్సుక్యేన పునర్విశినష్టి– అథేతి. అనురుంధతః అనుకుర్వతః (3)

**టీ॥** అట్లే ఇంకను అనుగ్రహింతువేని – అని. మిక్కిలి ఉత్సాహముతో మఱల విశేషించి అడుగుచున్నాడు. అనురుంధతః – అనుకరించు చున్న వాని యొక్క (కృష్ణుని యొక్క) (3)

*శ్రీశుక ఉవాచ.*

**శు॥** కదాచిదౌత్థానిక కౌతుకాప్లవే
జన్మర్క్ష యోగే సమవేత యోషితామ్ ।
వాదిత్ర గీత ద్విజమంత్ర వాచనై
శ్చకార సూనోరభిషేచనం సతీ ॥ (4)

*శ్రీశుకుడు ఇట్లనెను*

**తా॥** "ఒకానొకదినమున, కృష్ణుని జన్మనక్షత్రము కలిసి వచ్చిన నాడు, అతనికి అంగసంస్కారము (పరికర్మ – మార్జన, ఉద్వర్తన – స్నానము మున్నగునవి) జరుపుటకు తలపెట్టబడిన సంరంభ సమయమున, గోపికలందఱును చేరి యున్న వేడుక యందు, వివిధ వాద్యములు, గానములు, బ్రాహ్మణుల వేదమంత్ర పఠనములును మ్రోగుచున్న ఉత్సవవేళ, యశోద, తనకుమారుడగు కృష్ణునకు అభిషేచనము చేసెను. (4)

**టీ॥** కదాచిదితి. ఉత్థానం శిశోరంగపరివర్తనం తత్ర కరణీయే కౌతుకాప్లవే ఉత్సవాభిషేకే. తథా తస్మిన్నేవ దినే. జన్మర్‌క్షస్యాపి యోగే సతి, అతః మహోత్సవే. సమవేతయోషితాం మిళితపురం ధ్రీ ణాం మధ్యే. వాది త్రాదిభిః శోభితమభిషేచనం, యశోదా చకార (4)

**టీ॥** ఉత్థానం - శిశువునకు తలంటిపోయుట. అచట చేయదగి యుండగా - ఆ సంరంభముతో గూడిన స్నానోత్సవము నందు - మరియు అదే దినమున కృష్ణుని జన్మనక్షత్రముకూడ కలిసిరాగా - ఆ మహోత్సవమున, సువాసినులందఱు చేరగా, వారిమధ్య, వాద్యపు మ్రోతనడుమ శుభప్రదమైన అభిషేచనమును, యశోద చేసెను. (4)

**శ్లో॥** నందస్య పత్నీ కృతమజ్జనాదికం
విప్రైః కృతస్వస్త్యయనం సుపూజితైః ।
అన్నాది వాస స్రగభీష్ట ధేనుభి
స్సంజాత నిద్రాక్ష మశీశయచ్ఛనైః ॥ (5)

**తా॥** నందుని భార్యయగు యశోద, స్నానము మొదలగునవి పూర్తి చేసి, చక్కగా పూజింపబడిన బ్రాహ్మణుల చేత స్వస్తివాచనము చేయించి, వారికి భోజనములు, వస్త్రములు, పూలమాలలు, ఇష్టమైన ఆవులు మున్నగు వానిని సమర్పించి, కృష్ణుని కన్నులు నిద్రా వశమైపోవు చుండగా మెల్లగా ఆతనిని పరుండబెట్టెను. (5)

**టీ॥** నందస్యేతి, అన్నాదిభిః సుపూజితైః, విప్రైః. కృతమంగళం సంజాతనిద్రే అక్షిణీ యస్య తం అశీశయత్ శాయితవతీ. (5)

**టీ॥** భోజనాదులచేత సత్కరింపబడిన బ్రాహ్మణులచేత మంగళ వాచనము చేయించి నిద్రవచ్చు కన్నులు ఎవనికో అట్టి వానిని (కృష్ణుని) పరుండఁజేసెను. (5)

**శ్లో॥** ఔత్థానికౌత్సుక్య మనా మనస్వినీ
సమాగతాన్ పూజయతీ వ్రజౌకసః ।
నైవాశృణోద్వై రుదితం సుతస్య సా
రుదం స్తనార్థీ చరణావుదక్షిపత్ ॥ (6)

**తా॥** మంచి మనస్సు గల యశోద, ఇంతకు ముందే జరిగిన కృష్ణుని అంగపరివర్తన కార్యక్రమమున నిమగ్నమైన మనస్సుగలదియై, ఆ ఉత్సవమునకేతెంచిన వ్రజవాసులను సత్కరించు పనిలో నుండుటచే తన కుమారుని ఏడుపును వినజాలకుండెను. పాలకొఱకు ఏడ్చుచున్న చిన్నికృష్ణుడు తన కాళ్లను - బరువైన వస్తువును పైకి త్రోయుచున్న వాని వలె - పైకి తన్నెను. (6)

**టీ॥** ఔత్థానికేతి. శకటస్యాధస్తాత్ ప్రేంఖే ఉదక్షిపత్. ఊర్ధ్వం చాలితవాన్. (6)

**టీ॥** బండి క్రిందు భాగమున ఇటునటు ఊగుచుండెను – (ఊగిఊగి)పైకి కాళ్లతో తన్నెను. (6)

**శ్లో॥** అధశ్శయానస్య శిశోరనోల్పక
ప్రవాళ మృద్వంఘ్రి హతం వ్యవర్తత ।
విధ్వస్త నానారస కుప్య భాజనం
వ్యత్యస్త చక్రాక్ష విభిన్న కూబరమ్ ॥ (7)

**తా॥** క్రింద పరుండియున్న పసివాని చిన్ని చిగురుల వంటి లేత పాదముచే కొట్టబడిన బండి తలక్రిందులై ధ్వంసమయ్యెను. అది వివిధ రసముల పదార్థములచే నిర్మితములైన కంచు, మట్టి మున్నగు పాత్రల వలె ఛిన్నాభిన్నమయ్యెను. దాని చక్రములు, అక్షములు, నొగ అన్నియు అస్తవ్యస్తములయ్యెను. (7)

**టీ॥** అధశ్శయానస్యేతి. తదధశ్శయానస్య శిశోః. అల్పకశ్చాసౌ ప్రవాళవన్మృదుశ్చ యోఽంఘ్రిః. తేన హతం. అనః శకటం వ్యవర్తత విపరీతమపతత్. కథం విధ్వస్తాని నానారసవంతి కుప్యభాజనాని స్వర్ణరజత వ్యతిరిక్త కాంస్యాదిమయాని యథా భవతి తథా చక్రే చ అక్షశ్చ చక్రాక్షాః. వ్యత్యస్తాః చక్రాక్షాః. యస్మిన్ విభిన్నః కూబరో యుగంధరో యస్మిఽ తచ్చ తచ్చ యథా భవతి తథా వ్యవర్తతేతి. (7)

**టీ॥** దాని క్రింద పరుండియున్న శిశువు యొక్క చిన్నది, చిగురువలె మెత్తనిదియునైన ఏ పాదము గలదో – దాని చేత కొట్టబడినది. అనః – బండి, వ్యవర్తత –తల క్రిందులుగ పడెను. ఎట్లు ధ్వంసములయ్యెను? వివిధ రసములు గల స్వర్ణరజతములకన్న ఇతరములతో చేయబడిన పాత్రలు ఎట్లుండునో – ఎట్లగునో అట్లు – చక్రములు, బండి కన్ను చక్రాక్షములు వ్యత్యస్తములైన చక్రాక్షములు. దేని యందు ముక్కలైన నొగ దేని యందో ఆ యా భాగములు ఎట్లు కాగలవో అట్లు విపరీతము లయ్యెను అని. (7)

**శ్లో॥** దృష్ట్వా యశోదా ప్రముఖా వ్రజస్త్రియో
హ్యౌత్థానికే కర్మణి యాస్సమాగతాః।
నందాదయశ్చాద్భుత దర్శనాకులాః
కథం స్వయం వై శకటం విపర్యగాత్ ॥
(ఇతి బ్రువంతోఽతి విషాద మోహితా
జనాస్సమంతా త్వరి వవ్రురార్తవత్.) (8)

**తా॥** యశోద మొదలగువారు, అంగపరివర్తన కార్యక్రమమున కేతించిన గోప స్త్రీలును నందుడు మొదలగు వారును ఆ దృశ్యమును చూచి, చూచుట వలన మనస్సు చెదరి "ఈ బండి, తనంత తానుగ ఎట్లు తల క్రిందులయ్యెను. అని చెప్పుకొనుచు, ఆశ్చర్యచకితులై జనులందఱు అంతటను ఆర్తులవలె చుట్టును మూగిరి. (8)

**టీ॥** దృష్ట్వేతి. అద్భుతదర్శనేన ఆకులా బభూవుః. తదేవాహ- కథమితి. విపర్యగాత్ విపరీతమపతత్. (8.9)

**టీ॥** ఆశ్చర్యకరమైన దృశ్యమును చూచుటచేత చెదరిన మనస్సులు గల వారైరి. అదియే చెప్పుచున్నాడు. 'కథం' అని. విపర్యగాత్ - తలక్రిందుగ పడెను. (8,9)

**శ్లో॥** ఊచురవ్యవసిత మతీన్ గోపాన్ గోపీశ్చ బాలకాః ।
రుదతానేన పాదేన క్షిప్తమేతన్న సంశయః ॥ (9)

**తా॥** అనిశ్చిత బుద్ధులైయున్న గోపాలురతో, గోపస్త్రీలతోను అచటి బాలకులు ఇట్లుచెప్పిరి. "ఏడ్చుచునే కృష్ణుడు తన యీ పాదముతో దీనిని పడగొట్టెను. సందేహములేదు". (9)

**శ్లో॥** న తే శ్రద్దధిరే గోపా బాలభాషితమిత్యుత ।
అప్రమేయం బలం తస్య బాలకస్య న తే విదుః ॥ (10)

**తా॥** గోపాలకులు, అవి బాలుర మాటలు' అని వారిమాటలపై శ్రద్ధ వహింపకుండిరి. (ఆశ్చర్యము!) కృష్ణుని - బాలుడైన కృష్ణుని సాటిలేని బలమును గూర్చి వారికి తెలియదు. (10)

**టీ॥** నేతి. న శ్రద్దధిరే విశ్వాసం న జగ్ముః. ఉత అపి బాలస్యైతన్న సంభవతి. ఏతే చ బాలాః కిం జానంతీతి. (10)

**టీ॥** న శ్రద్దధిరే – విశ్వసింప లేదు. ఉత – మరియు – బాలునకు ఇది సంభవింపదు. వీరు కూడ బాలురే – వీరికేమి తెలియును? – అని. (10)

**శ్లో॥** రుదంతం సుతమాదాయ యశోదా గ్రహశంకితా ।
కృత్వా స్వస్త్యయనం విప్రైస్సూక్తైఃస్తన మపాయయత్ ॥ (11)

**తా॥** యశోద, తన యేడ్చుచున్న కొడుకునెత్తికొని, అతనికి గ్రహమేదైన సోకినదేమో యని శంకించి బ్రాహ్మణులచేత, రాక్షసుల సంహరించు సూక్తములతో, స్వస్తి వాచనమును చేయించి, కృష్ణునకు పాలిచ్చెను. (11)

**టీ॥** రుదంతమితి. రక్షోఘ్నైః సూక్తైః రక్షాం కృత్వా.(11)

**టీ॥** రక్షోఘ్న సూక్తములతో రక్షను చేసి – (11)

**శ్లో॥** పూర్వవత్ స్థాపితం గోపైర్బలిభి స్సపరిచ్ఛదమ్ ।
విప్రా హుత్వార్చయాంచక్రుర్దధ్యక్షత కుశాంబుభిః ॥ (12)

**తా॥** పైన కప్పెడి వస్త్రముతో సహా బండి, బలవంతులైన గోపాలుర చేత పూర్వమునందున్న విధముగ సరిచేయబడెను. బ్రాహ్మణులు హవనముచేసి పెరుగు, అక్షతలు, దర్భలు, నీరు మున్నగు వానిచే శకటమునకు పూజ నిర్వహించిరి. (12)

**టీ॥** భగవత్ప్రభావానభిజ్ఞ విప్రచేష్టితం విడంబయన్నివాహ– పూర్వవదితి. బలిభిః శక్తైః యద్వా. అష్టదిక్షు బలిభిస్సహితం. సపరికరం యథాపూర్వం స్థాపితం. విప్రాః దధ్యాదిభిరర్చయామాసుః. హుత్వా

**టీ॥** – భగవంతుని ప్రభావము లెస్సగాతెలియని బ్రాహ్మణుల పనిని హేళనచేయుచున్నట్లు చెప్పుచున్నాడు – బలిభిః –శక్తి గల వారి చేత – లేక–ఎనిమిది దిక్కులయందు బలులతో కూడ–పరికరములతో కూడ

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

గ్రహాదిహోమం విధాయ. (12)

**శ్లో॥** యేఽసూయానృత దంభేర్ష్యా హింసామాన వివర్జితాః ।
న తేషాం సత్యశీలానామాశిషో విఫలాః కృతాః ॥ (13)

**టీ॥** – య ఇతి. అసూయా గుణేషు దోషావిష్కరణం. ఈర్ష్యా అక్షాంతిః. తేషామాశిషః. కృతాస్తైః ప్రయుక్తాః ఇత్యేవమభిప్రేత్య. (13)

**శ్లో॥** ఇతి బాలక మానీయ సామర్గ్యజు రుపాకృతైః ।
జలైః పవిత్రౌషధిభి రభిషిచ్య ద్విజోత్తమైః ॥ (14)

**టీ॥** ఇతీతి. సామర్గ్యజుర్భిరుపాకృతై స్సంస్కృతైః. పవిత్రా ఓషధయో యేషు జలేషు తైః ద్విజోత్తమః కర్తృభిరభిషిచ్య అభిషేకం కారయిత్వా. (14)

పూర్వమునందున్న దాని వలె స్థాపింపబడినది. బ్రాహ్మణులు పెరుగు మున్నగువానితో పూజచేసిరి. హుత్వా–గ్రహాది హోమమును చేసి (12)

**తా॥** మంచివాని యందు చెడుగుణము లారోపించుట, అసత్యము, డంబము, ఓర్పులేకుండట, హింసించుట, అభిమానము మున్నగు లక్షణములు లేని సత్యశీలుర యొక్క ఆశీస్సులు వ్యర్థములు కావు. (13)

**టీ॥** అసూయాది గుణములయందలి దోషములను ప్రకటము చేయుట – ఈర్ష్య – ఓర్వలేనితనము వారి యొక్క – కృతాః – వారి చేత ప్రయోగింపబడినవి అని యిట్లు ఉద్దేశించి – (13)

**తా॥** అని, బాలుని కొనివచ్చి, ఋగ్యజుస్సామవేద మంత్రములతో అభిమంత్రించిన జలములతో, పవిత్రమైన ఓషధులతోను, ఉత్తములైన బ్రాహ్మణుల చేత అభిషేకము చేయించి – (14)

**టీ॥** సామ, ఋక్, యజుస్సులచేత సంస్కరింపబడిన, పవిత్రమైన ఓషధులతో గూడిన జలములతో – ఆ నీటి చేత ఉత్తములైన బ్రాహ్మణులచే – చేయువారి చేత అభిషేకము చేయించి – (14)

**శ్లో॥** వాచయిత్వా స్వస్త్యయనం నందగోపస్సమాహితః ।
హుత్వా చాగ్నిం ద్విజాతిభ్యః ప్రాదాదన్నం మహాగుణమ్॥ (15)

**తా॥** బ్రాహ్మణజాతి వారితో, నందగోపుడు ఏకాగ్రచిత్తుడై, స్వస్తి వాచనము చేయించి, హవనమునుకూడ నిర్వర్తింపజేసి, గుణోపేతమైన అన్న దానము చేసెను. (15)

**టీ॥** వాచయిత్వేతి. హుత్వా హావయిత్వా. (15)

**టీ॥** హుత్వా - హవనము చేయించి (15)

**శ్లో॥** గావశ్చ సర్వ గుణోపేతా వాసస్స్రగుక్మ మాలినీః ।
ఆత్మజాభ్యుదయార్థాయ ప్రాదాత్తే చాన్వయుంజత ॥ (16)

**తా॥** ఉత్కృష్ట గుణములతోగూడిన ఆవులు, వస్త్రములు, పూలదండలు, (బంగారము, దండలు తయారు చేయు స్త్రీలను) బంగారపు హారములు, తన కుమారుని అభ్యుదయము కొఱకు బ్రాహ్మణులకు నందుడు దానముచేసెను. వారును ఆశీర్వాదములు చేసిరి. (16)

**టీ॥** గా ఇతి. గావశ్చ ప్రాదాత్ తే చ విప్రాః. అన్వయుంజత ఆశిషః అయుంజన్. తే శతమన్వయురితి పాఠాంతరే. శతం తద్దత్తగో శతమన్వయుః స్వీకృతవంత ఇత్యర్థః. యద్వా. శతం శతసంఖ్యాకాః. తే విప్రా ఇతి. (16)

**టీ॥** ఆవులను కూడ ఇచ్చెను. తే చ - ఆ బ్రాహ్మణులును - అన్వయుంజత-ఆశీస్సుల నిచ్చిరి. 'తేశత మన్వయుః' అను పాఠాంతరమున - శతం - అతనిచే ఈయబడిన నూఱు ఆవులను - అన్వయుః - స్వీకరించిరని యర్థము - లేక - శతం - నూఱు సంఖ్యలో గల ఆ బ్రాహ్మణులు అని. (16)

**శ్లో॥** విప్రా మంత్రవిదో యుక్తాస్తైర్యాః ప్రోక్తాస్తదాశిషః ।
తా నిష్ఫలా భవిష్యంతి న కదాచిదపి ధ్రువమ్ ॥ (17)

**తా॥** మంత్రవేత్తలైన బ్రాహ్మణులు. ఏ ఆశీర్వచన మంత్రములచే దీవెన లిచ్చిరో అవి ఎప్పుడును నిష్ఫలములు కావు – ఇది నిశ్చయము. (17)

**టీ॥** విప్రా ఇతి. తాః తథైవ బభూవురిత్యర్థః. శ్లో. "ఉత్క్షిప్య మృదుపాదేన శకటం వ్యోమ్ని లీలయా, తృణావర్తం పదాపీడ్య భువ్యపాతయదర్భకః". శ్రీధరీయోఽయం శ్లోకః. (17)

**టీ॥** అవి అట్లే అయ్యెనని యర్థము. (వారు మంత్రములద్వారా ఏమి ఉద్దేశించిరో అదియే సాకారమయ్యెనని భావము) "లీలగా తన మెత్తని పాదముల చేత, బండిని ఆకాశమునకెత్తి తృణావర్తుని తనపాదముచే (అంతటను) పీడించి, చిన్నికృష్ణుడు వానిని భూమిపై పడగొట్టెను" ఈ అర్థముగల శ్లోకము శ్రీధరీయము. (17)

**శ్లో॥** ఏకదాఽఽరోహమారూఢం లాలయంతీ సుతం సతీ।
గరిమాణం శిశోర్వోఢుం న సేహే గిరికూటవత్ ॥ (18)

**తా॥** ఒకప్పుడు యశోద ఒడిలో నున్న కుమారుని లాలించుచుండగా అతడు హఠాత్తుగ బరువెక్కి గిరి శిఖరము వలె పెచ్చరిలి పోయెను. అప్పుడామె ఆ శిశువు బరువును సహింపజాలక పోయెను. (18)

**టీ॥** ఏకదేతి. ఆరోహముత్సంగం. (18)

**టీ॥** ఆరోహం – ఉత్సంగం – ఒడి (18)

**శ్లో॥** భూమౌ నిధాయ తం గోపీ విస్మితా భారపీడితా ।
మహాపురుషమా దధ్యౌ జగతామాస కర్మసు ॥ (19)

**తా॥** బరువు చేత పీడింపబడి, ఆశ్చర్యముతో యశోద, అతనిని నేలపై దించి, జగత్తులలో కెల్ల మహాపురుషుడగు పరమాత్మను ధ్యానించెను. పిదప తన పనులలో నుండిపోయెను. (19)

**టీ॥** భూమావితి. తృణావర్తాత్స్వాపమృత్యుపరిహారాయ కృష్ణేనైవాత్మనః ఉత్సంగాదుత్తారాయ చ కృతం భారమజానతీ. ఉత్పాతశంకయా మహాపురుషమాదధ్యౌ. శ్రీకృష్ణోదరవర్తినాం జగతాం భారేణ పీడితా విస్మితా చ సతీ. యద్వా జగతాం మధ్యే కర్మసు ఆస బభూవ. న తు జగదుదరం తు వేదేత్యర్థః. (19.20)

**టీ॥** తృణావర్తుని నుండి తన అపమృత్యువును పరిహరించు కొఱకు, తన ఒడి నుండి క్రిందకు దించుట కొఱకు కృష్ణుని చేతనే (తన) బరువును పెంచబడెనను విషయము తెలియక ఉత్పాతమేమో అను శంకతో భగవానుని ధ్యానించెను. శ్రీకృష్ణుని ఉదరమందున్న జగత్తుల భారము చేత పీడింపబడినదై ఆశ్చర్యపడి –లేక జగత్తుల యొక్క కర్మలలో నిమగ్నమయ్యెను కాని జగత్తులతో కూడిన అతని ఉదరమును తెలియదయ్యెను. (19,20)

**శ్లో॥** దైత్యో నామ్నా తృణావర్తః కంసభృత్యః ప్రచోదితః ।
చక్రవాత స్వరూపేణ జహారాసీన మర్భకమ్ ॥ (20)

**తా॥** కంసుని సేవకుడగు తృణావర్తుడను పేరు గల రాక్షసుడు కంసుని చేత ప్రేరేపింపబడి సుడి గాలి రూపమున పసివాడగు కృష్ణుని లేవనెత్తుకొని పైకింబోయెను. (20)

**శ్లో॥** గోకులం సర్వమావృణ్వన్ ముష్ణంశ్చక్షూంషి రేణుభిః ।
ఈరయన్ సుమహా ఘోరశబ్దేన ప్రదిశో దిశః ॥ (21)

**తా॥** గోకులమంతయు నావరించుచు, ధూళిరేణువులచేత అచట ప్రజల కన్నులను (చూపులను) దోచుకొనుచు, దిక్కులను విదిక్కులను (మూలలు) భయంకరమైన శబ్దములతో కంపింప జేయుచు – (21)

**టీ॥** గోకులమితి. ఈరయన్నాదయన్నిత్యర్థః. పూరయన్నిత్యపి పాఠాంతరం. (21)

**టీ॥** ఈరయన్ – నినదించుచు అని యర్థము. 'పూరయన్' అనియు పాఠాంతరము. (21)

**శ్లో॥** ముహూర్తమభవద్గోష్ఠం రజసా తమసావృతమ్ ।
సుతం యశోదా నాపశ్యత్తత్ర న్యస్తవతీ యతః ॥ (22)

**టీ॥** ముహూర్తమితి. యతః. యత్ర. న్యస్తవతీతి. తత్ర తస్మిన్ స్థానే నాపశ్యత్. (22, 23)

**శ్లో॥** నా పశ్యత్ కశ్చనాత్మానం పరం చాపి విమోహితః ।
తృణావర్త విసృష్టాభిః శర్కరాభి రుపద్రుతః ॥ (23)

**శ్లో॥** ఇతి ఖర పవనచక్ర పాంసువర్షే
సుతపదవీమబలా విలక్ష్య మాతా ।
అతి కరుణమనుస్మరంత్యశోచ
ద్భువి పతితా మృత వత్సకా యథా గౌః ॥ (24)

**టీ॥** ఇతీతి ఖరపవనచక్రాత్. పాంసువర్షే సతి. (24)

**తా॥** పన్నెండు క్షణముల పాటు గోస్థానమంతయు ధూళితోను, చీకటితోను ఆవరింపబడెను, యశోద, ఎచట తన కుమారునుంచెనో అచట అతనిని చూడజాలకుండెను. (22)

**టీ॥** యతః - ఎక్కడ - న్యస్తవతీ - ఉంచెనో - తత్ర - ఆ స్థానమందు - చూడకుండెను. (22,23)

**తా॥** తృణావర్తుడు విడుదలచేసిన రేణువులచేత ఉపద్రవము పొందినవారై, భ్రమ చెందినవారునై ఎవ్వడును తనను తాను గాని, ఇతరుని గాని చూడజాల కుండెను. (23)

**తా॥** ఇంద్రియ క్షోభను కలిగించు తీవ్రమైన గాలిచే సుడులు తిరుగుచున్న ధూళి వర్షము నందు, తల్లి యగు యశోద తన కొడుకు ఉన్న స్థానమును చూడజాలక మిక్కిలి జాలి గొలుపునట్లు అతని లీలలను తలచుకొనుచు భూమిపైబడి శోకింపసాగెను. చనిపోయిన లేగదూడను చూచి ఆవు పొందెడి బాధవలె ఆమె విలపింపసాగెను.(24)

**టీ॥** తీక్ష్ణమైన సుడిగాలి వలన, ధూళిరేణువులు వర్షించుచుండగా. (24)

**శ్లో॥** రుదితమను నిశమ్య తత్ర గోప్యో
భృశమనుతప్తధియోఽశ్రు పూర్ణముఖ్యః ।
రురుదు రనుపలభ్య నందసూనుం
పవన ఉపారత పాంసువర్ష వేగే ॥ (25)

**టీ॥** రుదితమితి. ఉపారతః శాంతః. పాంసువర్షస్య వేగోయస్మిన్. తథా భూతే పవనే సతి. తత్ర తస్యా రుదితం. అను నిశమ్య. గోప్యో రురుదుః. (25)

**తా॥** అచటి గోపస్త్రీలు, గాలి దుమారము వేగము తగ్గిన తరువాత, యశోద యొక్క ఏడుపు ధ్వని విని, మిక్కిలి సంతాపముతో కూడిన బుద్ధిగల వారై కన్నీరు నించుచున్న ముఖములుగల వారై, నంద నందనుడు అగు కృష్ణుడు కనపడనందు వలన దుఃఖంపసాగిరి. (25)

**టీ॥** ఉపారతః- శాంతించినది - ధూళి వర్ష వేగము దేని యందో అట్టి గాలి (శమించి యుండ) అచట ఆమె యొక్క రోదన ధ్వని విని గోపస్త్రీలు ఏడువసాగిరి. (25)

**శ్లో॥** తృణావర్తః శాంతరయో వాత్యారూపధరో హరన్ ।
కృష్ణం నభో గతో గంతుం నాశక్నోద్భూరి భారభృత్ ॥ (26)

**టీ॥** తృణావర్త ఇతి. వాత్యా చక్రవాతః తద్రూపధరః. కృష్ణం హరన్. శాంతరయః కథంచిన్నభో గతః తతః పరం గంతుం భారాతి రేకాన్నాశక్నోదిత్యర్థః. (26)

**తా॥** తృణావర్తుడు సుడిగాలి రూపమును ధరించి, కృష్ణుని ఆకాశ మార్గమున కొనిపోవుచుండగా ఇక భరింపజాలని బరువును మోయుచున్న వాడగుటచే ముందుకు పోవుటకు సాధ్యపడక వేగమును తగ్గించెను. (26)

**టీ॥** వాత్యా - సుడిగాలి - ఆరూపమును ధరించినవాడు. కృష్ణుని కొనిపోవుచు, శమించిన వేగముగలవాడై - ఎట్లో ఆకాశమునంబోవుచు - అటుపై పోవుటకు శక్తుడుకాకుండెను అని యర్థము. (గొప్ప బరువు మోయువాడై) (26)

శ్లో॥ తమశ్మానం మన్యమాన ఆత్మనో గురుమత్తయా ।
గలే గృహీత ఉత్సృష్టుం నాశక్నోదద్భుతార్భకమ్ ॥ (27)

తా॥ తనకు మిక్కిలి బరువగుటచే ఆ ఆశ్చర్యకరమైన బాలుని ఒక పెద్ద బండగా, కొండగా భావించుచు, అతని చేతనే కంఠము పట్టు కొనబడిన వాడై, అతనిని విడిచిపెట్టదలచిన వాడైనను విడుచుటకు శక్తుడు కాకపోయెను. (27)

టీ॥ తమితి. గురుమత్తయా అతి గౌరవేణ భారేణ తం అశ్మానం పర్వతప్రాయం. మన్యమానః. తేనైవ ఆత్మనో గళే గృహీతః తం త్యక్తుమిచ్ఛన్నపి. నాశక్నోదిత్యర్థః. (27–29)

టీ॥ గురుమత్తయా – మిక్కిలి బరువగుటచే అతనిని ఆ విధముగ పర్వతప్రాయముగ భావించుచు, అతని చేతనే తన కంఠము పట్టుకొన బడినవాడై, అతనిని భరించుచున్న వాడై అతనిని విడుచుటకు కోరు చుండియు అందుకు సమర్థుడు కాకపోయెనని యర్థము. (27–29)

శ్లో॥ బాలగ్రహణ నిశ్చేష్టో దైత్యో నిర్గతలోచనః ।
అవ్యక్తరావో న్యపతత్సహ బాలో వ్యసుర్వ్రజే ॥ (28)

తా॥ రాక్షసుడైన తృణావర్తుడు, కృష్ణుడు కంఠమును పట్టుకొనుటచేత చేష్టలుదక్కి, కనుగ్రుడ్లు బయటకు వెడలి, మాటరాక అస్పష్టమైన ధ్వని గల వాడై బాలకునితో సహ క్రిందపడి, వ్రజము నందు ఆ దైత్యుడు అసువులు బాసెను. (28)

శ్లో॥ తమంతరిక్షాత్పతితం శిలాయాం
విశీర్ణ సర్వావయవం కరాలమ్ ।
పురం యథా రుద్రశరేణ విద్ధం
స్త్రియో రుదంత్యో దదృశుః సమేతాః ॥ (29)

తా॥ రుద్రుని బాణాఘాతముచే నలిగిపోయిన త్రిపురాసురుని దేహము వలె – ఆకాశము నుండి ఱాతి మీద పడి ముక్కలు చెక్కలైన అవయములుగల తృణావర్తుని భయంకరమైన శరీరమును – అచట ఒక్కచోగూడి కృష్ణుని కొఱకు దుఃఖించుచున్న గోపస్త్రీలు చూచిరి. (29)

**శ్లో॥** ప్రాదాయ మాత్రే ప్రతిహృత్య విస్మితాః
కృష్ణం చ తస్యోరసి లంబమానమ్ ।
తం స్వస్తిమంతం పురుషాదనీతం
విహాయసా మృత్యుముఖాత్ప్రముక్తమ్ ॥
గోప్యశ్చ గోపాః కిల నందముఖ్యా
లబ్ధ్వా పునః ప్రాపు రతీవమోదమ్ ॥ (30)

**టీ॥** కృష్ణమితి. తస్యోరసి లంబమానం కృష్ణమాదాయ. మాత్రే ప్రతిహృత్య సమర్ప్య విస్మితాశ్చ బభూవురితి. విహాయసా గగనమార్గేణ పురుషాదేన తృణావర్తేన. నీతం. తథాపి. మృత్యుముఖాత్ప్రముక్తం పునర్లబ్ధ్వా మోదం ప్రాపురిత్యుత్తరేణాన్వయః. (30)

**శ్లో॥** అహో బతాత్యద్భుతమేష రక్షసా
బాలో నివృత్తిం గమితోఽభ్యగాత్పునః ।
హింస్రః స్వపాపేన విహింసితః ఖలః
సాధుస్సమత్వేన భయాద్విముచ్యతే ॥ (31)

**టీ॥** గోప్యఇతి. పరస్పరం హర్ష కథామాహుః. అహో బతేతి. నివృత్తిం గమితో మృత్యుం ప్రాపితః. (31)

**తా॥** (కృష్ణుడు) తృణావర్తుని వక్షః స్థలమున వ్రేలాడుచు, అతనిచే కొనిరాబడి, ఆకాశము నుండి, మృత్యు ముఖము నుండియు విడుదల పొందిన శుభప్రదుడగు అతనిని వెంటనే తీసికొని తల్లికి సమర్పించి గోపస్త్రీలు గోపాలురును మిక్కిలి ఆశ్చర్యపడిరి. నందుడు మొదలగు వారును కృష్ణుని మరల పొంది చాలా సంతోషించిరి. (30)

**టీ॥** అతని రొమ్ముపై వ్రేలాడుచున్న కృష్ణుని తీసికొని తల్లికి సమర్పించి ఆశ్చర్యచకితులైరి – అని. ఆకాశమార్గమున రాక్షసుడగు తృణావర్తుని చేత కొనిరాబడిన వానిని – అట్లైనను మృత్యుముఖము నుండి విడువబడిన అతనిని మరల పొంది సంతోషమునందిరి. (30)

**తా॥** ఆశ్చర్యము! అత్యద్భుతము! ఏమన అయ్యో! ఈ బాలుడు రాక్షసునిచేత మృత్యుముఖమునకు కొనిపోబడెను. అయినను మరల సురక్షితముగా వచ్చెను. హింసకుడైన ఈ దుర్మార్గుడు తన పాపము చేతనే హింసింపబడెను. సాధువు, సమత్వము చేత భయము నుండి ముక్తుడగును. (31)

**టీ॥** ఒకరితో నొకరు సంతోష కథను చెప్పుకొనిరి, ఆశ్చర్యము! అయ్యో! అనుచు. నివృత్తింగమితః –మృత్యువును పొందినవాడు (అయియును) (31)

**శ్లో॥** కిం నస్తపశ్చీర్ణ మధోక్షజార్చనం
పూర్తేష్ట దత్తముత భూతసౌహృదమ్ ।
యత్సంపరేతః పునరేవబాలకో
దిష్ట్యా స్వ బంధూన్ప్రణయన్నుపస్థితః ॥ (32)

**తా॥** మేము ఏమి తపస్సు చేసితిమి? ఎట్టి కేశవార్చన చేసితిమి? బావులు, చేదబావులు, చెఱువులు, ఆరామములు మున్నగునవి ఏమి నిర్మించితిమి? పంచయజ్ఞములు, అగ్నిహోత్రాదులు ఏమిచేసితిమి? ఏమి దానములు చేసితిమి? ఏమి జీవ కారుణ్యము చూపితిమి? ఏలయన మా బాలుడు "మరణించియు" మరల తన బంధు జనులను ప్రేమించుచు వచ్చి యున్నాడు!! ఇది మా సౌభాగ్యము గదా!! (32)

**టీ॥** కో౽త్ర విస్మయః యుజ్యత ఏవైతదితి తేష్వేవ కేచిదాహుః- హింస్ర ఇతి. నః అస్మాభిః చిరంకృతం పూర్తం వాపీ కూప తటాకాది నిర్మాణం. ఇష్టం పంచయజ్ఞాగ్ని హోత్రాది. దత్తం దానం. (32)

**టీ॥** మా చేత చిరకాలముగ చేయబడిన పూర్తం - వాపీకూప తటాకాదుల నిర్మాణము - ఇష్టం - పంచయజ్ఞ అగ్నిహోత్రాదులు - దత్తం - దానము - (32)

**శ్లో॥** దృష్ట్వాద్భుతాని బహుశో నందగోపో బృహద్వనే ।
వసుదేవ వచో భూయో మానయామాస విస్మితః ॥ (33)

**తా॥** గోపాలకుడైన నందుడు, ఆ మహావనములో అనేక విధములైన అద్భుతములను చూచి ఆశ్చర్యపడుచు వసుదేవుని మాటలను మరల స్మరించుకొనెను. (33)

**శ్లో॥** ఏకదార్భక మాదాయ స్వాంకమారోప్య భామినీ ।
ప్రస్నుతం పాయయామాస స్తనం స్నేహ పరిప్లుతా ॥ (34)

**తా॥** ఒకప్పుడు శిశువైనకృష్ణుని ఒడిలోని కెక్కించుకొని, పెల్లుబికిన ప్రేమతో, స్వయముగనే స్రవించుచున్న చనుబాలను యశోద, అతనికి త్రాగించెను. (34)



ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

**టీ॥** శ్లో "తృణావర్తాగమే దృష్టగౌరవాశంకినీం ప్రసూమ్, బోధయఉ దర్శయామాస జృంభమాణో ముఖే జగత్". శ్రీధరీయోఉయం శ్లోకః . ఏకదేతి. (33,34)

**టీ॥** ఇచట శ్రీధరీయమైన శ్లోకము గలదు. దాని భావమిది. "తృణావర్తుడు రాగా గొప్ప బరువును శంకించుచున్న తల్లిని, తన ఈశ్వరత్వమును జ్ఞాపకముచేయుచు, ఆవులించు మిషతో తన నోటి యందు జగత్తు నంతయును చూపెను." (33,34)

**శ్లో॥** పీతప్రాయస్య జననీ సా తస్య రుచిరస్మితమ్ ।
ముఖం లాలయతీ రాజన్! జృంభతో దదృశే ఇదమ్ ॥ (35)

**తా॥** త్రాగిన స్తనముగల కృష్ణుని తల్లి యగు యశోద, అతని అందమైన చిరునవ్వుగల ముఖమును ముద్దాడుచుండగా ఓ రాజా! అతడు ఆవులింపగా ఆమె ఈ జగత్తును చూచెను. (35)

**టీ॥** పీతేతి. పీతమస్యాస్తీతి పీతః. తత్ప్రాయః పీతప్రాయః పీత విదితాదిశబ్దానాం పానాదిమతి వ్యుత్పన్నత్వాత్. విభక్తా భ్రాతర ఇత్యాదివత్. యద్వా–పీతప్రాయః స్తనో యేనేత్యుత్తరవదలోపసమాసో వా. (35)

**టీ॥** పీతప్రాయస్య – పీతః – త్రాగబడిన – ప్రాయః – స్తనము ఎవరి చేతనో అతని యొక్క (ఇది నాగరలిపిలోగల భాగవతమునందలి శ్రీధరీయ వ్యాఖ్య) – పీతమస్యాస్తీతి పీతః తత్ప్రాయః పీతప్రాయః – త్రాగబడినది కలవాడు పీతః – దాని ఆధిక్యము గలవాడు పీతప్రాయః – పీతవిదితాది శబ్దములకు – త్రాగుటయందు, తెలిసికొనుటయందు ఇష్టముగల అను మొదలగు అర్థము కలుగుటవలన – 'విభజింపబడిన అన్నదమ్ములు'వలె (విభజింపబడునది అన్నదమ్ములుకారు,. ఆస్తిపాస్తులు. త్రాగబడునది వాడు కాదు. పానీయము, క్షీరము. తెలిసి కొనబడునది వాడు కాదు – తెలియదగిన విషయము) లేక పీతప్రాయః స్తనో యేన ఇతి ఉత్తరపద లోప సమాసో వా – త్రాగబడిన స్తనము

నందలి పాలు – అని ఉండవలసి యుండ 'పాలు' అను ఉత్తర పదము లోపించనది. (ఇది వావిళ్ల ప్రతిలో గలవ్యాఖ్య.) (35)

**శ్లో॥** ఖం రోదసీ జ్యోతిరనీకమాశాః
సూర్యేందు వహ్ని శ్వసనాంబు ధీంశ్చ ।
ద్వీపాన్నగాం స్తద్దుహితౄర్వనాని
భూతాని యాని స్థిర జంగమాని ॥ (36)

**తా॥** ఆ జగత్తులో ఆకాశము, అంతరిక్షము, జ్యోతిర్మండలములు, అన్ని దిక్కులు, సూర్యుడు, చంద్రుడు, అగ్ని, వాయువు, సముద్రములు, ద్వీపములు, పర్వతములు, నదులు, వనములు చరాచరములైన భూతములు ఉండెను. (36)

**టీ॥** ఖమితి. ఖం స్వర్గాకాశం. నగాన్ గిరీన్. తద్దుహితౄః నదీః. (36,37)

**టీ॥** ఖం – స్వర్గాకాశము, నగాన్ – పర్వతములు, తద్దుహితౄః– నదులును – (36,37)

**శ్లో॥** సా వీక్ష్య విశ్వం సహసా రాజన్ సంజాతవేపథుః ।
సంమీల్య మృగశాబాక్షీ నేత్రే చాసీత్సువిస్మితా ॥ (37)

**తా॥** ఓరాజా! ఆమె, వెంటనే విశ్వమునంతయును (తన కొడుకు నోటి యందు) చూచి, వణుకు పుట్టినదై, లేడిపిల్ల కన్నులవంటి తన కన్నులను మూసికొని ఆశ్చర్యచకితయయ్యెను. (37)

శ్రీ మద్భాగవతే, మహాపురాణే దశమస్కంధే,
సప్తమోఽధ్యాయః

అని శ్రీమద్భాగవతమున దశమస్కంధమందు
ఏడవ అధ్యాయము సమాప్తము.

## అష్టమో ఽ ధ్యాయః

### శ్రీబాదరాయణి రువాచ.

**శ్లో॥** గర్గః పురోహితో రాజన్ యదూనాం సుమహాతపాః ।
వ్రజం జగామ నందస్య వసుదేవ ప్రచోదితః ॥ (1)

**టీ॥** శ్లో. "అష్టమే నామకర్మాస్య బాలక్రీడాకుతూహలే, మృద్భక్షణాదియోగ చ విశ్వరూపం నిరూప్యతే. విశ్వరూపాది బాలస్య నిశమ్యా శంకినః పితుః, నామకృద్గర్గవాక్యేన నీజం తత్త్వమసూచయత్".(1-3)

**శ్లో॥** తం దృష్ట్వా పరమప్రీతః ప్రత్యుత్థాయ కృతాంజలిః ।
ఆనర్చాధోక్షజధియా ప్రణిపాత పురస్సరమ్ ॥ (2)

**శ్లో॥** సూపవిష్టం కృతాతిథ్యం గిరా సూనృతయా మునిమ్ ।
నందయిత్వా బ్రవీద్బ్రహ్మన్ "పూర్ణస్య కరవామ కిమ్"? ॥ (3)

## ఎనిమిదవ అధ్యాయము.

### శ్రీబాదరాయణ మహర్షి యిట్లనెను

**తా॥** "పరీక్షిన్మహారాజా! యదువంశీయులకు పురోహితుడును, గొప్ప తపశ్శాలియునైన గర్గుడు వసుదేవునిచే ప్రేరేపింపబడి నంద గోకులమునకుఁ బోయెను. (1)

**టీ॥** ఈ అష్టమాధ్యాయమునందు, కృష్ణుని నామకరణము, బాలక్రీడాసక్తి యందు మట్టి తినుట మొదలగు లీలలయోగమున విశ్వరూపమును దర్శింప జేయుట, బాలకుని విశ్వరూపాది నిరూపణమును విని తండ్రి సందేహించుట, నామకరణము చేసిన గుర్గుని మాటచే నిత్య తత్త్వమును సూచించెను (76) ఇది శ్రీధరీయశ్లోక భావము. (1-3)

**తా॥** అతనిని చూచి నందుడు మిక్కిలి ప్రసన్నుడై, లేచి నిలబడి సాష్టాంగ నమస్కార పురస్సరముగ అంజలి ఘటించి, విష్ణు భావనతో పూజించెను. (2)

**తా॥** ఆతిథ్య సత్కారములు పూర్తిచేసి విశ్రాంతిగ కూర్చొనియున్న గర్గమహర్షిని ఉద్దేశించి మధుర వాక్కులతో అతనినానందింపజేసి ఇట్లనెను. "భగవన్! తాము పూర్ణకాములు. అట్టి తమరికి మేము ఏమి సేవచేయగలము?" (3)

**శ్లో॥** మహద్విచలనం నృణాం గృహీణాం దీనచేతసామ్ ।
నిశ్శ్రేయసాయ భగవన్నాన్యథా కల్పతే క్వచిత్ ॥ (4)

**తా॥** భగవన్! సంసారమునందు దీనమైన చిత్తములుగల మావంటి గృహస్థులైన మనుష్యులకు, మీవంటి మహాత్ముల ఆగమనము కల్యాణముకొఱకేగాని, ఎప్పుడును అన్యథాకాదు. (4)

**టీ॥** పూర్ణశ్చేత్కథం ధనినాం గృహమాగతస్తత్రాహ-మహద్విచలన మితి. మహతాం స్వాశ్రయాదన్యత్ర విచలనం న స్వార్థం. కింతు. గృహిణాం మంగళాయ. నను తర్హి, త ఏవ మహద్దర్శనార్థం కిమితి న గచ్ఛంతి? తత్రాహ-దీనచేతసాం, కృపణానాం క్షణమపి గృహం త్యక్తుమశక్నువతామిత్యర్థః. (4)

**టీ॥** పూర్ణకాముడై యుండినయెడల ధనవంతుల గృహమునకేల వచ్చెను? ఇట చెప్పుచున్నాడు. 'మహద్విచలనం' అని - మహాత్ములయొక్క అన్యత్ర గమనము - తన నివాసమునుండి ఇతరుల నివాసములకు కదలుట తనకొఱకు కాదు. మఱి? గృహస్థుల నిశ్శ్రేయసము - కొఱకు అటులైనచో ఆ గృహస్థులే ఈ మహాత్ములను దర్శించుటకు ఎందులకని పోవుటలేదు? చెప్పుచున్నాడు. దీనమైన మనస్సులుగలవారికి, జాలి గొలుపునట్లున్న వారికి, లోభులకును, ఒక్క క్షణమైనను ఇల్లు వదలి పోవుటకు శక్యము కాదని యర్థము.(4)

**శ్లో॥** జ్యోతిషామయనం సాక్షాద్యత్త జ్ఞాన మతీంద్రియమ్ ।
ప్రణీతం భవతా యేన పుమాన్వేద పరాపరమ్ ॥ (5)

**తా॥** ఇంద్రియములకు అతీతమైన ఏ జ్ఞానముగలదో అది జ్యోతిర్మార్గమున ప్రతిపాదింపబడిన జ్యోతిశ్శాస్త్రము. అది సాక్షాత్తుగ తమరిచేత రచింపబడినది. ఆ శాస్త్రముచేత మానవుడు తన పూర్వ జన్మమున చేసిన కర్మ యొక్క ఫలమును, ప్రస్తుత జన్మలోని భవిష్యత్ఫలమును తెలిసికొన గలుగును. (5)

**టీ॥** త్వయా బాలయోర్నామకరణాది. కరణీయమితి వక్తుం. తస్య జ్ఞానాతిశయ మాహ–జ్యోతిషామితి. యదతీంద్రియజ్ఞానసాధనం జ్యోతిషామయనం తత్ప్రతిపాదకం జ్యోతిశ్శాస్త్రమిత్యర్థః. తత్సాక్షాద్భవతా ప్రణీతం. యేన అన్యోఽపి పుమాన్. పరాపరం. పరం కారణం పూర్వజన్మకృతం కర్మ. అపరం కార్యం అస్మిన్ జన్మని భావి ఫలం తద్వేద. ఉక్తం చ జాతకే. శ్లో. "యదుపచితమన్యజన్మని శుభాశుభం తస్య కర్మణః ప్రాప్తిం, వ్యంజయతి శాస్త్రమేతత్తమసి ద్రవ్యాణి దీప ఇవే"తి.(5)

**టీ॥** మీ చేత బాలురిద్దఱికిని నామకరణాది కార్యములు చేయబడ వలయునని చెప్పుటకు ఆతని జ్ఞానాతిశయమును చెప్పుచున్నాడు. 'జ్యోతిషాం' అని – ఏది అతీంద్రియజ్ఞాన సాధనమో, అది జ్యోతిస్స్వ రూపముల మార్గము, దానిచే ప్రతిపాదింపబడినది జ్యోతిశ్శాస్త్రము. అది సాక్షాత్తుగ మీచే రచింపబడినది. దేనిచేత ఇతర మనుష్యుడుకూడ పరాపరం – పరం. కారణమగు పూర్వజన్మమున చేయబడిన కర్మ – అపరం – కార్యమగు ఈ జన్మయందు భవిష్యత్కాల సంబంధమగు ఫలము – దానిని తెలిసికొనును, 'జాతకము'నందు చెప్పబడినది కూడ. "పూర్వజన్మమునందు శుభమో అశుభమో ఏది సంపాదింప బడినదో అట్టి కర్మ యెక్క ఫల ప్రాప్తిని ఈ శాస్త్రము సూచించును. ఆ ఫలము కూడ ఎట్టిదో – వస్తువులను చీకటిలో దీపమువలె – చూపించును." అని – (5)

**శ్లో॥** త్వం హి బ్రహ్మవిదాం శ్రేష్ఠస్సంస్కారాన్ కర్తు మర్హసి ।
బాలయోరనయోర్నౄణాం జన్మనా బ్రాహ్మణోగురుః ॥ (6)

**తా॥** బ్రహ్మవేత్తలలో తాము శ్రేష్ఠులు. ఈ బాలురిద్దఱకును నామ కరణాది సంస్కారములను చేయుటకు మీరు అర్హులు. మానవులలో జన్మ చేతనే బ్రాహ్మణులు గురువులును. (6)

**టీ॥** వివక్షితమాహ – త్వం హీతి. దైవజ్ఞో మంత్రవచ్చ త్వం. అతో నామకరణాదిసంస్కారాన్ కర్తుమర్హసీత్యర్థః. నన్వేతద్గురుణా కరణీయ మితి చేత్తత్రాహ నౄణామితి. (6)

**టీ॥** చెప్పనిచ్ఛగల దానిని చెప్పుచున్నాడు. "త్వం హి' అని. మీరు దైవజ్ఞులు, మంత్రవేత్తలు, అందువలన నామకరణాది సంస్కారములు చేయుటకు అర్హులు అని యర్థము. ఇట్టిది నిశ్చయముగ గురువు

చేతనే చేయదగినది అనినచో దానికి చెప్పుచున్నాడు. మనుష్యులలో తాము జన్మ చేత బ్రహ్మణులు, గురువులు కూడ అని. (6)

గర్గాచార్య ఉవాచ

శ్లో॥ యదూనామహమాచార్యః ఖ్యాతశ్చ భువి సర్వతః ।
సుతం మయాసంస్కృతం తే మన్యతే దేవకీ సుతమ్ ॥ (7)

గర్గాచార్యుడిట్లనెను.

తా॥ "యదువంశీయులకు నేను ఆచార్యుడను, ఈ విషయము లోకమంతటికి తెలియును. నీ కుమారుడు నాచే సంస్కరింపబడెనగా, దేవకి కుమారుడే సంస్కరింప బడెనని అతడు (కంసుడు) భావించును సుమా! (7)

టీ॥ అత్యుత్సాహినం నందం ప్రతి గుప్తమేతత్కార్యమిత్యభిప్రాయేణ ప్రత్యాచక్షాణ ఇవాహ-యదూనామితి. భవతు తథాపి. త్వమత్రాగత ఇతి కుతో విద్యాదితి చేదత ఆహ-ఖ్యాతశ్చేతి. తతః కిమత ఆహ-దేవకీసుతమితి. కంసో మన్యతే కల్పయేదిత్యర్థః. (7)

టీ॥ అత్యుత్సాహియైన నందునుద్దేశించి (ఈ కార్యము రహస్యముగ చేయదగినది' అను అభిప్రాయముచేత ప్రత్యుత్తరమిచ్చుచున్న వాని వలె చెప్పుచున్నాడు 'యదూనాం'అని. అగుగాక! అట్లైనను, 'నీ విచటికి వచ్చుట ఎట్లు తెలియును?" అనినచో అది చెప్పుచున్నాడు.'ఖ్యాతః' అని – అయిననేమి? చెప్పుచున్నాడు – 'దేవకీసుతం' అని. కంసుడు భావించును. కల్పించుకొనునని (ఊహించుకొనును) యర్థము. (7)

శ్లో॥ కంసః పాపమతి స్సఖ్యం తవ చానక దుందుభేః ।
దేవక్యా అష్టమో గర్భో న స్త్రీ భవితు మర్హతి ॥ (8)

తా॥ కంసుడు పాపబుద్ధి గలవాడు. నీకును వసుదేవునకును మధ్య గల గాఢమైన స్నేహము అతనికి తెలియును. దేవకి యొక్క ఎనిమిదవ సంతానము స్త్రీయగుటకు వీలులేదు. (ఈ మూడు కారణముల వలన కంసుడు, దేవకి కుమారుడే సంస్కరింపబడెనని ఊహింపగలడు.(8)

**టీ॥** కంస ఇతి. నను యదుకుమార ఇతి కథంచిజ్జ్ఞానాతు తత్ర వసుదేవస్య పుత్రః దేవక్యాం జాత ఇతి కుతో జానీయా త్తత్రాహ- పాపమతిరిత్యాది . (8)

**టీ॥** యదువంశపు బాలుడని ఏదో విధముగ తెలిసికొనుగాక. కాని వసుదేవుని పుత్రుడని దేవకి యందు పుట్టిన వాడనియు ఎట్లు తెలిసికొనగలడు? అను దాని గురించి చెప్పుచున్నాడు. ఇచటి శ్లోకము నందలి 'పాపమతిః' అని మొదలుగ (గల కారణములతో) (8)

**శ్లో॥** ఇతి సంచింతయన్ శ్రుత్వా దేవకీదారికావచః ।
అపిహంతాగతా శంకస్తర్హి తన్నోఽనయో మహాన్ ॥ (9)

**తా॥** దేవకి యొక్క కన్యయగు మాయాదేవి మాటలు "కిం మయా హతయా మందజాతః ఖలు తవాంత కృత్ (10-4-12) అను మొదలగు మాటలు విని, కంసుడు "దేవకీ గర్భమున ఎనిమిదవ పర్యాయము స్త్రీ యగుటకు వీలేదు" అని చింతించుచు, అనుమానము నివృత్తికానివాడై. ఒకవేళ హంతకుడైనచో మనకు గొప్ప అన్యాయము జరుగును. (9)

**టీ॥** ఇతీతి శ్లో. "కిం మయా హతయా మందే"త్యాదిదేవకీ కన్యావచః శ్రుత్వా. శ్లో. "దేవక్యా అష్టమో గర్భో న స్త్రీ భవితుమర్హతీ"తి చ నిత్యం సంచింతయన్ సామాన్యేన క్వచిదస్తీతి జ్ఞాత్వా. యువయోశ్చ సఖ్యం చింతయన్ - త్వద్గృహే భవేదితి సంభావ్య. మత్సంస్కారలింగేన వా. అగతా శంకః. అగతా. ఆశంకా యస్య సః. అపి యది. హంతా హనిష్యతి తర్హి తదా తతో నో మహాన్ అన్యస్స్యాదితి. (9)

**టీ॥** "కిం మయా హతయా మంద" అనిమొదలుగ దేవకియొక్క కుమార్తెమాటలనువిని, "దేవకియొక్క ఎనిమిదవ సంతానము స్త్రీయగుటకు వీలులేదు" అనియు ఎల్లప్పుడు చింతించుచు సామాన్యముగా ఏదో ఉన్నది అని తెలిసికొని, మీ యిరువురి మైత్రిని గురించి ఆలోచించుచు నీ యింటిలో ఉండవచ్చునని భావించి, లేక నేను చేసెడు సంస్కారపు గుర్తుచేత నైనను - అగతాశంకః - ఆ శంక పోనివాడెవడో వాడు (కంసుడు అపి - ఒకవేళ - హంతా - చంపువాడైనచో-అప్పుడు మనకు గొప్ప ఆపద కలుగును-అని. (9)

<u>నంద ఉవాచ.</u>

**శ్లో॥** అలక్షితోఽస్మిన్ రహసి మామకైరపి గో వ్రజే ।
కురు ద్విజాతి సంస్కారం స్వస్తివాచన పూర్వకమ్ ॥ (10)

<u>నందుడిట్లనెను.</u>

**తా॥** "ఈ గోశాలలో, నాకు సంబంధినవారు కూడ చూడకుండునట్లు, రహస్యముగ, స్వస్తి వాచన పూర్వకముగ పసి వానికి ద్విజాతి సంస్కారమును చేయుదు. (10)

**టీ॥** అలక్షిత ఇతి. ద్విజాతి సంస్కారమాత్రం. కేవలం స్వస్తివాచన పూర్వకం కుర్వితి. - యదూనామపృథగ్భావాత్. భావో భావనం. తస్మాత్ అన్యోన్య శిక్షయా సర్వైకమత్యకరణాదిత్యర్థః. సమ్యక్ కర్షతి ఏకీకరోతీతి సంకర్ష ణమప్యుశంతి మన్యంతే వక్ష్యంతీత్యర్థః. (10-12)

**టీ॥** త్రైవర్ణికులకు అర్హమైన సంస్కారమును మాత్రము స్వస్తివాచన పూర్వకముగ చేయుదు అని -యదాఊనామ పృథగ్భావాత్ - ఏదో కారణమువలన చెల్లాచెదరైన యదువంశీయుల యొక్క అభిన్నత్వము వలన - భావః - భావనము - అందువలన ఒకరినొకరు తెలుపుకొనుటచే అందఱిని ఒకటిగా చేయుటవలన - సమ్యక్ కర్షతి - ఏకీ కరోతీతి సంకర్షణ మప్యుశంతి- అందురు. భావింతురు - చెప్పుదురని యర్థము. (10- 12)

<u>శ్రీశుక ఉవాచ.</u>

**శ్లో॥** ఏవం సంప్రార్థితో విప్రస్స్వ చికీర్షితమేవ తత్ ।
చకార నామకరణం గూఢో రహసి బాలయోః ॥ (11)

<u>శ్రీశుకమహర్షి ఇట్లనెను.</u>

**తా॥** గర్గమహర్షి ఈ విధముగ ప్రార్థింపబడి స్వయముగ, స్వీయకర్తృకముగనే, రహస్యముగ, తనను తాను గుప్తపరుచుకొని, ఇరువురు బాలురకు నామకరణము చేసెను. (11)

గర్గ ఉవాచ.

**శ్లో॥** అయం హి రోహిణీ పుత్రో రమయన్ సుహృదో గుణైః
ఆఖ్యాస్యతే రామ ఇతి బలాధిక్యాద్బలం విదుః
యదూనామ పృథగ్భావా త్సంకర్షణ ముశంత్యుత ॥ (12)

**శ్లో॥** ఆసన్ వర్ణాస్త్రయో హ్యస్య గృహ్ణతోఽనుయుగం తనూః ।
శుక్లో రక్తస్తథాపీత ఇదానీం కృష్ణతాం గతః ॥ (13)

**టీ॥** గర్భసంకర్షణం తు న ప్రకాశయతి – ఆసన్నితి. అస్య తవ పుత్రస్య అతః కృష్ణ ఇత్యేకం నామ భవిష్యతి. (13)

**శ్లో॥** ప్రాగయం వసుదేవస్య క్వచిత్ జ్ఞాతస్తవాత్మజః ।
వాసుదేవ ఇతి శ్రీమా నభిజ్ఞాస్సం ప్రచక్షతే ॥ (14)

గర్గమహర్షియిట్లనెను

**తా॥** ఇతడు రోహిణి యొక్క పుత్రుడు. తన సద్గుణములచేత బంధుమిత్రులను సంతోషింపజేయుచు ఇతడు రాముడని పేర్కొనబడును. అధికమైన బలవంతుడగుటచే ఇతనిని బలుడనియు తెలియుదురు. మరియు యదువంశీయులకు భిన్నమైన వాడు కాకుండుటచే ఇతనిని సంకర్షణుడనియు నందురు. (12)

**తా॥** అతడు స్వీకరించిన తన శరీరవర్ణములు, యుగముల ననుసరించి క్రమముగ, తెలుపు, ఎఱుపు, పసుపు అని మూడు రంగులు ఉండెను. ఇప్పుడది కృష్ణ వర్ణమును పొందెను. (అందుచే అతడు కృష్ణనామముచే పిలువబడును.) (13)

**టీ॥** అస్య – నీ కుమారుని యొక్క – అందువలన కృష్ణుడని ఒకే నామము కలుగును. (13)

**తా॥** మొదట ఎప్పుడో నీ ఈ పుత్రుడు వసుదేవుని పుత్రుడుగా తెలియబడెను. అందుచేత ఈవిషయము తెలిసినవారు ఇతనిని వాసుదేవుడను శుభనామముతో పిలిచెదరు. (14)

**టీ॥** ప్రాగయమితి. సామాన్యోక్త్యా. ఋషిరయం జన్మాంతర గతం నామ కథయతీతి నందో మన్యతే స్మ. అత ఏవం వాసుదేవ ఇతి సంప్రచక్షత ఇతి. (14)

**టీ॥** సామాన్యోక్తిచేత ఇతడు (గర్గుడు) ఋషి – గడచిన జన్మము నందలి పేరు చెప్పుచున్నాడని నందుడు భావించెను. అందువలన ఇతడు వాసుదేవుడనియు చెప్పుదురు. అని. (14)

**శ్లో॥** బహూని సంతి నామాని రూపాణి చ సుతస్య తే ।
గుణకర్మానురూపాణి తాన్యహం వేద నో జనాః ॥ (15)

**తా॥** నీ పుత్రునకు అనేకములైన నామములు, రూపములును – అతని గుణముల ననుసరించి, కర్మల ననుసరించియు కలవు. అవి అన్నియు, సాధారణమైన జనులతో పాటు నాకు కూడా తెలియవు. (15)

**టీ॥** బహూనీతి. గుణానురూపాణి. ఈశ్వరః సర్వజ్ఞ ఇత్యాదీని కర్మానురూపాణి గోవిందః గోవర్ధనోద్ధరణ ఇత్యాదీని. తాని సర్వాణ్యహమపి నో వేద. జనాః అపి నో విదురితి. (15)

**టీ॥** గుణములననుసరించి, ఈశ్వరుడు, సర్వజ్ఞుడు మొదలైనవియు, కర్మల ననుసరించి గోవిందుడు, గోవర్ధనోద్ధరణుడు మొదలగునవి – అవి యన్నియును నాకు తెలియవు, జనులకు కూడా తెలియవు – అని. (15)

**శ్లో॥** ఏష వః శ్రేయ ఆధాస్యత్ గోప గోకుల నందనః ।
అనేన సర్వదుర్గాణి యూయమంజస్తరిష్యథ ॥ (16)

**తా॥** ఇతడు మీకు శ్రేయమును సమకూర్చును. గోపాలకులకు గోవులకు ఆనందమును కలిగించును. ఇతని చేత మీరు అన్ని విధములైన విపత్తులను సుగమముగ దాటెదరు. (16)

**టీ॥** జాతకఫలమాహ-ఆధాస్యతీతి. ఏషః పరమపురుషః. శ్రేయః ముక్తిం. అంజః ఝడితి. (16)

**టీ॥** జాతకఫలమును చెప్పుచున్నాడు. 'ఆధాస్యతి' అని, ఇతడు పరమపురుషుడు. శ్రేయః = ముక్తిని - అంజః - శీఘ్రముగ. (16)

**శ్లో॥** పురానేన వ్రజపతే సాధవో దస్యుపీడితాః ।
అరాజకే రక్ష్యమాణా జిగ్యు (జఘ్నుః)ర్దస్యూన్ సుమేధితాః(17)

**తా॥** పూర్వము రాజులు లేని కాలమున సాధువులు, దొంగల చేత పీడింపబడుచుండిరి. ఓ వ్రజరాజా! అప్పుడు ఇతనిచేత ఆ సాధువులు రక్షింపబడుచు క్రమముగ బలవంతులై ఆ దస్యులను సంహరించిరి. (17)

**టీ॥** పురేతి. అనేన రక్ష్యమాణాః సమేధితాశ్చ. దస్యూన్ జఘ్నురితి. (17-19)

**టీ॥** ఇతనిచే రక్షింపబడుచున్నవారై, వర్ధితులై ఆ దోపిడి గాండ్రను వధించిరి. (17 -19)

**శ్లో॥** య ఏతస్మిన్ మహాభాగాః ప్రీతిం కుర్వంతి మానవాః ।
నారయో హి భవంత్యేతాన్ విష్ణుపక్షానివాసురాః ॥ (18)

**తా॥** ఏ మనుష్యులు ఇతని యందు ప్రేమ కలిగియుందురో వారు మిక్కిలి భాగ్యశాలురు. వీరికి శత్రువులే ఉండరు. విష్ణుపక్షము వహించిన రాక్షసులకు వలె అందఱును ఆత్మీయులై యుందురు. (మహాభాగే అను పాఠమున యశోదా సంబోధనము.) (18)

**శ్లో॥** తస్మాన్నందాత్మజోఽయం తు నారాయణ సమో గుణైః ।
శ్రియా కీర్త్యానుభావేన గోపాయస్వ సమాహితః ॥ (19)

**తా॥** అందువలన ఓ నందరాజా! ఈ నీ కుమారుడు గుణములచేతను, సంపదచేతను, కీర్తిచేతను, ప్రభావముచేతను నారాయణునితో సమానమైనవాడు. కావున మిక్కిలి శ్రద్ధగా ఇతనిని రక్షించుచుండుము. (19)

**శ్లో॥** ఇత్యాత్మానం సమాదిశ్య గర్గేన స్వ గృహం గతే ।
నందః ప్రముదితో మేనే హ్యాత్మానం పూర్ణమాశిషామ్ ॥ (20)

**తా॥** నందుడు ఈ విధముగ గర్గమహర్షి చేత ఆదేశింపబడి, తన యింటికి వెడలిన తరువాత మిక్కిలి సంతోషపడినవాడై తాను సంపూర్ణముగ ఆశీర్వదింపబడితినని భావించెను. (20)

**టీ॥** ఇతీతి. ఇతి ఆత్మానం ప్రతి. సమాదిశ్య ఆత్మానం కృష్ణంచ. ఆశిషాం ఆశీర్భిః నందః పూర్ణం విష్ణుం మేనే అమంస్త. (20)

**టీ॥** అని తనను గూర్చి ఆజ్ఞాపింపబడి, తనను, కృష్ణుని కూడ ఆశీస్సుల చేత – నందుడు –పూర్ణం – విష్ణువును భావించెను. (20)

**శ్లో॥** కాలేన వ్రజతా తాత గోకులే రామకేశవౌ ।
జానుభ్యాం సహపాణిభ్యాం రమమాణౌ విజహ్రతుః ॥ (21)

**తా॥** నాయనా! కొంతకాలము గడచిన తరువాత బలరామకృష్ణులు గోకులము నందు, తమ మోకాళ్లతోను, చేతులతోను కలిపి ప్రాకుచు అందఱిని ఆనందింపజేయుచు ఇటు నటు విహరించుచుండిరి. (21)

**టీ॥** శ్లో.బాలక్రీడాచమత్కారైః కృష్ణో రామేణ సంయుతః, పరమానందమాధత్త వ్రజే నందయశోదయోః. శ్రీధరీయోఽయం శ్లోకః. పూర్ణత్వమేవ దర్శయన్నాహ–కాలేనేతి. (21)

**టీ॥** బాలుర క్రీడల చమత్కారముల చేత కృష్ణుడు, బలరామునితో కూడి గోకులమునందున్న వారికి, యశోదానందులకును పరమానందము కలిగించుచుండిరి. ఈ భావము గల శ్లోకము శ్రీధరీయము. (21)

**శ్లో॥** తావంఘ్రియుగ్మ మనుకృష్య సరీసృపంతౌ
ఘోషప్రఘోష రుచిరం వ్రజ కర్దమేషు ।
తన్నాద హృష్ట మనసా వనుసృత్యలోకం
ముగ్ధ ప్రభీతవదుపేయతు రంతిమాత్రోః ॥ (22)

**తా॥** బలరామ కృష్ణులిరువురు గోకులమున నేలపై అచటచట గల బురదలో, పాదముల అడుగు భాగములతోనే ఒరయుచు అతిశయముగ ముందునకు ప్రాకుచుండగా, వారి పాదములకు, నడుమునకు గల ఆభరణముల కింకిణులు ధ్వనించుచు, ప్రతిధ్వనించుచు శ్రావ్యముగ వినబడుచుండగ, ఆ ధ్వనితో ఉల్లసించిన మనస్సులు గలవారై, ఎవరో

ఒకడు త్రోవ నడుచుచుండగా వాని వెనుకనే, వానికి తెలియకుండ కొంతదూరము నడచి, వాడు తమను గమనింపగనే – లేక తామే వానిని చూడగానే, అమాయకముగ, భయపడుచున్న వారివలె తమ తమ తల్లుల కడకు పోవుచుండిరి. (22)

**టీ॥** తావితి. అనుకృష్య పునః పునరాకృష్య. సరీసృపంతౌ అతిశయేన చలంతౌ. ఘోషాః కటిపాదభూషణకింకిణ్యః. తేషాం ప్రఘోషేణ రుచిరం యథా భవతి తథా. ఘోషాణాం నాదేన హృష్టం మనో యయోస్తౌ లోకం తతస్తతో గచ్ఛంతం జనం. అనుసృత్య త్రిచతురాణి పదాని అనుగమ్య. ముగ్ధవత్ప్రభీతవత్ మాత్రోరంతి సమీపే ఉపేయతుః ఉపజగ్మతుః. (22)

**టీ॥** అనుకృష్య – మఱల మఱల ఒరయుచు – సరీ సృపంతౌ – అతిశయముగ కదలుచు ప్రాకుచు ఘోషాః – నడుమునకు, పాదములకు గల భూషణముల చిఱుగజ్జెల (ధ్వనులు) వాని యొక్క ధ్వని చేత శ్రావ్యత ఎట్లు కలుగునో అట్లు – కింకిణుల ధ్వని చేత సంతోషించిన మనస్సు ఎవరికో ఆ యిద్దఱు – లోకం – అటనట పోవుచున్న మనుష్యులను అనుసరించుచు మూడు నాలుగు అడుగులు వెంబడించి – అమాయకునివలె – భయపడినవానివలె తమ తల్లుల సమీపమునకు – ఉపేయతుః – వెడలుదురు. (22)

**శ్లో॥** తన్మాతరౌ నిజసుతౌ ఘృణయా స్నువంత్యౌ
పంకాంగరాగ రుచిరా వుపగూహ్య దోర్భ్యామ్ ।
దత్వా స్తనౌ ప్రపిబతో స్సుముఖం నిరీక్ష్య
ముగ్ధస్మితాల్ప దశనం యయతుః ప్రమోదమ్ ॥ (23)

**తా॥** వారి తల్లులిద్దఱు (రోహిణీ యశోదలు) బురదతో ఒడలంతయు ఎరుపువారి సుందరులై యున్న తమ కొడుకులను (బలరామ కృష్ణులను) బాహువులు చాచి కౌగలించుకొని, అతిశయించిన వాత్సల్యమున, స్వయముగ పాలతో ద్రవించుచున్న స్తనము లిచ్చి తృప్తిగ త్రాగుచున్న వారి అమాయికపు చిఱునవ్వుతో కూడిన అప్పు

టీ॥ తదితి. తదా చ తన్మాతరౌ. నిజసుతౌ దోర్భ్యాముపగూహ్య. ప్రమోదం. యయతుః కథంభూతే. ఘృణయా కృపయా స్నువంత్యౌ క్షరత్పయఃపూర్ణ పయోధరే సత్యౌ.పంకేనాంగ రాగేణ చ. రుచిరౌ. కథంభూతం ముఖం నిరీక్ష్య ముగ్ధం మందస్మితం యస్మిన్ అల్పా దశనాశ్చ యస్మిన్ తచ్చ తచ్చ.(23)

శ్లో॥ యర్హ్యంగనా దర్శనీయ కుమారలీలా
వంతర్వ్రజే తదబలాః ప్రగృహీతపుచ్ఛైః ।
వత్సైరితస్తత ఉభావను కృష్యమాణౌ
ప్రేక్షంత్యఉజ్ఝిత గృహా జహృషుర్హసంత్యః ॥ (24)

టీ॥ యర్హీతి. యర్హి అంగనానాం దర్శనీయా కుమారలీలా యయోః . తథా భూతౌ జాతౌ. తదాంతర్వ్రజే వ్రజస్య మధ్యే. తదబలాః

దప్పుడే వచ్చుచున్న దంతముల తోడి ముఖములను చూచి పరమానందము నొందిరి. (23)

టీ॥ అప్పుడు వారి తల్లులిద్దరు తమ కొడుకులిరువురిని భుజములతో కౌగలించుకొని ఆనందమునొందిరి. ఎట్టివారు? దయతో స్రవించు పాలతో నిండిన స్తనములు గలవారగుచు – బురద పూతతో ఎఱ్ఱనైన శరీరములు గల సుందరులను – ఎట్టి ముఖములను చూచి? అమాయకమైనవి, లేత చిఱునవ్వుగలవి. కొంచెముగా దంతములు గలవి. (23)

తా॥ గోకులమునందు, బలరామకృష్ణులచేత, పట్టుకొనబడిన తోకలు గల లేగడూడలు ఇటునటు, వారినికూడ లాగికొనుచు పరుగెత్తుచుండగా, అచటి గోపస్త్రీలు తమ ఇండ్లను వదలి, ఇంటి పనులను మరచి, వారిని చూచుచు, సంతోషించుచు నవ్వుచుండగా అప్పుడు – ఆ వ్రజమున కుమారుల లీలలు అచటి స్త్రీలకు దర్శనీయ ములై అలరారును. (24)

టీ॥ యర్హి – ఎప్పుడైతే స్త్రీలకు దర్శనీయములై బాలుర చేష్టలు (ఉండునో అని శేషము) అప్పుడు వ్రజ మధ్యమున, ఆ బాలురిద్దటి

వ్రజాంగనాః. ప్రేక్షంత్యః ప్రేక్షమాణాః విస్మృత గృహకృత్యాః హసంత్యో జహృషుః హృష్టాః బభూవుః. కథంభూతౌ. తాభ్యాం ప్రగృహీతాని పుచ్ఛాని. యేషాం తైః వత్సైః. ఇతస్తతోఽనుకృష్యమాణౌ. (24)

చేతనే పట్టుకొనబడిన తోకల చేత - అట్టి లేగల చేత ఇటునటు ఆకర్షింపబడుచున్న వారిని చూచుచున్నవారు. గృహవ్యాపారములు మరచిపోయి (ఉత్సృత) (ఉర్ఘిత గృహాః అని కూడ పాఠము.) జహృషుః - సంతోషించినవారై జగృహుః అను పాఠమున - వారిరువురిని తీసికొనిపోయిరి అని అర్థము. (24)

**శ్లో॥** శృంగ్యగ్ని దంష్ట్ర్యసి జలద్విజకంటకేభ్యః
క్రీడాపరావతిచలౌ స్వసుతౌ నిషేద్ధుమ్ ।
గృహ్యాణి కర్తుమపి యత్ర న తజ్జనన్యౌ
శేకాత ఆపతురలం మనసోఽనవస్థామ్ ॥ (25)

**తా॥** మిక్కిలి చపలురును, క్రీడలయందాసక్తిగలవారును అగు తమ కొడుకులను (బలరామకృష్ణులను) పశువుల కొమ్ముల నుండి, లేక కొమ్ములు గల పశువుల నుండి, అగ్ని నుండి, కొన్ని విధములగు జంతువుల కోరల నుండి, ఖడ్గముల నుండి ( అహి యను పాఠమున పాములనుండి) నీటి (గుంతల)నుండి, నెమిళ్లు మొదలగు పక్షిజాతులనుండి, ముండ్ల(చెట్ల) నుండి నిషేధించుటకు ( వాటి వద్దకు పోకుండ ఆపుటచే) తల్లులిద్దఱు (రోహిణీ యశోదలు) గృహకృత్యములు (కూడ) నిర్వర్తించుటకు కూడ శక్తులు కాకపోయిరి అందువలన వారి మనస్సులకు వ్యాకులత కలుగుచుండెననుట చాలును. (25)

**శ్లో॥** కాలేనాల్పేన రాజర్షే రామః కృష్ణశ్చ గోకులే ।
ఆకృష్ట జానుభిః పద్భిర్విచక్రమతురంజసా ॥ (26)

**తా॥** ఓ రాజర్షీ! కొద్ది కాలమునకు రామకృష్ణులు, గోకులమునందు, మోకాళ్ళతో (నేలకు) రాపిడిలేకుండ పాదములతో వేగముగ తిరుగుచుండిరి. (26)

**శ్లో॥** తతస్స భగవాన్ కృష్ణో వయస్యైర్వ్రజ బాలకైః ।
సహ రామో వ్రజ స్త్రీణాం చిక్రీడే జనయన్ ముదమ్ ॥ (27)

**తా॥** భగవానుడగు కృష్ణుడు తన తోటి వారైన వ్రజ బాలకులతోను, బలరామునితో కూడియు వ్రజ స్త్రీలకు సంతోషము కలిగించుచు క్రీడించుచుండెను. (27)

**శ్లో॥** కృష్ణస్య గోప్యో రుచిరం వీక్ష్య కౌమార చాపలమ్ ।
శృణ్వంత్యాః కిల తన్మాతురితి హోచు స్సమాగతాః ॥ (28)

**తా॥** కృష్ణుడు బాల్య చాపల్యమున చేయు ఆనందకరములైన చేష్టలు చూచి, ఒకతడవ వారు యశోద వద్దకు వచ్చి ఆమె వినుచుండగా ఆశ్చర్యముగ వానినన్నింటిని చెప్పిరట! (28)

**టీ॥** శృంగీతి. క్రీడాపరౌ అతిచపలౌ తౌ. శృంగ్యాదిభ్యో నిషేద్ధు. గృహో చితాని కర్మాణి చ కర్తుం యత్ర యదా తజ్జనన్యౌ న శేకాతే తదా. మనసః అనవస్థామాపతురితి. శ్లో. "గృహిణాం గృహసౌఖ్యస్య పరా తుష్టిః ప్రదర్శితా, కృష్ణచాపల చౌర్యాణి సహైవాఖిలసద్మసు. ప్రజల్పంత్యస్సమా గత్య గోప్యో గోప్యై ముదం దదుః." శ్రీధరీయో ఉ యం శ్లోకః. (25-28)

**టీ॥** క్రీడాపరౌ – ఆటల యందాసక్తి గల వారిని – అందుకే ఆటంకములను గమనింపక తిరుగు వారిని, అతిచపలౌ – మిక్కిలి చపలురను, కొమ్ములు గల పశువులు మొదలైన వానినుండి, గృహోచిత కార్యము లను నిర్వర్తించుటకు – పనులు చేయుటకు ఎప్పుడు వారి తల్లులిద్దఱు శక్తులుకారో అప్పుడు వలసినంత మానసికమైన వ్యాకులత్వము పొందెదరని చూపబడినది. శ్రీధరుని వ్యాఖ్యా శ్లోక భావ మిది. "గృహస్థుల గార్హస్థ్యసౌఖ్యమునకు పరాకాష్ఠ చూపబడినది. అందఱి యిండ్లలోను చూపిన కృష్ణుని చపల కార్యములను గోపస్త్రీలు ముచ్చటించుకొనుచు వచ్చి యశోదకు చెప్పి ముదము గూర్చుచుండిరి. (25-28)

**శ్లో॥** వత్సాన్ ముంచన్ క్వచిదసమయే క్రోశసంజాత హాసః
స్తేయం స్వాద్వత్త్యథ దధి పయః కల్పితైః స్తేయ యోగైః ।
మర్కాన్ భోక్ష్యన్ విభజతి స చేన్నాత్తి భాండం భినత్తి
ద్రవ్యాలాభే స గృహకుపితో యాత్యుపక్రోశ్య తోకాన్ ॥ (29)

**టీ॥** అసమయే అదోహకాలే. క్రోశే సంజాతహాసః. స్తేయం చౌర్యార్జితం తత్రాపి. స్వాదు. నేతరత్. దధి చ, పయశ్చ. దధిపయః. అత్తి కించ భోక్ష్యన్ భోక్ష్యమాణః స్వయం భుంజాన ఇత్యర్థః. మర్కాన్ మర్కటాన్ ప్రతి. విభజ్య దదాతి. తేషాం మధ్యే తృప్తత్వేన కోఽపి నాత్తి చేత్తర్హి, భాండం భినత్తి క్వచిత్. ద్రవ్యస్యాలాభే సతి కృష్ణః. గృహాయ ధక్ష్యామీతి కుపితో యాతి. యద్వా సగృహాః గృహిణ్యః. తేభ్యః కుపితః తేషాం తోకాన్ బాలాన్ పర్యంకాదిషు సుప్తాన్. ప్రహారనోదనాదిభిః. ఉపక్రోశ్య ప్రరుదితాన్ కృత్యాయాతీతి. (29)

**తా॥** ఒక్కొక్కప్పుడు అసమయములందు దూడలను వదలిపెట్టును, గృహిణులు కేకలువేయగా నవ్వుచు, దొంగిలించిన రుచికరములైన పెరుగు పాలు త్రాగును. ఆ దొంగిలించిన వస్తువులను తాను తినుచు. తక్కిన పదార్థమును కోతులకు పంచియిచ్చును. అవి తినకపోయిన యెడల కుండలను, ముంతలను పగులగొట్టును. ఏ యింటిలోనైనను తనకు కావలసిన పాలు, వెన్న మొదలైనవి దొరకనిచో, ఆ యింటిమీద కోపగించి, అందున్న చిన్న పిల్లలను ఏడిపించి పోవును. (29)

**టీ॥** అసమయే – పాలుపిండు సమయముకాని యప్పుడు – కోపముతో కేకలు వేసినప్పుడు నవ్వు కలిగినవాడై దొంగతనముతో సంపాదించిన – అదియును రుచికరమైన – ఇతరమైనదికాదు. పెరుగు పాలును – తినును. మరియు – తాను స్వయముగ తినుచు – కోతులను గూర్చి పంచిపెట్టును. ఆ కోతులలో ఏకోతియైనను తృప్తిపడియుండుటచే తినకపోయినచో ఒక్కొక్కపుడు పాత్రను పగులగొట్టును. పదార్థము లభింపనప్పుడు కృష్ణుడు ఆ యింటిని 'భస్మీకరింతునని' కోపగించుకొని వెడలిపోవును. లేక – సగృహాః – గృహిణులు – వారివలన కోపించినవాడై – వారి బాలురను – మంచములుమున్నగు వానియందు పరుండియున్నవారిని, కొట్టుట స్థలము మార్చుట ద్వారా వారిని బాగుగ ఏడ్చునట్లుచేసి వెడలపోవును – అని. (29)

**శ్లో॥** హస్తాగ్రాహ్యే రచయతి విధిం పీఠకోలూఖలాద్యై
శ్ఛిద్రం హ్యంతర్నిహితవయున శ్శిక్య భాండేషు తద్విత్ ।
ధ్వాంతాగారే ధృతమణిగణం స్వాంగమర్థప్రదీపం
కాలే గోప్యో యర్హి గృహకృత్యేషు సువ్యగ్రచిత్తాః ॥ (30)

**తా॥** రెండుచేతులతోను తీసికొనరానివైనప్పుడు, పీటలు, ఱోళ్లు మొదలైన వానితో నొకవిధానమును కల్పించుకొనును. ఏ వస్తువెచ్చట నున్నదో అనుజ్ఞానము కలవాడగుటచేత, ఉట్లమీద అమర్పుతో భద్ర పరచబడిన పాత్రలకు రంధ్రములు చేసి – ఆకళలో పండితుడగుట వలన, చీకటి గల యింటి లోనను, తాను ధరించిన మణి సమూహము లకు తన అవయవములతోనే రాపిడి కలిగించి. అవి వెలుగులనీయగా, ఎప్పుడు గోపస్త్రీలు తమ తమ గృహకృత్యములలో పూర్తిగ నిమగ్నమైన చిత్తములు గలవారైయుందురో అప్పుడు తన పని చక్కబెట్టుకొనును. (30)

**టీ॥** కల్పితైః స్తేయయోగైరిత్యుక్తం తత్ప్రపంచయతి– ద్వాభ్యాం హస్తేతి. తుంగశిక్యస్థ భాండేషు అంతర్నిహితేన దధ్యాదౌ వయునం జ్ఞానం. యస్య సః ఛిద్రం రచయతి. తద్వత్. ఛిద్ర రచనాదివిత్ ధ్వాంత యుక్తే గృహే. స్వాంగమేవార్థప్రదీపం విరచయతి విశేషతో ధృతమణిగణం. యర్హి కాలే యస్మిన్ సమయే. అత్ర ఛందో భంగ ఆర్షః. (30)

**టీ॥** – దొంగలించిన వస్తుసముదాయముచే కల్పింపబడిన వానిచేత అని చెప్పబడినది – దానిని వివరించుచున్నాడు. "ద్వాభ్యాం హస్తేతి" రెండు చేతులతో అని ఈ శ్లోకమున – ఎత్తైన ఉట్ల మీద గల పాత్రల యందు – లోపల ఉంచబడిన – పెరుగు మొదలైనవాని వయునం – జ్ఞానము ఎవనికిగలదో అట్టివాడు. రంధ్రముచేయును. తద్విత్ – అది తెలిసినవాడు రంధ్రము చేయుట తెలిసినవాడు. చీకటితో కూడిన ఇంటి యందు – తన శరీరమునే ప్రయోజనము నెరవేర్చు గల 'వెలుగును'గా రచించును. విశేషించి తనచే ధరింపబడిన మణి సమూహమును – యర్హి – ఏ సమయమున – ఇచట ఛందో భంగము ఆర్షము. (30)

**శ్లో॥** ఏవం ధార్ష్ట్యాన్యుశతి కురుతే మేహనాదీని వాస్తౌ
స్తేయోపాయై ర్విరచిత కృతి స్సుప్రతీకో యథాస్తే ।
ఇత్థం స్త్రీభిస్సభయ నయన శ్రీముఖా లోకినీభి
ర్వ్యాఖ్యాతార్థా ప్రహసితముఖీ నహ్యుపాలబ్ధుమైచ్ఛత్ ॥ (31)

**టీ॥** ఏవమితి. రేరే చోర. ఇత్యాద్యుక్తః శ్రీకృష్ణః. త్వ మేవ చోరః. అహం గృహస్వామీత్యాదీని ధార్ష్ట్యాని ప్రగల్భవచాంసి. ఉశతి జల్పతి భో కమనీయే యశోదే. యద్వా ఉశతి వాస్తౌ స్వర్చితే గృహే. మేహనాదీని పురీషోత్సర్గాదీని. కురుతే ఏవం స్తేయోపాయైః. విరచితా. కృతిః కర్మ. యేన సః త్వత్సమీపే సుప్రతీకః సాధురివాస్తే. యద్వా సుప్రతీకః దిగ్గజవదధృష్య ఆస్త ఇత్యర్థః. సభయే నయనే యస్మిన్ తచ్చ తత్ శ్రీయుక్తం ముఖం చ. తదాలోకినీభిః వ్యాఖ్యాతార్థప్రఖ్యాపిత కర్మఫలకా. ఉపాలబ్ధుం నిర్భర్త్సనాదికం కర్తుం ఆక్షేప్తుమితి యావత్ నైచ్ఛత్. (31- 32)

**తా॥** ఇట్లు ప్రగల్భ వాక్యములు పలుకును. ఇంటి యందు మూత్ర పూరీషాదులు విసర్జించును. దొంగిలించునుపాయముల చేత చేసెడు కొంటెపనులు గలవాడై, ఓ యశోదా! నీ ముందు అమాయకుని వలె సాధువువలె కన్పట్టుచుండును. ఇంతలో భయపడుచున్నట్లున్న అతని కన్నుల తోడి ఆ ముద్దు మోము చూచుచున్న ఆ గోపస్త్రీల చేత, తామింత వఱకు వివరించిన అతని చర్యలను గూర్చి ప్రతి గోప స్త్రీయును నవ్వుచున్న ముఖము గలదియై, కృష్ణుని నిందించుటకు గాని బెదరించుటకు గాని ఇష్టపడకుండెను. (31)

**టీ॥** 'ఓరీ దొంగా! వంటి మాటలతో కృష్ణుడు నిందింపబడగా – నీవే దొంగవు – నేనే ఇంటి యజమానిని – వంటి ప్రగల్భవాక్యములతో కవ్వించును. ఓ సుందరాంగీ! యశోదా! – లేక ఉశతివాస్తౌ – చక్కగా అలంకరింపబడిన ఇంటిలో మూత్రపురీషాదులు చేయును. ఇట్లు దొంగిలించు ఉపాయముతో చేయబడు పనులు ఎవనిచేతనో అట్టి కృష్ణుడు నీదగ్గర సాధువువలె ఉండును. – లేక – సుప్రతీకః – దిగ్గజమువలె బెదరక, దిట్టతనమున నుండును. భయముతో చూచు కన్నులు గల వాడై – అందువలన సుందరమైన ముఖము గలవాడై – అట్టి ముఖమును చూచుచుండిన గోపస్త్రీలచేత – లోగడ చెప్పబడిన కృష్ణుని కొంటె పనుల ఫలితములను గూర్చి మరల బెదరించుటకును ఆక్షేపించుటకును ఇష్ట పడకుండిరి. (31 –32)

**శ్లో॥** గోప్యః కదాచన పృథక్పృథ గూహ్యా కృష్ణ
మేత్త్యైకదైవ గదితుం ప్రసృతాస్తదాగః ।
దృష్ట్వా తదంత్యథ తమేవ నిజానదృష్ట్వా
సర్వాశ్చ తానివ వృతుః స్వగృహాన్ సలజ్జాః ॥ (32)

**తా॥** వెన్న, పెరుగు, పాలుమొదలగు పదార్థములను సంగ్రహించుకొనుటకు కృష్ణుడు, ఒక్కొక్కప్పుడు అందఱి యిండ్ల లోనికి ఒకే తడవ ప్రవేశించెడివాడు. ఒకానొక పర్యాయము గోపస్త్రీలందఱు ఎవరికి వారుగ యశోద గృహమునకు కృష్ణుని వెంట బెట్టుకొని పోయి అతని అపరాధములను ఆమెకు నివేదించుకొనుటకు నిశ్చయించుకొని, కృష్ణుని పట్టుకొని (ఎవరికి వారుగ) నందగృహమునకుఁబోయిరి. తీరా అచటికి వెడలిన వంటనే కృష్ణుడు ఇంటిలో నుండి వచ్చుటయు, తాము వెంటగొనివచ్చిన కృష్ణుడు అదృశ్యమగుటయు జరిగెను. అప్పుడు గోపస్త్రీలు సిగ్గుతో మరలిపోయిరి. (32)

**శ్లో॥** ఏకదా క్రీడమానాస్తే రామాద్యా గోప దారకాః ।
కృష్ణో మృదం భక్షితవానితి మాత్రే న్యవేదయన్ ॥ (33)

**తా॥** ఒక పర్యాయము బలరాముడు మొదలగు వారును, గోప బాలకులును ఆడుకొను చుండిరి. అపుడు కృష్ణుడు మన్ను తినెనని వారు తల్లియగు యశోదకు చెప్పిరి. (33)

**టీ॥** కదాచిదపరాధాంతరే ఉపాలభత. తదా మాతుః మహదాశ్చర్యమభూదితి కథయన్నాహ–ఏకదేతి. (33)

**టీ॥** ఒకప్పుడు అపరాధము చేయుచుండగనే దొరికెను. అప్పుడు యశోదకు మిక్కిలి ఆశ్యర్యము కలిగెనని వివరించుచు చెప్పుచున్నాడు. 'ఏకదా' అని. (33)

**శ్లో॥** సా గృహీత్వా కరే పుత్రముపాలభ్య హితైషిణీ ।
యశోదా భయ సంభ్రాంత ప్రేక్షణాక్షమ భాషత ॥ (34)

**తా॥** కృష్ణుని శ్రేయోభిలాషిణియగు యశోద, అతనిచేతిని పట్టుకొని, 'మన్ను తింటివా?' యని బెదరించి, భయాశ్యర్యములతో కూడిన చూపులు గల అతనితో ఇట్లు సంభాషించెను. (34)

టీ॥ సేతి. ఉపాలభ్య నిర్భర్త్స్య. భయేన సంభ్రాంతే ప్రేక్షణే చపలనిరీక్షణే అక్షిణీ యస్య తం. (34)

టీ॥ ఉపాలభ్య - అదలించి - భయముతో కూడిన ఆశ్చర్యము నిండిన కన్నులుగల - చపలమైన కనుచూపులుగల అతనినిగూర్చి (ఇట్లనెను) (34)

యశోదోవాచ.

శ్లో॥ "కస్మాన్మృద మదాంతాత్మన్! భవాన్ భక్షితవాన్ రహః ।
వదంతి తావకా హ్యేతే కుమారాస్తే ఽగ్రజోఽప్యయమ్ ॥(35)

యశోదదేవియిట్లనెను

తా॥ చపల శరీరుడా! (ఉద్ధతస్వభావుడా!) రహస్యముగా మన్నెందుకు తింటివి? ఈ నీ తోడి బాలురందఱును, నీ అన్నయగు బలరాముడు కూడ చెప్పుచున్నారు.' (35)

టీ॥ కస్మాదితి. అదాంతాత్మన్ చపల గాత్ర యద్వా-ఉద్ధతస్వభావ. రహః ! ఏకాంతే అగ్రజోఽపి బలరామోఽపి. వదతీత్యర్థః. (35)

టీ॥ అదాంతాత్మన్! - చపలమైన శరీరము గలవాడా! లేక ఉద్ధత స్వభావుడా! రహః - ఏకాంతము నందు - అగ్రజోఽపి- బలరాముడు కూడ. (35)

శ్రీకృష్ణఉవాచ.

శ్లో॥ "నాహం భక్షితవానంబ! సర్వే మిథ్యాభిశంసినః ।
యది సత్యం గిరస్తర్హి సమక్షం పశ్య మే ముఖమ్ ॥ (36)

కృష్ణుడిట్లనెను.

తా॥ నేను తినలేదమ్మా! అందఱును అసత్యముగ నిందించు వారే. ఒకవేళ వారి మాటలు సత్యమైన యెడల నా నోటిని ప్రత్యక్షముగ చూడుము. (36)

టీ॥ నేతి, నాహం భక్షితవానితి సర్వే మిథ్యాభివాదినః, న హి బాహ్యం కించిన్మయా భక్షితం. మత్కుక్షావాదావేవ సర్వమస్తీతి భావః సమక్షం ప్రత్యక్షం. (36)

టీ॥ నేను మన్ను తినలేదని - అందఱును అసత్యవాదులు - నేను కొంచెముగూడ నా కంటె బహిరమైన పదార్థమును తినలేదు. నాగర్భముననే సర్వస్వము మొదటనే కలదని భావము. సమక్షం - ప్రత్యక్షముగ. (36)

**శ్లో॥** యద్యేవం తర్హి వ్యాదేహీత్యుక్తస్స భగవాన్ హరిః ।
వ్యాదత్తాఽవ్యాహతైశ్వర్యః క్రీడా మనుజ బాలకః ॥ (37)

**తా॥** 'అటులైనచో నోరు తెరువుము' అని భగవానుడగు కృష్ణుడు ఆజ్ఞాపింపబడెను. ఆ అఖండైశ్వర్యముతో కూడిన ప్రభువు 'అటులే' అని ఆడుకొనుచున్న మనుష్య బాలకుడుగనే నోరు తెరచెను. (37)

**టీ॥** యదితి. వ్యాదేహి ముఖం ప్రసారయేతి వ్యాదత్త ప్రసారితవాన్. స్వకుక్షిస్థ నానా సృష్టి వైచిత్ర్యం మాత్రే దర్శనాయ ప్రవృత్త ఇతి సూచయన్నాహ–అవ్యాహతేతి. (37)

**టీ॥** వ్యాదేహి – 'నోరు తెరువుము' అని (యశోద ఆదేశించెను) వ్యాదత్త తెరచెను. తన గర్భము నందు గల వివిధములగు సృష్టి విచిత్రములను మాత్రము చూపుటకు అట్లు ప్రవర్తించెనని సూచించుచు 'అవ్యాహతైశ్వర్యః' అని చెప్పినాడు. (37)

**శ్లో॥** సా తత్ర దదృశే విశ్వం జగత్స్థాస్ను చ ఖం దిశః ।
సాద్రిద్వీపాబ్ధిభూగోళం సవాయ్వగ్నీందు తారకమ్ ॥ (38)

**తా॥** జంగమములు, స్థావరములు, ఆకాశము, దిక్కులు, పర్వతములు, ద్వీపములు, సముద్రములు, వాయువు, అగ్ని, చంద్రుడు, తారకలు మున్నగు వానితో గూడిన భూగోళము మొదలగు విశ్వము నంతటిని కూడ యశోద అతని నోటిలో చూచెను. (38)

**టీ॥** నేతి తత్ర తస్మిన్ ముఖే. విశ్వం దదృశే దదర్శ తత్ప్రపంచయతి.– జగత్ జంగమం. స్థాస్ను స్థావరం. ఖం అంతరిక్షలోకం. సాద్రి ద్వీపాబ్ధి భూగోళం పర్వత ద్వీపసముద్రసహితం భూలోకం వాయుః పవనః అగ్నిర్వైద్యుతః. ఇందుశ్చ తత్సహితం. (38)

**టీ॥** తత్ర – ఆ నోటియందు – విశ్వమును చూచెను. అది వివరించు చున్నాడు. జగత్ – జంగమము (చరము) – స్థాస్ను – స్థావరము. (అచరము) ఖం – అంతరిక్షలోకము పర్వత, ద్వీప, సముద్రములతో కూడిన భూగోళము – గాలి, విద్యుత్తు (సూర్యుడు) చంద్రుడు, తారకలు – వానితోకూడిన (విశ్వమును) (38)

**శ్లో॥** జ్యోతిశ్చక్రం జ్వలత్తేజో వివరాణి రసాతలమ్ ।
వైకారికాణీంద్రియాణి మనోమాత్రా గుణాస్త్రయః ॥ (39)

**తా॥** జ్యోతిర్మండలము, ప్రకాశించు తేజస్సు, అధోలోక బిలములు, రసాతలము, అహంకారము, ఇంద్రియములు, మనస్సు, తన్మాత్రలు, గుణత్రయము. (చూచెను) (39)

**టీ॥** జ్యోతిశ్చక్రమితి. జ్యోతిశ్చక్రం స్వర్లోకం. వైకారికాణి దేవాః. మన ఇతి. వై కారికశబ్దేన గృహీతమపి. దేవవైలక్షణ్యాత్పునరుక్తం ఇంద్రియాణి చ తైజసాని. మాత్రాః తామసాః శబ్దాదయః. (39)

**టీ॥** జ్యోతిశ్చక్రం - స్వర్లోకము, వైకారికాణి - దేవతలు. వైకారిక శబ్దముచేత గ్రహింపబడియు దేవ వైలక్షణ్యములచేత మఱల చెప్ప బడినది. ఇంద్రియాణి - తైజసములు - మాత్రాః - తమోగుణ ప్రధానములు - శబ్దాదులు. (39)

**శ్లో॥** ఏతద్విచిత్రం సహజీవ కాల
స్వభావ కర్మాశయ లింగభేదమ్ ।
సూనో స్తనౌ వీక్ష్య విదారితాస్యే
వ్రజం సహాత్మాన మవాప శంకామ్ ॥ (40)

**తా॥** జీవులు, కాలము స్వభావము, కర్మ, ఆశయము, లింగభేదములు మున్నగు వానితో కూడిన ఈ విచిత్ర ప్రపంచమంతయు తనకుమారుని శరీరము నందు - అతని తెరచిన నోటి యందు చూచి యశోదయు, వ్రజ వాసులును సందేహమును పొందిరి. (40)

**టీ॥** ఏతదితి. ఏవ మేతద్విచిత్రం విశ్వం. సహ ఏకదైవ వీక్ష్య. తత్ర తామాహ - జీవశ్చ గుణక్షోభకః కాలశ్చ పరిణామహేతుః. స్వభావశ్చ జన్మహేతుః కర్మ చ తత్సంస్కారః ఆశయశ్చ ఏతైః లింగానాం చరాచరశరీరాణాం. భేదో యస్మిన్ తత్. తనౌ. తత్ర వ్రజం చ. సహాత్మానం స్వసహితం. క్వచిద్వీక్ష్య. సూనోః అల్పే విదారితే అస్యే శంకామవాప. (40)

**టీ॥** ఇట్లు ఈ విచిత్రమైన విశ్వమును - అందఱునుకూడి ఒకేసారి చూచి ఆశ్చర్యమును పొందిరని చెప్పుచున్నాడు - గుణములను క్షోభింపజేయుజీవుడు, పరిణామ కారణమగు కాలము, జన్మహేతువైన స్వభావము, కర్మయు, దాని సంస్కార భూతమగు కోశము, ఈ లక్షణములు గల చరాచర శరీరముల యొక్క భేదము, ఏ వస్తువు నందు గలదో అట్టి విశ్వము - యశోదతోసహ వ్రజమంతయును

ఒకసారి చూచి, కుమారుని చిన్న శరీరమున - తెరచిన (చీల్చబడి నట్లున్న) నోటి యందు చూచి శంకను పొందిరి. (40)

**శ్లో॥** కిం స్వప్న ఏతదుత దేవమాయా
కిం వా మదీయో బత బుద్ధిమోహః ।
అథో అముష్యైవ మమార్భకస్య
యః కశ్చనౌత్పత్తిక ఆత్మయోగః ॥ (41)

**తా॥** ఇది కలయా? లేక దేవతల మాయయా? కాక నా చిత్తములోని విభ్రమమా? ఆశ్చర్యము! లేక ఈ నా బాలకుని లోని ఉత్పత్తికి సంబంధించిన యోగ సిద్ధియా? (41)

**టీ॥** తామాహ - కిం స్వప్న ఇతి. పరితో విలోక్యాహ-నాయం స్వప్నః. తర్హి కిం దేవస్య హరేః. మాయా. తథా చేదన్యే కిం న పశ్యంతి. తర్హి, కిం వా మదీయ ఏవ కశ్చిద్బుద్ధిమోహః. విపర్యాసః దర్పణే ముఖవత్. ఏవం. తర్హి, అయం కృష్ణోఽపి కథమంతః ప్రతీయతే. అంతర్బహిశ్చైకరూపేణ చ. కథం జగత్ప్రతీయతే తథాసతి. బింబ ప్రతి బింబయోరివ పరస్పర వైపరీత్యేన ప్రతీతిః స్యాదిత్యాశంక్యా న్యథా వితర్కయతి. -అథో ఇతి. అథో అథవా మమాముష్యార్భకస్యాపి సతః యః కశ్చనాచింత ఇతి ఆత్మయోగః స్వీయమైశ్వర్యం. ఔత్పత్తికః స్వాభావికః. (41)

**టీ॥** యశోద, దానినే చుట్టును చూచి చెప్పుచున్నది. ఇది స్వప్నముకాదు. అయినచో ఇదిఏమి? విష్ణుదేవుని మాయ కాబోలును. అని. అటులైనచో ఇతరులెందుకు చూచుటలేదు? అయినచో నాకు సంబంధించినదేదో బుద్ధి మోహము కానోపునేమో! చిత్త విపర్యాస మేమో! అద్దమునందు ముఖము వలె. అటులైనచో ఈ కృష్ణుడు కూడ లోపల కన్పట్టుచున్నాడు! అద్దమునందు అద్దము కన్పట్టదు కదా! లోపల, వెలుపల కూడ ఈ జగత్తు ఒకే విధముగ ప్రతీతమగు చున్నదెట్లు? అటులైన బింబ ప్రతిబింబముల వలె కుడి యెడమల వ్యతిరేకముగ ప్రతీతము కావలెను కదా!. కాబోలునేమోయని శంకించి మరియొక విధమున తర్కించుచున్నది అథ అని. - లేక ఈ నా కుఱ్ఱ వాని మహాత్ముడగు అర్భకుని ఏదో యొక అనిర్వచనీయమగు తన ఐశ్వర్యము -ఔత్పత్తికః - స్వాభావికమగు (సిద్ధి కావచ్చునేమో!) (41)

**శ్లో॥** అథో యథావన్న వితర్కగోచరం
చేతో మనః కర్మ వచోభిరంజసా ।
యదాశ్రయం యేన యతః ప్రతీయతే
సుదుర్విభావ్యం ప్రణతాస్మి తత్పదమ్ ॥ (42)

**టీ॥** చరమం పక్షమాశ్రిత్య అయమీశ్వర ఇతి నిశ్చిత్యాహ–అథో ఇతి. చేతః చిత్తం. తదాదిభిః న వితర్కగోచరం జగత్. యదాశ్రయం యదధిష్ఠానం. యేన కరణేన అధిష్ఠాత్రా యతో బుద్ధివృత్త్యభివ్యక్తాత్ నన్విదమవితర్క్యం భవతు తత్పదంకీదృక్. అత ఆహ–సుదిర్విభావ్య మితి. ఇదమత్యంతమచింత్యమిత్యర్థః. (42)

**తా॥** ఇక బుద్ధిచే గాని, మనోవ్యాపారముచేత గాని, వాక్కులచే నైనను గాని, తర్కించినను ఈ విచిత్రప్రపంచము దేని నాశ్రయించి యున్నదో, ఎవరిచే కల్పింపబడినదో దేని నుండి యావిర్భవించినదో, ఎట్లు ప్రతీయమానమగుచున్నదో అర్థమగుట లేదు. ఏదియు చెప్పరా కున్నది. అతని పాదములకు (ఆ స్థానమునకు) నమస్కరించుచున్నాను. (42)

**టీ॥** ఇక దాని యందు తాదాత్మిక తత్త్వబుద్ధితో చెప్పుచున్నాడు. చేతశ్శబ్దము బుద్ధి పరము. మనోవ్యాపారము మనః కర్మ – బుద్ధి మొదలగు వానితో ఎట్లు సాధ్యమగునో అట్లు, ఎటులో అటుల అని యర్థము. ఆలోచన కందదు. జగత్తు దేని నాశ్రయించి యున్నదో – దేనినధిష్ఠించి యున్నదో, ఏ కారణమును అధిష్ఠించి యున్నదో ఏ బుద్ధివృత్తి వలన అభివ్యక్తమగుచున్నదో నిశ్చయరూపమున తర్కింపరాదు. మఱి ఆ స్థానమెట్టిదో చెప్పుచున్నాడు. 'భావింప శక్యము కానిది' అని. ఇది అత్యంతము అచింత్యమని యర్థము. యతః – యస్మాత్ – పంచమీ విభక్త్యంత సామర్థ్యము వలన ఏ దేని నుండి పుట్టునో, దేని చేత నంతయు స్థితి కలిగియుండునో – ఎచట లీనమగునో – యత్ర అను పదము అధ్యాహారము. (42)

శ్లో॥ అహం మమాసౌ పతిరేష మే సుతో
వ్రజేశ్వరస్యాఖిల విత్తపా సతీ ।
గోప్యశ్చ గోపాస్సహ గోధనాశ్చ
యన్మాయయేత్థం కుమతిస్సమే గతిః ॥ (43)

టీ॥ ఏవం ప్రపంచ ప్రతీత్యా ఉన్నీతం తత్త్వం. పునర్జీవ సంసృతి హేతుమాయాశ్రయ త్వేనోన్నయంతీత్యాహ – అహమితి. యశోదానామాహం అసౌ మమ పతిః అముష్య వ్రజేశ్వరస్య అఖిలా విత్తపా అఖిల విత్తాధిష్ఠాత్రీ. అహం సతీ జాయా. ఏష కృష్ణో మే సుతః గోప్యాదయశ్చ మదీయాః ఇతీత్థం కుమతిః. యన్మాయయా స ఏష మే శరణమితి. (43)

శ్లో॥ ఇత్థం విదిత తత్త్వాయాం గోపికాయాం స ఈశ్వరః ।
వైష్ణవీం వ్యతనోన్మాయాం ప్రజాస్నేహమయీం విభుః ॥ (44)

తా॥ నేను, నాది, ఇతడు నా భర్త, ఇతడు నా కొడుకు, ఈ గోకులమునందలి సమస్తమైన సంపదకు నేను రక్షకురాలను, గోకులాధిపతికి నేను పత్నిని, గోపికలు, గోపాలురు, గోసంపదలతో కూడ ఇవి యన్నియు నావి. ఇట్టి మాయ చేత నేను బుద్ధి హీనురాలనై యున్నాను. ఆతడే నాకు శరణ్యము. (43)

టీ॥ (ఎవని సంకల్పమున నాకింత సంసార భ్రాంతి కలిగినదో, అతడే నాకు గతియని చెప్పుచున్నాడు) ఈ విధముగ ప్రపంచ ప్రతీతి చేత ఈ తత్త్వముపైకి కొనిరాబడినదో – జననమరణ రూపమగు సంసారమునకు కారణమగు మాయను ఆశ్రయించి యుండుట చేత కొని రాబడినవని చెప్పుచున్నాడు యశోదయను పేరు గల నేను, అఖిల విత్తమునకు అధిష్ఠాత్రిని – నేను పత్నిని – ఈ కృష్ణుడు నా కొడుకు – గోప స్త్రీలు మొదలగువారు నాకు సంబంధించిన వారు. అని యిట్లు కుమతిని, ఎవని మాయచే ఇట్లు జరుగుచున్నదో అతడే నాకు శరణము. (43)

తా॥ ఈ విధముగ తత్త్వమును తెలిసికొనిన గోప స్త్రీయగు యశోద యందు ఆ ప్రభువగు కృష్ణుడు తన మాయను – పుత్ర ప్రేమతో కూడిన తన మాయను ప్రసరింప జేసెను. (44)

**టీ॥** ఇత్థమితి. వైష్ణవీం స్వీయాం. (44)

**శ్లో॥** సద్యో నష్టమతిర్గోపీ సారోప్యారోహ మాత్మజమ్ ।
ప్రవృద్ధ స్నేహకలిల హృదయాసీ ద్యథ్యా పురా ॥ (45)

**టీ॥** సద్య ఇతి. ప్రవృద్ధేన స్నేహేన. కలిలం వ్యాప్తం హృదయం యస్యాస్సా. పురేవాసీత్. (45)

**శ్లో॥** త్రయ్యా చోపనిషద్భిశ్చ సాంఖ్యయోగైశ్చ సాత్త్వతైః ।
ఉపగీయమాన మాహాత్మ్యం హరిం సా మన్యతాత్మజమ్ ॥ (46)

**టీ॥** మాయా బలోద్రేకమాహ–త్రయ్యేతి. త్రయ్యా ఇంద్రాదిరూపేణ ఉపనిషద్భిర్బ్రహ్మేతి. సాంఖ్యైః పురుష ఇతి. యోగైః పరమాత్మేతి. సాత్త్వతైః భగవానితి. ఉపగీయమానం మాహాత్మ్యం యస్య తం. (46)

**టీ॥** – వైష్ణవీం – తనదైన (మాయను) (44)

**తా॥** గోపస్త్రీయగు యశోద ఇంతకు ముందు గల తాత్త్విక బుద్ధిని కోల్పోయి, తన కుమారుడగు కృష్ణుని, ఒడిలోనికి ఎక్కించుకొని, మిక్కిలి వృద్ధి చెందిన ప్రేమతో వ్యాపించిన హృదయముగలదియై పూర్వము వలె ప్రపంచ స్పృహ లోనికి వచ్చెను. (45)

**టీ॥** వృద్ధిచెందిన స్నేహముతో – కలలం – వ్యాప్తమైన మనస్సు ఎవరికో అట్టిదిగ – పూర్వమునందువలె నయ్యెను. (45)

**తా॥** వేదములు, ఉపనిషత్తులు, సాంఖ్యము, యోగము, భక్తజనులు, ఏ విష్ణుభగవానుని మాహాత్మ్యమును కొనియాడుచు కీర్తించుచుందునో అట్టి వానిని ఆమె – ఆ యశోద తన కొడుకు అని భావించుచున్నది. (46)

**టీ॥** మాయ యొక్క బలోద్రేకమును గూర్చి చెప్పుచున్నాడు – వేదముల చేత ఇంద్రాది రూపమునను, ఉపనిషత్తుల చేత బ్రహ్మ మనియు, సాంఖ్యుల చేత పురుషుడనియు, యోగుల చేత పరమాత్మ యనియు, భక్త జనుల చేత భగవానుడనియు కీర్తింపబడు మాహాత్మ్యము ఎవనిదో అట్టి వానిని–(యశోద తన కొడుకను కొనుచున్నది) (46)

రాజోవాచ.

శ్లో॥ నందః కిమకరోద్బ్రహ్మన్! శ్రేయ ఏవం మహోదయమ్ ।
యశోదా చ మహాభాగా పపౌ యస్యా స్తనం హరిః ॥ (47)

టీ॥ అతివిస్మయేన పృచ్ఛతి-నంద ఇతి. మహోదయం మహాన్ ఉదయ ఉద్భవో యస్మిన్ తత్. (47)

శ్లో॥ పితరౌ నాన్వవిందేతాం కృష్ణో దారార్భకే హితమ్ ।
గాయంత్యద్యాపి కవయో యల్లోకశమలాపహమ్ ॥ (48)

టీ॥ పితరావితి. యయోః ప్రసన్నోఽవతీర్ణః తౌ పితరావపి. యం నాన్వవిందేతాం న ప్రాప్నువతాం. కృష్ణస్యోదారం మహత్ అర్భకే హితం బాలలీలాం. యచ్చ కవయో గాయంతి. తత్. యోగినో విందంతి. స కిం శ్రేయః అకరోదితి. (48)

పరీక్షిన్మహారాజు ఇట్లనెను.

తా॥ శుకబ్రహ్మా! ఇట్లు శ్రేయస్సును కూర్చు భగవానుడు కుమారుడుగ జన్మించుటకు నందుడు ఏ పుణ్యము చేసి యుండెను? ఎవరి స్తన్యమును సాక్షాత్తుగ ఆ శ్రీహరియే గ్రోలియుండెనో ఆ మహాభాగ్యశాలిని యగు యశోదయు ఏ తపస్సు చేసి యుండెను?(47)

టీ॥ మిక్కిలి ఆశ్చర్యముతో అడుగుచున్నాడు-గొప్పనైన ఆవిర్భావము ఎవరియందు జరిగెనో అది - (వారు). (47)

తా॥ ఎవ్వాని ఉదారమైన బాల్యలీలా విశేషములను ఈనాడు కూడ తత్త్వవేత్తలు గానముచేయుచుందురో, ఎవ్వాని లీలాగానము లోక పాపములను హరించునో - అట్టి కృష్ణుని ఆ లీలా మాహాత్మ్యములను ఆతని కన్న తల్లిదండ్రులగు దేవకీ వసుదేవులు అనుభవింపలేక పోయిరి (48)

టీ॥ ఏ దంపతుల యెడ ప్రసన్నుడై (కృష్ణుడు) అవతరించెనో ఆ దేవకీ వసుదేవులు అను అతని కన్న తల్లిదండ్రులుకూడ - దేనిని పొందలేకపోయిరో కృష్ణుని యొక్క ఉదాత్తమైన గొప్ప బాలలీలను - దేనిని జ్ఞానులు పాడుకొనుచుందురో-దానిని యోగులు తెలిసి కొందురు. ఆతడేమి (నందుడు) పుణ్యము చేసెను? అని. (48)

శ్రీశుక ఉవాచ .

శ్లో॥ ద్రోణో వసూనాం ప్రవరో ధరయా సహ భార్యయా ।
కరిష్యమాణ ఆదేశాన్ బ్రహ్మణస్తమువాచ హ ॥ (49)

శ్రీశుకుడిట్లనెను.

తా॥ వసువులలో శ్రేష్ఠుడగు ద్రోణుడు తన భార్యయగు 'ధర' అను నామెతో కలసి, బ్రహ్మదేవుని ఆదేశములను పాలించుట కొఱకు అతనితో నిట్లనెను. (49)

టీ॥ ద్రోణ ఇతి. బ్రహ్మణ ఆదేశాన్ గోపాలనాది లక్షణాన్ (49,50)

టీ॥ బ్రహ్మదేవుని ఆదేశములను – గోపాలన మొదలగు లక్షణములను – (49,50)

శ్లో॥ జాతయోర్నౌ మహాదేవే భువి విశ్వేశ్వరే హరౌ ।
భక్తి స్స్యాత్పరమా లోకే యయాఞ్జో దుర్గతిం తరేత్ ॥ (50)

తా॥ భూలోకము నందు పుట్టిన మాకు, మహాదేవుడును, విశ్వమున కంతటికి ఈశ్వరుడును ఐన ఆ శ్రీహరి యందు పరమమైన భక్తికలుగు గాక, ఏ పరమ భక్తి చేత ఏ ప్రయాసయును లేకుండ మానవుడు దుర్గతిని దాటుకొనునో అట్టి భక్తి మాకు కలుగు కాక.(50)

శ్లో॥ అస్త్విత్యుక్త స్సఏవేహ వ్రజే ద్రోణో మహాయశాః ।
జజ్ఞే నంద ఇతి ఖ్యాతో యశోదా సా ధరా భవత్. (51)

తా॥ అట్లే యగుగాక యని బ్రహ్మదేవుడామోదించెను. మహాకీర్తి మంతుడైన ద్రోణుడు భూలోకము నందు నందుడుగాఁబుట్టి ప్రఖ్యాతి గాంచెను. ఆ ధర యశోదగా జన్మించెను. (51)

టీ॥ అస్త్వితి. ఏవేహ ద్రోణో జజ్ఞే స చ నంద ఇతి ఖ్యాతః. సా ధరా యశోదాऽభవత్. (51)

టీ॥ ఆ ద్రోణుడే భూ లోకమున పుట్టి నందుడు అని ఖ్యాతినందెను. ఆ ధరయే యశోద యయ్యెను. (51)

శ్లో॥ తతో భక్తిర్భగవతి పుత్ర భూతే జనార్దనే ।
దంపత్యోర్నితరామాసీద్గోప గోపీషు భారత! ॥ (52)

తా॥ ఆ దంపతులకు పుత్రభూతుడైన జనార్దన భగవానుని యందు నిరంతరముగా మిక్కిలి భక్తి యేర్పడెను. రాజా! గోపాలకులకును, గోప స్త్రీలకును అతనిపై భక్తి కల్గెను. (52)

టీ॥ తత ఇతి. గోప గోపీనామపి వస్తుస్వభావాదస్త్యేవ భక్తిః. తయోః పునర్నితరామితి. (52)

టీ॥ గోప, గోప స్త్రీలకును వస్తు స్వభావము వలన భక్తి కలిగెను. వారికిని అతనిపై సంపూర్ణమైన భక్తియే. (నితరాం అనుమాట యశోదా నందులకు గోపీ గోపులకు వర్తించును) (52)

శ్లో॥ కృష్ణో బ్రహ్మణ ఆదేశం సత్యం కర్తుం వ్రజే విభుః ।
సహరామో వసంశ్చక్రే తేషాం ప్రీతిం స్వలీలయా ॥ (53)

తా॥ బ్రహ్మదేవుని ఆదేశమును సత్యము చేయుటకు ప్రభువగు కృష్ణుడు, బలరామునితో కూడ నంద గోకులమున నివసించుచు, అచటి వారికి తన లీలతో ప్రీతిఁగూర్చెను. (53)

టీ॥ కృష్ణ ఇతి. స్వలీలయా పుత్ర భావానుకారిణ్యా. (53)

టీ॥ తన లీలతో – పుత్రభావముననుకరించు తన లీలతో – (53)

**శ్రీ మద్భాగవతే, మహాపురాణే దశమస్కంధే,**
**అష్టమోఽధ్యాయః**

**అని శ్రీమద్భాగవతమున దశమస్కంధమందు**
**ఎనిమిదవ అధ్యాయము సమాప్తము.**

## అథ నవమో உధ్యాయః

బాదరాయణి రువాచ.

**శ్లో॥** ఏకదా గృహదాసీషు యశోదా నందగేహినీ ।
కర్మాంతర నియుక్తాసు నిర్మమంథ స్వయం దధి ॥ (1)

**టీ॥** శ్లో. "నవమే పయ ఉత్సిక్తే గత్వా గోప్యథ త్కృతం, విలోక్య భాండభంగాది కృష్ణం దామ్నా బబంధ తం. తత్తూదరాశ్రితం విశ్వం దృష్ట్వా విస్మిత చేతసః, బంధనద్వ్యంగుళాపూర్త్యా పూర్ణతా సోஉ న్వదర్శయత్". ఏకదేతి. స్వయం దది. నిర్మమంథ. (1)

**శ్లో॥** యాని యానీహ గీతాని తద్బాల చరితాని చ ।
దధి నిర్మంథనే కాలే స్మరంతీ తాన్యగాయత ॥ (2)

**టీ॥** యానీతి. తదా చాగాయ తేతి చకారాన్వయః. (2)

## తొమ్మిదవ అధ్యాయము

బాదరాయణి మహర్షి యిట్లనెను

**తా॥** "ఒకప్పుడు ఇంటి దాసీజన మంతయు వేఱ్వేఱు పనులలో నియుక్తులై యుండగా నందుని గృహిణి యగు యశోద స్వయముగనే పెరుగును చిలుకసాగెను. (1)

**టీ॥** తొమ్మిదవ అధ్యాయమున – పాలు పొంగగా ఆ పని చక్క బెట్టుటకు గోపస్త్రీ (యశోద) అచటికి పోయెను. అచట కృష్ణుడు కుండను పగులగొట్టుట మొదలగు తుంటరి పని చేయుచుండుట చూచి అతనిని త్రాటితో కట్టి వేసెను. కృష్ణుని కడుపును ఆశ్రయించి యున్న విశ్వమును చూచి ఆశ్చర్యపడిన మనస్సు గలదియై త్రాటి కట్టు నుండి రెండంగుళముల వఱకును సంపూర్ణ విశ్వ స్వరూపమును ఆమె చూచెను. – స్వయముగనే పెరుగును చిలికెను. (1)

**తా॥** పెరుగు చిలుకుచున్నంత కాలము, ఆ బాలుని చరితలకు సంబంధించిన ఎన్నెన్ని పాటలు గలవో వానిని స్మరించుచు ఆపాటలు పాడెను. (2)

**టీ॥** 'తదాచ అగాయత' అని చకారముతో అన్వయము. (2)

**శ్లో॥** క్షౌమం వాసః పృథు కటితటే బిభ్రతీ సూత్రనద్ధం
పుత్రస్నేహస్నుత కుచయుగం జాతకంపం చ సుభ్రూః ।
రజ్జ్వాకర్షశ్రమ భుజ చలత్కంకణౌ కుండలే చ
స్విన్నం వక్త్రం కబర విగళన్మాలతీ నిర్మమంథ ॥ (3)

**తా॥** పట్టుచీరయు, స్థూలమైన నడుము భాగముపై మొలనూలు కట్టును ధరించినదియు పుత్రవాత్సల్యము వలన శరీరము, స్తనములు కంపించుచున్నదియు, సుందరమైన కనుబొమ్మలు కలదియును. త్రాడును లాగి పట్టు కొనుటచే శ్రమ కలుగుచున్న భుజములు, కదలుచున్న కంకణములును, కర్ణకుండలములు కలదియు, చెమట పట్టుచున్న ముఖము, శిఖా బంధము నుండి జారి పడుచున్న జాజి పూవులు గలదియునైన యశోద పెరుగు చిలికెను. (3)

**టీ॥** క్షౌమమితి. సూత్రనద్ధం కాంచీబద్ధం రజ్జ్వోరాకర్షేణ శమః. యయోర్భుజయోశ్చలంతౌ కంకణౌ చ. కబరాద్విగళంత్యో మాలత్యో యస్యాస్సా. (3. 4)

**టీ॥** సూత్రనద్ధం - కాంచీ బద్ధము (మొలనూలు కట్టు) త్రాడు లాగుచుండుట చేత శ్రమ, చేతులకు గల కదలుచున్న కంకణములు - సిగ నుండి జారుచున్న జాజి పూలు గలది. (3,4)

**శ్లో॥** తాం స్తన్యకామ ఆసాద్య మథ్నంతీం జననీం హరిః ।
గృహీత్వా దధి మంథానం న్యషేధత్ప్రీతి మావహన్ ॥ (4)

**తా॥** స్తన్యపానమును చేయగోరి కృష్ణుడు, పెరుగు చిలుకుచున్న తల్లిని సమీపించి, పెరుగు కవ్వమును తీసికొని అత్యంతమగు ప్రీతి కలిగించుచు చిలుకుటను ఆపి వేసెను. (4)

**శ్లో॥** తమంకమారూఢ మపాయతీ స్తనం
స్నేహస్నుతం సస్మిత మీక్షతీ ముఖమ్ ।
అతృప్త ముత్సృజ్య జవేన సా యయా
వుత్సిచ్యమానే పయసి త్వధి శ్రితే ॥ (5)

**తా॥** ఒడి లోనికి చేరిన అతనికి, చిరునవ్వుతో నున్న అతని ముఖము చూచుచు పుత్రవాత్సల్యముతో స్వయముగ స్రవించుచున్న చనుబాలను ఇచ్చుచుండగా - పొయ్యిపై నున్న పాలు పొంగిపోవుచుండగా గమనించిన యశోద - కృష్ణునకు తృప్తి కలుగకున్నను -

బలవంతముగా అతనిని స్తనమునుండి విడిపించుకొని – (పొంగుచున్న పాలను చక్కఁబెట్టుటకు అటు పోయెను.) (5)

**టీ॥** – తమితి. అధిశ్రితే చుల్లీమారోపితే. ఉత్సిచ్యమానే అతితాపేన బహిర్నిర్గచ్ఛతి సతీత్యర్థః. (5)

**టీ॥** అధిశ్రితే – పొయ్యి మీద నుంచిన – ఉత్సిచ్యమానే – మిక్కిలి వేడియగుట చేత పొంగి పోయి, పాత్రను దాటి బయటకు స్రవించుచుండగా – అని యర్థము. (5)

**ప॥** సంజాత కోపః స్ఫురితారుణాధరం
సందశ్య దద్భిర్దధి మంథ భాజనమ్ ।
భిత్త్వా మృషాశ్రుర్దృష దశ్మనా రహో
జఘాన హైయంగవమంతరం గతః ॥ (6)

**తా॥** కృష్ణుడు కోపించి, తన ఎఱ్ఱని క్రింది పెదవి అదురుచుండ, మీగడ గల మట్టి పాత్రను దంతములతో కొఱికియు, ఱాతి ముక్కతో పగుల గొట్టియు, అబద్ధాల కన్నీరు కార్చుచు, వేఱొక యింటి లోనికి పోయి అచట ఏకాంతముగ వెన్నను తినెను. (6)

**టీ॥** స ఇతి. దృషదశ్మలా శిలా పుత్రేణ శేషణ్యశ్మ నేత్యర్థః. అంతరం గృహ మధ్యం గతః రహ ఏకాంతే హైయంగవం నవనీతమభక్షయత్. (6)

**టీ॥** దృషదశ్మనా – ఱాతిముక్కచేత – పెద్ద ఱాయికి సంబంధించిన ఒక చిన్నభాగము చేతనని యర్థము – అంతరం – ఇంటి మధ్యకు గతః–చేరినవాడై – ఒంటరిగా హైయంగవం–వెన్నను–తినెను. (6)

**శ్లో॥** ఉత్తార్య గోపీసు శృతం పయః పునః
ప్రవిశ్య సందృశ్య చ దధ్యమంత్రకమ్ ।
భగ్నం విలోక్య స్వ సుతస్య కర్మత
జ్జహాస తం చాపి న తత్ర పశ్యతీ ॥ (7)

**తా॥** యశోద, బాగుగా కాగియున్న పాలగిన్నెను ఎత్తివేసి, (దించి) మఱల పెరుగు చిలుకు స్థలమునకు వచ్చి, పూర్తిగ చిలుకబడని పెరుగును చూచి, పాత్ర పగిలి యుండుట చూచి, ఇది తన కుమారుని పనిగాగుర్తించి నవ్వుకొనెను. అతనిని మాత్రము అచట (లేకుండుటంజేసి) – చూడలేక పోయెను. (7)

**టీ॥** ఉత్తార్యేతి. సుశృతం సుతప్తం. దధిమంథనం స్థానం. ప్రవిశ్య భిన్నం సన్దృశ్య దృష్ట్వా. (7)

**టీ॥** సుశృతం – చక్కగా కాగినవి – పెరుగుచిలుకెడు స్థానమునకు ప్రవేశించి పగిలియున్న పాత్రను చూచి. (7)

**శ్లో॥** ఉలూఖలాంఘ్రే రుపరి వ్యవస్థితం
మర్కాయ కామం దదతం శుచిస్మితం
హయ్యంగవం చౌర్యవిశంకితేక్షణం
నిరీక్ష్య పశ్చాత్సుత మాగమచ్ఛనైః ॥ (8)

**తా॥** తల క్రిందులుగ నున్న ఱోలుపై నున్నవాడును, శుభ్రమైన చిఱునవ్వుతో వెలుగుచున్న వాడును, కోతికి ఇష్టమైన వెన్నను ఇచ్చుచున్న వాడును, దొంగిలించి తెచ్చిన వెన్నయని భయపు చూపులు చూచుచున్న వాడును అయిన కృష్ణుని జూచి యశోద మెల్ల మెల్లగా అతని వెనుక నుండి అతని సమీపమునకు వచ్చెను. (8)

**టీ॥** ఉలూఖలేతి. ఉలూఖలాంఘ్రేః పరివర్తితస్యోలూఖలస్యోపరి స్థిత్వా చౌర్యేణ విశంకితం చంచలమీక్షణమ్ యస్య తం మర్కాయ మర్కటాయ. మర్కశబ్దోఽత్ర మార్జాలాదీనాముపలక్షకః. యద్వా మర్కం నవనీతం తదర్ధమాగతాయ సఖీజనాయేత్యన్యేచ. (8)

**టీ॥** ఉటూఖలాంఘ్రేః – బోర్లించబడిన ఱోలుమీద – ఉండి దొంగిలించుటవలన చంచలమైన చూపు ఎవరికో అట్టివానిని – మర్కాయ – కోతికొఱకు – మర్కశబ్దము ఇచట పిల్లులు మొదలగువానికి ఉపలక్షకము – లేక మర్కం – వెన్న – దానికొఱకు వచ్చిన స్నేహితుని కొఱకు అని కొందఱు. (8)

**శ్లో॥** తామాత్తయష్టిం ప్రసమీక్ష్య సత్వర
స్తతోఽవరుహ్యా పససార భీతవత్ ।
గోప్యన్వధావన్న యమాప యోగినాం
క్షమం ప్రవేష్టుం తపసేరితం మనః ॥ (9)

**తా॥** బెత్తెముతో వచ్చుచున్న యశోదను గమనించి త్వరపడినవాడై కృష్ణుడు ఱోలుపైనుండిదిగి భయపడినవానివలె పరుగెత్తెను. ఏకాగ్రమైన మనస్సుతో తపస్సుచేయుటచేత మాత్రమే – (అదియును యోగులకు మాత్రమే) పొందుటకు శక్యమైన ఆ కృష్ణుడు, యశోద అతని వెనుక పరుగెత్తినను లభింపకపోయెను. (9)

**టీ॥** తామితి. తపసా ఏకాగ్రేణ. ఈరితం తదాకారతాం నీతం అత ఏవ ప్రవేష్టుం న క్షమమితి. (9)

**టీ॥** తపసా – ఏకాగ్రముచే – ఈరితం – అతని ఆకారత్వము పొందబడినది. (కొనిపోబడినది) అందు వలననే ప్రవేశించుటకు సాధ్యముకానిది అని. (9)

**శ్లో॥** అన్వంచమానా జననీ బృహచ్చల
చ్ఛ్రోణీ భరాక్రాంత గతిస్సుమధ్యమా ।
జవేన విస్రంసిత కేశబంధన
చ్యుత ప్రసూనానుగతిః పరామృశత్ ॥ (10)

**తా॥** సన్నని నడుము గలదియును, కదలుచున్న ఎత్తైన పిరుదులు గలదియును అయిన తల్లియగు యశోద, కృష్ణుని వెనుక పరుగెత్తు చుండగా ఆమె గమనము కొంత స్తబ్ధమయ్యెను. అయినను ఆమె పరుగు లోని వేగము చేత, సిగలోని పూవులు వెనుక ఒక్కొక్కటి జారి పడిపోవుచుండగా, ముందునకు చేరి ఎట్టకేలకు ఆతనిని పట్టుకొన గలిగెను. (10)

**టీ॥** అన్వంచమానేతి. అన్వంచమానా ఏవం కృష్ణమనుగచ్ఛంతీ. బృహత్యోః చలుత్యోః శ్రోణ్యోః భరేణ ఆక్రాంతా స్తబ్ధా గతిర్యస్యాస్సా విస్రంసితాత్ శిథిలీకృతాత్ కేశబంధాత్ చ్యుతైః ప్రసూనైరనుగతిరను గమనం. యస్సాస్సా. యద్వా జవేన కంపితాత్కేశబంధాత్. పునః పునః పతితాని ప్రసూనాని. అను పశ్చాత్. గతిర్యస్యాస్సా. పరామృశత్ ధృతవతీ. (10)

**టీ॥** అన్వంచమానా – ఇట్లు కృష్ణుని వెనుక పోవుచున్నదై – ఘనములైన నితంబములు చలించుచుండగా – ఆ బరువు చేత స్తబ్ధమైన గమనము ఎవరికో అట్టి ఆమె – శిథిలీకృతమైన (వదులై పోయిన) సిగ నుండి జారి పడు పూవుల చేత – అనుసరించిన నడక ఎవరికో ఆమె – లేక వేగము వలన కదలుచున్న సిగ నుండి మరల మరల పడిపోవుచున్న పూలు – అను – వెనక పోవుట ఎవరికో ఆమె – పట్టుకొనెను. (10)

**శ్లో॥** కృతాగసం తం ప్రరుదంత మక్షిణీ
కషింత మంజన్మషిణీ స్వపాణినా ।
ఉద్వీక్షమాణం భయ విహ్వలేక్షణం
హస్తే గృహీత్వా భిషయంత్యవాగురత్ ॥ (11)

**తా॥** తప్పిదము చేసియుండిన వాడును. వెక్కివెక్కి యేడ్చు చుండిన వాడును. కన్నులకు పెట్టబడిన కాటుక ముఖమున వ్యాపించుచుండగా తన చేతితో కన్నులు నలుపుకొనుచున్న వాడును, పైకి చూచుచున్న వాడును, భయముతో చంచలమైన చూపులు కలవాడును అయిన చిన్ని కృష్ణుని చేతితో పట్టుకొని భయపెట్టుచు, ఆతనిని యశోద, బెదిరించెను.(11)

**టీ॥** కృతాగసమితి. అంజన్మషిణీ అంజంతీ. సర్వత్ర ప్రసరంతీ మషీ కజ్జలం యయోస్తే, అంతర్మర్షిణీత్యపి పాఠాంతరం అక్షిణీ స్వపాణినా కర్షంతం సమ్మర్దయంతం భిషయంతీ భీషయంతీ. హ్రస్వం ఛాందసం. భయముత్పాదయంతీ. అవాగురత్ అభర్త్సయత్. అ పాగురదితి పాఠాంతరే అపగురణం మనసా ద్రోహచింతనమకరో దిత్యర్థః. (11)

**టీ॥** అంజన్మషిణీ అంజంతీ – అంతటను వ్యాపించుచున్న కాటుక ఏ కన్నులకో అవి. అంతర్మర్షిణీ అని కూడ పాఠాంతరము. అక్షిణీ స్వపాణినా కర్షంతం – (చేతితో) నులుముకొనుచున్న వానిని భిషయంతీ – భయపెట్టుచున్నదై – (భీషయంతీ అను శబ్దమునకు బదులు భిషయంతి అని హ్రస్వమును వాడుట ఛాందసము. – భయము పుట్టించుచున్నదై – అవాగురత్. బెదిరించెను. అపాగురత్ అను పాఠాంతరమున అపగురణం – మనస్సుతో ద్రోహ చింతనము చేసెనని యర్థము. (11)

**శ్లో॥** త్యక్త్వా యష్టిం సుతం భీతం విజ్ఞాయార్భక వత్సలా ।
ఇయేష కిల తం బద్ధుం దామ్నాఽతద్వీర్య కోవిదా ॥ (12)

**తా॥** చిన్న వాని యందు ప్రేమ గల యశోద, కొడుకు భయపడెనని తెలిసికొని, బెత్తెమును వదలిపెట్టి, అతని ప్రభావము తెలియని ఆమె, అతనిని త్రాటితో కట్టివేయుటకు ఇచ్ఛయించెనట. (12)

**టీ॥** త్యక్త్వేతి. ఇయేష ఐచ్ఛత్. అతద్వీర్యకోవిదాతత్ప్రభావానభిజ్ఞా. (12)

**టీ॥** ఇయేష - కోరెను. - అతద్వీర్య కోవిదా. అతని ప్రభావము తెలియనిది. (12)

**శ్లో॥** న చాంతర్న బహిర్యస్య న పూర్వం నాపి చాపరమ్ ।
పూర్వాపరం బహిశ్చాంతర్జగతో యో జగచ్చయః ॥ (13)

**తా॥** ఎవనికి, లోపల, వెలుపల, పూర్వము, అపరము అనునవిలేవో, జగత్తుకుపూర్వము తరువాత, వెలుపల, లోపల అంతటను తానే అయి ఉన్నాడో - ఎవడు జగత్తే తానో (అట్టి వాడు కృష్ణుడు) (జగత్+చయః అని పదచ్ఛేదము చేసినచో - జగత్సమూహము) తానే అని - జగద్రక్షకుడు (జగత్తనెడు కోటకు కోటకొఅడు వంటి వాడనియు) తానే అనియు అర్థము స్ఫురించును.) (13)

**టీ॥** అకోవిదత్వమేవాహ - పంచభిశ్శ్లోకైః న చాంతరితి. బంధనం హి బహిః పరివృతేన దామ్నా అంతరావృతస్య న భవతి. తథా. పూర్వాపరవిభాగవతో వస్తునః. పూర్వం దామతో ధృత్వా. పరితః పరివేష్టనేన భవతి నత్వేతదస్తీత్యాహ-నచాంతరితి. కించ. వ్యాపకేన వ్యాప్యస్య బంధో భవతి, తచ్చ విపరీతమిత్యాహ-పూర్వాపరమితి. కించ. తద్వ్యతిరిక్తస్య చాభావాన్న బంధ ఇత్యాహ-జగచ్చయ ఇతి. (13)

**టీ॥** తెలియనితనమునే చెప్పుచున్నాడు 'నచాంతః' అను ఈ శ్లోకము నుండి ఐదు శ్లోకముల చేత - బయట త్రాడుతో కట్టినంతమాత్రమున, లోపల కట్టబడినవాడు కాడుకదా! ఆ విధముగ - (బయట కట్టబడిన త్రాటి చేత లోపలి భాగము కూడ బంధింపబడిన వాడగును - అని నాగరలిపి పూర్వ ప్రతిలో కలదు) పూర్వాపర విభాగములు గల వస్తువునకు - పూర్వతః త్రాడును ధరించి చుట్టును ఆ త్రాడు చుట్ట బడియుండుట చేత బంధనము సంభవించును - అది ఇచట లేదని చెప్పుచున్నాడు - 'నచాంతః' అని - మరియును వ్యాపకము చేత వ్యాప్యమునకు బంధముకలుగును - అదియు విపరీతమని చెప్పు చున్నాడు - 'న పూర్వాపరం' అని - ఇంక ఆ వ్యతిరిక్తత లేనందు వలన బంధములేదని చెప్పుచున్నాడు. 'జగచ్చయః' అని. (13)

**శ్లో॥** తం మత్వాత్మజ మవ్యక్తం మర్త్యలింగమధోక్షజమ్ ।
గోపికో లూఖలే దామ్నా బబంధ ప్రాకృతం యథా ॥ (14)

**తా॥** హృదయమునకును, ఇంద్రియములకును గోచరముకాని అధోక్షజుని (ఇంద్రియజన్య జ్ఞానమును అధఃకరించు భగవానుని) తన కుమారునిగను, మనుష్యరూపమునగలవానిగను భావించి, యశోద, ఱోటికి త్రాటితో ప్రాకృతుని వలె కట్టివేసెను. (14)

**టీ॥** తమితి. తం మర్త్యలింగం. అధోక్షజం ఆత్మజం. మత్వా. బబంధేతి. (14)

**టీ॥** మనుష్యరూపము గల వానిని అధోక్షజుని కొడకుగ భావించి కట్టివేసెను అని. (14)

**శ్లో॥** తద్దామ బధ్యమానస్య స్వార్భకస్య కృతాగసః ।
ద్వ్యంగులో నమభూత్తేన సందధేఽన్యచ్చ గోపికా ॥ (15)

**తా॥** ఆ త్రాటితో బంధింపబడిన తన తుంటరి కుమారునకు, ఆ త్రాడు రెండంగుళములు తక్కువ కాగా, గోపిక యగు యశోద మఱియొక త్రాటిని దానికి జతచేసెను. (15)

**టీ॥** తదితి. ద్వ్యంగులోనం ద్వాభ్యామంగులీభ్యామూన మపూర్ణం. (15.16)

**టీ॥** ద్వ్యంగులోనం – రెండంగుళములమేర తక్కువ కాగా. (15,16)

**శ్లో॥** యదాసీత్తదపిన్యూనం తేనాన్యదపి సందధే ।
తదపి ద్వ్యంగులం న్యూనం యద్యదాదత్త బంధనమ్ ॥ (16)

**తా॥** ఏది యుండెనో అదియును రెండంగుళములు తక్కువయ్యెను. దానికి మరియొక దానిని జత చేసెను. అదియును రెండంగుళములు తక్కువయ్యెను, ఏదేది బంధించుటకు జోడించుచు బోయెనో ఆయా త్రాళ్లన్నియు బంధనమునకు సరిపడకుండెను. (16)

**శ్లో॥** ఏవం స్వగేహ దామాని యశోదా సందధత్యపి ।
గోపీనాం విస్మయంతీనాం స్మయంతీ విస్మితాऽభవత్ ॥ (17)

**తా॥** ఈ విధముగ యశోద తన యింటిలోని త్రాళ్ళన్నియు జత చేసినను కృష్ణుని బంధింపలేకపోయెను. అచటనున్న గోపస్త్రీలు యశోద వైఫల్యమునకు చిఱునవ్వుతో ఆశ్చర్యపడుచుండగా యశోదయు నవ్వు కొనుచు ఆశ్చర్యపడెను. (17)

**టీ॥** ఏవమితి. స్మితం కుర్వంతీనాం మధ్యే. స్వయమపి హసంతీ. విస్మయమాప. (17.18)

**టీ॥** చిరునవ్వులు చిందించుచున్న వారి మధ్య తాను కూడ నవ్వుచు ఆశ్చర్యపడెను. (17,18)

**శ్లో॥** స మాతుస్స్విన్న గాత్రాయా విస్రస్తకబర స్రజః ।
దృష్ట్వా పరిశ్రమం కృష్ణః కృపయాసీత్స్వ బంధనే ॥ (18)

**తా॥** చెమటతో తడిసిన శరీరముగల తన తల్లి యొక్క కొప్పునుండి క్రింద పడిపోయిన పూవులు గల ఆమె పరిశ్రమను చూచి, కృష్ణుడు, దయతో తన బంధమునందు కట్టుబడి యుండెను. (18)

**శ్లో॥** ఏవం సందర్శితా హ్యంగ హరిణా భక్తవశ్యతా ।
స్వవశేనాపి కృష్ణేన యస్యేదం సేశ్వరం వశే ॥ (19)

**తా॥** రాజా! స్వతంత్రుడైనను కృష్ణుచేత ఈ విధముగ తాను భక్తుల వశమైయుండుట ప్రదర్శింపబడినది. ఎవని అధీనమున బ్రహ్మేంద్రాదులతో కూడిన ఈ విశ్వమంతయు కలదో, అట్టి హరి చేత – కట్టులో ఒదిగి యుండుట ద్వార, భక్తపరాధీనత చూపబడినది. (19)

**టీ॥** న చైవం స్వాతంత్ర్యభంగ ఇత్యాహ–ఏవమితి. సేశ్వరం బ్రహ్మేంద్రాదీశ్వరసహితమిదం విశ్వం యస్య వశే. యదధీనమిత్యర్థః (19)

**టీ॥** సేశ్వరం – బ్రహ్మేంద్రాదీశ్వర సహితమైన ఈ విశ్వము ఎవని వశము నందు గలదో – ఎవని అధీనమునందున్నదో – అనియర్థము. (19)

**శ్లో॥** నేమం విరించో న భవో న శ్రీరప్యంగ సంశ్రయా ।
ప్రసాదం లేభిరే గోపీ యం తం ప్రాప విముక్తిదాత్ ॥ (20)

**తా॥** మోక్షదాతయగు శ్రీకృష్ణుని నుండి గోపస్త్రీయైన యశోద ఏ అనుగ్రహమును పొందెనో అట్టి దానిని. పుత్రుడైన బ్రహ్మ, ఆత్మయైన శంకరుడు, వక్షఃస్థలమున నుండు అర్ధాంగి యగు లక్ష్మియు పొందలేక పోయిరి. (20)

**టీ॥** భగవత్ప్రసాదమన్యేఽపి భక్తా లభంతే ఇదం త్వతిచిత్రమితి. సరోమాంచితమాహ–నేతి. విరించః. పుత్రోఽపి భవః స్వాత్మాపి. శ్రీర్జాయాపి. (20)

**టీ॥** భగవానుని అనుగ్రహమును ఇతర భక్తులుకూడ పొందు చున్నారు. కాని 'ఇది' మిక్కిలి విచిత్రమైనది అని ఒడలు పులకించునట్లు చెప్పుచున్నాడు. విరించః పుత్రుడైనను. (బ్రహ్మ), భవః – తన ఆత్మయైనను (శివుడు) శ్రీః – భార్యయగు లక్ష్మియు. (20)

**శ్లో॥** నాయం సుబోధో భగవాన్ దేహినాం గోపికా సుతః ।
జ్ఞానినాం చాత్మపోతానాం యథా భక్తిమతామిహ ॥ (21)

**తా॥** యశోదానందనుడు, భగవానుడును అగు శ్రీకృష్ణుడు, మానవ మాత్రులలో భక్తులకు తప్ప, నివృత్తాభిమానులై తమను తామే ఉద్ధరించుకొను జ్ఞానులకు కూడ అర్థముకాడు. (21)

**టీ॥** ఫలితమాహ.–నాయమితి. దేహినాం దేహాభిమానినాం తాపసాదీనాం జ్ఞానినాం నివృత్తాభి మానినామితి. (21)

**టీ॥** ఫలితమును చెప్పుచున్నాడు – 'న+అయం' అని – దేహినాం – దేహాభిమానులకు – తపస్వులు మొదలగువారికి, అభిమానము నుండి విడివడిన వారికి – అని. (21)

శ్లో॥ కృష్ణస్తు గృహ్య కృత్యేషు వ్యగ్రాయాం మాతరి ప్రభుః ।
అద్రాక్షీ దర్జునౌ పూర్వం గుహ్యకౌ ధనదాత్మజౌ ॥ (22)

తా॥ తన తల్లియగు యశోద ఇంటి పనులలో నిమగ్నమై యుండగా, కృష్ణప్రభువు అచట ఏఱు మద్దిచెట్ల రూపమున నున్న కుబేర పుత్రులగు ఇరువురు గహ్యకులు అను దేవజాతి వారిని చూచెను. (22)

టీ॥ భక్తైర్బద్ధస్యాప్యన్య మోచకత్వం వక్తుమాహ–కృష్ణ ఇతి.(22,23)

టీ॥ భక్తులచేత బద్ధుడైయున్నను ఇతరులను విడిపించు లక్షణము గల వాడని చెప్పుటకు – చెప్పుచున్నాడు. (22,23)

శ్లో॥ పురా నారద శాపేన వృక్షతాం ప్రాపితౌ మదాత్ ।
నల కూబర మణిగ్రీవా విత్యాఖ్యాతౌ శ్రియాన్వితౌ ॥ (23)

తా॥ పూర్వకాలమున, నలకూబరుడు, మణిగ్రీవుడు అను ఇరువురు కుబేర పుత్రులు అహంకారముతో వర్తించి, ధనవంతులే యైనను నారదుని శాపము వలన అర్జున వృక్షముల రూపమునొందిరి. (23)

**శ్రీ మద్భాగవతే, మహాపురాణే దశమస్కంధే, నవమోఽధ్యాయః**

**అని శ్రీమద్భాగవతమున దశమస్కంధమందు తొమ్మిదవ అధ్యాయము సమాప్తము.**

## దశమోఽధ్యాయః

**రాజోవాచ.**

**శ్లో॥** కథ్యతాం భగవన్నేతత్తయోశ్శాపస్య కారణమ్ ।
యత్తద్విగర్హితం కర్మ దేవర్షేర్యేన వా తమః ॥ (1)

**టీ॥** శ్లో. "దశమేఽపాతయద్రాజన్నంతరా యమళార్జునౌ, తత్ర తాభ్యాం చ దేవాభ్యాం కృష్ణః స్తుత ఇతీర్యతే". కథ్యతామితి. యద్విగర్హితం కర్మ. యేన వా. దేవర్షేర్భాగవతోత్తమస్యాపి తమః క్రోధః తదేతత్కథ్యతామితి. (1-3)

**శ్రీశుక ఉవాచ.**

**శ్లో॥** రుద్రస్యానుచరౌ భూత్వా సంధృప్తౌ ధనదాత్మజౌ ।
కైలాసోపవనే రమ్యే మందాకిన్యాం మదోత్కటౌ ॥ (2)

**శ్లో॥** వారుణీం మదిరాం పీత్వా మదాఘూర్ణితలోచనౌ ।
స్త్రీజనైరనుగాయద్భిశ్చేరతుః పుష్పితే వనే ॥ (3)

## పదియవ అధ్యాయము

**పరీక్షిత్తు ఇట్లనెను.**

**తా॥** 'భగవన్! వారి శాపమునకు కారణము చెప్పుడు, వారి ఏ నింద్యమైన పని ఆ నారదునకు కోపము తెప్పించెను. (1)

**టీ॥** పదియవ అధ్యాయమున - దారి నడుమ ఈ రెండు ఏలు మద్దిచెట్లు వచ్చిపడినవి. రాజా! అచట ఆ ఇరువురు దేవతల చేత కృష్ణుడు స్తుతింప బడెనని చెప్పుదురు. ఏ నిందితమైన కర్మ గలదో - లేక దేని చేత - దేవర్షేః - భాగవతోత్తమునికి కూడ - తమః - క్రోధము కలిగెనో - ఆ సన్నివేశము చెప్పుడు - అని. (1 -3)

**శ్రీశుక మహర్షి యిట్లనెను**

**తా॥** "కుబేరుని పుత్రులు ఇరువురును రుద్రుని అనుచరులై, గర్వితులై అతిశయించిన అహంకారముగలవారై, కైలాసమునందలి అందమైన ఉద్యానవనము నందు ఆకాశగంగ తటమున. (2)

**తా॥** బాగుగా మత్తెకించెడు మద్యమును త్రాగి, మదముతో, మైకముతో జోగుచున్న కన్నులుగలవారై, స్త్రీలచే అనుసరింపబడుచు, ఆపుష్పించిన వనమున ప్రవేశించిరి. (3)

**శ్లో॥** అంతః ప్రవిశ్య గంగాయామంభోజ వన రాజిని ।
చిక్రీడతుర్యువతిభిర్గజావివ కరేణుభిః ॥ (4)

**తా॥** తామర పూలతోటల సమూహములు గల ఆకాశగంగ లోనికి ప్రవేశించి, వారు, ఆడ యేనుగులతో రెండు మగ యేనుగుల వలె, యువతులతో క్రీడింపసాగిరి. (4)

**టీ॥** అంతరితి. గంగాయాం అంతర్మధ్యే కథంభూతే. అంభోజానాం వనాని. తేషాం రాజయః. తాః విద్యంతే యస్మిన్ తస్మిన్ . (4)

**టీ॥** గంగ యందు లోపలి మధ్య భాగమున – ఎట్టి దాని యందు? తామరల వనముల యొక్క సమూహములు – అవి దేని యందు గలవో దాని యందు – (4)

**శ్లో॥** యదృచ్ఛయా చ దేవర్షిర్గతవాంస్తత్ర నారదః ।
అపశ్యద్గుహ్యకౌ దృష్ట్వా క్షీబాణౌ సమబుధ్యత ॥ (5)

**తా॥** దేవర్షియగు నారదుడు తన యిష్టానుసారముగ తిరుగుచు అచటికిఁబోయెను. ఆ గుహ్యక ద్వయమును చూచెను. చూచి ఆ మత్తులిరువురిని స్వేచ్ఛాచారులని గ్రహించెను. (5)

**టీ॥** యదృచ్ఛయేతి. దృష్ట్వా చ తస్మిన్ అపశ్యత్. క్షీబాణౌ మత్తౌ. సమబుధ్యత. (5)

**టీ॥** ఆ గంగ యందు చూచెను. క్షీబాణౌ – మత్తులు – అని తెలిసికొనెను. (5)

**శ్లో॥** తం దృష్ట్వా వ్రీడితా దేవ్యో వివస్త్రాశ్శాప శంకితాః ।
వాసాంసి పర్యధుశ్శీఘ్రం వివస్త్రౌ నైవ గుహ్యకా ॥ (6)

**తా॥** నారదుని చూచి సిగ్గుపడి యువతులందఱును, అతడు శపించునేమోయని శంకించి, నగ్నముగ నున్నవారు వెంటనే వస్త్రములను ధరించిరి. కాని గుహ్యకు లిద్దఱును, నగ్నముగ నున్నను, అతని రాకను లెక్కచేయక, వస్త్రములు ధరింపకుండిరి. (6)

**టీ॥** కుత ఇత్యత ఆహ – తమితి. (6)

**టీ॥** ఎందువలన? చెప్పుచున్నాడు. 'తం' అని– (6)

**శ్లో॥** తౌ దృష్ట్వా మదిరా మత్తౌ శ్రీమదాంధౌ సురాత్మజౌ ।
తయోరనుగ్రహార్థాయ శాపం దాస్యన్నిదం జగౌ ॥ (7)

**టీ॥** తావితి. అనుగ్రహార్థాయ అనుగ్రహశ్చ మదనాశః. అర్థశ్చ శ్రీకృష్ణదర్శనం. తదర్థమిదం వక్ష్యమాణం. (7)

**శ్లో॥** నహ్యన్యో జుషతో జోషాన్ బుద్ధిభ్రంశో రజోగుణః ।
శ్రీమదాంధాభి జాత్యాదిర్యత్ర స్త్రీద్యూత మాస వః ॥ (8)

**టీ॥** నహీతి. జోష్యాన్ ప్రియాన్ విషయాన్. జుషతస్సేవమానస్య పుంసః. శ్రీమదాంధస్య ఆభిజాత్యాదిః సత్కుల విద్యాదిజనితో మదః. అన్యో వా. రజోగుణః రజఃకార్యం. హాస్యహర్షాదిరూపః. న హి తథా

**తా॥** మద్యపు మత్తులో నున్నవారును, ధన గర్వితులును అయిన ఆ కుబేర పుత్రులిరువురిని చూచి నారదుడు, వారి ననుగ్రహించుట కొఱకు శాపమునిచ్చుచు ఇట్లనెను. (7)

**టీ॥** అనుగ్రహార్థాయ - అనుగ్రహము మదము నశింపజేయుట -అర్థము శ్రీకృష్ణుని దర్శనము. ఆ కారణము కొఱకు ఈ చెప్ప బోవునది. (7)

**తా॥** ప్రియమైన విషయముల ననుభవించువానికి బుద్ధి నాశము కాదు. అట్లే రజోగుణ ప్రధానుడైన వాడు కూడ బుద్ధి భ్రంశము కల వాడగుట సంభవింపదు. కాని ధన గర్వముచేత కనులుమూసి కొనిపోవుట, సత్కులమున జన్మించితినను గర్వము. విద్యావంతుల వంశమున బుట్టితినను మదము మొదలగు లక్షణములతో బాటు, స్త్రీ, జూదము, మద్యము, ఉండును కావున అట్టి వానికి తప్పక మతిభ్రంశము కలుగును. (8)

**టీ॥** జోష్యాన్ – ప్రియమైన విషయములను – జుషతః – సేవించు పురుషునకు – ధనగర్వము గలవానికి – ఆభిజాత్యాదిః – సత్కులమునందు, విద్యావంతుల కులమునందు జన్మించితినను

బుద్ధిభ్రంశః. బుద్ధిం భ్రంశయతీతి తథా. (8)

గర్వము-లేక ఇతరుడైనను - రజోగుణము కలవాడు - హాస్య హర్షాది రూపమగు రజోగుణకార్యము గల వాడు - ఆ విధముగ బుద్ధి భ్రంశుడు కాడు - బుద్ధిని నశింపజేయును కావున అటుల చెప్పబడినది. (8)

**శ్లో॥** హన్యంతే పశవో యత్ర నిర్దయై రజితాత్మభిః ।
మన్యమానైరిదం దేహమజరా మృత్యునశ్వరమ్ ॥ (9)

**తా॥** ఈ నా దేహమునకు ముసలితనము రాదు, నేను మరణించను. ఈ నా శరీరము నశించునది కాదు" అని భావించుచుండు ధన మదము గలవారు దయాహీనులై, జంతువులను సంహరించుదురు.(9)

**టీ॥** కింతు శ్రీమద ఏవేతి. తదేవాహ-హన్యంత ఇతి. యత్ర శ్రీమదే ఇమం నశ్వరం దేహం. అజరామృత్యు. అజరం అమృత్యు చ యథా తథా. మన్యమానైః. (9)

**టీ॥** కాని ధన గర్వముగల వారే యని - ఎచటి శ్రీమదుని యందు ఈ నశ్వరమైన శరీరము ముసలితనములేనిది; మరణములేనిది అను భావముందునో, అట్లు చెప్పబడును. మన్యమానైః-భావించువారిచే.(9)

**శ్లో॥** దేవ సంజ్ఞిత మప్యంతే కృమివిడ్భస్మ సంజ్ఞితమ్ ।
భూతధ్రుక్ తత్కృతే స్వార్థం కిం వేద నిరయో యతః ॥ (10)

**తా॥** దేవశబ్ద వ్యవహారముగలవాడైనను, మరణించిన తరువాత క్రిమికీటకాదులుగ మారుటయో, మలినరూపము నొందుటయో, బూడిదయగుటయో జరుగును. అందువలన ప్రాణి ద్రోహము చేయువాడు ఆ దుష్కృతము వలన నరకమును పొందును. కాబట్టి తన జీవరూపమునకుగల ప్రయోజనమును ఆతడేమి తెలిసికొనగలడు? (10)

**టీ॥** దేవేతి. నరదేవభూదేవసంజ్ఞితమపి. శ్వాదిభిర్భక్షితం. విట్ సంజ్ఞితం దగ్ధం భస్మసంజ్ఞితం అన్యథా క్రిమిసంజ్ఞితం తత్కృతే తదర్థం. యో భూతధ్రుక్ భూతద్రోహీ. యతో భూతద్రోహాన్నిరయో భవతి. స కిం స్వార్థం వేద. నైన వేదేత్యర్థః. (10)

**టీ॥** మనుష్యులలో దేవుడు, భూమి యందలి దేవుడు (బ్రాహ్మణుడు) దేవుడు (దేవుని వంటివాడు) అను గుర్తింపుగల వాడైనను – కుక్కలచే భక్షింపబడును – మలినరూపుడగును. కాలిపోయి బూడిదగా మారును. లేక క్రిమి సముదాయముగ మారిపోవును. అందువలన – ఎవడు ప్రాణులకు ద్రోహము చేయునో – ప్రాణి ద్రోహము వలన నరకము కలుగును కావున – ఆత్మ ప్రయోజనమునతడు తెలియునా? తెలియ లేదని యర్థము. (10)

**శ్లో॥** దేహః కిమన్నదాతుః స్వం నిషేక్తుర్మాతు రేవ వా ।
మాతుః పితుర్వా బలినః క్రేతురగ్నేః శునోఽపి వా ॥ (11)

**తా॥** ఈ శరీరమెవరిది? అన్నము నిచ్చు వానిదా? గర్భాధానము చేయు తండ్రిదా? మోసి, కని, పెంచు తల్లిదా? తల్లి యొక్క తండ్రిదా? తండ్రి యొక్క తండ్రిదా? సేవలందుకొను బలవంతునిదా? ధనమిచ్చి కొనిన వానిదా? కాల్చివేయు అగ్నిదా? చీల్చి తిను కుక్కలదా? (11)

**టీ॥** ఇదానీం దేహే అహం భావో న ఘటత ఇత్యాహ–దేహ ఇతి. నిషేక్తుః పితుః. మాతుర్వా. మాతుః పితుః మాతామహస్య వా. పుత్రికా పుత్రీకరణే. (11)

**టీ॥** ఇప్పుడు దేహము నందు 'నాది' అను భావము ఘటింపదని చెప్పుచున్నాడు – నిషేక్తుః – తండ్రిదా? లేక తల్లిదా? తల్లిని తన పుత్రికగా చేసికొనిన తాతదా? క్రేతుః – మూల్యమునిచ్చి కొనియున్న వానిదా? (పూర్వము మనుష్యుల వ్యాపారము కూడ జరుగుచుండెడిది) (11)

**శ్లో॥** ఏవం సాధారణం దేహమవ్యక్త ప్రభవాప్యయమ్ ।
కో విద్వానాత్మసా త్కృత్వా హంతి జంతూ నృతేఽ సతః ॥(12)

**తా॥** ఇట్లు శరీరము సాధారణమైనది. అది అవ్యక్తము నుండి పుట్టి దాని యందే ఉండిపోవును. కావున శరీరమును ఆత్మ సంబంధముని భ్రమించి(చే), దుష్టుడు తప్ప ఏ పండితుడు ప్రాణులను చంపును?(12)

**టీ॥** ఏవమితి. అవ్యక్తప్రభవాప్యయం. అవ్యక్తాత్ప్రభవస్తస్మి న్నేవా ప్యయో యస్య తం. ఆత్మసాత్కృత్వా ఆత్మీయమితి మత్వా. అసతో మూఢా దృతే. (12)

**టీ॥** అవ్యక్త ప్రభవాప్యయం– ప్రకృతినుండి పుట్టి అందే ఏది తృప్తి నొందునో దానిని, ఆత్మ సాత్కృత్వా – ఆత్మీయమని తలచి – అసతః ఋతే – మూఢుడు తప్ప. (12)

**శ్లో॥** అసత శ్రీమదాంధస్య దారిద్ర్యం పరమాంజనమ్।
ఆత్మౌపమ్యేన భూతాని దరిద్రః పరమీక్ష్యతే ॥ (13)

**తా॥** మూఢుడగు ధనగర్వితుని కనులు తెరిపించుటకు అతనికి దారిద్ర్యము వచ్చుటయే గొప్ప అంజనము – (కాటుక చికిత్స), ఏలయన దరిద్రుడే ప్రాణులన్నింటిని తనతో సమానముగ లేక ఆత్మతో సమానముగ ఉన్నతమైన దృష్టితో చూచును. (13)

**టీ॥** ఏవం శ్రీమదవిచేష్టితముక్త్వా తత్ప్రతీకారం నిశ్చినోతి–అసత ఇతి. పరం శ్రేష్ఠం. దారిద్ర్యమేవ కేవలమితి వా. కుత ఇత్యాహ– ఆత్మౌపమ్యేనేతి. తతో న ద్రుహ్యతీతి భావః. (13)

**టీ॥** ఇట్లు ధన మదాంధు చేష్టితమును చెప్పి దానికి ప్రతీకారము నిశ్చయించుచున్నాడు. పరం – శ్రేష్ఠమైన వానినిగ – లేక దారిద్ర్య మొక్కటియే (చికిత్స) ఎందులకో చెప్పుచున్నాడు. ఆత్మౌపమ్యేన అని – అప్పుడు ద్రోహము చేయడని భావము. (13)

**శ్లో॥** యథా కంటక విద్ధాంగో జంతోర్నేచ్ఛతి తాం వ్యథామ్ ।
జీవసామ్యం గతో లింగైర్న తథా విద్ధ కంటకః ॥ (14)

**తా॥** ముల్లు గ్రుచ్చుకొనిన వాడు, అట్టి బాధ ఏ ఇతర ప్రాణికి కలుగ కూడదని కోరునట్లు ముల్లు బాధ తెలియని వాడట్లు కోరజాలడు. అనేక లక్షణముల చేత జీవులలో సమానత్వముండుటచే - బాధ పొందిన వాడే అట్టి బాధ ఇతర జీవులకు కలుగ కూడదని భావించును. జీవసామ్యజ్ఞానము లేని వాడు ఇతరులకు బాధ కలుగవలదని భావింప నేరడు. (14)

**టీ॥** సదృష్టాంతమాహ - యథేతి. ముఖమ్లానాదిలింగైః. సర్వేషాం జీవానాం. సుఖ దుఃఖే సమే ఇతి జ్ఞాతవానిత్యర్థః. (14)

**టీ॥** దృష్టాంతముతో చెప్పుచున్నాడు. ముఖము వికారము నందుట వికాసమునందుట మొదలగు లక్షణములచేత జీవులందఱికిని సుఖదుః ఖములు సమానములే అని తెలిసినవాడు అని అర్థము. (14)

**శ్లో॥** దరిద్రో నిరహం స్తంభో ముక్తః సర్వమదైరిహ ।
కృచ్ఛ్రం యదృచ్ఛయాఽప్నోతి తద్ధి తస్య పరం తపః ॥ (15)

**తా॥** నిరహంకారముతో మ్రాన్పడి యుండు దరిద్రుడు అన్ని గర్వము ల నుండి ముక్తుడై యుండును. పాపమును పోగొట్టు దైవికమైన ఏ సన్నివేశమైనను అదియే అతని యొక్క శ్రేష్ఠమైన తపస్సగును. (15)

**శ్లో॥** నిత్యం క్షుతాక్షమ దేహస్య దరిద్రస్యాన్నకాంక్షిణః
ఇంద్రియాణ్యను శుష్యంతి హింసాపి వినివర్తతే. (16)

**తా॥** ప్రతిదినము ఆకలితో అలమటించుచు అన్నమును కోరుచుండు వాని దేహము శుష్కించి యుండును. అట్టివాని ఇంద్రియములు కూడ దేహముననుసరించి కృశించి యుండును, అట్టి పేదవాడు హింసా ప్రవృత్తి నుండియు విరమించి యుండును. (16)

**టీ॥** కించ. దారిద్ర్యమేవ మోక్షమపి సాధయతీత్యాహ–శ్లోకచతుష్టయేన. దరిద్ర ఇతి. నిరహంస్తంభః నిర్గతః అహంకారరూపః స్తంభో యస్మాత్సః. (15,16)

**టీ॥** మరియు దారిద్ర్యము మోక్షమును కూడ సాధించునని చెప్పుచున్నాడు. నాలుగు శ్లోకములతో – దేని వలన అహంకారము నశించి స్తంభీభూతుడగునో అతడు (అది) (15,16)

**శ్లో॥** దరిద్రస్యైవ యుజ్యంతే సాధవస్సమదర్శినః ।
సద్భిః క్షిణోతి తత్తర్షం తత ఆరాద్విశుద్ధ్యతి ॥ (17)

**తా॥** సాధుపురుషులు, తత్త్వజ్ఞానులు దరిద్రుని సంయోగముననే ఉందురు. సత్పురుషుల కలయిక చేత దరిద్రుని ఆశ నశించిపోయి ఆపదప శీఘ్రమే అతని చిత్తము శుద్ధమగును. (17)

**టీ॥** దరిద్రస్యేతి యుజ్యంతే స్వత ఏవ సంగచ్ఛంతి తర్షం తృష్ణాం. ఆరాచ్ఛీఘ్రం. (17)

**టీ॥** యుజ్యంతే – స్వయముగనే కలియుదురు. తర్షం – ఆశను ఆరాత్ – శీఘ్రమే – (17)

**శ్లో॥** సాధూనాం సమచిత్తానాం ముకుంద చరణైషిణామ్ ।
దర్శనాంతో భవేద్బంధః పుంసోక్ష్ణోస్సవితుర్యథా ॥ (18)

**తా॥** సత్పురుషులకు, పరమాత్మతో నిండి యున్న చిత్తముగల వారికి, భగవానుని పాదములపైననే ఇచ్ఛగల వారికిని, సూర్యుడు కనబడగానే మనుష్యుని కనుల చీకటి తొలగునట్లు, దర్శనము (సాధుపురుషుల) తోడనే బంధము సమాప్తమగును. (18)

**శ్లో॥** ఉపేక్ష్యైః కింధన స్తంభైరసద్భిరసదాశ్రయైః ॥ (19)

**తా॥** సాధువులు మొదలగు వారికి, ఉపేక్షింపదగిన వారితోను, ధనముచే గర్వించి యున్న వారితోను, పరతత్త్వ సంబంధము లేని వారితోను, అట్టి వారిని ఆశ్రయించియుండు వారితోను పనియేమి? 19

**టీ॥** నను సాధూనామపి ధనిక ఏవ ప్రియస్స్యాత్. న దరిద్ర ఇతి తత్రాహ–సాధూనామితి. ఉపేక్ష్యైరితి. ధనేన స్తంభో గర్వో యేషాం తైః. (18,19)

**టీ॥** సాధువులకు కూడ ధనికుడే ప్రియమెట్లగును కాదు. దరిద్రుడు కూడ కాదని – యిట సాధూనాం అను శ్లోకమున చెప్పుచున్నాడు. ధనము చేత స్తంభః – గర్వము ఎవరికో వారితో (పనియేమి?) (18,19)

**శ్లో॥** తదహం మత్తయోర్మాధ్వ్యా వారుణ్యా శ్రీమదాంధయోః ।
తమో మదం హరిష్యామి స్త్రైణయోరజితాత్మనోః ॥ (20)

**తా॥** అందువలన, ఇప్పపూవుతో చేయబడిన కల్లు, మద్యము త్రాగి మత్తెక్కియున్న, ధనమదాంధులైన, స్త్రీలోలురైన , నిగ్రహశక్తి లేని వీరిద్దఱి అజ్ఞాన మదమును నేను నశింప జేసెదను. (20)

**టీ॥** తదితి. తమోమదం అజ్ఞాన కృతం మదం. (20)

**టీ॥** తమోమదం – అజ్ఞానముచే ఆవరింపబడియున్న గర్వము.(20)

**శ్లో॥** యదిమౌ లోకపాలస్య పుత్రౌ భూత్వా తమః ప్లుతౌ ।
న వివాసస మాత్మానం విజానీత స్సుదుర్మదౌ ॥ (21)

**తా॥** వీరిద్దఱు లోకపాలకుడైన కుబేరుని పుత్రులై యుండియు, అజ్ఞానముతో నిండినవారై, మిక్కిలి మదించినవారై తాము నగ్నముగ నున్న విషయమును కూడ తెలియజాలకుండిరి. (21)

**టీ॥** యదితి. తమః ప్లుతౌ తమో వ్యాప్తౌ. (21)

**టీ॥** తమః ప్లుతౌ – అజ్ఞానముతో వ్యాపింపబడియున్నవారై. (21)

**శ్లో॥** అతోఽర్హతః స్థావరతాం స్యాతాం నైవం యథా పునః ।
స్మృతిస్స్యాన్మత్ప్రసాదేన తత్రాపి మదనుగ్రహాత్ ॥ (22)

**తా॥** అందువలన వీరు వృక్షత్వమునొందుటకు తగియున్నారు. అట్లగుటచే మఱల వీరికి పూర్వాభిమానము కలుగదు. వృక్షయోనిలో పుట్టినను,నా అనుగ్రహముచేత భగవానుని స్మృతిమాత్రము ఉండును. అదియును నా అనుగ్రహము వలననే. (22)

**టీ॥** అత ఇతి. అను గృహ్ణాతి. స్యాతాం నైవమిత్యాదినా మత్ప్రసాదేన స్మృతిః స్యాత్. (22)

**టీ॥** 'అతోఽర్హతః' అని శపించుచున్నాడు – తోడ్తో అనుగ్రహించు చున్నాడు "స్యాతాం నైవం" అను మొదలగు వాక్యములచేత – నా అనుగ్రహము చేత స్మృతి ఉండును. (22)

**శ్లో॥** వాసుదేవస్య సాన్నిధ్యం లబ్ధ్వా దివ్య శరచ్ఛతే ।
వృత్తే స్వర్లోకతాం భూయో లబ్ధ్వా భక్తౌ భవిష్యతః ॥ (23)

**తా॥** ఒక వంద దివ్య సంవత్సరములు గడచిన పిదప కృష్ణభగవానుని సన్నిధినిచే, మఱల స్వర్గ లోకమును పొంది, ఇరువురును భక్తుల య్యెదరు. (23)

**టీ॥** వాసుదేవస్యేతి. స్వర్లోకతాం దేవత్వం పునర్లబ్ధ్వా మదనుగ్రహాల్లబ్ధభక్తౌ భవిష్యత ఇతి. (23. 24)

**టీ॥** స్వర్లోకతాం – దేవత్వమును – మఱలపొంది, నా అనుగ్రహమున భక్తులగుదురు అని. (23,24)

**శ్లో॥** స ఏవముక్త్వా దేవర్షి ర్గతో నారాయణాశ్రమమ్ ।
నలకూబర మణిగ్రీవా వాసతుర్యమళార్జునౌ ॥ (24)

**తా॥** నారదుడిట్లు చెప్పి నారాయణాశ్రమమునకు బోయెను. నలకూబరుడు, మణిగ్రీవుడు ఒకేచోట ఏఱుమద్ది చెట్లుగ మారి యమళార్జునులను పేరుతో ఉండిరి. (24)

**శ్లో॥** ఋషేర్భాగవత ముఖ్యస్య సత్యం కర్తుం వచో హరిః ।
జగామ శనకైస్తత్ర యత్రాస్తాం యమళార్జునౌ ॥ (25)

**తా॥** దేవర్షియు, పరమభక్తుడును అగు నారదుని వాక్యములను యథార్థము చేయుటకు భగవానుడగు కృష్ణుడు మెల్లగా యమళార్జును లుండుతావునకు బోయెను. (25)

**టీ॥** ప్రస్తుతమాహ–ఋషేరితి. అస్మిన్ శ్లోకే పూర్వ శ్లోకే చాక్షరాధిక్యమార్షం. (25)

**శ్లో॥** దేవర్షిర్మే ప్రియతమో యదిమౌ ధనదాత్మజౌ ।
తత్తథా సాధయిష్యామి యద్గీతం తన్మహాత్మనా ॥ (26)

**టీ॥** కిమితి. సత్యం కర్తవ్యం తత్రాహ – దేవర్షిరితి. యద్యతః తత్తతః ఇమౌ ఆలక్ష్య యద్గీతం. (26)

**శ్లో॥** ఇత్యంతరేణార్జునయోః కృష్ణస్తు యమయోర్యయౌ ।
ఆత్మనిర్వేశ మాత్రేణ తిర్యగ్గతములూఖలమ్ ॥ (27)

**టీ॥** ఇతీతి. యమయోర్యమళయోః సహ జాతయోరిత్యర్థః. ఆత్మనిర్వేశ మాత్రేణ. ఆత్మనః కృష్ణస్య. తన్మధ్యప్రవేశమాత్రేణ. అన్వంచత్తదులూఖలమితి పాఠే అను పశ్చాత్పృష్ఠభాగే అంచత్ శోభమానమిత్యర్థః (27)

**టీ॥** ఇక ప్రస్తుత విషయమును చెప్పుచున్నాడు. ఈ శ్లోకమునను, పూర్వ శ్లోకమునను అక్షరము లెక్కువ యగుట ఆర్షము. (25)

**తా॥** నారదుడు నాకు మిక్కిలి యిష్టమైన వాడు. వీరు కుబేర పుత్రులగుట వలనను, వీరిని చూచి నారదుడట్లు చెప్పి యుండుట వలనను, ఆ మహాత్ముడు చెప్పినట్లుగ సాధింపగలను. (26)

**టీ॥** సత్యము ఆచరింపదగినది. ఇట చెప్పుచున్నాడు. యత్ – ఎందువలన – తత్తతః – వీరినిచూచి – యద్గీతం – ఏదిచెప్పబడెనో (దానిని సాధింతును) (26)

**తా॥** కృష్ణుడు ఇట్లనుకొని ఆ రెండు అర్జున వృక్షముల మధ్య భాగమునకు బోయెను. తాను ప్రవేశించి అవతల వైపునకు పోగా ఱోలు రెండు చెట్ల నడుమ ఇరుకుకొనెను. (27)

**టీ॥** యమయోః – యమళయోః కవలల యొక్క అని యర్థము – ఆత్మనిర్వేశమాత్రేణ – ఆత్మనః కృష్ణుని యొక్క – వాని మధ్య ప్రవేశించిన మాత్రమున – 'అన్వంచత్తదూలుఖలం' అను పాఠమున – అను వెనుక భాగమున – అంచత్ – ప్రకాశించెనని యర్థము. (27)

**శ్లో॥** బాలేన నిష్కర్షయ తా న్వ గులూఖలం త
ద్దామోదరేణ తరసోత్కలితాంఘ్రి బంధౌ ।
నిష్పేతతుః పరమ విక్రమితాతి వేప
స్కంధ ప్రవాళ విటపౌ కృత చండశబ్దౌ ॥ (28)

**టీ॥** బాలేనేతి. అన్వంచతీత్యన్వక్ తత్ర హేతుః. దామోదరేణేతి. అత ఏవ తన్నిష్కర్షయతా. తేన ఉత్కలితాంఘ్రిబంధో ఉత్కలితః ఉత్పాటితః. అంఘ్రి బంధో మూల బంధో యయోస్తౌ. పరమస్య శ్రీకృష్ణస్య. విక్రమితేనాతివేపః కంపో యేషు తే. స్కంధప్రవాళ విటపా యయోస్తౌ. (28)

**తా॥** బాలుడగు కృష్ణునిచే బలముగ లాగబడుచు అతని వెనుకనే వచ్చు ఱోలు, (ఆతడు చెట్లనడిమి భాగముదాటి ముందుకుపోగా) వెంటనే ఆ చెట్లను కూకటి వేళ్లతో పెకలించెను, మిక్కిలి వేగముగ ముందునకు వచ్చి తాకుటచే ఆ చెట్ల కొమ్మలు, రెమ్మలు, ఆకులు, చిగుళ్లు, బోదెలు కంపించుచుండగా అవి రెండును భయంకరమైన శబ్దముతో నేలcగూలెను. (28)

**టీ॥** అన్వంచతీత్యన్వక్ – వెనుక బోవును కనుక అన్వక్, దానికి కారణము – దామోదరుని చేత – అని. – అందుకే దానిని లాగుట చేత – అందుచే – ఉత్కలితాంఘ్రి బంధః – ఉత్కలితః – పెకిలింప బడినది. అంఘ్రిబంధః – మూలబంధము వేనికో అవి– పరమస్య – శ్రీకృష్ణుని యొక్క – వేగముగా ముందునకు పోవుట చేత – అతివేపః – మిక్కిలి కదలక వేని యందో అవి. స్కంధ ప్రవాళ విటపా యయోస్తౌ – బోదెలు, చిగుళ్లు కొమ్మలు వేనికో అవి. (28)

**శ్లో॥** తత్ర శ్రియా పరమయా కకుభః స్ఫురంతౌ
సిద్ధా వుపేత్య కుజయోరివ జాతవేదాః ।
కృష్ణం ప్రణమ్య శిరసాఖిల లోకనాథం
బద్ధాంజలీ విరజసావిద మూచతుస్తౌ ॥ (29)

**తా॥** మిక్కిలి శోభతో దిక్కులు మెఱయుచుండగా, ఆ చెట్లకు సంబంధించిన, అగ్నివలె ప్రకాశించుచున్న ఇరువురు సిద్ధపురుషులు నిర్మదులై స్ఫురించి, సమస్త లోకములకు నాథుడైన కృష్ణుని సమీపించి, అంజలి ఘటించి, శిరసు వంచి అతనికి నమస్కరించి ఇట్లనిరి. (ఇట్లు స్తుతించిరి.) (29)

**టీ॥** తత్రేతి. కకుభః ప్రతి సర్వతః స్ఫురంతావిత్యర్థః. యద్వా. దిశః ప్రకాశయంతావితి. అథవా. కకుభస్ఫురంతావిత్యేకం పదం. కకుభయోరర్జునవృక్షయోః స్ఫురంతౌ ప్రథమం ఛాయారూపేణ ప్రతిఫలంతావితి. శ్లో. "ఇంద్రస్తు కకుభోఽర్జున" ఇతి నిఘంటుః. కుజయోః వృక్షయోః స్థితోఽగ్నిర్యథా మూర్తిమానుపైతి. తథోపేత్య విరజసౌ నిర్మదౌ ధనమత్తౌ. (29)

**టీ॥** దిక్కులను గూర్చి అంతటను తోచుచున్న వారై అని యర్థము. లేక దిక్కులను ప్రకాశింపజేయుచు - అని. లేక కుకుభస్ఫురంతౌ అని ఏకపదము, కకుభయోః - అర్జున వృక్షములకు - స్ఫురంతౌ - స్ఫురించుచున్న వారై - మొదట ఛాయా రూపమున ప్రతిబింబించు వారై అని. "ఇంద్రస్తు కకుభోఽర్జునః" అని నిఘంటువు. కుజయోః - వృక్షములకు ఉన్న అగ్ని, మూర్తిమత్వమును పొందినట్లు - ఆ విధముగ సమీపించి - విరజసౌ - గర్వములేని వారై - ధనమత్తులుకాని వారై. (29)

### గుహ్యకావూచతుః

**శ్లో॥** కృష్ణ కృష్ణ మహాయోగిన్ త్వ మాద్యః పురుషః పరః ।
వ్యక్తావ్యక్తమిదం విశ్వం రూపం తే బ్రహ్మణో విదుః ॥ (30)

### గుహ్యకులిరువురును ఇట్లనిరి.

**తా॥** "ఓకృష్ణా! కృష్ణా! మహాయోగీ! సృష్టికి ఆద్యుడవు. నీవు ఆది పరమపురుషుడవు. తత్త్వజ్ఞులు, ఈ స్థూల, సూక్ష్మ విశ్వమంతయు నీ స్వరూపముగా తెలియుచున్నారు. (30)

**టీ॥** గోపాలం మాం యువాం దేవౌ కిమితి ప్రణమత ఇతి చేత్తత్రాహతుః-కృష్ణేతి. హే కృష్ణ మహాయోగిన్. అచింత్యప్రభావత్వం. న గోపాలః. కింతు పరః పురుషః యతః ఆద్యః కారణభూతః. తత్రాపి న నిమిత్తమాత్రం. కింతూపాదానమపి. త్వ మేవేత్యాశయేన తుష్టువతుః . వ్యక్తావ్యక్తమితి స్థూలసూక్ష్మమిదం తే రూపం విదుః. బ్రాహ్మణా

**టీ॥** గోపాలుడనైన నాకు, దేవతలైన మీరు ఎందుకని నమస్కరించుచున్నారు? అనినచో చెప్పుచున్నాడు. నీవు గోపాలుడవు కావు. మఱి - పరమ పురుషుడవు. ఈ విశ్వమునకు మొట్టమొదటి కారణభూతుడవై నందువలన - అట్లైనను కేవలము నిమిత్తకారణుడవుకావు. మఱి ఉపాదాన కారణుడవుకూడ - నీవే అను అభిప్రాయమున స్తుతింతుము.

విదురితి పాఠే బ్రాహ్మణా స్తత్త్వజ్ఞాః (30)

'వ్యక్తావ్యక్త'మితి. స్థూలము సూక్ష్మము అని. నీ రూపమును తెలిసి కొందురు. బ్రాహ్మణా విదుః అను పాఠమున బ్రాహ్మణాః అనగా తత్త్వజ్ఞులు. (30)

**శ్లో॥** త్వమేక స్సర్వభూతానాం దేహీ స్వాత్మేంద్రియేశ్వరః ॥ (31)

**తా॥** నియమించు వాడవు కూడ నీవేఅని చెప్పుచున్నారు. నీవొక్కడవే సర్వప్రాణులకు దేహివి. ప్రాణములు అహం కొరకు, ఇంద్రియములు నీవే. (31)

**టీ॥** నియంతాపి త్వమేవేత్యూచతుః–త్వమితి. దేహీ అసవః ప్రాణాః ఆత్మా అహంకారః. ఇంద్రియాణి చ. తేషామీశ్వరః. (31)

**టీ॥** నియంతవు కూడ – నీవే అని చెప్పుచున్నారు. దేహి – ప్రాణములు, అహంకారము ఇంద్రియములు కూడ – వానికి ఈశ్వరుడవు. (31)

**శ్లో॥** త్వమేవ కాలో భగవాన్ విష్ణురవ్యయ ఈశ్వరః
త్వం మహాన్ ప్రకృతి స్సూక్ష్మా రజ స్సత్వ తమోమయీ
త్వమేవ పురుషోఽ ధ్యక్ష స్సర్వక్షేత్రవికారకృత్ ॥ (32)

**తా॥** నీవే కాలము, నేవే షడ్గుణైశ్వర్య సంపన్నుడవు. నీవే విష్ణు దేవుడవు, అవ్యయుడవు, ఈశ్వరుడవు, బుద్ధి తత్త్వము నీవే, దానికి మూలమగు సత్త్వరజస్తమో గుణాత్మకమైన ప్రకృతి – సూక్ష్మప్రకృతి తత్త్వము నీవే, నీవే పురుషుడవు – అధ్యక్షుడవు. శరీరములనన్నింటిని కాలమునను సరించి పరిణామ వికారములను చెందించు వాడవు నీవే. (32)

**టీ॥** నన్వస్య కాలో నిమిత్తం ప్రకృతిరుపాదానం ప్రకృతేర్జాతో మహాన్ విశ్వాత్మతయా. పరిణమతే పురుషః కర్తా నియంతా చ కిమత్రాహం. అత ఆహతుః సార్థేన–త్వమితి. యతో భగవానీశ్వరో విష్ణుస్త్వం. అతః కాలో నామ తవ లీలాప్రకృతిః శక్తిః. పురుషోఽంశః మహాన్ కార్యం అతస్త్వమేవ సర్వమిత్యర్థః. నన్వహమేవ చేత్సర్వం తర్హి కీటాదిజ్ఞానేన మజ్జ్ఞానం కిం న భవతి. భవతి చేత్సర్వోఽపి బ్రహ్మవిత్స్యాదపి ఆహతుః. (32)

**టీ॥** ఆతని కాలమే నిమిత్తకారణము. అతని ప్రకృతి ఉపాదాన కారణము. (కాలము వలన సృష్టి స్థితి లయాది వికారములు కలుగును. ప్రకృతి వలన వస్తుత్వ స్థితి కలుగును.) ప్రకృతి నుండి పుట్టిన మహత్తత్త్వము విశ్వ రూపముగ పరిణమించును. పురుషుడు కర్త, నియంతయును – ఇచట నేనేమిటి? అదియే సార్థముగ చెప్పుచున్నారు. 'త్వం' అను శ్లోకముతో – నీవు భగవానుడవు. ఈశ్వరుడవు, సర్వ వ్యాపకుడవు అయినందు వలన కాలము అనెడి నీ లీలాప్రకృతి, శక్తి, పురుషుడు నీ అంశ – మహత్తత్త్వము కార్యము – అందుచేత నీవే సర్వము అని యర్థము. నేనే సర్వమనిన యెడల కీటకము మొదలు కొనిన జ్ఞానముచేత నా జ్ఞానము ఏమి కాకుండును? అటులయ్యేనేని ప్రతివాడును బ్రహ్మవేత్తయగును గదా! ఐనను చెప్పుచున్నారు. (32)

**శ్లో॥** గృహ్య మాణై స్త్వమగ్రాహ్యో వికారైః ప్రాకృతైర్గుణైః ।
కోన్విహార్హతి విజ్ఞాతుం ప్రాక్సిద్ధం గుణసంవృతః ॥ (33)

**తా॥** ప్రకృతి సంబంధములైన గుణములుగలవియు, పరిణామము చెందునవియు, గ్రహించుటకు వీలగుచున్నవియునైన పదార్థముల చేత నీవు తెలియబడజాలవు, గుణములతో కూడియున్న వాడెవడు, సృష్టికి పూర్వము నుండియు ఉన్న నిన్ను, తెలిసికొనుటకు అర్హుడగును? (ఎవడును అర్హుడుకాడు) (33)

**టీ॥** గృహ్యమాణైరితి. దృశ్యత్వేన వర్తమానైః. బుద్ధ్యాద్యహంకారైః తద్వికార్యైరింద్రియాదిభిః ద్రష్టా తం. న గృహ స ఇతి భావః. నను తర్హి జీవో జానాతు. నైవేత్యాహతుః–కోన్వి్హేతి. జీవాద్యుత్పత్తేః. ప్రాగేవ స్వప్రకాశతయా నద్ధం త్వాం కో హి జానాతి. గుణసంవృతః దేహాద్యావృతః. (33)

**టీ॥** కనపడు లక్షణములచేత విద్యమానములగు పదార్థముల చేత, బుద్ధిమొదలగు అహంకారముల చేత, వాని వికారముల చేత, ఇంద్రియములు మున్నగువాని చేతను. ద్రష్ట అతనిని గ్రహింపజాలడని భావము. అటులయిన జీవుడు తెలిసికొనునేమో! అదియునుకాదని చెప్పుచున్నారు. 'కోన్విహ' అని. జీవుని పుట్టుకకంటె పూర్వమే స్వప్రకాశముతో అంతటను అల్లుకొనియున్న నిన్ను ఎవరును తెలిసికొనజాలరు. గుణసంవృతః – దేహముతో ఆవరింపబడి యున్నవాడు. (దేహధారియైన వాడు ఎవ్వాడును నిన్ను తెలిసికొనలేడు) (33)

**శ్లో॥** తస్మై తుభ్యం భగవతే వాసుదేవాయ వేధసే ।
ఆత్మ ద్యోత గుణచ్ఛన్న మహిమ్నే బ్రహ్మణే నమః ॥ (34)

**తా॥** భగవానుఁడవు, వాసుదేవుడవు, సృష్టికర్తవు, నీ నుండి ప్రకాశించు గుణముల చేత కప్పబడిన మహిమ గలవాడవు, బ్రహ్మవు అయిన అట్టి నీకు నమస్కారము. (34)

**టీ॥** అతో దుర్జ్ఞేయ ఇత్యౌత్కంఠ్యేన కేవలం ప్రణమతః. తస్మా ఇతి ఆత్మనః స్వాస్మాత్ ద్యోతః ప్రకాశో యేషాం తైః గుణైః ఛన్నో మహిమా యస్య అభ్రైరివ రవేః రశ్మయస్తస్మై. (34)

**టీ॥** అందువలన, తెలిసికొనబడజాలని వాడవని ఉత్కంఠ చేత నమస్కారము మాత్రమే చేయుచున్నారు. ఆత్మనః – తన వలన – ద్యోతః – ప్రకాశము ఎవరికో అట్టి గుణములచేత ఆచ్ఛాదింపబడిన గొప్పదనము ఎవరికో – సూర్య కిరణములు మేఘముల చేత వలె ఎవని యందు కప్పబడి యున్నవో – వానికి (నమస్కారము.) (34)

శ్లో॥ యస్యావతారా జ్ఞాయంతే శరీరేష్వ శరీరిణః ।
తై స్తై రతుల్యాతిశయై ర్వీర్యై ర్దేహేష్వ సంగతైః ॥ (35)

టీ॥ అహో అహం ఈశ్వరః ఇతి కుతో జ్ఞాతః తత్రాహతుః. యస్యేతి. (35)

శ్లో॥ స భగవాన్ సర్వలోకస్య భవాయ విభవాయ చ ।
అవతీర్ణోఽంశ భాగేన సాంప్రతం పతిరాశిషామ్ ॥ (36)

టీ॥ స ఇతి. భవాయ ఉద్భవాయ. విభవాయ విగతో భవో యస్మిన్ తస్మై. కైవల్యాయేత్యర్థః.(36,37)

శ్లో॥ నమః పరమ కల్యాణ నమస్తే విశ్వమంగళ ।
వాసుదేవాయ శాంతాయ యదూనాం పతయే నమః ॥ (37)

తా॥ ఏ నిరాకారుని అవతారములు, శరీరముల యందు తెలిసికొనబడునో అట్టి పరమేశ్వరుని ఆయా సాటిలేని అతిశయించిన ప్రభావముల చేత, నిస్సంగులైన వారు, శరీరముల యందు తెలిసికొందురు. (35)

టీ॥ అహో! నేను ఈశ్వరుడనని ఎట్లు తెలిసికొనబడును? ఆ విషయమును చెప్పుచున్నారు. 'యస్య' అను ఈ శ్లోకము నందు.(35)

తా॥ లోకమంతటికిని భగవానుడవు. సంసారమునకును కైవల్యమునకును నీవే అధిపతివి. ఇప్పుడు నిరాకారుడును నిర్గుణుడునునైన ఆ పరమాత్ముని అంశ భాగముతో అవతరించితివి. అందఱి అభీష్టములకు నీవే అధినాయకుడవు. అట్టి నీకు నమస్కారము. (36)

టీ॥ భవాయ – పుట్టుక గలవాడవగు నీకు – విభవాయ – పుట్టుకలేని నీకు – కైవల్యరూపుడవగు నీకు – అని అర్థము. (నమస్కారము) (36,37)

తా॥ పరమ కల్యాణమూర్తివి, విశ్వమునకు శుభములిచ్చువాడవు, వసుదేవుని కమారుడవు, శాంతుడవు, యదుకులపతివి అయిన నీకు నమస్కారము. (37)

**శ్లో॥** అను జానీహి నౌ భూమంస్తవాను చర కింకరౌ ।
దర్శనం నౌ భగవత ఋషేరాసీదను గ్రహాత్ ॥ (38)

**తా॥** ఆనందా! మా ఇరువురిని నీ భక్తులుగా, సేవకులనుగా గుర్తింప వేడెదము. భగవానుడైన నారదమహర్షి యొక్క అనుగ్రహము వలన మాకు నీ దర్శనమైనది. (38)

**టీ॥** అనుజానీహీతి. నౌ ఆవాం. అనుచరః. కుబేరో నారదో వా. తస్య కింకరౌ భగవతస్తవ దర్శనం. (38)

**టీ॥** నౌ – మా ఇరువురకు – అనుచరః – కుబేరుడు లేక నారదుడు. అతని కింకరులము. భగవతః – భగవానుడవైన నీ యొక్క దర్శనము. (38)

**శ్లో॥** వాణీ గుణాను కథనే శ్రవణే కథాయాం
హస్తౌచ కర్మసు మనస్తవ పాదయోర్నః ।
స్మృత్యాం శిరస్తవ నివాస జగత్ప్రణామే
దృష్టి స్సతాం దర్శనేఽస్తు భవత్తనూనామ్ ॥ (39)

**తా॥** మా వాక్కు నీగుణములను చెప్పుకొనుటలోను, చెవులు నీ కథలను వినుటలోను, చేతులు నీ గుఱించిన కర్మలు చేయుటలోను, మనస్సు నీ పాదములను స్మరించుచుండుటలోను, మా శిరస్సు(లు) నీవు నివసించు జగత్తునకు నమస్కరించుచుండుటలోను, మా దృష్టి నీ శరీరప్రాయములగు సత్పురుషుల దర్శనములోను నిమగ్నమై యుండుగాక. (39)

**టీ॥** తత్ర గతయోః ఆవయోః పూర్వస్వభావో మాభూత్. కింత్వేవం ప్రార్థయామహ ఇత్యాహతుః – వాణీతి. న ఇతి. అస్మత్సంగినాం సర్వేషామిత్య భిప్రాయేణ బహువచనం. తవ నివాస భూతం యజ్జగత్. తస్య ప్రణామే త్వన్నివాస భూతమితి. బహుమానేన జగతః ప్రణామే

**టీ॥** ఇట్టి ఉత్తమస్థితిని పొందిన మాకు మా పూర్వస్వభావములు లేకుండుగాక – అయినను ఈవిధముగ నిన్ను ప్రార్థించెదమని చెప్పుచున్నారు. మా స్నేహముగలవారికి అందరికిని అను అభిప్రాయ మున బహువచనము – నీ నివాసభూతమగు ఏ జగత్తుకలదో –

శిరోఽస్త్విత్యర్థః. భవత్తనూనాం భవతో మూర్తీనాం. (39)

**శ్రీశుక ఉవాచ.**

శ్లో॥ ఇత్థం సంకీర్తిత స్తాభ్యాం భగవాన్ గోకులేశ్వరః ।
నామ్నా చోలూఖలే బద్ధః ప్రహసన్నాహ గుహ్యకౌ ॥ (40)

టీ॥ ఇత్థమితి. సంకీర్తితః సంస్తుతః. (40)

**శ్రీభగవానువాచ.**

శ్లో॥ జ్ఞాతం మయా పురైవేతదృషిణా కరుణాత్మనా ।
యచ్ఛ్రీమదాంధయో ర్వాగ్భిర్విభ్రంశోఽనుగ్రహః కృతః ॥ (41)

టీ॥ జ్ఞాతమితి. వాగ్భిః శ్లో. న హ్యన్యో జుషతో జోష్యాని త్యాద్యాభిః శ్రీః విభ్రంశరూపోఽనుగ్రహః కృత ఇతి. (41)

దానికి నమస్కరించుట యందు. అది నీ నివాసభూతమని గౌరవముతో జగత్తునకు ప్రణామము చేయుటకే శిరస్సు ఉన్నదని యర్థము. భవత్తనూనాం – నీ మూర్తులకు. (39)

**శ్రీశుక మహర్షియిట్లనెను**

తా॥ ఈ విధముగా వారి చేత స్తుతింపబడిన గోకులేశ్వరుడైన భగవానుడు, నామ మాత్రముగ ఱోలుకు కట్టబడియున్న కృష్ణుడు నవ్వుచు గుహ్యకులతో నిట్లనెను, (40)

టీ॥ సంకీర్తితః – చక్కగ స్తుతింపబడినవాడై. (40)

**శ్రీభగవానుడిట్లనెను.**

తా॥ "ధనగర్వితులైన మీయిరువురి మాటలచేత మిక్కిలి చలించి, మిమ్మనుగ్రహించిన దయామయుడైన నారదమహర్షిచేత మీ విషయము నాకు ముందే తెలిసినది. (41)

టీ॥ వాగ్భిః – "నహ్యన్యో జుషతో జోష్యాన్" మొదలగు మాటల చేత ధనగర్వముచే బుద్ధిభ్రంశమయిన వారిస్థితిమీద అనుగ్రహించిన వాడై అని. (ధనముచేనైన వారి గర్వప్రవృత్తికి చలించి నారదుడు వారిననుగ్రహించెననియు) (41)

**శ్లో॥** సాధూనాం సమ చిత్తానాం సుతరాం మత్కృతాత్మనామ్ ।
దర్శనాంతో భవేద్బంధః పుంసోఽక్ష్ణో స్సవితుర్యథా ॥ (42)

**తా॥** సత్పురుషులకు, 'సమ'చిత్తులకు, నాయందే మనస్సు నిలిపి యుంచు వారికి - మనుష్యుని కన్నులకు సూర్యుని వెలుగుతో చీకటి తొలగిపోవునట్లు నా దర్శనముతో భవబంధము తొలగిపోవును. (42)

**టీ॥** యుక్తమేవైతదిత్యాహ-సాధూనామితి. సాధూనాం స్వధర్మ వర్తినాం. సమచిత్తానాం ఆత్మవిదాం. సుతరాం మత్కృతాత్మనాం మయ్యర్పితచిత్తానాం. తేషాం కృపాతిరేకాత్సుతరామిత్యుక్తం. సవితు ర్దర్శనాదక్ష్ణోర్యథా బంధోన భవేత్తద్వత్. (42)

**టీ॥** సాధూనాం - స్వధర్మమున వర్తించువారికి - సమచిత్తానాం - ఆత్మవేత్తలకు - సుతరాం - పూర్తిగ -మత్కృతాత్మనాం-నా యందే అర్పించియున్న చిత్తముగల వారికి - వారి యందు అతిశయించిన దయచేత సుతరాం అని చెప్పబడినది. సూర్యుని దర్శనము వలన కన్నులకు వలె చీకటి అడ్డు ఉండని యట్లు - (భవబంధము తొలగును) (42)

**శ్లో॥** తద్గచ్ఛ తం మత్పరమౌ నలకూబర సాదనమ్ ।
సంజాతో మయి భావో వామీప్సితః పరమోఽభవః ॥ (43)

**తా॥** అందువలన ఓ నలకూబరా! (మణిగ్రీవా!) మీరు మత్పరాయణులై (నన్నాశ్రయించియుండి) మీ గృహములకు పొండు. నాయందే మనస్సు కలిగిన వారైయుండుట చేత మీ అభీష్టమగు సంసారరాహిత్యము అను ఉత్తమ స్థితిని పొందగలరు. (43)

**టీ॥** తదితి. ప్రాధాన్యాదేకస్య సంబోధనం. హే నళకూబర. యువాం. తత్తస్మాత్సాదనం సదనం స్వనికేతనం మత్పరమౌ సతౌ గచ్ఛతం. యువయోరపేక్షితో మయి. ప్రేమాజాత ఏవ. అభవః. న భవో యస్మిన్ సః. (43)

**టీ॥** ప్రాధాన్యము వలన (ఇరువురికిని) ఒకని సంబోధనము. ఓ నలకూబర! మీరు - తత్ - అందువలన - సాదనం - సదనం . స్వగృహమును గూర్చి - నన్నాశ్రయించిన చిత్తము గలవారై - వెడలిపొండు. మీయందు ఆపేక్షకలిగి నా యందు ప్రేమ జనించిన

వారై) ప్రేమ కలిగినది కూడ. అభవః - దేని యందు పుట్టుక లేదో అది అభవము - ముక్తి - (43)

**శ్రీశుక ఉవాచ.**

శ్లో॥ ఇత్యుక్తౌతు పరిక్రమ్య ప్రణమ్య చ పునః పునః ।
బద్ధోలూఖల మామంత్ర్య జగ్మతుర్దిశ ముత్తరామ్ ॥ (44)

**శ్రీశుక మహర్షి యిట్లనెను**

తా॥ ఇట్లు కృష్ణుని చేత చెప్పబడిన వారై ఆ యిరువురు గుహ్యకులు ఆతనికి ప్రదక్షిణముచేసి, మఱలమఱల నమస్కరించి ఱోటికి కట్టబడి యున్న ఆ భగవానుని వద్ద సెలవుగైకొని ఉత్తర దిశాభిముఖులై పోయిరి. (44)

టీ॥ ఇతీతి. బద్ధోలూఖలం బద్ధం ఉలూఖలం యస్మిన్ తం. (44)

టీ॥ బద్ధోలూఖలం - కట్టబడిన ఱోలు ఎవనియందో అతనిని (కృష్ణుని) (44)

**శ్రీ మద్భాగవతే, మహాపురాణే దశమస్కంధే,**
**దశమోఽధ్యాయః**

**అని శ్రీమద్భాగవతమున దశమస్కంధమందు**
**పదియవ అధ్యాయము సమాప్తము.**

## ఏకదశోఽధ్యాయః

**శ్రీ బాదరాయణి రువాచ.**

**శ్లో॥** గోపా నందాదయ శ్శ్రుత్వా ద్రుమయోః పతితో రవమ్ ।
తత్ర జగ్ముః కురుశ్రేష్ఠ నిర్ఘాత భయశంకితాః ॥ (1)

**టీ॥** శ్లో. "ఏకాదశే సమాగత్య బృందావనమథార్భకైః, వత్సాన్ పాలయతానేన హతౌ వత్సబకాసురౌ". గోపా ఇతి. నిర్ఘాతో వజ్రపాత ఇతి. భయేన శంకితాః. (1)

**శ్లో॥** భూమ్యాం నిపతితౌ తత్ర దదృశుర్యమళార్జునౌ ।
బభ్రముస్తదవిజ్ఞాయ లక్ష్యం పతన కారణమ్ ॥ (2)

**టీ॥** భూమ్యామితి. తల్లక్ష్యం. ప్రత్యక్షతః పురతో దృశ్యమపి. పతనకారణమవిజ్ఞాయ. బభ్రముః. (2)

**శ్లో॥** ఉలూఖలం వికర్షంతం దామ్నా బద్ధం చ బాలకమ్ ।
కస్యేదం కుత ఆశ్చర్యముత్పాత ఇతి కాతరాః ॥ (3)

## పదకొండవ అధ్యాయము

**శుకమహర్షి యిట్లనెను.**

**తా॥** రాజా! రెండు చెట్లు పడిన ధ్వని విని నందుడు మొదలగు గోపాలకులు, అది పిడుగు పడిన చప్పుడేమో యను భయముతో (శంకించి) అటకుఁబోయిరి. (1)

**టీ॥** పదునొకండవ అధ్యాయమున, గోపాలురు బృందా వనమునకు వచ్చి, దూడలను రక్షించుచున్న కృష్ణునిచేత – పరీక్షిన్మహారాజా! బకాసురులు ఇరువురు చంపబడిరి – నిర్ఘాతః – పిడుగుపాటు అని భయముతో అనుమానించినవారై – (1)

**తా॥** అచట, భూమిపై యమళార్జునులు పడియుండుటను వారు చూచిరి. అటుల పడిపోవుటకు గల కారణమునకు లక్ష్యమెద్దియో తెలియక అవ్యవస్థిత చిత్తులయిరి. (2)

**టీ॥** తల్లక్ష్యం – ప్రత్యక్షముగ కనుల ముందు కనబడుచున్నను – పడిపోయిన కారణమును తెలియనేరక భ్రమించిరి. (2)

**తా॥** త్రాటితో ఱోటికి కట్టబడిన బాలుని – బంధమును విడిపించుకొను ప్రయత్నమున నున్నవానిని చూచి "ఈ పనియెవరిది?

ఈ ఆశ్చర్యకరమైన దుర్ఘటన ఎట్లు, ఎటనుండి సంభవించినది? అని వారు భయపడిరి. భయగ్రస్తులైరి. (3)

**టీ॥** లక్ష్యం కారణం దర్శయతి–ఉలూఖలమితి భ్రమ ప్రకారమాహ. – కస్యేదం రాక్షసాదేః కర్మ. కుతో వా కారణాత్. అహో ఆశ్చర్యం ఉత్పాత ఇతి. కాతరాః భీతాస్సంతో బభ్రమురిత్యర్థః. (3)

**టీ॥** భ్రమ ప్రకారమును చెప్పుచున్నాడు – కస్యేదం? ఎవరైన రాక్షసులు మొదలగువారి కర్మయా? (పనియా) ఏ కారణము వలన జరిగి యుండవచ్చును? అహో! ఇది ఆశ్చర్యము ఇది ఒక ఉపద్రవమే – అని భయపడుచున్నవారై భ్రమించిరని యర్థము. (3)

**శ్లో॥** బాలా ఊచురనేనేతి తిరశ్చీన ములూఖలమ్
వికర్షతా మధ్యగేన నిహతౌ యమళార్జునౌ
వృక్షాభ్యాం నిర్గతౌ దివ్యౌ పురుషౌ వప్యచక్ష్మహి ॥ (4)

**తా॥** అచటి బాలురు, ఈ కృష్ణునిచేత ఱోలు లాగబడుచు, అతడు చెట్లమధ్యకు చేరగానే అది అడ్డముగాతిరిగెను. ఱోలు తాకిడి వలన ఆ రెండు చెట్లు పడిపోయెను, వాని నుండి ఇద్దఱు దివ్యపురుషులు బయలువెడలిరి కూడ. ఇదియంతయు మేము చూచితిమి" అనిచెప్పిరి. (4)

**టీ॥** బాలా ఇతి. మధ్యగేన వృక్షయోర్మధ్యే గతే సతి. పతితా విత్యూచుః . న కేవల మేతావత్ వృక్షాభ్యాం నిర్గతౌ దివ్యౌ పురుషావపి. ఆచక్ష్మహి. దృష్టవంతో వయమితి. (4,5)

**టీ॥** మధ్యగేన – రెండు చెట్లమధ్యకు చేరుకొనగానే – అవి రెండును పడిపోయినవి అని చెప్పిరి. అంతియే కాదు. ఆ రెండు చెట్ల నుండి ఇద్దఱు దివ్యపురుషులు బయటకు వచ్చిరికూడ, మేము చూచితిమి అని. (అచక్ష్మహి – దృష్టవంతః) (4,5)

**శ్లో॥** న తే తదుక్తం జగృహు ర్ఘగటేతేతి తస్య తత్ ।
బాలస్యోత్పాటనం తర్వోః కేచిత్సందిగ్ధ చేతసః ॥ (5)

**తా॥** బాలుర మాటలను వారు విశ్వసింపజాలక పోయిరి. అతని వలన ఆ పని జరిగియుండక పోవచ్చునని వారు భావించిరి. పసివాడు చెట్లను పెకిలించుటను కొందఱు సందేహమనస్కులైరి. (సందేహించిరి) (5)

**శ్లో॥** ఉలూఖలం వికర్షంతం దామ్నాబద్ధం స్వమాత్మజమ్ ।
విలోక్య నందః ప్రహసన్ బంధనా ద్విముమోచ హ ॥ (6)

**తా॥** త్రాడుతో కట్టబడి, ఱోటిని లాగుచున్న తన కొడుకును చూచి నందుడు, నవ్వుచు కృష్ణుని ఱోటి కట్టు నుండి విడిపించెను. (6)

**టీ॥** నేతి. కేవలం తార్కికా జగృహురేవ అన్యే తు సందేహయుక్త చిత్తా బభూవురితి. (6)

**టీ॥** ఆలోచనాపరులు మాత్రము వారిమాటలను స్వీకరించిరి. కాని ఇతరులు సందేహముతో కూడిన చిత్తములు గలవారైరి అని. (ఆలోచనా పరులు అనగా కృష్ణుడు భగవానుడని తెలిపినవాడు.) (6)

**శ్లో॥** గోపీభిః స్తోభితో నృత్యన్ భగవాన్ బాలవత్క్వచిత్ ।
ఉద్గాయతి క్వచిన్ముగ్ధ స్తద్వశోదారుయంత్రవత్ ॥ (7)

**తా॥** గోపస్త్రీల చేత ప్రోత్సహింపబడి భగవానుడైన బాలుడు ఒక్కొక్కప్పుడు నాట్యముచేయును. ఒక్కొక్కప్పుడు పాటలు పాడును. అమాయకముగ వారికి వశుడై కీలుబొమ్మ వలె ప్రవర్తించును. (7)

**టీ॥** జ్ఞాస్యంతే మామితి శంకమానోఽతీవ బాల్యమనుకరోతి స్మ తదాహ. గోపీభిరితి. స్తోభితః కరతాళాదినా ప్రోత్సాహితః. (7)

**టీ॥** – నన్ను గుర్తింతురేమో అను శంకతో మిక్కిలి చిన్నబాలుని వలె ప్రవర్తించుచున్నాడు – అదియే చెప్పుచున్నాడు – స్తోభితః – చప్పట్లు మొదలగు వానితో ప్రోత్సహింపబడినవాడై – (7)

శ్లో॥ బిభర్తి క్వచిదాజ్ఞప్తః పీఠకోన్మాన దారుకాన్ ।
బాహు క్షేపం చ కురుతే స్వానాం చ ప్రీతి మావహన్ ॥ (8)

తా॥ ఒక్కొక్కప్పుడు గోపస్త్రీల చేత ఆజ్ఞాపింపబడి వారికి చిన్న చిన్న పీటలు, కొలత పాత్రలు, కట్టెలు మోసికొని తెచ్చి యిచ్చుచుండును. ఒక్కొక్కప్పుడు తొడ గొట్టుచు తన వారికి ప్రీతి కలిగించుచుండును.(లేక తన వారికి ప్రీతి కలిగించుచు కొరడా ఝుళిపించును) (8)

టీ॥ బిభర్తీతి. ఇదమానయేత్యాజ్ఞప్తః ఆనేతుమసమర్థ ఇవ బిభర్తి. కేవలం పీఠాది. ఉన్మానం ప్రస్థాది. బాహుక్షేపం. కశచాలనం చ తద్విదాం చేతి చకారస్యాన్వయః. (8)

టీ॥ 'ఇది తీసికొని రమ్ము' అని ఆజ్ఞాపింపబడి, తెచ్చుటకు శక్తి చాలని వాని వలె మోసికొని తెచ్చును, కేవలము పీటలు మొదలగునవి. ఉన్మానం – కుంచెము, తవ్వ మొదలగు కొలత పాత్రలు – బాహుక్షేపం – కొరడా ఝుళిపించును. – అది తెలిసిన వారితో అనియు 'చ' కారముతో అన్వయము. (8)

శ్లో॥ దర్శయంస్తద్విదాం లోకేహ్యాత్మనో భృత్యవశ్యతామ్ ।
వ్రజస్యోవాహ వై హర్షం భగవాన్ బాలచేష్టితైః ॥ (9)

తా॥ లోకము నందు కృష్ణపరతత్త్వము నెఱింగియున్న వారికి తన భక్త పరవశత్వమును చూపుచు, వ్రజవాసులకు తన బాల్య లీలలతోను ఆ భగవానుడు ఆనందింపజేయు చుండెను. (9)

టీ॥ దర్శయన్నితి. తదైశ్వర్యం విందంతి యే తేషాం తద్విదాం. ఏవం వ్రజస్య హర్షమువాహేతి. (9–26)

టీ॥ తన ఐశ్వర్యమును (లోక ప్రభుత్వమును) ఎవరు తెలియదురో వారికి – తద్విదాం – ఇట్లే నందగోకులమునకు – ఆనందము కలిగించెను. అని (9 - 26)

**శ్లో॥** గోపీనా మంతికే క్రీడన్ భగవాన్ లోకభావనః ।
క్రీణీధ్వం భో ఫలానీతి వచశ్రుత్వా తు సత్త్వరః ॥ (10)

**తా॥** గోపస్త్రీల యిండ్ల దాపున ఆడుకొనుచున్న లోకభావనుడు, భగవానుడునైన కృష్ణుడు "పండ్లు కొనండోయ్! పండ్లు!" అనెడు పండ్లమ్ముకొనునామె పిలుపు విని, తొందర గల వాడై – (10)

**శ్లో॥** కరాభ్యాం ధాన్య మాదాయ యయౌ సర్వ ఫలప్రదః ।
ఫలవత్యే హి ధాన్యాని మయానీతాని భూరిశః ॥ (11)

**తా॥** తన రెండు చేతులతో ధాన్యమును తీసికొని సర్వఫలములను ఇచ్చువాడగు కృష్ణుడు పరుగెత్తెను. పండ్లమ్ము స్త్రీ వద్దకు పోయి, ఫలములు(ల)గల లక్షణము నందు మక్కువ గలవాడై "మెండుగ ధాన్యమును తెచ్చితిని." (11)

**శ్లో॥** గృహ్ణీష్వ తవ మానేన మానయ త్వం ఫలాని మే ।
ఫలవిక్రయిణీ తస్య వచశ్రుత్వా మహాత్మనః ॥ (12)

**తా॥** నీ కొలత ప్రకారముగ తీసికొనుము. నాకు కొలిచి (లెక్క ననుసరించి) ఫలములిమ్ము అనెను. 'పండ్లమ్మి' మహాత్ముడైన అతని మాటలు విని – (12)

**శ్లో॥** ఆయాంత మరవిందాక్షం కరిపోతమివాగతమ్ ।
ప్రేక్షమానా ముహుః ఫుల్లైర్నయనైరచ్యుతం తదా ॥ (13)

**తా॥** తామర రేకుల వంటి కన్నులు గల వాడును, ఏనుగు పిల్ల వలె వచ్చిన వాడును అయిన అచ్యుతుని, విప్పారిన నేత్రములతో ఆమె మఱల మఱల చూడసాగెను. (13)

**శ్లో॥** ఫల విక్రయిణీ తస్య చ్యుత ధాన్యం కరద్వయమ్ ।
ఫలైరపూరయ ద్రత్నైః ఫలభాండ మపూరితమ్ ॥ (14)

**తా॥** విడిచిపెట్టబడిన ధాన్యముగల అతని రెండు చేతులను, ఆమె ఫలములతో నింపెను. ఇటు ఆమె పండ్ల గంప రత్నములతో నింపబడెను. (14)

శ్లో॥ ఫలానీమాని సర్వాణి గోపీభ్యోఽభ్యదదాత్ప్రభుః ।
వయస్యైర్వ్రజ వీథ్యాం స క్రీడన్ సర్వ ఫల ప్రదః ॥ (15)

తా॥ ఈ ఫలములన్నింటిని ప్రభువైన కృష్ణుడు గోపస్త్రీల కిచ్చి వేసెను. సర్వఫల ప్రదాతయగు బాలకృష్ణుడు తోటి వారితో కలిసి వ్రజ వీధిలో ఆడుకొనుచు - (15)

శ్లో॥ ఉత్తిష్ఠంతౌ ప్రస్ఖలంతౌ చరంతౌ రామకేశవౌ ।
పద్భ్యాం గంతుం శక్నువంతౌ కథంచిత్త్ర్వజాంగణే ॥ (16)

తా॥ కాళ్ళతో నడుచుటకు శక్తిగలవారైన, బలరామ కృష్ణులిరువును పడుచు, లేచుచు, జారుచు, తిరుగుచు, ఆ వ్రజ వీధిలోని ముంగిళ్ళ ముందు నుండి - (16)

శ్లో॥ సరిత్తీర గతం కృష్ణం భగ్నార్జున మథాహ్వయత్ ।
రామం చ రోహిణీ దేవీ చరంతౌ బాలకైర్భృశమ్ ॥ (17)

తా॥ గతమున అర్జున వృక్షములను గూల్చిన కృష్ణుడును, మరియు బలరాముడు తోటి బాలురతో తిరుగుచు, తిరుగుచు యమునా నదీ తీరమునకు చేరగానే రోహిణీదేవి వీరిద్దరిని కేకవేసి పిలిచెను. (17)

శ్లో॥ నోపయాతాం యదాహూతౌ లీలాసంగేన పుత్రకౌ ।
యశోదాం ప్రేషయామాస రోహిణీ పుత్ర వత్సలా ॥ (18)

తా॥ రామకృష్ణ లిరువురును ఆటలయందాసక్తి గలగి యుండుటచే, పిలువ గానే రానందు వలన పుత్రవాత్సల్యము గల రోహిణి, యశోదను పంపెను - (18)

శ్లో॥ క్రీడంతం సా సుతం బాలైరతివేగం సహాగ్రజమ్ ।
యశోదా చాహ్వయద్వీక్ష్య పుత్రస్నేహ స్నుతస్తనీ ॥ (19)

తా॥ యశోద, బాలురతో తన్మయముగ నాడుకొనుచున్న, తన కొడుకును, బలరాముని చూచి, కేకవేసి పిలుచుచుండగనే పుత్ర ప్రేమ వలన ఆమె స్తనములు ద్రవించెను. (19)

**శ్లో॥** కృష్ణ కృష్ణారవిందాక్ష తాత చైహిస్తనం పిబ ।
అలం విహారైః క్షుత్క్షాంతస్తద్భవాన్ భోక్తుమర్హతి ॥ (20)

**తా॥** కృష్ణా! కృష్ణా! తామరరేకుల వంటి కన్నుల వాడా! నాయనా! పాలు త్రాగుదువు గాని రారా! ఇక ఆటలు చాలును. ఆకలితో అలసిపోయి యున్నావు. అన్నము కూడ తిందువు గాని. (20)

**శ్లో॥** హే రామాగచ్ఛ తాతాశు సానుజః కులనందన! ।
ప్రాతరేవ కృతాహారః క్రీడాశ్రాంతోఽసి పుత్రక! ॥ (21)

**తా॥** నాయనా! బలరామా! వంశదీపకుడా! తమ్మునితోకూడా రారా! ప్రొద్దున ఎప్పుడో తిన్నావు – ఆడి ఆడి అలసినావు బిడ్డా! (21)

**శ్లో॥** ప్రతీక్షతే త్వాం దాశార్హ భోక్ష్యమాణో వ్రజాధిపః ।
ఏహ్యావయోః ప్రియం దేహి స్వగృహాన్ యాన్తి బాలకాః ॥ (22)

**తా॥** కృష్ణా! వ్రజాధిపతి (నందుడు) భోజనము చేయుటకు ఉపక్రమించి, నీ రాక కొఱకు ఎదురుచూచుచున్నాడు. రమ్ము! మమ్మానందింప జేయుము. బాలురు తమ యిండ్లకు బోయెదరు. (22)

**శ్లో॥** ధూళి ధూసరితాంగస్త్వం తాత మజ్జన మావహ ।
తింత్రిణీ ఫల సంయుక్తం స్నానీయం తైలసంయుతమ్ ॥(23)

**తా॥** నాయనా! ఒడలంతయు దుమ్ముపట్టియున్నావు. స్నానము చేయుము. చింతపండు, నూనె మొదలగు వానితో సహ నీరు (సిద్ధముగ నున్నది) (23)

**శ్లో॥** కల్పయిత్వా ప్రతీక్షేఽహం చిరం చంచల చేష్టితః ।
జన్మర్క్షం తేఽద్య భవతి విప్రేభ్యో దేహిగా శ్శుచిః ॥ (24)

**తా॥** అన్నియు సిద్ధముచేసి నేను నీ కొఱకు నిరీక్షంచుచున్నాను. చాలాసేపటినుండి నీవు చంచలముగ తిరుగుచు ఆడుచున్నావు. నేడు నీ జన్మనక్షత్రము. స్నానము చేసి బ్రహ్మణులకు ఆవులు దానమీయ వలయును. (24)

శ్లో॥ పశ్య పశ్య వయస్యాంస్తే మాతృమృష్టాన్ స్వలంకృతాన్ ।
త్వం చ స్నాతః కృతాహారో విహరస్వ స్వలంకృతః ॥ (25)

తా॥ నీ స్నేహితులను చూడుము. వారి తల్లులచేత ఎంత శుభ్రముగా స్నానము చేయింపబడి, ఎంత చక్కగా అలంకరింపబడి యున్నారో నీవు కూడ చక్కగా స్నానము చేసి, అన్నము తిని సుందరముగ అలంకరించుకొని, ఆ పైన నిక విహరింతువు గాని. (25)

శ్లో॥ ఇత్థం యశోదా తమశేషశేఖరం
మత్వా సుతం స్నేహ నిబద్ధధీర్నృప! ।
హస్తే గృహీత్వా సహరామ మచ్యుతం
నీత్వా స్వవాటం కృతవత్యథోదయమ్ ॥ (26)

తా॥ రాజా! ఈ విధముగ యశోద, అఖిల సృష్టికిని శేఖరీభూతుడైన కృష్ణుని తన కొడుకని భావించి, ప్రేమతో నిండిన బుద్ధి గలదియై, రామకృష్ణుల నిరువురిని తన చేతులతో పట్టుకొని స్వగృహమునకు కొనిపోయి, అభ్యుదయ కార్యక్రమములు నిర్వర్తించెను. (26)

శ్రీశుక ఉవాచ.

శ్లో॥ గోపవృద్ధా మహోత్పాతా ననుభూయ బృహద్వనే ।
నందాదయ స్సమాగమ్య వ్రజకార్యమ మంత్రయన్ ॥ (27)

శ్రీశుకుడిట్లనెను.

తా॥ "మహావనమున అనేక ఉపద్రవములను అనుభవించి, నందుడు మొదలగు గోపకుల వృద్ధులు ఒక్కచో సమావిష్టులై, వ్రజమున ముందు చేయదగిన పనులను గూర్చి ఆలోచించిరి. (27)

టీ॥ శ్లో. తంతు బృందావనం రంతుమంతః కృష్ణేన యంత్రితాః, స్వతంత్రా ఇవ నందాద్యా మంత్ర మేతమమంత్రయన్. శ్రీధరీయోఽయం శ్లోకః. గోపవృద్ధా ఇతి. వ్రజకార్యం గోకులస్య హిత కృత్యం. (27-30)

టీ॥ విహారార్థమై బృందావనమునకుఁబోఁగోరిన ఆ పెద్దలను కృష్ణుడు లోలోపలనే నియంత్రింపగా నందుడు మొదలగు వారు స్వతంత్రుల వలె ఈ వ్రజకార్యమును గూర్చి ఆలోచింపసాగిరి – ఈ భావముగల శ్లోకము శ్రీధరీయము – వ్రజకార్యం – గోకులమునకు మేలు కలిగించుపని. (27 – 30)

శ్లో॥ తత్రోపనందనామాహ గోపో జ్ఞాన వయోఽధికః ।
దేశ కాలార్థ తత్త్వజ్ఞః ప్రియ కృద్రామ కృష్ణయోః ॥ (28)

తా॥ జ్ఞానము చేతను, వయస్సు చేతను పెద్దవాడును, దేశకాలముల ననుసరించిన ప్రయోజన తత్వమును తెలిసినవాడును, బలరామ కృష్ణులకు హితమును చేయువాడును ఉపనందుడు అను పేరుగల గోపాలకుడు ఇట్లనెను. (28)

శ్లో॥ ఉత్థాతవ్యమితోఽస్మా భిర్గోకులస్య హితైషిభిః ।
ఆయాంత్యత్ర మహోత్పాతాః ప్రజానాం నాశహేతవః ॥ (29)

తా॥ ప్రజలకు, (శిశువులకు) వినాశమును కలిగించు గొప్ప ఉత్పాతము లిచట సంభవించుచున్నవి. అందుచేత గోకులము యొక్క క్షేమమును కోరు మనమందరము ఇచటి నుండి మన నివాసములను మార్చుకొనవలెను." (29)

శ్లో॥ ముక్తః కథంచిద్రాక్షస్యా బాలఘ్న్యా బాలకోఽ ప్యసౌ ।
హరేరనుగ్రహాన్నూన మనశ్చోపరి నా పతత్ ॥ (30)

తా॥ ఈ బాలకుడు (కృష్ణుడు) ఏదో విధముగ ఆ బాలురను చంపు రాక్షసియగు పూతన నుండి తప్పు కొనగలిగెను. విష్ణుని అనుగ్రహమున శకటము కూడ పైన పడలేదు. (30)

శ్లో॥ చక్ర వాతేన నీతోఽయం దైత్యేన విపదం వియత్ ।
శిలాయాం పతితస్తత్ర పరిత్రాత స్సురేశ్వరైః ॥ (31)

తా॥ సుడిగాలి రూపముననున్న రాక్షసునిచేత ఇతడు (కృష్ణుడు) ఆకాశమునకు కొనిపోబడి అచట ఱాతిపై పడద్రోయబడెను. కాని మన దేవేశ్వరులచే రక్షింపబడెను. (31)

టీ॥ చక్రవాతేనేతి. విపదం. వీనాం పక్షిణాం పదం విహారస్థానం. వియత్. విగతప్రతిష్ఠం వా. అపరిచ్ఛిన్నమిత్యర్థః. (31)

టీ॥ విపదం-వీనాం- పక్షులకు విహారస్థానము - వియత్ - లేక అపరిచ్ఛిన్నమని యర్థము. (31)

**శ్లో॥** యన్న మ్రియేత ద్రుమయో రంతరం ప్రాప్య బాలకః ।
అసావన్యతమో వాపి తచ్చాప్యచ్యుత రక్షితమ్ ॥ (32)

**టీ॥** యదితి. అన్యతమో వా కశ్చిద్బాలః అచ్యుతేనైవ రక్షణమాసీత్. (32)

**శ్లో॥** యావదౌత్పాతికోఽ రిష్టో వ్రజం నాభిభవేదితః ।
తావద్బాలా నుపాదాయ యాస్యామోఽ న్యత్ర సానుగాః ॥ (33)

**టీ॥** యావదితి. అరిష్టః అనర్థః. ఇతః స్థానాత్. (33)

**శ్లో॥** వనం బృందావనం నామ పశవ్యం నవ కాననమ్ ।
గోపగోపీ గవాం సేవ్యం పుణ్యాద్రితృణ వీరుధమ్ ॥ (34)

**టీ॥** వనమితి. పశవ్యం పశుభ్యో హితం. నవాని కాననాని స్థలాంత రాణి. విద్యంతే యస్మిన్ తత్. (34.35)

**తా॥** అర్జున వృక్షముల నడుమ చేరిన బాలుడు కాని ఇతరులెవరైన గాని మరణింపకుండిరి. అదియును విష్ణుభగవానుని రక్షణమే. (32)

**టీ॥** అన్యతమో వా. ఇతర బాలుదెవడైనను. అచ్యుతుని చేతనే రక్షణము కలిగెను. (32)

**తా॥** ఉత్పాతముల వలన కలుగు ఆపదలు వ్రజమున సంభవింప కుండునంత వఱకు మనము బాలురను తోడ్కొని యిచటి నుండి వేఱొక స్థలమునకుఁబోవుదము. (33)

**టీ॥** అరిష్టః – అనర్థము. ఇతః – ఈ స్థానము నుండి – (33)

**తా॥** బృందావనమను పేరనొక వనము కలదు. అది క్రొత్త అడవి. పవిత్రమైన కొండలు, పచ్చిక బయళ్ళు, వనస్పతులు గలది. గోపస్త్రీలకు, గోపాలకులకు, ఆవులకును సేవింపదగినది. పశువుల కనుకూలమైనది. (34)

**టీ॥** పశవ్యం – పశువులకు హితమైనది, క్రొత్త అడవులు – స్థలాంతరములు దేనియందుండునో అది – (34,35)

శ్లో॥ తత్త్రాద్యైవ యాస్యామో శకటాన్యుజ్క్షమాచిరమ్ ।
గోధనాన్యగ్రతో యాంతు భవతాం యది రోచతే ॥ (35)

తా॥ అందువలన అచటికి నేడే బయలుదేరుదము. శీఘ్రమే బండ్లు కట్టుడు. ఆవులు ఇతర పశువులను ముందు పోనిండు – మీకందటికిని ఇష్టమైనచో ప్రయాణము కందు. (35)

**శ్రీశుక ఉవాచ.**

శ్లో॥ తచ్ఛ్రుత్వైకధియో గోపాస్సాధుసాధ్వితి వాదినః ।
వ్రజాన్ స్వాన్ స్వాన్ సమాయోజ్య యయూ రూఢపరిచ్ఛదాః (36)

**శ్రీశుకుడిట్లనెను.**

తా॥ ఉపనందుని మాటలు విని, అందఱును ఏకకంఠముగ, 'సరే! సరే! యని తమ తమ గూడెములను ఒక్కచో చేర్చి, శకట వ్యూహములు కూర్చి, వానిపై గట్టి కప్పులు సమకూర్చి, బృందావనమునకు బయలు దేరిరి. (36)

టీ॥ తదితి. ఏకధియః విప్రతిపత్తిరహితాః. వ్రజాన్ శకట వ్యూహాన్ రూఢాః శకటేష్వారోపితాః పరిచ్ఛదాః. యైస్తే. (36)

టీ॥ ఏకధియః – భేదాభిప్రాయములేని వారై – వ్రజాన్ – శకట వ్యూహములను – రూఢాః – శకటములపై కప్పబడిన ఆచ్ఛాదనములు ఎవరి చేతనో వారు – (36)

శ్లో॥ వృద్ధాన్ బాలాన్ స్త్రియో రాజన్! సర్వోపకరణాని చ ।
అనస్స్వారోప్య గోపాలా యత్తా ఆత్త శరాసనాః ॥ (37)

తా॥ ముసలివారిని, పిల్లలను, ఆడువారిని, ఉపకరణములన్నింటిని పూనికతో బండ్లమీదికి ఎక్కించి గోపాలకులు, తాముమాత్రము ధనుర్బాణములు ధరించి (బండ్ల వెనుక నడువసాగిరి) (37)

టీ॥ వృద్ధానితి. యత్తాః కృతప్రయత్నాః. (37 – 38)

టీ॥ యత్తాః – చేయబడిన ప్రయత్నము గలవారై – (37 – 38)

శ్లో॥ గో ధనాని పురస్కృత్య శృంగాణ్యాపూర్య సర్వతః ।
తూర్యఘోషేణ మహతా తే యయుస్స పురోహితాః ॥(38)

తా॥ గో సంపదలను ముందిడు కొని, అంతటను కొమ్ములు పూరించుచు, వివిధ వాద్యముల ఘోషలతోను, పురోహితులతో కూడ ప్రయాణము సాగించిరి. (38)

శ్లో॥ గోప్యో రూఢ రథా నూత్న కుచకుంకుమ కాంతయః ।
కృష్ణలీలాం జగుః ప్రీత్యా నిష్క కంఠ్యస్సువాససః ॥ (39)

తా॥ గోపస్త్రీలు, తమ కుచముల యందు క్రొత్త కుంకుమ పూత వలని శోభ గలవారై, మెడలలో బంగారపు బిళ్లల హారములు ధరించినవారై, సుందరమైన వస్త్రములు ధరించినవారై, శ్రీకృష్ణుని లీలా విలాసములను గానము చేయుచు రథముల నెక్కిరి. (39)

టీ॥ గోప్య ఇతి. నూత్నైః కుచగతైః కుంకుమైః కాంతిర్యాసాం నూత్నేషు కుచేషు యత్కుంకుమం తేనకాంతిర్యాసామితి (39-40)

టీ॥ చన్నవలపై క్రొత్త కుంకుమపూతలతోడి కాంతి ఎవరియందో - కుచములందు ఏ క్రొత్త కుంకుమముగలదో దానితో ప్రకాశము ఎవరియందో - అని. (39 - 40)

శ్లో॥ తదా యశోదా రోహిణ్యావేకం శకటమాస్థితే ।
రేజతుః కృష్ణ రామాభ్యాం తత్కథా శ్రవణోత్సుకే ॥ (40)

తా॥ యశోదా రోహిణులిరువురును కృష్ణబలరాములతోకూడ ఒకే శకటముపై నధిరోహించి, వారికథలను వినుటయందాసక్తి గలవారై ప్రకాశించిరి. (40)

శ్లో॥ బృందావనం సంప్రవిశ్య సర్వకాల సుఖాశహమ్ ।
తత్ర చక్రుర్వ్రజావాసం శకటైరర్ధ చంద్రవత్ ॥ (41)

తా॥ అన్ని కాలముల యందును సుఖములను కలిగించు బృందావనమున ప్రవేశించి వారచట బండ్లను అర్ధ చంద్రాకారముగ నిలిపి, పసుల మందలకును స్థానము లేర్పరచిరి. (41)

**టీ॥** బృందావనమితి. వ్రజావాసం గోకులవసతిస్థానం. (41 -42)

**టీ॥** వ్రజావాసం - గోకులమునకు వసతిస్థానము. (41- 42)

**శ్లో॥** బృందావనం గోవర్ధనం యమునా పులినాని చ ।
వీక్ష్యాసీదుత్తమా ప్రీతీ రామమాధవయోర్నృప! ॥ (42)

**తా॥** పరీక్షిన్మహారాజా! ఆ బృందావనమును, అచటి గోవర్ధనగిరిని, యమునా నదికి అచటచట గల ఇసుక తిన్నెలు మున్నగు వానిని చూచి రామకృష్ణులకు మిక్కిలి ప్రీతి కలిగెను. (42)

**శ్లో॥** ఏవం వ్రజౌకసాం ప్రీతిం యచ్ఛంతౌ బాలచేష్టితైః ।
కలవాక్యై స్స్వ కాలేన వత్సపాలౌ బభూవతుః ॥ (43)

**తా॥** ఇట్లు వ్రజవాసులకు తమ కుఱ్ఱచేష్టలతో, ముద్దుముద్దు మాటలతో కృష్ణబలరాములు ఆనందమును కలిగించుచు కొంత కాలమునకు వారు లేగదూడల సంరక్షకులైరి. (43)

**టీ॥** ఏవమితి. స్వకాలేన తద్యోగ్యకాలేన. (43)

**టీ॥** స్వకాలేన - ఆ పనికి యోగ్యత కలిగిన కాలమునందు.(43)

**శ్లో॥** అవిదూరే వ్రజభువస్సహ గోపాల బాలకైః ।
చారయామాసతుర్వత్సాన్నానా క్రీడ పరిచ్ఛదౌ ॥ (44)

**తా॥** పశువుల కొట్టములకు దగ్గరలోనే, తోటి గోపాల బాలురతో వివిధములగు ఆటలలో మునిగితేలుచునే లేగదూడలను మేపుచుండిరి. (44)

**టీ॥** కౌమారలీలాం నిరూపయతి - అవిదూర ఇత్యాదినా. (44)

**టీ॥** రామకృష్ణుల కుమారావస్థలోని లీలలను నిరూపించుచున్నాడు - 'అవిదూరే' అని మొదలుగ - (44)


ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ
ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

శ్లో॥ క్వచిద్వాదయతో వేణుం క్షిపంతౌ క్షేపణైః క్వచిత్ ।
క్వచిత్పదైః కింకిణీభిః క్షిపతశ్చ క్వచిత్పునః ॥ (45)

తా॥ ఒక్కొక్కప్పుడు పిల్లన గ్రోవిని వాయించుచు, మరియొక్కొక్కప్పుడు మారేడుకాయలు, ఉసిరికాయలు మున్నగు వానిని విసరివేయుచు, ఒక్కొక్కపరి చిరుగజ్జెలుగల కాళ్లతో నేలమీద కొట్టుచు 'తాళమేళ' చేయుదురు. (45)

టీ॥ – క్వచిదితి. క్షేపణైః బిల్వామలకాదిభిః. కింకిణీయుక్తైః పాదైః క్షిపతస్తాడయతః. (45)

టీ॥ క్షేపణైః – మారేడు ఉసిరి మొదలగువానితో – కింకిణీయుక్తైః పాదైః – చిఱుగజ్జెలుగల పాదములతో క్షిపతః – తాడనము చేయువారై– (45)

శ్లో॥ వృషాయ మాణౌ నర్దంతౌ క్వచిత్కృత్రిమ గోవృషైః ।
గోపై రుద్ధాను చరితౌ యుయుధాతే పరస్పరమ్ ॥ (46)

తా॥ గోవృషభాదులవలె ఒక్కొక్కప్పుడు అరచుచు, మరియొక్కొక్కప్పుడు తామే స్వయముగ గోవృషభాదుల వలె (చతుష్పాత్తులను బోలి) నడచుచు, ఒక్కొక్క తడవ తమ తోటి గోపాలకుల ననుకరించుచు, ఒక్కొక్కపరి తమలో తాము కలహించుకొనుచు (46)

టీ॥ వృషాయమాణావితి. వత్సపాలా ఏవ వృషాః కృష్ణకంబళాది పిహితాః వృషానుకారిణో నర్దంతి తైస్సహ స్వయమపి తథైవ వృషాయమాణౌ. నర్దంతౌ తదనుకారిశబ్దాన్ కుర్వంతౌ యుయుధాత ఇత్యర్థః. (46.)

టీ॥ లేగదూడల కాయువారే నల్లని గొంగళ్లు కప్పుకొని ఆఁబోతుల ననుకరించుచు వాని వలె అరచుచు, వానితో వారు కూడ వాని వలె ప్రవర్తించుచుండుట వృషాయమాణౌ. నర్దంతౌ – వాని అరుపులను అనుకరించు శబ్దములను చేయుచు – కలహించిరని యర్థము. (46)

శ్లో॥ చకోర క్రౌంచ చక్రాంగ భారద్వాజాన్ సబర్హిణః
అను రోదితి సత్వాన్ వై భీత వద్వ్యాఘ్ర సింహయోః ।
అనుకృత్య రుతై ర్జంతూంశ్చేరతుః ప్రాకృతౌ యథా ॥ (47)

తా॥ పులి సింహములకు భయపడిన, వెన్నెల పులుగులను, కొంగలను, జక్కవ పక్షులను, ఏట్రింతలను, నెమిళ్ళను, ఇతర జంతువులను అనుకరించుచు రోదన శబ్దములు చేయుచుందురు. జంతువుల ధ్వనులచే ననుసరించుచు పోసాగిరి. (47)

టీ॥ చకోరేతి. రుతైః శబ్దైః. జంతూన్ హంసమయూరాదీన్. (47.48)

టీ॥ రుతైః – శబ్దములచే – జంతూన్ హంసలు, నెమిళ్ళు మొదలగు వానని. (47,48)

శ్లో॥ కదా చిద్యమునాతీరే వత్సాంశ్చారయతోఽర్భకైః ।
వయస్యైః కృష్ణ బలయోర్జిఘాంసుర్దైత్య ఆగమత్ ॥ (48)

తా॥ ఒకప్పుడు యమునా నదీతీరమున బాలురిద్దరు తమ తోటి బాలురతో కూడి లేగదూడలను కాయుచుండగా, కృష్ణ బలరాములిద్దరిని చంపనిచ్ఛతో అచటికి ఒక రాక్షసుడు వచ్చెను. (48)

శ్లో॥ తం వత్సరూపిణం వీక్ష్య వత్సయూథ గతం హరిః ।
దర్శయన్ బలదేవాయ శనైర్ముగ్ధ ఇవాసదత్ ॥ (49)

తా॥ దూడ రూపమున నున్న ఆ రాక్షసుడు దూడల సమూహము లోనికి జొచ్చుటను చూచి, కృష్ణుడు బలరామునకు ఆ విషయమును సైగ చేసి చూపుచు, తాను మెల్లగ ఏమియు నెఱుగని వానివలె ఆ రాక్షసుని సమీపించెను. (49)

టీ॥ తమితి. ముగ్ధ ఇవాజాన న్నివ ఆసదత్ సమీపమాగమత్. (49)

టీ॥ ముగ్ధఇవ – తెలియని వాని వలె – ఆసదత్ – సమీపించెను. (49)

**శ్లో॥** గృహీత్వా పర పాదాభ్యాం సహ లాంగూల మచ్యుతః ।
భ్రామయిత్వా కపిత్థాగ్రే ప్రాహిణోద్గత జీవితమ్ ॥ (50)

**తా॥** దూడ యొక్క (రాక్షసునియొక్క) తోకతో సహ రెండు వెనుక కాళ్ళను పట్టుకొని, వెలగ చెట్టు ముందు గుండ్రముగ త్రిప్పి, వాని ప్రాణము పోవునట్లు వెలగచెట్టుపైకి విసరికొట్టెను.(50)

**టీ॥** గృహీత్వేతి. అపర పాదాభ్యాం సహ లాంగూలం యథా భవతి తథా. గృహీత్వా. (50.51)

**టీ॥** వెనుక కాళ్ళతో కూడ తోక ఎట్లు–అట్లు–పట్టుకొని. (50,51)

**శ్లో॥** స కపిత్థైర్మహా కాయః పాత్యమానైః పపాత హ ।
తం వీక్ష్య విస్మితా బాలా శ్శశంసు స్సాధుసాధ్వితి ॥ (51)

**తా॥** పెద్ద శరీరముగల ఆరాక్షసుడు వెలగచెట్లను పడగొట్టుచు తానును పడిపోయెను. అతనిని చూచి బాలురందఱు ఆశ్చర్యపడుచు, 'బలేబలే' అని ప్రశంసించిరి. (51)

**శ్లో॥** దేవాశ్చోపరి సంతుష్టా వవర్షుః పుష్ప వర్షిణః ।
తౌ వత్సపాలకౌ భూత్వా సర్వ లోకైక పాలకౌ॥ (52)

**తా॥** పైన గలదేవతలు సంతుష్టులై పూలవాన కురిపించిరి. లోకమునకు పాలకులైన ఆ ఇరువురు (రామకృష్ణులు) దూడల కాపరులై ప్రొద్దున (ఉదయమున) అనగా భోజనముచేసినవారై, దూడలను (మేపుచు) కాయుచు తిరుగుచుండిరి. (52)

**టీ॥** – దేవా ఇతి. సర్వేషాం లోకానాం. ఏకౌ ముఖ్యౌ పాలకౌ ప్రాతరాశః ప్రాతర్భోజ్యం అన్నం తేన సహితౌ. (52)

**టీ॥** లోకములన్నిటికి ఒకరేపాలకులై – ప్రాతరాశౌ – ప్రాతః కాలముననే అన్నము గలవారై – (ఉదయముననే ఆహారమును వెంటగొనిన వారై) (52)

**శ్లో॥** స్వం స్వం వత్సకులం సర్వే పాయయిష్యంత ఏకదా ।
గత్వా జలాశయాభ్యాశం పాయయిత్వా పపుర్జలమ్ ॥ (53)

**తా॥** ఒకనాడు గోపాల బాలురందఱు, తమతమ దూడలకు నీరు ద్రావించుట కొఱకు జలాశయ సమీపమునకు బోయి, మొదట దూడలచే నీరు త్రావించి, పిదప వారును నీరు త్రాగిరి. (53)

**టీ॥** -స్వమితి. అభ్యాశం సమీపం. (53-55)

**టీ॥** అభ్యాశం - సమీపము. (53-55)

**శ్లో॥** తే తత్ర దదృశు ర్బాలా మహాసత్త్వమవస్థితమ్ ।
తత్రసుర్వ్రజ నిర్భన్నం గిరేః శృంగమివ చ్యుతమ్ ॥ (54)

**తా॥** బాలకులు అచటనొక పెద్ద జీవమేదో ఉన్నట్లు కనుగొనిరి. అది ఇంద్రుని వజ్రాయుధముతో తెగిపడిన ఒక కొండ కొమ్మువలె నుండెను. (54)

**శ్లో॥** స వై బకో నామ మహానసురో బక రూపధృత్ ।
ఆగత్య సహసా కృష్ణం తీక్ష్ణ తుండోఽ ఉగ్ర సద్బలీ ॥ (55)

**తా॥** అతడు 'బకుడు' అను పేరుతోగల మహారాక్షసుడు. బలశాలి. కొంగ రూపమును ధరించియున్న వాడు. తీక్ష్ణమైన, దృఢమైన (భయంకరమైన) తుండము (నోరు) గలవాడు - ఆతడు హఠాత్తుగ కృష్ణుని వద్దకు వచ్చి - (పట్టుకొనెను.) (55)

**శ్లో॥** కృష్ణం మహాబక గ్రస్తం దృష్ట్వా రామాదయోఽ ర్భకాః ।
బభూవు రింద్రియాణీవ వినా ప్రాణైర్విచేతసః ॥ (56)

**తా॥** ఆ కొంగ (రాక్షసుని) చే పట్టుకొనబడిన కృష్ణుని చూచి బలరాముడు మొదలగు బాలురు ప్రాణము లేని ఇంద్రియముల వలె నిశ్చేష్టులైరి. (56)

**టీ॥** కృష్ణమితి. రామ ఆదిర్యేషాం తే. అతద్గుణసంవిజ్ఞానబహువ్రీహిః తస్మాత్. న తు రామ ఇత్యర్థో బోధ్యః. (56 .57)

**టీ॥** బలరాముడు మొదటి వాడుగ ఎవరికి కలరో వారు - న తు రామః - బలరాముడు మాత్రము కాడు. అతద్గుణ సంవిజ్ఞాన బహువ్రీహి - అని (క్రియాన్వయముతో తెలియబడని అన్యపదార్థము గల బహువ్రీహి) అందువలన- ఇచట బలరాముడను అర్థము బోధ్యము కాదు. (56 - 57)

**శ్లో॥** తం తాలు మూలం ప్రదహంత మగ్నివత్
గోపాల సూనుం పితరం జగద్గురోః ।
చచర్ద సద్యోఽతి రుషా క్షతం బక
స్తుండేన హంతుం పునరభ్యపద్యత ॥ (57)

**తా॥** బకాసురుని దౌడల క్రింది భాగమును అగ్నివలె వేడెక్కించుచున్న వాడును, బ్రహ్మదేవునకు తండ్రియైన వాడయ్యు ఒక గోపాలకునికి కొడుకైన వాడును అయిన కృష్ణుని బకాసురుడు 'ఉడికించెను'. (కృష్ణునిలో కోపమును రగిలించెను) ఆ పైన మిక్కిలి రోషముతో తన నోటితో 'అవినాశి' యగు పరమాత్ముని చంపుటకు ఆతని ముందున కురికెను. (57)

**శ్లో॥** తమాపతంతం స నిగృహ్య తుండయో
ర్దోర్భ్యాం బకం కంససఖం సతాం గతిః ।
పశ్యత్సు బాలేషు దదార లీలయా
ముదావహో వీరణవద్దివౌకసామ్ ॥ (58)

**తా॥** కంసుని స్నేహితుడైన బకాసురుడు మీద పడుచుండగనే సత్పురుషులకు గమ్యుడైన ఆ కృష్ణభగవానుడు తన రెండు చేతులతో అతని చంచువులను ( ముక్కు గల తావులను) ఒడిసి పట్టుకొని బాలురు చూచుచుండగనే, కణుపు లేని గడ్డి పోచను వలె లీలగా అతనిని చీల్చివేసెను. ఆ విధముగా దేవతలకు సంతోషమును గూర్చిన వాడయ్యెను. (58)

**టీ॥** తమితి. తుండయోః చంచ్వోః. వీరణవత్ అగ్రంథి తృణ విశేషవత్. (58)

**టీ॥** తుండయోః – చంచువులతో – వీరణవత్ – గ్రంథులు లేని తృణ విశేషమును వలె. (58)

**శ్లో॥** తదా బకారిం సురలోక వాసిన
స్సమాకిరన్నందన మల్లికాదిభిః ।
సమీడిరే చానక శంఖ సంస్తవై
స్తద్వీక్ష్య గోపాలసుతా విసిస్మిరే ॥ (59)

**తా॥** అప్పుడు దేవతలందఱు నందన వనములోఁబూసిన మల్లెలు మొదలగు పూవులను కృష్ణునిపైన వెదజల్లుచు, నగారాలు, శంఖములు మొదలగు వాద్యములను వాయించుచు, ఆ నాదముల మధ్య అతనిని – బక శత్రువైన కృష్ణుని స్తోత్రము చేసిరి, ఇదంతయును చూచి గోపాల బాలకులు ఆశ్చర్యచకితులైరి. (59)

**టీ॥** తదేతి. సమీడిరే తుష్టువుః. ఆనకైః పటహైః శంఖైః. అన్యైశ్చ సంస్తవైస్సహ.(59)

**టీ॥** సమీడిరే – సంతోషించిరి. ఆనకైః – దుందుభులచే, శంఖముల చేత – ఇతర వాద్యముల చేత – స్తోత్రములతో కూడ. (59)

**శ్లో॥** ముక్తం బకాస్యా దుపలభ్య బాలకం
రామాదయః ప్రాణమివైంద్రియో గణః ।
స్థానా గతం తం పరిరభ్య నిర్వృతాః
ప్రణీయ వత్సాన్ వ్రజమేత్య తజ్జగుః ॥ (60)

**తా॥** బకాసురుడు అను మృత్యుముఖము నుండి విడుదల పొందిన చిన్ని కృష్ణుని చూచి, బలరాముడు మొదలగువారు, ఇంద్రియముల సమూహములతో గూడిన ప్రాణము లేచి వచ్చినట్లు హాయిని పొంది, వారున్న చోటికి వచ్చిన కృష్ణుని ఆలింగనము చేసికొని, ఆ పిమ్మట దూడలను తోలుకొని వ్రజమునకుఁబోయి, జరిగినదంతయు నచటి వారికి చెప్పిరి. (60)

**టీ॥** ముక్తమితి. స్వస్థానమాగతం. ప్రాణమివ కృష్ణం చ. ప్రణీయ ఏకీకృత్య. (60)

**టీ॥** స్వస్థానమునకు వచ్చిన కృష్ణుని ప్రాణము వలె – ప్రణీయ – ఒక్కచో చేర్చి. (60)

**శ్లో॥** శ్రుత్వా తద్విస్మితా గోపా గోప్యశ్చాపి ప్రియాదృతాః ।
ప్రేత్యాగతమి వౌత్సుక్యాదైక్షంత తృషితేక్షణాః ॥ (61)

**తా॥** అది అంతయును విని గోపాలకులు ఆశ్చర్యపడిరి. గోపస్త్రీలును తమకు ప్రేమపాత్రుడైన కృష్ణుని (ఆపద నుండి తప్పుకొని వచ్చుట వలన) ప్రేమతో ఆదరించిరి. పరలోకము నుండి వచ్చిన వాడుగ అతనిని, దప్పిక గొన్నట్లున్న చూపులతో అబ్బురముగ, వారు చూడసాగిరి. (61)

**టీ॥** శ్రుత్వేతి. అతిప్రియేన ప్రీత్యా ఆదృతాః సాదరాః. ప్రేత్యాగత మివ లోకాంతరాదాగతమివ తృషితాన్యతృప్తాని. అమృతం పిబంతీవ ఈక్షణాని యేషాం తే. (61)

**టీ॥** అతి ప్రియేన – మిక్కిలి ప్రీతితో – ఆదృతాః – ఆదరముతో కూడినవారై – ప్రేత్యాగత ᳚మివ – లోకాంతరము నుండి వచ్చిన వానిని వలె – తృషితాని – తృప్తిని పొందని – అమృతమును త్రాగుచున్న వాని వలె చూపులు ఎవరికో వారు. (61)

**శ్లో॥** అహో! బతాస్య బాలస్య బహవో మృత్యవోఽభవన్ ।
అప్యాసీద్విప్రియం తేషాం కృతం పూర్వం యతో భయమ్॥(62)

**తా॥** అయ్యో! ఇది ఆశ్చర్యము! ఈ బాలుడు (కృష్ణుడు) పెక్కుసార్లు మృత్యుముఖమునకు బోయి వచ్చినాడు. అటులైనను వారికి (కంసాదులకు) ద్వేషమట్లే యున్నది. వారు గతమున కూడ బహు విధములుగ మనకు భయమును కలిగించి యున్నారు. (62)

**టీ॥** అహో ఇతి. అహో బతేత్యాదిశ్లోకత్రయస్య ఇతి సందాదయ ఇత్య నేనాన్వయః. అపి ఏవమపి. తేషామేవానిష్టమాసీత్ యతస్తైః. పూర్వమన్యేషాం భయం కృతం. (62)

**టీ॥** అహోబత అని మొదలగు ఈ శ్లోకము నుండి మూడు శ్లోకములకు "ఇతి నందాదయః" అను 65వ శ్లోకముతో అన్వయము – అపి – ఇట్లైనను – వారికే అనిష్టము జరిగెను. అందుచే వారిచేత, పూర్వముకూడ భయకారకములైన కృత్యములు చేయబడెను. (62)

**శ్లో॥** అథాప్యభిభవంత్యేనం నైవ తే ఘోరదర్శనాః ।
జిఘాంసయైన మాసాద్య నశ్యంత్యగ్నౌ పతంగ వత్ ॥ (63)

**తా॥** ఇప్పటికిని ఇతనిని గుఱించి ఇట్టివి జరుగుచున్నవి. కాని అవి భయంకర పరిణామములు గలవి కావు. ఇతని చంపుటకే వచ్చియు నిప్పులో మిడుతల వలె కాలిపోవుచున్నారు. (63)

**టీ॥** అథేతి. అథ ఘోరదర్శనా అపి నాభిభవంతి న ధర్ష యంతి. (63)

**టీ॥** భయంకరముగ కనపడునవే ఐనను – నాభి భవంతి – భయపెట్టుట లేదు. (63)

**శ్లో॥** అహో బ్రహ్మవిదాం వాచో నా సత్యాస్సంతి కర్హిచిత్ ।
గర్గో యదాహ భగవాన్ అన్వభావి తథైవ తత్ ॥ (64)

**తా॥** ఆశ్చర్యము, బ్రహ్మవిదుల మాటలు ఎప్పుడును అసత్యములు కావు. భగవానుడైన గర్గమహర్షి చెప్పినది చెప్పినట్లే జరిగినది కాని మఱియొక విధముగ కాదు. (64)

**టీ॥** అహో ఇతి. గర్గో యదాహ–శ్లో. తస్మాన్నందాత్మజోఽయం తే నారాయణసమో గుణైరిత్యాది. (64,65)

**టీ॥** గర్గమహర్షి చెప్పినది ఇది – "నీకొఱకు ఇతడు నందుని కుమారుడు – గుణములచే విష్ణునితో సమానుడు" అని మొదలగునది. (64,65)

**శ్లో॥** ఇతి నందాదయో గోపాః కృష్ణరామ కథా ముదా ।
కుర్వతో రమ మాణాశ్చ నావిందన్భవ వేదనామ్ ॥ (65)

**తా॥** అని యిట్లు నందుడు మొదలగు గోపాలురు సంతోషముతో బలరామకృష్ణుల కథలను చెప్పుకొనుచు, ఆనందించుచు, సాంసారిక వేదనను పొందకుండిరి. (65)

**శ్లో॥** ఏవం విహారైః కౌమారైః కౌమారం జహతుర్వ్రజే ।
నీడాయనైస్సేతు బంధైర్మర్కట ప్లవనాదిభిః ॥ (66)

**తా॥** ఈ విధముగ కుమారావస్థకు తగిన విహారములతో, దాగుడు మూతల వంటి ఆటలతోను, (పక్షి గూళ్ళ వంటి రహస్య ప్రదేశముల కడకు దాగికొనుట కొఱకు పోవుటవంటి క్రీడలతోను) జలాశయములలో తాత్కాలికమైన ఆనకట్టలు కట్టుటల తోను, కోతుల వలె దుమికెడు వినోదముల తోను బలరామకృష్ణులు తమ కౌమారావస్థను ఆ గొల్లపల్లెలో గడిపిరి. (66)

**టీ॥** వత్స యూథగతం హత్వా వత్సదంభాసురం హరిః, మునియూథగతం చాహన్నగ్రణ్యః దంభినాం బకమ్ । శ్రీధరీయోఽయం శ్లోకః. (66)

**టీ॥** దూడల గుంపులోదూరిన దంభముగల వత్సాసురుని చంపి శ్రీకృష్ణుడు, ముని సమూహమునంజొచ్చిన డాంబికులలో అగ్రగణ్యుడగు బకాసురుని కూడ సంహరించెను. (ఈ భావముగల శ్లోకము శ్రీధరునిది) (66)

**శ్రీ మద్భాగవతే, మహాపురాణే దశమస్కంధే,**
**ఏకాదశోఽధ్యాయః**

**అని శ్రీమద్భాగవతమున దశమస్కంధమందు**
**పదకొండవ అధ్యాయము సమాప్తము.**

## ద్వాదశోఽధ్యాయః

**శ్రీశుక ఉవాచ.**

శ్లో॥ క్వచిద్వనాశాయ మనో దధద్వ్రజా
త్ప్రాతస్సముత్థాయ వయస్య వత్సపాన్ ।
ప్రబోధయన్ శృంగరవేణ చారుణా
వినిర్గతో వత్స పురస్సరో హరిః ॥ (1)

టీ॥ – "ద్వాదశే తు మహాసర్ప వపుర్ధరమఘాసురం, వత్స పాలగిళం క్రుద్ధో గళేఽహన్నితివర్ణ్యతే. మహాబకగళ క్రీడాకేవలస్య న కౌతుకం, ఇతి వాఘాసురముఖే ససఖః ప్రావిశద్ధరిః. క్వచిదితి. క్వచిత్కదాచిత్. వనాశాయ వన ఏవ ప్రథమం భోజనం కర్తుం. (1)

శ్లో॥ తేనైవ సాకం పృథుకాస్సహస్రశ
స్స్నిగ్ధాన్న శిగ్వేత్ర విషాణవేణవః ।
స్వాన్ స్వాన్ సహస్రో పరిసంఖ్య యాన్వితాన్
వత్సాన్ పురస్కృత్య వినిర్యయుర్ముదా ॥ (2)

## పన్నెండవ అధ్యాయము.

**శ్రీశుక మహర్షి యిట్లనెను**

తా॥ ఒకానొక సమయమున కృష్ణుడు వనభోజనము లేర్పాటు చేయదలచి, ఉదయముననేలేచి, శ్రావ్యమైన కొమ్ము వాయించిన నాదముతో తోటి వత్సపాలురగు బాలును నిద్రలేపి, హెచ్చరించి దూడలు ముందునడవగా, వ్రజమునుండి బయలుదేరెను. (1)

టీ॥ – పన్నెండవ అధ్యాయమున గొప్ప సర్పముయొక్క శరీరమును దరించినవాడు, వత్సపాలురను మ్రింగువాడును అయిన అఘాసురుని, మిక్కిలి కోపగించిన కృష్ణుడు, కంఠమునందే కొట్టి, సంహరించెనని వర్ణింపబడును. బకాసురుని గళక్రీడా మాత్రమున కుతూహలములేదు, అని కాబోలును – కృష్ణుడు తన స్నేహితులతోసహా అఘాసురుని నోటిలో ప్రవేశించెను. – క్వచిత్ – ఎప్పుడో ఒకసారి – వనాశాయ – వనమునందే మొదటి భోజనము చేయుటకు – (1)

తా॥ కృష్ణునితో కూడి బాలురనేకులు, నూనె, నేయి తాళింపులుగల అన్నములు, ఉట్లు, బెత్తములు, కొమ్ములు, పిల్లనగ్రోవులును, – తమ తమ, వేల సంఖ్యకు పైబడిన దూడలు ముందు నడవగా, – వెంటగొని సంతోషముగ వ్రజమునుండి బయలుదేరిరి. (2)

టీ॥ తేనేతి. తేనైవ శృంగరవేణ. కృష్ణేన వా. పృథుకాః బాలాః స్నిగ్ధాః. స్నేహయుక్తాః. శిలక్ శిక్యం. రమ్యాః శిగ్వేత్రాదయో యేషాంతే. సహస్రాధిక సంఖ్యాయుక్తాన్ వత్సాన్. (2.3)

టీ॥ - తేనైన - శృంగనాదముచేత లేక కృష్ణునితోకూడ - పృథుకాః బాలురు - స్నిగ్ధాః - నూనె మొదలగు పదార్థములతోకూడిన - శిక్ - ఉట్టి - రమ్యములైన ఉట్లు, బెత్తములు ఎవరికిగలవో వారు - వేయి కంటె ఎక్కువ సంఖ్యతోకూడిన లేగదూడలను - (2,3)

శ్లో॥ కృష్ణ వత్సై రసంఖ్యాతై ర్యూధీకృత్య స్వకాన్ స్వకాన్
గుంజామణి స్వర్ణభూభి ర్విజహ్రుస్తత్ర తత్ర హి. (3)

తా॥ అసంఖ్యాకములైన కృష్ణుని దూడలతో తమ తమ దూడల నన్నింటిని కలిపి ఒక గుంపుగా చేసి ఎఱుపు నలుపు కలిసినవియు, లేత ఎఱుపువన్నెగలవి, పసువు పచ్చనివియునైన (అచ్చుటచ్చుట) భూములద్వారా వానిని తీసికొనిపోవుచుండిరి. (3)

శ్లో॥ ఫల ప్రవాళస్తబక సుమనః పింఛనామభిః
కాచగుంజా మణిస్వర్ణ భూషితాఅప్య భూషయన్. (4)

తా॥ గాజువస్తువులు, గురిజలు మణులు, బంగారు ఆభరణములతో అలంకరింపబడియున్నను, పండ్లు, చిగుళ్లు, పూరిగుత్తులు, పుప్పొడులు, ఈకలు, అనునట్టి వానిచేత అలంకరించుకొనిరి. (అడవిలోని వస్తువులతో అలంకరించుకొనుట వారికి ఇష్టమయ్యెను) (4)

టీ॥ ఫలేతి. కాదిభిః. కాదిభిః. పూర్వం మాతృభిర్భూషితా అపి ఫలాదిభిరాత్మానమభూషయన్నిత్యర్థః. (4)

టీ॥ ఇంతకుముందే తల్లులచేత అలంకరింపబడియున్నను, పండ్లు మున్నగువానిచేత తమనుతాము అలంకరించుకొనిరని యర్థము. (4)

శ్లో॥ ముష్ణంతోఽన్యోన్య శిక్యాదీన్ జ్ఞాతానారాచ్చ చిక్షిపుః ।
తత్రత్యాంశ్చ తతో దూరాద్ధసంతః పునరాదదుః ॥ (5)

తా॥ ఉట్లు, బెత్తములు మొదలగునవి ఒకరివి మరియొకరు దొంగిలించి, దూరముగనున్న తెలిసినవారివైపు విసరివేయుచు కొంత సేపటికి నవ్వుచు దూరమునుండి తెచ్చి యిచ్చుచుండిరి. (5)

టీ॥ ముష్ణంత ఇతి. ముష్ణంతశ్చోరయంతః. (5)

టీ॥ - ముష్ణంతః - దొంగిలించుచున్నవారై (5)

శ్లో॥ యది దూరగతః కృష్ణో వనోద్దేశేక్షణాయుతం
అహంపూర్వమహం పూర్వమితి సంస్పృశ్య రేమిరే. (6)

తా॥ వనసౌందర్యమును చూచు నుద్దేశముతో కృష్ణుడు కొంచెము దూరముగ పోయినప్పుడు, అతనిని తాకివచ్చుటకు 'నేను మొదట', నేను మొదట' అని వాదులాడుకొని, పరుగెత్తి, అతనినితాకి, ఆనందము పొందుచుండిరి. (6)

టీ॥ యదీతి. యది దూరగతః కృష్ణో భవతి తర్హి - (6)

టీ॥ కృష్ణుడు దూరమునకు పోయిఉండి నట్టయినచో - (6)

శ్లో॥ కేచిద్వేణూన్ నాదయంతో ధ్మాంత శృంగాణి కేచన ।
కేచిద్భృంగైః ప్రగాయంతః కూజంతః కోకిలైః పరే ॥ (7)

తా॥ కొందఱు పిల్లనగ్రోవులను వాయించుచు, మఱికొందఱు కొమ్ములనూదుచు, ఇంకనుకొందరు తుమ్మెదలతో కలిసిపాడుచు, కొందఱు కోకిలలతో కూయుచుండిరి. (7)

టీ॥ కేచిదితి. ధ్మాంతః ముఖవాయుం శృంగేషు ఉత్సృజంతః, గాయంతః. వాదయంతః భృంగైస్సహ. (7)

టీ॥ ధ్మాంతః - ముఖవాయువును కొమ్ములలో పూరించుచు. - పాడుచు, వాయించుచు - తుమ్మెదలతోకూడ. (7)

శ్లో॥ విచ్ఛాయాభిః ప్రధావంతో గచ్ఛంతస్సాధు హంసకైః ।
బకైరుప విశంతోఽన్యే నృత్యంతశ్చ కలాపిభిః ॥ (8)

టీ॥ విచ్ఛాయాభిరితి. విచ్ఛాయాభిః పక్షిణాం యాభిః. కలాపిభిః మయూరైశ్చ. (8)

శ్లో॥ వికర్షంతః కీశ వారానారోహంతశ్చ తైర్ద్రుమాన్ ।
వికుర్వంతశ్చ తైస్సార్ధం ప్లవంతశ్చ పలాశిషు ॥ (9)

టీ॥ వికర్షంత ఇతి. కీశవాలాఽ వృక్షశాఖాసు లంబమానాని వానరలాంగులాని వికర్షంతః. లాంగులాన్యముంచతః తైస్సహ ద్రుమానారోహంతః వికుర్వంతః దంతదర్శన భ్రూవిజృంభాదిభిః తైస్సహ వికారాఽ కుర్వంతః. పలాశిషు వృక్షేషు. ప్లవంతః శాఖాయాః శాఖాంతరముద్గచ్ఛంతః. (9)

తా॥ పక్షుల నీడలతో పరుగెత్తెడివారు కొందఱు. సాత్వికములైన హంసలతో నడచువారు కొందఱు. మఱికొందరు కొంగలతో కూర్చుండువారు. మఱికొందఱు నెమిళ్ళతో నృత్యము చేయువారు.(8)

టీ॥ విచ్ఛాయాభిః - పక్షులనీడలతో - కలాపిభిః నెమిళ్ళతోకూడ.(8)

తా॥ కొందఱు కోతుల తోకలు లాగుచుండిరి, కొందఱు ఆ కోతులతో బాటు చెట్లనెక్కుచుండిరి, కొందఱు ఆ కోతులతో వికృత చేష్టలు చేయుచుండిరి, కొందఱు ఆ కోతుల వలె ఒక చెట్టు కొమ్మపై నుండి మరియొక చెట్టుకొమ్మ పైకి దుముకుచుండిరి. (9)

టీ॥ కీశ వాలాన్-వృక్ష శాఖలయందు వ్రేలాడుచున్న కోతుల తోకలను-లాగుచు- తోకలను విడవకనుండినవారై, వానితోకూడ చెట్లనెక్కుచున్నవారై- వికుర్వంతః- ఇకిలించుట, కనుబొమ్మలను విజృంభింపజేయుట మొదలగు వానిచేత, వానితో కూడ వికారములను చేయుచున్నవారై- పలాశిషు - చెట్లయందు - ప్లవంతః-కొమ్మలయొక్క - పైనుండి ఇతరకొమ్మలపైకి ఎగురు చున్నవారై- (9)

శ్లో॥ సాకం భేకై ర్విలంఘంత స్సరిత్తోయ పరిప్లుతాః ।
హసంతశ్చ ప్రతిచ్ఛాయా శ్శపంతశ్చ ప్రతిస్వనాన్ ॥ (10)

తా॥ కప్పలతో కూడా ఎగురుచున్నవారై, నదీజలమున దుముకుచు ఈదులాడుచున్నవారై, తమ ప్రతిబింబములను నీడలను చూచుచు నవ్వుచున్నవారై, తమ ధ్వనులకు ప్రతిధ్వనులు వినబడుచున్నప్పుడు వానిని తిట్టుకొనుచును వినోదించుచుండిరి. (10)

టీ॥ – సాకమితి. ప్రతిచ్ఛాయాః ప్రతిబింబాని హసంతః. (10)

టీ॥ – ప్రతిచ్ఛాయాః – ప్రతిబింబములను – హసంతః – నవ్వుచున్నవారై. (10)

శ్లో॥ ఇత్థం సతాం బ్రహ్మసుఖానుభూత్యా
దాస్యం గతానాం పరదైవతేన ।
మాయాశ్రితానాం నరదారకేణ
సార్ధం విజహ్రుః కృతపుణ్యపుంజాః ॥ (11)

తా॥ ఇట్లు జ్ఞానులకు బ్రహ్మానందానుభూతిగను, దాస్యభక్తిని నెఱపువారికి పరదైవతముగను, మాయతో ఆశ్రయింపబడినవారికి మానవమాత్రుని కుమారనిగను భాసించు కృష్ణునితోసహా, తమ పూర్వజన్మల పుణ్యసమూహములుగల గోపాల బాలురు క్రీడించుచుండిరి. విహరించిరి. (11)

టీ॥ – తానితి విస్మితః శ్లోకద్వయేనాభినందతి–ఇత్థమితి. సతాం విదుషాం బ్రహ్మచ. తత్సుఖం చ. అనుభూతిశ్చతయా స్వప్రకాశ పరమ సుఖేనేత్యర్థః, భక్తానాం పరదైవతేన ఆత్మప్రదేన నాథేన. మాయా శ్రితానాం తు నరదారకతయాప్రతీయమానేన సహ విజహ్రుః. కృతానాం పుణ్యానాం పుంజాః రాశయో యేషాం తే. బ్రహ్మవిదాం తదనుభవ ఏవభక్తానామతిగౌరవేణైవ భజనం ఏతే తు తేన సహ

టీ॥ – విస్మితుడై రెండు శ్లోకములతో అభినందించుచున్నాడు. – సతాం – విద్వాంసులకు – బ్రహ్మము, ఆ సుఖము, ఆ అనుభూతియు – దానిచేత – స్వప్రకాశరూపమైన పరమ సుఖముచేతనని యర్థము. భక్తులకు – పరదైవతేన – ఆత్మప్రదుడైన ఈశ్వరునిచేత – మాయచేత ఆశ్రయింపబడిన వారికి అయినచో మానవ బాలకునిగ కన్పట్టుచున్న వానితో (కృష్ణునితో) విజహ్రుః – క్రీడించిరి. చేయబడిన పుణ్యముల

సఖ్యేన విజహ్రుః. అహో భాగ్యమితి భావః. (11)

యొక్క రాశులు ఎవరికోవారు - బ్రహ్మవేత్తలకు ఆ అనుభవమే - భక్తులకు మిక్కిలి గౌరవముతోడనే అతనిని భజించుట కాని వీరు (ఈ గొల్లపిల్లలు) అతనితోకూడ మైత్రితోవిహరించిరి, ఆహో! అదృష్ట విశేషమని భావము. (11)

శ్లో॥ యత్పాద పాంసుర్బహు జన్మ కృచ్ఛ్ర
ధృతాత్మభి ర్యోగిభిరప్యలభ్యః ।
స ఏవ యద్దృగ్విషయే స్వయం స్థితః
కిం వర్ణ్యతే దిష్టమహో వ్రజౌకసామ్ ॥ (12)

తా॥ అహో! అనేక జన్మలుగా పరిశ్రమించి మనస్సును నిగ్రహించిన యోగులచేత కూడ ఎవని పాదరేణువులు పొందుటకు సాధ్యముకాదో, అతడే స్వయముగ ప్రత్యక్ష విషయముగ స్థితుడైయుండగా నిక వ్రజవాసుల మహాభాగ్యమేమని వర్ణింపగలము? (12)

టీ॥ - యదితి. బహుజన్మభిః. కృచ్ఛ్రేణ ధృత ఆత్మా మనోయైస్తైరపి. (12)

టీ॥ - బహుజన్మభిః - అనేక జన్మలచేత మిక్కిలి కష్టముతో నిగ్రహింపబడిన ఆత్మ - అనగా మనస్సు ఎవరిచే సాధింపబడినదో వారిచే కూడ (అతనిపాద పాంసువులు అప్రాప్యములు) (12)

శ్లో॥ అథా ఘనామాభ్య పతన్మహాసురో
తేషాం సుఖక్రీడన వీక్షణాక్షమః ।
నిత్యం యదంతో నిజ జీవితేప్సుభిః
పీతామృతై రప్యమరైః ప్రతీక్ష్యతే ॥ (13)

తా॥ ఈ సమయముననే అఘాసురుడు అనునొక మహారాక్షసుడు అటకు వచ్చిపడెను. గోపబాలుర యొక్క ఉల్లాసకరమైన ఆటలను వాడు చూడజాలకపోయెను(ఈర్ష్యతో). అమృతమును త్రాగియున్న దేవతలు కూడ, తమ జీవితములు క్షేమముగనుండుటకు కోరుచు, తమలో తాము ప్రతిదినము ఆ రాక్షసుని బాధ తొలగుటకు నిరీక్షించు చుండిరి. (13)

టీ॥ – అథేతి. సుఖక్రీడనవీక్షణే అక్షమా ఈర్ష్యా యస్య సః. కథంభూతః . అతః అంతరం ఛిద్రం. పీతామృతైరపి తతో మృత్యుభీతైరమరైః ప్రతీక్ష్యతే కథం మరిష్యతి. కదా చేతి. యద్వా. కథం భూతం సుఖం. క్రీడనం యత్. అంతర్హృదయే అమరైః ప్రతీక్ష్యతే విచింత్యతే పీతామృతైరపి. నిజజీవితేప్సుభిః. అయం భావః. నామృతపానమాత్రేణ జీవనం సఫలం భవతి. కింతు. భగవల్లీలానుస్మరణేనేతి. తదేవ నిత్యమంతశ్చింత్యత ఇతి. (13)

టీ॥ – సుఖ క్రీడన వీక్షణే అక్షమా. సుఖకరమైనవారి ఆటలను చూచుటకు ఈర్ష్య ఎవనికోవాడు. ఎట్టివాడు? – అంతః – మనస్సు, రంధ్రముతోకూడినవాడు – అమృతమును త్రాగియున్నవారైనను మరణభయముగల దేవతలచేత నిరీక్షింపబడుచున్నది. ఎట్లు చనిపోయెదరు? ఎప్పుడోఅని. లేక – సుఖమెట్టిది? ఏ క్రీడసము (ఆట) గలదో అట్టిది. మనస్సులోన దేవతలచేత ప్రతీక్షింపబడుచున్నది. ప్రతీక్ష్యతే – ఆలోచింపబడుచున్నది. అమృతమును త్రాగినవారిచేకూడ. తమ జీవితముపై ఆశగలవారిచేత–భావమిది. అమృతమును త్రాగి యున్నంత మాత్రమున జీవితము సఫలముకాదు. కాని భగవానుని లీలలను స్మరించుచుండుటచేత అని. అదియే నిత్యము మనస్సులందు చింతింపబడును – అని. (13)

శ్లో ॥ దృష్ట్వార్భకాన్ కృష్ణముఖానఘాసురః
కంసాను శిష్టస్స బకీ బకానుజః ।
అయంతు సోదర్య వినాశ కృత్త
యోర్ద్వయోర్మమైనం సబలం హనిష్యే ॥ (14)

తా॥ పూతనకును, బకాసురునకును తమ్ముడు, కంసునిచే పంపబడినవాడు అయిన అఘాసురుడు కృష్ణుడు మొదలగు వారిని చూచి, ఇతడే (ఈ కృష్ణుడే) మా తో బుట్టువులైన పూతనను, బకాసురుని సంహరించినవాడు. సైన్యసమేతముగా ఇతనిని వధింతును – లేక – బలరామునితో కూడ చంపుదును. (14)

టీ॥ – దృష్ట్వేతి. కృష్ణముఖానర్భకాన్ దృష్ట్వా. స ఇతి వ్యవస్య నిశ్చిత్య. అజగరం వపుర్ధృత్వా. తేషాం గ్రసనాశయా పథి వ్యశేత ఇతి తృతీయేనాన్వయః. కంసేనానుశిష్టః ప్రహితః. బకీ పూతనా. బకః బకాసురః తయోరనుజః. కథం వ్యవస్యేత్యత్రాహ–అయం త్విత్యాదిసార్ధేన. మమ తయోర్ద్వయోః. సోదరయోః స్థానే. ఏవం కృష్ణం సబలం బలరామసహితం. యద్వా. సబలం ససైన్యం వత్స తత్పాలక సహితం హనిష్య ఇత్యర్థః. సకులమితి పాఠే సాన్వయం స్వగృహమితి వా. (14)

టీ॥ – కృష్ణుడు మొదలగు బాలురనుచూచి, సబలం హనిష్యే" అని నిశ్చయించుకొని – పెనుబాము శరీరమును ధరించి వారిని మ్రింగుటకు నాశించి, ఆ ఆశతో త్రోవలో పడుకొని యుండెనను అని అర్థముగల దీనిని కలుపుకొని మూడవ (16) శ్లోకముతో అన్వయము. కంసేన అను శిష్టః – కంసునిచే పంపబడినవాడు – బకీ – పూతన బకాసురః – వారితమ్ముడు. ఎట్లు నిశ్చయించి? ఇటచెప్పుచున్నాడు "అయంత" మొదలుకొనిన సగము శ్లోకముతో – నా యొక్క ఇద్దఱు తోబుట్టువులను అనుస్థానమున – ఇట్లు కృష్ణుని, సబలం – బలరామసహితుని – లేక సబలం – సైన్యముతో కూడినవానిని – దూడలను పాలించువారితోకూడ దూడలను – చంపెదను అనియర్థము. 'సకులం' అనుపాఠమున – వంశముతోకూడ లేక స్వగృహమనియును. (14)

శ్లో॥ ఏతే యదా మత్సుహృదస్తిలాపః
కృతాస్తదా నష్టసమా వ్రజౌకసః ।
ప్రాణేగతే వర్ష్మసు కానుచింతా
ప్రజాసవః ప్రాణభృతోహి లోకే ॥ (15)

తా॥ వీరు నా తోబుట్టువులకు తిలాంజలులైనప్పుడిక వ్రజవాసులు కూడ నశించినట్లే యగుదురు. దేహముల యందలి ప్రాణములు పోయినప్పుడు చింతయేమి? లోకమునందు ప్రాణధారులకు తమ సంతానములే ప్రాణ తుల్యములుగదా! సంతానమే చెఱుకు రసముగా గలవారు ప్రాణధారులు, (15)

టీ॥ - నను తథాపి వ్రజస్థాస్త్వవ శిష్యేరన్ నేత్యాహ - ఏత ఇతి. తిలాపః కృతాః తిలోదకతయా కల్పితాః. వర్ష్మసు దేహేషు. ప్రజా ఏవ అసవో యేషాం తే తథా. (15)

టీ॥ - అట్లయినను వ్రజములోనుండువారు మిగిలియుందురా? ఉండరు అని చెప్పుచున్నాడు. తిలాపః కృతాః - తిలోదకత్వముచే దూపింపబడినవారు. వర్ష్మసు - శరీరములయందు - సంతానమే ఆసవముగా (ప్రాణముగ - చెఱుకు రసముగ) నుండుట యెవరికో వారు అటుల చెప్పబడిరి. (15)

శ్లో॥ ఇతి వ్యవస్యాజగరం బృహద్వపు
స్సయోజనాయామ మహాద్రి పీవరమ్ ।
భిత్వాద్భుతం వ్యాత్త గుహాననం తదా
పథివ్యశేతే గ్రసనాశయాఖలః ॥ (16)

తా॥ అని నిశ్చయించుకొని అతడు ఒక పెద్ద శరీరముగల మహాసర్ప శరీరమును - ఒక యోజనము పొడవు మహాపర్వతమంతటి వైశాల్యమును కలిగియున్న దానిని ధరించి, పెద్ద గుహ వంటి తన నోటిని చీల్చికొని దుష్టుడగు ఆ అఘాసురుడు వారందఱిని మ్రింగివేయు ఆశయముతో త్రోవలో అద్భుతముగ పరుండి యుండెను. (16)

టీ॥ - ఇతీతి. సయోజనాయామం యోజనప్రమాణేన దైర్ఘ్యేణ దేహేన యుక్తం చ. తన్మహాద్రివత్ పీవరం చ. వ్యాత్తం ప్రసారితం. గుహాతుల్యమాననం యస్మిన్ తత్. (16)

టీ॥ - సయోజన+ఆయామం - యోజన ప్రమాణమున పొడవుగల దేహముతోకూడియు - తన్మహాద్రివత్ పీవరంచ - దానికి తగిన మహా పర్వతమువంటి వైశాల్యముకూడ. వ్యాత్తం - ప్రసరింపబడిన గుహతో సమానముగు నోరు దేనియందు గలదో - అది. (యోజనము - నాలుగు క్రోశములు) (16)

శ్లో॥ ధరాధరోష్ఠో జలదోత్తరోష్ఠో
దర్యాననాంతో గిరిశృంగ దంష్ట్రః ।
ధ్వాంతాంతరాస్యో వితతాధ్వ జిహ్వః
పరుషానిల శ్వాస దవేక్షణోష్ణః ॥ (17)

తా॥ నేలను తాకుచున్న క్రిందిపెదవిగలవాడును, మేఘములను తాకుచున్న పైపెదవి గలవాడును, గుహలవంటి నోటి చివరలుగల వాడును, కొండ కొమ్ములను బోలియున్న కోరలుగలవాడును, చీకటితో నిండియున్న నోటి లోపలి భాగము గలవాడును, వెడల్పైన ఎట్టని రహదారివంటి నాలుకగల వాడును తుఫాను గాలి వంటి శ్వాసగల వాడును, దావానలము వంటి కన్నుల వేడిగల వాడును అయి, ఆ మహాసర్పాకృతి ధరించియున్న అఘాసురుడు దారిలోనుండెను. (17)

టీ॥ – అద్భుతమితి. యుదుక్తం తద్దర్శయితుం విశినష్టి–ధరేతి. ధరాయామధరోష్ఠో యస్య సః దర్యావివ ఆననస్యాంతౌ సృక్విణీ యస్య సః. గిరేః శృంగాణేవ దంష్ట్రా యస్య సః. వితతా అధ్వవత్ జిహ్వా యస్య సః. పరుషానిలవత్ ఝుంఝూమారుతవత్ శ్వాసో యస్య సః. ధ్వాంతవదంత రాస్యం యస్య సః. అత్ర వర్ణాధిక్యమార్షం. దవవ దీక్షణయోరుష్ణః దావదృష్టిరిత్యర్థః. పరుషానిల శ్వాసశ్చాసౌ దవేక్ష ణోష్ణశ్చ. తథా. (17)

టీ॥ – భూమి యందు క్రింది పెదవి ఎవనికో వాడు – దర్యానివ ఆననస్యాంతౌ – లోయవలె నోటి చివరలు ఎవనికి గలవో వాడు. కొండ యొక్క కొమ్ములవలె కోరలు ఎవనికో వాడు. చీకటి వలె లోపలి నోరు ఎవనికో వాడు. వెడల్పైన త్రోవ వలె నాలుక ఎవనికో వాడు. తుఫాను గాలి వలె శ్వాస ఎవనికో వాడు – ఇచట అక్షరములు ఎక్కువ అగుట ఆర్షము. దవానలము వంటి కన్నులలోని వేడిమి – వేడిమి గల చూపులు గలవాడని అర్థము. తుఫాను శ్వాస, దవానలపు చూపుల వేడిమి – అటుల. (17)

శ్లో॥ దృష్ట్వాతం తాదృశం సర్వే మత్వా బృందావనశ్రియం
వ్యాత్తాజగర తుండేన హ్యుత్ప్రేక్షంతే స్మ లీలయా. (18)

తా॥ గోప బాలురందఱును, అటుల కనబడుచున్న దానినిచూచి, ఇది యేదో కొండచిలువ యొక్క విప్పారియున్న నోటివలెనున్నదని ఊహించుకొని, ఇది బృందావనమునకు ఒక సంపదయని భ్రమించి లీలగా ఆలోచింపసాగిరి. (18)

టీ॥ – దృష్ట్వేతి. వస్తుతః అజగరతుండమేవ వ్యాత్తం దృష్ట్వా. బృందావనస్య శ్రీః సంపదేవేతి భ్రాంత్యా మత్వా విపరీతం. వ్యాత్తాజగర తుండ సాదృశ్యేనోత్ప్రేక్షితవంతః. (18)

టీ॥ – నిజమునకు కొండచిలువయొక్క తెరచియున్న నోటినే చూచి, బృందావన సంపదగా విపరీతముగ భావించి తెరిచిన కొండచిలువ నోటి సాదృశ్యముగ ఊహించుచుండిరి. (18)

శ్లో॥ అహో మిత్రాణి గదత స్సత్వకూటం పురస్థితమ్ ।
అస్మత్సంగ్రసన వ్యాత్త వ్యాళ తుండాయతేన వా ॥ (19)

తా॥ అహో! మిత్రులారా! మనముందుగల ఈ వస్తువు పర్వత శిఖరము వంటి ఒక 'జీవము'వలె నున్నదికదా! చెప్పుడు. మనలను మ్రింగుట కొఱకు తెరచుకొనిన పెనుబాము నోటిని బోలి వర్తించు చున్నది. ఔనా? కాదా? (19)

టీ॥ – ఉత్ప్రేక్షామేవ ప్రశ్నోత్తరాభ్యాం చాహుః–అహో ఇతి. సత్వకూటం సత్వాభాస మిదం న వా. తత్రాప్యస్మత్సం గ్రసనాయ వ్యాత్తం. యద్వ్యాళతుండం. తద్వదాచరతి వా. న వా. (19)

టీ॥ – ఉత్ప్రేక్షనే ప్రశ్నోత్తరములచే చెప్పుచున్నారు. 'అహో' అని. సత్వకూటం–జీవమువలె భాసించుచున్నది–కదూ! అదియును మనలను మ్రింగుటకొఱకు తెరచిన ఏ పెనుబాము నోరుకలదో దాని వలె వర్తించుచున్నది. వర్తించుచున్నట్లున్నది. ఔనందురా! కాదా! (19)

శ్లో॥ సత్య మర్కకరా రక్తముత్తరా హనువద్ఘనమ్ ।
అధరా హనువద్రోధస్తత్ప్రతిచ్ఛాయయారుణమ్ ॥ (20)

తా॥ సత్యము, సూర్యకిరణములచే అంతటను ఎఱ్ఱనై పైపెదవి ఆయుధమువలె దిట్టముగనున్నది. క్రిందిపెదవి మృత్యువువలె, పైపెదవి నీడతో ఎఱుపువన్నెతో, శ్వాస (వాయు) నిరోధకముగనున్నది. (20)

టీ॥ - నిశ్చితం తథైవేత్యాహ–సత్యమితి. అర్కకరైరారక్తం. ఘనం ఉత్తరోష్ఠవత్పశ్యత. తస్య ఘనస్య ప్రతిచ్ఛాయయా అరుణం రోధః స్థలం అధరోష్ఠవత్పశ్యతేతి సర్వత్రాన్వేతి. (20)

టీ॥ నిశ్చయముగ అటులే అని చెప్పుచున్నాడు - సూర్యకిరణముల చేత అంతటను ఎఱ్ఱనై, దిట్టముగ పైపెదవివలె కనబడుచున్నది. అట్టి దిట్టమైన దానియొక్క నీడవలె ఎఱుపువన్నెతో ఆనకట్ట స్థలమై క్రిందిపెదవివలె కనపడుచున్నదని అంతటను అన్వయించును. (20)

శ్లో॥ ప్రతి స్పర్ధేతే సృక్విభ్యాం సవ్యాసవ్వే నగోదరే ।
తుంగ శృంగాళయో ప్యేతా స్తద్దంష్ట్రాభిశ్చపశ్యత ॥ (21)

తా॥ "కొండ కడుపున కుడి యెడమలకుగల ఈ శృంగముల పంక్తులు, పెదవుల కొసలవలె తోచుచున్నవి ఎత్తైన కొండకొమ్ములు కోఱలతో పోటీ పడుచున్నట్లున్నవి. (అని బాలుడు మరియొకడు వ్యాఖ్యానించెను.) (21)

టీ॥ - ప్రతి స్పర్ధేతే ఇతి. సృక్విభ్యా మోష్ఠప్రాంతాభ్యాం. ప్రతిస్పర్ధేతే తుల్యతయా వర్తేతే. నగోదరే గిరిదర్యౌ తస్య దంష్ట్రాభిః స్పర్ధమానాః. (21)

టీ॥ - సృక్విభ్యాం - పెదవుల చివరిభాగములతో - ప్రతిస్పర్ధేతే - సమానముగనున్నవి. నగోదరే - పర్వతబిలములు, కోరలతో పోటీ పడుచున్నవి. (అటుల కన్పట్టుచున్నవి. చూడుడు) (21)

శ్లో॥ ఆస్తృతా యామ మార్గోఽయం రసనాం ప్రతిగర్జతి ।
ఏషామంతర్గత ధ్వాంతమేతదప్యంతరాననమ్ ॥ (22)

తా॥ (మరియొక గోపబాలుడిట్లు చెప్పుచున్నాడు) మిక్కిలి పొడవుగా వ్యాపించియున్న ఈ దారి కొండచిలువ నాలుకను బోలియున్నది. దీని లోపలి చీకటి - అదియును నోటి లోపలి భాగముతో సరిపోలు చున్నది. ఆస్తృతాయామమార్గః- (22)

టీ॥ - ఆస్తృతేతి. ఆస్తృతాయామమార్గః విస్తృతో దైర్ఘ్యవాన్మార్గః ప్రతిగర్జతి ప్రతిస్పర్థతే. ఏషాం శృంగాణాం. అంతర్గతం మధ్యగతం. ధ్వాంతం. ఏతత్ అంతరాననం ఆననస్య మధ్యం ప్రతి గర్జతి. (22)

టీ॥ - దూరముగ వ్యాపించియున్న పొడవైన త్రోవ - ప్రతిగర్జతి - (నాలుకతో) పోటీపడుచున్నది. ఏషాం శృంగాణాం - ఈ కొండ కొమ్ములయొక్క అంతర్గతం - మధ్యననునట్టి. ధ్వాంతం - చీకటి. ఏతదంతరాననం - ముఖము యొక్క నడిమి భాగమును - ప్రతిగర్జతి - (సరిపోలుచున్నది) (22)

శ్లో॥ దావోష్ణ ఖర వాతోఽయం శ్వాసవద్భాతి పశ్యత ।
తద్దగ్ధ సత్వ దుర్గంధో హ్యంతరామిష గంధవత్ ॥ (23)

తా॥ "కార్చిచ్చు వేడిమిగల తీక్ష్ణమైన ఈ గాలి శ్వాసవలె తోచుచున్నది చూడుడు. ఆ అగ్నివలన కాలిన ఏదో ప్రాణినుండి వచ్చు దుర్వాసన, దాని లోపలి మాంసపు వాసనవలె (మాంసము కాలుచున్న వాసనవలె) నున్నది." అని యింకొక బాలుడనెను. (23)

టీ॥ - దావేతి. దావవదుష్ణః ఖరో వాతోఽయం తేన వనాగ్నినా దగ్ధానాం సత్వానాం యో దుర్గంధః. స ఏవ సర్పస్యాంతర్గతామిష గంధవద్భాతి. (23)

టీ॥ - కార్చిచువలె వేడిమి, తీక్ష్ణమునైన ఈ గాలి - ఆ కార్చిచ్చుచేత కాలిన జీవముల యొక్క ఏ దుర్వాసనగలదో - అదియే కొండచిలువ లోపలనున్న మాంసపు దుర్వాసనవలె తోచుచున్నది. (23)

శ్లో॥ అస్మాన్నివిష్టాన్ గ్రసితా కిమేతా
నయం తథా చేద్బకవద్వి నంక్ష్యతి ।
క్షణాదనేనేతి బకార్యుశన్ముఖం
వీక్ష్యోద్ధసంతః కరతాడనైర్యయుః ॥ (24)

తా॥ "లోనికి ప్రవేశించిన మనను ఇది మ్రింగివేయునా యేమి? అటులైనచో బకాసురునివలె ఇదియును క్షణములో ఇతని చేత నశించిపోవును" అని బకుని జంపిన కృష్ణుని అందమైన ముఖమును చూచి, బిగ్గరగా నవ్వుచు చప్పట్లు చరచుచు వారు ముందుకు సాగిరి. (24)

టీ|| - అస్మాదితి. ఏవం సత్యమేవాజగరం. అన్యథోత్ప్రేక్ష్య నిర్భయాః . యయుః కిం గ్రసితా గ్రసిష్యతి అనేన శ్రీ కృష్ణేన హంత్రా. బకారేః ఉశత్ కమనీయం ముఖం. (24)

టీ|| - ఇట్లు నిజమైన కొండచిలువను మరియొక విధముగ ఊహించుకొని, భయములేనివారై వెడలిరి. కిం గ్రసితా - మ్రింగునా? ఈ శ్రీకృష్ణునిచేత చంపబడిన - బకుని శత్రువు యొక్క - ఉశత్ - అందమైన - ముఖమును - (చూచి). (24)

శ్లో|| ఇత్థం మిథో తద్యమతజ్ఞ భాషితం
శ్రుత్వా విచింత్యేత్య మృషా మృషాయతే ।
రక్షే విదిత్వాஉఖిల భూత హృత్స్థితః
స్వానాం నిరోద్ధుం భగవాన్ మనోదధే ॥ (25)

తా|| ఈవిధముగ (ఒక సత్యమును గుఱించి, అసత్యమును గూర్చి కాని) తెలియని అజ్ఞానులైన గోపబాలకులు తమలో తాము మాట్లాడుకొనిన విషయమును విని, "వీరు ఒక సత్యమును, అసత్యమని భ్రమ పడుచున్నారు" అని చింతించి, ప్రాణులందఱి హృదయములలో (అంతర్యామిగ)నున్న కృష్ణభగవానుడు, తన వారిని లోన ప్రవేశించ కుండ అడ్డుకొనుటద్వారా రక్షించెదను అని భావించెను. (25)

టీ|| - ఇత్థమితి. అమృషా వస్తుతః. సర్పవపుర సుర ఏషః మృషాయతే. స్వానాం సర్పస్యాదృశ్యగోచర త్వేన ప్రతీయత ఇతి విచింత్య. తా న్నిషేద్ధుం వారయితుం. యావన్మనో దధే. తావత్ప్రవిష్టా ఇత్యుత్తరే ణాన్వయః. (25)

టీ|| - నిజమునకు సర్పశరీరమును ధరించిన ఈ రాక్షసుడు మరియొక విధముగ భ్రమింపజేయుచున్నాడు. తనవారికి తన సర్పత్వరూపము కనబడుకుండ వ్యక్తమగుచున్నాడు. అని చింతించి, తాన్ నిషేద్ధుం - వారిని వారించుటకు మనస్సున తలచెను. ప్రవిష్టులగునంత వఱకు' అని తరువాతి శ్లోకముతో అన్వయము. (25)

శ్లో॥ తావత్ప్రవిష్టా స్త్వసురాంత రోదరం
పరం నగీర్ణాః శిశవస్సవత్సాః ।
ప్రతీక్షమాణేన బకారివేశనం
హత స్వకాంత స్మరణేన రక్షసా ॥ (26)

తా॥ గోపబాలురు, దూడలతోకూడ అఘాసురుని కుక్షిలోనికిఁ బోయిరి. కాని అంతవఱకు వారు పూర్తిగ మ్రింగబడలేదు. ఎందుకనగా ఆ రాక్షసుడు, తనవారిని (పూతనను, బకాసురుని) చంపియున్న శ్రీకృష్ణుని గూర్చి ఆలోచించుచు అతని రాక కొఱకు ఎదురు చూచు చుండెను. (అందరిని కలిపి ఒకేసారి మ్రింగవచ్చును కదా యను అభిప్రాయముతో నిరీక్షించుచుండెను) (26)

టీ॥ – తావదితి. ప్రవిష్టా ఏవ పరం కేవలం న తు తేన గీర్ణాః గిలితాః జీర్ణా ఇతి పాఠేఽపి స ఏవార్థః. కథం భూతేన హతయోః అంతః స్మరతీతి తథా తేన. అతఏవ బకారేః శ్రీకృష్ణస్య. ప్రవేశం ప్రతీక్షమాణేన. (26)

టీ॥ – వారు ప్రవేశించియేయుండిరి. అయినను అతనిచేత పూర్తిగ మ్రింగబడక ఉండిరి. 'జీర్ణాః' అను పాఠమునకూడ అదే అర్థము. ఎట్టివానితో చంపబడెనని తలచుచుండెనో అటుల తలచుచున్నవానిచే – అందుచేతనే బకుని శత్రువైన శ్రీకృష్ణుని ప్రవేశమునకు నిరీక్షించు చున్న వానిచేత (అఘాసురునిచేత – మ్రింగబడలేదు) (26)

శ్లో॥ తాన్ వీక్ష్య కృష్ణ స్సకలాభయ ప్రద
స్త్వనన్య నాథాన్ స్వకరాదవచ్యుతాన్ ।
దీనాంశ్చ మృత్యోర్జఠరాగ్ని ఘాసాన్
ఘృణార్దితో దిష్టకృతేన విస్మితః ॥ (27)

తా॥ తాను తప్ప ఇతర రక్షకులులేనివారును, తన చేతినుండి జారిపోయినవారును, దీనులును, మృత్యువుయొక్క జఠరాగ్నికి ఆహారముగుచున్నవారునునైన ఆ గోప బాలురను చూచి, అన్ని విధములుగ అభయమిచ్చువాడును అయిన కృష్ణుడు, కాలముతో చేయబడిన ఈ ఆపదచేత ఆశ్చర్యమును పొందినవాడై, దయతో నిండిన వాడయ్యెను. (27)

టీ॥ - తానితి. స్వకరాదపచ్యుతాన్ వినిస్సృతాన్. విస్మితస్సన్.(27)

టీ॥ - స్వకరాదపచ్యుతాన్ - విడిచి పెట్టబడిన వారిని. ఆశ్చర్యపడుచున్నవాడై - (27)

శ్లో॥ కృత్యం కిమత్రాప ఖలస్య జీవనం
నోవా అమీషాంచ సతాం వినాశమ్ ।
ద్వయం కథం స్యాదితి సంవిచింత్యత
జ్ఞాత్వా విశత్తుండ మశేషదృగ్ఘనః ॥ (28)

తా॥ "ఇప్పుడు ఏమిటి కర్తవ్యము? ఈ దుర్మార్గుని (అఘాసురుని) జీవితము సమాప్తమగుట, ఈ అమాయకులగు గోపబాలురు నాశము కాకుండుటయు అను ఈ రెండును ఒకేసారి ఎట్లు జరుగును?" అని ఆలోచించి - తెలిసికొని - ఆ సకలమును చూచెడు కృష్ణుడు ఆ సర్పముఖమున ప్రవేశించెను. (28)

టీ॥ - కృత్యమితి. కృత్యం కిమత్రేత్యాది విచింత్య తత్రోపాయం జ్ఞాత్వా స్వయమప్యవిశదిత్యన్వయః. కథం విచింత్య. అన్యజీవనం అమీషాం చ విహింసనమితి ద్వయం వై నిశ్చితం. కథం న స్యాదితి. (28)

టీ॥ - ఇచట చేయదగిన కార్యమేమి? అని బాగుగా ఆలోచించి - దానికి ఉపాయమును తెలిసికొని తానుకూడ ప్రవేశించెనని అన్వయము. ఎటుల ఆలోచించి? ఈ రాక్షసుడు బ్రతుకుట - ఈ గోపబాలురు నశించుట అని ఈ రెండును ఎట్లు జరుగకూడదో నిశ్చయించుకొని - (28)

శ్లో॥ తదా ఘనచ్ఛదాదేవా భయాద్ధాహేతి చుక్రుశుః ।
జహృషుర్యే చ కంసాద్యాః కౌణపాస్త్వఘ బాంధవాః ॥ (29)

తా॥ అప్పుడు, మేఘములచాటుననున్న దేవతలు భయము వలన "హా! హా" అని ఆక్రోశించిరి, కంసుడు మొదలగువారును, శవభక్షకులగు రాక్షసులు, (నిర్‌ఋతికి సంబంధించినవారును) అఘాసురుని బంధువులును సంతోషించిరి. (29)

టీ॥ – తదేతి. ఘనచ్ఛదాః మేఘాంతరితాః. కౌణపాః కుణపాశినో రాక్షసాః కోణపో నిర్‌ఋతిస్తదీయా ఇతి వా. (29)

టీ॥ – ఘనచ్ఛదాః – మేఘముల చాటుననున్నవారు (దేవతలు) కాణపాః – కణపములను (శవములను) తినువారు – రాక్షసులు. లేక నిర్‌ఋతియు అతనికి సంబంధించినవారు (29)

శ్లో॥ తచ్ఛ్రుత్వా భగవాన్ కృష్ణ స్త్వవ్యయ స్సార్భవత్సకమ్ ।
చూర్ణీ చికీర్షో రేవాదౌ తరసా వవృధే గళే ॥ (30)

తా॥ ఆ దేవతల హాహాకార ధ్వనివిని భగవానుడు, అవ్యయుడునైన కృష్ణుడు – తనను, లేగదూడలను గోపబాలురను, చూర్ణముగా నమిలి మ్రింగదలచిన అఘాసురుని కంఠబిలమునందు, (మొదట) వేగిరముగా తన శరీరమును పెంచెను. (30)

టీ॥ తదితి. సార్భవత్సకమాత్మానం. చూర్ణీకర్తుమిచ్ఛోస్తస్య గళే ఆదావేన తరసా వవృధే అవర్ధత. (30)

టీ॥ దూడలతో, బాలురతోసహా తనను, పిండిపిండిగా చేయుటకు నిచ్ఛయించు అఘాసురునియొక్క కంఠనాళమునందు మొదటనే తొందరగా పెరిగిపోయెను. (30)

శ్లో॥ తతోఽతి కాయస్య నిరుద్ధ మార్గిణో
హ్యుద్గీర్ణ దృష్టేర్భ్రమత స్త్వితస్తతః ।
పూర్ణోంతరంగే పవనో నిరుద్ధో
మూర్ధన్ వినిర్భిద్య వినిర్గతో బహిః ॥ (31)

తా॥ అప్పుడు మిక్కిలి పెద్దశరీరముగలవాడును, కృష్ణుని శరీరముచే అడ్డగింపబడిన మార్గముగలవాడును బయటకు పొక్కుచున్న కనుగ్రుడ్లు గలవాడును, అటునిటు కదలుచున్న వాడును అయిన అఘాసురుని దేహమధ్యమున అడ్డగింపబడిన వాడైన వాయువు (ప్రాణవాయువు) నిండి బ్రహ్మరంధ్రమును ఛేదించుకొని ఆ రాక్షసుని శరీరమునుండి బయటకు వెడలిపోయెను. (31)

టీ॥ - తత ఇతి. నిరుద్ధో ముఖాదీనాం మార్గభూతః కంఠో యస్య తస్య. యద్వా. నిరుద్ధౌ మార్గౌ ప్రాణోచ్ఛ్వాసరంధ్రే అస్య స్త ఇతి వా. ఉద్గీర్ణదృష్టేర్బహిర్నిర్గతలోచనస్య. అంతరంగే దేహ మధ్యే. పూర్ణః పరిభృతః మూర్ధన్ మూర్ధః. జిలోప ఆర్షః. బ్రహ్మరంధ్రం వినిర్భిద్య. బహిర్గత ఇతి. (31)

టీ॥ - నిరుద్ధః - ముఖము మున్నగువానియొక్క మార్గమువంటి కంఠము ఎవనికో వానికి - లేక ఇతనిగల ప్రాణోచ్ఛ్వాస రంధ్రములు నిరోధింపబడిన మార్గములు గలవి కాగా - అని - యో ఉద్గీర్ణదృష్టేః - బయటకు వచ్చుచున్న కన్నులుగలవాని యొక్క - అంతరంగే - శరీరముయొక్క మధ్య భాగమునందు - పూర్ణః - నిండి, మూర్ధన్ - శిరస్సు మధ్య భాగమున - జిలోపము ఆర్షము, బ్రహ్మరంధ్రమును ఛేదించి - బహిర్గత ఇతి - బయటకు వచ్చెను అని. (31)

శ్లో॥ తేనైవ సర్వేషు (ప్రాణేషు) బహిర్గతేషు
ప్రాణేషు సర్వాన్ సుహృదః పరేతాన్ ।
దృష్ట్వా స్వయోత్థాప్య తదన్వితః పునః
వక్త్రాన్ ముకుందో భగవాన్ వినిర్యయౌ ॥ (32)

తా॥ అతని చేతనే అఘాసురుని ప్రాణములన్నియు బయటకు పోవగా, భగవానుడైన ముకుందుడు చనిపోయిన తన స్నేహితులను (దూడలను కూడ) చూచి స్వయముగ వారిని లేవనెత్తి, మఱల బ్రతికించి, వారందఱితో కూడి (అఘశరీరమునుండి) బయటకు వచ్చెను. (32)

టీ॥ - తేనేతి. ప్రాణేషు ఇంద్రియేషు. స్వయా అమృతవర్షిణ్యా దృష్ట్యైవ. (32)

టీ॥ - ప్రాణేషు - ఇంద్రియములయందు తనదైన అమృతమును వర్షించు చూపుచేతనే - (32)

శ్లో॥ పీనాహిభోగోత్థిత మద్భుతం మహ
జ్జ్యోతి స్స్వ ధామ్నోజ్జ్వలయద్ది శోదశ ।
ప్రతీక్ష్య ఖేఽవస్థిత మీశనిర్గమం
వివేశ తస్మిన్ మిషతాం దివౌకసామ్ ॥ (33)

టీ॥ - పీనేతి. అహి దేహోత్థితం శుద్ధసత్త్వమయం జ్యోతిర్నిర్గతం. ఖే-వస్థితం. తస్మిన్నేవ ఈశే. వివేశ. (33)

తా॥ స్థూలమైన ఆ కొండచిలువ శిరస్సునుండి లేచిన అద్భుతమైన గొప్ప తేజస్సు తన చోటునుండి పది దిక్కులకును ప్రసరించెను. అంతటను తన కాంతులు విరజిమ్మెను. ఆకాశముననున్న కృష్ణుని, వెడలి పోవుటను గూర్చి యొకింత తడవు నిరీక్షించి, దేవతలు చూచు చుండ అతనిలో ప్రవేశించెను. (33)

టీ॥ - పాము శరీరమునుండి లేచిన శుద్ధ సత్వమయమైన కాంతి బయటకు వచ్చెను. ఆకాశమునందున్న - ఆ ఈశ్వరుని లోననే ప్రవేశించెను. (33)

శ్లో॥ తతోఽతి హృష్టా స్స్వకృతో కృతార్హణం
పుష్పైస్సురా అప్సరసశ్చ నర్తనైః ।
గీతైస్సుగా వాద్యధరాశ్చ వాద్యకైః
స్తవైశ్చ విప్రా జయ నిస్స్వనైర్గణాః ॥ (34)

టీ॥ - తత ఇతి. స్వకృతః స్వకార్యకృతః. శ్రీకృష్ణస్యార్హణం. ఆకృతపూజా మకుర్వన్ సుష్ఠు గాయంతీతి సుగాః గంధర్వాదయః. (34)

తా॥ ఆ సమయున మిక్కిలి సంతోషించినవారై దేవతలు పుష్ప వర్షములచే పూజించిరి. అప్సర స్త్రీలు తమ నాట్యముల చేతను, గంధర్వులు పాటలచేతను, విద్యాధరులు తమ వాద్యములను వాయించుటతోను, బ్రాహ్మణులు స్తోత్రములతోను, పార్షదులు జయ జయ ధ్వానముల చేతను శ్రీకృష్ణభగవానునభినందించిరి. (34)

టీ॥ - స్వకృతః - తమ పనిగ భావించినవారై - శ్రీకృష్ణుని పూజను - చేయని పూజను చేసినవారై, చక్కగా పాడువారు సుగాః - గంధర్వులు మొదలగువారు - (34)

శ్లో॥ తదద్భుత స్తోత్ర సువాద్యగీతికా
జయాద్యనే కోత్సవ మంగళస్వనాన్ ।
శ్రుత్వాస్వధామ్నోంత్యజ ఆగతోఽ చిరా
ద్దృష్ట్వా మహీశస్య జగామ విస్మయమ్ ॥ (35)

టీ॥ – కించ. తదితి. తేషాం యాన్యద్భుతస్తోత్రాదీని. నైకోత్సవాః అనేకోత్సవాః యే మంగళస్వనాః. తాన్ స్వధామ్నః అంతి సమీపే. శ్రుత్వా. అజో బ్రహ్మా. ఆదరాదాగతః ఈశ్వరస్య శ్రీకృష్ణ. మహిమానం దృష్ట్వా. విస్మయం ప్రాపేతి. (35)

*శ్రీశుక ఉవాచ.*

శ్లో॥ రాజన్నాజగరం చర్మ శుష్కం బృందావనేఽద్భుతమ్ ।
వ్రజౌకసాం బహుతిథం బభూవాక్రీడ గహ్వరమ్ ॥ (36)

తా॥ ఆ గొప్పనైన స్తోత్రములు, శ్రావ్యమైన వాద్య ధ్వనులు, వినుటకు సొంపైన పాటలు, జయజయ ధ్వనులు, మొదలైన ఉత్సవసంరంభముల శుభనాదములను తన నివాసస్థానము నుండియే విని బ్రహ్మదేవుడు శ్రీఘ్రముగవచ్చి ఆఉత్సవమును, పరమేశ్వరుడైన కృష్ణునికి సంబంధించిన అభినందనలును చూచి ఆశ్చర్యమును పొందెను. (35)

టీ॥ – వారియొక్క అద్భుతములైన స్తోత్రములు మొదలగునవి ఏవికలవో – నైకోత్సవాః – అనేకములైన ఉత్సవములు. ఏ మంగళ ధ్వనులు గలవో వానిని – స్వధామ్నః – తన భవనము యొక్క అంతి – సమీపమున – శ్రుత్వా – విని. అజః బ్రహ్మదేవుడు – ఆదరముతో వచ్చెను. శ్రీకృష్ణని యొక్క మహిమను చూచి ఆశ్చర్యమును పొందెను అని – (35)

*శ్రీశుక మహర్షి యిట్లనెను*

తా॥ రాజా! ఆ చనిపోయిన కొండచిలువకు సంబంధించిన చర్మము ఎండిపోయి బృందావనమున ఒక అద్భుత వస్తువుగ నేర్పడెను. వ్రజమునందున్నవారికి అది అనేక దినములు ఆటలాడుకొను ఒక గుహవలె ఉపయోగపడెను అని శ్రీశుకుడు చెప్పసాగెను. (36)

టీ॥ – రాజన్నితి. బహుతిథం బహుకాలం క్రీడగహ్వరం అక్రీడార్థ మహాబిలం. (36)

టీ॥ – బహుతిథం – పెక్కుకాలము. క్రీడాగహ్వరం – వినోదక్రీడకు ఒక సొరంగము (మహాబిలము) (36)

శ్లో॥ ఏతత్కౌమారకం కర్మ హరేరాత్మాహి మోక్షణమ్ ।
మృత్యోః పౌగండకే బాలా దృష్ట్వోచుర్విస్మితా వ్రజే ॥ (37)

తా॥ ఇది శ్రీకృష్ణుని కుమార దశలోనిపని – అది సాంసారిక వృత్తిలో నుండిన జీవాత్మయగు సర్పమునకు (అఘాసురునికి ముక్తిని ప్రసాదించుట, చనిపోయిన గోపబాలురకు, దూడలకు మృత్యుస్థితి నుండి విడుదల కలిగించుట ద్వారా వారికి జీవనమును అనుగ్రహించుట – బాలురీ విషయములను చూచియున్న వారగుటచే తమ పౌగండక దశయందు (ఆఱునుండి పది సంవత్సరములలోపున గల వయస్సు) ఆశ్చర్యముతో – అప్పుడే చూచుచున్నట్లు వ్రజమునందు చెప్పిరి. (37)

టీ॥ – అన్యచ్చాతివిచిత్రం వృత్తమిత్యాహ–ఏతదితి. శ్లో. కౌమారం పంచమాబ్దాంతం పౌగండం దశమావది, కైశోరమాపంచదశాద్యౌవనం తు తతః పరం. హరేః కౌమారజం పంచమాబ్దకృతం కర్మ తథైవ దృష్ట్వా పైగండకేష్షష్ఠే౽బ్దే. బాలా అద్యైవ తద్వృత్తమిత్యూచుః కిం తత్కర్మ మృత్యోస్సకాశా దాత్మనాం. అహేశ్చ మోక్షణం ఆత్మనాం ప్రసిద్ధాత్ మృత్యోః. అహేస్తు సంసారలక్షణాత్. అఘాసురస్య జ్యోతిష్యః శ్రీకృష్ణే ప్రవేశమపి తదా దృష్టం కథివంతిత్యర్థః. (37)

టీ॥ – మఱియొక అతి విచిత్రమైన సన్నివేశమని చెప్పుచున్నాడు. "ఐదు సంవత్సరముల సమాప్తివఱకు కౌమారము – అచటినుండి పది సంవత్సరములవఱకు పౌగండము. (పదునైదు సంవత్సరముల వఱకు కైశోరము) ఆ తరువాత వచ్చునది యౌవనము." శ్రీకృష్ణుని కుమారదశయందలి అనగా ఐదవసంవత్సరమున చేసిన పనిని, అటులేచూచి, పౌగండకే – ఆఱవ సంవత్సరమున – బాలాః – బాలురు, నేడే అది జరిగినది అన్నట్లుగ చెప్పిరి. ఆపని ఏది? జీవులకు మృత్యువు సన్నిహితమే ఐయుండగా – జీవులకు మృత్యువుయొక్క

ప్రసిద్ధివలన - సర్పమునకు మోక్షమిచ్చుట - సర్పమునకు సంసార లక్షణము వలన - అఘాసురునియొక్క జ్యోతిస్సు శ్రీకృష్ణుని యందు ప్రవేశించుట అటులనే చూడబడిన దానిని చెప్పిరి అని అర్థము.(37)

శ్లో॥ నైతద్విచిత్రం మనుజార్భమాయినః
పరాపరాణాం పరమస్య వేధసః ।
అఘో–పి తత్స్పర్శన ధూత పాతకః
ప్రాపాత్మ సామ్యంత్వ సతాం సుదుర్లభమ్ ॥ (38)

తా॥ మనుష్య బాలకుని రూపముననున్న పరమేశ్వరుడును, వ్యక్తావ్యక్త పదార్థముల రూపముననున్న సమస్తమైన సృష్టికి కర్తయునగు కృష్ణప్రభువు యొక్క ఇట్టి కర్మ విచిత్రమైన దేమియు కాదు. అఘాసురుడును, ఆతని స్పర్శ మాత్రమున విడువబడిన పాపములు గలవాడై (శుద్ధుడై) సామాన్యులకు (అసత్పురుషులకు) శ్రమించినను లభింపజాలని స్వస్వరూపమును పొందెను. (38)

టీ॥ - నేతి. నైతద్విచిత్రం. కిం తదిత్యపేక్షాయామాహ–అఘోఽపీతి. ఆత్మ సామ్యం స్వసమానరూపతాం. (38)

టీ॥ - ఇది విచిత్రముకాదు. అదియేది అను ఆకాంక్షతో చెప్పు చున్నాడు. "అఘః + అపి"అని. ఆత్మ సామ్యం - స్వ సమాన రూపత్వమును. (38)

శ్లో॥ సకృద్య దంగ ప్రతి మాంతరాహితాం
మనోమయీాం భగవతీం దదౌ గతిమ్ ।
స ఏవనిత్యాత్మ సుఖాను భూత్య భి
వ్యదస్త మాయోఽంతర్గతో హి కిం పునః ॥ (39)

తా॥ ఒక్కసారి ఆభగవానుని అంగములతో ప్రతిమనుచేసి అందులో నతనిని ప్రతిష్ఠచేసినచో అది మనసున నిండిపోయిన భగవత్సం బంధమైన స్థితిని ప్రసాదించును. అతడే నిత్యమైన ఆత్మానందమును అనుభవింపజేయును. లోపలనున్న మాయను అశేషముగ తొలగించి వేయును. ఇకనేమి కావలెను? (39)

టీ॥ – సకృదితి. యస్యాంగం మూర్తిః. తస్య ప్రతిమా ప్రతికృతిః తత్రాపి కేవలం మనోమయీ. సాపి బలాదంతరాహితా సతీ భాగవతీం గతిం దదౌ. ప్రహ్లాదాదిభ్యః స ఏవ సాక్షాత్స్వయమంతర్గతః. కింపునః నిత్యాచాసావాత్మ సుఖానుభూతిశ్చ తయా. అభితో వ్యుదస్తా మాయా యేనః సః. (39)

టీ॥ – ఎవని అంగము – మూర్తి – తస్యప్రతిమా – ప్రతికృతి అదియును కేవలము మనోమయమైనది. అదియును దృఢముగా లోననుంచబడుచుండగా భగవత్సంబధమైన గతిని అనుగ్రహించెను. ప్రహ్లాదుడు మొదలగువారి కొఱకు అతడే స్వయముగ, సాక్షాత్తుగ లోనప్రవేశించెను. శాశ్వతమైన సుఖానుభూతిచేత దాపునగల మాయ ఎవనిచే పారంద్రోలబడునో వాడు– (39)

### శ్రీసూత ఉవాచ.

శ్లో॥ ఇత్థం ద్విజాగ్ర్యాదధ దేవదత్తః
శ్రుత్వా స్వభర్తుశ్చరితం విచిత్రమ్
పప్రచ్ఛ భూ యోఽపి తదేవ పుణ్యం
వైయ్యాసికిం యన్నగృహీతచేతాః. (40)

### శ్రీసూత మహర్షియిట్లనెను

తా॥ "ఈవిధముగ శుకమహర్షిచేత, పరీక్షిత్తు, తన ప్రభవైన కృష్ణభగవానుని విచిత్రమైన చరిత్రమునువిని, వశీకృతుడైన మనస్సుతో ఆ పుణ్యచరిత్రమునే శుకమహర్షిని మఱల అడిగెను. (40)

టీ॥ – ఇత్థమితి. దేవదత్తః పరీక్షిత్. ద్రౌణ్యస్త్రేణ దగ్ధోఽపి భగవతా శ్రీకృష్ణేన దత్తత్వాత్. యేన శ్రవణేన నితరాం గృహీతం వశీకృతం చేతో యస్య సః. యద్వా. భగవతి. నిగృహీతం నియమితం చేతో యస్యేతి వా. (40)

టీ॥ – దేవదత్తుడు పరీక్షిత్తు – (తల్లియగు ఉత్తర గర్భమున నున్నప్పుడే అశ్వత్థామ ప్రయోగించిన బ్రహ్మశిరోనామకాస్త్రముచే నితడు దగ్ధుడయ్యెను. ఉత్తర, శ్రీకృష్ణుని ప్రార్థింపగా ఆతనిని తిరిగి బ్రతికించెను.) అశ్వత్థామయొక్క అస్త్రముచే దగ్ధుడైయును కృష్ణభగవానుని చేత మఱల ఈయబడిన వాడగుటచే దేవదత్తుడయ్యెను – ఏది వినుటచేత – నితరాం గృహీతం – పూర్తిగ వశీకృతమైనచేతః (మనస్సు) ఎవనికోవాడు. (పరీక్షిత్తు) లేక భగవానునియందు – నిగృహీతం – నియమితమైన మనస్సు ఎవనికో అనియును. (40)

విష్ణురాత ఉవాచ.

శ్లో॥ బ్రహ్మన్! కాలాంతర కృతం తత్కాలీనం కథం భవేత్ ।
యత్కౌమారే హరికృతం విదు పౌగండుకేఽర్భకాః ॥ (41)

టీ॥ – బ్రహ్మన్నితి. కాలాంతరే కౌమారే కృతం పౌగండా కథం జ్ఞాత్వా. ఊచురిత్యర్థః. (41.42)

శ్లో॥ తద్బ్రూహి మే మహాయోగిన్! పరం కౌతూహలం గురో! ।
నూనమేతద్ధరే రేవ మాయాభవతి నాన్యథా ॥ (42)

శ్లో॥ వయం ధన్యతమా లోకే గురోపి క్షత్రబంధవః ।
యత్పిబామో ముహుస్త్వత్తః పుణ్యం కృష్ణకథామృతమ్ ॥ (43)

విష్ణురాత మహర్షి యిట్లనెను

తా॥ బ్రాహ్మణోత్తముడవైన ఓశుకదేవా! ఎప్పుడో వేఱొక కాలమున చేయబడినది తత్కాలమున జరిగినదిగా ఎట్లగును? ఏలయన కుమారావస్థలో కృష్ణుడుచేసిన ఆ పనిని గోపబాలకులు తమ తరువాతి వయస్సున అనగా ఆఱునుండి పది సంవత్సరముల వయస్సు వఱకు గల పౌగండకావస్థలో తెలిసికొనిరి! అప్పుడే జరిగినట్లు జ్ఞాపకముంచుకొనిరి! (ఆశ్చర్యము కదా!) (41)

టీ॥ – కాలాంతరే – కౌమారమున చేయబడినది ఆఱునుండి పది వయస్సునగలబాలురు ఎట్లు తెలిసికొని చెప్పగలిగిరి అని యర్థము. (41,42)

తా॥ యోగీశ్వరా! గురుదేవా! మిక్కిలి కుతూహలము కలిగించునట్టి యావిషయమును నాకు చెప్పుము. కృష్ణుని చిత్తౌన్నత్యమే మాయ యగును. కాని మఱియొక విధముకాదు. (ఆయన ఉత్కృష్ట ప్రభావమే మాయ!) (42)

తా॥ గురూత్తమా! పాపిష్ఠులమైనను మేము లోకమునందు మిక్కిలి ధన్యులము. ఏలయన మీవలన, పుణ్యమును కలిగించు కృష్ణుని కథయనెడు అమృతమును గ్రోలుచుండిమి. (43)

టీ॥ - వయమితి. హే గురో, క్షత్రబంధవోఽపి పాపిష్ఠా ఆపీత్యర్థః (43)

టీ॥ - ఓ గురువర్యా! క్షత్తబంధవో-పి - పాపిష్ఠులమైనను అని యర్థము. (43)

*శ్రీసూత ఉవాచ.*

శ్లో॥ ఇత్థం స్మపృష్టస్సతు బాదరాయణి
స్సంస్మారి తానంత హృతాఖిలేంద్రియః ।
కృచ్ఛ్రాత్పునర్లబ్ధ బహిర్దృశ శ్శనైః
ప్రత్యాహతం భాగవతోత్తమోత్తమ ॥ (44)

శ్రీసూత మహర్షి యిట్లనెను

తా॥ ఉత్తమ భక్తులలో నుత్తమ భక్తుడవగు ఓ శౌనక మహర్షీ! ఈవిధముగ పరీక్షిన్మహారాజుచేత ప్రశ్నింపబడిన శుకయోగీంద్రుడు, భగవానుని గాఢముగ స్మరించుచుండుటచే అతని సర్వేంద్రియములను బాహ్యస్మృతిని కోల్పోయి అంతర్ముఖములయ్యెను, మిక్కిలి శ్రమతో అపారవశ్యమునుండి మరల బహిర్దృష్టినిపొంది మెల్లగా పరీక్షిత్తు అడిగిన ప్రశ్నకు సమాధానముచెప్పెను. (44)

టీ॥ ఇత్థమితి. తేన యః స్మారితోఽనంతః తేన హృతాన్యఖిలేంద్రియాణి యస్య సః తథాభూతోఽపి కథం చిల్లబ్ధ బహిర్దృష్టిః. హే భాగవతోత్తమోత్తమ శౌనక. (44)

టీ॥ - అతనిచే ఏ అనంతుడు స్మరింపబడెనో ఆ అనంతునిచేత అతని సర్వేంద్రియములు అపహరింపబడెను. ఇట్టి స్థితి ఎవనికి గలదో ఆతడు (శుకుడు) అట్లయియును ఏదోవిధముగ బహిదృష్టినిపొందినవాడయ్యెను - ఓ భాగవతోత్తములలో ఉత్తముడా! (44)

**శ్రీ మద్భాగవతే, మహాపురాణే దశమస్కంధే, ద్వాదశోఽధ్యాయః**

**అని శ్రీమద్భాగవతమున దశమస్కంధమందు పన్నెండవ అధ్యాయము సమాప్తము.**

## త్రయోదశోఽధ్యాయః

శ్రీశుక ఉవాచ.

శ్లో॥ సాధుపృష్టం మహాభాగ త్వయా భాగవతోత్తమ ।
యన్నూతనయసీశస్య శృణ్వన్నపి కథాం ముహుః ॥ (1)

టీ॥ – "త్రయోదశేఽహరద్బ్రహ్మా వత్సాన్ పాలాంశ్చ మాయయా, తదా తత్సర్వరూపోఽబ్దం కృష్ణ పూర్వవదాచరత్" సాధ్వితి. నూతనయసి నవీకరోషి. (1)

శ్లో॥ సతామయం సారభృతాం నిసర్గో
యదర్థవాణీ శ్రుతిచేతసామపి ।
ప్రతిక్షణం నవ్యవదచ్యుతస్య యత్
స్త్రియా విటానామివ సాధువార్తా ॥ (2)

టీ॥ – సతామితి. తథాహి. సారభృతాం సార గ్రాహిణాం అయం నిసర్గః స్వభావః కోఽసౌ అచ్యుతస్య వార్తా ప్రతిక్షణం సాధు నవ్యవద్భవతీతి యత్ సః విటానాం స్త్రైణానాం. స్త్రియాః కామిన్యాః

## పదునాలుగవ అధ్యాయము

**శ్రీశుకమహర్షియిట్లనెను**

తా॥ "భక్తాగ్రణీ! భాగ్యశాలీ! లెస్సగా నడిగితివి. ఈశ్వరుని కథను మఱల మఱల వినుచును (ఇట్లడగుచుంటివనగా) దానికి క్రొత్తదనమును సమకూర్చుచున్నావు. (1)

టీ॥ – పదమూడవ అధ్యాయమున బ్రహ్మ! దూడలను, గోపబాలురను మాయతోగొని పోయెను. అప్పుడు ఆ సర్వరూపుడగు కృష్ణుడు సంవత్సరములోగా వారికి తిరిగి తీసికొనివచ్చి యథా పూర్వముగ ఆచరించెను, – నూతనయసి – క్రొత్తవిగ చేయుచున్నావు. (1)

తా॥ భగవానుని గుఱించిన ఈ ప్రయోజనవంతము, అర్థవంతము నైన ఏ వాక్కుగలదో అవి బ్రహ్మవిదులకు, రస హృదయులకు స్వాభావికముగనున్నను, శ్రవణాసక్తులకు మాత్రము స్త్రీచే పంపబడిన అనుకూలమైన వార్త, భోగాపేక్షులకు వలె ప్రతిక్షణము క్రొంగ్రొత్త విషయముగ భాసించుచుండును. (2)

టీ॥ – అది యుక్తమే – సారభృతాం – సారమును గ్రహించు వారలకు – అయం నిసర్గః–ఇది స్వభావమే –అదిఏది – కృష్ణుని వర్తనము. ప్రతిక్షణమును ఒప్పిదమే. క్రొత్తగ ఏదిఉండునోఅది. విటానాం –

వార్తేవ కథం భూతానామపి సతాంయత్. యా. అచ్యుతస్య వార్తైవ అర్థో యేషాం తాని వాణీ శ్రుతిచేతాంసి యేషాం. తథా భూతానామపి. (2-4)

స్త్రీసుఖమును కోరువారికి - స్త్రీయాః - కామినియొక్క వర్తనమువలె - కథం భూతానామపి సతాం యత్. సత్పురుషు లెట్టివారైనను. - యా అచ్యుతస్యవార్తైవ - ఏభగవానుని వర్తనమువలె - అర్థోయేషాం - ప్రయోజనమెవరికో - తాని వాణీశ్రుతి చేతాంసి. అట్టి వాక్కు వినగోరు హృదయములు - యేషాం ఎవరికి గలవో - తథా భూతానామపి -అట్టి వారికి కూడ. (2-4)

శ్లో॥ శృణుష్వావహితో రాజన్నపి గుహ్యం వదామి తే ।
బ్రూయుస్స్నిగ్ధస్య శిష్యస్య గురవో గుహ్యమప్యుత ॥ (3)

తా॥ రాజా! సావధానుడవై వినుము. రహస్యమేయైనను నీకు చెప్పెదను. గురువులు తమ ప్రియశిష్యు(లకు)నకు రహస్యమైనను చెప్పెదరు కూడ. (3)

శ్లో॥ తదాఘ వదనాన్మృత్యో రక్షిత్వా స్వార్భవత్సకాన్ ।
సరః పులినమానీయ భగవానిదమబ్రవీత్ ॥ (4)

తా॥ అప్పుడు మృత్యురూపమైన అఘాసురుని నోటి నుండి తన గోప బాలురును, దూడలను రక్షించి యమునానది యొక్క ఇసుక తిన్నె పైకి తోడ్కొని వచ్చి కృష్ణుడిట్లనెను. (4)

*శ్రీభగవానువాచ*

శ్లో॥ అహోఽతిరమ్యం పులినం వయస్యా
స్స్వకేళి సంపన్మృదులాచ్ఛవాలుకమ్ ।
స్ఫుట త్సరోగంధ హృతాళి పత్రిక
ధ్వని ప్రతిధ్వాన లసద్ద్రుమాకులమ్ ॥ (5)

*శ్రీభగవానుడిట్లనెను*

తా॥ ఆహా! మిత్రులారా! ఈ ఇసుక తిన్నెఎంతో అందముగనున్నది. మన ఆటలు ఉత్సాహవంతముగ ఆడుకొనుటకు మెత్తని శుభ్రమైన ఇసుక కలిగియున్నది. వికసించుచున్న ఈ యమునా సరస్సులోని సువాసనల చేత ఆకర్షింపబడిన తుమ్మెదల యొక్క, చిన్న పక్షుల

టీ॥ - భోజనవిధానాయ పులినం స్తౌతి- అహో ఇతి. స్వీయానాం కేళీనాం. సంపదో విద్యంతే యస్మిన్ తత్. మృదులాః అచ్ఛాః వాలుకా యస్మిన్ తత్. కించ, స్ఫుటత్ వికసత్. సరః సరోబాబహుళ్యేన ఉపచారతః సర ఏవ వికసదిత్యుక్తం. తస్య గంధస్తేన హృతః ఆకృష్టాః అళయః పత్రిణశ్చ. తేషాం కే ఉదకే ధ్వనయః. తేషాం ప్రతిధ్వానాః తైర్లసంతో ద్రుమాస్తైరాకులం వ్యాప్తం. (5)

శ్లో॥ అత్రభోక్తవ్య మస్మాభిర్దివారూఢం క్షుధార్దితాః ।
వత్సాస్సమీపేఽపః పీత్వాచరంతు శనకైస్తృణమ్ ॥ (6)

టీ॥ - అత్రేతి. దివా దినం ఆరూఢం ప్రవృద్ధం. భోజనవేళా అతీతేత్యర్థః (6)

యొక్కయు నాదములతో ప్రతిధ్వనించుచుండు నవనవలాడు చెట్లతో చెదురుగానిండియున్నది. (5)

టీ॥ - భోజనపద్ధతికై తెన్నెను పొగడుచున్నాడు. స్వీయానాం కేళీనాం - సొంత ఆటలకు సంతదో విద్యంతే యస్మిన్ -తత్ - అనుకూల్యములు దేని యందు గలవో - అది - మెత్తని స్వచ్ఛమైన ఇసుక దేని యందు గలదో అది - మరియు స్ఫుటత్ - వికసించుచున్న - సరః - నీటిమడుగు - అనేక మడుగులుండుటచే ఔపచారికముగ మడుగే వికసించుచున్నదని చెప్పబడినది. దాని పరిమళముచేత హృతాః - ఆకర్షింపబడిన తుమ్మెదలు, పక్షులుకూడ. దానియొక్క-కే- నీటియందు - ధ్వనయః - నాదములు - వాని యొక్క ప్రతిధ్వనులు - వాని చేత నొప్పుచున్న చెట్లు-వానిచేత-ఆకులం - వ్యాపించియున్నది. (5)

తా॥ ఇచట మనము భోజనము చేయుదము. ప్రొద్దెక్కినది, ఆకలిగొని యున్నాము. దూడలు సమీపముననే నీరుద్రావి మెల్లగా గడ్డి మేయు చుండును గాక. (6)

టీ॥ - దివా - దినము - ఆరూఢం - పెరిగినది, భోజనవేళ దాటినదని యర్థము. (6)

శ్లో॥ తథేతి పాయయిత్వార్భా వత్సానారుధ్య శాద్వలే ।
ముక్త్వా శిక్యాని బుభుజుస్సమం భగవతా తదా ॥ (7)

తా॥ 'సరే!' అని గోపబాలురు దూడలకు నీరుద్రావించి వానిని లేత కసవుగల ప్రదేశమున జేర్చి, ఉట్లువిప్పి (ఉట్లలోని చద్దిమూటలు విప్పి) అప్పుడు కృష్ణునితో కలిసి భోజనముచేసిరి. (7)

టీ॥ తథేతి ఆరుధ్య సంరుధ్య శాద్వలే హరితతృణదేశే. (7)

టీ॥ ఆరుధ్య - నింపివేసి - శాద్వలే - పచ్చని గఱికతో నిండిన ప్రదేశమున. (7)

శ్లో॥ కృష్ణస్య విష్వక్పురురాజిమండలై
రభ్యాననాః పుల్ల దృశో వ్రజార్భకాః ।
సహోపవిష్టాః పులినే విరేజుశ్ఛదా
యథాంభోరుహ కర్ణికాయాః ॥ (8)

తా॥ కృష్ణుని చుట్టును అనేకములైన వరుసలతో వర్తులాకారముగ, కృష్ణునికి అభిముఖముగానుండునట్లు ఎడము లేకుండునట్లు - గోప బాలకులు వికసించిన చూపులతోకూడి కూర్చొనియుండిరి. ఆ ఇసుక తిన్నెమీద, కృష్ణుని చుట్టు - తామర బొద్దు చుట్టును అందమైన తామర ఱెక్కల వలె వారు ప్రకాశించిరి. (8)

టీ॥ - కృష్ణస్యేతి. తదా తే విరేజుః కృష్ణస్య విష్యక్ పరితః. పురురాజిమండలైః బహుభిః పఙ్క్తిమండలైస్సహ-నైరంతర్యేణోపవిష్టాః శ్రీకృష్ణాభిముఖాన్యాననాని యేషాం తే. పుల్లదృశో వికసిత నయనాః. కమల కర్ణికాయాః పరితః పత్రాణి. యథేతి. (8)

టీ॥ - తదా తే విరేజుః-అపుడు వారు ప్రకాశించిరి. కృష్ణస్య విష్వక్- కృష్ణుని చుట్టును, పురురాజమండలైః - అనేకములైన మండలాకారములగు వరుసలతోకూడ - ఎడము లేకుండునట్లు కూర్చొనిరి. శ్రీకృష్ణునికి అభిముఖముగ (ఎదురుగ) ఎవరిముఖములు ఉండెనో వారు. పుల్లదృశః - వికసించిన చూపులు గలవారై-తామరబొద్దు చుట్టును రెక్కలున్నయట్లు . అని. (8)

శ్లో॥ కేచిత్పుష్పైర్దళైః కేచిత్పల్లవై రంకురైః ఫలైః ।
శిగ్భిస్త్వగ్భిర్దృషద్భిశ్చ బుభుజుః కృతభాజానాః ॥ (9)

టీ॥ కేచిదితి. పుష్పైస్తద్దళైః అన్యైశ్చ పత్రైః. కృతాని భాజనాని యైస్తే. 9

శ్లో॥ సర్వేమిథో దర్శయం తస్స్వం స్వాం భోజ్యరుచిం పృథక్ ।
హసంతో హాసయంతశ్చాభ్యవజహ్రుస్సహేశ్వరాః ॥ (10)

టీ॥ - సర్వ ఇతి. రుచిం స్వాదువిశేషం. అభ్యవజహ్రుః బుభుజిరే సహేశ్వరాః శ్రీకృష్ణసహితాః. (10)

శ్లో॥ బిభ్రద్వేణుం జఠర పటయో శ్శృంగవేత్రే చ కక్షే
వామేపాణౌ మసృణ కబళం తత్ఫలాన్యంగులీషు ।
తిష్ఠన్ మధ్యే స్వపరి సుహృదోహాసయన్నర్మభిస్తైః
స్వర్గేలోకే మిషతి బుభుజే యజ్ఞభుగ్బాలకేళిః ॥ (11)

తా॥ కొందఱు పువ్వులతో, కొందఱు దళములతో, కొందఱు చిగురు టాకులతో, కొందఱు మొలకలతో కొందఱు పండ్లతో, కొందఱు చెట్లనారతో కొందఱు వెడల్పు ఱాళ్లతోను, కొందఱు పండ్లతొక్కలతోను భోజనపాత్రలు సిద్ధముచేసికొని, చేసికొని భోజనముచేసిరి. (9)

టీ॥ పువ్వులతో - వాని రెక్కలతో ఇతరమైన ఆకులతోను చేయబడిన పాత్రలు ఎవరి చేతనో వారు. (9)

తా॥ అందఱును ఏకాంతముగ వారివారి భోజనము యొక్క రుచులను విడి విడిగా చుట్టుప్రక్కల వారికి చూపుచు, నవ్వుచు నవ్వించుచు ప్రభువైన కృష్ణునితో కలసి భోజనములను సాగించిరి.(10)

టీ॥ - రుచిం - స్వాదుత్వ విశేషమును -అభ్యవజహ్రుః - భుజించిరి. కృష్ణునితో కూడి. (10)

తా॥ పిల్లనగ్రోవిని, కట్టుకొనిన వస్త్రమునకును, కడుపునకును మధ్యభాగమున నమర్చుకొని ఎడమ చంకలో కొమ్ము వాద్యము, బెత్తెమును అదిమిపట్టుకొని, ఎడమ చేతి యందు చిక్కని పెరుగన్నపు ముద్దను, వ్రేళ్లపై ఆ అన్నమునకు కావలసిన నిమ్మ, ఉసిరి మొదలగు

ఫలముల పచ్చళ్లును పట్టుకొని, సకలయజ్ఞముల భోక్తయైన శ్రీకృష్ణుడు, తనచుట్టును ఉన్న గోప బాలుర మధ్యన నిలబడి, తన హాస్యపు మాటలతో వారిని నవ్వించుచు, బాలక్రీడా వశుడై, స్వర్గలోకమునందలి దేవతలు (ఆశ్చర్యముగ) చూచుచుండగా భోజనము చేసెను. (11)

టీ॥ – బిభ్రదితి. యజ్ఞభుగపి. తేషు బుభుజే బాలానామివ కేళిర్యస్య సః తదాహ–ఉదరవస్త్రయోర్మధ్యే వేణుం బిభ్రత్ దధాన ఇతి సర్వత్రాన్వయః. వామ ఇతి కాకాక్షిన్యాయాత్ కక్షపాణ్యోర్విశేషణం. మసృణం. స్నిగ్ధం దధ్యోదన కబళం. తదుచితాని బిల్వామలకాదిఫలాని. అంగులీషు అంగులీ సంధిషు. కర్ణికేవ సర్వాభిముఖో మధ్యే తిష్ఠన్. స్వపరి స్వస్య పరితః. ఉపవిష్టానిత్యర్థః. సుహృదః. సైర్వర్నర్మభిః పరిహాసవాక్యైః స్వర్గే స్వర్గ నివాసిని జనే ఆశ్చర్యేణ మిషతి పశ్యతి సతి. లోకే ఇహ. వత్సప జనానాం మధ్యే బుభుజే. (11.12)

టీ॥ యజ్ఞ భోక్తయైనను వారియందుకలిసి భోజనము చేసెను. బాలురకువలెనే క్రీడ యెవనికోవాడు. అది చెప్పుచున్నాడు. కడుపు, కట్టుకొనిన వస్త్రములమధ్య వేణువును బిభ్రత్ – ధరించెనని అంతట అన్వయము. 'వామ' అని. కాకాక్షి న్యాయమువలన చంక, చేయి అనువానికి విశేషణము. మసృణం – మిసిమిగల (చిక్కని) పెరుగన్నము ముద్ద – దానికి తగిన మారేడు – ఉసిరి మొదలగు పండ్లు (వాని పచ్చళ్లు) అంగులీషు – వ్రేళ్ల కణుపుల యందు. దుద్దువలె అందఱికిని అభిముఖుడై – నడుమ నిలబడి – స్వపరి – తన చుట్టును – కూర్చొనియున్నవారిని అని యర్థము. స్నేహితులను తన నర్మభిః – పరిహాస వాక్యములతో – పర్గే – స్వర్గలోకముననున్న దేవతలు ఆశ్చర్యముగా మిషతి – చూచుచుండగ – లోకే – ఇహలోకమున – గోపాలుర నడుమ భుజించెను. (11,12)

శ్లో॥ భారతైవం వత్సపేషు భుంజానేష్వచ్యుతాత్మసు ।
వత్సాస్త్వంతర్వనే దూరం వివిశుస్తృణ లోభితాః ॥ (12)

తా॥ పరీక్షిద్రాజా! ఈ విధముగ కృష్ణుడే ఆత్మగాగల గోపబాలురురు తినుచుండగా దూడలు గడ్డిక మేయునాసక్తిగలవియై దూరమునగల అడవి నడుమకు ప్రవేశించెను. (12)

శ్లో॥ తానదృష్ట్వా భయత్రస్తానూచే కృష్ణోఽస్యభీ భయమ్
మిత్రాణ్యాశాన్మా విరమత హ్యేనేష్యే వత్సకానహమ్. (13)

తా॥ రాజా! "దూడలను గానక భయ భీతుడైన గోపాలబాలకుల నుద్దేశించి, విశ్వభయములన్నియు తన భయమే అయిన కృష్ణుడు ఇట్లనెను. ప్రియమిత్రులారా! మీరు భోజనము చేయుట ఆపకుడు, నేను దూడలను తోడ్కొని వచ్చెదను. (13)

టీ॥ - తానితి. భీభయం భయహేతుభ్యో భయం. అస్య అపాస్య నిరస్యేత్యర్థః. యద్వా. అస్య విశ్వస్యభియోపి భయం యః. శ్రీకృష్ణః. ఆశాత్ భోజనాత్. అత్రాక్షరాధిక్యమార్షం. (13)

టీ॥ - భీభయం - భయకారణములచే కలుగు భయము - అస్య - అపాస్య - తొలగించి - లేక - అస్య - విశ్వముయొక్క - భయముకూడ ఎవనిభయమో అట్టి శ్రీకృష్ణుడు - ఆశాత్ - భోజనమునుండి - ఇచట అక్షరమెక్కువయగుట ఆర్షము. (మా 'విరమత' అనుచోట ఒక అక్షరము ఎక్కువైనది. అది ఆర్షము. 'ఆర్షత్వాత్సాధుః' అనిప్రసిద్ధము.) (13)

శ్లో॥ ఇత్యుక్త్వాద్రి దరీకుంజ గహ్వరేష్వాత్మ వత్సకాన్ ।
విచిన్వన్ భగవాన్ కృష్ణస్సపాణి కబళోయయౌ ॥ (14)

తా॥ అని చెప్పి కొండలు, లోయలు, చెట్ల గుబురులు, గుహలు మొదలగు ప్రదేశములలో లేగదూడలను వెదకుచు, చేతిలోని పెరుగన్నపు ముద్ద తోడనే కృష్ణుడు బయలుదేరెను. (14)

టీ॥ – ఇతీతి. అద్రిషు తద్దరీషు కంజేషు లతాదిపిహితోదరవివరేషు. గహ్వరేషు సంకటస్థానేషు చ. (14)

టీ॥ – అద్రిషు తద్దరీషు – కొండలయందు, కొండగుహల యందును – కుంజేషు – తీగలు మొదలగువానితో కప్పబడిన అడవి నడిమి దారులయందు (బిలములందు). గహ్వరేషు – చొరరాని ప్రదేశముల యందును. (14)

శ్లో॥ అంభో జన్మజనిస్త దంతరగతో మాయార్భ కస్యేశితు
ర్ద్రష్టుం మంజు మహత్త్వ మన్యదపి తద్వత్సానితో వత్సపాన్ ।
నీత్వాన్యత్ర కురూద్వ హాంతర దధాత్తే–వస్థితో యః పురా
దృష్ట్వాఽఘాసుర మోక్షణం భగవతః ప్రాప్తః పరం విస్మయమ్॥ (15)

తా॥ ఓ పరీక్షిన్నృపాలా! బ్రహ్మదేవుడు తన మనస్సులో మాయా మానుషదేహుడు, జగత్ప్రభువునైన శ్రీకృష్ణుని మనోహరమైన మహిమ మరియొకటి చూడదలచి, వారి దూడలను, (కృష్ణుడు వెడలిన తరువాత) గోపబాలురను తీసికొనిపోయి మరియొకచోట నుంచి అంతర్ధాన మయ్యెను. అతడు పూర్వము అఘాసురునకు భగవానుడిచ్చిన మోక్షస్థితినిచూచి విస్మితుడై యుండెను. (15)

టీ॥ – అంభోజన్మేతి. అంభోజన్మనః పద్మాత్. జనిరుత్పత్తిర్యస్య సః బ్రహ్మ తదంతరేఽస్మిన్నవసరే గతః ఆగతః. తచ్ఛిద్రం ప్రాప్తో వా. అన్యదపి మహత్త్వం మహిమానం. ద్రష్టుం. తస్య వత్సాన్ ఇతః స్థానాత్ వత్సపాంశ్చ. అన్యత్ర నీత్వా. స్వయం తిరోబభూవ భగవతః శ్రీకృష్ణస్య. తత ఇతి. ఉభావపి వత్సాన్ వత్సపాంశ్చ. విచికాయ అన్వేషితవాన్ . క్వేతి.విధికృతం బ్రహ్మణా కృతం. (15 – 17)

టీ॥ – అంభోజన్మనః – పద్మమునుండి – జనిః – పుట్టుక, ఎవనికో అతడు – బ్రహ్మ – తదంతరే – ఆసయమున – గతః – ఆగతః – వచ్చెను. తెరిపి దొరికిన వాడగుటచేతనో – కృష్ణుని బలహీనత (అఘాసురునివంటి పాపిష్ఠునకు మోక్షమిచ్చుట) దొరికినందుననో – అన్యదపి మహత్త్వం – మరియొక మహిమను – చూచుటకు – అతని లేగదూడలను – ఈ స్థానమునుండి గోపబాలురను – వేరొకస్థలమునకు తీసికొపోయి, తాను అంతర్హితుడయ్యెను.

శ్రీకృష్ణునియొక్క (అచటినుండి) రెండును (ఇద్దఱిని) దూడలను, గోపాల బాలురను - విచికాయ - అన్వేషించిన వాడయ్యెను. - విధికృతం - బ్రహ్మచే చేయబడిన - (15-17)

శ్లో॥ తతో వత్సానదృష్ట్వైత్య పులినేఽథ చ వత్సపాన్ ।
ఉభా వపి వనేకృష్ణో విచికాయ సమంతతః ॥ (16)

తా॥ దూడలను కనుగొననేరక అచటినుండివచ్చి పులినమునందును వనమునందును, గోపాల బాలురను, దూడలను, ఉభయులను శ్రీకృష్ణుడు అంతట వెదికెను. (16)

శ్లో॥ క్వాప్యదృష్ట్వాంతర్విపినే వత్సాన్ బాలాంశ్చ విశ్వదృక్ ।
సర్వం విధికృతం జ్ఞాత్వా సహసాభి జగామ హ ॥ (17)

తా॥ విశ్వమునంతను చూడగల కృష్ణుడు వనమధ్యమున దూడలను గాని, గోపబాలురనుగాని కానకుండ, అది అంతయును బ్రహ్మచేసిన పనియని తెలిసికొని వెంటనే తిరిగి వచ్చెను. (17)

శ్లో॥ తతః కృష్ణో ముదంకర్తుం తన్మాతౄణాం చ కస్య చ ।
ఉభయాయిత మాత్మానం చక్రే విశ్వ దృగీశ్వరః ॥ (18)

తా॥ గోపాలబాలుర తల్లులకు, లేగదూడల తల్లులకును, అటు బ్రహ్మదేవునకును సంతోషమును కలిగించుటకై, ఈరెండు పనులకు తనను తానుసిద్ధపరచుకొని, విశ్వమంతటను చూపుగల కృష్ణప్రభువు వత్సలుగను బాలురుగను తనను తానుచేసికొనెను. (వారిరూపములను ధరించెను.) (18)

టీ॥ - తత ఇతి. ఉభయాయితం వత్సతత్పాలరూపేణ ఉభయధా వర్తమానమిత్యర్థః. అయం భావః. యది తూష్ణీమాస్తే. తర్హి తన్మాతృణాం విషాదస్స్యాత్. యది చ. తానేవానయామి తర్హి బ్రహ్మణో మోదో న స్యాదితి తదుభయ ప్రీతయే తథా చక్ర ఇతి. (18)

టీ॥ - ఉభావపి - దూడలను, బాలురనుకూడ అనుకరించి - ఉభయాయితం - వత్సలు, వానిని పాలించువారి రూపముతో - రెండు విధములుగ ప్రవర్తించుచున్నవాడై అని యర్థము. దీని భావము ఒకవేళ ఊరకనే యున్నచో వారి తల్లులకు దుఃఖము కలుగును. ఒకవేళ వానిని తాను తోడ్కొని వచ్చినచో బ్రహ్మదేవునకు సంతోషము కలగదు. అని ఆ ఉభయులకును ప్రీతి కలుగుటకొఱకు ఆ విధముగా చేసెను అని. (18)

శ్లో॥ యావద్వత్సప వత్సకాల్పక వపుర్యావత్కరాంఘ్ర్యాదికం
యావద్యష్టి విషాణవేణు దళశిగ్యా వద్వి భూషాంబరమ్ ।
యావచ్ఛీల గుణా భిధా కృతివయో యావద్విహారాదికం
సర్వం విష్ణుమయం గిరోఽంగ వదజస్సర్వ స్వరూపో బభౌ॥19

తా॥ గోప బాలురయొక్కయు, దూడలయొక్కయు సంఖ్య ఎంత ఉండెనో వారి శరీరములు, చేతులు కాళ్ళు మొదలగునవి ఎట్లెట్లుండెనో, వారివారి చూపులు, కొమ్ముువాద్యములు, పిల్లనగ్రోవులు, ఆకులు ఉట్లు, ఆభరణములు, ధరించిన వస్త్రములు, శీలములు, గుణములు, పేర్లు, ఆకృతులు, వయస్సులు, నడకలు (ప్రవర్తనలు) మొదలగున వన్నియును, మాటలు, అంగములు అన్నియును యథాతథముగ అనుకరించి, "అంతయును విష్ణుమయమే" అన్నట్లుగ కృష్ణుడు అందరి రూపములు కలవాడయ్యెను. (19)

టీ॥ - తదేవ దర్శయతి-యావదితి. వత్సపానాం వత్సకానాం చాల్పకవపుః ప్రమాణమనతిక్రమ్య ఏవముపర్యపి యోజ్యం. యద్వా.

టీ॥ - అదియే చూపుచున్నాడు. గోప బాలురయొక్కయు, దూడలయొక్కయు చిన్ని శరీరముల ప్రమాణములను అతిక్రమింపక

యావద్వత్సపాది వపుః. తావత్సర్వస్వరూపః. అజః కృష్ణః బభావి త్యుత్తరత్రాన్వయః. శ్లో. "సర్వం విష్ణుమయం జగది"తి. ప్రసిద్ధాయా గీః తస్యా అంగవత్ మూర్తివత్. సా గీరేనార్థస్వరూపేణ ప్రత్యక్షా యథా తథా. బభూవేత్యర్థః. (19)

శ్లో॥ స్వయ మాత్మాత్మ గోవత్సాన్ ప్రతివార్యాత్మ వత్సపైః ।
క్రీడన్నాత్మ విహారైశ్చ సర్వాత్మాప్రావిశద్వ్రజమ్ ॥ (20)

టీ॥ స్వయమితి. ఏవం సర్వాత్మా సన్ వ్రజం ప్రావిశత్. కథం స్వయమాత్మైవ ప్రయోజకః ఆత్మరూపాన్ గోవత్సానితి. కర్మాపి స్వయమేవేత్యుక్తం ఆత్మరూపైర్వత్సపైః ప్రతివార్య ప్రయోజ్యకర్తాపి స్వయమేవ. ఆత్మవిహారైః క్రీడన్నితి. క్రియాకారకాన్యపి స్వయమేవేత్యర్థః (20)

– ఇట్లు తరువాత కూడ యోచింపదగినది. లేక – గోపబాలురు మొదలగువారి శరీరములెంతెంత – ఎన్నియుండెనో – అంతంత – అన్ని స్వరూపములు గలవాడయ్యెను. అజః – కృష్ణుడు అయ్యెను అని తరువాతి శ్లోక భాగముతో అన్వయము. "అంతయు విష్ణుమయ మైనదే జగత్తు" అని ప్రసిద్ధమైన – యాగీః – ఏ మాట గలదో ఆ మాట యొక్క మూర్తిమత్త్వము వలె. ఆ మాటయే అర్థ స్వరూపముతో ప్రత్యక్షమైన నెట్లుండునో అట్లు అయ్యెనని యర్థము. (19)

తా॥ స్వయముగ ఆత్మయైన తాను, తానేయైన లేగదూడలను, తానేయైన గోపబాలురచేత కాపలాకాసి ( కాయుచు తనతో తానే ఆడుకొనుచు ఆ సర్వాత్ముడైన కృష్ణుడు వ్రజమును ప్రవేశించెను.(20)

టీ॥ ఇట్లు సర్వాత్ముడగుచును – వ్రజమును ప్రవేశించెను. ఎట్లు? తాను స్వయముగ ఆత్మయే ప్రయోజకుడు. తన రూపమేయైన లేగదూడలను – కర్మకూడ తానేయని చెప్పబడినది. తన రూపములే యగు గోప బాలురచేత కాపలా కాయించి – చేయదగిన పనియును తానే – ఆత్మవిహారైః క్రీడన్నితి. పనియును అది చేయించు వాడును (చేయువాడును) తానే అని యర్థము. (20)

శ్లో॥ తత్తద్వత్సాన్ పృథక్ జ్ఞాత్వా తత్తద్గోష్ఠే ప్రవేశ్య సః ।
తత్తదాత్మా భవద్రాజం స్తత్తత్సద్మ ప్రవిష్టవాన్ ॥ (21)

టీ॥ – తత్తదతి తత్తదాత్మా తత్త ద్గోపబాలరూపోఽ భవత్ తతస్తత్తత్సద్మ ప్రవిష్టః. (21)

శ్లో॥ తన్మాతరో వేణురవ త్వరోత్థితా
ఉత్థాప్యదోర్భిః పరిరభ్య నిర్భరమ్ ।
స్నేహస్నుతస్తన్య పయస్సుధా సవం
మత్వాపరం బ్రహ్మసుతానపాయయన్ ॥ (22)

టీ॥ గోపికా మోహనమాహ –తన్మాతర ఇతి. తన్మాతరో వేణురవేణ. త్వరయా ఉత్థితాస్సత్యః సుప్తాన్ మత్వా పరం బ్రహ్మైవ దోర్భి రుత్థాప్య ఉపగూహ్య పయస్సుధాసవం. పయ ఏవ సుధావత్స్వాదు. ఆసవవదున్మాదకం పాయ యామాసురిత్యర్థః. (22)

తా॥ రాజా! ఆయా లేగదూడలను విడివిడిగా తెలిసికొని, కృష్ణుడు ఆయా (వాని వాని) పశుశాలలోనికి ప్రవేశించి, ఆ యా గోపబాలుర ఆత్మయై వారి వారి ఇండ్లలోనికిఁబోయెను. (21)

టీ॥ – తత్తదాత్మా – ఆయా గోప బాలురుగనయ్యెను. అప్పుడు వారి వారి ఇండ్ల లోనికి ప్రవేశించెను. (21)

తా॥ వారి తల్లులు పిల్లనగ్రోవి నాదముతో తొందరగలేచి, వారిని చేతులతో ఎత్తికొని గట్టిగా గుండెలకు హత్తుకొని, పుత్రప్రేమ అతిశయించుటచే అమృతరసమువంటి చనుబాలు పైకి పొంగగా అదియే అమృతధారగా భావించి, పరబ్రహ్మయే సుతులుగనైన తమ కొడుకులకు పాలిచ్చిరి. (22)

టీ॥ గోపికల భ్రమను చెప్పుచున్నాడు. వారి తల్లులు వేణునాదము చేత శీఘ్రముగ లేచిన వారగుచు నిద్రించియున్నవారని భావించి పరబ్రహ్మయే అని అతనిని చేతులతో పైకి లేవనెత్తి, కౌగిలించుకొని పాలు(చనుబాలు) అనెడి అమృతరసమును – పాలే అమృతమువలె రుచికరముకాగా –ఆసవమువలె మత్తుగొలుపునదికాగా – (తాగించిరని యర్థము. (ఆసవము–చెఱుకు రసముతోచేయబడు మత్తు పానీయము) (22)

శ్లో॥ తతో నృపోన్మర్దన గంధలేపనా
లంకార రక్షా తిలకాశనాదిభిః ।
సు లాలిత స్స్వౌ చరితైః ప్రహర్షయన్
సాయం గతో యామ యమేన మాధవః ॥ (23)

తా॥ పరీక్షిన్మహారాజా ! కృష్ణుడు, సాయంకాల సమయమున ఆయా జాములయందు ఆయా ఆటలు ఆడుకొను నియమములను పూర్తి చేసికొని ఇంటికి వచ్చి తాను చేసిన ఆ యా పనులను గూర్చి చెప్పుచు తల్లులను సంతోషపెట్టుచుండగా అప్పుడు ఆ తల్లులు అతనిని లాలించుచు, ఒంటిని ప్రేమతో రాయుచు, గంధము మొదలగు సుగంధ ద్రవ్యములను పూయుచు, అలంకారములతో నలరించుచు, రక్షలు కట్టుచు. తిలకములు దిద్దుచు. అన్నము తినిపించుచు ఆనందించుచుండిరి. (23)

టీ॥ – తత ఇత. ఏవం యామయమేన తత్తాత్కాల క్రీడానియమేన సాయం గతః ప్రాప్తః స్వాచరితైః స్వస్యాచరితైః శోభనైరాచరితైర్వా మాతౄః ప్రహర్షయన్ . తతస్తాభిరున్మర్ద నాదిభిరుపలాలిత ఇతి. 23

టీ॥ – ఏవం – ఇట్లు – యామయమేన – ఆ యా కాలముల యందలి క్రీడా నియమములచేత – సాయం గతః – సాయం కాలము వచ్చిన వాడు కాగా – స్వాచరితైః – తాను చేసిన పనులచేత – మంగళ ప్రదములైన ఆచరణలచేతను, తల్లులలను మిక్కిలి సంతోషింప జేయుచుండ – అప్పుడు వారిచేత నలుగుతో ఒడలు రాయుట మొదలగు వాని చేత గారాబము చేయబడి – అని (23)

శ్లో॥ గావస్తతో గోష్ఠముపేత్య సత్వరం
హుంకార ఘోషైః పరిహూత సంగతాన్ ।
స్వకాన్ స్వకాన్ వత్సతరానపాయయన్
ముహుర్లిహంత్య స్రవదౌధసం పయః ॥ (24)

తా॥ గోవులు త్వర త్వరగా తమ గోష్ఠమునకుచేరి, 'హుం' అను శబ్దముతో తమ తమ లేగదూడలను పిలిచి, పొదుగు నుండి స్వయముగ స్రవించుచున్న పాలను వారికి త్రాగనిచ్చి మఱల, ప్రేమతోవాని శరీరములను నాకు చుండెను. (24)

టీ॥ గవాం మోహనమాహ-గావ ఇతి. పరిహూతా ఆహూతాశ్చ తే శంగతాశ్చ తాన్. (24)

టీ॥ ఆవుల మోహమును చెప్పుచున్నాడు. పరిహూతాః - తమకు సంబంధించిన లేగలను పిలిచి పిలువబడిన తమ లేగలుగలవియై.(24)

శ్లో॥ గో గోపీనాం మాతృతాస్మిన్నాసీ త్స్నేహర్ధికాం వినా ।
పురోవదాస్వపి హరేస్తోకతా మాయయా వినా ॥ (25)

తా॥ గోవులకును, గోపస్త్రీలకును కృష్ణుని పైన మాతృప్రేమ, పూర్వమే యుండెను. ఇప్పటి స్నేహవృద్ధి తప్ప - కృష్ణునకును వారి యందు పుత్రభావన (తాను వారి చిన్ని బాలుడనను భావన) పూర్వమే ఉండెను - తానే పన్నిన ఇప్పటి మాయ తప్ప - (అనగా ఇప్పుడు స్నేహవృద్ధి, కృష్ణమాయ అనునవి తప్ప, గోవులకు గోప స్త్రీలకును, కృష్ణునకును మధ్యగల ప్రేమభావము ఎప్పటివలెనే యున్నవి అని భావము.) (25)

టీ॥ ఏతావత్తు వైషమ్యం కృష్ణస్యాపి దుర్నివారమాసీదిత్యాహ-గో గోపీనా మితి. గవాం గోపీనాం చాస్మిన్ కృష్ణే మాతృతా ఉపలాలనాది రూపా. పురోవదేవాసీత్. కింతు. స్నేహర్ధికాం వినా స్నేహాధిక్యం త్విదానీం విశేష ఇత్యర్థః. ఆసు గోపీషు హరేః తోకతా చ బాలభావనాపి పూర్వవదేవాసీత్ కింతు మాయయా వినా. మమేయం మాతా. అహం యస్యాః పుత్ర ఇతి. మోహం వినేత్యర్థః. (25)

టీ॥ ఇప్పటి వఱకు కృష్ణుని విషయమున నేర్పడిన మార్పు నివారింపబడ జాలనిదిగనుండెనని చెప్పుచున్నాడు. గవాం - ఆవులకు, గోపీనాం- గోపస్త్రీలకును ఈ కృష్ణునియందు - మాతృతా - గారాబము చేయుట మొదలగు రూపముననున్న ప్రేమ పూర్వమునందువలెనే యుండెను. కాని'స్నేహవృద్ధి' యనునది తప్పః-స్నేహము యొక్క ఆధిక్యమనునది ఇప్పుడు విశేషమని అర్థము. ఆసు-గోపస్త్రీల యందు-హరేః-కృష్ణుని యొక్క తోకతా-బాల భావన-కూడ పూర్వము నందువలెనే యుండెను. కాని-మాయతప్ప - నాకు ఈమెతల్లి-నేను ఈమె పుత్రుడనుః - అని. మోహముతప్ప అని యర్థము. (25)

శ్లో॥ వ్రజౌకసాం స్వతోకేషు స్నేహవల్ల్యాబ్దమన్వహమ్ ।
శనైర్నిస్సీమ వవృధే యథా కృష్ణే తు పూర్వవత్ ॥ (26)

తా॥ వ్రజవాసులకు తమ పుత్రులయందు, ఒక సంవత్సరము వఱకు ప్రేమవల్లరి దినదినాభివృద్ధి గాంచుచుండెను. కృష్ణుని యందలి ప్రేమవలె, తమ పుత్రుల యందును మెల్ల మెల్లగా, ఇది వఱకు లేని విధముగ హద్దు లేకుండ ప్రేమ వృద్ధియయ్యెను. (26)

టీ॥ – స్నేహార్ధిమేవ దర్శయతి–వ్రజౌకసామితి. యథా కృష్ణే యంశోదానందనే. స్వపుత్రేభ్యో–పి స్నేహాధిక్యం. పూర్వమాసీత్. ఇదానీం స్వతోకేష్వపి. తథైవా వర్ధతేత్యర్థః. అబ్దం యావద్వత్సరం. నిస్సీమ యథా తథా. స్నేహవల్లీ సవృధే. (26)

టీ॥ స్నేహ వృద్ధినే చూపుచున్నాడు – తమ కొడుకుల యందు కన్న, కృష్ణునియందెట్లు అధికమైన ప్రేమయుండెనో – ఇప్పుడు తమ కొడుకుల యందు కూడ – అట్లే పెరుగుచుండెనని యర్థము. అబ్దం – సంవత్సరము వఱకు హద్దు లేకుండ ఎట్లో ఆ విధముగ, స్నేహపు తీగ పెరిగెను. (26)

శ్లో॥ ఇత్థమాత్మాత్మ నాత్మానం వత్సబాల మిషేణ సః ।
పాలయన్ భగవాన్ వర్షం చిక్రీడే వన గోష్ఠయోః ॥ (27)

తా॥ ఈ విధమున పరమాత్మయగు శ్రీకృష్ణుడు దూడల మిషతోను, గోపబాలుర నెపముతోను, తనను తానే రక్షించుకొనుచు, ఆ భగవానుడు ఒక సంవత్సరము వఱకు వనమునందును, పశుశాల యందును క్రీడించెను. (27)

టీ॥ ఇత్థమితి. ఏవమాత్మా శ్రీకృష్ణ. వత్సపో భూత్వా. తత్రాపి తావద్వత్సానాం తద్బాలకానాం చ మిషేణా త్మానమాత్మనా పాలయన్ క్రీడితవానిత్యర్థః. (27)

టీ॥ – ఇట్లు 'ఆత్మ' యగు శ్రీకృష్ణుడు గో(వత్స)పాలుడై, అట్లయ్యును. అంతవఱకు లేగలయొక్క వానిని కాపాడు బాలురయొక్కయు నెపమున తనను తానే పాలించుకొనుచు క్రీడించెనని యర్థము. (27)

శ్లో॥ ఏకదాచారయన్ వత్సాన్ స రామో వన మావిశత్ ।
పంచషట్సు త్రియామాసు హాయనాపూరణీష్వజః ॥ (28)

తా॥ ఒక సంవత్సర కాలము పూర్తియగుటకు ఇంకను ఐదో ఆఱో రాత్రులు మిగిలియున్న కాలమున ఒకనాడు కృష్ణుడు, బలరామునితో కూడి దూడలను మేపుకొనుచు అడవి లోనికి ప్రవేశించెను. (28)

టీ॥ ఏతావత్పర్యంతం రామస్యాపి మోహ ఏవాసీత్. సంవత్సరాంతే తు. కథంచిత్ జ్ఞాతవానితి దర్శయన్నాహ-ఏకదేతి. పంచసు షట్సువా. రాత్రిషు హాయనస్యాపూరణీషు పూరకతయా అవశిష్టాస్విత్యర్థః. (28)

టీ॥ ఇప్పటివఱకు బలరామునకు కూడ భ్రమయే ఉండెను. సంవత్సరము సమాప్తమగుచున్న సమయమున నాతడెట్లో (సత్యమును) తెలిసికొనగలిగెనని చూపుచు చెప్పుచున్నాడు. 'ఏకదా' అను నీ శ్లోకమున - పంచ షట్సు - ఐదో లేక ఆఱో రాత్రులయందు, సంవత్సరమును పూర్తిచేయువానియందు పూర్తి అగుటకు- మిగిలిన వాని యందని అర్థము. (28)

శ్లో॥ తతోఽతి దూరాచ్చరతో గావో వత్సానుప వ్రజమ్ ।
గోవర్ధనాద్రి శిఖరే చరంత్యో దదృశుస్తృణమ్ ॥ (29)

తా॥ వ్రజమునకు చాల దూరముననున్న గోవర్ధన పర్వత శిఖరముపై గడ్డిమేయుచున్న ఆవులు వ్రజమునకు మిక్కిలి సమీపమున గడ్డిక మేయుచున్న లేగదూడలను చూచెను. (29)

టీ॥ తత ఇతి. తతోఽతిదూరతయేవ గోవర్ధనశిఖరే చరంత్యో గావో వ్రజసమీపే. చరతః వత్సాన్ దదృశుః. (29)

టీ॥ అచటి నుండి చాల దూరమున గోవర్ధన శిఖరము మీద మేయుచున్న ఆవులు, వ్రజమునకు దగ్గరలో తిరుగుచు మేయుచున్న లేగలను చూచెను. (29)

శ్లో॥ దృష్ట్వాథ తత్స్నేహ వశోఽస్మృతాత్మా
సగో వ్రజోఽత్యాత్మప దుర్గమార్గః ।
ద్విపాత్కకుద్గ్రీవ ఉదాస్యపుచ్ఛోఽ
గాద్ధుం కృతైరాస్ను పయా జవేన ॥ (30)

తా॥ చూచి, ఇక ప్రేమాతిశయమునకు వశమై, తన శక్తిని మరచి, ఆగోవుల సమూహము, తన పాలకులను అతిక్రమించి, పోవుటకు సాధ్యము కాని మార్గమున, ముందరి రెండుకాళ్ళను ఒక్కచో వెనుకటి రెండు కాళ్ళను ఒక్కచో చేర్చుటచే రెండే కాళ్ళతో పరుగిడుచున్నట్లు, మూపురముల వైపు మెడలను కుంచించి, ముఖములను, తోకలను పైకెత్తి, 'హుం' కార ధ్వనులను చేయుచు, పొదుగులకు చేపులురాగా (పాలు స్రవించుచుండగా) వేగముగా పరుగెత్తుకొని, లేగల వైపునకు పోసాగెను. (30)

టీ॥ – దృష్ట్వేతి. తథైవ స గోవ్రజః గవాం కలాపః. తత్. స్నేహవశః తేషాం వత్సానాం స్నేహేనాకృష్టః. అత ఏవ న స్మృత ఆత్మా యేవ సః తథా. జవేన. ఉపవ్రజమగాత్. కథంభూతః అత్యాత్మపదుర్గమార్గః. అతిక్రాంతః. ఆత్మ పాన్. గోపాలాన్ యః సోఽత్యాత్మపః. తథా దుర్గమో మార్గో యస్య సః. తథా యుక్తాభ్యాం. పద్భ్యాం ధావన్ ద్విపాదివ. ప్రతీయమానః. కకుది ఆకుంచితా గ్రీవాయస్య సః ఉదాస్యపుచ్ఛః ఉన్నమితాన్యాస్యాని పుచ్ఛాని చ యేన సః. ఆస్నుపయాః సర్వతః స్రవంతి పయాంసి యస్య సః. గోవ్రజ ఇత్యనేన వృషభాదయోఽప్య జగురిత్యుక్తం. (30)

టీ॥ అప్పుడే ఆ గోవ్రజము – ఆవుల గుంపు – అది – స్నేహవశః – వాని లేగల యొక్క ప్రేమచేత ఆకర్షింపబడినదై – అందువలననే – తమను తామ మరచిపోవుట ఎవరికో వారు అట్లు చెప్పబడిరి. (అస్మృతాత్మా అని) వేగముగా – వ్రజసమీపమునకుఁబోయెను. (ఆవులసమూహము) ఎట్టిది? అత్యాత్మప దుర్గమార్గః – గోపాలురను అతిక్రమించి (అతిక్రాంతః ఆత్మపాన్ – గోపాలాన్ – యః సః అత్యాత్మపః.) అట్లే చొరరాని త్రోవ ఎవరికో వాడు దుర్గ మార్గః – మరియు – ఒక్కచో కలిసిన కాళ్ళతో పరుగెత్తుచు – రెండు కాళ్ళ వాని వలె వ్యక్తమగుచు – కకుది – మూపురము నందు – ఆకుంచితా అంతట కుచింపచేయబడిన – గ్రీవా – మెడ – యస్య సః – ఎవనికి కలదో వాడు – ఉదాస్య పుచ్ఛః పైకి లేవనెత్తిన ముఖములు, తోకలు

ఎవనికి గలవోవాడు - ఆస్నుపయాః సర్వతః స్రవంతి పయాంసి యస్య సః - పొదుగు అంతటను స్రవించుచుండు పాలు ఎవనికో వాడు. గోవ్రజము ఆవుల సమూహము అనుమాటల చేత, (గో శబ్దము చేత) ఎద్దులుకూడ పోయెనని చెప్పబడినది. (30)

శ్లో॥ సమేత్య గావో గోవత్సాన్ వత్స వంతోఽప్య పాయయన్ ।
గిళంత్య ఇవ చాంగాని లిహంత్య స్స్వోధసంపయః ॥ (31)

తా॥ ఆవులు, వ్రజ సమీపమున గల లేగలను చేరి - క్రొత్త లేగలను ప్రసవించియున్న ఆవులు కూడ, తమ పెద్ద లేగలకు - వానిని మ్రింగి పొట్టలో దాచుకొనునేమోయనునంతగా వాని అవయములను నాకుచు తమ పొదుగుల నుండి స్రవించుచుండు పాలతో కూడా - పాలను త్రాగ నిచ్చెను. (31)

టీ॥ - తత్ర విశేషతో ధేనూనాం చేష్టితమాహ-సమేత్యేతి. గోవర్ధనస్యాధః వత్సవంత్యః పునః ప్రసూతా అపి. (31)

టీ॥ - అచట విశేషించి ఆవుల చేష్టితమును చెప్పుచున్నాడు. గోవర్ధన గిరికి క్రింద భాగమున గల లేగలు గల ఆవులను - మఱల ప్రసూతియైనవి కూడ - (క్రొత్తగా ఈనినవి కూడ) (31)

శ్లో॥ గోపాస్తద్రోధనాయాసమౌఘ్య లజ్జోరు మన్యునా ।
దుర్గాధ్వ కృచ్ఛ్రతోఽ భ్యేత్య గోవత్సై ర్దదృశుస్సుతాన్ ॥ (32)

తా॥ గోపాలురు వానినాపుటకు ప్రయాసపడియు, వారిప్రయత్నము వ్యర్థమగుటచే సిగ్గుపడిరి. కోపముతో ఆ దుర్గమ మార్గము నుండి మిక్కిలి క్లేశముతో అచటికి చేరుకొని. లేగలతోఁబాటుగ తమ పుత్రులగు గోపబాలురను కూడ చూచిరి. (32)

టీ॥ రామేణ దృష్టం వత్సేషు గవాం స్నేహాతిశయముక్త్వా గోపానామపి దర్శయితుమాహ. గోపా ఇతి. తాసాం గవాం రోధనే య ఆయాసస్తస్య మౌఘ్యేన మోఘత్వేన లజ్జయా సహ ఉరుమన్యువా. దుర్గమార్గ జనితక్లేశేన చాభ్యేత్య గోవత్సైస్సహ సుతాన్ దదృశుః. (32)

టీ॥ - బలరామునిచే చూడబడిన, లేగలయందలి ఆవులప్రేమాతిశయమును చెప్పి, గోపాలకుకూడ దానిని చూపుటకు చెప్పుచున్నాడు. ఆ ఆవులను నిరోధించుటయందు ఏ కష్టముగలదో దాని వ్యర్థత్వము చేత, సిగ్గుతో కూడిన తీవ్రమైన కోపముతో దుర్గమమైన మార్గమున నడచిన క్లేశముతోను, చేరుకొని, లేగలతో బాటుగ కొడుకులను కూడ చూచిరి. (32)

శ్లో॥ తదీక్షణోత్ప్రేమ రసాప్లుతాశయా
జాతానురాగా గత మన్యవోఽర్భకాః ।
ఉదూహ్యా దోర్భిః పరిరభ్య మూర్ధ్ని
ఘ్రాణైరవాపుః పరమాం ముదంతే ॥ (33)

తా॥ గోపబాలురగు తమ కుమారులను చూచుట తోడనే ఉప్పొంగిన ప్రేమరసమున నిమగ్నమైన హృదయములు గలవారై, అనురాగము కలిగినవారై, తమకోపమును మరచినవారై బాలురను చేతులతోపైకి లేవనెత్తికొని, కౌగలించుకొని వారి శిరస్సులపైన మూర్కొని పరమానందము నొందిరి. (33)

టీ॥ - తదితి. తతశ్చ తేషామీక్షణేనోద్గతో యః ప్రేమరసః. తస్మిన్నాప్లుతాః నిమగ్నాః ఆశయా యేషాం తే. లజ్జామన్యుకృచ్ఛ్రైస్తానపి తాడయితుమాగతా స్సంతోఽపి. గతమన్యవః ప్రత్యుత జాతోఽనురాగో యేషాం తే. మూర్ధ నిఘ్రాణైః అవఘ్రాణైః పరమాం ముదమవాపుః. (33)

టీ॥ - అప్పుడు వారిని చూచుటచేత ఉప్పొంగిన ఏ ప్రేమ రసముగలదో - తస్మిన్నాప్లుతాః - దానియందు మునిగిన మనస్సు ఎవరికోవారు. సిగ్గు కోపము క్లేశము అనువానిచే వారినికూడ కొట్టించుటకువచ్చిన వారైయును కోపము పోయినవారై పైగా అనురాగము కలిగినవారై - అనురాగముపుట్టిన వారెవరోవారు - శిరస్సు పైన మూర్కొనుటలచేత పరమమైన ఆనందమునొందిరి. (33)

శ్లో॥ ఏవం స పశవో గోపాస్తోకాశ్లేష సు నిర్వృతాః ।
కృచ్ఛ్రాచ్ఛనై రపగతాస్తదను స్మృత్యుదశ్రవః ॥ (34)

తా॥ ఇట్లు తమ కుమారులను ఆలింగనముచేసికొని యుండుట వలన తేలికపడిన గోపాలురు పశువులతో కూడ వెడలిపోయిరి. మెల్లగా తమ క్లేశము నుండి తేరుకొని, పుత్రస్నేహమును గుణించిన తమ జ్ఞాపకములతో వారి కన్నుల నుండి కన్నీరు ఉబికి వచ్చెను. (34)

టీ॥ – ఏవమితి. కృచ్ఛ్రాత్. తతః అపగతాః. నివృత్తాః తేషాం సుతానాం అనుస్మృత్యా. ఉద్గచ్ఛంతి అశ్రూణి యేషాం తే. (34)

టీ॥ – కృచ్ఛ్రాత్ – శ్రమనుండి – తతః అపగతాః – అప్పుడు విముక్తిపొంది – నివృత్తాః – తేరుకొని వారి కుమారులను గూర్చిన జ్ఞాపకముతో – ఉబికి వచ్చుచున్న కన్నీరు ఎవరికో – వారు (34)

శ్లో॥ వ్రజస్య రామః ప్రేమర్ద్ధే ర్వీక్ష్యౌత్కంఠ్య మనుక్షణమ్ ।
ముక్తస్తనేష్వపత్యేషు హ్యహేతు విదచింతయన్ ॥ (35)

తా॥ చనుబాలను మానివేసిన బాలుర యందును వ్రజవాసులకు ప్రేమ వృద్ధియగుటను చూచి బలరాముడు ప్రతిక్షణము ఉత్కంఠతో ఆలోచించుచు, దానికి కారణము తెలియుకుండెను. (35)

టీ॥ వ్రజస్యేతి. ప్రేమర్ద్ధేరౌత్కంఠ్యమతిశయం. ముక్తస్తనేష్వపత్యేషు. వీక్ష్య అహేతువత్ హేతుమజానన్నచింతయత్. (35)

టీ॥ – ప్రేమ వృద్ధియగుటయందు అతిశయించిన ఆసక్తి – స్తన్యపానమును విడిచిపెట్టిన తమ సంతానమునందు – చూచి – అహేతువత్ – కారణము తెలియనివాడై ఆలోచించెను. (35)

శ్లో॥ కిమేతదద్భుత మివ వాసుదేవేఽఖిలాత్మని ।
వ్రజస్య సాత్మన స్తోకేష్వపూర్వం ప్రేమ వర్ధతే ॥ (36)

తా॥ ఇదియేమి? ఆశ్చర్యమువలెనున్నది! సర్వాత్ముడైన వాసుదేవుని యందు ఈ వ్రజవాసులకు తమ తమ సంతానముల యందు వలెనే ప్రేమ వృద్ధిచెందుచున్నది.! (36)

టీ॥ చింతామేవాహ - ద్వాభ్యాం. కిమితి. వాసుదేవే యథా పురా. తథా స్వతోకేష్వపి వ్రజస్య ప్రేమ వర్ధతే. కిమేతదద్భుతమితి. కించ. సాత్మనః ఆత్మ సహితస్య వ్రజస్య. మమ తేషు ప్రేమకారణం కిమితి భావః. (36)

టీ॥ - రెండు శ్లోకములతో (బలరాముని) చింతించుటను గూర్చియే చెప్పుచున్నాడు - పూర్వము కృష్ణుని యందెట్లుండెనో, అటుల తమ కుమారుల యందు కూడ వ్రజమునకు ప్రేమ పెరుగుచున్నది. ఇది ఏమి అద్భుతము? అని - మరియు- సాత్మనః - ఆత్మ (తమ)తో కూడిన వ్రజమునకు - వారి యందు నాకును గల ప్రేమకు కారణమేమి? అని భావము. (36)

శ్లో॥ కేయం వాకుత ఆయాతా దైవీ వానార్యుతాసురీ ।
ప్రాయో మాయాస్తు మే భర్తుర్నాన్యామేఽపి విమోహినీ ॥ (37)

తా॥ ఇదియెవరు? ఎచటినుండి వచ్చినది? దైవీ మాయయా? మనుష్య సంబంధమైనదా? లేక రాక్షస మాయయా? ప్రాయికముగ ఇది నా పతి దేవునిదే యగును కాని ఇతరముకాదు. లేకున్న ఇది నన్ను కూడ మోహింప జేయుట ఎట్లు సంభవించెను? (నన్నుకూడ మోహింపజేసినది కావున ఇది నా స్వామియగు శ్రీకృష్ణునిదే? (37)

టీ॥ - కేతి. కేయం మాయాదేవానాం వా. నరాణాం వా. అసురాణాం వా. కుతోవా. కస్మాత్ప్రయుక్తా తత్రాన్యమాయా న సంభవతి. యతో మమాపి మోహో వర్తతే అతః ప్రాయశో మత్స్వామినః శ్రీకృష్ణస్యైవ. మాయేయమస్త్వితి సంభావయతి. (37)

టీ॥ - ఈ మాయ ఎవరు? దేవతలదియగునా. మనుష్యులదా? లేక రాక్షసులదా? ఎక్కడనుండి వచ్చినదో? ఎందువలన ప్రయోగింప బడినదో కాని - ఇతరుల మాయ ఇట సంభవింపదు. నాకు కూడా మోహము కలుగుచున్నందువలన ప్రాయశః ఇది నాస్వామియగు శ్రీకృష్ణునిదే - ఈ మాయను ఇటులుండనిమ్ము అని సంభావించు చున్నాడు. (37)

శ్లో॥ ఇతి సంచింత్య దాశార్హో వత్సాన్ సవయసానపి ।
సర్వావాచష్ట వైకుంఠం చక్షుసా వయునేన సః ॥ (38)

టీ॥ - ఇతీతి. సవయస్యాన్ స సఖీనపి. వయునేన జ్ఞానమయేన చక్షుషా. వైకుంఠం శ్రీకృష్ణమేవాపశ్యత్. (38)

శ్లో॥ నైతే మదంశా ఋషయో నచైతే
త్వమేవ భాసీశ భిదాశ్రయేఽస్మిన్ ।
సర్వం పృథక్త్వం నిగమాత్కథం వదే
త్యుక్తేన వృత్తం ప్రభుణా బలోఽవైత్ ॥ (39)

టీ॥ - ఏవం కృష్ణరూపాన్ సామాన్యతో జ్ఞాత్వా. శ్రీకృష్ణం దృష్ట్వా. కృష్ణోపదేశేన విశేషతో జ్ఞాతవానిత్యాహ-నేతి. అయమర్థః పాల్యమానాస్తావద్వత్సా ఋషీణామంశాః. పాలకాశ్చ దేవానామంశా ఇతి తావదహం వేద్మి ఇదానీం తు న తథా. కింతు. అస్మిన్ భిదాశ్రయేఽపి. త్వమేవ భాసి. అతస్త్వం సర్వం పృథక్ వివిచ్య. కథం వృత్తమితి వదేత్యుక్తేన ప్రభుణా వక్త్రా నిగమాత్ సంక్షేపత ఏవోక్తం వృత్తం బలః అవైత్ విదితవానిత్యర్థః. (39)

తా॥ అని యిట్లాలోచించి బలరాముడు, దూడలను, గోపబాలురను జ్ఞాన దృష్టితో చూచి అందరిని శ్రీకృష్ణునిగనే దర్శించెను. (38)

టీ॥ - సవయస్యాన్ - సఖీజనులతోకూడ - వయునేన - జ్ఞానముతో నిండిన-చక్షుషా-నేత్రముతో వైకుంఠం-శ్రీకృష్ణునే చూచెను. (38)

తా॥ వీరు దేవతలుకారు. ఋషులునుకారు. ప్రభూ! నీవే ప్రకాశించుచున్నావు. ఈ వేర్వేరు రూపములను ఆశ్రయించి భిన్నభిన్నములైన ఆకారములలోనున్నను అంతటను నీవే కన్పట్టుచున్నావు ఇదెటులో చెప్పుము. అని ప్రశ్నింపగా భగవానునిచే సంక్షేపముగ జరిగినదంతయును చెప్పబడెను. బలరాముడు తెలిసికొనెను. (39)

టీ॥ - ఈ విధముగ కృష్ణరూపములను సామాన్యముగ తెలిసికొని, శ్రీకృష్ణునిచూచి, కృష్ణుని ఉపదేశముచేత విశేషించి తెలిసికొనగలిగెనని చెప్పుచున్నాడు. "న" అని - దీనియర్థము - పాలింపబడుచున్న దూడలు ఋషుల అంశలని, పాలకులు దేవతల అంశలని ఇంతవఱకు నాకు తెలియును. ఇప్పుడట్లుకాదు. కాని ఈ భేదాశ్రయమునందును నీవే ప్రకాశించుచున్నావు. అందువలన నీవు అంతయును విడి విడిగా విడమరచి, ఏ విషయమో, ఏమి జరిగినదో చెప్పుమనగా వక్తయైన కృష్ణునిచేత - నిగమాత్ - సంక్షిప్తముగనే చెప్పబడినది. బలరాముడు అవైత్ - తెలిసికొనెను, అని యర్థము. (39)

శ్లో॥ తావదేవాత్మ భూరాత్మ మానేన త్రుట్యనేహసా ।
పురోవదాబ్దం క్రీడంతం దదృశే సకలం హరిమ్ ॥ (40)

తా॥ అంత వఱకు (ఒక సంవత్సరము సమాప్తమగు వఱకు) బ్రహ్మదేవుడు, తన కాలమానము ననుసరించి ఒక్కత్రుటి (క్షణములో నాల్గవవంతు) కాలము మాత్రమే గడచిపోవగా, ఒక సంవత్సరమునకు పూర్వకాలమునందువలెనే తన తోటి వారందఱితోను కృష్ణుడు క్రీడించుచుండుట చూచెను. (40)

టీ॥ – తతః కిం వృత్తమిత్యపేక్షాయామాహ – తావదితి. వర్షే జాతే. ఆత్మనో మానేన త్రుట్యనేహసా త్రుటిమాత్రేణ కాలేన. సకలం సానుచరం హరిం దదర్శ. (40)

టీ॥ – తరువాతయేమి జరిగినదను అపేక్షతో చెప్పుచున్నాడు. ఒక వత్సరము సమాప్తముకాగా తన కాలమానముచేత – త్రుట్యనేహసా – త్రుటిమాత్ర(అల్ప)కాలముతో – సకలం – అనుచరులతోకూడిన కృష్ణుని చూచెను. (40)

*బ్రహ్మోవాచ.*

*బ్రహ్మభగవానుడిట్లనెను.*

శ్లో॥ యావంతో గోకులే బాలాస్సవత్సా స్సర్వ ఏవ హి ।
మాయాశయే శయానాయే నాద్యాపి పునరుత్థితాః ॥ (41)

తా॥ గోకులమునందు ఎందఱు బాలురుగలరో అందఱు దూడలతో కూడ, సర్వులును, మాయా తల్పమున పడుండియున్న వారు నేటికిని కూడ సచేతనులు కాకుండిరి. (41)

టీ॥ – దృష్ట్వా చ వ్యతర్కయదిత్యాహ –ద్వాభ్యాం. యావంత ఇతి. మే మాయాశయే మన్మాయా తల్పే. (41)

టీ॥ – చూచి విశేషముగ తర్కించుకొనుచుండెనని రెండు శ్లోకములతో చెప్పుచున్నాడు. మే మాయాశయే – నా మాయాతల్పమున – (41)

శ్లో॥ ఇత ఏతేఽత్ర కుత్రత్యా మన్మాయా మోహితే తరే ।
తావంతో యావదద్యాబ్దం క్రీడంతో విష్ణునా సహ ॥ (42)

తా॥ నా మాయచేత మోహితులైన గోప బాలురు, లేగలకు బదులు, ఇచట కృష్ణునితో ఆడుచుండినవారు, సంవత్సరము వెనుక నుండి యున్నంత మంది అన్యులు ఎచటివారు? అని బ్రహ్మదేవుడు ఆలోచించుచుండెను. (42)

టీ॥ ఇత ఇతి. మన్మాయామోహితేభ్య ఇతరే కుత్రత్యాః. (42)

టీ॥ - ఇత - అని - నా మాయచేత మోహితులైన వారి బదులు ఇతరులు ఎచటివారు? (42)

శ్లో॥ ఏవమేతేషు భేదేషు చిరం ధ్యాత్వా సదాత్మభూః ।
సదాశ్రయా ఏత ఇతి జ్ఞాతుం నేశే కథంచన ॥ (43)

తా॥ ఇట్లు బ్రహ్మదేవుడు ఈ భేదములయందు చిరకాలము వఱకు ఆలోచించియును, ఇది విష్ణుదేవుని మహిమయని మాత్రము ఎటులునూ తెలిసికొనుటకు సమర్థుడు కాలేకపోయెను. (43)

టీ॥ - ఇతి వితర్కయన్. అముహ్యదిత్యాహ - ఏవమిత్యాది ద్వాభ్యాం. (43 -44)

టీ॥ - అని విశేషముగ తర్కించుకొనుచు భ్రమ చెందెనని చెప్పుచున్నాడు "ఏవం" అను రెండు శ్లోకములతో - (43-44)

శ్లో॥ ఏవం విమోహయన్ విష్ణుం విమోహం విశ్వమోహనమ్ ।
స్వయైవ మాయయా జోఽపి స్వయమేవ విమోహితః ॥(44)

తా॥ ఇట్లు బ్రహ్మదేవుడు, విశ్వమోహనుడును, (విశ్వమును మోహింపజేయువాడును) విశేషమైన మాయ తన అదుపులోనున్న వాడును ఐన శ్రీకృష్ణుని మోహింపజేయుటకు యత్నించుచు, తన మాయతో తానే మోహముచెందెను. (44)

శ్లో॥ తమ్యాం తమోవన్నైహారం ఖద్యోతార్చిరివాహని ।
మహతీతర మాయైశ్యం నిహంత్యాత్మని యుంజతః ॥ (45)

తా॥ చీకటి రాత్రియందు, హిమకిరణపు వెలుగు చీకటిలో కలిసిపోవును - హిమకిరణము తన వెలుగును కోల్పోవును. దిన సమయమునందు మిణుగరుపురుగుయొక్క ప్రకాశము సూర్య ప్రకాశమున కలిసిపోవును. అందుచే మిణుగురుపురుగు తన ప్రకాశమును కోల్పోవును. అట్లే సాధారణుల మాయను మహాత్ములపై ప్రయోగించినచో, ఆ మాయ, ఆత్మలో లీనమైపోవును. ఆ సాధారణుడు తన సామర్థ్యమును కోల్పోవును. (45)

టీ॥ - నను మాయాశ్రయస్య తస్య కుతో మోహ ఇత్యత ఆహ- తమ్యామితి. మహామాయావిని భవతి. అన్యమాయాయా ఆవరణ విక్షేపకత్వాభావే. దృష్టాంతద్వయమాహ. తమ్యాం తమిస్రాయాం రాత్ర్యాం. నైహారం హిమకిరణ ప్రభవం తమ ఇవ తద్ధితార్థోప సర్జనస్యాపి తమసో నైహారమితి విశేషణం ఛాందసం. తత్తమో యథా పృథగావరణం న కరోతి కింతు తత్రైవ లీయతే. యథా చ. ఖద్యోతార్చిరహని పృథక్. ప్రకాశం న కరోతి. ఏవం మహతి పురుషే. యుంజతః పుంసః ఇతరా నీచమాయా తత్ర న కించిత్కరోతి. కింతు. ఆత్మని స్వస్మిన్నేవ ఐశ్యం సామర్థ్యం నిహంతి. (45)

టీ॥ - మాయకు ఆశ్రయుడైన అతనికి (పరమేశ్వరునకు) మోహ మెందులకు కలుగునని ఇటచెప్పుచున్నాడు. మహామాయావి అయిన నీ యందు - ఇతరుల మాయచేత, ఆవరణ విక్షేపకత్వములు ఉండక పోవుటచే - రెండు దృష్టాంతములను చెప్పుచున్నాడు - తమ్యాం - తమిస్రామాంరాత్ర్యాం-చీకటి రాత్రియందు -నైహారం - హిమకిరణపు కాంతి. చీకటివలెనే తద్ధితార్థము - అప్రధానమైనప్పటికిని - దానిని చీకటికి విశేషణముగా నైహారమని వాడుట ఛాందసము. ఆ చీకటి వేఱుగా ఒక ఆవరణమును చేయజాలనట్లు - చేయజాలదుకాని అచటనే లయమైపోవును. అట్లేకూడ - మిణుగురుపురుగు ప్రకాశము దినసమయమున విడిగా వెలుగును ప్రసరింపజాలదు. ఇట్లే మహాపురుషుని యందు. యోగియగు పురుషునకు - ఇతరమైన క్షుద్రమాయ అచట

ఏమియుచేయజాలదు. కాని ఆత్మని - తనయందే - ఐశ్యం - సామర్థ్యమును - నిహంతి - నాశముచేయును. (45)

శ్లో॥ తావత్సర్వా వత్సపాలాః పశ్యతోఽజస్య తత్ క్షణాత్ ।
వ్య దృశ్యంత ఘన శ్యామాః పీత కౌశేయ వాస సః । (46)

తా॥ అంతవఱకునున్న గో వత్సపాలకులు (బాలురు) అప్పటికప్పుడే బ్రహ్మదేవుడు చూచుచుండగనే, మేఘవర్ణమున ప్రకాశించుచు, పీతాంబరధారులై (కృష్ణులై) కన్పట్టిరి. (46)

టీ॥ అన్యదప్యాశ్చర్యమహ-తావదితి. వత్సపాలాః వత్సాః పాలాః బాణాశ్చ. సర్వే యష్టివిషాణాదయశ్చ. (46. 47)

టీ॥ - మఱియొక ఆశ్చర్యమునుకూడ చెప్పుచున్నాడు. వత్సపాలాః - వత్సాః - దూడలు - పాలాః బాణాశ్చ.సర్వే యష్టివిషాణాదయశ్చ.- బాణములు - కఱ్ఱలు కొమ్ములు మొదలగునవన్నియును. (46,47)

శ్లో॥ చతుర్భుజాశ్శంఖ చక్ర గదా రాజీవ పాణయః ।
కిరీటినః కుండలినో హారిణో వనమాలినః ॥ (47)

తా॥ నాలుగు భుజములు గలవారును, శంఖము, చక్రము, గద, పద్మము అనువానిని చేతులలో కల్గియున్నవారును, కిరీటములు, కుండలములు ధరించియున్నవారును., పాదములవఱకు వ్రేలాడు పూలమాలలు గలవారును, వివిధములైన హారములు గలవారును అయిన “కృష్ణులు” కనబడిరి. (47)

శ్లో॥ శ్రీ వత్సాంగద దోరత్నకంబు కంకణ పాణయః
నూపురైః కటకైర్భ్రాజత్కటి సూత్రాంగులీయకైః (48)

తా॥ శ్రీవత్సములు అను లాంఛనములతో (పుట్టుమచ్చలతో) కేయూరములు (బాహుపురులు) అలంకరించి యున్న భుజములతో,

టీ॥ – శ్రీవత్సేతి. శ్రీవత్సప్రభయా యుక్తాని అంగదాని దోర్ష్ణు యేషాం తే రత్నమయాని కంబువత్త్రి రేఖా ధరాణి కంకణాని. పాణౌ తు యేషాం తే చ తే చ తథా. (48)

శ్లో॥ అంఘ్రిమస్తక మాపూర్ణ తులసీ నవ దామభిః ।
కోమలైస్సర్వ గాత్రేషు భూరి పుణ్యవదర్పితైః ॥ (49)

టీ॥ అంఘ్రీతి. భూరిబహుజన్మార్జితం పుణ్యం తద్యుక్తైర్జనైరర్పితైః. (49)

శ్లో॥ చంద్రికావిశదస్మేరై స్సారుణాపాంగవీక్షితైః ।
స్వకార్థానామివ రజస్సత్త్వాభ్యాం ప్రష్టుపాలకాః ॥ (50)

రత్నములు పొదిగిన, శంఖములయందువలె మూడురేఖలుగల కంకణములను ధరించియున్న చేతులతో, చిఱు గజ్జెలు, పెండేరములు ధరించిన కాళ్ళతోను, ప్రకాశించుచున్న మొలత్రాళ్ళతోను, ఉంగరముల తోను (వారు ఒప్పుచుండిరి.) (48)

టీ॥ – శ్రీవత్స ప్రభచేత కూడియున్న బాహుపురులు భుజముల యందెవరికి గలవో వారు. శంఖమునందువలె మూడు రేఖలు గల కంకణములు చేతి యందెవరికి గలవో వారు అట్లు చెప్పబడిరి. (48)

తా॥ గొప్ప పుణ్యవంతులచే సమర్పింపబడిన కోమలములైన క్రొత్త తులసీదళముల హారములను అన్ని అంగములయందును – పాదముల నుండి శిరస్సు వఱకు ధరించియున్న. ( వారు ఒప్పుచుండిరి) (49)

టీ॥ భూరి – బహుజన్మలుగా సంపాదించుకొనబడిన పుణ్యముచే కూడిన భక్తజనముచే సమర్పితములైనవానిచే (49)

తా॥ వెన్నల వంటి తెల్లని చిరునవ్వులచేత అరుణవర్ణముతో కూడిన కటాక్షముల చేతను తన భక్తులయొక్క సత్త్వ రజోగుణములను ప్రశ్నించు రక్షకులవలెనుండిరి (చిరునవ్వులచేత సత్త్వగుణమును, ఎఱ్ఱని కడచూపులచే రజోగుణమును ప్రశ్నించు పాలకులవలెనుండిరి) (50)

టీ॥ - చంద్రికేతి. చంద్రికావద్విశదస్మియుక్తైః సహారుణగుణేన వర్తమానాః. యే అపాంగాః తైర్వీక్షితైః. స్వకార్థానాం స్వభక్త మనోరథానాం రజస్సత్త్వాభ్యాం స్రష్టృపాలకా ఇవ. వ్యదృశ్యంత. సత్త్వవద్విశదస్మి తేన పాతకా ఇవ రజోవదరుణ గుణేన చ. స్వకార్థానాం స్రష్టార ఇవ. తాదృక్కటాక్షైః. ద్యోతమానా ఇత్యర్థః. (50)

టీ॥ - వెన్నెలవలె స్వచ్ఛమైన చిరునవ్వులతోకూడుకొని, ఎఱ్ఱని గుణముతో వర్తించునట్టి ఏ కొసచూపులు వానిచేత చూడబడుచు తమభక్తుయొక్క కోరికలకు రజస్సత్త్వములతో ప్రశ్నించు పాలకులవలె కన్పట్టుచుండిరి. సత్యమువంటి స్వచ్ఛమగు చిరునవ్వుతో పాతకముల వంటి ఎఱ్ఱని గుణముచేత తమభక్తజనుల ప్రయోజనములను అడుగుచున్నవారివలె - ఆ విధమైన కటాక్షములతో ప్రకాశించు చున్నవారు - స్ఫురించుచున్నవారు అని యర్థము. (50)

శ్లో॥ ఆత్మాదిస్తంబ పర్యంతై ర్మూర్తి మద్భిశ్చరాచరైః ।
నృత్తగీతాది నైకార్హైఃపృథ క్పృథగుపాసితాః ॥ (51)

తా॥ బ్రహ్మమొదలుకొని స్తంబము వఱకును వేర్వేరు స్వరూపములను ధరించియున్న జడ చైతన్యములన్నింటి చేతను నృత్యము, గీతము మొదలగుననేక రూపముల పూజల చేత విడి విడిగా ఉపాసింపబడు చున్నారు. (51)

టీ॥ ఆత్మేతి. ఆత్మా బ్రహ్మ. తదాది స్తంబపర్యంతైః నైకార్హైరనేకార్హణైః (51)

టీ॥ ఆత్మా - బ్రహ్మ - అతడు మొదలుకొని స్తంబము వఱకును గలవారి చేత - నైకార్హైః - అనేక విధములైన పూజలచేత (పూజా విధానములచేత) (51)

శ్లో॥ అణిమాద్యైర్మహిమభి రజాద్యాభి ర్విభూతిభిః ।
చతుర్వింశతి భిస్త్వస్త్వైః పరీతా మహదాదిభిః ॥ (52)

తా॥ అణిమమొదలగు సిద్ధులచేత, మహిమలచేత - మాయ మొదలగువానిచేత, ఐశ్వర్యములచేత మహత్తు మొదలగు ఇరువది నాలుగు జగత్కారణ తత్త్వములచేతను చుట్టుకొనబడియున్నారు. (52)

టీ॥ అణిమాద్యైరితి. అజాద్యాభిః అజా మాయా. తత్ప్రభృతిభిః. విభూతిభిః శక్తిభిః మహదాదిభిరితి. మహత్సత్త్వయోః పృథక్త్వవివక్షయా చతుర్వింశతితత్త్వైర్జగత్కారణైః. (52)

టీ॥ – అజాద్యాభిః – అజా – మాయా – అది మొదలగునవి – విభూతిభిః – శక్తులచేత మహత్తత్వము మొదలగువానిని విడమరచి చెప్పుదృష్టితో జగత్కారణములైన ఇరువది నాలుగు తత్త్వములతో (ఆవరింపబడి యుండివారు) (52)

శ్లో॥ కాల స్వభావ సంస్కార కామకర్మ గుణైరపి ।
స్వమహిధ్వస్త మహిభి ర్మూర్తి మద్భిరుపాసితాః ॥ (53)

తా॥ కాలము, స్వభావము (నిసర్గత) సంస్కారము (వాసన) కామములు, కర్మలు, గుణములు, ఈశ్వరుని మహిమచే ధ్వంసము చేయబడు 'తమ' మహిమగలవియు, మూర్తిమంతములైన ఈ అన్నింటిచేతను సేవింపబడుచుండువారు. (కాలాదులు మహా మహిమాన్వితములే యైనను ఈశ్వరుని 'మహత్తరత' ముందు మోకరిల్లునవియే) (53)

టీ॥ కాలేతి, కాలాదిభిశ్చ తత్సహకారిభిశ్చ తత్ర స్వభావః పరిణామ హేతుః, సంస్కార ఉద్బోధకః, స్వ మహిధ్వస్తమహిభిః, భగవన్మహిమ్నా తిరస్కృతస్వాత్మ తంత్రైః ఉక్తైః సర్వైరణిమాద్యైః. (53)

టీ॥ – కాలము మొదలగు వానిచేతను, వానికి సహకరించువాని చేతను, అందు స్వభావము పరిణామకారణము. సంస్కారము ప్రేరేపించునది – స్వమహిధ్వస్త మహిభిః – భగవానుని మహిమచేత తిరస్కరింపబడు తను స్వీయతంత్రములచేత చెప్పబడిన అణిమాదు లన్నిటి చేతను – (53)

శ్లో॥ సత్య జ్ఞానానంతానంద మాత్రైక రసమూర్తయః ।
అస్పృష్ట భూరి మాహాత్మ్యా అపి హ్యుపనిషద్దృశామ్ ॥ (54)

తా॥ త్రికాలాబాధ్యమైన అస్తిత్వము, జ్ఞేయసాపేక్షముకాని జ్ఞానము, అవధులులేని వ్యాప్తియు, అంతములేని ఆనందము, ఏకరసమునైన స్వరూపము(లు)గలవారును, ఎప్పుడును ఎవ్వారును స్పృశింపని గొప్ప మాహాత్మ్యముగల వారయ్యును, ఉపనిషద్ద్రష్టలకును అందనివారు.(54

టీ॥ – సర్వేషాం స్వరూపత్వేఽపి విశేషమాహ – సత్యేతి. సత్యాశ్చ. జ్ఞానరూపాశ్చ అనంతాశ్చ ఆనందరూపాశ్చ తత్రాపి తదేకమాత్రాః. విజాతీయసజాతీయ భేదరహితాః తత్రాపి చైకరసాః సదైకరూపా మూర్తయో యేషాం తే. యద్వా. సత్యజ్ఞానాదిమాత్రైకరసం యద్బ్రహ్మ. తదేవ మూర్తిర్యేషామితి. అత ఏవ ఉపనిషత్. ఆత్మజ్ఞానం. సైవ దృక్ చక్షుర్యేషాం తేషామపి. హి నిశ్చితం. అస్పృష్టభూరిమాహాత్మ్యాః న స్పృష్టం స్పర్శనాయోగ్యం భూరి మాహాత్మ్యం యేషాం తే. తథా భూతా స్సంతః సర్వేవ్యదృశ్యంతేతి. (54)

టీ॥ – అందఱికిని స్వరూపత్వమున్నను విశేషమును చెప్పుచున్నాడు. సత్య'రూపులు', జ్ఞానరూపులు అంతములేనివారు. ఆనంద 'స్వరూపులు' – అయినను ఒకటి మాత్రమే అనుటకు దృశ్యత్వమునొందినవారు. విజాతీయసజాతీయ భేదములేనివారు. అట్లైనను ఏక రసులు సత్పదార్థమగు బ్రహ్మము ఒకే రూపము అనుటకు స్వరూపములు ఎవరికి గలవోవారు. లేక సత్యము జ్ఞానము మొదలగు లక్షణములతో ఏక రస మాత్రమైన ఏ బ్రహ్మముకలదో అదియే స్వరూపముగా ఎవరికి గలదో వారు అని. అందువలననే – ఉపనిషత్ – ఆత్మజ్ఞానము – అదియేచూపు ఎవరికి గలదో వారలకు కూడ – హి – నిశ్చయము – అస్పృష్టభూరి మాహాత్మ్యాః – నస్పృష్టం – స్పర్శకు సాధ్యముకాని గొప్ప మాహాత్మ్యము ఎవరికిగలదో వారు అందరును అట్లగుచు కన్పట్టిరి అని. (54)

శ్లో॥ ఏవం సకృద్దదర్శాజః పరబ్రహ్మాత్మనోఽఖిలాన్ ।
యస్యభాసా సర్వమిదం విభాతి స చరాచరమ్ ॥ (55)

తా॥ ఇట్లు పరబ్రహ్మాత్ములగు ఆ అందఱిని బ్రహ్మదేవుడు ఒకేసారి చూచెను. ఎవడు ప్రకాశించుచుండిన ఈ చరాచర జగత్తంతయును ప్రకాశించునో అట్టి బ్రహ్మమును బ్రహ్మ చూచెను. (55)

టీ॥ – ఏవమితి. ఏవం సకృత్ ఏకదైవ. దదర్శ. పరబ్రహ్మణో విశేషణం యస్యేతి. (55)

టీ॥ ఏవం – ఇట్లు, సకృత్ – ఒక్కసారియే –దదర్శ – చూచెను. ఏది పరబ్రహ్మకు ఏది లక్షణమో – అని. (55)

శ్లో॥ తతోఽతి కుతుకోద్వృత్య స్తిమితైకాదశేంద్రియః ।
తద్ధామ్నా భూదజస్తూష్ణీం పూర్దేవ్యంతీవ పుత్రికా ॥ (56)

తా॥ అప్పుడు మిక్కిలి ఆశ్చర్యముతో క్షభితుడై, పదునొకండు ఇంద్రియములు స్తంభించిపోవగా బ్రహ్మదేవుడు వారియొక్క తేజస్సుచేత స్తబ్ధుడై, వ్రజాధిష్ఠాత్రియైన ఏదో దేవతముందు ఒక (నాలుగు ముఖముల) ప్రతిమవలె ఊరక ఉండిపోయెను. (56)

టీ॥ తత ఇతి. అతికుతుకేన అత్యాశ్చర్యేణ ఉద్వృత్య దృష్టిం పరావృత్య హంసపృష్ఠే పరావృత్యేతి వా. కుతుకశబ్దే తృతీయాయాః ఛాందసోలుక్. పాఠాంతరే తు. అతికుతుకేనోద్వృత్తః క్షుభితః. తేషాం ధామ్నా తేజసా. స్తిమిత సర్వేంద్రియో బ్రహ్మ తూష్ణీం నిశ్చలోఽభూత్. అత్ర దృష్టాంతః పూర్దేవీ వ్రజాధిష్ఠాత్రీ కాచిద్దేవతా తస్యాః. అంతి సమీసే పుత్రికా చతుర్ముఖీ కనక ప్రతిమేవ. (56)

టీ॥ – అతి కుతుకేన – మిక్కిలి ఆశ్చర్యముతో – కుతుక శబ్దమునకు తృతీయా విభక్తి లోపము ఛాందసము–ఉద్వృత్య – దృష్టిని పైకి మరల్చి – లేక హంస వీపుననే పైకి తిరిగి – అనియు – పాఠాంతరమున – అతి కుతకేన ఉద్వృత్తః–క్షుభితుడై – వారి యొక్క తేజస్సు చేత – స్తిమిత సర్వేంద్రియః – ఇద్రియములన్నియు స్తంభింపగా – బ్రహ్మ –బ్రహ్మదేవుడు–తూష్ణీం–ఊరక–నిశ్చలోఽభూత్ – చలనములేని వాడయ్యెను. దీనిని దృష్టాంతము – పూః – దేవీ – వ్రజమునధిష్ఠించి

శ్లో॥ ఇతీరేశేఽ తర్క్యే నిజమహిమని స్వ ప్రమితికే
పరత్రాజాతో తన్నిరసనముఖ బ్రహ్మకమితౌ ।
అనీశోపి ద్రష్టుం కిమిదమితి వా ముహ్యతిసతి
చఛాదాజో జ్ఞాత్వా సపది పరమోఽజా యవనికామ్ ॥ (57)

టీ॥ ఏవం మోహనిమగ్నమజముజ్జ హరేత్యాహ–ఇతీతి. ఇరా సరస్వతీ తస్యా ఈశే బ్రహ్మణి. కిమిదమితి ముహ్యతి సతి. పశ్చాత్తద్ద్రష్టుమప్యనీశే సతి. పరమః అజః శ్రీకృష్ణః. సపది. అజా యవనికాం మాయారూపాం తిరస్కరణీం యయాద్భుతం. దర్శితం తాం చఛాద తిరోధత్త. అపసారితవానిత్యర్థః. అథవా. అయం లోకాభిమానీ మమైశ్వర్యం. ద్రష్టుమయోగ్య ఇతి తస్యోపరి మాయాం

యున్న దేవత – కాచిత్ దేవతా – ఏదోదేవత – ఆమె యొక్క – అంతి – అతి సమీపమున – పుత్రికా – నాలుగు ముఖములుగల బంగారపు ప్రతిమవలె. (56)

తా॥ తర్కముచే గోచరముకాని వాడు, తనదైన అసాధారణమైన మహిమ గలవాడు, తనకు తానే ప్రమాణమైనవాడు. ఇతర ప్రామాణ్య విషయమున, ఆ ఇతరములను తిరస్కరించు ద్వారమున కలుగు బ్రహ్మానందమునకు ప్రమాణమైనవాడును, అయిన ఆ పుట్టుకలేని పరమాత్ముని మాయను చూచుటకుకూడ సమర్థుడు కాజాలని, "ఇదియేమిటి?"అని భ్రమచెందు ఆ సరస్వతీపతియగు బ్రహ్మదేవుని స్థితిని గమనించిన పరమేశ్వరుడు (అజుడగు కృష్ణుడు) తక్షణమే అతని నుండి మాయ అను తెరను తొలగించెను. (57)

టీ॥ ఇరా–సరస్వతి –తస్యాః – ఆమె యొక్క. ఈశే(ఈశః) భర్తయగు బ్రహ్మ – సతి ( సప్తమి) ఇది ఏమి అని ఆశ్చర్యముతో భ్రమ పడుచుండగా, తరువాత మరల ఆ కృష్ణుని మాయను చూచుటకు అసమర్థుడగుచుండగా – పరమః, అజః – శ్రీకుష్ణుడు – సపది – వంటనే – అజా యవనికాం – మాయ అను తెరను – అద్భుతములు చేయు మాయా రూపమగు తిరస్కరిణిని తొలగించెను. దేని చేత

ప్రసారితవానిత్యర్థః. క్ష్వముహ్యాతి సతి. అతర్క్యే తర్కాగోచరే. నిజః అసాధారణో మహిమా యస్య తస్మిన్ ఇతి మోహహేతురుక్తః. దర్శనాయోగ్యత్వాయ త్రీణి విశేషణాని. స్వప్రమితిః స్వప్రకాశం చ. యత్కం సుఖం చ యస్మిన్. అత ఏవ. అజాతః ప్రకృతేః పరత్ర పరస్మిన్. అత ఏవ అతన్నిరస నముఖేన బృంహకైః శ్రుతిశిరోభిః. మితిః జ్ఞానం యస్మిన్ తస్మిన్ స్వరూపే. (57)

అద్భుతము దర్శింపజేయబడినదో దానిని చఛాద - వెనుకకు తీసికొనెను. తొలగించెనని యర్థము. లేక - ఇతడు లోకము నందు అభిమానము గలవాడు నా ఐశ్వర్యమును చూచుటకు యోగ్యుడుకాడు అని అతనిపై మాయను ప్రసరింపజేసెను అని యర్థము. ఏ స్వరూపమునందు భ్రమపడెను అను విషయమును చెప్పుచున్నాడు - అతర్క్యే - తర్కమునకు గోచరింపని - నిజః - అసాధారణమైన - మహిమా - గొప్పదనము - ఎవనియందో వానియందు - అని భ్రమకు కారణము చెప్పబడినది. చూచుటకు యోగ్యతలేదనుటకు మూడు విశేషణములు - స్వప్రమితిః - తన తేజస్సు - యత్ కంసుఖం చ యస్మిన్ - ఎవని యందు ఏ ఆనందముగలదో - అందులకే పుట్టువులేని వాడు - ప్రకృతేః పరత్ర - ప్రకృతికంటె భిన్నమైన స్థానము గలవాని యందు - పరస్మిన్ - ప్రకృతీతరుని యందు - అందుకే బ్రహ్మము కన్న నితరమైన పదార్థమును నిరసించుట ద్వారా ఉపనిషత్తులచే ఉద్ఘాటింపబడిన, మితిః - జ్ఞానము ఎవనియందుగలదో అట్టి వాని స్వరూపము నందు. (57)

శ్లో॥ తతో–ర్వాక్ప్రతిలబ్ధాక్షః కఃపరేత వదుత్థితః ।
కృచ్ఛ్రాచ్ఛనైర్మిల్య దృష్టీరాచషష్టదం సహాత్మనా ॥ (58)

తా॥ తరువాత వెంటనే బ్రహ్మదేవుడు, చనిపోయినవాడు లేచినట్లు లేచి, దృష్టిని పొంది, మిక్కిలి కష్టముతో మెల్లగా కన్నులు తెరచి, తనను తానుతో బాటు ఈ జగత్తును కూడ చూచెను. (58)

టీ॥ - తత ఇతి. అర్వాగ్భహిః ప్రతిలబ్ధాన్యక్షిణి యేన సః పరేతవత్ మృతో యథా. కథంచిత్ పునరుత్తిష్ఠతి తథా దృష్టీః నేత్రాణి. (58)

టీ॥ అర్వాక్ - తరువాత - ఎవనిచే కన్నులుపొందబడెనో ఆతడు - పరేతపత్ - చచ్చినవానివలె - ఎట్లు మఱల లేచునో అట్లు - దృష్టీ ః - కన్నులు (చతుర్ముఖత్మమువలన బహువచనము) (58)

శ్లో॥ సపద్యేవాభితః పశ్యన్ దిశోஉపశ్యత్పురస్థితమ్ ।
బృందావనం జనాజీవ్యద్రుమాకీర్ణం సమాప్రియమ్ ॥ (59)

తా॥ వెంటనే ముందునకు చూచుచు, ఆపై దిక్కులు చూచెను. తరువాత జనులకు బ్రదుకుతెరవు నిచ్చు చెట్లతోను, అంతటను ఆహ్లాదము కలిగించు దృశ్యములతో నిండి యున్న బృందావనమును చూచెను. (59)

టీ॥ సపదీతి. జనానామాజీవ్యైరుపజీవ్యైః ద్రుమైరాకీర్ణం. సమాప్రియం సమ్యక్ ఆసమంతాత్ ప్రియాణి యస్మిన్ తత్. (59)

టీ॥ జనానామాజీవ్యైః - జనులకు 'ఉపాధిని' కల్పించుచెట్లతో నిండిన-సమాప్రియం -చక్కగా అంతటను ప్రియమును కలిగించునవి దేనియందుగలవో అవి. (59)

శ్లో॥ యత్ర నైసర్గ దుర్వైరా స్సహాసన్న మృగాదయః ।
మిత్రాణీవాజితా వాసాత్ ద్రుతరుట్త రుషాదికమ్ ॥ (60)

తా॥ స్వాభావిక శత్రుత్వముగల సింహములు, లేళ్లు మొదలైనవి. కృష్ణుని నివాసమువలన క్రోధము. లోభము మొదలగువాని నుండి దూరముగ నుండి స్నేహితుల వలె సహజీవనము చేయుచుండునో అట్టి బృందావనమును బ్రహ్మచూచెను. (60)

టీ॥ తదాహ -యత్రేతి. నైసర్గికదుర్వైరాః స్వాభావికా ప్రతికార్య వైరవంతోఽపి నరాః. సింహాదయశ్చ మిత్రాణీవ యత్ర సహైవాసన్. అజితస్య శ్రీకృష్ణస్య ఆవాసేన. ద్రుతాః పలాయితాః రట్తర్షాదయః క్రోధలోభాదయో యస్మాత్తత్తథా భూతం. అత్ర తరుషేతి వర్ణవిశ్లేషః ఛందోనురోధేన. బృందావనమపశ్యదితి. (60)

టీ॥ - నైసర్గిక దుర్వైరాః - స్వాభావికముగ ప్రతీకారము చేయనెంచు శత్రుభావముగలవియైనను - మనుష్యులు, సింహములు మొదలగునవి స్నేహితులవలె ఎచటకలిసియుండునో అజితస్య - శ్రీకృష్ణునియొక్క - నివాసమగుట చేత - ద్రుతాః - పలాయనమగును. (దూరమగ నుండును) రుట్తర్షాదయః - క్రోధము, లోభము మొదలగునవి ఎవరి నుండి పలాయితములగునో అట్టివి. ఇచట తరుష అని వర్ణ విశ్లేషము చేయుట (తర్షఅని వాడుటకు బదులు 'తరుష' అని వాడుట) ఛందస్సు అనుకూలించుటకొఱకు - బృందావనమును చూచెను అని. (60)

శ్లో॥ తత్రోద్వహత్పశుపవంశ శిశుత్వనాట్యం
బ్రహ్మాద్వయం పరమనంతమగాధబోధమ్ ।
వత్సాన్ సఖీనివ పురా పరితోవిచిన్వ
దేకం సపాణికబళం పరమేష్ఠ్యచష్ట ॥ (61)

తా॥ అద్వయ బ్రహ్మమగు కృష్ణుడు గోపాలక వంశమునందలి ఒక బాలుడుగ నాట్యము చేయుచుండగ బ్రహ్మదేవుడు చూచెను. పరమాత్ము డొక్కడేయైనను అతనికి మిత్రులుండిరి. కాపాడవలసిన దూడలుండెను. అనంతుడైనను అతడు చుట్టుప్రక్కల దూడలను, బాలురను వెదకుచు అటు నిటు తిరుగుచుండెను. అతనిజ్ఞానము అగాధమైయున్నను వారికొఱకు వెదకుచెండెను. శ్రీకృష్ణుడు మొదట తనచేతిలో పెరుగన్నపు ముద్దనుంచుకొని యెట్లు వెదకుచుండెనో బ్రహ్మదేవున కిప్పుడట్లే కసబడెను. ఆతడు పరముడయ్యుసు శిశువుగ కన్సట్టుటయు వింతయే. (61)

టీ॥ తత్రేతి. తత్ర చ పరమేష్ఠీ బ్రహ్మ పురా పూర్వవదేవ. బ్రహ్మ ఆచష్ట అపశ్యత్ కథంభూతం పశుపవంశశిశుత్వనాట్యముద్వహత్. నాట్యమిత్యత్ర హేతుః అద్వయమిత్యాది. అద్వయం చ వత్సాన్ విచిన్వత్. ఏకం చ సఖీన్ అగాధ బోధం చ విచిన్వత్. అనంతం చ పరితో విచిన్వత్. పరం చ శిశుత్వముద్వహత్. బ్రహ్మ చ సుపాణి కబళమితి నాట్యమేవోద్వహదిత్యర్థః. (61)

శ్లో॥ దృష్ట్వా త్వరేణ నిజ ధోరణతోఽవతీర్య
పృథ్వ్యాం వపుః కనకదండమివాభిపాత్య ।
స్పృష్ట్వా చతుర్మకుట కోటిభిరంఘ్రియుగ్మం
నత్వా ముదశ్రుసలిలైర కృతాభిషేకమ్ ॥ (62)

టీ॥ – దృష్ట్వేతి. నిజధోరణతః స్వవాహనాత్. త్వరేణ వేగేన అవతీర్య. దండవన్నత్వా. చతుర్ణాం మకుటానాం. అగ్రైరంఘ్రియుగ్మం స్పృష్ట్వా. ముదశ్రుసలిలైరానందాశ్రురూపైః సుజలైరభిషేకమకరోదితి. (62)

టీ॥ అచటనే బ్రహ్మదేవుడు పూర్వమునందువలెనే అతనిని చూచెను. ఎట్టివానిని? పశుపవంశ శిశుత్వ నాట్యముద్వహత్ – గోవులను పాలించువంశనందలి ఒక శిశువై నాట్యముచేయుచుండగ – నాట్యమనునది, అద్వయము మొదలగువాని కారణము – అద్వయుడయ్యు దూడలను వెదకుచుండెను. ఒక్కడేయయ్యును సఖులను వెదకుచుండెను. అగాధమైన జ్ఞానము కలవాడయ్యును వెదకుచుండెను. అనంతుడయ్యును చుట్టును వెదకెను. శ్రేష్ఠతముడైనను శిశుత్వమును ధరించెను, బ్రహ్మమయ్యును చేతిలో దధ్యన్న కబళముతో నాట్యమే చేసెను అని యర్థము. (61)

తా॥ బ్రహ్మదేవుడు అతనిని చూచి వెంటనే తన వాహనము నుండి దిగి, తన శరీరమును ఒక బంగారపు దండమునువలె భూమిపై పడవేసి (సాష్టాంగముగ నమస్కరించుచు) తన నాలుగు కిరీటముల సమూహముతో అతని (కృష్ణుని) పాదద్వయమును స్పృశించి నమస్కరించి ఆనంద బాష్పజలముతో అభిషేకించెను. (62)

టీ॥ – నిజ ధోరణతః – తన వాహనమునుండి – వేగముగదిగి, దండమువలె ప్రణామముచేసి నాలుగు కిరీటముల అగ్రములతో చరణ ద్వయమును స్పృశించి – ఆనందాశ్రురూపములైన మంచి నీటితో అభిషేకముచేసెను. అని. (62)

శ్లో॥ ఉత్థాయోత్థాయ కృష్ణస్య
చిరస్య పదయోః పతన్ ।
ఆస్తే మహత్త్వం ప్రాగ్దృష్టం
స్మృత్వా స్మృత్వా పునః పునః ॥ (63)

తా॥ చాల సేపటి వఱకు కృష్ణుని పాదములపై పడుచును లేచుచును మఱల మఱల నమస్కరించుచు బ్రహ్మదేవుడు తాను పూర్వము చూచిన కృష్ణుని మహిమలను మఱల మఱల తలచుకొనుచు ఉండి పోయెను. (63)

టీ॥ – ఉత్థాయేతి, చిరస్య చిరం, పాదయోః పతన్నాస్తే. (63)

టీ॥ – చిరస్య – చిరం – చాలసేపు – పాదయోః పతన్నాస్తే – పాదములపై పడుచు ఉండిపోయెను.(63)

శ్లో॥ శనైరథోత్థాయ విమృజ్యలోచనే
ముకుందముద్వీక్ష్య వినమ్ర కంధరః ।
కృతాంజలిః ప్రశ్రయవాన్ సమాహిత
స్సవేపథుర్గద్గదయైడతేరయా ॥ (64)

తా॥ పిమ్మట మెల్లగాలేచి, కన్నులు తుడుచుకొని, కృష్ణుని వైపుచూచి, మెడలు వంచి, అంజలి ఘటించి మిక్కిలి వినయముతో ఏకాగ్రచిత్తుడై, కంపించుచు, గద్గదస్వరముతో ఆతనిని వాక్కులతో స్తుతించెను. (64)

టీ॥ – శనైరితి, సవేపథుః సకంపః, అత ఏవ, గద్గదయా అనుకరణమే తత్, ఇరయా వాచా ఐడత అస్తౌత్. (64)

టీ॥ సవేపథుః – కంపముతో కూడిన వాడై – అందులకే గద్గదముగా (ఇది అనుకరణము) ఇరయా – వాక్కుతో – ఐడత – స్తుతించెను. (64)

**శ్రీ మద్భాగవతే, మహాపురాణే దశమస్కంధే, త్రయోదశోఽధ్యాయః**

**అని శ్రీమద్భాగవతమున దశమస్కంధమందు పదమూడవ అధ్యాయము సమాప్తము.**

## చతుర్దశోఽధ్యాయః

బ్రహ్మోవాచ.

**శ్లో॥** నౌమీడ్య తేఽభ్రవపుషే తటి దంబరాయ
గుంజావతంస పరిపింఛలసన్ముఖాయ ।
వన్యస్రజే కబళవేత్ర విషాణవేణు
లక్ష్మశ్రియే మృదుపదే పశుపాంగజాయ ॥ (1)

**టీ॥** – "చతుర్దశేఽద్భుతం దృష్ట్వా పూర్వాగంతుకనిశ్చయమ్, అనీశః కర్తుమషీత్కృష్ణం బ్రహ్మాతి మోహితః,". స్వకృతాపరాధేన, భియా సకంపయా, భగవన్మహిమానమనవగాహమానో యథా దృష్ట స్వరూపమేవ కీర్తయన్నాహ నౌయితి హే ఈడ్య స్తుత్య తే తుభ్యం నౌమి నమ ఇత్యర్థః యద్వా ద్వితీయార్థే చతుర్థీ అథవా – నౌమీత్యుక్త్వా ప్రస్తుతస్య భగవతః కర్మత్వేఽజ్ఞాతే. ప్రయోజనాపేక్షాయామేవం భూతః

## పదునాలుగవ అధ్యాయము

బ్రహ్మభగవానుడిట్లనెను

**తా॥** (ఇట్లుస్తుతించెను.) స్తుతింపదగినవాడా! ఆకాశపువర్ణము వంటి వర్ణముగల శరీరము, మెరుపును బోలిన వస్త్రములు గలవాడవగునీకు నమస్కరించుచున్నాను. గురిగింజల కర్ణభూషణములు గలవాడా! తలపై నెమిలిపింఛము గల వాడవును, దానితో ప్రకాశించు ముఖము గలవాడవును, అడవి పవ్వుల దండ ధరించియున్నవాడవును, పెరుగన్నము ముద్ద, బెత్తము కొమ్ముువాద్యము, పిల్లనగ్రోవి కలిగియున్న వాడవును, కళలుమున్నగు వానిచేతను, చిహ్నముల చేతను శోభించు వాడవును, మృదువైన పాదములు (మాటలు) గల వాడవును, గోపాలకు నకు కుమారుడుగనున్నవాడవు – లేక గోపాలకులో మన్మథుని వంటి వాడవునునైన నీకు నమస్కారము. (1)

**టీ॥** – పదునాల్గవ అధ్యాయమున, 'ఇతడు పూర్వము వచ్చినవాయే యని నిశ్చయము చేయుటకు అసమర్థుడైన బ్రహ్మదేవుడు అతి మోహితుడై కృష్ణుని స్తుతించెను'. తాను చేసిన అపరాధము వలన భయము చేత వణుకుచు భగవానుని మహిమను అర్థము చేసికొనుచు తాను చూచిన స్వరూపమునే కీర్తించుచు చెప్పుచున్నాడు. హే ఈడ్య – ఓ స్తుతింపదగినవాడా! నీకు నమస్కారము చేయుచున్నాను. అని

భగవానేవ ప్రయోజనమితి తాదర్థ్యే చతుర్థీ. యద్వా. తుభ్యం ప్రసాదయితుం త్వామేవ నౌమీత్యర్థః, అభ్రవద్వపుర్యస్య తస్మై, తటిద్వదంబరే యస్య తస్మై గుంజాభిరవంతం సౌ కర్ణభూషణీ పరితః పింఛం బర్హాపీడం తైర్లసన్ముఖం యస్య తస్మై వన్యాః స్రజో తస్మై కళాదిభిః. లక్ష్మభిఃశ్రీః శోభా యస్య తస్మై. పశుపస్యాం గజాయ, యద్వా, పశూ నింద్రియాణి. సౌతి రక్షంతీతి పశుపాః దేవాః, త ఏవాం గజా, యస్య తస్మై. (1)

యర్థము – ద్వితీయా విభక్త్యర్థమున తాదర్థ్యమున చతుర్థీ విభక్తి. లేక –నిన్ను అనుగ్రహింపజేసికొనుటకొఱకు నీకే నమస్కరించుచున్నానని యర్థము – ఆకాశము వంటి శరీరము ఎవరికో అతనికి – మెఱుపువలె వస్త్రములు (రెండు) ఎవరికో అతనికి (అట్టినీకు) గురింజల తోడి కర్ణ భూషణములు ఎవరికో – చుట్టును నెమిలి పింఛముకూడ, వానిచేత ప్రకాశించు ముఖము ఎవనికి గలదో అట్టి నీకు – అడవి పూల, ఆకుల దండ ఎవనికి గలదో అట్టి నీకు – కళాదులచే, చిహ్నములచే శోభ ఎవనికిగలదో అట్టి నీకు – పశుపస్యాంగజాయ – గోపాలకుని కుమారునకు – లేక పశూన్ – ఇంద్రియములను – పాంతి – రక్షించువారు – దేవతలు. వారే సంతానముగ ఎవనికి గలరో అట్టి నీకు (నమస్కారము) (1)

**శ్లో॥** అస్యాపి దేవవపుషో మదనుగ్రహస్య
స్వేచ్ఛామయస్య నతు భూతమయస్యకోఽపి ।
నేశే మహిత్వ వసితుం మనసాంతరేణ
సాక్షాత్తవైవ కిముతాత్మసుఖానుభూతేః ॥ (2)

**తా॥** ఎవని వలన నాకు అనుగ్రహము లభించునో, ఎవడు తన ఇష్టానుసారమే వర్తించువాడో, పంచభూతాత్మకము కాని దయినను ఎవని శరీరము దేదీప్యమానముగ ప్రకాశించుచుండునో అట్టి అవతారము గల ఇతని మహిమ చిత్తమును నిగ్రహించినను ఎవనికి, బ్రహ్మదేవుడనైన నాకును తెలియజాలకున్నది. ఇక ఆత్మానందము యొక్క అనుభూతిరూపుడుగను ఉన్న ఈ పరమాత్ముని తెలియుటను గూర్చి చెప్పునదేమి? (2)

**టీ॥** – నను నౌమీతి ప్రతిజ్ఞాయ. కిం స్వరూపానువాదమత్రం క్రియతే. అత ఆహ – అస్యాపీతి. హేదేవ అస్యాఽపిః సులభత్వేన ప్రకాశితస్యాపి తవ వపుషః అవతారస్య. మహి మహిమానం. అవసితుం జ్ఞాతుం. కోఽపి కః బ్రహ్మాపి. నేశే న శక్నోమి. యద్వా కశ్చిదపి నేశే న సమర్థ ఆసీత్ సులభత్వాయ విశేషణద్వయం. మదనుగ్రహస్య మహానుగ్రహో యస్మాత్. తస్మదనుగ్రహం తస్య కించ. స్వేచ్ఛా మయస్య. స్వీయానాం యథా యథా ఇచ్ఛా కథా తథా భవతః. తర్హి కిమితి జ్ఞాతుం న శక్యతే అత ఆహ – న తు భూతమయస్య అచింత్య శుద్ధసత్త్వాత్మకస్య. యథాస్యాప్యేవం తథా. కథం పునః సాక్షాత్తవ కేవలస్యాత్మ సుఖానుభూతేః. తావకసుఖానుభవమాత్రస్యానవతారిణో గుణాతీతస్య మహిమానం అంతరేణ. నిరుద్ధేనాపి మనసా కో వా జ్ఞాతుం సమర్థో భవేత్. అథవా నతు. భూతమయస్య. అపి తు విరాడ్రూపస్య తవ. త్వన్నియామ్యస్యాపి వపుషః. మహి అవసితుం. కోఽపి నేశే. తదా సాక్షాత్తవైవాసాధారణస్య నియామ్య నియంతృ భేదరహితస్య. ఉక్త లక్షణస్య అస్య. మహి మహిమానం. అవసితుం కోఽపి నేశ ఇతి కిం వక్తవ్యమిత్యర్థః. (2)

**టీ॥** – ఓదేవా! అస్యాపి –సులభత్వముతో ప్రకాశించుచున్న వాడవైనను నీ అవతారముయొక్క మహి – మహిమను – అవసితుం – తెలిసి కొనుటకు – కః+అపి. బ్రహ్మనైననేనుకూడ – నేశే – సమర్థుడను కాను – లేక – ఎవడును సమర్థుడుకాడు – సులభత్వము కొఱకు రెండు విశేషణములు – మదనుగ్రహస్య – ఎవనివలన నాకు అనుగ్రహము కలుగనో, అది అతని మదనుగ్రహం – మరియు – స్వేచ్ఛామయస్య – తన వారికి ఎట్లెట్లు ఇష్టమో అట్లు నీ యిచ్ఛయు. అయినచో ఎందుకని తెలిసికొనుటకు శక్యముకాదు? చెప్పుచున్నాడు. నతుభూతమయస్య – ఆలోచన కందని శుద్ధ సత్త్వాత్మకునియొక్క – ఇట్టివానినిగూర్చి ఎట్లుతెలియబడదో అట్లే – ఇకమఱి సాక్షాత్తుగ కేవలుడవైన. ఆత్మరూపమైన అనుభూతిస్వరూపముగలవానియొక్క జ్ఞానమెట్లు? నీయొక్క ఆత్మానందానుభూతి మాత్రునియొక్క – అవతార రూపములేనివానియొక్క – గుణములకు అతీతుడైన వానియొక్క మహిమను – అంతరేణ – నిగ్రహించిన–మనస్సుతో తెలిసికొనుటకు ఎవడు సమర్థుడుగును? లేక – భూతమయస్య అపితు–నీ విరాడ్రూపుని యొక్క – నీ నియామ్య శరీరముగలవాని యొక్కయు (ప్రత్యగాత్మచే నియమింపదగిన శరీరముగలవానియొక్క) మహిమను తెలిసికొనుటకు ఎవ్వరును సమర్థులు కారు. అప్పుడు నీదేయైన అసాధారణమైన నిమామ్య – నియంతృ భేదములేని ( శరీర సంబంధములేని కేవలాత్మ

**శ్లో॥** జ్ఞానే ప్రయాసముదపాస్యనమంత ఏవ
జీవంతి సన్ముఖరితాం భవదీయవార్తామ్ ।
స్థానే స్థితాశ్శ్రుతిగతాంతను వాఙ్మనోభి
ర్యేప్రాయశోఽజితజితోఽప్యసితైస్త్రిలోక్యామ్ ॥ (3)

**టీ॥** – తర్హి అజ్ఞా కథం సంసారం తరేయురత ఆహ–జ్ఞాన ఇతి. ఉదపాస్య ఈషదప్యకృత్వా సద్భిర్ముఖరితాం సత్వ ఏవ నిత్యం ప్రకటితాం భవదీయాం వార్తాం స్వస్వస్థాన ఏవ స్థితాస్సంతః సన్నిధిమాత్రేణ స్వత ఏవ శ్రుతిం గతాం శ్రవణం ప్రాప్తాం. తనువాఙ్మనోభిః. నమంతః సత్కుర్వంతః. యే జీవంతి కేవలం. యద్యపి నాన్యత్ కుర్వంతి. తైః ప్రాయశః త్రిలోక్యామన్యైరజితోఽపి హే అజితత్వం జితః ప్రాప్తోఽసీతి. కిం జ్ఞానశ్రమేణేత్యర్థః. (3)

స్వరూపము యొక్క) చెప్పబడిన లక్షణములుగల ఇతని మహిమను అవగాహన చేసికొనుటకు ఎవ్వారును సమర్థులుకారు అనినని చెప్పదగినదేమి కలదు? (2)

**తా॥** జ్ఞానమునందు పరిశ్రమించుటను పూర్తిగవదలి, తమ తమ స్థానముల యందే ఉండి, సత్పురుషులచేత ప్రకటింపబడుచుండు నీ కథా విశేషములను వినుచు, మనోవాక్కాయములచే సత్కర్మలను ఆచరించుచు ఎవరు జీవించుచుందురో ప్రాయికముగ, ఈ ముల్లోకములలోను ఎవ్వరిచే జయింపబడని నీవు – వారి చేత జయింపబడు వాడవగుచున్నావు. (3)

**టీ॥** – అయినచో అజ్ఞానులు సంసారమునెట్లుతరింపగలరు? ఇట చెప్పుచున్నాడు. ఉదపాస్య – కొంచెముకూడ చేయనివారై – సద్భిర్ముఖరితాం – సత్పురుషులచేత నిత్యము ప్రకటింపబడుచుండిన – భవదీయాం వార్తాం – నీ కథా విశేషమును – స్వస్థానములందే నివసించుచు – సమీపముననుండుట మాత్రము చేతనే తమకు తామే శ్రవణమును పొంది, శరీరము, వాక్కు, మనస్సులచేత – సమంతః – భగవత్కృత్యము నాచిరించుచు – యే జీవంతి కేవలం – ఎవరు జీవనమాత్రమును సాగించుచుందురో – వేఱేమియు చేయకుందురో – తైః – వారిచేత –ప్రాయశః సాధారణముగ – త్రై లోక్యాం –

**శ్లో॥** శ్రేయస్సృతిం భక్తిముదస్య తే విభో
క్లిశ్యంతి యే కేవలబోధ లబ్ధయే ।
తేషామసౌ క్లేశల ఏవ శిష్యతే
నాన్యద్యథా స్థూల తుషావఘాతినామ్ ॥ (4)

**టీ॥** – భక్తిం వినా జ్ఞానం తు నైవ సిద్ధ్యేదిత్యాహ–శ్రేయ ఇతి. శ్రేయసామభ్యుదయాపవర్గ లక్షణానాం. శృతిః శ్రవణం యస్యాః సరస ఇవ నిర్ఝరాణాం తే తవ. భక్తిం ఉదస్య త్యక్త్వా. శ్రేయసాం మార్గభూతామితి వా. తేషాం క్లేశలః క్లేశ ఏవ శిష్యతే. నాన్యత్. అయం భావః. యథా అల్పం ప్రమాణం ధ్యానం పరిత్యజ్య. అంతః కణవిహీనాన్ స్థూలాన్. ధాన్యాభాసాన్ తుషానేవావఘ్నంతి. తేషాం న కించిత్ ఫలం. ఏవం భక్తిం తుచ్ఛీకృత్య. యే కేవలబోధాయ. ప్రయతం తే తేషామపీతి. (4)

ముల్లోకములందు – ఇతరులచే జయింపబడకున్నను – ఓ జయింపబడని వాడా! నీవు – జితః – ప్రాప్తించిన వాడవగుదువు. జ్ఞానక్రమముతో పనియేమి? అని అర్థము. (3)

**తా॥** ప్రభూ! అభ్యుదయ నిశ్శ్రేయసములకు సరళ మార్గమగు 'భక్తి'ని విడిచి కేవలమైన జ్ఞానము పొందుటకు ఎవరు కష్ట పడుచుందురో వారికి ఆ కష్టమే మిగులును. మరియొక విధమున జరుగదు – ఇట్టివారు స్థూలమైన ఊఁకనుదంచెడు వారగుచున్నారు. (4)

**టీ॥** – భక్తిలేని జ్ఞానమైనచో అది సిద్ధింపదని చెప్పుచున్నాడు – శ్రేయసాం – అభ్యుదయ–ముక్తిలక్షణములకు – సృతిః – మార్గమగు 'శ్రవణము', ఎవరికి స్వచ్ఛమైన నీరుగల సెలయేళ్లవంటివో వారు. నీయొక్క భక్తిని – ఉదస్య – విడిచి – లేక శ్రేయస్సులకు మార్గభూతమైనట్టి – అనియో వారికి – క్లేశలః – కష్టమే మిగులును. మరియొకటి కాదు. దీనిభావమిది – కొద్ది ప్రమాణమున మాత్రమేకల ధాన్యమును విడిచిపెట్టి – లోపల గింజయే లేని – స్థూలాన్ – ధాన్యము వలె కనబడు ఊకనే దంచెదరో వారికి కొంచెమైనను ఫలితముఉండదు – ఈ విధముగనే భక్తిని శూన్యమైనదిగచేసి – ఎవరు కేవల జ్ఞానము కొఱకు మిక్కిలిగ యత్నించెదరో వారికి కూడ అని (4)

**శ్లో॥** పురేహ భూమన్ బహవోఽపి యోగిన
స్త్వదర్పి తేహ నిజకర్మలబ్ధయా ।
విబుధ్య భక్త్యైవకథోపనీతయా
ప్రపేదిరే భోఽచ్యుత తే గతిం పరామ్ ॥ (5)

**టీ॥** – భక్త్యైవ జ్ఞానం. నాన్యథేత్యత్ర సదాచారం ప్రమాణయతి –పురేతి. హే భూమన్. ఇహ లోకే పూర్వం యోగినోఽపి సంతః యోగైర్జ్ఞాన మప్రాప్య పశ్చాత్త్వదర్పితేహాః త్వయ్యర్పితా లౌకిక్యపి. ఈహా చేష్టా యైస్తే నిజకర్మ లబ్ధయా త్వదర్పితైః నిజైః కర్మభిః లబ్ధయా యద్వా. త్వయ్యర్పితా. ఈహా చ. నిజాని కర్మాణి చ. తైర్లబ్ధయేత్యేకం పదం. కథోపనీతయా కథయా త్వత్సమీపం ప్రాపితయా. భక్త్యైవ విబుధ్య ఆత్మానం జ్ఞాత్వా అంజః సుఖేనైవ. తే పరాం.గతిం ప్రాప్తాః ఏవం తావత్సగుణనిర్గుణయోరపి జ్ఞానం దుర్ఘటమపి త్వత్కథాశ్రవణాదినైవ. త్వత్ప్రాప్తిః నాన్యథేత్యుక్తం భవతి. (5)

**తా॥** ఓ అచ్యుతా! ఓ ఆనందరూపా! ఈలోకమున పూర్వమెందరో యోగులు, నీకే అర్పించిన చేష్టలుగలవారై, తమ పూర్వకర్మఫలముగా లభించిన తెలివి చేత మేల్కొని (తెలసికొని) నీభక్తి కథల శ్రవణ కీర్తనాదులచే నీ సమీపమునకు కొనిపోబడి, నీ ఉత్తమమైన స్థితియగు మోక్షమును పొందిరి. (5)

**టీ॥** – భక్తిచేతనే జ్ఞానము. ఇతర విధముగకాదు అవి ఇచట పెద్దల ఆచారమును ప్రమాణీకరించుచున్నాడు – ఓ ఆనందస్వరూపా! ఈ లోకమునందు వెనుకటి కాలమున యోగులకూడ – సత్పురుషులు యోగసాధనల చేత జ్ఞానమును పొందనేరక, తరువాత, నీకే అర్పించిన –ఈహాః–నీ యందే సమర్పింపబడిన – లౌకికములు కూడ – చేష్టలు –ఎవరి చేతనో వారు, తమ కర్మచే లభింపబడిన – నీకే అర్పింపబడిన – తమ కర్మలచేత లభింపబడిన – లేక – నీయందు అర్పింపబడిన చేష్టలు, తమ కర్మలు కూడ–దానిచే లభించిన దాని చేత – అని ఒకే పదము – కథోపనీతయా – కథ(ల)చే నీ సమీపమున చేరుటచేత – భక్తిచే మాత్రమే–విబుధ్య – ఆత్మను తెలిసికొని – అంజః – సుఖముగానే – వారు ఉత్తమమైన గతినిపొందిరి. ఈ విధముగ సగుణ నిర్గుణముల యొక్క జ్ఞానము కూడ దుస్సాధ్యమనియు – నీ యొక్క కథలు, లీలలు మొదలగునవి శ్రవణముచేయుట, కీర్తించుటమున్నగు వానిచేతనే నీవుప్రాపింతువు. ఇతర విధముగ కాదని చెప్పినట్లైనది. (5)

**శ్లో॥** తథాపి భూమన్ మహిమా గుణస్య తే
విబోద్ధుమర్హత్యమలాంతరాత్మభిః ।
అవిక్రియాత్స్వాను భవాదరూపతో
హ్యనన్య భోధ్యాత్మతయా నచాన్యథా ॥ (6)

**టీ॥** – యద్యప్యుభయోరపి విశేషేణ దుర్జ్ఞేయత్వముక్తం. తథాపి గుణాతీతస్య జ్ఞానం కథంచిద్భవేత్. న తు సగుణస్య తవ అచింత్యానంత గుణత్వాదితి స్తౌతి. –శ్లోకద్వయేన. తథాపీతి. హే భూమన్ అపరిచ్ఛన్న అగుణస్య తే మహిమా. అమలైరంతరాత్మభిః ప్రత్యాహృతేంద్రియైః విబోద్ధుం బోధే గోచరీభవితుం అర్హతి యోగ్యో భవతి. అథవా విబోద్ధుం జ్ఞాతుమర్హతి శక్యత ఇత్యర్థః. యద్వా. మహిమేతి మహిమానం కశ్చిద్బోద్ధుమర్హతీత్యర్థః. కథం స్వానుభవాత్ ఆత్మాకారాంతఃకరణవృత్తి సాక్షాత్కారాత్. నన్వంతఃకరణమపి స వికారమేవ విషయీ కరోతి. కథమాత్మాకారతా తస్యేత్యత ఆహ –అవిక్రియాదితి. విక్రియా విశేషాకారః తద్రహితాత్. విశేషపరిత్యాగ ఏవాత్మాకారతేత్యర్థః. నన్వంతః కరణ సాక్షాత్కారవిషయత్వే నానాత్మత్వ ప్రసంగస్స్యాదత ఆహ – అరూపత ఇతి. రూపం విషయః అవిషయాత్. వృత్తివిషయత్వ మేవాత్మనః. న ఫలవిషయత్వం. అతో నాయం దోష ఇతి భావః. కథం తర్హి స్ఫూర్తిః

**తా॥** ఓ ఆనందస్వరూపా! అట్లైనను, గుణాతీతుడవైన నీ మహిమను తెలిసికొనుటకు నిర్మలమైన – ఇంద్రియ నిగ్రహముతోడి, అంతః కరణములతో మాత్రమే సాధ్యము. నీ నైరూప్యతను, ఎట్టి వికారము నొందని, స్వకీయమైన అనుభూతితో – ఇతరమైనదేదియు గ్రహింపని – కేవలము నిన్ను మాత్రమే గ్రహింపగలిగెడు మనస్సుతో 'అవగాహన' చేసికొనవచ్చును. అన్యథా సాధ్యముకాదు. (6)

**టీ॥** – సగుణము, నిర్గుణము అను నీరెండు తత్త్వములను తెలిసికొనగలుగుటలోనున్న దుస్సాధ్యత్వము విశేషముగనే చెప్పబడినది. – అట్లైనను – గుణాతీతుని (నిర్గుణుని) జ్ఞానము ఏదో విధముగ పొందవచ్చును. కానీ నీ సగుణ తత్త్వముయొక్క జ్ఞానము మాత్రము పొందజాలము. నీ ఆలోచనకందని యసంఖ్యాకములైన గుణముల వలన అని స్తుతించుచున్నాడు రెండు శ్లోకములతో. ఓ ఆనందా విభజించుటకు సాధ్యముకాని గుణములుకల నీ యొక్క ఘనత – అమలైరంతరాత్మభిః – ప్రాపంచిక విషయములనుండి మరల్చిన ఇంద్రియములచే (మనస్సుచేత) విబోద్ధుం – తెలియుటకు చేయు యత్నమున బుద్ధి గోచరమగుటకు తగియుండును. అనగా యోగ్యమగును – లేక – తెలిసికొనుటకు శక్యమగును అనియర్థము – లేక – మహిమను ఒకడు తెలిసికొనుటకు అర్హుడగునని యర్థము. – ఎట్లు? స్వీయమగు అనుభవము వలన – ఆత్మరూపమగు

అనన్యబోధ్యాత్మతయా స్వప్రకాశత్వేనైన న త్వన్యథా. ఇదం తదితి విషయత్వేనేత్యర్థః. అథవా. మా. సర్వంతోఽ ంతరంగా లక్ష్మీరపి యథా యాదృగ్వస్తు తథా తేన రూపేణా విబోద్ధుం. కిమర్హతి నార్హ త్యేవేత్యర్థః కథం తర్హ్యర్హతి? తదాహ–స్వానుభవాదిత్యాదినా. ఉక్తార్థమేవైతత్. (6)

మనోవృత్తిని ప్రత్యక్షము చేసికొనుటవలన–కాని నిశ్చయముగ మనస్సు కూడ వికారముతో కూడుకొనినదే కదా! అది ఎంతటి అంశమునైనను 'విషయముగా' చేయును గదా! మఱి దానికి ఆత్మాకారత ఎట్లు సంభవించును? అను దానికి ఇట చెప్పుచున్నాడు. విక్రియా – విశేషమైన ఆకారము – అదిలేని విధముగ – 'విశేష' పరిత్యాగమే ఆత్మాకారతయని యర్థము – అంతఃకరణ సాక్షాత్కార విషయత్వమున "ఆత్మలు అనేకములు" అను ప్రసంగము వచ్చును – దానినిగూర్చి చెప్పుచున్నాడు – "అ రూపతః" అని – రూపము అనగా విషయము – అరూపతః అనగా అవిషయము వలన – ఆత్మకు (అంతఃకరణకు) వృత్తి విషయత్వమేగాని ఫలవిషయత్వములేదు. అందుచే ఇట దోషమేమియులేదు. అనిభావము. అట్లైనచో మఱి – 'అనన్య బోధ్యాత్మతయా– స్వప్రకాశత్వముచేతనే – ఇతర విధముగకాదు. అనెడు స్ఫురణ ఎట్లుకలుగును?–ఇది అదియే అనెడు విషయత్వముతో అని అర్థము. లేక – మా = లక్ష్మి – అంతటను అంతరంగముగల లక్ష్మియు ఎట్లు, ఏ విధముగ కనబడు వస్తువు–అట్లు–ఆ విధమైన రూపముతో నర్థము చేసికొనుటకు ఏమిఅర్హత గలదియగునును? ఏదియు అర్హతగలదికాకపోవును. మఱి అప్పుడు ఏది అర్హమగును? అది చెప్పుచున్నాడు. 'స్వానుభవాదిత్యాదినా' అని మొదలగు మాటలచే – అది లోగడ చెప్పబడినదే. (6)

**శ్లో॥** గుణాత్మనస్తేఽపి గుణాన్ విమాతుం
హితావతీర్ణస్య క ఈశిరేఽస్య ।
కాలేన యై ర్వా విమితా స్సుకల్పై
ర్భూ పాంసవః ఖే మిహికాద్యుభాసః ॥ (7)

**తా॥** విశ్వమంతటికి మేలు కూర్చుటకు అవతరించినవాడవు, గుణమయుడవు అయిన నీ యొక్క అసంఖ్యాకములైన గుణములను లెక్కించుటకు ఎవరు సమర్థులైరి? నిపుణులైన గొప్ప గణకులచేత, వారి బహుజన్మలకాలమునందు, భూమియందలి మట్టి కణములుగాని, ఆకాశమునందలి హిమకణములుగాని, అంతరిక్షమునందలి ప్రకాశ కిరణ కణములుగాని లెక్కింపబడెనా? (7)

**టీ॥** – గుణాత్మన ఇతి. గుణాత్మ నః గుణానామాత్మనః గుణాధిష్ఠాతుః తే తవ పునః. గుణాన్ విమాతుం ఏతావంత ఇతి గణయితుమపి. క ఈశిరే సమర్థా బభూవుః. దూరతస్తద్విశేషవార్తా. కథం భూతస్య తవ అస్య విశ్వస్య హితాయ పాలనాయ. బహుగుణా నిష్కారేణావతీర్ణస్య. నను కాలేన నిపుణైః కిం కర్తుమశక్యమత ఆహ–కాలేనేతి. వా శబ్దో వితర్కే, సుకల్పైరతినిపుణైః. బహుజన్మనా కాలేన భూపరమాణవో విమితా విశేషేణ గణితా భవేయుః. తథా ఖే. మిహికాద్యుభాసః మిహికా హిమకణా అపి. తథా ద్యుభాసః దివి నక్షత్రాదికిరణపరమాణవోఽపి. (7)

**టీ॥** – గుణాత్మకుడవు నామాత్మకుడవు, సర్వగుణాధిష్ఠాతవు అయిన నీ యొక్క గుణములను విమాతుం–ఇన్ని, ఇంతవఱకు అని లెక్కించుటకు ఎవరు సమర్థులైరి? అట్టి విశేషవార్త చాలా దూరమున నున్నది (ఎప్పుడును వినజాలము) ఎట్టి నీ యొక్క – అస్య విశ్వస్య–ఈ సకల ప్రపంచమునకు –హితాయ – శ్రేయము కూర్చుట కొఱకు–పాలించుకొఱకు అనేకానేక గుణముల నావిష్కరింప నీవతరించిన వాని యొక్క, కాలముతో జీవించిన నిపుణులచేత ఏమిచేయుటకు శక్యము కాకుండెను అది చెప్పుచున్నాడు. 'కాలేన' అని వా అను శబ్దము విశేషముగ ఊహించుట (యందు వర్తించును) – సుకల్పైః – మిక్కిలి నిపుణులచే–బహుజన్మల కాలముతో –భూమి యొక్క పరమాణువులు – విమితాః–విశేషముగ లెక్కింపబడినవి, మరియు ఆకాశమునందలి –మిహికా ద్యుభాసః – హిమకణములు కూడ – అట్లే ఆకాశమునందలి నక్షత్రములు మొదలగువాని యొక్క కిరణ పరమాణువులు కూడ.(7)

**శ్లో॥** తత్తేఽను కంపాం సుసమీక్షమాణో
భుంజాన ఏవాత్మకృతం విపాకమ్ ।
హృద్వాగ్వపుర్భిర్విదధన్నమస్తే
జీవేత యో ముక్తి పదే సదాయభాక్ ॥ (8)

**టీ॥** – తస్మాద్భక్తిరేవ సంగచ్ఛత ఇత్యాహ–తదితి. తే తవ. అనుకంపాం సుసమీక్షమాణః కదా కృపా భవిష్యతీతి తాం బహుమన్యమానః. స్వార్జి తం చ కర్మఫలమనాసక్తస్సన్ భుంజాన ఏవ నాతీవ తప ఆదినా క్లిశ్యన్నేన యో జీవేత్ సముక్తేర్దాయభాగ్భవతి భక్తస్య జీవనవ్యతిరేకేణ దాయప్రాప్తౌ విముక్తౌ నాన్యదుపయుజ్యత ఇతి భావః. (8)

**తా॥** అందువలన నీ దయను గూర్చిలెస్సగా విచారించుకొనుచు, ఫలోన్ముఖమైన తన సుకృత దుష్కృతములను అనుభవించుచునే, మనోవాక్కాయములచే నీకు భక్తి శ్రద్ధలతో నమస్కరించుచు జీవింపవలెను. అట్టివాడు మోక్షస్థానమునకు అర్హత పొందును. (8)

**టీ॥** – అందువలన భక్తిమార్గమునే పొందవలెనని చెప్పుచున్నాడు – తే – నీయొక్క – అనుకంపాందయను – సు సమీక్షమాణః – నీ కృప ఎప్పుడు కలుగునో అని ఆభక్తిని మిక్కిలిగ ఆదరించుచు – తాను సంపాదించుకొనియున్న కర్మఫలమును అనాసక్తుడై అనుభవించుచునే తపస్సు మున్నగు వానితో అతిమాత్రముగ కష్టపడకయే ఎవడు జీవించునో వాడు ముక్తికి అర్హుడగును. ముక్తిలో భాగము పొందిన పిమ్మట భక్త జీవన విధానమునకు వ్యతిరేకముగ, మఱల నింకొక దానితో నుపయోగములేదు. (8)

**శ్లో॥** పశ్యేశ మేఽనార్యమనంత ఆద్యే
పరాత్మని త్వయ్యపి మాయి మాయిని ।
మాయాం వితత్యేక్షితుమాత్మవైభవం
హ్యహం కియానైచ్ఛమివార్చిరగ్నౌ ॥ (9)

**తా॥** ప్రభూ! దుర్జనుడనగు నన్ను చూడుము. అనంతుడవు, ఆద్యుడవు, పరమాత్మవు, మాయులలోకెల్ల 'మాయి'వి అయిన నీ పైననే మాయను ప్రసరింపజేసి నా వైభవమును చూచుటకు ప్రయత్నించితిని. ఆత్మ వైభవమును చూచుటకు కోరి నీ యందే మాయను ప్రసరింప జేసితిని, అట్లు కోరుటకు నేనెంతటి వాడను? అగ్ని నుండియే పుట్టిన చిన్న జ్వాలవంటి వాడను! (9)

**టీ॥** – తదేవం స్తుత్వా భగవంతం క్షమాపయితుం స్వాపరాధం నివేదయతి–పశ్యేతి. హే ఈశ. మే అనార్యం దౌర్జన్యం. పశ్య. యదహం అనంతే త్రివిధపరిచ్ఛేదరహితే ఆద్యే సర్వప్రపంచోపాదానభూతే. మాయినాపి మాయిని విమోహకే త్వయ్యపి స్వమాయాం వితత్య ప్రసార్య ఆత్మైశ్వర్యమీక్షితుం ఐచ్ఛం అభిలషితవాన్. అహో ఏవం కర్తుం త్వయి. అహం క్రియాన్. న కించిత్. యథాగ్నేరుద్భూతా జ్వాలా అగ్నౌ న కించిత్తద్వదితి. (9)

**శ్లో॥** అతః క్షమస్వాచ్యుత మే రజో భువో
హ్యజానతస్త్వత్పృథగీశ మానినః ।
అజావలేపాంఽధ తమోఽంధ చక్షుషో
హ్యేషోఽను కంప్యోమయినాథవానితి ॥ (10)

**టీ॥** – బ్రహ్మదేవుడీవిధముగ స్తుతించి భగవానుని క్షమాపణవేడుటకు తన అపరాధమును నివేదించుచున్నాడు–ఓ ఈశ్వరా! నా దౌర్జన్యమును చూడుము. ఏమనగా నేను – అనంతే – సజాతీయ, విజాతీయ స్వగతములను మూడు విధములైన విభాగములులేని నీయందు – ఆద్యే – సర్వప్రపంచమునకు ఉపాదాన కారణ భూతుడవగు నీయందు – మాయినాపి మాయిని – మాయగల వారిలో మాయివియగు నీ యందు – విమోహకే త్వయ్యపి – సర్వులను మోహపెట్ట గల నీ యందు కూడ – నా మాయను ప్రసరింపజేసి – నా ప్రభుతను చూచుకొనుటకు అభిలషించితిని. అహో! నీయందిట్లు చేయుటకు నేను ఎంతవానిని? కొద్దిపాటి వాని నైనను కాదు. అగ్ని నుండియే పుట్టిన ఒకజ్వాల అగ్నితో పోల్చినపుడు కొద్దిపాటిదియైనను కాదు – ఆవిధముగ – (9)

**తా॥** రజస్సు నుండి పుట్టినవాడను, తెలియనివాడను, నీ కన్నవేరైన ఈశ్వరుడనను భావము గల వాడను, సృష్టి కర్తననెడు గర్వముతో గ్రుడ్డివాడనై, ఏమియు కానని కన్నులు గలవాడను అయిన నా అపరాధమును – ఓ అచ్యుతా! క్షమింపుము. "వీడు నా భృత్యుడు అనుభావమున నాపై దయజూపుటకు అర్హుడవు– (10)

**టీ॥** – అత ఇతి. రజోభువః రజసో జాతస్య. అతః అజానతః. అతఏవ అజావలేపాంధ తమోంధ చక్షుషః అజో జగత్కర్తా అహమితి మదేన. గాఢతమో రూపేణాంధీభూత నేత్రస్య. అతస్త్వత్తః. పృథగీశమానినః అన్యత్ర ప్రభుత్వేన వర్తమానోఽపి మయి నాథే సతి నాథవాన్మద్భృత్య ఏవ. అతేవానుకంప్య ఇతి మత్వా. క్షమస్వేత్యర్థః. (10)

**టీ॥** – రజస్సు (రజోగుణము) నుండి పుట్టిన వాని యొక్క – అందువలన, తెలియని వానియొక్క, అందువలననే. అజావలేపాంధ తమోంధచక్షుషః – అజః – జగత్కర్త – నేనేయను గర్వముచే గాఢమైన అంధకార రూపముచే గ్రుడ్డితనము వచ్చిన కన్నులుగల వాని యొక్క, అందువలన నీ కంటే వేరైన ఈశ్వరుడనని నన్ను గూర్చి నేను భావించువాని యొక్క – ఇతరత్ర ప్రభుత్వముతో వర్తించుచున్న వాడనైనను, నా యందు – నాథేసతి, నాథవాన్ – సేవకుడనే – అందుచేతనే –వీడు దయచూపదగినవాడు అని భావించి క్షమించుమని యర్థము. (10)

**శ్లో॥** క్వాహం తమో మహదహం ఖచరాగ్నివార్భూ
సంవేష్టితాండ ఘటసప్త వితస్తికాయః ।
క్వే దృగ్విధా విగణితాండపరాణు చర్యా
వాతాధ్వరోమ వివరస్వచ తే మహిత్యమ్ ॥ (11)

**తా॥** ప్రకృతి, మహత్తు, అహంకారము, ఆకాశము, వాయువు, అగ్ని, జలము, భూమి అనువానితో ఆవరింపబడి, అండాకారముగ రూపము ధరించిన ఏడు జేనల శరీరముగల నేనెక్కడ? ఇదే విధమున గల అసంఖ్యాకములైన అండములు, పరమాణువులవలె తిరుగుచున్న, గవాక్షముల వంటి రోమరంధ్రములుగల గొప్పతనముగల నీవెక్కడ? **11**

**టీ॥** – బ్రహ్మాండ విగ్రహస్త్వమపీశ్వర ఏవేతి చేత్తత్రాహ –క్వాహమితి. తమః ప్రకృతిః మహత్. అహం అహంకారః ఖం ఆకాశం చరో వాయుః అగ్నిః తేజః వాః జలం భూశ్చ ప్రకృత్యాదిపృథివ్యంతైరేతైః. సంవేష్టితో యోఽండఘటః, స ఏవ తస్మిన్ స్వమానేన సప్తవితస్తిః

**టీ॥** – బ్రహ్మాండ విగ్రహుడవగు నీవును ఈశ్వరుడవే అనినచో ఆ విషయమున చెప్పుచున్నాడు. 'క్వాహం అని – తమః ప్రకృతి– మహత్తు – అహంకారము – ఖం – ఆకాశము. చరః వాయువు, అగ్నిః – తేజస్సు – వాః – జలము – భూశ్చ – భూమియు – ప్రకృతి

కాయో యస్య సోఽహం. క్వక్వ చ. తే మహిత్వం కథంభూతస్య. ఈదృగ్విధాని యాన్యవిగణితాన్యండాని. తఏవ పరమాణవః తేషాం చర్యాపరిభ్రమణం. తదర్థం. వాతాధ్వనో గవాక్షా ఇవ. రోమవివరాణి యస్య తస్య తవ. అతః అతితుచ్ఛత్వాత్త్వయానుకంప్యోఽహమితి.(11)

మొదలుకొని పృథివి వఱకునుగల వీనిచేత ఆవరింపబడియున్న ఏ ఘటమవంటి అండముగలదో అద్దానియందే - తన కొలతతో ఏడు జేనల శరీరము ఎవనికి గలదో అట్టి నేను ఎంతటి అల్పుడను నీ గొప్పదనము - ఎట్టివాని యొక్క? ఇట్టివే అయిన ఏ లెక్కింపరాని అండములుగలవో - అవియే పరమాణువులుగ - వానియొక్క చర్యా - భ్రమణము - దాని కొఱకు వాతాధ్వనః గవాక్షములవలె - రోమ రంధ్రములు ఎవనికి గలవో అట్టినీది. అందువలన మిక్కిలి అల్పత్వము వలన నేను దయచూపబడదగిన వాడను అని. (11)

**శ్లో॥** ఉత్క్షేపణం గర్భగతస్య పాదయోః
కిం కల్పతే మాతు రధోక్ష జాగసే ।
కిమస్తి నాస్తివ్యపదేశ భూషితం
తవాస్తి కుక్షేః కియదప్యనంతః ॥ (12)

**తా॥** ఓ అధోక్షజా! గర్భమునందలి శిశువు తన కాళ్ళను ఎగద్రోయుట (కడపున తన్నుట) ఆ తల్లి చేసిన ఏ అపరాధమునకు కల్పింపబడినది? ఇది ఉన్నది, ఇదిలేదు. అని ప్రసిద్ధముగా చెప్పబడునదేమి? నీ కుక్షికి వెలుపల నున్నదేమి? (ఏమియులేదు) (12)

**టీ॥** - ఉత్క్షేపణమితి. అపి చ. గర్భగతస్య శిశోః పాదయోరుత్క్షేపణం మాతుః కిమపరాధాయ భవతి. లోకే అస్తినాస్తివ్యపదేశాభ్యాం భావాభావశబ్దాభ్యాం. స్థూలసూక్ష్మకార్యకారణశబ్దైర్వా. భూషితమభిహితం ఏతేషాం శబ్దానాం భువి విషయే. ఉషితం స్థితమితి వా సర్వం వస్త్విత్యర్థః. హే అధోక్షజ తవ కుక్షే అనంతః బహిః కియదపి కించిన్మాత్ర మపి. కిమస్తి న కించిదస్తీత్యర్థః. అతః సర్వస్య త్వత్కుక్షిగతత్వేన మామాపి

**టీ॥** - మరియు కడుపులోనున్న శిశువు యొక్క పాదముల ఉత్క్షేపణము (ఎగద్రోయుట - తన్నుట) తల్లి చేసిన ఏ అపరాధమునకు కలుగుచున్నది? లోకమునందు, ఉన్నది - లేదు అను ప్రసిద్ధులకు, భావము -అభావము అనుశబ్దములకు, స్థూలసూక్ష్మములు, కార్యకారణములను శబ్దములచేతనో, భూషితం. చెప్పబడిన - ఈ శబ్దములకు - భూమి యందలి విషయమున ఉషితం - ఉన్నది అనియో చెప్పబడున

తథాత్వాత్. మత్రువత్ మదపరాధః సోఢవ్య ఇతి భావః. (12)

**శ్లో॥** జగత్త్రయాంతోదధి సంప్లవోదే
నారాయణస్యోదర నాభినాళాత్ ।
వినిర్గతోఽజస్త్వితి వాఙ్నవైమృషా
కింత్వీశ్వర త్వన్న వినిర్గతోఽస్మి ॥ (13)

**టీ॥** - కించ విశేషతోఽపి త్వత్తో మమ జన్మ ప్రసిద్ధమిత్యాహ- జగదితి. జగత్త్రయస్యాంతే ప్రళయే య ఉదధీనాం సంప్లవః సంశ్లేషః తస్మిన్నుదే ఉదకే. నారాయణస్యోదరే యా నాభిః తస్యా నాళాత్ అజో వినిర్గత ఇతి యా జనవాక్. సా తావన్మృషా న భవతి వై నిశ్చితం. తథా అపి తు హే ఈశ్వర. త్వత్తః అహం కిం న వినిర్గతః నోత్పన్నోఽస్మి? అపి తు త్వత్తఏవోత్పన్న ఇత్యర్థః. (13)

దంతయు వస్తువే అని యర్థము. ఓ అధోక్షజా నీ గర్భమునకు - అనంతః - వెలుపల - కొద్ది మాత్రము కూడ ఏమి కలదు? ఏమియు - కొద్దిపాటి వస్తువు కూడ లేదని యర్థము. అందువలన అంతయు నీ కడుపుననే ఉన్నందున నా ఉనికి కూడ అట్టిదే అయినందువలన తల్లివలె, నా అపరాధము కూడ సహింపదగినదే అని భావము. (12)

**తా॥** ముల్లోకములకు ప్రళయము కలిగినప్పుడు, సముద్రము లన్నియు కలిసిపోయినప్పుడు, ఆ జలమునందుగల నారాయణుని కడుపునందలి బొడ్డునుండి వెలువడిన నాళమునుండి బ్రహ్మదేవుడు ఆవిర్భవించెను అనుమాట అసత్యముకాదుగదా! అయినను ఓ ఈశ్వర! నీ నుండి నేను పుట్టలేదా? నీ నుండియే పుట్టితిని. (13)

**టీ॥** - అదియునుంగాక విశేషించియు నీ నుండియే నేను జన్మించితి ననుట ప్రసిద్ధమని చెప్పుచున్నాడు. ముల్లోకముల సమాప్తియందు- ప్రళయమున ఏ సముద్రములయొక్క సంప్లవః - కలిసిపోవుటగలదో - దాని యందలి నీటిలో - నారాయణుని కడుపున ఏ బొడ్డుగలదో దాని యొక్క తూడు నుండి బ్రహ్మ వెలువడెనని ఏ జన వాక్యము కలదో అది అంత వఱకు అసత్యము కాదు. నిశ్చితమే. అట్లైనను ఓ ఈశ్వరా! నీ నుండి నేను వెలువలేదా? పుట్ట లేదా? నీ నుండియే నేను జన్మించితిని - అని యర్థము. (13)

**శ్లో॥** నారాయణ స్త్వం నహి సర్వదేహినా
మాత్మాస్య ధీశోఽఖిల లోకసాక్షీ।
నారాయణోఽంగం నర భూజలాయనా
త్తచ్చాపి సత్యం న తవైవ మాయా ॥ (14)

**తా॥** నీవు నారాయణుడవు. అఖిల శరీరములుకును ఆత్మయై యున్నావు. అధీశుడవు లోకములన్నింటికిని సాక్షివి. కావా? నరుని నుండి పుట్టిన ఇరువదినాలుగు తత్త్వములు–మరియు జలాశ్రయత్వము వలన, నార+అయన శబ్దముల (అర్థముల) మూర్తీభూతుడవు. అదియును నీ మాయ చేతనే అనునది సత్యము కాదా? (14)

**టీ॥** – తర్హి నారాయణపుత్రస్య మమ కిమాయాతం తత్రాహ– నారాయణ ఇతి. నహీతి కాక్వాత్వమేవ నారాయణ ఇత్యాపాదయతి– కుతోఽహం నారాయణ ఇతి చేదత ఆహ. –సర్వదేహినామాత్మాసి. ఏవమసి కిం నారాయణో న భవసి. నారం జీవసమూహః. హే అధీశ త్వం నారాయణో నహీతి పునః కాకుః. అధీశః ప్రవర్తకః. తతశ్చ నారస్యాయనం ప్రవృత్తిర్యస్మాత్ స తథేతి. పునస్త్వ మేవాసావితి. కించ త్వమఖిలలోక సాక్షీ అఖిలలోకం సాక్షాత్పశ్యసి. అతో నారమయసే జానాసీతి. త్వమేవ నారాయణ ఇత్యర్థః నన్వేవం నారాయణపదవ్యుత్పత్తౌ భవేదేవం. తత్త్వన్యథా ప్రసిద్ధ మిత్యాశంక్యాహ. నారాయణోఽంగమితి. నరాదుద్భూతా యే అర్థాః. చతుర్వింశతితత్త్వాని. తథా నరాజ్జాతం యజ్జలం. తాదయనాద్యో నారాయణః ప్రసిద్ధః. సోఽపి తవైవాంగం మూర్తిః. తథా చ స్మర్యతే. శ్లో. "నరాజ్జాతాని తత్త్వాని నారాణీతి విదుర్బుధాః, తస్య తాన్యయనం ప్రోక్తం తేన నారాయణః స్మృతః"

**టీ॥** – అయినచో నారాయణుని కుమారుడనగు నాకు వచ్చిన దేమి? ఇట చెప్పుచున్నాడు. "నహి?" అను కాకు స్వరముతో 'నీవే నారాయణుడవు' అని ఆపాదించుచున్నాడు. (కాకువు – శోక భయాదులచే కలుగు ధ్వని వికారము) – నేను ఎందువలన నారాయణుడను? అనినచో చెప్పుచున్నాడు. అందఱి శరీరములకు ఆత్మవైయున్నావు. ఇట్టైనను నారాయణుడవు కాకుందువా? వారం – జీవసమూహము –అయనం – ఆశ్రయము. ఎవనికో వాడు అటుల చెప్పబడుచున్నాడు– అని. నీవే సర్వదేహులకును ఆత్మత్వమువలన నారాయణుడవు–అని. ఓ అధీశ్వరా! నీవు నారాయణుడవు కావా? అని మఱియొకసారి కాకువు. అధీశః – ప్రవర్తకుడవు. అప్పుడు నారస్య అయనం – జీవసమూహము యొక్క వర్తనము ఎవని వలననో వాడు అటుల చెప్పబడుచున్నాడు అని. మఱల నీవే అట్టివాడవు అని. అదియుగాక నీవు అఖిలలోకమునకు సాక్షివి. సమస్తలోకములను ప్రత్యక్షముగ

ఇతి. తథా చ మనుః. శ్లో. "అపో నారా ఇతి ప్రోక్తా ఆపోవైనరసూనవః తా యదస్యాయనం పూర్వం తేన నారాయణః స్మృతః" ఇతి. నను మన్మూర్తేపరిచ్ఛిన్నాయాః. కథం జలాశ్రయత్వం. కింతు. తవైవ మాయయా కల్పితం అపరిచ్ఛేన్న త్వాదితి భావః. అత ఆహ. తచ్చాపి సత్యం నేతి. (14)

చూచెదవు. అందుచేత – నారం అయసే. సమస్త జీవులను తెలిసి యున్నావు – అని. అందుచే నీవే నారాయణుడవు అని యర్థము. ఈ విధముగ 'నారాయణ' అను పదము యొక్క వ్యుత్పత్తిచే ఇట్లగును. అవి మరియొక విధమున ప్రసిద్ధమేమో అని ఆశంకించి చెప్పుచున్నాడు – 'నారాయణోంఽగం' అని, నరుని నుండి పుట్టిన ఏ అర్థములు గలవో –ఆ ఇరువది నాలుగు తత్త్వములు. అట్లే 'నర' శబ్దము నుండి పుట్టిన ఏ జలము గలదో దాని ఆశ్రయమువలన ఏ నారాయణుడు (గలడో) ప్రసిద్ధుడో అతడును నీ అంగమే – మూర్తియే అట్లే స్మృతి చెప్పుచ్నుది – "నరుని నుండిన పుట్టిన తత్త్వములు నారములు అని బుధులు తెలిసికొందురు. అతనికి వాని ఆశ్రయము చెప్పబడినందున నారాయణుడని చెప్పబడెను." అని – మనువు కూడ అట్లే చెప్పెను. "జలములు 'నారాః' అని చెప్పబడెను. ఆ జలములు నరపుత్రులు. వీరు అతనిని ఆశ్రయించి యుండు వారు కావున ఆతడు నారాయణుడు అనబడెను." అని – పరిచ్ఛిన్నముకాని నా 'మూర్తి' కి జలాశ్రయత్వమెట్లు సంభవించును? కాని నీమాయచేత కల్పితమైనది – అదియును సత్యము కాదు – అని (అపరిచ్ఛిన్నత్వము వలన ఆశ్రయాశ్రయీభావము ఉండని కారణమున అదియు అసత్యమే అనిభావము.) (14)

**శ్లో॥** తచ్చేజ్జలస్థం తవ సజ్జగద్వపుః
కిం మే నదృష్టం భగవంస్తదైవ ।
కిం వా సుదృష్టం హృది మే తదైవ
కింనోసపద్యేవ పునర్వ్యదర్శి ॥ (15)

**టీ॥** – అపరిచ్ఛేదమేవోపపాదయతి–తచ్చేదితి. జగదాశ్రయభూతం. తవ తద్వపుః. జలస్థమిత్యేవ యది. సత్ సత్యం స్యాత్. తర్హి తదైవ. కమలనాళమార్గేణాంతః ప్రవిశ్య. సంవత్సరశతం విచిన్వతాపి మయాః హే భగవన్ అచింత్యైశ్వర్య. తత్ర కిమితి నదృష్టం తత అగత్య స్వస్థానే స్థిత్వా. సంవత్సరశతం తపసి తప్తే సతి. తథైవ మే మయా హృది కిం వా సుదృష్టం. హృద్యపి సపది కిమితి నో వ్యదర్శి న దృష్టం. అతస్తన్మూర్తేః దేశవిశేషపరిచ్ఛేదః సత్యో న భవతీత్యర్థః.అత్ర కేషుచిద్వ్యాఖ్యా గ్రంథేష్వేవం వ్యాఖ్యాతం. నను న చ బాహ్యదృష్టం. సద్వపుః. కింతు. అంతఃకరణ దృశ్యం. తదా హృద్యపి కిమితి. నో వ్యదర్శి న దృష్టం. తథైవ తపఃకరణానంతరం సపద్యేవ చ సుదృష్టం. అతో మాయైవ. అతస్త్వన్మూర్తేః దేశవిశేషపరిచ్ఛేదః సత్యో న భవతీత్యర్థః. (15)

**తా॥** జగదాశ్రయమైన నీశరీరము అట్లు నీటియందుండుట నిక్కమేని ఓ భగవానుడా! నాకేల ఉన్నదియున్నట్లుగ కనబడుకుండెను? ఆ పిదప నా హృదయము నందు స్పష్టముగా కనబడి అప్పటికప్పుడే మఱల ఏల కన్పట్టకుండెను? (15)

**టీ॥** – భగవానుని అపరిచ్ఛేదత్వ లక్షణమునే చెప్పుచున్నాడు – జగదాశ్రయరూపమగు నీ శరీరము నీటిలోననే ఉండియున్న యెడల – సత్ – (అటులుండుట) సత్యమే అయినచో – అప్పుడే తామరతూడు మార్గమున లోనికి ప్రవేశించి నూరు సంవత్సరములు వెదకిన నాకు, ఓ భగవానుడా! ఆలోచనకందని ప్రభుతగలవాడా! ఎందుకని కనబడలేదు? అప్పుడు మరల నా స్థానమునకు వచ్చి. అచట నుండి నూరుసంవత్సరములు తపస్సు చేయగా నా హృదయము నందు ఏల స్పష్టముగ కనబడెను? హృదయముందైనను అప్పటికప్పుడు మఱల ఏల కనబడకుండెను? అందువలన నీ మూర్తికి దేశ విశేషపరిచ్ఛేదము సత్యము కాదు అని యర్థము. ఇచట కొన్ని వాఖ్యాన గ్రంథములం దిట్లు వ్యాఖ్యానింపబడినది. "సత్పదార్థము యొుక్క 'మూర్తి', నిశ్చయముగ వెలుపల కనుపింపదు. కాని అంతఃకరణమునందు – (మనస్సునందు) చూడదగినది. అటుపై మనస్సునందును ఏమి? అనిన అచటను చూడబడదు. అట్లే తపస్సు చేసిన తరువాత అప్పటి

కప్పుడే చక్కగా సాక్షాత్కరించినది - అందువలన మాయయేయిది. కాబట్టి నీ'మూర్తి'యొక్క ప్రదేశవిశేష సంబంధమగు విభాగము సత్యము కాదని యర్థము. (నైరూప్యము చర్మ చక్షువులకు కనబడదు. తపింపగా తపింపగా తన అభిరుచిననుసరించి మనస్సునందొక రూపము మాత్రము క్షణిక దర్శనమిచ్చును.) (15)

**శ్లో॥** అత్రైవ మాయా దమనావతారే
హ్యస్య ప్రపంచస్య బహిఃస్ఫుటస్య ।
కృత్స్నస్య చాంతర్జఠరే జనన్యా
మాయాత్వమేవ ప్రకటీకృతం తే ॥ (16)

**తా॥** మాయను ఉపశమింపజేయువాడా! ఇచటనే ఈ అవతారమున నే నీ గర్భముననున్న, బయట స్పష్టముగ కనిపించు ఈ సమస్త ప్రపంచమును నీ తల్లియగు యశోదకు చూపుట ద్వారా నీ మాయా తత్త్వమునే ప్రకటించితివి. (16)

**టీ :-** అపి చ యది జలాది ప్రపంచః సత్యస్స్యాత్. తర్హి తేన తవ పరిచ్ఛేదో భవేత్. స తు మాయావిలసిత ఇతి త్వయైవ దర్శిత ఇత్యాహ - శ్లోకత్రయేణ. అత్రేతి. హే మాయాదమన మాయోపశమన. అత్రైవావతారే. అస్య ప్రపంచస్య బహిః స్ఫుటస్యాపి ఆత్మనో జఠరమధ్యే జనన్యాః ప్రదర్శనేన. (16)

**టీ॥** - ఇంకను - జలాదిప్రపంచము సత్యమైన యెడల - నీకు పరిచ్ఛేదత్వము సంభవించును అది మాయా విలసితమే అని నీ చేతనే చూపబడినది అని చెప్పుచున్నాడు - మూడుశ్లోకములతో - హే మాయాదమన! - ఓ మాయను ఉపశమింపజేయువాడా! ఇదే అవతారమున ఈ ప్రపంచము యొక్క - బయట స్పష్టముగ స్ఫురించు దాని యొక్క రూపమును కూడ నీజఠర మధ్యమున ఉన్న దానిని నీ తల్లికి ప్రదర్శించుటచేత-(నీ మాయాలక్షణమునే ప్రదర్శించితివి.) (16)

**శ్లో॥** యస్య కుక్షావిదం సర్వం సాత్మంభాతి యథా తథా ।
తత్త్వయ్యపీవా తత్సర్వం కిమిదం మాయయా వినా ॥ (17)

**తా॥** ఎవ్వాని కడుపున ఈ ప్రపంచమంతయు ఉన్నది యున్నట్లుగా – తనతో కూడ – ప్రకాశించునో అట్టి నీ యందును వెలుపల అది అంతయును ప్రకాశించుచున్నది. ఇది మాయ కాక మఱేమిటి? (17)

**టీ॥** – నను బహిః సత ఏవ. అంతర్జఠరే ప్రతిబింబోఽస్తు. అతస్సర్వదా మాయావిలసితత్వం మమైవోక్తమితి కుత ఇత్యత ఆహ – యస్యేతి. యస్య తవ కుక్షౌ. సర్వమిదం యథా భాతి. తత్సర్వం. ఇహాపి బహిరపి. తథైవ భాతి. కించ. సాత్మంత్వత్సహితం. తదిదం. త్వయి మాయయా వినా. కథం ఘటేతేతి అయం భావః. త్వయి ప్రతిబింబశ్చేత్తర్హి. బాహ్యాద్విలోమతయా ప్రతీయేత న తు తదస్తి తవ చాదర్శస్థానీ యస్య. త్వయి ప్రతీతిర్నస్యాత్. అతః సర్వదా మిథ్యాత్వమేవేతి. (17)

**టీ॥** – బయటి ప్రపంచమే జఠరమునందు ప్రతిబింబించినదా? అగునుగాక – అందువలన అన్ని విధముల మాయా విలసితత్వమే అని నాచేతనే చెప్పబడినది ఎందులకు – అది చెప్పుచున్నాడు. ఏ నీ కుక్షియందు ఈ సమస్తమును ఎట్లు ప్రకాశించునో అది అంతయును ఇచట వెలుపల కూడ అట్లే ప్రకాశించుచున్నది. సాత్మం – నీతో కూడ అది నీ యందు మాయతో తప్ప ఎట్లు సంభవమగును? అని – దీని భావమిది – నీ యందు ప్రతిబింబమే అయిన యెడల అప్పుడు బాహ్యప్రపంచమున కంటె విలోమముగా (కుడియెడమలు తారుమారై) కనపడవలెను గదా! అట్లు జరుగుటలేదు. ఆ దర్శస్థానీయుడవగు నీరూపమునకు నీయందు అట్టి ప్రతీతి కలుగుటలేదు. (లోపల, బయట కూడ కుడియెడమల మార్పులే కుండాగా ఒకే విధమున కన్పట్టుచున్నావు) అందువలన లోపలిది బయటిది అంతయు మిథ్యయే – అని. (17)

**శ్లో॥** అద్యైవ త్వదృతేఽస్య కిం మమ న తే మాయాత్వమాదర్శితం
ఏకోఽసి ప్రథమం తతోవ్రజ సుహృద్వత్సాస్సమస్తా అపి ।
తావంతోఽసి చతుర్భుజాస్తదఖిలైస్సాకం మయోపాసితా
స్తావంత్యేవ జగంత్య భూస్తతమిదం బ్రహ్మాద్వయం శిష్యతే ॥(18)

**తా॥** నిన్నుఁదప్ప ఈ విశ్వమాయా తత్త్వమును నాకు ఈ దినముననే చూపలేదేమి? (చూపితివి సుమా!) మొదట ఒక్కడవేయుంటివి. అటుపిమ్మట నీ స్నేహితులగు గోపబాలురుగ, లేగదూడలుగ, ఆపై సమస్తములుగ చూపితివి. ఎన్నియో నీ చతుర్భుజరూపములు నాతో సహా ఇదియంతయును వ్యాపింపజేయబడెను. చివరకు అద్వితీయమగు బ్రహ్మమే మిగిలెను. (18)

**టీ॥** – అపి చ. న కేవలం జనన్యాః మమాపి తథైవ దర్శితమిత్యాహ – అద్యైవేతి. త్వదృతే త్వాం వినా. అస్య విశ్వస్య మాయాత్వం. త్వయా మమైవ చ. తదప్యద్యైవ కిం న దర్శితం. కింతు దర్శితమేవ. తథాహి ఏకోఽసీత్యాది. తతో మయా సహ అఖిలైస్తత్త్వాదిభిరుపాసితాః. తావంతశ్చతుర్భుజా అసి. జగంతి బ్రహ్మాండానీతి ప్రాగనుక్తమపి దృష్టమితి జ్ఞాతవ్యం. (18)

**టీ॥** – త్వత్+ఋతే – నిన్నుదప్ప – ఈ విశ్వము యొక్క మాయాత్వము నీచేత – నాకే – అదియును నేడే. ఎందుకు చూపబడలేదు? కాని చూపబడెను – అదియుక్తమే. ఒక్కనివే యుంటివి. మొదలగువానితో – అప్పుడు నాతో సహా అన్ని తత్త్వములచేత ఉపాసింపబడితివి (రి). అన్ని చతుర్భుజ రూపములుగానుంటివి. జగంతి – బ్రహ్మాండములు అని మొదట చెప్పబడకున్నను చూడబడినదని తెలియవలెను. (18)

**శ్లో॥** అజానతాం త్వత్పదవీ మనాత్మ
న్యాత్మాత్మనా భాసి వితత్య మాయామ్ ।
సృష్టావివాహం జగతో విధాన
ఇవత్వమేషోఽంత ఇవ త్రిణేత్రః ॥ (19)

**తా॥** అనాత్మరూపమగు ప్రకృతియందు నీ స్థానమేదియో తెలియని వారికి, నీవు ఆత్మయై యుండియు స్వతంత్రముగా మాయను విస్తరింప జేసి, సృష్టియందు నావలె, పాలనయందు నీవలె, లయమునందు హరునివలె భాసించుచున్నావు. (19)

**టీ॥** – నను బ్రహ్మన్ తవ మయా దర్శితం శుద్ధమేవ చైతన్యం. కథం ప్రపంచవన్మాయేత్యుచ్యతే. సత్యం. కింతు. అద్వితీయే త్వయి. నానాత్వం గుణావతారమత్స్యాద్యవతారేష్వివ. కార్యవశేన స్వతంత్ర మాయా నిబంధనమిత్యాహ–శ్లోకద్వయేన. అజానతామితి. త్వత్పదవీం తవ స్వరూపం అజానతాం అనాత్మని ప్రకృతౌ స్థితః. ఆత్మైవ త్వం ఆత్మనైవ స్వాతంత్ర్యేణ మాయాం వితత్య ఆభాసి. కథం జగతః సృష్టౌ. అహమివ బ్రహ్మేవ విధానే పాలనే. ఏషత్వమివ అంతే ప్రళయే. త్రిణేత్ర ఇవ.(19)

**టీ॥** – ఓ బ్రహ్మమా! నీవు నాకు చూపినది శుద్ధచైతన్యమే. ప్రపంచమును వలె మాయయని ఎట్లుచెప్పనగును? నిజమే – మరియు అద్వితీయ స్వరూపమవగు నీయందు అనేకత్వము. గుణములతో నవతరించు మత్స్యము మొదలగు అవతారములందువలె – కార్యవశమున స్వతంత్రముగనే మాయచేత బంధింపబడి యుండుట యని రెండు శ్లోకములతో చెప్పుచున్నాడు – త్వత్పదవీం – నీ స్వరూపమును – తెలియని వారికి అనాత్మయగు ప్రకృతియందు ఉండిన –ఆత్మైవ–నీవే–ఆత్మవా+ఏవ–స్వాతంత్ర్యముతో మాయను వ్యాపింపజేసి ప్రకాశింపజేయుచున్నావు. భాసించుచున్నావు. ఎట్లు జగత్తు యొక్క సృష్టి యందు నావలె – బ్రహ్మవలె – విధానే – పాలనమునందు – ఇట్టి నీవలె – అంతే–ప్రళయమునందు శివునివలె– (19)

**శ్లో॥** సురేష్వృషిష్వీశ తథైవ నృష్వపి
తిర్యక్షు యాదస్స్వపి తేజనస్య ।
జన్మాసతాందుర్మదనిగ్రహాయ
ప్రభో విధాతస్సదనుగ్రహాయ చ ॥ (20)

**తా॥** ఈశ్వరా! దేవతల యందు, ఋషుల యందు, అట్లే మానవుల యందు, తిర్యగ్జంతువుల యందు, నీటి యందును, పుట్టుకయే లేని నీ యొక్క పుట్టుక, దుష్టుల గర్వమునడచుట కొఱకు – ప్రభూ! విశ్వకర్తా! సత్పురుషుల ననుగ్రహించుట కొఱకును జరిగినది. (20)

**టీ॥** – నను చ. స్వాతంత్ర్యే కథం కుత్సితేషు మత్స్యాదిషు జన్మ. కథం వామనాద్యవతారే యాచ్ఞాదికార్పణ్యం. కథంవాస్మిన్నేవ

**టీ॥** – నిశ్చయముగను – స్వాతంత్ర్యముచే నికృష్టమైన జాతుల యందు. చేపలుమున్నగు వానియందు నీవు జన్మించుటయెట్లు? వామనుడు

కదాచిద్భయపలాయనాదీత్యత ఆహ –శ్లోకద్వయేన. సురేష్వితి. సురేషు వావామన జన్మ ఋషిషు నారదాదిజన్మ. తిర్యక్షు నృషింహాదిజన్మ. యాదస్సు మత్స్యకమఠాదిజన్మ. నృష్వపి రామాదిజన్మ. అసన్నిగ్రహాయ. సత్పాలనాయ చ. (20)

**శ్లో॥** కోవేత్తి భూమన్ భగవన్ పరాత్మన్
యోగీశ్వరో తీర్భవతస్త్రిలోక్యాం
క్వవాకథం వా కతివా కదేతి
విస్తరయన్ క్రీడసి యోగమాయామ్. (21)

**టీ॥** – క ఇతి. అన్వర్థైః సంబోధనః దుర్జ్ఞేయత్వ మేవాహ. –భూమన్నిత్యాదిభిః. భవతః. ఊతీః లీలాః. త్రిలోక్యాం కో వేత్తి. క్వ వాకథం వా. కదా వా కతి వేతి. అచింత్యం తవ యోగమాయావైభవమితి భావః. (21)

మొదలగు అవతారములందు యాచన మొదలగు కృపణత్వమెట్లు? ఈ అవతారమునందే ఒకానొకప్పుడు భయాశయత్వము వెలగునవెట్లు? రెండు శ్లోకములతో చెప్పుచున్నాడు. దేవతల యందు వామన జన్మ ఋషులయందు నారదుడు మొదలగువారి జన్మ – తిర్యక్కులలో నరసింహుడు మొదలగువారి జన్మ – నీటియందు చేప, తాబేలు మొదలగు వాని జన్మ, మానవులయందును, రాముడు మొదలగువారి జన్మము దుష్టులను నిగ్రహించుట కొఱకు – శిష్టుల పాలనకొఱకు.(20

**తా॥** బ్రహ్మమా! షడ్గుణైశ్వర్య సంపన్నుడా! పరమాత్మా యోగీశ్వరా! ఈ ముల్లోకములలో నీ లీలలను ఎవరు తెలిసికొనగలరు? ఎచటనో, ఎట్లో, ఎన్నియో, ఎప్పుడో ఆ లీలలను విస్తరించుచు యోగమాయ యందు క్రీడించుచుందువు. (21)

**టీ॥** – "భూమన్!" మొదలగు అర్థవంతములైన సంబోధనలచేత ఆ పరమేశ్వరుని దుర్జ్ఞేయత్వమునే (తెలిసికొనరాని లక్షణమునే) చెప్పుచున్నాడు. భవతః నీయొక్క – ఊతీః – లీలలను ముల్లోకములలో ఎవ్వడెఱుగును? ఎచ్చటనో, ఎటులో, ఎప్పడో, ఎన్నియో అని – నీ యోగమాయా వైభవము ఊహింపరానిది అని భావము. (21)

**శ్లో॥** తస్మాదిదం జగదశేషమసత్త్వ రూపం
స్వప్నాభమస్తధిషణం పురుదుఃఖ దుఃఖమ్ ।
త్వయ్యేవ నిత్యసుఖబోధ తనావనంతే
మాయాత ఉద్యదపి యత్సదివా విభాతి ॥ (22)

**తా॥** అందువలన ఈ జగత్తంతయును అనాత్మరూపము – స్వప్నము వంటిదే. బుద్ధిని అస్తమింపజేయునది. నిండియున్న దుఃఖముల వరుసగలది. (ఒక దుఃఖము తరువాత మఱియొకటి) అంతము లేనిదియు జ్ఞానానందరూపమైయున్నదియునగు తనువుగాని తనువుగల నీ యందే మాయవలన ప్రకటమగునిది యంతమును అస్తిత్వము గలదిగ భాసించుచున్నది. (22)

**టీ॥** – నను భవత్త్వవతారాణామచింత్యో మహిమా. ప్రపంచస్య త్వసత్వే. కథం సత్వప్రతీతిరితీమామాశంకాం సపరికరాముప సంహరన్. పరిహరతి–తస్మాదితి. అస్తధిషణం నిరస్తప్రభాసం. త్వయ్యేవ. ఉద్యత్ ఉద్భవత్. అపి యత్ నశ్యత్ సదివేత్యుపలక్షణ మేతత్. నిత్యమివ. చేతనమివ చ. అధిష్ఠానభూతస్య తవ గుణైస్తథా తథా భాతీత్యర్థః(22)

**టీ॥** – నీ యవతారముల మహిమ నిశ్చయముగ ఆలోచనకందనిది. ప్రపంచము సత్పదార్థము కానిదగుచుండగా – దీనియందు "సత్త్వ" ప్రతీతియెట్లు కలుగుచున్నది? అనుశంకను – దానికి సంబంధించిన అంశములన్నింటితోకూడ సమాప్తిచేయుచు – వానిని తొలగించు చున్నాడు తస్మాత్ అని . అస్తధిషణం – తిరస్కరింపబడిన ప్రాగల్భ్యము గలది. (అస్తమించిన తెలివిగలది) నీ యందే ఉద్యత్ – పుట్టుచున్న – నశించుచున్నదేయైనను సత్పదార్థమువలెనని ఇది ఉపలక్షణము. నిత్యమైనదానివలె – చేతనమువలె– ఆక్రమించుకొనియున్న నీ గుణములచే అట్లా విధముగ వ్యక్తమగునని యర్థము. (22)

**శ్లో॥** ఏకస్త్వమాత్మాపురుషః పురాణ
స్సత్యస్స్వయం జ్యోతిరనంత ఆద్యః ।
నిత్యోఽ క్షరోఽ జస్ర సుఖో నిరంజనః
పూర్ణోఽ ద్వయో ముక్త ఉపాధితోఽ మృతః. (23)

**తా॥** నీవు ఒకే ఒక్కడవు. ఆత్మవు. పురుషుడవు, సనాతనుడవు. సత్యమవు. స్వయముగ ప్రకాశించువాడవు. అంతములేనివాడవు. మొట్టమొదటి వాడవు. ఎల్లవేళలనుండువాడవు. నాశములేనివాడవు, ఎడతెగని ఉనికిగల వాడవు, ఆనందుడవు, శుద్ధమైన వాడవు, నిండైన వాడవు, ద్వితీయములేని వాడవు, కేవలుడవు, అవతరించియున్నను అమృతుడవు. (23)

**టీ॥** – త్వమేవ తు సత్య ఇత్యాహ. –ఏక ఇతి –ఏకస్త్వం సత్యః కుతః ఆత్మాదృశ్యమసత్యం దృష్టం. న చాత్మాదృశ్యః. అతః సత్యః. కించ యద్వికారవత్తదసత్యం. న చ త్వయి జన్మాదయో వికారాస్సంతీత్యాహ– ఆద్యః కారణం అతో న జన్మ. ఆద్యత్వే హేతుః. పురాణః పురాతనః. కార్యాత్పూర్వమపి వర్తమాన ఇత్యర్థః. అత్ర హేతుః. పురుష ఇతి. తథా చ శ్రుతిః. శ్రు. "పూర్వమేవాహమిహాస" మితి. తత్పురుషస్య పురుషత్వ" మితి. జన్మాంతరాస్తిత్వ లక్షణ వికారం వారయతి – నిత్య ఇతి సనాతన ఇత్యర్థః. పూర్ణః. అజస్రసుఖః అక్షరః. అసుత్ర ఇతి పదైశ్చతుర్భిః. క్రమేణ సమృద్ధి పరిణామాక్షయ వినాశాన్ వారయతి– పూర్ణత్వే హేతుః. అనంతః అద్వయ ఇతి చ. దేశకాలపరిచ్ఛేద రహితః వస్తు పరిచ్ఛేదరహితోఽ పి. అమృతత్వోపపాదనాయ చతుర్విధ క్రియాఫలత్వం నివారయతి. స్వయం జ్యోతిః. నిరంజనః. ఉపాధితో

**టీ॥** – నీవే సత్యము అని చెప్పుచున్నాడు – "ఏకః" అని. నీవొక్కడవే సత్యము. కనపడని ఆత్మఎట్లు సత్యమగును? ఆత్మ కనబడదు కావుననే సత్యము. మరియు ఏది వికారమును పొందునో అది అసత్యము. నీయందు జన్మమొదలగు వికారములులేవు అని చెప్పుచున్నాడు. మొట్టమొదటి కారణరూపుడవు నీవే కావున నీకు జన్మ అనునదిలేదు – ఆద్యత్వమునకు కారణము పురాణః పురాతనుడవు. కార్యమగు సృష్టికంటెను పూర్వముకూడ ఉండిన వాడవని యర్థము. దీనికి కారణము. పురుషః అని. శ్రుతియు అటులే చెప్పుచున్నది. శ్రు "పూర్వమేవాహమిహాస" (నేను పూర్వమే యుంటిని) "తత్పురుషస్య పురుషత్వ" మితి. (ఆ పురుషునకే పురుషత్వము) అని. ఇతర జన్మలుండుట అను వికారమును 'నిత్యః' అను శబ్దముతో నివారించు చున్నాడు. సనాతనుడని యర్థము. 1. పూర్ణః – (నిండైనవాడు) –

ముక్త ఇతి పదత్రయేణ. అయం భావః. తత్రోత్పత్తిరాద్య ఇత్యనేనైన నిరాకృతా ప్రాప్తిరపి క్రియయా జ్ఞానేన నా భవేత్. క్రియయా ప్రాప్తిరాత్మపదేనైన నిరాకృతా. జ్ఞానతః ప్రాప్తిం వారయతి. స్వయంజ్యోతిరితి. వికృతిరపి తుషాపా కరణేనావఘాతేన వ్రీహీణామివ ఉపాధ్యపాకరణేన భవేత్. తచ్చాసంగతత్వాన్న సంభవతీత్యాహ – యుక్తఉపాధిత ఇతి. సంస్కారోఽపి కిమతిశయాధానేన. మలాపా కరణేన వా. తత్రాతిశయాధానం పూర్ణత్వేనైన నిరాకృతం. మలాపా కరణం వారయతి. నిరంజన ఇతి నిర్మల ఇత్యర్థః. (23)

2. అజస్రసుఖః – 3. అక్షరుడవు – 4. అమృతుడవు అను ఈ నాలుగు పదములచేత క్రమముగా వృద్ధి, విపరిణామము, అపక్షయము, వినాశము అనువానిని నివారించుచున్నాడు. పూర్ణత్వమునకు కారణము. 'అనంతః' 'అద్వయః' అనియు దేశకాల పరిచ్ఛేద రహితుడవు, వస్తుపరిచ్ఛేద రహితుడవు అనియునర్థము. అమృతత్వ మును ఉపపాదించుట కొఱకు నాలుగు విధములైన క్రియల యొక్క ఫలత్వమును నివారించుచున్నాడు. స్వయంజ్యోతిః, నిరంజనః, ఉపాధితోఽమృతః. అను మూడు పదములచేత – దీని భావమిది. ఉత్పత్తి (పుట్టుక) అనునది ఆద్య శబ్దముచే ముందే నిరాకరింపబడినది. ప్రాప్తికూడ, క్రియచేత లేక జ్ఞానముచేత కలుగును. క్రియచేత ప్రాప్తి కలుగుట యనుదానిని ఆత్మ శబ్దము చేతనే నిరాకరించెను. 'స్వయం జ్యోతిః' అను మాటచేత జ్ఞానము వలన ప్రాప్తి కలుగుటను కూడ నివారించుచున్నాడు. వికృతియు (ప్రకృతి నుండియే ఏర్పడినను ప్రకృతి కంటె భిన్న స్వభావము గల వస్తువు) –పొల్లును తొలగించి, దంచిన ధాన్యము నుండియే బియ్యము కలుగునట్లే ఉపాధిని తొలగించుట ద్వారా (మానసికముగనైనను) ఆత్మ ప్రకటమగును. తత్త్వసంగాత్ న – (తత్‌తు+అసంగాత్ న – తత్త్వసంగాత్‌స) సంభవతి+ఇతి+ఆహ –పొల్లును తొలగించి వడ్లను దంచుట అను ప్రక్రియతో సంబంధము లేకుండ బియ్యము లభించవు అట్లే ఈ ప్రక్రియ తెలిసినంత మాత్రమున

కూడ బియ్యము ప్రాప్తింపవు – అదే విధముగ – ఉపాధిని త్యజించుట అను ప్రక్రియతో సంబంధము లేకుండినచో ఆత్మప్రాప్తి కలుగదు. అట్లే ఈ ప్రక్రియా జ్ఞానము కలిగినంత మాత్రమున – దానిని అనుభూతికి మలచుకొననిదే ఆత్మప్రాప్తి కలుగదు. ఈ అర్థముగల శ్రీధర వ్యాఖ్యా వాక్యము బొంబాయిలో ముద్రింపబడిన కృష్ణదాసుని నాగరలిపి, విడి కాగితముల భాగవత ప్రతిలో గలదు.) (ఇకవావిళ్లవారి తెలుగు ప్రతిలోకః "తచ్చ అసంగతత్త్వాన్న సంభవతీత్యాహ – అదియును (ఆత్మపద లాభము) దానితో సంబంధము లేక సంభవింపదని చెప్పుచున్నాడు అని మాత్రము కలదు) ముక్త ఉపాధిత ఇతి – విడువబడిన ఉపాధితో – అని – అతిమాత్రముగ – మిక్కిలిగ ధారణ చేయుటచేత జన్మ జన్మల వాసన గుఱించిన మాటయేమి? పాప మాలిన్యము తొలగించుకొనుట చేత మాత్రము? ఇచట మిక్కిలిగ ధారణచేయుట యనునది పూర్ణుడు అని చెప్పుటతో నిరాకరింప బడినది. మాలిన్యమును తొలగించుకొనుట యను దానిని ఇప్పుడు నివారించుచున్నాడు. 'నిరంజన' శబ్దముతో – నిర్మలుడని యర్థము. (అజుడు కావున ఆయనకు వాసనలు లేవు. అపహతపాప్ముడు, నిరంజనుడును అగుటచేత ఆయనకు మాలిన్య మును తొలగించుకొను ప్రసక్తియే లేదు.) (23)

**శ్లో॥** ఏవం విధం త్వాం సకలాత్మనామపి
స్వాత్మానమాత్మాత్మతయా విచక్షతే ।
గుర్వర్కలబ్ధోపనిషత్సు చక్షుషా
యేతే తరంతీవ భవామృతాంబుధిమ్ ॥ (24)

**టీ॥** – తస్మాదేవం భూతజ్ఞానాన్ముచ్యంత ఇత్యాహ –ఏవం విధమితి. త్వాం యే. విచక్షతే సమ్యక్ పశ్యంతి. కథం. ఆత్మాత్మతయా. ఆత్మా ప్రత్యక్. తస్య స్వరూపేణ న చైతత్పుత్రాదిష్వివ గౌణమిత్యాహ. – సకలాత్మ నామపి స్వాత్మానం. కేన. గురురేవార్కః. తస్మాల్లబ్ధం. ఉపనిషత్ జ్ఞానం. తదేవ సుచక్షుస్తేనభవ ఏవ అమృతాంబుధిస్తం. తే తరంతీవ. అత్ర చ జ్ఞానేన తరంతీతి. తచ్చ తరంతీవేతి. తచ్చాత్మాత్మ తయా జ్ఞానేనేత్యర్థత్రయం ప్రతి జ్ఞాతం క్రమేణోపపాద్యతే. తత్రాత్మాన మేవాత్మతయేత్యనేన శ్లోకేన జ్ఞానేన తరంతీత్యుపపాద్యతే. అజ్ఞాన సంజ్ఞావిత్యనేన తరంతీవేత్యేతత్. త్వామిత్యాదిశ్లోకద్వయేన తు ఆత్మాత్మతయేత్యేతదుపపాద్యతే. (24)

**తా॥** సర్వజీవులలోను ప్రత్యగాత్మరూపముగ ఈ విధముగ నున్న నిన్ను, గురువను సూర్యునిచే నీయబడిన జ్ఞానపు వెలుగనెడు దృష్టితో, పరమాత్మగనే ఎవరు చూడగలిగెదరో వారు, ఈ అమృతముగ భ్రమింపజేయు సంసారము నుండి విముక్తులయ్యెదరు. (24)

**టీ॥** – కాబట్టి ఈ విధమైన జ్ఞానమువలననే ముక్తులగుదురని చెప్పు చున్నాడు 'ఏవం విధం' అని. నిన్ను ఎవరు సరిగా చూచెదరో – ఎట్లు? ఆత్మాత్మతయా – ఆత్మా – ప్రత్యక్ (శరీరమునందలి ఆత్మ – దాని యొక్క స్వరూపేపముచేత – పుత్రాదులయందువలె ఇదిగౌణము కాదు. (అప్రధానముగకాదు) అనిచెప్పుచున్నాడు. ('ఆత్మావై పుత్రనామాసి' అను వాక్యము స్మరించునది.) సమస్తమైన జీవులకు – స్వాత్మానం – తన ఆత్మను – దేనిచేత? గురువే సూర్యుడు – అతని నుండి లభించిన. ఉపనిషత్ – జ్ఞానము అదియే శుద్ధమైన దృష్టి – దానిచేత పుట్టినదే అమృతసముద్రము. దానిని (తెలియుటచేత) వారు తరింతురు. ఇచ్చట కూడ జ్ఞానముచేత తరింతురు–అని. అదియును తరించుననియే. అదియు ఆత్మాత్మతయా – జ్ఞానముచేతనే అని మూడర్థములు ప్రతిజ్ఞచేయబడినవి. క్రమముగ ఉపపాదింప బడును. ఇట ఆత్మను ఆత్మచేతనే (మనస్సు చేతనే) అనుచు ఈ శ్లోకమునందలి జ్ఞానముచేత తరించెదరు అను సంశయమును వ్యక్తము

**శ్లో॥** ఆత్మానమేవాత్మతయా విజానతాం
తేనైవ జాతం నిఖిలం ప్రపంచితమ్ ।
జ్ఞానీ నభూ యోఽపి చ తత్రప్రలీయతే
రజ్జ్వామహేర్భోగ భవా భవౌ యథా ॥ (25)

**టీ॥** –నను జ్ఞానేన కథం భవం తరంతీత్యాశంక్య. తస్యాజ్ఞాన మూలకత్వాదిత్యాహ – ఆత్మానమితి. తేనైవాజ్ఞానేనైవ ప్రపంచితం ప్రపంచః. రజ్జ్వా మహేర్భోగభవాభవావితి. సర్పశరీరస్యాధ్యాసాపవాదౌ యథేతి. (25)

చేసినాడు. ఆత్మతత్త్వమున సమగ్రముగ నెఱింగినవాడు అనుకథనముచే తరింతురనియే అని ఇది (చెప్పబడినది) 'త్వాం' మొదలుగాగల రెండు శ్లోకములచేత ఆత్మను ఆత్మత్వముచేనని ఉపపాదించుచున్నాడు. (24)

**తా॥** ఆత్మను శుద్ధమైన మనస్కతతో నెఱింగిన వారికి, ఈ విస్తరించి యున్న ప్రపంచమంతయును ఆ ఆత్మ నుండియే పుట్టినదని తెలియును. ఆత్మను తెలిసినవాడు త్రాడును చూచి దానిని సర్పమని అనుకొనుట, కాదు కాదు, అట సర్పమేలేదనుకొనుట వంటి వికల్పాత్మకమైన భ్రమల యందు లీనముకాడు. (అతడు మాయకు వశుడుకాడు.) (25)

**టీ॥** – జ్ఞానముచేత సంసారము నెట్లు దాటగలరు? అని ఆశంకించి, సంసారము యొక్క అజ్ఞానమూలకత్వమువలననని చెప్పుచున్నాడు 'ఆత్మానం'అని. ఆ అజ్ఞానము చేతనే విస్తరింపబడియున్నదీ ప్రపంచము – రజ్జామహేర్భోగ భవా భవౌ ఇతి – సర్ప శరీరము యొక్క అధ్యాస, మరియు అపవాదములెట్లో అట్లు – (ఒక వస్తువునందు మరియొక వస్తువు యొక్క ప్రతీతి అధ్యాస.) (అది కాని దాని యుందు అది యను బుద్ధి అధ్యాస) (ఒక దానికి మరియొకటి చెప్పుట అపవాదము.) (25)

**శ్లో॥** అజ్ఞాన సంజ్ఞౌభవబంధ మోక్షౌ
ద్వౌ నామనాన్యౌస్త ఋతజ్ఞ భావాత్ ।
అజస్ర నిత్యాత్మని కేవలే పరే
విచార్యమాణే తరణా వివాహనీ ॥ (26)

**తా॥** సంసారబద్ధత - మోక్షము అను రెండును అజ్ఞానము అను పేర్లు గలవియే. యథార్థ జ్ఞాన దృష్టిచేత అవి పరస్పరము భిన్నములు కావు. శాశ్వతము, నిత్యము, కేవలము పరమునైన బ్రహ్మము నందు - విచారింపగ - సూర్యునకు పగలు, రాత్రి, అను భేదము లేనియట్లు- బంధ మోక్షములు లేవు. (సూర్యుని దృష్ట్వా చీకటి వెలుగులు అను భేదముండదు కదా!) (26)

**టీ॥** - నను జ్ఞానినః తరంత్యేవ. కిమిదముచ్యతే. తరంతీవేతి తత్రాహ- అజ్ఞానసంజ్ఞావితి. అజ్ఞానేవ సంజ్ఞా యయోస్తౌ. భవబంధ మోక్షౌ. భవేన బంధః. తస్మాన్మోక్షశ్చ తౌ ద్వౌ. నామ ప్రసిద్ధౌ. ఋతజ్ఞభావాత్. ఋతశ్చాసౌజ్ఞశ్చ తయోర్భావస్తస్మాదన్యౌ స్తః. నను కథం మహానపలాపః క్రియతే. పరమార్థవిచారాదిత్యాహ అజస్రేతి. అఖండానుభవరూపే. పరే. శుద్ధే. ఆత్మని. నాజ్ఞానం న చ బంధః. అతేవ జ్ఞానం చ మోక్షః. తరణౌ సూర్యేరాత్ర్యమనీ ఇవేతి. (26)

**టీ॥** - జ్ఞానులు నిశ్చయముగ తరింతురు. అది ఏమియో చెప్పబడు చున్నది. తరింతురనే యిట చెప్పుచున్నాడు. "అజ్ఞాన సంజ్ఞౌ" అని - అజ్ఞానము అను సంజ్ఞవేనికో అవి. (బంధమోక్షము, భవబంధ మోక్షౌ - సంసారముచేత బంధము. దాని నుండి విడివడుట అను ఆ రెండును - నామ ప్రసిద్ధి గలవి. ఋతజ్ఞభావాత్ - యథార్థమైన జ్ఞానము. దాని తత్త్వము నెఱింగిన భావముచేత - వేఱ్వేఱైనవి కావు. అయినచో మఱి యీ మహత్తరమైన సత్యగోపనము ఎట్లు చేయబడు చున్నది? పరమార్థ విచారము (లేనందు) వలననని చెప్పుచున్నాడు - అఖండమైన అనుభవరూపమునందు - పరమునందు - శుద్ధమైన వాని యందు - ఆత్మయందు - అజ్ఞానములేదు -బంధములేదు. అందువలననే జ్ఞానమే మోక్షము. సూర్యుని యందు రాత్రి, పగలు ఉండనట్లు అని. (26)

**శ్లో॥** త్వామాత్మానం పరం మత్వా పరమాత్మానమేవ చ ।
ఆత్మా పునర్బహిర్మృగ్య, అహో అజ్ఞ జనాజ్ఞతా ॥ (27)

**టీ॥** – నను పరమార్థజ్ఞానాత్. అజ్ఞానకృతో బంధో నివర్తతాం. ఆత్మాత్మతయైవ జ్ఞానాదితి కోఽయమాగ్రహ ఇత్యాశంక్య. యదధ్యాసాదాత్మనః పరరూపా స్ఫూర్తిః తదపవాదేన తత్రైవ ఆత్మ స్వరూపే జ్ఞానం యుక్తమితీమమర్థం విస్మయేనాక్రోశన్నివాహ– త్వామితి. త్వామాత్మానం. పరం దేహాదిం మత్వా. ఆత్మని దేహాదిమధ్యస్య. తథాపరం దేహాదిమాత్మానం మత్వా. దేహాదేవాత్మాన మధ్యస్య. అత్ర నష్ట ఆత్మా బహిర్మృగ్య ఇతి చిత్రం న హి గృహే నష్టం వనే మృగ్యత ఇత్యర్థః. (27)

**తా॥** ఆత్మవైన నిన్ను, సర్వశ్రేష్ఠునిగ భావించి, పరమాత్మునిగనెంచి, మఱల ఆత్మను వెలుపల వెదకుట ఆశ్చర్యము – అజ్ఞానుల అజ్ఞత్వము!! విచిత్రముగదా !! (27)

**టీ॥** – పరమార్థజ్ఞానాత్ – అజ్ఞానముచే చేయబడిన బంధము నివర్తించిన వారికి – శుద్ధమనస్కతతో నేర్పడిన ఆత్మజ్ఞానము వలననేయను ఈ పట్టుదలయేమి? అని ఆశంకించి – అధ్యాస వలన ఆత్మకంటె నితరమైన రూపము తోచుటయు, దాని అపవాదముచే అచటనే ఆత్మస్వరూపమునందు జ్ఞానము కలుగుట యుక్తమను ఈ భావమును ఆశ్చర్యముతో నాక్రోశించుచు (అరచుచు) చెప్పుచున్నాడు "త్వాం" అని. – త్వాం – ఆత్మవైన నిన్ను – పరం – దేహము మొదలగు దానిగ భావించి – దేహాదిమధ్యగల ఆత్మయందు – పరం – దేహాదినే ఆత్మగ భావించి – దేహాదులయందే ఆత్మను ఆరోపించి, ఇచట నుండిపోయిన ఆత్మను వెలుపలవెదకి – విచిత్రము – ఇంటిలో పోయిన వస్తువును, అడవిలోపల వెదకరు గదా! అని యర్థము.(27)

**శ్లో॥** అంతర్భవేఽనంతభవం త్వమేవ
హ్యతత్త్యజంతో మృగయంతి సంతః ।
అసంతమప్యంత్యహి మంతరేణ
సంతంగుణంతం కిము యంతి సంతః ॥ (28)

**తా॥** ఓ అనంతా! ఈ పుట్టుకగల సంసారపు లోపల – నీవు కాని పదార్థమును విడిచివేయుచు, సత్పురుషులు నిన్నే వెదకుచుందురు. అచట అస్తిత్వముగల త్రాటిని తప్ప – అచటలేని సర్పమును వెదకుచుందురు. సత్పురుషులైనను సర్పమునందు మిథ్యాత్వ నిశ్చయము లేనిదే, అది త్రాడు అని యెట్లు తెలియుదురు. (28)

**టీ॥** – వివేకినస్తు ప్రత్యక్స్వరూప ఏవ పరమాత్మానం విచిన్వంతీత్యాహ– అంతరితి. భవతీతి భవం. చిజ్జడాత్మకం శరీరం. తన్మధ్య ఏవ త్వాం మృగయంతి అతత్ జడం త్యజంతః అపవదంతః. నను సతో జ్ఞానేనాలం. కిమసతోఽపవాదేనేత్యాశంక్య. అసతోఽపవాదం వినా. అధిష్ఠానతత్త్వజ్ఞానం న జాయత ఇతి. సతాం వ్యవహారేణాహ. అసంతమితి. అంతి సమీపే. అసంతమపి. అహిమంతరేణ తన్నిషేధం వినేత్యర్థః. సంతం గుణంతంరజ్జుం. సంతః కిము యంతి జానంతి. అంతి. సంతమపి గుణమితి వా న జానంతీత్యర్థః. తస్మాదాత్మతయైవ జ్ఞానాన్ముక్తిరితి భావః. (28)

**టీ॥** – వివేకముగలవారు ప్రత్యగాత్మనే పరమాత్మగ ఎన్నుకొందురు అని చెప్పుచున్నాడు. ప్రభవించును కావున 'భవము' చరాచరాత్మకమైన ప్రపంచశరీరము, దానిలోనే నిన్ను వెదకెదరు. అతత్ – జడము (అనాత్మము) త్యజంతః – విడిచినవారై – నిశ్చయముగ సత్పదార్థ జ్ఞానముతోనే చాలును. మఱి అసత్పదార్థమును తిరస్కరించు పనియేమి? అని ఆశంకించి – అసత్తు (అనాత్మ) యొక్క అపవాదము (తిరస్కృతి) లేకుండ అధిష్ఠానతత్త్వము యొక్క జ్ఞానము కలుగదు అని. (ప్రపంచమును తిరస్కరించిననే బ్రహ్మజ్ఞానము కలుగును) విద్వాంసుల వ్యవహారముతో చెప్పుచున్నాడు. "అసంతం" అని – అంతి– సమీపమున – అసంతమపి – లేనిదైనను – అహిం – సర్పమును – అంతరేణ – నిషేధింపనిదే – సంత – అస్తిత్వము గలదైన – గుణం తం ఆ త్రాటిని. విద్వాంసులు మాత్రము ఎట్లు తెలుసుకొనగల్గుదురు ఉన్న త్రాటిని కూడ తెలిసికొనలేరని యర్థము. అందువలన శుద్ధ మనస్కతతో సంపాదించిన జ్ఞానము వలననే మోక్షము సిద్ధించునని యర్థము.(28)

**శ్లో॥** అథాపి తే దేవ పదాంబుజద్వయ
ప్రసాదలేశాను గృహీత ఏవ ।
జానాతి తత్త్వం భగవన్ మహిమ్నో
నచాన్య ఏకోఽపి చిరం విచిన్వన్ ॥ (29)

**తా॥** అట్లైనను ఓ దేవా! ఓ భగవన్ । నీపాద కమలముల ప్రసాద లేశముచే అనుగ్రహింపబడినవాడే నీ మహిమ యొక్క తత్త్వమును తెలిసికొనగలడు – ఇతరుడొక్కడు కూడ చిరకాలము వఱకు వెదకినను (చింతన చేసినను) తెలిసికొనజాలడు. (29)

**టీ॥** – నన్వేనం జ్ఞానైకసాధ్యే మోక్షే కిమితి. భక్తిరుద్బోధితా. అత ఆహ– అథాపీతి. యద్యపి హస్తప్రాప్యమివ జ్ఞానముక్తం. అథాపి హే దేవ. తవ పదాంబుజద్వయమధ్యే ఏకదేశస్యాపి. యః ప్రసాదలేశోఽపి తేనాపి గృహీత ఏవ భగవతస్తవ మహిమ్నఃతత్త్వం జానాతి. హే భగవన్ తే మహిమ్నః తత్త్వమితి వా. ఏకోఽపి అహం బ్రహ్మాసి కశ్చిదపీతి. వా. చిరమపి విచిన్వన్ అతదంశాపవాదేన విచారయన్నపీత్యర్థః. (29)

**టీ॥** – ఈవిధముగ ఒక్క జ్ఞానముచేత మాత్రమే మోక్షము సాధింపదగినది యగుటేమి? అని భక్తి ఉద్బోధింపబడినది. ఇట చెప్పుచున్నాడు "అథాపి" అని – జ్ఞానము కరతలామలకమువలె పొందదగినదానిగ చెప్పబడినను – ఓ దేవా! నీ రెండు పాదకమలముల నడుమ కొంచెమైనను ఏ రవ్వంత అనుగ్రహమైనను కలదో – దానిచేత – అనుగ్రహింపబడిన వాడే భగవంతుడవైన నీ మహిమ యొక్క తత్త్వమును తెలియగలడు. లేక ఓ భగవన్! నీ మహిమ యొక్క తత్త్వమనినయో–ఒక్కడు కూడ, 'నేను బ్రహ్మము'ననియో, ఎవరిననియో బహుకాలము అనాత్మపదార్థమును తిరస్కరించుచు విచారించుచున్నను ఆ తత్త్వమును పొందజాలడు అనియు అర్థము. (29)

**శ్లో॥** తదస్తు మే దేవ సభూరిభాగో
భవేఽత్ర వాన్యత్ర తు వా తిరశ్చామ్ ।
యేనాహమేకోఽపి భవజ్జనానాం
భూత్వా నిషేవే తవపాద పల్లవమ్. (30)

**తా॥** ఓదేవా! ఈ బ్రహ్మజన్మలోగాని, పశుజన్మయందేకాని, ఏ భాగ్యము చేతనైనను నీకు సంబంధించిన వారిలో ఏ'ఒక్కడు'గగాని అని నీ చిగురువంటి పాదము(ల)ను సేవించుచుండు అదృష్టము నాకు కలుగును గాక! (30)

**టీ॥** తదితి. తస్మాద్భూరి భాగః మహద్భాగ్యం. అత్ర భవే బ్రహ్మజన్మని. తిరశ్చామపి మధ్యే యజ్జన్మ తస్మిన్ వా. యేన భాగ్యేన. భవదీయానాం. జనానాం. ఏకోఽపి యః కశ్చిదపి భూత్వా నిషేవే

**టీ॥** – అందువలన గొప్ప భాగ్యము(చేత) ఈ బ్రహ్మజన్మ యందు, నాలుగు కాళ్ళ పశువుల మధ్యయైనను ఏ జన్మయుండునో దాని యందైనను – ఏ భాగ్యముచేత నీకు సంబంధించిన వ్యక్తులలో

అత్యర్థం సేవేయం. (30)

ఒక్కనిగనైనను ఎవడనో ఒకడనైనను అయి మిక్కిలిగ నిన్ను సేవింతును. (అట్టి భాగ్యము నాకు కలుగుగాక) (30)

**శ్లో॥** అహోఽతి ధన్యా వ్రజ గో రమణ్యః
స్తన్యామృతం పీత మతీవ తే ముదా
యాసాం విభో వత్సతరాత్మజాత్మనా
యత్తృప్తయేఽద్యాపి న చాల మధ్వరాః (31)

**తా॥** ప్రభూ! ఎవరియందు లేగదూడలుగను, గోపబాలురుగను ప్రభవించి, గోవుల యొక్కయు, గోపస్త్రీల యొక్కయు అమృతమువంటి స్తన్యమును మిక్కిలి సంతోషముతో త్రాగి తృప్తినందితివో అట్టి గోకులము నందలి ఆవులును, గోపస్త్రీలును మిక్కిలి ధన్యులు. అట్టి నీ తృప్తి కొఱకు నేటి వఱకు జరిగిన యజ్ఞములను సరిపోవకుండెను. (యజ్ఞముల వలన కలుగని తృప్తి స్తన్యపానముతో నీకు కలిగెను)(31)

**టీ॥** దేవాదిజన్మతోఽపి యత్ర కుత్రచిత్త్వద్భక్తిమజ్జన్మైవ శ్రేష్ఠ మిత్యౌత్సుక్యేన సప్తభిశ్లోకైరభినందతి – అహో ఇతి. వ్రజగోరమణ్యః వ్రజస్థాః గావో గోప్యశ్చ. తే త్వయా వత్సతరాత్మజాత్మనా వత్సానామాత్మ జానాం చ రూపేణ. యస్య తవ తృప్తయే. సర్వేఽపి యజ్ఞాః. అద్యాపి న సమర్థాః తే త్వయా ప్రతిక్షణం తృప్యతా. యాసాం స్తన్యం అమృత రూపం పీతమితి. (31)

**టీ॥** – దేవతలు మొదలగువారి జన్మలకంటెను కూడ, ఎచటినేని నీ భక్తిగల జన్మమే ఉత్తమమైనదని ఉత్సాహముతో, ఏడు శ్లోకములలో అభినందించుచున్నాడు 'అహో' అని – వ్రజ గో రమణ్యః – వ్రజము నందున్న ఆవులు, గోపస్త్రీలును. తే – నీచేత – వత్సతరాత్మజాత్మనా – లేగదూడలయొక్కయు, పుత్రులయొక్కయు రూపమున – ఏ నీ తృప్తికొఱకు – యజ్ఞములన్నియును – నేటికి కూడ సమర్థములుకావు. నీ చేత ప్రతిక్షణము తృప్తి పొందబడెను. ఎవరి చనుబాలు అమృత రూపమో – అవి త్రాగబడెను. (31)

**శ్లో॥** అహోభాగ్య మహోభాగ్యం నందగోప వ్రజౌకసామ్ ।
యన్మిత్రం పరమానందం పూర్ణం బ్రహ్మసనాతనమ్ ॥ (32)

**టీ॥** – తత్ర భగవత్సఖానాం మహినూ వక్తుం జ్ఞాతుం న శక్యత ఇత్యాహ –అహో ఇతి. అహో భాగ్యమితి పునరుక్త్యా. ఆదరేణ భాగ్యస్య సర్వదా అపరిచ్ఛిన్నత్వముక్తం. యన్మిత్రం యేషాం మిత్రం. బ్రహ్మ శ్రీకృష్ణస్వరూపం పరమానందం నిరతిశయసుఖస్వరూపం– తథా చ. ప్రాకృతమితస్య పరస్పరోపకారిత్వాపేక్షయా కదాచిద్విషయవిరోధాత్ మైత్రీభంగశ్చ శ్రీకృష్ణే తు పరమానందే న తథా. కింతు తేషామానంద ఏవేతి భావః. ప్రాకృతమిత్రస్య దేశాంతరగమనేన విశేషదుఃఖమపి భవతి. శ్రీకృష్ణే మిత్రే. న తథేత్యాహ –పూర్ణమితి. తథా చ. గతాగతాది రహితమిత్యర్థః. అత్ర యద్యపి శ్రీకృష్ణస్యాపి గోచారణాదినా విశేష దుఃఖం భవతి. తథాపి. తచ్చింతయాప్యానందనియమః. ప్రాకృత మిత్రే తు న తథేతి భావః. యద్వా. శ్రీకృష్ణస్య పూర్ణత్వే సర్వవ్యాపకత్వే జాతే. మధురాద్వారకావాసినామపి శ్రీకృష్ణే విశేష దుఃఖం నాభూదేవ. (32)

**తా॥** అహో! నంద గోప వ్రజమున నివసించువారి భాగ్యము మహాభాగ్యము కదా! ఏలయన పరమానంద స్వరూపుడు, పరిపూర్ణుడు, సనాతనుడునైన బ్రహ్మము, వారికి మిత్రుడైయుండెను. (32)

**టీ॥** – అచటి భగవన్మిత్రుల మహిమను వర్ణించుటకు, తెలిసి కొనుటకును సాధ్యముకాదని చెప్పుచున్నాడు 'అహో' అని. అహో భాగ్యమని పునరుక్తి (మఱలచెప్పుట) చేత గౌరముతో భాగ్యము యొక్క అఖండత్వము – అన్నివిధముల అపరిచ్ఛిన్న లక్షణము చెప్పబడినది, యన్మిత్రం –ఎవరికి శ్రీకృష్ణస్వరూపముననున్న 'బ్రహ్మము' మిత్రుడో – పరమానందం – మిక్కిలి అతిశయించిన ఆనంద స్వరూపము – అట్లే – ప్రాకృత (ప్రపంచ) మిత్రునికి – ఒకరికొకరు ఉపకారముచేసి కొనవలెననెడి దృష్టితో, ఎప్పుడో ఒకప్పుడు విషయవిరోధమువలన స్నేహము భంగమగునుకాని పరమానంద రూపుడగు శ్రీకృష్ణుని స్నేహమట్టిదికాదు. కావున వారికి ఆనందమే ఆనందము అని భావము. ప్రాకృత మిత్రుడు వేఱొక స్థలమునకు పోయినప్పుడు విశేషమైన దుఃఖము కలిగినను శ్రీకృష్ణుడు మిత్రుడై ఉండగా అట్లు దుఃఖము కలుగదు మరియు అతడు పూర్ణమైనవాడు అనగా పోవుట వచ్చుట అనునవి లేనివాడని అర్థము. ఇచట ఒకవేళ ఆవులను మేపుటకు పోవుట మొదలగువాని వలన శ్రీకృష్ణుని వియోగ దుఃఖము కలిగినను

– అతనిని గూర్చిన ఆలోచనచేయుటచేత ఆనందమే కలుగుట నియమము. ప్రాకృత మిత్రునియందట్లు కలుగదని భావము. లేక శ్రీకృష్ణుని పూర్ణత్వమునందు సర్వవ్యాపకత్వము కలుగుచుండగా, మధురలోను, ద్వారకలోను ఉండువారికి కూడ శ్రీకృష్ణుని ఎడబాటు వలన కలుగు దుఃఖము ఉండదుకూడ. (32)

శ్లో॥ ఏషాం తు భాగ్యమహిమాచ్యుత తావదాస్తా
మేకాదశైవహవయం బత భూరిభాగాః ।
ఏతద్ధృషీక చషకై రసకృత్పిబామ
శ్శర్వాదయోఽఙ్ఘ్ర్యుదజ మధ్వమృతాసవం తే ॥ (33)

తా॥ ఓ అచ్యుతా! వీరి యదృష్ట విశేషమంతవఱకట్లుండనిమ్ము పదునొకండు ఇంద్రియాధిష్ఠాన దేవతలమగు మేము అయ్యయ్యో ఇంకను గొప్ప భాగ్యశాలురము. వ్రజమునందలి వీరి ఇంద్రియ ములనెడు గిన్నెలతో పెక్కు పర్యాయములు, అహంకారాధిష్ఠాతయైన శర్వురు (శివుడు) మొదలుకొని మేమందరమును నీ పాదపద్మముల తేనెయనెడి (అమృతము అనెడి) మత్తెక్కించెడు మధుర పానీయమును త్రాగుచుందుము. (మేము నీ మహిమాతిశయమును ఏకదేశముగ సేవించువారము – కాని ఈ వ్రజవాసులు సర్వేంద్రియములతో సర్వమహిమలను సేవింపగలుగుదురు. కావున వీరి భాగ్యమే మిన్నసుమా) (33)

టీ॥ – కించ. ఏషామితి. ఏషాం భాగ్యస్య తావన్మహిమా తావదాస్తాం తిష్ఠతు. కస్తం వక్తుం శక్నోతి. శర్వాదయః శర్వః అహంకారాధిష్ఠాతా

టీ॥ – వీరి భాగ్యమహిమ అటుండనిమ్ము. దానినిగూర్చి చెప్పుటకు ఎవడు సమర్థుడగును? శర్వాదయః – శర్వః –అహంకారమునకు

ఆదిర్యేషాం చంద్రాదీనామేకాదశానాం తే తథా. వయం చ, వయమిత్యాత్మానమేవ బహుమన్యమాన ఆహ. -ఏవం మనోబుద్ధ్యహంకారచక్షురాద్యధిష్ఠాతారస్త్రయోదశ దేవా ఏవ తావత్. బత అహో. భూరిభాగాః. యస్మాదేతేషాం హృషీకాణీంద్రియాణ్యేవ చషకాణి పాత్రాణి. తైః. పాన పాత్రైః. తే చదుర్దశస్య చిత్తాధిష్ఠాతుః అంఘ్రీ ఏవ. ఉదజే వారిజే తయోర్మధు మకరందః. తదేవా మృతం స్వాదుఆసవం మాదకం. పిబామః. ఏతదుక్తం భవతి. యదా ప్రత్యేకమింద్రియాభిమానినో వయం. కీర్తిసౌందర్యసౌగంధ్యాద్యేకైకదేశ సేవినోఽపి. కృతార్థాః తథా సర్వేంద్రియైః సర్వ సేవినామేతేషాం కింవర్ణ్యతే భాగ్యమితి. (33)

అధిష్ఠానదేవతయగు శర్వుడు మొదలుగాగల - చంద్రుడు మొదలగు పదునొకండుమంది దేవతలయొక్క సమూహము - వయం చ - మేము అని తనను కూడ గౌరవించుకొనుచు చెప్పుచున్నాడు. ఇట్లు మనస్సు, బుద్ధి, అహంకారము, కన్నులు మొదలగువాని అధిష్ఠానదేవతలు పదముగ్గురు- బత - అహో! గొప్పభాగ్యశాలురు. ఎందువలన వీరియొక్క ఇంద్రియములే పాత్రలుగచేసి వానితో - ఆ పాన పాత్రలతో ఆ పదునలుగురు దేవతలకు సంబంధించిన అధిష్ఠానమగు మనస్సు యొక్క - (ఇంద్రియ చషకములతో) - నీ పాదకమలముల మకరందము, అదే అమృతముగ రుచికరమగు మాదకముగ (మత్తును కలిగించు పానీయముగ) త్రాగుదుము- ఇది చెప్పబడినదియే అగుచున్నది. ప్రత్యేకముగ మేము ఇంద్రియాభిమానులమైనప్పుడు, నీ కీర్తి, సౌందర్యము, సౌగంధ్యము మొదలగు వానిని కేవలము ఒక భాగముగ సేవించువారమైనను కృతార్థులమే - అట్లు ఇంద్రియములన్నింటిచేత, అన్ని విధముల సేవించుచుండు వీరి యొక్క భాగ్యమెట్లు వర్ణింపబడును? (మా భాగ్యము కంటె వారి భాగ్యముచాల గొప్పది.) (33)

**శ్లో॥** తద్భూరిభాగ్య మిహజన్మ కిపప్యటవ్యాం
యద్గోకులేఽపి కతమాంఘ్రి రజోభిషేకమ్ ।
యజ్జీవితం తు నిఖిలం భగవాన్ ముకుంద
స్త్వద్యాపి యత్పదరజ శ్రుతిభిర్విమృగ్యమ్ ॥ (34)

**తా॥** వ్రజవాసుల భాగ్యము మహత్తరమైనది. వారు ఇహలోకమునఁ బుట్టిననేమి? అడవిలో పుట్టిననేమి? నందగోకులమున పుట్టిననేమి? నీపాదధూళిని ఎంతెంత మాత్రముగ తమ శిరములందు అభిషేకించుకొనిరో? వారి జీవితము సమస్తమును భగవానుడైన కృష్ణుడే! భగవానుని పాద పాంసువులను ధరించుటచే ఎంతటి మహర్దశ కలుగునో అని చెప్పుటకు వేదములు నేటి వఱకు కూడ వెదకుచునేయున్నవి. (34)

**టీ॥** అతో మయా ప్రార్థితం. శ్లో. తదస్తు మే నాథ సభూరిభాగ ఇతి యత్. తదేవేత్యాహ–తదితి. కిం తత్. ఇహ మనుష్యలోకే. యత్కిమపి జన్మ. తత్రాప్యటవ్యాం యత్. తత్రాపి గోకులే యత్. అహో సత్యలోకం విహాయాత్ర జన్మని జాతే కోలాభ ఇత్యత ఆహ.– అపి కతమాంఘ్రిరజోభిషేకమితి. గోకులవాసినాం మధ్యేఽపి కతమస్య కస్యాప్యంఘ్రిరజసా అభిషేకో యస్మిన్ తత్. నను కుతో గోకులవాసిన ఏవమితి ధన్యాస్తత్రాహ–యదితి. యేషాం జీవితం నిఖిలం ముకుంద ఇతి. నిఖిలం ముకుందపరమేవ జీవనమిత్యర్థః. దుర్లభతామాహ.– అద్యాపీతి. శ్రుతిమృగ్యం వేదైరపి మృగ్యత ఏవ న తు దృశ్యత ఇత్యర్థః (34)

**టీ॥** – అందుకే, 'ఏ జన్మ నాకిచ్చినను నీ సేవాభాగ్యము నాకెప్పుడును ఉండుగాక' యని నేను నిన్ను ప్రార్థించితిని, అదియే చెప్పుచున్నాడు. 'తత్'అని – కింతత్ – అదియేమి? ఇహ – ఈ మనుష్యలోకమున – ఏ జన్మయైనను. అదియు అడవియందైనను, గోకులము నందైనను – అహో! సత్యలోకమును విడిచి ఇచట పుట్టుక కలుగగా ఏమి లాభమో చెప్పుచున్నాడు. 'కతమాంఘ్రిరజోభిషేకం' అనికూడ. గోకులవాసుల మధ్యన కూడ ఎవని పాదరేణువులతో అభిషేకము కలుగునో. అట్టి అభిషేకము దేనియందో అది. ఇట్లు గోకులవాసులే ఎందుకు ధన్యులో చెప్పుచున్నాడు. 'యత్' అని. ఎవరి జీవితము సమస్తము కృష్ణుడే అని. జీవనమంతయును కృష్ణుని పరమే అనియర్థము. దుర్లభత్వమును చెప్పుచున్నాడు. 'అద్యాపి' అని. శ్రుతిమృగ్యం – వేదములచేతకూడ వెదుకబడుచునేయున్నది. కన్పట్టుటలేదని యర్థము. (34)

**ప॥** ఏషాంఘోషనివాసినాముత భవాన్ కిందేవరాతేతిన
శ్చేతో విశ్వఫలాత్ఫలం త్వదపరం కుత్రాప్యయం ముహ్యతి ।
సద్వేషాదివ పూతనాపి సకులా త్వామేవ దేవాపితా
యద్ధామార్థసుత ప్రియాత్మతనుగో ప్రాణీశయాస్త్వత్కృతే ॥ (35)

**తా॥** ఓదేవా! ఈ గొల్లపల్లెలోనుండువారికి – విశ్వఫలములలోకెల్ల గొప్ప ఫలమగు నీ కంటె నితరమైనదేమి ఇచ్చితివి? అని ఎచటనో ఈ నా మనస్సు మోహముచెందుచుండును. ఉత్తమురాలి వేషమున వచ్చిన (దుష్టురాలగు) పూతన కూడ తనవారితో సహా నిన్నే పొందెను. ఇక ఈ వ్రజవాసుల ఇండ్లు, ధనములు, పుత్రులు, ప్రియులు, శరీరములు, ఆత్మలు, ఆవులు, ఇంద్రియములు, ప్రాణములు మొదలగునవన్నియు ఓ ఈశ్వరా! నీ కొఱకే సమర్పింబడినవి కదా! (నీ కన్న గొప్ప ఫలము లేదు పూతన వంటి రాక్షసులకును నీవే ప్రాప్తించితివి. మిక్కిలి ప్రేమతో తమ సర్వస్వమును నీకే సమర్పించిన వారికిని నిన్ను నీవు సమర్పించుకొనుట దప్ప అంతకంటె ఇంకను గొప్ప ఫలము ఏమిచ్చెదవు. నిన్ను నీవిచ్చుకొనుట కంటె ఈ విశ్వమున మరియొక గొప్ప ఫలము లేదయ్యెను. అని బ్రహ్మదేవుని ఆలోచన. దానితో అతడు మోహమునందుచుండును.) (35)

**టీ॥** – అపి చ కిం వర్ణ్యతే కృతార్థత్వమేతేషాం. భక్త్యా భవానపి. ఋణివాస్తే ననుకిం దాతుమసమర్థోఽహం. యేన ఋణీస్యా మత ఆహ –ఏషామితి. ఉత అపి భవానపి ఏషా కుత్రాపి. కిం విశ్వఫలాత్సర్వ ఫలాత్మకాత్ త్వత్తః. అపరం ఫలం దాతా దాస్యతీతి నశ్చేతః అయత్ సర్వత్ర గచ్ఛత్. విచారయత్. ముహ్యతి. నను మామేవ దత్వా అనృణః

**టీ॥** – మరియు వీరి కృతార్థత్వము ఏమని వర్ణింపబడును? భక్తితో నీవు కూడ ఋణగ్రస్తుడవుగ నుండిపోయితివి – నేను ఏమిచ్చుటకు సమర్థుడను? దేనిచేత నేను ఋణినయ్యెదనో – అది చెప్పుచున్నాడు. 'ఏషాం' అని – లేక నీవు కూడ వీరికి ఎచ్చటనో –విశ్వఫలములలో కెల్లను సర్వఫలాత్మకత్వము వలన నీ కంటె వేరైన ఫలమును

స్యామితి చేత్. న హి న హి సద్వేషాదివ సతాం భక్తానాం యో వేషః తదనుకారమాత్రేణ పాపిష్ఠా పూతనాపి. త్వామేవాపితా ప్రాపితా. తర్హి ఏతత్సంబంధినామపి దాస్యామీతి చేత్తత్రాహ-సకులేతి. బకాఘాసుర సహితా. ఏషామపి తావదేవ చేదపర్యాప్తమిత్యాహ-యదితి. యేషాం ధామాదయ స్త్వత్కృతే త్వదర్థమేవేత్యర్థః. (35)

ఇచ్చువాడవయ్యెదవేమో అని నా మనస్సు పరిపరివిధముల పోవుచుండును. ఆలోచించుచు తికమక పడుచుండును, నన్ను నేనే యిచ్చుకొని ఋణ విముక్తుడనయ్యెదనినచో కాదు కాదు సద్వేషాదివ సతాం - భక్తుల యొక్క ఏ వేషము గలదో దానిని అనుకరించిన మాత్రమున పాపిష్ఠురాలగు పూతన కూడ నిన్నే పొందెను! అయినచో ఇట్టి వారికి కూడ ఇచ్చెదవంటివేని - చెప్పుచున్నాడు. "సకులా" అని. బకాసుర, అఘాసుర సహితురాలై - వీరికి కూడ అంతవఱకే ననినచో అపర్యాప్తమని చెప్పుచున్నాడు. - ఎవరి ఇండ్లు మొదలగునవి నీ కొఱకేనని యర్థము. (35)

**శ్లో॥** తావద్రాగాదయః స్తేనాస్తావత్కారా గృహంగృహమ్ ।
తావన్మోహోఽంఘ్రి నిగళో యావత్కృష్ణ నతేజనాః ॥ (36)

**తా॥** ఎంత వఱకు రాగము ద్వేషము మొదలగునవి చోరులవలె లోననుండునో అంత వఱకు ఇల్లే చెఱసాలయగును. ఎంత వఱకు మోహమనునది కాలికివేసిన సంకెలవలె నుండునో అంత వఱకు ఓ కృష్ణా! అట్టివారు నీవారు కారు. (36)

**టీ॥** - నను విగతరాగాదిదోషాణాం సన్న్యాసినామపి. న మత్తః పరం కించిదస్తి కథమేతేషామపర్యాప్తమిత్యత ఆహ-తావదితి. హే కృష్ణ రాగాదయస్తావదేవ. స్తేనాశ్చోరా భవంతి. తదా తావద్గృహమపి కారాగృహం బంధనాగారం. మోహోఽపి తావదేవ. అంఘ్రియుగళ నిగళః

**టీ॥** - రాగద్వేషాదులను విడిచిన సన్న్యాసులకు కూడ నాకంటె వేరైన గమ్యమేదియులేదు. మఱివీరికి అపర్యాప్తమనుటయెట్లు? చెప్పుచున్నాడు. ఓ కృష్ణా! రాగాదులు ఎంత వఱకు దొంగలుగనుందురో అంతవఱకు ఇల్లు కూడ చెఱసాలయే యగును. ఎంత వఱకు

పాదశృంఖళా. యావత్తే త్వదీయా జనా న భవంతి త్వదీయానాం. తు రాగాదయోఽపి త్వన్నిష్ఠా మోచకాఏవేతి న యతిభ్యో విశేషః భజనం త్వధికమితి భావః. (36)

మోహముకూడ కాళ్ళకువేసిన సంకెళ్ళుగనుండునో అంత వఱకు వారు నీ వారలు కారు. నీ వారలకైననో – రాగాదులు కూడ నీ యందలి నిష్ఠను విడగొట్టునవియే. యతులకును ఇందు విశేషమేమియులేదు – సేవించుటయే గొప్పదని భావము. (36)

**శ్లో॥** ప్రపంచం నిష్ప్రపంచోఽపి విడంబయసి మాయయా ।
ప్రసన్నజనతానంద సందోహం ప్రథితుం భవాన్ ॥ (37)

**తా॥** నీవు అనుగ్రహించిన జనుల ఆనంద సమూహములను విస్తరింపజేయుట కొఱకు – ఈ ప్రపంచముతో బొత్తిగ సంబంధింపని వాడవైనను నీవీ ప్రపంచమును మాయచే మోహింపజేయుచున్నావు. **37**

**టీ॥** – నన్వనృణత ఏవాహమేషాం పుత్రాదిరూపేణ వర్త ఇతి చేత్తత్రాహ –ప్రపంచమితి. ప్రసన్నా యా జనతా. జనసమూహః తస్యా అనందానాం సందోహం సమూహం ప్రథయితుమితి. న హి కపటపుత్రత్వాదినా తాదృగ్భక్తేరానృణ్యం సంపద్యత ఇత్యర్థః. (37)

**టీ॥** – నేను ఇట్లు వీరి పుత్రాది రూపమున వర్తించుచుండుట ఋణములేకుండునట్లుండుట కొఱకే. ఋణ విముక్తత కొఱకే అనినచో చెప్పుచున్నాడు. 'ప్రపంచం' అని. అనుగ్రహింపబడిన ఏ జనత – జన సమూహము గలదో దాని యొక్క ఆనందముల సమూహము విస్తరించుటకు అని. కపట పుత్రత్వము మొదలగు దానిచే ఆ ధమైన భక్తికి ఋణ విముక్తత లభింపదని యర్థము. (37)

**శ్లో॥** జానంత ఏవ జానంతు కిం బహూక్త్యా న మే ప్రభో ।
మనసో వపుషో వాచో వైభవం తవగోచరమ్ ॥ (38)

**తా॥** ప్రభూ! మనస్సునకు, శరీరమునకు, వాక్కునకును తెలిసినంత వఱకు, తెలిసినవారు, నీ మహిమను తెలియుదురుగాక. పెక్కు మాటలతో యేమి? నాకు మాత్రము తెలియదు. (38)

**టీ॥** – తదేవమాదిత ఆరభ్య. అచింత్యానంతగుణత్వేన స్వయం దుర్జ్ఞేయత్వముక్తం. కేచిత్తు వయం జానీమ ఇతి స్థితాస్తానపహ సన్నివాహ – జానంత ఇతి. న తు మే మన ఆదీనాం. తవ వైభవం విషయ ఇతి. (38)

**టీ॥** – 'తదేవమాదిత' అని ఆరంభించి తన అచింత్యత్వము, అనంతత్వము మొదలగు లక్షణములచేత స్వయముగ తన ఎఱుగరాని తత్త్వముచెప్పబడినది. కొందఱు "మాకుతెలియు"నని అందురు వారిని అపహాస్యము చేయుచున్నవానివలె చెప్పుచున్నాడు. 'జానంతం' అని. నా మనస్సు మొదలైన వానికి మాత్రము నీవైభవము (తత్త్వము) విషయము కాదు. (38)

**శ్లో॥** అనుజానీహి మాం కృష్ణ సర్వం త్వం వేత్సిసర్వదృక్ ।
త్వమేవ జగతాం నాథో జగచ్చైతత్తవార్పితమ్ ॥ (39)

**తా॥** కృష్ణా! నీవు సర్వసాక్షివి. అంతయు నెఱుఁగుదువు. జగత్తుకంతటికి నీవే పతివి. జగత్తంతయు నీకే అర్పితమైయున్నది. ఇక నాకు సెలవిమ్ము. (39)

**టీ॥** జగదీశత్వాద్యభిమానం పరిత్యజ్యాహ – అనుజానీహీతి. స్వమహిమానం. అస్మదాదీనాం చ జ్ఞానబలాది సర్వం. త్వమేవవేత్సి. యతః సర్వదృక్ జగతాం నాథః. త్వమేవేత్యేతావజ్జ్ఞానం. అతో మమతాస్పదం జగదేతచ్ఛరీరం చ తవార్పితం. (39)

**టీ॥** – 'నేను జగదీశ్వరుడను' అను అభిమానమును విడిచిపుచ్చి (బ్రహ్మదేవుడు) చెప్పుచున్నాడు. 'అనుజానీహి'అని, నీ మహిమ, మా వంటి వారి జ్ఞానము, బలము మొదలగునవి అన్నియును నీకే తెలియును. ఎందువలన అనగా నీవు అంతయును చూడగలవాడవు – జగత్తులకు నాథుడవు. నీవే అనునంతవఱకు జ్ఞానము, అందువలన, 'ఇది నాది' అను భావనకు మూలమైన ఈ జగత్తు – ఈ శరీరము నీకర్పింపబడినవి. (39)

**శ్లో॥** శ్రీకృష్ణ వృష్ణికుల పుష్కరజోషదాయిన్
క్ష్మానిర్జరద్విజ పశూదధివృద్ధి కారిన్ ।
ఉద్ధర్మ శార్వర హరక్షితి రాక్షసద్రు
గా కల్పమార్కమర్హన్ భగవన్నమస్తే ॥ (40)

**టీ॥** – తదేవం కింకరం ప్రస్థాపయేత్యత్యాదరేణ నమస్కరోతి– శ్రీకృష్ణేతి. వృష్ణికులపద్మస్య ప్రీతిదాతృత్వేన. హే సూర్యోపమ. క్ష్మా చ. నిర్జరా దేవాశ్చ ద్విజాశ్చ. పశవశ్చ త ఏవ ఉదయస్తేషాం వృద్ధికారిత్వేన. హే చంద్రోపమ ఉద్ధర్మః పాషండధర్మః. తదేవ శార్వరం తమః తద్ధరతీతి తథా. అనేన హే ద్వయోపమ. హే క్షితిరాక్షస ద్రుక్ క్షితౌ రాక్షసాః కంసాదయః. ఉద్యన్నేవ తేభ్యో ద్రుహ్యతీతి. పునః సూర్యోపమా. సూర్యాద్యుపమాపి న్యూనేతి మత్వాహ–అర్కం అర్కమభివ్యాప్య. సర్వేషామర్హన్ పూజ్య. భగవన్ ఆకల్పం కల్పపర్యంతం. తే తుభ్యం. నమ ఇతి. (40)

**తా॥** ఓ శ్రీకృష్ణా! వృష్ణి (గొల్ల,గొల్ల) కులమనెడు పద్మమునకు సంతోషము నిచ్చువాడా! (సూర్యునివంటివాడా) భూమిని, దేవతలను, బ్రాహ్మణులను, (పక్షులను) పశువులను, సముద్రమును వృద్ధి పొందించువాడా! (చంద్రుడా!) పాషండ ధర్మమనెడు చీకటి రాత్రిని హరింపజేయువాడా! (సూర్య చంద్రులవంటి వాడా) భూమి యందలి రాక్షసులను సంహరించువాడా! సూర్య బింబమున వ్యాపించి, అందచేత పూజింపదగినవాడా! భగవన్ కల్పాంతము వఱకును నీకు నమస్కరించుచుందును. (40)

**టీ॥** – ఇట్టి కింకరుని (సేవకుని) నడిపింపుము అని మిక్కిలి ఆదరముతో నమస్కరించుచున్నాడు శ్రీకృష్ణఅని. వృష్ణికులమనెడు తామర పువ్వునకు ప్రీతికలిగించుటచే – ఓ సూర్యుని వంటివాడా! భూమి, దేవతలు, బ్రాహ్మణులు (పక్షులు) పశువులు – ఎవడు ఉదయించుటచే వీరికి వృద్ధి కలిగించుచుండునో అట్టి ఓ చంద్రునివంటివాడా! – ఉద్ధర్మః – పాషండ (నాస్తిక) ధర్మము – అదియే చీకటి – దానిని ధరించుటచే అట్లు చెప్పబడినది. దీనిచే ఓ సూర్య చంద్రులిరువురి పోలికగలవాడా! ఓ భూమిపైని రాక్షసులను ద్రుంచువాడా! భూమియందు కంసుడు మొదలగు రాక్షసులు ఉదయించగనే వారిని దునుమాడు వాడవని మఱల సూర్యునితో

పోలిక. సూర్యుడు మున్నగు పోలికకూడ తక్కువగా భావించి చెప్పుచున్నాడు. అర్కం – సూర్యుని – అంతటను వ్యాపించి – సర్వేషాం అర్హన్–అందరికిని పూజ్యుడవైనవాడా! భగవన్! ఆకల్పం – కల్పాంతము వఱకు – తే – నీకు – నమస్కారము – అని. (చతుర్యుగములు ఒకవేయి పర్యాయములైనచో ఒక కల్పము.) (40)

*శ్రీశుక వాచ.*

**శ్లో॥** ఇత్యభిష్టూయ భూమానం త్రిః పరిక్రమ్య పాదయోః ।
నత్వాభీష్టం జగద్ధాతా స్వధామ ప్రత్యపద్యత ॥ (41)

*శ్రీశుక మహర్షి యిట్లనెను*

**తా॥** జగత్సృష్టికర్తయగు బ్రహ్మదేవుడీ విధముగ ఆనందరూపుడగు నారాయణుని స్తుతించి మూడు పర్యాయములు (పాదములతో) ప్రదక్షిణముచేసి, తనకు ఇష్టుడైన ఆ దేవదేవునకు నమస్కారముచేసి తన నివాసస్థానమగు సత్యలోకమునకు పోయెను. (41)

**టీ॥ –** శ్లో. "ససఖవత్సక మోక్షణకౌతుక ద్రుత విలంబితపుత్రముదేఽద్భుతం, నిఖిలరూపమతోదధదచ్యుతోఽవతు స వః కలయన్ వ్రజమంగళం." శ్రీధరీయోఽయం శ్లోకః. ఇతీతి. పాదయోర్నత్వా. అభీష్టం. సర్వతః పూజితం అభిప్రేతం వా. (41)

**టీ॥** శ్లో. "ససఖవత్సక మోక్షణకౌతుక ద్రుత విలంబిత పుత్రముదేఽద్భుతం, నిఖిల రూపమతోదధదచ్యుతోఽవతు స వః కలయన్ వ్రజమంగళమ్ – ఇది శ్రీధరుని శ్లోకము, స్నేహితులగు గోప బాలురతో కూడ, లేగదూడలకు, అందఱికిని మోక్షమిచ్చు కుతూహలమున – తన లోకమునకు బోయి కర్తవ్యములను నెరవేర్చవలయుననెడి తొందర – కృష్ణుని వీడిపోజాలనందున ఆలస్యము (ద్రుతవిలంబిత) రెండును ఒకే సమయమున ననుభవించు తన పుత్రుడైన బ్రహ్మదేవుని గూర్చి

అద్భుతమైన ఆనందముతో అన్ని రూపములను ధరించిన కృష్ణుడు, వ్రజమునకు శుభమును కలిగించుచు మిమ్ము రక్షించుగాక అని ఈ శ్లోక భావము. (ద్రుతవిలంబిత పుత్ర శబ్దమునకు వంశీధరుడు కూడ కొంత విశేషముగ వ్యాఖ్యానించెను). ఇతీతి–పాదములకు నమస్కరించి – తన కిష్టమైన – లేక అంతటను పూజింపబడువాడు అను అభిప్రాయమున 'అభీష్టం' అని. (41)

**శ్లో॥** తతోఽనుజ్ఞాప్య భగవాన్ స్వభువం ప్రాగివస్థితాన్ ।
వత్సాన్ పులిన మానిన్యే యథాపూర్వ సఖం స్వకమ్ ॥ (42)

**తా॥** అప్పుడు భగవానుడు బ్రహ్మదేవున కనుజ్ఞనిచ్చి, పూర్వస్థితిలోనే యున్న లేగదూడలను యమునానది యొక్క ఇసుక తిన్నెకుగొని వచ్చెను. అచట యథా పూర్వముగ తన మిత్రులగు గోపబాలురు ఉండిరి. (42)

**టీ॥** – తత ఇతి. అనుజ్ఞాప్య అనుజ్ఞాం ప్రదాయ పృష్ట్వేత్యర్థః. స్వభువం బ్రహ్మాణం. యథాపూర్వం సఖాయో యస్మిన్ తత్. స్వకం పులినం. (42)

**టీ॥** – అనుజ్ఞాప్య – అనుజ్ఞనిచ్చి – అడిగి అనియర్థము. స్వభువం – బ్రహ్మదేవుని – పూర్వమువలెనే తన స్నేహితులు దేనియందుండిరో అది – స్వకం – పులినము – ఇసుకతిన్నె – (42)

**శ్లో॥** ఏకస్మిన్నపి యాతేఽబ్దే ప్రాణేశం చాంతరాత్మనః ।
కృష్ణమాయా హతా రాజన్ క్షణార్ధం మేనిరేఽర్భకాః ॥ (43)

**తా॥** పరీక్షిన్మహారాజా! కృష్ణుని మాయచేత కొట్టబడినవారై, తమ ప్రాణ ప్రియుడు, అంతరాత్మయునగు శ్రీకృష్ణుని విడిచిన ఒక సంవత్సరము గడచినను, ఆ గోపబాలురు ఆ సమయమును క్షణములో సగముగ భావించిరి. (43)

**టీ॥** – నన్వేతావంతం కాలం కథం తత్రైవోపవిష్టాః. కథం చ. క్షుత్పిపాసాదివిస్మరణమత ఆహ–శ్లోకద్వయేన. ఏకస్మిన్నితి. అబ్దేఽపి యాతే ప్రాణేశం కృష్ణం అంతరా చ వినాపి. ప్రియవిరహేక్షణోఽపి యద్యపి వర్షాధికో భవతి. తథాపి. మాయామోహితాః క్షణార్ధం మేనిరే. (43)

**టీ॥** – ఇంతకాలము వారు అచటనే ఎట్లు కూర్చొని యుండిరి? ఆకలి దప్పులు మొదలగు వానిని ఎట్లు మరచి యుండిరి? రెండు శ్లోకములతో చెప్పుచున్నాడు. ప్రాణేశుడగు కృష్ణుడు తమతో లేక ఒక సంవత్సరము గడచిపోయినను, ఇష్టమైన వాని విరహమునందు ఒక్క క్షణము కూడ సంవత్సరము కంటె అధికమగును – కాని మాయా మోహితులై వారు అర్ధ క్షణముగనే భావించిరి. (43)

**శ్లో॥** కిం కిన్న విస్మరంతీహ మాయా మోహిత చేతసః ।
యన్మోహితం జగత్సర్వ మభీక్ష్ణం విస్మృతాత్మకమ్ ॥ (44)

**తా॥** మాయచేత మోహమును చెందు చిత్తములు గలవారు దేనిని మరచిపోవుదురో, దేనిని మరవకుండెదరో తెలియదు. ఏలయన ఈ జగత్తంతయును ఎల్లప్పుడును మరచిపోవు స్వభావము గలదియై భ్రమను చెందియే యుండును. (44)

**టీ॥** – కిమితి. యత్ యయా మాయయా. మోహితం జగత్. అభీక్ష్ణం పునః పునః విస్మృత ఆత్మా యేన తత్తథా. (44)

**టీ॥** – ఏ మాయచేత భ్రమించుచుండు జగత్తుకలదో అది – అభీక్ష్ణం – మరల మరల విస్మరించుచుండు స్వభావము కలిగియుండుటచే అటుల చెప్పుబడినది. (44)

**శ్లో॥** ఊచుశ్చ సుహృదం కృష్ణం స్వాగతం తేఽతి రంహసా ।
నైకోఽప్య భోజి కబళ ఏహి తత్సాధు భుజ్యతామ్ ॥ (45)

**తా॥** గోపబాలురు మిక్కిలి వేగముగా ముందునకేగి తమ నెచ్చెలి యగు శ్రీకృష్ణునకు 'నీకు స్వాగతము' అని చెప్పిరి. "మాలో ఒక్కరము కూడ నీ అనుపస్థితిలో ఒక్క ముద్ద కూడ తినకుంటిమి! రమ్ము రమ్ము! భోజనము చేయుటయే లెస్స భుజించెదముగాక. (45)

**టీ॥** – ఊచురితి. అత ఏవమూచుశ్చ. తే త్వయా అతివేగేన స్వాగతం సమ్యగాగతం. ఏకోఽపి త్రాసస్త్వాం వినా అస్మాభిః నాభోజి న భుక్తః ఇతి ఏహి సాధు అవిక్షేపేణ. భుజ్యతామితి. (45)

**టీ॥** – నీవు అతివేగముగ 'చక్కగా వచ్చితివి మేలు మేలు అని పలికిరి. మాలో ఒక్కడు కూడ నీవు లేనందు వలన బాధపడి భుజింపడయ్యెను. ఇటకు రమ్ము కలిపి తినెదముగాక అని. (45)

**శ్లో॥** తతో హసన్ హృషీకేశోఽభ్యవహృత్య సహార్భకైః ।
దర్శయంశ్చర్మాజగరం న్యవర్తతవనాద్వ్రజమ్ ॥ (46)

**తా॥** అప్పుడు కృష్ణుడు నవ్వుచు గోపబాలకులతో కూడి భోజనము చేసి, అటుపైన అఘాసురుని మారురూపమగు కొండచిలువ చర్మమును (అస్థిపంజరమును) వారికి చూపుచుండగా, ఆ వనము నుండి వ్రజమునకు అందఱును తిరిగి వచ్చిరి. (46)

**టీ॥** తత ఇతి. అభ్యవహృత్య భుక్త్వా. (46)

**టీ॥** – అభ్యవహృత్య – భోజనముచేసి– (46)

**శ్లో॥** బర్హప్రసూన నవధాతు విచిత్రితాంగః
ప్రోద్దామవేణు దళశృంగ రవోత్సవాఢ్యః ।
వత్సాన్ గృణన్ననుగ గీతపవిత్ర కీర్తి
ర్గోపీదృగుత్సవదృశిః ప్రవివేశ గోష్ఠమ్ ॥ (47)

**తా॥** నెమిలిపింఛము, పువ్వులు, క్రొత్త బంగారు ఆభరణములు (లేక వివిధములగు ధాతువులచే చేయబడిన ఆభరణ విశేషములతో) అలంకరింపబడిన విచిత్రమైన శరీరము గలవాడును, ప్రకృష్టముగ ప్రసరించుచున్న పిల్లనగ్రోవి సమూహములు, కొమ్మువాద్యములు మున్నగు వాని ధ్వనులచే నెలకొనియున్న ఉత్సవ వాతావరణముచే ఒప్పుచున్నవాడును, లేగదూడలకు మార్గదర్శకములగు లాలింపు ధ్వనులను చేయుచు, వానిననుసరించి తన పవిత్రమైన కీర్తిని గానము చేయుచున్న గోపబాలుర పాటలతోను, గోపస్త్రీల చూపులకు ఉత్సవరూపమగు దర్శన మిచ్చుచున్నవాడును అయిన శ్రీకృష్ణుడు గోశాలను ప్రవేశించెను. (47)

**టీ॥** – బర్హేతి. ప్రోద్దామో యో వేణ్వాదిరవైరుత్సవస్తేనాఢ్యః సంపన్నః గృణన్ ఉపలాలనైః ఆహ్వయన్. గోపీదృగుత్సవదృశిః గోపి నాం దృశాం ఉత్సవరూపా దృశిర్దర్శనం యస్య సః. అత్ర ఘోషమితి పాఠే వ్రజమిత్యర్థః (47)

**టీ॥** – ప్రకృష్టముగ బయటకు వినిపించుచున్న ఏ వేణువులు మొదలగు వాద్య ధ్వనులచేత కలుగు ఉత్సవము, దానిచేత ఒప్పుచున్నవాడు – గృణన్ – ఉపలాలలనలతో ఆహ్వానించుచు – గోపీదృగుత్సవ దృశిః – గోపస్త్రీలచూపులకు ఉత్సవ రూపమగు దృశిః – దర్శనముగల వాడెవడో వాడు – ఇచట ఘోషమను పాఠాంతరమునందు వ్రజమని యర్థము. (47)

**శ్లో॥** అద్యానేన మహాన్ వ్యాళో యశోదానంద సూనునా ।
హతోఽవితా వయం చాస్మాదితి బాలా వ్రజే జగుః ॥ (48)

**తా॥** ఈనాడే యశోదానందుల కుమారుడగు శ్రీకృష్ణునిచేత ఒక మహాసర్పము చంపబడి – దాని నుండి మేము రక్షింపబడితిమి" అని గోపబాలురు వ్రజమునందు చెప్పిరి. (48)

**టీ॥** అద్యేతి. యశోదానందసూనునేతి. బహూనాం ముక్తిః సహైవ దర్శితా. కేచిదాహుః. యశోదా సూనునా అపరే నందసూనునేతి. యద్వా. యశోదానందయతీతి యశోదానందః స చాసౌ సూనుశ్చేతి తథా తేన అస్మాత్ మహావ్యాళాద్వయం చ అవితాః రక్షితాః. (48)

**టీ॥** – చాలమంది మోక్షమునొందుట వెంటవెంటనే చూపబడెను. కొందఱు, యశోద యొక్క కుమారునిచేత అనియు, ఇతరులు నందుని కుమారునిచేత అనియు చెప్పిరి. లేక యశోదను ఆనందింపజేయువాడు యశోదానందుడు – అతడే ఈ కుమారుడు అని అటుల – అతనిచేత. ఈ మహాసర్పమునుండి మేము – అవితాః – రక్షింపబడితిమి. (48)

రాజోవాచ.

**శ్లో॥** బ్రహ్మన్ పరోద్భవే కృష్ణ ఇయాన్ ప్రేమా కథం భవేత్ ।
యేభూతపూర్వస్తోకేషు స్వోద్భవేష్వపి కథ్యతామ్ ॥ (49)

పరీక్షిన్మహారాజు యిట్లనెను

**తా॥** యోగీంద్రా! బ్రహ్మన్! కృష్ణుడు ఇతరుల (దేవకీవసుదేవుల) పుత్రుడగుచుండగా అతనిపై వీరికింత ప్రేమ ఎట్లు కలుగును? ఇంతకు పూర్వమే పుట్టియుండిన తమ సొంత పిల్లల మీద గల ప్రేమవంటి ప్రేమయే ఇతరుల పిల్లలమీద ఎట్లు కలుగునో చెప్పుము. (49)

**టీ॥** – శ్లో. వ్రజౌకసాం స్వతోకేషు స్నేహవైక్లబ్యమన్వహం. శనైర్నిస్సీమ వవృధే యథా కృష్ణే త్వపూర్వవదిత్యాదినా. స్వతోకేభ్యోఽపి పరపుత్రే కృష్ణే ప్రేమాధిక్యముక్తం. తత్ర పృచ్ఛతి – బ్రహ్మన్నితి. (49)

**టీ॥** – "వ్రజమునందుండు వారికి తమ పిల్లలయందుగల అవశమైన వాత్సల్యము, మెల మెల్లగా కృష్ణుని యందు అవధిలేకుండగా, అపూర్వముగ పెరిగిపోయెను" అని తమ సంతానములయందు కంటె కూడ ఇతరుల సంతానమగు కృష్ణునియందు అధికమైన ప్రేమ కలదని చెప్పబడినది. అదియే అడుగుచున్నాడు. "బ్రహ్మన్" ఇత్యాదిగ. (49)

శ్రీశుక ఉవాచ.

**శ్లో॥** సర్వేషామేవ జంతూనాం నృప ! స్వాత్మైవ వల్లభః ।
ఇతరేఽపత్య విత్తాద్యా స్తద్వల్లభయైవ హి ॥ (50)

శ్రీశుకమహర్షి యిట్లనెను

**తా॥** "రాజా! ప్రాణులన్నింటికిని తమ ఆత్మయే ప్రియమైనది. ఆ ఆత్మయందలి ప్రేమ వలననే తక్కిన సంతాన ప్రేమ, ధనమునందలి ప్రేమ మున్నగునవి ప్రవర్తించుచుండును. (50)

**టీ॥** – శ్రీకృష్ణస్య సాక్షాదాత్మత్వాత్తస్మిన్నాత్మీయేభ్యః ప్రేమాధిక్యం యుజ్యత ఇతి వక్తుం ప్రథమం తావదాత్మనః. స్వతః ప్రేమాస్పదత్వమన్యే

**టీ॥** – శ్రీకృష్ణుడు సాక్షాత్తుగ ఆత్మయగుటవలన ఆతని యందు ఆత్మీయులకు అధికమైన ప్రేమయుండుట యుక్తమే అని చెప్పుటకు

షాం తు తదుపాధికమితి దర్శయతి - పంచభిః. సర్వేషామితి. (50)

మొదట ఆత్మకు స్వయముగ ప్రేమాస్పదత్వము, ఇతరులకైననో ఆ ఆత్మకు గల ఉపాధి (ఆత్మను ఆవరించియున్న శరీరము) అని, ఐదు శ్లోకములతో చూపుచున్నాడు. (50)

**శ్లో॥** తద్రాజేంద్ర యథాస్నేహః స్వస్వకాత్మని దేహినామ్ ।
న తథా మమతాలంబి పుత్ర విత్త గృహాదిషు ॥ (51)

**తా॥** ఓ రాజేంద్రా ! ఆ కారణము వలననే శరీరధారులకు తమ తమ అంతరాత్మ యందు ప్రేమయున్నట్లు, తమ పుత్రలయందు గాని, ధనము యందుగాని, గృహములు మొదలగువాని యందు గాని ఉండదు. (51)

**టీ॥** - కుతః తథా దర్శనాదిత్యాహ - తదితి. తస్మాదేవ కారణాత్. స్వస్వకాత్మని అహంకారాస్పదేఽపి దేహే. (51)

**టీ॥** అటుల ఎందులకు? కనపడుచుండుట వలనని చెప్పుచున్నాడు. అదే కారణము వలన - స్వస్వకాత్మని - అహంకారమునకు స్థానమైన దేహము నందు కూడ - (లౌకిక పక్షముగ అహంకారాస్పదమగు జీవతత్త్వమున - పారమార్థికముగ ప్రత్యగాత్మయందు). (51)

**శ్లో॥** దేహాత్మవాదినాం పుంసామపి రాజన్యసత్తమ ।
యథాదేహః ప్రియతమస్తథా నహ్యను యే చ తమ్ ॥ (52)

**తా॥** ఓ రాజోత్తమా! 'దేహమే ఆత్మ'యని విశ్వసించు పురుషులుకూడ తమ దేహమును ప్రేమించినంతగ, తమననుసరించి యుండు పుత్ర ధన గృహాదులను ప్రేమింపరు. (52)

**టీ॥** ఆత్మాధ్యాస తారతమ్యేన ప్రేమతారతమ్యం దృశ్యమానం తన్నిబంధనమేవేతి దర్శయితుం. మూఢా మూఢభేదేన. విశేషమాహ–ద్వాభ్యాం. దేహేతి. తం దేహమను యే భవంతి పుత్రాదయః. తే తు. న తథా ప్రియతమా ఇత్యర్థః. (52)

**శ్లో॥** దేహోఽతి మమతాభాక్చేత్తర్హ్యసౌ నాత్మవత్ప్రియః ।
యజ్జీర్యత్యపి దేహేఽస్మిన్ జీవితాశా బలీయసీ ॥ (53)

**టీ॥** దేహ ఇతి. యత్ యస్మాత్. జీర్ణత్యపి ఆసన్నమరణేఽపి జీవితాశా భవతి. అయం భావః. న జీవిష్యతీతి నిశ్చితేఽపి దేహే యత్ప్రేమాస్పదత్వం తదాత్మగతమేవ సంగచ్ఛత ఇతి. అథవా. యత్ యస్మిన్ దేహే జీర్ణత్యపి. జీవితాశా అవివేకదశాయా మాసీత్సాపి వివేకినో యదా మమతాభాక్ భవతి. తదా తత్ర నాతివాస్త ఇతి. (53)

**టీ॥** – ఆత్మకును దాని అధ్యాసకును (శరీరమునకు) మధ్యనగల భేదముచేత కనపడుచున్న ప్రేమలోని భేదము దానికి కట్టుబడియే యున్నవి అని చూపుటకు వివేకవంతులు మూఢులు అనుభేదము చేత రెండు శ్లోకములతో విశేషమును చెప్పుచున్నాడు – ఆ దేహము ననుసరించి ఏ పుత్రాదులు కలుగుదురో వారు అట్లు ప్రియతములు కారు. అనియర్థము. (అట్లు = దేహమును ప్రేమించునట్లు) (52)

**తా॥** శరీరము, అతిమాత్రమైన ప్రేమకు పాత్రమైనను, ఆ ప్రేమ, ఆత్మయందలి ప్రేమకంటెను గొప్పదికాదు; ఈ దేహము శిథిలావస్థకు చేరుకొనినను దీని యందు ఆశ బలీయమైనది. (53)

**టీ॥** – మరణమాసన్నమైనను జీవితాశ బలీయముగనే ఉండును. భావమేమనగా, 'దేహమిక జీవింపదు' అని నిశ్చయమైనను, దేహము నందలి ప్రేమ ఆత్మను పొందియే యుండును. ఆత్మకు సంబంధ పడినదిగనే యుండును. లేక ఈ దేహము జీర్ణముగును, ఐనను దీని యందు అవివేక దశయందు జీవితాశయుండును. వివేకదశ యందున్న వానికి కూడ అదియే ప్రేమపాత్రమై ఎప్పుడు ఉండునో, అప్పుడు అతి మిక్కిలి ఆస్థగనుండుదు. (ఆత్మయందువలె అతి ప్రియముగ నుండదు) ప్రవాహవశమున జీవతత్త్వమునకు గల దేహ ప్రేమయేకాని,

వివేకవంతుడు ఆసన్నమరణుడై యున్నప్పుడు దేహము నందతి మాత్రమగు ప్రేమ ఉండదు. ఏలయన నతడు దేహాత్మల భేదము తెలిసినవాడు కదా! (53)

**శ్లో॥** తస్మాత్ప్రియతమ స్స్వాత్మా సర్వేషామేవ దేహినామ్ ।
తదర్థమేవ సకలం జగచ్చైతచ్చరాచరమ్ ॥ (54)

**తా॥** అందువలన శరీరధారులందరికిని తమ తమ 'ఆత్మయే అన్నింటి కంటె ప్రియమైనది. ఈ చరాచర జగత్తంతయును ఆత్మ కొఱకే అయియున్నది. (54)

**టీ॥** – తస్మాదితి. తదర్థమేవ సకలం ప్రియమిత్యర్థః. (54)

**టీ॥** ఆ కారణము వలననే అంతయు ప్రియమైనదని యర్థము.(54)

**శ్లో॥** కృష్ణమేవ మవేహి త్వ మాత్మాన మఖిలాత్మనామ్ ।
జగద్ధితాయ సోఽప్యత్ర దేహీవాభాతి మాయయా ॥ (55)

**తా॥** ఆత్మయైన ఈ కృష్ణుని సర్వభూతముల ఆత్మగా గ్రహింపుము. అతడు కూడ జగత్తుకు హితముచేయగోరి (తన) మాయచేత శరీరధారిగ ప్రకాశించుచున్నాడు. (55)

**టీ॥** – ప్రస్తుతమాహ –కృష్ణమితి. – (55)

**టీ॥** – ప్రస్తుతమును చెప్పుచున్నాడు – 'కృష్ణం' అని – (55)

**శ్లో॥** వస్తుతోజానతామత్ర కృత్స్నం స్థాస్నుచరిష్ణు చ ।
భగవద్రూపమఖిలం నాన్యద్వస్త్విస్తి కించన ॥ (56)

**తా॥** ఇచట సత్య స్థితిని తెలిసికొనవలెను. అశేషమగు స్థావర జంగమాత్మకమైన ఈ సమస్త ప్రపంచము భగవానుని రూపమే. ఇతరమైన వస్తువేదియును లేదు. (56)

**టీ॥** న కేవలమాత్మనాత్మా కింతు జడానామపీత్యాహ - వస్తుత ఇతి. సర్వజగత్కారణమితి కృష్ణం జానతాం పుంసాం స్థావరం జంగమం చ. సర్వం భగవద్రూపం. భగవానేవ స్వరూపం యస్య తత్. నాన్యదస్తీతి భావః. (56)

**టీ॥** - ఒక ఆత్మమాత్రమేకాక జడపదార్థముల ఉనికికూడ ఆయనయే అనిచెప్పుచున్నాడు 'వస్తుతః' అని. కృష్ణుని సర్వజగత్తునకు కారణమైన వాడుగ (కార్యమైనవాడుగకూడ) తెలియవలెను. మనుష్యులు, స్థావరములు (జడములు), జంగమములు (చైతన్యముగలవియును), అంతయు భగవంతుని రూపమే. భగవానుడే స్వరూపము దేనికో అది (స్థావరము - జంగమము) వేరొకటిలేదని భావము. (56)

**శ్లో॥** సర్వేషామపి భూతానాం భావార్థో భవతిస్మృతః ।
తస్యాపి భగవాన్ కృష్ణః కిమతద్వస్తు రూప్యతామ్ ॥ (57)

**తా॥** సకల పదార్థములకును పరమార్థకారణము కృష్ణుడే - ఆ కారణమునకుగూడ భగవానుడగు కృష్ణుడేకారణము. (స్వయం కారణుడు) ఇక అతడుకాని వస్తువేదో నిరూపింపుము. (57)

**టీ॥** - కుత ఇత్యత ఆహ-సర్వేషామితి. భావార్థః పరమార్థః. భవతీతి భవత్ పరిణామం ప్రాప్నువత్ కారణం తస్మిన్. తస్యాపి భవతః కారణస్యాపి భగవాన్ కృష్ణః కారణం. అతః కిం. అతత్ శ్రీకృష్ణవ్యతిరిక్తం వస్తు నిరూప్యతాం. (57)

**టీ॥** - ఎందులకో చెప్పుచున్నాడు 'సర్వేషాం' అని. భావార్థః - పరమార్థము అగును అని. నీవు పరిణామమునుపొందు కారణము అతని యందే - నీ కారణమునకు కూడ భగవానుడగు కృష్ణుడే కారణము. ఇకనేమి శ్రీకృష్ణునకన్న నితరమైన వస్తువును నిరూపింపుము. (57)

**శ్లో॥** సమాశ్రితా యే పదపల్లవప్లవం
మహత్పదం పుణ్యయశో మురారేః ।
భవాంబుధిర్వత్స పదం పదం పరం
పదం పదం యద్విపదాం నతేషామ్ ॥ (58)

**టీ॥** – తస్మాత్ శ్రీకృష్ణస్యైవ పరమార్థత్వాత్తదేక శరణానామయత్నసిద్ధో మోక్ష ఇతి ప్రతరణార్థముపసంహరతి –సమాశ్రితా ఇతి. పుణ్యం యశో యస్య సః పుణ్యయశాః. స చాసౌ మురారిశ్చ. తస్య పదవల్లవ ఏవ ప్లవః. తం యే సమ్యగాశ్రితాః. మహత్పదం మహతాం పదం. ఆశ్రయం. యద్వా. మహచ్చ తత్పదం చేతి తథా. తేషాం భవాంబుధిః వత్సపదమాత్రం భవతి. కించ. పరం పదం శ్రీవైకుంఠాఖ్యం పదం స్థానం భవతి. విపదాం యత్పదం విషయ స్తత్పునః కదాచిదపి తేషాం న భవతి. న తతః పునరావర్తంత ఇత్యర్థః. (58. 59)

**తా॥** పుణ్యమునకు, కీర్తికిని మూర్తీభూతము, మహాపురుషులకు ఆశ్రయమునగు శ్రీకృష్ణుని చిగురువంటి పాదమును నావగా చేసికొని ఎవరు దాని నాశ్రయించెదరో, వారికి ఈ సంసారమనెడు సముద్రము, లేగదూడ పాదమువలె చిన్నదై, ఉత్తమోత్తమస్థానమగు మోక్షమునకు చేర్చగలదు. అడుగడుగునను ఆపదలు కలిగించు ఏ ఈ సంసారము కలదో అది వారికి కలుగదు. (58)

**టీ॥** – అందువలన శ్రీకృష్ణుని పరమార్థత్వమువలన, ఆతనినే శరణము పొందిన వారికి మోక్షము అప్రయత్నముగనే సిద్ధించునని ప్రకరణార్థ మును ముగించుచున్నాడు 'సమాశ్రితాః' అని. పుణ్యము, కీర్తి ఎవరికి గలవో అట్టివాడు 'పుణ్యయశాః' అట్టివాడు ఈ కృష్ణుడు – అతనియొక్క చిగురువంటి పాదమే నావ – దానినెవరు చక్కగా నాశ్రయించెదరో – మహత్పదం – గొప్పవారి ఆశ్రయము. లేక గొప్పదైన ఆపాదము అనియు చెప్పవచ్చును. వారికి సంసారసముద్రము లేగదూడ పాదమంతయగును. మరియు పరం పదం – శ్రీవైకుంఠమను పేరుగల స్థానము కలుగును. ఆపదలకు ఏ స్థానము గలదో – అది విషయము అది మఱల ఎప్పుడును వారికి కలుగదు. అప్పుడువారు పునరావృత్తిని పొందరని యర్థము. (58, 59)

**శ్లో॥** ఏతత్తే సర్వమాఖ్యాతం యత్పృష్టోఽహ మిహ త్వయా ।
యత్కౌమారే హరికృతం పౌగండే కీర్తితం భువి ॥ (59)

**తా॥** ఐదేండ్ల వయసు నందలి కృష్ణుని లీలలు, ఆఱేండ్ల వయస్సున గోపబాలకులెట్లు కీర్తించిరి? అని నీవడిగిన ప్రశ్నకు ఓ పరీక్షిద్రాజా! సమాధానముగ నీకంతయుఁజెప్పితిని. (59)

**శ్లో॥** ఏతత్సుహృద్భిశ్చరితం మురారే
రఘార్దనం శాద్వలభోజనం చ ।
వ్యక్తేతరద్రూప మజోర్వభిష్టవం
శృణ్వన్ గృణన్నేతి నరోఽఖిలార్థాన్ ॥ (60)

**తా॥** ఈ కృష్ణుని స్నేహితుల చరిత్ర, అతనిచే జరిగిన అఘాసురుని సంహారము, లేత కసవుగల పచ్చిక బయళ్ళలో వారి భోజనములు, నిర్గుణ పరమాత్మను గూర్చి బ్రహ్మదేవుడు చేసిన స్తోత్రము - వీనిని గూర్చి వినినను, కీర్తించినను (పారాయణము చేసినను) అట్టివాడు సకల పురుషార్థములను పొందును. (60)

**టీ॥** ఏతదితి. సుహద్భిశ్చరితం. శ్లో. ముష్ణతోఽన్యోన్యశిక్యాదీని త్యాది నోక్తం. అఘార్దనం శాద్వలే భోజనం చ. వ్యక్తేతరత్ వ్యక్తాజ్జడాత్ ప్రపంచాదితరత్. శుద్ధసత్వాత్మకం వత్సతత్పాలరూపం. యద్వా. వ్యక్తేతరత్ చిద్విలాసః తదేవ రూప్యత ఇతి రూపం అజస్య ఉరుర్మహాన భిష్టవః తం బ్రహ్మకృతాం స్తుతిం. ఏతత్ శృణ్వన్ గృణన్నరః సర్వపురుషార్థానాప్నోతి. ఇతి శ్రీపరమానందనృసింహపదషట్పదః. వ్యాకరోచ్ఛ్రీధరస్వామీ యథామతివిధిస్తుతిం. శ్రీధరీయోఽయం శ్లోకః (60, 61)

**టీ॥** సుహృద్భిశ్చరితం - ఒకరి ఉట్టిని మరియొకరు దొంగిలించుచు" అని మొదలగు భావముగల శ్లోకములలో చెప్పబడినది. అఘాసురవధ - పచ్చికబయళ్ళలో భోజనములు-వ్యక్తేతరత్. వ్యక్తాత్ - జడము కంటె - ప్రపంచము కంటె ఇతరమైన - కేవలము సత్తామాత్రుడును (ఇంద్రియములకు విషయముకానట్టి అస్తిత్వముకలవాడు) లేగదూడల రూపమును, గోపబాలుర రూపమును ధరించినవాడు లేక - వ్యక్తేతరత్ - వ్యక్తముకానట్టి చిద్విలాసుడు - (జ్ఞానమే-ప్రకాశస్థితిలోనున్నవాడు) అదియే రూపమునందినట్లున్న రూపము. బ్రహ్మదేవుని మహాస్తోత్రము. వీనిని వినుచు, కీర్తించుచున్న మనుష్యుడు అన్ని పురుషార్థములను

శ్లో॥ ఏవం విహారైః కౌమారైః కౌమారం జహతుర్వ్రజే ।
నిలాయనై స్సేతుబంధై ర్మర్కట ప్లవనాదిభిః ॥ (61)

(ధర్మ, అర్థ, కామ, మోక్షములను) పొందును – అని "శ్రీపరమానంద రూపుడగు నరసింహుని పాద పద్మములవద్ద తిరుగాడు (శ్రీధరస్వామి) – తుమ్మెదయగు శ్రీధరస్వామి తన బుద్ధికి తోచినట్లు బ్రహ్మదేవుడు చేసిన స్తోత్రమును వ్యాఖ్యానించెను" ఈ భావముగల శ్లోకము శ్రీధరులవారిది. (60,61)

తా॥ ఈవిధముగ విహారములతో, దాగుడుమూతల ఆటలతో 'ఉత్తుత్తి' ఆనకట్టల నిర్మాణములతో, కోతులవలె గంతులు వేయుటలతో కృష్ణ బలరాములు తమ తోటివారలతో, కౌమార వయస్సును వ్రజమునందు గడిపిరి. (61)

**శ్రీ మద్భాగవతే, మహాపురాణే దశమస్కంధే,**
**చతుర్దశోఽధ్యాయః**

**అని శ్రీమద్భాగవతమున దశమస్కంధమందు**
**పదునాలుగవ అధ్యాయము సమాప్తము.**

## పంచదశోऽధ్యాయః

### శ్రీబాదరాయణి రువాచ

**శ్లో॥** తతశ్చ పౌగండవయ స్సమాశ్రితౌ
బభూవతుస్తౌ పశుపాలసమ్మతౌ ।
గాశ్చారయంతౌ సఖిభి స్సమంపదై
ర్బృందావనం పుణ్యమతీవ చక్రతుః ॥ (1)

**టీ॥** – 'తతః పంచదశే ధేనుపాలనం ధేనుకార్దనం, కాళాయక్ష్వేళతో గోపరక్షణం చ నిరూప్యతే. అహివక్త్రప్రవేశేన వృధా ఖిన్నాన్ సఖీనతః కృష్ణః ప్రావేశయత్పక్వఫలతాళాళికాననం, శైశవే పూతనాం జిత్వా కౌమారే తు బకాదికాన్, పౌగండ ఏవ దైత్యానాం మహామద మహన్నజః " తత ఇతి. పశుపాలసంమతౌ పశుపాలనే సంమతౌ. పశుపాలానాం వా సమ్మతౌ. ఈషద్వయో బలాతిరేకం అనుకృతవంతా విత్యర్థః. అతీవ చక్రతుః సర్వతః ప్రసర్పణేన. (1)

## పదిహేనవ అధ్యాయము

### శ్రీబాదరాయణమహర్షియిట్లనెను

**తా॥** "కృష్ణ బలరాములు పౌగండావస్థకు – అనగా ఆఱవ సంవత్సర వయస్సునకు చేరుకొనిరి. అప్పుడు వారు పశుపాలన చేయుటకు యోగ్యులైరి. తమస్నేహితులగు గోపబాలురతో కలిసి ఆవులను మేపుకొనుచు తమ పాదస్పర్శలతో బృందావనమును మిక్కిలి పవిత్రీకరించిరి. (1)

**టీ॥** – ఈ పదునైదవ అధ్యాయమున ఆవులను సంరక్షించుట, ధేనుకాసుర సంహారము, కాళీయుని విషము నుండి ఆవులను (లేగలను) రక్షించుట, వర్ణింపబడును. సర్పము నోటి లోనికి ప్రవేశించుటచేత వ్యర్థముగ దుఃఖించు తమ స్నేహితులను కృష్ణుడు అచటి నుండి పండిన పండ్లు, తాటిచెట్లు, తుమ్మెదలుగల ఒక వనమున ప్రవేశింపజేసిన వృత్తాంతము, శిశుత్వదశయందు పూతనను జయించి కౌమార దశయందు బకాసురుడు మొదలగువారిని నిర్జించి, పౌగండదశయందుననే అజుడైన కృష్ణుడు రాక్షసుల మహాగర్వమును హరించెను – పశుపాల సంమతౌ – పశువులను పాలించుట యందు యోగ్యత గలవారు లేక పశుపాలకులకు ఒప్పిదమైనవారు – కొంచెము వయస్సును, బలమును పెంచుకొనినట్లు అనుకరించుచుండిరని యర్థము. అంతటను తిరుగుచుండుటచే మిక్కిలిగ పవిత్రము చేసిరి. 1

**శ్లో॥** తన్నాథవో వేణుముదీరయన్ వృతో
గోపైర్గృణద్భిస్స్వయశోబలాన్వితః ।
పశూన్ పురస్కృత్య పశవ్యమావిశ
ద్విహర్తుకామః కుసుమాకరం వనమ్ ॥ (2)

**టీ॥** తదితి. స్వయశో గృణద్భిర్గోపైర్వృత స్తద్వనం ప్రావిశత్. (2)

**శ్లో॥** తన్మంజు ఘోషాళి మృగద్విజాకులం
మహన్మనః ప్రఖ్యపయస్సరస్వతా ।
వాతేన జుష్టం శత పత్రగంధినా
నిరీక్ష్యరంతుం భగవాన్ మనోదధే ॥ (3)

**టీ॥** – తదితి. తద్వనం నిరీక్ష్య. రంతుం మనో దధే. కథంభూతం మంజుఘోషా యే అళిమృగద్విజాః భ్రమరమృగపక్షిణః. తైరాకులం వ్యాప్తం మహన్మనః ప్రఖ్యపయస్సరస్వతా మహతాం మనసా ప్రఖ్యం తుల్యం స్వచ్ఛం పయో యస్మిన్ తత్సర ఆశ్రయత్వే నాస్తి యస్య. తేన వాతేనేతి శైత్యముక్తం. శతపత్రగంధినేతి. పరిమళవత్వం తేన జుష్టం వనమితి మాంద్యం చ సూచితం. (3)

**తా॥** ఆ కృష్ణుడు వేణువు వాయించుచు, తన కీర్తిని గానము చేయుచున్న గోపబాలురచే చుట్టుముట్టబడి, బలరామునితో కూడిన వాడై, పశువులు ముందునడువగా, విహారముచేయ గోరిన వాడై, పశువులను మేపుటకు యోగ్యమైన స్థలముగలదియు, పువ్వుల కాలవాల మైనదియునైన వనమును ప్రవేశించెను. (2)

**టీ॥** – తన కీర్తిని పాడుచున్న గోపబాలురతో ఆవరింపబడి ఆ వనమున ప్రవేశించెను. (2)

**తా॥** తుమ్మెదలు, జింకలు, అడవి యేనుగులు, పక్షులు మున్నగువాని శ్రావ్యమైన ధ్వనులతో నిండియున్నదియు, తామర పూవుల పరిమళము లతో కూడిన గాలులతో, మహాత్ముల మనస్సుల వలె స్వచ్ఛమైన నీటితో నిండిన సరస్సులు కలిగియున్న ఆ వనమును చూచి భగవానుడగు కృష్ణుడు అందు విహరింప గోరెను. (3)

**టీ॥** – ఆ వనమును చూచి అందు విహరించుటకు నిశ్చయించు కొనెను. (ఆవనము) ఎట్టిది? శ్రావ్యమైన ధ్వనులు చేయుచున్న ఏ తుమ్మెదలు, జింకలు, పక్షులుగలవో వానితో నిండినది. మహాత్ముల మనస్సులతో సమానమైన పరిశుద్ధమైన జలముగల సరస్సులతో నాశ్రయింపబడిన ఏ వనము కలదో అది. 'తేన వాతేన' అని చల్లదనము చెప్పబడినది. "శతపత్ర గంధినా" (నూరురేకుల తామర

**శ్లో॥** స తత్ర తత్రారుణ పల్లవ శ్రియా
ఫలప్రసూనోరు భరేణ పాదయోః ।
స్పృశచ్ఛిఖాన్ వీక్ష్య వనస్పతీన్ ముదా
స్మయన్నివాహాగ్రజ మాదిపూరుషః ॥ (4)

**టీ॥** స ఇతి. అరుణపల్లవశ్రియా సహ స్పృశంత్యః శిఖాః శాఖాగ్రాణి. యేషాం తాన్. (4)

శ్రీభగవానువాచ.

**శ్లో॥** అహో! అమీదేవవరామరార్చితం
పాదాంబుజం తే సుమనః ఫలార్హణమ్ ।
నమంత్యుపాదాయ శిఖాభిరాత్మన
స్తమోపహత్యై తరుజన్మ యత్కృతమ్. (5)

పూల వాసనతో) అని పరిమళము చెప్పబడినది. 'తేన జుష్టం వనం' (దానిచే సేవింపబడిన అడవి) అని దాని ప్రకాశము సూచింపబడినది. (మన్దస్తుతున్ద పరిమృజ ఆలస్యశ్శీతకోఽలసోనుష్ణః – అని అమరము) (మాంద్యశబ్దమునకు ప్రశాంతత – అనుష్ణత్వము, శీతలత్వము, ప్రకాశము, తృప్తి అని ఏ అర్థమైనను సరిపడును.) (3)

**తా॥** అచ్చటచ్చట ఎఱ్ఱని చిగుళ్ల సంపదతోను, పండ్ల, పూల సమృద్ధి వలని బరువు చేత, పాదస్థానములను తాకుచున్న చిటారు కొమ్మలుగల చెట్లను చూచి ఆదిపుషరుడైన కృష్ణభగవానుడు, ఆశ్చర్యపడుచున్న వాని వలె తన అన్నయగు బలరామునితో నిట్లనెను. (4)

**టీ॥** ఎఱ్ఱని చిగుళ్ళ సంపదతో కూడ, తాకుచున్న కొమ్మల పైభాగము వేనికో – వానిని. (4)

శ్రీభగవానుడిట్లనెను

**తా॥** శ్రీకృష్ణుడిట్లనెను. అహో! "ఓ దేవతాగ్రణీ! ఈ చెట్లు తమ తమ పుష్పములతోను, ఫలములతోను నిండియున్న శాఖాగ్రములను వంచి, (సమీపమునకు వచ్చి) ఏ పాపముల వల్ల చెట్లుగా జన్మించినవో ఆ పాపములను హరింపజేసి కొనుటకై, దేవతల పూజలందు కొను నీ పాద పద్మములను పూజించుచు నమస్కరించుచున్నవి. (5)

**టీ॥** – అహో ఇతి. తరుజన్మ యేన కృతం. తస్య తమసః పాపస్యాపహత్యై నాశాయ. అథవా యేన త్వయా ఈశ్వరేణ. సర్వోపకారకం తరు జన్మ కృతం తం త్వాం నమంతి. ఏవం శ్లాఘ్యేఽపి జన్మని యదజ్ఞాన రూపం తమః అస్తి తస్యాపహత్యై. (5)

**టీ॥** – చెట్టుపుట్టుక దేనితో చేయడినదో అట్టి తమసః –పాపముయొక్క – అపహత్యై నాశము కొఱకు – లేక – ఏ ఈశ్వరుడవగు నీ చేత – అన్ని ప్రాణులకును ఉపకారముచేయు చెట్టు పుట్టుక చేయడినదో – దానిని గూర్చి (అవి) నీకు నమస్కరించుచున్నవి. ఇట్లు పొగడదగిన జన్మమునందును ఏ అజ్ఞానరూపమైన చీకటి (పాపము) కలదో దానిని నశింపజేయుటకు – (5)

**శ్లో॥** ఏతేఽళినస్తవ యశోఽఖిల లోకతీర్థం
గాయంత ఆదిపురుషాను పదం భజంతే ।
ప్రాయోహ్యామీ మునిగణాభవదీయ ముఖ్యా
గూఢం వనేఽపి నజహంత్యనఘాత్మదైవమ్ ॥ (6)

**తా॥** పాప రహితుడవైన ఓ ఆదిపురుషా ఈ తుమ్మెదలు సకలలోక పవిత్రములగు నీ కీర్తులను తమ ఝుంకార నాదముతో పాడుచున్నవి. అడుగడుగునను, మాటి మాటికిని భజించుచున్నవి. (ఇక) ఈ ముని సమూహములు, నీకు ముఖ్యులగువారు, ఆహారమును విడిచి, ఈ వనమునందు, అరూపుడవైనను మనుష్యరూపమున రహస్యముగనున్న, ఆత్మదైవతమవగు నిన్ను విడిచియుండుటలేదు. (6)

**టీ॥** ఏత ఇతి. హే అనఘ వనే గూఢమపి త్వాం న త్యజంతి. త్వయి మనుష్య వేషేణ నిగూఢే సతి. మునయోఽప్యళివేషేణ నిగూఢాస్త్వాం భజంతీత్యర్థః. (6)

**టీ॥** ఓ పాపరహితుడా! వనము నందు మనుష్య వేషమున రహస్యముగ నున్న నిన్ను, మునులు కూడ తుమ్మెదల వేషముతో రహస్యముగ నుండి సేవించుచున్నారని యర్థము. (6)

**శ్లో॥** నృత్యం త్యమీ శిఖిన ఈద్యముదా హరిణ్యః
కుర్వంతి గోప్య ఇవ తే ప్రియమీక్షణేన ।
సూక్తైశ్చ కోకిలగణా గృహమాగతాయ
ధన్యావనౌకస ఇయాన్ హి సతాం నిసర్గః ॥ (7)

**తా॥** ఈ నెమిళ్ళు నిన్ను స్తుతించి సంతోషముగా నాట్యము చేయు చున్నవి. జింకలు, గోపస్త్రీల ప్రేమనిండిన చూపుల వంటి చూపులతో నిన్ను చూచుచున్నవి. కోకిలల సమూహములు శ్రావ్యమైన తమ కూజితములతో స్వాగతము పలుకుచున్నవి. తమ నివాస స్థానమునకు వచ్చిన అతిథుల నాదరించుట సత్పురుషులకు సహజ స్వభావముగదా! ఈ వనమునందలి జంతువులు, పక్షులు, చెట్లు ధన్యములు. (7)

**టీ॥** – నృత్యంతీతి. ఇయాన్ హి సతాం నిసర్గ ఇతి. యదస్తి స్వస్మిన్. తద్గృహ మాగతాయ మహతే. సమర్పయంతీతి. (7)

**టీ॥** – ఇంత గొప్పది సజ్జనుల స్వభావము. తమయందేది కలదో దానిని ఇంటికి వచ్చిన అతిథికి సమర్పింతురు అని. (7)

**శ్లో॥** ధన్యేయమద్య ధరణీతృణ వీరుధస్త్వ
త్పాదస్పృశో ద్రుమ లతా కరజాభిమృష్టాః ।
నద్యోద్రయఃఖగ మృగాస్సదయావలోకై
ర్గోప్యోఽ ంతరేణ భుజయోరపియత్ స్పృహాశ్రీః ॥ (8)

**తా॥** పచ్చిగడ్డితోను, చిన్నపొదలతోను చిటారు కొమ్మలతోను నీ పాదములను తాకుచున్న ఈ నేల నేడు ధన్యమైనది. చెట్లు, తీగలు నీ వ్రేళ్ళతో స్పృశింపబడి ధన్యమైనవి. ఇచటి నదులు, పర్వతములు పక్షులు, మృగములు దయతో కూడిన నీ చూపులతో ధన్యమైనవి, గోపస్త్రీలు తమ పిల్లలకు స్తన్యపానములిచ్చుట చేత ధన్యత పొందిరి. లక్ష్మియును ఇట్టి వానినే కోరుచుండును. (8)

**టీ॥** ధన్యేతి. తృణవీరుధశ్చ తవ పాదౌ స్పృశంతీతి తథా కరజాభి మృష్టాః నఖైః స్పృష్టాః సదయైరవలోకనైః. శ్రీరపి యస్మై స్పృహయతి. కేవలం తేన భుజ యోరంతరేణ. వక్షసా గోప్యో ధన్యా ఇతి. అత్ర

**టీ॥** – పచ్చిగడ్డి, పొదలు నీ పాదములను స్పర్శించుటవలన అటుల చెప్పబడినవి. కరజాభిమృష్టాః – గోళ్ళచే స్పృశింపబడినవి. దయతో కూడిన చూపులచేత – శ్రీ కూడ దేని కొఱకు కోరుచుండునో –

నద్యోఽద్రయ ఇతి సంధ్యభావ ఆర్షః. (8)

కేవలము తమ భుజముల మధ్య భాగము చేత – స్తన భాగము చేత గోపస్త్రీలు ధన్యులు అని. ఇచట 'నద్యోఽద్రయః' అను తావున సంధిలేకపోవుట ఆర్షము. (8)

**శ్లో॥** ఏవం బృందావనం శ్రీమత్కృష్ణః ప్రీతమనాః పశూన్ ।
రేమే సంచారయన్నద్రే స్సరిద్రోధస్సు సానుగః ॥ (9)

**తా॥** ఈ విధముగ బృందావనము సంపద్యుక్తమైనది. శ్రీకృష్ణుడు సంతుష్ట హృదయుడై, పర్వతమునందలి నదీ తీరములందు గోవుల వెంట నడచుచు వానిని మేపుకొనుచు క్రీడించెను. . (9)

**టీ॥** – ఏవమితి. ఏవం శ్రీమద్బృందావనం ప్రతి ప్రీతస్సన్. అద్రేః సమీప వర్తిసరిత్తటేషు గాస్సంచారయన్ సానుగః ప్రీతమనాస్సన్ రేమే. యద్వా. శ్రీమద్బృందావనం ప్రతి పశూన్ సంచారయన్. అద్రే స్సరిద్రోధస్సు రేమే. (9)

**టీ॥** – ఇట్లు బృందావనమును గూర్చి సంతోషించినవాడై కొండకు దగ్గరలో నున్న నది ఒడ్డులందు ఆవులను తోలుచు (మేపుచు) వాని వెంట నడచుచు సంతోష మనస్కుడై క్రీడించెను. లేక సంపత్కరమైన బృందావన ప్రాంతములందు పశువులను త్రిప్పుచు కొండయొక్క నదీ తీరములందు క్రీడించెను . (9)

**శ్లో॥** క్వచిద్గాయతి గాయత్సు మదాంధా ళిష్వనువ్రతైః ।
ఉపగీయమాన చరిత స్స్రఖీ సంకర్షణాన్వితః ॥ (10)

**తా॥** తనను అనుసరించుటయే వ్రతముగాగల గోపబాలురచేత కీర్తింపబడుచున్న చరిత్రగల వాడును, స్నేహితులతోను, అన్నయగు బలరామునితో కూడిన వాడును అగు కృష్ణుడు, పాడుచున్న మదించిన తుమ్మెదలతో బాటుగ ఒక్కొక్కప్పుడు తానును శ్రుతి కలుపుచు పాడుచుండును. (10)

**టీ॥** తామేవ రతిమాహ-క్వచిదిత్యాది పంచభిః. (10)

**టీ॥** క్వచిత్ అను శ్లోకము మొదలుకొని ఐదు శ్లోకములచే బృందావనముపై శ్రీకృష్ణుని రతిని చెప్పుచున్నాడు. (10)

**శ్లో॥** క్వచిచ్చ కలహంసానామను కూజతి కూజితమ్ ।
అనునృత్యతి నృత్యంతం బర్హిణం హాసయన్ సఖీన్ ॥ (11)

**తా॥** ఒక్కొప్పుడు కలహంసల ధ్వనులను అనుకరించుచుండును. నెమలి నాట్యము ననుసరించి తానును నాట్యము చేయుచు, స్నేహితులను నవ్వించుచుండెను. (11)

**టీ॥** క్వచిదితి. బర్హిణం నృత్యంతం అన్వభినృత్యతి బర్హిణమభిముఖో నృత్యతీతి వా. సఖీన్ హాసయన్. (11 .12)

**టీ॥** – నాట్యము చేయుచున్న నెమలితో దాని ననుకరించుచు నాట్యము చేయుచుండును, నెమలికి ఎదురుగా నర్తించుచుండునని – స్నేహితులను నవ్వించుచు – (11,12)

**శ్లో॥** మేఘ గంభీరయా వాచా నామభిర్దూరగాన్ పశూన్ ।
క్వచిదాహ్వయతి ప్రీత్యా గో గోపాల మనోజ్ఞయా ॥ (12)

**తా॥** దూరముగ బోయిన పశువులను, వాని వాని పేర్లతో, వానికిని, గోపాలురకును ప్రీతి కలుగునట్లుగ మేఘ గంభీరమగు ధ్వనితో పిలుచును. (12)

**శ్లో॥** చకోర క్రౌంచ చక్రాహ్వ భరద్వాజాంశ్చ బర్హిణః ।
అనురౌతి స్మ సత్వానాం భీతవద్వ్యాఘ్ర సింహయోః ॥ (13)

**తా॥** పులుల యొక్కయు, సింహముల యొక్కయు భయముతో అరచుచున్న, వెన్నెల పులుగులు, కొంగలు, జక్కవలు, ఏట్రింతలు, నెమిళ్ళు మొదలగు పక్షుల ధ్వనులను అనుకరించుచుండెను. (13)

**టీ॥** – చకోరేతి. చకోరీ ననునృత్య రౌతి కదాచిచ్చ సత్వానాం మధ్యే వ్యాఘ్రసింహయోః. తాభ్యాం భీతవద్భవతి. సత్వేషు పలాయమానేషు. పలాయత ఇత్యర్థః. తయోః సత్వానాం బలోద్రేకాణాం చ. భీతవద్భ వతీతి వా. (13)

**టీ॥** – చకోరపక్షులననుకరించి వాని అరుపు వలె అరుచును. ఒక్కొక్కప్పుడు జంతువుల మధ్య – పులి సింహముల యొక్క – వానిచే భయపడువాని వలె అగును. పరుగెత్తుచున్న జంతువుల మధ్య పరుగెత్తుచుండునని యర్థము. లేక ఆ జంతువులకు – మిక్కుటమైన బలము, ఉద్రేకముగల ఆ పులి సింహిములకు భయపడిన వానివలె నగునని – (13)

**శ్లో॥** క్వచిత్క్రీడా పరిశ్రాంతం గోపోత్సం గోప బర్హణమ్ ।
స్వయం విశ్రామయత్యార్యం పాద సంవాహనాదిభిః ॥ (14)

**తా॥** ఒక్కొక్కప్పుడు, ఆటలతో అలసిపోయిన తన అన్నయగు బలరాముని, ఒక గోపాలుని తొడను దిండుగ జేసి పరుండబెట్టి, స్వయముగ కాళ్ళొత్తుచు సేదదీర్చును. (కాళ్ళు పట్టుట మొదలగువాని చేత) (14)

**టీ॥** క్వచిదితి. ఆర్యమగ్రజం విశ్రామయతి విగతశ్రమం కరోతి.(14)

**టీ॥** ఆర్యం – అన్నయగు బలరాముని – విశ్రామయతి – అలసటను పోగొట్టును. (14)

**శ్లో॥** నృత్యతో గాయతః క్వాపి వల్గతో యుధ్యతో మిథః ।
గృహీత హస్తాన్ గోపాలాన్ హసంతౌ ప్రశశంసతుః ॥ (15)

**తా॥** గోపాలురలో ఒకడు నాట్యమాడుచుండగా, మఱియొకడు పాడుచుండగా, ఇంకొకడు తన రెండు కాళ్ళ నెత్తి లయబద్ధముగా ఎగురుచుండగా, మఱియొక్కడు ఇంకొకనితో 'ఉత్తుత్తి'గ పోట్లాడు చుండగా కృష్ణ బలరాములిరువురును ఆ గోపాలురను చేతులతో దగ్గరకు తీసికొని నవ్వుచూ ప్రశంసించిరి. (15)

**టీ॥ –** నృత్యత ఇతి. మిథో నృత్యాదీన్ కుర్వతో గోపాన్. ప్రశశంసతుః. (15.16)

**టీ॥** తమలో తాము ఏకాంతముగ చేయు నాట్యములు మొదలగు వానిని అట్టివి చేయుచున్న గోపాలురను మెచ్చుకొనుచుండిరి.(15,16)

**శ్లో॥** క్వచిత్పల్లవ తల్పేషు నియుద్ధ శ్రమ కర్శితః ।
వృక్షమూలాశ్రయశ్శేతే గోపోత్సం గోపబర్హణః ॥ (16)

**తా॥** ఒక్కొక్క తడవ బాహు యుద్ధముల వలన అలసినవాడై చెట్ల మూలములందున్న చివురు పడకలనాశ్రయించి ఒక గోపాలుని తొడను తలగడగా చేసికొని పరుండును. (16)

**శ్లో॥** పాద సంవహనం చక్రుః కేచిత్తస్య మహాత్మనః ।
పరే తు హత పాప్మానో వ్యజనైస్సమ వీజయన్ ॥ (17)

**తా॥** కొందఱు మహాత్ముడైన ఆ కృష్ణుని పాదములొత్తుచుండగా నితరులు – పాపరహితులైనవారు. చిగుళ్ళతో నిర్మింపబడిన వీవనలతో విసరుచుండిరి. (17)

**టీ॥** పాదసంవహనమితి. వ్యజనైః పల్లవాదినిర్మితైః. (17,18)

**టీ॥** వ్యజనైః చిగుళ్ళతో చేయబడిన విసనకఱ్ఱలతో – (17,18)

**శ్లో॥** అన్యే తదను రూపాణి మనోజ్ఞాని మహాత్మనః ।
గాయంతి స్మ మహారాజన్! స్నేహక్లిన్నధియశ్శనైః ॥ (18)

**తా॥** ఇతరులు, మహాత్ముడైన శ్రీకృష్ణుని విశ్రాంతికి అనురూపముగ శ్రావ్యముగ పాడుచుండిరి. రాజా! వారు స్నేహముతో ఆర్ద్రమైన బుద్ధులు గలవారై నెమ్మదిగ పాడుచుండిరి. (18)

శ్లో॥ ఏవం నిగూఢాత్మ గతి స్స్వమాయయా
గోపాత్మజత్వం చరితైర్విడంబయన్ ।
రేమే రమా లాలిత పాదపల్లవో
గ్రామ్యైస్సమం గ్రామ్య వదీశ చేష్టితః ॥ (19)

తా॥ ఈ విధముగ రహస్యమైన ఆత్మస్థితిలో నుండియు గోప కుమారత్వమును తన మాయచేతనే పొంది, తదనుగుణముగ వివిధము లైన లీలలచే మోహపెట్టుచు, లక్ష్మీదేవిచేత సేవింపబడు సుకుమారమైన పాదములుగల ఆ విష్ణుభగవానుడు (కృష్ణుడు) గ్రామీణులతో కూడి గ్రామీణుడుగ నున్నను, తన ఈశ్వర లక్షణములను అప్పుడప్పుడు వ్యక్తము చేయుచు క్రీడించుచుండెను. (19)

టీ॥ ఏవమితి. ఈశచేష్టిత ఇతి నిగూఢ స్వభావత్వేఽప్యంతరాంతరా. ఈశస్యైవ చేష్టితాని దృశ్యంతే యస్మిన్ సః.(19)

టీ॥ – ఈశ్వరుని చేష్టితములు గలవాడు, రహస్యమగు స్వభావముతో నున్నవాడయ్యును. మధ్య మధ్యన ఈశ్వరుని చేష్టితములే ఎవని యందు కన్పట్టుచుండునో (వాడు ఈశచేష్టితుడు) (19)

### ధేనుకాసుర భంజన ఘట్టః

శ్లో॥ శ్రీదామనామో గోపాలో రామకేశవయోస్సఖా ।
సుబల స్తోక కృష్ణాద్యా గోపాః ప్రేమ్ణేదమ బ్రువన్ ॥ (20)

తా॥ శ్రీదాముడను పేరుగల గోపాలకుడు, సుబలుడు, చిన్నికృష్ణుడు మొదలగువారు వినుచుండగా వారితో ప్రేమతో నిట్లనెను. శ్రీదాముడు, బలరామ, కృష్ణుల స్నేహితుడు. (20)

టీ॥ – ఈశచేష్టితత్వమేవ దర్శయితుమాహ–శ్రీదామేతి. స్తోకకృష్ణః కశ్చిత్. (20)

టీ॥ – శ్రీకృష్ణుని ఈశ్వర చేష్టితములను చూపుచునే చెప్పుచున్నాడు. 'శ్రీదామః' అని – స్తోక కృష్ణుడొకడు. (20)

శ్లో॥ రామరామ మహాసత్త్వ! కృష్ణ!దుష్టనిబర్హణ! ।
ఇతో విదూరే సుమహద్వనం తాళాళి సంకులమ్ ॥ (21)

తా॥ గొప్ప బలశాలివియగు రామా! దుష్టులను సంహరించు కృష్ణా! ఇచటి నుండి కొద్ది దూరములోననే, తాటిచెట్ల సమూహములతో విలసిల్లు నొక గొప్ప అడవి కలదు. (21)

టీ॥ రామరామేతి. తాళాళిసంకులం తాలానాం అళీభిః. పంక్తిభిర్వ్యాప్తం. (21-24)

టీ॥ తాళాళి సంకులం-తాటిచెట్ల పంక్తులతో నిండియున్న(21-24)

శ్లో॥ ఫలాని తత్ర భూరీణి పతంతి పతితాని చ ।
సంతి కిం త్వవ రుద్ధాని ధేనుకేన దురాత్మనా ॥ (22)

తా॥ అచట కావలసినన్ని పండ్లు రాలుచుండును. రాలినవి కూడ ఉన్నవి కాని, దుష్టాత్ముడైన ధేనుకునిచే అడ్డగింపబడుచున్నవి. (22)

శ్లో॥ సోఽతివీర్యోఽసురో రామ! హే కృష్ణ! ఖరరూపధృత్ ।
ఆత్మతుల్య బలై రన్యైర్ జ్ఞాతిభిర్బహుభిర్వృతః ॥ (23)

తా॥ వాడు గొప్ప బలవంతుడగు రాక్షసుడు. ఓ రామా! ఓకృష్ణా! వాడు గాడిద రూపము ధరించియుండును. తనతో సమానమగు బలవంతులైన ఇతర రాక్షసులతోను, అనేకులైన బంధువులతోను కూడి యుండును. (23)

శ్లో॥ తస్మాత్కృత నరాహారాద్భీతై ర్నృభి రమిత్రహన్ ।
విద్యంతే భుక్త పూర్వాణి ఫలాని సురభీణి చ ॥ (24)

తా॥ ఓ శత్రు హంతకుడా! ఆ గాడిద రూపమున ఉండు రాక్షసుని వలన చేయబడు మనుష్య మాంస భోజనము వలన భయముచెందిన మనుష్యులచే (అట్టి మనుష్యులచటికి పోనందువలన) మంచి సువాసనగల పండ్లు - ఎంగిలి కానివి - అచటుండును. (24)

శ్లో॥ నసేవ్యంతే పశుగణైః పక్షిసంఘైర్వివర్జితమ్. (24)

తా॥ అచటికి పశుపక్ష్యాదులు కూడ పోవుటకు భయపడును, కావున అవి కూడ ఆ పండ్లను తినవుకదా ! (24)

శ్లో॥ ఏషవై సురభిర్గంధో విషూచీనోద్య గృహ్యతే ।
ప్రయచ్ఛ తాని నః కృష్ణ! గంధలోభిత చేతసామ్ ॥ (25)

తా॥ ఈ పరిమళభరితమైన పండ్లవాసన సర్వత్ర వ్యాపించి మాచే ఆఘ్రాణింపబడుచున్నది. ఓ కృష్ణా! అట్టి పండ్లను, వాని సువాసనచే ఆకర్షింపబడిన మనస్సులుగల మాకు తెచ్చియిమ్ము. (అమిత్రహన్ – అనుమాట ఖరాసురుని సంహరింపుమనుటకు సూచన) (ఇంద్రియాకర్షణలు ఆయా ఇంద్రియములకు కాక మనస్సుకే అని 'చేతసామ్' అనుమాట సూచించుచున్నది.) (25)

టీ॥ ఏవ ఇతి. విషూచీనః సర్వతః ప్రసృతః. (25-28)

టీ॥ – విషూచీనః– అంతటను వ్యాపించినది. (25-28)

శ్లో॥ వాంచా సీన్మహతీ రామ! గమ్యతాం యది రోచతే
ఏవం సుహృద్వచశ్శ్రుత్వా సుహృత్ప్రియ చికీర్షయా. (26)

తా॥ ఓ బలరామా! కోరిక బలీయముగనుండెను. కావున రుచించి నట్లయిన యెడల (ఫలభక్షణ – రాక్షససంహరణ) మీరు ఇరువురు అచటికి పోవుదురుగాక. అని పలికిన మిత్ర వాక్యమును విని బలరామకృష్ణులు మిత్రునకు ప్రియము చేయదలచుటచే. (26)

శ్లో॥ ప్రహస్య జగ్మతుర్గోపై ర్వృతౌ తాళవనం ప్రభో! (ప్రభూ)
బలః ప్రవిశ్య బాహుభ్యాం తాళాన్ సంపరికంపయన్. (27)

తా॥ ఇరువురును నవ్వి, గోపబాలురచే ఆవరింపబడిన బలరామకృష్ణులిరువును ఆ తాటి వనమునకు పోయిరి. బలరాముడు ప్రవేశించి చేతులతో తాళ వృక్షములను కంపింపజేయుచు. (27)

**శ్లో॥** ఫలాని పాతయామాస మతంగజ ఇవౌజసా ।
ఫలానాం పతతాం శబ్దం నిశమ్యాసుర రాసభః ॥ (28)

**తా॥** ఫలములను క్రింద పడగొట్టెను, మదించిన ఏనుగు వంటి బలముతో చెట్లను కదలించుచు పండ్లను పడగొట్టెను. ఆ ఖరాసురుడు పండ్లు క్రింద పడునట్టి ధ్వనిని విని. (28)

**శ్లో॥** అభ్యధావత్ క్షితితలం సనగం పరికంపయన్ । (29)

**తా॥** చెట్లతో సహా భూమిని కంపింపజేయుచు పరుగెత్తెను. (29)

**టీ॥** - అభ్యధావదితి. సనగం సవృక్షం. (29)

**టీ॥** - సనగం - వృక్షములతోకూడ (భూమిని వణికించుచు) (29)

**శ్లో॥** సమేత్య తరసా ప్రత్యగ్ద్వాభ్యాం పద్భ్యాం బలం బలీ ।
నిహత్యోరసి కా శబ్దం ముంచన్ పర్యసరత్ఖరః ॥ (30)

**తా॥** అతివేగముగ ముందునకు పరుగెత్తుకొని వచ్చిన బలవంతుడైన ఆ ఖరాసురుడు బలరాముని ఱొమ్ముపైన తన వెనుక కాళ్ళతో కొట్టి, వికారమైన గార్దభ స్వరమును చేయుచు (ఓండ్రపెట్టుచు) చుట్టును పరుగెత్తుచు తిరిగెను. (30)

**టీ॥** - సమేత్యేతి. ప్రత్యక్ పశ్చిమాభ్యాం. ద్వాభ్యాం పద్భ్యాం. ప్రత్యక్ ప్రతిముఖస్సన్నితి వా. కాశబ్దమితి. కేతి గర్దభజాతి శబ్దానుకరణం. పర్యసరత్-పరితో ఉ_ధావదిత్యర్థః. (30)

**టీ॥** - ప్రత్యక్-వెనుకటి రెండు కాళ్ళతో -ప్రత్యక్- ప్రతిముఖుడగుచుననియో - కాశబ్దం - 'కా' అని గాడిద జాతిశబ్దము యొక్క అనుకరణ-పర్యసరత్ - పరితోఉ_ధావదిత్యర్థః-చుట్టు పరుగెత్తెనని యర్థము (30)

**శ్లో॥** పునరాసాద్య సంరబ్ధః ఉపక్రోష్టా పారాక్ స్థితః ।
చరణావపరౌ రాజన్! బలాయ ప్రాక్షిపద్రుషా ॥ (31)

**తా॥** రాజా ! మఱల వచ్చి, ఆటోపముగలవాడై, సమీపముననే బిగ్గరగా అరచుచు, పెడదిరిగి, కోపముతో వెనక కాళ్ళతో బలరాముని కొట్టెను. (31)

**టీ॥** పునరితి. ఉపక్రోష్ట గర్దభః. పరాక్ ప్రతిముఖః. అపరౌ పశ్చిమౌ. బలాయ బలం హంతుం. (31)

**టీ॥** – సమీపమున ఆక్రోశించుచున్న ఆ గాడిద–పరాక్ – ప్రతిముఖుడై – ఆపశా – వెనుకవి (కాళ్ళు) బలాయ – బలమును (బలరాముని) చంపుటకు (31)

**శ్లో॥** స తం గృహీత్వా పదయోర్భ్రామయిత్వైక పాణినా ।
చిక్షేప తృణరాజాగ్రే భ్రామేణ త్యక్త జీవితమ్ ॥ (32)

**తా॥** బలరాముడు ఆ ఖరాసురుని కాళ్ళతో పట్టుకొని గిరగిర త్రిప్పి– ఒక్క చేతితోనే త్రిప్పి తాటిచెట్టుపై భాగమునకు విసరికొట్టెను. త్రిప్పుట చేతనే వాడు ప్రాణములు వదలెను. (32)

**టీ॥** తృణరాజస్తాళః. (32.33)

**టీ॥** – తృణరాజః తాటిచెట్టు (32,33)

**శ్లో॥** తేనాహతో మహాతాళః పతమానో బృహచ్ఛిరాః ॥
పార్శ్వస్థం కంపయన్ భగ్నస్స చాన్యం సోఽపిచాపరమ్॥ (33)

**తా॥** ఆ పెద్ద తాటి చెట్టు, వానితో కొట్టబడి, దాని శిరస్సు (పైభాగము) గొప్పగ నుండుట చేత ప్రక్కచెట్టును కూడా కంపింప జేయుచు కూలి పోయెను. ఆ ప్రక్క చెట్టు కూడా మరియొక ప్రక్క చెట్టును పడగొట్టెను (ఇట్లు ఎన్ని చెట్లు కూలినవో) (33)

**శ్లో॥** బలస్య లీలయోత్సృష్ట ఖరదేహ హతాహతాః ।
తాళశ్చ కంపిరే సర్వే మహా వాతేరితా ఇవ ॥ (34)

**తా॥** బలరాముని లీలచేత విడువబడిన (విసరబడిన) ఖరాసురుని దేహము చేత బాగుగా కొట్టబడుచు తాటిచెట్లు అన్నియును, పెనుగాలి చేత కొట్టబడినట్లు కంపించి పోయెను. (34)

**టీ॥** - బలస్యేతి. ఉత్సృష్టేన ఖరదేహేన. హతైః ఆహతాః చ కంపిరే అకంపంత. (34)

**టీ॥** - ఉత్సృష్టేన ఖరదేహేన - విడువబడిన ఖరుని శరీరముచేత - హతేః - కొట్టబడినవియై - చకంపిరే - వణికి పోయెను.(34)

**శ్లో॥** నైతచ్చిత్రం భగవతి హ్యనంతే జగదీశ్వరే ।
ఓతం ప్రోతమిదం యస్మిన్ తంతుష్వంగ యథా పటః ॥ (35)

**తా॥** వత్సా! పడుగు పేకలుగ నున్న దారముల యందు వస్త్రము పరివ్యాప్తమై యుండునట్లు, అనంతుడు, జగదీశ్వరుడును అయిన భగవంతుని యందు ఈ విశ్వమంతయును ఓత ప్రోతమై (నిలువుగను అడ్డముగను వ్యాపించియున్నది. కావున అతని యందిది విచిత్ర మేమియు కాదు. (35)

**టీ॥** - నేతి. యస్మిన్నిదం విశ్మం ఓతం ఊర్ధ్వతంతుషు పట ఇవ గ్రథితం. ప్రోతం తిర్యక్తంతుషువత్. ఏవం సంగ్రథితం సర్వతోఽను స్యూతం వర్తత ఇత్యర్థః. (35 - 37)

**టీ॥** - ఎవని యందీ విశ్వము - ఓతం నిలువు దారములందు వస్త్రము కూర్పబడియుండునట్లు ప్రోతం- అడ్డపు దారములందువలె - ఈ విధముగ చక్కగా కూర్పబడి అంతటను క్రమముననుసరించి యుండునో (అట్లు విశ్వము భగవానుని యందు ) వ్యాప్తమైయుండునని యర్థము. (35 - 37)

**శ్లో॥** తతః కృష్ణం చ రామం చ జ్ఞాతయో ధేనుకస్యయే ।
క్రోష్టారోఽభ్య పతన్ సర్వే సంరబ్ధాహత బాంధవాః ॥ (36)

**తా॥** అప్పుడు ధేనుకాసురుని (ఖరాసురుని) అన్నలు, తమ్ములు మొదలగు అతని బంధువులైన గాడిదలన్నియు ఖర సంహారమునకు ఆక్రోశించుచు ఆవేశముతో బలరామ, కృష్ణులపై వచ్చి పడెను. (36)

**శ్లో॥** తాంస్తానా పతతః కృష్ణో రామశ్చ నృప! లీలయా ।
గృహీత పశ్చాచ్చరణాన్ ప్రాహిణోత్తృణ రాజసు ॥ (37)

**తా॥** రాజా! వచ్చిన వానిని వచ్చినట్లుగ బలరామ కృష్ణులిరువురును, వాని వెనక కాళ్ళను లీలగా పట్టిఎత్తి తాటి చెట్ల యందు విసిరికొట్టిరి. (37)

**శ్లో॥** ఫలప్రకర సంకీర్ణం దైద్యదేహైర్గతాసుభిః ।
రరాజ (ఖర) తాళాగ్రైర్ఘనైరివ నభస్థలమ్ (భూః) ॥ (38)

**తా॥** ఫల సమూహములచే నిండినదియు, ప్రాణములు పోయిన రాక్షసుల శరీరములచే వ్యాపించియున్నదియు, ఎడములు గల తాటిచెట్ల పైభాగములు గలదియునై భూమి, మేఘములతో నిండిన ఆకాశము వలె ప్రకాశించెను. (38)

**టీ॥** – ఫలేతి. ఘనైర్నభ ఇవ. భూతలం రరాజ. తత్ర ఫలప్రకర సంకీర్ణమితి. దైత్యదేహైః ఖరతాళాగ్రైశ్చ సంకీర్ణమిత్యరుణ శ్వేత నీల ఘన సాదృశ్య సంపాదనం. (38, 39)

**టీ॥** – మేఘములతోడి ఆకాశమువలె భూమియొక్క ఉపరితలము ప్రకాశించెను, అచట పండ్ల సమూహములతో వ్యాపించినది యని – రాక్షసుల శరీరములతోను, ఎడమలుగల తాటి చెట్ల పైభాగములతోను నిండియున్నదని, ఎఱుపు, తెలుపు, నీల వర్ణములతో కూడిన మేఘము లతో సదృశత్వమును సంపాదించుట. (38,39)

**శ్లో॥** తయోస్తు సు మహత్కర్మ నిశామ్య విబుధాదయః ।
ముముచుః పుష్ప వర్షాణి చక్రు ర్వాద్యాని తుష్టువుః ॥ (39)

**తా॥** కృష్ణ బలరాముల మహత్తరమైన ఈ రాక్షస సంహార లీలఁ జూచి దేవతలు మున్నగు వారు పుష్పములను వారిపై కురిపించిరి. సంతోషించిన వారై వివిధ వాద్యములను వాయించిరి. (39)

**శ్లో॥** అథ తాళ ఫలాన్యాదన్ మనుష్యా గత సాధ్వసాః ।
తృణం చ పశవశ్చేరుర్హత ధేనుక కాననే ॥ (40)

**తా॥** ధేనుకాసురుడు చంపబడిన ఆ వనము నందు, భయమును వీడి మనుష్యులు అచటి ఫలములను యథేచ్ఛగా ఆరగింపసాగిరి, పశువులు అచటి పచ్చి గడ్డిని యథేచ్ఛగా మేయసాగినవి.(40)

**టీ॥**– అథేతి. అదన్ అభక్షయన్. (40, 41)

**టీ॥**– ఆదన్ – భుజించిరి. (40, 41)

**శ్లో॥** కృష్ణః కమల పత్రాక్షః పుణ్య శ్రవణ కీర్తనః ।
స్తూయమానోఽను గైర్గోపై స్సాగ్రజో వ్రజమావిశత్ ॥ (41)

**తా॥** తామరరేకుల వంటి కన్నులు గలవాడును, పుణ్యమును కలిగించు శ్రవణము, కీర్తనములు గల వాడును అయిన కృష్ణుడు, వెంట వచ్చు గోపబాలురచే స్తోత్రము చేయబడుచు, తన అన్నయగు బలరామునితో కూడ వ్రజమును ప్రవేశించెను. (41)

**శ్లో॥** తం గో రజశ్ఛురిత కుంతలబద్ధ బర్హ
వన్య ప్రసూన రుచిరేక్షణ చారుహాసమ్ ।
వేణుం క్వణంత మనుగై రుపగీత కీర్తిం
గోప్యోదిదృక్షిత దృశోఽభ్య గమన్ సమేతాః ॥ (42)

**తా॥** ఆవుల గిట్టల వలన ఎగసిన ధూళితోధూసరితమైన తల వెంట్రుకలపైన నమర్చబడిన నెమలిపింఛము గలగినవాడును, అడవి పూవుల మాలలతో అలంకరింపబడియున్నవాడు, అందమైన చూపులుగల వాడును, మనోజ్ఞమైన నవ్వు గలవాడును, పిల్లనగ్రోవిని

**టీ॥** తమితి. గోరజోభిః ఛురితేషు కుంతళేషు. బద్ధం బర్హంవన్యాని ప్రసూనాని చ యస్య రుచిరమీక్షణం చారుహాసశ్చ యస్య తం చ. దిదృక్షితదృశః దిదృక్షితాః దర్శనోత్కంఠితా దృశో యాసాం తాః. (42)

**శ్లో॥** పీత్వా ముకుంద ముఖ సారఘమక్షి భృంగై
స్తాపం జహుర్విరహజం వ్రజయోషితోఽహ్ని ।
తత్సత్కృతిం సమధిగమ్య వివేశ గోష్ఠం
సవ్రీడ హాసవినయం తదపాంగ మోక్షమ్ ॥ (43)

**టీ॥** - పీత్వేతి. ముకుందస్య ముఖపద్మగతం. సారఘంమధు. అహ్నియో విరహస్తస్మాజ్జాతం తాపం. స చ తాసాం సత్కృతిం పూజాం.

వాయించుచున్న వాడును, అనుచరులగు గోపబాలురచే గానము చేయబడు కీర్తిగల వాడును అయిన కృష్ణుని చూడవలెననెడి కోరికగల చూపులతో నున్న గోపస్త్రీలు తమ తమ పరివారములతో కూడి వ్రజము నుండి వెలుపలకు వచ్చిరి. (42)

**టీ॥** గోధూళులతో కప్పబడియున్న నీలాలకములయందు అమర్చబడిన పింఛము, అడవి పూలును, అందమైన చూపు, సుందరమైన నవ్వు ఎవరికి గలవో అట్టి వానిని (కృష్ణుని) దిదృక్షితదృశః-దర్శించుటకు మిక్కిలి ఆసక్తిగల చూపులు ఎవరికో అట్టి గోపస్త్రీలు (42)

**తా॥** శ్రీకృష్ణుని ముఖమనెడు పద్మము యొక్క తేనెను కన్నులనెడు తుమ్మెదలతో గ్రోలి, అతని విడిచియుండుట వలన కలిగిన తాపము, వ్రజము నందలి స్త్రీలు విడిచిపెట్టిరి. (కృష్ణ విరహతాపము చల్లార్చుకొనిరి) ఇక ఆ గోపస్త్రీల సిగ్గు, వినయముతో కూడిననవ్వు, కడకంటి చూపులు మున్నగు వానితో వారు చేసిన సత్కారములను పొంది శ్రీకృష్ణుడు గోశాలలోనికి ప్రవేశించెను. (43)

**టీ॥** - కృష్ణుని ముఖమనెడు తామర పువ్వుననున్న - సారఘం- తేనెను - అహ్ని - (దినమున) ఏ విరహము గలదో దానివలన

కాం సత్కృతిం కథం వా కృతాం. తామాహ-సవ్రీడేతి సలజ్జేన హాసేన. వినయో యథా భవతి తథా. యదేతత్. కిం అపాంగమోక్షం కటాక్ష దర్శనం. తథా తాసాం సత్కృతిం ప్రాప్యేతి. (43-50)

కలిగిన తాపము - అతడును వారి యొక్క సత్కారమును, పూజను - ఎట్టి సత్కారమును ఎట్లు చేయబడిన దానిని? దానిని చెప్పుచున్నాడు. సవీడేతి - సిగ్గుతో - హాసేన - నవ్వుతో వినయము ఎట్లు కలుగనో అట్లు - యత్ - ఈ అపాంగమోక్షమేమి? కడగంటి చూపు. అటుల వారి సత్కారమును పొంది అని. (43 - 50)

**శ్లో॥** తయోర్యశోదా రోహిణ్యౌ పుత్రయోః పుత్రవత్సలే ।
యథా కాలంయథా కామం వ్యధత్తాం పరమాశిషః ॥ (44)

**తా॥** అమితమైన పుత్రప్రేమ కలిగియున్న యశోదా రోహిణు లిరువురును ఆ కృష్ణ బలరాములు అను తమ పుత్రులిరువురకును వలసినంత కాలము వారి కోరికలననుసరించి, ఆహార, పానీయ, వస్త్రాదులను సమకూర్చుచు ఆశీస్సులందించిరి. (కాలనుగుణముగ, కామానుగుణముగ వారికి వివిధ వస్తువులను సమకూర్చుచు ఉత్తమములైన ఆశీస్సులిచ్చిరి) (44)

**శ్లో॥** విగతాధ్వశ్రమౌ తత్ర మర్దన్మజ్జనాదిభిః ।
నాసో వసిత్వా రుచిరం దివ్య స్రగ్గంధమండితౌ ॥ (45)

**తా॥** అలుగు పిండితో ఒడలు రుద్దుట, స్నానములు చేయించుట, చక్కని వస్త్రములు ధరింపజేయుట, పూలమాలలలంకరించుట సుందర సుగంధలములగు చందనములు పూయుట మొదలగు నుపచారములా తల్లులు చేయగా వారు (కృష్ణ బలరాముల) మార్గాయాసము నుండి తేరుకొని స్వస్థులైరి. (45)

శ్లో॥ జనన్యుపహృతం ప్రాశ్య స్వాద్వన్నముపలాలితౌ ।
సంవిశ్య వర శయ్యాయాం సుఖం సుషుపతుర్వ్రజే ॥ (46)

తా॥ వ్రజమునందు తల్లులిచ్చిన 'తాయిలములు' రుచికరమైన ఆహారము ఆరగించి, వారిచే లాలింపబడి, శ్రేష్ఠమగు పడక మీద పరుండి సుఖముగా నిదురించిరి. (46)

**కాళీయమర్దన కథా ప్రారంభ ఘట్టః**

శ్లో॥ ఏవం సభగవాన్ కృష్ణో బృందావన చరః క్వచిత్ ।
యయౌ రామమృతేరాజన్! కాళిందీం సఖిభిర్వృతః ॥ (47)

తా॥ రాజా! ఇట్లు (కాలము గడచుచుండగా) భగవానుడైన కృష్ణుడు ఒకానొకప్పుడు బృందావనమున నడచుచున్నవాడై, బలరాముడు లేకుండగనే తన స్నేహితులతో కలిసి యమునానదికి బోయెను.(47)

శ్లో॥ అథ గావశ్చ గోపాశ్చ నిదాఘాతప పీడితాః ।
దుష్టం వవుర్జలం తస్యాస్తృషార్తా విషదూషితమ్ ॥ (48)

తా॥ ఆవులు, గోపబాలరును, గ్రీష్మఋతువుతోని ఆ తీక్ష్ణమగు ఎండ వలన డస్సిపోయి, దప్పిగొని విషముచే కలుషితమైన యమునా నదియందలి అపరిశుద్ధమైన నీటిని త్రాగిరి. (48)

శ్లో॥ విషాం భస్త దుపస్పృశ్య దైవోపహత చేతసః ।
నిపేతుర్వ్యసవస్సర్వే మూర్ఛితా వై కురూద్వహ! ॥ (49)

తా॥ రాజా ! విషపూరితమైన ఆ నీటిని త్రాగి, దురదృష్ట వశమున భ్రంశమైన బుద్ధిగలవారై అందఱును విగత ప్రాణులవలె మూర్ఛిల్లి పడిపోయిరి. (49)

శ్లో॥ వీక్ష్యతాన్ వై తథా భూతాన్ కృష్ణో యోగేశ్వరేశ్వరః ।
ఈక్షయాఽమృత వర్షిణ్యా స్వనాథాన్ సమజీవయత్ ॥ (50)

తా॥ ఆ విధముగ పడిపోయిన పశువులను గోపబాలురను చూచి యోగేశ్వరేశ్వరుడగు శ్రీకృష్ణుడు, తన చూపులనెడి అమృత వర్షముతో తానే రక్షకుడుగగల వారి నందఱిని బ్రతికించెను. (50)

**శ్లో॥** తే సంప్రతీత స్మృతయ ఉత్థాయ చ జలాంతికాత్ ।
ఆసన్ సువిస్మితాస్సర్వే వీక్షమాణాః పరస్పరమ్ ॥ (51)

**తా॥** వారు తెలివిని పొందిన వారై నీటి లోపలి నుండి లేచి అందరఱును ఒకరినొకరు చూచుకొనుచు మిక్కిలి ఆశ్చర్యపడుచు నుండి పోయిరి. (51)

**టీ॥** - త ఇతి. సంప్రతిసద్య ఏవ ఇతా ప్రాప్తా స్మృతిర్యైస్తే. సంప్రతీతస్మృతయః. యద్వా. సమ్యక్ ప్రతిప్రాప్తాస్మృతిర్యైస్తే తథేతి. (51.52)

**టీ॥** - సంప్రతి పద్య ఏవ -- అప్పటినుండి స్మృతి కలిగిన వారెవరో వారు సంప్రతీత స్మృతయః. లేక చక్కగా తిరిగి పొందిన స్మృతిగల వారెవరో వారు - ఎవరిచేత తిరగి పొందబడిన స్మృతి గలదో వారు. (51,52)

**శ్లో॥** అన్వమంసత తద్రాజన్ గోవిందానుగ్రహేక్షితమ్ ।
పీత్వా విషం పరేతస్య పునరుత్థాన మాత్మనః ॥ (52)

**తా॥** రాజా ! 'మృత్యు ప్రదమైన విషమును ద్రాగియు గోవిందుని అనుగ్రహ దృష్టి వలన మఱల జీవించి లేచితిమి' అని వారు నిశ్చయించుకొనిరి. (52)

శ్రీ మద్భాగవతే, మహాపురాణే దశమస్కంధే,
పంచదశోఽధ్యాయః

అని శ్రీమద్భాగవతమున దశమస్కంధమందు
పదునైదవ అధ్యాయము సమాప్తము.

## షోడశోఽధ్యాయః

**శ్రీ బాదరాయణి రువాచ**

**శ్లో॥** విలోక్య, దూషితాం కృష్ణాం కృష్ణః కృష్ణాహినా విభుః ।
తస్యా విశుద్ధి మన్విచ్ఛన్ సర్పం తముదావాసయత్ ॥ (1)

**టీ॥** శ్లో. షోడశే కాళియస్యోక్తో నిగ్రహో యమునాహ్రదే, తత్పత్నీభిస్తుతే నాథ కృష్ణేనానుగ్రహః పునః. హత్వా రాసభదైతేయాన్ జగ్ధ్వా తాళఫలాన్యలం, ప్రీతో నృత్యత్ఫణారంగే కాళీయస్య కళానిధిః. విలోక్యేతి. ఉదావాసయత్ నిష్కాసితావాన్. (1)

**రాజోవాచ**

**శ్లో॥** కథ మంతర్జలే ఽగాధే న్యగృహ్ణాద్భగవానహిమ్ ।
స వై బహుయుగావాసం యథాసీత్తత్ర కథ్యతామ్ ॥ (2)

## పదహారవ అధ్యాయము

**శ్రీ బాదరాయణి మహర్షియిట్లనెను**

**తా॥** ప్రభువైన కృష్ణుడు, కాళీయుడను సర్పముచే యమునా నది దూషిత మగుటచూచి, ఆ నదిని శుద్ధి చేయవలనని కోరి, ఆ సర్పమును తీసివేసెను. (1)

**టీ॥** - పదునాఱవ అధ్యాయమునందు, యమునా సరస్సు నందలి కాళీయుని నిగ్రహించుట చెప్పబడినది. అతని భార్యలచేత స్తోత్రము చేయబడి, అతనిచే (కృష్ణునిచే) అనుగ్రహింపబడెను. ఖరాసురులను సంహరించి, వలసినన్ని తాళఫలములను తిని, ప్రీతుడై, కళానిధియగు కృష్ణుడు ఆ కాళీయుని పడగలనెడి రంగస్థలము మీద నాట్యము చేసెను - ఉదవాసయత్- తొలగించెను. (1)

**పరీక్షిన్మహారాజు ఇట్లనెను.**

**తా॥** భగవానుడు, లోతైన నీటియందలి ఆ సర్పమును నిగ్రహించుట యెట్లు, ఆ సర్పము అచట ఎన్నియో యుగముల నుండి ఎట్లు నివసించుచుండెనో చెప్పుడు. (2)

**టీ॥** – కథమితి. బహూని యుగాన్యావాసో యస్య తమహిం. స వై అహిః అజలచరోఽపి తస్మిన్నంతర్జ్జరే. యథా యేన ప్రకారేణాసీత్. అథవా. బహూని యుగాన్యావాసో యథా భవతి తథా. కేన ప్రకారేణ స వై తత్రాసీదితి యత్తత్కథ్యతామితి. (2)

**టీ:**– అనేక యుగములుగ నివాసము ఎట్లు కలుగునో అట్లు – బహుయుగావాసం–అని చెప్పబడెను. ఏ విధముగా? ఆ సర్పము జలచరము కాకున్నను ఆ నీటి లోపల – యథా– ఏ ప్రకారముగ నుండగల్గెను, లేక – అనేక యుగములు నివాస స్థాన మెట్లో – అట్లు– ఏ ప్రకారముగ అతడచ్చట ఉండెనో ఆ విషయమును చెప్పుము అని. (2)

**శ్లో॥** బ్రహ్మన్! భగవత స్తస్య భూమ్న స్స్వచ్ఛంద వర్తినః ।
గోపాలోదార చరితం కస్తృప్యేతామృతం జుషన్ ॥ (3)

**తా॥** యోగేశ్వరా–భగవానుడు (షడ్గుణైశ్వర్య సంపన్నుడు) బ్రహ్మము, స్వేచ్ఛావర్తనుడునైన ఆ గోపాలకృష్ణుని ఉదాత్త చరిత్ర మనెడి అమృతమును త్రాగుచు ఎవడు తృప్తి పొందగలడు? (అతని లీలామృతమెంత పానము చేసినను తనివితీరదు). (3)

**టీ॥** బ్రహ్మన్నితి. గోపాలేన యదుదారమాచరితం. తదేవామృతం. అతః కథ్యతామితి. (3)

**టీ॥** – గోపాలుని చేత ఏది ఉదారముగ నాచరింపబడినదో అదియే అమృతము, అందువలన చెప్పబడుగాక అని. (3)

<u>శ్రీశుక ఉవాచ</u>

**శ్లో॥** కాళింద్యాం కాళియస్యాసీద్ధ్రదః కశ్చిద్విషాగ్నినా ।
శ్రప్యమాణపయా యస్మిన్ పతంత్యుపరిగాః ఖగాః ॥ (4)

<u>శ్రీశుకమహర్షి ఇట్లనెను.</u>

**తా॥** యమునానదిలో నొక చోట కాళీయుని మడుగు ఒకటి యుండెను. అందలి నీరు విషమనెడి అగ్ని వలన సలసల మసలు చుండును. వాని పైభాగమున ఎగురుచుండు పక్షులు దానిలో పడుచుండెను.(4)

**టీ॥** – కాళింద్యామితి. శ్రప్యమాణం పచ్యమానం. పయో యస్య సః అత ఉపరి గచ్ఛంతః ఖగాః యస్మిన్ పతంతి. (4)

**శ్లో॥** విప్రుష్మతా విషోదోర్మి మారుతేనాభిమర్శితాః ।
మ్రియంతే తీరగా యస్య ప్రాణేనస్థిర జంగమాః ॥ (5)

**టీ॥** – విప్రుష్మతేతి. కించ విప్రుష్మతా అంబుకణయుక్తేన. విషోద తరంగస్పర్శ మారుతేన. స్పృష్టాః యస్య తీరగాః, మ్రియంతే. స హ్రద ఆసీదితి. (5)

**శ్లో॥** తం చండ వేగ విష వీర్యమవేక్ష్య తేన
దుష్టాం నదీం చ ఖల సంయమనావతారః ।
కృష్ణః కదంబమధి రుహ్య తతోఽతితుంగ
మాస్ఫోట్య గాఢ రశనోఽభ్య పతద్విషోదే ॥ (6)

**టీ॥** శ్రప్యమాణం – ఉడుకుచు – నీరు దేని యందుగలదో అది (హ్రదము) అందువలన పైన పోవుచున్న పక్షులు దేనియందు పడుచుండునో అది (హ్రదము) (4)

**తా॥** నీటి కణములతో కూడిన, విషపూరితమైన జలతరంగములపై నుండి వీచుగాలుల చేత తాకబడి దాని తీరమునందలి ప్రాణులు, చరాచరములన్నియు మరణించుచుండును. (5)

**టీ॥** మరియు విప్రుష్మతా – నీటి కణములతో కూడిన విషపు నీటి తరంగములను తాకి వచ్చు గాలిచేత స్పృశింపబడి ఏ హ్రదము యొక్క తీరమందుగలవారు మరణించితురో అట్టి హ్రదముండెనని.(5)

**తా॥** ఆ భయంకరమగు వేగముగల విషము యొక్క ప్రభావమును, దానిచేత దూషితమైన యమునా నదిని చూచి, దుష్టుల నణచుట కొఱకే అవతరించిన కృష్ణుడు, వెంటనే అచట నున్న ఎత్తైనట్టి కడిమి చెట్టునెక్కి. చేతులను చఱిచి, మొలత్రాటిచే గట్టిగా (కట్టి) వస్త్రమును బిగించుకొని, ఆ విషపూరితమైన నీటిలో దూకెను. (6)

**టీ॥** – తమితి తం. కాళీయం చండో వేగో యస్య తద్విషమేవ వీర్యం యస్య తం కదంబమితి. భావినా శ్రీకృష్ణచరణస్పర్శభాగ్యేన స ఏకస్తీరేన శుష్కః అమృతమాహరతా గరుత్మతాక్రాంతత్వాదితి పురాణాంతరం. ఆస్ఫోట్య బాహుం కరతలేనాహత్య గాఢం దృఢం బద్ధా రశనా కాంచీ యేన స తథా. (6)

**టీ॥** – ఆ కాళీయునకు సంబంధించిన భయంకరమైన వేగముగల విషమే ఎవనికి పరాక్రమమో అతనిని, భవిష్యత్కాలమున కలుగబోవు శ్రీకృష్ణుని పాదస్పర్శయను మహాభాగ్యముచేత, ఆ చెట్టు ఒక్కటే ఒడ్డున (ఎండి) యుండెను. అమృతము అపహరించి తెచ్చుచున్న గరుత్మంతుని చేత ఆక్రమించి యుండుట వలననని వేఱొక పురాణ వచనము – ఆస్ఫోట్యః – భుజమును చేతితో చరచి–గాఢం–దృఢముగా బద్ధారశనా యేన సః తథా – కట్టబడిన మొలత్రాడు ఎవని చేతనో వాడు 'గాఢ రశనః అని – అట్లు చెప్పబడెను.(6)

**శ్లో॥** సర్పహ్రదః పురుష సారనిపాత వేగ
సంక్షోభితోరగ విషోన్నమితాంబురాశిః ।
పర్యక్ ప్లుతో విష కషాయిత భీషణోర్మి
రంచద్ధను శతమనంత బలస్య కిం తత్ ॥ (7)

**తా॥** సర్ప నివాసమైన యమునానది యొక్క సరస్సు, పురుష శ్రేష్ఠుడగు కృష్ణుని పడుట(దుముకుట)లోని, వేగము వలన కల్లోలితమై, సర్ప విషముచేత కూడిన జలరాశులు పైకి ఉబికి చుట్టును ప్రసరించి, విషముచే ఎఱ్ఱనై, భయము కలిగించు అలలు, నూఱు ధనుస్సుల మేర వఱకును వ్యాపించెను. అనంతమైన బలముగల కృష్ణుని విషయమున నందాశ్చర్యమేమియులేదు. (7)

**టీ॥** సర్పేతి. సర్పస్య హ్రదః పురుషశ్రేష్ఠస్య పతనభరేణ. సంక్షోభితానాం ఉరగాణాం విషైరున్నమితోఽంబురాశిర్యస్య సః. విషేణ కషాయీకృతా భయంకరా ఊర్మయో యస్య సః పర్యక్ పరితః అంచత్. ధనుశ్శతంప్లుతః

**టీ॥** – సర్ప హ్రదః – సర్పముయొక్క మడుగు–( పురుష శ్రేష్ఠుని పడుట వలన కలుగు బరువుచేత– సంక్షోభితానాం ఉరగాణాం – కలత చెందిన పాముల యొక్క – విషయముల చేత ఎగసిన నీటి

ప్రసృతః. నైతచ్చిత్రమిత్యాహ - అనంతబలస్యేతి. (7)

సమూహములు దేనికో అది. (హ్రదము) - విషముచేత కషాయముగా (ఎఱుపుగా) చేయబడిన భయము గొల్పెడు తరంగములు దేనికో అది (హ్రదము) - పర్యక్ - చుట్టును - అంచత్- కదలుచు -ధనుశ్శతం - నూఱు ధనుస్సుల మేర -ప్లుతః-ప్రవృతమయ్యెను, వ్యాపించెను 'అనంత బలస్య' అని, ఇది చోద్యము కాదని చెప్పుచున్నాడు. (7)

**శ్లో॥** తస్మిన్ హ్రదే విహరతోభుజ దండ ఘూర్ణ
వార్ఘోషమంగ వక వారణ విక్రమస్య
రాజా! అశ్రుత్య తత్స్వ సవానాభిభవం విరీక్ష్య
చక్ముశ్రవాస్స చక్షుత్రావాస్యమసరత్తదమృష్య మాణం (8)

**తా॥** ఆ మడుగులో ఈదుచు తన దండముల వంటి భుజములను ఇటు నటు త్రిప్పుచున్న, మదించిన యేనుగు వంటి బలశాలియగు శ్రీకృష్ణుని కదలిక వలన కలుగుచున్న నీటి చప్పుడువిని, తన నివాస ప్రదేశమగు హ్రదమునకు జరుగుచున్న తిరస్కారమును చూచి, సహించజాలని సర్పము, ప్రాకుచు కృష్ణుని వద్దకు వచ్చెను.(8)

**టీ॥** - తస్మిన్నితి. భుజదండాహతోదక ఘోషం శ్రుత్వా తత్ తతః. స్వసదనాభిభవం చ నిరీక్ష్య తదసహమానః సర్పః. సమసరత్సమాజ గామ. (8)

**టీ॥** దండముల వంటి భుజములతో కొట్టబడుచున్న నీటి ధ్వని విని - అప్పుడు, తన నివాసమునకు జరుగుచున్న తిరస్కారమును చూచి దానిని సహింపజాలని ఆ నాగము -సమసరత్-సమా జగామ- తిన్నగా కృష్ణుడున్న తావునకు వచ్చెను.(8)

**శ్లో॥** తం ప్రేక్షణీయ సుకుమార ఘనావదాతం
శ్రీవత్స పీతవసనం స్మిత సుందరాస్యమ్ ।
క్రీడంతమప్రతిబలం కమలోదరాంఘ్రిం
సందశ్య మర్మసురుషా భుజయా చఛాద ॥ (9)

**తా॥** చూడదగినట్టి, మృదువైన మేఘము వలె శుభ్రమైన వాడును, ఉరమున శ్రీవత్సము అను పుట్టుమచ్చ గలవాడును, పసుపు పచ్చని పట్టువస్త్రమును ధరించి యున్న వాడును, చిఱునవ్వుతో అందమైన ముఖముగల వాడును, ఆడుచున్నవాడును, తనతో సమానమైన బలశాలి మఱియొకడు లేని వాడును, తామరపువ్వు దుద్దు వంటి పాదములు గలవాడును అయిన ఆ శ్రీకృష్ణుని మర్మస్థానములందు కఱచి, కోపముతో తన పడగల చేత అతనిని ఆక్రమించి కప్పి వేసెను. 9

**టీ॥ –** తమితి. ప్రేక్షణీయశ్చ సుకుమార్చ ఘనవదుజ్జ్వలచ్చ తం. శ్రీవత్సపీతవసనం శ్రీవత్సేన సంయుక్తముజ్జ్వలత్పీతం వస్త్రం యస్య తం. భుజయా భోగేన చఛాద అవేష్టయత్ . (9)

**టీ॥** చూడదగిన వాడును, సుకుమారుడును, మేఘమువలె ప్రకాశించు వాడును అయిన శ్రీవత్సమను పుట్టుమచ్చ వక్షస్థలమున గలవాడును దానితో కూడా ప్రకాశించుచున్న పీతాంబరము ఎవనికో అట్టి వానిని, – భుజయా – పడగతో– చఛాద– చుట్టివేసెను. (9)

**శ్లో॥** తన్నాగ భోగ పరిపీతమదృష్ట చేష్ట
మాలోక్య తత్ప్రియ సఖాః పశుపాభృశార్తాః ।
కృష్ణేఽర్పితాత్మ సుహృదర్థ కళత్ర కామా
దుఃఖార్తి శోక భయ మూఢధియో నిపేతుః ॥ (10)

**తా॥** ఆ నాగపాశమున చుట్టుకొనబడి చేష్టలుడిగినట్లున్న శ్రీకృష్ణుని జూచి అతని ప్రియమైన స్నేహితులు, పశుపాలకులను మిక్కిలి బాధ నొందిన వారై, కృష్ణుని యందే అర్పింపబడిన తమ తమ హృదయములు, స్నేహితులు, సంపదలు, భార్యలు, కోరికలును గలిగిన వారందఱును దుఃఖము చేతను, భయము చేతను వ్యాకులము నొంది, బుద్ధి భ్రంశులై, మూర్ఛనొంది పడిపోయిరి. (10)

**శ్లో॥** గావో వృషా వత్సతీర్యః క్రందమానాస్సు దుఃఖితాః ।
కృష్ణ న్యస్తేక్షణా భీతా రుద్యంత ఇవ తస్థిరే (11)

**తా॥** ఆవులు, ఎడ్లు, యౌవనములో నున్న లేగలు, మిక్కిలి దుఃఖించు నవియై ఆక్రందించుచుండెను. కృష్ణుని యందే చూపులు నిలిపి, భయమునొందినవియై, ఏడ్చుచున్న వాని వలె నుండెను.(11)

**టీ॥** తదితి. సః ప్రియో యేషాం తే తత్ప్రియాః. తే చ తే సఖాయశ్చేతి తథా. (10.11)

టీ:- అతడు ప్రేమాస్పదుడై ఎవరికి ఉండేనో వారు 'తత్ప్రియాః' వారును 'నీకు' స్నేహితులని అట్లు. (10,11)

**శ్లో॥** అథ వ్రజే మహోత్పాతాస్త్రి విధా అతిదారుణాః ।
ఉత్పేతుర్భువి దివ్యాత్మన్నాసన్న భయం శంసినః ॥ (12)

**తా॥** పిమ్మట వ్రజము నందు, భవిష్యత్తున కలుగబోవు ఆపదలను సూచించినట్టి మిక్కిలి భయము గొల్పునట్టి మూడు విధములైన - భూ సంబంధములు, ఆకాశసంబంధములు, శరీర సంబంధములైన గొప్ప ఉత్పాతములు సంభవించెను. (12)

**టీ॥** - అథేతి. భువి భూకంపాదయః దివి ఉల్కాపాతాదయః. ఆత్మని వామనేత్రస్ఫురణాదయః ఆసన్నం భయం శంసితుం శీలం యేషాం తే. (12)

**టీ॥** భూమియందు భూకంపములు మొదలగునవి, ఆకాశమున ఉల్కాపాతములు మొదలగునవి, ఆత్మయందు (శరీరమునందు) ఎడమ కన్ను అదురుట మున్నగునవి. త్వరలోనే కలుగబోవు భయమును సూచించు స్వభావము వేనికో అవి. (12 )

**శ్లో॥** తానాలక్ష్య భయోద్విగ్నా గోపా నంద పురోగమాః ।
వినా రామేణ గాః కృష్ణం జ్ఞాత్వా చారయితుం గతమ్ ॥ (13)

**తా॥** నందుడు మొదలగు గోపాలకులు ఆ దుశ్శకునములను చూచి భయముతో ఉద్వేగమునొందిరి. బలరాముడు వెంట లేకుండగనే కృష్ణుడు ఆవులను మేపుటకు బోయెనని తెలిసికొనిరి. (13)

**టీ॥** తానితి. తానాలక్ష్య. గోకులాన్నిర్జగ్మురితి తృతీయేనాన్వయః. భయోద్విగ్నాః భయహేతుభ్యో భీతాః. భయేన కంపమానా ఇతి వా. (13)

**టీ॥** వానిని(ఉత్పాతములను) చూచి-గోకులము నుండి బయలుదేరి (కృష్ణుని జూచుటకు) వెడలిరి అని. ఈ శ్లోకము నుండి మూడవ శ్లోకముతో అన్వయము. భయోద్విగ్నాః - భయ కారణముల వలన భయపడినవారై - లేక భయముతో వణకు చున్నవారై అనియో (13)

**శ్లో॥** తైర్దుర్నిమిత్తైర్నిధనం మత్వాప్రాప్తమతద్విదః ।
తత్ప్రాణాస్తన్మన స్కాః తే దుఃఖశోక భయాతురాః ॥ (14)

**తా॥** భగవానుని లీల తెలియని వారైన ఆ నందుడు మొదలగు గోపాలురు ఆ దుశ్శకులనములచే, కృష్ణుడు మరణించెనో ఏమో అని భావించి, కృష్ణుడే తమ ప్రాణములుగ, కృష్ణుడే తమ మనస్సులుగా వారు దుఃఖించుచు, శోకించుచు భయముతో దిగులు చెందుచున్నవారై (14)

**టీ॥** తైరితి. న తం విదంతీత్యతద్విదః. (14)

**టీ॥** అతనిని (అతని లీలను) తెలియని వారు అతద్విదులు. (దైవవిలాసము నెఱుగని వారు) (14)

**శ్లో॥** ఆ బాల వృద్ధ వనితా స్సర్వేంగ! పశువృత్తయః ।
నిర్జగ్ముర్గోకులా ద్దీనాః కృష్ణ దర్శన లాలసాః ॥ (15)

**తా॥** రాజా! బాలురు మొదలుకొని వృద్ధులు, స్త్రీలు అందఱును - పశువృత్తి గలవారై - పశువుల వలె అమాయకమైన ప్రేమ గలవారై కృష్ణుని చూడవలెననెడి మిక్కుటమైన ఆశతో, దీనులై గోకులము నుండి బయలుదేరిరి.(15)

**టీ॥** – ఆబాలేతి. పశువృత్తయః అతివత్సలాః. (15)

**టీ॥** పశువృత్తయః – మిక్కిలి ప్రేమ గలవారై. (15)

**శ్లో॥** తాంస్తథా కాతరాన్ వీక్ష్య భగవాన్ రోహిణీ సుతః ।
ప్రహస్య కించిన్నోవాచ ప్రభావజ్ఞోఽనుజస్య సః ॥ (16)

**తా॥** భయపడుచున్న వారి నందరిని జూచి భగవానుడైన బలరాముడు నవ్వి ఏమియు మాటలాడక మిన్నకుండెను. అతడు తన తమ్ముడగు కృష్ణుని ప్రభావము తెలిసిన వాడు కదా ! (16)

**టీ॥** – తానితి. కాతరాన్ భీతాన్. (16)

**టీ॥** కాతరాన్ – భీతిచెందిన (16)

**శ్లో॥** తేఽన్వేషమాణా దయతం కృష్ణం సూచితయా పదైః ।
భగవల్లక్షణైర్జగ్ముః పదవ్యా యమునా తటమ్ ॥ (17)

**తా॥** వారు, తమకు మిక్కిలి ప్రియమైన కృష్ణుని, భగవంతుని లక్షణములను సూచించు పదములతో, అతని చరణ చిహ్నములను గుర్తించుచు యమునా తీరము నందలి మార్గము నందు వెదకుచుఁ బోయిరి. (17)

**టీ॥** త ఇతి భగవంతం లక్షయంతి యాని పదాని. తైః పదైస్సూచిత యా పదవ్యా మార్గేణ. (17)

**టీ॥** – కృష్ణ భగవానుని లక్షణములను సూచించు ఏ పాదములు గలవో, ఆ పాద చిహ్నములుగల మార్గము ద్వారా (వెదకుచు బోవుచుండిరి) (17)

**శ్లో॥** తే తత్ర తత్రాబ్జ యవాంకుశాశని
ధ్వజోపపన్నాని పదాని విశ్పతేః ।
మార్గే గవామన్య పదాంతరాంతరే
నిరీక్ష్యమాణాయయురంగ! సత్వరాః ॥ (18)

**తా॥** రాజా! త్రోవలో గోవుల యొక్కయు ఇతరుల యొక్కయు పాద చిహ్నముల మధ్య భాగములలో అచటచ్చట, తామర పువ్వు, జవ్వ (యవ), అంకుశము, వజ్రాయుధము, ధ్వజము మున్నగు గుర్తులు కలిగిన కృష్ణుని అడుగు జాడలు కనబడగా అట్టి వానిని పోల్చుకొనుచు, వేగము గలవారై వారందఱు అట్టి చిహ్నములను వెదకికొనుచు ముందునకు సాగిపోయిరి. (18)

**టీ॥** మార్గజ్ఞానప్రకారమాహ. త ఇతి విశ్పతేః శ్రీకృష్ణస్య. అన్యేషాం పదానాం. అంతరాంతరే మధ్యే మధ్యేతత్తదపోహనేన. గవాం శ్రుతీనాం. మార్గేణ సత్వరా అప్రమత్తా యోగిన స్తత్తదుపాధ్యపవాదేన. యథా పరం తత్త్వం. మృగయంతే. తద్వదితి భావః. (18)

**టీ॥** మానవులందఱికిని పతియైన శ్రీకృష్ణుని యొక్క – ఇతరుల పాదముద్రల మధ్య మధ్య – అవియేనేమో అను అపోహచేత – గవాం – వేదముల యొక్క – మార్గము ద్వారా – సత్వరా– అప్రమత్తులై యోగులు ఆయా ఉపాధులను తిరస్కరించి ఏ విధముగ పరతత్త్వమును వెదకుదురో అట్లు అని భావము. (నేతి నేతి వాదము ద్వారా పరమాత్మను అన్వేషించునట్లు) (18)

**శ్లో॥** అంతర్జలే భుజగ భోగ పరీత మారా
త్కృష్ణం నిరీహముపలభ్య జలాశయాంతే ।
గోపాంశ్చ మూఢ ధిషణాన్ పరితః పశూంశ్చ
సంక్రందతః పరమకల్మష మాపురార్తాః ॥ (19)

**తా॥** నీటి లోపలి భాగమున, పాము పడగలచే చుట్టుకొనబడి చేష్టలుడిగి యున్నట్లున్న కృష్ణుని, సమీపముననే వారు కనుగొని, అటులే ఆ జలాశయము చుట్టును ఆక్రోశించుచు, స్తబ్ధులై యున్న గోప బాలురను, పశువులను చూచి వ్రజవాసులు ఆర్తులై మిక్కిలిగ మోహము నొందిరి. (19)

**టీ॥** అంతరితి. తతశ్చ సర్పపరివేష్టితం కృష్ణం దూరాన్నిరీక్ష్య గోపాంశ్చ పశూంశ్చ. తథా తథా నిరీక్ష్య. ఆర్తాః. పరమం మోహం ప్రాపుః. (19)

**టీ॥** అట నుండి పాముచే ఆక్రమించబడియున్న కృష్ణుని, దూరము నుండి చూచి గోపబాలురను పశువులను కూడా – అట్లా విధముగా చూచి – ఆర్తాః మిక్కిలి మోహమును పొందిరి. (19)

**శ్లో॥** గోప్యోఽనురక్త మనసో భగవత్యనంతే
తత్సౌహృద స్మిత విలోక గిరస్స్మరంతః ।
గ్రస్తేఽహినా ప్రియతమో భృశ దుఃఖ తప్తా
శ్శూన్యం ప్రియవ్యతి హృతం దదృశు స్త్రి లోకమ్ ॥ (20)

**తా॥** అనంతుడు, భగవానుడు, ప్రియతముడు అయిన కృష్ణుని పాముచే పట్టబడిన వానిని చూచి, అతని సుహృద్భావమును, చిరునవ్వును, చూపులను, మాటలను తలచుకొని తలచుకొని, భరించరాని దుఃఖముతో తపించి పోవుచు, ప్రియతముడైన కృష్ణుడు లేని ముల్లోకములను శూన్యముగ చూచిరి. (20)

**టీ॥** – గోప్య ఇతి. ప్రియేణ శ్రీకృష్ణేన. విరహితం త్రైలోక్యం శూన్యం దదృశుః. (20–22)

**టీ॥** ప్రియమైన శ్రీకృష్ణుని లేమిచే త్రైలోక్యమును శూన్యముగ చూచిరి. (20–22)

**శ్లో॥** తాః కృష్ణ మాతర మపత్యమను ప్రతప్తాం
త్ృుల వ్యథా స్సమధిగమ్య శుచస్స్రవంత్యః ।
త్రస్తా వ్రజ ప్రియ కథాః కథయంత్య ఆసన్
కృష్ణాననేఽర్పిత దృశో ఽమృతక ప్రతీకాః ॥ (21)

**తా॥** తన కుమారుని స్థితిని గూర్చి మిక్కుటముగా బాధపడుచున్న కృష్ణుని తల్లియగు యశోదను గూర్చి, ఆమె వలెనే బాధను పొందుచు కన్నీరు గార్చుచున్న వారందఱును యశోదను గూర్చి భయము, దిగులు పడుచు, కృష్ణుని ముఖమువైపునకే తమ చూపులు నిలిపి, వ్రజమునందలి ప్రియమైన కథలను చెప్పుచు, యశోదను ఓదార్చుచుండినను, వారును కృష్ణుని గూర్చిన బాధ వలన శవ ప్రాయులుగ నుండి. (21)

**శ్లో॥** కృష్ణ ప్రాణాన్నివిశతో నందాదీన్ వీక్ష్య తం హ్రదమ్ ।
ప్రత్యషేధత్ స భగవాన్ రామః కృష్ణానుభావవిత్ ॥ (22)

**తా॥** కృష్ణుడే తమ ప్రాణమని భావించు నందుదు మున్నగు వారు ఆ కాళీయ హ్రదము లోనికి ప్రవేశించుటకు సిద్ధము కాగా, కృష్ణుని భావమును తెలిసిన భగవానుడైన ఆ బలరాముడు వారిని వారించెను. (22)

**శ్లో॥** ఇత్థం స్వగోకుల మనన్యగతిం నిరీక్ష్య
స స్త్రీ కుమారమతి దుఃఖిత మాత్మహేతోః ।
అజ్ఞాయ మర్త్య పదవీ మనువర్తమానః
స్థిత్వా ముహూర్తముద తిష్ఠ దురంగ బంధాత్ ॥ (23)

**తా॥** ఈ విధముగా తన మూల(క) ముగ, బాలురు, స్త్రీలు మొదలుకొని అందఱును చాలా దుఃఖపడుట, తన గోకులమంతటికి తాను తప్పనిక వేఱొక రక్షకుడు లేకపోవుటను గమనించి, కృష్ణుడు, తాను మనుష్య స్థానముననుసరించుచున్నట్లు తెలియక, ఒక ముహూర్త కాలము అటులే ఉండి పిమ్మట సర్ప బంధము నుండి బయటపడెను.(23)

**టీ॥** ఇత్థమితి. అనన్య గతిమాత్మానం. ఇత్థం నిరీక్ష్య. అత ఏవాత్మ హేతోః. స్వగోకులమతి దుఃఖితమాజ్ఞాయ. ఉరగబంధాదుదతిష్ఠ దిత్యన్వయః. (23)

**టీ॥** తాను తప్ప వేఱొక గతి వ్రజవాసులకు లేకుండుట గమనించి –తన కారణముగ తన గోకులము (అజ్ఞానముతో)మిక్కలిగ దుఃఖించు చుండుట–సర్పబంధము నుండి వెలికి వచ్చెనని అన్వయము. (23)

**శ్లో॥** తత్ప్రథ్యమాన వపుషా వ్యథితాత్మ భోగ
స్త్యక్త్వోన్నమయ్య కుపితః స్వఫణాన్ భుజంగః ।
తస్థౌ శ్వసన్ శ్వసన రంధ్ర విషోఽఽంబరీష
స్త బ్ధేక్షణోల్ముక ముఖో హరిమీక్షమాణః ॥ (24)

**తా॥** కృష్ణునిచే పెంచబడుచున్న అతని శరీరము చేత బాధింప బడిన (తన) పడగలు గలదియై, ఆ సర్పము తన పట్టు వదలి, పడగలను పైకి లేపి, కోపించి, బుసలు కొట్టుచు, నాసికారంధ్రముల నుండి విషాగ్నిని చిమ్ముచు, కాగుచున్న ఎఱ్ఱని మంగలము వంటిదై

**టీ॥** –తదితి. తస్య ప్రధ్యమానేన ప్రవర్ధమానేన వపుషా. వ్యధితాత్మా పీడిత శరీరః. భుజంగః కుండలీ. శ్రీకృష్ణం త్యక్త్వా. కుపితః. స్వఫణానున్నమయ్య. శ్వసన్ కేవలసమీక్ష మాణస్తస్థౌ. కథంభూతః శ్వసనరంధ్రేషు నాసావివరేషు. విషం యస్య స తథా. అంబరీషం భ్రాష్ట్రః. మండకపాక భాజనమిత్యర్థః. తద్వత్ సంతప్తాని స్తబ్ధాని ఈక్షణాని యస్య త తథా. ఉల్ముకాని ముఖేషు యస్య స చ. (24)

**శ్లో॥** తం జిహ్వయా ద్విశిఖయా పరిలేలిహానం
ద్వేసృక్విణీ హ్యతి కరాళ విషాగ్ని దృష్టిమ్ ।
క్రీడన్నముం పరిససార యథా ఖగేంద్రో
బభ్రామసోఽ పృవసరం ప్రసమీక్ష్యమాణః ॥ (25)

పూత్కారములు చేయుచు, చూపులను నిలిపి, కొఱవి వంటి ముఖము గలదియై (నిప్పు గురింపిచుచు) శ్రీ కృష్ణుని అదే పనిగ చూచుచుండెను. (24)

**టీ॥** ప్రధ్యమానేన – పెరుగుచున్న శరీరముచేత– వ్యధితాత్మా – పీడింపబడిన శరీరము గలదియై – భుజంగః – సర్పము – శ్రీకృష్ణుని విడిచి – కోపించునదై – తన పడగలను పైకి లేపి– శ్వాసించుచు –కేవలముగ చూచుచుండెను. ఎట్టిది? నాసికా రంధ్రములందు విషము దేనికో అది. అట్లు చెప్పడినది. అంబరీషం– మంగలము –గుండ్రని వంట పాత్రయని అర్థము. దానివలె ఎఱ్ఱనై నిలుకడ గల చూపులు ఎవనికో వాడు, అటుల చెప్పబడెను. కొఱువుల (మిరుగుళ్లు) ముఖములందెవనికో వాడు 'ఉల్ముక ముఖః' అని– (24)

**తా॥** రెండు కొసలుగల నాలుకతో, రెండు పెదవికొసలను నాకు చున్నదియు. అతిమాత్రముగ భయము గొల్పుచున్న విషాగ్నితో చూచు చున్నదియునైన ఆ సర్పమును పట్టుకొని గరుడుడు ఆడునట్లాడుచు దానిని చుట్టును త్రిప్పుచుండెను. ఆ సర్పము కూడా కృష్ణుని వేటు వేయుటకు సమయము కొఱకు చూచు చుండెను.(25)

**టీ॥** తమితి. హరిశ్చ క్రీడన్. తమముం సర్పం. పరిససార పరితోబభ్రామ. అతికరాళా విషాగ్నియుక్తా దృష్టిర్యస్య తం. జిహ్వయా ద్విశిఖయేతి ప్రతిముఖం. (25)

**టీ॥** కృష్ణుడును ఆడుచు – ఆ సర్పమును – పరిససార – చుట్టును త్రిప్పెను. మిక్కిలి భయంకరమగు విషమనెడు అగ్నితో కూడుకొనిన చూపు ఎవనికో వానిని – (త్రిప్పెను). (25)

**శ్లో॥** ఏవం పరిభ్ర హతౌజసమున్నతాంస
మానమ్యతత్పృథుశిరః స్వధిరూఢ ఆద్యః ।
తన్మూర్ధ రత్న నికర స్పర్శాతి తామ్ర
పాదాంబుజోఽఖిల కళాది గరుర్ననర్త ॥ (26)

**తా॥** ఈ విధముగ త్రిప్పబడుటచేత బలము క్షీణించిన సర్పము యొక్క మూపును వంచి ఆద్యుడైన కృష్ణుడు దాని బలిష్ఠమైన తలలపై అధిరోహించి, అచటి రత్నసమూహములచే కలిగిన స్పర్శవలన, మిక్కిలి ఎఱ్ఱనైన పాదపద్మములు మఱింత ప్రకాశింపగా, సమస్తమైన కళలకు ఆది గురువైన కృష్ణుడు నాట్యమాడెను. (26)

**టీ॥** ఏవమితి. ఏవం పరిభ్రమేణైవ హతమోజో యస్య తం. ఉన్నతౌ అంసౌ యస్య తం. తస్య మూర్ధసు యే రత్ననికరాః. తేషాం స్పర్శేన. అత్యరుణం పాదాంబుజం యస్య సః. అత్ర ఛందోభంగ ఆర్షః. నను కథం చంచలేషు శిరస్సుననర్థ? తత్రాహ –అఖిలకళానామాదిగురుః (26, 27)

**టీ॥** ఇట్లు త్రిప్పబడుట చేతనే ఎవని బలము క్షీణించి పోయెనో వానిని – ఎత్తైన మూఁపులు ఎవనికో వానిని – అతని శిరస్సులపై ఏ రత్న సమూహములు గలవో, వాని యొక్క స్పర్శ చేత– మిక్కిలి ఎఱుపు వన్నెగల అడుగు తామరలెవనికో వాడు– ఇచట ఛందోభంగము ఆర్షము. అయినను కదలుచున్న వాని శిరస్సులపై ఎట్లు నాట్యము చేసెను? చెప్పుచున్నాడు. అన్ని కళలకు మొదటి గురువు అని. (26,27)

**శ్లో॥** తం నర్తు ముద్యత మవేక్ష్య తదా తదీయా
గంధర్వ సిద్ధ ముని చారణ దేవ వధ్వః ।
ప్రీత్యా మృదంగ పణవానక వాద్యగీత
పుష్పోపహారనుతిభిస్సహసోపసేదుః (27)

**తా॥** నృత్యము చేయుటకు పూనుకొనన శ్రీకృష్ణుని జూచి- అప్పుడు-ఆయనకే సంబంధించిన వారగు గంధర్వులు, సిద్ధులు, మునులు, చారణులు, దేవతా స్త్రీలు, ప్రేమతో, మృదంగములు, ఉడుక వాద్యములు, తప్పెటలు మున్నగు వాద్యములు మ్రోగించుచు, స్తుతి గీతములు పాడుచు, పుష్పవృష్టి గురిపించుచు, కానుకలు సమర్పించుచు, స్తోత్రములు చేయుచు- వెంటనే కృష్ణుని సన్నిధికేతెంచిరి. (27)

**శ్లో॥** యద్యచ్ఛిరో న నమతేఽంగ! శతైక శీర్ష్ణ
స్తత్తన్మమర్ద ఖలదండ ధరోఽంఘ్రిపాతైః ।
క్షీణాయుషో భ్రమత ఉల్బణ మాస్యతోఽసృ
జ్నస్తో వమన్ పరమ కశ్మలమాప నాగః ॥ (28)

**తా॥** రాజా! కాళీయుని నూటొక్క శిరస్సులలో ఏయే శిరస్సు వంగియుండదో, ఆయా శిరస్సులను దుర్మార్గుల పాలిటి యమ రాజైన కృష్ణుడు, తన పాద తాడనములతో అణిచివేసెను. దానితో కాళీయుని ఆయువు క్షీణించెను. అట్లే గిరగిర త్రిప్పబడిన అతడు ముఖము నుండి, ముక్కు నుండి విపరీతమగు నెత్తురు క్రక్కుచు తేరుకొనలేని విధముగ మూర్ఛనొందెను. (28)

**టీ॥** - యద్యదితి. శతైకశీర్ష్ణః శతం ఏకాని ముఖ్యాని. శీర్షాణి యస్య తస్య క్షీణాయుషోఽపి పునర్భ్రమతః యద్యచ్ఛిరో న నమతేస్తబ్ధతాం న జహాతి. నృత్యచ్ఛ లేనాంఘ్రిపాతైస్తత్తన్మమర్ద. తథా చ. అస్యతో ముఖేభ్యః. నస్తో నాసావివరేభ్యశ్చ. అసృగ్వమన్. (28)

**టీ॥** శతైక శీర్ష్ణః - నూటను ఒకటియు ముఖ్యములైన తలలు ఎవనికో అట్టి కాళీయుని యొక్క- ఆయువు తగ్గుచున్న వాడైనను- మఱల తిరుగుచున్న వానియొక్క ఏయే శిరస్సు-ననమతే- స్తంభించిపోయి (వంగి పడుచున్నట్లు) ఉండదో-నాట్యము చేయు నెపమున, తన అడుగుల ఒత్తిడిచేత ఆయా శిరములను అణిచివేసెను. అటులే - అస్యతః - ముఖముల నుండి, ముక్కుల నుండి- ముక్కు రంధ్రముల నుండి - రక్తమును క్రక్కుచు. (28)

**శ్లో॥** తస్యాక్షిభిర్గరళ ముద్వమత శ్శిరస్సు
యద్యత్సమున్నమతి నిశ్వసతో రుషోచ్చైః ।
నృత్యత్పదాను నమయన్ దయమాం బభూవ
పుష్పైస్సు పూజిత ఇవేహ పునః పురాణంః ॥ (29)

**తా॥** అతని (కాళీయుని) కన్నుల నుండి విషము బయలు వెడలుచుండగా ఆ శిరస్సులలో ఏ ఏ శిరస్సు మఱల కోపముతో బుస కొట్టుచు పైకి లేచుచుండెనో ఆయా శిరస్సులపై సనాతనుడగు కృష్ణుడు నాట్య మాడుచున్న తన పాదముల ఘాతలననుసరించి అణచి వేయుచుండ నవి వంగి పోవుచుండెను. ఆ సమయమున (అతని పాదములపై చిమ్మిన రక్తపు చుక్కలు) ఈతడు ఎఱ్ఱని పూలతో చక్కగా పూజింపబడినట్లు కన్పట్టుచుండెను. (29)

**టీ॥** – తస్యేతి. పునరపి రుషా ఉచ్చైర్నిశ్వసతో యద్యత్సమున్నమతి. తత్తత్పదాఘాతేనానునమయన్. ఇహాస్మిన్నవసరే. హృష్టైర్గంధర్వాదిభిః శేషాసనః పురుష ఇవ స యశోదానందనః. పుష్పైః పూజితః యద్వా. తదా గంధర్వాదిభిః పుష్పైస్సుపూజితో గోపైః పురాణ ఇవ పుమాన్ దృష్ట ఇతి. యద్వా–పుష్పైస్సుపూజిత ఇవ ప్రసన్నస్సన్. దమయాం బభూవ హితం కృతవానిత్యర్థః. (29)

**టీ॥** మఱల కూడ కోపముచేత బిగ్గరగ బుసకొట్టుచు ఏయే శిరస్సు పైకి లేచుచున్నదో ఆయా శిరస్సును తన పాదముల దెబ్బలచే అణచుచు–ఇహ–ఈ సమయమున–సంతోషించిన గంధర్వులు మున్నగు వారిచే – శేషుడే ఆసనముగల పురుషుని వలె ఆ యశోదా నందనుడగు కృష్ణుడు పుష్పముల చేత పూజింపబడెను–లేక–అప్పుడు గంధర్వాదులచే పూలతో చక్కగా పూజింపబడిన వానివలె, ఆ పురాణ పురుషుడు గోపాలకులచే చూడబడెను అని – లేక – పూలతో పూజింపబడినట్లుగ ప్రసన్నుగుడుచు దమయాం బభూవ– హితమును కలుగజేసెనని యర్థము. (29)

**శ్లో॥** తచ్చిత్ర తాండవ నిరుగ్ణ ఫణా సహస్రై
రక్తం ముఖైరురు వమన్నృప ! భగ్న గాత్రః ।
స్మృత్యా చరాచర గురుం పురుషం పురాణం
నారాయణం తమరణం మనసా జగామ ॥ (30)

**తా॥** రాజా! కృష్ణుని విచిత్రమైన నాట్యముతో కాళీయుని అనేకమైన పడగలు గాయపడి, (భగ్నమై) అతడు తన ముఖముల నుండి విశేషముగ రక్తమును గ్రక్కుచు, శరీరము శిథిలమైనవాడై, జడ చైతన్యముల కన్నింటికిని గురువు, పురాణపురుషుడు, నారాయణుడును అయిన శ్రీకృష్ణుని స్మరించి, మనస్సుతోనే శరణు పొందెను. (30)

**టీ॥** – తదితి. అరణం శరణం. (30)

**టీ॥** అరణం – హరణము. (30)

**శ్లో॥** కృష్ణస్య గర్భ జగతో ఉ తి భరావ సన్నం
పార్ష్ణి ప్రహార పరిరుగ్ణ ఫణాతపత్రమ్ ।
దృష్ట్వా హి మాద్యముపసేదురముష్య పత్న్య
ఆర్తా శ్లథద్వసన భూషణ కేశబంధాః ॥ (31)

**తా॥** కృష్ణుని కడుపులోగల ప్రపంచము యొక్క మిక్కుటమైన బరువుచేత ఆక్రమింపబడిన వాడును, అతని పాదముల వెనుక భాగముల చేత కొట్టబడిన దెబ్బల చేత, భగ్నమై గొడుగువలె విప్పుకొనిన పడగలుగల వాడును అయిన కాళీయుని, కృష్ణుని చూచి, కాళీయుని భార్యలు ఆవేదన చెంది, అస్తవ్యస్తమైన వస్త్రములు, భూషణములు, సిగముడులును గలవారై కృష్ణుని సన్నిధికేతెంచిరి. (31)

**టీ॥** – కృష్ణస్యేతి. గర్భే జగంతి యస్య తస్యాతిభరేణ. అవసన్నమాక్రాంతం. పార్ష్ణిః. పాదపృష్ఠం. ఆద్యం శ్రీకృష్ణం. శ్లథంతో విస్రంసమానాః వసనాదయో యాసాం తాః. .(31)

**టీ॥** గర్భము నందు కదలుచున్న ప్రపంచము ఎవనికి గలదో వాని యొక్క మిక్కుటమగు బరువుచేత–అవసన్నం–ఆక్రమింప బడిన వానిని –పార్ష్ణిః–పాదముయొక్క వెనుకభాగము– ఆద్యం– కృష్ణుని– శ్లథంతః –శిథిలములగుచున్న–వస్త్రములు మొదలనవి–ఎవరికో వారు.(31)

శ్లో॥ తా స్తం సువిగ్నమన సోఽథ పురస్కృతార్భాః
కాయాన్నిపాత్య భువి భూతపతిం ప్రణేముః ।
సాధ్వ్యః కృతాంజలిపుటాశ్శమలస్య భర్తు
ర్మోక్షేప్సవశ్శరణదం శరణం ప్రపన్నాః ॥ (32)

తా॥ సాధ్వులగు ఆ నాగపత్నులు భయవిహ్వలురై, తమ పిల్లలను ముందిడుకొని, తమ శరీరములను భూమిపై పడునట్లుచేసి, సకల భూతములకు అధినాథుడైన కృష్ణునకు నమస్కారము చేసిరి. పిమ్మట చేతులు జోడించి, చనిపోబోవుచున్న తమ భర్తకు మోక్షము కలుగ వలెనని కోరిక గలవారై, శరణన్న వారిని రక్షించు భగవానుని శరణువేడి ప్రపన్నులైరి. (32)

టీ॥ – తా ఇతి. శరణం ప్రపన్నాస్సత్యః తం ప్రణేముః. సువిగ్నమనసః విహ్వలచిత్తాః. భువీతి తస్మిన్ స్థానే. జలాదధస్తాద్వా. తీరే వా. శమలస్య పాపాత్మనోఽపి. భర్తుర్మోక్షేప్సవః. భర్తుర్యచ్ఛమలంతస్య వా. భూతపతిం ప్రాణిమాత్రస్య పతిం. శరణదం ఆశ్రయప్రదం. (32)

టీ॥ – శరణాగతి పొందుచు అతనికి నమస్కరించిరి–సువిగ్నమనసః –విహ్వలచిత్తులై–భువి–ఆ స్థలమునందు– లేక – నీటి అడుగు భాగమున – లేక–తీరమునందు–శమలస్య–పాపాత్ముడైనను–భర్తకు మోక్షము కలుగవలెనని కోరినవారై–భర్త యొక్క ఏ పాపము గలదో దాని యొక్క శమమునో–భూతపతిం–ప్రాణిమాత్రుడైనవానికి నాథుడైన వానిని శరణదం–ఆశ్రయమిచ్చు వానిని –(శ్రీకృష్ణుని శరణువేడిరి)**32**

### కాళీయ పత్నీకృత శ్రీకృష్ణ స్తుతి.

**నాగ పత్న్య ఊచుః**

శ్లో॥ "న్యాయ్యోహి దండః కృత కిల్బిషేఽస్మిన్
తవావతారః ఖల నిగ్రహాయ ।
రిపోస్సుతానామపి తుల్య దృష్టే
ర్ధత్సే దమం ధర్మ మే వానుశం సన్ ॥ (33)

**నాగ పత్ను లిట్లనిరి**

తా॥ అపరాధమొనరించిన యీతనికి శిక్షవిధించుట న్యాయ యుక్తమే, దుష్ట శిక్షణ కొఱకే నీ ఈ అవతారము! శత్రువు కొడుకులను కూడా సమదృష్టి తోడనే – వారు శిష్టులైనచో రక్షింతువు, దండన కూడా ధర్మమే అని ఆలోచించుచు దుష్టులను దండించెదవు. (33)

**టీ॥** – ప్రథమం తావత్కుపితం భగవంతం. దండానుమోదనేనో పశమయంత్యః. స్తువంతి తత్ర. శ్లో. దండాను మోదనం షడ్భిః దశభిశ్చ హరేస్తుతిః, ప్రార్థనాపంచభిశ్శ్లోకైస్తతః పన్నగ యోషితాం. శ్రీధరీ యోఽయం శ్లోకః. న్యాయ్య ఇతి. న చ నిగ్రహాను గ్రహలక్షణం వైషమ్య మిత్యాహుః ధత్సఇతి. ఫలం అనుశంసన్.ఆలోచయన్. (33)

**టీ॥** మొదట, అంతవఱకును కోపముతోనున్న భగవానుని, శిక్షను ఆమోదించుచు, వశముచేసికొనుచు స్తోత్రము చేయుచున్నారు. ఈ సందర్భమున "ఆఱు శ్లోకములచే శిక్షను ఆమోదించుట, పది శ్లోకముల చేత కృష్ణుని స్తుతించుట, ఆ పిదప ఐదు శ్లోకములచేత నాగస్త్రీల ప్రార్థన". (ఇది శ్రీధరీయ శ్లోకభావము శిక్షించుట, రక్షించుట అనువాని లక్షణము అసమానముకాదు (సమానమే) అని చెప్పుచున్నారు.) 'పోషింతువు' అను శబ్దముచేత – ఫలం అనుశంసన్–ఆలోచించుచు (33)

**శ్లో॥** అనుగ్రహోఽయం భవతా కృతోహినో
దండోసతాం తే ఖలు కల్మషాపహః ।
యద్దందశూకత్వమముష్య దేహినః
క్రోధోఽపి తేఽనుగ్రహ ఏవ సమ్మతః ॥ (34)

**తా॥** ఈ కాళీయ దండనము నీవు మా యందు చేసిన అనుగ్రహమే, నీవు చేసెడు దుష్టశిక్షణము అనునది వారి పాపమును బాపునదే కదా! ఈ వ్యక్తికి సర్పత్వము వచ్చుట పాప ఫలమే. కావున నీ కోపము కూడ అనుగ్రహముతో సమానమే, కావున అంగీకార్యమే. (34)

**టీ॥** నిగ్రహోఽస్యానుగ్రహాయేత్యక్తం పూర్వం. ఇదానీమనుగ్రహ ఏవాయం. న నిగ్రహ ఇత్యాహుః అనుగ్రహ ఇతి నోఽస్మాకం యస్మాదస్య సర్పత్వం దృశ్యతే. అతస్తన్మూలపాపనివర్తకో దండః. అనుగ్రహ ఏవ. క్రోధత్వేన ప్రతీయమానోఽపీత్యర్థః. (34)

**టీ॥** దండించుట కూడ ఇతని అనుగ్రహమే అని ముందు చెప్పడినది. ఇక ఇప్పుడు ఇది అనుగ్రహమే– నిగ్రహము కాదు అని చెప్పుచున్నారు. నః–మాకు ఇతని (కాళీయుని) సర్పత్వము కనబడు చున్నందువలన అతని మూల పాపమును నివర్తింపజేయునదే ఈ దండము (శిక్ష) అనుగ్రహమే. క్రోధత్వము వ్యక్తమగుచున్నను కూడ అని అర్థము. (34)

**శ్లో॥** తపస్సు తప్తం కిమనేన పూర్వం
నిరస్తమానేన చ మానదేన ।
ధర్మో ఽథవా సర్వజనానుకంపయా
యతో భవాం స్తుష్యతి సర్వజీవః ॥ (35)

**టీ॥** – మహాంశ్చాయమనుగ్రహ ఇతి తస్య పూర్వపుణ్యమభినందతి. –తప ఇతి. స్వయం మానరహితేన అన్యేభ్యోమానదేన చ. సర్వం జీవయతీతి సర్వజీవః. (35)

**శ్లో॥** కస్యానుభావో ఽస్య నదేవ విద్మ
హే తవాంఘ్రేరేణుస్పర్శాధికారః ।
యద్వాంఛయా శ్రీలలనా చరత్తపో
విహాయ కామాన్ సుచిరం ధృతవ్రతాః ॥ (36)

**టీ॥** న తప ఆదినిమిత్తక ఏష భాగ్యోదయః కింత్వచింత్యం తవ కృపావైభవమిత్యాహుః. శ్లోకత్రయేణ. కస్యేతి. తపఆదినా బ్రహ్మాదయో ఽపి యస్యాః శ్రియః ప్రసాదమిచ్ఛంతి. సా శ్రీర్లలనాపి. శ్రీరేవలలనా ఉత్తమా స్త్రీ యస్య త్వదంఘ్రి స్పర్శాధికారస్య. వాంఛయా. స్పర్శాధికార

**తా॥** ఇతరులకు ఉత్కర్షనిచ్చు వాడైనను స్వయముగ తాను చిత్తౌన్నత్యములేని వాడగు ఈ కాళీయుడు పూర్వకాలమున ఏ గొప్ప తపస్సు చేసియుండెనో? లేక ఏ గొప్ప ధర్మమాచరించి యుండెనో? లేనిచో సర్వ జీవులననుగ్రహించుచు సర్వులను జీవింప జేయు నీవు ఎట్లు సంతోషించెదవు? (శిక్షించుట ద్వారా అనుగ్రహించుటకు) (35)

**టీ॥** తనకు స్వయముగ ఆత్మగౌరవము లేకున్నను ఇతరులకు ఉత్కర్షనిచ్చు ఈతని చేత (ఏ తపస్సుచేయబడి యుండెనో) సర్వమును జీవింపజేయువాడు సర్వజీవః. (35)

**తా॥** దేవా! నీ పాదరేణువులను తాకెడు నధికారము ఇతనికి ఏ సాధన యొక్క ఫలము వలన కలిగినదో తెలియజాలకున్నాము. లక్ష్మీదేవి, తన కోరికనలన్నియు విడిచి, చిరకాలము దీక్ష వహించి, ఏ అభీష్టమును సిద్ధింపజేసికొనుటకై తపస్సు చేసినదో కదా! (36)

**టీ॥** ఈ భాగ్యము కలుగుట తపస్సు మొదలగువాని కారణముల వలన కాదు. కాని నీ కృపా వైభవమునకు కారణము ఊహింపరానిది అని మూడు శ్లోకములతో చెప్పుచున్నారు. తపస్సు మున్నగ వానిచేత బ్రహ్మ మొదలగు వారు కూడా ఏ లక్ష్మీదేవి యొక్క అనుగ్రహమును

ఇత్యత్ర ఛందోభంగ ఆర్షః. తప ఆచరత్. అస్య సర్పస్య. కిం కృతమితి కో వేత్తీత్యర్థః. (36)

కోరుదురో అట్టి లక్ష్మీదేవి కూడా శ్రీయే స్త్రీ - ఉత్తమస్త్రీ- ఏనీ పాదములను స్పృశించు నధికారము యొక్క కోరికతో - స్పర్శాధికారః అనుచోట ఛందోభంగము ఆర్షము. తపస్సు చేసెననగా ఈ సర్పము యొక్క ఏ ఫలము వలన అనునది ఎవరు తెలిసికొన గల్గుదురు? అని యర్థము (36)

**శ్లో॥** న నాక పృష్ఠం న చ సార్వభౌమం
న పారమేష్ఠ్యం న రసాధి పత్యమ్ ।
న యోగసిద్ధీ ర్నపునర్భవం వా
వాంఛంతి యత్పాదరజః ప్రపన్నాః ॥ (37)

**తా॥** ఏ నీ పాద ధూళి రేణువులు కలవో వానిని పొందిన వారు, సమగ్ర స్వర్గానుభవమునుగాని, (ఇంద్ర పదవినిగాని) చక్రవర్తిత్వమును గాని, చతుర్ముఖ బ్రహ్మ పదవిని గాని, రసాతలాధిపతిత్వమునుగాని, (రసశబ్దమునకు అనేకార్థములున్నవి. వాని ఆధిపతిత్వముగాని), యోగసిద్ధి గాని, పునరావృత్తి రాహిత్యముగాని (పునర్జన్మలేకుండటగాని) అభిలషింపరు. (వానిని తుచ్ఛములని భావింతురు). (37)

**టీ॥** నేతి. యత్తవ పాదరజః. ప్రపన్నాః ప్రాప్తాః పారమేష్ఠ్యాదీనపి. తుచ్ఛం మన్యంతే. (37)

**టీ॥** ఏ నీ పాదధూళికణములు గలవో - ప్రపన్నాః-వానిని పొందిన వారు, బ్రహ్మలోకాధిపత్యమును కూడా శూన్యప్రాయమని తలంతురు. (37)

**శ్లో॥** తదేష నాథాప దురాప మన్యై
స్తమో జనిః క్రోధవశోఽప్యహీశః ।
సంసార చక్రే భ్రమతః శరీరణో
యదిచ్ఛతస్స్యా ద్విభవస్సమక్షః ॥ (38)

**టీ॥ –** తదితి. అహో తదేష అయత్నత ఏవ ప్రాప. అన్యైః బ్రహ్మాదిభిరపి. పునః కథం భూతం పాదరజః యదిచ్ఛతః సేవ్యం మే భవత్వితి ప్రార్థయత ఏవ. సమక్షం ప్రత్యక్షత ఏవ. విభవః అపేక్షితా సంపద్భవతి. (38)

**తా॥** తమో గుణ ప్రధానముగ జన్మించినవాడును, మిక్కిలి కోపము గలవాడైనను ఈ సర్పరాజుగు కాళీయుడు, ఇతరులకు దుర్లభమైన నీ పాదరజమును పొందగల్గెను. దేవా! సంసార చక్రము నందు తిరుగుచున్న జీవునకు ఇట్టి మహాభాగ్యము తన ఎదుటనే యున్నది సుమా! (38)

**టీ॥** అహో! దానిని (పాదరజమును)ఇతడు(కాళీయుడు) అప్రయత్నము గనే పొందెను. అన్యైః (బ్రహ్మ మొదలగువారి చేత పొందబడజాలనిది) మఱల ఆ పాదరజమెట్టిది? ఏది సేవింపదగినదో అది నాకు లభించుగాక యని కోరి ప్రార్థించిన వానికి ఎదురుగనే ప్రత్యక్షమగును భాగ్యమును అపేక్షించువానిచే సంపద పొందబడును. (38)

**శ్లో॥** నమస్తుభ్యం భగవతే పురుషాయ మహాత్మనే ।
భూతావాసాయ భూతాయ పరాయ పరమాత్మనే ॥ (39)

**టీ॥** నమ ఇతి. భగవతే అంచిత్యైశ్వర్యాది గుణాయ. కించ. పరమాత్మనే తదుపాదానాయ ఏతాని దశభిశ్శ్లోకైర్విశేషణాని. పురుషాయ పూర్ష్ణ అంతర్యామిరూపేణ వర్తమానాయ. మహాత్మనే

**తా॥** భగవానుడవు, పురుషుడవు, మహాత్ముడవు, పంచ భూతములకు ఆశ్రయమైనవాడవు, భూతస్వరూపుడవు, సమస్తమునకు కారణమైన వాడవు, పరమాత్ముడవును అయిన నీకు నమస్కారము.(39)

**టీ॥** భగవతే–ఆలోచన కందని ఐశ్వర్యము మొదలగు గుణములు కలవాని కొఱకు, మరియు–పరమాత్మనే–వాని వస్తుత్వ కారణమైన వాని కొఱకు– ఇవి పది శ్లోకములతో విశేషణములు పురుషాయ –

ఏవమప్యపరిచ్ఛిన్నాయ కుతః భూతావాసాయ ఆకాశాద్యాశ్రయాయ. తదపి కుతః? భూతాయ పూర్వమపి స తే కుతః? పరాయ కారణాయ. కించ. పరమాత్మనే కారణాతీతాయేతి వా. (39)

శరీరములందు అంతర్యామి రూపముననున్న వాని కొఱకు - మహాత్మనే - ఇట్లైనను పరిచ్ఛిన్నత లేని వాని కొఱకు, ఎందువలన? భూతా వాసాయ - ఆకాశము మొదలగు వానికి ఆశ్రయమైన వాని కొరకు - అదియును ఎందువలన? భూతాయ- పూర్వమే ఉన్నవాని కొఱకు, ఎందువలన?-పరాయ- కారణమైన వాని కొఱకు, మరియు- పరమాత్మనే- కారణమునకు అతీతమైన వానికొఱకు (అనియో) (నమస్కారము) (39)

**శ్లో॥** జ్ఞాన విజ్ఞాన నిధయే బ్రహ్మణే ఽనంత శక్తయే ।
అగుణాయా వికారాయ నమస్తే ప్రాకృతాయ చ ॥ (40)

**తా॥** జ్ఞప్తికిని, చిచ్ఛక్తికిని స్థానమైన వాని కొఱకును, బృహత్వ బృంహణత్వములు గల వాని కొఱకును, అంతములేని శక్తి స్వరూపుని కొఱకును, ఏ గుణ సంబంధములేని శుద్ధుని కొఱకును, పరిణామ రహితుని కొఱకును, ప్రకృతిని ప్రవర్తింపచేయు వాని కొఱకును, ప్రకృతి సంబంధము లేని వాని కొఱకును నమస్కారము, నీకు నమస్కారము. (40)

**టీ॥** - కారణత్వం కారణాతీతత్వం చ సమర్థయితుమాహుః - జ్ఞానేతి. జ్ఞాన విజ్ఞాన నిధయే జ్ఞానం జ్ఞప్తిః. విజ్ఞానం చిచ్ఛక్తిః. తయోర్నిధయే. తాభ్యాం పరిపూర్ణాయ కథం తథా త్వమత ఉక్తం. బ్రహ్మణే. అనంత శక్తయే. బ్రహ్మణే కథం భూతాయ అగుణాయ వికారాయ పునః కథం

**టీ॥** కారణత్వమును, కారణాతీతత్వమును కూడా సమర్థించుచు చెప్పుచున్నారు-జ్ఞాన విజ్ఞాన నిధయే జ్ఞానం-జ్ఞప్తి (అవబోధనము) -విజ్ఞాన-చిచ్ఛక్తి-(జ్ఞేయాపేక్షితమైన జ్ఞానము) - వాని యొక్క నిధయే వాని కొఱకు, ఆ రెండిటి చేత పరిపూర్ణుడైన వాని కొఱకు, ఇంకను

భూతాయ అనంతశక్తయే ప్రాకృతాయ ప్రకృతిప్రవర్తకాయ. యద్వా అప్రాకృతాయ అప్రాకృతానంతశక్తియుక్తాయ అయమర్థః అగుణత్వా దవికారం బ్రహ్మజ్ఞప్తిమాత్రత్వాత్కారణాతీతం ప్రకృతిప్రవర్తకానంతశ క్తివిజ్ఞాననిధిత్వాదీశ్వరః కారణం. తదుభయాత్మనే నమ ఇతి. (40)

ఎట్టి వాని కొఱకు అనంతమైన శక్తిగల వాని కొఱకు ప్రాకృతాయ - ప్రకృతిని ప్రవర్తింపజేయు వాని కొఱకు లేక అప్రాకృతాయ ప్రకృతి సంబంధము లేని, అనంతమైన శక్తి గలవాని కొఱకు,- దీని అర్థమేమన - గుణ సంసర్గము లేనందు వలన అవికారిత్వము గలది బ్రహ్మము. జ్ఞప్తి మాత్రత్వముచేత కారణాతీతత్వము-ప్రకృతిని ప్రవర్తింపజేయుట, అనంతమైనశక్తి కలిగి యుండుట, విజ్ఞాన నిధిత్వము వలన కారణ రూపమైన ఈశ్వరుడు-ఆ రెండు రూపముల వాని కొఱకు నమస్కారము అని. (40)

**శ్లో॥** కాలాయ కాలనాభాయ కాలావయవ సాక్షిణే ।
విశ్వాయ తదుపద్రష్ట్రే తత్కర్త్రే విశ్వ హేతవే ॥ (41)

**తా॥** కాలస్వరూపుని కొఱకు, కాలమునకు ఆశ్రయమైన వాని కొఱకు, కాలము యొక్క అవయవములగు సృష్టి, స్థితి, లయముల సమయములకు సాక్షియైన వాని కొఱకు, విశ్వస్వరూపుని కొఱకు, విశ్వమును పర్యవేక్షించువాని కొఱకు, విశ్వకర్తకు, విశ్వమునకు కారణమైన వాని కొఱకును (నమస్కారము) (41)

**టీ॥** - అనంతశక్తిత్వాత్కాలశక్త్యా విశ్వస్రష్టృత్వాదిరూపేణ నమస్యంతి. కాలాయేతి. కాలాయ కాలస్వరూపాయ. కాలనాభాయ కాలశక్త్యాశ్రయాయ. కాలావయవానాం సృష్ట్యాదిసమయానాం సాక్షిణే తతశ్చ విశ్వాయ విశ్వస్వరూపాయ తర్హి కిం జడోఽహం. న హి

**టీ॥** అనంత శక్తిత్వము వలన కాలశక్తి చేత, విశ్వమును సృష్టించుట మున్నగు వాని రూపముచే నమస్కరించుచున్నారు. కాలాయ - కాలస్వరూపునకు, కాలనాభాయ. కాలశక్తికి ఆశ్రయమైన వానికి - కాలావయవానాం- సృష్టి మొదలగు వాని సమయములకు, సాక్షియైన

తదుపద్రష్ట్రే. న ద్రష్టృ మాత్రాయ. కింతు తత్కర్త్రే న చ కర్తృమాత్రాయ. విశ్వహేతవే సర్వ కారణరూపాయ. (41)

వానికి - అచటి నుండి విశ్వరూపునకు- అయినచో నేమి? నేను జడుడనా కాదు-దాని పర్యవేక్షకునకు, కేవలము పర్య వేక్షకమాత్రునకే కాదు కాని దాని కర్తకు కూడా - కేవలము కర్తయైన వానికే కాదు. విశ్వహేతవే-సమస్తమునకు కారణమైన వానికి-(నమస్కారము) (41)

**శ్లో॥** భూత మాత్రేంద్రియ ప్రాణమనో బుద్ధ్యాశయాత్మనే ।
త్రిగుణేనాభి మానేన గూఢ స్వాత్మానుభూతయే ॥ (42)

**తా॥** పృథివ్యాది భూతములు, తద్వికారములు, ప్రాణము, మనస్సు, బుద్ధి, చిత్తము తానేయైన వానికిని, సత్త్వాది గుణ త్రయమునందలి అభిమానముచేత, వివిధములైన ఉపాధులలోని ప్రత్యగాత్మ రూపమును తానే యనెడి అనుభూతి గల వాని కొఱకును (నమస్కారము) (42)

**టీ॥** - తదేవాహుః భూతేతి. ఆశయశ్చిత్తం భూతాదిరూపాయ. అతః సర్వకారణరూపాయేతి. అహంకారాత్మతయా నమస్యంతి. త్రిగుణేనేతి. ఏవం సృష్టికార్యే యస్త్రిగుణోఽభిమానః తేన గూఢానాం స్వాంశ భూతానామాత్మనామనుభూతిర్యేన తస్మై. (42)

**టీ॥** అదియే చెప్పుచున్నారు, ఆశయః - చిత్తము భూతములు మొదలగువాని స్వరూపమైన వానికిని - అందువలన సర్వకారణ రూపునికి - జీవ తత్త్వముతో నమస్కరించుచున్నారు. ఈ విధముగ సృష్టి కార్యమున, సత్త్వ రజస్తమస్సులనెడి మూడు గుణముల యందే యభిమానము గలదో, దాని చేత, రహస్యముగ నుండెడు తన అంశములుగా నున్న (వేర్వేరుగ కన్పట్టుచున్న) ఆత్మల యొక్క అనుభూతి ఎవని చేత పొందబడునో అట్టి వానికి (నమస్కారము) (తానొక్కడే వివిధములుగ ప్రతీతమగునని భావము) (42)

**శ్లో॥** నమోఽనంతాయ సూక్ష్మాయ కూటస్థాయ విపశ్చితే ।
నానా వాదానురోధాయ వాచ్య వాచక శక్తయే ॥ (43)

**టీ॥ –** త్వం తు అహంకారానావృత ఇతి స్తువంతి. నమ ఇతి. అనంతాయ అహంకారాపరిచ్ఛేదాత్. అతః సూక్ష్మాయ. అదృశ్యత్వాత్, అత ఏవ కూటస్థాయ ఉపాధికృతవికారాభావాత్. అత ఏవ విపశ్చితే సర్వజ్ఞాయ. ఏవం స్తుత్వా అచింత్యమాయత్వేన స్తువంతి. నానా వాదానురోధాయ. అస్తి. నాస్తి. సర్వజ్ఞః. కించిజ్ఞః బద్ధః. ముక్తః. ఏకః . అనేకః. ఇత్యాదీన్ నానానువాదాన్ అనురుణద్ధి మాయయానువర్తతే యస్తస్మై కించ. వాచ్య వాచక శక్తయే అభిధానాభిధేయ శ క్తి భేదాదపి నానాత్వేన ప్రతీయమానాయేత్యర్థః. (43)

**తా॥** అంతములేని వానికి, సూక్ష్మరూపునకు, కూటము (దిమ్మె) వలె స్థిరమై యుండు వానికి, మాయ యందు ఉన్నవానికి, వివిధములగు పరస్పర విరుద్ధ వాదములకు అనుకూలమై యుండు వానికి, అభిధాన (శబ్ద) అభిధేయ (అర్థ) శక్తి స్వరూపునకు నమస్కారము. (43)

**టీ॥ –** నీవు అహంకారములను ఆవరించి యున్నవాడవు అని స్తోత్రము చేయుచున్నారు 'నమః' అని, అనంతాయ – అహంకారము అపరిచ్ఛిన్నమగుటచే– అందువలన సూక్ష్మమైన వానికి, కనబడక పోవుట వలన – అందుకే కూటస్థునికి. ఉపాధికృతమైన వికారములు ఉండకపోవుటచే–అందువలననే విపశ్చితే– సర్వమును తెలిసినవానికి– ఇట్లు స్తుతించి ఆలోచించుటకు శక్యముకాని అతని మాయా లక్షణము లను స్తుతించుచున్నారు. నానా వాదానురోధాయ– ఉన్నాడు – లేడు – అన్నియు తెలిసిన వాడు, అల్పజ్ఞుడు – బద్ధుడు– ముక్తుడు – ఒక్కడు, అనేకుడు – ఇట్లు మొదలుకొని అనేక విధములైన వాదములను అనురుణద్ధి– మాయతో అనువర్తించుచున్న వాడెవడో అతనికి మరియు వాచ్య వాచక శక్తయే – అభిధాన అభిధేయ (శబ్దార్థముల) శక్తి భేదము వలన కూడా వివిధత్వముతో ప్రతీయమానమగుచున్న వానికి (వ్యక్తమగుచున్న వానికి) అని యర్థము. (43)

**శ్లో॥** నమః ప్రమాణ మూలాయ కవయే శాస్త్రయోనయే ।
ప్రవృత్తాయ నివృత్తాయ నిగమాయ నమో నమః ॥ (44)

**తా॥** ప్రత్యక్షాది ప్రమాణములకు మూలమైన వానికి, ప్రమాణ నిరపేక్షముగ సర్వము తెలియువానికి, వేదములకు పుట్టుక (మూల) స్థానమైన వానికి, క్రియాపరత్వము, నిష్క్రియాపరత్వము గలవానికి, వేదాత్మునకును నమస్కారము. నమస్కారము, నమస్కారము. (నమస్కార బహుళ్యము భక్త్యతిశయ సూచకము). (44)

**టీ॥** అనావృతత్వమేవ హేత్వంతరేణాపి సూచయంత్యః స్తువంతి - నమ ఇతి. ప్రమాణమూలాయ చక్షురాదీనాం చక్షురాదిరూపాయ. అతఏవ కవయే స్వయం తన్నిరపేక్షజ్ఞానాయ కుతః? శాస్త్రయోనయే వేదాత్మక నిశ్వాసాయ. (44)

**టీ॥** ఈశ్వరుని అనావృతత్వమునే ఇతర కారణములచేత కూడా సూచించుచు స్తుతించుచున్నారు. ప్రమాణ మూలాయ - కన్నులు మొదలైన వానికి, కన్నులు మొదలగు వాని రూపమునున్న వానికి -అందువలననే కవయే-స్వయముగ వాని (కన్నుల) అపేక్ష లేని జ్ఞానము కలవానికి-ఎందులకు? శాస్త్రయోనయే - వేదములను నిశ్వసించిన వానికి (వేదములకు జన్మస్థానమైనవాడు)-(నమస్కారము) (44)

**శ్లో॥** నమః కృష్ణాయ రామాయ వసుదేవ సుతాయ చ ।
ప్రద్యుమ్నాయానిరుద్ధాయ సాత్త్వతాం పతయే నమః ॥ (45)

**తా॥** కృష్ణునకు, రామునకు , వసుదేవుని కుమారుడవగు వాసుదేవునకు, ప్రద్యుమ్నునకు, అనిరుద్ధునకు, యాదవులకు స్వామివి యగు నీకు నమస్కారము. (ఆగమోక్తమైన చతుర్మూర్తివ్యూహమిందు సూచింపబడినది. (45)

**టీ॥** కించ. అనావృతైశ్వర్యత్వాదేవ చతుర్మూర్తిస్వరూపేణ సర్వోపాస్యత్వేన నమంతి. నమః కృష్ణాయేతి. రామాయ సంకర్షణాయ. వసుదేవ సుతాయ వసుదేవ శబ్దితం శుద్ధం సత్త్వం తత్ర ప్రకాశమానాయ వాసుదేవాయేత్యర్థః. సాత్త్వతాముపాసకానాం. పతయే సాలోక్యాదినా పాలకాయ. ఏవం చతుర్మూర్తయే కృష్ణాయ తుభ్యం నమ ఇతి.(45)

**టీ॥** మరియు ఐశ్వర్యత్వాద్యనావృత్త్వముచేతనే, చతుర్మూర్తి (సంరక్షణాది) స్వరూపముచేత అందరికి ఉపాసింపదగిన లక్షణముతో నమస్కరించుచున్నారు 'నమః కృష్ణాయ' అని.– రామాయ – సంకర్షణునకు – వసుదేవ సుతాయ– వసుదేవ శబ్దముతో చెప్పబడినది శుద్ధ సత్త్వము. అందు ప్రకాశించుచున్న వానికి–వాసుదేవునకు అనియర్థము–సాత్త్వతాం– ఉపాసకులకు–పతయే– సాలోక్యము మొదలగు మోక్ష స్థితుల చేత పాలించువానికి. ఈ విధముగ నాలుగు స్వరూపముల కృష్ణునకు నీకు నమస్కారము. అని (సంకర్షణ– వాసుదేవ– ప్రద్యుమ్న– అనిరుద్ధ–ఇవి చతుర్మూర్తులు) (45)

**శ్లో॥** నమో గుణ ప్రదీపాయ గుణాత్మచ్ఛాదనాయ చ ।
గుణవత్త్యుప లక్ష్యాయ గుణ ద్రష్ట్రే స్వసం విదే ॥ (46)

**తా॥** అంతఃకరణములను ప్రకాశింపజేయు వాని కొఱకు, ఉపాసకుల అంతఃకరణముల చేతనే తనను తాను గుప్త పరచుకొని యుండు వాని కొఱకును, చిత్తము మొదలగు వానియొక్క వృత్తుల చేత మాత్రమే చూడబడదగిన వాని కొఱకు, గుణములకు సాక్షియైన వాని కొఱకు, తనను తాను మాత్రమే తెలియువాని కొఱకు (అగోచరుడగు వాని కొఱకు) నమస్కారము. (46)

**టీ॥ –** కథం చతుర్మూర్తితేతి తదాహుః. నమో గుణప్రదీపాయేతి. గుణాః అంతఃకరణాని. తాన్ ప్రదీపయతి ప్రకాశయతీతి తథా తస్మై.

**టీ॥** చతుర్మూర్తిత్వమెట్లో దానిని చెప్పుచున్నారు ' నమో గుణ ప్రదీపాయ' అని –గుణాః –అతఃకరణములు, వానిని ప్రకాశింపజేయు

చిత్తాద్యధిష్ఠాతృత్వేన చతుర్మూర్తితేతి భావః. నను తథాప్యేకస్యైవ కథం చతుష్ట్వమత ఆహుః. గుణాత్మచ్ఛాదనాయ చ. తైరేవ గుణైరుపాసకానాం ఫలవైచిత్ర్యాయ ఆత్మానమాచ్ఛాద్య నానాత్వేన ప్రకాశమానాయేత్యర్థః నను కథం తర్హి ప్రతీతిరత ఉక్తం. గుణవృత్త్యు పలక్ష్యాయ చిత్తాదీనాం చేతనాధ్యవసాయాదివృత్తిభిరుపలక్ష్యాయ. ఉపలక్షణమేవాహుః. గుణ ద్రష్ట్రే తత్సాక్షిణే కథంచిదుపలక్ష్య ఏవ న జ్ఞేయ ఇత్యాహుః. స్వసంవిదే అగోచరాయేత్యర్థః. (46)

వానికి –చిత్తాదుల అధిష్టాతృత్వము చేత చతుర్మూర్తిత్వము అని భావముల. ఐనను ఒక్కడే యైన వానికి నాలుగు అను లక్షణ మెట్లు? అది చెప్పుచున్నారు. గుణాత్మచ్ఛాదనాయ చ – ఆ అంతఃకరణముల చేతనే ఉపాసకులకు వివిధ ఫలమును స్ఫురింపజేయు వాని కొఱకు, తనను తాను కప్పి ఉంచి అనేకత్వముతో ప్రకాశించుచున్న వాని కొఱకు అని అర్థము మరి అట్లయినచో ప్రతీతి ఎట్లు? (ఎట్లు వ్యక్తమగును?) అది చెప్పబడుచున్నది. గుణ వృత్త్యుపలక్ష్యాయ– చిత్తము మొదలగు వాని తెలివిడి పూనిక, ఉత్సాహము మొదలగు వాని వర్తనముల చేత చూడబడు వాని కొఱకు – ఊహించుట గూర్చియే చెప్పుచున్నారు గుణద్రష్ట్రే – వాని సాక్షియైన వాని కొఱకు ఏ విధముగనైనను, ఊహింపదగిన వాడే కాని, తెలియ దగినవాడు కాదని చెప్పుచున్నారు. స్వ సం విదే – ఇంద్రియములకు తెలియరాని వాడు అని యర్థము. (46)

**శ్లో॥** అవ్యాకృత విహారాయ సర్వవ్యాకృత సిద్ధయే ।
హృషీకేశ నమస్తేఽ స్తు మునయే మౌనశీలినే ॥ (47)

**తా॥** తర్కించుటకు శక్యముకాని మహిమగల వానికి, సర్వ కార్య ప్రపంచము యొక్క పుట్టుకకు దాని ప్రకాశమునకును, కారణత్వము చేత ఊహింపదగిన వానికి, ఇంద్రియములకు ప్రభువైన వానికిని, ఆత్మారామునకు, ఆత్మారామ స్వభావము గలవానికిని నమస్కారమగు గాక. (47)

**టీ॥** అగోచరత్వముపలక్ష్యత్వం. దర్శయంత్యో నమస్యంతి. అవ్యాకృతేతి. అవ్యాకృత విహారాయ అతర్క్య మహిమ్న ఇత్యర్థః. సర్వవ్యాకృతసిద్ధయే సర్వకార్యోత్పత్తి ప్రకాశ హేతుత్వేనోపలక్షణయోగ్యా యేత్యర్థః. ఉపలక్షణాంతరమాహుః. హృషీకేశ. కరణప్రవర్తక. కిం విషయలిప్సయా న. మునయే ఆత్మారామాయ కిం సాధన వశేన న హి న హి. మౌనిమాత్మారామతా తత్స్వభావాయ.(47)

**టీ॥** – అగోచరత్వము, ఊహద్వారా మాత్రమే చూడబడు లక్షణమును చూపుచు నమస్కరించుచున్నారు. అవ్యాకృత విహారాయ– అతర్క్యమైన మహిమ గలవానికి అని యర్థము– సర్వవ్యాకృత సిద్ధయే – సమస్తమైన కార్యములయొక్క పుట్టుకకును, అట్టి వాని ప్రకాశమునకు, కారణత్వము చేత ఊహించుటకు మాత్రమే తగినవాడు– అట్టి వానికి అని యర్థము. మరియొక ఉపలక్షణమున (ఊహదర్శన లక్షణమును) చెప్పుచున్నారు– 'హృషీకేశ' అని– కరణములను ప్రవర్తింపజేయువాడు అట్టి వానికి – విషయములందలి కోరిక చేతనా? కాదు. మునయే – ఆత్మారామునకు – సాధన వశముననా? కాదు. కాదు – మౌనశీలినే – మౌనము ఆత్మారామత్వము. అట్టి స్వభావము గల వానికి (47)

**శ్లో॥** పరాపర గతి జ్ఞాయ సర్వాధ్యక్షాయ తే నమః ।
అవిశ్వాయ చ విశ్వాయ తద్ద్రష్ట్రే ఽస్య చ హేతవే ॥ (48)

**తా॥** 'సూక్ష్మ స్థూల పదార్థముల స్థితి గతుల నెఱింగి యున్నవాడవు, వానికి ద్రష్టవు, స్వయముగ వానికి నీవే కారణుడవు, విశ్వమును నిషేధించు వాడవు.'' అంతవఱకు విశ్వ పదార్థజాతమునకు అధిష్టానమవు సకలమునకు అధిష్ఠాతవు, 'సాక్షివి' కారణరూపుడవు అయిన నీకు నమస్కారము. (48)

**టీ॥** పరాపరేతి. కుతః పరాపరగతిజ్ఞాయ స్థూలసూక్ష్మాణాం గతిజ్ఞత్వేన న క్వాపి సజ్జమానాయేత్యర్థః. సర్వాధ్యక్షాయ సర్వస్యాధిష్ఠాత్రే.

**టీ॥** – పరాపరగతిజ్ఞాయ అనునది యెందులకు? స్థూల సూక్ష్మ పదార్థముల గమనమును తెలియుటచేత దేనితోడను లిప్తుడు కాని

కుత ఏతత్. అవిశ్వాయ. న విశ్వం యస్మిన్. తన్నిషేధా వధయే విశ్వాయ చ తద్వివరాధిష్ఠానాయేత్యర్థః. తద్ద్రష్ట్రే అధ్యాసాపవాదసాక్షిణే అపి చ. అస్య చ విశ్వాధ్యాసస్య. తదపవాదస్య చ విద్యావిద్యాభ్యాం హేతవే యద్వా. అవిశ్వాయ విశ్వతైజ సాద్యవస్థారహితాయ విశ్వాయ మాయయా స్వాంశైస్తత్తదవస్థాయ తద్ద్రష్ట్రే. తాసామవస్థానాం భావాభావసాక్షిణే. అన్యత్సమానం. తస్మాత్సర్వజ్ఞ త్వ సర్వాధిష్ఠాతృత్వా త్మారామత్వాదిభిర్నిరతిశయైశ్వర్యాయ తుభ్యం నమ ఇతి. శ్లో. "విశేషణై రసంకీర్ణైః పంచపంచాశతానుతః, అహి స్త్రీభిః ప్రసన్నో యస్తాసామేవ భవేద్ధరిః." శ్రీధరీయోఽయం శ్లోకః." (48)

వానికి అని యర్థము.- సర్వాధ్యక్షాయ- సకలమునకు అధిష్ఠాతయైన వానికి, ఇది యెందులకు? అవిశ్వాయ- ఎవని యందు విశ్వములేదో- దానిని నిషేధించు వరకు- విశ్వాయ - విశ్వముయొక్క వివరమును (రంధ్రమును- ఎడమును) అధిష్ఠించి యున్నవానికి అని యర్థము, తద్ద్రష్ట్రే- అధ్యాస, అపవాదముల సాక్షిగ నుండి వాని కొఱకు కూడ- (అధ్యాస ఒక ధర్మమును మరియొక దాని యందు ఆరోపించుట- భ్రమ - అపవాదమనగా ఆ భ్రమను తిరస్కరించి వాస్తవమును గుర్తించుట). ఈ విశ్వాధ్యాస యొక్కయు, దాని అపవాదము యొక్కయు, విద్య, అవిద్యల యొక్క కారణమైన వానికి- లేక-అవిశ్వాయ-విశ్వ, తైజస మొదలగు అవస్థలు లేని వానికి -విశ్వాయ- మాయచేత- తన అంశల చేత ఆయా అవస్థలను పొంది యుండు వానికి- తద్ద్రష్ట్రే- ఆ అవస్థల ఉనికి లేములకు సాక్షిగ నుండు వానికి- తక్కినదంతయు సమానము.- అందు వలన సర్వజ్ఞత్వము, సర్వాధిష్ఠాతృత్వము స్వాత్మారామత్వము మున్నగువానిచేత, అతిశయమైన ఐశ్వర్యము గలవానికి, నీకు నమస్కారము. అని, ఏబదియైదుగురు నాగస్త్రీల చేత, ఒకదానితో ఒకటి మిళితము కాని విశేషణములతో స్తోత్రము చేయబడిన శ్రీ కృష్ణుడు, ఆ నాగాంగనల యెడ ప్రసన్నుడైనట్లు మీ యెడ కూడ ప్రసన్నుడగుగాక - ఇది శ్రీధరీయశ్లోక భావము. (48)

**శ్లో॥** త్వం హ్యస్య జన్మస్థితి సంయమాన్ విభో
గుణైరనీహో కృత కాల శక్తిధృత్ ।
తత్తత్స్వభావాన్ ప్రతిబోధయన్ సత
స్సమీక్షయామోఘ విహార ఈహసే ॥ (49)

**టీ॥** ఏవం తావద్దండానువోదన నమస్కారైశ్చ భగవంతం ప్రసాద్యేదానీం త్వదధీనప్రాణినాం కోఽపరాధ ఇత్యాశయవంత్యః ప్రార్థయంతే– త్వం హీతి. అస్య లోకస్య. జన్మాదీన్ త్వమేవ అకృత అకరోః. తతశ్చ తాన్ తాన్ సంస్కారూపేణ సతః స్వభావాన్. ఘోరత్వాదీన్. ప్రబోధయన్ ఈహసి క్రీడసే. యద్వా అస్య జన్మాదీన్ త్వమేవమీహస ఇత్యన్వయః. కథంభూతః అకృతా అనాదిర్యా కాలశక్తిః , తాంధారయతీతి తథా, అన్యత్సమానం. (49)

**తా॥** ప్రభూ! ఈ లోకము యొక్క పుట్టుకను, ఉనికిని, వినాశమును నీవు, అసంకల్పితముగనే, కాలశక్తిని ధరించి, ప్రకృతి గుణములతో చేసితివి. సత్ అసత్తుల ఆ యా స్వభావములను లెస్సగ పరిశీలించి తెలిసికొనుచు, వ్యర్థముకాని విహరణము గలవాడై క్రీడించుచుండెదవు. (49)

**టీ॥** ఇట్లు కాళీయునకు విధించిన శిక్షను ఆవోదించుట, నమస్కారములు చేయుట మున్నగువానితో భగవానుని చల్లబరచి యిప్పుడు నీ శరణమందున్న ప్రాణుల అపరాధమేమిటి? అనెడు ఆశయమున ప్రార్థించుచున్నారు. అస్య – లోకము యొక్క పుట్టుక మొదలగునవి నీవే చేసితివి. అప్పుడు(ను) ఆయా సంస్కార రూపముతో సాధు స్వభావములను (భయంకరములు మొదలగువానిని) నీవే అకృత అకరోః చేసితివి. వానిని తెలపుచు (వ్యక్తము చేయుచు) క్రీడించు చున్నావు లేక – ఈ లోకముయొక్క జన్మ మొదలగు వానిని నీవే సంకల్పించితివి అని అన్వయము. ఎట్టి వాడవై? అకృతా– అనాదియైన ఏ కాలశక్తి గలదో దానిని ధరించును గావున అటుల (అకృత కాలశక్తి ధృత్) తక్కినది సమానము.(49)

**శ్లో॥** తస్యైవ తేఽ మూస్తనవస్త్రిలోక్యాం
శాంతా అశాంతా ఉత మూఢయోనయః ।
శాంతాః ప్రియాస్తే హ్యధునా వితుం సతాం
స్థాతుశ్చ తే ధర్మ పరీప్సయే హతః ॥ (50)

**తా॥** ముల్లోకములలోను గల శాంతులు, అశాంతులు, మూఢులు అను ఈ మూడు విధములైన శరీరములు ఆ కాలశక్తికి సంబంధించిన వియే. సత్వగుణ ప్రధానులైన శాంతులు నీకు ఇష్టమైన వారు, ధర్మమును విస్తరింప గోరియున్న ఈ సాత్త్వికులను ఎప్పుడును రక్షించుటకు ఇష్టపడుచుందువు. (50)

**టీ॥** తస్యేతి. అతః తస్యైవ వామూస్తనవః. తన్యంత ఇతి తనవః క్రీడోపస్కరాః తథాపి. తవాధునా శాంతాః ప్రియాః కుతః సతాం ధర్మపరిపాలనేచ్ఛయా, ఈహతః ప్రవర్తమానస్య. అతస్తానవితుం స్థాతుః స్థితస్య. (50)

**టీ॥** అందువలన ఈ శరీరములు ఆ కాలశక్తి సంబంధములే. విస్తరించును కావున తనువులు నీ లీలలకు సంబారములు అట్లైనను నీ కిప్పుడు శాంతులు ప్రియమైనవారు. ఎందువలన సత్పురుషుల ధర్మపరిపాలన చేయు కోరికతో –ఈహతః–ప్రవర్తించుచున్నవాని యొక్క –అందువలన వారిని కాపాడుటకు– స్థాతుః ఉన్నవాని యొక్క (50)

**శ్లో॥** అపరాధ స్సకృద్భర్త్రా సోఢవ్య స్స్వప్రజాకృతః ।
క్షంతు మర్హసి సర్వాత్మన్ మూఢస్యత్వామజానతః ॥ (51)

**తా॥** సర్వాత్మా! నీ సంతానమేయైన మా భర్తచేత చేయబడిన అపరాధము ఈ ఒక్కసారికి సహించుకొనదగినది. మూఢుడు తెలియక నీ యెడ చేసిన యీ అపచారమును మన్నింపుము. (51)

**టీ॥** ఏవం చ తవాప్రియాచరణాద్యపరాధః తర్హి సోఢవ్య ఇత్యాహుః అపరాధ ఇతి. (51. 52)

**టీ॥** ఇట్లు నీకప్రియము చేయుట మున్నగునది అపరాధమైన యెడల సహించుకొనదగినదని చెప్పుచున్నారు. " అపరాధః" అను ఈ శ్లోకమునందు. (51,52)

**శ్లో॥** అను గృహ్ణీష్వ భగవన్! ప్రాణాంస్త్యక్ష్యతి పన్నగః ।
స్త్రీణాం నస్సాధు శోచ్యానాం పతిః ప్రాణః ప్రదీయతామ్ ॥(52)

**తా॥** భగవాన్! అనుగ్రహింపుము (లేనిచో) కాళీయుడు ప్రాణములు వదలును దుఃఖించుచున్న స్త్రీలమైన మాకు సజీవుడైన భర్తనిచ్చుట లెస్స- సప్రాణుడైన మా భర్త మా కీయబడుగాక.(52)

**శ్లో॥** విధేహి తే కింకరీనా మనుష్ఠేయం తవాజ్ఞయా ।
యచ్ఛ్రద్ధయాను తిష్ఠన్ వై ముచ్యతే సర్వబంధనాత్ ॥ (53)

**తా॥** నీ సేవకురాండ్రకు ఆజ్ఞాపింపుము. ఎట్టి సేవ చేయవలెనో అనుజ్ఞయిమ్ము, ఏలయన నీ చేత అజ్ఞాపింపబడిన సేవను శ్రద్ధతో చేసినవారు బంధములన్నింటి నుండి ముక్తులగుదురు. (53)

**టీ॥** యుష్మదనుగ్రహోఽపి అన్యేషాం మృత్యురేవేతి చేన్నేత్యాహుః . విధేహీతి. త్వదాజ్ఞయా ప్రాణినో నాద్యామేతి భావః. (53-55)

**టీ॥** నీ అనుగ్రహము కూడా కొందఱికి మృత్యు వేయననిచో కాదని చెప్పుచున్నారు. నీ ఆజ్ఞ చేత ప్రాణులు మృత్యువును పొందరని భావము.(53 - 55)

బాదరాయిణి రువాచ

**శ్లో॥** ఇత్థం స నాగపత్నీభిర్భగవాన్ సమభిష్టుతః ।
మూర్ఛితం భగ్నశిరసం విససర్జాంఘ్రి కుట్టనైః ॥ (54)

శ్రీశుకుడిట్లనెను

**తా॥** ఈ విధముగ భగవానుడగు కృష్ణుడు, కాళీయుని భార్యలచే బాగుగా స్తోత్రము చేయబడి కృష్ణుని పాద ఘట్టనలచే తలలు పగిలి మూర్ఛిల్లియున్న కాళీయుని విడిచి పెట్టెను. (54)

**శ్లో॥** ప్రతిలబ్ధేంద్రియ ప్రాణః
కాళీయశ్శనకైర్హరిమ్ ।
కృచ్ఛ్రాత్స్వముచ్ఛ్వసన్
దీనః కృష్ణం ప్రాహ కృతాంజలిః ॥ (55)

**తా॥** ఇంద్రియములు, ప్రాణములు తిరిగి కొంత చైతన్యవంతములైన వాడై, కాళీయుడు నెమ్మదిగ, కష్టముతో శ్వాసను పీల్చుకొనుచు, దీనుడై, అంజలి ఘటించి కృష్ణునితో నిట్లనెను. (55)

కాళీయ ఉవాచ-

**శ్లో॥** వయం ఖలాస్సహోత్పత్యా తామసా దీర్ఘ మన్యవః ।
స్వభావో దుస్త్యజో నాథ భూతానాం యదసద్గ్రహః ॥ (56)

**టీ॥** వయమితి. యదసద్గ్రహ ఇతి. యతః స్వభావః అసద్గ్రహరూపః యద్వా. యతః స్వభావాత్. అసతి దేహాదౌ యో గ్రహః. సదుస్త్యజ ఇతి. (56)

**శ్లో॥** త్వయా సృష్టమిదం సర్వం ధాతర్గుణ విసర్జనమ్ ।
నానా స్వభావ వీర్యౌజో యోని బీజాశయాకృతి ॥ (57)

**టీ॥** త్వయేతి. గుణైర్వివిధతయా. సృజ్యత ఇతి గుణవిసర్జనం తత్రాపి నానాస్వభావాదయో యస్య తత్. (57)

కాళీయుడిట్లనెను

**తా॥** ప్రభూ! మేము పుట్టుకతోడనే దుష్టులము. తామస స్వభావులము. పగబట్టియుండువారము. స్వామీ ఈ స్వభావము విడువబడజాలనిది కదా! అందులకే లోకమున ప్రాణులు దురాగ్రహమున చిక్కుపడి యుందురు. (56)

**టీ॥** స్వభావము ఆసద్రూపముగ పట్టి యుండునది కావున లేక స్వభావము వలన దేహాదులందు అసత్ అనుగ్రహము ఏది పట్టి యుండునో అది విడుచుటకు శక్యముకానిది అని . (56)

**తా॥** ఓ సృష్టి కర్తా! ఈ సమస్తము వివిధములైన గుణములను వదలుచు నీచేత సృజింపబడినది. నానా విధములైన స్వభావములు, వీర్యములు, బలములు, జాతులు, బీజములు, చిత్తములు, ఆకారములు మొదలగు అనేక భేదములచే సృష్టింపబడినది. (57)

**టీ॥** గుణముల యొక్క వివిధత్వముచేత సృష్టించును కావున గుణ విసర్జనం. అదియును అనేక స్వభావములు మొదలగునవి దేనికో అది (సృష్టి) (57)

**శ్లో॥** వయం చ తత్ర భగవన్ సర్వా జాత్యోరుమన్యవః ।
కథం త్యజా మస్త్వన్మాయాం దుస్త్యజాం మోహితాప్తయా ॥(58)

**తా॥** భగవాన్! మేమందఱము పుట్టుకతోనే గొప్ప కోప గొండులము, నీ మాయచేత మోహితులమై యున్న మేము విడుచుటకు సాధ్యము కాని నీ మాయను ఎట్లు విడువగలము? (58)

**టీ॥** వయమితి. జాత్యా జన్మనైవ. ఉరుర్మన్యుర్యేషాంతే. వయం కథం త్యజామః. (58)

**టీ॥** జాత్యా-పుట్టుకతోనే -గొప్ప కోపము ఎవరికి గలదో వారు- మేమెట్లు విడుతుము-? (58)

**శ్లో॥** భవాన్ హి కారణం తత్ర సర్వజ్ఞో జగదీశ్వరః ।
అనుగ్రహం నిగ్రహం వా మన్యసే తద్విధేహినః ॥ (59)

**తా॥** దీనికి నీవే కారణము, నీవు సర్వజ్ఞుడవు, లోకమున కంతటికి ప్రభువైన వాడవు. రక్షణమో శిక్షణమో ఏది సరియైనదని భావింతువో అట్టి దానినే మాకు విధింపుము.(59)

**టీ॥** భవానితి. హి యస్మాత్. తత్ర త్వన్మాయాత్యాగే భవానేవ కారణమిత్యనుగ్రహం విధేహి మమాజ్ఞయా ఖాదతేతి. ఈశ్వరత్వాన్ని గ్రహం వా. విధేహి. (59)

**టీ॥** హి- దేని వలననో- ఇట నీ మాయను విడుచుటతో దానికి నీవే కారణము కావున అనుగ్రహమును విధింపుము. నా ఆజ్ఞతోనే అనుభవింతురని – లేక నీ ఈశ్వరత్వము వలన శిక్షనైనను విధింపుము. (59)

**శ్రీశుక ఉవాచ**

**శ్లో॥** ఇత్యాకర్ణ్య వచః ప్రాహ భగవాన్ కార్యమానుషః ।
నాత్ర స్థేయం త్వయా సర్ప! సముద్రం యాహి మాచిరమ్ ।
స్వ జ్ఞాత్యపత్య దారాద్యైర్గో నృభిర్భుజ్యతాం నదీ ॥ (60)

**టీ॥** - ఇతీతి. యతో గోభిర్నృభిశ్చ నదీ భుజ్యతామితి. (60)

**శ్లో॥** య ఏత త్సంస్మరేన్మర్త్యస్తుభ్యం మదనుశాసనమ్ ।
కీర్తయన్ను భయోస్సంధ్యోర్న యుష్మద్భయ మాప్నుయాత్ ॥ (61)

**టీ॥** య ఇతి. తస్య యుష్మాభిర్భయం నోత్పాద నీయమిత్యాజ్ఞా.(61

**శ్లో॥** యోఽస్మిన్ స్నాత్వా హ్రదే మర్త్యో దేవాదీంస్తర్పయే జ్జలైః ।
ఉపోష్యవాస్మరన్నర్చన్ సర్వపాపైః ప్రముచ్యతే ॥ (62)

**శ్రీశుకుడిట్లనెను**

**తా॥** ఓ సర్పా! ఇక నీవిచ్చట ఉండతగదు. శ్రీఘ్రమే సముద్రమునకు వెడలిపొమ్ము, నీ బంధువులు, నీ సంతానము, భార్యలు అందరితో కూడి వెడలి పొమ్ము, ఈ యమునానది ఇక నుండి ఆవులచేత (పశువులచేత) మనుష్యుల చేత అనుభవింపబడునుగాక. (60)

**టీ॥** ఆవుల చేత, మనుష్యుల చేతను ఈ నది అనుభవింపబడ గలందులకు - అని. (60)

**తా॥** నేను నీకిచ్చిన ఈ ఆజ్ఞను ఏ మనుష్యుడు, ఉదయము, సాయం కాలము అనగా రెండు సంధ్యలలో స్మరించునో లేక కీర్తించుచు స్మరించునో అట్టివానికి మీ వలన భయము కలుగనేరదు. (61)

**టీ॥** అట్టివానికి మీ చేత భయము కలుగనీయరాదని ( నా) ఆజ్ఞ.(61

**తా॥** ఎవడీ మడుగులో స్నానము చేసి దేవతలకు, ఋషులకు మున్నగువారికి జలములచేత తర్పణము చేయునో, ఉపవసించి నన్ను స్మరించుచు అర్చించుచుండునో అట్టి మనుష్యుడు సర్వపాపముల నుండి విడివడను.(62)

**టీ॥** ఇతోఽపి త్వయా నిర్గంతవ్యమిత్యాహ. య ఇతి. త్వయి స్థితే తన్న సంభవతీతి భావః. (62)

**టీ॥** ఇందువలన కూడా నీవిచటి నుండి పోవలెనని చెప్పుచున్నాడు. నీవిచటనుండగా మనుష్యుడు స్నానము చేయటగాని, తర్పణము లిచ్చుట గాని సంభవము కాదని భావము. (62)

**శ్లో॥** ద్వీపం రమణకం హిత్వా హ్రదమేతదుపాశ్రితః ।
యద్భయాత్స సుపర్ణస్త్వాం నాద్యాన్మత్పద లాంఛితమ్ ॥ (63)

**తా॥** రమణక ద్వీపమును వదలి నీవీ హ్రదమునకు వచ్చి చేరితిని. గరుడుని భయముచే ఈ మడుగును ఆశ్రయించితివి. ఇప్పుడు నీ శరీరము నా పాద చిహ్నములతో వంకిత మగుట వలన గరుడుడు నిన్ను భుజింపడు. (63)

**టీ॥** న చ తవ గరుడభయం భవేదిత్యాహ-ద్వీపమితి. (63-68)

**టీ॥** నీకిక గరుడుని భయమేమియు నుండదని చెప్పుచున్నాడు. 'ద్వీపం' అను ఈ శ్లోకమున. (63-68)

ఋషిరువాచ

**శ్లో॥** ముక్తో భగవతా రాజన్! కృష్ణేనాద్భుత కర్మణా ।
తం పూజయామాస ముదా నాగః పత్నీభిరాదరమ్ ॥ (64)

**తా॥** రాజా ! అద్భుత లీలలు గల భగవంతుడైన శ్రీకృష్ణుని చేత విడవబడిన వాడై కాళీయుడు తన భార్యలతో గూడి హర్షము తోను, ఆదరముతోను కృష్ణుని పూజించెను. (64)

**శ్లో॥** దివ్యాంబర స్రఙ్మణిభిః పరార్థ్యైరపి భూషణైః ।
దివ్య గంధానులేపైశ్చ మహత్యోత్పల మాలయా ॥ (65)

**తా॥** దివ్యములైన వస్త్రములతోను, హారములతోను, మణులతోను, మిక్కిలి వెలగల, భూషణములతోను,. శ్రేష్ఠమైన గంధములు, మైపూతలతోను, గొప్ప కలువ పూల దండతోను (పూజించెను) (65)

**శ్లో॥** పూజయిత్వా జగన్నాథం ప్రసాద్య గరుడధ్వజమ్ ।
నాగ రాజో௨భ్యనుజ్ఞాతః పరిక్రమ్యాభివంద్యతమ్ ॥ (66)

**తా॥** జగన్నాథుడు, గరుడ ధ్వజుడునునైన శ్రీకృష్ణుని పూజించి, ప్రసన్నుని చేసికొని, ఆజ్ఞను పొంది, ఆతనికి వందన మాచరించి కాళీయుడు బయలుదేరి (పోయెను) (66)

**శ్లో॥** స కళత్ర సుహృత్పుత్రో ద్వీపమబ్ధేర్జగామ హ ।
తదైవ సామృత జలా యమునా నిర్విషా భవత్ ॥ (67)

**తా॥** భార్యలు, స్నేహితులు, పుత్రులు మొదలగు పరివారముతో కూడి కాళీయుడు, సముద్రమునకు సంబంధించిన రమణక ద్వీపమునకు తరలిపోయెను. అప్పుడే అమృత తుల్యమగు జలములు గల యమునా నది విషరహితమయ్యెను. (67)

**శ్లో॥** అనుగ్రహాద్భగవతః క్రీడా మనుజ రూపిణః ॥ (68)

**తా॥** ఇది యంతయు లీలా మానుషరూపుడగు కృష్ణ భగవానుని అనుగ్రహమున జరిగెను. (68)

**శ్రీ మద్భాగవతే, మహాపురాణే దశమస్కంధే, షోడశో௨ధ్యాయః**

**అని శ్రీమద్భాగవతమున దశమస్కంధమందు పదునారవ అధ్యాయము సమాప్తము.**

## సప్తదశోఽధ్యాయః

**రాజోవాచ**

**శ్లో॥** నాగాలయం రమణకం కస్మాత్తత్యాజ కాళియః ।
కృతం కింవా సుపర్ణస్య తేనైకేనా సమంజసమ్ ॥ (1)

**టీ॥** శ్లో. "నాగం సప్తదశే నాగాలయం తం నిరయాపయత్, బంధూంశ్చ సఖినశ్రాంతా సుప్తాంస్తత్ర దవాదపాత్". నాగేతి. అసమంజసం అప్రియ. (1)

**శ్రీశుక ఉవాచ**

**శ్లో॥** ఉపహార్యై స్సర్ప జనైర్మాసి మాసీహ యో బలిః ।
వానస్పత్యో మహాబాహో! నాగానం ప్రాఙ్నిరూపితః ॥ (2)

**టీ॥** ఉపహార్యైర్భక్షైః సర్పజనైః సర్పాయ తైర్జనైః వానస్పత్యః వనస్పతేర్మూలే దేయః నాగానాం తద్బాధాపరిహారాయ యో బలిః నిరూపితః ఉపకల్పితః. యద్వా ఉపహార్యైస్సుపర్ణభక్షైః. సర్పా ఏవ

## పదిహేడవ అధ్యాయము

**పరీక్షిత్తు ఇట్లనెను**

**తా॥** సర్పములకు నివాస స్థానమైన రమణక ద్వీపమును కాళీయుడు ఏల వదలిపెట్టెను? అతడొక్కడే గరుడునకేమి అపరాధము చేసెను?(1)

**టీ॥** ఈ పదునేడవ అధ్యాయమున శ్రీకృష్ణుడు, కాళీయుని యమునా నది ప్రాంతము నుండి బహిష్కరించుట, యమునా తీరము నందు విశ్రాంతి తీసికొనుచున్న తన బంధువులను స్నేహితులను కార్చిచ్చు నుండి కాపాడుట వర్ణింపబడినవి. - అసమంజసము- అప్రియము- అపచారము. (1)

**శ్రీశుకుడిట్లనెను**

**తా॥** ప్రతి మాసము నందును గరుడునకు సర్పములనే ఆహారముగ, ఏదేని ఒక చెట్టు క్రింద నుంచవలసిన ఏ బలి కలదో అది ముందే నిర్ణయింపబడియున్నది. (2)

**టీ॥** ఉపపహార్యైః సర్పజనైః-భుజింపదగిన సర్పములయొక్క నిడువులచేత- వానస్పత్యః- చెట్టు యొక్క మూలమునందు- దేయః -ఇవ్వదగినని(ఈయదగినది) సర్పములయొక్క బాధను పరిహరించుట

జనాః తైః నాగానాం సంబంధీ భాగః. యస్మిన్ ఏకైకో నాగో దీయతే తథా భూతో యో బలిః సుపర్ణాయ నిరూపిత ఇతి. (2)

కొఱకు ఏ బలి - నిరూపితః కల్పింపబడినదో- లేక- ఉపహార్యైః - గరుడుని చేత తినదగియున్న - సర్పములే వ్యక్తులుగా గల వాని చేత - సర్పముల సంబంధమగు భాగము- దేనియందు ఒకే ఒక్క సర్పము ఈయబడునో అట్టిది (భాగము) అగు ఏ బలి కలదో అది గరుడునికి నిర్ణయింపబడినది. (2)

**శ్లో॥** స్వం స్వం భాగం ప్రయచ్ఛంతి నాగాః పర్వణి పర్వణి ।
గోపీ థాయాత్మన స్సర్వే సుపర్ణాయ మహాత్మనే ॥ (3)

**తా॥** ప్రతి అమావాస్యకు సర్పములు, మహాత్ముడైన గరుడునికి తమ తమ భాగములను - తక్కిన సర్పముల రక్షణ నిమిత్తమై ఇచ్చుకొనుచుండిరి. (3)

**టీ॥** స్వమితి. తే చ నాగాః స్వం స్వం భాగం జనైర్దత్తం సుపర్ణాయ ప్రయచ్ఛంతి. తతో భీతాః గోపీథాయ రక్షకాయ. (3)

**టీ॥** ఆ సర్పములు తమ తమ భాగములను, (తామే భాగములుగ) పెద్దలచే ఈయబడిన భాగములను గరుడునకు ఇచ్చుకొనుచుండిరి. అతనికి భయపడినవారై-గోపీథాయ- రక్షకుని కొఱకు (తమ్ము తాము సమర్పించుకొనుచుండిరి) (3)

**శ్లో॥** విష వీర్య మదావిష్టః కాద్రవేయస్తు కాళియః ।
కదర్థీ కృత్య గరుడం స్వయం తు బుభుజే బలిమ్ ॥ (4)

**తా॥** విష బలములచేత మదించిన వాడై, కద్రువ సంతానమైన కాళీయుడు గరుడుని లెక్కచేయక, అతని కొఱకు ఉద్దేశింపబడిన బలిని తానే భుజించెను.(4)

**టీ॥** విషేతి. విషవీర్యాభ్యాం యో మదః తేనావిష్టః కాద్రవేయః కద్రూ పుత్రః కాళీయః. గరుడం కదర్థీకృత్య అవిగణయ్య స్వం భాగమదత్వా అన్యైర్దత్తమపి తం బలింస్వయమేవ బుభుజే. (4.5)

**టీ॥** విష వీర్యము వలన ఏ మదము కలుగునో దానిచేత ఆవేశింప బడి-కాద్రవేయః- కద్రువ పుత్రుడగు కాళియుడు- గరుడుని- కదర్థీకృత్య - లెక్కింపక - తనభాగ మీయకుండుటయేగాక ఇతరులచేత నీయబడిన బలిని కూడా తానే భుజించెను. (4,5)

**శ్లో॥** తచ్ఛ్రుత్వా కుపితో రాజన్! గరుత్మాన్ భగవత్ప్రియః ।
విజిఘాంసుర్మహా వేగః కాళీయం సముపాద్రవత్ (5)

**తా॥** రాజా! అది విని భగవానునికి ఇష్టుడైన గరుత్మంతుడు కోపించిన వాడై కాళీయుని వధింపదలచి మిక్కిలి వేగముతో కాళీయునిపైకి పరుగెత్తి అతని నాక్రమించెను. (5)

**శ్లో॥** తమాపతంతం తరసా విషాయుధః
ప్రత్యభ్యయాదుచ్ఛ్రితనైక మస్తకః ।
దద్భిస్సుపర్ణం న్యదశద్రదాయుధః
కరాళ జిహ్వోచ్ఛ్వసితోగ్రలోచనః ॥ (6)

**తా॥** వేగముగ వచ్చి పైన బడుచున్న గరుడుని యెదుర్కొనుటకు పూనుకొనిన, విషమే ఆయుధముగా గల కాళీయుడు అనేక తలలు పైకెత్తి భయంకరములగు నాలుకలు చాచుచు, బుసకొట్టుచు, భీతి గొలుపు కన్నులు గలవాడై, దంతాయుధుడై, పంటి కొసలతో గరుడుని కరచెను. (6)

**టీ॥** - తమితి. విషమేవాయుధం యస్య సః ప్రత్యభ్యయాత్ యోద్ధుం ప్రతి జగామ ఉచ్ఛ్రితనైకమస్తకః. ఉన్నమితానేకఫణః రదాయుధః. దంతాయుధః కరాళజిహ్వశ్చాసా వుచ్ఛ్వసితోగ్రలోచనశ్చ ఉచ్ఛ్వసితాని ఉజ్జృంభితాని ఉగ్రాణి లోచనాని యస్య సః. (6)

**టీ॥** విషయమే ఆయుధమెవనికో వాడు - ప్రత్యభ్యయాత్ - యుద్ధము చేయుటకు ఎదురుగ పోయెను- ఉచ్ఛ్రితనైక మస్తకః - పైకెత్తిన అనేకములగు పడగలు గలవాడై, రదాయుధః - దంతములే ఆయుధములుగ గలవాడై భయంకరమలగు నాలుకలు గలిగి- ఉచ్ఛ్వాసల వలన, బాగుగా తెరచుకొనిన తీక్షణమైన కన్నులు ఎవనికో వాడు. (6)

**శ్లో॥** తం తార్క్ష్య పుత్రస్య నిరస్య మన్యు మా
ప్రచండ వేగో మధుసూదనా సనః ।
పక్షేణ సవ్యేన హిరణ్య రోచిషా
జఘాన కద్రూ సుత ముగ్ర విక్రమః॥ (7)

**తా॥** కృష్ణభగవానునకు వాహనమైనవాడు, తృక్షుడు అను ముని కుమారుడును అయిన గరుత్మంతుడు కద్రువ సుతుడైన ఆ కాళీయుని త్రోసివేసి, భయంకరమైన పరాక్రమము గలవాడు ప్రచండమైన వేగము గలవాడై, బంగారు వన్నెతో ప్రకాశించునట్టి తన ఎడమ రెక్కతో కాళీయుని గట్టిగా కొట్టెను. (7)

**టీ॥** తమితి. తార్క్ష్యపుత్రో గరుడ. మధుసూదనస్యాసనం యస్మిన్ సః. (7)

**టీ॥** తార్క్ష్య పుత్రుడు గరుడుడు. మధుసూదనునికి కూర్చొని యుండు స్థలమో ఎవడో అతడు. (7)

**శ్లో॥** సుపర్ణ పక్షాభిహతః కాళీయోఽతీవ విహ్వలః ।
హ్రదం వివేశ కాళింద్యాస్తదగమ్యం దురాసదమ్ ॥ (8)

**తా॥** గరుడునిచే కొట్టబడిన కాళీయుడు మిక్కిలి అశక్తుడై, యమునా నదియొక్క, ఎవరికిని ప్రవేశింపరానిది, లోతైన దగుటచే చొర రానిదియునైన మడుగును ప్రవేశించెను. (8)

**టీ॥** సుపర్ణేతి. తస్య గరుడస్యాగమ్యం అగాధతయా చ దురాసదం. 8

**టీ॥** ఆ గరుడునకు పొందరానిది-లోతైన దగుటచేత దురాసదము. 8

**శ్లో॥** తత్రైకథా జలచరం గరుడో భక్ష్యమీప్సితమ్ ।
నివారితస్సౌ భరిణా ప్రసహ్య క్షుధితోఽహరత్ ॥ (9)

**తా॥** అచట నొకసారి, ఆకలిగొని యున్న గరుడుడు తన కిష్టమైన ఒక చేపను - తపస్వియగు సౌభరి వారించుచున్నను వినక భక్షించెను. 9

**టీ॥** తదగమ్యత్వే కారణాంతరమాహ - తత్రేతి. నివారితోఽపి అహరత్ అభక్షయత్. (9- 11)

**టీ॥** నివారితోఽపి - నివారించుచున్నను - అహరత్-తినెను. (9-11)

శ్లో॥ మీనాన్ సుదుఃఖితాన్ దృష్ట్వా దీనాన్ మీనపతౌ హతే ।
కృపయా సౌభరిః ప్రాహ తత్రత్య క్షేమ మాచరన్ ॥ (10)

తా॥ చేపలకు స్వామియగువాడు చంపబడుట వలన మిక్కిలిగ దుఃఖపడుచున్న చేపలను చూచి దయాహృదయుడైన సౌభరి - అచటనున్న జలచరములకు మేలు చేకూర్చువాడగుచు ఇట్లనెను.(10)

శ్లో॥ "అత్ర ప్రవిశ్య గరుడో యది మత్స్యాన్ స ఖాదతి ।
సద్యః ప్రాణైర్వియుజ్యేత సత్యమే తద్బ్రవీమ్యహమ్" (11)

తా॥ "గరుడుడు ఇందు ప్రవేశించి, అతడు చేపలను తినినచో అప్పటికప్పుడే అతడు ప్రాణములచే విడువబడును. (ప్రాణములు విడుచును) నేనీ సత్యమును చెప్పుచున్నాను" (11)

శ్లో॥ తత్కాళీయః పరం వేద నాన్యః కశ్చన లేలిహః ।
అవాత్సీద్గరుడాద్భీతః కృష్ణేన చ వివాసితః ॥ (12)

తా॥ ఈ సౌభరి శాపము ఒక్క కాళీయునకు మాత్రమే తెలియును. కాని ఇతరమైన ఏ సర్పమునకు కూడా తెలియదు. గరుడుని భయము వలన కాళీయుడిచటనే ఇంతకాలము నివసించెను. ఇప్పుడు కృష్ణుని చేత (రమణ ద్వీపమునకు) పంపబడెను. (12)

టీ॥ తదితి. లేలిహః సర్పః అతస్తత్రావాత్సీత్. (12)

టీ॥ లేలిహః - సర్పము-అందువలన (కాళీయుడు) అచట నివసించెను.(12)

శ్లో॥ కృష్ణం హ్రదాద్వి నిష్క్రాంతం దివ్యస్రగ్గంధ వాససమ్ ।
మహామణి గణాకీర్ణం జాంబూసదపరిష్కృతమ్ ॥ (13)

తా॥ మడుగు నుండి బయటకు వచ్చిన కృష్ణుని, దివ్యమైన పూల దండలు, గంధానులేపనములు, వస్త్రములు, విలువైన మణుల సమూహములతో ఖచితమైన బంగారు ఆభరణములతో అలంకరింపబడిన వానిని (చూచిరి). అని తరువాతి శ్లోకముతో అన్వయము.(13)

**టీ॥** కృష్ణమితి. జాంబూనదం సువర్ణం. తేనాలంకృతం. (13)

**టీ॥** జాంబూశదం - బంగారము - దానితో అలంకరింపబడిన వానిని (13)

**శ్లో॥** ఉపలభ్యోత్థితా స్సర్వే లబ్ధ ప్రాణా ఇవాసవః ।
ప్రమోద నిభృతాత్మానో గోపాః ప్రీత్యాభిరేమిరే ॥ (14)

**తా॥** తీరమున నున్న గోపాలురందఱును కృష్ణుని చూచి లేచి, ప్రాణములు, ఇంద్రియములును తిరిగి పొందిన వారివలె, హర్ష నిర్భర మానసులై మిక్కిలి ప్రీతితో అతని నాలింగనము చేసికొనసాగిరి.(14)

**టీ॥** ఉపలభ్యేతి. అసవః ఇంద్రియాణి. ప్రమోదనిభృతాత్మానః. ఆనందపూర్ణ మనసః. (14)

**టీ॥** ఆసవః - ఇంద్రియములు - ప్రమోద నిభృతాత్మానః - ఆనందముతో నిండిన మనస్సులు గలవారై (14)

**శ్లో॥** యశోదా రోహిణీ నందో గోప్యో గోపాశ్చ కౌరవ! ।
కృష్ణం సమేత్య లబ్ధేహా ఆసన్ లబ్ధ మనోరథాః ॥ (15)

**తా॥** కురువంశ తిలకా! యశోద, రోహిణి, నందుడు, గోపస్త్రీలు, గోపాలురును కృష్ణుని పొంది, చైతన్యమును పొందినవారై, తమ అభీష్టము నెరవేరిన వారైరి. (15)

**టీ॥** యశోదేతి. లబ్ధేహాః లబ్ధచేష్టాః. (15)

**టీ॥** లబ్ధేహాః చేష్టలు పొందినవారై (ప్రాణములులేచి వచ్చినట్లై) (15)

**శ్లో॥** రామశ్చాచ్యుత మాలింగ్య జహాసాస్యానుభావవిత్ ।
నగా గావో వృషా వత్సాః లేభిరే పరమాం ముదమ్ ॥ (16)

**తా॥** ముఖమును బట్టి, భావము నెఱుంగగల నేర్పరియగు బలరాముడు కృష్ణునాలింగనము చేసికొని నవ్వెను. కొండలు, చెట్లు, ఆవులు, ఎడ్లు, లేగదూడలు మిక్కిలి ఆనందమును పొందెను.(16)

**టీ॥** రామ ఇతి. నగాః వృక్షాఅపి పూర్వం శుష్కాస్సంతః సద్య ఏవ విరూఢా ఇత్యర్థః. (16)

**టీ॥** నగాః - చెట్లు కూడా - పూర్వము ఎండియున్నవి కూడ చిగురించి 'నవనవలాడెను' అప్పుడే - అని యర్థము (16)

**శ్లో॥** నందం విప్రా స్సమాగమ్య గురవ స్సకళత్రకాః ।
ఊచుస్తే కాళియగ్రస్తో దిష్ట్యా ముక్తస్తవాత్మజః ॥ (17)

**తా॥** గురువులైన బ్రాహ్మణులేతెంచి- తమ భార్యలతో సహా వచ్చి నందునితో నిట్లనిరి. "కాళీయుని చేజిక్కిన నీ కుమారుడు, అందరి కానందము కలిగించుచు అతని నుండి విడువబడెను.(17)

**టీ॥** నందమితి. తే విప్రాః. ఊచుః. (17)

**టీ॥** తే విప్రాః - ఆ బ్రాహ్మణులు - ఊచుః చెప్పిరి. (17)

**శ్లో॥** యశోదా చ మహాభాగా నష్ట లబ్ధ ప్రజాపతీ ।
పరిష్వ జ్యాంక మారోప్య ముమోచాశ్రు కణాన్ బహూన్ ॥ (18)

**తా॥** భాగ్యశాలిని యగు యశోద పోయిన కొడుకు తిరిగి లభించిన వాడు కాగా అతనిని కౌగలించుకొని ఒడి లోనికి ఎక్కించుకొని ఉప్పొంగిన దుఃఖముతో కన్నీరు విడిచెను.(18)

**టీ॥** యశోదేతి. నష్టలబ్ధప్రజా నష్టప్రాయా పునర్లబ్ధా ప్రజా యయా సా. (18. 19)

**టీ॥** నష్టలబ్ధ ప్రజా - కోల్పోయిన దాని వలెనయ్యు, తిరిగి పొందిన కొడుకు ఎవరిచేతనో ఆమె.(18,19)

**శ్లో॥** తతశ్చాస్తం గతే భానౌ కృష్ణో వాసమకల్పయత్ ।
స రామస్సహ గోపాలో మాత్రా పిత్రా స గోధనః ॥ (19)

**తా॥** సూర్యుడు అస్తమించిన వాడగుచుండగా కృష్ణుడు తన తల్లియగు యశోదమ్మతో, తండ్రియగు నందునితో కూడ, బలరాముడు, గోపాలురు, గోవులు మొదలగు వారందఱకును నివాసము కల్పించెను. (19)

శ్లో॥ తాం రాత్రిం తత్ర రాజేంద్ర! క్షుత్తృడ్భ్యాం శ్రమ కర్శితాః ।
ఊషుర్వ్ర జౌకసో గావః కాళింద్యా ఉపకూలతః ॥ (20)

తా॥ రాజేంద్రా! యమునా నదీ తీర సమీపమున వ్రజవాసులు ఆవులును, ఆకలిదప్పులతో అలమటించుచు ఆ రాత్రిని అసుఖముగనే గడిపిరి. (20)

టీ॥ తామితి. శ్రమేణ చ కర్శితాః ఉపకూలతః కూలప్రాంతే. (20-23)

టీ॥ శ్రమతో నొరయబడువారై-ఉపకూలతః-తీరప్రాంతమున (20-23)

శ్లో॥ తదాశు విపినోద్భూతో దవాగ్నిస్సర్వతో వ్రజమ్ ।
సుప్తం నిశీథ ఆవృత్య ప్రదగ్ధుముపచక్రమే ॥ (21)

తా॥ అపుడు, వెంటనే అడవి నుండి వచ్చిన కార్చిచ్చు, ఆ రాత్రి నిదురించిన వ్రజమునంతటిని ఆవరించి దహించి వేయుట కారంభించెను. (21)

శ్లో॥ తత ఉత్థాయ సంభ్రాంతా దహ్యమానా వ్రజౌకసః ।
కృష్ణం యయుస్తే శరణం మాయా మనుజ మీశ్వరమ్ ॥ (22)

తా॥ అప్పుడు అచటి వ్రజవాసులందఱు ఆ వేడిమిని అనుభవించుచున్నవారై భయాశ్చర్యముల నొందుచు మాయా మానుషమూర్తి, ప్రభువునైన కృష్ణుని శరణుజొచ్చిరి. (22)

శ్లో॥ కృష్ణ కృష్ణ మహాభాగ హే రామామిత విక్రమ! ।
ఏష ఘోరతమో వహ్నిస్తావకాన్ గ్రసతే హి నః ॥ (23)

తా॥ మహాభాగ్యశాలివగు ఓ కృష్ణా! ఓ అమితమైన పరాక్రమ శాలివగు బలరామా! ఈ మిక్కిలి భయంకరమగు అగ్ని మీ వారలమైన మమ్ము మ్రింగివేయును. (23)

**శ్లో॥** సుదుస్తరాత్ స్వాన్నః పాహి కాలాగ్నే స్సుహృదః ప్రభో! ।
నశక్నుమస్త్వచ్చరణం సంత్యక్తు మకుతో భయమ్ ॥ (24)

**టీ॥** సుదుస్తరాదితి కాలాగ్నిః మృత్యురూపాదగ్నేః న మృత్యోర్భీమః కింతు త్వచ్చరణ వియోగాదిత్యాహుః న శక్నుమ ఇతి. (24)

**శ్లో॥** ఇత్థం స్వజన వైక్లబ్యం నిరీక్ష్య జగదీశ్వరః ।
తమగ్నిమపిబత్తీవ్ర మనంతోఽనంత శక్తి ధృత్ ॥ (25)

**టీ॥** ఇత్థమితి. శ్లో. విమోహా నహి దండేన తతస్స్వశరణం గతాన్, గోపానపాదనంతోఽసావనంత నవహ్నితః. శ్రీధరీయోఽయం శ్లోకః (25)

**శ్రీ మద్భాగవతే, మహాపురాణే దశమస్కంధే,**
**సప్తదశోఽధ్యాయః**

**తా॥** ప్రభూ! మృత్యువు వంటి ఈ అగ్ని నుండి నీ మిత్రులను కాపాడుము. (దాటుటకు సాధ్యముకాని ఈ మృత్యువు వంటి అగ్ని నుండి మమ్ము కాపాడుము). భయ విరహితమైన నీ పాదము విడువజాలము. (24)

**టీ॥** కాలాగ్నేః - మృత్యురూపమైన అగ్నినుండి - మృత్యువునకు భయపడము - కాని - నీ పాదముల వియోగము వలన (భయపడుదుము) అని చెప్పుచున్నారు. (24)

**తా॥** ఇట్లు తనవారి యొక్క విహ్వలస్థితిని చూచి జగదీశ్వరుడు, అనంతుడు, అనంతమై శక్తిని ధరించియున్నవాడును అయిన కృష్ణుడు ఆ తీవ్రమైన అగ్నిని త్రాగివేసెను. (25)

**టీ॥** కాళీయుని శిక్షించుటతో విమోహితులై, తన శరణమును పొందిన గోపాలురను, అనంతుడు కార్చిచ్చు నుండి కాపాడెను. (ఈ భావము గల శ్లోకము శ్రీధరీయము) (25)

**అని శ్రీమద్భాగవతమున దశమస్కంధమందు**
**పదహేడవ అధ్యాయము సమాప్తము.**

## అష్టాదశోఽధ్యాయః

### శ్రీశుక ఉవాచ

**శ్లో॥** అథ కృష్ణః పరివృతో జ్ఞాతిభిర్ముదితాత్మభిః ।
అనుగీయ మానో న్యవిశద్వ్రజం గోకుల మండితః ॥ (1)

**టీ॥** శ్లో. "అష్టాదశే తతో గ్రీష్మే వసంతగుణలక్షితే. అఘాతయ ద్బలేనాలం ప్రలంబం లీలయా హరిః. కృత్వా నృత్యం ఫణాగ్రేషు కాళీయస్య సకౌతుకం, బలం ప్రలంబ తుంగాం సమారోహయ దమిత్రహా. (1)

**శ్లో॥** వ్రజే విక్రీడతో రేవం గోపాల చ్ఛద్మ మాయయా ।
గ్రీష్మోనామర్తు రభవన్నాతి ప్రేయాన్ శరీరిణామ్ ॥ (2)

**టీ॥** – వ్రజ ఇతి. గోపాలఛద్మమాయయా గోపాలనమేవ ఛద్మ యస్యాం తయా. (2. 3)

## పదునెనిదవ అధ్యాయము

### శ్రీశుకు డిట్లనెను

**తా॥** అటు పిమ్మట, సంతుష్ట హృదయులై అతనిని కీర్తించుచున్న బంధువులందఱిచే నావరింపబడినవాడు, ఆల మందలతో అలంకరింప బడిన వాడునునైన కృష్ణుడు వ్రజమును ప్రవేశించెను.(1)

**టీ॥** పదునెనిమిదవ అధ్యాయమున, వసంతర్తు గుణములతో చూడ బడుచున్న గ్రీష్మర్తువున, ప్రలంబడు అను రాక్షసుని, శ్రీకృష్ణుడు తన లీలలతో బలరామునిచే గొట్టించుట, కాళీయుని పడగల మీద నాట్యము చేసి, కుతూహలముతో నాడి, బలరాముని, ప్రలంబుడను వాని ఎత్తైన భుజముల మీద ఎక్కించుట వర్ణింపబడినవి. (1)

**తా॥** గోపాలుర నెపమున, మాయతో ఈ విధముగ కృష్ణ బలరాము లిరువురు క్రీడలతో వ్రజము నందుకాలము గడుపుచుండగా, శరీర ధారులకు అంతగా హితమైనది కానట్టి గ్రీష్మ మనెడిఋతువు వచ్చెను. 2

**టీ॥** గోపాలచ్ఛద్మమాయయా– ఆవులకు పాలించుటయే నెపము ఎవరికో వారికి అట్టి మాయచేత. (2,3)

**శ్లో॥** స చ బృందావన గుణైర్వసంత ఇవ లక్షితః ।
యత్రాస్తే భగవాన్ సాక్షాద్రామేణ సహ కేశవః ॥ (3)

**తా॥** ఆ ఎండకాలము కూడా బృందావన గుణములచేత వసంతర్తువు వలె అనుభూతమగుచుండెను. అచట సాక్షాత్తు భగవానుడగు కృష్ణుడు, బలరామునితో కూడా నుండెను. (3)

**శ్లో॥** యత్ర నిర్ఘర నిర్హ్రాద నివృత్త స్వనఝిల్లికమ్ ।
శశ్వత్తచ్ఛీకరైర్జుష్ట ద్రుమ మండల మండితమ్ ॥ (4)

**తా॥** నిశ్శబ్దముగ ప్రవహించు సెలయేళ్ల వలన తమ అరుపులను మానిన కీచురాళ్లుగలది, నిరంతరముగ తడుపబడుచున్న ఆ సెలయేళ్ల నీటి తుంపరలతో స్నిగ్ధమైన చెట్లతో అలంకరింపబడినదియునైన (బృందావనము శోభిలుచుండెను) (4)

**టీ॥** వసంతసామ్యమాహ – చతుర్భిః యత్రేతి. యత్ర గ్రీష్మేఽపి. నిర్ఝురాణాం నిర్హ్రాదేన ఘోషేణ నివృత్తస్వనాః ఛన్నధ్వనయః. ఝిల్లికాః కఠోర ధ్వనయః. సూక్ష్మకీటా యస్మిన్. తథా భూతం బృన్దావనం భవతి కించ. శశ్వత్తేషాం నిర్ఝురాణాం శీకరైః. అంబుకణైః జుష్టా స్నిగ్ధా యే ద్రుమాస్తేషాం మండలైర్మండితమ్. (4)

**టీ॥** – నాలుగు శ్లోకములతో గ్రీష్మమునందలి వసంతర్తు లక్షణములను చెప్పుచున్నడు–'యత్ర' అనుచు, యత్ర – గ్రీష్మము నందు కూడ సెయేళ్ళ యొక్క నిశ్శబ్దతత చేత లేక అవ్యక్త ధ్వనిచేత – నివృత్తస్వనాః –దాచుకొనిన ధ్వని గల – ఝిల్లికాః– కఠోరమైన ధ్వనిగల– సూక్ష్మకీటాః –చిన్న ఈల పురుగులు (కీచురాళ్లు) ఎందుగలవో – ఆ విధమున బృందావనమయ్యెను. మరియు శశ్వత్తేషాం – ఆగకుండ ఆ నిర్ఝురముల యొక్క (కొండవాగులయొక్క) శీకరైః – తుంపరల చేత – జుష్టాః– సేవింపబడినవైన చెట్ల సమూహములచేత అలంకరింప బడినది (బృందావనము) (4)

**శ్లో॥** సరిత్సరః ప్రస్రవణోర్మి వాయునా
కల్హార కంజోత్పల రేణు హారిణా ।
న విద్యతే యత్ర వనౌకసాం దవో
నిదాఘ వహ్న్యర్క భవోఽతిశాద్వలే ॥ (5)

**టీ॥** సరిదితి. యత్ర గ్రీష్మే వనే వా నిదాఘో గ్రీష్మః. తేన తత్కాలీవ వహ్న్యర్కాభ్యాం చ భవతి యో దవః. తాపః అతి శాద్వలే అతి హరిత తృణాకీర్ణే. యద్వా - అతిక్రాంత శాద్వలేఽపి స్థానే. (5)

**శ్లో॥** అగాధ తోయ హ్రదినీ తటో ర్మిభి
ర్ద్రవత్పురీష్యాః పురినై స్సమంతతః ।
న యత్ర చండాంశుకరా విషోల్బణా
భువో రసం శాద్వలితం విగృహ్ణతే ॥ (6)

**తా॥** పరిమళ భరితములైన కలువల యొక్కయు, తామర పూవుల యొక్కయు, సాధారణమైన కలువ పూల యొక్కయు పుప్పొడి రేణువులను వెంట దీసికొని, నదుల యొక్కయు, సరస్సుల యొక్కయు సెలయూటల యొక్కయు అలలపై నుండి వీచెడి గాలిచేత, ఆ దట్టమైన పచ్చిక గల బయళ్ళ యందు, గ్రీష్మము వలన కాని, అగ్ని వలన గాని, సూర్యుని వలన గాని, ఆ వనము నందుండెడి ప్రాణులకు చెట్లు చేమలకు కార్చిచ్చు బాధ యుండదు. (5)

**టీ॥** యత్ర –గ్రీష్మము నందు ఆ యడవిలో– నిదాఘః– వేసవి కాలము – దానిచేత ఆ సమయమునకు సంబంధించిన అగ్ని చేత, సూర్యునిచేత కార్చిచ్చు సంభవింపదు, తాపః –వేడిమి, అతి శాద్వలే– మిక్కిలి పచ్చనైన లేత గడ్డితో నిండిన – లేక– పచ్చిక బయలు దాటిన భూమియందు కూడా– (5)

**తా॥** లోతైన నీరుగల సరస్సుల ఒడ్డుల యందంతట, నీటి అలల తాకిడిచేత తడిసియున్న బురదచే నేర్పడిన తిన్నెల పచ్చిదనము, అచటి భూప్రాంతముల పచ్చదనమును మిక్కిలి తీక్ష్ణమైన సూర్యకిరణములు పీల్చుకొన లేక పోవుచున్నవి. (తడిని, పచ్చదనమును సూర్యకిరణములు గ్రహింపలేకపోవుచున్నవి) (6)

**టీ॥** నను శాద్వలమేవ కుతస్త్యం? తత్రాహ–అగాధేతి. అగాధాని తోయాని యాసాం తాసాం హ్రదినీనాం గటస్పర్శిభిరూర్మిభిః. పుళినైస్సహ. ద్రవత్పురీషం పంకో యస్యాస్తస్యాః. భువః. రసం శాద్వలితం శాద్వలరూపతాం చ. విషవదుల్బణా అపి. సూర్యరశ్మయో న విగృహ్ణతే న హరంతి. (6)

**టీ॥** పచ్చిక బయలున – ఎచటనున్న దానిని?(ఎచట నుండి వచ్చిన దానిని?) ఆ విషయమును చెప్పుచున్నాడు. లోతైన జలములు వేని యందో అట్టి కొలనుల యొక్క – ఒడ్డులను తాకుచున్న అలల చేత – తిన్నెలతో కూడ – ద్రవత్పురీషం– జారుచున్న బురద దేనికో దానికి – భూమికి – రసం– ద్రవత్వము– శాద్వలితం– పచ్చికబయలు రూపత్వమును – విషము వలె ప్రకటమగుచున్నను కూడా సూర్య కిరణములు – న గృహ్ణతే – హరించుటలేదు. (6)

**శ్లో॥** వనం కుసుమితం శ్రీమన్నదచ్చిత్ర మృగద్విజమ్ ।
గాయన్మయూర భ్రమరం కూజత్కోకిల సారసమ్ ॥ (7)

**తా॥** అడవి యంతయు విరబూచి మిక్కిలి సౌభాగ్యవతముగ నుండెను. అరచుచున్న మృగములు, పక్షులు గలదియును, పాడుచున్న నెమిళ్ళు, తుమ్మెదలు గలదియు, కూయుచున్న కోకిలలు, బెగ్గురు పక్షులు కలదియునై విరాజిల్లుచుండెను. (7)

**టీ॥** వనమితి. తద్వనం నదంతః చిత్రాః మృగాః. ద్విజాశ్చ యస్మిన్. గాయంతో మయూరాః భ్రమరాశ్చ యస్మిన్. కూజంతః కోకిలాః సారసాశ్చ యస్మిన్ తత్. (7)

**టీ॥** ఆవనము వివిధములైన ధ్వనులు చేయుచున్న నానా వర్ణము లతో భాసించు మృగములు, పక్షలు దేని యందు గలవో– పాడుచున్న నెమిళ్ళు, తుమ్మెదలు దేనియందు గలవో, కూయుచున్న కోకిలలు, బెగ్గురు పక్షలును దేని యందు గలవో అట్టిది – ఆ వనము. (7)

**శ్లో॥** క్రీడిష్యమాణ స్తత్కృష్ణో భగవాన్ బలసంయుతః ।
వేణుం విరణయన్ గోపై ర్గోధనైస్సంవృతో ఉ విశత్ ॥ (8)

**తా॥** భగవానుడైన ఆ కృష్ణుడు, బలరామునితో కూడి, విహరించుచు, పిల్లనగ్రోవిని వాయించుచు, గోపాలకులతోను, ఆలమందలతోను ఆవరింపబడినవాడై ఆ వనమున ప్రవేశించెను (8)

.**టీ॥** - క్రీడిష్యమాణ ఇతి. తద్వనం అవిశత్. (8-11)

**టీ॥** ఆ వనమును ప్రవేశించెను. (8 - 11)

**శ్లో॥** ప్రవాళ బర్హ స్తబక స్రగ్ధాతు కృత భూషణాః ।
రామ కృష్ణాదయో గోపా ధనృతుర్యుయధుర్జగుః ॥ (9)

**తా॥** చిగురాకులు (పగడములు) నెమిలి పింఛములు, పూలగుత్తులు, హారములు, బంగారము మొదలగు పదార్థములతో చేయబడిన ఆభరణములు గలవారై బలరామకృష్ణులు మొదలగువారు, గోపాలకులు నాట్యములు చేసిరి. పోట్లాడుకొనిరి. పాటలు వాడిరి. (9)

**శ్లో॥** కృష్ణస్య నృత్యతః కేచిత్ జగుః కేచిదవాదయన్ ।
వేణు పాణి తలైశ్శృంగైః ప్రశశంసు రథాపరే ॥ (10)

**తా॥** కృష్ణుడు నాట్యము చేయుచుండగా కొందఱు పాటలు పాడిరి. కొందఱు వేణువులు వాయించిరి. కొందఱు కరతాళములు మ్రోగించిరి. కొందఱు కొమ్ముvాద్యములను పలికించిరి. కొందఱు ఆ నాట్యమును ప్రశంసించిరి. (10)

**శ్లో॥** గోప జాతీ ప్రరిచ్ఛన్నాదేవా గోపాల రూపిణః ।
ఈడిరే కృష్ణ రామౌ చ నటా ఇవ నటం నృప ॥ (11)

**తా॥** దేవతలు, గోపాలుర రూపమును ధరించి, ప్రచ్ఛన్నముగా బలరామ కృష్ణుల నిరువురిని (నటుల తమ నాయకునిని వలె) స్తోత్రము చేయఁదొడగిరి. (11)

**శ్లో॥** భ్రమణైర్లంఘనైః క్షేపైః ఆస్ఫోటన వికర్షణైః ।
చిక్రీడతుర్నియుద్ధేవ కాక పక్షధరావుభౌ ॥ (12)

**టీ॥** భ్రమణైరితి. కాకపక్షాః చూడాకరణాత్ ప్రాక్తనకేశాః. భ్రమణాది ప్రకారైః. నియుద్ధేన బాహుయుద్ధేన చిక్రీడతుః. (12. 13)

**శ్లో॥** క్వచిన్నృత్యత్సు చాన్యేషు గాయకౌ వాదకౌ స్వయమ్ ।
శశంసతుర్మహారాజ సాధు సాధ్వితి వాదినౌ ॥ (13)

**శ్లో॥** క్వచిత్కుంభైః క్వచిద్బిల్వైః క్వచామలక ముష్టిభిః ।
అస్పృశ్య నేత్ర బంధాద్యైః క్వచిన్మృగ ఖగేహయా ॥ (14)

**తా॥** చూడాకర్మ కంటె ముందటి వయస్సున గల వారిద్దఱును, తిరుగుటచేత, ఎగురుటచేత, ప్రేరణచేత తఱచుకొనుటచేత, వికర్షణచేత, బాహుయుద్ధముల చేతను క్రీడించిరి. (12)

**టీ॥** కాక పక్షాః – చూడాకర్మకంటె ముందుగల జేనెడేసి ఉంగరాల జుట్టుగలవారు. తిరుగుట మొదలగు ప్రకారములతో– నియుద్ధేన– బాహుయుద్ధముతో– క్రీడించిరి. (12,13)

**తా॥** మహారాజా! ఒక్కొక్క తడవ ఇతరులు నాట్యము చేయుచుండగా వారిద్దఱే స్వయముగ పాటలు పాడువారును, వాద్యములు వాయించు వారును అయి వారిని “బాగు బాగు” అని మెచ్చుకొను చుండిరి.(13)

**తా॥** ఒక్కొక్కప్పుడు గుగ్గిలపు కాయలను, ఒక్కొక్కప్పుడు మారేడు కాయలను, ఒక్కొక్కప్పుడు ఉసిరి కాయలను పిడికిళ్ల చేత ఒకరిపై ఒకరు విసురుకొనుచు, కన్నులు మూయుట ద్వారా దొరకకుండునట్టి దాగుడు మూతలు మొదలైన ఆటల చేతను, ఒక్కొక్కొప్పుడు మృగములను, పక్షులు అనుకరించుటల చేతను – (14)

టీ॥ క్వచిదితి. కుంభై కుంభవృక్షఫలైః అస్పృశ్యత్వం. నేత్రబంధశ్చ తదాద్యైః మృగాణాం ఖగానాం చ చేష్టయా. (14)

టీ॥ కుంభైః - గుగ్గిలపు చెట్ల పండ్లతో - అస్పృశ్యత్వం - తాక కుండనుండుట - నేత్ర బంధశ్చ- కన్నులు మూయుటయును. ఆ మొదలగు వాని చేత - మృగాణాం ఖగానాం చ చేష్టయా - పశువుల యొక్కయు పక్షుల యొక్కయు చేష్ట (ల) చేత - (14)

శ్లో॥ క్వచిచ్చ దర్దుర ప్లావై ర్వివిధై రూప హాసకైః ।
కదాచి దాందోళికయా కర్హి చిన్నృప చేష్టయా ॥ (15)

తా॥ ఒక్కొక్క పర్యాయము కప్పగంతుల తోడను, నానా విధములైన నవ్వులాటలతోను, ఎప్పుడో ఒకప్పుడు ఊయలలూగుచు, ఒకప్పుడు రాజువలె దర్పముచూపుట మున్నగు రీతులలో వారు క్రీడించిరి.(15)

టీ॥ క్వచిదితి. దర్దుప్లావైర్మండూకప్లుతిభిః ఆందోళికయా డోలా లంబనేన నృపాణామివ లీలయా. (15)

టీ॥ దర్దుర ప్లావైః-కప్పలవలె గంతులు వేయుచు- ఆందోళికయా- ఊయలపై నూగుచు -నృప చేష్టయా- రాజులవలె లీలగా- (15)

## ప్రలంబాసుర వధ ఘట్టః

శ్లో॥ ఏవం తౌ లోక సిద్ధాభిః క్రీడాభిశ్చేరతుర్వనే ।
నద్యద్రి ద్రోణి కుంజేషు కాననేషు సరస్సు చ ॥ (16)

## ప్రలంబాసుర వధ ఘట్టము.

తా॥ ఈ విధముగ వారిద్దఱును లోకసిద్ధమైన ఆటలతో వనమున విహరించిరి. నదులు, కొండలు, దోనెలు, పొదలు, అడవులు,సరస్సులు మొదలగు ప్రాంతముల యందును. విహరించిరి. (16)

టీ॥ ఏవమితి. నద్యః అద్రి ద్రోణయః కుంజాని చ యేషు. (16)

టీ॥ నదులు, కొండలు, దోనెలు, పొదలు మొదలగువానియందు. (16)

**శ్లో॥** పశూంశ్చారయతో ర్గోపైస్తద్వనే రామ కృష్ణయోః ।
గోప రూపీ ప్రలంబోఽ గాదసురస్తజ్జిహీర్షయా ॥ (17)

**తా॥** ఆ వనమున బలరామ కృష్ణులు తమ పశువులను గోపాలకులతో కూడి మేపు కొనుచుండగా, గోపాలుని రూపమున ప్రలంబుడను రాక్షసుడొకడు రామకృష్ణులను హరించుకొని పోవుటకై వచ్చెను. (17)

**టీ॥** పశూనితి. చారయతోస్సతోః తద్వనే తస్మిన్ వనే. తయోర్జిహీర్షయా. (17.18)

**టీ॥** మేపుచు తిరుగుచుండగా, ఆ వనమునందు కలిసియున్న వారిద్దఱిని హరింపనిచ్ఛచేత (17,18)

**శ్లో॥** తం విద్వానపి దాశార్హో భగవాన్ సర్వదర్శనః ।
అన్వమోదత తత్సఖ్యం వధం తస్య విచింతయన్ ॥ (18)

**తా॥** యాదవ ప్రముఖుడు, భగవానుడు, అంతయును (సర్వమును) చూడగల వాడైన కృష్ణుడు, గోప వేషమున నున్న ప్రలంబుని గమనించి, అతని సంహారమును గూర్చి ఆలోచించుచూ అతని స్నేహమును ఆమోదించెను. (18)

**శ్లో॥** తత్రోపహూయ గోపాలన్ కృష్ణః ప్రాహ విహారవిత్
హే గోపా విహరిష్యామో ద్వంద్వీభూయ యథా యథమ్॥(19)

**తా॥** క్రీడలలో విద్వాంసుడైన కృష్ణుడు, గోపాలురందఱిని అచటికి పిలిచి వారితో నిట్లు చెప్పెను, “ఓ గోపాలకులారా! మనలో మనము రెండు జట్లుగ విడిపోయి విహరింతము”. (19)

**టీ॥** తత్రేతి.యథాయథం వయోబలాద్యనురూపం.ద్వంద్వీభూయ. (19)

**టీ॥** వయస్సులు, బలములకు అనురూపముగ, సరియైన పద్ధతిగ రెండు భాగములుగ వేరేరై. (19)

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ
ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

శ్లో॥ తత్ర చక్రుః పరివృఢౌ గోపా రామ జనార్దనౌ ।
కృష్ణ సంఘట్టినః కేచిదాసన్ రామస్య చాపరే॥ (20)

తా॥ బలరామ కృష్ణుల నిరువురిని గోప బాలురు నాయకులనుగా చేసిరి. అందు కొందఱు కృష్ణుని పక్షమునను మఱికొందఱు బలరాముని పక్షమునను చేరిరి. (20)

టీ॥ తత్రేతి. పరివృఢౌ నాయకా. తత్ర కేచన శ్రీకృష్ణసంఘట్టినః. శ్రీకృష్ణపక్షీయా. (20.21)

టీ॥ పరవృఢౌ – నాయకులను – అందు కొందఱు శ్రీకృష్ణ పక్షీయులు (20,21)

శ్లో॥ ఆచేరు ర్వివిధాః క్రీడా వాహ్యవాహక లక్షణాః ।
తత్రారోహంతి జేతారో వహంతి చ పరాజితాః ॥ (21)

తా॥ మోయుట, ఎక్కుట అను లక్షణములు గల క్రీడల ననేక విధములుగ నాడిరి. అట్టి ఆటలయందు గెలిచిన వారు ఎక్కుచుండిరి. ఓడినవారు మోయుచుండిరి. (21)

శ్లో॥ వహంతో వాహ్యమానాశ్చ చార యంతశ్చ గోధనమ్ ।
భాండీరకం నామ వటం జగ్ముః కృష్ణ పురోగమాః ॥ (22)

తా॥ మోయుచున్నవారును, మోయబడుచున్నవారును పశువులను మేపుకొనుచు మేపుకొనుచు, 'భాండీరకము' అను పేరుగల మఱ్ఱి చెట్టు వద్దకు చేరిరి. కృష్ణుడు ముందుపోవగా అందఱును అతని ననుసరించిపోయిరి. (22).

టీ॥ వహంత ఇతి. వాహ్యమానాః పృష్ఠేనోహ్యమానాః.(22-24)

టీ॥ వాహ్యమానాః – వీపున మోయబడుచున్నవారు. (22 -24)

**శ్లో॥** రామ సంఘట్టినో యే హి శ్రీదామ వృషభాదయః ।
క్రీడాయాం జయినస్తాంస్తే హ్యూహుః కృష్ణాదయో నృప ॥ (23)

**తా॥** రాజా! బలరాముని జట్టులోని వారగు శ్రీదాముడు, వృషభుడు మున్నగువారు ఆటలో నొకసారి విజేతలుగ నుండిరి. వారిని కృష్ణుడు మున్నగు వారు మోయుచుండిరి. (23)

**శ్లో॥** ఉవాహ కృష్ణో భగవాన్ శ్రీదామానం పరాజితః ।
వృషభం భద్రసేనస్తు ప్రలంబో రోహిణీ సుతమ్ ॥ (24)

**తా॥** భగవానుడగు కృష్ణుడు, ఓడినవాడై శ్రీదాముడను వానిని మోసెను. భద్రసేనుడు వృషభుని, ప్రలంబుడు బలరాముని మోసిరి. (24)

**శ్లో॥** అవిషహ్యం మన్యమానః కృష్ణం దానవ పుంగవః ।
వహన్ ద్రుత తరం ప్రాగాదవరోహణతః పరమ్ ॥ (25)

**తా॥** కృష్ణుడు, సహింప శక్యముకాని బలవంతుడని భావించుచున్న ఆ రాక్షస శ్రేష్ఠుడగు ప్రలంబుడు, బలరాముని మోయుచు, దింపవలసిన చోటును దాటి వేగముగా ముందునకు బోయెను. (25)

**టీ॥** అవిషహ్యమితి. కృష్ణదృష్టివంచనాయ. అవరుహ్యతేస్మిన్నిత్యవరోహణం మర్యాదా. తతః పరం దూరమగాత్. (25)

**టీ॥** కృష్ణుని దృష్టిని మోసగించుట కొఱకు- దిగవలసిన తావున దింపుట కట్టుబాటు. దానిని దాటి దూరముగఁ బోయెను. (25)

**శ్లో॥** తముద్వహన్ ధరణి ధరేంద్రగౌరవం
మహాసురో విగతరయో నిజం వపుః ।
స ఆస్థితః పురట పరిచ్ఛదో బభౌ
తటిద్ద్యుమానుడు పతి వాడినాంబుదః ॥ (26)

**తా॥** రాజేంద్రా! బలశాలియైన ఆతనిని మోయుచు ఆ గొప్ప రాక్షసుడు తన వేగమును కోల్పోయి తన నిజరూపమును పొందెను. బంగారు అలంకారములుగల వాడయ్యెను. విద్యుద్దీప్తివలె ప్రకాశమానమైన ఆభరణములు గలవాడయ్యెను. మెఱుములతో కూడిన మేఘము చంద్రుని మోయుచున్నట్లుండెను. (26)

**టీ॥** తమితి. ధరణీధరేంద్రవద్గౌరవం యస్య తం. నిజం ఆసురం వపుః. పురటపరిచ్ఛదః సువర్ణాలంకారః. తటిద్ద్యుమాన్ విద్యుద్దీప్తిమా నిత్యలంకారోపమా. ఉడుపతివాడితి రామోపమా. ఉడుపతిం. వహతీత్యుడుపతివాట్ యథోచితస్థానేషు స్థితా విద్యుతో భవంతి. ఉపరి చోడుపతిః తదా సోఽంబుదో యథా భాతి. తద్వద్భాతీత్యర్థః. (26)

**టీ॥** రాజశ్రేష్ఠునికి వలె గురుత్వమెవనికో అట్టివానిని–నిజం వపుః – రాక్షస శరీరమును– పురటపరిచ్ఛదః– బంగారపు అలంకారములు గలవాడై– తటిద్ద్యుమాన్–'మెఱుపు వంటి కాంతిగల వాడై' అని అలంకారములతో పోలిక– ఉడుపతివాట్ ఇతి రామోపమా – ఉడుపతి – బలరామునితో పోలిక చుక్కల ఱేడగు చంద్రుని మోయుచున్న వాడు కావున ఉడుపతి వాట్ – (చంద్రుని మోయు చున్నట్లున్న మేఘమువలె బలరాముని మోయుచున్న ప్రలంబుడుండెను) తగిన స్థానములందుండునవి మెరుములగుచున్నవి. వాని పైన చంద్రుడు– అటుల మేఘముతో కూడి చంద్రు డెట్లుండునో (అట్లు) – ఎట్లు ప్రకాశించునో అట్లు ప్రకాశించు చుండెనని యర్థము. (26)

**శ్లో॥** నిరీక్ష్య తద్వపురలమంబరే చరత్
ప్రదీప్తదృగ్ భృకుటి తటోగ్ర దంష్ట్రమ్ ।
జ్వలచ్ఛి ఖం కటక కిరీట కుండల
త్విషాద్భుతం హలధర ఈష దత్రసత్ ॥ (27)

**తా॥** మిక్కిలిగ ప్రకాశించుచున్న కను బొమ్మల ముడి కొసలు, భయంకరమైన కోఱలు, మండుచున్నశిఖ, కంకణములు, కిరీటము, కుండలముల కాంతులచేత ఆశ్చర్యమును గొలుపు ప్రలంబుని శరీరము ఆకాశమున కదలుచుండగా చూచి, బలరాముడు ఇంచుక భయపడె ననుట, చాలును. (27)

**టీ॥ –** నిరీక్ష్యేతి. అలం అతివేగేన. ప్రదీప్తే దృశౌ యస్మిన్ వపుషి తత్. భ్రుకుటితటసంలగ్నా ఉగ్రదంష్ట్రా యస్మిన్ తత్. ప్రదీప్తదృక్

**టీ॥** అలం–మిక్కిలి వేగములతో మెఱయుచున్న కన్నులు దేనియందో అట్టి శరీరమున, కనుబొమ్మలతో కలిసిన భయంకరమగు కోఱలు

భ్రుకుటీతటం యస్మిన్. ఉగ్రాః దంష్ట్రాః యస్మిన్. తచ్చ తచ్చేతి వా. జ్వలంత్యః శిఖాః కేశాః యస్మిన్ తత్. (27)

దేని యందో అది - జ్వలించు కన్నులు, కనుబొమ్మల కొసలు దేని యందో - భయము గొలుపు కోఱలు దేని యందో- ఆ యా- మెఱయుచున్న - శిఖాః-వెంట్రుకలు దేనియందో అది. (27)

**శ్లో॥** అథా గత స్మృతి రభయో రిపు బలో
విహాయ సార్థమిన హరంతమాత్మనః ।
రుషా హనచ్ఛిరసి దృఢేన ముష్టినా
సురాధిపో గిరిమివ వజ్ర రంహసా ॥ (28)

**తా॥** పిమ్మట బలరాముడు స్మృతిలోనికి వచ్చినవాడై (తన బలమును తాను గుర్తించి) నిర్భయుడై, తన తోటి వారి నందఱిని విడిచి తనను మాత్రమే దొంగిలించుకొని తీసికొని పోవుచున్న ప్రలంబుని శిరస్సుపై, కోపముతో గట్టిగ పిడికిలి బిగించిన వాడై ఒక్క గ్రుద్దు గ్రుద్దెను. ఇంద్రుని వజ్రాయుధము అతివేగమున వచ్చి కొండను తాకినట్లుగ ఆ దెబ్బ ఆ రాక్షసుని తలపైన బలముగ తగిలెను. (28)

**టీ॥** అథేతి. ఆగతస్మృతిః. అభయ ఇవ. ఆత్మనః సార్థం గోపసమూహం విహాయ. హరంతం రిపుం అహనత్. యద్వా. విహాయసా ఆకాశమార్గేణ. ఆత్మనః ప్రాప్తం. అర్థమివ హరంతమితి. వజ్ర రంహసా వజ్ర వేగేన ముష్టినా. (28)

**టీ॥** ఆగత స్మృతిః - స్మృతి వచ్చిన వాడై- నిర్భయుని వలె-తనతో కూడ నున్న గోపాలుర సమూహమును విడిచి-కొనిపోవుచున్న శత్రువును కొట్టెను. లేక-నిహాయసా- ఆకాశమార్గమున - తనచే పొందబడిన ధనమును వలె కొనిపోవుచున్న వానిని- అని. వజ్ర రంహసా-వజ్రాయుధపు వేగమున పిడికిలితో (కొట్టెను). (28)

**శ్లో॥** స ఆహత స్సపది విశీర్ణ మస్తకో
ముఖాద్వమన్ రుధిర మపస్మృతోఽసురః ।
మహా రవం వ్యసురపతత్సమీరయన్
గిరర్యథా మఘవత ఆయుధా హతః ॥ (29)

**తా॥** ఆ రాక్షసుడు కొట్టబడి, వెంటనే తలపగిలి, నోటినుండి రక్తము క్రక్కుచు, స్మృతిని కోల్పోయి, గొప్ప ధ్వని చేయుచు, ఇంద్రుని వజ్రాయుధముచే కొట్టబడిన పర్వతము వలె నేలఁగూలెను. (29)

**టీ॥** స ఇతి. అపస్మృతః గతస్మృతిః. మహారవం సమీరయన్. (29, 30)

**టీ॥** అపస్మృతః- స్మృతి తప్పినవాడై- గొప్ప ధ్వనిని వ్యాపింప చేయుచు. (29,30)

**శ్లో॥** దృష్ట్వా ప్రలంబం నిహతం బలేన బలశాలినా
గోపాస్సు విస్మితా ఆసన్న సాధుం సాధురూపిణమ్ ॥ (30)

**తా॥** బలశాలియైన బలరాముని చేత కొట్టబడిన రాక్షసుడగు ప్రలంబుని జూచి, గోపాలకులు మిక్కిలి ఆశ్చర్యపడినవారగుచు "బాగుబాగు" అనుచు సంతసించిరి. "అసాధుం సాధు రూపిణమ్" అను పాఠమున 'అమాయకుని వలె ఉన్న ఆ దుర్మార్గుని చూచి' అని యర్థము. (30)

**శ్లో॥** ఆశిషోఽభి గృణంతస్తం ప్రవశంసుస్తదర్హణమ్ ।
ప్రేత్యాగతమివాలింగ్య ప్రేమ విహ్వల చేతసః ॥ (31)

**తా॥** ప్రేమతో విహ్వలమైన మనస్సులు గలవారై గోప బాలకులు, బలరాముని, పరలోకమునుండి తిరిగివచ్చిన వానిని వలె కౌగలించుకొని అతనిని ఆశీస్సులతో ముంచెత్తుచు, అభినందించుచు, పూజ్య భావమున గౌరవించిరి. (31)

**టీ॥** ఆశిషితి. తదర్హణం ప్రశంసార్హం. (31,32)

**శ్లో॥** పాపేప్రలంబే నిహతే దేవాః పరమ నిర్వృతాః ।
అభ్య వర్షన్ బలం మాల్యై శ్శశంసుస్సాధుసాధ్వితి ॥ (32)

**శ్రీ మద్భాగవతే, మహాపురాణే దశమస్కంధే,**
**అష్టాదశోఽధ్యాయః**

**టీ॥** తదర్హణంః ప్రశంసాపాత్రుని (బలరాముని) (31,32)

**తా॥** పాపాత్ముడగు ప్రలంబుడు చంపబడగా దేవతలు, మిక్కిలిగ తేలిక పడి, బలరామునిపై పూల వాన గురిపించుచు- బలే బలే ! (భళిభళి) అనుచు ప్రశంసించిరి. (32)

**అని శ్రీమద్భాగవతమున దశమస్కంధమందు**
**పదునెనిమిదవ అధ్యాయము సమాప్తము.**

## ఏకోనవింశోఽధ్యాయః

**శ్లో॥** క్రీడాసక్తేషు గోపేషు తద్గావో దూర చారణీః ।
స్వైరం చరంత్యో వివిశుస్తృణ లోభేన గహ్వరమ్ ॥ (1)

**టీ॥** శ్లో. ఊనవింశే నివిష్టం తు గోపగోకులమచ్యుతః, ముంజారణ్యమరణ్యాగ్నేర రక్షత్తన్నిపా నతః. క్రీడేతి. దూరచారిణీః దూరచారిణ్యః ప్రథమార్థే ద్వితీయా. (1)

**శ్లో॥** అజా గావో మహిష్యశ్చ నివిశంత్యో వనాద్వనమ్ ।
ముంజాటవీం ని వివిశుః క్రందంత్యో దావతర్షితాః ॥ (2)

**టీ॥** అజాఇతి. వనాద్వనాంతరం నివిశంత్యః. దావేన తర్షితాః క్రందంత్యః ఇషికాటవీం అత్యుచ్ఛ్రిత ఘనతృణవిశేషారణ్యం వివిశుః (2)

## పందొమ్మిదవ అధ్యాయము

**తా॥** గోప బాలకులు ఆటల యందు నిమగ్నులై యుండగా, ఆవులు దూరముగ తిరుగుచున్నవియై, స్వేచ్ఛగా ముందునకు బోవుచు, పచ్చిక మీద ఆశతో నొక కొండ బిలమును ప్రవేశించినవి. (1)

**టీ॥** ఈ పందొమ్మిదవ అధ్యాయమున, ముంజగడ్డితో నిండిన అరణ్యమున ప్రవేశించిన గోవులను, గోపాలకులను, కార్చిచ్చు మ్రింగివేయకుండ కృష్ణుడు రక్షించెను. ( ఈ భావముగల శ్లోకము శ్రీధరస్వామి వారిది) దూరచారిణీః –దూరముగ తిరుగుచున్నవియైన– ప్రథమా విభక్త్యర్థమున ద్వితీయా విభక్తి వాడబడినది. (1)

**తా॥** మేకలు, ఆవులు, గేదెలు ఒక వనము నుండి మరియొక వనములోనికి ప్రవేశించుచు, ముంజగడ్డితో నిండియున్న అడవి లోనికి ప్రవేశించి, అచటి కార్చిచ్చు వలన దాహముతో ఆక్రోశింపసాగినవి.(2)

**టీ॥** అడవి నుండి అడవికి బోవుచు కార్చిచ్చు చేత 'దాహము' గొని, అరచుచు – మిక్కిలి దట్టమైన గడ్డిగల, పొడవైన అడవి లోనికి ప్రవేశించినవి. (2)

**శ్లో॥** తే పశ్యంతః పశూన్ గోపాః కృష్ణ రామాదయస్తథా ।
జాతానుతాపాః వివిశుర్విచిన్వంతో గవాం గతిమ్ ॥ (3)

**తా॥** బలరాముడు, కృష్ణుడు మొదలగు గోపాలకులు ఆ పశువులను వెదకుచు, వాని స్థితిని చూచి, తాపము చెంది, (కార్చిచ్చులో, చిక్కిన ఆవుల గతిని చూచుచు) అందు ప్రవేశించిరి. (3)

**టీ॥** తత ఇతి. కృష్ణరామౌ ఆదాయేషాం తే. న తు తౌ. (3)

**టీ॥** కృష్ణుడు, రాముడు మొదలగు వారు. కాని వారు కాదు. (3)

**శ్లో॥** తృణైస్తత్ఖురదచ్ఛిన్నైర్గోష్పదై రంకితైర్గవాం ।
మార్గమన్వ గమన్ సర్వే నష్టా జీవ్యా విచేతసః ॥ (4)

**తా॥** అందరును, పశువులు తప్పిపోవుట వలన దిగులు చెందిన మనస్సులు గలవారై, ఆ పశువుల గిట్టల చేతను, వాని దంతముల చేతను తెగియున్న గడ్డి పరకలనాధారముగ గొని, ఆవుల కాళ్ళ గిట్టల చిహ్నముల చేత దారిని వెదకికొనుచు ముందునకు సాగిరి. (4)

**టీ॥** తృణైరితి. తాసాం గవాం ఖురైః. దద్భిశ్చ. ఛిన్నైస్తృణైర్గోష్పదైరంకితైశ్చ భప్రదేశైశ్చ. గవాం మార్గమన్వగమన్. దష్టా జీవ్యాః గత జీవికా సాధనాః. (4)

**టీ॥** ఆ ఆవుల యొక్క గిట్టల చేతను, దంతముల చేతను తెగిన గడ్డి పరకలతోను, ఆవుల పాదపు గుర్తులతోను నిండిన నేలల ననుసరించుచు, ఆవుల మార్గమును ననుసరించి పోవుచు, తప్పిపోయిన పశువులను సాధించుచున్నవారై. (4)

**శ్లో॥** ముంజాటవ్యాం భ్రష్టమార్గం క్రందమానం స్వగోధనం ।
అప్రాప్య తృషితాః శ్రాంతాస్తతస్తే సంన్యవర్తయత్ ॥ (5)

**తా॥** ముంజగడ్డితో నిండిన అడవి యందు దారి తప్పి రోదించుచున్న పశుసమూహమును చూచి గోపాలురు దప్పిగొని, డస్సి, వచ్చిన మార్గముననే పోవ నిశ్చయించిరి. (5)

**టీ॥** ముంజాటవ్యామితి. ముంచాటవ్యపి సైవ. (5- 7)

**టీ॥** ముంజగడ్డితో నిండిన ఆ అడవి నుండియే - నిడివిగ నున్న అడవి లోనికి- (5 - 7)

**శ్లో॥** కృష్ణః ప్రోత్తుంగ మారుహ్య వృక్షం మేఘ నిభచ్ఛవిః ।
ఆత్మాన మాహ్వాయామాస దర్శయన్ గాస్స్వనామాభిః ॥ (6)

**తా॥** మేఘముల మెరుపు వంటి మెఱుపుతో ప్రకాశించుచున్న కృష్ణుడు మిక్కిలి ఎత్తైన చెట్టు నెక్కి తనను తాను చూపుచు ఆవులను వాని వాని పేర్లతో పిలిచెను. (6)

**శ్లో॥** తా ఆహూతా భగవతా మేఘ గంభీరయా గిరా ।
స్వ నామ్నాం నినదం శ్రుత్వా ప్రతినేదుః ప్రహర్షితాః ॥ (7)

**తా॥** మేఘ గంభీర స్వరముతో భగవానుని చేత పిలువబడిన ఆవులు తమ పేర్ల ధ్వని విని అవి కూడా సంతోషముతో "అంబా" అనుచు సమాధానమిచ్చెను.(7)

**శ్లో॥** తతస్సమంతా ద్వన ధూమకేతు
ర్యదృచ్ఛయాభూత్ క్షయ కృద్వనౌకసామ్ ।
సమీరిత స్సారథినోల్బణోన్ముఖై
ర్లిలేలిహానః స్థిర జంగమాన్ మహాన్ ॥ (8)

**తా॥** అప్పుడు ఆ అడవి అంతటను, వారికి వినాశమును కలిగించు నట్టి కార్చిచ్చు విచ్చల విడిగ వ్యాపించు చుండెను. వాయువుతో ప్రేరేపింపబడుచు ఉవ్వెత్తున పైకి లేచుచున్న ఆ మహా దవానలము అచటి జడ పదార్థములను, చేతనములను ఆస్వాదించుచు దహించి వేయుచుండెను. (8)

**టీ॥** తత ఇతి. గోపానాం నాశహేతుర్వన వహ్నిః. సర్వతః ప్రాదురభూత్. సారథినా వాయునా. (8-12)

**టీ॥** గోపాలకుల నాశకారణమగు కార్చిచ్చు అంతటను పుట్టెను. సారథినా- గాలిచేత. (8-12)

**శ్లో॥** తమాపతంతం పరితో దవాగ్నిం
గోపాస్స గావః ప్రసమీక్ష్య భీతాః ।
ఊచుశ్చ కృష్ణం సబలం ప్రపన్నా
యథా హరిం మృత్యుభయార్దితా జనాః ॥ (9)

**తా॥** గోవులతో కూడిన గోపాలకులు,చుట్టును వ్యాపించుచు వచ్చి పడుచున్న కార్చిచ్చును చూచి, భయపడినవారై – మరణభయముచే ఆందోళన పడుచున్న మనుష్యులు హరి(ని) శరణు వేడుచున్నట్లు– కృష్ణ బలరాములతో నిట్లనిరి. (9)

**గోపాఊచుః**

**శ్లో॥** కృష్ణ కృష్ణ మహావీర్య ! హే రామామిత విక్రమ ।
దవాగ్నినా దహ్యమానాన్ ప్రపన్నాం స్త్రాతుమర్హథః ॥ (10)

**గోపాలకులిట్లనిరి.**

**తా॥** మహా పరాక్రమశాలివగు ఓ కృష్ణా! అమిత బలశాలివగు ఓ బలరామా! ఈ దవాగ్నిలో కాలిపోవుచున్న ఆర్తులను, మిమ్ము శరణుపొందిన వారిని కాపాడదగియున్నారు.(10)

**శ్లో॥** నూనం త్వద్బాంధవాః కృష్ణ! నార్హంత్యేవావసాదితుం
వయం హి సర్వధర్మజ్ఞ! త్వన్నాథాస్త్వత్పరాయణాః (11)

**తా॥** కృష్ణా! నిన్నే రక్షకునిగ కలిగి, నిన్నే ఆశ్రయించియున్న నీ బంధువులమైన మేము ఈ కార్చిచ్చు చేత నాశము పొందదగిన వారము కాదు కదా! నీవు సకల ధర్మములను తెలిసిన వాడవు. (శరణు పొందిన వారిని కాపాడుట పరమధర్మమని నీకు తెలియనిది కాదు అని – ధర్మజ్ఞా! అని సంబోధించుటలోని భావము) (11)

**శ్రీశుక ఉవాచ**

**శ్లో॥** వచో నిశమ్య కృపణం బంధూనాం భగవాన్ హరిః ।
నిమీలయత మాభైష్ట లోచనా నీత్యభాషత ॥ (12)

**శుకయోగి యిట్లనెను**

**తా॥** భగవానుడగు శ్రీకృష్ణుడు తన బంధువుల దీనాలాపమును విని, "కన్నులు మూసికొనుడు, భయపడకుడు" అనెను. (12)

శ్లో॥ తథేతి మీలితాక్షేషు భగవానగ్ని ముల్బణమ్ ।
పీత్వా ముఖేన తాన్ కృచ్ఛ్రాద్యోగాధీతో వ్యమోచయత్ ॥ (13)

తా॥ 'అట్లే' యని వారు కన్నులు మూసికొనగా యోగాధీశుడగు భగవానుడు, ఆ తీక్ష్ణమగు అగ్నిని నోటితో త్రాగివేసి వారిని ఆ పీడ నుండి విముక్తులను జేసెను. (13)

టీ॥ తథేతి. కృచ్ఛ్రాత్ గహ్వరప్రవేశతృట్ఛ్రమాది జనితాత్ తత్ క్షణమేవ భాండీరం నీత్వా. తానమోచయ దిత్యర్థః. (13)

టీ॥ కృచ్ఛ్రాత్– కొండబిలము– లేక దట్టమగు అరణ్యము లోనికి ప్రవేశించుట చేత కలిగిన దాహము, శ్రమ మొదలగు వాని బాధనుండి – ఆ క్షణముననే, మేడిపండ్ల రసమును ద్రాగినట్లు అగ్నిని త్రాగివేసి కృష్ణుడు వారిని ఆ అగ్ని బాధ నుండి విముక్తులంజేసెను. అని యర్థము. (13)

శ్లో॥ తతశ్చ తే ఉక్షీణ్యున్మీల్య పునర్భాండీరమాపితాః ।
నిశామ్య విస్మితా ఆసన్నాత్మానం గాశ్చమోచితాః ॥(14)

తా॥ "మీరును ఆవులును దవానలము నుండి విముక్తులైతిరి" అను కృష్ణుని అను మాటలు విని, కన్నులు తెరచి చూడగా వారు మేడి చెట్టు దగ్గర ఉండిరి. ఆశ్చర్యపడిరి. (14)

టీ॥ తత ఇతి. క్షణేనైవ భాండీరం ప్రాపితాః. తత్ర అక్షీణ్యున్మీల్య విస్మితా ఆసన్. (14–17)

టీ॥ క్షణములో మేడిచెట్టును చేరిరి. అచట కన్నులు తెరచి ఆశ్చర్యముతో నుండి పోయిరి అని అర్థము. (14 –17)

శ్లో॥ కృష్ణస్య యోగ వీర్యం తద్యోగమాయానుభావితమ్ ।
దవాగ్నే రాత్మనః క్షేమం వీక్ష్య తం మేనిరేఽమరమ్ ॥ (15)

తా॥ కృష్ణ భగవానుని యోగమాయ చేత ప్రభావితమైన, ఆతని యోగశక్తి వలన ఆ కార్చిచ్చు నుండి తమకు ఆపద తప్పిపోయి, క్షేమము ఘటించుట చూచి, వారాతనిని దేవుడని భావించిరి. (15)

శ్లో॥ గాస్సన్నివర్త్య సాయాహ్నే సహ రామో జనార్దనః ।
వేణుం విరణయన్ గోష్ఠమగాద్గోపై రభిష్టుతః ॥ (16)

తా॥ సాయంకాలమున బలరామునితో కూడి శ్రీకృష్ణుడు ఆవులను మరలించుకొని, పిల్లనగ్రోవిని వాయించుచు, గోపబాలురతో స్తుతింపబడుచు వ్రజమునకు చేరిరి. (16)

శ్లో॥ గోపీనాం పరమానంద ఆసీద్గోవింద దర్శనే ।
క్షణంయుగ శతానీవ యాసాం యేన వినా భవత్ ॥ (17)

తా॥ ఏ గోప స్త్రీలకు కృష్ణుడు లేని క్షణము నూరు యుగముల వలె భారముగ గడచుచుండెనో అట్టి వారికి అతడు కనబడుటతో పరమానందమయ్యెను. (17)

టీ:- శ్లో. శ్రీదామాది స్వగోపానాం స్వాంగమారుహ్య హృష్యతాం, న్వైశ్వర్యమావిరకరోద్వన వహ్ని నిపానతః. శ్రీధరీయోఽయం శ్లోకః

టీ॥ తన అవయవముల మీద బడి సంతోషించుచున్న శ్రీదాముడు మొదలగు తన వారగు గోపబాలకులకు, వనాగ్నిని త్రాగిన శ్రీకృష్ణుడు - తన వైభమును ప్రకటము చేసెను. (ఇది శ్రీధరీయ శ్లోకభావము)

**శ్రీ మద్భాగవతే, మహాపురాణే దశమస్కంధే,**
**ఏకోనవింశోఽధ్యాయః**

**అని శ్రీమద్భాగవతమున దశమస్కంధమందు**
**పందొమ్మిదవ అధ్యాయము సమాప్తము.**

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

## వింశో௨ధ్యాయః

### శ్రీశుక ఉవాచ

**శ్లో॥** తయోస్తదద్భుతం కర్మ దవాగ్నేర్మోక్షమాత్మనః ।
గోపా స్త్రీభ్యస్సమాచఖ్యుః ప్రలంబ వధమేవ చ ॥ (1)

**టీ॥** శ్లో. వింశే ప్రావృట్ఛరచ్ఛోభావర్ణనేన వనోచితాః. ప్రావృట్ క్రీడా నిరూప్యంతే గోపరామయుజో హరేః. హేయాదేయోపమానేన ప్రావృట్ఛరదృతుశ్రియోః, వర్ణనం త్వద్భుతైశ్వర్యకృష్ణ లీలావివక్షయా. (1,2)

**శ్లో॥** గోపా వృద్ధాశ్చ గోప్యశ్చ తదిపాకర్ణ్య విస్మితాః ।
మేనిరే దేవ ప్రవరౌ రామకృష్ణౌ వ్రజంగతౌ ॥ (2)

**శ్లో॥** తతః ప్రావర్తత ప్రావృట్సర్వ సత్త్వ సముద్భవా ।
విద్యోతమాన పరిధిర్విస్ఫూర్జిత నభస్థలా ॥ (3)

## ఇరువదియవ అధ్యాయము

### శ్రీశుక యోగీంద్రుడిట్లనెను

**తా॥** ప్రలంబుని వధ, కార్చిచ్చు నుండి తమను విడిపించుట మున్నగు కృష్ణ బలరాముల అద్భుతమగు పనులను గూర్చి గోపాలకులు వ్రజస్త్రీలకందఱకును వివరించిరి. (1)

**టీ॥** ఈ ఇరువదవ అధ్యాయమున వర్షాకాలము, శరత్కాలముల యందలి అడవుల శోభను వర్ణించుట చేత గోపాలురు, బలరామునితో కలిసిన శ్రీకృష్ణుని యొక్క వర్షాకాలపు క్రీడలు నిరూపింపబడును. విడువదగినవి – స్వీకరింపదగినవి అను ఉపమానములతో వర్షాకాల శరత్కాలముల వైభవముల వర్ణన, అద్భుతమైన ప్రాభవముగల శ్రీకృష్ణుని లీలలను చెప్పదలచి – చేయబడినది. (1,2)

**తా॥** గోపాలకులు చెప్పిన దంతయు విని, ముసలి వారు, గోపస్త్రీలు, గోపాలకులును బలరామ కృష్ణులిరువు వ్రజమునందున్న దేవతా శ్రేష్ఠులుగా భావించిరి. (2)

**తా॥** అప్పుడు, సర్వ ప్రాణుల ఉత్పత్తి, స్థితులకు కారణమైనదియు, పరివేషముల (తేజో వలయముల) శోభగలదియు, సంక్షుభితమైన ఆకాశ స్థలము గలదియునై వర్షాకాలము ప్రవర్తించెను (3)

**టీ॥** తతఇతి. సర్వేషాం ప్రాణినాం సముద్భవః ఉత్పత్తితః జీవనతశ్చ. యస్యాం సా. ప్రావృట్ విద్యోతమానాః పరిధయః పరివేషాది శోభాః యస్యాం సా. విస్ఫూర్జితం సంక్షుభితం. నభస్థలం చ యస్యాం సా.(3)

**టీ॥** ప్రాణులన్నింటి పుట్టుకకు జీవనమునకు కారణము దేనియందో అది – తేజో వలయముల శోభలు దేని యందో అది – సంక్షోభించు ఆకాశ స్థలము దేనియందో అది. (వర్షర్తువు) (3)

**శ్లో॥** సాంద్ర నీలాంబుదైర్వ్యోమ స విద్యుత్స్తనయిత్నుభిః ।
అస్పృష్ట జ్యోతి రాచ్ఛన్నం బ్రహ్మేవ సగుణం బభౌ ॥ (4)

**తా॥** మెఱుపులు, ఉఱుములతో కూడిన దట్టమైన నల్లని మబ్బుల తోను, పేలవమైన కాంతితో కప్పబడియు ఆకాశము, సుగుణ బ్రహ్మము వలె నయ్యెను.(4)

**టీ॥** సాంద్రేతి. సాంద్రైర్నిబిడైః నీలాంబుదైః విద్యుర్గర్జితసహితైః. ఆచ్ఛన్నం. సగుణం గుణైరాచ్ఛన్నం జీవాఖ్యం. విద్యుర్గర్జితాంబుదానాం సత్త్వరజస్తమోభిరుపమా. (4)

**టీ॥** నిబిడమైన నల్లని మేఘములతో ఉఱుములు మెఱుపులతో కూడిన వానితో కప్పబడినదియై – సగుణం – గుణములతో కప్పబడిన జీవుడను పేరు గల వానిని – మెఱుపులు, ఉఱుములుతో కూడిన మేఘములకు, సత్త్వ రజస్తమో గుణములతో పోలిక.(4)

**శ్లో॥** అష్టౌ మాసాన్నిపీతం యద్భూమ్యాముదమయం వసు ।
స్వ గోభిర్మోక్తు మారేభే పర్జన్యః కాల ఆగతే ॥ (5)

**తా॥** ఎనిమిది నెలలుగ, కప్పము రూపమున భూమిపైన గల నీటిని త్రాగి వేసిన సూర్యుడు, (వర్షా) కాలము రాగానే తన కిరణములతో వదలి పెట్టుట కారంభించెను.(5)

**టీ॥** అష్టావితి. పర్జన్యః సూర్యః. స్వగోభిః. రశ్మిభిః. కాలే యథోచిత సమయే. అత్ర రాజోపమా. కరాదానతః సమయే పునర్దానతశ్చ. సూచితా. (5)

**టీ॥** పర్జన్యః – సూర్యుడు – స్వగోభిః – తన కిరణములచేత – కాలే – ఉచితమైన సమయమున – ఇచట రాజుతో పోలిక – కప్పము తీసికొనుట చేత – సమయము వచ్చినప్పుడు తిరిగి యిచ్చుటతో – అను విషయము సూచింపబడినది.(5)

**శ్లో॥** తటిత్వంతో మహామేఘాశ్చండ శ్వసన వేపితాః ।
ప్రాణనం జీవనం చాస్య ముముచుః కరుణా ఇవ ॥ (6)

**తా॥** మెఱుపులతో కూడిన గొప్పనైన మేఘములు ప్రచండమగు గాలివలన కదలిక కలిగినవియై, (దయనువలె) సుఖమును కలిగించు నీటిని విడిపెట్టెను (వర్షించెను).(6)

**టీ॥** తటిత్వంత ఇతి. అస్య విశ్వస్య. ప్రాణనం ఆప్యాయనకరం. జీవనముదకం. ముముచుః. కృపాళవః. యథా తప్తం జనం నిరీక్ష్య. అనుకంపమానాః. తదాప్యాయనాయ. స్వజీవనమపి త్యజంతి. తద్వన్మహాంతో మేఘాః. తటిన్నేత్రైస్తప్తం విశ్వం నిరీక్ష్య. వాయుభిర్వేపితాః జీవనం ముముచురితి. (6)

**టీ॥** అస్య విశ్వస్య – ఈ ప్రపంచమునకు – ప్రాణనం – ఆప్యాయన కరం – సుఖమును కలిగించనట్టి జీవనం – నీటిని – ముముచుః – విడిచినవి. కృపాళవః – దయగలిగినవిమై – లేక – దయగలవారు, తపించు జనమును చూచి, జాలి తలచుచు వారికి సుఖము కలిగించుట కొఱకు తమ జీవితములను కూడ విడిచి పెట్టుదురో అట్లే గొప్ప మేఘములు కూడా – మెఱుపుల వలన తాపము పొందిన కన్నులు గలవారైన ప్రాణులుగల ప్రపంచమును చూచి– గాలులచేత కంపింపజేయబడినవియై తమ జీవనమును (నీటిని) విడిచిపెట్టెను – అని.(6)

**శ్లో॥** తపః కృశా దేవమీఢాహ్యసీద్వర్షీయసీ మహీ ।
యథేవ కామ్య తపసస్తనుస్సంప్రాప్య తత్ఫలమ్ ॥ (7)

**తా॥** కామ్యమైన తపస్సు నాచరించినవ్యక్తి మొదట కృశించి, తపః ఫలము సిద్ధింపగానే తన యథా పూర్వమైన శరీరమును పొందునట్లు – బహువత్సరముల వయస్సు కలిగిన భూమి మొదట గ్రీష్మమునందు శుష్కించి మేఘుడు వర్షించుటతో తడిసిపోయి పచ్చదనముతో కళకళ లాడిన దయ్యెను. (7)

**టీ॥** తతఇతి. తపసా గ్రీష్మేణ. కృశా. దేవమీఢా పర్జన్యసిక్తా. మిహ సేచన ఇతి ధాతుః. వర్షీయసీ. ఉచ్ఛూనా పుష్టా. కామ్యం తపో యస్య తస్య తనుః కామాన్ సంప్రాప్య యథేతి. (7. 8)

**టీ॥** తపసా – గ్రీష్మముచేత – కృశా – శుష్కించినదై – దేవమీఢా – మేఘునితో తడుపబడి – "మిహసేచనే" అని ధాతువు, వర్షీయసీ – వృద్ధురాలైన భూమి– ఉచ్ఛూనా – పుష్టిగలదయ్యెను. కోరిక నీడేర్చు కొనుటకు తపస్సు ఎననికో, అతనికి తపస్సు యొక్క ఫలమెట్లు పొందియుండునో అట్లు అని. (7,8)

**శ్లో॥** నిశాముఖేషు ఖద్యోతాస్తమస్తాం భాంతి న గ్రహాః ।
యథా పాపేన పాషండా న హి వేదాః కలౌ యుగే ॥ (8)

**తా॥** కలియుగము నందు పాపము చేత నాస్తిక మతముల వారెట్లు ప్రకాశింతురో, వేదములెట్లు ప్రకాశింపవో అట్లే వర్షర్తువున రాత్రి యగుచున్నప్పుడు చీకట్లలో మిరుగుడు పురుగులు ప్రకాశించు చుండును. గ్రహములు ప్రకాశింపవు. (8)

**శ్లో॥** శ్రుత్వా పర్జన్య నినదం మండూకా వ్యసృజన్ గిరః ।
తూష్ణీం శయానాః ప్రాగ్యద్వద్బ్రాహ్మణా నియమాత్యయేః ॥ (9)

**తా॥** అంతకు మునుపు ఊరక పరుండియున్న కప్పలు, మేఘగర్జన వినుట తోడనే – బ్రాహ్మణులు నిత్యకర్మ పూర్తికాగానే వేదమంత్రములు పఠించుచుండినట్లు – బెక బెలాడుచుండెను. (9)

**టీ॥** శ్రుత్వేతి. నియమాత్యయే నిత్యకర్మావసానే ఆచార్యనిగమం శ్రుత్వా. తచ్ఛిష్యాః యథా అధీయంతే తద్వదితి. (9)

**టీ॥** నియమాత్యయే – నిత్యకర్మ సమాప్తికాగానే గురువు గారి వేద పాఠమును విని వారి శిష్యులు ఎట్లు అధ్యయనము చేయుటకు ఉపక్రమింతురో అట్లు – అని. (9)

**శ్లో॥** ఆసన్నుత్పథ వాహిన్యః క్షుద్రనద్యోఽనుశుష్యతీః ।
పుంసో యథా స్వతంత్రస్య గేహే ద్రవిణ సంపదః ॥ (10)

**తా॥** ఇంద్రియములకు వశుడై స్వాతంత్ర్యమును కోల్పోయిన మనుష్యుని యింట ధనసంపదలే విధముగ వ్యర్థముగ వ్యయమై పోవుచుండునో అట్లే – శుష్కించిన కాలువల వంటి చిన్న నదులు ఒడ్డు లొరసికొని ప్రవహించుచుండెను. (10)

**టీ॥** ఆసన్నితి. అనుశుష్యతీః అనుశుష్యంత్యః. అస్వతంత్రస్య ఇంద్రియపరతంత్రస్య. స్వతంత్రస్యేతిచ్ఛేదే. నిరంకుశస్యేత్యర్థః. (10)

**టీ॥** అను శుష్యతీః – గ్రీష్మము ననుసరించి ఎండిపోవుచున్నవై – అస్వతంత్రస్య – ఇంద్రియ పరతంత్రునకు – స్వతంత్రస్య అను పదచ్ఛేదమున నిరంకుశునకు అని యర్థము. (10)

**శ్లో॥** హరితా హారిభిశ్శష్పైరింద్ర గోపైశ్చ లోహితా ।
ఉచ్ఛిలీంధ్ర కృత చ్ఛాయా నృణాం శ్రీరివ భూరభూత్ ॥ (11)

**తా॥** పచ్చని లేత గరికలతో ఆకుపచ్చగను, ఆరుద్ర పురుగులతో ఎఱుపు వన్నె కలిగియు, పైకి పెరిగిన పుట్ట గొడుగులచేత తెలుపువన్నె గలిగియు భూమి, రాజుల సంపదయగు సైన్యము విడిసినట్లయ్యెను. (మనుష్యుల సంపద (ధాన్యములను) ఆరబోసి నట్లుండెను) (11)

**టీ॥** హరితేతి. హారిభిః నీలైః శష్పైః బాలతృణైః నీలవర్ణా క్వచిత్. క్వచిదింద్రగోపైః కీటవిశేషైః లోహితా ఆరక్తా తత్ర తత్ర ఉచ్ఛిలీంధ్రై శ్ఛత్రాకారైః పుష్పైః. కృతచ్ఛాయా నృణాం రాజ్ఞాం శ్రీః. సేవా సంపదివ. (11)

**టీ॥** పచ్చని లేత గరికలతో ఆకుపచ్చగను, ఆరుద్ర పురుగులతో ఎఱుపు వన్నె కలిగియు, పైకి పెరిగిన పుట్ట గొడుగులచేత తెలుపువన్నె గలిగియు భూమి, రాజుల సంపదయగు సైన్యము విడిసినట్లయ్యెను. (మనుష్యుల సంపద (ధాన్యములను) ఆరబోసి నట్లుండెను) (11)

**శ్లో॥** క్షేత్రాణి సస్య సంపద్భిః కర్షకాణాం ముదం దదుః ।
మానినా మనుతాపం చ దైవాధీన మజానతామ్ ॥ (12)

**తా॥** పంట పొలములు ధాన్య సంపదలతో రైతుల కానందము నిచ్చెను. "అంతయును దైవాధీనముగనే నడచును" అను సత్యము తెలియని దురభిమానులకు తాపము నిచ్చెను. (12)

**టీ॥** క్షేత్రాణీతి. తథాహి. వృష్టేరవిచ్ఛేదే లసంతః ప్రియంగ్వాదయః ముదం దదురితి. విచ్ఛేదే శుష్యంతోఽనుతాపం చేతి. (12)

**టీ॥** ఎడతెరిపి లేని వర్షములు పడుచుండగా నవ నవలాడుచు కొఱ్ఱలు మొదలగునవి సంతోషమునిచ్చెను అని. (వర్షమాగి పోవుటచే పొలములెండి పోవగా బాధ అని) (12)

**శ్లో॥** జల స్థలౌకస స్సర్వే నవ వారి నిషేవయా ।
అబిభ్రన్ రుచిరం రూపం యథా హరి నిషేవయా ॥ (13)

**తా॥** భగవానుని సేవించు వారి రూపము, సౌందర్యమును సంతరించు కొనుచుండునట్లు – జలచరములు, స్థల చరములు అన్నియును క్రొత్త నీటిని సేవించుట చేత అందమైన రూపములను ధరించెను. (13)

**టీ॥** – జలేతి. అబిభ్రన్ అభిభరుః యథా హరినిషేవయేతి. హరినిషేవాయం ప్రవృత్తా హి సద్యఏవ సర్వే రుచిరా భవంతి. తస్యాః పరమధర్మత్వాత్ పరమసుఖత్వాచ్చ. తద్వదితి. (13)

**టీ॥** అబిభ్రత్ – ధరించెను, హరిసేవనమునందు ప్రవృత్తులైన వారందఱును అప్పటికప్పుడే సుందరులగుదురు. ఆ సేవ యొక్క పరమ ధర్మత్వము వలన – పరమ సుఖత్వము వలన కూడా – ఆ విధముగ అని. (13)

**శ్లో॥** సరిద్భిస్సంగత స్సింధుశ్చు క్షోభ శ్వసనోర్మిమాన్ ।
అపక్వ యోగినశ్చిత్తం కామాక్తం గుణయుగ్యథా ॥ (14)

**తా॥** పరిపక్వము చెందని యోగి యొక్క చిత్తము కోరికలతో కూడియు, ప్రాకృతిక గుణములతో కూడియు క్షోభించునట్లు, నదులచేత కలయికను పొందిన సముద్రము గాలి వలన కలిగిన అలలతో కల్లోలితమై యుండెను. (14)

**టీ॥** సరిద్భిరితి. కామాక్తం కామవాసనాయుక్తమితి శ్వసనోర్మిసామ్యం. గుణైర్విషయైర్యుజ్యత ఇతి సరిత్సంగతిసామ్యమ్. (14)

**టీ॥** కామాక్తం - కామ వాసనలతో కూడి అని, గాలి వలని తరంగములతో పోలిక - గుణైః - విషయములతో కూడి యుండుటచే - నదుల కలియికతో పోలిక. (14)

**శ్లో॥** గిరయో వర్షధారాభిర్హన్యమానా న వివ్యథుః ।
అభిభూయమానా వ్యసనైర్యథాధోక్షజ చేతసః ॥ (15)

**తా॥** భగవానుని మనస్సునందు నిలుపుకొని యున్నవాడు ఆపదలతో తెగడబడినవాడైనను ఎట్లు చలింపకుండ నుండునో అట్లే వర్ష ధారలచే కొట్టబడుచున్న పర్వతములు వ్యథ చెందక నిశ్చలముగా నుండెను. (15)

**టీ॥** గిరయ ఇతి. అధోక్షజ ఏవ చేతో యేషాం తే. (15)

**టీ॥** భగవానుడే మనసుగ ఎవరికి ఉండునో వారు - (మనుస్సు భగవానుడే అనునట్లు ఉండువారు.) (15)

**శ్లో॥** మార్గాబభూవు స్సందిగ్ధా స్తృణైశ్ఛన్నా అసంస్కృతాః ।
నాభ్యస్యమానా శ్శ్రుతయో ద్విజైః కాలహతా ఇవ ॥ (16)

**తా॥** కాలము చేత కొట్టబడి, బ్రాహ్మణులచేత చక్కగా అభ్యసింపబడని వేదములవలె, మార్గములన్నియు గడ్డితో కప్పబడి, అపరిశుభ్రములై, సందేహాస్పదములయ్యెను. (16)

**టీ॥** మార్గా ఇతి. అసంస్కృతాః అక్షుణ్ణాః. నాభ్యస్యమానాఇత్య సంస్కృతసామ్యం. కాలేన హతా ఇతి తృణాచ్ఛాదనసామ్యం. (16)

**శ్లో॥** లోక బంధుషు మేఘేషు విద్యుత శ్చల సౌహృదాః ।
స్థైర్యం న చక్రుః కామిన్యః పురుషేషు గుణిష్వివ ॥ (17)

**టీ॥** లోక బంధుష్వితి. యథా కామిన్యః పుంశ్చల్యః. (17)

**శ్లో॥** ధనుర్వియతి మాహేంద్రం నిర్గుణం చ గుణిన్య భాత్ ।
వ్యక్తే గుణ వ్యతికరే గుణవాన్ పురుషో యథా ॥ (18)

**టీ॥** ధనురితి. నిర్గుణం జ్యారహితం గుణిని గర్జనశబ్దవతి వియతి. అభాత్ అశోభత. గుణ వ్యతికరాత్మనే వ్యక్తే ప్రపంచే. అగుణవాన్నిర్గుణః పురుషో యథేతి. (18)

**టీ॥** అసంస్కృతాః – శోధింపబడనవియై – 'అభ్యసింపబడని' అని. సంస్కరింపబడని దారులతో పోలిక, కాలముచేత కొట్టబడినవి అని గడ్డిచే కప్పబడిన దారులతో సామ్యము. (16)

**తా॥** గుణవంతులగు పురుషుల యెడ, స్థిరముగ నిలువ జాలని కామినీ స్త్రీల వలె లోకమునకు ఉపకారకములైన మేఘముల యందు, మెఱుపులు, చంచలమగు స్నేహమును కలిగియుండెను. (17)

**టీ॥** యథా కామిన్యః – సురతమును కోరు స్త్రీలు ఏ విధముగా – (సచ్ఛీలురగు పురుషులయెడ అస్థిరులై యుందురో అట్లు) (17)

**తా॥** నిర్గుణమైన బ్రహ్మము, ప్రపంచమున సగుణ రూపమున గల 'పురుషుడు' గ ప్రకాశించునట్లు, అల్లెత్రాడు లేనిదయ్యును ఇంద్ర ధనుస్సు, అల్లెత్రాడు గలదాని వలె గర్జన శబ్దము చేయుచు ప్రకాశించు చుండెను. (18)

**టీ॥** నిర్గుణం–అల్లెత్రాడు లేనిది యైనను –గుణిని–అల్లెత్రాడు గల దాని యందువలె – వియతి – గర్జనయే శబ్దముగా చేయుచుండెను. అభాత్ – శోభించెను, గుణవ్యతికరే – నిర్గుణ బ్రహ్మము –వ్యక్తే–ప్రపంచమున–లేక–(నిర్గుణుడు వ్యక్తముకాగా) – అగుణావాన్ – నిర్గుణుడు, పురుషరూపమున ఎట్లు (వ్యక్తమగునో అట్లు) (18)

**శ్లో॥** నరరాజోడు పశ్చన్నస్స్వజ్యోత్స్నా రంజితైర్ఘనైః ।
అహం మత్యా భాసితయా స్వభాసా పురుషో యథా ॥ (19)

**తా॥** ఆత్మమూలముగనే ప్రకాశించు అహం భావముచేతనే ఆత్మకప్పివేయబడి, ప్రకాశము ప్రచ్ఛన్నమైనట్లు, తన వెన్నెల వెలుగులచేత ప్రకాశించు మేఘములచేత చంద్రుడు కప్పబడి ప్రకాశింపకుండెను. (19)

**టీ॥** నేతి. స్వభాసా భాసితయా అహమ్మత్యేతి. స్వచైతన్యేనైవ ప్రకాశితే నాహంకారేణ ఛన్నో జీవో యథా. యద్వా. తద్వత్ అహం విద్వాన్. దాతా. వేత్తాశూర ఇతి స్వప్రతీత్యేవారోపితయేతి. (19)

**టీ॥** జీవ + ఆత్మ ప్రకాశము చేతనే ప్రకాశించు అహంకారము చేత కప్పబడిన జీవుని వలె లేక – అటులనే అహం అను విద్వాంసుడు తాను ఇచ్చువాడు, తెలిసినవాడు , శూరుడు అని తన ప్రతీతినే ఆరోపించు కొనువాడైనట్లు అని. (19)

**శ్లో॥** మేఘా గమోత్సవా హృష్టాః ప్రత్యనందన్ శిఖండినః ।
గృహేషు తప్తా నిర్విణ్ణా యథాచ్యుత జనాగమే ॥ (20)

**తా॥** ఇండ్లలోనే తపించుచు నిర్వేదము నొందుచుండు వారు, భక్త జనుల రాకతో ఆనందమునొందునట్లు, మేఘముల రాకయే ఉత్సవముగ సంతసించి, నెమిళ్ళు మిక్కిలి ఆనందించుచుండెను. (20)

**టీ॥** మేఘేతి. మేఘాగమేనోత్సవో యేషాం తే. అతో హృష్టాః. (20)

**టీ॥** మేఘముల రాక చేత ఎవరికి ఉత్సవమో అవి (నెమిళ్ళు) అందువలన సంతోషము గలవియై. (20)

**శ్లో॥** పీత్వాపః పాదపాః పద్భిరాసన్ నానాత్మమూర్తయః ।
క్షుత్ క్షామా స్తపసా శ్రాంతా యథా కామానుసేవయా ॥ (21)

**తా॥** ఆకలి (దప్పుల) చేత కృశించి, తపస్సుచేత క్లేశము నొందిన వారు, తపః ఫలమగు కామ్యమును పొందిన తరువాత మఱల స్వస్థత నొందినట్లు, వివిధములగు చెట్లు తమ వేళ్ళతో (వేరులతో) నీటిని త్రాగి కళకళ లాడుచు వికసించెను. (21)

**టీ॥** పీత్వేతి. నానాత్మమూర్తయః అనేకరూపదేహాః. (21)

**టీ॥** నానాత్మమూర్తయః – అనేక రూపముల దేహములు గలవి (చెట్లు). (21)

**శ్లో॥** సరస్స్వశాంతరోధస్సు న్యూషు రంగాపి సారసాః ।
గృహేష్వ శాంత కృత్యేషు గ్రామ్యా ఇవ దురాశయాః ॥ 22

**తా॥** రాజా! విషయ వాంఛలతో నిండిన హృదయములు గల పామరులు, అలజడితో కూడి కృత్యములు గల ఇండ్లనే అంటి పెట్టుకొని యున్నట్లు, బెగ్గురు పక్షులు – బురద, ముండ్లు మొదలగు వానితో అశాంతముగనున్న జలాశయముల తీరములందు విడువకుండ నివసించుచుండెను. (22)

**టీ॥** సరస్స్వితి. అశాంతాని పంక కంటకాది యుక్తాని. రోధాంసి తటాని యేషాం తే తేష్వపి న్యూషుః నితరామవసన్. సారసాః చక్రవాకాః అశాంతాని ఘోరాణి అనుపరతాని వా. కృత్యాని యేషుతేష్వపి గృహేషు. (22)

**టీ॥** అశాంతాని – బురద, ముండ్లు మున్నగు వానితో కూడియున్న – రాధాంసి – తటములు (ఒడ్డులు) వేనికో అవి. వానియందు కూడా – న్యూషుః –ఎల్లప్పుడు నివసించుచుండెను – సారసాః–చక్రవాక పక్షులు – అశాంతాని – ఘోరములైన – లేక శాంతిలేని, కార్యములు వేనియందు గలవో అట్టి ఇండ్లల్లో. (22)

**శ్లో॥** జలౌఘైర్నిరభిద్యంత సేతవో వర్షతీశ్వరే ।
పాషండినా మసద్వాదైర్వేద మార్గాః కలౌ యథా ॥ (23)

**తా॥** కలియుగమునందు నాస్తికుల దుష్టవాదముల చేత, వేద మార్గములు శైథిల్యమును పొందినట్లు, ఇంద్రుడు వర్షములు కురిపించుచుండగా నీటి సమూహముల ఒత్తిడిచేత ఆనకట్టలు పగుళ్ళువారెను. (23)

**టీ॥** జలౌఘైరితి. ఈశ్వరే ఇంద్రే. (23)

**టీ॥** ఈశ్వరే - ఇంద్రుడు (వర్షించుచుండగా) (23)

**శ్లో॥** వ్యముంచన్ వాయుభిర్నున్నా భూతేభ్యోహ్యమృతం ఘనాః ।
యథాశిషో విశ్పతయః కాలే కాలే ద్విజేరితాః ॥ (24)

**తా॥** బ్రాహ్మణులచేత చెప్పబడిన ఆశీర్వచనములకు, రాజులు (ధనికులు) ఆ యా సమయముల యందు ఆ యా దానములిచ్చునట్లు - గాలిచేత ప్రేరేపించబడిన మేఘములు ప్రాణుల కొఱకు, అమృతము వంటి నీటిని, ధారాళముగ విడిచిపెట్టెను. (24)

**టీ॥** వ్యముంచన్నితి. నున్నాః ప్రేరితాః. ఆశిషః కామాన్. విశ్పతయో రాజానః. వణిజాం పతయో వా. ద్విజేరితాః పురోహితైరుక్తాః. (24)

**టీ॥** నున్నాః - ప్రేరేపింపబడినవియై - ఆశిషః - కోరికలను - విశ్పతయ- రాజులు - వ్యాపార ప్రముఖులైనను - ద్విజేరితాః - పురోహితులచే చెప్పబడిన వారై. (24)

**శ్లో॥** ఏవం వనం తద్వర్షిష్ఠం పక్వ ఖర్జూర జంబుమత్ ।
గో గోపాలైర్వృ తో రంతుం సబలః ప్రావిశద్ధరిః ॥ (25)

**తా॥** అతిశయమైన వర్షములతో కూడి, పండిన ఖర్జూరములు, నేరేడు పండ్లుగల ఆ వనమున, గోవులు, గోపాలురు, బలరామునితో కూడి విహరించుటకు కృష్ణుడు ప్రవేశించెను.(25)

**టీ॥** ప్రావృషి కృతాః క్రీడాః వర్ణయతి సప్తభిః. ఏవమితి. వర్షిష్ఠం సమృద్ధం అతిశయవర్షయుక్తం వా. (25. 26)

**టీ॥** వర్షిష్ఠం - సమృద్ధమైన - అతిశయించిన వర్షముతో కూడినదనియు - వర్షాకాలమున కృష్ణాది బాలుర క్రీడలను ఏడు శ్లోకములతో వర్ణించుచున్నాడు. (25,26)

**శ్లో॥** ధేనవో మందగామిన్య ఊధో భారేణ భూయసా ।
యయుర్భగవతా హూతా ద్రుతం ప్రీత్యా స్నుతస్తనాః ॥ (26)

**తా॥** విస్తారమైన పొదుగు బరువుచేత ఆవులు మెల్లగ నడుచుచు కృష్ణుని చేత పిలువబడుచు (తోలబడుచు) చన్నులు చేపులు రాగా తొందరపడుచు ఆటకు చేరెను. (26)

**శ్లో॥** వనౌకసః ప్రముదితా వనరాజీర్మధుచ్యుతః ।
జలధారా గిరే ర్నాదానాసన్నాన్ దదృశే గుహాః ॥ (27)

**తా॥** వనమునందు నివసించు నిషాదులు మున్నగువారు మిక్కిలి సంతసించిరి. వన సమూహము తేనెలు కురిసెను. కొండపై నుండి పడుచున్న నీటి ధారలు హర్ష ధ్వానములు చేసెను. కొండబిలములు ప్రతిధ్వనించెను. ఇట్లు నిషాదులు, వన సమూహము, కొండవాలున పడు నీటిధారలు, గుహలును ఆ వచ్చిన వారిని చూచెను. (27)

**టీ॥** వనౌకస ఇతి. వనౌకసః పుళిందాః ప్రముదితాః భగవాన్ దదృశే. తథా వనరాజీః వనపరంపరాః. మధుచ్యుతః మధుస్రవాః. దదృశే గిరేస్సకాశాజ్జలధారాః తాసాం నాదాంశ్చ. ఆసన్నాః నికటవర్తినీర్గుహాశ్చ. యద్వా. వనౌకసః ప్రముదితా ఆసన్. తథా వనరాజీర్వనరాజయః. మధుచ్యుత ఆసన్ గిరేర్జలధారా ఆసన్ తానేవంభూతాన్ ఆదదృశే సర్వతో దదర్శ భగవాన్ తథా. జలధారాణాం నాదాన్ గుహాశ్చేతి. (27-31)

**టీ॥** వనౌకసః - పుళిందులు సంతసించుచు భగవానుని చూచిరి. అట్లే వనపరంపరలు తేనెలు కార్చుచు కృష్ణుని చూచెను. కొండపై నుండి జారు నీటిధారలు వాని ధ్వనులు చేయుచుండెను. దగ్గరలో నున్న గుహలు, లేక - వనమున నున్నవారు సంతసముతో నుండిరి మరియు అడవుల సమూహములు తేనెలు వదలుచున్నవగు చుండెను, కొండనుండి నీటిధారలు పడుచుండెను. (తాన్ -గో గోపాల కృష్ణాదులను అవి చూచెను) లేక - తాన్ - ఇట్టి వనౌకసాదులను భగవానుడు చూచెను, మరియు నీటిధారల ధ్వనులను, గుహలను -అవి- (చూచెను).(27-31)

శ్లో॥ క్వచిద్వనస్పతి క్రోడే గుహాయాం చాభి వర్షతి ।
నిర్విశ్య భగవాన్ రేమే కందమూల ఫలాశనః ॥ (28)

తా॥ వర్షము కురియుచున్న సమయములో, భగవానుడగు శ్రీకృష్ణుడు ఒక్కొక్కప్పుడు చెట్టు ఒడిలోను, ఒక్కొక్కప్పుడు కొండ గుహలోను, ప్రవేశించుచు, ఒక్కొక్క సమయమున గడ్డలు, పండ్లు తినుచును క్రీడించుచుండెను. (28)

శ్లో॥ దధ్యోదన ముపానీతం శిలాయాం సలిలాంతికే ।
సంభోజనీయైర్బుభుజే గోపైస్సంకర్షణాన్వితః॥ (29)

తా॥ నీటియొడ్డున గల ఱాతిపై కూర్చుండి, వెంట తెచ్చుకొనిన పెరుగన్నమును గోపాలురు, బలరాముడు మొదలైన భోజనము చేయదగిన వారితో కలిసి, తినుచుండును. (29)

శ్లో॥ శాద్వ లోపరి సంవిశ్య చర్వతో మీలి తేక్షణాన్ ।
తృప్తాన్ వృషాన్ వత్సతరాన్ గాశ్చ స్వోధో భర శ్రమాః ॥ (30)

తా॥ కృష్ణుడు పచ్చికబయలు మీదకు ప్రవేశించి, కన్నులు మూసికొని మేయుచున్నవియు, తీవీగానున్నవియు అయిన ఎడ్లను కోడెదూడలను, తమ పొదుగు బరువుతో అలసిన ఆవులను – చూచి (ముందరి శ్లోకముతో అన్వయము) (30)

శ్లో॥ ప్రావృట్ఛ్రియంచ తాం వీక్ష్య సర్వభూత సుఖావహామ్ ।
భగవాన్ పూజయాం చక్రే హ్యాత్మ శక్త్యుపబృంహితామ్ ॥ (31)

తా॥ ప్రాణులన్నింటికి సుఖమును కలిగించునదియు, ఆత్మశక్తిని వృద్ధి చేయునదియునైన ఆ వర్షాకాలపు శోభను చూచి భగవానుడైన కృష్ణుడు (తన సృష్టియే యైనను) దానిని అభినందించెను. (31)

**శ్లో॥** ఏవం నివసతోస్తస్మిన్ రామకేశవయోర్వ్రజే ।
శరత్సమభవద్వ్య భ్రా స్వచ్ఛాంబ్వపరుషానిలా ॥ (32)

**టీ॥** తతః శరదం వర్ణయత్యష్టాదశభిః ఏవమితి. విగతాని అభ్రాణి యస్యాం సా. స్వచ్ఛాని అంబూని యస్యాం సా. అపరుషః శాంతోఽనిలో యస్యాం సా. (32)

**తా॥** బలరామకృష్ణులీవిధముగ వ్రజములో నివసించుచుండగా, వర్షామేఘములు లేనిదియును, పరిశుద్ధమైన నీరు గలదియును, ప్రశాంతమైనగాలి వీచునట్టిదియునైన శరత్కాలము వచ్చెను. (32)

**టీ॥** పదునెనిమిది శ్లోకములతో శరదృతువును వర్ణించుచున్నాడు – ఏవం అని. పోయిన వర్షామేఘములు దేనియందో అది. స్వచ్ఛమైన నీరు దేనియందో అది. ప్రశాంతమగు గాలి దేనియందో అది. (ఆ శరత్తు) (32)

**శ్లో॥** శరదా నీరజోత్పత్త్యా నీరాణి ప్రకృతిం యయుః ।
భ్రష్టానామివ చేతాంసి పునర్యోగ నిషేవయా ॥ (33)

**టీ॥** శరదేతి. నీరజానాముత్పత్తిర్యయా తయా. శరదా. కృతానాం నీరజానాముత్పత్త్యా వా. (33)

**తా॥** కమలముల పుట్టుకకు కారణమైన శరదృతువుచేత – లేక శరదృతువున పుట్టిన తామరలచేత నీరు, ప్రకృతి సిద్ధముగ శుద్ధముగా నుండెను – శుద్ధతను పొందెను, యోగభ్రష్టులైన వారి హృదయములు, మఱల యోగసాధనచేయనెంచగా నిర్మలములైనట్లు. (33)

**టీ॥** తామరల ఉత్పత్తి దేనిచేతనో దాని చేత – శరత్తుచేత లేక శరత్తుచే చేయబడిన తామరల పుట్టుక చేత. (33)

**శ్లో॥** వ్యోమ్నోఽబ్దం భూత శాబల్యం భువః పంకమపాం మలమ్ ।
శరజ్జహారాశ్రమిణాం కృష్ణే భక్తి ర్యథాఽశుభమ్ ॥(34)

**టీ॥** వోమ్నఇతి. వ్యోమాదీనాం చతుర్ణాం, చతురో మేఘాదీన్ మలాన్. శరదహరత్. ఆశ్రమిణాం చతుర్ణాం కృష్ణే జాతా భక్తిర్యథా అశుభమసుఖం హరతి. తథాహి. బ్రహ్మచారిణో గుర్వర్థోదకా హరణ కుంభ శ్రమం యథా భక్తిర్హరతి తయా. పూర్ణస్య తేనానుపయోగాత్. గురుభిరపి కృతార్థస్య తస్యానియోగాత్. ఏవం వ్యోమ్నోఽబ్దం మేఘం శరజ్జహార. యథా చ. గృహిణోఽపత్యాది సాంకర్యం. భక్తిర్హరతి. వివిక్త వాసరుచ్యుత్పత్తేః. తథా. భూతానాం శాబల్యం సాంకర్యం. శరద్వర్షాసు వృష్టిభిః. యాని సంకులాని వసంతి. యథా చ. వనస్థస్య మలధారణ క్లేశం భక్తిర్హరతి. ఏవం భువః. పంకం శరత్. యథాచ. యతీనాం కామాదివాసనామలం శ్రీకృష్ణభక్తిర్హరతి ఏవమపాం మలం. (34)

**తా॥** బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సన్యాసాశ్రమముల వారికి కృష్ణుని యందలి భక్తి, పాపములను తొలగించి శుభమును కలిగించునట్లు, – ఆకాశపు మేఘమును, గాలిలోని నానా విధములైన కాలుష్యములను, భూమియొక్క బురదను, నీటిలోని మాలిన్యమును – వీని నన్నింటిని శరత్కాలము తొలగించెను. (34)

**టీ॥** ఆకాశము మొదలగు నాల్గింటియొక్క, (ఆకాశము, గాలి, భూమి, నీరు) మేఘములు మొదలగు వాని మలములను శరత్తు తొలగించివేసెను. నాలుగు ఆశ్రమముల వారికిని కృష్ణునియందు కలిగిన భక్తి ఏ విధముగా అసుఖమును (అశుభమును) హరించునో – అది యుక్తమే – శరత్తు కూడా హరించెను. బ్రహ్మచారికి, గురువుకొఱకై తీసికొని వచ్చునీటి కుండను మోసెడి శ్రమను, ఎట్లు భక్తి హరించునో అట్టి భక్తిచేత, కృతార్థుడైన తరువాత అతనికి దాని ఉపయోగము లేనందు వలన – గురువులచేత కూడా, అతనిని తిరిగి ఆ పనికి (నీటిని తెచ్చుటకు) నియమింపకపోవుట వలన – ఇట్లు ఆకాశము నందలి మేఘమును శరత్తు తొలగించెను. ఎట్లు గృహస్థు యొక్క సంతానాదుల సాంకర్యమును (కలయిక వలన అశాంతిని) భక్తి తొలగించునో–ఏకాంత వాసము నందలి రుచి, పుట్టుట వలన– అట్లు భూతములు సాంకర్యమును శరత్తు హరించును–వర్షపు దినముల

యందు ఏ పదార్థముల కలియికలు ఉండునో, దానిచే కలిగిన మలములను భరించు కష్టమును, వానప్రస్థాశ్రమమున ఉన్న వాని, భక్తి హరించునో, అట్లు భూమి యందలి బురదను శరత్తు హరించును. అట్లే యతుల యొక్క కామము మొదలగు వాని వాసనలచే నేర్పడు మనోమాలిన్యమును శ్రీకృష్ణుని యందలి భక్తి హరించును - అట్లే నీటి కాలుష్యమును. (34)

శ్లో॥ సర్వస్వం జలదా హిత్వానరేజుశ్శుభ్ర వర్చసః ।
యథా త్యక్తైషణాశ్శాంతా మునయో ముక్త కిల్బిషాః ॥ (35)

తా॥ కోరికలను విడిచి, శాంతులై, పాపముల చేత విడవబడిన వారైన మునులేవిధముగ ప్రకాశింతురో ఆ విధముగనే, మేఘములు తమ వస్తువైన నీటి నంతటిని వదలిపెట్టి స్వచ్ఛమైన కాంతితో వెలుగొందెను. (35)

టీ॥ సర్వస్వమితి. త్యక్తైషణాః త్యక్తాః పుత్రవిత్త దారైషణాయైస్తే.(35)

టీ॥ త్యక్తైషణాః - ఎవరి చేత పుత్రప్రేమ, ధనమునందలి కోరిక, కళత్రముల యందలి ప్రేమ విడవడినదో వారు. (35)

శ్లో॥ గిరయో ముముచుస్తోయం క్వచిన్నముముచుశ్శివమ్ ।
యథా జ్ఞానామృతం కాలే జ్ఞానినో దధతే న వా (36)

తా॥ కొండలు(కూడ) నీటిని వదలిపెట్టెను కొని కొన్ని కొండలు, స్వచ్ఛమైన నీటినివదలక అప్పుడప్పుడు ధారలుగా విడుచుచుండెను. జ్ఞానులైనవారు, సరియైన కాలమున తమ జ్ఞానామృతమును ఇతరులకు పంచి యిచ్చుచు, ఒక్కొక్కప్పుడు జ్ఞానబోధ చేయకుండ మౌనముగ ఉండునట్లు. (36)

**టీ॥** గిరయితి. అయం భావః. న హ్యుపాధ్యాయాః కర్మవిద్యామివ జ్ఞానినో జ్ఞానామృతం సర్వతో వితరంతి. అపితు. కృపయా క్వచిదేవ. ఏవం గిరయశ్శివం నిర్మలం తోయం క్వచిన్ముముచుః క్వచిన్న. న పునః పావృషీవ సర్వత ఇతి. (36)

**టీ॥** దీని భావమిది. ఉపాధ్యాయులు కర్మ విద్యను వలె కాక, జ్ఞానులు, జ్ఞానామృతమును అంతటను పంచి యిచ్చుచుందురు. అయినను దయతో ఎప్పుడో ఒకప్పుడే – అట్లే కొండలు – శివం – పవిత్రమైన నీటిని – ఒకప్పుడు వదలకుండును. వర్షర్తువు నందువలె అంతటను కాదు అని. (36)

**శ్లో॥** నైనా విదన్ క్షీయమాణం జలం గాధ జలే చరాః ।
యథాయురన్వహం క్షీణం నరామూఢాః కుటుంబినః॥ (37)

**తా॥** లోతులేని నీటిలో తిరుగాడుచున్న జలచరములకు (చేపలు మొదలగు వానికి) దినదినము ఆ నీరు ఇంకి పోవుచున్నదని తెలియదు. మూర్ఖులైన సంసారులకును ప్రతి దినము తమ ఆయువు తరిగి పోవుచున్నదని తెలియనట్లు. (37)

**టీ॥** నేతి. గాధే క్షుద్రే జలేచరంతీతి తథా. మీనాదయః. (37)

**టీ॥** గాధే – క్షుద్రమైన – లోతులేని నీటిలో చరించు చేపలు మున్నగునవి. (37)

**శ్లో॥** గాధ వారి చరాస్తాతపమ విందన్ శరదర్కజమ్ ।
యథా దరిద్రః కృపణః కుటుంబ్య విజితేంద్రియః ॥ (38)

**తా॥** పేదవాడు, దీనుడు, భార్యాపుత్రాదులు కలవాడు, ఇంద్రియములను జయింపలేని వాడు అయిన మానవుడు వివిధములుగా బాధ పడునట్లు, లోతులేని నీటిలో నున్న జలచరములు, శరత్కాలము నందలి సూర్యుని వలన బుట్టిన తాపమును (వేడిమిని) పొందు చుండెను. (38)

**టీ॥** గాధేతి. అవిందన్ లేభిరే. (38)

**టీ॥** అవిందన్ –పొందెను (బ.వ.) (38)

**శ్లో॥** శనైశ్శనైర్జహుః పంకం స్థలాన్యామంచ వీరుధః ।
యథాహం మమతాం ధీరాశ్శరీరాదిష్వనాత్మసు ॥ (39)

**తా॥** ఎట్లు వివేకవంతులు అనాత్మ పదార్థములగు శరీరాదుల యందు, అహంకార మమకారములను (నేను నాది) వదలిపెట్టుదురో, అట్లే ఆయా ప్రాంత ప్రదేశములు మెల్ల మెల్లగా బురదను, అపక్వ (తేమగల) మాలిన్యమును, అల్లుకొని యున్న పొదలను విడిపెట్టు చుండెను. (39)

**టీ॥** శనైరితి. తత్ర మమతామివ పంకం. అహంతామివ. ఆమతామపక్వతాం. జహురితి. (39)

**టీ॥** ఇచట – నేను అనుభావనను వలె ఆమతాం – అపక్వతను 'నాది' అను భావనను వలె బురదను వదలి పెట్టినవి అని. (39)

**శ్లో॥** నిశ్చలాంబురభూత్తూష్ణీం సముద్రశ్శరదాగమే ।
ఆత్మన్యుపరతే సమ్యఙ్మునిర్వ్యుపరతాగమః ॥ (40)

**తా॥** ఆత్మయందు నిశ్చలుడైయున్న ముని కర్మల నుండి విరమించుట చేత వేదపఠనము నుండి కూడ విశ్రమించి యున్నట్లు, శరదృతువు వచ్చుటతో సముద్రము నిశ్చలమైన నీరు గలదియై నిస్తరంగమయ్యెను. (40)

**టీ॥** నిశ్చలేతి. ఆత్మన్యుపరతే త్యక్త క్రియో మునిరివ. నిశ్చలాంబుః స ఏవం వ్యుపరతాగమః నివృత్త వేదఘోష ఇవ తూష్ణీమభూదితి. (40)

**టీ॥** ఆత్మన్యుపరతే– క్రియలను వదిలిన మునివలె – (సముద్రము) నిశ్చలమైన నీరు గలదియైనట్లు – ముని కూడా ఆ విధముగా వేదఘోష నుండి విరమించినవాడై (యుండెను) (40)

**శ్లో॥** కేదారేభ్యోస్త్వపోఽగృహ్ణన్ కర్షకాద్దృఢసేతుభిః ।
యథా ప్రాణై స్రవద్ జ్ఞానం తన్నిరోధేన యోగినః ॥ (41)

**తా॥** ఇంద్రియముల నుండి జ్ఞానము స్రవించుచు బయటకు పోకుండ, యోగులు తమ ఇంద్రియములను నిరోధించునట్లు, రైతులు, తమ పంట పొలముల నుండి (మళ్లనుండి) నీరు బయటకు ప్రవహించి పోవకుండునట్లు దృఢమైన అడ్డు కట్టలు నిర్మించి నిరోధించిరి. (41)

**టీ॥** కేదారేభ్య ఇతి. బద్ధసేతుశాలిక్షేత్రేభ్యః. దృఢైస్సేతుభిః. అపోఽగృహ్ణన్. తతః వృష్ట్యభావాత్. ప్రాణైరింద్రియైః. తన్నిరోధేన ఇన్ద్రియ ప్రత్యాహారేణ ద్వారేణ. (41)

**టీ॥** కట్టబడిన అడ్డుకట్టలు గల పొలముల నుండి - దృఢమైన కట్టలతో - నీరు స్వీకరింపకుండునట్లు - అప్పుడు - వర్షములు లేనందువలన - ప్రాణైః - ఇంద్రియముల ద్వారా - వానిని నిరోధించుట ద్వారా - విషయముల నుండి ఇంద్రియములను మరలించుట (ప్రత్యాహారము) ద్వారా. (41)

**శ్లో॥** శరదర్కాంశుజం తాపం భూతానా ముడుపోఽహరత్ ।
దేహాభిమానజం బోధో ముకుందో వ్రజ యోషితామ్ ॥ (42)

**తా॥** 'నేను దేహమును' అను అభిమానమును, ఆత్మజ్ఞానము తొలగించినట్లు, వ్రజమునందలి స్త్రీల తాపమును కృష్ణుడు తొలగించినట్లు, శరత్కాలము నందలి సూర్యకిరణముల వేడిమి ప్రాణులను బాధింపకుండ చంద్రుడు హరించుచుండెను. (42)

**టీ॥** శరదితి. దేహాభిమానజం బోధ ఇవ. వ్రజయోషితాం ముకుంద ఇవ చేత్యర్థః. (42)

**టీ॥** దేహాభిమానము వలన కలిగిన అజ్ఞానమును, జ్ఞానము వలె - వ్రజస్త్రీలకు కలిగిన తాపమును శ్రీకృష్ణ భగవానుని వలె నని యర్థము. (42)

**శ్లో॥** ఖమశోభత నిర్మేఘం శరద్విమల తారకమ్ ।
సత్త్వ యుక్తం యథా చిత్తం శబ్ద బ్రహ్మార్థ దర్శనమ్ ॥ (43)

**తా॥** సాత్త్వికత్వముతో కూడిన చిత్తము, శబ్దరూపమున నున్న వేదమున కర్థమును సాక్షాత్కరించుకొనునట్లు, ఆకాశము మేఘ రహితమై శరత్కాలము నందలి స్వచ్ఛమైన తారకలతో శోభించు చుండెను. (43)

**టీ॥** ఖమితి. శరదా మిమలాస్తారకా యస్మిన్ తత్. ఖమాకాశం శబ్దబ్రహ్మణో వేదస్యార్థాన్ పూర్వోత్తర మీమాంసా ప్రణీతాన్. దర్శయతీతి తథా తదివ. (43. 44)

**టీ॥** శరత్తు చేత శుద్ధమైన తారకలు దేనియందో అది. ఖం – ఆకాశము – శబ్దబ్రహ్మం – వేదము యొక్క – అర్థములను – పూర్వ, ఉత్తరమీమాంసా శాస్త్రములచే వివరింపబడిన వానిని, దర్శింప జేయునది– దానివలె (43,44)

**శ్లో॥** అఖండ మండలో వ్యోమ్ని రరాజోడుగణైశ్శశీ ।
యథా యదుపతిః కృష్ణో వృష్ణి చక్రావృతో భువి ॥ (44)

**తా॥** భూమి యందు కృష్ణుడే విధముగా యదువంశీయుల సమూహముతో ఆవరింపబడి శోభించు చుండెనో, ఆ విధముగనే పూర్ణ చంద్రుడు నక్షత్ర సమూహములతో ఆవరింపబడి ప్రకాశించు చుండెను. (44)

**శ్లో॥** ఆశ్లిష్య సమశీతోషం ప్రసూత వనమారుతమ్ ।
జనాస్తాపం జహుసిర్గోప్యో న కృష్ణ హృత చేతసః ॥ (45)

**తా॥** పుష్పించిన వనమునందలి గాలి, అతి శీతలత్వము కాని, అత్యుష్ణత్వము కాని, సమస్థితిని పొంది యుండెను, ప్రజలు తాపమును వదలిరి. గోపస్త్రీలు, కృష్ణునిచే దొంగిలింపబడిన మనస్సులు గలవారై తాపమననుభవించుచుండిరి. (45)

**టీ॥** ఆశ్లిష్యేతి. సమః అన్యూనావధికః. శీతోష్ణశ్చుతం. న తు గోప్యః కృష్ణాపహృతచేతస్త్వేన తాసాం దుస్సహ ఇతి. యద్వా. నకార ఉపమార్థః తథా చ. కష్ణహృతచేతసఇవేతి. చేతసా కృష్ణమాశ్లిష్య ఆలింగ్య. యథేత్యర్థః. (45)

**టీ॥** సమః - తక్కువయు ఎక్కువయు కాకుండెడు చల్లదనము వేడిమియు గల స్థితిని - గోపస్త్రీలు మాత్రము కృష్ణునిచే దొంగిలింపబడిన హృదయముగల వారగుటచేత వారికి తాపము సహింపరానిదయ్యెను అని. లేక నకారము పోలిక కొఱకు మఱియు - కృష్ణునిచేత దొంగిలింపబడిన బుద్ధి గల వారి వలె అని. - బుద్ధి చేతనే కృష్ణుని కౌగిలించుకొనిన వారివలె అని యర్థము. (45)

**శ్లో॥** గావో మృగాః ఖగా నార్యః పుష్పిణ్యః శరదాభవన్ ।
అన్వీయమానాస్స్వ వృషైః ఫలైరీశక్రియా ఇవ ॥ (46)

**తా॥** ఈశ్వర పూజ మొదలగు కర్మల వలన నేర్పడు సత్ఫలములు తత్కర్తలను వెంబడించి వచ్చునట్లు ఆ శరత్కాలమున ఋతుమతులైన ఆవులు, ఆడలేళ్లు, ఆడ పక్షులు, మనుష్య స్త్రీలును తమ జాతి యందలి పురుషులను ఆశ్రయించు చుండిరి. పురుషులచే ఆశ్రయింపబడు చుండెను. (46)

**టీ॥** గావ ఇతి. పుష్పిణ్యో గర్భిణ్యః. అన్వీయమానాః. స్వవృషైః స్వపతిభిః అనిచ్ఛంత్యోஉపి బలాదనుగమ్యమానాః ఈశ్వరారాధనార్థాః క్రియాః బలాత్ఫలైరనుగమ్యమానాః సమస్తభోగగర్భా యథేతి. (46)

**టీ॥** పుష్పిణ్యః-గర్భధారణేచ్ఛగలవారై - స్వవృషైః సొంతభర్తలతో-అన్వీయమానాః-వెంబడింపబడుచు ఇష్టము లేకున్నను బలవంతముగ అనుసరింప బడుచుండెను. భగవంతుని పూజించుట కొఱకైన కర్మలు, బలవంతముగనే ఫలములచేత అనుసరింపబడుచు - సకల సుఖములతో నిండియున్నట్లు అని. (46)

**శ్లో॥** ఉపాహృష్యన్ వారి జాని సూర్యోత్థానే కుముద్వినా ।
రాజ్ఞా తు నిర్భయా లోకా ఆసన్ దస్యూన్ వినా నృప! ॥ (47)

**తా॥** ఓ పరిక్షిన్మహారాజా ! రాజు వచ్చుట చేత చోరులు తప్ప తక్కిన వారందఱును నిర్భయముగా నుండునట్లు – సూర్యోదయము కాగానే కలువలు తప్ప తక్కిన నీటిలో బుట్టెడు పూవులన్నియు (తామరలు) వికసించెను.(47)

**టీ॥** ఉపాహృష్యన్నితి. కుముత్ కుముదం. కుత్సితాః ముదః యస్య తదితి దస్యుసామ్యం. (47)

**టీ॥** కుముద్ – కలువ – కుత్సితమైన ముదము దేనికో అది అని. చోరులతో పోలిక. (47)

**శ్లో॥** పురగ్రామేష్వాగ్రయణైరైంద్రియైశ్చ మహోత్సవైః ।
బభౌభూః పక్వసస్యాఢ్యా కళాభ్యాం నితరాం హరేః ॥ (48)

**తా॥** పట్టణములందును, పల్లెల యందును, నూతనాన్న ప్రాశనములును, ఇంద్రియములకు ఆనందమును కలిగించు కార్యక్రమములును సాగు చుండెను. తఱచుగా వినబడు శ్రీకృష్ణుని సంభాషణములు, మురళీనాదముల మధుర ధ్వనులతో భూమి యంతయు పండిన ధాన్యములతో నిండి ఒప్పిదమగుచుండెను. (48)

**టీ॥** పురేతి. ఆగ్రయణైః నవాన్నప్రాశనార్థైః వైదికైః కర్మభిః ఇంద్రియైరింద్రియార్థై ర్లౌకికైశ్చ మహోత్సవైః. కళాభ్యాం రామకృష్ణాభ్యాం దర్శనాది మహోత్సవాభ్యాం. (48)

**టీ॥** ఆగ్రయణైః– క్రొత్త అన్నమును భుజించుట కొఱకైన వైదిక కర్మలతో – ఇంద్రియై– ఇంద్రియముల (ఆనందము) కొఱకు చేయబడు లౌకిక కర్మలతో గూడిన మహోత్సవములతో – కళాభ్యాం – రామకృష్ణుల దర్శనము మున్నగు మహోత్సవములతో (48)

శ్లో॥ వణిగ్యతి నృప స్నాతా నిర్గమ్యార్థాన్ ప్రపేదిరే ।
వర్షరుద్ధా యథా సిద్ధా స్స్వపిండాన్ కాల ఆగతే ॥ (49)

తా॥ మంత్ర యోగ సిద్ధులు కాలము రాగానే తమ యోగ ఫలముగా దేవతాది దేహములను పొందు విధమున, వర్తకులు, యతులు, రాజులు విద్యాభ్యాసము ముగిసిన స్నాతకులు, ఇంతకాలము వర్షములచే నిరోధింపబడి ఇప్పుడు బయటకు పోయి తమ తమ ప్రయోజనములను పొందిరి. (49)

టీ॥ వణిగితి. వణిజః యతయః. నృపాః. స్నాతకాశ్చదృష్టాదృష్టాభ్యాం వర్షరుద్ధాస్సంతః నిర్గమ్యార్థాన్. వాణిజ్య, స్వాచ్ఛంద్య, దిగ్విజయ, విద్యాదీన్. ప్రపేదిరే ప్రాపద్యంత యథా మంత్రయోగాదిసిద్ధాః ఆయుషా రుద్ధాః కాలే ఆగతే. స్వపిండాన్ యోగాది ప్రాప్యాన్ దేవాది దేహానితి. (49)

టీ॥ వర్తకులు, సన్యాసులు, రాజులు, స్నాతకులు, కనబడునది, కనిపింపనది అయిన వర్షములచే నిరోధింపబడిన వారగుచు – బయటకు వెడలి తమ కార్యములను, వాణిజ్యములను, స్వేచ్ఛా గమనము, దిగ్విజయము, ఇతర విద్యలు నేర్చుకొనుట మొదలగు వానిని పొందిరి. ఎట్లనగా మంత్ర యోగ సిద్ధులు ఆయువుచేత నిరోధింపబడి (మృతిచెంది) కాలము ప్రాప్తింపగా – స్వపిండాన్ – యోగము మొదలగు వాని వలన పొందదగిన వాని – దేవతలు మొదలగు వారి దేహములను పొంది అని. (49)

శ్రీ మద్భాగవతే, మహాపురాణే దశమస్కంధే,
వింశోఽధ్యాయః

అని శ్రీమద్భాగవతమున దశమస్కంధమందు
ఇరువదియవ అధ్యాయము సమాప్తము.

## ఏకవింశోఽధ్యాయః

### శ్రీశుక ఉవాచ

**శ్లో॥** ఇత్థం శరత్స్వచ్ఛ జలం పద్మాకర సుగంధినా ।
న్యవిశద్వాయునోపేతం స గో గోపాలకోఽచ్యుతః ॥ (1)

**టీ॥** శ్లో. "ఏకవింశే శరద్రమ్యబృందావన గతే హరౌ, తద్వేణు స్వనమా కర్ణ్య గోపీభిర్గీతమీర్యతే." ఇత్థమితి ఇత్థమేవం భూతం వనం, తదేవాహు–శరదా స్వచ్ఛాని జలాని యస్మిన్ తత్. వాయునోపేతం అనుగతం వనం. తద్దేశవ్యాప్తమిత్యర్థః. (1)

**శ్లో॥** కుసుమిత వనరాజి శుష్మిభృంగ
ద్విజకుల ఘుష్ట సరస్సరిన్మహీధ్రమ్ ।
యదుపతి రవగాహ్య చారయన్
గాస్సహ పశుపాల బలశ్చుకూజ వేణుమ్ ॥ (2)

## ఇరువది ఒకటవ అధ్యాయము

### శ్రీ శుకమహర్షి ఇట్లనెను

**తా॥** తామరలతో నిండిన సరస్సుల సువాసనలతో గూడిన గాలి వీచుచున్నదియు, శరత్కాలము నందలి పరిశుద్ధమగు నీరు గలది యునైన ఆ వనము లోనికి, ఆవులు, గోపాలురతో కూడి కృష్ణుడు ప్రవేశించెను. (1)

**టీ॥** ఈ ఇరువది యొకటవ అధ్యాయమున – శరత్కాలమునందలి సుందరమైన బృందావనమునకు చేరిన కృష్ణుడు వేణువు వాయింపగా వినిన గోపికల చేత గీతమాలాపింపబడెను. ఇత్థం – ఇట్టి వనమున – అదియే చెప్పుచున్నాడు. శరత్తు చేత శుద్ధముచేయబడిన నీరు దేనియందు గలదో అది – వాయునోపేతం – వెంటవచ్చుచుండు గాలి ప్రసరించిన వనము, ఆ ప్రదేశమంతయును వ్యాపించినది అని యర్థము. (1)

**తా॥** నిండుగా పుష్పించిన వనసమూహములందలి మదించిన తుమ్మెదల ఝుంకారములు, పక్షుల కూజితములు, అచటి సరస్సులు, నదులు, కొండ ప్రాంతములందు ధ్వనించుచుండగా, కృష్ణుడు ఆవులను మేపుకొనుచు, గోపాలురతోను, బలరామునితోను, అందు ప్రవేశించి, వేణువును వాయించెను. (2)

**టీ॥** కుసుమితేతి. తతశ్చ కుసుమితవనరాజిషు, శుష్మిణో మత్తాః భృంగాః. ద్విజాశ్చ. తేషాం కులాని తైర్ఘుష్టాస్సరాంసి సరితః. మహీధ్రాశ్చ. యస్మిన్ తద్వనం కృష్ణః అవగాహ్య ప్రవిశ్య వేణుమవాదయత్. (2)

**టీ॥** అటు పిమ్మట విరబూసిన వనసమూహములందు - శుష్మిణః - మదించిన- భృంగాః - తుమ్మెదలు - ద్విజాశ్చ - పక్షులును - వాని జాతులు - తైర్ఘుష్టాస్సరాంసి సరితః మహీధ్రాశ్చ- వానిచే మ్రోగుచున్న (ప్రతిధ్వనించుచున్న) సరస్సులు, నదులు, కొండలును దేనియందు గలవో అట్టి వనమును, కృష్ణుడు - అవగాహ్య - ప్రవేశించి - వేణువును వాయించెను. (2)

**శ్లో॥** తద్వ్రజస్త్రియ ఆశ్రుత్య వేణుగీతం స్మరోదయమ్ ।
కాశ్చిత్పరోక్షం కృష్ణస్య స్వసఖీభ్యోఽన్వవర్ణయన్ ॥ (3)

**తా॥** వ్రజము నందలి స్త్రీలు ఆ వేణునాదమును- మన్మథ వికారమును కలిగిచు ఆ పిల్లనగ్రోవి పాటను ఆలకించి, తమ పరోక్షమున నున్న కృష్ణుని గూర్చి (కొందఱు) తమ స్నేహితురాండ్రకు వర్ణించి చెప్పఁదొడిగిరి. (3)

**టీ॥** తదితి. తత్కృష్ణస్య వేణుగీతం. స్మరస్య ఉదయో యస్మాత్తత్. ఆశ్రుత్య. పరోక్షం యథా భవతి. తథా. వ్రజే స్థితత్వాత్. (3)

**టీ॥** ఆ కృష్ణుని వేణు గీతములను - మన్మథోదయము దేనివలన జరుగునో అట్టి దానిని - ఆశ్రుత్య - విని అప్రత్యక్షముగ నున్న వానిని ఎటులో అట్లు - తాము వ్రజమునందుండుట వలన. (3)

**శ్లో॥** తద్వర్ణయితు మారబ్ధా స్స్మరంత్యః కృష్ణ చేష్టితమ్ ।
నాశకన్ స్మర వేగేన విక్షిప్త మనసో నృప ॥ (4)

**తా॥** రాజా! కృష్ణుని చేష్టలు జ్ఞాపకముచేసికొనుచు వారు అతని వర్ణనము ప్రారంభించిరి. కాని మన్మథ వేగమున అందుకు సమర్థులు కాక వ్యాకుల చిత్తులైరి. (4)

**టీ॥** తదితి. విక్షిప్త మనసః వ్యాకులచిత్తాః. (4)

**టీ॥** విక్షిప్త మనసః – వ్యాకుల చిత్తముగల వారు. (4)

**శ్లో॥** బర్హాపీడం నటవర వపుః కర్ణయోః కర్ణికారం
బిభ్రద్వాసః కనక కపిశం వైజయంతీం చ మాలమ్ ।
రంధ్రాన్ వేణోరధర సుధయా పూరయన్ గోప బృందైః
బృందారణ్యం స్వపద రమణం ప్రావిశద్గీత కీర్తిః ॥ (5)

**తా॥** నెమలి పింఛముల గుచ్ఛముతో శ్రేష్ఠమైన నటుని శరీరము గలవాడును, చెవులకు కొండగోగు పూలును, నలుపు కలిసిన పసుపు వన్నె వస్త్రములు ధరించి, తక్కలపూలమాల నలంకరించుకొని, పిల్లనగ్రోవి రంధ్రములును క్రింది పెదవి అమృతముతో నింపుచు (శ్రావ్యముగవాయించుచు) గోపాలుర సమూహములతో కలిసి, (తన పాదములతో) కోరికను బుట్టించు నడకలతో, అందఱును తనను కీర్తించు వాడగు కృష్ణుడు బృందారణ్యమును ప్రవేశించెను. (అందఱిచే కీర్తింపబడు కృష్ణుడు బృందావనమున ప్రవేశించెను) (5)

**టీ॥** యాదృక్కృష్ణస్య స్మరణం. తాసాం మనసః క్షోభకం జాతం తదాహ – బర్హేతి. నటవత్. వరం వపుర్బిభ్రత్. బృందావనం ప్రావిశత్. కథంభూతం తద్వనం. స్వపదాంకితైః. రమణం రతిజనకం. గోపబృందైః గీతకీర్తిః. తథా బర్హమయాపీడం శిరోభూషణం. బిభ్రత్. బర్హమాపీడో యస్మిన్నితి వపుషో విశేషణం వా. వేణువాదనముత్ప్రేక్షతే– రంధ్రాన్వేణోరితి. అతో నూనం. అధరసుధైవ పూర్ణాద్వేణో రుచ్ఛలంతీ. గీతవత్ ప్రసర్పతీతి. భావః. (5)

**టీ॥** కృష్ణ స్మరణము చేయుచున్న గోపస్త్రీల మనస్సులలోని క్షోభ ఎట్లుండెనో దానిని చెప్పుచున్నాడు. నటుని వలె శ్రేష్ఠమైన శరీరమును ధరించిన వాడై బృందావనమును ప్రవేశించెను. ఆ వనము ఎట్టిది? తన పాదాంకితములతో – రమణం – కోరికను బుట్టించునది. గోపాలుర సమూహముల చేత గీతకీర్తి– స్తుతింపబడు కీర్తిగల వాడు. మరియు నెమలి పింఛముల చేత గూర్పబడిన శిరోభూషణమును ధరించినవాడు – నెమలిపింఛము ఏ శరీరమునందలంకరింపడెనో – విశేషణమైన, వేణువు వాయించుటను ఉత్ప్రేక్షించుచున్నాడు –

శ్లో॥ ఇతి వేణురవం రాజన్ సర్వభూత మనోహరమ్ ।
శ్రుత్వా వ్రజస్త్రియస్సర్వా వర్ణయంత్యోఽభిరేమిరే ॥ (6)

టీ॥ ఇతీతి. అభిరేమిరే. వర్ణయంత్యస్స్తుత్యః. పదే పదే. పరమానంద మూర్తిం కృష్ణం పరిరబ్ధవత్యః. (6)

**గోప్య ఊచుః**

శ్లో॥ అక్షణ్వతాం ఫలమిదం న పరం విదామ
స్సఖ్యః పశూననువివేశ యతోర్వయస్యైః ।
వక్త్రం వ్రజేశ సుత యోరను వేణు జుష్టం
యైస్తైర్నిపీత మనురక్తకటాక్ష మోక్షమ్ ॥ (7)

వేణువు యొక్క రంధ్రములను అని, అధర సుధ నిండుట చేత వలె (వేణువు యొక్క ఆ రంధ్రములు) పైకి కదలుచున్నట్లు – పాట వలె పాకుచున్నవని భావము. (5)

తా॥ ఈ విధమైన వేణునాదమును, రాజా ! సర్వప్రాణులకును హృదయంగమమైన కృష్ణుని పిల్లనగ్రోవి ధ్వనిని విని వ్రజమునందలి స్త్రీలందఱును దానిని వర్ణించుచు రమించుచుండిరి. (6)

టీ॥ అభిరేమిరే – వర్ణించుకొనుచు – మాటి మాటికి పరమానంద స్వరూపుడగు శ్రీ కృష్ణుని ఆలింగనము చేసి కొనుచుండిరి.(6)

**గోపపస్త్రీ లిట్లనిరి**

తా॥ సఖులారా ! కృష్ణుడు, బలరాముడు వేణువును వాయించుచు తమ ఆవులతోను, తోటి గోపబాలకులతోను వచ్చుచు తమ ముఖములను త్రిప్పి మన వైపు కడగంటి చూపును వదలగా, ఎవరెవరిచే ఆ కటాక్షామృతము గ్రోలబడునో అట్టి అదృష్టము గలవారి కన్నులు సాఫల్యమగును. అట్టి సాఫల్యము మఱి ఏ ఇతరమైన దాని వలనను కానము. (7)

**టీ॥** అనువర్ణనమేవాహ -త్రయోదశభిః అక్షణ్వతామితి. అక్షణ్వతాం చక్షుష్మతాం. తావదిదమేవ ఫలం ప్రియదర్శనం. పరమన్యత్ న విదామః న విద్మ ఇత్యర్థః. తచ్చ ఫలం సఖిభిస్సహ పశూన్ వనే ప్రవేశయతో రామకృష్ణయోర్వక్త్రం యైర్నిపీతం. తైరేవ జుష్టం సేవితం. నాన్యైరిత్యర్థ కథంభూతం వక్త్రం. అనువేణుం వేణుమను వర్తమానం. తం వాదయత్. తథా అనురక్తకటాక్షమోక్షం స్నిగ్ధకటాక్ష విసర్గం. అథవా యైర్నిపీతం తయోర్వక్త్రం తైర్జుష్టం. ఇదమేవాక్షణ్వతామక్ష్ణోః ఫలమితి. (7)

**శ్లో॥** చూత ప్రవాళబర్హ స్తబకోత్పలాబ్జ
మాలానుపృక్త పరిధాన విచిత్రవేషౌ ।
మధ్యే విరేజతురలం పశుపాల గోష్ఠ్యాం
రంగే యథా నటవరౌ క్వ చ గాయమానౌ ॥ (8)

**టీ॥** పదమూడు శ్లోకములతో కృష్ణవర్ణనమే చెప్పుచున్నాడు - అక్షణ్వాతా - కన్నులు గల వారికి ఇంత మాత్రమే ఫలము -అదియే ప్రియదర్శనము. అంతకంటె శ్రేష్ఠమైన దానిని ఎఱుంగము. తెలియ లేమని అర్థము. ఆ ఫలము - సఖులతో కూడి పశువులను వనము నందు ప్రవేశింపజేయు రామ కృష్ణుల యొక్క ముఖము - ఎవరిచేత త్రాగబడునో వారి చేతనే సేవింపబడును. ఇతరులచే కాదని యర్థము. ముఖము ఎట్టిది అనువేణుం - వేణువుననుసరించునది, దానిని వాయించూచు - ఆ విధముగా అనురాగముతో కూడిన కటాక్షమోక్షం - స్నేహముతోడి కడగంటి చూపు యొక్క ప్రసారము - లేక ఎవరిచే త్రాగబడునో వారి ముఖము - వారిచే సేవింపబడినది. ఇదియే కన్నులు గలవారి చూపునకు (కన్నులకు) ఫలము - అని. (7)

**తా॥** మామిడి చిగుళ్లు, నెమలి పింఛములు, పూల గుత్తులు, కలువ పూలు, తామర పువ్వులు మున్నగువాని దండలతో కూర్పబడిన పట్టు వస్త్రములు ధరించిన విచిత్రమైన వేషములుగల కృష్ణ బలరాములు, ఆ గోపాలుర సమూహము మధ్య భాగమున మిక్కిలిగ ప్రకాశించిరి. అప్పుడప్పుడు పాడుచుండిరి కూడ.(8)

**టీ॥** అన్యాః ఆహుః. చూతేతి. చూతప్రవాళాదీనాం విచిత్రాభిర్మాలాదిభిః అనుపృక్తే ఈషదంతరాంతరత స్సంయుక్తే పరిధానే నీలపీతాంబరే. తాభ్యాం విచిత్రో వేషో యయోస్తౌ. క్వ చ కదాచిత్. పశుపాల గోష్ఠ్యాం గోపాలసభాయాం మధ్యే. అలమత్యర్థం. విరేజతుః అహో గోపాలానాం పుణ్యమితి భావః. (8)

**టీ॥** ఇతరులిట్లు చెప్పిరి - మామిడి చిగుళ్ళు మొదలగు వాని యొక్క విచిత్రమైన మాలలు మున్నగువాని చేత నించుక లోలోపలి భాగముల వఱకును కూర్చబడిన నీల పీత వస్త్రముల యుగ్మముల చేత, ఎవరికి విచిత్రమైన వేషములు గలవో వారు - క్వచ- ఎప్పుడో ఒకప్పుడు (పాడుచు) పశుపాలకుల సభా మధ్యమున - అలం - మిక్కిలిగ - విరేజతుః - ప్రకాశించిరి - అహో ! గోపాలకుల పుణ్యము! అని భావము. (8)

**శ్లో॥** గోప్యః కిమాచరదయం కుశలం స్మవేణు
ర్దామోదరాధర సుధా మపి గోపి భోగ్యామ్ ।
భుజ్తే స్వయం యదవశిష్ట రసం హ్రదిన్యో
హృష్యత్త్వచోఽ శ్రు ముముచుస్తరవో యథార్యాః ॥ (9)

**తా॥** గోపస్త్రీలారా! ఈ వేణువు ఏమి పుణ్యమును చేసెనో, గోపస్త్రీలు అనుభవింపదగిన కృష్ణుని అధరామృతమును తాను స్వయముగ అనుభవించుచున్నది! ఈ జలాశయములు, (నీరు ఇంకిపోయిన) మిగిలిన నీటి తోడనే పులకించి పోవుచున్నవి. ఈ చెట్లు మధుస్రావము రూపమున, కులవృద్ధుల వలె ఆనందాశ్రువులను కార్చుచున్నవి. (9)

**టీ॥** అన్యా ఊచుః. గోప్య ఇతి. హే గోప్యః అయం వేణుః కిం స్మ పుణ్యమాచరత్ కృతవాన్. కథం? యత్ యస్మాద్గోపికానామేవ. భోగ్యాం సతీమపి. దామోదరాధరసుధాం స్వయం స్వాతంత్ర్యేణ. యథేష్టం భుజ్తే కథమవశిష్టరసమాత్రం యథా భవతి తథా. యతః. యాసాం పయసా పుష్టః వేణుః తాః మాతృతుల్యా హ్రదిన్యః. హృష్యత్త్వచః

**టీ॥** ఇతరులు కొంది టిట్లనిరి. 'ఓ గోపికాలారా! ఈ పిల్లనగ్రోవి ఏ పుణ్యము చేసియుండెనో - ఎట్లు - ఏది గోపికలకే భోగ్యమైనదై యుండగా - కృష్ణుని అధరోష్ఠ సుధాపానము స్వతంత్రముగనే - యథేచ్ఛగా అనుభవించుచున్నది. - (జలాశయము) మిగిలిన నీటి మాత్రముగ ఎట్లో అట్లు - ఎందువలన - ఏ నీటితో వేణువు

వికసిత కమల వన మిషేణ రోమాంచితాః. లక్ష్యంతే. యేషాం వంశే జాతస్తే తరవో మధుధారామిషేణ ఆనందాశ్రు ముముచుః. యథా ఆర్యాః కులవృద్ధాః. స్వవంశే భగవత్సేకవం దృష్ట్వా. హృష్యత్త్వచోఽశ్రు ముంచంతి తద్వదితి. (9)

బలముకలదయ్యేనో అవి పోగా మిగిలిన ఆ నీరు గల సరస్సులు, ఆ వేణువునకు తల్లితో సమానమైనవియై సంతోషించుచున్నవి. వికసించిన తామరపూల నెపమున రోమాంచితములై కనబడుచున్నవి. ఏ వేణువు వంశమున జన్మించెనో, ఆ చెట్లు మధుధారల కార్చు నెపమున ఆనంద బాష్పములను కార్చుచున్నవి. ఆ విధముగా – అని. (9)

**శ్లో॥** బృందావనం సఖి భువో వితనోతి కీర్తిం
యద్దేవకీసుత పదాంబుజ లబ్ధ లక్ష్మీః ।
గోవింద వేణు మను మత్త మయూరనృత్తం
ప్రేక్ష్యాద్రి సాన్వపరతాన్య సమస్త సత్త్వమ్ ॥ (10)

**తా॥** చెలియా! కృష్ణుని పాద పద్మముల (అడుగు తామరల) ముద్రలచే సంపదలను పొందిన ఈ బృందావన ప్రదేశముల, భూమియొక్క కీర్తి అతనిచే (కృష్ణునిచే) విస్తరింపజేయబడుచున్నది. కృష్ణుని వేణుగానము ననుసరించి మదించిన నెమిళ్ళు నాట్యము చేయుచుండగా చూచిన కొండ కొమ్మల పైని జంతువులన్నియు దేని కదిగా చేష్టలుడిగి తమ పనులు మాని నివ్వెరపడి చూచుచుండెను. (10)

**టీ॥** – కాశ్చిదాహుః–బృందావనమితి. హే సఖి బృందావనం. భువః . కీర్తిం స్వర్గాదపి విశేషేణ తనోతి. కథంభూతం. యద్దేవకీసుతస్య పదాంబుజాభ్యాం లబ్ధా లక్ష్మీః శోభా సంపద్యేన తత్. కించ. గోవిందస్య వేణుమను వేణునినాదం శ్రుత్వా. అనంతరం మందగర్జితం నీలమేఘం తం. మత్వా. మత్తా మే మయూరాః. తేషాం నృత్యం ప్రేక్ష్య.

**టీ॥** కొందఱిట్లనిరి – ఓ సఖీ! బృందావనము, భూమి యొక్క కీర్తిని స్వర్గముకంటెను విశేషముగ విస్తరించుచున్నది. ఎట్టిది? కృష్ణుని పాదాంబుజములచేత లభించిన శోభను సంతరించుకొనినట్టిది. మరియు – గోవిందుని వేణునాదమును విని – తరువాత – మెల్లగా ఉరుముచున్న నల్లని మేఘముగ అతనిని భావించి – మదించి యున్న

సంఘశస్త్రత్ర తత్రైవాద్రి సానుషు ఉపరతాని ఉపరతక్రియాణి. అన్యాని సమస్తాని. సత్త్వాని. యస్మిన్ తత్. నైతదన్యేషు లోకేషు విద్యతే. అతో భువః కీర్తిం వితనోతీత్యర్థః. (10)

ఏ నెమిళ్ళుగలవో–వాని నాట్యమును చూచి – గుంపులుగ అచ్చటచ్చట కొండ కొమ్మలయందు తమ తమ పనులు చాలించిన జంతువులు, ఇతరములైన సమస్త ప్రాణులును దేని యందు గలవో అట్టిది. ఇట్టిది ఇతర లోకముల యందు సంభవింపదు. అందువలన భూమి యొక్క కీర్తిని విస్తరించుచున్నదని యర్థము. (10)

**శ్లో॥** ధన్యాః స్మ మూఢ మతయో ఽపి హరిణ్య ఏతా
యానందనందనముపాత్త విచిత్ర వేషమ్ ।
ఆకర్ణ్య వేణు రణితం చ స కృష్ణ సారాః
పూజాం దదుర్విరచితాం ప్రణయావలోకైః ॥ (11)

**తా॥** చిత్రమైన వేషముగల ఆ శ్రీకృష్ణుని సన్నిహితముగ పొంది నందులకు, ఈ మూఢ బుద్ధులైన లేళ్ళు ధన్యత చెందెను. అట్లే అవి నల్లని యిఱ్ఱులతో గూడి కృష్ణుని వేణుగానమును విని, తమ అనురాగముతో కూడిన చూపులతో అతని యెడ ఆదరమును (పూజ్య భావమును) ప్రకటించినవి. (11)

**టీ॥** అపరా ఆహుః – ధన్యా ఇతి. హే సఖి. మూఢమతయస్తిర్య గ్జాతయోఽపి. ఏతా హరిణ్యః ధన్యాః కృతార్థాః యాః, వేణురణితం వేణునాదం ఆకర్ణ్య నందనందనం ప్రతి ప్రణయసహితైరవలోకనైర్వి రచితాం పూజాం. సమ్మానం దదుః కృతవత్యః, కించ. కృష్ణసారైః స్వపతిభిస్సహితా ఏవ దదుః. అస్మత్పతయస్తు గోపాః క్షుద్రాః సమక్షం తన్న సహన్త ఇతి భావః. (11)

**టీ:–** ఇతరులిట్లనిరి. " ఓ సఖీ! మూఢ బుద్ధులైన ఆ తిర్యగ్జంతువులు, ఈ జింకలు కూడా ధన్యమైనవి. కృతార్థములైనవి. ఏవైతే వేణునాదమును విని శ్రీకృష్ణుని యెడ ప్రణయముతో కూడిన చూపులతో పూజను (సమ్మానమును) (ఇచ్చినవి) చేసినవి. మరియు తమ పతులతో కూడియే ఇచ్చినవి. మన భర్తలైన గోపాలకులు క్షుద్రులు. ఎదురుగ జరుగుఈ పూజను సహించుట లేదని భావము. (11)

**శ్లో॥** కృష్ణం నిరీక్ష్య వనితోత్సవరూప శీలం
శ్రుత్వా చ తత్క్వణిత వేణు విచిత్ర గీతమ్ ।
దేవ్యో విమాన గతయః స్మరనున్న సారా
భ్రశ్యత్ప్రసూన కబరాముముహుర్వినీవ్యః ॥ (12)

**టీ:-** అన్యా ఊచుః-కృష్ణమితి. హేగోప్యః. ఆశ్చర్యం శృణుత. వనితానాముత్సవో యస్మాత్తద్రూపం శీలం చ యస్య తం. శ్రీకృష్ణం నిరీక్ష్య తేన వాదిత వేణోరసంకీర్ణం గీతం చ శ్రుత్వా విమానైర్గచ్ఛంత్యో దేవ్యో దేవానామంకేషు స్థితా అపి స్మరేణ నున్నసారాః పరిక్షిప్త ధైర్యాః ముముహుః. మోహలింగమాహుః. భ్రశ్యత్ప్రసూనాః కబరాశ్చూడాః యసాం తాః. విగతా నీవ్యో యసాం తాః. 12

**తా॥** స్త్రీలకు ఉల్లాసము కలిగించు కృష్ణుని, అతని రూపమును, స్వభావమును చూచి, మ్రోగుచున్న అతని విచిత్రమైన వేణుగానమును విని, ఆకాశయానము చేయుచున్న దేవతాస్త్రీలు, మన్మథుని చేత చుట్టబడిన ధైర్యము గలవారై, క్రింద పడిపోవుచున్న సిగపూలు గలవారై, కట్టు ముడులు సడలి పోవుచుండగ మోహితులగుచుండిరి. (12)

**టీ:-** ఇతరులు ఇట్లనిరి. ఓ గోపికలారా ! ఆశ్చర్యము! వినుడు. స్త్రీలకు ఉత్సవము కలిగించు రూపము, శీలము ఎవనికి కలవో అట్టి కృష్ణుని చూచి, అతని చేత వాయించబడు వేణువు యొక్క స్పష్టమైన పాటను విని, విమానములో ప్రయాణము చేయుచున్న దేవతాస్త్రీలు, తమ భర్తల ఒడిలోనున్న వారయ్యును. మన్మథుని చేత చుట్టివేయబడిన ధీరత్వము గలవారై మోహము చెందిరి. మోహ లక్షణములను చెప్పుచున్నారు. జారిపడుచున్న పూలుగల సిగలు ఎవరికో వారు- సడలి పోవుచున్న ముడులు ఎవరికో వారు. (12)

**శ్లో॥** గావశ్చ కృష్ణముఖనిర్గత వేణు గీత
పీయూషముత్తభితకర్ణపుటైః పిబంత్యః ।
శాబాస్స్నుతస్తన పయః కబళాస్స్మ
తస్థుర్గోవిందమాత్మని దృశాశ్రుకళాస్స్పృశంత్యః ॥ 13

**తా॥** కృష్ణుని ముఖము నుండి వెలువడిన వేణుగాన మనెడు అమృతమును, ఆవులు తమ దొప్పలవంటి చెవులను పైకెత్తి త్రాగు చుండగా, లేగదూడలు తమ తల్లి ఆవుల పొదుగుల నుండి స్రవించుచున్న పాలనే చప్పరించుచు, అటులే వేణుగానము వినుచు (త్రాగుచు) కృష్ణుడు వచ్చుచున్న మార్గము తమ మనస్సులందు కన్పట్టు చుండగా చూచుచు కన్నులలో నుండి నీరు గార్చుచుండెను.(13)

టీ:- గావ ఇతి. అత్ర సర్వత్ర వక్తృభేదాన్నా తీవ సంగతిర్వక్తవ్యాక్షరణ శంకయైవ ఉత్తభితైరున్నమితైః.కర్ణపుటైః పిబంత్యస్సత్యః.తథా శాబాశ్చ వత్సాః. స్తన్యపానే ప్రవృత్తాః. సమనంతరమేవ గీతం శ్రుత్వా. తదేవ పీయూషముత్తభిత కర్ణపుటైః పిబంతః. స్తనస్నుతపయః కబళాః కేవలం స్తనేభ్యః క్షరితక్షీరగ్రాసాః ముఖేషు ఏషాం తే తస్థుః విస్మృతక్రియా బభూవురిత్యర్థః. తత్ర హేతుః - గోవిందం దృశా మార్గేణ ఆత్మని మనసి. స్పృశంత్యః. అత ఏవ అశ్రూణాంకళాలేశా. లోచనయోర్యాసాం తాః. గావః. తే. చ శాబాః. (13)

టీ:- ఇచట అంతటను ఎవరు ఏమి చెప్పుచున్నారను సంధర్భమును ప్రత్యేకముగా చెప్పనక్కరలేదు.(వేణుగానామృత) ప్రవాహశంకతోనే పైకెత్తిన దొప్పలవంటి చెవులతో త్రాగుచు - అట్లే లేగలు కూడా కర్ణపుటములతో త్రాగుచు - స్తనస్నుతపయః కబళాః - కేవలము స్తనముల నుండి స్రవించియున్న పాలనుమాత్రమే గ్రసించినవి అయిన ముఖములందు గలవి దేనికో అవి ఊరకయుండిపోయినవి. తమ పనిని మర్చిపోయినవియయ్యెనని అర్థము - దానికి కారణము- కృష్ణుని - దృశా - మార్గముచేత ఆత్మని మనస్సునందు-స్పృశంత్యః-తాకు చుండినవి. అందువలననే-అశ్రూనాంకళాలేశా-కన్నులకు ఆనందా శ్రువుల లేశము ఎవరికో అవి-ఆవులు-(వత్సలు కావు). (13)

శ్లో॥ ప్రాయోబతామ్బ మునయోవిహ గావనేఽస్మిన్
కృష్ణేక్షితం తదుదితం కలవేణుగీతమ్ ।
ఆరుహ్య యే ద్రుమభుజాన్ రుచిరప్రవాళాన్
శృణ్వంతి మీలితదృశో విగతాన్యవాచః ॥ 14

తా. అయ్యోతల్లి! ఏమని చెప్పను? ఈ వనమునందు చెట్టుకొమ్మల నెక్కి, అందమైన చిగుళ్ళపైనెక్కిన పక్షులు, పిట్టలును మునులే, ఏలయన అవి కృష్ణునిచే చూడబడిన, అతనిచే పలుకబడుచున్న మధురధ్వనిగల వేణుగానమును, కనులు మూసుకొని ఇతర ప్రసంగములను మానుకొని (తాదాత్మ్యముతో) నిలుచున్నవి. (సామాన్యముగా అవి అట్లు నిలు చుండును) (14)

టీ:- ప్రాయ ఇతి. భో అంబ మాతః. అస్మిన్ వనే యే విహగాః పక్షిణః తే ప్రాయేణ మునయో భవితుమర్హంతి. కుతః. కృష్ణేక్షితం కృష్ణదర్శనం. పుష్పఫలాద్యంతరం వినా యథా భవతి తథా. రుచిరాః ప్రవాళాః, యేషాంతాన్. ధ్రుమభుజాన్ వృక్షాణాం శాఖా ఆరుహ్య. తేన శ్రీ కృష్ణేన ఉదితం ప్రకటితం కలవేణుగీతం. కేనాపి సుఖేన నిమీలి తదృశః త్యక్తాన్యవాచస్సంతోయే శృణ్వంతీతి. తథాహి. మునయః శ్రీకృష్ణ దర్శనం యథా భవతి తథా వేదోక్తకర్మఫలపరిత్యాగేన వేదధ్రువ శాఖా రూడాః. రుచిర ప్రవాళ స్థానీయాని కర్మాణ్యేవోపాదదానాః సుఖినస్సంతః. శ్రీకృష్ణగీతమేవ శృణ్వంతి. అతస్త ఏవైతే భవతు మర్హం తీతి. 14

శ్లో॥ నద్యస్తదా తదుపధార్య ముకుందగీత
మావర్త లక్షితమనోభవభగ్న వేగాః ।
ఆలింగనస్థగితమూర్మిభుజైర్మురారే
ర్గృహ్ణంతి పాదయుగళం కమలోపహారాః ॥ 15

టీ:- భో అంబ! ఓ అమ్మా! ఈ వనమునందు ఏ పక్షులుగలవో అవి సామాన్యముగా మునులు అగుటకు తగియున్నవి. కృష్ణేక్షితం-కృష్ణుని దర్శనము-పుష్పములు, ఫలములు మొగలగువాని మఱుగులేకుండా ఎట్లు జరుగునో అట్లు-అందమైన చిగుళ్ళు వేనికో అట్టి చెట్టుకొమ్మల నెక్కి-ఆ కృష్ణునిచే ప్రకటింపబడు శ్రావ్యమైన వేణుగానమును ఏదో తన్మయత్వముతో, కన్నులు మూసుకొని, ఇతర ప్రసంగములను వదిలి పెట్టినవియై, ఏవి వినుచుండునో-అని-అదియుక్తమే-మునులు శ్రీ కృష్ణుని దర్శనము ఎట్లగునో అట్లు-వేదోక్తములైన కర్మల ఫలములను బొత్తిగా విడిచిపెట్టుటచేత, వేదము అనెడి చెట్టుయొక్క కొమ్మలపైకెత్తి, అందమైన చిగుళ్ళ స్థానమునందుండు కర్మలే (అచింత్యచింతనాదులే) ఇంద్రియ నిగ్రహకారకములుగ కలవారై, సుఖముగల వారగుచు శ్రీకృష్ణుని గీతమునే వినుచున్నారు. అందువలన ఈ పక్షులు వారే (మునులే) అగుటకు అర్హములగుచున్నవి అని భావము. 14

తా. ఆ సమయమున నదులు కృష్ణుని వేణుగానము నాలకించి, సుడులను సూచించుచు మన్మధుని (ఒత్తిడి) వలన తమ వేగమును తగ్గించినవియయ్యెను. తమ అలలు అనెడి భుజములతో తామరపూవుల కానుకలు గలవియై కృష్ణుని పాదద్వంద్వమును కౌగలించుచున్నట్లు ఆచ్ఛాదించెను. 15

టీ:- నద్య ఇతి. ఆస్తాం చేతనానాం కథా ఆవర్తైః. పరిభ్రమైః లక్షితేన సూచితేన. మనోభవేన కామేన భగ్నో వేగో యాసాం తాః. ఆలింగనేన స్థగిత మాచ్ఛాదితం యథా భవతి తథా. ఊర్మయ ఏవ భుజాస్తైః కమలోపహారాః కమలాని ఉపహరన్త్యః మురారేః పాదయుగళం గృహ్ణంతి ధారయంతి. 15

టీ:- చేతలను కథ అట్లుండుగాక - (ఇక ఇతరులతోడి కథ ఎట్లున్నది?) ఆవర్తైః - సుడులతో - లక్షితేన - సూచించుటద్వార మనోభవేన మన్మధుని చేత - తగ్గిపోయిన వేగము ఎవరికో అవి. (నదులు) ఆలింగనేన స్థగితం - కౌగిలితో కప్పుబడిన వానివలె - తరంగములే భుజములుగా గలవియై - వానిచేత - కమలోపహారాః - కమలములే కానుకలుగ - కృష్ణుని పాద ద్వంద్వమును - దర్శించు చున్నవి. 15

శ్లో॥ దృష్ట్వా తపే వ్రజపశూన్ సహ రామగోపై
స్సంచారయంతమను వేణుముదీరయం తమ్ ।
ప్రేమ ప్రవృద్ధ ఉదితః కుసుమావళీభి
స్సఖ్యుర్వ్యధాత్స్వవపుషాంబుద ఆతపత్రం ॥ 16

తా. బలరామునితోను, గోపాలురతోను కలసి వ్రజమునందలి పశువులను మేపుకొనుచు, వేణువును వాయించుచును, ఎండలో సంచరించుచున్న శ్రీకృష్ణునిచూచి మేఘుడు తన స్నేహితుడగు కృష్ణుని పైనను, అతని అనుచరగణముపైనను, ప్రేమ ఉప్పొంగగా తన శరీరమునే గొడుగుగా విస్తరించి సన్నని పూలవంటి తుంపరలను చల్లుచు చల్లదనమును పూర్చెను. (తనను తాను గొడుగుగా పట్టెను)16

టీ:- దృష్ట్వేత్వి. లోకార్తిహరణ శీలత్వాదిసామ్యాత్. సఖ్యుః శ్రీకృష్ణస్య. అంబుదః తదుపరి ఉదితః పునః ప్రేమ్ణా ప్రవృద్ధస్సన్ కుసుమావళీభిః పుష్ప సమూహైః తత్తుల్యైస్తుషారైర్వా సహ స్వవపుషా. ఛత్రం విహితవాన్. 16

టీ:- లోకమునకు కలుగు బాధను నివారించుట మున్నగు సామ్యము వలన-సఖ్యుః-శ్రీకృష్ణునకు-మేఘుడు అతనిపైకి ఆకాశమునందు లేచి ఇంకను ప్రేమతో వృద్ధిచెందినవాడై-కుసుమావళిభిః పుష్పముల సమూహములతో-లేక వానితో సమానమైన తుంపరలతో కూడా-స్వదపుష్పా-తన శరీరముతో-గొడుగు పట్టెను. 16

శ్లో॥ పూర్ణాః పులిన్ద్య ఉరుగాయపదాబ్జరాగశ్రీ
కుంకుమేన దయితాస్తన మండితేన ।
తద్దర్శనస్మరరుజస్తృణరూషితేన లింపంత్య
ఆనన కుచేషు జహుస్తదాధిం ॥ 17

తా. ప్రియమైన గోపస్త్రీలు తమ స్తనములకు అలంకరించుకొనిన మైపూతలచేత శ్రీకృష్ణుని పాదపద్మముల అరుణిమ ప్రభకు తోడైన కుంకుమతో కూడుకొనిన బృందావనమునందలి గడికను చూచుటచేత కలిగిన మన్మధబాధను, దానిని (కుంకుమమును) తమ ముఖములకును, కుచముల యందును అలదుకొనుట ద్వారా శబర స్త్రీలు తమ మన్మధబాధను బాపుకొనిరి. వారు ధన్యులుకదా! 17

టీ:- ససీత్కారమాహుః పూర్ణా ఇతి. పూర్ణాః కృతార్థాః. పుళింద్యః శబరాంగనాః. కథమిత్యత ఆహ – ప్రథమం దయితానాం స్తనేషు మండితేన అనులిప్తేన.పునశ్చ. రతిసమయే. ఉరుగాయస్య శ్రీకృష్ణస్య పదాబ్జయోః రాగేణ ఆరుణ్యేన. శ్రీః కాంతిర్యస్య తేన కుంకుమేన పునస్తస్య వక్షస్థలీషు చంక్రమణేన తృణేషు రూషితేన లగ్నేన. తద్దర్శనేన. తథాభూతస్య కుంకుమస్య. దర్శనేన స్మరకృతా రుక్ తాపో యాసాం తాః.తేన కుంకుమేన.ఆననేషు కుచేషుచ కామత ప్తేషు.లింపంత్యః.తదాధింకామవ్యధాంజహుః అతస్తాః.కృతార్థాః. ధిగ న్యామాదృశీః యాః ఏవం భూతమస్యాధిశమనం న లంభత ఇతి. 17

టీ:- సీత్కారముతో (ధ్వని విశేషముతో) పలికిరి – పూర్ణాః – కృతార్థులు – పుళింద్యః – శబరకాంతలు. ఎటులో చెప్పుచున్నాడు– మొదట, ప్రియమైన స్తనములందు పూయబడిన – ఇంకను – రాత్రి సమయము నందు – ఉరుగాయస్య – శ్రీకృష్ణునియొక్క అడుగు తామర మరల యొక్క, రాగేణ – ఎఱుపు వన్నెచేత – శ్రీః – కాంతి. దేనికో దానిచేత – కుంకుమచేత మరల – దాని వక్షస్థలములందు త్రిప్పుకొనుటచేత – గడ్డి యందు, రూషితేన – లగ్నమైన (కూడియున్న) – దానిని చూచుటచేత – అట్టి కుంకుమయొక్క దర్శనము చేత, మన్మధునిచేత బాధింపబడిన వారగుచున్న తాపము ఎవరికో వారు (శంబర స్త్రీలు) ఆ కుంకుమము చేత – ముఖములందు, చనులయందును – కామముచేత తపించి పోవుచున్న వాని యందు పూసికొనుచు – ఆ కామ బాధను ఉపశమింప చేసుకొనిరి.

శ్లో॥ హంతాయమద్రిరబలా హరిదాసవర్యో
యద్రామకృష్ణ చరణస్పర్శ ప్రమోదః ।
మానం తనోతి సహ గోగణయోస్తయో
ర్యత్పానీయ సూయ వసకందర కందమూలైః ॥ 18

టీ:- హంతేతి. హంతేతి హర్షే. హే సంఖ్యః. అయమద్రిర్గోవర్ధనః. ధ్రువం హరిదాసేషు శ్రేష్ఠః.కుత ఇత్యతఆహ - యస్మాద్రామకృష్ణయో శ్చరణస్పర్శేన ప్రమోదోయస్య సః తృణాద్యుద్గమమిషేణ రోమ హర్ష దర్శనాత్. కించ. యత్ మానం తనోతి. సహగోభిర్గణేన సఖిసమూహేన చ. వర్తమానయోరపి తయోః. కైః. పానీయైః సూయవసైః శోభనతృణైః కందరైః. కందమూలైశ్చయథోచితం అతోఽయమతిధన్య ఇత్యర్థః. 18

అందువలన వారు ధన్యులయిరి- అయ్యో ! మా వంటివారు ఎవరుకలరో వారు ఇట్టిఇట్టి ఉపశమనమును పొందజాలకపోయిరి. అని. 17

తా. ఓగోపస్త్రీలారా ! అహో !ఈ గోవర్ధనగిరి రాజము కృష్ణ బలరాముల పాదస్పర్శలచే మిక్కిలి సంతోషించుచుండు హరిభక్తులలో శ్రేష్ఠమైనది అంతేగాక గోవుల సమూహములతో కూడిన బలరామ కృష్ణులు - గోపాలకులును, పానీయములచేత (నీటి సరస్సులచేత, ఫలరసములచేత) శుభ ప్రదములైన గతికల చేతను, పర్వత బిలముల చేతను, (తలదాచుకొనుటకు) కందమూలములచేతను సత్కారము చేయును. (ఆ గోవర్ధనగిరి ధన్యమైనది). 18

టీ:- హంత అనునది హర్షసూచకము-ఓ చెలులారా! ఈ గోవర్ధన పర్వతము - నిశ్చయముగ హరిదాసులలో శ్రేష్ఠమైనది. ఎందుకో చెప్పుచున్నాడు - రామకృష్ణుల పాదములను స్పృచించుటచేత హర్షము దేనికో అది - గడ్డి మొదలగునవి మొలచుట అను నెపమున పులకింత కలుగుట కన్పట్టుట వలన - మరియు-ఏ సత్కారమును చేయు చున్నదో - ఆవుల సమూహములతో - స్నేహితులతో కూడా కూడియున్న రామ కృష్ణులకు - వేనిచేత? (సేలయేళ్ల) నీటితో

శ్లో॥ గాగోపకైరనువనం నయతోరుదారవేణు
స్వనైః కలపదైస్తనుభృత్సుసఖ్యః ।
ఆస్పందనం గతిమతాం పులకస్తరూణాం
నిర్యోగపాశకృతలక్షణయోర్విచిత్రమ్ ॥ 19

టీ॥ గా ఇతి. హే సంఖ్యః. ఇదం త్వతిచిత్రం. గోపైస్సహగాః వనే సంచారయతో స్తయోః రామకృష్ణయోః మధురపదైః మహావేణునాదైః . శరీరిషు యే గతి మంతస్తేషాం ఆస్పందనం. స్థావరధర్మః తరూణాం పులకః జంగమధర్మ ఇతి. నియుజ్యంతే గావః ఏభిరితి. నిరోగ్యాః

-సూయవసైః - అందమైన గతికలచేత- కొండబిలములచేత, కందమూలముల చేతను యథోచితముగా - (సత్కరించుటచేత) (ఇతడును) గోవర్ధనుడు ధన్యుడని అర్థము. 18

తా. చెలులారా! ఆవులతోను, గోపాలకులతోను కలసి, శ్రావ్యమైన వేణుగానములతోను, మధురమైన పాటలతోను ఒక వనమునుండి మరియొక వనమునకు బ్రోవుచున్నప్పుడు రామకృష్ణుల గతిలీల మిక్కిలి విచిత్రము. పశువులను కట్టివేయు త్రాళ్లు, తమ శిరస్సులపైన, భుజములపైనను వేసుకొని పిల్లనగ్రోవులు వాయించుచు, లేక పదములు పాడుచు గోవులను గోపాలురను తోడ్కొని వారిరువురు వనములు తిరుగుచున్నప్పుడు చైతన్యముగల ప్రాణులయందు తన్మయత్వము వలన స్తబ్ధత ఆవహించి స్థావరధర్మము వచ్చినది. ఇక చెట్లు మొదలగు స్థావరములయందు గగుర్పాటువంటి జంగమ లక్షణము ఏర్పడినది. ఆశ్వర్యము కదా! 19

టీ॥ ఓ చెలులారా! ఇది మిక్కిలి విచిత్రము. గోపాలురలతోకూడా ఆవులను అడవిలో మేపుచు తిరుగుచున్న ఆ రామకృష్ణులయొక్క తీయని పాటలతో, గొప్ప వేణునాదములతో - శరీరిషు ఎవరు చైతన్యము గలవారో అట్టి వారిలో స్తబ్ధత - స్థావరధర్మము - చెట్లకు

పాదబంధనరజ్జవః. అధృష్యగవాం కర్షణార్థాః పాశాశ్చ తైః కృతం లక్షణం చిహ్నం యయోః. శిరసి నిరోగ్యవేష్టనేన స్కంధస్థపాశేన చ. గోపపరిబృఢశ్రియా విరాజమానయోరిత్యర్థః. (19-20)

పులకాంకురములు, అనగా జంగమధర్మము ఏర్పడెను అని పశువులు వీనిచే కట్టబడును. కావున నిర్యోగములు - కాళ్లకు కట్టు త్రాళ్లు, మొరటి పశువులను నియంత్రించు కొఱకునైన త్రాళ్లు - వానిచే ఏర్పరచుకొనిన ఆ క్షణము- చిహ్నము ఏ ఇరువురికో - తలపైన త్రాళ్లు చుట్టుకొనుటచేత - భుజము పైనగల త్రాటిచేతను గోపాలకుల, పాలకుల ఠీవితో ప్రకాశించుచున్న వారి యొక్క అని అర్థము. (19-20)

**శ్రీశుక ఉవాచ**

శ్లో॥ ఏవంవిధా భగవతో యా బృందావనచారిణః ।
వర్ణయంత్యో మిథో గోప్యః క్రీడాస్తన్మయతాం యయుః ॥ 20

**శ్రీశుకుడు ఇట్లనుచున్నాడు.**

తా. బృందావనమున చరించుచున్న గోపస్త్రీలు ఈ విధముగా తమలోతాము భగవానుడు శ్రీకృష్ణునియొక్క లీలలను వర్ణించుకొనుచు తన్మయత్వము పొందిరి. 20

**శ్రీ మద్భాగవతే, మహాపురాణే దశమస్కంధే,**
**ఏకవింశోఽధ్యాయః**

**అని శ్రీమద్భాగవతమున దశమస్కంధమందు**
**ఇరువది ఒకటవ అధ్యాయము సమాప్తము.**

## ద్వావింశోధ్యాయః

**శ్రీశుక ఉవాచ**

శ్లో॥ హేమంతే ప్రథమేమాసి నందవ్రజకుమారికాః ।
చేరుర్హవిష్యం భుంజానా మాసం కాత్యాయనీ వ్రతమ్ ॥ 1

శ్లో॥ ఆప్లుత్యాంభసి కాళింద్యాః జలాంతే చోదిత్యేऽరుణే ।
కృత్వా ప్రతికృతిం దేవీమానర్చుర్నృప సైకతీమ్ ॥ 2

శ్లో॥ గంధైర్మాల్యైస్సురభిభిర్బలిభిర్ధూపదీపకైః ।
ఉచ్చావచైశ్చోపహారైః ప్రవాళఫలతండులైః ॥ 3

శ్లో॥ కాత్యాయని మహామాయే మహాయోగీన్యధీశ్వరి ।
నందగోప సుతం దేవి పతిం మే కురు తే నమః ॥ 4

## 22వ అధ్యాయము

**శ్రీశుకయోగి ఇట్లనుచున్నాడు.**

తా. హేమంత ఋతువుయొక్క మొదటినెలయగు మార్గశిరమునందు నందవ్రజమునందలి కన్యలు, హవిష్యాన్నమును మాత్రము భుజించుచు ఆ మాసమంతయును కాత్యాయనీ వ్రతమునాచరించుచు గడిపిరి. 1

తా. ఓ రాజా! సూర్యుడు ఉదయింపగనే యమునానదీ జలములతో స్నానముచేసి, ఇసుకతో అమ్మవారి ప్రతిమను చేసి–ఆ కన్యలు దేవిని పూజించిరి. 2

తా. గంధములు, సువాసనగలపుష్పములు, దండలు, నైవేద్యములు, ధూపములు,దీపములు, అనేక విధములైన కానుకలు, చిగురులు (పగడములు) పండ్లు, అక్షతలు మున్నగువానితో పూజించిరి. 3

ఇతా. ఓ కాత్యాయనీ! ఓ మహామాయా! మహాయోగినీ! అధీశ్వరీ! దేవీ! నందగోకుమారుడగు శ్రీకృష్ణుని నాకు భర్తగా చేయుము. నీకు నమస్కారము. 4

టీ:- శ్లో. "ద్వావింశే గోపకన్యానాం వస్త్రాహరణలీలయా, వరం దత్వా గతః కృష్ణో యజ్ఞశాలామితీర్యతే. గోపీనాం కామతః కృష్ణే నిస్సీమ ప్రేమ సంభవః, కాత్యాయన్యర్చనోద్భూతతత్ప్రసాద మహోదయః." హేమంత ఇతి ప్రథమే మాసి మార్గశీర్షే. (1-4)

టీ:- ఈ ఇరువదిరెండవ అధ్యాయమున కృష్ణుడు గోపకన్యల బట్టలు దొంగిలించుట అను లీలతో వారికి వరమిచ్చి యజ్ఞశాలను ప్రవేశించెనని చెప్పబడుచున్నది. గోపకన్యలు కోరినందువలన వారికి కాత్యాయనిని (పార్వతిని) అర్చించుటచే ఆ యమ్మ అనుగ్రహముతో ఫలస్వరూపముగా కృష్ణునియందు అవధిలేని ప్రేమ కలిగెను.(ఇవి శ్రీధరీయ శ్లోకముల భావములు)- హేమంతేఅని - మొదటి మాసమున - మార్గశిరమున (1-4)

శ్లో॥ ఇతి మంత్రం జపం త్యస్తాః పూజాం చక్రుః కుమారికాః ॥ 5

తా. అనునట్టి ఈ మంత్రమును జపించుచు వారు (ఆ కన్యలు) అమ్మవారిని పూజించిరి. 5

టీ:- మహామాయేత్యాది సంభోధనైస్తవన కించిదశక్యమితి సూచయంత్యః తాః స్వైరం ప్రత్యేకం ప్రార్థయంతే-ఇతీతి. 5

టీ:- మహామాయ మొదలగు సంబోధనలతో 'నీకు శక్యముకానిది ఏదియు లేదని సూచించుచు వారు స్వయముగను ప్రత్యేకముగను ప్రార్థించుచున్నారు. ఇతి' అని. 5

శ్లో॥ ఏవం మాసం వ్రతం చేరుః కుమార్యః కృష్ణచేతసః ।
భద్రకాళీం సమానర్చుర్భూయన్నందసుతః పతిః ॥ 6

తా. ఈ విధముగా వారు ఒకనెల వరకు వ్రతమునాచరించిరి. ఆ కన్యలందఱును శ్రీకృష్ణుని తోడనేనిండిన మనస్సుగలవారై 'మాకు కృష్ణుడే భర్తయగుగాక' యని భద్రకాళిని వినయముగ ప్రార్థించిరి. 6

టీ:- ఏవమితి. కృష్ణచేతస్త్వమేవాహ-భయాన్నందసుతః పతిరితి. 6

టీ:- కృష్ణుడే పతియగుగాకయని వారి కృష్ణమయమగు మనస్తత్వమును తెలుపుచున్నారు. 6

శ్లో॥ ఉషస్యుత్థాయ గోత్రైస్స్వైరన్యోన్యా బద్ధ బాహవః ।
కృష్ణముచ్చైర్జగుర్యాంత్యః కాళింద్యాం స్నాతుమన్వహమ్ ॥ 7

తా. ఉషఃకాలముననే లేచి తమ గోత్రనామములతో (ఉపనామములతో) ఒకరినొకరు పిలిచి కన్యలందఱును పరస్పరము ఒకరిచేయి మరిఒక రుపట్టుకొని, ప్రతిదినము స్నానము చేయుటకు యమునానదికి పోవుచు కృష్ణుని ఉచ్చైస్స్వరమున కీర్తించుచుండిరి. 7

శ్లో॥ నద్యాః కదాచిదాగత్య తీరే నిక్షిప్య పూర్వవత్ ।
వాసాంసి కృష్ణం గాయంత్యోవిజహ్రుస్సలిలేముదా ॥ 8

తా. ఒకానొకప్పుడు పూర్వమువలనే తమ బట్టలన్నియు నదియొడ్డున భద్రపరిచి శ్రీకృష్ణుని స్తుతించుచు నీటిలో విహరించుచుండిరి. 8

టీ:- వ్రతస్య పూర్వాంగమాహ-ఉషసీతి. గోత్రైర్నామభిః అన్యోన్యా బద్ధబాహవః పరస్పరం గృహీతపాణయః. (7-8)

టీ:- గోత్రైః-పేర్లతో-పరస్పరము చేతులు పట్టుకొనినవారై- (7-8)

శ్లో॥ భగవాంస్తదభిప్రేత్య కృష్ణో యోగేశ్వరేశ్వరః ।
వయస్యైరాగత స్తత్రవృతస్తత్కర్మసిద్ధయే ॥ 9

తా. భగవానుడు యోగీశ్వరులకే ఈశ్వరుడును అయిన కృష్ణుడు వారి అభిప్రాయమును గుర్తించి తన తోటివారితో అచటికి (నదిఒడ్డుకు) వచ్చి వారు చేసిన కాత్యాయనీవ్రతము అను కర్మఫలవంతము చేయుటకు పూనుకొనెను. 9

టీ:- భగవానితి. యోగేశ్వరాణామీశ్వర ఇతి ప్రత్యేకం తాదృఙ్మనోరథపూరణ సామర్థ్యం దర్శయతి - తాసాం కర్మణః సిద్ధయే ఫలదానాయేతి. 9

టీ:- యోగీశ్వరులలో ఈశ్వరుడు అని ప్రత్యేకముగ అట్టి మనోరథములను (కోరికలను) పూర్తిచేయుటకు గల సామర్థ్యమును చూపుచున్నాడు. వారికర్మయొక్క సిద్ధికొఱకు-ఫలమునిచ్చుట కొఱకు అని 9

శ్లో॥ తాసాం వాసాంస్యుపాదాయ నీప మారుహ్య సత్వరః ।
హసద్భిః ప్రహసన్ బాలైః పరిహాసమువాచ హ ॥ 10

తా. వారి వస్త్రములను తీసుకొని, తొందరగా కదంబవృక్షము (కడిమిచెట్టు) నెక్కి, నవ్వుచున్న బాలురతోసహా తానును నవ్వుచు, పరిహాసముగా కృష్ణుడిట్లనెను. 10

టీ:- తాసామితి. నీపం కదంబం. బాలైస్సహ. 10

టీ:- నీపం-కదంబము-బాలైస్సహ-బాలురతోకూడా 10

శ్లో॥ అత్రాగత్యాబలాః కామం స్వం స్వం వాసః ప్రగృహ్యతాం ।
సత్యం బ్రవాణినో నర్మయద్యూయం వ్రతకర్శితాః ॥ 11

తా. కన్యలారా! కొరినచో ఇచటికి వచ్చి మీ మీ వస్త్రములను తీసుకొనుడు. నేను సత్యమును చెప్పుచున్నాను. ఇందు పరిహాస మేమియు లేదు. ఏలయన మీరు వ్రతమునాచరించుటచే అలసి యున్నారు. (అట్టిమీతో నేను పరిహాసము చేయనుగదా! అని) 11

టీ:- అత్రేతి. హే అబలాః నోనర్మ న పరిహాసః. యస్మాత్ యూయం కర్శితాః వ్రతశాంతాః. 11

టీ:- హే అబలాః - ఓ కుమారికలారా! - నోనర్మ- పరిహాసము కాదు- ఏలయన మీరు వ్రతముచేసి అలసియున్నారు. 11

శ్లో॥ నమయోదిత పూర్వం వా హ్యనృతంతదిమే విదుః ।
ఏకైకశః ప్రతిచ్ఛధ్వం సహ వా తదనుమధ్యమాః ॥ 12

తా. అందమైన నడుములతో నలరారు సౌందర్యవతులారా! నేను ఇంత కుముందెన్నడును అసత్యము మాట్లాడి ఎరుగను. ఆ విషయము వీరికి (ఈ గోపబాలురము) తెలియును. ఒక్కొక్కరువచ్చి మీ మీ బట్టలు తీసుకొనుడు. లేక అందఱును కలిసి వచ్చి ఒకే పర్యాయము తీసుకొనుడు. 12

టీ:- నేతి ఏకైకశో నా ఆగత్య స్వీకురుత. స హైవ వా. న తత్రాస్మాక మాగ్రహ ఇత్యర్థః. 12

టీ:- ఒక్కొక్కరువచ్చి తీసుకొనుడు. కలసి అందఱు ఒక్కసారియైనను (తీసుకొనుడు) ఎట్లైనను మాకు అభ్యంతరములేదు అని అర్థము. 12

శ్లో॥ తస్య తత్ క్ష్వేళితం దృష్ట్వా గోప్యః ప్రేమపరిప్లుతాః ।
వ్రీడితాః ప్రేక్ష్య చాన్యోన్యం జాతహాసాననిర్యయుః ॥ 13

తా. కృష్ణుని ఆ పరిహాస వాక్యమును విని(చూచి) ప్రేమరసమగ్నులై, సిగ్గుతో వారు ఒకరినొకరు చూచుకొనుచు నవ్వుకొనుచు నీటినుండి బయటకు రాకుండిరి. 13

శ్లో॥ ఏవం బ్రువతి గోవిందే నర్మణా క్షిప్తచేతసః ।
ఆ కంఠమగ్నాః శీతోదే వేపమానాస్తవ బ్రువన్ ॥ 14

తా. శ్రీకృష్ణుడు ఇట్లు పలుకగనే ఆ కన్యలు అతని పరిహాసముచేత చుట్టుకొనబడిన మనస్సుకలవారై, చల్లని నీటిలో గొంతువఱకు మునిగినవారై వణుకుచు ఇట్లనిరి. 14

టీ:- తస్యేతి. క్ష్వేళితం పరిహాసః. ప్రేమ పరిప్లుతాః ప్రేమ రసమగ్నాః (13-14)

టీ:- క్ష్వేళితం - పరిహాసము- ప్రేమపరిప్లుతాః- ప్రేమ రసమగ్నులై. (13,14)

శ్లో॥ మానయంభోకృథాస్త్వాం తు నందరాజ సుతం ప్రియమ్ ।
జానిమోఽంగ వ్రౌజశ్లాఘ్యం దేహి వాసాంసి వేపితాః ॥ 15

తా. కృష్ణా! అన్యాయము చేయకుము. నిన్ను నందరాజ కుమారునిగను, ప్రేమాస్పదుడుగను, వ్రజమునందలి అందరిలోనను శ్రేష్ఠమైన వాడుగను తెలియుదుము. ఓ కృష్ణా! వణుకుచున్న మాకు మా వస్త్రములనిమ్ము. 15

టీ:- తత్ర మగ్నా ఊచుః. మేతి. అంగభో కృష్ణ. అనయమన్యాయం. మా కృథాః. 15

టీ:- నీటమునిగియున్న వారిట్లనిరి. అంగభో-కృష్ణా! అనయం- అన్యాయమును. మాక్రుధాః-చేయకుము. 15

శ్లో॥ శ్యామసుందర తే ద్యాసః కరవామ తవోదితమ్ ।
దేహి వాసాంసి సర్వజ్ఞ నో చేద్రాజ్ఞే బ్రువామహై ॥ 16

తా. ఓ శ్యామసుందరా ! నీకు సేవకురాండ్రము. నీవు చెప్పినట్లు చేయుదుము. ఓ సర్వజ్ఞా ! మా వస్త్రములనిమ్ము ! లేనిచో రాజుకు నివేదింతుము. 16

**శ్రీ భగవానువాచ**

శ్లో॥ భవత్యో యది మే దాస్యో మయోక్తం వా కరిష్యథ ।
అత్రాగత్య స్వ వాసాంసి ప్రతీచ్ఛత సుమధ్యమాః ।
నోచేన్నాహం ప్రదాస్యే కిం వృద్ధో రాజా కరిష్యతి ॥ 17

**శ్రీకృష్ణుడు ఇట్లనెను.**

తా. మీరు నాకు సేవకురాండ్రే అయినచో నేను చెప్పినట్లు మీరు చేసెదరేని ఇచటకి వచ్చి మీ మీ బట్టలు తీసుకొనుడు. సుందరాంగులారా ! నే నీయకుండినట్లయినచో రాజుకు చెప్పెదరా! ముసలిరాజు ఏమి చేయగలడు? 17

టీ:- ప్రౌఢా ఊచుః. శ్యామేతి. నోచేద్రాజ్ఞే నందాయ కంసాయ వా. బ్రువామహై. (16-17)

టీ:- ప్రౌఢ వయస్సుననున్న స్త్రీలు ఇట్లనిరి-నోచేత్‌రాజ్ఞే-లేనియెడల నందునికో, కంసునికో చెప్పెదము. (16-17)

శ్లో॥ తతో జలాశయాత్సర్వా దారికాశ్శీతలేపితాః ।
పాణిభ్యాం యోనిమాచ్ఛాద్య ప్రోత్తేరు స్శీరమంగనాః ॥ 18

తా. అప్పుడు కన్యలు ప్రౌఢలు అందఱును చలితో వణుకుచున్నవారై తమచేతులతో గుప్తస్థానములను కప్పివేసి జలాశయమునుండి ఒడ్డునకు వచ్చిరి. 18

టీ:- తత ఇతి. ప్రోత్తేరుర్నిర్గతాః. 18

టీ:- ప్రోత్తేరుః-వెలువడిరి. 18

శ్లో॥ భగవానాహ తా వీక్ష్య శుద్ధ భావప్రసాదితః ।
స్కంధే నిధాయ వాసాంసి ప్రీతః ప్రోవాచ సస్మితః ॥ 19

తా. వారిని చూచి నిష్కలంకమైన అనుగ్రహ బుద్ధితో భగవానుడు, వారి వస్త్రములన్నియు తన భుజముపై వేసుకొని, ప్రీతుడై చిరునవ్వు నవ్వుచు ఇట్లనెను. 19

టీ:- భగవానితి.అహతాః. ఈషదక్షతయోనీః వీక్ష్య. 19

టీ:- అహతాః - అక్షత యోనులను - కొంచెము చూచి. 19

శ్లో॥ యూయం వివస్త్రాయదపో ధృత వ్రతా
వ్యగాహ తై తత్తదుదేవహేలనమ్ ।
బద్ధ్వాంజలిం మూర్ధ్న్యపనుత్తయేఽంహసః
కృత్వా నమో వో వసనం ప్రగుహ్యతామ్ ॥ 20

తా. వ్రతానుష్ఠానముననున్న మీరు వస్త్రహీనులై నదిలో స్నానమాచరించితిరి. దాని వలన దేవతలకు ( జలాధిదేవత వరుణునకు, దేవతయగు యమునానదికిని) అపచారము కలిగినది. అట్టి దోషమును పోగొట్టుకొనుటకై మీరు అంజలిఘటించి చేతులు శిరస్సుపైకిసాచి (మాకు) నమస్కారముచేసి మీ వస్త్రములను తీసుకొనుడు. 20

శ్లో॥ ఇత్యేతద్వచనం శ్రుత్వా ధర్మయుక్తం మహాత్మనః ।
ఏకేన పాణినా నేమురేకేనాచ్ఛాద్య చాంగనాః ॥ 21

తా. మహాత్ముడైన కృష్ణుని ధర్మయుక్తమైన ఈ మాటవిని ఆ స్త్రీలు ఒక చేతితో యోనిని ఆచ్ఛాదించుకొని ఒక చేతితో నమస్కారము చేసిరి. 21

శ్లో॥ తా వీక్ష్యోవాచ భగవాన్ భూయో ధర్మమిదం వచః ।
ఏకేన పాణినా యోవైప్రణమేద్దేవమచ్యుతమ్ ॥ 22

తా. కృష్ణభగవానుడు వారినిచూచి మఱల ధర్మయుక్తమైన మాట ఇట్లనెను. గోవిందునకు ఒకచేతితో ఎవడు నమస్కారము చేయునో వానికి శిక్ష చేతిని నరికివేయుటయే అని ధర్మవేత్తలకు తెలియును.

శ్లో॥ తస్యాః దండః కరచ్ఛేద ఇతి ధర్మవిదో విదుః ।
తస్మాదుభాభ్యాం పాణిభ్యాం ప్రణమేత్స్వామినం నరః ॥ 23

అందు వలన ప్రభువగు అచ్యుతునకు మానవుడు రెండుచేతులతో నమస్కరించవలెను. (22-23)

శ్లో॥ తథా చ యూయం కురుత తన్మే ప్రియతరం భవేత్ ।
అహంస్తూభయమేతత్తు పరిమార్జయితుం యది ।
ఇచ్ఛావః పాణియుగళైర్నమస్కృత్య ప్రగృహ్యతామ్ ॥ 24

తా, అట్లే మీరును చేయుడు. అదియే నాకు చాల ఇష్టమైనది. నేను మీరెండు దోషములను ప్రక్షాళన చేయవలెనని మీరు కోరినయెడల రెండుచేతులతో నమస్కరించి బట్టలు తీసుకొనుడు. 24

టీ:- యూయమితి. ధృతవ్రతాస్సత్యో వివస్త్రాః అపో వ్యగాహత అప్సుస్నాతా ఇతి యత్ తదేతత్. ఉ ఏవ. దేవహేళనం అపరాధ ఏవేత్యర్థః. వ్రతవైగుణ్యభీతానాం ప్రాయశ్చిత్తమివాహ - అస్య అంహసః పాపస్య. అపనుత్తయే నివర్తయే. మూర్ధ్ని అంజలిం బద్ధ్వా. ఓన్నమ ఇతి ప్రణామం కృత్వా. (20-24)

టీ:- వ్రతనియమమున నుండుచు బట్టలులేకుండ నీటియందు స్నాన మాడితిరి. దానివలన-దేవహేళనం-అపరాధమే అని యర్థము. వ్రత దోషమువలన భయపడువారికి ప్రాయశ్చిత్తము వంటిది చెప్పుచున్నాడు. అస్య అహంసః - ఈ పాపముయొక్క - అపనుత్తయే- నివారణకొరకు- శిరస్సుపై అంజలిని ఘటించి-'నమస్కరించుచున్నాము' అని ప్రమాణము చేసి. (20-24)

శ్లో॥ ఇత్యచ్యుతేనాభిహితం వ్రజాబలా
మత్వావివస్త్రా ప్లవనం వ్రతచ్యుతిం ।
తత్పూర్తి కామాస్తద శేషకర్మాణాం
సాక్షాత్కృతం నేమురవద్యముద్యతః ॥ 25

తా. ఈ విధముగా శ్రీకృష్ణుడు చెప్పగానే వ్రజస్త్రీలు వివస్త్రలుగ స్నానము చేయుటవలన తమ వ్రతమునకు ప్రత్యవాయము కలిగినదని భావించి-తమ వ్రతము సాంగోపాంగముగ పూర్తియై ఫలవంతము కావలెనను కోరికను గలవారై కిందనున్న చేయి పైకెత్తి నమస్కారము చేసిరి. 25

శ్లో॥ తాస్తథాఽవనతా దృష్ట్వా భగవాన్ దేవకీసుతః ।
వాసాంసి తాభ్యస్సం ప్రాదాత్ కరుణస్నేహ తోషితః ॥ 26

తా. ఆ విధముగా వారు నమస్కారము చేయుటచూచి భగవానుడగు కృష్ణుడు-దేవకీతనయుడు దయతోను, జాలితోను అర్ధమనస్కుడై సంతసించి వారి వస్త్రములను వారికిచ్చెను. 26

టీ:- ఇతీతి. ఇతి దోషత్వేన. అచ్యుతే నాభిహితం. వివస్త్రాప్లవనం వ్రతస్య చ్యుతి హేతుం మత్వా. తస్య వ్రతస్య పూర్తికామాః. తదశేష కర్మాణాం తస్య వ్రతస్య అన్యేషామశేషకర్మాణాం చ. సాక్షాత్కృతం ఫలభూతం. తమేవ నేముః. యతః స ఏవ అవద్యముట్. పాపమార్జకః (25,26)

టీ:- ఇట్టి దోషత్వముచేత-కృష్ణునిచేత చెప్పబటిన యట్లు నగ్నముగ స్నానముచేయుట వ్రతముయొక్క చ్యుతికి (భంగము)కారణముగ భావించి-ఆ వ్రతము తృటిలేకుండ పరిసమాప్తి కావలెనను కోరికగల వారై - ఆ వ్రతముయొక్క అశేషమైన కర్మలన్నియు (సఫలము కావలెనని కోరిక గలవారై) సాక్షాత్కృతం - ఫలమునిచ్చునదిగ - అతనికే నమస్కరించిరి. ఎందువలననగ అతడే-అవద్యముట్-పాపమును తొలగించువాడు. (అవద్యముత్తతః) (అవద్యముద్యతః). (25,26)

శ్లో॥ దృఢం ప్రలబ్ధాస్త్రపయా చ హాపితాః
ప్రస్తోభితాః క్రీడానవశ్చ కారితాః ।
వస్త్రాణి చైవాపహృతాన్యథాప్యముం
తానాభ్యసూయన్ ప్రియసంగనిర్వృతాః ॥ 27

తా. మిక్కిలిగ వంచివబడినవారయ్యును, సిగ్గువిడిచినవారయ్యును, పరిహసింపబడినవారయ్యును, ఆటబొమ్మలవలె వర్తింపబడియు, వస్త్రములు ఆపహరింపబడినవారయ్యు, అతనిని దోషదృష్టితోచూడక తమ ప్రియతముని సంగముచేత ఆనందించిరి. 27

టీ:- దృఢమత్యర్థం. ప్రలబ్ధాః వంచితాః యూయం వివస్త్రా ఇత్యాదినా. త్రపయా లజ్జయా చ. హాపితాస్త్యాజితాః. అత్రాగత్య.

టీ:- దృఢం - మిక్కిలిగ - ప్రలబ్ధాః - వంచితులై 'మీరు వివస్త్రలు' మున్నగు రీతిలో - త్రపయా - సిగ్గుచే హాపితాః - విడవబడినవారై-

స్వవాంసి ప్రతీచ్ఛతేత్యాగ్రహేణ ప్రస్తోభితా ఉపహసితాః. సత్యం బ్రువాణి నో నర్మేత్యాదినా క్రీడనవచ్చ కారితాశ్చ. బద్ధ్వాంజలీత్యాది, ప్రాయశ్చిత్తచ్ఛలేనాభ్యసూయన్. దోషదృష్ట్యా నాపశ్యన్. 27

ఇచటకి వచ్చి మీమీ వస్త్రములుతీసుకొనుడు. మున్నగురీతిగ కోరుటచేత- ప్రస్తోభితాః- పరిహసింపబడివారై - 'సత్యము చెప్పుచున్నాను పరి హాసము కాదు' మొదలగురీతిగ - క్రీడనవచ్చ కాంతాశ్చ- ఆట బొమ్మలవలె చేయబడినవారై - 'అంజలిఘటించి' మున్నగురీతిగ - ప్రాయశ్చిత్తచ్ఛలేనా భ్యసూయన్ - దోషదృష్టితో చూడక 27

శ్లో॥ పరిధాయ స్వవాసాంసి ప్రేష్ఠసంగమజ్జితాః ।
గృహీతచిత్తానోచ్చేలు స్తస్మిన్ లజ్జాయ తేక్షణాః ॥ 28

తా. తమ తమ వస్త్రములు ధరించి, మిక్కిలి ప్రియమైనవాని సాన్నిహిత్యము చేత జోడుకలిగినవారై (వశీకృతులై) కృష్ణునిచే గ్రహింపబడిన చిత్తములు గలవారై (అతనియందే లగ్నమైన మనస్సుగలవారై) సిగ్గుతో కూడిన చూపులుకలవారై అటునుండి కదలలేకపోయిరి. 28

టీ:- పరిధాయేతి. ప్రేష్ఠ సంగమేన సజ్జితాః వశీకృతాః. అతో గృహీతచిత్తాస్సత్యో నోచ్చేలుః. గృహీతచిత్తత్వమాహ-తస్మిన్ కృష్ణే. లజ్జాయి తేక్షణాః. లజ్జావిలసితం ఈక్షణం యాసాం తా ఇత్యర్థః. 28

టీ:- ప్రేష్ఠసంగమేన సజ్జితాః-(మిక్కిలి ప్రియమైనవాని సంగముచేత) వశీభూతులై - అందువలన-ఆకర్షింపబడిన చిత్తములు గలవారై-కదల కుండిరి, గృహీత చిత్తత్వములు చెప్పుచున్నాడు. ఆ కృష్ణునియందు- లజ్జాయితేక్షణాః-సిగ్గుతో ప్రకాశించుచూపు ఎవరికో అనిఅర్థము. 28

శ్లో॥ తాసాం విజ్ఞాయ భగవాన్ స్వపాదస్పర్శ కామ్యయా ।
ధృత వ్రతానాం సంకల్పమాహ దామోదరోऽబలాః ॥ 29

తా. భగవానుడు శ్రీకృష్ణుడు తన పాదములను స్పృశింపవలెనని కోరికతో నున్న ఆ వ్రతనిష్ఠులైన గోపకాంతల సంకల్పమును గమనించి వారితో ఇట్లనెను. 29

టీ:- తాసామితి. దామోదర ఇతి భక్తవాత్సల్యం దర్శయతి-అబలాః ప్రతి. 29

శ్లో॥ సంకల్పో విదిత స్సాధ్వ్యో భవతీనాం మదర్చనే ।
మయానుమోదితస్సోఽసౌ సత్యో భవీతుమర్హతి ॥ 30

టీ:- సంకల్ప ఇతి. భో సాధ్వ్యః. భవతీనాం మదర్చన ఏవ సంకల్పః మనోరథః. లజ్జయా యుష్మాభిరకథితోఽపి మయా విదితః సమయానుమోదితః. అతః సత్యో భవితుమర్హతీతి సంభావనోక్త్యా. ఆత్యంతికో న భవిష్యతీతి సూచితం. 30

శ్లో॥ న మయ్యావేశిత ధియాం కామః కామాయ కల్పతే ।
భర్జితాః క్వథితాధానాః ప్రాయోబీజయ నేష్యతే ॥ 31

టీ:- తత్కృత ఇత్యత ఆహ-నేతి. కామాయ పునః కామభోగాయ . విషయ మహిమ్నా కామస్యాపి శాంతిహేతుత్వాదితి భావః. కామా

టీ:- 'దామోదర' శబ్దముచే భక్తులయందు అతనికిగల వాత్సల్యమును చూపుచున్నాడు. ఇచట గోపకాంతలను గూర్చి-(దామ్నా ఉదరే మాత్రా బద్ధః దామోదరః). 29

తా. సాధ్వులారా!నన్నుపూజింపవలెననెడి మీ కోరికనాకు అవగతమైనది.నాకుసమ్మతమేయగుటచేమీకోరిక సత్యమగుటకుతగియున్నది. 30

టీ:- ఓ సాధ్వులారా! మీకు నన్నర్చించుటయే సంకల్పమైయున్నది-కోరికయై యున్నది. సిగ్గుచేత మీచే చెప్పబడకున్నను నాకు సమయానుమోదితమై తెలిసినది. అందువలన అది సార్వకాలికము కాదని సూచించబడినది. 30

తా. నాయందే బుద్ధిని నిలిపిన వారి కామనలు, సంసారభోగముల కొరకైనవికావు. కాల్చబడినవి, పక్వమైనవియునైన ధాన్యపు గింజలు సామాన్యముగ అంకురోత్పత్తికి యోగ్యమైనవికావు. 31

టీ:- ఎందులకో చెప్పుచున్నాడు. కామాయ-మరలకామభోగము కొరకు-విషయమహిమచేత కామనకుకూడ కాంతి హేతుత్వము

ప్రరోహే దృష్టాంతః. భర్జితాః దగ్ధాః. క్వథితాః పక్వాః. ధానాః యవాదయః బీజాయ అంకురోద్గమాయ. ప్రాయ ఇతి స్వేచ్ఛయా పునః ప్రరోహమపి సూచయతి. 31

వలననని భావము. కామములు పుట్టకపోవుటకు దృష్టాంతము-భర్జితాః-కాల్చ బడినవి-క్వథితాః-పక్వమైనవి-దానాః-జవ్వలు మొదలగు ధాన్యపు గింజలు. బీజాయ-మొలకెత్తుట కొరకు ప్రాయః అని స్వేచ్ఛగ మరల మొలకత్తుటను సూచించుచున్నాడు-(తఱచుగా మొలకెత్త కున్నను అరుదుగా మొలకెత్త వచ్చునని భావము)- 31

శ్లో॥ యాతాః బలావ్రజం సిద్ధామయేమా రంస్యథ క్షపాః ।
యముద్దిశ్య వ్రతమిదం చేరురార్యార్చనం సతీః ॥ 32

తా. కన్యలారా! సాధ్వులారా! ఇక మీరు వ్రజమునకుపొండు. ఫలవంతమైన వ్రతముగలవారైతిరి. ఎవరినిఉద్దేశించి మీరు కాత్యాయనీ వ్రతముచేసి ఆయమ్మ నర్చించితిరో అట్టినాతో రాబోవు రాత్రులు క్రీడింపగలరు. 32

టీ:- యాతేతి. సిద్ధాః పూర్ణ మనోరథాః. తదాహ. ఇమాః ఆగామినీ రాత్రీః. మయా రస్యంథేతి ఆర్యా కాత్యాయనీ. సతీః సత్యః. 32

టీ:- సిద్ధాః-తీరినకోరిక కలవారు. అది చెప్పుచున్నాడు. హిమాః-రాబోవురాత్రులు-నాతో వినోదింపగలరు. ఆర్యా-కాత్యాయని-సతీః-సతులు(స్త్రీలు) 32

శ్లో॥ ఇత్యాదిష్టా భగవతా లబ్ధకామాః కుమారికాః ।
ధ్యాయంత్య స్తత్పదాంభోజం కృచ్ఛ్రాన్నివివిశుర్వ్రజమ్ ॥ 33

తా. ఈ విధముగ కృష్ణునిచే ఆజ్ఞాపింపబడిన గోపకాంతలు ఫలించిన కోరికలు గలవారై శ్రీకృష్ణుని చరణ కమలములను ధ్యానించుచు, వ్రతక్లేషము నుండి విడివడి వ్రజమున ప్రవేశించిరి. (33)

శ్లో॥ అథ గోపైః పరివృతో భగవాన్ దేవకీసుతః ।
బృందావనాద్గతో దూరం చారయన్ గాస్సహాగ్రజః ॥ 34

తా. అటు పిమ్మట దేవకీసుతుడైన కృష్ణభగవానుడు గోపబాలురతో కూడినవాడై గోవులను మేపుకొనుచు తన అన్నయగు బలరామునితో కూడా బృందావనమునుండి దూరముగా పోయెను. 34

శ్లో॥ నిదాఘూర్కాతపే తస్మింశ్ఛాయాభిస్స్వాభిరాత్మనః ।
ఆతపత్రాయితాన్ వీక్ష్య ద్రుమానాహ వ్రజౌకసః ॥ 35

తా. వేసవికాలపు సూర్యుని ఎండలో (ఒకనాడు కృష్ణుడు, గోపబాలురతో ఒకప్రదేశమునందు పోవుచుండగా) అచట తమ కొమ్మలతో గొడుగులతోవలె నీడను కల్పించుచున్న చెట్లనుచూచి కృష్ణుడు వ్రజవాసులైన తన వయస్యులతో ఇట్లనెను. 35

టీ:- ఇతీతి. శ్లో. భక్త్యానుకంప్య కన్యాస్తాస్తద్విపర్జిత యజ్వనాం, పత్న్యన గ్రహతస్తేషామహన్ కర్మ మహామదం. శ్రీధరీయో౨యంశ్లోకః. (33-35)

టీ:- 'గోపకన్యలు (అమ్మవారిని-తనను) సేవించుటచే వానిని అనుగ్రహించి-వారిచేత వీడ్కోలు పొందిన, యజమానుల గృహిణులను అనుగ్రహించుటకుగాను వారియొక్క అహంకారమును, కర్మను లేక గర్వముతో కూడిన కర్మను కృష్ణుడు నశింపజేసెను'. ఈ భావముగల శ్లోకము శ్రీధరీయము (33-35)

శ్లో॥ హే స్తోక కృష్ణ హే అంశో శ్రీదామన్ సుబలార్జున ।
విశాలవృషభాజస్విన్ దేవప్రస్థవరూథప ॥ 36

తా. ఓ స్తోక కృష్ణా! ఓ అంశూ! శ్రీదామా! సుబలా! అర్జునా! విశాలా! వృషభా! తేజస్వీ! దేవప్రస్థా! రూథపా! (వీరందరు గోపాలురు వీరిని కృష్ణుడు సంబోదించుచున్నాడు). 36

టీ:- ద్విజభార్యాయా అనుగ్రహాయ యజ్ఞవాటం గచ్ఛన్. విప్రాణాం కాఠిన్యమభిప్రేత్య. తేభ్యోఽపి ద్రుమాశ్శ్రేష్ఠా ఇతి తానాభినందయతి - చతుర్భిః. హే స్తోకకృష్ణేతి. స్తోకకృష్ణాదయో గోపాః. 36

టీ:- బ్రాహ్మణుల భార్యలను అనుగ్రహించుటకొరకు యజ్ఞవాటికకు వెడలుచు-బ్రాహ్మణులయొక్క కఠినత్వమును ఉద్దేశించి-వారికంటెను చెట్లేశ్రేష్ఠమైనవి అని వానిని నాలుగు శ్లోకములతో అభినందించుచున్నాడు. స్తోకకృష్ణుడు మొదలగువారు గోపాలురు. 36

శ్లో॥ పశ్యతైతాన్ మహాభాగాన్ పరార్థైకాంతజీవితాన్ ।
వాత వర్షాతప హిమాన్ సహం తో వారయంతి నః ॥ 37

తా. ఇచట ఈ అదృష్టశాలురగు వృక్షములను చూడుడు. ఇవి ఇతరుల కోసమే జీవించుచున్నవి. (ఇతరులకొఱకు మాత్రమే సమాప్తమగు జీవితము గలవి) గాలిని, వానను, ఎండను, మంచును తాము సహించుచు మనను వానినుండి నివారించుచున్నవి. 37

టీ:- పశ్యతేతి. ఏతాన్ ద్రుమాన్ పశ్యత. పరార్థమేకాంతేన జీవితం యేషాం తాన్ తదాహ-వాతవర్షాదీన్ స్వయం సమానాః. నః అస్మాకం వారయంతి. 37

టీ:- ఈ చెట్లను చూడుడు-ఇతరులకొఱకు ఒంటరి జీవితము వేనికో వానిని-దానినే చెప్పినాడు. గాలివాన మొదలగువాని స్వయముగ సహించుచు-మనలను వాని నుండి తప్పించుచున్నవి. 37

శ్లో॥ అహో ఏషాం పరం జన్మ సర్వప్రాణ్యుపజీవనమ్ ।
సుజనస్యేవచైషాం విముఖా యాంతి నార్థినః ॥ 38

తా. అహో! వీని జన్మము శ్రేష్ఠమైనదికదా! సకల ప్రాణుల జీవనమునకు ఇవి సహకరించుచున్నవి. సజ్జనుని ఇంటినుండి ఏ యాచకుడు ఫలముపొందక తిరిగిపోవడు. 38

టీ:- అహో ఇతి. సుజనస్య కృపాళోరర్థిన ఇవ. 38

టీ:- సుజనస్య-దయామయినినుండి యాచకునివలె (రిత్తగ పోవడు అని). 38

శ్లో॥ పత్ర పుష్పఫలచ్ఛాయా మూల వల్కలదారుభిః ।
గంధనిర్యాస భస్మాస్థి తోకైః కామన్ వితన్వతే ॥ 39

తా. ఇవి తమ ఆకులు, పువ్వులు, పండ్లు, నీడలు, వేళ్లు, నారలు, కఱ్ఱలు, గంధము, జిగురు, బొగ్గు, అంకురములు మొదలగువానితో ప్రాణుల కోరికలను ఈడేర్చుచున్నవి. 39

శ్లో॥ ఏతావజ్జన్మ సామగ్ర్యం దేహినామిహ దేహిషు ।
ప్రాణైరర్థైర్ధియా వాచా శ్రేయ ఆచరణం సదా ॥ 40

తా. లోకమునందలి ప్రాణులలో ఏ ప్రాణులకు తమ ప్రాణముల తోను, ధనములతోను, బుద్ధితోను, వాక్కుతోను ఇతరులకు శుభమును కలుగజేయునట్టి ఆచరణము సర్వదా ఉండునో అట్టి ప్రాణుల జన్మమే సఫలమైనది. 40

టీ:- పత్రేతి. నిర్యాసో ఘనరసః తోకాః పల్లవాద్యంకురాః. (39-40)

టీ:- నిర్యాసః-ఘనరసము(జిగురు) తోకాః-జిగుళ్లు, మొలకలు మొదలగునవి. (39-40)

శ్లో॥ ఇతి ప్రవాళస్తబక ఫల పుష్పదళోత్కరైః ।
తరూణాం నమ్రశాఖానాం మధ్యేన యమునాం గతః ॥ 41

తా. అని చెప్పి చిగురు గుత్తులు, పండ్లు, పువ్వులు, దళములు మొదలగువాని రాశులతో నిండి, వంగియున్న కొమ్మలుగల చెట్ల నడిమి త్రోవగుండా యమునకు చేరెను. 41

శ్లో॥ తత్ర గాః పాయయిత్వాపస్సుమృష్టాశ్శీతలాశ్శివాః ।
తతో నృప! స్వయం గోపాః కామం స్వాదు పపుర్జలమ్ ॥ 42

తా. అచట గోవులను చల్లని స్వచ్ఛమైన నీరుత్రాగించి, తృప్తిపరచి రాజా! అటు మీద గోపాలకులను స్వయముగ తమకు ఇష్టమైనచోట తీయని నీటిని త్రాగిరి. 42

టీ:- ఇతీతి. ఇత్యభినందయన్ ప్రవాళాదిసమూహైర్నతశాఖానాం తరూణాం మధ్యతో యమునాం ప్రాప్తః. (41-42)

శ్లో॥ తస్యా ఉపవనే కామం చారయంతః పశూన్నృప ।
కృష్ణ రామా వుపాగమ్య క్షుధార్తా ఇదమబ్రువన్ ॥ 43

టీ:- తస్యా ఇతి. కుమారికాభ్యః పూర్వమేవ తన్నర్మాకులతయా. అగృహీతభోజ్యా నామేవ నిర్గమాత్ క్షుధార్తా, ఇత్యుక్తం. 43

**శ్రీ మద్భాగవతే, మహాపురాణే దశమస్కంధే,**
**ద్వావింశోఽధ్యాయః**

టీ:- అని అభినందించుచు చిగుళ్లసమూహములతో వంగియున్న కొమ్మలుగల చెట్ల నడిమినుండి యమునకు చేరెను. (41-42)

తా. రాజా! యమునానదికి సమీపమునగల అడవిలో స్వేచ్ఛగా పశువులను మేపుచున్న బలరామ కృష్ణులవద్దకు వచ్చి ఆకలిగొన్న కొందరు గోపబాలురు వారితో ఇట్లనిరి. 43

టీ:- గోపకన్యలను మొదటనే పరిహసించియున్న వ్యాకులపాటుతోను, చద్దిమూటలు వెంటతెచ్చుకొనకుండ బయలుదేరుట వలన ఆకలిగొని యున్నారని అర్థము. 43

**అని శ్రీమద్భాగవతమున దశమస్కంధమందు**
**ఇరువది రెండవ ధ్యాయము సమాప్తము.**

## త్రయోవింశోధ్యాయః

### శ్రీశుక ఉవాచ

శ్లో॥ తత్ర గత్వోపవిష్టాస్తే గోపాలా యమునాతటే ।
ఊచుర్బుభుక్షితా రాజన్ కృష్ణరామౌ జగత్పతీ ॥ 1

### గోపా ఊచు

శ్లో॥ రామరామ మహాబాహో కృష్ణదుష్టనిబర్హణ ।
ఏషా వై బాధతే క్షున్నస్తచ్ఛాంతిం కర్తుమర్హథః ॥ 2

టీ:- శ్లో. "త్రయోవింశే తతో గోపైరన్న యాచ్ఞాపదేశతః, తత్పత్న్యను గ్రహాత్కృష్ణో దీక్షితా నన్వతాపయత్." (1-4)

### శ్రీశుక ఉవాచ

శ్లో॥ ఇతి విజ్ఞాపితో గోపైర్భగవాన్ జగదీశ్వరః ।
భక్తాయా విప్రభార్యాయాః ప్రసీదన్నిదమబ్రవీత్ ॥ 3

## 23వ అధ్యాయము.

### శ్రీశుకుడిట్లు చెప్పెను.

తా. రాజా! అచటికిపోయి ఆ యమునానది యొడ్డున కూర్చుండిన ఆకలిగొన్న గోపాలురు జగత్పతులైన శ్రీకృష్ణబలరాములతోనిట్లనిరి. 1

### గోపబాలురు ఇట్లనిరి.

తా. మహావీరుడవైన ఓ బలరామా! దుష్టులను సంహరించు ఓ కృష్ణా! ఈ మా ఆకలిమమ్ము బాధపెట్టుచున్నది. దానిని శాంతింపజేయుటకు మీరు తగియున్నారు. (శాంతింపజేయుడు) 2

టీ:- ఈ ఇరువదిమూడవ అధ్యాయమున గోపాలురచే అన్నము యాచింపబడు మిషచేత యజ్వల భార్యల ననుగ్రహించుట వలన దీక్షితులకు పశ్చాత్తాపము కలిగించెను-ఇది శ్రీధరీయ శ్లోకభావము. (1-4)

### శ్రీశుకుడిట్లు చెప్పెను.

తా. ఇట్లు గోపాలురచే విన్నవింపబడిన దేవకీసుతుడైన కృష్ణుడు భక్తులైన బ్రాహ్మణుల భార్యలననుగ్రహించుచు ఇట్లనెను. 3

శ్లో॥ ప్రయాత దేవాయజనం బ్రాహ్మణాబ్రహ్మవాదినః ।
సత్రమాంగిరసం నామ హ్యాసతే స్వర్గకామ్యయా ॥ 4

తా. బ్రహ్మవాదులైన బ్రాహ్మణులు స్వర్గమును పొందు కోరికతో 'ఆంగిరసము'అను పేరుగల దేవతలనుద్దేశించిన ఒక యజ్ఞము చేయుచున్నారు. మీరచటికిపొండు. (యజ్ఞస్థాన మిటకు సమీపముననే యున్నది). 4

శ్లో॥ తత్ర గత్వోదనం గోపా యాచతాస్మద్విసర్జితాః ।
కీర్తయంతో భగవత ఆర్యస్య మమచాభిధామ్ ॥ 5

తా. గోపాలులారా! మాచేత పంపబడినవారుగ అచటికి పోయి భగవత్కీర్తనము చేయుచు అనగా అన్న బలరాముని పేరును నాపేరును కీర్తించుచు అచటివారిని ఆహార పదార్థములను యాచింపుడు. 5

శ్లో॥ ఇత్యాదిష్టా భగవతా గత్వాఽ యాచంత తే తదా ।
కృతాంజలిపుటా విప్రాన్ దండవత్పతితా భువి ॥ 6

తా. భగవానుడగు కృష్ణునిచే ఈ విధముగ ఆదేశింపబడిన గోపాలురు అచటికిపోయి, బ్రాహ్మణులకు అంజలి ఘటించుచు, సాష్టాంగముగ నమస్కరించి (కఱ్ఱవలె భూమిపైబడి) యాచించిరి. 6

శ్లో॥ హే భూమి దేవాశ్శృణుత కృష్ణస్యాదేశకారిణః ।
ప్రాప్తాన్ జానీత భద్రం వో గోపాన్నో రామచోదితాన్ ॥ 7

తా. ఓ బ్రాహ్మణులారా! వినుడు. శ్రీకృష్ణుని ఆదేశమును పాటించు వారమై బలరాముడు పంపగా ఇచటికి వచ్చియున్నామని తెలియుడు. మీకు శుభమగుగాక, మేము గోపాలురము. 7

టీ:- తత్రేతి. అస్మద్విసర్జితాః ఆసాభ్యాం ప్రహితాస్సంతః యాఛధ్వం. యుష్మాకం కా తత్ర లజ్జానను తథాప్య పాత్రత్వాదస్మభ్యం కిమితి

టీ:- అస్మద్వివర్జితాః - మా యిరువురిచే పంపబడిన వారగుచు యాచింపుడు. మీకు సిగ్గెందుకు? అట్లైనను 'అపాత్రులమైనమాకు'

దాస్యంతీతి చేత్తత్రాహ–కీర్తయంత ఇతి. (5–7)

(పాత్రలులేనిమాకు–దానము తీసుకొను యోగ్యతలేని మాకు) ఏమని దానమిచ్చెదరను సందేహమునకు చెప్పుచున్నాడు–'కీర్తించువారగుచు' అని. (5–7)

శ్లో॥ గాశ్చారయంతావ విదూర ఓదనం
రామాచ్యుతౌ యల్లషతో బుభుక్షితౌ ।
తయోర్ద్విజా ఓదనమర్థినోర్యది
శ్రద్ధాళవో యచ్ఛత ధర్మవిత్తమాః ॥ 8

తా. ఓ ధర్మముతెలిసిన వారిలో శ్రేష్ఠులారా! ఇచటికి సమీపముననే బలరామకృష్ణులు ఆవులను మేపుచు, ఆకలిగొన్నవారై అన్నమును కోరుచున్నారు. ఓ బ్రాహ్మణులారా! వారిరువురకును, మరియు అన్నార్తులమైనమాకును శ్రద్ధ కలిగినచో–అన్నమును ఒసంగుడు. 8

టీ:– అవిదూరే వర్తమానౌ సంతౌ వో యత్ ఓదనం అన్నం. తత్. లషతః అభిలాషతః ఓదనం శ్రద్ధా చ యద్యస్తి తర్హి యచ్ఛతేతి. 8

టీ:– అవిదూరే వర్తమానౌ సంతౌ–దగ్గరలోనే ఉన్న వారిరువురకును – నః – మాకును – యత్ – ఏదైతే – ఓదనం– అన్నముగలదో దానిని – లషతః – అభిలషించుచున్న వారికి – అన్నము మరియు శ్రద్ధయు గలదేని ఈయుడు – అని. 8

శ్లో॥ దీక్షాయాః పశుసంస్థాయాః సౌత్రామణ్యాశ్చ సత్తమాః ।
అన్యత్ర దీక్షితస్యాపి నాన్నమశ్నన్ హి దుష్యతి ॥ 9

తా. సత్పురుషులారా! పశ్వాలంభము(పశువధ)గలయజ్ఞము నందును, సౌత్రామణి యజ్ఞమునందును దీక్షితులైన వారి అన్నము తినుట దోషము, కాని ఇతర యజ్ఞములందు దీక్షితులైనవారి అన్నము తినుట దోషముకాదు. 9

టీ:- దీక్షితావయమభోజ్యాన్నాఇతి వదిష్యంతీతి స్వయమేవా శంక్యా హుః-దీక్షాయాఃఇతి.దీక్షాయా ఆరభ్యాగ్నిష్టోమియపశ్వాలంభా త్పూర్వం దోషః. న తతోఽన్యత్ర. తథా సౌత్రామణ్యాశ్చ. అన్యత్ర అన్యదా. 9

టీ:- 'మేము అన్నముభుజింపకూడదు'అని దీక్షితులందురేమోయని తామే ఆశంకించుకొని గోపాలురు చెప్పుచున్నారు. దీక్షను ప్రారంభించిన పిదప అగ్నిష్టోమమునకు సంబంధించిన పశువును ఆలంభము చేయక ముందు దోషము, ఇతర యజ్ఞములందు అటుల దోషము కాదు. అట్లే సౌత్రామణి దీక్షయందును దోషమే, ఇతరము లందు దోషముకాదు. 9

శ్లో॥ ఇతి తే భగవద్యాచ్ఞాం శృణ్వంతోఽపి న శుశ్రువుః ।
క్షుద్రాశా భూరికర్మాణో బాలిశా వృద్ధమానినః ॥ 10

తా. భగవానుని యాచనగా గోపాలురు చెప్పిన ఈ మాటలు వినుచుకూడా ఆ బ్రాహ్మణులు దానిని పెడచెవిన పెట్టిరి, క్షుద్రమైన స్వర్గమునందలి ఆశతో పెద్దపనిని చేయువారును, మూఢులును, మేమే జ్ఞానులము అని అనుకొనువారును అయిన బ్రాహ్మణులు వారిమాటలు వినియు వినకుండిరి. 10

టీ:- క్షుద్రేస్వర్గదావాశానూత్రం యేషాం తే. భూరీణి క్లేశాదికాని కర్మాణి యేషాం తే.అతః అజ్ఞాః వృద్ధమానినః జ్ఞానవృద్ధా ఇతి మానవంతః. 10

టీ:- క్షుద్రే-స్వర్గము మొదలగు లోకమందలి ఆశ ఎవరికో వారు భూరీణి-మిక్కిలి క్లేశముతో గూడిన కర్మలు ఎవరివో వారు. అందువలన అజ్ఞానులు - వృద్ధమానినః - జ్ఞానవృద్ధులము అని తమను తాము భావించువారు. 10

శ్లో॥ దేశః కాలః పృథగ్ద్రవ్యం మంత్ర తంత్రర్త్విగగ్నయః ।
దేవతా యజమానశ్చ క్రతుర్ధర్మశ్చయన్మయః ॥ 11

తా. ప్రదేశము, సమయము, వేల్వఁఖు వస్తువులు (యజ్ఞసామగ్రి) మంత్రము, తంత్రము, ఋత్విక్కు, అగ్ని, దేవత, యజమాని, యజ్ఞము, ధర్మము ఇవి అన్నియు భగవన్మయములే. 11

టీ:- నను కర్మక్రమముల్లంఘ్య. అదేశకాలే అన్నార్థమన్నమన్యస్మై కథం దేయం? తత్రాహా-దేశ ఇతి. పృథక్చరుపురోడాశాది ద్రవ్యం. తంత్రం ప్రయోగః. ధర్మః అపూర్వం. 11

టీ:- వేల్వఁఖుగా అన్నము, పురోడాశము మొదలగు ద్రవ్యములు. తంత్రం-ప్రయోగము-ధర్మం-అపూర్వము. 11

శ్లో॥ తద్బ్రహ్మ పరమం సాక్షాద్భగవంతమధోక్షజం ।
మనుష్యదృష్ట్యా దుష్ప్రజ్ఞా మర్త్యాత్మానో న తే విదుః ॥ 12

తా. అది సాక్షాత్తుగా బ్రహ్మమే, అధోక్షజుడగు భగవానునికి సంబంధించిన అట్టి శ్రేష్ఠమగు పదార్థమును, మనుష్యదృష్టితోనున్న అజ్ఞానులు, దేహాభిమానులైనవారు తెలుసుకొనజాలరు. 12

శ్లో॥ న తే తదోమితి ప్రోచుర్నేతి చ పరంతప ।
గోపా నిరాశాః ప్రత్యేత్య తథోచుః కృష్ణరామయోః ॥ 13

తా. ఓ పరీక్షిన్మహారాజా! ఆ బ్రాహ్మణులు ఔననిగాని, కాదనిగాని చెప్పకుండిరి. గోపాలకులు నిరాశచెంది తిరిగివచ్చి రామకృష్ణులిరువురికి జరిగినదంతయును విన్నవించిరి. 13

టీ:- తదితి. మనుష్యోఽయమితి దృష్ట్యా మర్త్యాత్మానః దేహాభిమానినః . బ్రాహ్మణా వయం మహాంత ఇతి మన్యమానాః. (12-13)

టీ:- ఇతడు మనుష్యుడే అను దృష్టితో - మర్త్యాత్మానః- దేహాభిమానులు మేము బ్రాహ్మణులము, గొప్పవారము అని తమను తాము భావించు వారలై. (12-13)

శ్లో॥ తదుపాకర్ణ్య భగవాన్ ప్రహస్య జగదీశ్వరః ।
వ్యాజహార పునర్గోపాన్ దర్శయన్ లౌకికీం గతిమ్ ॥ 14

తా. వారు చెప్పినదానిని విని భగవానుడు, జగదీశ్వరుడు అయిన శ్రీకృష్ణుడు లోకమునందలి వర్తనమును చూపుచు, నవ్వి, గోపాలురతో తిరిగి ఇట్లనెను. 14

టీ:- తదితి. లౌకికం గతిమితి న హి కార్యార్థినో నిర్విద్యంతే కో వా యాచకో న పరా భూయత ఇత్యాదిలోకస్థితిం దర్శయన్. 14

టీ:- లోకవర్తనము అను భావముతో చెప్పుచున్నాడు. 'కార్యార్థులు విరక్తులుకారు', 'ఏ యాచకుడైనను అవమానమునొందకుండునా?' అను మొదలగులోకమునందలి స్థితినిచూపుచు (చెప్పుచున్నాడు). 14

శ్లో॥ మాం జ్ఞాపయత పత్నీభ్యస్ససంకర్షణమాగతం ।
దాస్యంతి కామమన్నం వస్స్నిగ్ధా మయ్యుషితా ధియా ॥ 15

తా. బలరామునితో సహా నేను వచ్చినట్లు ఆ యజ్ఞదీక్షితుల భార్యలకు జ్ఞాపకముచేయుడు. వారు నాయందే ఉంచిన బుద్ధిగల వారును, స్నేహ స్వభావులును అగుటచేత మనకు కావలసిన ఆహార పదార్థములు ఇచ్చెదరు. 15

శ్రీశుక ఉవాచ

శ్లో॥ గత్వా చ పత్నీశాలాయాం దృష్ట్వాసీనాస్స్వలంకృతాః ।
నత్వా ద్విజపతీర్గోపాః ప్రశ్రితా ఇదమబ్రువన్ ॥ 16

శ్రీశుకుడిట్లనెను

తా. గోపాలురు, దీక్షితుల భార్యలున్న స్థానమునకుబోయి అచట చక్కగా అలంకరించుకొని కూర్చొనియున్న వారినిజూచి, వారికి నమస్కరించి వినయముగానిట్లనిరి. 16

టీ:- మామితి. కేవలం దేహేన గృహే వసంతి. ధియా తు మయ్యే వోషితాః. యతో మయి స్నిగ్ధాః. అతో దాస్యంతీతి. (15-16)

టీ:- కేవలము దేహముతో గృహమున వసించుచున్నారు. కాని వారి బుద్ధిని నా యందే ఉంచినారు. అందువలన నా యందు ప్రేమ గలవారు. అందువలన ఇచ్చెదరు - అని. (15-16)

శ్లో॥ నమో వో ద్విజపత్నీభ్యో నిబోధత వచాంసినః ।
ఇతోఽవిదూరే చరతా కృష్ణేన ప్రేషితా వయమ్ ॥ 17

తా. (మీకు) బ్రాహ్మణభార్యలకు నమస్కారము. మా మాటలు వినుడు, ఇచటి నుండి కొద్దిదూరములోనే చరించుచున్న శ్రీకృష్ణునిచేత మేము ఇచటకు పంపబడినాము. 17

టీ:- నమ ఇతి. ప్రేషితాః ప్రేరితాః. 17

టీ:- ప్రేషితాః-ప్రేరేపింపబడిన వారము. 17

శ్లో॥ గాశ్చారయన్ స గోపాలైస్సరామో దూరమాగతః ।
బుభుక్షితస్య తస్యాన్నం సానుసగ్య ప్రదీయతామ్ ॥ 18

తా. అతడు (కృష్ణుడు) ఆవులను మేపుచు, గోపాలురు, బలరాముడును వెంటరాగా (ఇంటి నుండి చాలా) దూరము వచ్చి యున్నాడు. ఆకలిగొన్న అతనికి, అనుచరులతో కూడిన అతనికి - అన్నము నిండు. 18

టీ:- గా ఇతి. స కృష్ణో గోపాలైస్సహ. 18

టీ:- ఆ కృష్ణుడు, గోపాలురతోసహా (ఉన్నాడు) 18

శ్లో॥ శ్రుత్వాచ్యుతముసాయాంతం నిత్యం తద్దర్శనోత్సుకాః ।
తత్కథాక్షిప్త మనసో బభూవుర్జాతసంభ్రమాః ॥ 19

తా. కృష్ణుడు సమీపమునకు వచ్చినాడని విని, నిత్యమును అతనిని చూడవలెనను ఉత్సాహముతోనున్న బ్రాహ్మణ భార్యలు అతనిని గూర్చిన కథలన్నియు మనస్సులో దాచుకొనిరవారై యుండుటచేత ఆశ్చర్యము కలిగినవారైరి. 19

టీ:- శ్రుత్వేతి. తత్కథాక్షిప్త మనసః. అత ఏవ తద్దర్శనోత్సుకాః తం కృష్ణమాగతం శ్రుత్వా. జాతసంభ్రమా బభూవురితి. 19

టీ:- అతనిని గూర్చిన కథలచే నిండినమనస్సు కలవారై-అందువలననే అతనిని చూచుటకు ఉత్సాహపడుచున్న వారైరి.-కృష్ణుని రాకనుగూర్చి విని, ఆశ్చర్యము కలిగిన వారయిరి. 19

శ్లో॥ చతుర్విదం బహుగుణమన్న మాదాయభాజనైః ।
అభిసస్రుః ప్రియం సర్వాస్సముద్రమివ నిమ్నగాః ॥ 20

తా. భక్ష్య, భోజ్య, చోష్య, లేహ్యాత్మకమగు నాలుగు విధములు ఆహారము, వివిధములైన రుచులు కల దానిని, పాత్రలలో నమర్చుకొని అందఱును, నదులు సముద్రమువైపు ప్రవహించునట్లు, తమకు మిక్కిలి ప్రియమైన కృష్ణునుద్దేశించి ముందుకు కదిలిపోయిరి. 20

టీ:- చతుర్విధమితి. భక్ష్య భోజ్య లేహ్య చోష్య భేదైశ్చతుర్విధం. బహుగుణం సంస్కారవిశేషైర్బహవో గుణాః రససౌరభ్యాదయో యస్మిన్ తత్. భాజనైః అమత్రైర్భాండైర్వా. పత్యాదిభిర్వార్యమాణా అపి. ప్రియం శ్రీకృష్ణం అభిసస్రుః అభిజగ్ముః. అప్రతిబంధే దృష్టాంతః. సముద్రం నిమ్నగా నద్య ఇవేతి. 20

టీ:- భక్ష్య, భోజ్య, లేహ్య, చోష్యములు అను భేదములతో నాలుగు విధముల ఆహారము బహుగుణము, వివిధములగు పాకవిశేషములతో వివిధములగు గుణములు-రుచులు-సువాసనలు మున్నగున్నవి దేనియందో అది,-భాజనైః-గంపలతో-లేక పెద్దపాత్రలతో భర్తలు మున్నగువారితో నిషేధింపబడుచుకూడా-ప్రియం శ్రీకృష్ణునిగూర్చి-అభిసస్రుః-ఎదురేగిరి-అడ్డులేకుండుటకు దృష్టాంతము. సముద్రమునుగూర్చి-నిమ్నగాః-నదులవలె-అని 20

శ్లో॥ నిషిధ్యమానాః పతిభిః పితృభిర్భ్రాతృభిస్సుతైః ।
భగవత్యుత్తమశ్లోకే దీర్ఘ శ్రుత ధృతాశయాః ॥ 21

తా. భర్తలచేత, తండ్రులచేతం అన్నలచేత, కొడుకులచేతను నిషేధింపబడినవారును (వలదని వారింపబడుచున్న వారగుచును)

దీర్ఘకాలముగ వినియుండిన ఉత్తమశ్లోకుడైన భగవానునియందు ప్రేమ పూర్వకమగు ధారణగల హృదయములు గలవారై. (ముందుకుబోవుచు కనపడిరి) 21

శ్లో॥ యమునోపవనేఽశోక నవ పల్లవ మండితే ।
విచరంతం వృతం గోపైర్దదృశుస్సాగ్రజం స్త్రియః ॥ 22

తా. యమునానదికి సమీపమునగల అడవిలో, కొత్తచిగుళ్లతో సింగారించుకొనియున్న అశోకవృక్షములతో వ్యాప్తమైయున్న ఆ అడవిలో గోపాలురతోను, అన్నయ్యఅగు బలరామునితోను కూడి చరించుచున్న కృష్ణుని ఆ స్త్రీలు చూచిరి. 22

టీ:- నిషిధ్యమానా ఇతి. తత్ర హేతుః భగవతీతి. దీర్ఘం బహుకాలం. శ్రుతేన శ్రవణేన ధృతః ఆశయోయాభిస్తాః.తథా గతాస్సత్యోదదృశుః. (21-22)

టీ:- నిషేధింపబడినను వెడలుచున్నారు. దానికి కారణము - దీర్ఘం - చాలాకాలము - శ్రుతేన - వినుట చేత - ఎవరి చేత ధారణ చేయబడినదో వారు - ఆ విధముగ పోవుచూ కనబడిరి. (21-22)

శ్లో॥ శ్యామం హిరణ్యపరిధిం నవమాల్య
బర్హధాతుప్రవాళనటవేషమనువ్రతాంసే ।
విన్యస్తహస్తమితరేణ ధునానమబ్జం
కర్ణోత్పలాలక కపోలముఖాబ్జహాసమ్ ॥ 23

తా. చామనచాయగలవాడును, బంగారువన్నెగల వస్త్రము ధరించి యున్నవాడును, కొంగొత్తపూలదండలు నెమలిపింఛము, వివిధ ధాతువుల హారములు, పగడముల దండలు ధరించి, నటునివలె ఆకర్షించుచు ఒకచేతిని పక్కనగల గోపబాలుని భుజముమీదవేసి, మరియొకచేతితో తామరపువ్వును త్రిప్పుచు, చెవులకు కలువపువ్వులు గలవాడై చెక్కిళ్లపై గిరజాల వెంట్రుకలు తారాడగ, చిరునవ్వు ముఖము గలవాడై కృష్ణుని (ద్విజపత్నులు చూచిరి). 23

టీ:- శ్యామమితి. హిరణ్యవత్పరిధిః. పరిధానం యస్య. పీతాంబర మిత్యర్థః. వనమాల్యైర్బర్హైర్ధాతుభిః ప్రవాళైశ్చ. నటవద్వేషో యస్య. అనువ్రతస్య సఖ్యుః అంసేవిన్యస్తో నిహితో హస్తోయేన ఇతరేణ హస్తేన. లీలయా. అబ్జం ధునానం భ్రామయంతం. కర్ణయోరుత్పలే యస్య. అలకాః కపోలయోర్యస్య. ముఖాబ్జే హాసోయస్య. తంచ తం. చ. 23

టీ:- హిరణ్యవత్పరిధిః-బంగారువన్నె వస్త్రముఎవనికో (పీతాంబరం) అని అర్థము.- అడవిపూలు, నెమలిపింఛము, ధాతువులు, పగడములు (బగుళ్లు) మున్నగువానితో-నటునివలె ఎవనికి వేషము కలదో-వెంట వచ్చెడి చెలికానిభుజముపై నుంచబడిన చేయి ఎవనిచేతనో ఆ కృష్ణుని, మరియొక చేతితో లీలగా అబ్జం - తామర పువ్వును, ధువానం - తిప్పుచున్న వానిని చెవులయందు కలువపూలు ఎవనికో - అట్టి కృష్ణుని, చెంపలమీద కురులు తారాడుట ఎవనికో అట్టి కృష్ణుని తామరపువ్వు వంటి ముఖమున నవ్వు ఎవనికో అట్టి కృష్ణుని- అట్టి వానిని - వారిని - వారుచూచిరి. 23

శ్లో॥ ప్రాయశ్శ్రుతప్రియతమోదకర్ణపూ
రైర్యస్మిన్నిమగ్నమనసస్తమథాక్షరంధ్రైః ।
అంతః ప్రవేశ్య సుచిరం పరిరభ్యతాపం
ప్రాజ్ఞం యథాభిమతయో విజహుర్నరేంద్ర ॥ 24

తా. రాజా! తరచుగా వినియున్న తమ ప్రితముని ఉత్కర్షలచేత కృతార్థమైన చెవులతోను, వాని యందే నిండియున్న మనస్సులతోను ఒప్పెడు ద్విజపత్నులు, ఇప్పుడు కన్నులనెడి రంధ్రములచేత సుందరు డను, ప్రాజ్ఞుడునునైన కృష్ణుని లోపల ప్రవేశించి చాలాసేపు యథేచ్ఛగ వానిని కౌగిలించుకొని తమ విరహతాపమును బాపుకొనిరి. 24

టీ:- వృత్తేరపి లయేన సామరస్యమాహ - ప్రాయ ఇతి. ప్రాయః బహుశః. శ్రుతాయే ప్రియతమస్య ఉదయాః ఉత్కర్షాః త ఏవ కర్ణపూరాః కర్ణౌ పూరయంతి కృతార్థీ కుర్వంతీతి తథా. తైః కర్ణాభరణైరితి నా.

టీ:- ఇంద్రియములకు సంబంధించిన ప్రవృత్తికంటెనుకూడా తల్లీనత చేతనేర్పడు సామరస్యమును గూర్చిచెప్పుచున్నాడు. ప్రాయః-పెక్కు విధములుగ - ఎవరు తమ ప్రియతమును గూర్చిన ఉత్కర్షలు విని యున్నారో - అదియే చెవులను నింపి, వానిని ధన్యముచేయును -

యస్మిన్ శ్రీకృష్ణే. నిమగ్న మనసః ఆవిష్టచేతసః. తం లోచనద్వారైరంతః ప్రవేశ్య. సుచిరముపగృహ్య. తాపం జహుః. అభిమతయః అహం వృత్తయః ప్రాజ్ఞం సుషుప్తి సాక్షిణం. పరిరభ్య తస్మిన్ లయం ప్రాప్య. యథేతి. 24

వానిని ఆ చెవులను గూర్చి అటుల చెప్పబడినది. వానిచేత – లేక చెవులకుగల ఆభరణములచేత – ఏ కృష్ణుని యందు ఆవేశించిన బుద్ధిగలవారు – అతనిని కన్నులు అను ద్వారముల నుండి అతనిలోనికి ప్రవేశించి, చాలాసేపు గాఢా లింగనము చేసుకొని – అతని యందు లీనతను పొంది. తాదాత్మ్యస్థితి నొందిరని భావము. 24

శ్లో॥ తాస్తథా త్యక్తసర్వాశాః ప్రాప్తా ఆత్మదిదృక్షయా ।
విజ్ఞాయాఖిలదృగ్ద్రష్టా ప్రాహ ప్రహసితాననః ॥ 25

తా. వారు ఆ విధముగా అన్ని ఆశలు వదిలి (అన్ని దిక్కులివదిలి) ఆత్మసాక్షాత్కారము కొఱకు ఆతనిని పొందిరి. అన్ని చూపులను చూచు కృష్ణభగవానుడు– వారిభావమును తెలిసికొని నవ్వుచు ఇట్లనెను. 25

టీ:– తాఇతి. అఖిలదృక్ ద్రష్టా. సర్వబుద్ధిసాక్షీతాస్తథా ప్రాప్తా విజ్ఞాయాపి. తథేత్యేతద్వివృణోతి. త్యక్తా సర్వా ఆశా యాభిస్తాః. కేవలమాత్మనః స్వస్యైవ దిదృక్షయేతి. 25

టీ:– అఖిలదృక్ ద్రష్టా – సర్వబుద్ధులకు సాక్షియగు శ్రీకృష్ణుని వారు ఆ విధముగా పొందియున్నారని తెలిసికొనియు – దానిని వివరించు చున్నాడు విడువబడిన అన్ని ఆశలు ఎవరి చేతనో వారు – కేవలము ఆత్మయొక్క – తమను తాము – చూచుకొనెడు కోరికతో – అని. 25

### శ్రీభగవానువాచ

శ్లో॥ స్వాగతంవో మహాభాగా ఆస్యతాం కరవామకిమ్ ।
యన్నో దిదృక్షయాభ్యేతా ఉపపన్నమిదం హి వః ॥ 26

### శ్రీకృష్ణుడిట్లనెను.

తా. ఓ భాగ్యశాలినులారా! మీకు స్వాగతము. రండు, ఆసీనులు కండు, మీ కొఱకు ఏమి చేయవలెను? నన్ను చూచుటకే ఇచటికి వచ్చితిరి గదా! మీ ఆశయము నెరవేరినది. 26

టీ:- స్వాగతమితి. హే మహాభాగాః. వః స్వాగతం శుభమాగమనం. తదేవాహ - యత్ యస్మాత్. ప్రతిబంధ తిరస్కారేణ. అస్మాకం దిదృక్షయా ప్రాప్తా ఇతి. ఇదం వ ఉపపన్నం సంపన్నం యుక్తమితి వా. 26

టీ:- ఓ అదృష్టవతులారా! మీకు స్వాగతము. మీరాక శుభప్రధము. అదియే చెప్పుచున్నాడు. ఎందువలన? ఆటంకములను తిరస్కరించుట చేత - మమ్ము చూడ నిచ్ఛతో విచ్చితిరి. ఈ మీ కోరిక నెరవేరినది. సంపన్నమైనది. లేక అదియుక్తమే - అని. 26

శ్లో॥ నన్వద్ధా మయి కుర్వంతి కుశలాస్స్వార్థదర్శినః ।
అహైతుక్య వ్యవహితం భక్తిమాత్మ ప్రియే యథా ॥ 27

తా. తమ శ్రేయస్సును కాంక్షించు వివేకులు సాక్షాత్తుగా నాయందు ఫలాపేక్షలేకుండ, నిరంతరముగ మిక్కిలి ప్రియమైన వస్తువునందువలె- భక్తిని నెరపుదురనుట నిశ్చయము. 27

టీ:- యుక్తత్వమే వాహ-నన్వితి. ఆత్మప్రియే ఆత్మా చ ప్రియశ్చ తస్మిన్ మయి కుశలాః వివేకినః. అత ఏవ స్వస్యాత్మనోఽర్థం పశ్యంతి యే. తే యథా యథావత్. భక్తిం కుర్వంతి. యథావత్త్వమాహ-అద్ధా సాక్షాత్. అత్ర హేతుః. అహైతుక్యవ్యవహితాం ఫలాభిసంధిరహితాం. అత ఏవ. అవ్యవహితాం నిరంతరాం. 27

టీ:- 'నను' అను శ్లోకమున యుక్తత్వమునే చెప్పుచున్నాడు - ఆత్మప్రియే - ఆత్మవంటి ప్రియమైనదానియందు - మయి- నా యందు - కుశలాః - వివేకముగల వారు - అందులకే తమ ఆత్మయొక్క ప్రయోజనమును ఎవరు చూచెదరో వారు - యథా - అట్లు భక్తిని చేయుదురు -ఎటులో చెప్పుచున్నాడు. అద్ధా - సాక్షాత్తుగ - దీనికి కారణము - అహైతుక్యవ్యవహితాం - ఫలాభిసంధిలేనిదియు, అందు వలననే - విరామము లేనిదియు (నైనభక్తిని చేయుదురు). 27

శ్లో॥ ప్రాణబుద్ధిమనస్స్వాత్మ దారాప్రత్య ధనాదయః ।
యత్సంపర్కాత్ప్రియా ఆసంస్తతః కోన్వపరః ప్రియః ॥ 28

తా. ప్రాణము, బుద్ధి, మనస్సు, తనవారు, తాను, భార్య, పుత్రులు, ధనము, వీని సాన్నిహిత్యముచే ఇవియన్నియు ప్రియములైనవి. అంత కంటెను ప్రియమైన ఇతరుదెవ్వరు? (అన్నిటి కన్నా ప్రియమైనవాడు శాశ్వతుడైన శ్రేయోదాత భగవానుడేకదా!) 28

టీ:- ఆత్మనః సర్వత్ర. ప్రేష్ఠత్వముపపాదయతి-ప్రాణేతి. స్వాః జ్ఞాతయః. ఆత్మా దేవాః ఏతే సర్వే. యత్సంపర్కాత్ యస్యాధ్యానేన ఉపకరణత్వేన వా. 28

టీ:- అంతటను ఆత్మయొక్క గరిమను ఉపపాదించుచున్నాడు. స్వాః - బంధువులు, ఆత్మ, శరీరము అన్నియును - ఏ సంపర్కముచేత, దేని అధ్యాసచేత - లేక ఉపకరణత్వముచే. 28

శ్లో॥ తద్యాత దేవ యజనం పతయో వో ద్విజాతయః ।
స్వసత్రం పారయిష్యంతి యుష్మాభిర్గృహమేధినః ॥ 29

తా. మీ భర్తలు బ్రాహ్మణ గృహస్థులు. మీ చేతనే మీరు (వారు) మీ యజ్ఞమును సంపన్నముచేసి కొనగలరు. అందువలన మీరు మీ యజ్ఞ స్థావరమునకు పొండు. 29

టీ:- తదితి. తత్ తస్మాత్ కృతార్థః యూయం. యాత. దేవయజనం యజ్ఞవాటం. గచ్ఛత. కృతార్థాః కిమితియాస్యామ ఇతిచేదత ఆహ-పత యఇతిపారయిష్యంతి సమాపయిష్యంతి పతీనామనుగ్రహాయేత్యర్థః (29)

టీ:- తత్ - అందువలన - మీరు కృతార్థులు- పొండు - దేవ యజనం- యజ్ఞవాటికను గూర్చి (పొండు) కృతార్థులమగుటచే ఏమిపొందగలము? అనినచో నిటచెప్పుచున్నాడు. పారయిష్యంతి - సమాప్తి చేయగలరు. (భర్తలు) భర్తల అనుగ్రహము కొఱకు- (యజ్ఞ సమాప్తికై పొండు) అని. 29

<u>విప్రపత్న్య ఊచు</u>

శ్లో॥ మైవం విభోఽర్హతి భవాన్ గదితుం నృశంసం
సత్యం కురుష్వ నిగమం తవ పాదమూలమ్ ।
ప్రాప్తా వయం తులసిదామ పదావసృష్టం
కేశైర్నివోఢుమతిలంఘ్య సమస్తబంధూన్ ॥ 30

<u>బ్రాహ్మణుల భార్యలిట్లనిరి.</u>

తా. ప్రభూ! ఇట్లు పరుషముగ మాట్లాడుట నీకు తగదు. నీసత్య ప్రతిజ్ఞను (నా భక్తుడు నశింపడు) నెరవేర్పుము. మేము నీ పాదముల చెంతకు చేరితిమి. మా బంధువులనందరిని - వారినిషేధములను ఉల్లంఘించి, నీ పాదములచే విడువబడిన తులసిమాలను శిరస్సుపై ధరించుటకు ఇచటికి చేరినాము. 30

టీ:- మేతి. నృశం సం పరుషం నిగమం ప్రతిజ్ఞాం. శ్లో.'న మే భక్తః ప్రణశ్యతీ'. వేదం వా.శ్రు."న స న స పునరావర్తతే" ఇతి. పదావసృష్టం అవజ్ఞయాపి దత్తం. బహుమానేన కేశైర్నివోఢుం. దాసీ భవితుం. 30

టీ:- నృశం సం- పరుషమైన - కఠినమైన- నిగమం - ప్రతిజ్ఞ, "నా భక్తుడు నశించడు" అని లేక వేదము "అతడు మరల జన్మింపడు" - మఱల జన్మింపడు" (అని ఉద్ఘాటించినది) పదావసృష్టం - తిరస్కారముతో ఇచ్చినదైనను - గౌరవముతో తలదాల్చుటకు - దాసి యగుటకు. 30

శ్లో॥ గృహ్ణంతి నో న పతయః పితరస్సుతా
వా న భ్రాతృ బంధు సుహృదః కుత ఏవ చాన్యే ।
తస్మాద్భవత్ప్రపదయోః పతితాత్మనో
నాన్యే భవేద్గతి రంరిందమ తద్విధేహి ॥ 31

తా. మా భర్తలు, తండ్రులు, కొడుకులు, అన్నలు, బంధువులు, స్నేహితులు మమ్ము స్వీకరింపరు. ఇక ఇతరుల సంగతి చెప్పనేల? ఓ శత్రుదమనుడవైన కృష్ణా! అందువలన మేము మీ పవిత్రములైన పాదములపైన పడినవారము. ఇక మాకు వేరుగతిలేదు. కావున నీ సాయుజ్యమునే అనుగ్రహింపుము. 31

టీ:- గృహ్ణంతీతి. కించ. న గృహ్ణంతి. నోఽస్మాన్. హే అరిందమ కామలోభాది దమన, భవతః పాదాగ్రయోః. పతిత దేహానాం. అన్యా స్వర్గాది గతిరపి న భవేత్ మాభూత్. తత్తస్మాద్దాస్యమేవ విధేహీతి. 31

టీ:- మరియు - మమ్ము స్వీకరింపరు. మాకెవ్వరును లేరు. ఓ శత్రుదమనా! కామలోభాదులను నశింపజేయువాడా ! మీ పాదమందు మోకరిల్లిన దేహములకు ఇతరములైన స్వర్గము మొదలగు గతి కూడా ఉండదు. ఉండకుండుగాక. ఆ కారణమున తమ సేవా భాగ్యమే అనుగ్రహింపుడు అని. 31

**శ్రీ భగవానువాచ**

శ్లో॥ పతయో నహ్యసూ యేరన్ పితృ భ్రాతృ సుతాదయః ।
లోకాశ్చ వో మయోపేతా దేవా అప్యనుమన్యతే ॥ 32

టీ:- పతయ ఇతి. మయా ఉపేతా అనుజ్ఞాతాః. ప్రత్యక్షం దేవాన్ ప్రదర్శ్యాహ-దేవా అపీతి. 32

శ్లో॥ నప్రీతయేఽనురాగాయ హ్యంగసంగో నృణామివ ।
తన్మనో మయి యుంజానా అచిరాన్మామవాప్స్యథ ॥ 33

శ్లో॥ శ్రవణాద్దర్శనాద్ధ్యానాన్మయి భావోఽనుకీర్తనాత్ ।
నతథా సన్నికర్షేణ ప్రతియాత తతో గృహాన్ ॥ 34

టీ:- తథాపి త్వాం న త్యక్తుం శక్నుమ ఇతి చేత్తత్రాహ-నేతి. నృణాం మద్భక్తానాం. ప్రీతయే సుఖాయ అనురాగాయ స్నేహవృద్ధయే. అంగ సంగః అంగాభ్యాం సంగః. (33-34)

**కృష్ణుడు పలికెను**

తా. "మీభర్తలు, తండ్రులు, అన్నలు, పుత్రులు మొదలగువారెవ్వారును మిమ్ము తిరస్కరింపరు. వారేకాదు లోకములోని వారెవ్వరును-మీరు నావారైనందువలన-అవజ్ఞచేయురు. దేవతలు కూడా మిమ్ము సమ్మానముగ చూచెదరు. 32

టీ:- మయాఉపేతాః-అనుజ్ఞాతులై-ప్రత్యక్షముగ దేవతలనుచూపి చెప్పుచున్నాడు. "దేవాఃఅపి" అని- 32

తా. లోకమునందు మనుష్యులకు శరీరసంగము ప్రీతికొఱకును అనురాగముకొఱకును కావు. (శరీర సంగమము వలన ప్రేమానురాగములు కలుగవు). మీరు నాయందు మీ మనస్సులను లగ్నము చేసితిరి. కావున మీరు త్వరగానే నన్ను పొందుదురు. 33

తా. వినుటచేత,చూచుటచేత,ధ్యానముచేత,లీలలను కీర్తించుటచేత నాయందే భావము స్థిరపడును. కాని కలసి ఉండుట మాత్రముచే అట్లు జరుగదు - కావున ఇండ్లకుపొండు. 34

టీ:- అట్లయినను నిన్ను విడువజాలమనినచో దానికి చెప్పుచున్నాడు. నృణాం- నా భక్తులకు- ప్రీతయే - సుఖము కొరకు - అనురాగాయ- స్నేహము పెరుగుటకు-అంగ సంగః-అంగములు కలయిక (33-34)

**శ్రీశుక ఉవాచ**

శ్లో॥ ఇత్యుక్త్వా ద్విజపత్న్యస్తా యజ్ఞవాటం పునర్గతాః ।
తే చాయసూయవస్తాభిస్త్రీభిస్సత్రమపారయన్ ॥ 35

టీ:- ఇతీతి. అనసూయవః అదోషదృష్టయః. (35-37)

శ్లో॥ తత్రైకావిధ్రుతా భర్త్రా భగవంతం యథా శ్రుతమ్ ।
హృదోప్యగూహ్య విజహౌ దేహం కర్మానుబంధనమ్ ॥ 36

శ్లో॥ భగవానపి గోవిందస్తేనైవాన్నేన గోపకాన్ ।
చతుర్విధేనాశయిత్వా స్వయం చ బుభుజే ప్రభుః ॥ 37

శ్లో॥ ఏవం లీలా నర వపుర్న్రు లోక మనుశీలయన్ ।
రేమే గో గోప గోపీనాం రమయన్ రూపవాక్కృతైః ॥ 38

**శ్రీశుకుడిట్లు చెప్పెను**

తా. కృష్ణుడిట్లు చెప్పగానే బ్రాహ్మణ భార్యలు తిరిగి యజ్ఞశాలకు పోయిరి. బ్రాహ్మణులు తమ భార్యలయందెట్టి దోషమును చూడక వారితో కలిసి యజ్ఞమును పూర్తిచేసిరి. 35

టీ:- అనుసూయవః-దోషదృష్టిలేనివారలై- (35-37)

తా. అచట భర్తచేతవిడవబడిన ఒకస్త్రీ, తాను లోగడ వినియున్నట్లుగ భగవానుని మనస్సు చేతనే ఆలింగనముచేసుకొని (అట్లు భావించుకొని) కర్మనియతి ననుసరించి అక్కడికక్కడే తనువు చాలించెను. 36

తా. ఇక కృష్ణుడుకూడా అదే అన్నమును గోపాలురందఱికిని తినుటకు ఇచ్చి-నాలుగు విధములైన ఆహారమును వారిచే తినిపించి తానుకూడ భుజించెను. 37

తా. ఈ విధముగా లీలామానుష దేవుడగు శ్రీకృష్ణుడు మానవ లోకమున పర్యవేక్షించుచు తన రూపముతో, మాటలతోను, లీలలతోను, గోవులను, గోపాలకులను, గోపస్త్రీలను ఉల్లపింపజేయుచు ప్రకాశించెను (క్రీడించుచుండెను) 38

టీ:- ఏవమితి. అనుశీలయన్ అనుకుర్వన్. గో గోప గోపీనామితి కర్మణి షష్ఠీ. రూపవాక్కృతైః. రూపేణ వాచా. కృతైశ్చరితైశ్చ.రమయన్ తాన్ రమయితుం రేమ ఇత్యర్థః. 38

టీ:- అనుశీలయన్ - అనుసరించి వర్తింపుచు, "గో గోప గోపీనాం" అని కర్మణి షష్టివిభక్తి - రూపవాక్కృతైః - ఆకృతిచేత, వాక్కుచేత, వర్తనలచేతను-రమయన్ వారిని క్రీడింపజేయుటకు క్రీడించెను. 38

శ్లో॥ అథానుస్మృత్య విప్రాస్తే హ్యన్వ తప్యన్ కృతాగసః ।
యద్విశ్వేశ్వరయోర్యాచ్ఞామహన్మనృవిడంబయో ॥ 39

తా. మానవరూపముననున్న విశ్వేశ్వరులగు కృష్ణ బలరాములయొక్క ఆహార సంబంధమగు యాచనమునను తాము తిరస్కరించుటయను తమ అపరాధమునుజ్ఞాపకముచేసుకొని ఆ బ్రాహ్మణులు పశ్చాత్తాపము నొందిరి. 39

టీ:- అనుస్మృతిప్రకారమాహ-అథేతి. నరానుకరణవతోః విశ్వేశ్వర యోర్యాచ్ఞాం యత్ అహన్మహతవంతః. తత్కృతాగసో వయమిత్యను స్మృత్యేతి.. 39

టీ:- అనుస్మృతి (జ్ఞాపకముయొక్క) ప్రకారము చెప్పుచున్నాడు. మనుష్యుల ననుకరించుచున్న విశ్వేశ్వరుల యొక్క యాచనను గూర్చి ఏ - అహన్మ - తిరస్కారముచేయుటకలదోఅది - అట్టి కృతాగసః - చేయ బడిన అపరాధముగల వారముమేము. అని జ్ఞాపకము చేసుకొని - అని. 39

శ్లో॥ దృష్ట్వా స్త్రీణాం భగవతి కృష్ణే భక్తిమలౌకికీమ్ ।
ఆత్మానం చ తయా హీనమనుతప్తా వ్యగర్హయన్ ॥ 40

తా. భగవానుడు కృష్ణునియందు తమ స్త్రీలయొక్క అలౌకిక భక్తిని చూచి వారి భక్తికంటే తాము హీనమైపోయినట్లు తమనుతాము గర్హించుకొనుచు వారు పశ్చాతాపమునొందిరి. 40

టీ:- తథా చ భార్యాః గురూనివ మానయంతః భగవద్భక్తిరహిత మాత్మానం వ్యనిందన్నిత్యాహుః-దృష్ట్వేతి. అలౌకికీం లోకాతీతాం. 40

టీ:- అట్లు తమ భార్యలను గురువులవలె భావించుకొనుచూ, భగవంతునిమీదభక్తిలేని తమను నిందించుకొనుచూ ఇట్లనిరి. అలౌకికీం -లోకమునకతీతమైన- 40

శ్లో॥ ధిగ్జన్మ నస్త్రివృద్విద్యాం ధిగ్వ్రతం ధిగ్బహుజ్ఞతామ్ ।
ధిక్కులం ధిక్క్రియా దాక్ష్యం విముఖా యేత్వధోక్షజే ॥ 41

తా. మాతాపితరుల శుద్ధత్వము, ఉపనయన సంస్కారము, యజ్ఞాది దీక్ష అనునట్టి మూడు యోగ్యతలుగల ఈ మా పుట్టుకలను ధిక్కరించు చున్నాము. మా వేదశాస్త్రముల అధ్యయనమును ధిక్కరించు చున్నాము. బ్రహ్మచర్యాది వ్రతమును, బహువిషయ పరిజ్ఞానమును, కులమును, క్రియాదక్షతను ధిక్కరించుచున్నాము. ఎవరు భగవానునికి విముఖులో వారి ఈ గొప్పతనములన్నియు వృథా. ఈ "యోగ్యతలు" దండుగ. 41

శ్లో॥ నూనం భగవతో మాయాయోగినామపి మోహినీ ।
యద్వయం గురవో నృణాం స్వార్థేముహ్యామహేద్విపాః॥ 42

తా. భగవానుని మాయయోగులనుకూడా మోహింపజేయునదగుట నిశ్చయము. ఏలయన మేము మనుష్యుల కందరికిని గురువులమైన బ్రాహ్మణులమై యుండియు స్వార్థమునందు అజ్ఞానులమైయున్నాము. 42

టీ:- ధిగితి. త్రివృత్ శౌక్ల్యం. సావిత్రం. దైక్షమితి. త్రిగుణితం జన్మ.వ్రతం బ్రహ్మచర్యం. క్రియాకర్మాణి. దాక్ష్యం చ. క్రియాదాక్ష్య మిత్యేకం వా పదం ధిగిత్యధిక్షేపే యే వయమధోక్షజే విముఖాస్తేషాం

టీ:- త్రివృత్-'1. శుక్లత్వము 2. గాయత్రీత్వము 3. దేవ(యజ్ఞ) దీక్షాత్వము" అని మూడు గుణములుకలది జన్మము. వ్రతం-బ్రహ్మ చర్యము -క్రియా-కర్మలు. దాక్ష్యం-దక్షత్వము(కుశలత) లేక క్రియా

నో జన్మాది యత్తత్సర్వం ధిగితి వ్యగర్హయన్నిత్యర్థః (41-42)

దాక్ష్యం అని ఒకేపదం. ధిక్-అనునది అధిక్షేపము(నింద) ఏ మేము అధోక్షజునియందు విముఖులమో అట్టి మా జన్మ మొదలుకొని అన్నియును "ధిక్" (వ్యర్థములైనవి అని) తమనుతాము నిందించుకొనుచు అని అర్థము. (41 -42)

శ్లో॥ అహో పశ్యత నారీణామపి కృష్ణే జగద్గురౌ ।
దురంతభావం యోఽవిధ్యన్మృత్యుపాశాన్ గృహాభిధాన్ ॥ 43

తా. అహో! చూడుడు. జగద్గురువైన శ్రీకృష్ణునియందు ఈ స్త్రీల యొక్క అచంచలమైన, నిరంతరమైన భక్తి భావము ! ఆ భావము గృహములు అను పేరుగల మృత్యుపాశములను తెంచివేసుకొనెను. ఛేదించినది. 43

టీ:- అహో ఇతి. యోఽవిధ్యదచ్ఛినత్. తం దురంతం భావం భక్తిం పశ్యతేతి. 43

టీ:- అవిధ్యత్-తెంచుకొనెను. ఆ నిరంతరమైన భక్తిని చూడుడు - అని, 43

శ్లో॥ నాసాం ద్విజాతిసంస్కారో ననివాసోగురావపి ।
న తపోనాత్మమిమాంసా న శౌచం చ క్రియాశ్శుభాః ॥ 44

తా. వారికి బ్రాహ్మణజాతికిసంబంధించిన ఉపనయనాది సంస్కారములు లేవు. గురుకులమందు నివాసముచేసి విద్యనభ్యసించినది లేదు. తపస్సులేదు. ఆత్మవిచారములేదు. శుచిత్వములేదు. సంధ్యావందనము మొదలగు పుణ్యకర్మలులేవు. 44

శ్లో॥ తథాపి హ్యుత్తమశ్లోకే కృష్ణే యోగేశ్వరేశ్వరే ।
భక్తిర్దృఢా న చాస్మాకం సంస్కారాదిమతామపి ॥ 45

తా. అట్లయినను ఉత్తమశ్లోకుడు యోగేశ్వరులకు ఈశ్వరుడు అయిన కృష్ణునియందు వారికి దృఢమైనభక్తి కలిగినది. మాకు (మనకు) సంస్కారాదులున్నను భక్తి కలుగకున్నది. 45

శ్లో॥ నను స్వార్థవిమూఢానాం ప్రమత్తానాం గృహేహయా ।
అహో న స్మారయామాస గోపవాక్యైస్సతాం గతిః ॥ 46

తా. స్వార్థముతో మూఢులమై ఇంటిపైన కోరికతో వివేకము కోల్పోయి పరాకుననున్న మాకు కృష్ణభగవానుడు అహో! గోపాలుర వాక్యములచేత సత్పురుషులగతిని జ్ఞాపకము చేసినాడు. 46

శ్లో॥ అన్యథా పూర్ణకామస్య కైవల్యాద్యాశిషాం పతేః ।
ఈశితవ్యైః కిమస్మాభిరీశస్యైత ద్విడంబనమ్ ॥ 47

తా. లేనిచో కోరికలన్నియుతీరినివాడును, కైవల్యమున్నగు మహత్తర స్థితులను అనుగ్రహింపగల ప్రభువునకు మా పదార్థములతో పనిఏమి? (అన్నము కొఱకు మమ్ము యాచించుటేమి?) ఇది అంతయు ఆ ప్రభువుయొక్క లీల!! (గోపాలురచేత అన్నమును యాచింపచేయుట ద్వారా మాకు కనువిప్పు కలిగించినాడని భావము). 47

టీ:- నేతి. ద్విజాతి సంస్కారః ఉపనయః క్రియాః సంధ్యోపాసనాదయః. (44-47)

టీ:- ద్విజాతిసంస్కారః - ఉపనయనము. క్రియాః - సంధ్యోపాసన మొదలగునవి. (44-47)

శ్లో॥ హిత్వాన్యాన్ భజతే యం శ్రీః పాదస్పర్శాశయాసకృత్ ।
స్వాత్మదోషాపవర్గేణ తద్యాచ్ఞా జనమోహినీ ॥ 48

తా. తన చాంచల్యము, గర్వము మున్నగు లక్షణములను విడిచిపెట్టి లక్ష్మీదేవి ఇతరులందరిని కాదని, పెక్కు పర్యాయములు ఎవని పాద స్పర్శ కోరకతో భజించునో అట్టి కృష్ణదేవుని అన్నార్థమైన యాచన, జనులను మోహింపజేయుటయే-(కాక మరేమి?) 48

శ్లో॥ దేశః కాలః పృథగ్ద్రవ్యం మంత్రతంత్రర్త్విజోఽగ్నయః ।
దేవతా యజమానశ్చ క్రతు ధర్మశ్చ యన్మయః ॥ 49

తా. దేశము, కాలము, వేఱ్వేఱు వస్తువులు, మంత్రము, తంత్రము, ఋత్విక్కులు, అగ్నులు, దేవత, యజమానుడు, యజ్ఞధర్మము అన్నియు అతనితో నిబిడమై యున్నవియేకదా! 49

టీ:- హిత్వేతి. స్వాత్మదోషాపవర్గేణ చాంచల్య గర్వాది త్యాగేన.(48-49)

టీ:- స్వాత్మదోషాపవర్గేణ - చాంచల్య గర్వాది గుణములు విడిచి పెట్టుట ద్వార. (48 -49)

శ్లో॥ స ఏవ భగవాన్ సాక్షాద్విష్ణుర్యోగేశ్వరేశ్వరః ।
జాతో యదుష్విత్యశృణ్మహ్యపి మూఢా న విద్మహే ॥ 50

తా. యోగీశ్వరులకు ఈశ్వరుడు అగు విష్ణుభగవానుడతడే. అతడే యదువంశమున జన్మించియున్నాడని వినియున్నాము. అయినను మూఢులమై తెలిసికొనలేక పోవుచున్నాము. 50

శ్లో॥ నమస్తుభ్యం భగవతే కృష్ణా యాకుంఠమేధసే ।
యాన్మాయామోహితధియో భ్రమామః కర్మవర్త్మసు ॥ 51

తా. చురుకైన మేధాశక్తికలవాడవు, భగవానుడవు, కృష్ణుడవు అయిన నీకు నమస్కారము. నీ మాయచేతనే మోహితులమై, అట్టి బుద్ధితో కర్మ మార్గములందు భ్రమించుచున్నాము. 51

శ్లో॥ స వై న ఆద్యః పురుషస్స్వమాయామోహితాత్మనాం ।
అవిజ్ఞాతానుభావానాం క్షంతుమర్హత్యతిక్రమమ్ ॥ 52

తా. తన మాయచేతనే మోహితులమైనవారము, మరియు తన ప్రభావము తెలియనివారము, అయిన మా అపచారమును ఆది పురుషుడవగు కృష్ణభగవానుడు క్షమించుటకు తగినవాడు. 52

టీ:- స ఇతి. ఇత్యశృణ్మ. ఏవం సర్వత్ర శ్రుతవంతో వయం హి. తథాపీతి. (50-52)

టీ:- ఇత్యశృణ్మ-ఈ విధముగా అంతటను విని యున్నాము. మేమే-అట్లయినను-అని (50-52)

శ్లో॥ ఇతి స్వాఘమనుస్మృత్య కృష్ణే తే కృత హేళనాః ।
దిదృక్షవో౽ప్యచ్యుతయో కంసాద్భీతానచాచలన్ ॥ 53

తా. అని తమ అపచారమును తలచుకొని, కృష్ణునిగూర్చి అవహేళన చేసియున్న ఆ బ్రాహ్మణులు, కృష్ణబలరాములను దర్శింపనిచ్ఛగలిగిన వారయ్యును, కంసుని భయమున కదలలేకపోయిరి. 53

టీ:- ఇతీతి. నచాచలన్ తయోర్దర్శనాయ. న జగ్ముః. 53

టీ:- నచాచలత్-వారిరువురి దర్శనమునకు వెడలలేక పోయిరి. 53

**శ్రీ మద్భాగవతే, మహాపురాణే దశమస్కంధే, త్రయోవింశో౽ధ్యాయః**

**అని శ్రీమద్భాగవతమున దశమస్కంధమందు ఇరువది మూడవ ధ్యాయము సమాప్తము.**

## చతుర్వింశోఽధ్యాయః

**శ్రీశుక ఉవాచ**

శ్లో॥ భగవానపి తత్రైవ బలదేవేన సంయుతః ।
అపశ్యన్నివసన్ గోపానింద్ర యాగ కృత్యోద్యమాన్ ॥ 1

శ్లో॥ తదభిజ్ఞోఽపి భగవాన్ సర్వాత్మా సర్వదర్శనః ।
ప్రశ్రయావనతోఽపృచ్ఛద్వృద్ధాన్నందపురోగమాన్ ॥ 2

టీ:- చతుర్వింశే మహేంద్రస్య ముఖం వ్యావర్త్య హేతుభిః, కృష్ణః ప్రావర్తయామాస గోవర్ధనమహోత్సవమ్. భూసురాణాం క్రియాగర్వం నిరస్య స్వసురేషు చ, మఖవన్మదభంగాయ తన్మఖం సమవారయత్. భగవానితి బ్రాహ్మణాః కంసాద్భీతాః స్వాశ్రమస్థా ఏవ భగవంత మమభజన్ భగవానపి. తత్రైవ నివసన్నింద్ర యాగ కృతోద్యమాన్ గోపానపశ్యది సంబంధః. (1-2)

## 24వ అధ్యాయము

**శ్రీశుకుడు ఇట్లనుచున్నాడు.**

తా. భగవానుడగు కృష్ణుడు బలరామునితో అచటనే (బృందా వనమున) ఉండి, ఇంద్రయాగమునకు సంబంధించిన సన్నాహములు చేయుచున్న గోపాలురను చూచెను. 1

తా. అంతట నుండువాడును, అన్నియు చూచువాడును అగు కృష్ణ భగవానుడు ఆ విషయము లెస్సగా తెలిసినవాడే అయ్యును, వినయ విధేయతలతో నమ్రుడై నందుడు మున్నుగాగల పెద్దలనడిగెను. 2

టీ:- ఇరువది నాల్గవ అధ్యాయమున కృష్ణుడు, ఇంద్రుని యాగమును కొన్ని కారణములచేత చుట్టివేసి గోవర్ధన మహోత్సవమును ప్రవర్తింప చేసెను. బ్రాహ్మణులయొక్క క్రియాగర్వమును నిరసించి, తోటి దేవతలతోనే ఇంద్రుని గర్వమనుచుట కొఱకు, అతని యజ్ఞమును వారించెను. (శ్రీధరీయశ్లోకముల భావముఇది). బ్రాహ్మణులు కంసుని వలన భయమునొందినవారై, తమ ఆశ్రమమునందుండియే భగవానుని సేవించిరి. భగవానుడు కూడా అచటనే ఉండి, ఇంద్రయాగ సన్నాహ ములు చేయు గోపాలురను చూచెనని సంబంధము. (1-2)

శ్లో॥ కథ్యతాం మే పితః కోఽయం సంభ్రమో వ ఉపాగతః ।
కిం ఫలం? కస్య చోద్దేశః? కేన వా సాధ్యతే మఖః? ॥ 3

టీ:- కథ్యతామితి. వృథా సంభ్రమో న భవతి. మఖోఽయమితి చేత్ కిమత్రఫలం? కా దేవతా? కేనవాధికారిణా? కేనవా సాధనేన? సాధ్యతే. 3

తా. తండ్రీ! మనకు వచ్చిపడిన ఈ సంభ్రమమేమి? దీని ఫలమేమి? ఎవరిని ఉద్దేశించినది? ఇంద్రుడు ఎవనిచే సాధింపబడును? తెలియజేయుడు. 3

టీ:- ఇది యజ్ఞమైన యడల సంభ్రమము వ్యర్థముకాదు. దీని ఫలమేమి? దేవత ఎవరు? ఏ అధికారముచే జరుపబడును? ఏ సాధనముచేత జరుపబడును? ఎట్లు సాధింపబడును? 3

శ్లో॥ ఏతద్బ్రూహిమహాన్ కామో మహ్యం శుశ్రూషవే పితః ।
న హి గోప్యం హి సాధూనాం కృత్యం సర్వాత్మనామిహ ॥ 4

టీ:- ఏతదితి. ఏతద్బ్రూహి. మహాన్ కామో మమశ్రవణే వర్తతే. యద్వా. తవ మహాన్ కామో దృశ్యత ఇతి తూష్ణీం స్థితం ప్రత్యాహ-సహీతి సర్వాత్మనాం సర్వత్రాత్మదృష్టీనాం. 4

తా. తండ్రీ! విననిచ్ఛగల నాకు ఇది వినుటకు మిక్కిలి కుతూహలము కలుగుచున్నది. దానిని చెప్పుడు. అంతట ఆత్మ భావమును దర్శించు సత్పురుషులకు దాపరికము చేయదగినది ఏదియు నుండదు కదా ! 4

టీ:- ఇది చెప్పుము - నాకు వినుటయందు గొప్ప కోరిక కలుగుచున్నది. లేక - నీకు గొప్పకోరిక కన్పట్టుచున్నది. అని ఊరకనున్న వానిని గూర్చి అనెను. సర్వాత్మనాం - అంతటను ఆత్మ దృష్టి కలవారికి- 4

శ్లో॥ అస్య స్వ పరదృష్టీనామ మిత్రోదాస్తవిద్విషాం ।
ఉదాసీనోఽరివద్వర్జ్య ఆత్మవత్సుహృదుచ్యతే ॥ 5

తా. తనవాడు, పరుడు-శత్రువు, ఉదాసీనుడు, శత్రువు అను భేదములేని దృష్టిగలవారికి దాపరికము ఏదియు ఉండదు. (భేదదృష్టికల వారికి దాపరికము ఉండును). ఉదాసీనుడు (ఏ పట్టింపు లేనివాడు) శత్రువును వలెనే వదిలిపెట్టదగినవాడు. మిత్రుడన తన వంటివాడే. 5

టీ:- అస్తీతి. అత ఏవ. న విద్యతే స్వః పరఇతిదృష్టిర్యేషాం. స్వపర ఇతి దృష్ట్యభావాదేవ. న తద్భవామిత్రాదయోఽపి యేషాం సంతీత్యాహ -అమిత్రేతి. నమిత్రం ఉదాస్తః ఉదాసీనః. విద్విట్ యేషాం తేషాం కృత్యం కర్మ న గోపనీయం కించిదస్తీతి పూర్వేణాన్వయః సత్యపి భేదదర్శనే ఉదాసీనః శత్రువద్వర్జ్యం ఆత్మతుల్యత్వాత్ సుహృన్నవర్జనీయ ఇత్యాహ-ఉదాసీన ఇతి. 5

టీ'- అందువలననే తన-పర అను భేదదృష్టిలేని వారికి అట్టి దృష్టి లేనందువలననే - దానివలన కలుగు శత్రువులు మొదలగు వారును ఎవరికి ఉండరో - అని చెప్పుచున్నాడు - మిత్రుడు కానివాడు - ఉదాస్తః - ఉదాసీనుడు - విద్విట్ - శత్రువుతప్ప ఎవరికి కలరోవారికి - చేయవలసిన పని దాచవలసిన విషయము కొంచెమైననులేదని పూర్వ శ్లోకము నందలి భావముతో అన్వయము. భేదదర్శనము ఉండగా ఉదాసీనుడు శత్రువువలె విసర్జింపదగినవాడు. తనతో సమానుడగుట వలన మిత్రుడు విడువదగినవాడు కాదు అని చెప్పుచున్నాడు. 5

శ్లో॥ జ్ఞాత్వాఽజ్ఞాత్వా చ కర్మాణి జనోఽయమనుతిష్ఠతి ।
విదుషః కర్మసిద్ధిస్స్యాద్యథానావిదుషో భవేత్ ॥ 6

తా. మనుష్యుడు తెలిసియు, తెలియకను కర్మలు చేయుచుండును. తెలిసిచేసినవాని కర్మలు ఫలవంతమగును అట్లు తెలియక చేసినవాని కర్మలు సిద్ధింపవు. 6

టీ:- కించ. సుహృద్భిస్సహ విచార్యజ్ఞాత్వైవ. కర్మ కర్తవ్యం. న తు గతానుగతికమాత్రేణేత్యాహ-జ్ఞాత్వేతి. అజ్ఞాత్వా చ. తత్ర విదుషో యథావత్కర్మఫలం స్యాత్. తథా నా విదుషః. 6

టీ:- ఇట విద్వాంసుని కర్మఫలమున్నట్లు అవిద్వాంసుని కర్మఫల ముండదు. 6

శ్లో॥ తత్ర తావత్క్రియా యోగో భవతాం కింవిచారితః ।
అథవా లౌకిక స్తన్మే పృచ్ఛతస్సాధు ఫణ్యతామ్ ॥ 7

తా. ఇప్పటికి మీ ఈ క్రియాయోగము శాస్త్రముననుసరించి విచారింపబడినదా? లేక కేవలము లోకాచారముననుసరించి చేయునదియా? ప్రశ్నించుచున్న నాకు సహేతుకముగా చెప్పుడు. 7

టీ:- తత్రేతి. భవతామయం క్రియాయోగః. శాస్త్రతః కిం విచారితః ప్రవృత్తః. లౌకిక ఆచారప్రాప్తో వేతి. సాధు సోపపత్తికం. ఫణ్యతాం తస్య తామితి. 7

టీ:- మీ యీ చేయబోవు కర్మ శాస్త్రీయముగ ఆలోచింపబడినదా? లేక లోకాచారముననుసరించియా? సాధు-సోపపత్తికముగ-ఫణ్యతాం-చెప్పుదురుగాక. 7

**నంద ఉవాచ**

**నందుడు ఇట్లనెను.**

శ్లో॥ పర్జన్యో భగవానింద్రో మేఘా స్తస్యాత్మ మూర్తయః ।
తేఽభివర్షంతి భూతానాం ప్రాణసంజీవనం పయః ॥ 8

తా. వర్షించువాడును, షడ్గుణైశ్వర్య సంపన్నుడును అగు ఇంద్రుని స్వరూపములే మేఘములు. అవి ప్రాణులకు జీవనాధారములగు నీటిని వర్షించును. 8

టీ:- ఆచారప్రాప్త ఏవేతి సహేతుకమాహ-పర్జన్య ఇతి. ఆత్మమూర్తయః ప్రియమూర్తయః. 8

టీ:- ఈ కార్యక్రమము ఆచారముతో ప్రాప్తించినదియే అని సకారణముగ చెప్పుచున్నాడు. ఆత్మమూర్తయః - ప్రియమైన స్వరూపములు. 8

శ్లో॥ తం తథావయమన్యే చ వార్ముచాం పతిమీశ్వరమ్ ।
ద్రవ్యైస్తద్రేతసా సిద్ధైర్యజంతే క్రతుభిర్నరాః ॥ 9

తా. ఆ విధముగా మేము, ఇతరులును ఆ మేఘములకు రాజగు ఇంద్రుని, అతడు వర్షించు నీటిచే కలుగు సిద్ధికొఱకు, వేఱ్వేఱు వస్తువులతో (మానవులు) యజ్ఞములద్వారా పూజింతుము. 9

టీ:- తతః కిమత ఆహ-తమితి. తమింద్రం వార్ముచాం మేఘానాం. తద్రేతసా తద్వృష్టిపయసా. 9

శ్లో॥ తచ్ఛేషేణోపజీవంతి త్రివర్గ ఫలసిద్ధయే ।
పుంసాం పురుషకారణాం పర్జన్యః ఫలభావనః ॥ 10

శ్లో॥ య ఏవం విసృజేద్ధర్మం పారంపర్యాగతం నరః ।
కామాల్లోభాద్భయాద్ద్వేషాత్సవైనాప్నోతి శోభనమ్ ॥ 11

టీ:- తదితి. ఉపజీవంతి జీవికాం కల్పయంతి ధర్మార్థ కామసిద్ధయే నను కృష్యాదిభిర్జీవంతి కిమింద్రేణేత్యత్రాహ-పుంసామితి. ఫలభావనః ఫలసాధకః పర్జన్యం వినా కృష్యాదివైఫల్యాదిత్యర్థః. (10-11)

టీ:- ఇకనేమి?చెప్పుచున్నాడు. ఆ ఇంద్రుని - వార్ముచాం- మేఘముల యొక్క - తద్రేతసా - అతడు వర్షించు నీటిచే - 9

తా. అట్టి యజ్ఞమువలన ఫలమున కలుగు ధర్మ, అర్థ, కామముల సిద్ధిద్వారా జనులకు జీవికను కల్పించుచున్నారు. పురుషలకు, పురుష ప్రయత్నములకును ఇంద్రుడు ఫలసాధకుడు. 10

తా. ఏ మనుష్యుడు పరంపరగా మన పూర్వులనుండి వచ్చిన ధర్మమును విడిచిపెట్టునో-కామము వలనకాని, లోభమువలన కాని, భయమువలనకాని, ద్వేషమువలనకాని ఆచరింపకుండునో వానికి శుభము కలుగదు. వాడు శుభమును పొందనేరడు. 11

టీ:- ఉపజీవంతి - జీవికను కల్పించుచున్నారు. ధర్మార్థ కామసిద్ధి కొఱకు, నిశ్చయముగ వ్యవసాయము మొదలగు వానిచేతను జీవించు చున్నారు. ఇంద్రునితోఏమి? ఇచట చెప్పుచున్నాడు. 'పుంసాం' అని - ఫలభావనః - ఫలసాధకుడు - ఇంద్రం వినా - మేఘములను కాక వ్యవసాయాదులఫలించవని యర్థము. (10-11)

**శ్రీ శుక ఉవాచ**

శ్లో॥ వచో నిశమ్య నందస్య తథాన్యేషాం వ్రజౌకసామ్ ।
ఇంద్రాయ మన్యుం జనయన్ పితరం ప్రాహ కేశవః ॥ 12

టీ:- వచ ఇతి. ఇంద్రాయ మన్యుం జనయన్నితి. కోప జనన ద్వారా గర్వపర్వతాదింద్రమవతారయితుం దేవతానిరాకరణం. న త్వయమేవ భగవతోఽభిప్రాయ ఇత్యర్థః. 12

**శ్రీశుకుడిట్లనెను.**

తా. నందునియొక్కయు, ఇతర వ్రజవాసులయొక్కయు మాటలువిని ఇంద్రునికి కోపముపుట్టించుచు శ్రీకృష్ణుడు తండ్రినుద్దేశించి ఇట్లు చెప్పెను. 12

టీ:- ఇంద్రాయ మన్యుం జనయన్ – కోపము పుట్టించుట ద్వారా ఇంద్రుని గర్వమనెడు పర్వతము నుండి క్రిందికి దించుటకు – దేవతలను నిరాకరించుట – ఇదియే భగవానుని అభిప్రాయము కాదని యర్థము. 12

**శ్రీ భగవానువాచ**

శ్లో॥ కర్మణా జాయతే జంతుః కర్మణైవ ప్రలీయతే ।
సుఖదుఃఖం భయం క్షేమం కర్మణైవ ప్రపద్యతే ॥ 13

టీ:- ప్రథమం తావత్కర్మవాదేన దేవాన్నిరాకరోతి–కర్మణేతి. నను జడాత్కర్మణః కేవలాత్కథం ఫలసిద్ధిస్స్యాత్. అహో. అపరిశీలితమీమాంసానాం స్వమతివిలసితశ్రద్ధాకర్మణః ఫలకర్తృతే వచనతోఽవగతే. కింతతోఽనుపపన్నం నామేతి భావః. 13

**శ్రీకృష్ణుడిట్లనెను.**

తా. ప్రాణి కర్మచేతనే పుట్టుచున్నది. కర్మచేతనే లయమగుచున్నది. సుఖము, దుఃఖము, భయము, క్షేమము మొదలగువానిని కర్మచేతనే పొందుచున్నది. 13

టీ:- మొదట కర్మవాదముతో దేవతలను నిరాకరించుచున్నాడు. కేవలము జడమగు కర్మవలన ఫలసిద్ధి ఎట్లు కలుగును? అహో! లెస్సగ పరిశీలింపకనే ఆలోచన సాగించువారికి తమ ఇష్టము ననుసరించి కలుగు శ్రద్ధతో చేయు కర్మయొక్క ఫలము కలుగుట, కేవలము మాటలతోడనే తెలియు ఫలము కలుగుట జరుగుచుండగా– ఇక అప్పుడు అనుపపన్నమైనదననేమి? అని భావము. 13

శ్లో॥ అస్తిచేదీశ్వరః కశ్చిత్ఫలరూప్యన్యకర్మాణాం ।
కర్తారం భజతేసోఽపి న హ్యకర్తుం ప్రభుర్హిసః ॥ 14

టీ:- కేచిత్పునరతిసాహసాద్భీతాః కర్మ పరతంత్రమీశ్వరం మన్యంతే తన్మతమనూద్య నిరాకరోతి – అస్తిచేదితి స్వయం కర్మభిర్లిప్తోఽన్యేషాం జీవానాం కర్మణాం. ఫలరూపీ ఫలదాతా సోఽపి కర్తారం భజతే. తత్కర్మ ఫలదానేన. 14

శ్లో॥ కిమింద్రేణేహ భూతానాం స్వం స్వం కర్మానువర్తినామ్ ।
అనీశే నాన్యథాకర్తుం స్వభావ విహితం నృణామ్ ॥ 15

టీ:- అతః కర్మణ ఏవ ఫలసిద్ధేస్తత్పారతంత్ర్యేచ. అజాగళస్తనతుల్యత్వాత్. న దేవతయా కృత్యమిత్యాహ–కిమింద్రేణేతి. నను కర్మణోఽపి

తా. కర్మలచే లిప్తులైన వారి కర్మలకు ఫలదాత రూపమున ఈశ్వరు డొకడు కలడని భావించిన ఎడల అతడుకూడా కర్మచేయువానినే భజించును. కాని అతడు ఆ కర్తకు ప్రభువుకాడు.(ఫలప్రదాతయగు ఈశ్వరుడన్నచో అతడుకూడా కర్తలను, కర్మలను ఆశ్రయించియే ప్రవర్తించుచుండును. కాని కర్తలుకానివారితోను, కర్మలు లేనిస్థితుల తోను అతనికి సంబంధము ఉండదుకదా!) 14

టీ:- కొందరు అతిసాహసమువలన భయముచెందినవారై ఈశ్వరుని కర్మ పరతంత్రుడుగ భావింతురు. అట్టివారి అభిప్రాయమును ఊహించి నిరాకరించుచున్నాడు. స్వయముగకర్మలతో లిప్తుడై- ఇతరుల - జీవులయొక్క కర్మలకు, ఫలస్వరూపుడు, ఫలదాత–అతడును కర్తను భజించును, కర్మఫలమిచ్చుటద్వారా–14

తా. తమ తమ కర్మననుసరించి వర్తించుచుండు ప్రాణులకు ఇంద్రునితో నేమిపని? మానవుల ప్రాక్తన సంస్కారములతోనే చేయబడు కర్మను మార్చుటకు అధికారములేమి. అతడేమి చేయగలడు? 15

టీ:- ఇంద్రుని(ఈశ్వరుని) తంత్రమేమియు లేకయే–కర్మవలననే ఫలముసిద్ధించుచుండగా–మేకమెడకుగల స్తనమువలె వృథాగనుండుట

ప్రవృత్తిరంతర్యామ్యపేక్షయైవ. కథం సర్వథా దేవతాయా అనుపయోగ ఇత్యాశంక్యాహ-స్వభావవిహితమితి. స్వభావేన ప్రాక్తనసంస్కారేణైవ విహితం యత్కర్మ. తదన్యథాకర్తుమనీశేన. 15

బట్టి దేవత చేయదగినది ఏమియులేదని చెప్పుచున్నాడు. 'కిమింద్రేణ' అని కర్మయొక్క ప్రవృత్తికూడ 'అంతర్యామి' యొక్క ఆపేక్షతోడనే-దేవత యొక్క ఉపయోగము సర్వదాలేదనుటయెట్లు? అని శంకించి చెప్పుచున్నాడు. 'స్వభావవిహితం' అని-స్వభావేన-పూర్వసంస్కారము చేతనే విధింపబడిన ఏ కర్మగలదో - దానిని ఇంకొక విధమున - చేయుటకు అధికారములేనివానిచేత - (ప్రయోజనమేమి? అని భావము). 15

శ్లో॥ స్వభావతంత్రోహి జనస్స్వభావమనువర్తతే ।
స్వభావస్థమిదం సర్వం సదేవాసురమానుషమ్ ॥ 16

తా. స్వభావమునకు (యథా సంభవత్వమునకు) ప్రాణి లోబడి యుండును. దానిననుసరించియే ప్రవర్తించుచుండును. దేవతలు, రాక్షసులు, మనుష్యులతోకూడిన ఈ విశ్వమంతయును ఈ స్వభావము నందే ఆధారపడియుండును. 16

టీ:- ఏతద్వివృణోతి-స్వభావతంత్ర ఇతి. ప్రవృత్తేః సంస్కారాధీనత్వాత్కి మంతర్యామిణేత్యర్థః. 16

టీ:- దీనిని వివరించుచున్నాడు. ప్రవృత్తి సంస్కారమునకు అధీనమై యుండుటవలన 'అంతర్యామితోనేమి?' అనిఅర్థము. 16

శ్లో॥ దేహానుచ్చావచాన్ జంతుః ప్రాప్యోత్సృజతి కర్మణా ।
శత్రుర్మిత్ర ఉదాసీన కర్మైవ గురురీశ్వరః ॥ 17

తా. ప్రాణి కర్మచేతనే వివిధములైన శరీరములను పొందుచును, విడుచుచును ఉన్నది. శత్రువులు, మిత్రులు, తటస్థులు కర్మచేతనే ఏర్పడుచున్నారు. కావున కర్మయే గురువు. కర్మయే ఈశ్వరుడు. 17

టీ:- తస్మాత్స్వభావతో నిష్పన్నస్య కర్మణ ఏవ సర్వకారణత్వాత్. కర్మైవ పూజ్యమిత్యాహ-దేహోనిత్యాదిసార్ధేన. 17

టీ:- అందువలన, స్వభావమువలన నిష్పన్నమైన కర్మకే సర్వకారణత్వము వలన-కర్మయే పూజించదగినది. అని చెప్పుచున్నాడు. 17

శ్లో॥ తస్మాత్సంపూజయేత్కర్మ స్వభావతస్స్వకర్మకృత్ ।
అంజసా యేన వర్తేత తదేవాస్య హి దైవతమ్ ॥ 18

తా. అందువలన పూర్వసంస్కారపు బలిమిచే స్వాభావికముగనే కర్మచేయువాడు కర్మనే పూజింపవలయును. సత్యముగ ఏది ప్రవర్తించునో అదియే అతని దేవత. 18

టీ:- తస్మాదితి. సంపూజయేత్ సంమానయేత్ నను దేవతోద్దేశేన ద్రవ్యత్యాగాత్మకత్వాత్కర్మణః. కథం దేవతాం వినా సిద్ధిరిత్యాశంక్య. కర్మాంగమాత్రం దేవతేతి పక్షముపసంహరన్నివ. హేతువాదమాశ్రిత్యాన్యామేవ దేవతాం సమర్థయతే - అంజసేతి. 18

టీ:- సంపూజ్యయేత్ - సమ్మానింపవలెను. దేవతనుద్దేశించి ద్రవ్యముల నిచ్చుట అను లక్షణముగల కర్మకు దేవతలేకుండ సిద్ధిఎట్లు కలుగును? అని శంకించి - కర్మాంగమాత్రమే దేవత అను పక్షమును ఉపసంహ రించుచున్నట్లు-హేతువాదము నాశ్రయించి ఇతరమైన దేవతనే సమర్థించుచున్నాడు. 18

శ్లో॥ అజీవ్యైకతరం భావం యస్త్వన్యముపజీవతి ।
న తస్మాద్విందతే క్షేమం జారం నార్యసతీ యథా ॥ 19

తా. తన బ్రతుకును నడిపించు ఒకే ఒక్క దేవతను విడిచిపెట్టి వేరొక దేవతను సేవించువానికి-వ్యభిచారిణియైన స్త్రీ తన భర్తనుకాక పర పురుషుని చేరినచో ఆమెకువలె క్షేమము, సుఖము కలుగవు. 19

టీ:- హేతుబలేనైవ విపక్షేదోషమాహ - ఆజీవ్యేతి. ఉపజీవతిసేవతే. 19

టీ:- హేతుబలముచేతనే విపక్షమునందు దోషమునుచెప్పుచున్నాడు- ఉపజీవతి-సేవించునో-19

శ్లో॥ వర్తేత బ్రహ్మణా విప్రో రాజన్యో రక్షయా భువః ।
వైశ్యస్తు వార్తయా జీవేచ్ఛూద్రస్తు ద్విజసేవయా ॥ 20

తా. బ్రాహ్మణుడు వేదాధ్యయనముతోను, క్షత్రియుడు రాజ్యమును రక్షించుటచేతను, వైశ్యుడు వృత్తిచేతను, శూద్రుడు బ్రాహ్మణసేవ (త్రైవర్ణికులసేవ) తోను జీవించుచుండవలెను. 20

టీ:- స్వవృత్తిం వక్తుం దృష్టాంతత్వేన వర్ణానాం వృత్తిభేదమాహ-వర్తేతేతి. బ్రహ్మణా వేదాధ్యయనాదినా. 20

టీ:- తమ వృత్తిని గూర్చి చెప్పుటకు దృష్టాంతత్వముచే వర్ణముల వృత్తి విభాగమును చెప్పుచున్నాడు - బ్రహ్మణౌ - వేదాధ్యయనము మున్నగు వానిచేత (అధ్యయనము, అధ్యాపనము) 20

శ్లో॥ కృషివాణిజ్యగోరక్షాః కుసీదం తుర్యముచ్యతే ।
వార్తాచతుర్విధా తత్ర వయం గోవృత్తయోఽనిశమ్ ॥ 21

తా. వ్యవసాయము, వర్తకము, పశుసంరక్షణ, వడ్డీవ్యాపారము (నాల్గవది) అని వైశ్యులవృత్తి నాలుగు విధములు. మేము ఎల్లప్పుడును గోపాలనము చేయువారము. 21

టీ:- వైశ్యవృత్తేశ్చాతుర్విధ్యమాహ - కృషీతి. కృషివాణిజ్య సహితా గోరక్షాః. ఏవం త్రయం. కుసీదం వృద్ధిజీవనం. చతుర్థం. 21

టీ:- నాలుగు విధములుగాగల వైశ్యవృత్తిని చెప్పుచున్నాడు. వ్యవసాయము, వర్తకముతోబాటుగ పశుసంరక్షణ ఇట్లు ఈ మూడు. కుసీదం-వడ్డీపై జీవించుట ఇది నాల్గవది. 21

శ్లో॥ సత్త్వం రజ స్తమ ఇతి స్థిత్యుత్పత్త్యంత హేతవః ।
రజసోత్పద్యతే విశ్వ మన్యోన్యం వివిధం జగత్ ॥ 22

తా. సత్వగుణము, రజోగుణము, తమోగుణము అని ఈ మూడును క్రమముగ స్థితికి, సృష్టికి, లయమునకు కారణములు. విశ్వమునందలి వివిధప్రాణి జగత్తంతయు స్త్రీపురుష పరస్పర సంయోగమునకు కారణమైన రజోగుణము వలన పుట్టుచున్నది. 22

టీ:- నను గవామపి వృత్తిర్మహేంద్రాధీనైవేత్యాశంక్య. నిరీశ్వరసాంఖ్య మతాశ్రయేణ నిరాకరోతి - శ్లోకద్వయేన. సత్త్వమితి. అన్యోన్యం యోగేన. 22

టీ:- గోవులకుకూడా సంబంధించినవృత్తి మహేంద్రుని ఆధీనముననే యున్నదేమో అని శంకించి నిరీశ్వరసాంఖ్యము అను మతము నాశ్రయించి నిరాకరించుచున్నాడు. రెండు శ్లోకములతో - అన్యోన్యం- కలయికచేత 22

శ్లో॥ రజసోత్పాదితా మేఘా వర్షం త్యంబూని సర్వతః ।
ప్రజాస్తైరేవ సిద్ధ్యంతి మహేంద్రః కిం కరిష్యతి ॥ 23

తా. రజస్సు చేతనే మేఘములు ఉత్పాదింపబడుచున్నవి. అవి అంతటను నీటిని వర్షించుచున్నవి. ప్రజలు వానిచేతనే కలుగు చున్నారు. మహేంద్రుడేమి చేయును? ప్రజలు ఆ మేఘముల చేతనే జీవించుచున్నారు. మహేంద్రుడేమి చేయగలడు? 23

టీ:- రజసేతి. సర్వత ఇతి సముద్రశైలవనాదిష్వపి వృష్టిదర్శనాన్న ప్రేక్షావత్పూర్వత్వం వృష్టేరితి భావః. తైరేవ మేఘైరేవ. సిద్ధ్యంతి జీవంతీతి. 23

టీ:- సర్వతః-అని సముద్రులందు, పర్వతములందు, అడవులు మున్నగు ప్రదేశములందు వర్షముకురియుట కనబడుచుండుట వలన- వర్షమునకు బుద్ధికివలె పూర్వత్మము లేదని భావము. (పూర్వత్వము అనగా ముందు ఆలోచన) 23

శ్లో॥ న నః పురోజనపదానగ్రామా న గృహా వయమ్ ।
వనౌకసస్తాత నిత్యం వనశైల నివాసినః ।
తస్మాద్గవాం బ్రాహ్మణా నామద్రేశ్చారభ్యతాం మఘః ॥ 24

తా. తండ్రీ! మనకు పురములులేవు. జనపథములులేవు. గ్రామములు లేవు. ఇండ్లులేవు. మనము అడవియందు నివసించు వారము. ఎల్లప్పుడును అడవులలో, కొండప్రాంతములందు ఉన్న వారము. అందువలన గోవులకు బ్రాహ్మణులకు, కొండలకును ఈ యజ్ఞము ప్రారంభింపుడు. 24

టీ:- తథాపి. యోగక్షేమార్థం దేవతాపేక్షితేతి చేత్తత ఆహ-నేతి. పురః పత్తనాని జనపదాః దేశాః. న అస్మాకం యోగక్షేమహేతుర్వనశైలాదయ ఏవేతి భావః. బ్రాహ్మణానపి సంగృహ్ణన్నిగమయతి-తస్మాదితి. 24

టీ:- అట్లయినను యోగక్షేమముల కొఱకు దేవతయే కోరబడునేని- దానికి చెప్పుచున్నాడు. పురః - పట్టణములు - జనపథాః- దేశములు -నః - మనకు - యోగక్షేమములకుకారణము అడవులు, కొండలు, ఈ మొదలగునవియే అని భావము. ( బ్రాహ్మణులలు కూడా ) స్వీకరించుచు చెప్పుచున్నాడు. 24

శ్లో॥ య ఇంద్రయాగ సంభారాస్తైరయం సాధ్యతాం మఘః ॥ 25

తా. ఈ ఇంద్రయాగమునకు సంబంధించిన సామగ్రి అంతయును దానికి ఉపయోగింపుడు. (అద్రియాగమునకు). 25

టీ:- స్వయముత్ప్రేక్షితయాగకల్పమాహ-సార్ధైః పంచభిః. య ఇతి. సంభారాస్సాధనాని. 25

టీ:- తాను ఊహించిన యాగవిధానమును చెప్పుచున్నాడు. ఐదున్నర శ్లోకములతో - సంభారాః - సాధనములు. 25

శ్లో॥ పచ్యంతాం వివిధాః పాకాస్సూపాంతాః పాయసాదయః ।
స యావాపూపశష్కుల్యస్సర్వదోహశ్చ గృహ్యతామ్ ॥ 26

తా. అనేకవిధములైన వంటలు. పాయసములు మొదలుకొని పప్పులవరకు వండుడు. అలచందలతోకూడిన భక్షములు, చక్కిలములు, అన్నిపూరణములు, లేక అందఱి కోరికలు పూర్తిచేయు వంటకములు పూర్తి చేయుటకు స్వీకరింపుడు. లేక అందఱి ఇండ్లలోని పాలు స్వీకరింపుడు. 26

టీ:- పచ్యంతామితి. సూపం మౌద్గం. పాయసం కేవలే పయసి పక్వం. సంయావాదయో గోధూమాదివిక్రియాః క్రమశ్చ సూప పాయ

టీ:- సూపం - పెసరపప్పు - పాయసం - కేవలము పాలతో వండినది. సంయావాదయః-గోధుమ మొదలైనవాని రకములు. క్రమము - పప్పు పాయసము మొగలగువానికి సంబంధించినవి.

సయోః. శ్రుత్వా. దోహస్యార్థతోఽన్యేషాం పాఠతః. 26

దోహశబ్దముయొక్క అర్థము వలన ఇతరులకు చెప్పిన వాని ననుసరించివిని - (అనియును) 26

శ్లో॥ హూయంతామగ్నయస్సమ్యగ్బ్రాహ్మణైర్బ్రహ్మవాదిభిః ।
అన్నం బహువిధం దేయం తేభ్యో వో ధేను దక్షిణాః ॥ 27

తా. వేదవాదులైన బ్రాహ్మణులచేత అగ్నులు ప్రేల్చబడునుగాక, అట్టి బ్రాహ్మణులకు బహు విధములైన ఆహార పదార్థములు ఆవులు, దక్షిణలు ఈయవలెను. 27

టీ:- యాగశోభార్థం శ్రద్ధోత్పాదనార్థంచాహ - హుయంతామితి. ధేనుదక్షిణాఃధేనుసహితా దక్షిణాస్తా ఏవవా దక్షిణాః. వః యుష్మాభిః. 27

టీ:- యాగశోభకొరకు, శ్రద్ధను కలిగించుటకును చెప్పుచున్నాడు- ధేనుదక్షిణాః-ఆవులతో కూడిన దక్షిణలు, లేక ఆ ఆవులే దక్షిణలుగ అనియు - వః - మీచేత . 27

శ్లో॥ అన్యేభ్యశ్చ శ్వ చండాల పతితేభ్యో యథార్హతః ।
యవసం చ గవాం దత్వా గిరయే దీయతాం బలిః ॥ 28

తా. పతితులు, చండాలురు, కుక్కలు వంటి ఇతర ప్రాణులకు కూడా వారివారి అర్హతలననుసరించి ఆ యా వస్తువులనీయవలెను. ఆవులకు గడ్డి వేయవలెను, పర్వతమునకు బలినీయవలెను. 28

శ్లో॥ స్వలంకృతా భుక్తవంతః స్వనులిప్తాస్సువాసనః ।
ప్రదక్షిణం చ కురుత గో విప్రానల పర్వతాన్ ॥ 29

తా. చక్కగ అలంకరించుకొని, భోజనములుచేసి, సుగంధద్రవ్యము లను లేపనముచేసుకొని,మంచివస్త్రములను ధరించినవారై గోవుల కు, బ్రాహ్మణులకు, అగ్నికి. పర్వతమునకు ప్రదక్షణమాచరించ వలెను. 29

టీ:- అన్యేన్య ఇతి. యవసం తృణం. (28-29)

టీ:- యవసం - లేతగడ్డి (28 -29)

శ్లో॥ ఏతన్మమ మతం తాత క్రియతాం యది రోచతే ।
అయం గోబ్రాహ్మణాద్రీణాం మహ్యం దయితో మఘః ॥ 30

తా. తండ్రీ! ఇదినా అభిప్రాయము. మీకు ఒకవేళ ఇది రుచించినచో చేయుడు. ఇది గోవులకు, బ్రాహ్మణులకు, పర్వతమునకు, నాకును ప్రియమైనది. 30

శ్రీ శుక ఉవాచ

శ్లో॥ కాలాత్మనా భగవతా శక్ర దర్ప జిఘాంసయా ।
ప్రోక్తం నిశమ్య నందాద్యాస్సాధ్వగృహ్ణంత తద్వచః ॥ 31

శ్రీశుకుడిట్లనెను.

తా. కాలాత్ముడైన కృష్ణభగవానుడు ఇంద్రుని గర్వముననచుటకై చెప్పిన మాటలువిని నందుడు మొదలగువారు సరేనని అతని సూచనను అంగీకరించిరి. 31

టీ:- ఏతదితి. సర్వాన్ శిరః కంపేనానుమోదయన్నాహ-గో బ్రాహ్మణ ద్రీణామితి. మహ్యం మమ చ. (30-31)

టీ:- అందటిని- తలఊపుచు, ఆమోదింపచేయుచు చెప్పుచున్నాడు. మహ్యం - నాకును. (30-31)

శ్లో॥ తథా చ వ్యదధుస్సర్వం యథాహ మధుసూదనః ।
వాచయిత్వా స్వస్త్యయనం తద్ద్రవ్యేణ గిరిద్విజాన్ ॥ 32

తా. కృష్ణుడు చెప్పినట్లే అంతయును చేసిరి. పుణ్యాహవాచనము చేయించి ఇంద్రయాగము కొరకు సమకూర్చబడిన ద్రవ్యములతో పర్వతమునకు, బ్రాహ్మణులకు పూజలు చేసిరి.(బలులు ఇచ్చిరి) 32

టీ:- తథేతి. తద్ద్రవ్యేణ మహేంద్రమఖద్రవ్యేణ గిరిద్విజాన్ ప్రతి యథా యథం. 32

టీ:- తద్ద్రవ్యేణ-ఇంద్రియాగార్థమై సేకరించిన ద్రవ్యముతో-పర్వత మును బ్రాహ్మణులను గూర్చి విద్యుక్తముగ (పూజలుసాగించిరి). 32

శ్లో॥ ఉపహృత్యబలీన్ సర్వానాదృతా యవ సంగవామ్ ।
గో ధనాని పురస్కృత్య గిరిం చక్రుః ప్రదక్షిణమ్ ॥ 33

టీ:- ఉపహృత్యేతి. బలీనుపహృత్య దత్వా ఆదృతాః సాదరాః. 33

శ్లో॥ అనాంస్య నడుద్యుక్తాని తే చారుహ్య స్వలంకృతాః ।
గోప్యశ్చ కృష్ణవీర్యాణి గాయంత్యస్సద్విజాశిషః ॥ 34

టీ:- అనాంసీతి. అనడుద్యుక్తాని ఉత్తమానడుద్భిర్యుక్తాని. సద్విజాశిషః ద్విజాశీర్భిస్సహితాః. 34

శ్లో॥ కృష్ణస్త్వన్యతమం రూపం గోపవిస్రం భణం గతః ।
శైలో౽స్మీతి బ్రువన్ భూరి బలిమాదద్బృహద్వపుః ॥ 35

తా. అందరికిని యథార్థముగ బలులు - పూజలు - సత్కారములు మున్నగువానితో సమ్మానములిచ్చి, ఆవులకు ఆదరముగ గడ్డివేసి, ఆవులను, లేగలను ముందుంచుకొని పర్వతమునకు ప్రదక్షిణములు ఆచరించిరి. 33

టీ:- బలీన్ ఉపహృత్యా- బ లులనుఇచ్చి - ఆదృతాః-ఆదరముగల వారై. 33

తా. గోపస్త్రీలు, బ్రాహ్మణాశీర్వాదములుపొందినవారై, చక్కగ అలంకరించుకొనినవారై, మంచిఎద్దులు బూన్చబడిన బండ్లనెక్కి, కృష్ణుని వీరగాథలను పాడుచు (గిరిరాజుపరిక్రమముచేయుచుండిరి). 34

టీ:- అనడుద్యుక్తాని-ఉత్తమమైన ఎడ్లనిబూన్చినవి - సద్విజాశిషః - బ్రాహ్మణాశీస్సులతో కూడినవారై. 34

తా. గోపాలురకు విశ్వాసము కలిగించుటకు శ్రీకృష్ణుడు తనకన్న ఇతరమైన ఒక మిక్కిలి పెద్దరూపమునుపొంది, 'నేను పర్వతమును' అని చెప్పుచూ, ఆ బృహచ్ఛరీరముతో బలిని ఆరగించెను. 35

టీ:- కృష్ణ ఇతి. గోప విస్రంభణం గోపానాం విశ్వాసజనకం రూపం గతః ప్రాప్తస్సన్ బలిముపహారం, ఆదత్ అభక్షయత్. 35

టీ:- గోప విస్రంభణం గోపాలురకు విశ్వాసము కలిగించునదియగు రూపమును పొందినవాడై - బలిం- ఉపసంహారమును - అధత్ - భక్షించెను. 35

శ్లో॥ తస్మై నమో వ్రజజనైస్సహ చక్రే మహాత్మనే ।
అహో పశ్యత శైలోఽసౌ రూపీనోఽనుగ్రహం వ్యధాత్ ॥ 36

తా. మహాత్ముడైన ఆ గిరిరాజుకు (తన గిరిరూపమునకు) ఇతర వ్రజవాసులతోకూడా తానును నమస్కారము చేసెను. చేయుచు-'అహో చూడుడు ఈ మహారూపుడగుశైలరాజు మననుఅనుగ్రహించెను'. 36

టీ:- తస్మాఇతి. తస్మై ఆత్మనే, ఆత్మనా స్వయం వ్రజజనైస్సహ-సమశ్చక్రే అహో ఇత్యాదిసార్ధశ్లోకం పఠన్. 36

టీ:- తస్మై-తనకే-తానే వ్రజజనులతోకూడ నమస్కరించెను. 'అహో' ఇత్యాదిగాగల సగము శ్లోకమును చదువుచు-36

శ్లో॥ ఏషోఽవజానతే మర్త్యాన్ కామరూపీ వనౌకసః ।
హంతిహ్యస్మై నమస్యామశ్శర్మణేహ్యాత్మనో గవామ్ ॥ 37

తా. వనమునందు నివసించు జీవులు, మానవులు ఇతనిని నిరాదరణ చేసినచో - కామరూపియై - కోరిన రూపమును ధరించి, వారికి నష్టము కలిగించును. అందువలన మనకును, మన గోవుల కును క్షేమము కలిగించుట కొఱకు ఇతనికి నమస్కారము చేసెదము. 37

టీ:- ఏష ఇతి. కామరూపీ సర్పాదిరూపః. అస్మై అద్రయే. శర్మణే క్షేమాయ. 37

టీ:- కామరూపి-సర్పములు మొదలగువాని రూపము ధరించినవాడై -అస్మై ఈశైలమునకు-శర్మణే-క్షేమముకొఱకు(నమస్కరింతుము). 37

శ్లో॥ ఇత్యద్రి గో ద్విజ మఖం వాసుదేవ ప్రచోదితాః ।
యథా విథాయ గోపాలస్సహకృష్ణా వ్రజం యయుః ॥ 38

తా. కృష్ణునిచేత ప్రేరేపింపబడినవారై ఇట్లు నందాదులు శైల, గో, విప్ర యజ్ఞమును యథావిధిగ నిర్వర్తించిన పిమ్మట కృష్ణునితోగూడ గోపాలురందఱును వ్రజమునకు పోయిరి. 38

టీ:- ఇతీతి. శ్లో. కర్మైవాలం ప్రాక్స్వభావోగుణా వా కర్మాంగం వా తద్వశో వా మహేశః, వార్తా కర్త్రీ దేవతేతియముక్తా దేవక్షోభేషణ్మాతిర్నత్వ భీష్టా. శ్రీధరీయోఽయం శ్లోకః 38

టీ:- 'కర్మయేచాలును. లేక ప్రాక్తనసంస్కారముగాని, గుణములు గాని కర్మాంగముకాని లేక మహేశుడు వశుడై యుండుటగాని కర్తృత్వమునకు ఉన్ముఖమైన ప్రవృత్తిగాని దేవతయని చెప్పబడును. దేవునికి బాధకలిగించు ఈ షణ్మాత్రమైన బుద్ధికూడ వాంఛనీయము కాదు'. ఇది శ్రీధరీయ శ్లోకమునందలి భావము. 38

**శ్రీ మద్భాగవతే, మహాపురాణే దశమస్కంధే,**
**చతుర్వింశోఽధ్యాయః**

**అని శ్రీమద్భాగవతమున దశమస్కంధమందు**
**ఇరువది నాల్గవ అధ్యాయము సమాప్తము.**

## పంచవింశోఽధ్యాయః

### శ్రీ శుక ఉవాచ

శ్లో॥ ఇంద్రాస్తదాత్మనః పూజాం విజ్ఞాయ విహతాం నృప ।
గోపేభ్యః కృష్ణనాథేభ్యో నందాదిభ్యశ్చుకోపహ ॥ 1

టీ:- పంచవింశే రూషా శక్రే వ్రజనాశాయ వర్షతి, ఉద్ధృత్య గిరిమా సారాదరక్షద్గోకులం ప్రభుః. ఇంద్రేతి. కృష్ణో నాథో యేషాం తేభ్యః. 1

శ్లో॥ గణం సంవర్తకం నామ మేఘానాం చాంతకారిణామ్ ।
ఇంద్రః ప్రాచోదయత్క్రుద్ధో వాక్యం చాహేశమాన్యత ॥ 2

టీ:- గణమితి. క్రుద్ధశ్చ సన్నింద్రః. సంవర్తకం నామ. సంవర్తః. ప్రళయః. తత్కర్తారం మేఘానాం ప్రసిద్ధగణం ప్రాచోదయత్ ప్రేషయామాస. నను కథం కృష్ణనాథానాం ఘాతే ప్రవృత్త ఇత్యాశంక్యాత్మ సంభావనయా నిరస్తవివేకత్వాదిత్యాశయేనాహ-వాక్యంచాహేత్యాది

## 25వ అధ్యాయము

### శ్రీ శుకుడిట్లనెను.

తా. రాజా! తన పూజ భగ్నమైనదిగా తెలిసికొనిన ఇంద్రుడు, నందుడు మొదలుగాగల గోపాలురపైన మిక్కిలి ఆగ్రహించెను. కృష్ణుడు పతిగాగలవారందరిపై కోపగించెను. 1

టీ:- ఈ ఇరువది ఐదవ అధ్యాయమున ఇంద్రుడు కోపముతో, వ్రజమును నాశనము చేయుటకొఱకు వర్షము కురిపించుటయు, ప్రభువైన కృష్ణుడు తన బలము వలన పర్వతమును పైకెత్తి గోకులమును రక్షించెను అనుటయు శ్రీధర శ్లోక భావము. కృష్ణుడు నాథుడెవరికో వారు కృష్ణనాథులు వారి కొఱకు. 1

తా. ఇంద్రుడు సంవర్తకం అను పేరుగల ప్రళయ కారకమైన మేఘముల సమూహమును ప్రేరేపించెను. మరియు మిక్కిలి కోపించిన వాడై తనను తాను ఈశ్వరుడుగా భావించినవాడైన ఆ ఇంద్రుడు ఇట్లనెను. 2

టీ:- కోపించినవాడైన ఇంద్రుడు "సంవర్తకం" అను పేరుగల- సంవర్తః-ప్రళయము-అట్టి ప్రళయమును చేయగల మేఘముల యొక్క ప్రసిద్ధమైన సమూహమును - ప్రాచోదయత్ - పంపెను. కృష్ణుడే రక్షకుడుగ వారిని నశింపజేయుటకు ఎట్లు ప్రవృత్తమగును అని

పంచభిః, ఈశనూనీ అహమీశ్వర ఇతిగర్వవాన్. 2

ఆశంకించి – తనను తాను గొప్పగ భావించుకొనుటచేత – కోల్పోయిన వివేకత్వముతో – అనిచెప్పుచున్నాడు – "ఈమాట చెప్పెను" అని మొదలుగాగల ఐదు శ్లోకములతో –ఈశమానీ– నేనే ఈశ్వరుడను అను గర్వము గలవాడై 2

శ్లో॥ అహో శ్రీమదమహాత్మ్యం గోపానాం కాననౌకసామ్ ।
కృష్ణం మర్త్యముపాశ్రిత్య యే చక్రుర్దేవహేళనమ్ ॥ 3

తా. అహో ! అడవిలో నివసించు ఈ గోపాలకులకు గల ఐశ్వర్య గర్వము యొక్క మహాత్మ్యము! మానవ మాత్రుడైన ఒక కృష్ణుని ఆశ్రయించి వారు దేవుని (ఇంద్రుని) అవజ్ఞచేసిరి! 3

టీ:– అహో ఇతి. దేవహేళనం దేవస్య మమావజ్ఞాం. 3

టీ:– దేవహేళనః – దేవస్య – నాయొక్క – హేళన–అవజ్ఞ 3

శ్లో॥ యథాదృఢైః కర్మమయైః క్రతుభిర్నా మనౌనిభైః ।
విద్యామాన్వీక్షకీం హిత్వా తితీర్షంతి భవార్ణవమ్ ॥ 4

తా. నామమాత్రమైన నావలవలె అసమర్థములై, కేవలకర్మమయములై యుండు యజ్ఞములచేత–బ్రహ్మవిద్య విచారమును విడిచిపుచ్చి –సంసారసాగరమును తరింపగోరుచున్నవారి. 4

టీ:– యథేతి. అదృఢైః అసమర్థైః. కర్మమయైః క్రియానిర్వర్త్యైః.అత ఏవ నామనౌనిభైః నామమాత్రేణ యా నావ ఇతి వ్యవహ్రియంతే తత్సదృశైః ఆన్వీక్షకీమాత్మానుస్మృతిరూపం. 4

టీ:– అధృఢైః–అసమర్థమైనవానిచేత – క్రియనిర్వర్తి రూపములైన వానిచేత – అందుకేనామనౌనిభైః – పేరుతో మాత్రము నావలుఅని వ్యవహరింపబడునో – అట్టివానిచేత – అన్వీక్షకీం – ఆత్మనుగూర్చిన విచారణ రూపమైన దానిని 4

శ్లో॥ వాచాలాం బాలిశం స్తబ్ధమజ్ఞం పండితమానినమ్ ।
కృష్ణం మర్త్యముపాశ్రిత్య గీపా మే చక్రుర ప్రియమ్ ॥ 5

టీ:- వాచాలమితి. తథా వాచాలం బహుభాషిణం బాలిశం శిశుం. పండితమానినం పండితో2హమిత్యాత్మానం మన్యమానం. అతస్స్తబ్ధ మవినీతమితి. నిందాయాం యోజితాపీంద్రస్య భారతీ. శ్రీకృష్ణం స్తౌతి. తథాహి వాచాలం శాస్త్రయోనిం బాలిశం. ఏవమపి శిశువన్నిరభిమానినం. స్తబ్ధం అన్యస్య వంద్యస్యాభావాదనమ్రం అజ్ఞం. నాస్తిజ్ఞో యస్మాత్తం సర్వజ్ఞమిత్యర్థః. పండితమానినం. బ్రహ్మవిదాం బహుమాననీయం కృష్ణం. సదానందరూపం పరబ్రహ్మ. మర్త్యం. తథాపి భక్తవాత్సల్యేన మనుష్యతయా ప్రతీయమానమితి. 5

తా. అతిగా మాట్లాడువాడును, ఏమియు తెలియనివాడును, కదలిక లేనివాడును, జ్ఞానము లేనివాడును తననుతాను పండితునిగ భావించువాడును, మానవమాత్రుడను అయిన కృష్ణుని ఆశ్రయించి, గోపాలురు నాకు అప్రియమును చేసిరి. 5

టీ:- వాచాలం-ఎక్కువగ మాట్లాడు వానిని, బాలిశం-శిశువును, పండితమానినం-తననుతాను పండితుడని భావించువానిని, అందు వలన - స్తబ్ధం-అవినీతుని-నిందించుటయందు యోచించిన ఇంద్రుని వాక్యములు శ్రీకృష్ణుని స్తోత్రము చేయుచున్నవి. అది యుక్తమే- అది ఎట్లన-వాచాలం-శాస్త్రములకు పుట్టువైన వానిని-బాలిశం-అట్లయి నను శిశువువలె అభిమానరహితుడైనవానిని- స్తబ్ధం-ఇతరునికి నమస్క రించుట లేనందువలన వంగుటలేకుండగ నిగారుగ నుండువానిని. అజ్ఞం - ఎవని వలన జ్ఞానము లేకుండునదో అతనిని అనగ సర్వజ్ఞుని అని అర్థము. పండిత మానినం-బ్రహ్మవేత్తలకు మిక్కిలి మాననీయులైన వానిని-కృష్ణుని-సదానందరూపుని, పరబ్రహ్మమును-మర్త్యం- అట్లయి నను భక్తుల యందలి వాత్సల్యముచేత మనుష్యరూపమున వెలసినవానిని. 5

శ్లో॥ ఏషాం శ్రియావ లిప్తానాం మత్తానాం ధ్మాయితాత్మనామ్ ।
ధనుత శ్రీమదస్తంభం పశూన్న యతసంక్షయమ్ ॥ 6

టీ:- ఏషామితి. అవలిప్తానాంమత్తానాంధ్మాయితాత్మనాం బృంహిత దేహానాం. ధనుత అపనయత. శ్రీమదేనయః స్తంభో గర్వః. తం భిద్యత. 6

తా. ధనముతో తగుల్కొనియున్నవారును, మత్తులైయున్నవారును, బలిసిన శరీరము గలవారును అయిన వీరియొక్క ధనగర్వముచే కలిగిన అహంకారమును అణిచివేయుడు. వీరి పశువులను నశింపజేయుడు. 6

టీ:- అవలిప్తానాం - మిక్కిలిగ తగులుకొనియున్నవారి - మదించియున్నవారి - ధ్మాయితాత్మనాం - బలిసిన దేహములు గలవారి- ధునుత - అపహరింపుడు - ధనమదముచేత - యః స్తంభః - ఏ గర్వముగలదో - దానిని భేదింపుడు. 6

శ్లో॥ అహం చైరావతం నాగమారుహ్యానువ్రజే వ్రజమ్ ।
మరుద్గణైర్మహావేగైర్నంద గోష్ఠ జిఘాంసయా ॥ 7

టీ:- తాన్ ప్రత్యాహ- అహమితి. అనువ్రజే అనంతరమేవా గమిష్యామి మరుద్గణైర్దేవగణైస్సహ. 7

తా. నేను మిక్కిలి వేగముగల దేవతాసమూహముతోకూడి, నందుని ఆలమందలను నశింపజేయుటకొఱకు ఐరావతము అను ఏనుగును ఎక్కి మీ వెనకనే వ్రజమునకు వచ్చెదను. 7

టీ:- సంవర్తక మేఘముల నుద్దేశించి చెప్పుచున్నాడు. అనువ్రజే -వెనువెంటనే వచ్చెదను-మరుద్గణైః-దేవతల సమూహములతోకూడి 7

**శ్రీ శుక ఉవాచ**

శ్లో॥ ఇత్థం మఘవతాజ్ఞప్తా మేఘా నిర్ముక్త బంధనాః ।
నంద గోకుల మాసారైః పీడయామాసు రోజసా ॥ 8

**శ్రీశుకుడిట్లనెను.**

తా, ఇట్లు ఇంద్రునిచేత ఆజ్ఞాపింపబడిన మేఘములు, తమ బంధనములనుండి విడవబడినవై, బలిమితో నందగోకులమును జలధారపాతములతో పీడింపసాగెను. 8

టీ:- ఇత్థమితి. మఘవతా ఇంద్రేణ నిర్ముక్తం బంధనం యేషాం తే. ప్రళయభియా యే బద్ధా ఆసన్ తే నిర్ముక్తబంధనాస్సంతః ఆసారైర్ధారాసంపాతైః పీడయామాసుః. 8

టీ:- మఘవతా - ఇంద్రుని చేత - విడువబడిన బంధనములు వేనికో అవి - ప్రళయభయముచే ఏవి బంధింపబడి (కట్టబడి) యుండెనో అవి విడువబడిన బంధనములుగలవై - ఆసారైః - ధారాపాతముతో - పీడియామాసుః - బాధింపసాగెను. 8

శ్లో॥ విద్యోతమానా విద్యుద్భిస్స్తనంతస్స్తనయిత్నుభిః ।
తీవ్రైర్మరుద్గణైర్నున్నా వవృషుర్జల శర్కరాః ॥ 9

తా. మెరుపులతో (మిరుమిట్లు గొలిపేకాంతులతో) మెఱయుచు, ఉరుములతో (చెవులను బ్రద్దలుచేయుశబ్దములతో) ఉరుముచు తీవ్రమైన పెనుగాలులతో ప్రేరేపింపబడుచు, ఆ మేఘములు నీటిరాళ్లను వర్షించెను. (లేక నీటిని, రాళ్లను కురిపించెను). 9

టీ:- విద్యోతమానా ఇతి. స్తనయిత్నుభిరశనిభిః స్తనంతః గర్జంతః మరుద్గణైః ఆవహ ప్రవహాదివాయు సమూహైః నున్నాః ప్రేరితాః. జలశర్కరాః జలోపలాః. 9

టీ:- స్తనయిత్నుభిః - పిడుగుపాటులతో - స్తనంతః- గర్జించుచున్నవి, మరుద్గణైః - ఆవహము (అన్ని ప్రదేశములనుండి మోసుకొనిపోవునది). ప్రవహము (ప్రకృష్టముగ మోసుకొని పోవునది) మొదలగు వాయువుల సమూహములతో - నున్నాః - ప్రేరేపింపబడినవియై జలశర్కరాః - జలోపలములు - వడగండ్లు. 9

శ్లో॥ స్థూణా స్థూలా వర్షధారా ముంచత్స్వభ్రేష్వభీక్ష్ణశః ।
జలౌఘైః ప్లావ్యమానా భూర్నాదృశ్యత నతోన్నతమ్ ॥ 10

తా. స్తంభములవంటి స్థూలములైన వర్షధారలను, మేఘములు నిరంతరముగ వర్షించుచు నీటి సమూహములచేత నందవ్రజ ప్రాంతములను ప్రవహింపజేయుచున్నవి యయ్యెను. ఆ ప్రాంతము ఎత్తుపల్లములు కానరాకుండెను. 10

టీ:- స్థూణేతి. స్థూణావత్ స్థూలాః అభ్రేషుముంచత్సు. నతోన్నతం నతం నిమ్నమున్నతం తద్విపరీతం యథా భవతి తథా. భూర్నా దృశ్యత. 10

టీ:- స్థూణావత్ స్థూలాః-స్తంభమువలెలావైనవి - అభ్రేషు ముంచత్సు -మేఘములు వర్షించుచుండగా-నతోన్నతం-నతం-పల్లము-ఉన్నతం -ఎత్తు-దానికి విరుద్ధమెట్లగునో అట్లు నేల కనబడకుండెను. 10

శ్లో॥ అత్యా సారాతిపాతేన పశవో జాతవేపనాః ।
గోపా గోప్యశ్చ శీతార్తా గోవిందం శరణం యయుః ॥ 11

తా. అతి మాత్రముగ నీరు వర్షించుటచేత పశువులు వణుకు పుట్టినవి అయ్యెను. గోపాలురు, గోపస్త్రీలును, చలిచేత బాధపడుచు కృష్ణుని శరణువేడిరి. 11

టీ:- అత్యాసారేతి. జాతవేపనాః జాతకంపాః. 11

టీ:- జాతవేపనాః - కంపనము కలిగినవై. 11

శ్లో॥ శిరస్సు తాంశ్చ కాయేన ప్రచ్ఛాద్యాసారపీడితాః ।
వేపమానా భగవతః పాదమూలముపాయయుః ॥ 12

తా. ఎడతెగని జలధారలతో పీడింపబడు శిరస్సులను, శరీరముతో కప్పి వణుకుచు, పశువులన్నియు కృష్ణుని పాదమూలముల సమీపము నకు చేరెను. 12

టీ:- తత్ర పశూనాం ప్రయాసం విశినష్టి-శిరస్స్వితి. 12

టీ:- ఆ సంధర్భమునందలి పశువులయొక్క ప్రయాసను ప్రత్యేకించి చూపుచున్నాడు. 12

శ్లో॥ కృష్ణ కృష్ణ మహాభాగ త్వన్నాథంగోకులం ప్రభో ।
తాత్రుమర్హసి దేవాన్నః కుపితాద్భక్తవత్సల ॥ 13

తా. కృష్ణా ఓ కృష్ణా! భాగ్యశాలీ! ప్రభూ! భక్తవత్సలా! ఈ గోకులము నీ రక్షకత్వమున నున్నది. కావున కోపించిన ఇంద్రునినుండి ఈ గోకులమును నీవే కాపాడదగియున్నావు. 13

టీ:- గోప గోపీనాం ప్రార్థనామాహ-కృష్ణేతి. త్వమేవ నాథో యస్య తద్గోకులం గవాం కులం వంశం. నః అస్మాన్. కుపితాద్దేవాదింద్రాత్. త్రాతుం రక్షితుమర్హసి. 13

టీ:- గోపాలుర, గోపస్త్రీల ప్రార్థనను చెప్పుచున్నాడు - దేనికి నీవే నాథుడవో అట్టి గోకులమును - గోవుల సమూహములను, గోవుల వంశమును-నః-మమ్ము-కుపితాత్ దేవాత్-కోపించిన దేవుడగు ఇంద్రుని వలన-త్రాతుం-రక్షించుటకు-అర్హసి - తగియున్నావు. 13

శ్లో॥ శిలావర్షాతి పాతేన హన్యమానమచేతనం ।
నిరీక్ష్య భగవాన్ మేనే కుపితేంద్రకృతం హరిః ॥ 14

తా. మిక్కిలిగ వడగండ్లవాన పడుచుండుటచేత వ్రజమునందలి జనసమూహము, ఆ రాళ్లవానతో కొట్టబడి మూర్ఛిల్లుటచూచి కృష్ణ భగవానుడు ఇది కోపించిన ఇంద్రునిపనియే అని తెలిసికొనెను. 14

టీ:- శీలేతి. విజ్ఞాపనాత్పూర్వ మేవ కుపితే నేంద్రేణకృతం తద్వర్షం. మేనే. 14

టీ:- వ్రజవాసుల ప్రార్థనకు ముందే కోపించిన ఇంద్రునిచేత ఆ వర్షము కురిపింపబడినది అని ఎఱింగెను. 14

శ్లో॥ అపర్త్వత్యుల్బణం వర్షమతివాతం శిలామయమ్ ।
స్వయాగే విహతేఽస్మాభిరింద్రో నాశయవర్షతి ॥ 15

తా. ఋతువు గడిచిపోయినతర్వాత పెనుగాలులతో, వడగండ్లతో కూడి అతిశయించిన వర్షము కురియుట కారణము, తన యాగము మనచే భంగమై పోయినదని ఇంద్రుడు వ్రజనాశము కొరకు కురిపించుచుటయే. 15

టీ:- కథం మేనే తదాహ-అపర్త్వితి. అపగత ఋతుర్యస్య తద్వర్షం. అతిశయితో వాతో యస్మిన్ తత్. అతివాతం శిలామయం శిలాప్రచురం. 15

టీ:- గడిచిన ఋతువు దేనికో అట్టి వర్షము - అతిశయించిన గాలిదేని యందో అది - అతివాతము - శిలామయం - ఱాళ్ళతో నిండినది. శిలాప్రచురమైనది. 15

శ్లో॥ తత్ర ప్రతివిధిం సమ్యగ్జ్ఞాన యోగేన సాధయే ।
లోకేశమానినాం మౌఢ్యాద్ధరిష్యే శ్రీమదం తమః ॥ 16

తా. ఈ సందర్భమునకు సరియైన ఆలోచనతో ప్రతీకారమును సాధింతును. మూర్ఖత్వమువలన తాము లోకమునకంతటికి ప్రభువులమని భావించువారి ఐశ్వర్యగర్వమును అజ్ఞతను హరించెదను. 16

టీ:- తత్ర ప్రతిజ్ఞాపూర్వకం గోవర్ధనోద్ధరణమాహ- తత్రేతి. ప్రతివిధిం ప్రతీకారం. స్వసామర్థ్యేన సాధయిష్యామి. తేన చ మౌఢ్యాత్ లోకేశ మానినాం శ్రీమదలక్షణం తమో హరిష్యామి. బహువచనేన వరుణాదీన భిప్రైతి. 16

టీ:- ఇట ప్రతిజ్ఞాపూర్వకముగ గోవర్ధన పర్వతమును ఎత్తుటనుగూర్చి చెప్పుచున్నాడు.- ప్రతివిధిం - ప్రతీకారమును - నా సామర్థ్యముచేత సాధింతును. దానితో మూర్ఖత్వము వలన తాము లోకేశ్వరులమని భావించు వారి ఐశ్వర్యగర్వ లక్షణమును అజ్ఞానమును హరించి వేయుదును. బహువచనముచేత వరుణుడు మున్నగువారిని ఉద్దేశించు చున్నాడు. 16

శ్లో॥ న హి సద్భావయుక్తానాం సురాణామీశ విస్మయః ।
మత్తోఽసతాం మానభంగః ప్రశమాయోపకల్పతే ॥ 17

తా. సద్భావముతోకూడిన దేవతలకు 'నేను ఈశ్వరుడను' అను గర్వములేదు. అట్టి సద్భావన లేనివారికి నా వలన గర్వభంగము అనునది వారిని అనుగ్రహించుటకు కల్పింపబడుచున్నది. 17

టీ:- నను దేవాః సాత్త్వికాః త్వద్భక్తాశ్చ కుతస్తేషాం తమస్త్రాహ-న హీతి. స ద్భావః సత్త్వం మద్భక్తిర్వా తద్యుక్తానాం సురాణామీశా వయమితి విస్మయో గర్వః హి యస్మాత్. న ఘటతే అతోఽనంతస్తే కించ. తేషాం మానభంగోఽనుగ్రహ ఏవేత్యాహ-మత్త ఇతి. 17

టీ:- దేవతలు సాత్త్వికులు, నీ భక్తులుకూడా-అయినచో వారికి ఈ అజ్ఞానమెందులకు? చెప్పుచున్నాడు. సద్భావః-సత్త్వగుణము-లేక నా యందు భక్తి-దానితో కూడినవారికి దేవతలకు-మేము ఈశ్వరులము అనెడి విస్మయః-గర్వము - (లేదుఅని) హి - ఎందువలన - గర్వము సంభవింపదు. అందువలన వారు అనంతులు-మరియు-వారిగర్వ భంగము అనుగ్రహమే అని చెప్పుచున్నాడు. 17

శ్లో॥ తస్మాన్మచ్ఛరణం గోష్ఠం మన్నాథం మత్పరిగ్రహమ్ ।
గోపా యే సాత్రయోగేన సోఽయం మే వ్రత ఆహితః ॥ 18

తా. ఆ కారణమువలన నా శరణమున నున్నవారును, నా గో సమూహమున నున్నవారును, నేను మాత్రమే రక్షకునిగా గలవారును, నాచే స్వీకరింపబడియున్నవారును అయిన (ఏ గోపాలకునున్నారో) వారిని నా యోగమాయచే రక్షింతును. ఇది నా వ్రత నియమము. శరణులోనున్న వారిని రక్షించు వ్రతధారణ చేసియున్నాను. 18

టీ:- తస్మాదితి. గోపాయే రక్షిష్యామి. కించ సోఽయం మే మయా వ్రతో నియమః సంకల్పో వా. ఆహితః ధృత ఇత్యర్థః. 18

టీ:- గోపాయే-రక్షింతును. అదికాక-అదినా వ్రతనియమము. లేక సంకల్పము. ఆహితః-ధరింపబడినది అని అర్థము. 18

### గోవర్ధనోద్ధణ ఘట్టః

శ్లో॥ ఇత్యుక్త్వైకేన హస్తేన కృత్వా గోవర్ధనాచలం ।
దధార లీలయా కృష్ణశ్ఛత్రాకమివ బాలకః ॥ 19

తా. అని ఇట్లు చెప్పి, లీలగా గోవర్ధనగిరిని బాలకృష్ణుడు ఒకచేతితో పైకెత్తి పుట్టగొడుగు ఛత్రమునకు వలె పట్టుకొనెను. (గొడుగునువలె లేవనెత్తెను). 19

టీ:- ఇతీతి. కృత్వా ఉద్ధృత్య. ఛత్రాకం శిలీంధ్రం యథా. 19

టీ:- కృత్వా - లేవనెత్తి. ఛత్రాకం - పుట్టగొడుగు (నువలె) 19

శ్లో॥ అథాహ భగవాన్ గోపాన్ హేఽంబ తాత వ్రజౌకసః ।
యథోపజోషం విశత గిరివర్తం సగోధనాః ॥ 20

తా. పిమ్మటకృష్ణుడిట్లనెను, 'అమ్మా! తండ్రీ! వ్రజవాసులారా! మీరందఱును మీమీ ఆలమందలతోకూడా, మీకుఅనుకూలమైన రీతిగ ఈ కొండకింద ప్రదేశమునకు చుట్టును గుంతలో ప్రవేశింపుడు. 20

శ్లో॥ న త్రాస ఇహ వః కార్యో మద్ధస్తాద్రినిపాతనాత్ ।
వాతవర్షభయేనాలం తత్త్రాణం విహితం హి వః ॥ 21

తా. నా చేతినుండి ఈ పర్వతము కిందపడిపోవునేమోయను భయము మీకక్కర లేదు. ఇక గాలి వానల భయము కూడ చాలును. మీ ప్రాణములు కాపాడుటకే ఈ చర్య నిర్వహింపబడినది. 21

శ్లో॥ తథా నివివిశుర్గర్తే కృష్ణాశ్వాసితమానసాః ।
యథావకాశం సధనాస్సప్రజాస్సోపజీవనః ॥ 22

తా. కృష్ణునిచే ఓదార్చబడిన మనస్సులు గలవారై తమ తమ గోసంపదలతోను, తమ తమ సంతానములతోను, తమ తమభృత్య, పురోహితాది జనులతోను అవకాశమునుబట్టి కొండ క్రింది పల్లమున అందరు ప్రవేశించిరి. 22

టీ:- తథేతి. వ్రజాః శకటమండలీసహితాః. సోపజీవినః భృత్యపురోహితాదిసహితాః. (20-22)

టీ:- వ్రజాః - బండ్లసమూహములతో కూడినవారై - సోపజీవనః - భృత్యులు - పురోహితులు మొదలైనవారితో కూడి. ( 20-22)

శ్లో॥ క్షుత్తృడ్వ్యథాం సుఖాపేక్షాం హిత్వా తైర్వ్రజవాసిభిః ।
వీక్ష్యమాణో దధారాద్రిం సప్తాహం నాచలత్పదాత్ ॥ 23

తా. కృష్ణుడు ఆకలిదప్పులను, సుఖమునందలి ఆపేక్షను విడిచి ఆ వ్రజవాసులతో రాత్రులను, పగళ్లను చూచుచు ఏడు దినములు ఆ స్థలమునుండి కదలక నిలిచెను. 23

శ్లో॥ కృష్ణ యోగానుభావంతం నిశామ్యేంద్రోఽతివిస్మితః ।
నిస్తంభో భ్రష్టసంకల్పః స్వయం మేఘానవారయత్ ॥ 24

తా. కృష్ణుడు కౌశలముతో ఘటించిన మాయను గమనించి ఇంద్రుడు మిక్కిలి ఆశ్చర్యమునొంది గర్వమునువీడి తన సంకల్పము జారిపోగ తనకు తానుగ మేఘములను నివారించెను. 24

శ్లో॥ ఖం వ్యభ్రముదితాదిత్యం వాతవర్షం చ దారుణం ।
నిశామ్యోపరతం గోపాన్ గోవర్ధనధరోఽబ్రవీత్ ॥ 25

తా. ఆకాశము నిర్మేఘమగుట, సూర్యుడు ప్రకటమగుట, భయంకరమైన గాలివానలు శాంతించుట చూచి గోవర్ధనగిరి నెత్తిపట్టుకొనిన కృష్ణుడు గోపాలకులతో నిట్లనెను. 25

టీ:- క్షుదితి. పదాత్ స్థానాత్. (23-25)

టీ:- పదాత్ - స్థానమునుండి. (23-25)

శ్లో॥ నిర్యాత త్యజత త్రాసం గోపాస్సస్త్రీధనార్భకాః ।
ఉపారతం వాతవర్షం వ్యుదప్రాయాశ్చనిమ్నగాః ॥ 26

తా. గాలి వానలు శాంతించినవి. గోపాలులారా! నదులు, స్వల్ప జలములు గలిగి నెమ్మదిగ ప్రవహించుచున్నవి. ఇక భయమును విడిచి మీ మీ స్త్రీలతో, గోధనములతోను, పిల్లలతోను బయటకు వెడలుడు. 26

టీ:- నిర్యాతేతి. వ్యుదప్రాయాః విగతోదకప్రాయాః స్వల్పజలా ఇత్యర్థః. 26

టీ:- వ్యుదప్రాయాః - నీరులేని వానివలె - స్వల్పజలములు గలవి అని యర్థము. 26

శ్లో॥ తతస్తేనిర్యయుర్గోపాస్స్వం స్వమాదాయ గోధనం ।
శకటోఢోపకరణం స్త్రీబాలస్థ విరాశ్శనైః ॥ 27

తా. అప్పుడు ఆ గోపాలురు తమ తమ గోసమూహములను తోడ్కొని బండ్లు, వానిచే మోయబడు పరికరములు, స్త్రీలు, బాలురు, ముసలి వారు మున్నగు వారితో సహా మెల్లగా వెలుపలికి పోయిరి. 27

శ్లో॥ భగవానపి తం శైలం స్వస్థానే పూర్వవత్ప్రభుః ।
పశ్యతాం సర్వభూతానాం స్థాపయామాస లీలయా ॥ 28

తా. కృష్ణభగవానుడుకూడా అన్నిప్రాణులుచూచుచుండగనే ఆ గోవర్ధనగిరిని పూర్వమువలెనే దాని స్థానమున లీలగా స్థాపించెను. 28

టీ:- తత ఇతి. శకటోఢోపకరణం శకటైరూఢముపకరణం యథా భవతి తథా. (27-28)

టీ:- శకటోఢోపకరణం-బండ్లచేత మోయబడుచున్నఉపకరణములు ఎట్లుండునో అట్లు (27-28)

శ్లో॥ తం ప్రేమవేగాన్నిభృతా వనౌకసో
యథా సమీయుః పరిరంభణాదిభిః
గోప్యశ్చ సస్నేహమపూజయన్
ముదాదధ్యక్షతాద్భిర్యుయుజస్సదాశిషః ॥ 29

తా. వనమునందు నివసించు ఆ గొల్లలందఱును ప్రేమవేగముతో నిండినవారై కృష్ణుని ఆలింగనము చేసికొనుట మొదలగు అభినందన క్రియలచేత తమ కృతజ్ఞత తెలుపుకొనుటకు అతనివద్ద గుమిగూడిరి. గోపస్త్రీలును ఆదరముతో అతనిని పూజించిరి. సంతోషముతో పెరుగు అక్షతలు అతనిపై జల్లి మంచి ఆశీస్సులిచ్చిరి. లేక దధి అక్షతలు సదాశీస్సులతో చల్లిరి. 29

శ్లో॥ యశోదా రోహిణీ నందో రామశ్చ బలినాం వరః ।
కృష్ణమాలింగ్య యుయుజురాశిషస్స్నేహ కాతరాః ॥ 30

తా. యశోద, రోహిణి, నందుడు, బలవంతులలో శ్రేష్ఠుడగు బలరాముడు కృష్ణుని ఆలింగనము చేసుకొని స్నేహముచేత వ్యాకులురై ఆశీస్సులిచ్చిరి. 30

శ్లో॥ దివి దేవగణాస్సాధ్యాస్సిద్ధ గంధర్వ చారణాః ।
తుష్టువుర్ముముచుస్తుష్టాః పుష్పవర్షాణి పార్థివ ॥ 31

తా. పరీక్షిద్రాజా! ఆకాశమునందలి దేవతాసమూహములు, సాధ్యులు, సిద్ధులు, గంధర్వులు, చారణులు సంతోషముతో పుష్ప వర్షమును కురిపించుచు భగవానుని స్తుతించిరి. 31

శ్లో॥ శంఖ దుదుంభయో నేదుర్దివి దేవప్రచోదితాః ।
జగుర్గంధర్వ పతయస్తుంబురుప్రముఖా నృప ॥ 32

తా. దేవతల ప్రేరణచేత స్వర్గమున శంఖములు, దుందుభులు మ్రోగిం చిరి. రాజా! తుంబురుడు మొదలగు గంధర్వనాయకులు గానముతో భగవానుని స్తుతించిరి. 32

టీ:- తమితి. నిభృతాః పూర్ణాః యథా యథోచితం పరిరంభణాదిభిః సమీయుః. ఉపజగ్ముః సదాశిషః శ్రేష్ఠానాశీర్వాదాన్. (29-32)

శ్లో॥ తతోఽనురక్తైః పశుపైః పరిశ్రితో
రాజన్ స్వగోష్ఠం సబలోఽవిశద్ధరిః ।
తథావిధాన్యన్యకృతాని గోపికా గాయంత్య
ఈయుర్ముదితా హృదిస్పృశః ॥ 33

టీ:- తత ఇతి. తతో గోవర్ధనస్థానాత్. అస్య కృష్ణస్య. తథా విధాని. గోవర్ధనోద్ధరణాదిరూపాణి. కృతాని కర్మాణి గాయంత్యః. ఈయుః యయుః. కథంభూతాః ఏవం ప్రేమ్ణా హృది స్పృశంతీతిహృదిస్పృశః. యద్వా. కథంభూతస్య ప్రేష్ఠత్వేన. తాసాం హృది స్పృశతీతి హృదిస్పృక్ తస్య. 33

శ్రీ మద్భాగవతే, మహాపురాణే దశమస్కంధే,
పంచవింశోఽధ్యాయః

టీ:- నిభృతాః - నిండినవారై-ఆలింగనాదులచే-సమాయయుః-సమీపమునచేరిరి. సదాశిషః - శ్రేష్ఠమైన ఆశీర్వాదములను (29-32)

తా. రాజా! అటుపిమ్మట తమపై మిక్కిలి ప్రేమగల గోపాలురతో ఆశ్రయింపబడి, బలరామునితో కూడి ఆ కృష్ణుడు వ్రజమునకు బయలుదేరివెడలెను. గోవర్ధనగిరినెత్తుట మొదలుకొని కృష్ణుని ఇతర లీలలను గానముచేయుచు, ఆనందించుచు, హృదయమును స్పృశించు ప్రేమతో కదలి పోయిరి. 33

టీ:- తతః-గోవర్ధనస్థానమునుండి ఈకృష్ణునియొక్క-తథావిధాని-గోవర్ధనోద్ధరణము మొదలగు రూపములుగల-కృతాని కర్మాణి-చేసిన పనులను-గాయంత్యః-కీర్తించుచుండినవారై-ఈయుః-వెడలిరి-కథం భూతాః-ఎట్టివారు? ఇట్లు ప్రేమతోహృదయమునుస్పృశించువారు. కావునహృదిస్పృశః-లేక-ఎట్టివానిఅతిశయించినప్రేమతత్త్వముచేత? వారిహృదయమందుస్పృశించువాడుకావునహృదయస్పృక్-అట్టి వాని యొక్క-హృదిస్పృశః- 33

అని శ్రీమద్భాగవతమున దశమస్కంధమందు
ఇరువది ఐదవ అధ్యాయము సమాప్తము.

## షడ్వింశోఽధ్యాయః

### శ్రీ శుక ఉవాచ

శ్లో॥ ఏవం విధాని కర్మాణి గోపా కృష్ణస్య వీక్ష్యతే ।
అతద్వీర్య విదః ప్రోచుర్నందమభ్యేత్య విస్మితాః ॥ 1

టీ:- 'షడ్వింశే విస్మితాన్ గోపాన్ కృష్ణస్యాద్భుతకర్మభిః, నందో గర్గోక్తి మాశంస్య తదైశ్వర్యమవర్ణయత్'. ఏవమితి. 1

శ్లో॥ బాలకస్య యథైతాని కర్మాణ్యత్యద్భుతాని వై ।
కథమర్హత్యసౌ జన్మ గ్రామ్యేష్వాత్మజుగుప్సితమ్ ॥ 2

టీ:- నందమభ్యేత్య నందముపాగమ్య. యదూచుస్తదాహ-బాలకస్యేతి. యత్ యస్మాదద్భుతాని కర్మాణి తస్మాద్గ్రామ్యేషు గోపాలేషు కథం జన్మార్హతి ఆత్మజుగుప్సితం ఆత్మానర్హం అద్భుతాని కర్మాణ్యాహుర్ద్వాదశభిః. 2

## 26వ అధ్యాయము

### శ్రీశుకుడిట్లు చెప్పెను

తా. కృష్ణుని యొక్క ఈ విధమైన కర్మలు చూచి ఆ గోపాలకులు కృష్ణుని పరాక్రమము నెఱుంగని వారై ఆశ్చర్యపడి, నందుని సమీపించి అతనితో నిట్లనిరి. 1

టీ:- ఇరువదిఆరవ అధ్యాయమున, కృష్ణుని అద్భుత కర్మలచేత ఆశ్చర్యపడుచున్న గోపాలురను ఉద్దేశించి నందుడు, గర్గమహర్షి వాక్యమును ప్రశంసాపూర్వకముగ తలచికొనుచు, వారికి కృష్ణుని ఐశ్వర్యమును గూర్చి వర్ణించి చెప్పెను. (శ్రీధర) నందమభ్యేత-నందుని సమీపమునకు వచ్చి-ఏది వారడిగిరో దానిని వారికి చెప్పెను. 1

తా. ఈ బాలునికి పనులు మిక్కిలి ఆశ్చర్యముగొల్పునట్టివిగ ఉన్నవి. ఆత్మస్వరూపుడగు ఈతని జన్మము ఈ నిందనీయమైన అనాగరికులలో నెట్లు కలుగును? 2

టీ:- కర్మలు అద్భుతములైఉండుటవలన, గోపాలకులయందు ఈతని జన్మఎట్లుఅర్హమైనది?-ఆత్మజుగిప్సితం-ఆత్మకుఅనర్హమైనది- "నందుని సమీపించి గోపాలకులనడిగినప్రశ్నను ఇట్లు వివరించినాడు". పన్నెండు శ్లోకములతో కృష్ణునిఅద్భుతకర్మలనుగూర్చివారు ప్రస్తావించినారు. 2

శ్లో॥ యస్సప్తహాయనో బాలః కరేణైకేన లీలయా ।
కథం బిభ్రద్గిరివరం పుష్కరం గజరాడివ ॥ 3

తా. ఏడేండ్ల వయస్సుగల బాలుడు, మదించిన ఏనుగు తామర పువ్వునువలె - ఒకే చేతితో లీలగ ఆ పర్వతశ్రేష్ఠమును ఎట్లు భరింపగలడు? 3

టీ:- య ఇతి. యః సప్తహాయన ఇతి. కథం బిభ్రత్ స్థిత ఇతి పుష్కరం పద్మం గజరాట్ మహాగజ ఇవ. 3

టీ:- ఎట్లు ధరించినిలిచెను అని - పుష్కరం - పద్మమును గజరాట్- మహాగజమువలె (పెద్దఏనుగువలె) 3

శ్లో॥ తోకేనామీలితాక్షేణ పూతనాయా మహౌజసః ।
పీతస్తనస్సహప్రాణైః కాలేనేవవయస్తనోః ॥ 4

తా. కన్నులు మూసుకొనియున్న శిశువుచేత గొప్పబలశాలియైన పూతనయొక్క స్తనముతోబాటుగ ఆమె ప్రాణములనుకూడా-శరీరపు ఆయుర్ధాయమును కాలము పీల్చినట్లు-పీల్చబడినవి. 4

టీ:- తోకేనేతి. మహౌజసః మహాబలాయాః తనోర్వయః. ఆయుర్యౌవనం వా. కాలేన యథా పీయతే. తద్వత్. కథమిత్యనువర్తతే. 4

టీ:- మహౌజసః- గొప్పబలముగల దానియొక్క-తనోర్వయః- శరీరము యొక్క వయస్సును. లేక యవ్వనత్వమును కాలము ఏ విధముగ త్రాగివేయునో-ఆ విధముగ ఎట్లు అనునది అనువర్తించును. 4

శ్లో॥ హిన్వతో ధశ్శయానస్య మాస్యస్య చరణావుదక్ ।
అనోఽపతద్విపర్యస్తం రుదతః ప్రపదా హతమ్ ॥ 5

తా. మూడునెలల పసివాడుగనున్న కృష్ణుడు ఒక బండి క్రింది భాగమున ఏడ్చుచు పరుండి తనకాళ్లను ఊర్ధ్వముఖముగ కదలించుచుండగ అతని ఒకకాలి ముందుభాగము తగిలి బండి ఎగిరి తలక్రిందులుగ, దూరముగ పడిపోయెనెట్లు? 5

టీ:- హిన్వత ఇతి. అనసోఽధశ్శయానస్య మాస్యస్య మాసాః త్రయః పరిచ్ఛేదకా యస్య ఉదక్ ఊర్ధ్వం చరణౌ హిన్వతశ్చాలయతః ప్రపదేన పాదాగ్రేణ ఆహతం విపర్యస్తం అనః కథం అపతత్. 5

టీ:- అనసః అదః శయానస్య-బండియొక్క కిందభాగమున పఉండిన వాని యొక్క - మాస్యస్య - మూడు మాసముల వయోవిభజన ఎవనికో అతడు - ఉదక్ - ఊర్ధ్వమునకు- చరణౌ- కాళ్లను - హిన్వతః - కదలించుచున్న వానియొక్క- ప్రపదేన- పాదము యొక్క అగ్రభాగము చేత-ఆహతం- కొట్టబడినదై- విపర్యస్తం - తలకిందులుగ-అనః-బండి -కథం - ఎట్లు - అపతత్- పడెను? 5

శ్లో॥ ఏకహాయన ఆసీనో హ్రియమాణో విహాయసా ।
దైత్యేన యస్తృణావర్తమహన్ కంఠగ్రహాతురమ్ ॥ 6

తా. ఒక సంవత్సరము వయస్సువాడుగ నున్నప్పుడు కృష్ణుని, కూర్చునియుండిన వానిని కూర్చునియున్నట్లుగనే దొంగిలించుకొని ఆకాశమార్గమున పోవుచున్న రాక్షసుడగు తృణావర్తుని కంఠమును పట్టుటచే భయాతురుడైన వానిని చంపివేసెను,. ఎట్లు? 6

టీ:- ఏకహాయన ఇతి. యో దైత్యేన హ్రియమాణస్సన్ తం తృణావర్తం దైత్యం కథం అహన్నిత్యర్థః. 6

టీ:- ఏ రాక్షసునిచే దొంగలింపబడుచుండెనో ఆ తృణావర్తుని, రాక్షసుని ఎట్లు చంపెను? అని అర్థము. 6

శ్లో॥ క్వచిద్ధయ్యంగవ స్తైన్యే మాత్రాబద్ధ ఉలూఖలే ।
గచ్ఛన్నర్జున యోర్మధ్యే బాహుభ్యాం తావపాతయత్ ॥ 7

తా. ఒకప్పుడు వెన్నను దొంగిలించినందుకు ఱోటికి, తల్లిచే కట్టివేయబడిన కృష్ణుడు రెండు మద్ది చెట్లమధ్య భాగమునకు త్రోవుచు చేతులతో వాటిని పడవేసెను. (ఎట్లు?) 7

టీ:- క్వచిదితి. హైయంగవస్తైన్యే నవనీతచౌర్యే. హైయంగవీనమితి వక్తవ్యే హైంగవమితి ప్రయోగ ఆర్షః. ఏవమేవ సర్వత్రాపి జ్ఞేయం సూ. "హైయంగవీనం సంజ్ఞాయా"మితి. బాహుభ్యాం గచ్ఛన్ చరన్నిత్యర్థః. 7

శ్లో॥ వనే సంచారయన్ వత్సాన్ స రామా బాలకైర్వృతః ।
హంతుకామం బకం దోర్భ్యాం ముఖతోఽరిమపాటయత్ ॥8

శ్లో॥ వత్సేషు వత్సరూపేణ ప్రవిశంతం జిఘాంసయా ।
హత్వా న్యపాతయత్తేన కపిత్థాని చ లీలయా ॥ 9

శ్లో॥ హత్వా రాసభదైతేయం తద్బంధూంశ్చ బలాన్వితః ।
చక్రేతాళవనం క్షేమం పరిపక్వఫలాన్వితమ్ ॥ 10

టీ:- హైయంగవస్తైన్యే-వెన్నను దొంగలించుటకు కారణముగ-హైయంగవీనం అని చెప్పవలసియుండగ "హైయంగవం" అని ప్రయోగింపబడుట ఆర్షము. అంతటను ఇట్లే తెలుసుకొనవలయును". "హయంగవీనం సంజ్ఞయందు" అని సూత్రము. బాహుభ్యాంగచ్ఛన్ -ప్రాకుచు అని అర్థము. (బాహుభ్యాం గచ్ఛన్ అని "బాహుభ్యాం అపాతయత్"- అనియు అన్వయము చేయవచ్చును) 7

తా. కృష్ణుడు, బలరామునితో కూడిన గోపబాలురు అడవిలో లేగలను మేపుచుండగ బకుడు అను రాక్షసుడు ఈతనిని చంపుటకు రాగా వానిని-ఆ శత్రువును తన రెండు చేతులతో అతని నోటిని చీల్చి వేసెను. (ఎట్లు?) 8

తా. దూడలతో దూడరూపముతో, కృష్ణుని చంపుట కొఱకు ప్రవేశించిన రాక్షసుని చంపి వాని దేహమును వెలగ వెలగచెట్లపైకి విరవేయగ వానితోబాటు వెలగచెట్లను కూలెను. (ఎట్లు?) 9

తా. కృష్ణుడు, బలరామునితోకూడి గాడిదరూపమున నున్న ధేనుకుడను రాక్షసుని అతని భార్యలను చంపి, పండిన పండ్లతో నున్న తాటి వనమును క్షేమముగా కాపాడిరి. (ఎట్లు?) 10

శ్లో॥ ప్రబలం ఘాతయిత్వోగ్రం బలేన బలశాలినా ।
అమోచయద్వ్రజపశూన్ గోపాంశ్చారణ్యవహ్నితః ॥ 11

తా. బలశాలియగు బలరామునిచేత ఉగ్రుడైన ప్రలంబుడు అను రాక్షసుని సంహరింపజేసి కృష్ణుడు వ్రజపశువులను, గోపాలురను కార్చిచ్చునుండి రక్షించి ఆనందింపచేసెను. (ఎట్లు?) 11

టీ:- వన ఇతి. ముఖతో హంతుకామో యస్య తం బకవేషమరిం బాహుభ్యాం ముఖతః కథమపాటయత్. (8-11)

టీ:- నోటితో చంపగోరిన కోరిక ఎవనికి కలదో వానిని-కొంగ రూపముననున్న ఆ శత్రువును తన బాహువులతో అతని నోటిని చీల్చి ఎట్లు చంపెను? (8-11)

శ్లో॥ ఆశీవిషతమాహీంద్రం దమిత్వావిమదం హ్రదాత్ ।
ప్రసహ్యోద్వాస్య యమునాం చక్రేఽసౌ నిర్విషోదకామ్ ॥ 12

తా. మిక్కిలి ప్రమాదకరమైన విషము తలయందుగల సర్పములలో మేటియగు కాళీయుడను శత్రువును బలాత్కారముగ అణచివేసి సరస్సునుండి తరిమివేసి అందలి జలమును ఈ కృష్ణుడు విషరహితముగచేసెను. దానితో యమునానదీ జలముకూడా పరిశుద్ధమయ్యెను. (ఎట్లు?) 12

టీ:- ఆశీవిషతమేతి. ఆశీవిషతమఃఅతిక్రూరవిషశ్చాసావహీంద్రశ్చతం దుస్త్యజ ఇతి. (12)

టీ:- ఆశీవిషతమః-మిక్కిలి క్రూరమైన విషముగల సర్పరాజగు కాళీయుని. 12

శ్లో॥ దుస్త్యజశ్చానురాగోఽస్మిన్ సర్వేషాం నో వ్రజౌకసామ్ ।
నందతే తనయేఽస్మాసు తస్యాప్యౌత్పత్తికః కథమ్ ॥ 13

తా. నందరాజా! మా వ్రజవాసులందఱికిని ఈ కృష్ణునియందుగల ప్రేమ విడచుటకు సాధ్యముకానిది. నీకును నీ కొడుకు మీద, మా యందును అనంతమగు ప్రేమగలదు కాని అతనియొక్క (కృష్ణుని) ప్రేమ మనయందుకూడా అంతగాఉండుట ఎట్లుస్వాభావికము? 13

టీ :- ఔత్పత్తికః స్వాభావికః కథమితి మిం సర్వేషామయమాత్మా స్యాదితి శంకా. 13

టీ:- ఔత్పతికః-స్వాభావికమైనది-ఎట్లు? అని, అందఱిలోనను ఈ ఆత్మ ఉండుట బట్టియా? అని 13

శ్లో॥ క్వ సప్తహాయనో బాలః క్వ మహాద్రివిధారణమ్ ।
తతో నో జాయతే శంకా వ్రజనాథ తవాత్మజే ॥ 14

తా. ఏడు సంవత్సరముల వయస్సుగల బాలుడేమి? ఆ మహా పర్వతమును ఎత్తి పట్టుటేమి? ఓ నందరాజా! దానివలన మాకు నీ కుమారుడైన కృష్ణునిపై సందేహము కలుగుచున్నది. 14

టీ:- ఉక్తమపి అతివిస్మయేనాభినయే నవదంతి క్వ సప్తహాయన ఇతి. 14

టీ:- చెప్పబడినదే అయినను మిక్కిలి ఆశ్చర్యముతో.అభినయముతో చెప్పుచున్నాడు. "ఏడేండ్లవాడేమి" అని 14

**నంద ఉవాచ**

శ్లో॥ శ్రూయతాం మే వచో గోపాప్యే తు శంకా మమార్భకే ।
ఏవం కుమారముద్దిశ్య గర్గో మే యదువాచ తత్ ॥ 15

**నందుడిట్లనెను.**

తా. గర్గమహర్షి కృష్ణుని గూర్చి నాకు చెప్పియుండిన విషయమును నా మాటగా మీరు వినుడు. గోపాలురందఱికిని సందేహము నివృత్తి యగును. 15

శ్లో॥ వర్ణాస్త్రయః కిలాస్యాసన్ గృహ్ణతోఽనుయుగం తనూః ।
శుక్లోరక్త స్తథాపీత ఇదానీం కృష్ణతాం గతః ॥ 16

తా. కృష్ణుని శరీరమునకు ఒక్కొక్క యుగమున ఒక్కొక్క వర్ణము-తెలుపు, ఎఱుపు, పచ్చదనము అని మూడు వన్నెలు క్రమముగ ఉండెను. ఇప్పుడు శ్యామలవర్ణమును పొందెను. 16

శ్లో॥ ప్రాగయం వాసుదేవస్య క్వచిద్ జ్ఞాతస్తవాత్మజః ।
వాసుదేవ ఇతి శ్రీమానభిజ్ఞాస్సంప్రచక్షతే ॥ 17

తా. నందరాజా! నీ కుమారుడైన కృష్ణుడు పూర్వమొకప్పుడు వసుదేవుని కుమారుడిగ తెలియబడుచుండెను. వాసుదేవుడు అను పేరుతో ఈ భాగ్యశాలి పిలవబడుచుండెను. 17

శ్లో॥ బహూని సంతినామాని రూపాణి చ సుతస్య తే ।
గుణకర్మాను రూపాణి తాన్యహం వేదనో జనాః ॥ 18

తా. నీ కుమారునకు నామములు, రూపములు అనేకములు ఉండెను. అవి గుణములను బట్టి, కర్మలనుబట్టియు ఏర్పడినవి. అవియన్నియు నాకు తెలియును-జనులకు తెలియవు. 18

శ్లో॥ ఏషవశ్శ్రేయ ఆధాస్యద్గోప గోకుల నందనః ।
అనేన బహుదుర్గాణి యూయమంజస్తరిష్యథ ॥ 19

తా. గోపాలుడైన ఈ గోకులనందనుడు నీకు మిక్కిలి శ్రేయస్సును కూర్చును. ఇతనిచేత మీరు దుర్గమములైన విపత్తులను సుగమముగ దాటగలరు. 19

శ్లో॥ పురానేన వ్రజపతే సాధవో దస్యుపీడితాః ।
అరాజకే రక్ష్యమాణా జిగ్యుర్ధస్యూన్ సమేధితాన్ ॥ 20

తా. వ్రజరాజా! పూర్వము ఈ పృథ్వియందు రాజులేని కాలమున దొంగలు సజ్జనులను కొల్లగొట్టుచు బాధించుచుండిరి. అప్పుడు నీ కుమారుడు వారి బారినుండి సత్పురుషులను రక్షించెను. ఆ సత్పురుషులు దొంగలను కొట్టి, గాయపరిచి వారిని జయించిరి. 20

శ్లో॥ య ఏతస్మిన్ మహాభాగే ప్రీతిం కుర్వంతి మానవాః ।
నారయోఽభిభవంత్యేతాన్ విష్ణుపక్షానివాసురాః ॥ 21

తా. ఈ మహాభాగ్యశాలియగు కృష్ణునియందు ఎవరుప్రేమను భక్తిని కలిగియుందురో అట్టి మానవులకు-విష్ణుపక్షమున నున్న దేవతలను జయింపజాలని రాక్షసులవలె-ఏ శత్రువులును జయింపజాలరు. 21

టీ:- ప్రాక్ శ్రుతమేవ గర్గాచార్య వాక్యం తచ్చరిత్ర పరిశీలనేన నివృత్తా సంభావనస్య నందస్య కృష్ణతత్త్వావబోధకం జాతం. స ఇదానీం తేనైవ వాక్యేన గోపానుపదిశతి-శ్రూయతామితి. (15-21)

టీ:- పూర్వముగర్గాచార్యునిమాటవినియేయున్నారు. అతని చరిత్ర పరిశీలించిన మీదట నివారింపబడిన కృష్ణుని అసంభావ్య లీలలుగల నందునకు, కృష్ణునితత్త్వమును గూర్చి అవగాహనకలిగినది. అతడు ఇపుడు అదే మాటను గోపాలురకు ఉపదేశించుచున్నాడు. "శ్రూయతాం" అని (15-21)

శ్లో॥ తస్మాన్నందకుమారోఽయం నారాయణ సమో గుణైః ।
శ్రియా కీర్త్యానుభావేన తత్కర్మసు న విస్మయః ॥ 22

తా. అందువలన నందుని కుమారుడైన ఈ కృష్ణుడు, సంపదచేత కీర్తిచేతను, ప్రభావముచేతను, గుణములచేతను నారాయణునితో సమానమైనవాడు. ఆశ్చర్యములేనివాడు. ఆ కర్మలయందును అతనితో సమానుడే. 22

టీ:- తస్మాదితి. తస్మాత్తస్య కర్మసువిస్మయో నాస్తీతి నందస్యోక్తిః. 22

టీ:- ఆందువలన అతనిపనుల యందు ఆశ్చర్యములేదని నందుని వాక్యము. 22

శ్లో॥ ఇత్యద్ధామాం సమాదిశ్య గర్గేచ స్వగృహం గతే ।
మన్యే నారాయణస్యాంశం కృష్ణమక్లిష్టకారిణమ్ ॥ 23

తా. సాక్షాత్తుగ గర్గాచార్యుడు ఇట్లు నన్ను ఆదేశించి తన నివాసమునకు వెడలిపోయిన పిదప ఇక నేను సుఖకారకుడగు కృష్ణుని నారాయణుని అంశగ భావింపసాగితిని. 23

శ్లో॥ ఇతి నందవచశ్రుత్వా గర్గ గీతం వ్రజౌకసః ।
ముదితానందమానర్చుః కృష్ణం చ గతవిస్మయాః ॥ 24

తా. ఇట్లు గర్గవాక్యమును నందుడు చెప్పగ విని వ్రజవాసులు మిక్కిలి ఆనందించి నందుని మరియు కృష్ణుని ప్రశంసించి తమ ఆశ్చర్యమును పోగొట్టుకొనిరి. 24

టీ:- ఇతీతి. ఇత్యద్ధా సాక్షాత్. మాం ప్రతి సమాదిశ్య గర్గే స్వగృహం గతే సతి తదానీం తథా అమన్యమానోఽపి. ఇదానీం. కృష్ణం నారాయణ స్యాంశం మన్యే అత్ర హేతుః. అక్లిష్టకారిణమితి. (23-24)

టీ:- ఇత్యద్ధా-సాక్షాత్తుగ నన్ను ఉద్దేశించి, ఆదేశించి గర్గుడు తన గృహమునకు పోయిన తర్వాత అప్పుడు అట్లు తలచుకొన్నను ఇప్పుడు కృష్ణుని నారాయణుని అంశగా తలచితిని. ఇచట దానికి కారణము "ఆక్లిష్టకారిణం" అని (23-24)

శ్లో॥ దేవే వర్షతి యజ్ఞ విప్లవరుషా వజ్రాశ్మవర్షానిలైః
సీదద్బాలపశుస్త్రి చాత్మశరణం దృష్ట్వానుకంప్యుత్ స్మయన్ ।
ఉత్పాట్యైక కరేణ శైలమబలో లీలోచ్ఛిలీంధ్రం యథా
బిభ్రద్గోష్ఠమపాన్మహేంద్రభిత్ప్రీయాన్న ఇంద్రోగవామ్ ॥ 25

తా. తన కొఱకైన యజ్ఞము భగ్నమగుట వలన కోపముతో ఇంద్రుడు - పిడుగులు, వడగండ్లు, వర్షములు, పెనుగాలులు మున్నగు వానితో బాలురను, పశువులను, స్త్రీలను పీడింపుచుండగ వారు తనను శరణువేడుటచూచి కృష్ణుడు వారిపై జాలిచెంది, ఉత్సహించి, ఒకచేతితో లీలగా పుట్టగొడుగునెత్తినట్లు గోవర్ధనగిరిని పెకలించి పైకెత్తి పట్టుకొనుచు వ్రజమునంతనురక్షించెను. ఇంద్రుని గర్వమును అణిచిన వాడును, స్వయముగ ఇంద్రుడును, (ఇదంతిఇతి ఇంద్రః-పరమైశ్వర్య యుక్తుడు) అయిన కృష్ణుడు (గవాంఇంద్రః-భూమికి ప్రభువు) అయిన కృష్ణుడు మాయందు ప్రియత్వమును కలిగిఉండుగాక. 25

టీ:- గోవర్ధనోద్ధరణం సపరికరమనుస్మరన్. ప్రకటితైశ్వర్యస్య కృష్ణస్య ప్రీతిం ప్రార్థయతే. దేవ ఇతి. యజ్ఞవిప్లవనేన యా రుట్. తయా దేవేంద్రే వర్షతి సతి. వజ్రాశ్మ వర్షానిలైరశనిజలశర్కరాతివృష్టివాయుభిః సీదద్బాల పశుస్త్రీసీదంతః. బాలాః పశవః స్త్రియశ్చ. యస్మిన్ తత్తథా. ఆత్మా స్వయమేవ శరణం యస్య తద్గోష్ఠం దృష్ట్వానుకంపీ ఉత్స్మయన్ హసన్. ప్రౌఢిమావిష్కుర్వన్. సశైలముత్పాట్య అబలః బాలః లీలార్థ ముచ్ఛిలీంధ్రం యథా. ఏకేన కరేణ. బిభ్రత్. దధత్ యః గోష్ఠమపాత్ పాలితవాన్. ఏవం మహేంద్ర మదభిత్ గవామింద్ర ఇతి ఉత్తరాధ్యాయార్థం చ స్మరతి. ఏవంభూతః శ్రీకృష్ణః నః ప్రేయాత్ ప్రియతామితి.

శ్లో॥ షడ్వింశే దశమే వ్యక్తః షడ్వింశో దశమో హరిః ।
వ్యనక్తు పంచవింశమ్మాం చతుర్వింశతితః పృథక్ ॥

శ్రీధరీయోఽయం శ్లోకః. అస్యార్థః. దశమస్కంధే. షడ్వింశతితమాధ్యాయే షడ్వింశతితత్త్వాత్మకః దశలక్షణలక్షితః హరిః. చతుర్వింశతితత్త్వాపేక్షయా పృథక్ జీవసంజ్ఞంమాం వ్యనక్తు. (25)

**శ్రీ మద్భాగవతే, మహాపురాణే దశమస్కంధే,**
**షడ్వింశోఽధ్యాయః**

టీ:- గోవర్ధనోద్ధరణమునకు సంబంధించిన విశేషములను గూర్చి స్మరించుచు ప్రకటింపబడిన ఐశ్వర్యముగల కృష్ణునియొక్క ప్రేమను ప్రార్థించుచున్నాడు-యజ్ఞము భంగమగుటవలన ఏ కోపము కలిగినదో దానితో దేవేంద్రుడు వర్షింపచేయగా- అటఊళ్లు, వాననీళ్లు, పెనుగాలులతో, పిడుగులతో బాలురను, పశువులను, స్త్రీలను పీడించుచున్నవాడై తననే శరణుపొందిన వ్రజమునుచూచి దయగల వాడై-ఉత్స్మయన్-నవ్వుచు, ప్రౌఢిమను-ప్రకటించుచు, ఆ కొండను పెకిలించి బాలుడు(కృష్ణుడు)క్రీడార్థమైన పుట్టగొడుగునువలె-ఒక చేతితో -భరించుచు-ఎవడు-గోష్ఠః-అపాః-వ్రజమును కాపాడెనో-ఆ విధముగ మహేంద్రునిగర్వమును అణచినవాడయ్యెనో-"గవాంఇంద్రః" అని రాబోవు అధ్యాయమునందలి అర్థమునుకూడ స్మరించుచున్నాడు. ఇట్టి వాడైన శ్రీకృష్ణుడు సః ప్రేయాత్-మా వలన ప్రీతినొందుగాక. "పదియవస్కంధమునందలి ఈఇరువదిఆఱవ అధ్యాయమున ఇరువదిఆఱు తత్త్వములతో కూడినవాడు పది లక్షణములతో చూడబడువాడును అయిన విష్ణుభగవానుడు ఇరువది నాలుగు తత్త్వములతోడి పోలికచేత-విడిగ-జీవసంజ్ఞగల నన్ను ప్రకటము చేయునుగాక" ఇది శ్రీధరీయ శ్లోకమునందలి భావము. (25)

**అని శ్రీమద్భాగవతమున దశమస్కంధమందు**
**ఇరువది ఆరవ అధ్యాయము సమాప్తము.**

## సప్తవింశోఽధ్యాయః

**శ్రీశుక ఉవాచ**

శ్లో॥ గోవర్ధనే ధృతే శైల ఆసారాద్రక్షితే వ్రజే ।
గోలోకాదావ్రజత్ కృష్ణం సురభిశ్శక్ర ఏవ చ ॥ 1

టీ:– "సప్తవింశే తదాలక్ష్య కృష్ణస్య ప్రాభవం పరమ్, వర్ణ్యతే సురభీంద్రాభ్యామభిషేకమహోత్సవః". గోవర్ధన ఇతి. గోవర్ధనే ధృతే శైల శక్రస్య భయే నాగమనే హేతుః. ఆసారాద్రక్షితే వ్రజ ఇతి సురభేర్హర్షేణా గమనం. 1

శ్లో॥ వివిక్త ఉపసంగమ్య వ్రీడితః కృతహేళనః ।
సస్పర్శ పాదయుగళం కిరీటేనార్క వర్చసా ॥ 2

## 27వ అధ్యాయము

**శ్రీశుకుడిట్లనెను.**

తా. కృష్ణుడు గోవర్ధనగిరిని ధరించి వర్షపాతమునుండి వ్రజమును రక్షించిన పిమ్మట స్వర్గలోకమునుండి కామధేనువు, ఇంద్రుడును కృష్ణుని వద్దకు వచ్చిరి. 1

టీ:– ఈ ఇరువది ఏడవ అధ్యాయమున కృష్ణుని అతిశయించిన ప్రాభవమునుఉపలక్షించి, కామధేనువు,ఇంద్రుడునుకృష్ణభగవానునకు చేసిన అభిషేక మహోత్సవము వర్ణింపబడినది. (ఇది శ్రీధరీయశ్లోక భావము) "గోవర్ధనేధృతేశైలే" అని ఇంద్రుడు భయముతో వచ్చుటకు కారణము. "ఆసారాద్రక్షితేవ్రజే" అని కామధేనువుయొక్క హర్షముతో రాక. (ఇంద్రుడు కృష్ణుని భయమువలన, సురభి అతనిని అభినందించుటకును వచ్చిరి అని అభిప్రాయము) 1

తా. గతమున కృష్ణుని హేళనచేసియున్న ఇంద్రుడు ఏకాంతప్రదేశమున, సిగ్గుపడినవాడై కృష్ణుని సమీపించి, సూర్యప్రకాశముతో మెరయుచున్న తన కిరీటమును వంచి భగవానును చరణ ద్వంద్వమును స్పృశించెను. 2

టీ:- తత్రేంద్ర ఆగత్య కిం కృతవాంస్తదాహ-వివిక్త ఇత్యాదినా. అథాహ సురభిరిత్యతః ప్రాక్తనేన గ్రంథేన. వివిక్తఇతి. వివిక్తఏకాంతే. పాదయోః సస్పర్శ నమశ్చకార. 2

శ్లో॥ దృష్టశ్రుతానుభానోఽస్యకృష్ణ స్యామిత తేజసః ।
నష్టత్రిలోకేశ మద ఇదమాహ కృతాంజలిః ॥ 3

టీ:- దృష్టేతి. అస్య శ్రీకృష్ణస్య శ్రుతశ్చాసావనుభావశ్చ శ్రుతానుభావః దృష్టః శ్రుతానుభావో యేన. స ఇంద్రః నష్టః త్రిలోకేశోఽహమితి మదో యస్య సః. 3

ఇంద్ర ఉవాచ

శ్లో॥ విశుద్ధసత్వం తవ ధామ శాంతం
తపోమయం ధ్వస్తరజస్తమస్కమ్ ।
మాయామయోఽయం గుణసంప్రవాహో
సవిద్యతే తేఽగ్రహణానుబంధః ॥ 4

టీ:- వివిక్తే-ఏకాంతమునందు-అచటికి ఇంద్రుడువచ్చి ఏమిచేసెనో దానిని చెప్పుచున్నాడు. 'వివిక్తే' మొగలగు శ్లోకముతో-కామధేనువు వచ్చినట్లు ముందే చెప్పియుండెను. పాదయోః సస్పర్శ-నమస్కారము చేసెను. 2

తా. అమితమైన తేజస్సుగల కృష్ణుని ప్రభావమును చూచియు, వినియు ఉన్న ఇంద్రుడు, 'తాను ఈ మూడులోకములకు ప్రభువును' అను గర్వము నశించినవాడై, అంజలిఘటించి ఇట్లనెను. 3

టీ:- ఈ కృష్ణునియొక్క-వినిన ప్రభావము గలవాడు శ్రుతానుభావుడు -చూచిన, వినిన ప్రభావము ఎవనికో అట్టి ఇంద్రుడు- స్పష్టమైన 'నేను త్రిలోకేశుడను' అను భావము ఎవనికో వాడు (ఇంద్రుడు) 3

ఇంద్రుడిట్లనెను.

తా. భగవాన్! నీ స్వరూపము శాంతమైనది. జ్ఞానమయమైనది. రజోగుణ, తమోగుణ రహితమైనది. శుద్ధసత్త్వగుణ పూర్ణమైనది. గుణత్రయముతో ప్రవాహరూపమైన ఈ జగత్తు మాయతో కూడినది. నీకు ఇది లేదు. అజ్ఞానమునకు సంబంధించినది. దృశ్యజగత్తు ఈశ్వర పక్షముగ లేదు. అజ్ఞానపక్షముగ ఉన్నది. 4

టీ:- తత్ర మమాపరాధం క్షమస్వేతి వక్తుం తవ తావదపరాధో నాస్త్యేవ త్వయానుగ్రహ ఏవ కృత ఇత్యాహ-చతుర్భిః విశుద్ధసత్త్వమితి. ధామ స్వరూపం శాంతం ఏకరూపం అతశ్చ తపోమయం ప్రచురజ్ఞానం సర్వజ్ఞమిత్యర్థః. కుతః ధ్వస్తరజస్తమస్కం ధ్వస్తే అవిద్యమానే రజస్తమసీ యస్మిన్. అత ఏవాయం అస్మదాదిషు దృశ్యమానః. మాయాకార్యరూపః గుణసంప్రవాహః గుణైః సంప్రోహ్యత ఇతి తథా సంసార ఇత్యర్థః స తే తవ న విద్యతే యతః. అగ్రహణేనాజ్ఞానేనానుబధ్యత ఇతి తథా. సః సర్వజ్ఞస్య తే నాస్తీత్యర్థః. అజ్ఞానసంబంధో వా. 4

టీ:- నా అపరాధము క్షమింపుము అని చెప్పుటకు-నీ అపరాధమేమి యులేదు-నీచే అనుగ్రహమే చూపబడినది అని చెప్పుచున్నాడు నాలుగు శ్లోకములతో-'విశుద్ధసత్త్వం' అని-ధామ-స్వరూపము-శాంతం-ఏక రూపము-అందులకే తపోమయం-ప్రచురమైన జ్ఞానముగలది - సర్వజ్ఞము అని యర్థము. ఎందువలన? ధ్వస్త రజస్తమస్కం-ధ్వస్తే- అవిద్యమానములైన(లేని) రజోగుణము, తమోగుణము దేనియందో అది. అందువలననే-అయం-మనయందు దృశ్యరూపముగనున్న దంతయును మాయా కార్యరూపమైనది-గుణసంప్రవాహః-గుణైః- గుణములచేత ప్రవహించుచుండునది కావున అటుల చెప్పబడినది. సంసారమని అర్థము. న తే - నీకులేదు - అందువలన - అగ్రహణేన- అజ్ఞానముచేత - అనుబధ్యత - సంబంధించినది కావున అట్లు చెప్పబడినది. ఆ ప్రపంచము సర్వజ్ఞుడవగు నీకులేదని అర్థము. లేక అజ్ఞాన బంధము నీకు లేదు. 4

శ్లో॥ కుతోనుతద్ధే తవ ఈశతత్కృతా
లోభాదయో యేఽబుధలింగభావాః ।
అథాపి దండం భగవాన్ బిభర్తి
ధర్మస్య గుప్త్యై ఖలనిగ్రహాయ ॥ 5

తా. ఈశ్వరా! అజ్ఞానమే లేదనినచో దాని కారణములగు దేహాదులు, వానివలన కలుగు అవివేకలక్షణములగు లోభము మొదలగు భావములు నీకెక్కడివి? అయినను భగవానుడు అవతారములెత్తి ధర్మ రక్షణకొరకు దుష్టశిక్షణకొరకు పరిపాలన దండమును ధరించును. **5**

టీ:- యదా. అజ్ఞానతత్కృత దేహసంబంధౌ న స్తః. తదా తత్కృతానాం లోభాదీనాం కా వార్తేత్యాహ-కుత ఇతి. తత్కృతాః దేహసంబంధకృతాః తద్ధేతవః. పునరప్యన్యస్య దేహస్య హేతవః. నను జ్ఞానినామపి తే దృశ్యంతే. అత ఆహ-అబుధ లింగభావాః అజ్ఞానినాం గమకాః. యావ ద్రాగాదిమత్త్వం. తావత్ అజ్ఞానిత్వమేవ. జ్ఞానిత్వం న సిద్ధ మిత్యర్థః. లోభాద్యభావేఽపి మన్మానభంగో దండార్థమిత్యాహ-అథాపీతి. 5

టీ:- అజ్ఞానము, అదిచేయు దేహసంబంధములైన పదార్థములులేవు. లేనప్పుడు ఆ దేహాదులు కలిగించు లోభము మొదలగువాని యొక్క కథ ఏమి? అని చెప్పుచున్నాడు. తత్కృతాః - దేహసంబంధముచే చేయబడునవియు - వాని కారణములైనవియు మరియు మరియొక దేహమునకు కారణములు. జ్ఞానులలోకూడా ఇట్టివి కనబడుచున్నవి. అందువలన చెప్పుచున్నాడు. అబుధలింగభావాః-అజ్ఞానుల గమకములు - కదలికలు ఎంతవఱకు రాగద్వేషాది లక్షణము లుండునో అంత వఱకు అజ్ఞానత్వమే - జ్ఞానత్వము సిద్ధింపదని యర్థము. లోభాదులు లేకున్నను నా గౌరవమును భంగము చేయుట అనునది శిక్షించుటకొఱకే అని చెప్పుచున్నాడు. 'అథాపి' అని 5

శ్లో॥ పితా గురుస్త్వం జగతామధీశ్వరో
దురత్యయః కాల ఉపాత్తదండః ।
హితాయ చేచ్ఛాతనుభిస్సమీహసే
మానం విధున్వన్ జగదీశమానినామ్ ॥ 6

తా. నీవు లోకములకు తండ్రివి. గురువువు, నియంతవు, అతిక్రమించుటకు శక్యముకాని కాలస్వరూపుడవు, శాసనరూప దండమును ధరించియున్నావు. నేనే 'జగత్తుకు ఈశ్వరుడను' అను భావనముతో గర్వించు నావంటి వారల అహంకారము నణచుచు, లోకహితము కొఱకు నీకు ఇష్టమైన శరీరములను ధరించి ఆలోచించుచుందువు. 6

టీ:- నను తద్దండే చ మమ గోపపుత్రస్య కా శక్తిః. కిం వా కారణం కో వా దండః మయా కృత ఇత్యత ఆహ- పితేతి. జగతాం త్వం పితా

టీ:- నీ శిక్షచేత 'గోపాలుడను నాకు ఏమి శక్తి ? ఏకారణమున ఈశిక్ష ? శిక్షస్వరూపమేమి ? నేను చేయు ప్రతికారమేమి? -

జనకః గురురుపదేష్టా. అధీశః నియంతా. ఇతి దండధారణే హేతు త్రయం. కాలత్వాత్ సమర్థః తస్మాదుపాత్త దండోలీలావతారైః సమీహసే . తవ సమీహాలీలైవ జగదీశమాని నామ స్మాకం మానధునన మిత్యర్థః. 6

చెప్పుచున్నాడు-జగత్తులకు నీవు తండ్రివి. ఉపదేశించువాడవు. నియంతవు, అని దండ ధారణమునకు మూడు కారణములు. కాలత్వము వలన సమర్థుడవు. అందువలన దండమును ధరించిన వాడవు. లీలావతారముతోలెస్సగా ఆలోచించుదవు'. (యథా సంభవత్వమును నిర్ణయించుచుండెదవు). నీ నిర్ణయ లీలయే 'నేనే జగదీశ్వరుడను' అని భావించు నా వంటి వారి దురభిమానము వమ్ముచేయునది. 6

శ్లో॥ యే మద్విధాజ్ఞా జగదీశమానినస్త్వాం
వీక్ష్య కాలేఽభయమాశు తన్మదమ్ ।
హిత్వార్యమార్గం ప్రభజంత్యపస్మయా
ఈహాఖలానామపి తేఽనుశాసనమ్ ॥ 7

తా. నేనే జగత్తులకు ప్రభువును అని తనను తాను భావించు నావంటి దురభిమానముగల అజ్ఞానులు నిన్నుచూచి తత్కాలముననే భయమును, వెంటనే గర్వమును విడిచి ఆర్యుల భక్తిమార్గమును అనుసరింతురు. గర్వమును సమూలముగ కోల్పోవుదురు. నీ మనో వ్యాపారము దుష్టులను కూడ నియంత్రింపగలది. 7

టీ:- కథమేతదిత్యత ఆహ-యఇతి. మద్విధాశ్చ తే అజ్ఞాశ్చ. అతో జగదీశమానినః, కాలే భయకాలేఽపి. యథా అధునైవాతివృష్టౌ. త్వామభయం భయమగణ యంతం వీక్ష్య. ఆశు తన్మదం జగదీశా వయమితి. మదం హిత్వా. వీతగర్వాస్సంతః ఆర్యమార్గంత్వద్భక్తిలక్షణం ప్రభజంతి. అతస్త ఈహైవ ఖలానాం అనుశాసనం దండ ఇత్యర్థః. 7

టీ:- ఇది యెటులో చెప్పుచున్నాడు. నావంటి అజ్ఞానులు - అందుకే జగదీశ్వరులమని తమను తాము భావించుచున్నారు- కాలే- భయ కాలమునను - ఇప్పుడే కలిగిన అతివృష్టి యట్లు త్వామభయం - భయమును లెక్క చేయని నిన్ను చూచి - వెంటనే ఆ గర్వమును- 'మేముజగదీశులము' అను గర్వమును వదిలి అహంకార రహితులై-

ఆర్యమార్గం – నీ యందలి భక్తియే లక్షణముగ గలవారై మెలంగుదురు. భక్తి లక్షణమును భజింతురు. అందువలన నీ 'భావన' యే ఖలులకు– దుష్టులకు – అనుశాసనం – శిక్ష అని అర్థము. 7

శ్లో॥ సత్త్వం మమైశ్వర్యమదాప్లుతస్య
కృతాగసస్తే విదుషః ప్రభావమ్ ।
క్షంతుం ప్రభోఽథార్హసి మూఢచేతసో
మైవం పునర్భూరసతీశ మేమతిః ॥ 8

తా. పరమేశ్వరా! ఐశ్వర్య గర్వముచే కప్పబడినయున్నవాడను, నీ ప్రభావమును, శక్తిని తెలియజాలని అజ్ఞానిని నీయెడల అపరాధము చేసినవాడను అయిన నాయొక్క తప్పిదమును క్షమింపుము. ప్రభూ! మూఢమనస్కుడనైన నాఅపచారమువున్నింపుము. ఈశ్వరా! ఇట్టి దోష ముమరల జరగకుండగ నామనస్సునుశుద్ధముచేసిఅనుగ్రహింపుము. 8

టీ:– ఏవం భగవద్రూపం అభిప్రాయం చానువర్ణ్య. క్షమాపయతి– సత్త్వమితి–ఏవంభూతా అసతీమతిర్మే పునర్మాభూదితి. ప్రార్థనాంతరం. 8

టీ:– ఇట్లు భగవానుని రూపమును, తన అభిప్రాయమును వర్ణించి క్షమాపణ వేడుచున్నాడు. 'సత్త్వం' అని–ఈ విధమైన అసద్బుద్ధి నాకు మఱల కలుగకుండుగాక అని మఱియొక ప్రార్థన. 8

శ్లో॥ తవావతారోఽయమధోక్షజేహ
భువో భరాణామురుభారజన్మనామ్ ।
చమూపతీ నామభవాయ దేవ
భవాయ యుష్మచ్చరణానువర్తినామ్ ॥ 9

తా. అధోక్షజా! ఈ లోకమునందు నీ అవతారము, సంహారకులగు (అసుర) సేనాపతులతో ఈ ప్రదేశములు నిండిపోయి, అనేకములైన భారపు జన్మలుగలవారి వినాశము కొఱకును, నీ పాదపద్మములనను సరించి జీవించు భక్తుల జన్మముల కొఱకును అయియున్నది. 9

టీ:- మహానయమపరాధః కథం క్షంతవ్య ఇతి చేదత ఆహ-తవేతి. హే అధోక్షజ. ఇహ చమూపతీనాం స్వయమేవ భువోభారాణాం పునశ్చ. ఉరుభార జన్మనాం ఉరూణాం బహూనాం భారాణాం జన్మ యేభ్యస్తే షాం అభవాయనాశాయ. యుష్మచ్చరణ సేవినాం తు భవాయ. ఉద్భవాయ. అతో మమత్వత్సేవకత్వాదత్యంతాపరాధోఽపి క్షంతవ్య ఇతి భావః. 9

టీ:- ఓ అధోక్షజా! ఈ లోకమున స్వయముగనే భూమికి భారముగా నుండు అసురసేనాపతుల యొక్కయు ఉరుభార జన్మనాం - అనేకములైన భారములుగల జన్మలు ఎవరికో వారి - అభవాయ -నాశమునకు- నీ పాదములను సేవించువారల యొక్క - భవాయ - పుట్టుకకొఱకు- అందువలన - నీ సేవచేయుచున్నందు వలన నా మహాపరాధమును కూడా క్షమింపవలయునని భావము. 9

శ్లో॥ నమస్తుభ్యం భగవతే పురుషాయ మహాత్మనే ।
వాసుదేవాయ కృష్ణాయ సాత్త్వతాం పతయే నమః ॥ 10

తా. భగవానుడవు. పురుషుడవు, మహాత్ముడవు, వాసుదేవుడవు, యదువంశీయులకు పతివి, కృష్ణుడవు అయిన నీకు నమస్కారము. 10

టీ:- క్షమాపయన్నమస్కరోతి-నమ ఇతి తుభ్యం భగవతే కృష్ణాయ నమః పురుషాయ సర్వాంతర్యామిణే మహాత్మనే అంతస్థత్వేఽపి అపరిచ్ఛిన్నాయ కుతః వాసుదేవాయ సర్వనివాసాయ సాత్త్వతాం యాదవానాం పతయే నమః. 10

టీ:- క్షమాపణకోరుచు నమస్కరించుచున్నాడు. భగవంతుడవు, కృష్ణుడవు అయిన నీకు నమస్కారము. పురుషునకు నమస్కారము. సర్వాంతర్యామికి, మహాత్మునికి - అంతస్సుననున్నను, పరిచ్ఛేదము లేని వానికి - ఎందువలన? వాసుదేవాయ - సర్వమునందు నివసించు వానికి - సాత్త్వతాం పతయే - యదువులకు పతియైనవానికి నమస్కారము. 10

శ్లో॥ స్వచ్ఛందోపాత్తదేహాయ విశుద్ధజ్ఞానమూర్తయే ।
సర్వస్మై సర్వబీజాయ సర్వభూతాత్మనే నమః ॥ 11

తా. భక్తుల ఇచ్ఛతో స్వీకరించినదేహముగలవానికిస్వచ్ఛమైన జ్ఞానమే మూర్తిగా కలవానికి తన మాయచేత అంతటనున్న వానికి సర్వమునకు కారణమైనవానికి, సర్వప్రాణులతోఆత్మగగలవానికి నమస్కారము. 11

టీ:- తర్హి కిమహం యాదవః తత్రాహ-స్వచ్ఛందేతి. స్వచ్ఛందోపాత్తదేహాయ తేషాం భక్తానాం. ఛందేన ఇచ్ఛయా స్వీకృతదేహాయ. తత్రాపి విశుద్ధం జ్ఞానమేవ మూర్తిర్యస్య తస్మై. స్వస్య మాయయా సర్వస్మై. కుతః. సర్వబీజాయ కారణాయ అత ఏవ సర్వభూతాత్మనే నమ ఇతి. 11

టీ:- అయినచో నేను యాదవుడనా? చెప్పుచున్నాడు. స్వచ్ఛందోపాత్త దేహాయ-ఆ భక్తులయొక్క-ఛందేన-ఇచ్ఛచేత-స్వీకరించిన దేహముగల వానికి-అట్లయినను-విశుద్ధమైన జ్ఞానమే స్వరూపముగా ఎవనికి కలదో అట్టివానికి-తన మాయచేత అంతటికిని, ఎందువలన? సర్వబీజాయ - కారణునకు- అందులకే- సర్వభూతములలో ఆత్మగా కలవానికి నమస్కారము. 11

శ్లో॥ మయేదం భగవన్ గోష్ఠనాశాయాసారవాయుభిః ।
చేష్టితం విహతే యజ్ఞేమానినా తీవ్రమన్యునా ।। 12

తా. భగవన్! నా పేర జరుగు యజ్ఞము భంగమైనపిదప, గర్విష్ఠిని, తీవ్రమైన కోపస్వభావము కలవాడను అయిన నాచేత వ్రజమును నశింపజేయుటకు పెనువానలు, పెనుగాలులచే ఈ భీభత్సము సృష్టింపబడినది. 12

టీ:- కృతాగస ఇత్యనేనోక్తమపరాధం నివేదయతి-మయేతి. ఆసార వాయుభిః గోష్ఠనాశాయ మయేదమకృత్యం విచేష్టితం కృతమితి. 12

టీ:- 'పాపముచేసినవాడను' అనుమాటచేత అపరాధమును నివేదించుచున్నాడు. -పెనువానగాలులచేత గోష్ఠనాశనమునకు నాచేత ఈ అకృత్యము చేయబడినది అని 12

శ్లో॥ త్వయేశానుగృహీతోఽస్మి ధ్వస్తస్తంభో హతోద్యమః ।
ఈశ్వరం గురుమాత్మానం త్వామహం శరణం గతః ॥ 13

తా. ఈశ్వరా! నీచేత అనుగ్రహింపబడినాను, నా గర్వము అణచివేయబడినది. (వ్రజమును నాశనము చేయవలెననెడి) నా ఉద్యమము ధ్వంసము చేయబడినది. ప్రభూ! పతివి, గురువువు, ఆత్మవునైన నిన్ను శరణుపొందినాను. 13

శ్లో॥ ఏవం సంకీర్తితః కృష్ణో మఘోనా భగవానముమ్ ।
మేఘగంభీరయా వాచా ప్రహసన్నిదమబ్రవీత్ ॥ 14

తా. ఈ విధముగా ఇంద్రునిచేత కీర్తింపబడిన కృష్ణుడు, మేఘగంభీర స్వరముతో, నవ్వుతూ అతనితో ఇట్లనెను. 14

టీ:- త్వయేతి. తథాపి. భో ఈశ. త్వయా అనుగృహీతోஉస్మి అనుగ్రహం దర్శయతి - ధ్వస్తస్తంభ ఇతి. హతోద్యమ ఇతి. (13-14)

టీ:- అట్లయినను-ఓఈశ్వరా!నీచేతఅనుగ్రహింపబడినాను. అనుగ్రహమునుచూపుచున్నాడు.'ధ్వస్తస్తంభః'అని,'హతోద్యమః'అని. 13-14

శ్రీభగవానువాచ

శ్లో॥ మయా తేஉకారి మఘవన్ యజ్ఞభంగోஉనుగృహ్ణతా ।
మదనుస్మృతయే నిత్యం మత్తస్యేంద్రశ్రియా భృశమ్ ॥ 15

కృష్ణభగవానుడు ఇట్లనెను.

తా. ఇంద్రదేవా ! నిన్ను అనుగ్రహించుట కొఱకే నీ యజ్ఞము భంగము చేయబడినది. ఇది నిత్యమును నీవు నన్ను స్మరించుట కొఱకే ఇంద్రైశ్వర్యముచే మిక్కిలి మదించియున్న నీకు నన్ను జ్ఞాపకము చేయుకొఱకే. 15

శ్లో॥ మామైశ్వర్యశ్రీమదాంధో దండపాణిం న పశ్యతి ।
తం భ్రంశ యామిసంపద్భ్యోయస్య వాంఛామ్యనుగ్రహమ్ ॥16

తా. ఐశ్వర్యమదముతో గ్రుడ్డివాడై విశ్వ శాసనమంతయును చేతితో గల నన్ను ఎవరు చూడజాలడో అట్టి వాని సంపదలను-వానినను గ్రహింపదలచితినేని-హరించివేయుదును. వానిని సంపదనుండి భ్రష్టుని చేయుదును. 16

టీ:- ఇంద్రేణ స్వాభిప్రాయే నివేదితే భగవానపి యథైవాహ-మయేతి. ఇంద్రశ్రియా దేవరాజ్యేన. (15-16)

టీ:- ఇంద్రుడుతనఅభిప్రాయమునివేదించినపిదపభగవానుడు కూడ అదేచెప్పుచున్నాడు.ఇంద్రశ్రియా-దేవతల సామ్రాజ్యముచేత. 15-16

శ్లో॥ గమ్యతాం శక్రభద్రం వః క్రియతాం మేఽనుశాసనం ।
స్థీయతాం స్వాధికారేషు యుక్తైర్వస్స్తంభవర్జితైః ॥ 17

తా. ఇంద్రా! నా శాసనమునను సరించి వెంలగవలెనని గమనించెదరు గాక. మీకు శుభము కలుగునుగాక, అప్రమత్తులై, అహంకారరహితులై మీ మీ అధికారములలో నుండెదరుగాక. 17

టీ:- గమ్యతామితి. వః యుష్మాభిః. బహువచనం వరుణాద్యభిప్రాయేణ. క్వ గంతవ్యం స్వర్గేఽపితవైవేశ్వరత్వాదితి చేత్తత్రాహ- క్రియాతామితి. మదనుశాసనేన యథా పూర్వం తత్ర స్థీయతామిత్యర్థః యుక్తైరప్రమత్తైః స్తంభవివర్జితైర్నిరహంకారైః. 17

టీ:- వః- మీచేత - వరణుడు మొదలగువాని దృష్టిచేత బహువచనము .ఏది గమనింపదగినది? స్వర్గము మొదలైన మీ లోకములలో కూడా మీదే ప్రభుత్వమనుకొనినట్లయినచో చెప్పుచున్నాడు. 'క్రియతాం' అని నా ఆజ్ఞచేత పూర్వము వలెనే అచట ఉండెదరు గాక అని యుక్తైః - అప్రమత్తులగు మీచేత-స్తంభవివర్జితైః - అహంకారరహితులగు మీచేత-(ఉండబడునుగాక). 17

శ్లో॥ అథాహ సురభి కృష్ణమభినంద్యమనస్వినీ ।
స్వసంతానైరుపాగమ్య గోపరూపిణమీశ్వరమ్ ॥ 18

తా. అటు పిమ్మట సహృదయురాలగు కామధేనువు, తన సంతానములగు ఆవులతో కూడి కృష్ణుని సమీపించి, అతని నభినందించి - గోపాలుని రూపముననున్న ఈశ్వరుని అభినందించి ఇట్లనెను. 18

టీ:- అథేతి. స్వసంతానైర్గోభిస్సహ. 18

టీ:- స్వసంతానైః - ఆవులతోసహా 18

సురభి రువాచ

శ్లో॥ కృష్ణ కృష్ణ మహాయోగిన్ విశ్వాత్మన్ విశ్వభావన ।
భవతా లోకనాథేన సనాథావ యమచ్యుత ॥ 19

టీ:- కృష్ణ కృష్ణేతి కృష్ణ కృష్ణేత్యాదినా సంబోధ్య. ఇంద్రేణ హతా అపి భవతా సనాథాః వయం కృతా రక్షితా ఇత్యర్థః. 19

శ్లో॥ త్వమేవ పరమం దైవం త్వం న ఇంద్రో జగత్పతే ।
భవాయ భవ గో విప్ర దేవానాం యే చ సాధవః ॥ 20

టీ:- త్వమితి. త్వం నః పరమం దైవం దేవతా. అతః హే జగత్పతే. గోవిప్ర దేవానాం. యేఽన్యే చ సాధవస్తేషాం భవాయాభ్యుదయాయ. త్వమేవ ఇంద్రో భవః. 20

కామధేనువు ఇట్లనెను.

తా. ఓ యోగీశ్వరా! కృష్ణా! విశ్వమంతయును ఆత్మరూపమున నున్నవాడా! విశ్వమంతయును భావనగకలవాడా! అవినాశీ! లోకనాథుడవగు నీచేత మేమందఱము ఈశ్వరుడు గలవారమైతిమి. 19

టీ:- కృష్ణ! కృష్ణ! మొదలగువానిచేత సంబోధించి - ఇంద్రునిచేత పీడింపబడియుండినను - మేము నీ చేత సనాథులమైతిమి. (అనాథులము కాక నాథుడుకల వారముగ చేయబడితిమి), రక్షింపబడితిమి అని యర్థము. 19

తా. ఓ జగత్పతీ! నీవే పరమదైవమవు. గోవులకు, బ్రాహ్మణులకు, దేవతలకు, సాధువులైన వారెవరు కలరో వారికిని, మాకందఱకును అభ్యుదయము కలిగించుటకు నీవే ఇంద్రుడవు కమ్ము. 20

టీ:- నీవు మాకు శ్రేష్ఠతముడవైన దేవుడవు. అందువలన ఓ జగన్నాథా! గో బ్రాహ్మణులకు, దేవతలకు- ఇతరులెవరు సాధువులుగ నున్నారోవారికి - భవాయ - అభ్యుదయముకొఱకు నీవే ఇంద్రుడ వగుము. 20

శ్లో॥ ఇంద్రం నస్త్వాభిషేక్ష్యామో బ్రహ్మణాచోదితా వయమ్ ।
అవతీర్ణోఽసి భగవన్ భూమేర్భారాపనుత్తయే ॥ 21

తా. భగవాన్! బ్రహ్మచేత ప్రేరింపబడినవారమై మేము నిన్ను ఇంద్రునిగా అభిషేకింతుము. భూమియొక్క బరువును దించుటకే నీవు అవతరించితివి. 21

టీ:- నను భవతామింద్రోఽస్తీతి చేదత ఆహ-ఇంద్రమితి. అలం పురందరస్యేంద్రతయేత్యర్థః. నను దేవ ఇంద్రోభవ కథమహం భవేయమితి చేదత ఆహ-అవతీర్ణోఽసీతి. 21

టీ:- నీకు ఇంద్రుడొకడున్నాడనినచో చెప్పుచున్నాడు. 'ఇంద్రం' అని అలంపురంధరస్య-ఇంద్రత్వముతో నికచాలును అని అర్థము. ఓ దేవా! నీవే ఇంద్రుడవగుము. నేనెట్లు ఇంద్రుడనగుదును? అని అనినచో చెప్పుచున్నాడు.'అవతరించితివి' అని 21

శ్లో॥ ఏవం కృష్ణముపామంత్ర్య సురభిః పయసాత్మనః ।
జలైరాకాశగంగాయా ఐరావత కరోద్ధృతైః ॥ 22

శ్లో॥ ఇంద్రస్సురర్షిభిస్సాకం చోదితో దేవమాతృభిః ।
అభ్యషించత దాశార్హం గోవింద ఇతి చాభ్యధాత్ ॥ 23

తా. ఈ విధముగా కామధేనువు కృష్ణునకుచెప్పి, తన పాలతోను; ఐరావతము తన తొండముతో తెచ్చిన ఆకాశగంగయొక్క నీటితోను; ఇంద్రుడు, దేవర్షులు, దేవమాతృకలు మున్నగువారితో కూడి వారిచేత ప్రేరేపింపబడినదై కృష్ణునిఅభిషేకించెను. అభిషేకించి అతనిని గోవిందా అని సంబోధించెను. (అని పేరుపెట్టెను) (22-23)

టీ:- ఏవమితి. సురభిరాత్మనః పయసా అభ్యషించత్. ఇంద్రశ్చ ఆకాశగంగాయాః జలైరభ్యషించతేత్యుత్తరేణాన్వయః. ఇంద్ర ఇతి. దేవమాతృభిరదిత్యాదిభిః దేవైర్మాతృభిశ్చేతి వా. గాః పశూన్. గాం స్వర్గం వా. ఇంద్రత్వే. విందతీతి కృత్వా గోవింద ఇత్యభ్యధాత్. నామ కృతవానిత్యర్థః. (22-24)

టీ:- సురభిః-కామధేనువు-ఆత్మనఃపయసా-తన పాలతో-అభిషేకించెను. ఇంద్రుడును ఆకాశగంగనుండి తెచ్చిన నీటితో అభిషేకించెను అని 23వశ్లోకముతో అన్వయము. దేవమాతృభిః-అధితి మొదలగు వారి చేత-దేవతలచేత-తల్లులచేత అనియును వికల్పము. గాః-పశువులను-లేక గాం-స్వర్గమును-ఇంద్రత్వమునుపొందును అను కారణమున(గాం-విందతిఇతి)'గోవింద'అనినామకరణముచేసెను.(22-24)

శ్లో॥ తత్రావగతాస్తుంబురు నారదాదయో
గంధర్వ విద్యాధర సిద్ధ చారణాః ।
జగుర్యశోలోకమలాపహం హరేః
సురాంగనాస్సంననృతుర్ముదాన్వితాః ॥ 24

తా. తుంబురుడు, నారదుడు మొదలగు దేవర్షులు, గంధర్వులు, విద్యాధరులు, సిద్ధులు, చారణులును అచటికి వచ్చిరి. లోకమునందలి పాపమును నశింపచేయగల కృష్ణుని కీర్తిని గానముచేసిరి. దేవతాస్త్రీలు ఆనందముతోకూడి చక్కగా నాట్యముచేసిరి. 24

శ్లో॥ తం తుష్టువుర్దేవ నికాయ కేతవో
హ్యావాకిరం శ్చాద్భుత పుష్పవృష్టిభిః ।
లోకాః పరాం నిర్వృతిమాప్నువంస్త్రయో
గావస్తదా గామనయన్ పయోవృతామ్ ॥ 25

తా. దేవతల సమూహములలో ముఖ్యులు కృష్ణుని స్తుతించిరి. అద్భుతములైన పూలవానలు కురిపింపజేసిరి. ముల్లోకములు మిక్కిలి ఆనందము నొందెను. అప్పుడు ఆవులు తమ పాలతో భూమిని తడిపినవి. 25

టీ:- తమితి. దేవ నికాయేషు కేతవ ఇవ దర్శనీయాః ముఖ్యాః ఇత్యర్థః గావః గాం పృథివీం. పయోభిర్వృతామార్ద్రామనయన్ అకుర్వన్నిత్యర్థః 25

టీ:- దేవ నికాయేషు - దేవతల సమూహములయందు - కేతవ ఇవదర్శనీయా - పతాకములవలె చూడదగినవారు - ముఖ్యులని యర్థము. గావః-గోవులు-గాం-భూమిని-పాలతో ఆవరింపజేయ బడినన దానినిగ-ఆర్ద్రామనయన్-తడిసిన దానిగ చేసెనని యర్థము. 25

శ్లో॥ నానా రసౌఘాస్సరితో వృక్షా ఆసన్ మధుస్రవాః ।
అకృష్ట పచ్యౌషధయో గిరియోఽబిభ్రదున్మణీన్ ॥ 26

తా. నదులు, వివిధ రుచులుగల నీటి ప్రవాహములు కలవి అయ్యెను. చెట్లు తేనెల స్రవించుచున్నవి అయ్యెను. మొక్కలు శ్రమింప కుండగనే ఫలించినవి అయ్యెను. పర్వతములు తమ లోపల మణులను ధరించినవి అయ్యెను. 26

టీ:- నానేతి. నానారసౌఘాః క్షీరాది వాహిన్యః అకృష్టపచ్యాః కర్షణం వినైన పక్వా ఓషధయో వ్రీహ్యాదయ ఆసన్. యద్వా అకృష్టపచ్యా ఓషధయో యేషు తే. గిరయః. ఉన్మణీన్ గర్భగతాన్ ఉత్ ఉద్గతాన్. బహిః ప్రకటానబిభ్రదబిభరుః. 26

టీ:- నానారసౌఘాః-పాలు మొదలైనవానినదులు-అకృష్టపచ్యాః-దున్నుట లేకున్నను మొక్కలు ఫలించెను, ధాన్యాదులు గలవి యయ్యెను. లేక-కృషిచేయకయే ఫలించిన మొక్కలు వేనియందుగలవో-అట్టి పర్వతములు-ఉన్మణీన్-వానిగర్భమునందుగల-ఉత్-పైకితేలి నట్టి-బయటకు ప్రకటమైనవానిని-అబిభ్రత్-ధరించెను. 26

శ్లో॥ కృష్ణేఽభిషిక్త ఏతానిసర్వాణి కురునందన ।
నిర్వైరాణ్యభవంస్తాత క్రూరాణ్యపి నిసర్గతః ॥ 27

తా. పరీక్షిద్రాజా! కృష్ణుడిట్లు అభిషేకింపబడిన పిదప ఇచటి ఈ జంతువులన్నియు సహజముగ పరస్పర శత్రువులే అయినను-వైరము లేనివయ్యెను. నాయనా! అవి పరస్పర మిత్రములయ్యెను. 27

శ్లో॥ ఇతి గో గోకులపతిం గోవిందమభిషిచ్య సః ।
అనుజ్ఞాతో యయౌ శక్రోవృతో దేవాదిభిర్దివమ్ ॥ 28

తా. ఈ విధముగ ఇంద్రుడు, గోవులకును, గోకులమునకును పతియగు కృష్ణుని అభిషేకించి, సెలవుగైకొని దేవతలు మున్నగువానితో కలసి స్వర్గలోకమునకు పోయెను. 28

టీ:- శ్లో॥ ఇంద్రస్త్వమసి దేవానాం త్వం గవా మింద్రతాం గతః ।
గోవింద ఇతి లోకే త్వాంగాస్యంతి భువి మానవాః ॥
(శ్రీధరీయం శ్లోకః.) (27,28)

**శ్రీ మద్భాగవతే, మహాపురాణే దశమస్కంధే,**
**సప్తవింశోఽధ్యాయః**

టీ:- 'దేవతలకు నీవే ఇంద్రుడవు. గోవులకు కూడ ఇంద్రత్వమును పొందితివి. అందుచే నిన్ను 'గోవిందుడు' అని ఈ భూమియందలి మానవులు కీర్తింతురు'. (ఇది శ్రీధరీయశ్లోకభావము). (27,28)

**అని శ్రీమద్భాగవతమున దశమస్కంధమందు**
**ఇరువది ఏడవ అధ్యాయము సమాప్తము.**

## అష్టావింశోऽధ్యాయః

### శ్రీ శుక ఉవాచ

శ్లో॥ ఏకాదశ్యాం నిరాహారస్సమభ్యర్చ్యజనార్దనం ।
స్నాతుం నందస్తు కాళింద్యాం ద్వాదశ్యాం జలమావిశత్ ॥ 1

శ్లో॥ తం గృహీత్వాయద్దూతో వరుణస్యాసురోऽంతికం ।
అవిజ్ఞాయాం సురీం వేళాం ప్రవిష్టముదకం నిశి ॥ 2

టీ:- "అష్టావింశే తతో నందానయనం వరుణాలయాత్, వైకుంఠ దర్శనం చాపి గోపానామనువర్ణ్యతే. గోవర్ధనం సముద్ధృత్య వశే కృత్వామ రేశ్వరం. నందానయనతః కృష్ణో వరుణం చ వశేనయత్" ఏకాదశ్యానితి. కళామాత్రాయాం ద్వాదశ్యాం పారణాదరాభినివేశే నాసురీం వేళామవిజ్ఞాయ అరుణోదయాత్పూ ర్వమేవ శాస్త్రబలేన నిశి ఉదకం ప్రవిష్టం తదనభిజ్ఞో వరుణస్యభృత్యోऽన యదితి, తథా చ శాస్త్రం. శ్లో. కళార్ధాం ద్వాదశీం దృష్ట్వా నిశీథాదూర్ధ్వమేవ హి, ఆమధ్యాహ్నః క్రియాస్సర్వాః కర్తవ్యాశ్శంభుశాసనాదితి. వక్ష్యతి చ వరుణః. శ్లో. 'అజానతామామకేనేతి' తి. భగవద్ధర్మమజానతేత్యర్థః. (1-2)

## 28వ అధ్యాయము

### శ్రీశుకుడు పలుకుచున్నాడు

తా. ఏకాదశితిథినాడు ఉపవసించి విష్ణుదేవుని పూజించి నందుడు ద్వాదశినాడు స్నానమాచరించుటకు యమునా నదీజలములలో ప్రవేశించెను. 1

తా. రాక్షసవేళ అని తెలియక రాత్రివేళ నీటిలో ప్రవేశించిన నందుని, తీసుకొని వరుణిని భృత్యుడగు అసురుడు దూరముగ, వరుణుని దాపునకు పోయెను. 2

టీ:- (ఏ) నూటనలుబది ఔప్పపాట్ల కాలము మాత్రమేకల ద్వాదశితిథి యందు, దానిని పారణచేయుట యందలి పట్టుదలచేత, అది రాక్షసవేళ యని తెలియక, అరుణోదయమున కంటె ముందే- శాస్త్రబలముచేత- రాత్రి యందే నీటిలో ప్రవేశించుటకు పూనుకొనిన నందుని, వరుణిని భృత్యుడుగు అసురుడు తీసికొని పోయెను. "ఇరువదియెనిమిదవ అధ్యాయమున వరుణ లోకమునుండి నందుని తోడ్కొని వచ్చుట, గోపాలురకు వైకుంఠ దర్శనము చేయించుట వర్ణింపబడును. గోవర్ధన గిరి నెత్తి,ఇంద్రుని వశీభూతుని చేసుకొని, నందుని తోడ్కొని వచ్చుటతో కృష్ణుడు వరుణుని కూడ తన వశమునకు దెచ్చుకొనెను".(ఈ భావము శ్రీధరీయశ్లోకములకు సంబంధించినది) (శాస్త్రబలముచేత అని

శ్లో॥ చుక్రుశుస్తమపశ్యంతః కృష్ణరామేతి గోపికాః ।
భగవాంస్తదుపశ్రుత్య పితరం వరుణా హృతం ।
తదంతికం గతో రాజన్ స్వానామభయదోవిభుః ॥ 3

టీ:- చుక్రుశురితి. స్వానాం భగవద్ధర్మపరాణాం. అభయదః మాభైష్టే త్యభయం దదత్. 3

**శ్రీకృష్ణమూర్తేర్వరుణ లోకగమనమ్.**

శ్లో॥ ప్రాప్తం వీక్ష్య హృషీకేశం లోకపాలస్సపర్యయా ।
మహత్యా పూజయిత్వాహ తద్దర్శన మహోత్సవః ॥ 4

చెప్పబడిన దానికి శ్రీధరులు చూపిన ప్రమాణము-శాస్త్రము అటులే చెప్పుచున్నది "ద్వాదశీతిథిరాత్రి (రెండవ యామము దాటిన తరువాత) ముప్పది క్షణముల మాత్రమైనను ఉండుటను గమనించి నచో, మధ్యాహ్న పర్యంతముగా గల క్రియలన్నింటిని చేయవలయును అనెడు శంభుని శాసనమువలన"అని."నాకు సంబం ధించినవానికి తెలియక పోవుట వలన"అని వరుణుడుకూడ చెప్పుచు, భగవద్ధర్మము తెలియని కారణమున అని అర్థము. (1-2)

తా. నందుని కాననివారై గోపికలు కృష్ణా! బలరామా! అని బిగ్గరగా అరచుచు విలపింపసాగిరి. భగవానుడగు కృష్ణుడు, తన తండ్రియగు నందుడు వరుణునిచేత కొనపోబడెననివిని, రాజా! వారి సమీపమునకుబోయి, ప్రభువైన గోవిందుడు తన వారలందరికి అభయమిచ్చెను. 3

టీ:- స్వానాం-భగవద్ధర్మమునాశ్రయించియుండువారికి- అభయదః -'భయపడకుడు' అని అభయమిచ్చెను. 3

తా, కృష్ణుని రాక చూచి లోకపాలుడైన వరుణుడు, భగవానుని దర్శించుట వలన మిక్కిలి ఉప్పొంగినవాడై, గొప్ప ఆదరణ భావముతో పూజించి. 4

టీ:- ప్రాప్తమితి. సపర్యయా అర్చణేన. 4

టీ:- సపర్యయా - పూజతో (పూజ్యభావముతో) 4

**వరుణ ఉవాచ**

శ్లో॥ అద్య మే నిభృతో దేహోఽద్యార్థోఽధిగతో మయా ।
త్వత్పాదభాజో భగవన్నవాపుః పారమధ్వనః ॥ 5

**వరుణుడు ఇట్లనెను**

తా. భగవాన్! ఈ వేళనే నాచేత ఈ దేహము ధరింపబడినది. (ఈనాడే నా ఉనికి సార్థకమైనది) ఈ వేళనే నాచేత ప్రయోజనము పొందబడినది. (నేడే నా ఉనికి అర్థవంతమైనది) ఈ వేళనే నీ పాదములను భావించుస్థితిని ప్రాప్తించితిని. ఈ వేళనే నా జీవన మార్గమునకు అంతిమలక్ష్యమును చూడగలిగితిని. 5

టీ:- అద్యేతి. అద్యేదానీం. మే మయా. దేవో నిభృతః ధృతః యదా త్వద్దర్శనం జాతం. తదైవ దేహసాఫల్యం ప్రాప్తమిత్యర్థః. యద్వా. నిభృతః పూర్ణమనోరథ ఇత్యర్థః. కించ. అద్యైవార్థోఽధిగతః. సర్వరత్నాకరపతినాపి ఇతః పూర్వం నైవంవిధోఽర్థః ప్రాప్త ఇత్యర్థ. కించ. సంసారోఽపి నివృత్త ఏవేత్యాశయేనాహ-త్వత్పాదభాజ ఇతి. అధ్వనః పారం మోక్షం. 5

టీ:- అద్య-ఇప్పుడు-మే-నాచేత-దేహఃనిభృతః-శరీరము ధరింపబడినది. ఎప్పుడు నీ దర్శనము కలిగినదో అప్పుడే ఈ దేహము యొక్క సాఫల్యము కలిగినదని యర్థము. లేక నిభృతః-పూర్తియైన కోరిక గలవాడనైతినని యర్థము. (కోరిక తీరినవాడను-అని) మరియు అద్యఏవ అర్థః అధిగతః-సముద్రములన్నింటికి పతినైన నాచేత-ఇంతకుముందు-ఈ విధమైన "అర్థము" పొందబడలేదు. ఇంకను సంసారముకూడా నివృత్తమైనది అను ఆశయముతో చెప్పుచున్నాడు-"త్వత్పాదభాజః" అని అధ్వనఃపారం-మార్గముయొక్క గమ్యస్థానము-మోక్షము. 5

శ్లో॥ నమస్తుభ్యం భగవతే బ్రహ్మణే పరమాత్మనే ।
న యత్ర శ్రూయతే మాయా లోకసృష్టివికల్పనా ॥ 6

తా. ఎచ్చట మాయ అనునది వినబడదో, ఎచ్చట దృశ్యప్రపంచమునకు సంబంధించిన నానాత్వము కనబడదో అట్టి పరమాత్మవు, బ్రహ్మవు షడ్గుణైశ్వర్య సంపన్నుడవు అయిన నీకు నమస్కారము. 6

టీ:- నమ ఇతి. భగవతే నిరతిశయైశ్వర్యాయ. బ్రహ్మణే పూర్ణాయ పరమాత్మనే సర్వజీవనియంత్రే. తత్ర హేతుః - న యత్రేతి. లోకసృష్టిం వికల్పయతి - యా మాయా సా. యత్ర న శ్రూయతే. అవిద్యమానేన తిష్ఠతీత్యర్థః. 6

టీ:- భగవతే-నిరతిశయమైన ఐశ్వర్యముకలవానికి, బ్రాహ్మణే- పరిపూర్ణునకు, పరమాత్మనే-జీవులన్నింటిని నియమించు వానికి- దానికి కారణము. "నయత్ర" అని లోకసృష్టిం వికల్పయతి- ఏ మాయ గలదో అది ఎచ్చట వినిపింపదో-తెలియరాకుండ ఉండునని అర్థము. 6

శ్లో॥ అజానతా మామకేన త్వత్ప్రభావం జగద్గురో ।
ఆహృతో౽యం తవ పితా తత్ప్రభో క్షంతుమర్హసి ॥ 7

తా. ఓ జగద్గురూ! ప్రభూ! నీ ప్రభావము నెఱుంగని నా సేవకునిచేత నీ తండ్రియగు నందుడు అపహరింపబడినాడు. ఈ తప్పిదమును క్షమింపుము. 7

టీ:- అజానతేతి. అజానతా మద్భృత్యేన. త్వత్పిత్రాహరణం యత్కృతం తదితి. 7

టీ:- అజానతా-"తెలియని" నా సేవకునిచేత నీ తండ్రిని అపహరించుట ఏది కలదో దానికి క్షమింపుము. 7

శ్లో॥ పితైషతే య ఆనీతో యన్నస్త్వత్పాదదర్శనమ్ ।
గోవింద నియతా మేవ పితా తే మామకాహృతః ।
ప్రజావయమనుగ్రాహ్యాస్సాపరాధా అపి ప్రభో ॥ 8

తా. గోవిందా! మాచే కొనిరాబడిన మీతండ్రి ఇతడే, అతనివలననే మాకు నీ పాదముల దర్శనమైనది. మాచే అపహరింపబడిన మీతండ్రిగారిని తీసుకొనిపొండు. మేము మీ ప్రజలము, అపరాధులమైనను క్షమింపదగినవారము ప్రభూ! 8

**శ్రీ శుక ఉవాచ**

శ్లో॥ ఏవం ప్రసాదితః కృష్ణ భగవానఖిలేశ్వరః ।
ఆదాయగాత్స్వపితరం బంధూనాం చావహన్ముదమ్ ॥ 9

**శ్రీశుకుడిట్లనెను**

తా. ఇట్లు వరుణునిచే సంతోషింపచేయబడిన కృష్ణుడు, అఖిలమునకు ప్రభువైనవాడు తన తండ్రిని వెంటనిడుకొని వ్రజమునకు వచ్చెను. బంధువులలో హర్షమావహించెను. 9

శ్లో॥ నంద స్త్వతీంద్రియం దృష్ట్వా లోకపాలమహోదయం ।
కృష్ణేచ సన్నతిం తేషాం జ్ఞాతిభ్యో విస్మితోఽబ్రవీత్ ॥ 10

తా. నందుడు, లోకపాలుడైన వరుణమహోదయుని ఇంద్రియాతీతమైన వైభవమును, కృష్ణభగవానునియెడ అచ్చటివారికి గల మిక్కిలి వినయభావమును చూచి, ఆశ్చర్యమునొంది తన బంధువులతో నిట్లనెను. 10

టీ:- నందం విముచ్య సమర్పయతి పితేతి. (8-10)

టీ:- నందుని విడిచిపెట్టి కృష్ణునకు అప్పగించుచున్నాడు. (8-10)

శ్లో॥ తేత్వౌత్సుక్యధియో గోపా రాజన్ మత్వా తమీశ్వరమ్ ।
అపి నస్స్వగతిం సూక్ష్మాముపాధాస్యదధీశ్వరః ॥ 11

తా. రాజా! గోపాలకులు ఉత్సుకతతోకూడిన మనస్సుతో కృష్ణుని జగత్ప్రభువుగా విశ్వసించి "మనకుకూడ ఇతడు-ఈ ఈశ్వరుడు బ్రహ్మమను పేరుగల ఆత్మస్థానమును ప్రాప్తింపచేయగలడా?" అని తలచిరి. 11

టీ:- త ఇతి. ఔత్సుక్యయుక్తా ధీర్యేషాం తే. అపి కిం. స్వగతిం స్వస్థానం. సూక్ష్మాం బ్రహ్మాఖ్యాం చ. ఉపాధాస్యత్ ఉపాధాస్యతి. నః అస్మాన్ ప్రాపయిష్యతీతి సంకల్పితవంత ఇత్యర్థః. 11

టీ:- ఔత్సుక్యయుక్తాధీః ఏషాంతే-ఉత్కంఠతో కూడిన బుద్ధి ఎవరికో వారు-అపినఃకిం-మనకుకూడ ఏమి?-స్వగతిం-స్వస్థానమగు-సూక్ష్మాం - బ్రహ్మమను పేరు గల దానిని - ఉపాధాస్యత్? ప్రాప్తింప

శ్లో॥ ఇతి స్వానాం ససంకల్పం విజ్ఞాయాఖిలదృక్స్వయమ్ ।
సంకల్పసిద్ధయే తేషాం కృపయైతదచింతయత్ ॥ 12

టీ:- ఇతీతి. ఇతి. ఏవంభూతం. స్వానాం స్వేషాం. సంకల్పం. అఖిలదృక్ సర్వజ్ఞః. స్వయమేవ విజ్ఞాయ. తేషాం సంకల్పసిద్ధయే. కృపయా. ఏతద్వక్ష్యమాణమచింతయత్. 12

శ్లో॥ జనోవైలోక ఏతస్మిన్న విద్యా కామకర్మభిః ।
ఉచ్చావచాసు గతిషు న వేద స్వాం గతిం భ్రమన్ ॥ 13

టీ:- జన ఇతి. అవిద్యాదేహాదిష్వహం సర్వజ్ఞుడు కావునబుద్ధిః తతః కామః. తతః కర్మ. తైః ఉచ్చావచాసు దేవతిర్యగాదిషు. భ్రమన్ స్వీయాం గతిం. న వేద. 13

జేయునా? నః - మనకు - ప్రాపయిష్యతి ఇతి - పొందించునా అని - సంకల్పిత వంతః ఇత్యర్థః - ఆశించిరి అని యర్థము. 11

తా. కృష్ణుడు సర్వజ్ఞుడు కావున తనవారి యొక్క ఈ కోరికను తెలిసికొని - వారి సంకల్పము నెరవేర్చుట కొఱకు, దయతో ఈ విధముగ ఆలోచించెను. 12

టీ:- ఈ విధమైన తనవారి సంకల్పమును సర్వజ్ఞుడగు కృష్ణుడు తనకు తానే తెలిసికొని, వారి సంకల్పము సిద్ధించుట కొఱకు కృపతో - ఏతద్వక్ష్యమాణం - ఈ చెప్పబోవు దానిని - చింతించెను. 12

తా. ఈ లోకమునందు జన్మించిన మానవుడు అజ్ఞానము చేత ఇచ్ఛానుసారముగ చేయబడిన కర్మలచేత అనేక విధములుగ తిరుగుచు - అనేక యోనులలో జన్మించుచు తన లక్ష్యమును తెలియజాలకున్నాడు. 13

టీ:- అవిద్యా-దేహాదులయందు "నేను" అనెడు బుద్ధి అటుపై కామన - అటుపైన కర్మ వారిచేత ఉచ్చావచాసు - దేవతలు, జంతువులు మొదలగువారియందు - భ్రమన్ - తిరుగుచు- స్వీయాం గతిం - తమగతిని - న వేద - తెలియజాలరు. 13

శ్లో॥ ఇతి సంచిత్య భగవాన్ మహా కారుణికో విభుః ।
దర్శయామాస లోకం స్వం గోపానాం తమసః పరమ్ ॥ 14

టీ:- ఇతీతి. స్వం బ్రహ్మస్వరూపంలోకం వైకుంఠాఖ్యం చ తమసః పరం తమసః ప్రకృతేః పరం. 14

శ్లో॥ సత్యం జ్ఞానమనంతం చ బ్రహ్మజ్యోతిస్సనాతనమ్ ।
యద్ధిపశ్యంతి మునయో గుణాపాయే సమాహితాః ॥ 15

టీ:- దేహాది పిహితానాం తద్దర్శనమశక్యమితి ప్రథమం దేహాది వ్యతిరిక్తం బ్రహ్మస్వరూపం దర్శయామాసేత్యాహ-సత్యమితి. సత్యం అబాధ్యం జ్ఞానం అజడం అనంతమపరిచ్ఛిన్నం జ్యోతిః స్వప్రకాశం సనాతనం శశ్వత్సిద్ధం గుణాపాయే గుణాపోహే. జ్ఞానినో యత్పశ్యంతి తత్కృపయైవ దర్శయామాస. 15

తా. అని ఆలోచించి భగవానుడగు శ్రీకృష్ణుడు, ప్రభువు, మిక్కిలి దయామయుడై ప్రకృతికంటె భిన్నమైన తన లోకమగు వైకుంఠమును గోపాలురకు చూపెను. 14

టీ:- స్వం - బ్రహ్మ స్వరూపమగు - లోకం - వైకుంఠమను పేరుగల-చ - మరియు - తమసః పరం - ప్రకృతికంటె శ్రేష్ఠతమమైన (స్థానములు దర్శింపజేసెను). 14

తా. జ్ఞానులైన మునులు, గుణసంగరహితులై, సమాధినిష్ఠులై ఏ త్రికాలాబాధ్యమైన, జ్ఞప్తిరూపమైన, అపరిచ్ఛేదమైన, బృహత్తరమైన, స్వయంప్రకాశమైన, శాశ్వతమైన ఏ పరమాత్మను దర్శింతురో-(అట్టి పరమాత్మను గోపాలురకు చూపెను) 15

టీ:- దేహాదులచేత ఆవరింపబడియున్న వారికి బ్రహ్మసాక్షాత్కారము సాధ్యముకాదని మొదట దేహాదులకు అతిరిక్తమైన బ్రహ్మ స్వరూపమును చూపెనని చెప్పుచున్నాడు. సత్యం-దేనిచేతను బాధింపబడ జాలనిది -జ్ఞానం-జ్ఞానరూపమైనది-జడముకానిది-అనంతం-అపరిచ్ఛినమైనది -జ్యోతిః-స్వప్రకాశరూపము-సనాతనం-ఎల్లప్పుడును ఉండునది- గుణాపాయే-సత్వ, రజ, స్తమములనెడు గుణములు శమించిన పిదప, జ్ఞానులు దేనిని దర్శింతురో దానిని కృపతో దర్శింజేసెను. 15

శ్లో॥ తేతు బ్రహ్మహ్రదం నీతాః మగ్నాః కృష్ణేన చోద్ధృతాః ।
దదృశుర్బ్రహ్మణో లోకం యత్రాక్రూరోఽధ్యగాత్పురా ॥ 16

తా. వారు బ్రహ్మనామక జలాశయమునకు కృష్ణునిచేత కొనిపోబడిరి అందులో మునిగిరి. తిరిగి అతనిచేత పైకి లేపబడిరి. పూర్వము అక్రూరుడు చూచిన బ్రహ్మలోకమును వారుకూడ చూచిరి. 16

శ్లో॥ నందాదయస్తు తం దృష్ట్వా పరమానందనిర్వృతాః ।
కృష్ణం చ సమభిష్టూయమానయంతస్సు విస్మితాః ॥ 17

తా. నందుడు మొదలగు వారు కృష్ణునిచూచి పరమానంద పరవశులై అతనిని స్తోత్రముచేసి మిక్కిలిగ ఆనందించుచు ఆశ్చర్య చకితులైరి. 17

టీ:- త ఇతి. ఏవం ప్రబహ్మహ్రదం. బ్రహ్మైవ హ్రద ఇవ హ్రదః. తత్ర నిమగ్నస్య విశేషవిజ్ఞానాభావాత్. తం బ్రహ్మహ్రదం తే తు నీతాః ప్రాపితాస్తస్మిన్ మగ్నాశ్చ తు శబ్దోక్తం విశేషణమాహ – పునః కృష్ణేనో ద్ధృతాః సమాధేరివోత్థాపితాస్సంతో బ్రహ్మణస్తస్యైవ లోకం వైకుంఠాఖ్యం దదృశురితి. నను బ్రహ్మనిమగ్నానాం పునర్లోకదర్శనమఘటత మేవేత్యా శంక్యాహ – యత్రేతి యత్ర యస్మిన్ కృష్ణే నిమిత్తేసతి పూర్వమక్రూరః అధ్యగాత్ దృష్టవాన్. శుకపరీక్షిత్సంవాదాత్ప్రాక్తనత్వాత్ భూతనిర్దేశః. నహ్యాతర్క్యైశ్వర్యే దస్య బ్రహ్మహ్రద ఇతి నామ. తంహ్రదం నీతా మగ్నాస్సంతో బ్రహ్మలోకం దదృశుః. పునశ్చకృష్ణేనోద్ధృతాః. పూర్వవత్తం దృష్ట్వా. విస్మితా బభూవురితి వ్యవహితాన్వయోఽప్రసిద్ధకల్పనా చ సోఢవ్యేతి. (16-17)

టీ:- బ్రహ్మహ్రదం – బ్రహ్మయే జలాశయముగ యున్నట్లు ఉన్న జలాశయము. అందు మునిగిన వారికి విశేషమైన జ్ఞానమేమియు కలుగదు. అట్టి బ్రహ్మహ్రదమునకు వారు కొనిపోబడిరి. దానిలో మునిగిరికూడ, 'తు' శబ్దముచే చెప్పబడిన విశేషమును చెప్పుచున్నాడు. మఱల కృష్ణునిచే లేవనెత్తబడిరి. సమాధినుండి వలె ఉద్ధరింపబడిరి. పైకితేల్పబడినవారై – బ్రహ్మణః-తనదే అయిన వైకుంఠమను పేరుగల లోకమును చూచిరి అని, మఱి బ్రహ్మయందు మునిగిన వారికి మఱల బ్రహ్మలోక దర్శనము ఘటింపదుకదా అని ఆశంకించి చెప్పుచున్నాడు. యత్ర-దేనియందు కృష్ణుడు నిమిత్తమగుచుండగ పూర్వము అక్రూరుడు -అధ్యగాత్-దర్శించెనో-శుకపరీక్షత్సంభాషణ వలని పూర్వత్వము వలన గతకాల సూచనము. తర్కమునకు అందని ఐశ్వర్యముగల వానియందు

– భగవానునియందు ఏదియును– ఏ కొంచెమైనను అసంభవముకాదు అని భావము. లేక అక్రూరుడు ఎచ్చట దర్శించెనో ఆ యమునా నదీ జలాశయమునకు బ్రహ్మహ్రదమని పేరు. అట్టి హ్రదమునకు తోడ్కొని పోబడినవారై – మునిగినవారై బ్రహ్మలోకమును చూచిరి. మఱల కృష్ణునిచే లేవనెత్తబడి పూర్వమందువలెనే అతనిని చూచి ఆశ్చర్యపడిరి అని వ్యవధానముతో కూడిన అన్వయము అప్రసిద్ధమైన కల్పనము సహింపదగినది. (16–17)

("కృష్ణంచతత్రచ్ఛందోభిఃస్తూయమానంసువిస్మితాః" అని ఒక పాఠాంతరము)

**శ్రీ మద్భాగవతే, మహాపురాణే దశమస్కంధే,**
**అష్టవింశోఽధ్యాయః**

**అని శ్రీమద్భాగవతమున దశమస్కంధమందు**
**ఇరువది ఎనిమిదవ అధ్యాయము సమాప్తము.**

## ఏకోనత్రింశోఽధ్యాయః

### రాసక్రీడా కథా ప్రారంభఘట్టః

**శ్రీశుక ఉవాచ**

శ్లో॥ భగవానపి తా రాత్రీశ్శరదోత్ఫుల్లమల్లి కాః ।
వీక్ష్యరంతుం మనశ్చక్రే యోగమాయాముపాశ్రితః ॥ 1

టీ:- ఊనత్రింశే తు రాసార్థముక్తిప్రత్యుక్తయో హరేః, గోపీభిరాస సంరంభే తస్య చాంతర్ధి కౌతుకమ్. బ్రహ్మాదిజయ సంరూఢదర్ప కందర్ప దర్పహా, జయతి శ్రీపతిర్గోపీరాస మండల మండనః. భగవానితి. నను విపరీతమిదం. పరదారాది వినోదేన కందర్ప జితత్వ ప్రతీతేః. మైవం యొగమాయాముపాశ్రితః. శ్లో.'ఆత్మారామోవ్యరీరమత్, సాక్షాన్మన్మథమన్మథః, ఆత్మన్యవరుద్ధసారత' ఇత్యాదిషు స్వాతంత్ర్యా భిధానాత్. తస్మాద్రాస క్రీడవిడంబనం కామవిజయఖ్యాపనాయేత్యేవ తత్త్వం. కించ. శృంగార కథాపదేశేన విషయతో నివృత్తి పరేయం పంచాధ్యాయ్యాం వ్యక్తీకరిష్యామః. తాః రాత్రీరితి. శ్లో."యతా బలా వ్రజం సిద్ధా మయేమా రంస్యథ క్షపా" ఇతి చ. ప్రతిశ్రుతా ఇత్యర్థః. (1)

## 29వ అధ్యాయము

**శ్రీశుకుడిట్లనెను.**

తా. శరదృతువు కారణముగ బాగుగ వికసించిన మల్లెపువ్వులుగల ఆ రాత్రులు భగవానుడగు కృష్ణుడుకూడా చూచి యోగమాయను ఆశ్రయించినవాడై-క్రీడించుటకు కోరెను. 1

టీ:- ఈ ఇరువదితొమ్మిదవ అధ్యాయమున రాసక్రీడకొఱకు, గోప స్త్రీలతో కృష్ణుని సంభాషణలు, రససంబంధమగు ఉత్సాహమునందు అతనికి కుతూహలము వృద్ధియగుట - బ్రహ్మమొదలగు దేవతలను కూడ జయుంచుట వలన పెరిగిన మన్మథుని దర్పమును అడంచిన లక్ష్మీపతియు గోపస్త్రీల రసిక సమూహముచేత అలంకరింపబడియున్న వాడు, లేక రాసమండలముచేత ఆవరింపబడియున్న వాడును అయిన శ్రీకృష్ణునకు జయమగుగాక, ఇది విపరీతముకదా! ఇతరుల భార్యలతో వినోదించుట చేత, మన్మథుడు జీవించియున్నట్లు ప్రతీతి కలుగుట వలన యోగమాయ నాశ్రయించియున్నవాడనుటకాదు. సాక్షాత్తుగ "మన్మథులలో మన్మథుడగు" ఆత్మయే ఆరామముగాగల కృష్ణుడు' వారిని రమింపజేసెను. "ఆత్మరమించువాడై రమింపజేసెను." "సాక్షాత్తుగ మన్మథులకు మన్మథుడు", ఆత్మయందు నిగూఢమైనసారము ఉండుటవలన" ఈ మొదలైనవానియందు స్వాతంత్ర్యముపేర్కొనబడుట

శ్లో॥ తతోడు రాజః కకుభః కరైర్ముఖం
ప్రాచ్యా విలింపన్నరుణేన శంతమైః ।
సచర్షణీనాముదగాచ్ఛుచోమృజన్
ప్రియః ప్రియయా ఇవ దీర్ఘ దర్శనః ॥ 2

టీ:- తదేతి. తదా తస్మిన్నేవ క్షణే. తత్ప్రీతయే. ఉడురాజశ్చంద్రః. ఉదగాత్ ఉదితః. కిం కుర్వన్ దీర్ఘ కాలేన దర్శనం యస్య సః ప్రియః ప్రయాయాః. ముఖమరుణేన కుంకుమేన. యథా నిలింపతి. తతా ప్రాచ్యాః కకుభః దిశః. ముఖం. శంతమైః సుఖతమైః కరైః రశ్మిభిః. అరుణేన ఉదయరాగేణ విలింపన్నరుణీకుర్వన్నిత్యర్థః. స ప్రసిద్ధః

వలన-అందువలన రాసక్రీడను నటించుట, లేక అనుకరించుట. కామమును జయించుట కొఱకు ప్రచురముగా చెప్పుటయే ఇచటి పరమార్థము. మరియు శృంగార రసప్రధావములైన కథల వ్యాజముచేత విషయ ప్రపంచము నుండి నివృత్తి పరముగనే ఈ 'రాసపంచాధ్యాయి' యందు వ్యక్తీకరించెదము -"బలములు వ్రజమునుచేరినవి. ఇక ఆయత్తములైన రాత్రులు నాచే క్రీడింపబడును" అని ప్రతిజ్ఞ చేయ బడినది. 1

తా. అప్పుడు చాలాకాలము తర్వాత చూచిన తన ప్రియురాలి ముఖమును, ప్రియుడు తన సుఖకరములైన ఎఱ్ఱని చేతులతో నిమురుచు, ఆమె తాపగ్లానిని తొలగించునట్లు; చంద్రుడు, తూర్పుదిక్కు (ను) యొక్క ముఖమును తన లేతనైన ఎఱ్ఱని కరములతో (కిరణము లతో) నిమురుచు, మనుష్యుల యొక్కయు, ఓషధుల యొక్కయు తాపగ్లానిని తొలగించుచు ఉదయించెను. 2

టీ:- అదేక్షణమున దాని ప్రీతికొఱకు - ఉడురాజః - చంద్రుడు ఉదగాత్ - ఉదయించెను ఏమిచేయుచు? దీర్ఘకాలమునకు ఎవనికి దర్శనము కలిగెనో ఆ ప్రియుడు, తన ప్రియురాలియొక్క ముఖమును ఎఱ్ఱని కుంకుమముతో ఎట్లు లేపనముచేయునో - అట్లు తూర్పు దిక్కునకు-ముఖమున సుఖతమములైన కరైః - కిరణములతో అరుణేన

ఉడురాజః. తథా చర్షణీనాం జనానాం. ఓషధీనాం చ శుచస్తాపగ్లానీః మృజన్ అపనయన్. 2

– ఉదయరాగముతో నిలంపన్ – ఎఱ్ఱగచేయుచు అని యర్థము. ఆ ప్రసిద్ధమైన చంద్రుడు అట్లు చర్షణీనాం – జనుల యొక్క, ఓషధుల యొక్కయు – శుచః – తాపగ్లానిని – మృజన్ – తొలగించుచు–2

శ్లో॥ దృష్ట్వా కుముద్వంతమఖండమండలం
రమా సనాథం నవ కుంకుమారుణం ।
వనం చ తత్కోమలగోభిరంజితం జగౌ
కలం వా మదృశాం మనోహరమ్ ॥ 3

తా. భూమిని సంతోషింపజేయ గల లక్షణము గల వాడును, చేదురులేని గుండ్రదనము గలవాడును, మిక్కిలి శోభతో నొప్పువాడును, క్రొత్త కుంకుమవలె ఎఱ్ఱని ప్రకాశముగలవాడును అయిన చంద్రుని ఆతని లేత కిరణములతో ఎఱుపువారి యున్న వనమును చూచి, కృష్ణుడు అందముగ – లేక వంకర చూపులు ప్రసరింపబడుచున్న వేణువుపై హృదయం గమమైన అవ్యక్తమధుర ధ్వనులను పలికించెను (పిల్లనగ్రోవితో పాడెను) 3

టీ:– దృష్ట్వేతి. కుముత్ కుముదం. వికసనీయం విద్యతే యస్మిన్ తం. కుముద్వంతం. అఖండం మండలం యస్య. రమాయా ఆనన స్యాభేవ ఆభా యస్య తం. నవకుంకుమమివారుణం దృష్ట్వా, తథా వనం చ తస్య కోమలైః. గోభిః రశ్మిభిః రంజితం మధురం దృష్ట్వా కలం మధురం జగౌ అగాయత్. కథం వా మావక్రా దృశోయా సాం తాసాం. మనోహరం యథా తథా. 3

టీ:– కుముత్ – కుముదం – వికసింపదగిన లక్షణము దేనియందు గలదో దానిని–కుముద్వంతం ఖండములేని గుండ్రదనముదేనికో–దానిని –లక్ష్మియొక్క ముఖమందలి ప్రకాశమువంటి ప్రకాశము దేనికో – దానిని – క్రొత్తకుంకుమవలె ఎఱ్ఱనైన చంద్రబింబమును చూచి–అట్లే వనమును కూడ – చంద్రుని లేత గోభిః – కిరణములచేత– రంజితం– మధురమైన దానిని చూచి. కలం – మధురముగ – జగౌ – పాడెను ఎట్లు? వామా–వంకరైన–దృశః– చూపులు –దేనియందో దాని యందు – ఎట్లు మనోహరమో. 3

శ్లో॥ నిశమ్య గీతం తదనంగవర్ధనం
వ్రజస్త్రియః కృష్ణగృహీతమానసాః ।
ఆజుగ్మురన్యోన్యమలక్షితోద్యమాస్స
యత్ర కాంతోజవలోలకుండలాః ॥ 4

టీ:- నిశమ్యేతి. అసాపత్న్యాయాన్యోన్యం అలక్షితః న జ్ఞాపితః. ఉద్యమో యాభిస్తాః సకాంతో యత్ర తత్ర గీతధ్వనిమార్గేణాజగ్ముః. జవేన వేగేన లోలాని చంచలాని కుండలాని యాసాం తాః. 4

శ్లో॥ దుహ్యంత్యో౽భియయుః కాశ్చిద్దోహం హిత్వా సముత్సుకాః।
పయో౽ధిశ్రిత్య సంయావమనుద్వాస్యాపరాయయుః ॥ 5

శ్లో॥ పరివేషయంత్యస్తద్ధిత్వాపాయయంత్యః శిశూన్ పయః ।
శుశ్రూషంత్యః పతీన్ కాశ్చిదశ్నంత్యో౽పాస్య భోజనమ్ ॥ 6

తా. మన్మథుని రేకెత్తించు ఆ పాట విని వ్రజస్త్రీలు శ్రీకృష్ణునిచే ఆకర్షింపబడిన మనస్సుగలవారై - ఒకరికొకరు పట్టించుకొనకుండ, ప్రయత్నపూర్వకముగ తమ ప్రియుడుగల చోటికి, వారి గమనవేగమున, వారి చెవులకుగల కుండలములు కదలుచున్నవారై కృష్ణుని కడకు పోయిరి. 4

టీ:- శత్రుభావన లేకుండ ఒకరికొకరు తమ ఉద్యమమును గుర్తింప జేయుచున్నవారై, తమ కాంతుడెచ్చట గలడో అచ్చటికి, పాట యొక్క ధ్వనియే మార్గముగపోయిరి. జవేన - వేగముచేత - లోలాని - చంచలములగుచున్న కుండలములు ఎవరి యందోవారు. 4

తా. కొందరుస్త్రీలు, కృష్ణుని చేరవలెననెడి ఉత్సాహముగలవారై, పాలు పితుకుచూ ఆ పనిని అట్లే వదిలిపెట్టి వెడలిరి. కొందఱు పాలగిన్నెలను పొయ్యిమీద పెట్టి ఇక వాని విషయమును గూర్చి పట్టించుకొనకుండగ బయలుదేరి వెడలిపోయిరి. ఇంకను కొందఱు పొయ్యిపై నుంచిన గోధుమ అన్నము, అది పక్వమగు వఱకు ఎదురుచూడక-దింపకుండ వెడలిపోయిరి. 5

తా. భోజనపదార్థములను వడ్డించువారు, వడ్డించుటను వదిలివేసి పసిపిల్లలకు పాలుత్రాగించుచున్నవారు ఆ పనిని వదలివేసియు, తమ

భర్తలకు సేవచేయుచున్నవారు ఆ పనిని నిలిపివేసియు, మఱికొందఱు ఉపవసించిన తరువాత భోజనము చేయుచున్నవారు తినుటను ఆపివేసియు (వెడలిపోయిరి). 6

టీ:- శ్రీకృష్ణసూచకశబ్దశ్రవణేన తత్ప్రవణచిత్తానాం తత్ క్షణమేవ త్రైవర్గికకర్మనివృత్తిం ద్యోత యంత్య ఇవాభ్యవసితం కర్మ విహాయ యయుః. తదాహ-దుహంత్య ఇతి, పయః స్థాలీస్థం. చుల్యాం అధిశ్రిత్య తత్క్వాథమప్రతీక్షమాణాః. కాశ్చిద్యయుః సంయానం గోధూమకణాన్నం పక్వమనుద్వాస్య అనవతార్య అపరా యయుః. (5-6)

టీ:- శ్రీకృష్ణుని సూచించు మురళీనాదమును విని, అందు తన్మయులైన చిత్తములు గల వారలకు ఆ క్షణముననే ధర్మ, అర్థ, కామములకు సంబంధించిన కర్మలయొక్క కర్తృత్వమునుండి నివృత్తి లభించినదేమో అను నంశము ద్యోతకము చేయుచున్నట్లు - చేయుచున్న పనిని వదిలిపెట్టి అని చెప్పుచున్నాడు. పాలు గిన్నెలో నుండగ దానిని ప్రొయ్యి మీదకు ఎక్కించి ఆ పాలు పక్వమైనవా? కాగినవా? లేదా అని ఎదురుచూడకయే వెడలిరి కొందఱు; సంయావం- గోధుమ నూకలతో వండబడు అన్నము- పక్వమైన దానిని దింపకుండ, ఇతరులు కొందఱు పోయిరి. (5-6)

శ్లో॥ లింపంత్యః ప్రమృజ్యంత్యోఽన్యా అంజ్యంత్యః కాశ్చ లోచనే ।
వ్యత్యస్త వస్త్రాభరణాః కాశ్చిత్కృష్ణాంతికం యయుః ॥ 7

తా. అంగరాగము, చందనము ఇత్యాదులను లేపనము చేసుకొనుచున్నవారును, ఒంటికి నలుగు పెట్టుకొనుచున్నవారును, ఇతరులు కొందఱు కన్నులకు కాటుక దిద్దుకొనుచున్నవారును, మఱికొందఱు వస్త్రములు, ఆభరణములు తలక్రిందులుగ ధరించియు కృష్ణుని సమీపమునకు బోయిరి. 7

టీ:- లింపంత్యఇతి. అన్యాః ప్రమృజంత్యః అంగోద్వర్తనాది కుర్వంత్యః కాశ్చ కాశ్చిత్. కృష్ణతుష్ట్యర్థం కర్మ తదాసక్తమనసామన్యథా కృతమ ఫలత్యేవేతి ద్యోతయన్నాహ - వ్యత్యస్తేతి. స్థానతః స్వరూపతశ్చోర్ధ్వాధో ధారణేన. విపర్యయం ప్రాప్తాని వస్త్రాభరణాని యాసాం తాః. 7

టీ:- ఇతరులుకొందఱు-ప్రమృజ్యంతః-అంగోద్వర్తనాదికములు చేసికొనుచున్నవారు-కొందఱు-కృష్ణుని సంతోషముకొఱకు చేయుపని -అతనిమీదిఆసక్తిగలమనస్సుతో-వ్యత్యస్తముగ చేయబడియుండుటచేత అది ఫలించజాలదని సూచించుచు చెప్పుచున్నాడు-ఉండవలసిన స్థానమునకాక వేఱొక స్థానమున-ఉండవలసిన స్వరూపముతోకాక తలక్రిందులుగ ధరించుటచేత-విపర్యయముగ అలంకరించుకొనబడిన వస్త్రములు,ఆభరణములుఎవరియందోవారు(కృష్ణునివద్దకు పోయిరి). 7

శ్లో॥ తా వార్యమాణాః పతిభిః పితృభిర్భ్రాతృ బంధుభిః ।
గోవిందాపహృతాత్మానో న న్యవర్తంత కాశ్చన ॥ 8

తా. తమ భర్తలచేత, తండ్రులచేత, సోదరులచేత, బంధువులచేతను వారు అడ్డగింపబడియు, నివారింపబడుచున్న వారయ్యును, కృష్ణునిచేత అపహరింపబడిన మనస్సులు గలవారగుటచేత వారిలో ఎవరును అడ్డగించినవారి మాటలను లెక్కచేయకుండిరి. 8

టీ:- న చ కృష్ణాకృష్టమనసాం విఘ్నాః ప్రభవంతీత్యాహ-తాఇతి. 8

టీ:- కృష్ణునిచే ఆకర్షింపబడిన మనస్సులు గలవారికి విఘ్నములు కలుగవు అని చెప్పుచున్నాడు. తాః అని 8

శ్లో॥ అంతర్గృహ గతాః కాశ్చిద్గోప్యో లబ్ధవినిర్గమాః ।
కృష్ణం తద్భావనా యుక్తా దధ్యుర్మీలితలోచనాః ॥ 9

తా. ఇంటిలోపలి భాగముననున్న గోపికలు కొందఱు బయటకు పోవు వెరవు కానక కృష్ణుని, అతనిగూర్చిన సౌందర్యమాధుర్యాదులను తన్మయులై, కన్నులు మూసుకొని ధ్యానింపసాగిరి. 9

టీ:- అంతరితి. న లబ్ధో వినిర్గమో యాభిస్తాః. ప్రాగపి తద్భావనాయుక్తా స్తదా నితరాం దధ్యురిత్యర్థః. 9

టీ:-బయటకు పోవునుపాయము తెలియనివారగు గోపస్త్రీలు-ముందు నుండియే కృష్ణుని గూర్చిన భావనతో కూడినవారై ఇప్పుడు మరింత గాఢముగ ధ్యానింపజొచ్చిరని అర్థము. 9

శ్లో॥ దుస్సహప్రేష్ఠవిరహతీ వ్రతాపధుతాశుభాః ।
ధ్యానప్రాప్తాచ్యుతాశ్లేషనిర్వృత్యా క్షీణమంగళాః ॥ 10

తా. గోపస్త్రీలలోని భరింపరాని కృష్ణప్రేమనుండియు, అతని విరహమునుండియు కలిగిన తీవ్రమైన తాపమునందు వారిలోగల అశుభములన్నియు దగ్ధములైనవి. కృష్ణుని ధ్యానించుటచేతను, ధ్యానస్థితిలో ఆతనిని కౌగలించుకొనుట చేతను కలిగిన మహదానందమున అమంగళములన్నియు లయించి పోయినవి. 10

శ్లో॥ తమేవ పరమాత్మానాం జారబుద్ధ్యాపి సంగతాః ।
జహుర్గుణమయం దేహమసద్యః ప్రక్షీణ బంధనాః ॥ 11

తా. పరమాత్ముడైన ఆ కృష్ణుని వ్యభిచరించు బుద్ధితో పొందినను పాంచభౌతికము గుణమయమునైన తమ దేహమును విడిచిరి. (భావనలో) అప్పుడే తమకర్మబంధము సడలిపోవుట చేత - భావనలోనైనను దేహత్యాగము చేసిరి. 11

టీ:- కించ. తదానీమేవ తం పరమాత్మానం శ్రీకృష్ణం. ధ్యానతః ప్రాప్తాస్సత్యో గుణమయం దేహం జహురిత్యాహ-శ్లోకద్వయేన. దుస్సహేతి. తమితి. నను కథం జహుః పరమాత్మేతి. జ్ఞానభావాదిత్యాశంక్యాహ-జారబుద్ధ్యాపీతి. న హి వస్తుశక్తిర్బుద్ధిమపేక్షతే. అన్యథా

టీ:- ఇంకను-అప్పుడే ఆ పరమాత్ముడైన కృష్ణుని ధ్యానించుట వలన అతనిని పొందినవారగుచు గుణమయమైన (ప్రాకృతమైన) తమ శరీరమును విడిచిరని రెండు శ్లోకములతో చెప్పుచున్నాడు. ఎట్లు విడిచిరి? జ్ఞానములేక దేహభావమునేల త్యజింపగలిగిరి? అని

మత్వాపి పీతామృతవదితి భావః. నను తతాపి ప్రారబ్ధకర్మబంధనే సతి. కథం జహుః. తత్రాహ-సద్యః ప్రక్షీణబంధనా ఇతి. నను కథం భోగమంతరేణ ప్రారబ్ధకర్మ క్షీణం? భోగేనైవ సద్యః క్షీణమిత్యాహ-దుస్స హేతి. దుస్సహో యః ప్రేష్ఠస్య విరహస్తేన. యః తీవ్రతాపః తేన ధుతాని గతాన్యశుభాని పాపాని యాసాం తాః. తదప్రాప్తిపరమదుఃఖ భోగేన పాపం క్షీణమిత్యర్థః. తథా ధ్యానేన ప్రాప్తాచ్యుతస్యాశ్లేషేణ యా నిర్వృతిః పరమసుఖభోగః. తయా క్షీణం మంగళం పుణ్యబంధనం యాసాం తాః. అతో ధ్యానేన పరమాత్మప్రాప్తేః తత్కాల సుఖదుఃఖాభ్యాం చ నిశ్శేషకర్మక్షయాత్. గుణమయం దేహం జహురితి. (10-11)

శంకించి చెప్పుచున్నాడు. వ్యభిచారబుద్ధితోకూడ అని. "వస్తువులో నుండు శక్తి బుద్ధినపేక్షింపదు", (బుద్ధిని అనుసరించి వస్తువు ప్రవర్తింపదు. వస్తువులోని శక్తి, బుద్ధిని అపేక్షింపక తన పని తాను చేయుచుండును). వేఱొకరీతిగ భావించి - విషమని భావించి అమృతము త్రాగినట్లు అని భావము. అయినను ప్రారబ్ధకర్మచే కట్టబడి యుండువారు ఎట్లు విడిచిరి? చెప్పుచున్నాడు. "అప్పటికప్పుడే మిక్కిలిగ సడలిపోయిన కర్మ బంధములు గలవారు" అని - ప్రారబ్ధకర్మ అనుభవింపక ఎట్లు క్షీణించినది? భోగముతోడనే అప్పటికప్పుడు క్షీణించినది అని చెప్పినాడు. "దుస్సహ" అని. సహింపరాని ఏ ప్రేమాస్పదుని విరహము గలదో దానిచేత ఏ తీవ్రమైన తాపముగలదో దానిచేత కాల్చబడిన అశుభములు-పాపములు ఎవరికోవారు అతనిని పొందకపోవుట వలన కలిగిన అతిశయించిన దుఃఖమును అనుభవించుటచేత పాపము క్షీణించి పోయినదని అర్థము. అట్లే ధ్యానముచేత పొందబడిన కృష్ణుని కౌగిలిచేత ఏ నిర్వృత్తి-శ్రేష్ఠమైన సుఖానుభవము - దానిచేత మంగళము కూడ. పుణ్యబంధముకూడ క్షీణించినది. ఎవరికో వారు, అందువలన ధ్యానముచేత పరమాత్మప్రాప్తి కలుగుటచేత తత్కాలమునందలి సుఖదుఖముల వలనకూడ కర్మ నిశ్శేషముగ (మిగులకుండ) క్షయించి పోవుటవలన గుణమయమగు దేహమును విడిచిరి అని. (10-11)

రాజోవాచ

శ్లో॥ కృష్ణం విదుః పరం కాంతం న తు బ్రహ్మతయామునే ।
గుణ ప్రవాహో పరమస్తాసాం గుణధియా కథమ్ ॥ 12

టీ:- నను. యథా పతిపుత్రాదీనాం వస్తుతో బ్రహ్మత్వేఽపి న తద్భజ నాన్మోక్షః తథా బుద్ధ్యభావాత్ ఏవం కృష్ణేఽపి బ్రహ్మ బుద్ధ్యభావేన తత్సంగతిః కథం మోక్షహేతురితి, శంకతే-కృష్ణం విదురితి. పరం కేవలం. కాంతం కమనీయం. 12

పరీక్షిత్తు ఇట్లనెను.

తా. మునీశ్వరా! గోపస్త్రీలు, కృష్ణుని కేవలము మనోహరునిగ తెలియుదురు కాని బ్రహ్మభావముతో గుర్తింపరు గదా! మఱి-ప్రాకృత బుద్ధితోనున్న ఆ స్త్రీలకు గుణప్రవాహ రూపమైన ఈ ప్రపంచస్థితి నుండి నివృత్తి ఎట్లు సంభవించినది? 12

టీ:- భర్త, పుత్రులు మొదలగువారికి వస్తుతః బ్రహ్మత్వమే యున్నను, వారిని సేవించుటచేత ఎట్లు మోక్షము లభింపదో-అట్లే వారియందు బ్రహ్మభావన లేనందువలన-అదే విధముగ గోపస్త్రీలకు కృష్ణునియందు బ్రహ్మబుద్ధి లేకపోవుటచేత అతనితో సాన్నిహిత్యము మోక్షకారణము ఎట్లగును? అని శంకించుచున్నాడు - పరం - కేవలము - కాంతం - కమనీయునిగ 12

శ్రీ శుక ఉవాచ

శ్లో॥ ఉక్తం పురస్తా దేతత్తే చైద్యస్సిద్ధిం యథా గతః ।
ద్విషన్నపి హృషీకేశం కిముతాధోక్షజప్రియాః ॥ 13

శ్రీశుకుడిట్లనెను.

తా. కృష్ణుని ద్వేషించుచుకూడ చైద్యుడైన శిశుపాలుడు ఎట్లు సిద్ధిని పొందెనో నీకు ముందే చెప్పియున్నాను. ఇక కృష్ణుని ప్రేమించుచున్న వారినిగూర్చి చెప్పునదేమీ? (శిశుపాలుడు ప్రాకృతశరీరము విడిచి పార్షదుడయ్యెను). 13

టీ:- పరిహరతి-ఉక్తమితి. అయం భావః జీవేష్వావృత్తం బ్రహ్మత్వం. కృష్ణస్య హృషీకేశత్వాదనావృతత్వం తతో న తత్ర బుద్ధ్యపేక్షేతి. 13

టీ:- పరిహారమును చెప్పుచున్నాడు. భావమేమన జీవులయందు బ్రహ్మత్వము కప్పబడియున్నది. కృష్ణునిలో అతని హృషీకేశత్వము వలన అది అనావృత్తముగ నున్నది. అందువలన ఇచట బుద్ధియొక్క అపేక్ష లేదు. (బుద్ధి, కృష్ణుని కృష్ణుడనుకొనుచున్నది. జీవుని జీవుడనుకొనుచున్నది. బుద్ధి గ్రహించునది అంతమాత్రమే కాని సత్యమేమన అటు కృష్ణుడు, ఇటు జీవుడును బ్రహ్మమే. కావున బుద్ధిననుసరించి వస్తువు యొక్క స్థితి మారదు) అని- 13

శ్లో॥ నృణాం నిశ్శ్రేయసార్థాయ వ్యక్తిర్భగవతో భువి ।
అవ్యయస్యాప్రమేయస్య నిర్గుణస్య గుణాత్మనః ॥ 14

తా. గుణములను నియంత్రించువాడును, గుణసంబంధములేనివాడును, యథార్థముగ తెలియబడనివాడును, అవినాశియునయిన భగవానుని ఈ భూమియందలి ప్రకటమగుట యనునది మానవుల నిశ్శ్రేయసము కొఱకే-నిశ్శ్రేయసము-మోక్షము. 14

టీ:- నను దేహీకథమనావృతస్స్యాదత ఆహ-నృణామితి. గుణాత్మనః గుణ నియంతుః. భగవత ఏవం రూపాభివ్యక్తిః అతో న దేహిసాదృశ్యం. అత్ర వక్తుం యుజ్యత ఇతి భావః. 14

టీ:- దేహముగలవాడు అనాచ్ఛాదితుడెట్లగునో చెప్పుచున్నాడు- గుణాత్మనః - గుణనియంతయొక్క భగవంతునిదే రూపాభివ్యక్తి- కాబట్టి అతనికి మనుష్యునితో పోలికలేదు. ఇచట ఆ విషయమును చెప్పుట సరియైనదని భావము. 14

శ్లో॥ కామం క్రోధం భయం స్నేహమైక్యం సౌహృదమేవ వా ।
నిత్యం హరౌ విదధతో యాంతితన్మయతాం హితే ॥ 15

తా. విష్ణుభగవానుని యందు కామముగాని, కోపమునుగాని, భయమునుగాని, ఐక్యభావనగాని, స్నేహమునగాని, బంధుభావనము గాని, లేక ఏదోవిధముగ సంబంధమునుగాని నిరంతరముగ నెఱపు వారు తాదాత్మ్యమును లేక అతని సాయుజ్యమును పొందుదురు. 15

టీ:- అతో యథా కథం చిత్తదాసక్తిర్ముక్తి కారణమిత్యాహ - కామమితి. ఐక్యం సంబంధం సౌహృదం భక్తిం. విదధతః కుర్వంతః. 15

టీ:- అందువలన ఏదోవిధముగ భగవానునియందు ఆసక్తి, ముక్తికి కారణమని చెప్పుచున్నాడు. ఐక్యం-సంబంధమును సౌహృదం-భక్తిని -విదధతః-చేయువారికి 15

శ్లో॥ న చైవం విస్మయః కార్యో భవతా భగవత్యజే ।
యోగేశ్వరేశ్వరే కృష్ణే యత ఏతద్విముచ్యతే ॥ 16

తా:- కావున యోగేశ్వరులకు ఈశ్వరుడును, పుట్టుకలేనివాడును, షడ్గుణైశ్వర్యసంపన్నుడును అయిన కృష్ణునియందు మీరు ఆశ్చర్యము గాని, సందేహముగాని పడవలసినక్కరలేదు. ఏలయన అతడు ఈ సంసారమునంతయును బంధమునుండి విడుదలచేయగలడు. 16

టీ:- న చ భగవతోఽయమతిభార ఇత్యాహ - న చైవమితి. యత శ్రీ కృష్ణాదేతత్ స్థావరాదికమపి విముచ్యతే. 16

టీ:- భగవానునకు ఇది పెద్ద భారముకూడ కాదని చెప్పుచున్నాడు. యతః-శ్రీకృష్ణునివలన ఇది స్థావరము (జడము) మొదలగునవికూడ మోక్షమునందగలవు. 16

శ్లో॥ తా దృష్ట్వాంతికమాయాతాః భగవాన్ వ్రజయోషితః ।
అవదద్వదతాం శ్రేష్ఠో వాచః పేశైర్విమోహయన్ ॥ 17

టీ:- ప్రస్తుతమాహ-తా ఇతి. వాచః పేశైః వాగ్విలాసైః. 17

శ్రీ భగవానువాచ

శ్లో॥ స్వాగతం వో మహాభాగాః ప్రియం కిం కరవాణివః ।
వ్రజస్యానామయం కచ్చిద్బ్రూతాగమనకారణమ్ ॥ 18

టీ:- స్వాగతమితి. సర్వాః ససంభ్రమమాగతాః విలోక్య. సభయమివాహ-వ్రజస్యేతి. 18

శ్లో॥ రజన్యేషా ఘోరరూపాక్రూర సత్వనిషేవితా ।
ప్రతియాత వ్రజం నేహ స్థేయం స్త్రీభిస్సుమధ్యమాః ॥ 19

టీ:- లజ్జయా మందహసితా ఆలక్ష్యాహ-రజనీతి. 19

తా. ఆ వ్రజస్త్రీలు-గోపికలు తమ సమీపమునకు వచ్చుటచూచి, మాట్లాడుటలో మిక్కిలి చతురుడైన భగవానుడగు కృష్ణుడు తన వాగ్విలాసముతో వారిని మోహింపజేయుచు ఇట్లనెను. 17

టీ:- ప్రస్తుతమునుచెప్పుచున్నాడు. వాచఃపేశైః-వాగ్విలాసముతో 17

శ్రీకృష్ణుడిట్లనెను.

తా. మహాభాగ్యవతులారా! మీకు స్వాగతము. మీకు నేను ఏ ప్రియమును చేయగలను. వ్రజముఅంతయును ఆరోగ్యముగనున్నది కదా! మీరాకకు కారణమేమో చెప్పుడు. 18

టీ:- అందఱును సంభ్రమముతో వచ్చుటచూచి భయపడినవానివలె కృష్ణుడుఇట్లనుచున్నాడు. వ్రజమునకుకుశలమేనా?క్షేమమేనా? అని. 18

తా. ఈ రాత్రి మిక్కిలి భయంకరమైనది. అదియునుగాక ఇచట క్రూర జంతువులు తిరుగుచుండును. మీరందఱు వ్రజమునకు మరలిపొండు. సుందరీమణులారా! ముఖ్యముగ స్త్రీలు ఇటనుండుట క్షేమముకాదు. 19

టీ:- సిగ్గుతో చిఱునవ్వునవ్వుచు అంతటనుచూచిఅనుచున్నాడు. 19

శ్లో॥ మాతరః పితరః పుత్రాః భ్రాతరః పతయశ్చ వః ।
విచిన్వంతి హ్యపశ్యంతో మాకృధ్వం బంధుసాధ్వసమ్ ॥ 20

తా. మీతల్లులు, తండ్రులు, కుమారులు, సోదరులు, మీ భర్తలు మిమ్ము గానక వెదకుచుందురు, బంధుజనులను భయపెట్టుట తగదు. (20)

టీ:- కించ. మాతర ఇతి. విచిన్వంతి మృగయం తే బంధూనాం సాధ్వసం భయం మాకృధ్వం మా కురుతేత్యర్థః. 20

టీ:- విచిన్వంతి- వెదకుచుందురు. బంధువులకు- సాధ్వసం - భయమును - మా కృధ్వం - కలగింపదగదు అని యర్థము. 20

శ్లో॥ దృష్టం వనం కుసుమితం రాకేశకర రంజితమ్ ।
యమునానిల లీలైజత్తరు పల్లవ శోభితమ్ ॥ 21

తా. పూర్ణచంద్రుని కిరణములచే ఎఱుపువారినదియు, యమునా జలములపైనుండి వీచుగాలి యొక్క కదలికచేత కంపించుచున్న చెట్ల చిగుళ్లచేత శోభాయమానముగనున్న వనము మీచేచూడబడినది. 21

టీ:- ఈషత్ప్రణయకోపేనాన్యతో విలోకయంతీః ప్రత్యాహ-దృష్టమితి. రాకేశస్య పూర్ణచంద్రస్య కరైః రంజితం. యమునా స్పర్శినః అనిలస్య లీలా మందగతిః. తయా ఏజంతః కంపమానః. తరూణాం పల్లవాః. తైశ్శోభితం. 21

టీ:- ఇంచుకంత ప్రణయకోపముతో వేఱొక దిక్కునకు చూచుచున్న వారినిగూర్చి చెప్పుచున్నాడు. రాకేశశ్య-పూర్ణచంద్రునియొక్క-కరైః -కిరణములచే-రంజితం-ఎఱుపువారినది-యమునాజలముల 21

శ్లో॥ తద్యాత మాచిరం ఘోషం శుశ్రూషధ్వం పతీన్ సతీః ।
క్రందంతి వత్సా బాలాశ్చ తాన్ పాయయత దుహ్యత ॥ 22

తా. అందువలన ఇకతొందరగ పల్లెకుపొండు. విహితలు తమ తమ భర్తలను సేవింపుడు. పిల్లలు ఏడ్చుచుందురు. లేగలు అరచు చుండును. పిల్లలకు పాలుత్రాగింపుడు. లేగలకు పాలకు వదులుడు - ఆవులకు పాలు పితుకుడు. 22

టీ:- తదితి. సతీః హేతస్య. 22

టీ:- సతీః - సతులారా! (స్పృషించిన గాలియొక్క - లీలా - మంద గమనము - దానిచేత - ఏజంతః - కంపించుచున్న - చెట్లయొక్క చిగుళ్లు - వాని చేత శోభించుచున్నది) 22

శ్లో॥ అథవా మధభిస్నేహాద్భవత్యో యంత్రితాశయాః ।
ఆగతా హ్యుపపన్నం తత్ప్రీయంతే మయి జంతవః ॥ 23

తా. లేక నామీద మీకుగల ప్రేమవలన వశీకృతచిత్తులై ఇటకు వచ్చితిరా? అది యుక్తమే. ఏలయన జీవులన్నియు నా యందు ప్రేమను కలిగియేయున్నవి. నా యెడ ప్రసన్నముగనే యున్నవి. 23

టీ:- సంరంభ క్షుభితదృష్టీః ప్రత్యాహ-అథవేతి. యంత్రితాశయాః వశీకృతచిత్తాః. ఉపపన్నం యుక్తం. ప్రీయంతే ప్రీతా భవంతి. 23

టీ:- సంరంభమువలన క్షోభించిన చూపులుగలవారికి చెప్పుచున్నాడు. 'అథవాః' అని. యంత్రితాశయాః వశీకరింపబడిన మనస్సులు గల వారు - ఉపపన్నం- సముచితము. ప్రియంతే - ప్రీతిని పొందుచున్నారు. 23

శ్లో॥ భర్తృశూశ్రూషణం స్త్రీణాం పరధర్మో హ్యమా యయా ।
తద్బంధూనాం చ కల్యాణ్యః ప్రజానాం చానుపోషణమ్ ॥ 24

తా. కల్యాణులారా! స్త్రీలయొక్క పరమధర్మమేనగా, తమ తమ భర్తలను వారికి సంబంధించిన బంధువులను, కపటములేకుండ సేవించుట మరియు తమ సంతానములను చక్కగా పోషించుట. 24

శ్లో॥ దుశ్శీలో దుర్భగో వృద్ధో జడో రోగ్యధనోఽపి వా ।
పతిస్స్త్రీభిర్న హాతవ్యోలోకేప్సుభిరపాతకీ ॥ 25

తా. పుణ్యలోకములను కాంక్షించు స్త్రీలు, తమ భర్త దుర్మార్గుడైనను, భాగ్యహీనుడైనను, ముసలివాడైనను, చైతన్యములేనివాడైనను, వ్యాధిగ్రస్తుడైనను, ధనహీనుడైనను అతనిని విడిచిపెట్టకూడదు. 25

టీ:- దృష్టాదృష్టభయ ప్రదర్శనేన నివర్తయ భర్త్రిత్యాదిశ్లోకత్రయేణ. (24-25)

టీ:- దృష్టఫలములను, అదృష్టఫలములను గూర్చి చెప్పుచు గోప స్త్రీలను మఱలి పోవునట్లు ప్రోత్సహించుచున్నాడు మూడు శ్లోకము లలో. (24-25)

శ్లో॥ అ స్వర్గ్యమయ శస్యం వా ఫల్గు కృచ్ఛ్రం భయావహమ్ ।
జుగుప్సితం చ సర్వత్ర హ్యౌపపత్యం కులస్త్రియః ॥ 26

తా. కులస్త్రీకి జారత్వముతో సౌఖ్యము పొందుట అన్ని విధముల నిందనీయము, అసహ్యకరము, భయావహము, దుస్సంపాద్యము, తుచ్ఛము, అకీర్తికరము, పాపలోకప్రాప్తి కారణము 26

టీ:- అస్వర్గ్యమితి. ఫల్గు తుచ్ఛం. కృచ్ఛ్రం దుస్సంపాద్యం. ఔపపత్యం జారసౌఖ్యం. 26

టీ:- ఫల్గు-తుచ్ఛమైనది కృచ్ఛ్రం-సంపాదించుకొనుటకు మిక్కిలి కష్టమైనది. ఔపపత్యం-జారసౌఖ్యము. 26

శ్లో॥ శ్రవణాద్దర్శనాద్ధ్యానాన్మయి భావోఽనుకీర్తనాత్ ।
న తథా సన్నికర్షేణ ప్రతియాత తతో గృహాన్ ॥ 27

తా. నన్ను గుఱించి వినుచుండుట వలన, నన్ను మనస్సుతోనే దర్శనము చేసుకొనుచుండుట వలన, నన్ను ధ్యానము చేయుచుండుట వలన, నాయందే తలంపు నిలుపు చుండుట వలన నా గుఱించి కీర్తించు చుండుట వలన మాత్రమేనాయందలి ప్రేమ, భక్తివృద్ధి యగును కాని, అట్లు కాక నాకు సన్నిహితముగనుండుట, లేక నా సమక్షమున నుండుట అనువాని వలన భక్తి వృద్ధిచెందదు. అందువలన మీ ఇండ్లకు మఱలిపొండు. 27

శ్రీ శుక ఉవాచ

శ్లో॥ ఇతి విప్రియమాకర్ణ్య గోప్యో గోవిందభాషితమ్ ।
విషణ్ణాభగ్న సంకల్పాశ్చింతామాపుర్దురత్యయామ్ ॥ 28

టీ:- కించ. శ్రవణాదితి. (27-28)

శ్లో॥ కృత్వా ముఖాన్యవశుచశ్శ్వసనేన శుష్యద్బిం
బాధరాణి చరణేన భువం లిఖంత్యః ।
అస్రైరుపాత్తమషిభిః కుచకుంకుమాని
తస్థుర్మృజంత్య ఉరుదుఃఖభరాశ్శుతూష్ణీమ్ ॥ 29

టీ:- చింతా ప్రాప్తానాం స్థితిమాహ-కృత్వేతి. శుచః శోకాదుద్గతేన శ్వసనేన శుష్యంతో బింబాధరా యేషు ముఖేషు. తాని అవ అవాంచి కృత్వా. అథ అంగుష్ఠేన మహీం లిఖంత్యః. తథా గృహీతకజ్జలైర శ్రుభిః కుచ కుంకుమాని క్షాళయంత్యః తూష్ణీం స్థితాం. యతః ఉరు దుఃఖభరో యాసాం తాః. 29

శ్రీశుకయోగీంద్రుడిట్లనుచున్నాడు.

తా. అని కృష్ణుడు చెప్పిన అప్రియమైన మాటలువిని గోపస్త్రీలు ఖిన్నులై, కోరికచెదరినవారై దుర్భరమైన చింతను పొందిరి. 28

టీ:- అదియుగాక 'శ్రవణమువలన' ఇత్యాదిగ వారిని వారించు చున్నాడు. (27-28)

తా. దుఃఖమువలన ముఖములను నేలవైపునకు దించుకొని, నిట్టూర్పుచేత పాలిపోవు దొండపండ్లవంటి పెదవులుగలవారై, కాలి చేత నేలను రాయుచు, కన్నీటిచే కరిగిపోవుచున్న కాటుక నలుపుచేత జారిపోవుచున్న కుచములమీది కుంకుమ పూతగలవారై, గోపస్త్రీలు మిక్కిలి దుఃఖముచేత నిండినవారై ఊరక పైపూతలు పోగొట్టుకొనుచు (కాటుక, కుంకుమ మొదలగు) మౌనముగ నుండిరి. 29

టీ:- శుచః - శోకమువలన - ఉద్గతేన - పైకిఉబుకుచున్న. శ్వసనేన - శ్వాసించుటచేత - శుష్యంతః - ఎండిపోవుచున్న - బింబాధరాః - దొండపండ్ల వంటి పెదవులు - ఏ ముఖముల యందు గలవో వానిని - అవ - కిందకు కృత్వా - చేసి - అథ-ఇక క్రింది (కాలి) అంగుష్ఠేన - పెద్ద వ్రేలితో - మహీం - నేలను - లిఖంత్యః-

రాయుచున్నవారై - అట్లే కన్నీటిచే తీసుకొనిపోబడు కాటుకతో - కుంచములపైని కుంకుమపూతలు కనబడు చుండ ఊరక ఉండిపోయిరి. ఎందువలననగ - ఎవరియందు మిక్కిలి దుఃఖపు బరువు కలదో - వారు. (ఊరకనుండడరి) 29

శ్లో॥ ప్రేష్ఠం ప్రియేతరమివ ప్రతి భాషమాణం
కృష్ణం తదర్థవినివర్తితసర్వకామాః ।
నేత్రే విమృజ్య రుదితోపహతే స్మకించిత్సం
రంభగద్గదగిరోఽ బ్రువతానురక్తాః ॥ 30

తా. ఎవ్వాని కొఱకు తమ కోరికలన్నియు విడిచిపెట్టిరో అట్టి ప్రియతముడైన కృష్ణునితో-అప్రియముగ మాట్లాడు కృష్ణునితో, తమ రోదనమును విరమించి, కన్నులు తుడుచుకొని, కొంత సరంభముతో కూడినవణుకుచున్న స్వరముతో,గోపస్త్రీలు,అనురాగముతో ఇట్లనిరి. 30

టీ:- కించ ప్రేష్ఠమితి. కించిత్సంరంభేణ కోపావేశేన. గద్గదా గిరో యాసాం తాః. అబ్రువత. స్మరసంరంభే కారణం ప్రేష్ఠమిత్యాది. ప్రియేతరమివ వైరిణమివ. ప్రతిభాషమాణం ప్రత్యాచక్షాణం. 30

టీ:- మరియు - కించిత్సరంభేణ - కొంత కోపావేశముతో - గద్గదమైన మాటలు ఎవరివో వారు (గోపస్త్రీలు) అబ్రువత-(అనిరి) చెప్పిరి. స్మర సంరంభమునకు కారణము- ప్రేష్ఠం- మిక్కిలి ప్రియమైన వాడగుట - అట్టి వానినిగూర్చి-మొదలగునవి. ప్రియేతరమివ - శత్రువును వలె - ప్రతిభాష మాణం- మాట్లాడుచున్న వానిని గూర్చి (గోపస్త్రీలు ఇట్లనిరి - అని)30

**గోప్య ఊచు**

శ్లో॥ మైవం విభో௨ర్హతి భవాన్ గదితుం నృశంసం
సంత్యజ్య సర్వ విషయాం స్తవ పాదమూలమ్ ।
భక్తా భజస్వ దురవగ్రహమాత్యజాస్మాన్ దేవో
యథాదిపురుషో భజతో ముముక్షూన్ ॥ 31

టీ:- మేతి. నృశంసం క్రూరం దురవగ్రహ స్వచ్ఛంద. పాదమూలం భక్తాః సేవితవతీః అస్మాన్ భజస్వ. త్వం మా త్యజేతి. 31

**గోపస్త్రీలిట్లనిరి.**

తా. ఇట్లు క్రూరముగ మాట్లాడుట నీకు తగదు. నీ పాదములవద్ద విషయములన్నింటిని విడిచిపెట్టియున్న భక్తులము మేము. స్వచ్ఛంద వర్తనా! ఆదిపురుషుడైన దేవుడు మోక్షార్థులను భజించుచున్నట్లు నీవు కూడ మమ్ము అనుగ్రహింపుము.మమ్ములను విడిచిపెట్టకుము. 31

టీ:- నృశంసం-క్రూరమైన దానిని దురవగ్రహ - స్వేచ్ఛావర్తనము కలవాడా! నీ పాదమూలములను భక్తురాండ్రుగ సేవించుచున్నవారము -మమ్ము అనుగ్రహింపుము. నీవు మమ్ము వదిలివేయకుము - అని. 31

శ్లో॥ యత్పత్యపత్య సుహృదామనువృత్తిరంగ
స్త్రీణాం స్వధర్మ ఇతి ధర్మవిదా త్వయోక్తమ్ ।
అస్త్వేతదేవముపదేశ పదే త్వయీశే ప్రేష్ఠో
భవాం స్తనుభృతాం కిల బంధురాత్మా ॥32

టీ:- అపి యదుక్తం. యదితి. త్వయా ధర్మవిదేతి సోపహాసం ఏవం ఏతత్. ఉపదేశానాం పదేవిషయే. త్వయ్యేవాస్తు. ఉపదేశపదత్వే హేతుః ఈశ ఇతి వివిదిషా. వాక్యేన సర్వోపదేశానామీశపరత్వావగమాదితి భావః. ఈశత్వే హేతుః. ఆత్మాకిలభవానితి భోగ్యస్య హి సర్వస్య

తా. మఱియు తమభర్తలకు, పుత్రులకు, బంధువులకు సేవలందించుటయే స్త్రీల స్వధర్మమని ధర్మవేత్తవగు నీవు చెప్పినది ఉపదేశ స్థానముననే ఉండనిమ్ము. నీవు ప్రేమస్వరూపుడవు. ఈశ్వరుడవగు అట్టి నీ యందు సమస్త శరీరధారులు ఆధారపడియున్నారు. వారికి నీవే బంధువువు. ఆత్మవు. 32

టీ:- నీచే చెప్పబడినది కూడ - ధర్మవేత్తవగు నీచే చెప్పబడినది పాప నాశకమే. ఇట్లు ఇది ఉపదేశముచేయువారి - పదే - విషయమునందు - నీ యందే ఉండనిమ్ము - ఉపదేసవిషయమగుటకు కారణము - నీవు (ఆత్మవట) ఈశ్వరుడవు అని తెలిసికొనుటకు

భోక్తాత్మైవేశ ఇత్యతః ప్రేష్ఠోబంధుశ్చ భవానేవేతి సర్వబంధుషు కరణీయం. త్వయ్యే వాస్త్వితి భావః. అథవా ధర్మోపదేశానాం పదే స్థానే ధర్మోపదేష్టరి త్వయి సతి. అస్మాసు చ ధర్మం జిజ్ఞాసమానాసు సతీషు త్వయా ధర్మవిదా. యదుక్తం. ఏవమేతదస్తు న తు త్వం ధర్మోపదేష్టా. కింతు. భవానాత్మేతి అథ వా యదుక్తం తదుపదేశ పదే తద్గోచరే పురుషే. అస్తునామత్వయితు ఈశే స్వామినిసతి. ఏవం కాక్వానైవ మిత్యర్థః. యతస్తనుభృతాం త్వమాత్మా ఫల రూప ఇతి. యద్వా. యదుక్తం పత్యాది శుశ్రూషణం ధర్మ ఇత్యేవ మేత త్త్వయ్యేవాస్తు. కుతః. ఈశే ఉపదేశపదే శుశ్రూషణీయత్వేన. ఉపదిశ్య మానానాం పత్యాదీనాం పదే అధిష్టానే కుతః. ఈశే ఈశ్వరమధిష్టానం వినా కోఽపి పతి పుత్రాదిర్నామనాస్తీతి. అన్యత్సమానం. అలమతి విస్తరేణ. 32

ఇచ్ఛ-వాక్యముచేత ఉపదేశములన్నింటికిని ఈశ్వర పరత్వమగు అవగాహనవలన అని భావము. ఈశత్వమునకు కారణము. నీవు ఆత్మవుఅట, అని, భోగ్యము లన్నింటికిని భోక్త ఆత్మయగు ఈశ్వరుడే అని-అందువలన మిక్కిలిగ ప్రేమించువాడవు, బంధువువుకూడ నీవేఅని బంధువులందఱి విషయమున చేయదగిన సేవ అంతయు నీయందే కలదు అని భావము- లేక - ధర్మమును ఉపదేశించువారి యొక్క - పదే - స్థానమున నీవే ధర్మోపదేష్టవు అయినందున అని- ధర్మమును తెలిసికొనవలెననెడి ఇచ్ఛగల మాయందు - సతుల యందు - ధర్మవేత్తవైన నీ చేత ఏది చెప్పబడినదో అది అటుండనిమ్ము - నీవు ధర్మోపదేష్టవు కావు. (అనుకొందుము) కాని నీవు ఆత్మవే - లేక - ఏది చెప్పబడినదో దాని ఉపదేశస్థానమున - ఆ ఉపదేశము గోచరమగు చున్న పురుషుని యందు ఉండనిమ్ము. అనగా నీవే ఈశ్వరుడవు, స్వామివి అగుచుండగా - ఇట్లు కాకువుచేత దైవమని అర్థము. శరీరధారులకు నీవే ఆత్మవు. ఫలరూపుడవు అయినందు వలన అని- లేక - పతులు మొదలగువారి సేవచేయుట అను ఏ ధర్మము చెప్పబడినదో అది అంతయు నీ యందే ఉండనిమ్ము. ఎందువలన? ఉపదేశస్థానమగు నీవే సేవింపదగినవాడవు కాబట్టి - ఉపదేశింప బడుచున్న పతి మొదలగువారి స్థానము - అధిష్ఠానమగు నీవే కాబట్టి - ఎందువలన? అధిష్ఠానమగు ఈశ్వరుడు, వినాపతి పుత్రాదులు

శ్లో॥ కుర్వంతి హి త్వయి రతిం కుశలాః స్వ
ఆత్మన్నిత్యం ప్రియైః పతిసుతాది భిరార్తిదైః కిమ్ ।
తన్నః ప్రసీద పరమేశ్వర మాస్మ ఛింద్యా
ఆశాం భృతాం త్వయి చిరాదరవిందనేత్ర ॥33

టీ:- ఏతత్సదాచారేణ దృఢయంత్యః ప్రార్థయంతే. కుర్వంతీతి. కుశలాః శాస్త్రనిపుణాః తథా చ శాస్త్రం కిం. శ్రు. ప్రజయా కరిష్యామో యేషాం యేషాం నోఽ యమాత్మా లోక ఇత్యాది. 33

ఎవ్వరును - అట్లనబడు వారెవ్వరును లేరు - ఉండరు - అని. తక్కినది సమానము. - ఇకచాలును. 32

తా. ఆత్మస్వరూపా! జ్ఞానులైనవారు ఆత్మవగు నీయందే రమించుటకు గాఢముగ ఇష్టపడుచుందురు. ( ఏలయన నీవు నిత్యుడవైనందున) (కాని) అశాశ్వతులగు, భర్తలు, పుత్రులు మొదలగువారితో ప్రయోజన మేమి? కమల పత్రేక్షణా ! పరమేశ్వరా! చిరకాలము నుండి నీ యందు ఆశలు పెంచుకొనియున్న మా ఆశలు త్రెంచకుము. అందువలన మమ్ము అనుగ్రహింపుము. దుఃఖము కలిగించువారితో ప్రయోజన మేమియులేదు. 33

టీ:- దీనిని సదాచారముచేత బలపరుచుచు ప్రార్థించుచున్నారు. కుశలాః - శాస్త్రనిపుణులు అట్లే శాస్త్రముకూడ ఏమిటి? “కింప్రజయా కరిష్యామో యేషాం యేషాం నోఽ యమాత్మాలోక” ఇత్యాది. ఎవరివలన ఆత్మ సాక్షాత్కారము లభింపదో అట్టి-వారి సంతానమువలన ఏమి సాధింప గలము అని మొదలుకొని 33

శ్లో॥ చిత్తం సుఖేన భవతాపహృతం గృహేషు
యన్నిర్విశ త్యుత కరావపి గృహ్యకృత్యే ।
పాదౌ పదం న చలతస్తవ పాదమూలాద్యామః
కథం వ్రజమహో కరవామ కింవా ? ॥34

టీ:- కించ. ప్రతియాతేతి యదుక్తం తదశక్యం. త్వయైవ చిత్తాదీనామ పహృతత్వాదిత్యాహుః చిత్తమితి. యదస్మాకం చిత్తమేతావంతం కాలం సుఖేన గృహేషు నిర్విశతి. తత్త్వయాపహృతం. కరావపి యౌ గృహ్య కృత్యే నిర్విశతః తావపి సుఖాత్మనా త్వయేతి వా. 34

శ్లో॥ సించాంగ నస్త్వదధరామృతపూరకేణ
హాసావలోక కలగీత జహృచ్ఛయాగ్నిమ్ ।
నో చేద్వయం విరహజాగ్న్యుపయుక్తదేహాః
ధ్యానేన యామ పదయోః పదవీం సఖే తే ॥ 35

తా. ఇంతకాలము వఱకు మా మనస్సు ఇంటి పనులలోనికి సుఖముగా ప్రవేశించెడిది. చేతులు కూడ తదనుగుణముగ చక్కగ పనులు చేసుకొని పోవుచుండెడివి. కాని ఇప్పుడు నీచే మా మనస్సు అపహరింపబడినది అందుచే నీ పాదముల వద్ద నుండి మా పాదములు ఒక్క అడుగైనను ముందుకు కదులుటలేదు. ఇక వ్రజమునకు ఎట్లు పోగలము? అహో ! ఏమిచేయవలెనో? ఏమి చేయుగలవో (తెలియకున్నది) ? 34

టీ:- మాకు ప్రతికూలముగ నీచే ఏది చెప్పబడినదో అది సాధ్యము కానిది నీ చేతనే మా చిత్తము మొదలుగునవి అపహరింపబడుట చేత అని చెప్పుచున్నారు. మా మనస్సు ఇంతవఱకైన కాలమున సుఖముగ గృహ కృత్యములోప్రవేశించుచుండెను. అదినీచేత దొంగలింప బడినది. చేతులుకూడ ఏవి ఇంటిపనులలో ప్రవర్తించుచుండెడివో అవికూడ సుఖాత్ముడవగు నీచేత అపహరింపబడినవి. (అనియు) 34

తా. కృష్ణా! నీ నవ్వులచేత, నీ చూపులచేత, నీ మధురగీతములచేత మా హృదయములలో విడువబడిన కామాగ్నిని నీ అధరామృత రసముతో నింపి తడుపుము. లేనిచో మేము మా విరాహాగ్నితో కూడిన దేహములు కలవారమై ధ్యానముచేతనే అడుగులువేసి నీ స్థానమును చేరుదుము సఖా!. 35

టీ:- సించేతి. అతః అంగ హే కృష్ణ నోఽస్మాకం. తవాధరామృత పూరకేణ తవైవ హాససహితేనావలోకేన. కలగీతేన చ. జాతో యో హృచ్ఛయాగ్నిః కామాగ్నిః తం సించ. నోచేదయం తావదేకోఽగ్నిస్తథా విరహోజ్జనిష్యతే. యోఽగ్నిస్తేన చ ఉపయుక్తదేహాః దగ్ధశరీరాః యోగిన ఇవ తే పదవీమంతికం. ధ్యానేన యామః ప్రాప్నుయామ. 35

టీ:- అందువలన - అంగ - ఓ కృష్ణా! నః - మాకు - నీ అధరామృతమును నింపుటచేత - నీదేయైన నవ్వుతో కూడిన చూపుచేత - మధురగానము చేతను కలిగిన ఏ కామాగ్ని కలదో - దానిని తడుపుము. లేని యెడల ఈ ఒకే అగ్ని అట్లు విరహము వలన పుట్టునో ఆ అగ్నిచేత - ఉపయుక్తదేహాః - కాల్చబడిన శరీరములు కలవారమై - యోగులవలెనే నీ స్థానమును, సమీపమును - ధ్యానముతో పొందెదము. 35

శ్లో॥ యర్హ్యంబుజాక్ష తవ పాదతలం రమాయా
దత్తక్షణం క్వచిదరణ్యజనప్రియస్య ।
అస్ప్రాక్ష్మ తత్ప్రభృతి నాన్యసమక్షమంగ
స్థాతుం త్వయాభిరమితాబత పారయామః ॥36

తా. తామరరేకులవంటి కన్నులుగల ఓ కృష్ణా! అడవిలో జీవించు మనుష్యులను ప్రేమించు నీ పాదములను లక్ష్మీదేవికి సేవార్థమై అనుమతించినపుడు మేముకూడ నీ పాదములను స్పృశించితిమి. అప్పటినుండి నీచేత ఆనందింపజేయబడిన మేము ఇతరుల సమక్షమున నిలువలేక పోవుచున్నాము. అయ్యో! మాకు శక్యమగుటలేదు. 36

టీ:- నను స్వపతీనేవోపగచ్ఛతత ఏనమగ్నిం సించేయురితి చేత్త్రాహుః. యర్హీతి. రమాయాః లక్ష్మ్యాః. దత్తక్షణం దత్తోత్సవం. దత్తావసరం వా. తదపి క్వచిదేవ న సర్వదా. అరణ్యజనాః ప్రియా యస్య తస్య తవ. అరణ్య జనప్రియత్వాదరణ్యే క్వచిత్ యర్హి, అస్ప్రాక్ష్మ స్పృష్టవత్యో వయం. తత్ర చ. త్వయా అభిరమితాః ఆనందితాస్త్వత్యః

టీ:- మీ భర్తల వద్దకే పోయి మీ కామతాపమును చల్లార్చుకొనవచ్చును కదా అనినచో చెప్పుచున్నారు. "యర్హి" అని రమాయాః - లక్ష్మికి - దత్త క్షణం - ఇచ్చిన ఉత్సవము - లేక - ఇచ్చిన సమయము - అదియును ఎప్పుడో ఒకప్పుడు ఎల్లవేళలకాదు. అడవిలో జీవించు మనుష్యులు ఎవనికి ప్రియమైనవారో అట్టి నీ యొక్క -

తదారభ్య. అన్యసమక్షం స్థాతుమపి న పారయామః న శక్నుమః తుచ్ఛాస్తేన రోచంత ఇత్యర్థః. 36

అరణ్య జనప్రియత్వము వలన అరణ్యములోనే ఒక సమయమున- అస్ప్రాక్ష - మేము స్పృశించితిమి. అప్పుడు నీ చేత - అభిరమితాః- ఆనందింపజేయబడిన వారమై - అది మొదలుకొని - ఇతరులముందు నిలుచుటకు - నపారయామః - శక్తులము కాకపోతిమి. వారు తుచ్ఛులు - రుచింపరు - అని యర్థము. 36

శ్లో॥ శ్రీర్యత్పదాంబుజ రజశ్చకమే తులస్యా
లబ్ధ్వాపి వక్షసి పదం కిల భృత్యజుష్టమ్ ।
యస్యాస్స్వవీక్షణకృతేఽన్యసుర ప్రయాస
స్తద్వద్వయం చ తవపాదరజః ప్రపన్నాః ॥37

తా. ఏ లక్ష్మీదేవికటాక్షము కొఱకు ఇతర దేవతలందఱును తపించుచు ప్రయాస పడుచుందురో అట్టి లక్ష్మీదేవి ఇతరులెవ్వరు సేవింపని - లేక అందఱు భక్తులతో సేవింపబడిన నీ వక్షస్థలమున స్థానమును పొందియున్నను తులసితో సహా నీ పాదపాంసువులనే అపేక్షించినది. ఆ విధముగ మేముకూడ నీ పాదధూళి కణములకు ప్రపన్నులమైనాము. (భృతి+అజుష్టం=ప్రతిఫలము కొఱకైనను సేవింపబడజాలనిది; భృత్య+ జుష్టం=సేవకులచేత సేవింపబడినది)37

టీ:- త్వత్పాద సౌభాగ్యం త్వతిచిత్రమిత్యాహుః. శ్రీరితి. వక్షసి అసాపత్న్యం స్థానం లబ్ధ్వాపి తులస్యా సపత్న్యా సహ యత్తవ పదాంబురజః కామయతే స్మభృత్త్యైస్సర్వైర్జుష్టమితి సౌభాగ్యాతిరేకోక్తిః. యస్యాః స్వవీక్షణే శ్రీరాత్మానం విలోకయత్వి త్యేదర్థం. అన్యేషాం బ్రహ్మాదీనాం. తపోభిః ప్రయాసః. సా తద్రజస్త్వద్వత్. వయమపి ప్రపన్నా ఇతి. 37

టీ:- నీ పాద సౌభాగ్యము అతి విచిత్రమైనదని చెప్పుచున్నారు. వక్షస్థలమున ఏ ప్రతిద్వంద్విలేని స్థానమును పొందియును, తులసియను సపత్నితోకూడ - ఏ నీపాదపద్మముల రజము కోరబడియుండినదో - భృత్త్యైస్సర్వైః - అందఱు సేవకులచేత - జుష్టం - అనుభవింపబడినది అని (పాదపద్మముల) వక్షస్థలము యొక్క

శ్లో॥ తన్నః ప్రసీద వృజినార్దన తేఽంఘ్రిమూలం
ప్రాప్తా విసృజ్య వసతీ స్త్వదుపాసనాశాః ।
త్వత్సుందరస్మిత నిరీక్షణ తీవ్ర కామ
తప్తాత్మనాం పురుషభూషణ దేహి దాస్యమ్ ॥38

టీ:- తదితి. హే వృజినార్దన దుఃఖహంతః త్వదుపాసనే త్వద్భజన ఏవ ఆశా యాసాం తాః వయం వసతీః గృహాన్ విసృజ్య. యోగిన ఇవ ప్రాప్తాః. తవ సుందరస్మిత విలసిత నిరీక్షణేన యస్తీవః కామస్తేన తప్తచిత్తానాం నః. హే పురుషరత్న దాస్యం దేహి. 38

అతిశయించిన సౌభాగ్యమునకు సంబంధించినమాట, ఎవరి స్వవీక్షణములచేత, లక్ష్మి తననుతాను చూచుకొనునో - అని ఇచటి యర్థము. ఇతరులైన బ్రహ్మాదులకు తపస్సులచేత క్లేశము-ఆమె- ఆ రజము-అట్లే మేముకూడ ప్రపన్నులము (శరణాగతులము) అని. 37

తా. పాపభంజకా ! అందువలన మమ్మనుగ్రహింపుము. నీ పాదముల వద్దకు వచ్చినారము. మాగృహములు (కుటుంబములు) వదలి వచ్చినాము. నిన్ను ఉపాసించు ఆశగలవారమై వచ్చియున్నాము. పురుషోత్తమా! నీ అందమైన చిఱునవ్వును చూచుటకు గాఢమైన కోరికతో తపించుచున్న మనస్సులుగల మాకు నీ సేవాభాగ్యమునను గ్రహింపుము. 38

టీ:- హే వృజినార్దన - ఓ దుఃఖహరా! నీఉపాసనలో నిన్ను భజించుటయే ఆశ ఎవరికోవారు - మేము వసతీః - ఇండ్లను- విసృజ్య - విడిచి - యోగినుల వలె వచ్చితిమి - నీ అందమైన చిరునవ్వుతో విలసిల్లు చూపుతో ఏ తీవ్రమైన కామముగలదో దానితో తపించిన చిత్తములు గలవారమైనమాకు - ఓపురుషరత్నమా! నీ సేవచేయు భాగ్యము నిమ్ము. 38

శ్లో॥ వీక్ష్యాల కావృతముఖం తవ కుండల
శ్రీగండస్థలాధరసుధం హసితావలోకమ్ ।
దత్తాభయం చ భుజదండయుగం విలోక్య
వక్షశ్శ్రియైకరమణం చ భవామ దాస్యః ॥39

టీ:- నను గృహాదిస్వామ్యం విహాయ మదాస్యం కిమితి ప్రార్థ్యతే ఉత ఆహుః. వీక్ష్యేతి. అలకావృతముఖం కేశాంతైరావృతం ముఖం. తథా కుండలయోః శ్రీర్యయోస్తే. గండస్థలేయస్మిన్. అధరేసుధాయస్మిన్ తచ్చ తచ్చ ముఖం వీక్ష్య. దత్తాభయం భుజదండయుగ్మం చ వక్షశ్చ. శ్రియాః ఏకమేవ రమణం రతిజనకం. అత్ర విసర్గలోపే సంధిరార్షః. వీక్ష్య దాస్య ఏవ. భవామేతి. 39

శ్లో॥ కాస్త్ర్యం గతే కల పదాయత వేణుగీత
సంమోహితార్య చరితాన్న చలేత్త్రిలోక్యామ్ ।
త్రైలోక్య సౌభగమిదం చ నిరీక్ష్య రూపం
యద్గోద్విజ ద్రుమ మృగాః పులకాన్యబిభ్రన్ ॥40

తా. ముంగురులచే ఆవరింపబడియున్న నీ ముఖమును, నీ కుండలముల శోభను, క్రింది పెదవిలోని అమృతమును, నవ్వుతో కూడిన చూపును, అభయమిచినట్లున్న నీ దండములవంటి రెండు భుజములను, వక్షస్థలముయొక్క శోభ వలని ఆకర్షణను చూచి నీ సేవకురాంద్ర మగుచున్నాము. 39

టీ:- ఇంటి యాజమాన్యమును విడిచి నా ముఖమునెందుకర్థించు చున్నారు? అని అడిగినచో దానికి చెప్పుచున్నారు. కేశాంతములచేత ఆవరింపబడిన ముఖము - అట్లే కుండలములయొక్క శోభలుగల ఏ కపోలద్వయము దేనియందు గలదో (ఆ ముఖము), పెదవుల అమృతము దేనియందుగలదో అది-అట్టి ముఖమును చూచి- అభయ మిచ్చిన రెండు దండములవంటి భుజములును, వక్షమును - సౌందర్యముతో ఒకటే కోరికను పుట్టించునట్టిది(ఇచట విసర్గ లోపమున సంధి ఆర్షము) చూచి సేవకురాంద్రమే అయ్యెదము - అని. 39

తా. ఈ ముల్లోకములయందు ఏ స్త్రీ నీ సుమధుర వేణుగానముచేత మోహితురాలై తన దైనందిన కార్యములనుండి చలించిపోవదు? కృష్ణా! ఏ త్రిలోక సుందరమగు నీ రూపమును చూచి పశువులు, పక్షులు, చెట్లు, మృగములునుచూచి పులకించిపోవునో అట్టి మనోహర రూపమునుచూచి ఏ స్త్రీ చలింపదు? 40

టీ:- నను జుగుప్సితమౌపపత్యమిత్యుక్తం తత్రాహుః - కాస్త్రీతి. అంగ హేకృష్ణ. కలాని పదాని యస్మిన్ తదాయతం దీర్ఘం. మూర్ఛితం స్వరాలాపభేదః. తేన పాఠాంతరే కలపదామృతమయం వేణుగీతం తేన మోహితా కావా స్త్రీ ఆర్యచరితాన్నిజధర్మాన్న చలేత్ యన్మోహితాః పురుషా అపి చలితాః. కించ. త్రైలోక్యసౌభగమితి యత్ యత్ అబిభ్రన్ అబిభరుః. త్వద్ద్యోతకశబ్దశ్రవణమాత్రేణాపి తావన్నిజధర్మత్యాగో యుక్తః కిం పునస్త్వదనుభవేనేతి భావః. 40

టీ:- జారత్వసుఖము అసహ్యకరమని కృష్ణుడు చెప్పినదానికి సమాధానము చెప్పుచున్నారు. "కాస్త్రీ" అని. హే-అంగ-ఓకృష్ణా!-మధురమైన పలుకులు దేనియందో-అట్టి దీర్ఘమైన మూర్ఛితం-స్వరమును ఆలపించుట యందలి ఒక భేదము- దానిచేత- పాఠాంతరమున-కలపదామృతమయం వేణుగీతం-దానితో మోహితురాలైన ఏ స్త్రీ యైనను-ఆర్యచరితాత్- నిజధర్మమునుండి-చలింపదు? మోహితులై పురుషులుకూడ చలించునప్పుడు? మరియు-త్రైలోక్య సుందరమని ఏది చెప్పబడినదో ఆ రూపముచే రోమాంచమును అనుభవింతురో-దానినివ్యక్తపరచు శబ్దమును వినినంతమాత్రమున కూడ నిజధర్మములను విడుచుటయు యుక్తమే అయినప్పుడు ఇక దానిని అనుభవించునప్పుడు చెప్పనదేమి? అని భావము. 40

శ్లో॥ వ్యక్తం భవాన్ వ్రజజనార్తిహరోఽభిజాతో
దేవో యథా ది పురుషస్సురలోకగోప్తా ।
తన్నో విధేహి కరపంకజమార్తబంధో
తప్తస్తనేషు చ శిరస్సు చ కింకరీణామ్ ॥41

తా. ఆదిపురుషుడవగు నీవు, ఎట్లు దేవతా లోకమునకు దేవుడవైన రక్షకుడవో అట్లే వ్రజవాసుల ఆర్తిని హరించుటకొఱకు అవతరించితివి అనుమాట ప్రకటమైనది. అమదుచేత ఆర్తబంధూ! నీ హస్తపద్మమును తపించుచున్న మా స్తనములందు, శిరస్సులయందు-నీ సేవకురాండ్ర మగు మా స్తనములయందు, మా శిరస్సులయందు ఉంచుము. 41

టీ:- వ్యక్తమితి. వ్యక్తం నిశ్చితం. 41

టీ:- వ్యక్తం - నిశ్చయింపబడినది. 41

**శ్రీ శుక ఉవాచ**

శ్లో॥ ఇతి విక్లబితం తాసాం శ్రుత్వా యోగేశ్వరేశ్వరః ।
ప్రహస్య సదయం గోపీరాత్మారామోప్యరీరమత్ ॥42

**శ్రీశుకయోగి ఇట్లనెను.**

తా. సనత్కుమారుడు మొదలగు యోగేశ్వరులకు ప్రభువైన కృష్ణుడు, గోపస్త్రీల దుఃఖపూరితములైన మాటలువిని,దయతో,నవ్వుచు, తనలో తానే రమించువాడయ్యును, వారిని(గోపకాంతలను)రమించెను. 42

టీ:- ఇతీతి. విక్లబితం పారవశ్య ప్రలపితం గోపిః అరీరమత్ రమయామాస. 42

టీ:- విక్లబితం - పరవశించిన మాటలు - గోపకాంతలను - అరీరమత్ - రమించెను. 42

శ్లో॥ తాభిస్సమేతాభిరుదారచేష్టితః
ప్రియేక్షణోత్ఫుల్లముఖీభిరచ్యుతః ।
ఉదారహాసద్విజకుందదీధిత్వర్వ్య
రోచతైణాంక ఇవోడుభిర్వృతః ॥43

తా. నిష్కపటముగ వర్తించువారును, వికసించిన ముఖములుగల వారును అయిన గోపకాంతలతో అమాయకపు నవ్వువలన మొల్లమొగ్గల వలెప్రకాశించు పలువరుసగలవాడును, ప్రియమైన చూపులుగల వాడును అయిన కృష్ణుడు - తారకలతో ఆవరింపబడిన చంద్రుని వలె మిక్కిలి ప్రకాశించెను. 43

శ్లో॥ ఉపగీయమాన ఉద్గాయన్ వనితాశతయూథపః ।
మాలాం బిభ్రద్వైజయంతీం వ్యచరత్సవనాద్వనమ్ ॥ 44

తా. తనను గూర్చి వారిచే కీర్తింపబడుచు, వారిని గూర్చి తాను పాడుచు, వందలమంది స్త్రీల సమూహములకు నాయకుడైన కృష్ణుడు వైజయంతి మాలను ధరించి వనమును శోభింపజేయుచు తిరుగు చుండెను. 44

శ్లో॥ నద్యాః పులినమావిశ్య గోపీభిర్హేమవాలుకమ్ ।
జుష్టంత త్తరళాంభోజ కుముదామోద వాయునా ॥ 45

తా. బంగారపు రజముపరచినట్లున్న యమునానదియొక్క ఇసుక తిన్నెను గోపకాంతులతో కృష్ణుడు ప్రవేశించెను,అది అప్పుడే వికసించిన తామరల యొక్కయు, తెల్లకలువలయొక్కయు సువాసనలతో కూడిన గాలిచే ఆనందపడుచుండెను.(పరిమళించియుండెను). 45

టీ:- తాభిరితి. ప్రియస్యేక్షణేన. ఉత్ఫుల్లాని ముఖాని యాసాం తాభిః ఉదారహాసశ్చ ద్విజాశ్చ తేషు కుంద కుసుమవద్దీధితిర్యస్య సః ఏణాంకశ్చంద్రః. (43-45)

టీ:- ప్రియుని చూపులతో వికసించిన ముఖములు ఎవరికో వారితో- కప టములేని నవ్వుగల దంతములయందు మొల్లపువ్వుల వంటి కాంతులు ఎవరికో అట్టివాడగు కృష్ణుడు - ఏణాంకః - చంద్రుడు (చంద్రునివలె) (43 - 45)

శ్లో॥ బాహు ప్రసారపరిరంభకరాలకోరు
నీవి స్తనాలభన నర్మ నఖాగ్ర పాతైః ।
క్ష్వేళ్యావలోకహసితైర్వ్రజ సుందరీణా
ముత్తంభయన్ రతిపతిం రమయాం చకార ॥ 46

తా. చేతులు చాచుట, ఆలింగనములు, చేతులు, శిరోజములు, తొడలు, ముడులు, కుచములు మొదలగు వానిస్పర్శ వలన గుప్తముగ నేర్పడిన నఖ క్షతముల (గోరుగిచ్చుళ్లు) చేతను, క్రీడించుచుండుటచేత చూపులు, నవ్వులు మున్నగువానిచేతను వ్రజస్త్రీలను ఉత్తేజపరచుచు మదనుని పరవశింపజేసెను. 46

టీ:- బాహ్వితి. బాహుప్రసారశ్చ. పరిరంభశ్చ. కరాదీనామాలభనం స్పర్శశ్చ. నర్మ పరిహాసశ్చ. నఖాగ్రపాతశ్చ. తైః క్ష్వేళ్యా క్రీడయా చ. అవలోకనైర్హసితైశ్చ కామంతాసాముద్దీపయన్ తాః రమయామాస. 46

టీ:- చేతులుచాచుట, కౌగిలించుట, చేతులు మొదలైన వానిని స్పర్శించుట, పరిహాసములాడుట, గోటి ఆనవాళ్లు పడుట-ఇట్టి వానిచేత - క్ష్వేళ్యా - క్రీడచేత - చూపులచేత, నవ్వులచేత ఇష్టమైన రీతిగ వారిని ఉద్దీపింపజేయుచు వారితో క్రీడించెను. 46

శ్లో॥ ఏవం భగవతః కృష్ణాల్లబ్ధమానా మహాత్మనః ।
స్వాత్మానాం మేనిరే స్త్రీణాం మానిన్యోఽభ్యధికం భువి ॥ 47

టీ:- ఏవమితి. మహాత్మనః అనాసక్తచిత్తత్వాదితి భావః. 47

శ్లో॥ తాసాం తత్సౌభగమదం వీక్ష్యమానం చ కేశవః ।
ప్రశమాయ ప్రసాదాయ తత్రైవాంతరధీయత ॥ 48

టీ:- తాసామితి. తాత్సౌభగమదం అస్వాధీనతాం. మానం గర్వం కేశవః కశ్చ ఈశశ్చ కేశౌ తౌ వశ యతీతి తథా సః. 48

శ్రీ మద్భాగవతే, మహాపురాణే దశమస్కంధే,
ఏకోనత్రింశోఽధ్యాయః

తా. మహాత్ముడగు కృష్ణునివలన ఈ విధముగ గౌరవమును పొందిన ఆ గోపకాంతలు, "స్త్రీలలో ఈ ప్రపంచమున అందఱికన్న గొప్పవారమైతిమి" అని తమను గూర్చి భావించుకొనిరి. 47

టీ:- మహాత్మనః - అనాసక్త చిత్తము వలననని భావము. 47

తా. కృష్ణుడు వారి సౌభాగ్యమదమును, వారు పొందుచున్న అహంభావమును గమనించి, దానిని శమింపజేయుట కొఱకు వారిని అనుగ్రహించుట కొఱకు అచ్చటనే అంతర్హితుడయ్యెను. 48

టీ:- తత్సౌభగమదం - అస్వాధీవతను - మానం - గర్వమును - కేశవః-బ్రహ్మ, ఈశుడు (కేశౌ) వీరిద్దరిని వశమునందుంచు కొనువాడు కేశవుడు. 48

అని శ్రీమద్భాగవతమున దశమస్కంధమందు
ఇరువది తొమ్మిదవ అధ్యాయము సమాప్తము.

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

## త్రింశోధ్యాయః

శ్లో॥ అంతర్హితే భగవతి సహసైవ వ్రజాంగనాః ।
అతప్యం స్తమచక్షాణాః కరిణ్య ఇవ యూథపమ్ ॥ 1

టీ:- శ్లో."త్రింశే విరహసంతప్త గోపీభిః కృష్ణమార్గణం, ఉన్మత్తవన్న నియతం భ్రమతీ భిర్వనే వనే".అంతరితి.ఆచక్షాణాఃఅపశ్యంత్యః. 1

శ్లో॥ గత్యానురాగస్మితవిభ్రమేక్షితైః
మనోరమాలాప విహార విభ్రమైః ।
ఆక్షిప్తచిత్తాః ప్రమదా రమాపతేస్తాస్తా
విచేష్టా జగృహుస్తదాత్మికాః ॥ 2

టీ:- గత్యేతి.గత్యా అనురాగస్మితాభ్యాం చ విభ్రమేక్షితాని విలాస నిరీక్షితాని. తైశ్చమనోరమా ఆలాపాశ్చ. విహరాశ్చ క్రీడాశ్చ విభ్రమాః అన్యే చ విలాసాః తైశ్చ. రమాపతేర్గత్యాదిభిరేతైరాక్షిప్తాని ఆకృష్టాని. చిత్తాని యాసాం తాః అతస్తస్మిన్నేవ ఆత్మా యాసాం తాః. తస్య వివిధా

## 30వ అధ్యాయము

తా. భగవానుడగు కృష్ణుడు అంతర్హితుడైనపిమ్మట, వ్రజస్త్రీలు వెంటనే అతనిని కానక, తమ గజయూధమునకు అధిపతియైన గజరాజుని కానని ఆడయేనుగులవలె తపించిరి. 1

టీ:- విరహముచే తపించుచున్న గోపస్త్రీలు, పిచ్చివారివలె అస్తవ్య స్తముగ ప్రతి అడవియందు తిరుగుచున్నవారై కృష్ణుని వెదకుట ఈముప్పదియవ అధ్యాయమున వర్ణింపబడినది - అచక్షణాః- చూడనివారై. 1

తా. కృష్ణుని నడతచేత, ప్రేమచేత, చిరునగవుచేత, విలాసవంతము లగు చూపులచేతను, హృదయంగమములైన సంభాషణలచేతను, అతని క్రీడలచేతను, ఇతరములైన విలాసములచేతను ఆకర్షింపబడియున్న చిత్తములు గలవారైన గోపకాంతలు, అతని ఆయా లీలలను అతనిని వలనే అనుకరించుచుండిరి. 2

టీ:- గత్యా - నడవడిచేత, అనురాగపు చిరునవ్వులచేత - విభ్రమే క్షితాని - విలాసపుచూపులచేతను, వానిచేతను మనోహరములైన సంభాషణములు, విహారాశ్చ - క్రీడలును - విభ్రమాః - ఇతరములైన విలాసములు - వానిచేతను - శ్రీకృష్ణుని 'గతి' మొదలగు వానిచేత

శ్చేష్టా జగృహుః తదనుకరణైరా క్రీడన్. 2

– ఆక్షిప్తాని – ఆకర్షింప బడియున్న చిత్తాని – మనస్సులు ఎవరికోవారు – అందువలన అతనియందే ఆత్మ ఎవరికో వారు – అతని వివిధము లైన చేష్టలును – జగృహుః – వానిననుకరించుచు క్రీడించిరి. 2

శ్లో॥ గతిస్మితప్రేక్షణభాషణాదిషు ప్రియాః
ప్రియస్య ప్రతిరూఢమూర్తయః ।
అసావహంత్విత్య బలాస్తదాత్మికా
న్యవేదిషుః కృష్ణవిహారవిభ్రమాః ॥ 3

తా. ప్రియుడగు కృష్ణునియొక్క నడక, చిరునవ్వు, చూపు, మాట మొదలగు వానియందు అబలలగు ప్రియురాండ్రు సమానరూపములు గలవారై, "కృష్ణుడను నేనే" అనుచు అతని క్రీడలను, విలాసములను అచ్చముగా అనుకరించుచు పరస్పరముగ చెప్పుకొనుచుండిరి. 3

టీ:– అపి చ. గతిస్మితేతి. ప్రియస్య గత్యాదిషు ప్రతిరూఢాః ఆవిష్టా మూర్తయో యాసాం తాః. అతః కృష్ణవిహార విభ్రమాః కృష్ణస్యైవ విహారాః క్రీడాః విభ్రమాః విలాసాః యాసాం తాః. అహమేవ కృష్ణ ఇతి. పరస్పరం నివేదితవత్యః. 3

టీ:– మరియు – ప్రియునియొక్క నడక మొదలగు వానియందు–ప్రతి రూఢః–అచ్చముగ ఆవేశించిన–రూపములు ఎవరియందో వారు– అందువలన–కృష్ణుని యొక్క క్రీడలు, విలాసములు ఎవరికో వారు "నేనే కృష్ణుడను" అని ఒకరికొకరు చెప్పుకొనుచుండిరి. 3

శ్లో॥ గాయంత్యఉచ్చైరముమేవ సంగతా
విచిక్యురున్మత్తక వద్వనాద్వనమ్ ।
పప్రచ్ఛురాకాశవదంతరం బహిర్భూ
తేషు సంతం పురుషం వనస్పతిమ్ ॥ 4

తా. బిగ్గరగా కృష్ణుని పాటలు పాడుచు, తదేక ధ్యానముతో ఉన్మత్తుల వలె వనమునుండి వనమునకు తిరుగుచు, కృష్ణుని వెదుక సాగిరి. ఆకాశమువలె లోపలబయట, భూతములయందును (సర్వత్ర) వ్యాప్తమైయున్న ఆ పురుషుని (కృష్ణుని) గూర్చి ఆ గోపికలు, చెట్లు చేమలను ప్రశ్నింపజొచ్చిరి. 4

టీ:- కించ. గాయంత్య ఇతి. వనాద్వనాంతరం గచ్ఛంత్యః విచిక్యుః అమృగయన్ ఉన్మత్తతుల్యత్వమాహ - వనస్పతీన్ పప్రచ్ఛుః భూతేషు అంతరం మధ్యే సంతం పురుషం. బహిశ్చ సంతమితి. 4

టీ:- ఒక వనమునుండి మఱియొక వనమునకు పోవుచున్నవారై- విచిక్యుః - వెదకిరి. ఉన్మత్తత యొక్క సామ్యమును చెప్పుచున్నాడు. వనస్పతీన్ - చెట్లను - పప్రచ్ఛుః - అడిగిరి. భూతేషు - ప్రాణుల యందు - అంతరం - మధ్యభాగమున (ప్రదేశమునంతటను) సంతం - ఉన్నట్టి- పురుషుని గూర్చి - బహిశ్చ వెలుపలకూడ - సంతంఇతి - ఉన్నట్టి వానిని - అని (సర్వవ్యాపకుడగు వానిని అని భావము) 4

శ్లో॥ దృష్టో వః కచ్చిదశ్వత్థ ప్లక్ష న్యగ్రోధనో మనః ।
నంద సూనుర్గతో హృత్వా ప్రేమహాసావలోకనైః ॥ 5

తా. ఓ రావిచెట్టా! ఓ జువ్విచెట్టా! ఓ మఱ్ఱిచెట్టా! నందుని కుమారుడైన కృష్ణుడు తన ప్రేమతో కూడిన నవ్వు చూపులతో మా మనస్సులను దొంగలించుకుపోయినాడు. (అతనిని మీరు గాని చూచితిరా?) 5

టీ:- తత్ప్రపంచయతి - నవభిః. తత్ర. మహత్వాదేతే పశ్యేయురిత్యాశయాదశ్వత్థాదీన్ పృచ్ఛంతి - దృష్టఇతి. ప్రేమహాసవిలసితైరవలోకనైరస్మాకం మనోహృత్వాచోర ఇవ గతః. యుష్మాభిః కిం దృష్టఇతి. 5

టీ:- ఈ సందర్భమును తొమ్మిది శ్లోకములతో చెప్పుచున్నాడు. పెద్దవిగ నుండుటచేత నివి చూచిఉండవచ్చునని రావిచెట్టు మొదలగు వానిని అడుగుచున్నారు. ప్రేమ, నవ్వు, వికాసము మున్నగువాని తోడి చూపులతో మా మనస్సులను అపహరించి దొంగవలె వెడలిపోయినాడు. మీరెవరైన అతనిని చూచితిరా? అని? 5

శ్లో॥ కచ్చిత్కురవకాశోక నాగ పున్నాగ చంపకాః ।
రామానుజో మానినీనాం గతో దర్ప హరస్మితః ॥ 6

తా. ఓ ఎఱ్ఱపువ్వుల పెద్ద గోరింటా? అశోకమా! ఓ కొండగన్నేరూ! ఓ సురపొన్నా! ఓ సంపెంగా! స్త్రీల దర్పమును హరించు చిరునవ్వు గలవాడు బలరాముని తమ్ముడగు కృష్ణుడు ఇటుగాని వచ్చెనా? 6

టీ:- మహాంతః. స్వపుష్పైర్బహూపకారిణశ్చేతి కురవకాదీన్ పృచ్ఛంతి -కచ్చిదితి. హే కురవకాదయః దర్పహరం స్మితం యస్య సః ఇతో గతః కచ్చిద్దృష్ట ఇతి. 6

టీ:- గొప్పవి, తమ పుష్పములచేత చాలామందికి ఉపకరించు గోరింటలు మొదలగు వానిని అడుగుచున్నారు. ఓ గోరింట మొదలగు పూలచెట్టులారా! దర్పమును హరించు నవ్వు ఎవనికి కలదో అతడు (ఆకృష్ణుడు) ఇటు వచ్చెనా? మీకుగాని కనబడినాడా? అని 6

శ్లో॥ కచ్చిత్తులసి కల్యాణి గోవిందచరణప్రియే ।
సహ త్వాళికులైర్బిభ్రద్దృష్టస్తేఽతిప్రియోఽచ్యుతః ॥ 7

తా. కల్యాణీ! శ్రీహరి చరణములకు ప్రియమైన ఓ తులసీ! నీతో సహా తుమ్మెదల సమూహమును కూడ ధరించు నీకు మిక్కిలి ప్రియమైన కృష్ణుడు కనబడినాడా? 7

టీ:- కచ్చిదితి. అళికులైస్సహ - త్వా త్వాం బిభ్రత్. తవాతి ప్రియస్త్వయా కిం దృష్టః ఇతి. 7

టీ:- తుమ్మెదల సమూహముతో కూడ - త్వాం - నిన్ను- బిభ్రత్ - ధరించు చుండెడు నీకు మిక్కిలి ప్రియమైన వాడగు కృష్ణుడు నీకేమైన కనిపించినాడా? అని 7

శ్లో॥ మాలత్య దర్శినః కచ్చిన్మల్లికే జాతి యూథికే ।
ప్రీతిం వో జనయన్ యాతః కరస్పర్శేన మాధవః ॥ 8

తా. జాజితీగా! మల్లెతీగా! మాలతీ! అడవిమొల్లా! కృష్ణుడు మీకు కనబడలేదా! అతడు మీకు చేతిని తాకించి ప్రీతిని కలిగించుచు ఈ దారిన పోయెనా? 8

టీ:- గుణాతిరేకేఽపి నమ్రా ఇమాః పశ్యేయురితి పృచ్ఛంతి - మాలతీతి. హే మాలతి మల్లికే జాతియూధికే. వః యుష్మాభిః.కిం అదర్శి దృష్టః? కరస్పర్శేన వః ప్రీతిం జనయన్ కిం యాతః? ఇతి. అత్రమాలతీ జాత్యోరవాంతరవిశేషో ద్రష్టవ్యః. 8

టీ:- ఓమాలతీ ! ఓమల్లికా ! ఓజాతిమొల్లా ! వః - మీకు - కిం - అదర్శి - కనబడలేదా? (మీచేత చూడబడియుండలేదా?) చేతి స్పర్శతో మీకు ప్రీతి కలిగించుచు పోయెనా? అని - ఇచ్చట'మాలతి','జాతి' అనువానిలో అవాంతర విశేషమును గమనింపవలెను. 8

శ్లో॥ చూతప్రియాళుపనసాసన కోవిదార
జంబీర బిల్వ వకుళామ్ర కదంబ నీపాః ।
యేఽన్యే పరార్థ భవికా యమునోపకూలా
శ్శంసంతు కృష్ణపదవీం రహితాత్మనాం నః ॥ 9

తా. ఓ మామిడీ! మోరటీ! పనసా! వేగీ! ఎఱ్ఱకాంచనమా! నిమ్మా! మారెడుచెట్టా! పొగడా! రసాలావృక్షమా! కడిమిచెట్టా! ప్రియకమా! యమునా నది ఒడ్డునగల ఇతరమైన - పరులకొఱకే జన్మించిన ఓ వృక్షశ్రేష్ఠములారా! శూన్యమనస్కులమైన మాకు కృష్ణుని మార్గమును చెప్పుదురుగాక. 9

టీ:- ఫలాదిభిః సర్వప్రాణిసంతర్పకా ఏతే పశ్యేయురతి పృచ్ఛంతి- చూతేతి. చూతామ్రయోరవాంతరజాతిభేదః. నీప కదంబయోశ్చ. హేచూతాదయః హే అన్యే చ పరార్థభవికాః పరార్థమేవ భవోజన్మ యేషాం తే. యమునోపకూలాః తస్యా కూలసమీపే వర్తమానాః తీర్థవాసిన ఇత్యర్థః. తే భవంతః. రహితాత్మనాం శూన్యచేతసాం నః కృష్ణపదవీం కృష్ణ మార్గం. శంసంతు కథయంతు. 9

టీ:- పండ్లు మున్నగు వానిచేత ప్రాణులన్నింటిని సంతృప్తిపరచునవి (చెట్లు) కృష్ణునిచూచి యుండవచ్చునని అడుగుచున్నారు. 'చూతమో' 'ఆమ్రము' అనునవి మామిడిలోని భేదములు. నీప 'కదంబములు' కూడా అట్లే జాతిభేదములు. ఓ మామిడి మొదలగు వృక్షములారా! ఓ పరార్థ జన్ములగు ఇతరవృక్షములారా! పరార్థమేవ - ఇతరుల కొఱకే - భవః - జన్మము - వేనికోఅవి, యమునోపకూలాః - యమునానది యొక్క ఒడ్డు దగ్గరనున్నవి. తీర్థవాసులని యర్థము. మీరు - రహితాత్మనాం - శూన్యమైన మనస్సుగల మాకు - కృష్ణపదవీం - కృష్ణుని మార్గమున - శంసంతు - చెప్పుదురుగాక. (చెప్పుడు) 9

శ్లో॥ కిం తే కృతం క్షితి తపో బత కేశవాంఘ్రి
స్పర్శోత్సవోత్పులకితాంగరుహైర్విభాసి ।
అప్యంఘ్రి సంభవ ఉరుక్రమవిక్రమాద్వా
ఆహో వరాహ వపుషః పరిరంభణేన ॥ 10

టీ:- కిమితి. హేక్షితి హేక్షితే త్వయా కిం తపః కృతం? యాత్వం. కేశవాంఘ్రి స్పర్శోత్సవా కేశవస్యాంఘ్రి స్పర్శేనోత్సవో యస్యాః సా. కుతః. అంగరు హైరుత్పులకితా రోమాంచితా విభాసి శోభనే. తత్ర విశేషం పృచ్ఛతి - అపి కిం. అయముత్సవః అంఘ్రి సంభవః అధునా తదేకదేశాంఘ్రిస్పర్శ సంభూ తః. యద్వా. నైతావత్. కింతు ఉరుక్రమ విక్రమాత్పూర్వమేవ త్రివిక్రమ స్వపదాసర్వాక్రమణాత్. అహో అథవా. నైతాదేవ. అపి తు. తతోఽపి పూర్వం. వరాహస్య వపుషః పరిరంభణే నేతి. అతస్త్వయా నూనం దృష్టస్తం దర్శయేతి. 10

తా. ఓ భూదేవతా! అహో! నీవు ఏమి తపస్సు చేసియుంటివో మాధవుని పాదపద్మముల స్పర్శచేత మొలకెత్తిన పులకాంకురములతో ప్రకాశించుచున్నావు. లేక ఈ నీ సంబరము ఇప్పటి శ్రీకృష్ణుని స్పర్శ చేతనా? లేక ఇదంతయును కాక త్రివిక్రముడు తన మూడడుగులచేత నిన్ను సొంతముగ ఆక్రమించియుండుటవలననా? అహో! అదియు కానియెడల అంతకుపూర్వము అతడు వరాహరూపమున ఆలింగనము చేసుకొని యుండుట చేతనా? 10

టీ:- ఓ పృథ్వీ! నీచే ఏమి తపమాచరింపబడినది? దేనివలన నీవు శ్రీహరి పాదముల స్పర్శవలన ఉత్సవముకలదానివైతివో? కేశవుని పాదస్పర్శ వలన ఉత్సవము దేనికో అది ఎందువలన? అంగురహైః ఉత్పులకిత - రోమాంచితురాలవై - విభాసి- శోభించుచున్నావు. ఇచట విశేషము నడుగుచున్నాడు. ఈ ఉత్సవము - అంఘ్రిసంభవః కిం? కృష్ణపాదస్పర్శ వలన కలిగినదా? ఇప్పుడు ఈ ఒక్కసారియే కలిగిన పాదస్పర్శచే ఏర్పడినదా? లేక - ఇదియునుకాదు - కాని - ఉరుక్రమ విక్రమాత్పూర్వమేవ - త్రివిక్రముని పాదములచేత సర్వమును ఆక్రమింపబడుట వలననా? అహో! లేక ఇదియునుకాక - దానికన్నా పూర్వముననే వరహముయొక్క శరీరమును ఆలింగనము చేసుకొని యుండుట వలననా అని అందువలన నీచే నిశ్చయముగ చూడబడియే యున్నాడు. అతనిని గూర్చి తెల్లము చేయుము. 10

శ్లో॥ అప్యేణపత్న్యుపగతః ప్రియయేహ గాత్రైస్తన్వన్
దృశాం సఖి సునిర్వృతిమచ్యుతో వః ।
కాంతాంగ సంగ కుచ కుంకుమరంజితాయాః
కుందస్రజః కులపతేరివ వాతి గంధః ॥ 11

తా. చెలియా! ఓ ఆడజింకా! మహత్తరమైన ఆనందమును చూపులతో నింపుకొనియున్న కృష్ణుడు, సుందరమైన అవయవములతో నున్నవాడు, ఇటు సమీపమునకు వచ్చుట మీకు కనబడెనా? తనకు మిక్కిలి ప్రియమైన స్త్రీతో కలిసి వచ్చుట ఇటమీరు గమనించితిరా? అతడిటు వచ్చినట్లే యున్నది. ఏలయన ప్రియాంగన యొక్క అవయవలముల తోడను, కుచముల పైనున్న కుంకుమపూత తోడను రాపిడి కలుగుటచేత ఎఱుపు వారియున్న కృష్ణుని మెడలోని మొల్ల పూలదండ యొక్క పరిమళము వచ్చుచున్నది. 11

టీ:- హరిణ్యా దృష్టి ప్రసృత్యా. కృష్ణ దర్శనం సంభావ్యాహుః. అపీతి. హే సఖీ ఏణపత్ని. అవి కిం ఉపగతః సమీపం గతః గాత్రైః సుందరై ర్ముఖ బాహ్వాదిభిః. ప్రియయాసహేతి యదుక్తం తద్ద్యోతకం కాంతాయా అంగసంగతః. తత్కుచకుంకుమేన రంజితాయాః. కుంద కుసుమ స్రజో గంధః కులపతేః శ్రీకృష్ణస్య. వాతి ఆగచ్ఛతి. 11

టీ:- ఓ చెలీ! ఏణపత్నీ! (దృష్టిప్రసరించు జింకచేత కృష్ణుడు చూడబడి యుండవచ్చునని చెప్పుచున్నాడు). అపి కిం ఉపకతః- సమీపమునకు వచ్చెనా? - గాత్రైః - అందమైనముఖము, బాహువులు మొదలగు వాని చేత - ప్రియురాలితో అని ఏది చెప్పబడునదో అది ద్యోతకమగుచున్నది. స్త్రీయొక్క అంగములను స్పృశించుటచేత - ఆమె కుచములకు గల కుంకుమచేత, ఎఱ్ఱనైన మొల్లపువ్వుల దండ వాసన - సువాసన - శ్రీకృష్ణునికి సంబంధించినది. వాతి - వచ్చుచున్నది. 11

శ్లో॥ బాహుం ప్రియాంస ఉపధాయ గృహీత
పద్మో రామానుజస్తులసి కాళికులైర్మదాంధైః ।
అన్వీయమాన ఇహ వస్తరవః ప్రణామం
కిం వాభినందతి చరన్ ప్రణయావలోకైః ॥ 12

తా. అతడు తన ఒక చేతిని ప్రియురాలి భుజముపై వేసి మఱియొక చేతితో తామరపువ్వును పట్టుకొని, తులసిమొక్కల సువాసనలవలన మదించియున్న తుమ్మెదలతో కూడా వెనుకగ వానిననుసరించి పోవుచు ఇచటకు వచ్చి యుండును. ఓ చెట్టులారా! మీరు అతనికి నమస్కరించుటకే ఇట్లు వంగితిరేమో! అతడు ప్రేమ నిండిన చూపులతో మీ నమస్కారములను అభినందించి యుండెనా? 12

టీ:- ఫలభారేణ నతాన్ తరూన్ కృష్ణం దృష్ట్వా. ప్రణతా ఇతి మత్వా. ప్రియయా సహితస్య గతి విలాసం సంభావయంత్యః. పృచ్ఛంతి- బాహుమితి. తులసి కాయాః అళికులైః అతస్తదామోదమదాంధైః అన్వీయమానః అనుగమ్యమానః ఇహ చరన్నితి. 12

టీ:- పండ్ల బరువుచేత వంగియున్న చెట్లను - కృష్ణుని జూచి నమస్కరించినవేమో అని భావించి ప్రియురాలితో కలిసియున్న అతని గతివిలాసమును భావించుచు అడుగుచున్నారు. 'బాహుం' ఇత్యాదిగ- తులసిమొక్కల యొక్క తుమ్మెదల సమూహములచేత - తులసి మొక్కల మీద నుండుట వలన వాని పరిమళములచేత మదించి కన్ను మిన్ను గానని ఆ తుమ్మెద గుంపులచేత కొనిపోబడుచున్నవాడై - వాని ననుసరించి పోవుచున్నవాడై - ఇచట తిరుగుచునున్నవాడై - అని. 12

శ్లో॥ పృచ్ఛతే మాలతా బాహునప్యాశ్లిష్టా వనస్పతేః ।
నూనం తత్కరజస్పృష్టా బిభ్రత్యుత్పులకాన్యహో ॥ 13

తా. ఈ చెట్టుకొమ్మలను ఆలింగనము చేసుకొనియున్న ఈ తీగల నడుగుము. అహో! వీనికిగల ఈ రోమాంచములు కృష్ణుని చేతుల స్పర్శవలన కలిగినవే. 13

టీ:- పృచ్ఛతేతి. కాశ్చిదాహుః హే సఖ్యః ఇమా లతాః కృష్ణేన సంగతాః నూనం. అతః ఇమాః. పృచ్ఛత. నను స్వపతిసంగతౌ తత్సంగతిః దుర్ఘటా న వనస్పతేః పత్యుః బాహూన్ శాఖా ఆశ్లిష్టాఅపి. అహో భాగ్యం. నూనం తన్నఖైః స్పృష్టా యతః ఉత్పులకాని బిభ్రతి. న హి స్వపతి సంగతౌ ఈదృక్ పులక సంభవ ఇతి భావః. 13

టీ:- కొందఱిట్లనిరి. ఓ చెలులారా! ఈ తీగెలు కృష్ణునిచే సంగమించినవి. నిశ్చయమే, అందువలన వీనిని అడుగుము, ఏలయన తమ స్వంతమగు భర్తల కలయిక వలన ఇట్టి రోమాంచము కలుగ నేరదు. ఎందుకనగా భర్తల కలయిక దుర్ఘటమైనది కాదు. ఎప్పుడును ఘటించునట్టిదే - తన భర్తయగు చెట్టుయొక్క బాహూన్ - కొమ్మలను - ఆశ్లిష్టా అపి - కౌగలించుకొనినను - (ఈ పులకాంకురములు మొల కెత్తవు) అహో - అదృష్టము, కృష్ణునిచేతి గోర్లచే స్పృశింపబడినందు వలన ఇవి పులకాంకురములను ధరించియున్నవి. స్వభర్తృ సంపర్కమున నిట్టి గగుర్పాటు కలుగదు గదా అని భావము. 13

శ్లో॥ ఇత్యున్మత్తవచో గోప్యః కృష్ణాన్వేషణ కాతరాః ।
లీలాభగవతస్తాస్తా హ్యనుచక్రుస్తదాత్మికాః ॥ 14

తా. కృష్ణుని వెదకుటలో మిక్కిలి విహ్వాలురైన గోపికలు ఈ విధముగ పిచ్చిపిచ్చిగ మాట్లాడుచున్నవారై, తదేకచిత్తముగలవారై భగవంతుని ఆ యా లీలలను అనుకరింపసాగిరి. 14

టీ:- ఉన్మత్తకవత్ పప్రచ్ఛురిత్యేతత్ప్రపంచితం. ఇదానీం. శ్లో."ఆక్షిప్త చిత్తాః ప్రమదా రమాపతేస్తాస్తా విచేష్టా జగృహుస్తదాత్మికా" ఇతి యదుక్తం తత్ప్రపంచయతి - ఇతీతి. ఉన్మత్తవచో గోప్యః ఉన్మత్తవచశ్చ తాః గోప్యశ్చ. కృష్ణాన్వేషణేన కాతరా అతి విహ్వాలాః. అనుచక్రురనుకృతవత్యః. 14

టీ:- ఉన్మత్తులవలె అడిగిరి అనునది ఈ వఱకే చెప్పబడినది. ఇప్పుడు "గోపస్త్రీలు ఆ కృష్ణచిత్తులై శ్రీకృష్ణుని ఆయా చేష్టలను తదేక హృదయులుగ స్వీకరించిరి. అనుకరించిరి" అని ఏది చెప్పబడి యుండెనో దానిని వివరించుచున్నాడు. "ఇతి" అను శ్లోకమున - ఉన్మత్త వాక్యములు గలవారైన గోపికలు కృష్ణుని అన్వేషణలో మిక్కిలి

విహ్వాలురై అనుచక్రుః – అనుకరించిరి – (అతనివలెనె చేయదొడగిరి) 14

శ్లో॥ కస్యాశ్చిత్పూతనాయంత్యాః కృష్ణాయంత్య పిబత్ స్తనమ్ ।
తోకయిత్వా రుదంత్యన్యా పదాహంచ్ఛ కటాయతిమ్ ॥ 15

తా. కృష్ణుని అనుకరించు గోపిక పూతననుఅనుకరించు గోపికయొక్క స్తనమును గ్రోలెను. బాలకృష్ణునివలె నటించు ఒక గోపాంగన ఏడ్చుచు, శకటాసురునివలె నటించు గోపికను తన పాదములతో తన్నెను. 15

టీ:– కస్యాశ్చిదిత్యాదిభిశ్చతుర్భిరనుకరణం ప్రపంచ్యతే – తతశ్చతుర్భి స్తన్మయత్వం పునరేకేనానుకరణమితి వివేకః. కస్యా ఇతి. పూతనా యంత్యాః పూతనా వదాచరంత్యాః. పూతనావదాచరంతీ స్తనమపిబత్. తోకయిత్వా తోకవత్ శిశువదాత్మానాం కృత్వా. 15

టీ:– 'కస్యాశ్చిత్' అని మొదలుగాగల శ్లోకమునుండి నాలుగు శ్లోకములవఱకును గోపస్త్రీల అనుకరణమును చెప్పుచున్నాడు. అట నుండి నాలుగుశ్లోకములతో వారి తన్మయత్వము, మఱల ఒక శ్లోకముతో అనుకరణము అని విభజనము, పూతనాయంత్యాః – పూతన వలె ఆచరించు గోపస్త్రీ యొక్క స్తనమును కృష్ణునివలె ఆచరించు గోపస్త్రీ త్రాగెను. తోకయిత్వా – తోకవత్ – శిశువువలె తనను తాను చేసికొని – 15

శ్లో॥ దైత్యయిత్వా జహారాన్యామేకా కృష్ణార్భ భావనామ్ ॥16

తా. తనను తాను తృణావర్తుడను రాక్షసునిగా భావించిన ఒక గోపిక, బాలకృష్ణ భావనలోనున్న గోపికను దొంగిలించెను. 16

శ్లో॥ కృష్ణ రామాయితే ద్వేతు గోపవత్సాయితాః పరాః ।
వత్సాయితాన్ గృహీత్వా న్యా భ్రామయిత్వా న్యపాతయత్ ॥17

తా. ఇద్దఱు స్త్రీలు బలరామకృష్ణులవలెనైరి, ఇతరులు గోపాలకుల వలెను, లేగదూడలవలెనైరి, లేగదూడలవలెనైన వారిని ఇతరులు తోలుకొనుచు త్రిప్పి, త్రిప్పి పడగొట్టిరి. 17

టీ:- దైత్యాయిత్వేతి. దైత్యాయిత్వా దైత్యవత్ తృణావర్తవదాత్మానం కృత్వా ఏక కృష్ణార్భ భావనాం కృష్ణస్యార్భం బాల్యం. భావయతి తాం. అన్యాం జహార. (16-17)

టీ:- దైత్యాయిత్వా - రాక్షసునివలె - తృణావర్తునివలె తనను తాను భావించుకొని ఒక స్త్రీ, చిన్నికృష్ణుని భావనతోనున్న స్త్రీని - వేఱొకస్త్రీని - దొంగిలించెను. (16-17)

శ్లో॥ కృష్ణా యితా జఘానాన్యా తత్రైకాం తు బకాయితామ్ ।
ఆహూయ దూరగా యద్వత్కృష్ణ స్తమనుకుర్వతీమ్ ॥ 18

తా. కృష్ణునివలె నటించు ఒక స్త్రీ బకాసురుని అనుకరించుచున్న ఒక స్త్రీని హింసించినట్లు నటించెను. కృష్ణుననుకరించుచున్నస్త్రీని- దూరముగ పోయిన దానిని మరియొక స్త్రీ దగ్గరకు రమ్మని పిలిచెను. దూరముగ పోయిన ఆవులను కృష్ణుడు రమ్మని పిలిచినట్లు ఒక స్త్రీ పిలిచెను. 18

శ్లో॥ వేణు కణ్వంతీం క్రీడంతీమన్యా శంసతి సాధ్వితి ।
కస్యాం చిత్స్వభుజం న్యస్య చరంత్యాహాపరాంతు సా ॥ 19

తా. పిల్లనగ్రోవిని వాయించుచు ఆడుచున్న ఒక గోపికను మరియొక గోపిక "బాగుబాగు" అని ప్రశంసించెను. "అహో, ఓహో" అని పరవశ యగుచున్న ఒక గోపాంగన భుజముపై ఒకానొక గోపస్త్రీ తన భుజమును మోపుచుతిరుగసాగెను. 19

టీ:- కృష్ణాయితేతి. దూరగాః దూరే వర్తమానా గాః. యద్వత్. యథా. కృష్ణఃతథా ఆహూయ తం కృష్ణమనుకుర్వంతీం అనువర్తమానాం అనువర్తత ఇతి వా పాఠః. (18-19)

టీ:- దూరగాః - దురముననున్న ఆవులను-ఏ విధముగ కృష్ణుడు పిలుచునో అట్లు పిలిచి-తం-కృష్ణుని అనుకరించుచుండెను. అనుకుర్వంతీం - అనుపాఠమునకు అనువర్తత అని పాఠాంతరము. (18,19)

శ్లో॥ కృష్ణోஉహం పశ్యత గతిం లలితామితి తన్మయా ।
మాభైష్టవాతవర్షాభ్యాం తత్త్రాణం విహితం మయా ।
ఇత్యుక్త్వైకేన హస్తేన యతంత్యున్ని దధేஉంబరమ్ ॥ 20

తా. నేను కృష్ణుడను చూడుము. నా సుందరమైన నడకచూడుము అని తన్మయురాలైన ఒక గోపాంగన "గాలివానలకు భయపడకుము. వానినుండి రక్షణ నాతో ఏర్పాటు చేయబడినది" అని అనుచు తన ఉత్తరీయమును పైకిచాచి పట్టుకొనెను. 20

శ్లో॥ ఆరుహ్యైకాం పదాక్రమ్యశిర ఆహాపరాం నృప ।
దుష్ట హేగచ్ఛజాతోஉహం ఖలానామనుదండ భృత్ ॥ 21

తా. రాజా! ఒక గోపిక కృష్ణుడై కాళీయుని పాత్ర ధరించిన గోపిక శిరస్సుపైకి తన పాదములతోనెక్కి 'ఓరీదుష్టా! నీవు ఇచటినుండి వెడలిపొమ్ము! నేను దుష్టులను దండించుటకొఱకే పుట్టితిని'. 21

టీ:- కృష్ణ ఇతి. యతంతీం యత్నం కుర్వంతీం. అంబరం ఉత్తరీయం వస్త్రం ఉన్నిదధే ఊర్ధ్వం ధృతవతీ. (20-21)

టీ:- యతంతీం - యత్నము చేయుచున్నదానిని - అంబరం - ఉత్తరీయమును - వస్త్రమును- ఉన్నిదధే- పైభాగమునకెత్తి పట్టుకొనినది. (20- 21)

శ్లో॥ తత్రైకోవాచ హే గోపా దావాగ్నిం పశ్యతోల్బణమ్ ।
చక్షూంష్యాశు పిదధ్వం వో విధాస్యే క్షేమమంజసా ॥ 22

తా. అచట ఒక గోపాంగన ఇట్లనెను. 'ఓగోపాలులారా! విజృంభించుచున్న ఈ కార్చిచ్చును చూడుడు. మీరు వెంటనే కన్నులు మూసుకొనుడు. నేను మీకు త్వరలో క్షేమము కలిగింతును'. 22

టీ:- తత్రేతి. పిదధ్వం నిమీలయత. 22

టీ:- పిదధ్వం - మూసికొనుడు. 22

శ్లో॥ బధ్నంత్యన్యాం స్రజైకాహ త్వా మద్యో లూఖలే హరే ।
బధ్నామి భాండభేత్తారం హైయంగవ ముషంత్వితి ।
భీతాసుదృక్పిధా యాస్యం భేజే భీతి విడంబనమ్ ॥ 23

తా. ఒక వ్రజాంగన మఱియొక స్త్రీని పూలదండతో కట్టివేయుచు, 'నిన్ను ఈవేళ ఱోటికి నాగలికి కట్టివేయుదును, కాచుటకు పెట్టబడిన నేయి (వెన్న)గల పాత్రను పగులగొట్టిన నిన్ను బంధింతును'. అనెను. కృష్ణుననుకరించు సుందరి భయము నటించుచు, తన ముఖమును దాచుకొని భయపు నటనను భజించెను. 23

టీ:- బధ్నంతీతి. సుదృక్ సునయనమాస్యం పిధాయ సుదృక్ వరాక్షీతి వా భీతివిడంబనం భయానుకరణం. 23

టీ:- సుద్రుక్ - అందమైన కన్నులుగల ముఖమును - పిధాయ - మూసుకొని - సుద్రుక్ - మేలైన కన్నులుగలది అనియు, భీతివిడంబనం - భయమును అనుకరించుటను (భేజే - భజించెను). 23

శ్లో॥ ఏవం కృష్ణం పృచ్ఛమానా బృందావనలతా తరూన్ ।
వ్యచక్షత వనోద్దేశే పదాని పరమాత్మనః ॥ 24

తా. ఈ విధముగ బృందావనములోని తీగలను, చెట్లను, శ్రీకృష్ణుని గూర్చి అడుగుచు వనముయొక్క ఒక ఎత్తైన ప్రదేశమున వారు పరమాత్ముని యొక్క పాదపు గుర్తులను చూచిరి. 24

శ్లో॥ పదాని వ్యక్తమేతాని నంద సూనోర్మహాత్మనః ।
లక్ష్యంతే హి యదంభోజ ధ్వజ వజ్రాంకుశాదిభిః ॥ 25

తా. మహాత్ముడు, నందుని కుమారుడును అగు శ్రీకృష్ణుని ప్రకటమైన ఈ పాదములు, పద్మము, ధ్వజము, వజ్రము, (కులిశము) (వజ్రాయుధము) అంకుశము మొదలగు చిహ్నములచే చూడబడు చున్నవి. 25

టీ:- ఏవమితి. ఏవం పునరపి బృందావనే లతాస్తరూంశ్చ కృష్ణం పృచ్ఛంత్యః వనోద్దేశే వనబ్రప్రదేశే. వ్యచక్షత అపశ్యన్. (24-25)

టీ:- ఇట్లు మఱల బృందావనమున తీగలను చెట్లనుగూడ కృష్ణుని గూర్చి అడుగుచున్నవారై వనోద్దేశే - వనప్రదేశమును వ్యచక్షత - చూచిరి (పాదముద్రలను) (24-25)

తా. అటనుండి ముందునకుబ్రోవుచు కృష్ణునిస్థానమును వెదకుచున్న ఆ గోపస్త్రీలు కొంతముందునకు పోయిన పిదప కృష్ణుని పాదములతో కలిసియున్న ఏదో ఒక వ్రజ స్త్రీ యొక్క పాదముద్రలను చూచిరి. చూచి వారిలో వారిట్లనిరి. 26

శ్లో॥ తతస్తతస్తత్పదవీమన్విచ్ఛంత్యోఽగ్రతోఽబలాః ।
వధ్వాః పదైస్సుపృక్తాని విలోక్యార్తాస్సమబ్రువన్ ॥ 26

టీ:- తతస్తత ఇతి. సుపృక్తాని సంమిశ్రాణి. 26

టీ:- సుపృతాని - చక్కగ కలిసిపోయినట్టివి. 26

శ్లో॥ కస్యాః పదాని యాతాయాః పశ్యధ్వం నందసూనునా ।
అంసన్యస్త ప్రకోష్ఠాయాః కరేణోః కరిణా యథా ॥ 27

తా. గజరాజు వెంట ఆడ ఏనుగు పోయినట్లు - కృష్ణునివెంట అతని భుజముపై చేయివేసుకొని పోయిన ఏ స్త్రీ పాదములో ఇవి చూడుడు. కృష్ణునిచే భుజముపై వేయబడిన చేయిగల ఏ స్త్రీపాద ముద్రలివి? చూడుడు. 27

టీ:- కస్యాఇతి. తేన అంసేన్యస్తః ప్రకోష్ఠోయస్యాః కరేణోః హస్తిన్యాః 27

టీ:- అతనిచేత మూపుననుంచనబడిన ముంజేయి ఎవరికో - ఆ స్త్రీ - కరేణోః - ఆడ ఏనుగు యొక్క. 27

శ్లో॥ అనయారాధితో నూనం భగవాన్ హరిరీశ్వరః ।
యన్నో విహాయ గోవిందః ప్రీతో యామనయద్రహః ॥ 28

తా. భగవానుడగు కృష్ణప్రభువు ఈమెచేత ఆరాధింపబడియున్నాడు. ఏలయన ఈతడు మనలను విడిచి - ఈమె యెడల సంప్రీతుడై - ఈమెను ఏకాంతస్థలమునకు తోడ్కొని పోయినాడు. 28

టీ:- అనయేతి. రహః ఏకాంతస్థానే. 28

టీ:- రహః - ఏకాంతస్థలమున 28

శ్లో॥ ధన్యా అహో అమీహ్యాళ్యో గోవిందాంఘ్ర్యబ్జరేణవః ।
యాన్ బ్రహ్మేశౌ రమాదేవా దధుర్మూర్ధ్న్యఘనుత్తయే ॥ 29

తా. అహో! చెలులారా! కృష్ణునిపాదములచేస్పృశింపబడిన ఈ ధూళీ రేణువులు కృతార్థములు కదా! ఏలయన వీనిని బ్రహ్మ, శివుడు, లక్ష్మి మొదలగు దేవతలు తమ అనిష్టములను పోగొట్టుకొనుటకు శిరమున ధరింతురు. 29

టీ:- ధన్యాఇతి. హే ఆళ్యః సఖ్యః. అహో ధన్యా ఇతి. పుణ్యాః గోవిందాంఘ్ర్యబ్జరేణవః. తత్ర హేతుః యానితి. అస్మాభిరప్యేత్యద్రేణ్వభిషేకేణ. తథైవ కృష్ణః ప్రాప్తుం శక్య ఇతి భావః. 29

టీ:- హే అళ్యః - ఓ సఖీజనులారా! అహో! ధన్యాః- పుణ్యమయములు - గోవిందుని పాదపద్మముల యొక్క పాంసువులు! దానికి కారణము - మనము కూడ ఈ రేణువులను అభిషేకించుకొనుటచేత- ఆ దేవతలకు వలెనే-కృష్ణుని ప్రాప్తించుటకు శక్యమగునని భావము. 29

శ్లో॥ తస్యా అమూని నః క్షోభం కుర్వంత్యుచ్చైః పదానియత్ ।
యైకాపహృత్య గోపీనాం రహో భుఙ్క్తేచ్యుతాధరమ్ ॥ 30

తా. గోపస్త్రీలలో ఒక్కర్తెయే శ్రీకృష్ణుని అపసంహరించుకొనిపోయి ఏకాంతమున అతని అధరామృతమును అనుభవించుచున్నది. ఆమె యొక్క ఉబికినట్లున్న పాదముద్రలు మనలను బాధపెట్టుచున్నవి. 30

టీ:- అన్యా ఆహుః - తస్యా ఇతి.గోపీనాం సర్వస్వం.అయం భావః భవేదేవం యది తస్యాః పదాని సంపృక్తాని న భవేయుః. తాని నః కథం దుఃఖం కుర్వంతీతి. 30

టీ:- గోపికల సర్వస్వము - దీని భావమిది - ఇట్లగునుగాక - ఒకవేళ ఆమె పాదముద్రలు, అతని పాదముద్రలతో కలసి యుండక పోయిన యెడల అవి మనకు ఎట్లు దుఃఖము కలిగించును? అని. 30

శ్లో॥ న లక్ష్యంతే పదాన్యత్ర తస్యానూనం తృణాంకురైః ।
ఖిద్యత్సుజాతాంఘ్రి తలామున్నిన్యే ప్రేయసీం ప్రియః ॥ 31

తా. ఇచ్చట ఆమె అడుగుల గుర్తులు కానవచ్చుటలేదు. బహుశః ఆమె సుకుమారమైనపాదతలములు గడ్డిమొలకలచేత బాధింపబడునని ఆ ప్రేయసిని ఈ ప్రియుడు తన భుజముపై మోసికొని పోయి యుండవచ్చును. 31

శ్లో॥ ఇమాన్యధిక మగ్నాని పదాని వహతో వధూమ్ ।
గోప్యః పశ్యత కృష్ణస్య భారాక్రాంతాని కామినః ॥ 32

తా. గోపికలారా! చూడుడు - ఇచ్చట ఈ పాదముద్రలు, ఆమెను మోయుచుండుటచేత లోతుగనున్నవి. కామకుడైన కృష్ణుని ఈ పాదముద్రలు బరువుచే ఆక్రమింపబడినవి. 32

శ్లో॥ అత్రావరోపితా కాంతా పుష్పహేతోర్మహాత్మనా ।
అత్ర ప్రసూనాపచయః ప్రీత్యర్థే ప్రేయసే కృతః ॥ 33

తా. మహాత్ముడగు కృష్ణునిచేత ఇచ్చట ఆ స్త్రీ, పువ్వుల కారణముగ క్రిందకు దింపబడినది. ఇచ్చట ప్రేయసి ప్రీతికొఱకు పూలు కోసికొనుట అను కార్యక్రమము చేయబడినది. 33

టీ:- తదసంపృక్తాన్ కేవలకృష్ణ పాదరేణూనేవ విచిన్వంత్యస్తాన్ దృష్ట్వా పునరత్యంతం సమతప్యన్. తదాహ - శ్లోకత్రయేణ. న లక్ష్యంత

టీ:- ఏ అడుగులతో కలియని కేవలము కృష్ణుని పాదరేణువులను మాత్రమే వెదుకుచున్న వానినిచూచి ఇంకను మిక్కిలి తపించుచు -

ఇతి. ఖిద్యతీ సుజాతే సుకుమారే అంఘ్రితలే యస్యాస్తాం. ఉన్నిన్యే స్కంధమారోపితవాన్. (31-33)

అది మూడు శ్లోకములలో చెప్పుచున్నాడు - బాధపడుచున్న - సుజాతే- సుకుమారమైన పాదతలములు ఎవరికో ఆమెను - ఉన్నిన్యే - భుజమున నెక్కించుకొనెను. (31-33)

శ్లో॥ ప్రపదాక్రమణే హ్యేతే పశ్యతా సకలే పదే ।
కేశ ప్రసాధనం త్వత్రకామిన్యాః కామినా కృతమ్ ॥ 34

తా. ముందుభాగముతో ఆక్రమింపబడియున్న ఈ పాదపు గుర్తులు అసంపూర్ణములుగ నున్నవి చూడుడు. ఇచ్చట కాముకుడు, కామిని కేశములను దువ్వి అలంకరించినట్లుగా కూడ నున్నది. 34

టీ:- ప్రపదేతి.ప్రపదాభ్యాం.ఆక్రమణం క్షోణీసంమర్దనంయయోః. అతఏవ అసకలే పదే పశ్యతేతి.తస్యాః కృష్ణజానత్వ ఉపవిష్టా యాశ్చిహ్నాం దృష్ట్వాహుః. కేశప్రసాధనమితి. 34

టీ:- ప్రపదాభ్యాం ఆక్రమణం-ముందటి పాదములచే ఆక్రమించుట - శోణీసంమర్ధనం - ఎగిరి ఎగిరి పూలుకోయుటవలన నేల మర్ధింప బడినది. ఎవరి పాదములు అట్లు భూసమ్మర్ధనము చేసినవో అవి అందు వలననే అసంపూర్ణమైన పాదములు చూడుడు అని ఆమె యొక్క కృష్ణుని మోకాళ్ల చివరన కూర్చొని యుండిన గుర్తుచూసి చెప్పుచున్నారు.'కేశాలంకరణము'అని. 34

శ్లో॥ తాని చూడయతా కాంతాముపవిష్టమిహధ్రువమ్ ॥ 35

తా. ఆ పుష్పములు, ఇచ్చట నిశ్చలముగ కూర్చుండియున్న ఆ కామినిని శిరస్సున కనుగుణముగ అమరినవి. కొప్పుననుసరించి అమర్చబడుచుండినదై ఇచ్చట కదలక కూర్చొని యుండినది. 35

టీ:- తానీతి. కాంతామధికృత్య. తాని ప్రసూనాని చూడయతా చూడానుకారేణ బధ్నతా. ఇహధ్రువముపవిష్టం. 35

టీ:- స్త్రీని ప్రధానముగ చేసి – ఆ పూలను – చూడయతా – కొప్పు ననుసరించి – అమర్చుచున్న వ్యక్తిచేత ఇహధ్రువముపవిష్టం – ఇచ్చట స్థిరముగ కూర్చుండబడినది. 35

శ్లో॥ రేమేతయా చాత్మరత ఆత్మారామోఽప్య ఖండితః ।
కామినాం దర్శయన్ దైన్యం స్త్రీణాంచైవ దురాత్మతామ్ ॥ 36

తా. తనకు తాను సంతృప్తుడును, తనలోతాను క్రీడించుచున్న వాడును, అపరిచ్ఛేదుడు (తానుతప్ప అన్యములేనివాడు) అయిన శ్రీకృష్ణుడు, కాములకు దీనస్థితిని, స్త్రీల యొక్క కుటిలత్వమును చూపుచు, ఆ స్త్రీతో కలసి క్రీడించెను. 36

టీ:- రేమే తమేత్యాదిశుకోక్తిః. రేమ ఇతి. ఆత్మరతః స్వతస్తుష్టః. ఆత్మారామః ఆత్మక్రీడః. అఖండితః స్త్రీవిభ్రమైరనాకృష్టోఽపి తథా చేత్కిమితి రేమ ఇత్యత ఆహ – కామినామితి. (36-37)

టీ:- 'ఆమెతో క్రీడించెను'. అనునది శ్రీశుకుని మాట – ఆత్మరతః – తనకు తాను తృప్తుడు – ఆత్మారామః – ఆత్మతో (తనతో) క్రీడించువాడు. తనకన్న భిన్నమైన విభాగములు లేనివాడు – స్త్రీయొక్క విలాసములతో ఆకర్షితుడుకాకున్నను – అటులైనచో 'క్రీడించెను'. అనుటఎట్లు పొసగును? చెప్పుచున్నాడు – కాముకుల యొక్క (దైన్యస్థితిని చూపుటకు) అని.(36-37)

శ్లో॥ ఇత్యేవం దర్శయంత్యస్తాశ్చేరుర్గోప్యో విచేతనాః ।
యాం ప్రియా మనయత్కృష్ణో విహాయాన్యాః స్త్రియో వనే ॥37

తా. అని ఈ విధముగ గోపికలు వికలమనస్కులై కృష్ణునిగూర్చి చర్చించుచు తిరుగుచుండిరి. వనమునందు గోపస్త్రీలందఱిని విడిచి కృష్ణుడు ఏ ప్రియురాలిని తనవెంట కొనివచ్చెనో ఆమె తనలో తాను

శ్లో॥ సా చ మేనే తదాత్మానం వరిష్ఠాం సర్వయోషితామ్ ।
హిత్వా గోపీః కామయానా మామసౌ భజతే ప్రియః ॥ 38

టీ:- స్త్రీణాం దురాత్మతామాహ-ద్వాభ్యాం. సేతి. కామో యానమా గమన సాధనం యాసాం తాః. గోపీర్హిత్వా మాం భజత ఇతి హేతో రాత్మానం వరిష్ఠాం మేన ఇతి. (38-39)

శ్లో॥ తతో గత్వా వనోద్దేశం దృప్తా కేశవమబ్రవీత్ ।
న పారయేఽహం చలితుం నయ మాం యత్రతే మనః ॥ 39

శ్లో॥ ఏవముక్తః ప్రియామాహ స్కంధ ఆరూహ్యతామితి ।
తతశ్చాంతర్దధే కృష్ణస్సావధూరన్వతపత్యత ॥ 40

టీ:- కామినాం దైన్యం దర్శయతి - ఏవముక్త ఇతి. అఖండిత తత్త్వమాహ - తతశ్చేతి. తస్యాం స్కంధారోహోద్యతాయాం అంతర్హిత ఇత్యర్థః. 40

స్త్రీలలో అందఱకన్నను తాను శ్రేష్ఠురాలిననియు, ప్రియుడైన కృష్ణుడు గోపస్త్రీలందఱిని విడిచి - కామమే గమనసాధనముగ గల గోపికలందఱిని విడిచి నన్నే ఈతడు భజించుచుండెననియుతలచెను. (37-38)

టీ:- కామమే గమనసాధనమెవరికో వారు - అట్టి గోపికలను వదలి నన్ను భజించుచున్నాడను కారణమున తననుతాను గోపికలలో గొప్ప దానినిగ భావించెను. అని (38-39)

తా. అటనుండి వనప్రదేశమునకు పోయి గర్వితురాలైన ఆ కృష్ణుని ప్రియురాలగు గోపిక అతనితో నిట్లనెను. 'ఇక నడుచుటకు నాకు శక్తి లేదు. నీ ఇష్టమైనచోటికి నన్ను మోసుకొనిపొమ్ము'. 39

తా. ఇట్లు చెప్పబడిన కృష్ణుడు తన ప్రియురాలితో నా భుజము మీదకు ఎక్కుము అనెను. అంతలోననే అతడు అంతర్హితుడయ్యెను. ఆ గోపిక కూడ కృష్ణునిగానక తపించసాగెను. 40

'టీ:- కోఱికగలవారి దీనస్థితిని చెప్పుచున్నాడు. 'ఏవముక్తః' 'తతః' అని అతని అఖండితత్వమును చెప్పుచున్నాడు. ఆమె భుజము నెక్కు ప్రయత్నమునందే అంతర్హితుడయ్యెనని యర్థము. 40

శ్లో॥ హా నాథ రమణ ప్రేష్ఠ క్వాసి క్వాసి మహాభుజ ।
దాస్యాస్తే కృపణాయా మే సఖే దర్శయ సన్నిధమ్ ॥ 41

టీ:- అనుతాపమాహ-హా నాథేతి. 41

శ్లో॥ అన్విచ్ఛంత్యో భగవతో మార్గం గోప్యాऽవిదూరతః ।
దదృశుః ప్రియవిశ్లేషమోహితాం దుఃఖితాం సతీమ్ ॥ 42

శ్లో॥ తయా కథితమాకర్ణ్య మానప్రాప్తిం చ మాధవాత్ ।
అవమానం చ దౌరాత్మ్యాద్విస్మయం పరమం యయుః ॥ 43

టీ:- అన్విచ్ఛంత్య ఇతి. అన్విచ్ఛంత్యః మృగయమాణాః. అవిదూరతః సమీపే. (42-43)

తా. ఓ నాథా! రమణా! మిక్కిలి ప్రియమైన వాడా! ఎక్కడున్నావు? ఎక్కడనున్నావు! ఓ మహాభుజా! దీనురాలగు నీ ఈ దాసికి ఓ సఖా! నీ సన్నిధిని చూపుము. 41

టీ:- 'హానాథా' అనిగోపికయొక్కఅనుతాపమునుచెప్పుచున్నాడు. 41

తా. భగవంతుడగు కృష్ణుని దారి వెదుకుచున్న గోపస్త్రీలు, దగ్గఅలోనే తమ ప్రియుని ఎడబాటువలన మోహితురాలును, దుఃఖితురాలును అయిన ఆ గోపాంగనను చూచిరి. 42

తా. కృష్ణుని వలన ఆమె పొందిన గౌరవమునుగూర్చి, అతని 'దుష్టత్వము' వలన ఆమె పొందిన అవమానమునుగూర్చి ఆమెచే చెప్పబడినదంతయు విని వారు మిక్కిలి ఆశ్చర్యపడిరి. 43

టీ:- అన్విచ్ఛంత్యః - వెదుకుచున్నవారు - అవిదూరతః- సమీపమునందే. (42-43)

శ్లో॥ తతోఽవిశన్ వనం చంద్రజ్యోత్స్నా యావద్విభావ్యతే ।
తమః ప్రవిష్టమాలక్ష్య తతో నివవృతుః స్త్రియః ॥ 44

తా. అప్పుడు ఆ గోపికలు కృష్ణుని అన్వేషించుకొఱకు ఒక వనమున ప్రవేశించిరి. చంద్రుని వెన్నెల ప్రకాశించుచున్నంతవఱకు వెదకుచు చీకటి పడుటచూచి అటనుండి వెడలిపోయిరి. 44

టీ:- తత ఇతి. తతః తయాపి సహితాః. కృష్ణాన్వేషణాయ వనమ విశన్. తతో హరేరన్వేషణాన్నివృత్తాః. 44

టీ:- అటనుండి ఆమెతో కూడినవారై, కృష్ణాన్వేషణ కొఱకు వనమున ప్రవేశించిరి. కొంతసేపటికి హరిని అన్వేషించుపని నుండి విరమించిరి. 44

శ్లో॥ తన్మనస్కాస్తదాలాపా స్తద్విచేష్టాస్తదాత్మికాః ।
తద్గుణానేవ గాయంత్యో నాత్మాగారాణి సస్మరుః ॥ 45

తా. అతనినే మనస్సునందు తలచుచు అతనిగూర్చియే మాట్లాడు కొనుచు, అతని లీలలనే అనుకరించుచు అతనినే తాముగా భావించుచు అతనిగుణములనేకీర్తించుచు, తమఇండ్లనుగూర్చిస్మరింపకుండిరి. 45

టీ:- తదితి. ఏవం తమః ప్రాప్తా అపి. స్వగృహాన్నైవ స్మృతవత్యః. తదాత్మికాః స ఏవ ఆత్మా యాసాం తాః తన్మయా ఇత్యర్థః. 45

టీ:- ఇట్లు చీకటియైనను తమతమ ఇండ్లనుగూర్చి ఆలోచింపరైరి. తదాత్మకాః-అతడే ఆత్మగా ఎవరికో వారు - తన్మయులు అని అర్థము. 45

శ్లో॥ పునః పులినమాగత్య కాళింద్యాః కృష్ణభావనాః ।
సమవేతా జగుః కృష్ణం తదాగమన కాంక్షితాః ॥ 46

తా. మఱల యమునానదియొక్క ఇసుకతిన్నెపైకి వచ్చి ఆ గోపాంగనలు, కృష్ణభావన కలవారై అతని రాకను కోరుచున్నవారై, అందఱును కలిసి కృష్ణుని గూర్చియే పాడిరి. 46

టీ:- పునరితి. కింతు పూర్వం యత్ర. శ్రీకృష్ణేన సంగతిరాసీత్తదేవ కాళింద్యాః పునః పులినమాగత్య.కృష్ణం భావయంతి ధ్యాయంతీతి తథా తాః. కృష్ణస్యాగమనం కాంక్షితం యాసాం తాః, మిళితాః సమ్మిళితా స్సత్యః. కృష్ణమేవ జగురితి. 46

**శ్రీ మద్భాగవతే, మహాపురాణే దశమస్కంధే,**

**త్రింశోఽధ్యాయః**

టీ:- మఱల - కాని కృష్ణునితో పూర్వమెచ్చట కలయిక కలిగినదో - ఆ యమునానదియొక్క ఇసుకతిన్నెకు మఱల వచ్చి - కృష్ణుని ధ్యానించుచు, కృష్ణుని ఆగమనము కోఱుచు, అందఱును కలిసి కృష్ణునిగూర్చియే పాడిరి అని. 46

**అని శ్రీమద్భాగవతమున దశమస్కంధమందు**

**ముప్పదియవ అధ్యాయము సమాప్తము.**

## ఏకత్రింశోऽధ్యాయః

### గోపికా గీత ప్రారంభః

గోప్య ఊచుః

శ్లో॥ జయతి తేऽధికం జన్మనా వ్రజః
శ్రయత ఇందిరా శశ్వదత్ర హి ।
దయిత దృశ్యతాం దిక్షు తావకాః
త్వయి ధృతాసవస్త్వాం విచిన్వతే ॥ 1

టీ:- "ఏకత్రింశే నిశాయాం తాః పునః పులినమాగతాః, కృష్ణమేవాను గాయంత్యః ప్రార్థయంతే తదాగమం" జయతీతి. హే దయిత. తే జన్మనా. వ్రజః అధికం యథా భవతి తథా జయతి. అత్యుత్కర్షేణ వర్తతే. యస్మాత్. త్వమత్ర జాతః తస్మాత్ ఇందిరా లక్ష్మీః అత్ర హి వ్రజమలంకృత్య వర్తతే. ఏవం వ్రజే సర్వస్మిన్ మోదమానే. అత్ర తు తావకాః. త్వదీయగోపీజనాః త్వయి త్వదర్థమేవ కథంచిత్. ధృతా అసవో యైస్తే త్వాం విచిన్వతే. మృగయంతే అతస్త్వయా దృశ్యతాం ప్రత్యక్షీభూయతామితి. యద్వా. అస్మాభిర్భవాన్ దృశ్యతాం. యద్వా ఏవం త్వయా దృశ్యతామేతే విచిన్వత ఇతి. అత్ర స్వతంత్రాణాం బహూనాం చ వక్తృత్వాదపరా ఆహురితి. సర్వశ్లోకేష్వవధారణా తథాపి సంగతిరుచ్యతే. 1

## 31వ అధ్యాయము

### గోపస్త్రీలు ఇట్లనిరి

తా. ప్రియతమా! నీవు ఇచ్చట అవతరించుటచేత ఈ వ్రజము అధికమైన ఉత్కర్షనుపొంది ప్రకాశించుచున్నది. లక్ష్మీదేవికూడ ఈ వ్రజమునాశ్రయించియే నిత్యము, నిరంతరము ఇట నివసించు చున్నది? చూడుము. నీవారైన గోపికలు నీ కొఱకు ఆసనములను ధరించి దిక్కులందు నిన్నే వెదకుచున్నారు. 1

టీ:- "ముప్పదియొకటవ అధ్యాయమున - గోపస్త్రీలు రాత్రి, తిరిగి ఇసుకతిన్నెపైకి వచ్చి కృష్ణుని గూర్చియే పాటలు పాడుచు, అతని రాక కొఱకు ప్రార్థించుచున్నారు". (శ్లోకభావము శ్రీధరీయము) హేదయిత - ప్రియుడా! నీ జన్మచేత వ్రజము ఎట్లు ఉత్కృష్టమగునో అట్లు విభవమునందినది. ఎందువలన? నీవిచ్చట పుట్టితివి గదా! అందుకు - ఇందిరా - లక్ష్మీ - ఇచటనే వ్రజమునలంకరించియున్నది, ఈ విధముగ వ్రజమంతయు సంతోషించుచుండగ - ఇచట నీవారైన గోపీజనులు - త్వయి - నీకొఱకే - ఎట్లో - ధరింపబడిన ఆసనములు ఎవరి చేతనో వారు నిన్ను వెదకుచున్నారు. అందువలన నీచే దర్శనమీయబడును గాక. ప్రత్యక్షమగుము- లేక - మాచేత నీవు కనబడెదవుగాక - లేక - ఇట్లు నీచేత చూడబడుచుండగనే వీరు వెదుకుచున్నారు అని ఇచట స్వతంత్రులగు చాలామంది చెప్పుట

శ్లో॥ శరదుదాశయే సాధుజాతసత్సరసిజోదరశ్రీముషా దృశా ।
సురతనాథతేఽశుల్కదాసికా వరదనిఘ్నతో నేహ కింవధః ॥2

టీ:- తత్ర విచిన్వంతు మమ కిమితి చేత్తత్రాహుః. శరదితి. శరదుదాశయే శరత్కాలికే. సరసి సాధు జాతసత్సరసిజోదర శ్రీముషా, సాధుజాతం సమ్యగ్జాతం,యత్ సత్సరసిజం. సువికసితం పద్మం. తస్యోదరే గర్భే యా శ్రీస్తాం ముష్ణాతి హరతీతి తథా. తయా దృశా నేత్రేణ, హేసురతనాథ సంభోగపతే, వరద అభీష్టప్రద. అశుల్కదాసికాః అమూల్యదాసీః నిఘ్నతో మారయతః, తే తవ, త్వయా క్రియమాణః ఇహ లోకే, అయంవధో న భవతి కిం. కిం శస్త్రేణైవ వధో వధః కింద్రుశా వధో వధో న భవతి కింతు భవత్యేవ అతస్తవ దృశా అపహృత ప్రాణప్రత్యర్పణాయ. త్వయా దృశ్యతామితి భావః త్వయా దృశ్యతామితి యథా సంభవం సర్వత్ర వాక్యశేషః. 2

వలన ఇతరులు చెప్పిరని శ్లోకములన్నింటియందు గమనింపనగును. ఆ విధముగా సంబంధము చెప్పబడినది. 1

తా. శరత్కాలమున జలాశయమునందు చక్కగా పుట్టిన శ్రేష్ఠమైన తామరపువ్వు యొక్క మధ్యభాగమునగల కర్ణిక (దుద్దు) శోభను దొంగలించిన అందమైన చూపుతో - ఓ రతిపతీ! ఓ వరదాయకా! నీయొక్క శుల్కము చెల్లింపబడని దాసీజనములు చంపుట, చంపుట కాదా? 2

టీ:- "అచట మీరు వెదకుచుండియున్న నాకేమి?" అని యనినచో దానికి చెప్పుచున్నారు. 'శరత్' అని శరత్కాల సంబంధమైన సరస్సునందు - సాధుజాతం - ఒప్పిదముగా పుట్టిన - ఏ చక్కగా వికసించిన తామరపువ్వు గలదో-దాని గర్భమున-ఏ శోభగలదో దానిని హరించునట్టి అందముగల-దృశా-కన్నుతో(చూపుతో)-ఓ సంభోగపతీ! ఓ అభీష్టమునిచ్చువాడా! అశుల్కదాసికాః-మూల్యము చెల్లింపబడని -సేవకురాండ్రను- చంపువాడగు నీ యొక్క-నీచే చేయబడుచున్న-ఈ లోకమందలి ఈ నీ హత్య (చూపుతోచంపుట) హత్యకదా? శస్త్రములతో చంపుటయే చంపుట యగునా? చూపుచేత చంపుట, చంపుట కాకుండునా? అదియును వధయే. అందువలన నీ చూపుతో తీసిన ప్రాణములను తిరిగియిచ్చుటకు నీవు ప్రత్యక్షమగుము-'నీవు

శ్లో॥ విష జలాశయాద్వ్యాళ రాక్షసాద్వర్ష
మారుతాద్వైద్యుతా నలాత్ ।
వృషమయాత్మజాద్విశ్వతో భయా
దృషభతేవయం రక్షితా ముహుః ॥ 3

టీ:- కించ బహుభ్యో మృత్యుభ్యః కృపయా రక్షిత్వా కిమితీదానీం దృశా మన్మథం ప్రేష్య ఘాతయసీత్యాహుః. విషేతి. హే ఋషభశ్రేష్ఠ. విషమయాజ్జలాశయాత్. తథా వ్యాళరాక్షసాదఘాసురాత్ వర్షాత్, మారుతాత్. వైద్యుతానలాత్, అశనినిపాతాత్. వృషోఽరిష్టస్తస్మాత్ మయాత్మజాత్. వ్యోమాత్. విశ్వతః అన్యస్మాదపి. సర్వతో భయాచ్చ బక కాళీయ దమనాదినా రక్షితాః కిమిదానీముపేక్షస ఇతి భావః. 3

కనబడుము' అని యథా సంభవముగ అంతటను వాక్యశేషమును గ్రహింపవలెను. 2

తా. కాళీయుని విషముతో నిండిన జలాశయమునుండి, అజరగ (సర్ప) రూపమున ప్రాణులను హింసించు అఘాసురుడను రాక్షసుని నుండియు, ఇంద్రుడు కురిపించిన కుంభవృష్టి నుండియు, పెనుగాలి నుండియు, పిడుగుపాటుల నుండియు, తుఫానుల నుండియు, వృషభాసురుని నుండియు, వ్యోమాసురుని నుండియు, ఈ ప్రపంచము నందలి ఇతర భయముల వలననుకూడ, అన్ని విధములగు అశుభముల నుండియు నీవు మమ్ము రక్షించితివి. (ఇప్పుడు రక్షించుటలేదేమి?). 3

టీ:- అనేకవిధములైన మరణకారణముల నుండి దయతో రక్షించి, ఇప్పుడు చూపుతోడనే మన్మథుని పంపి హింసించుచున్నావు అని చెప్పుచున్నారు. హే ఋషభ -శ్రేష్ఠా! విషమయమైన నీటి సరస్సునుండి, అట్లే సర్పరాక్షసుడగు అఘాసురుని నుండి, వర్షము నుండి, గాలినుండి, పిడుగుపాట్లనుండి వృషః-అరిష్టము, వృషాసురుడు - వానినుండి- మయాత్మజాత్-వ్యోమాసురునినుండి- ఇతరమైన ఆపదల నుండియు- అన్ని భయములనుండి-బకుడు, కాళీయుడు మున్నగువారినణచుట ద్వారా నీచేత రక్షింపబడితిమి. ఇప్పుడు ఎందులకు ఉపేక్షించు చున్నావు? అని భావము. 3

శ్లో॥ న ఖలు గోపికానందనో భవాన
ఖిల దేహినామంతరాత్మదృక్ ।
విఘనసార్థితోవిశ్వగుప్తయే సఖ
ఉదేయివాన్ సాత్త్వతాం కులే ॥ 4

టీ:- అపి చ విశ్వపాలనాయావతీర్ణస్య తవ భక్తోపేక్షాత్యంతమనుచితే త్యాశయేనాహుః - న ఖ్వలితి. హే సఖే భవాన్ ఖలు. నిశ్చితం యశోదా సుతో న భవతి. కింతు. సర్వప్రాణినాం బుద్ధిసాక్షీ. నను స కిం దృశ్యో భవతి. తత్రాహుః. విఘనసా బ్రహ్మణా. విశ్వపాలనాయ ప్రార్థితస్సన్. సాత్త్వతాం కులే. ఉదేయివాన్. ఉదిత ఇతి. 4

తా. ఓ చెలికాడా! నీవు నిశ్చితముగ యశోదా పుత్రుడవు కాదు. సమస్తమైన దేహధారుల లోపల ఆత్మవుగా నున్నావు - బ్రహ్మదేవుని చేత ప్రార్థనచేయబడి, విశ్వమునంతయును పరిపాలించుటకు యదువంశమున ఉదయించితివి. 4

టీ:- మరియు విశ్వపాలన కొఱకు అవతరించిన నీకు భక్తులను ఉపేక్షించుట మిక్కిలి అనుచితము అను ఆశయముతో చెప్పుచున్నారు - ఓ సఖా! నీవు నిశ్చయముగ యశోదానందనుడవు కాదుగదా! కాని ప్రాణులన్నింటికిని బుద్ధి సాక్షివి. అయినను ఎందుకు కనబడుట లేదు? ఇట చెప్పుచున్నారు. విఘనసా - బ్రహ్మచే జగత్పాలన కొఱకు ప్రార్థింపబడినవాడై యాదవుల వంశమున - ఉదేయివాన్ - ఉదయించితివి అని. 4

శ్లో॥ విరచితా భయం వృష్ణిధుర్య తే
శరణమీయుషాం సంసృతేర్భయాత్ ।
కరసరోరుహం కాంత కామదం
శిరసి ధేహి నశ్శ్రీకరగ్రహమ్ ॥ 5

తా. ఓ వృష్ణీకులధురీణా! సంసార భయమువలన నిన్ను శరణు పొందిన వారికి అభయమునిచ్చినవాడవు. అట్టి నీ అభీష్టములిచ్చు హస్త పద్మమును, లక్ష్మి చేతిని గ్రహించిన నీ పద్మము వంటి చేతిని, -ప్రియుడా! మా తలపైననుంచుము. (మమ్ము అనుగ్రహింపుము) 5

టీ:- తస్మాత్త్వద్భక్తానామస్మాకమేతత్ప్రార్థనా చతుష్టయం సంపాదయే త్యాహుశ్చతుర్భిః-విరచితేతి. హేవృష్ణిధుర్య. సంసృతేర్భయాత్. తే చరణ మీయుషాం శరణం ప్రాప్తానాం ప్రాణినాం విరచితం దత్తమభయం యేన తత్తథా. హే కాంత. కామదం వరదా, తథా శ్రియః కరం గృహ్ణాతీతి తథా. తద్భవతః కరసరోరూహం. నః శిరసి ధేహి. 5

టీ:- అందువలన నీ భక్తులమైన మా యొక్క ఈ నాలుగు ప్రార్థనలు చేయుచున్నాము. అని నాలుగు శ్లోకములతో చెప్పుచున్నారు-ఓ వృష్ణి కులభారమును వహించు కృష్ణా! సంసార భయమువలన నీ చరణము లను శరణుపొందిన ప్రాణులకు ఎవరిచేత అభయమీయబడినదో ఆ నీవు - ఓ కాంతా! వరములిచ్చునదియు - అట్లే లక్ష్మీదేవి చేతిని గ్రహించినదియునైన నీ హస్తపద్మమును మా తలయందుఉంచుము. 5

శ్లో॥ వ్రజజనార్తిహన్ వీరయోషితాం నిజజనస్మయధ్వంసనస్మిత ।
భజసఖే భవత్కింకరీస్సనో జలరుహాననం చారుదర్శయ ॥ 6

తా. వ్రజవాసుల ఆర్తిని హరించువాడా! వీరుడా! స్త్రీలయొక్కయు, నీవారల యొక్కయు, గర్వమును అణచుచున్నట్టి చిఱునవ్వు కలవాడా! సఖుడా! నీదాసురాండ్రమగు మమ్ము భజింపుము. నీ సుందరమైన ముఖపద్మమును చూపుము. 6

టీ:- వ్రజేతి. హే వ్రజజనార్తిహన్ హే వీర. నిజజనానాం. యః స్మయో గర్వస్తస్య ధ్వంసనం నాశకం స్మితం యస్య. తథాభూత. హే సఖే. భవత్కింకరీః నోఽస్మాన్ భజ ఆశ్రయ. స్మనిశ్చిత్తం. ప్రథమం తావత్. జలరుహాననం చారుయోషితాం నో దర్శయ. 6

టీ:- వ్రజవాసుల దుఃఖమును తొలగించువాడా! ఓ వీరా! నీ జనుల యొక్క ఏ గర్వముగలదో దానియొక్క నాశకమగు చిరునవ్వు ఎవనికో అట్టివాడా! ఓ చెలికాడా! నీ సేవకురాండ్రమగు మమ్ము ఆశ్రయింపుము. స్మ - నిశ్చయముగ - మొదట అంతవఱకు పద్మము వంటి నీ సుందరమైన ముఖపద్మమును సుందర స్త్రీలమగు మాకు చూపుము. 6

శ్లో॥ ప్రణతదేహినాం పాపకర్శనం
తృణచరానుగం శ్రీనికేతనం ।
ఫణిఫణార్పితం తే పదాంబుజం
కృణు కుచేషునః కృంధి హృచ్ఛయమ్ ॥ 7

తా. త్రికరణశుద్ధిగా నీకు నమస్కరించు ప్రాణుల పాపములను క్షమింపజేయునది, గోవులను, పశువులను అనుసరించి నడచునది. సౌభాగ్యమునకు స్థావరమైనదియు, సర్పము యొక్క పడగపైన నిలిచినదియునగు నీ పాదపద్మమును మా కుచములపైన మోపుము. మా హృదయములోని కామాగ్నిని చల్లార్చుము. లేక–మా హృదయము లోని ప్రేమను ఎందుకు ఛేదించెదవు? 7

టీ:– ప్రణతేతి.విశేషేణ ప్రణతానాం దేహినాం పాపకర్శనం పాప హంతృ. తృణచరాన్ పశూన్ అనుగచ్ఛతి కృపయేతి. తథా సౌభాగ్యేన శ్రియోనికేతనం వీర్యాతిరేకేణ ఫణినః ఫణాస్వర్పితం తే పదాంబుజం నః కుచేషు కృణు కురు. కిమర్థం హృచ్ఛయం కామం కృంధి ఛింది. 7

టీ:– విశేషముగ నమస్కరించు జీవుల పాపములను నశింప జేయునది, తృణ చరాన్ – గడ్డి మేయుచు తిరుగు పశువులను అనుగ్రహించునది, అట్లే సౌభాగ్యమునకు నిలయము, వీర్యాతిరేకము తో పాము యొక్క పడగలమీద నుంచబడినది అయిన నీ పాదపద్మము మా స్తనములపైనుంచుము. మా హృదయములలోని కామమును. కృంధి ఛేదింతువు – కిమర్థం – ఎందులకు (ఛేదింతువు) 7

శ్లో॥ మధురయా గిరా వల్గువాక్యయా
బుధమనోజ్ఞయా పుష్కరేక్షణ ।
విధికరీరిమా వీరముహ్యతీ రధ
రశీధునాప్యాయయస్వ నః ॥ 8

తా. మెట్టతామరరేకులవంటి కన్నులుగలవాడా! తీయ్యని మాటల చేత, రమణీయమైన వాక్యములచేత, బుద్ధిమంతములగు మనోజ్ఞము లుగ నుండు భాషణముచేతను, నీ ఆజ్ఞానువర్తులైన ఈ గోపస్త్రీలు మొహము చెందియున్నవారు. అట్టి మాకు ఓ వీరుడా! అధర సుధారసమును ఇచ్చి జీవింపజేయుము. 8

టీ:- మధురయేతి. హే పుష్కరేక్షణ తవైవ మధురయా గిరా వల్గూని వాక్యాని యస్యాం తయా బుధానాం మనోజ్ఞయా హృద్యయా. గంభీర యేత్యర్థః ముహ్యతీః ఇమాః నః విధికరీరధరశీధునా ఆప్యాయ యస్వ సంజీవయేతి. 8

టీ:- ఓ పుష్కరేక్షణా! అట్లే మధురమైన శబ్దములచేత-రమణీయ వాక్యములు దేనియందో దానిచేత, బుధులకు మనోజ్ఞమైన-హృద్యమైన -గంభీరమైన దానిచే అనియర్థము. మోహమునన్నున్న ఈ మాకు-విధిరతేః - ఆజ్ఞననుసరించి వర్తించువారిని - అధరశీధునా - పెదవి తేనెతో చెఱకు-ఆప్యాయస్వ - నుద్యమముతో బ్రతికింపుము అని. 8

శ్లో॥ తవ కథామృతం తప్త జీవనం
కవిభిరీడితం కల్మషాపహం ।
శ్రవణమంగళం శ్రీమదాతతం
భువి గృణంతి యే భూరిదా జనాః ॥ 9

తా. నీ కథలనెడు అమృతమును గ్రోలిన వారి జీవనము తపోమయము. తాత్వికులు నీ లీలలను అనేక విధములుగ స్తుతించి యున్నారు. నీ కథాసుధ పాపహరము. వినిన మాత్రముననే శుభములిచ్చునది. సౌభాగ్యమును వ్యాపింపజేయునది. ఎవరు ఈ భూమియందు దానిని నిరూపింతురో అట్టి జనులు గొప్పదాతలు. 9

టీ:- కించ అస్మాకం త్వద్విరహే ప్రాప్తమేవ మరణం. కింతు త్వత్కథా మృతం పాయ యద్భిః సుకృతిభిర్వంచిత మిత్యాహుః-తవేతి. కథైవా మృతం. అత్ర హేతుః - తప్తజీవనం ప్రసిద్ధాదమృతాదుత్కర్షమాహుః కవిభిః బ్రహ్మవిద్భిరపి ఈడితం స్తుతం. దేవభోగ్యం త్వమృతం తైస్తుచ్ఛీకృతం. కించ. కల్మషాపహం కామకర్మ నిరసనం. తత్త్వమృతం నైవం భూతం కించ శ్రవణ మంగళం శ్రవణమాత్రేణ మంగళప్రదం తత్త్వనుష్ఠానా పేక్షం కించ. శ్రీమత్సు శాంతం. తత్తుమాదకం. ఏవం భూతం త్వత్కథామృతం. ఆతతం యథా భవతి తథా భువి యే గృణంతి

టీ:- మరియు మాకు నీ విరహమున ప్రాప్తించియే ఉన్నది మరణము కాని నీ కథామృతము త్రాగిన వారమగు మా చేత, పుణ్యవతులమగు మా చేత ఆ మృత్యువు వచింపబడినది అని చెప్పుచున్నారు. కథయే అమృతము - కారణము - తపించిన జీవనము మాది. ప్రసిద్ధమగు అమృతమువలన ఉత్కర్ష కలుగుచున్నది. కవిభిః - బ్రహ్మవేత్తలచేత - ఈడితం - స్తుతింపబడినది. దేవతలచేత భుజింపదగినది అమృతము కాని అది వారిచే అల్పముగ చేయబడినది. (నిర్లక్ష్యము చేయబడినది) ఇంకను -కల్మషాపహం - కామ్యకర్మలను నిరసించునది

నిరూపయంతి తే జనాః భూరిదాః బహుదాతారః. జీవితం దదతీత్యర్థః యద్వా – ఏవంభూతం త్వత్కథామృతం యే భువిగృణంతి తే భూరిదాః పూర్వ జన్మసు. బహు దత్తవంతః. సుకృతిన ఇత్యర్థః. ఏత దుక్తంభవతి. యే కేవలం కథామృతం గృణంతితేఽపి తావదతిధన్యాః. కింపునర్యే త్వాం పశ్యంతి అతః ప్రార్థయామహే. త్వయా దృశ్యత్యామితి. 9

శ్లో॥ ప్రహసితం ప్రియ ప్రేమవీక్షితం
విహరణం చ తే ధ్యానమంగళం ।
రహసి సంవిదో యా హృదిస్పృశః
కుహక నో మనః క్షోభయంతి హి ॥ 10

అట్టి అమృతము ఇట్టిది మాత్రమే కాదు. ఇంకను– శ్రవణ మంగళం – వినినంత మాత్రముననే శుభములనిచ్చునది. అందువలన అది అనుష్ఠించునపేక్ష గలిగినది. ఇంకను – భాగ్యవంతుల యందు శాంతమును కలిగించునది అది వైకమును కలిగించునది. (తన్మయత్వమునిచ్చునది) ఇట్టిది నీ కథామృతము. దానికి వ్యాప్తి ఎట్లు కలుగునో అట్లు ఈ పుడమియందు ఎవరు – గృణంతి – నిరూపింతురో అట్టి జనులు భూరిదాః – గొప్పదాతలు – జీవితమునే ఇత్తుతు అని యర్థము – లేక – ఇట్టి నీ కథామృతమును ఎవరు నిరూపింతురో వారు భూరిదాః–పూర్వజన్మలయందు మిక్కిలిగా దానము చేసియుండిన వారు పుణ్యవంతులని అర్థము. ఎవరు కేవలము నీ కథామృతమును నిరూపింతురో వారుకూడ అతి ధన్యులు – ఇక నిన్ను ప్రత్యక్షముగ చూడువారి మాటచెప్పనేల? అని చెప్పినట్లైనది. అందులకు ప్రార్థించు చున్నాము. 'నీ చే దర్శనమీయబడునుగాక' అని. 9

తా. ప్రియా! నీవు నవ్విన ప్రకృష్టమైన నవ్వు, ప్రేమతో నీవు చూచిన చూపు, నీవిలాసవంతమైననడక, అవి అన్నియు ధ్యానమున శుభప్రదముగనే యున్నవి. నీవు ఏకాంతమునందు మాట్లాడిన పరిహాసపుమాటలు హృదయంగమములై – ఓకపటీ! మా మనస్సులను క్షోభింపజేయుచున్నవి. 10

టీ:- నను తర్హి మత్కథాశ్రవణేనైవ నిర్వృతాభవంతు. కిం మద్దర్శనేన. త్వ ద్విలాసక్షుభితచిత్తాఃవయం. తత్రాపి శాంతిం నవిందామ ఇత్యాహుః ప్రహసితమితి. హే ప్రియ. కుహక కపట. సంవిదః సంకేత నర్మాణి. 10

టీ:- అట్లయిన నా కథలు వినుటచేతనే మీరు ఆనందపడుచున్నారు గదా! ఇక నా దర్శనమెందుకు? అందువేమో! నీ విలాసములచే క్షోభించుచున్న చిత్తముగలవారమైన మేము శాంతినిపొందలేక పోవు చున్నాము అని చెప్పుచున్నారు. ఓ ప్రియా!-కుహక-కపటము గలవాడా! సంవిదః-సంకేతాత్మకమైన పరిహాసవాక్యములు. 10

శ్లో॥ చలసి యద్వ్రజాచ్చారయన్ పశూన్
నళినసుందరం నాథ తే పదం ।
శిలతృణాంకురైస్సీదతీతి నః
కలిలతాం మనః కాంత గచ్ఛతి ॥ 11

తా. పశువులను మేపుకొనుచు నీవు వ్రజమునుండి బయలుదేరి వెడలునపుడు, తామరపువ్వువంటి సుకుమారమైన నీ పాదమునకు ఱాళ్లుగాని, గడ్డిమొలకలుగాని గ్రుచ్చుకొని బాధపెట్టుచు అనారోగ్యము పాలుజేయునేమోయని - ఓ నాథా! ఓ కాంతుడా! మా మనస్సు కలవరపడుచున్నది. 11

టీ:- కించ త్వయి వయమతి ప్రేమార్ద్రచిత్తాః త్వం పునరస్మాసు కేన హేతునా కపటమాచరసీత్యాహుః - శ్లోకద్వయేన. చలసీతి. హే నాథ. కాంత యద్యదా. వ్రజాచ్చలసి పశూంశ్చారయన్. తదా. తన్నళినవత్. సుందరం కోమలం తే పదం. శిలైః కణిశైః. తృణై రంకురైశ్చ. సీదతి క్లిశ్యతీతి. నో మనః. కలిలతాం అస్వాస్థ్యం. గచ్ఛతి ప్రాప్నోతి ఏవం భూతాస్త్వద్దుఃఖశంకితచిత్తా వయం. 11

టీ:- అదియునుగాక నీయందు మేము మిక్కిలి ప్రేమతో ఆర్ద్రమైన చిత్తముగలవారము - అయినను నీవు మాయందు ఏకారణముచేత కపటమునాచరించుచున్నావు అని అడుగుచు చెప్పుచున్నారు. హే - ఓ నాథా! ఓ కాంతుడా! యత్-ఎప్పుడైతే వ్రజమునుండి బయలుదేరెదవో - పశువులను మేతకు త్రిప్పుచు అప్పుడు ఆ తామరపువ్వువలె అందమైన మృదువైన నీ పాదము, ఱాతిముక్కలచేత, గఱిక మొదళ్లచేతను సీదతి - క్లేశమునొందును అని మా మనస్సు -

కలిలతాం - అస్వాస్థ్యమును - గచ్ఛతి - పొందును - ఈ విధమైన - నీ దుఃఖమును శంకించుచున్న చిత్తములుగలవారము మేము. 11

శ్లో॥ దినపరిక్షయే నీలకుంతలైర్వనరుహాననం బిభ్రదావృతం ।
ఘన రజస్వలం దర్శయన్ ముహుర్మనసినస్మరం వీరయచ్ఛసి ॥12

తా. సాయంకాలమున, నల్లనిజుట్టుతో ఆవరింపబడినదియు, ఎఱ్ఱని గోధూళితో వ్యాపించియున్నట్టిదియునైన, తామరపువ్వవంటి నీ ముఖమును చూపుచు ఓ వీరుడా! మఱలమఱల మా మనస్సున మన్మథుని ప్రేరేపించుచున్నావు. (మన్మథుని ఇచ్చుచున్నావు) 12

టీ:- దినేతి. త్వం తు. దినపరిక్షయే సాయంకాలే. నీలకుంతలై రావృతం. ఘనరజస్వలం గోరజశ్చురితం. వనరుహాననం అళిమాలా కుల పరాగ విచ్ఛురిత పద్మతుల్యమాననం. బిభ్రత్. తచ్చ ముహు ర్ముహుః. దర్శ యన్నోమనసి. కేవలం స్మరం యచ్ఛసి అర్పయసి. న తు సుఖం దదాసీతి. కపట ఇతి భావః. 12

టీ:- నీవు సాయంకాలమునందు నల్లని తలవెంట్రుకలతో ఆవరింపబడి - ఘనరజస్వలం - గోరజముతో చల్లబడినదియు - వనరుహాననం - తుమ్మెదల సమూహముతో నిండి, పరాగము వ్యాపించియున్న పద్మముతో సమానమైన ముఖమును, బిభ్రత్ - ధరించుచు - అదియును మఱల మఱలమాకు చూపుచు, కేవలము స్మరం యచ్ఛసి - మదనుని ఇచ్చు చున్నావు. మనసి- మనస్సు నందు (కలవరము రేపుచున్నావు) కాని సుఖము నిచ్చుటలేదు అని. కపటముగలవాడవు అని భావము. 12

శ్లో॥ ప్రణతకామదంపద్మజార్చితం ధరణిమండనంధ్యేయమాపది ।
చరణపంకజం శంతమంచతే రమణస్తనేష్వర్పయాధిహన్ ॥13

తా. మనోవ్యథలను హరించువాడా! నమస్కరించువారికి అభీష్టము లనిచ్చునది, బ్రహ్మదేవునిచేత పూజింపబడినది, భూమండలమునలంక

రించినది, ఆపద కలిగినప్పుడు ధ్యానింపదగినది, మిక్కిలి సుఖము నిచ్చునదియునగు నీ పాదకమలము ఓ క్రీడా నిపుణా! మా స్తనము లందు ఉంచుము. 13

టీ:- అతోஉధునాకపటం విహాయైవంకుర్విత ప్రార్థయంతే - శ్లోకద్వయేన. ప్రణతేతి. హే ఆధిహన్హే రమణపద్మజే నార్చితం. ఆపది ధ్యేయం ధ్యానమాత్రేణాపన్నివర్తకం. శంతమంచ నేవాసమయే చాపి సుఖతమం తవ చరణపంకజం. కామతాపశాంతయే నః స్తనేష్వర్పయేతి. 13

టీ:- అందువలన ఇప్పుడు నీవు కపటమును విడిచి ఇట్లు చేయుము అని ప్రార్థించుచున్నారు. రెండు శ్లోకములతో ఓ మనోపీడానివారకా! ఓరమణా! బ్రహ్మచే పూజింపబడినది, ఆపదయందు ధ్యానింపతగినది, ధ్యాన మాత్రము చేత ఆపదను తొలగించునది - శంతమం - సేవా సమయమునందు కూడ మిక్కిలి సుఖదము, అయిన నీ పాదపద్మమును కామ తాపమును శాంతింపజేయుటకు మా స్తనములయందర్పింపుము - అని. 13

శ్లో॥ సురతవర్ధనం శోకనాశనం స్వరితవేణునా సుష్ఠుచుంబితం ।
ఇతరరాగవిస్మారణం నృణాం వితర వీరనస్తేஉధరామృతమ్ ॥14

తా. నీ అధరామృతము, సంభోగ సుఖమును వృద్ధిచేయునది, దుఃఖమును నశింపజేయునది. మ్రోగుచున్న వేణువుచేత గాఢముగ చుంబింపబడినది. (ముద్దుపెట్టుకొనబడినది) మనుష్యులకు ఇతరము లైన ఏ కోఱికలనైనను మఱిపించునది. అట్టి నీ అధరామృతమును ఓ వీరుడా! మాకు పంచుము. 14

టీ:- అపిచ. హేవీరతే. అధరామృతం. నో వితరదేహి. స్వరితేన నాది తేన వేణునా సుష్ఠుచుంబితమితి వేణునాదామృతవాసితమితి భావః. ఇతర రాగవిస్మారణం నృణామితరేషు సార్వభౌమాది సుఖేషు రాగమిచ్ఛాం. విస్మారయతి విలోపయతీతి. తథా తత్. 14

టీ:- ఓ వీరాగ్రేసరా! నీ అధరామృతమును మాకుఇమ్ము- ప్రోగింప బడు మురళీవాద్యముచేత లెస్సగా ముద్దిడుకొనబడినది. అనగా నీ అధరామృతము వేణునాదామృతముతో పరిమళింపబడియున్నదని భావము. ఇతరరాగ విస్మారణం - మనుష్యులకు ఇతరములైన చక్రవర్తిత్వాది సుఖముల యందు - రాగం - ఇచ్ఛను - విస్మారయతి మిక్కిలిగ లోపింపజేయును అని - అట్లే అదియు. 14

శ్లో॥ అటతి యద్భవానహ్ని కాననం
త్రుటియుగాయతే త్వామపశ్యతామ్ ।
కుటిలకుంతలం శ్రీముఖం చ తే జడ
ఉదీక్షతాం పక్ష్మకృద్దృశామ్ ॥ 15

తా. కృష్ణా! నీవు బృందావనమున తిరుగు పగటి సమయమున, వ్రజమునందున్న మాకు, నిన్ను చూడజాలని ఒక్క క్షణములో సగము సమయముకూడ యుగమువలె తోచుచున్నది. (తృటి-గడియలో నాఱవ భాగము) లేక(క్షణార్ధము). ఇక దినాంతరమున నీవు తిరిగి వచ్చునపుడు, ఉంగరములు తిరిగిన తలవెంట్రులతోడి నీ ముఖశోభ, పైకి చూచుచుండు నీ చూపులు, చూచుచున్న మాకు ఆ నీ సౌందర్యము ఱెప్పవాల్చనీయక ఆ ఱెప్పలను సృష్టించిన బ్రహ్మదేవుడు మూర్ఖుడని అనిపించును. 15

టీ:- కించ. క్షణమపి త్వదదర్శనే దుఃఖం దర్శనే సుఖం చ దృష్ట్వా సర్వసంగపరిత్యాగేన యతయ ఇవ వయం త్వాముపాగతాః. త్వం తు కథమస్మాన్ త్యక్తుముత్సహస ఇతి సకరుణమూచుః-శ్లోకద్వయేన. అటతీతి. యత్ యదా భవాన్ కాననం బృందావనం ప్రతి అటతి

టీ:- మరియు నీవు కనబడని క్షణము కూడ మాకు దుఃఖమే, కనబడినచో సుఖము. నిన్ను చూచి సర్వసంగములను పరిత్యజించిన యతులవలె మేము నిన్నుచేరుదుము. నీవైతే మమ్ము విడిచి ఉండుటకు ఎట్లు ఉత్సహించుచున్నావో - అనిజాలి గొలుపుచు చెప్పుచున్నారు.

గచ్ఛతి. తదా. త్వామపశ్యతాం ప్రాణినాం త్రుటిః క్షణార్ధమపి. యుగవద్భవతి. ఏవమదర్శనే దుఃఖముక్తం. పునశ్చ కథం చిద్దినాంతే. తే తవ. శ్రీమన్ముఖం ఉత్ ఉచ్చైరీక్షమాణానాం. తేషాం దృశాం. పక్ష్మ కృద్బ్రహ్మా జడో మంద ఏవ. నిమేష మాత్రమప్యంతరమసహ్యమితి దర్శనే సుఖముక్తం. 15

రెండు శ్లోకములతో – యత్ – ఎప్పుడయితే – నీవు– బృందావనమును గూర్చి వెడలెదవో అప్పుడు నిన్ను చూడజాలని మాకు – ప్రాణులందఱికి – క్షణార్ధముకూడ యుగమువలె అగుచున్నది. ఇట్లు చూడకపోవుట వలన దుఃఖము చెప్పబడినది. మఱల ఎట్లో సాయంకాలమున నీ యొక్క సుందరమైన ముఖము – ఉదాత్తముగ చూచు చూపులను చూచువారికి – పక్ష్మకృత్ – ఱెప్పలను నిర్మించి ఆ బ్రహ్మ – జడః– మందుడే (అనిపించును) ఱెప్ప వాల్చు కాలముకూడ నిన్ను చూడక సహింపజాలమని కృష్ణ దర్శనమున కలుగు సుఖము చెప్పబడినది. 15

శ్లో॥ పతిసుతాన్వయభ్రాతృ భాంధవా
నతివిలంఘ్యతే హ్యచ్యుతాగతాః ।
గతవిదస్తవోద్గీతమోహితాః
కితవయోషితః కస్త్యజేన్నిశి ॥ 16

తా. ఓ అచ్యుతా! మేము మా భర్తలను, పుత్రులను, వంశీయులను, అన్నలను, బంధువులను తిరస్కరించి వారి ఆజ్ఞలను ఉల్లంఘించి, బిగ్గరగా వినబడుచున్న నీ మురళీగానముచే మోహితులమై నీ గమనమును తెలిసికొనిన వారమై నీ కడకు వచ్చితిమి. ధూర్తుడా! రాత్రి వచ్చిన స్త్రీలను నీవు తప్ప ఎవఱు వదిలిపెట్టుదురు? 16

టీ:– పతీతి. తస్మాత్. హే అచ్యుత పతీన్ సుతాన్ అన్వయాన్ తత్సం బంధినః భ్రాతౄన్ బాంధవాంశ్చాతివిలంఘ్య. తే తవోద్గీతేన ఉచ్చైర్గీతేన. మోహితాఃహే కితవ శఠ ఏవభూతాః యోషితః.నిశి స్వయమాగతాః. త్వామృతే కస్త్యజ్యేన్న కోఽపీత్యర్థః. 16

టీ:– అందువలన ఓ కృష్ణా! భర్తలను, కొడుకులను, వీరికి సంబంధించిన వారలను, అన్నలను, బంధువులను కూడ అతిక్రమించి– నీఉచ్చై స్వరమున వినపడు పాటచేత మోహితులమై – ధూర్తుడా! ఇట్టి స్త్రీలను రాత్రిపూట స్వయముగ వచ్చిన వారిని, నీవు వినా ఎవరు వదిలిపెట్టుదురు? ఎవరును వదలరని అర్థము. 16

శ్లో॥ రహసి సంవిదం హృచ్ఛయో దయం
ప్రహసితాననం ప్రేమవీక్షణం ।
బృహదురశ్శ్రియో ధామ వీక్ష్యతే
ముహురతిస్పృహా ముహ్యతే మనః ॥ 17

తా. ప్రభావశాలీ! ఏకాంతమున నీవు సంకేతాత్మకముగ చేయు పరిహాస భాషణములు, మా హృదయములతో గుప్తముగ నున్నను ఉబికి వచ్చు ప్రేమభావము, నీ నగుమోము, ప్రేమనిండిన నీ చూపులు, విశాలమైన నీ వక్షఃస్థల సౌందర్యము, వీటన్నింటిని చూచి మఱల మఱల మాలో కోర్కె విజృంబించి మా మనస్సును ముగ్ధమొనర్చుచున్నది. 17

టీ:- అతస్త్వయా త్యక్తానామస్మాకం.ప్రాక్తనత్వద్దర్శన నిదానస్య హృద్రోగస్య. త్వత్సంగత్యైవ చికిత్సాం కుర్విత్యాహుః. శ్లోకద్వయేన – రహసీతి శ్రియోధామతే బృహద్విశాలం. ఉరశ్చవీక్ష్య. అతిస్పృహ భవతి తయా చ. ముహుర్ముహుః. మనో ముహ్యతి. 17

టీ:- లక్ష్మికి నివాసమైన నీ విశాలమైన వక్షమును చూచి మాకు అతిశయించిన కోరిక కలుగుచున్నది. దానిచేత మఱల మఱల మా మనస్సు మోహము నొందుచున్నది. 17

శ్లో॥ వ్రజవనౌకసాం వ్యక్తి రంగం తే
వృజినహన్త్ర్యలం విశ్వమంగళం ।
త్యజ మనాక్చ నస్త్వత్స్పృహాత్మనాం
స్వజనహృద్రుజాం యన్నిషూదనమ్ ॥ 18

తా. ఓ కృష్ణా! వనములందు, వ్రజములందు జీవించుచుండు వారిలో నీవు అవతరించియుండుట దుఃఖహానము కొఱకు విశ్వమంగళము కొఱకును అయియున్నది. నీ యందే మనస్సు నిలుపుకొనియున్న నీ వారమగు మా యొక్క మనఃపీడను నివారింపగల నీ ఔదార్యమును కొంచెమైనను మాపై విడుదలచేయుము. 18

టీ:- వ్రజేతి. తవ చ. వ్యక్తిరభివ్యక్తిః. వ్రజవనౌకసాం సర్వేషాం అవిశేషే. వృజినహంత్రీ దుఃఖనిరసినీ. విశ్వమంగళం సర్వ మంగళ రూపాచ అతస్త్వత్ స్పృహాత్మనాం త్వత్స్పృహారూఢమనసాం. నః. మనాక్ ఈషత్. కిమపి త్యజ ముంచ.కార్పణ్యమకుర్వన్ దేహీత్యర్థః. కిం తత్. స్వజనహృద్రోగాణాం. యదతిగోప్యం నిషూదనం నివర్తక మౌషధం. తత్త్వమేవ వేత్సీతిగూఢోఽభిప్రాయః. 18

టీ:- నీ అభివ్యక్తి (ప్రకటమగుట) వ్రజములందు అడవులందును నివసించుచుండు అందఱియొక్కయు - ఎట్టి ప్రత్యేకతలు లేకుండ సామాన్యముగనే - వృజినహంత్రీ - దుఃఖమును పోగొట్టునది. సర్వ విశ్వమునకును మంగళములిచ్చునట్టిది కూడ. అందువలన నీ స్పృహతో రూఢమైయున్న మనస్సుగల మాకు - మనాక్ - కొంచెము ఏదైనను (కరుణ, ఔదార్యము వంటివి) విడుదలచేయుము. కృపణత్వము చేయక(లుబ్ధత్వము వహింపక) ఇమ్ము అని అర్థము ఏది? స్వజనహృదయరోగములను - ఏది రహస్యముగ నివారించు మందును - అది నీకే తెలియునని గూఢమైన అభిప్రాయము. 18

శ్లో॥ యత్తే సుజాతచరణాంబురుహం
స్తనేషు భీతాశ్శనైః ప్రియ దధీమహి కర్క శేషు ।
తేనాటవీమటసి తద్వ్యథతే న కిం
స్విత్కూర్పాదిభిర్భ్రమతి ధీర్భవదాయుషాం నః ॥ 19

తా. ప్రియా! ఏ నీ కోమలములైన పాదపద్మములుగలవో వానిని మా కఠినమైన స్తనములమీద భయము, భయముగ మెల్ల మెల్లగ ధరింపుము. దానివలన నీవు అడవిలో తిరుగుతున్నప్పుడు చిన్న చిన్న ఱాళ్లు ఱప్పలు మొదలగువానితో కొంచెమైనను నొప్పికలుగదు. అవి నిన్ను బాధింపవు. మాకు నీ జీవనమే జీవనము. నీవే మాజీవనము, మా బుద్ధి నిన్ను గూర్చి మోహించియున్నది. 19

టీ:- అతి ప్రేమధర్షి తా రుదంత్య ఆహుః. యదితి. హే ప్రియ. యత్తే తవ. సుకుమారం పదాబ్జం. కఠినేషు కుచేషు. సంమర్దన శంకితాః

టీ:- మిక్కిలి ప్రేమచేత ప్రగల్భించినవారై ఏడ్చుచు ఇట్లనుచున్నారు. ఓ ప్రియా! నీ సుకుమారమైన పాదపద్మము ఏది కలదో దానిని మా

. శనై శ్శనైః దధీమహి ధారయేమ. వయం. తేన అటవీమటసి గచ్ఛసి. నయసీతి పాఠే పశూన్ వా కించిదన్యాం వా ఆత్మానమేవ వా నయసి ప్రాపయసి తత్తతః తత్పదాంబుజం వా. కూర్పాదిభిః సూక్ష్మ పాషాణాదిభిః. కిం స్విన్నవ్యధతే కథం ను నామవ్యథతే భవానేవాయు ర్జీవనం యాసాం తాసాం. నో ధీర్భ్రమతి ముహ్యతీతి. 19

శ్రీ మద్భాగవతే, మహాపురాణే దశమస్కంధే,

ఏకత్రింశోఽధ్యాయః

కఠినమైన కుచములయందు – లెస్సగ మర్దింపబడినశంకగలవారై – మెల్ల మెల్లగా దధీమహి – ధరింతుము. మేము దానితో అడవికి పోయినప్పుడు (నీవు)– 'నయసి' అను పాఠమునందు – వెంటగొని పోవునప్పుడు – పశువులను– లేక– ఏవో ఇతరమైన వానిని – లేకతననుతానో–'నయసి' ప్రాప్తింపజేసెదవో అప్పుడు అది – ఆ పాదపద్మముగాని – కూర్పాదిభిః – చిన్న చిన్న రాళ్లమున్నగువానితో – కిం స్విన్నవ్యధతే – కొంచెమైనను వ్యధ నొందదు. నీవే మా జీవనము (ఎవరికోవారు) మా బుద్ధి మోహించుచున్నది. అని. 19

అని శ్రీమద్భాగవతమున దశమస్కంధమందు

ముప్పదిఒకటవ అధ్యాయము సమాప్తము.

## ద్వాత్రింశోఽధ్యాయః

**శ్రీ శుక ఉవాచ**

శ్లో॥ ఇతిగోప్యః ప్రగాయంత్యః ప్రలపంత్యశ్చ చిత్రధా ।
రురుదుః సుస్వరం రాజన్ కృష్ణదర్శనలాలసాః ॥ 1

టీ:- శ్లో. "ద్వాత్రింశే విరహాలాపవిక్లిన్నహృదయో హరిః, తత్రా విర్భూయ గోపిస్తాస్సాంత్వయామాస మానయన్. స్వ ప్రేమామృత కల్లోలవిహ్వాలీకృతచేతసః. సదయన్నందయన్ గోపీ రుదతో నందనందనః' ఇతీతి. ఇత్యేయం ప్రభృతి. చిత్రధా అనేకధా. సుస్వరం ఉచ్చైః కృష్ణదర్శనే లాలసా అతిస్పృహా యాసాం తాః. 1

శ్లో॥ తాసామావిరభూచ్ఛౌరిస్స్మయ మానముఖాంబుజః ।
పీతాంబరధరస్స్రగ్వీ సాక్షాన్మన్మథమన్మథః ॥ 2

టీ:- తాసామితి. సాక్షాన్మన్మథమన్మథః జగన్మోహనస్య కామస్యాపి మనస్యుద్భూతః కామః. సాక్షాత్తస్యాపి మోహక ఇత్యర్థః. 2

## 32వ అధ్యాయము

**శ్రీ శుక మహర్షి ఇట్లనెను.**

తా. అని యిట్లు ఆ గోపికలు మధురముగ పాడుచు వివిధములుగ మాట్లాడుకొనుచు, కృష్ణుని చూడవలెననెడి గాఢమైన కోరికతో-అప్పు డప్పుడు-రాజా! శ్రావ్యమగు స్వరముతో ఏడ్చుచుండిరి. 1

టీ:- "ముప్పదిరెండవ అధ్యాయమున గోపస్త్రీల విరహాలాపములచేత కృష్ణుడు ఆర్ద్రచిత్తుడై, 1

తా. చిరునవ్వుతో వికసించియున్న ముఖపద్మము గలవాడై, పచ్చని పట్టువస్త్రమును, వనమాలను ధరించివాడై సాక్షాత్తుగ మన్మథునకే మన్మథుడై శ్రీకృష్ణుడు వారి (గోపస్త్రీల) మధ్యన ఆవిర్భవించెను. 2

టీ:- సాక్షాన్మన్మథమన్మథః-జగన్మోహనుడగు కామదేవునియొక్క రూపమును మించి-మనస్సునందు ఉద్భవించువాడు కాముడు సాక్షాత్తుగ అతనినే మోహింపజేయు వాడనియర్థము. 2

శ్లో॥ తం విలోక్యా గతం కృష్ణం ప్రీత్యుత్ఫుల్లదృశో౽బలాః ।
ఉత్తస్థుర్యుగపత్సర్వాస్తన్వః ప్రాణమివాగతమ్ ॥ 3

తా. వచ్చిన ఆ కృష్ణుని జూచి ప్రేమతో వికసించిన చూపులుగల వారై అందఱును ఒకేసారి, శరీరములోనికి ప్రాణము వచ్చినట్లు లేచి నిలబడిరి. 3

టీ:- తమితి. తన్వః కరచరణాదయః. (3-5)

టీ:- తన్వః - చేతులు, కాళ్లు మొదలగునవి. (3-5)

శ్లో॥ కాచిత్కరాంబుజం శౌరేర్జగృహే౽ంజలినాముదా ।
కాచిద్దధార తద్బాహుమంసే చందనరూషితమ్ ॥ 4

తా. ఒక స్త్రీ కృష్ణుని హస్తపద్మమును తన దోసిటిలోనికి తీసుకొనెను. సంతోషముగ మఱియొకతి ఆతనిచేతిని, చందనముతో కప్పుబడియున్న దానిని - తమ మూపున మోపుకొనెను. 4

శ్లో॥ కాచిదంజలినాగృహ్ణాత్తన్వీ తాంబూలచర్వణమ్ ।
ఏకాంతదంఘ్రికమలం సంతప్తస్తనయోరధాత్ ॥ 5

తా. ఒక యువతి అతడు నములుచున్న విడెమును తన దోసిటి లోనికి తీసుకొనెను. మఱియొకతె అతని పాదపద్మములు తన వెచ్చని కుచముపై నుంచుకొనెను. 5

శ్లో॥ ఏకా భ్రుకిటి మాబధ్య ప్రేమ సంరంభవిహ్వలా ।
ఘ్నంతీ వైక్షత్కటాక్షేపైర్నిర్దష్ట దశనచ్ఛదా ॥ 6

తా. ఒక గోపిక ప్రణయకోపావేశముతో వివశురాలై కనుబొమ్మలు ముడిచి, పైపలువరుసతో క్రింది పెదవినికప్పి, (బిగించినొక్కి) కొస చూపులతోపరాభవించుచు అతనిని చంపుదుననునట్లు చూసెను. 6

టీ:- ఏకేతి. భ్రుకుటిమాబధ్య కుటిలీకృత్య ప్రేమ సంరంభేణ ప్రణయకోపావేశేన విహ్వాలా వివశా, నిర్దిష్టః దశనచ్ఛదః యయా. కటాః కటాక్షాః తైః యే ఆక్షేపాః పరిభవాః తైస్తాడయంతీ, వైక్షత్. 6

టీ:- కనుబొమ్మలు ముడిపెట్టి - ప్రేమవలని కోపముతో వివశురాలై, కఱువబడు పలువరుస కప్పు ఎవరిచేతనో ఆమె - కటాః - కటాక్షాః - కొసచూపులు - వానిచేత - ఆక్షేపాః-తిరస్కారములు - వానితో కొట్టుచు తీక్ష్ణముగ అతని వైపు చూచెను. 6

శ్లో॥ అపరా నిమిషద్ద్ృగ్భ్యాం జుషాణా తన్ముఖాంబుజమ్ ।
ఆపీతమపి నా తృప్యత్సంతస్తచ్చరణం యథా ॥ 7

తా. మఱియొక గోపిక రెప్ప వాల్చని చూపులతో అతని ముఖపద్మము నందలి సౌందర్యమాధుర్యమును ఆస్వాదించుచున్నను - సత్పురుషుల, భగవానుని పాదపద్మములనెంత ఆస్వాదించినను తృప్తి పడని రీతిగ అసంతృప్తినే పొందుచుండెను. 7

టీ:- అపరేతి. అనిమిషతీభ్యాం. అనిమీలంత్యాభ్యాం దృగ్భ్యాం ఆపీతమపి సమ్యగ్దృష్టమపి వునరుషాణా నాతృప్యత్. 7

టీ:- అనిమిషతీభ్యాః - ఱెప్పవేయని రెండుకన్నులతోడి - దృగ్భ్యాం చూపులతో - ఆపీతమపి - లెస్సగాచూచియున్నను మఱల చూచుటను ఆస్వాదించుచు - తృప్తినొందకుండెను. 7

శ్లో॥ తం కాచిన్నేత్ర రంధ్రేణ హృది కృత్వా నిమీల్య చ ।
పులకాంగ్యుపగూహ్యాస్తే యోగీ వా నందనిర్భరా ॥ 8

తా. ఒక గోపిక తన కంటి ద్వారమున మనస్సు లోనికి తీసుకొని, పిమ్మట కన్నులు మూసుకొని అతనిని కౌగలించుకొని రోమాంచితురాలై యోగివలె ఆనందమయురాలయ్యెను. 8

టీ:- తమితి. హృది కృత్వా హృదయం నీత్వేత్యర్థః. ఆనందసంప్లుతేతి. వా పాఠః. 8

టీ:- హృదికృత్వా - మనస్సులోనికి తీసికొనిపోయి అని యర్థము- 'ఆనందుప్లుతా' అనియు ఒక పాఠము. 8

శ్లో॥ సర్వాస్తాః కేశవాలోకపరమోత్సవ నిర్వృతాః ।
జహుర్విరహజం తాపం ప్రాజ్ఞం ప్రాప్య యథా జనాః ॥ 9

తా. వారందఱును శ్రీకృష్ణునిచూచుటచే మిక్కిలి ఉప్పొంగిన ఆనందముగలవారై - విరహమువలన కలిగిన తాపమును, ప్రాజ్ఞుని పొందిన జనులవలె వదిలిపెట్టిరి. 9

టీ:- సర్వా ఇతి. ప్రాజ్ఞం ఈశ్వరం. ప్రాప్య. యథా ముముక్షవో జనాః. యద్వా ప్రాజ్ఞం బ్రహ్మజ్ఞం. ప్రాప్య. యథా సంసారిణః. యద్వా. ప్రాజ్ఞం సుషుప్తిసాక్షిణం ప్రాప్య యథా విశ్వతైజసావస్థా జీవాః. 9

టీ:- ప్రాజ్ఞం - ఈశ్వరుని - పొంది ఏ విధముగ మోక్షార్థులు అగుజనులు - లేక - ప్రాజ్ఞం - బ్రహ్మవేత్తను పొంది ఏ విధముగ సంసారులు - లేక - ప్రాజ్ఞం - సుషుప్తి సాక్షియగు వానిని - పొంది విశ్వ, తైజసావస్థలతో గలజనులు - (తాపమును వీడినట్లు) 9

శ్లో॥ తాభిర్విధూత శోకాభిర్భగవానచ్యుతో వృతః ।
వ్యరోచతాధికం తత్ర పురుషశక్తిభిర్యథా ॥ 10

తా. భగవానుడగు కృష్ణుడు తన దర్శనముచేత విడిచిన దుఃఖముగల గోపస్త్రీలతో ఆవరింపబడినవాడై, శక్తులతోకూడిన పురుషునివలె అతిశయముగ ప్రకాశించెను. 10

టీ:- తాభిరితి. పురుషః పరమాత్మా శక్తిభిః సత్వాదిభిః. యథా. యద్వా ఉపాసకః పరుషః. జ్ఞాన వీర్య బలాదిభిః. యదా పురుషోఽను శయీ. ప్రకృత్యాద్యుపాధిభిర్వృతో యథా వ్యరోచత తద్వత్. 10

టీ:- పురుషః - పరమాత్ముడు - శక్తిభిః - సత్యము మొదలగువానితో వలె - లేక - ఉపాసకుడైన పురుషుడు, జ్ఞానము, వీర్యము, బలము మొదలగు వానితోకూడినప్పుడు ఎట్లు వెలుగొందునో అట్లు - లేక (తత్సృష్ట్వాద దేవానుప్రావిశత్) అంతర్యామి రూపమున నుండు పురుషుడు ప్రకృతి మొదలగుఉపాధులచేత ఆవరింపబడి ఎట్లు ప్రకాశించెనో అట్లు. 10

శ్లో॥ శరచ్చంద్రాంశు సందోహ ధ్వస్తదోషా తమశ్శివమ్ ।
కృష్ణాయా హస్త తరళాచిత కోమలవాలుకమ్ ॥ 11

శ్లో॥ తాస్సమాదాయ కాళింద్యా నిర్విశ్యపులినం విభుః ।
వికచత్కుంద మందార సురభ్యనిల షట్పదమ్ ॥ 12

టీ:- తా ఇతి. వికచత్కుందమందారైః. సురభిర్యో౽నిలః. తస్మాత్ షట్పదా యస్మిన్. 11

టీ:- శరదతి. శరచ్చంద్రాంశూనాం. సందోహైః సమూహైః. ధ్వస్తం దోషాతమః రాత్రిం గతం తమో యస్మిన్ తత్. అతః. శివం సుఖకరం. హస్తరూపైస్తరళైస్తరంగైః. ఆచితాః ఆస్తృతాః కోమలా వాలుకాః యస్మిన్. ఏవంభూతం పులినం. తాస్సమాదాయ నిర్విశ్య, తత్ర తాభిర్వృతః. అధికం వ్యరోచతేతి. పూర్వేణాన్వయః. 12

తా. శరత్కాల చంద్రుని కిరణ సమూహములచేత ధ్వంసము చేయబడిన రాత్రి సమయమునందలి చీకటి వలన మంగళప్రదమైనదియు, యమునానది యొక్క ఇటు అటు కదులుచున్న అలలు అనెడి కోమలమైన చేతులతో ఆవరింపబడియున్న ఇసుక తిన్నెకు గోపస్త్రీలను వెంటగొని కృష్ణుడు ప్రవేశించెను. ఆపుల నవనియందు వికసించిన మల్లెలు, దాసనలు మొదలగువాని పరిమళముల గాలి వీచుచుండెను. పూలతేనెలకై తుమ్మెదలు సందడించుచుండెను. అట్టి ఇసుకతిన్నెయందు ప్రవేశించిన కృష్ణుడు గోపికలతో ప్రకాశించెను. (11-12)

టీ:- నిచ్చుకొనుచున్న మొల్లలు, మందారపుష్పములు మొదలగు వానిచే పరిమళముతో గూడిన ఏ గాలి కలదో దానివలన తుమ్మెదలు దేనియందో-శరత్కాలపు చంద్రుని కిరణముల సమూహములచేత-ధ్వస్తం-ధ్వంసము చేయబడిన - దోషాతమః - రాత్రిని పొందియున్న చీకటి దేనియందో అది - అందువలన శివం - సుఖకరమైనది - చేతులవలె కదలుచున్న అలలచేత - ఆచితాః - చాచబడిన - మెత్తని ఇసుకలు దేనియందో - ఇట్టి ఇసుకతినెనను వారిని వెంటగొని ప్రవేశించి - ఇచట వారితో ఆవరింపబడి మిక్కిలిగ ప్రకాశించెను అని పూర్వశ్లోకముతో అన్వయము. (11-12)

శ్లో॥ తద్దర్శనాహ్లాద విధూతహృద్రుజో
మనోరథాంతం శ్రుతయో యథాయయుః ।
స్వైరుత్తరీయైః కుచుకుంకుమాంకితై
రచిక్లిపన్నా సనామాత్మబంధవే ॥ 13

తా. కృష్ణుడు కనబడుటచేత కలిగిన ఆనందముతో మనఃక్లేశములను విడిచినవారై గోపాంగనలు, శ్రుతులు ఆప్తకామత్వమును పొందినట్లు గోపాంగనలుకూడ కృష్ణ దర్శనమున పూర్ణమనోరథలై, కుచముల కలందికొనిన కుంకుమచిహ్నములుగల ఉత్తరీయములతో తమకు మిక్కిలి ప్రియతముడైన కృష్ణునకు ఒక కూర్చునెడు స్థానమును కల్పించిరి. 13

టీ:- తదితి తాశ్చ మనోరథానాం. అంతం. యయుః. పూర్ణకామ బభూవుః.శ్రుతయో యథేతి. అయమర్థః యథా. కర్మకాండే శ్రుతయః పరమేశ్వరమపశ్యంత్యః. తత్తత్కామానుబంధైరపూర్ణా ఇవ భవంతి. జ్ఞానకాండే తు. పరమేశ్వరం దృష్ట్వాః తదాహ్లాదపూర్ణాః. కామానుబంధం జహుస్తద్వదితి. ఆప్తకామా అపి ప్రేమ్ణా తమభజన్నిత్యా - స్వైరితి. అచిక్లిపన్ రచయా మాసుః ఆత్మబంధవే అంతర్యామిణే. 13

టీ:- వారును కోరికల సమాప్తిని పొందిరి. పూర్ణకాములైరి. 'ఎట్లు శ్రుతులు'- దీని అర్థమిట్లు - కర్మకాండలో శ్రుతులు పరమేశ్వరుని దర్శించినవియై ఆ యా కామానుబంధములతో అపూర్ణములవలె అగును. జ్ఞాన కాండమున నో - పరమేశ్వరుని దర్శించి అతని దర్శనమున ఆహ్లాదముతో నిండి కామానుబంధమును విడిచిపెట్టును - ఆ విధముగ అవి - ఆప్తకామములైన (కోరికతీరినవారైనను) ప్రేమతో అతనిని భజించిరి అని చెప్పుచున్నాడు. అచిక్లిపన్ - రచించిరి - ఆత్మబంధవే - అంతర్యామికొఱకు- 13

శ్లో॥ తత్రోపవిష్టో భగవాన్ స ఈశో
యోగేశ్వరాంతర్హృది కల్పితాసనః ।
చకాస గోపీపరిషద్గతోఽర్చితస్త్రై
లోక్యలక్ష్మ్యైకపదం వపుర్దధత్ ॥ 14

తా. యోగీశ్వరుల హృదయకోశములతో ఏర్పాటుచేయబడిన ఆసనము (కూర్చొనుతావు) కలవాడును, భగవానుడును, జగత్ప్రభువునైన కృష్ణుడు ముల్లోకములలోని సౌందర్యమును ఏకామాత్రమగు శరీరమును ధరించియున్నవాడగు శ్రీకృష్ణుడు ఆ గోపికల సమూహములో పూజింపబడుచు వారేర్పరచిన ఆసనములపై కూర్చుండి శోభించెను. 14

టీ:- తత్రేతి. గోపీసభాగతః. తాభిస్సంమానితస్సన్. చకాస శుశుభే త్రైలోక్యే యాలక్ష్మీః శోభా. తస్యా. ఏకమేవ పదంస్థానం. తద్వపుర్దధత్ దర్శయన్. 14

టీ:- గోపీ సభాగతః - గోపికల సమూహమును పొంది - వారితో పూజింపబడి - చకాస - శోభించెను. ముల్లోకములలో ఏ శోభగలదో- దానియొక్క ఒకే ఒక - పదం - స్థానమైన యట్టి శరీరమును చూపుము -14

శ్లో॥ స భాజయిత్వా తమనంగదీపనం
స హాసలీలేక్షణ విభ్రమ భ్రువా ।
సంస్పర్శనేనాంక కృతాంఘ్రిహస్తయోః
సంస్తుత్య చేషత్కుపితా బభాషిరే ॥ 15

తా. గోపస్త్రీలు ఆ మన్మథోద్దీపకుడగు కృష్ణుని తమ నవ్వులతో, లీలలతో, చూపులతో, విలాసములతోడి కనుబొమ్మలతో ఆనందింపజేసి అతని పాదములను, హస్తములను, వడిలోనుంచుకొనుచు నొక్కుచును అతనిని స్తోత్రముచేసి ఇంచుక కోపమునొందినవారై ఇట్లనిరి. 15

టీ:- స భాజయిత్వేతి. స హాసలీలేక్షణేన. విభ్రమో విలాసః యస్యాం తయా భ్రువా. ఉపలక్షితాః సంస్పర్శనేన సంమర్దనేన. 15

టీ:- స హాసలీలేక్షణేన - నవ్వుతోకూడిన లీలావీక్షణముతోడి - విభ్రమః - విలాసము ఎవరియందో దానిచేతకూడిన కనుబొమ్మలచేత గుర్తింప బడుచున్నవారై - సంస్పర్శనేన - సంమర్దనముచేత-15

**గోప్య ఊచు**

శ్లో॥ భజతో న భజంత్యేక ఏక ఏతద్విపర్యయమ్ ।
నోభయాంశ్చ భజంత్యన్య ఏతన్నో బ్రూహి సాధు భో ॥ 16

**గోపికలిట్లనిరి.**

తా. కొందఱు, తమను ప్రేమించువారినే ప్రేమింతురు. మఱికొందరు తమను ప్రేమింపని వారిని కూడ ప్రేమింతురు. కొందఱు ఈ రెండు రకముల వారిని కూడ ప్రేమింపరు. ఈ మూడు రకముల వారిలో ఎవరు మంచివారో చెప్పుడు. 16

టీ:- తత్ర భగవతః అకృతజ్ఞతాం తద్వచనే నైవోపపాదయితుకామాః గూఢాభిప్రాయాలోక వృత్తాంతమివ పృచ్ఛంతి. భజత ఇతి. భజతః ప్రాణినః. అను అనంతరం. కేచిత్తద్భజనానుసారేణ భజంతి. కేచిదే తద్విపర్యయం యథా భవతితథా. తద్భజనానపేక్షితం అభజతోఽపి భజంతి. అన్యే తు నో భయానితి. 16

టీ:- భగవానుని అకృతజ్ఞతను అతని మాటలద్వారానే వెలువరింప జేయుటకు నుద్దేశముగలవారై, నిగూఢమైన అభిప్రాయముగల లౌకవృత్తాంతమువలె అడుగుచున్నారు, సేవించు ప్రాణియొక్క - అను - తరువాత కొందఱు సేవించువారి సేవననుసరించి వారిని సేవింతురు. కొందఱు దీనికివ్యతిరేకముగ ఎట్లుసంభవించునో అట్లు- అనగా వారి సేవను అపేక్షించకుండగనే - వారు సేవింపకున్నను వారిని వీరు సేవింతురు. ఇక ఇతరులుకొందఱు తమను సేవించినను, సేవింపకున్నను తాము వారిని సేవింపరు. 16

శ్రీ భగవానువాచ

శ్లో॥ మిథో భజంతి యే సఖ్యస్స్వార్థైకాంతోద్యమా హి తే ।
న తత్ర సౌహృదం ధర్మస్స్వార్థార్థం తద్ధి నాన్యథా ॥ 17

శ్రీకృష్ణుడిట్లనెను.

తా. చెలులారా! పరస్పరముప్రేమించుకొనువారుకేవలము స్వార్థులు వారు 'ఏకాంతోద్యమ' ప్రియులుమాత్రమే. అచట సుహృద్భావములేదు. ధర్మములేదు. అదితమకొఱకుతామైనది కానివేఱువిధము కాదు. 17

టీ:- విదితాభిప్రాయస్సన్. ఉత్తరమాహ-మిథ ఇతి. హే సఖ్యః. ఉపకారప్రత్యుపకారతయా యే మిథో భజంతి. తేఽన్యం న భజంతి. కింత్వాత్మానమేవ కుతః? హి యస్మాత్. స్వార్థ ఏవైకాంతః ఉద్యమో యేషాం తే తత్ర చ. న సౌహృదం. అతో న సఖ్యం. న చ ధర్మః దృష్టోద్దేశాత్. గోమహిష్యాది భజనవదిత్యర్థః. 17

టీ:- గోపికల అభిప్రాయము ఎఱింగినవాడై సమాధానము చెప్పుచున్నాడు. ఓ సఖీజనులారా! ఉపకారము, ప్రత్యుపకారము అను భావముతో ఎవరు అన్యోన్యముగ - ఒకరినొకరు ప్రేమించుకొను చుందురో - వారు ఇతర వ్యక్తిని ప్రేమింపరు. తమను తామే భజింతురు. ఎందువలన? ఎందులకన - స్వార్థమే - ఏకాంతమే

శ్లో॥ భజంత్యభజతో యే వై కరుణాః పితరో యథా ।
ధర్మోనిరపవాదోఽత్ర సౌహృదం చ సుమధ్యమాః ॥ 18

టీ:- యే తు అభజతో భజంతి. తే ద్వివిధాః కరుణాః స్నిగ్ధాశ్చ. తత్ర తు. యథా క్రమం ధర్మకామౌభవత - భజంత్యభజత ఇతి. కరుణా ఏషా మస్తీతికరుణాః దాంతా ఇత్యర్థ. 18

శ్లో॥ భజతోఽపి న వై కేచిద్భజంత్యభజతః కుతః ।
ఆత్మారామాహ్యాప్తకామాహ్యకృతజ్ఞా గురుద్రుహః ॥ 19

వారి ఉద్యమము కావున, అచట స్నేహములేదు. - అచట ధర్మము కూడలేదు, అచట భౌతికత్వమే - ఇంద్రియ లౌక్యమే ప్రధానమైనందు వలన - ఆవులు, గేదెలు, మొదలగు పశువులు, పామరులు మొదలగువారి పరస్పర ప్రేమవలెనని అర్థము. 17

తా. సుందరీమణులారా! తమను ప్రేమింపనివారినికూడ ఎవరు ప్రేమింతురో వారు తల్లిదండ్రులవలె దయామయులు. అచట ధర్మము, సహృదయత్వము నిండుగనుండును. 18

టీ:- తమను భజింపనివారని కూడ ఎవరు ప్రేమింతురో వారు రెండు విధములు. "దయగలవారు, స్నేహముగలవారు" అని అచట క్రమముననుసరించి ధర్మము, కామము రెండును ఉండును. (రెండు ప్రసిద్ధ పురుషార్థములు సాధింపబడును) అని చెప్పుచున్నాడు-'కరుణ గలవారు కరుణాః' - దాంతి (ఓర్పు) గలవారు అని అర్థము. 18

తా. తమను ప్రేమించువారిని, ప్రేమింపనివారిని కూడ కొందఱు ప్రేమింపరు. ఇట్టివారు నాలుగు విధములుగనున్నారు. 1. ఆత్మయందే రమించువారు. (వీరికి ద్వైతస్థితిలేదు), 2. ఆప్తకాములు (అనగ కోరికలిన్నియు తీరినవారు - అనగ కోరికలే లేనివారు), 3. భజించు

టీ:- తృతీయప్రశ్నస్యోత్తరం. భజతోఽపీతి. అయమర్థః. చతుర్విధా ఏతే ఆత్మారామాః అపరాగ్దృశః కేచిదాప్తకామాః విషయ దర్శినేఽపి పూర్ణకామత్వేన భోగేచ్ఛారహితాః అన్యే గురుద్రుహః. అతికఠినాః. శ్లో. "స పితాయస్తు పోషక" ఇతి న్యాయాత్ ఉపకర్తా గురుతుల్యః తస్మై ద్రుహ్యంతీతితథా.తే. 19

శ్లో॥ నాహంతుసఖ్యో భజతోఽపి జంతూన్
భజామ్యమీషానువృత్తివృత్తయే ।
యథాఽధనో లబ్ధ ధనే వినష్టే
తచ్చింతయాన్యన్నిభృతో న వేద ॥ 20

వారెవరో - భజింపని వారెవరో వారి కర్మలెట్టివో తెలియని వారు. తెలుసుకొన అక్కఱలేనివారు, 4. మిక్కిలి కఠినులు (ఎంతగొప్ప ఉపకారికినైనను ద్రోహము చేయగలవారు). 19

టీ:- మూడవప్రశ్నకు సమాధానమిది. దీని అర్థమిట్లు - వీరు నాలుగు విధములు. 1.ఆత్మారాములు అనగా అపరాఙ్ముఖులు - పెడమొగము కాక ఆత్మయందే దృష్టి నిలుపువారు. 2. కొందఱు ఆప్తకాములు - విషయమును చూచినను కోరికలీడేరి యున్నవారగుట చేత భోగము (అనుభవము) నందు ఇచ్ఛలేనివారు. 3. ఇతరులు అతికఠినులు - పోషకుడుతండ్రి అను న్యాయమువలన ఉపకారము చేయువాడు - గురువుతో సమానుడు - వారికి - అట్టి వానికి ద్రోహము చేయువారు 'గురుద్రుహః' అని 4. కృతఘ్నుడు, కృతమును గుర్తింపనివారు. 19

తా. చెలులారా ! నిరంతరము ధ్యానప్రవృత్తిలో నుంచుటకు నేను, నన్ను భజించువారిని భజింపను. (భజింపనివారినిభజింతును), నిర్ధనుడైన వ్యక్తి ధనము లభించినను, నష్టమైపోయినను, ధనచింత తోడనే అతడు తక్కినఅన్ని విషయములను బొత్తిగ తెలుసుకొనజాలడు కదా! అట్లు. 20

టీ:- అత్ర చరమకోటి గతమాత్మానాం మత్వా అక్షి సంకోచైః పరస్పర గూఢస్మితముఖీస్తాదృష్ట్వాహ – నాహంత్వితి. హే సఖ్యః అహం తేషాం మధ్యే. న కోఽపి కింతు పరమకారుణికః పరమసుహృచ్చ కథం. అమీషాం భజతాం. అనువృత్తివృత్తయే నిరంతర ధ్యాన ప్రవృత్త్యర్థం తాన్నాహం భజామి. ఏతత్సదృష్టాంతమాహ – యథేతి. తస్య ధనస్యైవ చింతయా, నిభృతః పూర్ణః. వ్యాప్త ఇతి యావత్. అన్యత్తు క్షుత్పిపాసాదిక మపి న వేద. 20

టీ:- ఇచట తనను తాను చిట్టచివరి వర్గములోని వ్యక్తిగా భావించుకొని కనులు సంకోచించి, పరస్పరము గూఢమైన చిరునవ్వుతో గూడిన ముఖములుగలవారైన గోపికలను చూచి చెప్పుచున్నాడు. ఓ చెలులారా! నేను వారిమధ్య ఎవ్వరినీ కాను, కాని – మిక్కిలి దయగల వాడను– మిక్కిలి స్నేహముగలవాడను. ఎట్లు? ఈ భజించు వారిలో – అనువృత్తయే – నిరంతరముగ ధ్యాన ప్రవృత్తిని కలిగించుటకు, వారిని నేను భజింపను. దీనికి దృష్టాంతమును చెప్పుచున్నాడు. అతనిని (నిర్ధనునకు) ధనచింత తోనే – నిభృతః – నిండిన – వ్యాప్తమై యున్న మనస్సు గలవాడగుటచే – అన్యత్ తు – ఆకలి దప్పులు కూడ – న వేద – తెలియజాలడు. 20

శ్లో॥ ఏవం మదర్థోజ్ఝితలోకవేదస్వానాం
హి వో మయ్యనువృత్తయేఽబలాః ।
మయాపరోక్షం భజతా తిరోహితం
మాయాసుతం మార్హథ తత్ప్రియం ప్రియాః ॥ 21

తా. ఓ అబలలారా! నాతో అనువర్తించుట కొఱకు, మీరీవిధముగ లోకమును, వేదమును, బంధువులను తిరస్కరించి వచ్చితిరి. అట్టి మీకు అంతర్హితుడనై కనబడకుండ మీ ప్రేమాలాపములను వినుచున్న నన్ను – ఓ ప్రేమమూర్తులారా! దోషారోపణ దృష్టితో చూచుట తగదు సుమా!. 21

టీ:- ఏవమితి. మదర్థోజ్ఝితలోకవేదస్వానాం. మదర్థే ఉజ్ఝితః. లోకః యుక్తాయుక్తాప్రతీక్షణాత్. వేదాశ్చ. ధర్మాధర్మాప్రతీక్షణాత్. స్వాః జ్ఞాత

టీ:- మదర్థోజ్ఝిత లోకవేదస్వానాం – నా కొఱకు వదిలివేయబడిన – లోకః – యుక్తాయుక్తములను చూడక వేదః చ – ధర్మాధర్మములను

యశ్చ స్నేహత్యాగాత్. యాభిస్తాసాం వో యుష్మాకం. పరోక్షం అదర్శనం యథా భవతి తథా. భజతాయుష్మత్ప్రేమాలాపాన్ శృణ్వత్తైవ. తిరోహితం అంతర్ధానేన స్థితం. తత్తస్మాత్. హే అబలాః. హే ప్రియాః మామాం అసూయితుం దోషారోపేణ ద్రష్టుం. యూయంమర్హథ న యోగ్యాః స్థ. 21

చూడక - స్వాః - బంధువులు - వారి స్నేహమును విడుచుట ఎవరిచేతనో అట్టి - వః - మో యొక్క - పరోక్షం - కనబడని స్థితిలో ఎట్లో అట్లు- భజతా - మీ ప్రేమాలాపములను వినుచునే- అంతర్ధానస్థితిలో నున్న - ఆ స్థితి నుండి - ఓ అబలలారా! ఓ ప్రేమమూర్తులారా! మా - నన్ను - అసూయితుం - దోషారోపణతో చూచుటకు - మీకు తగినదికాదు. 21

శ్లో॥ న పారయేऽహం నిరవద్యసంయుజాం
సుసాధుకృత్యం విబుధాయుషాపి వః ।
యామాభజన్ దుర్దర గేహ శృంఖలాం
సంవృశ్చ్య తద్వః ప్రతియాతు సాధునా ॥ 22

తా. మీ ఆనందమైన కలయికను, చిరకాలము జీవించియున్నను ఏదేని ఒక సత్కార్యము ద్వారా ప్రత్యుపకారముచేసి, సమాప్తిచేయ జాలను. (ప్రత్యుపకారముతో మీ ఋణమును సంపూర్ణముగ తీర్చుకొనలేను) వ్రక్కలించుచుండు 'ఇంటి సంకెలలను' నిశ్శేషముగ భేదించి, నన్ను సేవించుచుండిన మీ ఏబుద్ధిగలదో - దానికి మీ సౌశీల్యమే ప్రత్యుపకారమగును గాక. 22

టీ:- ఆస్తామిదం పరమార్థం తు శృణుతేత్యాహ - నేతి. నిరవద్య సంయుజాం నిరవద్యం సంయుక్ సంయోగః యాసాం నిరవద్యం యథా భవతి తథా సంయుజ్యంతే భజంత ఇతి వా. తథా తాసాం వః విబుధాయుషా చిరకాలేనాపి స్వయం సాధుకృత్యం కర్తుం ప్రత్యుపకార కృత్యం, కర్తుం. న పారయే న శక్నోమి. కథంభూతానాం. యాః

టీ:- మన ఇరువురి చర్యలు అటులుండెను (ఉండనిండు) ఈ పరమార్థమును వినుడు - అని చెప్పుచున్నాడు. 'స' అని నిరవధ్య సంయుజాం - నిరవధ్యం సంయుక్ - సంయోగః - అనిందితమైన (చెప్పుకొనదగిన) కలయిక-ఎవరియందు అనిందితమెట్లగునో అట్లు- సంయుజంతే-సేవించుచుందురో అనియు. ఆ విధముగ-అట్టి మీ

భవత్యః. దుర్జరా అజరా యా గృహశంఖళా. తాం సంవృశ్చ్యనిశ్శేషం ఛిత్వా మామాం అభజన్. తాసాం మచ్చిత్తం బహుషు ప్రేమయుక్త తయా నైకనిష్ఠం తస్మాద్వో యుష్మాకమేవ సాధూనా సాధుకృత్యేన. యత్ యుష్మత్సాధుకృత్యం తత్. ప్రతియాతు ప్రతికృతం భవతు. యుష్మత్సౌశీల్యేనైవ మమానృణ్యం న తు మత్కృత ప్రత్యుపకారేణేత్యర్థః 22

శ్రీ మద్భాగవతే, మహాపురాణే దశమస్కంధే,

ద్వాతింశోఽధ్యాయః

యొక్క విబుధాయుశ దేవతల ఆయుర్దాయుముతో - అనగ చిరకాలమునకు కూడ - స్వయముగ - మంచిపనిచేయుటకు - ప్రత్యుపకార కార్యము చేయుటకు - న పారమే - శక్తుడనుకాను. ఎట్టివారికి? ఏ మీ యొక్క - దుర్ధర - వ్రక్కలించెడు - యా గృహశృంఖలా - ఏ ఇంటి సంకెళ గలదో - దానిని - సంరుశ్చ్య - మిగులు లేకుండ ఛేదించి - మా - మాం - నన్ను - సేవించిరి. అట్టి మీలో - నా చిత్తము - చాలా మంది యందు ప్రేమతో కూడి యుండుట చేత - నైకనిష్ఠం - ఒకదాని యందే (లేక)యుండునదైనది. అందువలన మీ మీదేయైన సత్కార్యముచేత - ఏమి సాధుకృత్యము గలదో అది - ప్రతియాతు - ప్రత్యుపకారము అగునుగాక. మీ సౌశీల్యముచేతనే నాకు ఋణవిముక్తి యగును. కాని నాచే చేయబడు ప్రత్యుపకారముచే కాదు అనిఅర్థము. 22

అని శ్రీమద్భాగవతమున దశమస్కంధమందు

ముప్పది రెండవ అధ్యాయము సమాప్తము.

## త్రయస్త్రింశోఽధ్యాయః

### శ్రీ శుక ఉవాచ

శ్లో॥ ఇత్యం భగవతో గోప్యః శ్రుత్వా వాచస్సుపేశలాః ।
జహుర్విరహజం తాపం తదంగోపచితాశిషః ॥ 1

టీ:- త్రయస్త్రింశే తతో గోపీ మండలీ మధ్యగో హరిః, ప్రియస్త్రా రమయామాస హ్రదినీ వనకేళిభిః. ఇత్థమితి. తత్తదా అంగ హే రాజన్. యద్వా. తస్య భగవతోఽంగేన అభ్రవపుషా కరచరణాద్యవయవైర్వా ఉపచితాస్సమృద్ధా ఆశిషో యాసాం తాః. 1

శ్లో॥ తత్రారభత గోవిందో రాసక్రీడా మనువ్రతైః ।
స్త్రీరత్నైరన్వితః ప్రీతైరన్యోన్యాబద్ధబాహుభిః ॥ 2

## 33వ అధ్యాయము

### శ్రీశుకుడు ఇట్లు పలికెను.

తా. ఈ విధముగ గోపికలు కృష్ణుని నిపుణమైన మాటలు విని, అతని కరచరణాద్యవయముల ఆశీస్సులు లెస్సగ గలవారై- లేక ఆకాశవర్ణము గల అతనిశరీరముచే నొసంగబడిన పుష్కలమైన దీవెనలు కలవారై - విరహము వలన కలిగిన తాపమును విడిచిరి. 1

టీ:- ఈ ముప్పదిమూడవ అధ్యాయమున గోపికలమండలి మధ్య భాగమును పొందిన కృష్ణుడు వారిని అగాధ జలాశయము లందును, తటములందును, వనములందును జరుపబడు క్రీడలచే రమించెను- అప్పుడు - హే అంగ! - ఓ రాజా! లేక ఆ భగవానుని శరీరముచేత- అభ్ర వపుషా ఆకాశమువంటి శరీరముచేత - లేక కరచరణాది అవయవములచేత - ఉపచితాః - సంమృద్ధమైన ఆశీస్సులు ఎవరికో వారు. 1

తా. తనను అనుసరించియున్న ఉత్తమ స్త్రీలతో కూడినవాడై, పరస్పర ప్రేమలతోడి బహుబంధములతో అచట కృష్ణుడు రాసక్రీడను ప్రారంభించెను. 2

టీ:- తత్రేతి. రాసక్రీడా. రాసోనామ బహునర్తకీయుక్తో నృత్తవిశేషః తాంక్రీడాం. అన్యోన్యం ఆబద్ధాః సంగ్రథితాః బాహవః యైః. తైస్సహ. 2

టీ:- రాసక్రీడా - 'రాసము' అనగా చాలామంది నర్తకీమణులు కలసి చేసెడు గాత్ర విక్షేప ప్రధానమైన నర్తనవిశేషము. అట్టి క్రీడను- పరస్పరము ఒకరిచేతులనొకరు తీసుకొని (పట్టుకొని) చేసెడు విక్షేపము లతో కూడి. 2

శ్లో॥ రాసోత్సవ స్సంప్రవృత్తో గోపీమండలమండితః ।
యోగేశ్వరేణ కృష్ణేన తాసాం మధ్యే ద్వయోర్ద్వయో ॥ 3

తా. మండలాకారముగనున్న గోపికలతో అలంకృతమైన రాసోత్సవము ప్రవర్తించెను. ఇద్దరేసి గోపికల నడుమ యోగేశ్వరుడగు కృష్ణునిచే ప్రవేశింపబడి అది (రాసోత్సవము) ప్రవృత్తమయ్యెను. 3

టీ:- తత్సాహిత్యమభినయేన దర్శయత్యక్షరచతుష్టయాధికేన సార్ధేన. రాసోత్సవ ఇత్యాదినా. తాసాం మండలరూపేణావస్థితానాం. ద్వయోర్ద్వ యోర్మధ్యే. 3

టీ:- కవి ఆ ఉత్సవముతో తన సహితత్వమును నాలుగుకన్న నించుక ఎక్కువ అక్షరములతో ఆ ప్రయోగమును అభినయముతో చూపు చున్నాడు. మండలాకారముగ (వృత్తాకారముగ) నున్న ఆ గోపికల మధ్యన ఇద్దరేసి ఇద్దరేసి మధ్యన - (గోపికకు గోపికకు మధ్య ఒక కృష్ణుడు - ఆ విధముగ) 3

శ్లో॥ ప్రవిష్టేన గృహీతానాం కంఠే స్వనికటం స్త్రియః ।
యం మన్యేరన్ నభస్తావద్విమాన శత సంకులమ్ ॥ 4

తా. ఇద్దరు గోపికల మధ్యన ప్రవేశించిన కృష్ణునిచేత ఆ రెండు వైపుల నున్న వనితలు అతనిచే కౌగలించుకొనబడిరి. (ఇట్లు గోపిక లందఱును అతనిని ఆ కంఠముగ కౌగలించుకొనిరి). అనగా ఒక్కొక్క కృష్ణుడు తనకు ఇటును అటునుగల గోపికలిరువురిని కౌగలించు

కౌనెను. (ఏకకాలమున) ఇక ప్రతి స్త్రీయును కృష్ణుడు తనకు మాత్రమే సమీపముగనున్నట్లుగ భావించెను. ఆకాశమున వందల కొలదిగ దేవతా విమానములు సంచరించెను. 4

టీ:- ప్రవిష్టేనేతి. ప్రవిష్టేన. తేనైవ కంఠే గృహీతానాం ఉభయత ఆలింగితానాం. కథంభూతేన. యం సర్వాః స్త్రియః. స్వ స్వ నికటం మామేవాశ్లిష్టవానితి మన్యేరన్. తేన ఏతదర్థం ద్వయోర్ద్వయోర్మధ్యే ప్రవిష్టే నేత్యర్థః. నన్వేకస్య కథం తథా ప్రవేశః. సర్వసన్నిహితత్వే వా తస్మిన్ కుతః స్వనికటవర్తిత్వాభిమానాత్తాసామిత్యత ఉక్తం. యోగేశ్వరేణేతి. అచింత్యశక్తినేత్యర్థః. 4

టీ:- ప్రవిష్టేన - ప్రవేశించిన కృష్ణునిచేతనే ఆకంఠముగ దగ్గఱకు తీసికొనబడిన గోపికలకు ఇరువైపుల కౌగలించుకొనబడిన వారికి - ఎట్టివాని చేత? ఎవనిని స్త్రీలందఱును తమ తమ సమీపముననే ఉండి 'నన్నే కౌగలించినాడు' అని తలచిరి. అందుచేతనే - దీని కొఱకే ఇద్దరేసి గోపికల మధ్యన ప్రవేశించిన వానిచేత అని అర్థము. మరి ఒక్కడే అయిన కృష్ణునికి ఆ విధముగ ప్రవేశించుటెట్లు సంభవమైనది? అందఱికిని దగ్గరగ ఆ మండలమందు ఎటనుండి ప్రవేశమైనది? తన చెంతనే కృష్ణుడున్నాడను అభిమానము వలన వారున్నట్లు చెప్పబడినది గదా! యోగేశ్వరుని చేత అని. అచింత్యమైన శక్తిగలవానిచేత - అని యర్థము. 4

శ్లో॥ దివౌకసాం సదారాణామౌత్సుక్యనిభృతాత్మనామ్ ।
తతో దుందుభయో నేదుర్నిపేతుః పుష్పవృష్టయః ॥ 5

తా. గొప్ప ఉత్సాహము నిండిన మనస్సులుగలవారైన, తన భార్యలతో కూడిన దేవతలయొక్క (విమానసమూహములతో ఆకాశము సంకుల మయ్యెను) దుందుభులు మ్రోగెను. పూలవానలు కురిసెను. 5

శ్లో॥ జగుర్గంధర్వ పతయస్సస్త్రీకాస్తద్యశోఽమలమ్ ।
వలయానాం నూపురాణాం కింకిణీనాం చ యోషితామ్ ॥ 6

శ్లో॥ సప్రియాణామభూచ్ఛబ్దస్తుములో రాసమండలే ।
తత్రాతిశుశుభే తాభిర్భగవాన్ దేవకీసుతః ॥ 7

తా. తమ తమ స్త్రీలతోగూడి గంధర్వనాయకులు కృష్ణుని పవిత్రమైన కీర్తిని వర్ణించు పాటలు పాడిరి. ఇక 'రాసమండలము'న స్త్రీల కంకణముల యొక్కయు, మంజీరముల యొక్కయు (అందెలయొక్కను), గజ్జెలయొక్కయు ధ్వనులు – కృష్ణునితోకూడియున్న స్త్రీల కంకణాదుల ధ్వనులు సంకీర్ణములై వినబడుచుండెను. దేవకీ సుతుడైన కృష్ణ భగవానుడు అచట మిక్కిలిగ శోభించెను. (6–7)

టీ:– దివౌకసామితి. తావత్తత్ క్షణమేవ అత్యౌత్సుక్యవ్యాప్త మనసాం స స్త్రీకాణాం దేవానాం విమానశతైస్సంకీర్ణం నభో బభూవ .స ప్రియాణమితి. స ప్రియాణాం కృష్ణ సహితానాం తుములః సంకీర్ణః. (5–7)

టీ:– అంతవఱకు – ఆ క్షణముననే మిక్కిలి ఉత్సాహముతోనిండిన మనస్సుగల స్త్రీలతో కూడిన దేవతలయొక్క విమానసమూహములతో సంకీర్ణమై ఆకాశము సందడించెను. సప్రియాణాం – కృష్ణసహితుల యొక్క –తుములః – సంకీర్ణము – (అన్ని ధ్వనుల కలయిక). (5–7)

శ్లో॥ మధ్యే మణీనాం హైమానాం మహామరకతో యథా ॥ 8

తా. బంగారువన్నెతో ప్రకాశించు మణులలో నీలమణివలె కృష్ణుడు శోభించెను. 8

టీ:– మధ్య ఇతి.మహామరకతోనీలమణిరివ,మరకతఇతి పాఠాంతరం హైమానాం మణీనాం మధ్యేతాభిః స్వర్ణవర్ణాభిరాశ్లిష్టాభిశ్శుశుభే. గోపీదృష్ట్యభిప్రాయేణ వా. వినైవ మధ్యపదావృత్తిమేకవచనం. 8

టీ:– మహామరకతః – నీలమణి(వలె)మరకతః అని పాఠాంతరము. బంగారు మణుల మధ్యన–వానిచేత బంగారువన్నెతో కలిపిన దానితో శోభించెను. లేక గోపికావృష్టి అభిప్రాయముచేత (ఈ పోలిక)–మధ్యమ స్థానము(పదము) యొక్క ఆ వృత్తిని మినహాయించియే ఏకవచనము.

శ్లో॥ పాదన్యాసైర్భుజ విధుతిభిస్సస్మితభ్రూవిలాసై
ర్భజ్యన్మధ్యైశ్చల కుచ పటైః కుండలైర్గండలోలైః ।
స్విద్యన్ముఖ్యః కబరరశనా గ్రంథయః కృష్ణవధ్వో
గాయంత్యస్తం తటిత ఇవ తా మేఘచక్రే విరేజుః ॥ 9

టీ:- స యథా. తాభిః. శుశుభే తథా తా అపి తేన విరేజురిత్యాహ- పాదన్యాసైరితి. భుజవిధుతిభిః కరచాలనైః భజ్యమానైర్మధ్యైః చలద్భిః కుచైః పటైశ్చః గండలోలైః గండేషు చంచలైః స్విద్యన్ముఖ్యః స్విద్యంతి స్వేదముద్గిరంతి ముఖాని యాసాం తాః. యద్వా. తేషు తాసు చ అగ్రంథయః శిథిల గ్రంథయ ఇత్యర్థః. తత్ర నానామూర్తిః కృష్ణో మేఘచక్రమివ. తాస్తు బహువిధాస్తటిత ఇవ. స్వేదస్తుషార ఇవ గీతం గర్జితమివేతి యథా సంభవమూహ్యం. 9

(గోపస్త్రీల నడిమ స్థలములలో ఎందఱో కృష్ణులు ఉన్నను ఉన్న కృష్ణుడొక్కడే కావున 'మరకతః' అని ఏకవచనము) 8

తా. పాదన్యాసములచేత (అడుగులు వేయుటచేత) హస్తచాలనము చేత, చిరునవ్వులతోడి కనుబొమ్మల విలాసములచేత, ఆ యా భంగిమలను భజించి నడుము (ల) చేత, కదులుచున్న కుచములచేత తత్సంబంధిత వస్త్రములచేత, చెక్కిళ్ళపైన చంచలించు కుండలముల చేత చెమర్చుచున్న ముఖములు గలవారై, కొప్పుల యొక్కయు, మొలనూళ్ళ యొక్కయు ముడులు సడలిపోవగ ఆ కృష్ణుని వధువులగు గోపికలు కీర్తించుచు, పాడుచు మేఘచక్రమునందు మెరుపు తీగలవలె ప్రకాశించిరి. 9

టీ:- అతడు (కృష్ణుడు) ఏ విధముగ వారిచేత (గోపికలచేత) శోభించెనో అట్లే వారును అతనిచేత ప్రకాశించెనని చెప్పుచున్నాడు. భుజవిధుతిభిః-కరచాలనముచేత-భంగిమలను భజించుచున్న నడుముల చేత - కదులుచున్న కుచములచేత - వస్త్రములచేత - చెక్కిళ్ళపై వేగముగ కదులుచున్న కుండలములచేతను, స్విద్యన్ముఖ్యః -చెమర్చుచున్న ముఖముగలవారై లేక - కృష్ణులయందును, గోపికల యందును ఆ యా ముడులు సడులుచుండగ అని యర్థము. అచట

శ్లో॥ ఉచ్చైర్జగుర్నృత్యమానా రక్తకంఠ్యో రతిప్రియాః ।
కృష్ణాభిమర్శముదితా యద్గీతేనేదమావృతమ్ ॥ 10

టీ:- ఉచ్చైరితి. నృత్యమానాః నృత్యంత్యః రక్తకంఠ్యః నానా రాగానురంజిత కంఠ్య. కృష్ణస్యాభిమర్శేన సంస్పర్శేన ముదితాః ఇదం విశ్వం. 10

శ్లో॥ కాచిత్సమం ముకుందేన స్వరజాతీరమిశ్రితాః ।
ఉన్నిన్యే పూజితా తేన ప్రీయమాణేన సాధ్వితి ।
తదేవ ధ్రువమున్నిన్యే తస్యై మానం చ బహ్వదాత్ ॥ 11

అనేక వ్యక్తులుగనున్న కృష్ణుడు మేఘచక్రమువలెను – వారు ( గోపికలు) అనేక విధముల మెరుపులవలె చెమటబిందువులు సన్నని చినుకులవలె పాట, ఉరుములవలె యథా సంభవముగ ఊహింపదగినది. 9

తా. వివిధములైన ఎఱ్ఱని మైపూతలతో రంజితములైన కంఠములు గలవారై రమించుట యందు ప్రీతిగలవారును అయిన గోపికలు నృత్యము చేయుచు బిగ్గరగ (తారస్థాయిలో) పాటలు పాడిరి. కృష్ణుని స్పర్శచేత మిక్కిలి సంతోషించినవారైరి. వారిపాటతో ఈ విశ్వమంతయు ఆవరింపడెను. 10

టీ:- నాట్యము చేయుచున్నవారై, రక్తకంఠ్యః – వివిధములైన ఎఱ్ఱని మైపూతలచే ఎఱ్ఱనైన కంఠములు గలవారు – కృష్ణస్య అభిమర్శేన – కృష్ణుని సుఖకరమగు స్పర్శచేత – ముదితాః – సంతసించినవారైరి. ఇదం – ఈ విశ్వమంతయు (వారిపాటతో ప్రతిధ్వనించెను). 10

తా. ఒక గోపిక కృష్ణునితో సమముగ, అన్య స్వర మిశ్రితములు కాని శుద్ధరాగమునకు సంబంధించిన స్వరవిశేషములను, గమకములను ఆలపించుచు ఒక దశలో ఆ ఆలాపనను తారస్థాయికి గొని పోయెను. దానితో కృష్ణుడు మిక్కిలి సంతోషించి ఆమెను ప్రశంసలతో

ముంచెత్తెను. బాగు బాగు అని ప్రీతుడైన అతనిచేత ఆమె మెప్పు పొందెను. దానినే ధ్రువతాళమున అదే ఉచ్చస్థాయిలో నిర్వహించెను. కృష్ణుడామెను మిక్కిలిగ గౌరవించెను. 11

టీ:- కాచిదితి. ముకుందేన సహ స్వరజాతీః షడ్జాదిస్వరాలాపగతీః అమిశ్రితాః కృష్ణేన ఉద్గీతాభిః అసంకీర్ణాః ప్రీయమాణేన సంమానితా తత్స్వరజాత్యున్నయనమేవ ధ్రువం ధ్రువాఖ్యం. తాళవిశేషం. కృత్వోన్నిన్యే ఉన్నీతవతీ. 11

టీ:- కృష్ణునితోకూడి షడ్జము మొదలగు స్వరములను ఆమె అమిశ్రితమైన శుద్ధతతో ఆలపించుచుండెను. కృష్ణునితో కలిసి ఉచ్చస్థాయిలో అసంకీర్ణముగ (అమిశ్రితముగ) పాడబడు పాటలచేత సంతోషించిన అతనిచే ఆమె సమ్మానింపబడెను. ఆ సర్వజాతియొక్క ఉచ్చస్థాయికి గొనిపోవుట యందే ధ్రువతాళమునకు మార్చి ఇంకను నిపుణముగ ఇంకను పైస్థాయికి గొని పోయెను. 11

శ్లో॥ కాచిద్రాసపరిశ్రాంతా పార్శ్వస్థస్య గదాభృతః ।
జగ్రాహబాహునాస్కంధం శ్లథద్వలయ మల్లికా ॥ 12

తా. ఒకానొక గోపిక నాట్యము చేయుటవలన అలసిపోయి చేతి కంకణములు, తలలోని మల్లెపువ్వులు జారిపోవు చుండగ పక్కననే ఉన్న కృష్ణుని చెయిపట్టి లాగి అతని భుజమును పట్టుకొనెను. 12

టీ:- ఏవం నృత్తగీతాదినా శ్రీకృష్ణ సంమానితానాం తాసామతి ప్రీతివిలసితం వృత్తమహ - కాచిదితి. శ్లథంతి వలయాని మల్లికాశ్చ యస్యాః సా. 12

టీ:- ఈ విధముగ నృత్యగీతములచేత శ్రీకృష్ణునిచే సమ్మానింపబడిన వారి ప్రేమ విలసితమైన నర్తనమును గూర్చి చెప్పుచున్నాడు. కంకణములు, మల్లెపువ్వులు ఎవరిని జారుచుండెనో ఆమె 'శ్లథద్వలయ మల్లికా' అనబడినది. 12

శ్లో॥ తత్రైకాసంగతం బాహుం కృష్ణస్యోత్పల సౌరభమ్ ।
చందనాలిప్తమాఘ్రాయ హృష్టరోమా చుచుంబ హ ॥ 13

తా. అచట ఒక గోపిక తన హృదయ స్థానముననున్న కృష్ణుని చేతికి గల కలువనెత్తావిని, చందనము లేపనము చేయబడిన ఆ చేతిని వాసన చూచి సంతసించిన రోమాంచముగలదై ఆ చేతిని చుంబించెను. 13

టీ:- తత్రేతి. ఉత్పలస్య సౌరభమివ సౌరభం యస్య. తం బాహుం. 13

టీ:- ఉత్పలమువంటి పరిమళము దేనికో - కలువనెత్తావి వంటి నెత్తావి దేనికో ఆ చేతిని 13

శ్లో॥ కశ్యాశ్చిన్నాట్య విక్షిప్త కుండల త్విషమండితమ్ ।
గండం గండే సందధత్యా ఆదాత్తాంబూల చర్వితమ్ ॥ 14

తా. ఒకానొక గోపాంగన, నాట్యవశమున కదలుచున్న కుండలముల కాంతిచేత నలంకృతమైన తన చెక్కిలిని అట్టిదే అయిన కృష్ణుని చెక్కిలితో కలుపగ కృష్ణుడు తన నమలిన తాంబూలము నామె నోటి కందించెను. 14

టీ:- కస్యా ఇతి. నాట్యేన నృత్యేన. విక్షిప్తయోశ్చంచలయోః కుండలయోః త్విషేణ త్విషా అదంతత్వమార్షం. మండితం గండం కపోలం తథా భూతే స్వ గండే. సందధత్యాః సంయోజయంత్యాః 14

టీ:- నృత్యముచేత చెంచలించు కుండలములు - త్విషా - త్విషేణ- అకారాంతము ఆర్షము - కాంతిచేత అలంకృతమైన గండం - చెక్కిలి -అట్టిదేయైన తన చెక్కిలిపై సందధత్యాః - ఆనిచ్చినట్టి ఆమె యొక్క-14

శ్లో॥ నృత్యతీ గాయతీ కాచిత్కూజన్నూపురమేఖలా ।
పార్శ్వస్థాచ్యుతహస్తాబ్జం శాంతాధాత్తనయోశ్శివమ్ ॥ 15

తా. ఒక గోపిక నాట్యముచేయుచు పాడుచునుండగా ఆమె ధరించిన మంజీరములు, కాంచియు సన్నని మధుర ధ్వనులు చేయుచుండగ ఆమె తన ప్రక్కన గల కృష్ణుని తామరపూవువంటి చేతిని, సుఖకరమైన చేతిని నెమ్మదిగ తన స్తనములపై నుంచుకొనెను. 15

టీ:- నృత్యతీతి. కూజంతీ నూపురే మేఖలా చ యస్యాః సా. 15

టీ:- ధ్వనిచేయుచున్న గజ్జెలు, మొలనూలు ఎవతెకుగలవో ఆమె. 15

శ్లో॥ గోప్యో లబ్ధ్వాచ్యుతం కాంతంశ్రియ ఏకాంతవల్లభమ్ ।
గృహీతకంఠ్యస్తద్దోర్భ్యాం గాయంత్యస్తం విజహ్రిరే ॥ 16

తా. శ్రీలక్ష్మికి ఏకాంతప్రియుడైన కృష్ణుని తమ కాంతునిగ పొంది గోపికలు - అతని చేతులతో అదుముకొనబడిన కంఠముగలవారై, అతనిని గూర్చియే పాడుచు శోభించిరి. 16

టీ:- ఏవమన్యా అపి గోప్యో యథా తథం నానా విభ్రమైర్విజహ్రురిత్యాహ - గోప్య ఇతి. 16

టీ:- గోపికలు ఎవరికి వారుగ వివిధములగు విలాసములతో ప్రకాశించిరని చెప్పుచున్నాడు - 'గోప్యః' అని. 16

శ్లో॥ కర్ణోత్పలాలక విటంక కపోలఘర్మ
వక్త్రశ్రియో వలయ నూపుర ఘోషవాద్యైః ।
గోప్యస్సమం భగవతా ననృతుస్స్వ
కేశస్రస్తస్రజో భ్రమర గాయక రాస గోష్ఠ్యామ్ ॥ 17

తా. చెవులకుగల కలువపూవులు, తలవెంట్రుకల చిత్రమైన అల్లికలు, చెక్కిళ్ళ పైని చెమటలు, ముఖముల సౌందర్యములు మొదలైన సింగారములతో గోపికలు, కంకణముల, చిరుమువ్వల సవ్వడుల వాద్యములతో తుమ్మెదల పాటలతో, తలకొప్పులనుండి పూలదండలు జారుచుండగా, జారిపడిపోవగ కృష్ణునితో సమానముగ నృత్యముచేసిరి. (అలకవిటంకములు - పక్షిగూళ్ళవలె చిత్రమైనఅల్లికగల శిరోజములు) రాసక్రీడకు సంబంధించిన సభలో తుమ్మెదలు గాయకులు - కంకణ నూపురఘోషలు వాద్య ధ్వనులు. 17

టీ:- తత్ర గాయకేషు వాదకేషు చ సస్త్రీకేషు గంధర్వకిన్నరాదిషు.

టీ:- అచట (రాసగోష్ఠిలో) స్త్రీలతో సహా గాయకులు వాదకులు

రసావేశేన ముహ్యాత్సు. నృత్యత్సువా. అన్యామేవ వాద్యాదిసంపత్తిం దర్శయన్. రాససంభ్రమమాహ–కర్ణోత్పలేతి. కర్ణోత్పలైశ్చ. అలక విటం కైరలకాలంకృతైః, కపోలైః ఘర్మైశ్చ. వక్రేషు శ్రీః శోభా యాసాం తాః ఘోషాః కింకిణ్యాః వలయనూపురఘోషైర్వాద్యైర్వాదిత్రైః భగవతా నన్రుతుః స్వకేశేభ్యః స్రస్తాః స్రజోయాసాం తాః. ఏతేన తాళగతేస్సంతుష్టాః కేశాః సశిరః కంపం పాదేషు పుష్పవృష్టిమివా కుర్వన్నిత్యుత్ప్రేక్షితం. భగవతా సమం నన్రుతుః. క్వ. భ్రమరా ఏవ గాయకా యస్యాం తస్యాం రాస సభాయాం. 17

గంధర్వులు, కిన్నెరులు మొదలగువారు రసావేశముతో పరవశించి పోవుచుండగ, నర్తనము చేయుచుండగ ఇతరమైన వాద్యాదుల, గాయకాదుల సంపత్తిని చూపుచు రాసక్రీడ సంరంభమును చెప్పు చున్నాడు - చెవులకు గల కలువలతో, అలంకవిటంకైః - తల వెంట్రుకల - కేశపాశముల అలంకారములతో - చెక్కిళ్ళపై చెమటలతో ముఖములందు - శ్రీః - శోభ ఎవరి యందో వారు - ఘోషాః- కింకిణులు, కంకణములు, గజ్జెలు మొదలైన వాని ధ్వనుల యొక్క వాద్యములతో తతానద్ధ సుషిర ఘనములతో - కృష్ణునితో సహా నృత్యము చేయుచున్న వాని యొక్క శిరోజములనుండి జారిపడిన పూలదండలు ఎవరియందో వారు - ఈ తాళగతితో సంతోషించి, తలవెంట్రుకలు తలలూపుటచేత పాదములయందు పూలవానను కురిపించినట్లుచేసినవి. అని ఉత్ప్రేక్షింపబడినది. (ఊహింపబడినది) కృష్ణునితో సమానముగ నర్తించిరి ఎచట? తుమ్మెదలే గాయకులుగ గల రాసగోష్ఠియందు 17

శ్లో॥ ఏవం పరిష్వంగకరాభిమర్శ
స్నిగ్ధేక్షణోద్దామవిలాసహాసైః ।
రేమే రమేశో వ్రజ సుందరీభిర్యథార్భ
కస్స్వ ప్రతిబింబ విభ్రమః ॥ 18

తా. ఈ విధముగ కౌగిలింతలు, కరస్పర్శలు, స్నేహవీక్షణములు, స్వేచ్ఛావిలాసములు, నవ్వులు మొదలగు వానితో కృష్ణుడు, అందమైన ఆ గోపాంగనలతో - శిశువు తన ప్రతిబింబమునుచూచి మోహపరవశు డైనట్లు - క్రీడించెను? 18

టీ:- యథా గోప్యో నానావిభ్రమైర్భగవతా సహ విజహ్రుః. ఏవం భగవానపి. స్వవిలాసైస్తాభిస్సహరేమ ఇత్యాహ - ఏవమితి. తద్విలాసాన భిభూతస్యైవ. రతౌ దృష్టాంతః యథార్భక ఇతి స్వప్రతిబింబైర్విభ్రమః క్రీడా యస్య స ఇత్యనేనైతద్దర్శితం స్వీయమేవ సర్వ కళా కౌశలం సౌగంధ్య లావణ్య మాధుర్యాది చ. తాసు సంచార్యతాభిస్సహ రేమే యథార్భకః స్వప్రతిబింబైరితి. 18

టీ:- గోపస్త్రీలు ఎట్లు వివిధములైన విభ్రమములతో శ్రీకృష్ణునితో శోభించిరో అట్లె భగవానుడుకూడ తన విలాసములతో వారితోకూడి క్రీడించెనని చెప్పుచున్నాడు. వారి శృంగారభావములకు లోబడనివాడే యైన ఆతని సంగమమునకు దృష్టాంతము-'యథాఅర్భకః' అని. తన ప్రతిబింబములచేత విశేషమైన చలనముగలవాడైన ఎవని క్రీడగలదో అట్టివాడు. అని ఈ దృష్టాంతముచే ఇది చూపబడినది. తనదేయైన సమస్త కళలయందలి నైపుణ్యము, పరిమళతత్త్వము, సౌందర్యము, మాధుర్యము మొదలగునవి వానియందును తిరిగెడు లక్షణములతో సహా ప్రకాశించెను. పనివాడు తన ప్రతిబింబములతో - అని (ఈ దృష్టాంతమున పరమాత్మయగు శ్రీకృష్ణుడు బింబముగను - అతనివే యైన అనేకానేకాంశములుగల గోపికలు ప్రతిబింబములుగను చూపుట, పరబ్రహ్మమునకు ప్రత్యగాత్మయొక్క ప్రతిబింబమగు జీవతత్త్వమునకు గల సంబంధము ఉద్భవించినది). 18

శ్లో॥ తదంగ సంగ ప్రముదాకులేంద్రియాః
కేశాన్ దుకూలాం కుచ పట్టికాం వా ।
నాంజః ప్రతివ్యోఢుమలం వ్రజ స్త్రియో
విస్రస్త మాల్యాభరణాః కురూద్వహ ॥ 19

తా. రాజా! వ్రజ స్త్రీలు కృష్ణుని శరీర స్పర్శతో కలిగిన సంతోషాతిరేకము చేత వశము తప్పిన ఇంద్రియములు గలవారై, తమ కేశ పాశములు, ఒంటిపైని వస్త్రములు, కుచములమీది పట్టికలును చెదిరి పోవుచున్నను, వానిని సరిచేసుకొనుటకు శక్తి చాలనివారై ఇంకను జారిపడు సిగపువ్వులు, ఆభరణములుగలవారై కల్లోలిత మనస్కులైరి. 19

టీ :- తాస్తు భగవద్విలాసైరాకులా బభూవురిత్యాహ - తదంగేతి. తస్యాంగ సంగేన ప్రకృష్టాముత్ప్రీతిః. తయా ఆకులాన్య వశానీంద్రియాణి యాసాం తాః. విశ్లథబంధాన్ కేశాదీనంజసా ప్రవ్యోఢుం యథా పూర్వం ధర్తుం నాలం న సమర్థా బభూవుః. విస్రస్తాని మాల్యాని ఆభరణాని చ యాసాం తాః. (19)

టీ:- కృష్ణుని శరీరస్పర్శచేత అతిశయించిన, ముత్ - ప్రీతిగలిగి- దానిచేత అవశమైన ఇంద్రియములు ఎవరికోవారు - సడలిపోయిన కట్టు ముడులను, తలవెంట్రుకలు మొదలగు వానిని వెంటనే - పూర్వము వలె ధరించుటకు సమర్థులు కాకపోయిరి - జారిపడు పూలు, ఆభరణములు ఎవరికోవారు విస్రస్తమాల్యాభరణలు. 19

శ్లో॥ కృష్ణ విక్రీడితం వీక్ష్య వ్యముహ్యన్ ఖేచరస్త్రియః ।
కామార్దితాశ్శశాంకశ్చ సగణో విస్మితోఽభవత్ ॥ 20

తా. కృష్ణుని ఈ రాసక్రీడ చూచి దేవతాస్త్రీలును కామకాంక్షతో మోహితులైరి. చంద్రుడు కూడ తార గ్రహాదులతో కూడ ఆశ్చర్యచకితుడయ్యెను. 20

టీ:- న కేవలం తా ఏవాకులేంద్రియాః కింతు దేవ్యోఽపీత్యాహ- కృష్ణేతి. కించ. శశాంకశ్చేత్యనేనైతత్సూచితం. శశాంకేన విస్మితేన. గతౌ విస్మృతాయాం. తత్ ప్రాక్తనాః సర్వేఽపి గ్రహాః. తత్ర తత్రైవ తస్థుః తతశ్చాతిదీర్ఘాసు రాత్రిషు. యథాసుఖం విజహ్రుంతి. 20

టీ:- వ్రజస్త్రీలు మాత్రమే వ్యాకులమైన ఇంద్రియములు కలవారు కాలేదు. దేవతాస్త్రీలుకూడ అనిచెప్పుచున్నాడు. మరియు చంద్రుడును కూడ-అను ఈ మాటతో ఇది సూచింపబడినది. ఆశ్చర్యపడిన చంద్రునితో తమ చలనమును మరచి - ఆ ప్రాచీనములైన సమస్త గ్రహములు -ఎక్కడివి అక్కడనే ఆగిపోయి విస్మయమునొందెను. అందు వలన నేర్పడిన దీర్ఘరాత్రులందు వారు యథా సుఖముగ విహరించిరి. 20

శ్లో॥ కృత్వాతావంతమాత్మానాం యావతీర్గోపయోషితః ।
రరామ భగవాంస్తాభిరాత్మారామోఽపి లీలయా ॥ 21

తా. ఆత్మయందే రమించువాడగుట చేతనేమో కృష్ణుడు లీలగ, ఎంత మంది గోపస్త్రీలు కలరో వారందఱిని ఆత్మగ (తననుగ) చేసి వారితో రమించెను. 21

టీ:- కృత్వేతి. అయం భావః. శ్లో. కాత్యాయని మహామాయే మహాయోగిన్యధీశ్వరి, నందగోపసుతం దేవిపతిం మే కురుతే నమితి. ప్రత్యేకం తాభిః ప్రార్థనాత్. భగవతాపి. శ్లో. యాతా బలావ్రజం సిద్ధామ యేమా రంస్యథక్షపా ఇతి. తథైవ ప్రతిశ్రుతత్వాత్తావంతమాత్మానం కృత్వా రేమ ఇతి యావతీర్యావత్యః. 21

టీ:- దీని భావము "ఓ కాత్యాయనీ! మాహామాయా! మహాయోగినీ! అధీశ్వరీ! నందగోపుని కుమారుని - ఓ దేవీ! నాకు భర్తగా చేయుము. నీకు నమస్కారము" అని ఒక్కొక్కరు అమ్మవారిని ప్రార్థించి యుండుట చేతను, కృష్ణునిచేతకూడ "ఓ అబలలారా! మీరు వ్రజమునకు పొందు. మీ వ్రతము సిద్ధించినది. ఈ రాబోవు రాత్రులు మీరు నాతో క్రీడింపుడు" అని చెప్పినట్లు అంగీకరించుటచేతను, అందటిని ఆత్మనుగా చేసి క్రీడించెను - యావతీః - ఎందఱుగలరో (అందటిని) 21

శ్లో॥ తాసాం రతివిహారేణ శ్రాంతానాం వదనాని సః ।
ప్రామృజత్కరుణః ప్రేమ్ణా శంతమేనాంగ పాణినా ॥ 22

తా. క్రీడవిహారములచేత అలసిపోయిన ఆ గోపాంగనల ముఖములను రాజా! కరుణాళువగు కృష్ణుడు ప్రేమతోడ తన చేతితో తుడిచెను (అంగ!-సంబోధన) సుఖతమమైన తన చేతితో తుడిచెను. 22

టీ:- కృపాతిశయమాహ - తాసామితి. 22

టీ:- కృష్ణుని కృపాతిశయమును చెప్పుచున్నాడు. 'తాసాం' అని. 22

శ్లో॥ గోప్యస్స్ఫురత్కనకకుండల కుంతల
త్విడ్గండ శ్రియాసుధీతహాసనిరీక్షణేన ।
మానం దధత్యృషభస్య జగుః
కృతాని పుణ్యాని తత్కరరుహ స్పర్శ ప్రమోదాః ॥ 23

తా. అదురుచున్న కుండలములయొక్కయు శిరోజముల యొక్కయు కాంతితోడి, చెక్కిళ్ళయొక్క శోభచేత అమృతముగా చేయబడిన నవ్వుతో కూడిన చూపుతో శ్రీకృష్ణుని వ్రేళ్ళ స్పర్శతో మిక్కిలి ఆనందమునందిన గోపస్త్రీలు తమ భర్తయైన అతనికి ఆనందము కూర్చుచు, అతని పుణ్యగాథలను గానము చేసిరి. 23

టీ:- తతోఽతిహృష్టానాం గోపీనాం చరితమాహ - గోప్య ఇతి. స్ఫురతాం స్వర్ణకుండలానాం కుంతలానాం చ త్విషా గండేషు యా శ్రీస్తయా. సుధితేన అమృతాయితేన హాసఁసహితేన నిరీక్షణేన చ ఋషభస్య పత్యుః కృష్ణస్య. మానం దధత్యః పూజాం కుర్వంత్యః తత్కర్మాణి జగుః, తస్య కరరుహైః నఖైః స్పర్శేన ప్రమోదో. యాసాం తాః. 23

శ్లో॥ తాభిర్యుతశ్శ్రమమపోహితుమంగసంగ
ఘృష్ట స్రజస్స్వ కుచ కుంకుమ రంజితాయాః ।
గంధర్వపాళి భిరనుద్రుత ఆవిశద్వా
శ్శ్రాంతో గజీభిరిభరాడివ భిన్నసేతుః ॥ 24

టీ:- అథ జలకేళిమాహ - తాభిరితి. తాసామంగ సంగేన మృష్టా సంమర్ధితా. యాసక్. తస్యాః అతఏవ తాసాం. కుచ కుంకుమేన రంజితాయాః. సంబంధిభిర్గంధర్వపాళిభిః గంధర్వాః గందర్వపతయ ఇవ గాయంతః యే అళయః. తైరనుద్రుతః అనుగతః స కృష్ణః. వాః ఉదకం అవిశత్ భిన్నసేతుః విదారితవప్రః స్వయం క్రాంతి లోక వేద మర్యాదః. 24

టీ:- కదులుచున్న బంగారు కుండలములయొక్క, చికురముల యొక్కయు కాంతిచేత చెక్కిళ్ళయందు ఏ సౌందర్యము కలదో దానిచేత - సుధితేన -అ మృతాయితేన - అమృతముగ చేయబడిన నవ్వుతో గూడిన చూపుచేత - ఋషభస్య - పతియగు కృష్ణునియొక్క - మానందధత్యః - పూజచేయుచున్నవారై - అతని లీలలను పాడిరి. అతని గోళ్ళచేత కలిగిన స్పర్శతో మిక్కిలి ఆనందము ఎవరియందో వారు. (గోపికలు) 23

తా. గోపస్త్రీలతో కలసినవాడై, క్రీడాశ్రమను పోగొట్టుకొనుటకు, వారి శరీరములతో రాపిడి పొందుటచే, వారి కుచములకు పూయబడి యున్న కుంకుమము చేత ఎఱుపు వారియున్న కృష్ణుని మెడలోని పూలదండ ననుసరించి వచ్చుచున్న గంధర్వగాయకులగు తుమ్మెదలతో పాటుగ, ఆడేనుగులతో కలసి కట్టలను ఛేదించుకొని ప్రవేశించు గజరాజువలె కృష్ణుడు వారితో గలసి నీటిలో ప్రవేశించెను. 24

టీ:- ఇక జలకేళినిగూర్చి చెప్పుచున్నాడు. వారియొక్క శరీరముల కలివిడిచేత రాపిడినొంది యుండిన ఏ పూలదండగలదో - దానియొక్క - అందువలననే వారి కుచములకు గల కుంకుమచేత ఎఱ్ఱనైన దాని యొక్క సంబంధమైన గంధర్వ రాజుల వంటి ఏ తుమ్మెదలు గలవో - వానిచేత వెంబడింపబడి ఆ కృష్ణుడు - వాః - జలమును ప్రవేశించెను. భిన్నసేతుః - పడగొట్టబడిన కట్టలుగలదియైన. (గజరాజువలె) స్వయముగనే లోకధర్మము, వేదమర్యాదను అతిక్రమించిన వాడై. 24

శ్లో॥ సోఽంభస్యలం యువతిభిః పరిషిచ్యమానః
ప్రేమ్ణేక్షితః ప్రహసితా పరితస్తతోఽంగః ।
వైమానికైః కుసుమవర్షిభిరీడ్యమానో
రేమే స్వయం స్వరతిరత్ర గజేంద్రలీలః ॥ 25

టీ:- సఇతి. సర్వతిః ఆత్మారామోఽపి. అత్ర గోపీమండలే. అంభసివా. 25

తా. కృష్ణుడు ఆ నీటియందు గోపస్త్రీలచే శరీరము చుట్టును నీటిచే చల్లబడుచు వారివైపు ప్రేమతో నీటిని చల్లుచు వారందఱును నవ్వుచు కేరింతలతో అతని చుట్టును సంరంభించుచుండగ వలసినంత సమయము గడిచెను. ఆకాశమునందు దేవతలు పుష్పవర్షమును కురిపించుచు ఆ దేవదేవుని స్తుతించుచుండిరి. తాను తనతోనే క్రీడించువాడైనను, గజేంద్రుని జలక్రీడవలె కృష్ణుడు గోపికలతో జలక్రీడలాడెను. 25

టీ:- ఇక - స్వరతిః - ఆత్మారాముడైనను ఇచట గోపీకామండలము నందు - లేక - నీటియందు (క్రీడించెను). 25

శ్లో॥ తతశ్చ కృష్ణోపవనే జలస్థల
ప్రసూన గంధా నిలజుష్టదిక్తటే ।
చచార భృంగప్రమదాగణావృతో
యథా మదాంధో ద్విరదః కరేణుభిః ॥ 26

తా. అటనుండి కృష్ణుడు, నీటియందలి పుష్పములగు కలువలు మున్నగువాని యొక్కయు, నేలయందలి పుష్పములగు మల్లెలు మొదలగు వానియొక్కయు పరిమళములతోకూడిన వాయువు ననుభవించు దిక్తటము నందున్న పూదోటయందు, తుమ్మెదల గుంపుల తోను, గోపకాంతల సమూహములతోను విహరించెను. మదపుటేనుగు ఆడ యేనుగులతో వలె. 26

టీ:- స్థలజల క్రీడేదర్శితే. వనక్రీడాం దర్శయతి. తతశ్చేతి. యమునాయా ఉపవనే జలస్థ ప్రసూనానాం గంధో యస్మిన్. తే నానిలేన

టీ:- స్థల, జలక్రీడలు చూపినమీదట వనక్రీడను చూపుచున్నాడు- యమునానది సమీపమునగ తోటలో జలములయందుండెడి పువ్వుల

జుష్టాని దిశాం తటాని అంతాః యస్మిన్.యద్వా దిశశ్చ తటం స్థలం చ యస్మిన్. తస్మిన్ వనే. భృంగాణాం ప్రదానాం చ గణైరావృతః చచార. 26

యొక్క పరిమళము దేనియందు గలదో అట్టి గాలిచేత కలిసియున్న దిక్కుయొక్క అంతములు దేనియందో – లేక దిక్కుల – తటం – స్థలము దేనియందో అట్టి వనమునందు – తుమ్మెదల యొక్క స్త్రీల యొక్కయు సమూహములచేత ఆవరింపబడినవాడై చరించెను. 26

శ్లో॥ ఏవం శశాంకాంశు విరాజితానిశా
స్సత్య కామోను రతా బలాగణః ।
సిషేవ ఆత్మన్యవరుద్ధసౌరత
స్సర్వాశ్శరత్కావ్య కథా రసాశ్రయాః ॥ 27

తా. సత్యసంకల్పుడగు శ్రీకృష్ణుడు సంయోగానుభవప్రక్రియను తనలోనే నిరోధించినవాడై, కావ్యములందలి కథలలో చెప్పబడినట్లున్న శరత్కాలము నందలి ఆ యా రసములుగల, చంద్రకిరణములతో ప్రకాశించు వెన్నెల రాత్రులను తనయందనురాగముతోనున్న స్త్రీల సమూహములతో కూడినవాడై (ఆ సత్యసంకల్పుడగు కృష్ణుడు) సేవించెను. 27

**రాజోవాచ**

శ్లో॥ సంస్థాపనాయ ధర్మస్య ప్రశమాయేతరస్య చ ।
అవతీర్ణో హి భగవానంశేన జగదీశ్వరః ॥ 28

**పరీక్షిత్తు ఇట్లనెను.**

తా. ధర్మమును స్థాపించుట కొఱకు అధర్మమును అణచుటకును జగదీశ్వరుడగు భగవానుడు ఒక అంశతో అవతరించినాడు. 28

టీ:- రాసక్రీడానిగమనం. ఏవమితి. సః కృష్ణః. సత్యసంకల్పః. అనురాగి స్త్రీకదంబస్థః ఏవం సర్వా నిశాః. సేవితవాన్. శరత్కావ్య కథా రసాశ్రయాః. శరది భవాః. కావ్యేషు కథ్యమానాః యే రసాః

టీ:- రాసక్రీడ ఉపసంహారము. ఆ శ్రీకృష్ణుడు సత్యసంకల్పుడు. తనపై అనురాగముగల స్త్రీల సమూహముననున్నవాడు. ఈ విధముగ రాత్రులన్నింటిని సేవించెను. శరత్కాలమున సంభవించునవియైన–

తేషామాశ్రయభూతా నిశాః. యద్వా. నిశా ఇతి ద్వితీయా. అత్యంత సంయోగే. శృంగార రసాశ్రయాః. శరది ప్రసిద్ధాః. కావ్యేషు యాః కథాస్తాః సిషేవ ఇతి. ఏవమప్యాత్మ న్యేవావరుద్ధః సౌరతః. సుర తరసః రసోధాతుః.న తు స్ఖలితో యస్యేతి కామ జయోక్తిః. (27-28)

కావ్యములందలి చెప్పబడు ఏ రసములు గలవో, వాని నాశ్రయించి యున్న రాత్రులు - లేక 'నిశాః' అని ద్వితీయావిధః మిక్కిలి సన్నిహితత్వ మున శృంగార రసాశ్రయములు, శరత్కాలమున ప్రసిద్ధములు కావ్యములయందు ఏ కథలుగలవో వానిని -సిషేవ-సేవించెను. అని ఇట్లు తనయందే నిరోధింపబడిన - సౌరతః- సురతరసముగలవాడై - రసః - ధాతువు (శుక్లము) ఎవనికి స్ఖలితము కాకుండెనో అని కామమును జయించినవాని విషయము. (27 -28)

శ్లో॥ స కథం ధర్మసేతూనాం వక్తకర్మాభిరక్షితా ।
ప్రతీపమాచరద్బ్రహ్మన్ పరదారాభిమర్శనమ్ ॥ 29

తా. అట్టి శ్రీకృష్ణుడు ధర్మమునుచెప్పువాడు, ధర్మమునాచరించువాడు, ధర్మమును రక్షించువాడు, అట్టివాడు ధర్మముయొక్క కట్టుబాట్లకు ప్రతికూలముగ ఎట్లు ప్రవర్తించెను. ఓ బ్రాహ్మణోత్తమా! ఇతరుల భార్యల తాకుట ధర్మవిరుద్ధముకదా! 29

టీ:- స ఇతి. ప్రతీపం ప్రతికూలం అధర్మమిత్యర్థః. ఆచరత్కృతవాన్. న చేదమధర్మమాత్రం కలంభజక్షణాదివత్. కింతు మహాసాహస మిత్యాహ. పరదారాభిమర్శనమితి. 29

టీ:- ప్రతీపం- ప్రతికూలము - అధర్మమని యర్థము - ఆచరత్- చేసెను లేని (కాని) యెడల ఇది కేవలము అపరిపక్వధర్మము మాత్రమే యగును. 'కలంజభక్షణము' మొదలగువానివలె. కాని ఇట్టి పరభార్యాభి మర్శనము మహా సాహసమని చెప్పినాడు. ('కలంజము' అనగా విషదిగ్ధబాణహతమైన మృగము యొక్క మాంసము, "సకలంజం భక్షయేత్" అనునది ధర్మనియమము. కాని - బాణ హతత్వముచేత

ఇందు అధర్మేతర వికారము (ఒకవిధమగు ధర్మము) కూడ ఈ మాంసభక్షణమున కలదని కొందరుదురు. కలంజము తినకూడదను శాస్త్రమే ఆదరణీయమని శ్రీధరుని ఆంతర్యము) (చూ.వంశీధరవ్యాఖ్య). 29

శ్లో॥ ఆప్తకామో యదుపతిః కృతవాన్ వై జుగుప్సితమ్ ।
కిమభిప్రాయ ఏతన్మే సంశయం ఛింధి సువ్రత ॥ 30

తా. యదుపతియగు శ్రీకృష్ణుడు కోరికలన్నియు తీరినవాడు, (కోరికలేనివాడు) అయినను ఆక్షేపింపదగిన పనిచేసియున్నాడు. ఇందలి అభిప్రాయమేమి? ఓ సువ్రతా!ఈ నా సంశయమును ఛేదింపుము. 30

టీ:- ఆప్తకామస్య. నాయమధర్మ ఇతి చేత్. యద్యేవం. కామా భావాన్నిందితం కేనాభిప్రాయేణ కృతవానితిపృచ్ఛతి - ఆప్తకామితి. 30

టీ:- ఆప్తకామునకు ఇది అధర్మము కాదనినచో- అట్లైనను కామము లేనందువలనను నిందితమే - ఏ అభిప్రాయముతో చేసెను? అని అడుగుచున్నాడు. 'ఆప్తకామ' అని. 30

## శ్రీ శుక ఉవాచ

శ్లో॥ ధర్మవ్యతిక్రమో దృష్ట ఈశ్వరాణాం చ సాహసమ్ ।
తేజీయసాం న దోషాయ వహ్నేస్సర్వోభుజో యథా ॥ 31

## శ్రీశుకుడు ఇట్లనెను

తా. ప్రభువులతో ధర్మవిరుద్ధమైన కార్యములు, అనాలోచితమైన చర్యలు - అచ్చటచ్చట కనబడుచున్నవి. తేజస్వులైన మహాత్ములకు సర్వభక్షకుడైన అగ్నికివలె - దోషము కలుగదు. 31

టీ:- పరమేశ్వరే కైముత్య న్యాయేన పరిహర్తుం. సామాన్యతో మహతాం వృత్తమాహ - ధర్మవ్యతిక్రమ ఇతి. సాహసం చ. దృష్టం ప్రజాపతీంద్ర సోమ విశ్వామిత్రాదీనాం. తచ్చ తేషాం తేజస్వినాం దోషాయ న భవతీతి. 31

టీ:- పరమేశ్వరునియందు కైముతిక న్యాయముచే పరిహరించుటకు సామాన్యముగ మహాత్ములచరిత్రమును చెప్పుచున్నాడు. 'ధర్మవ్యతిక్రమః ' అని సాహసముకూడ చూడబడినది. ప్రజాపతి, ఇంద్రుడు, సోముడు, విశ్వామిత్రుడు మొదలగు వారిలో - అదియును తేజస్వులగు వారిలో దోషమునకు కాదు అని. 31

శ్లో॥ నైతత్సమాచరేజ్జాతు మనసాపి హ్యనీశ్వరః ।
వినశ్యత్యాచరన్ మౌఢ్యాద్యథా రుద్రోఽబ్ధిజం విషమ్ ॥ 32

తా. దేహాదులకు పరతంత్రుడైనవాడు ఇట్టి పనులు మనస్సుతో కూడ ఎప్పుడును చేయకూడదు. అవివేకియై ఇట్టి పనులు ఆచరించినచో అతడు నశించిపోవును. సముద్ర మధనమున వెలువడిన విషమును త్రాగినను రుద్రునకు ఏ అపకారము సంభవింపలేదు - అదే సామాన్యుడు త్రాగినచో వాడు నశించును - ఆ విధముగ ఈశ్వరులు చేసిన పనిని సామాన్యులెప్పుడును చేయరాదు. 32

టీ:- తర్హి, శ్లో. యద్యదాచరతి శ్రేష్ఠస్తత్తదేవే తరోజన ఇతి. న్యాయే నాన్యోఽప్యేవం కుర్యాదిత్యాశంక్యాహ - నైతదితి. అనీశ్వరః దేహాది పరతంత్రః యథా రుద్రవ్యతిరిక్తో విషమాచరన్ భక్షయన్. 32

టీ:- అయినచో 'శ్రేష్ఠుడాచరించిన పనిని ఆదర్శముగ తీసికొని సామాన్యుడుకూడ చేయునుగదా! అనున్యాయమున, ఇతరుడు కూడ ఇట్లుచేయునేమో అని ఆశంకించిచెప్పుచున్నాడు, న+ఏతత్' అని. అనీశ్వరః - దేహము మొదలగువానితో పరతంత్రుడు. ఎట్లు రుద్రుడు కానివాడు విషమును భక్షించెనో (అట్లు తాను భక్షించినచో నశించును కదా యని) 32

శ్లో॥ ఈశ్వరాణాం వచస్సత్యం తథైవాచరితం క్వచిత్ ।
తేషాం యత్స్వవచో యుక్తం బుద్ధిమాంస్తత్తదాచరేత్ ॥ 33

తా. ఈశ్వరుల వాక్కుసత్యమైనది. దానిననుసరించి ఆచరణచేయవలెను. ఇక వారి ఆచరణమును ఎప్పుడో ఒకప్పుడు అనుకరించుట జరుగుచున్నది. అందువలన బుద్ధిమంతుడైనవాడు, ఈశ్వరుల ఉపదేశముననుసరించియే వారి ఆచరణ యున్నయెడల అట్టి ఆచరణమును తప్పక ఆదర్శముగ స్వీకరింపవలెను. 33

టీ:- కథం తదా సదాచారస్య ప్రామాణ్యమత ఆహ - ఈశ్వరాణామితి. తేషాం వచః సత్యం. అతస్తదుక్తమాచరేదేవ. ఆచరితం తు క్వచిత్సత్యం. అతః స్వవచోయుక్తం. తేషాం వచసాయద్యద్యుక్తం. అవిరుద్ధం. తత్తదేవాచరేత్. 33

టీ:- మఱి సదాచారముయొక్క ప్రామాణ్యమెట్లు? అది చెప్పుచున్నాడు ఈశ్వరుల వాక్యము సత్యము. అందువలన వారు ఉపదేశించినది ఆచరింపవలెను. వారు ఆచరించినది మాత్రము ఎప్పుడో ఒకప్పుడు ఆచరింపదగినది, కావున వారి ఉపదేశములతో వారి కృత్యములు కూడ పొసగియున్నచో-వారు చెప్పినది, చేసినది, అవిరుద్ధముగనున్నచో అట్టివి బుద్ధిమంతుడు ఆచరింపవలయును. 33

శ్లో॥ కుశలాచరితే నైషామిహ చార్థో న విద్యతే ।
విపర్యయేణ చానర్థో నిరహంకారిణా ప్రభో ॥ 34

తా. రాజా! అహంకార రహితుడైన వానిచేత నిపుణముగ ఇట్లు ఆచరింపబడినచో నీకంతకంటెను ఇతరమైన ప్రయోజనమేమియు ఉండదు. అట్లుకాక దీనికి విరుద్ధముగ - అనగ అహంకారముతోను మహాత్ములు చేసిన కృత్యములు తానును చేయవలయునని భావించి అట్టివి చేసినచో అనర్థము వాటిల్లును. 34

టీ:- నను తర్హితేఽపి కిమేవం సాహసమాచరంతి? తత్రాహ- కుశలేతి. ప్రారబ్ధకర్మ క్షపణ మాత్రమేవ తేషాం కృత్యం నాన్యదిత్యర్థః 34

టీ:- మఱి-అట్లైనచో వారును ఈ విధముగ సాహసములు చేయుట యేమి? చెప్పుచున్నాడు-ప్రారబ్ధకర్మ నశించిపోవుటయే వారి కృత్యము - ఇతర మేమియు కాదని యర్థము. 34

శ్లో॥ కిముతాఖిలసత్వానాం తిర్యఙ్మర్త్య దివౌకసామ్ ।
ఈశితుశ్చేశితవ్యానాం కుశలాకుశలాన్వయః ॥ 35

తా. మహాత్ముల విషయమే ఇట్లుండగ నిక సమస్త ప్రాణుల, పశువుల మనుష్యుల, పాలకుల, పాలితుల, దేవతల మాట ఏమి చెప్పవలెను? శుభ, అశుభ జన్మలగుఱించి చెప్పునదేమి? 35

టీ:- ప్రస్తుతమాహ - కిముతేతి. కుశలాకుశలాన్వయో న విద్యత ఇతి కింపునర్వక్తవ్యమిత్యర్థః. 35

టీ:- ప్రస్తుతమును చెప్పుచున్నాడు. శుభజన్మ, అశుభజన్మ ఉండదు. అనినచో ఇక చెప్పదగినదేమి? అనియర్థము. 35

శ్లో॥ యత్పాదపంకజ పరాగనిషేవతృప్తా
యోగప్రభావ విధుతాఖిలకర్మబంధాః ।
స్వైరం చరంతి మునయోఽపి ననహ్యమానా
స్తస్యేచ్ఛయాత్తవపుషః కుత ఏవ బంధః ॥ 36

తా. ఎవ్వాని పాదపద్మముల పుప్పొడి రేణువులను సేవించి,సంతుష్టులయ్యెదరో, యోగమహాత్మ్యముచేత సమస్తమైన కర్మబంధముల నుండి విడువబడెదరో, జ్ఞానులుకూడ బంధములను పొందక స్వేచ్ఛగా సంచరించుచుందురో అట్టి పరమేశ్వరుని ఇచ్ఛచేత పొందిన శరీరము గలవానికి బంధమెక్కడిది?- (భక్తులకు, యోగులకు, జ్ఞానులకును కర్మబంధములుండవు) 36

టీ:- ఏతదేవ స్ఫుటీకరోతి - యదితి. యస్య పాదపంకజ రాగస్య నిషేవణేన తృప్తాః. యద్వా. యస్య పాదపంకజపరాగే. సేవా యేషాం

టీ:- దీనినే స్పష్టము చేయుచున్నాడు. ఎవరి చరణపద్మముల పరాగమును సేవించుటచేత తృప్తిపొందెదరో - లేక - ఎవని పాద

తే తథా. తే చ తృప్తాశ్చేతి. భక్తా ఇత్యర్థః. తథా జ్ఞానినశ్చ ననహ్యమానాః బంధమప్రాప్నువంతః. 36

పద్మముల ధూళియందలి సేవ ఎవరికి కలుగునో (వారు) అటుల తృప్తినందుదురు. అని భక్తులు అని యర్థము. అట్లే జ్ఞానులుకూడ – ననహ్యమానః – బంధమును పొందని వారగుచు. 36

శ్లో॥ గోపీనాం తత్పతీనాం చ సర్వేషాం చాపి దేహినామ్ ।
యోఽంతశ్చరతి సోఽధ్యక్ష ఏష క్రీడన దేహభాక్ ॥ 37

తా. గోపికల యొక్కయు, వారి భర్తలయొక్కయు, సమస్తములైన భూతములయొక్కయు అంతర్భాగములలో చరించుచుండువాడు, బుద్ధి మొదలైనవానికి సాక్షీభూతుడైన పరమాత్మయే – అతడే అంతర్యామిగ క్రీడించుట కొఱకు దేహమును పొందినవాడయ్యెను. 37

టీ:– గోపీనాం పరదారత్వమంగీకృత్య పరిహృతం ఇదానీం భగవతః సర్వాంతర్యామిణః పరదారసేవా నామ న కించిదిత్యాహ – గోపీనామితి. యోఽంతశ్చరతి. అధ్యక్షో బుద్ధ్యాదిసాక్షీ. ఏష క్రీడనాయ. దేహభాక్. న తు అస్మదాదితుల్యః. యేన దోషః స్యాదితి. 37

టీ:– గోపికలయొక్క పరభార్యాత్వమునంగీకరించి, ఇప్పుడు భగవానుని, సర్వాంతర్యామియగు పరమాత్ముని, పరస్త్రీభజనము అనునది పరిహరింపబడినది. అట్టిది కొంచెమైనను లేదనే చెప్పుచున్నారు. ఎవడు అంతస్సులందు చరించునో అతడు దోషముతో కూడిన మనవంటివాడు కాడు – అని. 37

శ్లో॥ అనుగ్రహాయ భూతానాం మానుషం దేహమాశ్రితః ।
భజతేతాదృశీః క్రీడాయాశ్రుత్వాతత్పరో భవేత్ ॥ 38

తా. భగవానుడు ప్రాణులను అనుగ్రహించుటకొఱకు మనుష్య రూపమునుధరించి ఈ విధములైనలీలలను చేయుచుండును. అట్టివానిని (లీలలను) విని మనుష్యుడు భగవానునాశ్రయించువాడగును 38

టీ:- నన్వేనం చేదాప్తకామస్య నిందితే కుతః ప్రవృత్తిరిత్యత ఆహ-అనుగ్రహాయేతి. శృంగారరసాకృష్ణచేతసః బహిర్ముఖానపి. స్వపరాన్ కర్తుమితి భావః. 38

టీ:- ఇట్లైనయెడల ఆప్తకాముడైయున్నవారికి నిందనీయమైన ఈ 'ప్రవృత్తి'ఎందులకు? అను దీనినిగూర్చి యిట చెప్పుచున్నాడు. శృంగార రసముచే ఆకర్షింపబడిన మనస్సుగల బహిర్ముఖులనుకూడ తనను ఆశ్రయించు వారినిగా చేయుటకు అని భావము. (ఆత్మముఖులనగా చేయుటకు అని భావము) 38

శ్లో॥ నాసూయన్ ఖలు కృష్ణాయ
మోహితాస్తస్యమాయయా ।
మన్యమానాస్స్వపార్శ్వస్థాన్
స్వాన్ స్వాన్ దారాన్ వ్రజౌకసః ॥ 39

తా. కృష్ణుని మాయచేత మోహితులైన వ్రజమునందలి గోపాలురు అతనిపై ఎంతమాత్రమును ఈర్ష్యచెందక తమతమ భార్యలు తమ ప్రక్కనే యున్నట్లు భావించిరి. (భావించుచుండిరి). 39

టీ:- నన్వన్యేఽపి భిన్నాచారాః స్వచేష్టితమేవ మేవేతి వదంతి. తత్రాహ-నాసూయన్నితి. ఏవం భూతైశ్వర్యాభావే. తథా కుర్వంతః పాపా జ్ఞేయా ఇతి భావః. 39

టీ:- ఇతరులుకూడ వేర్వేఱు ఆచారములుగలవారై యుందురు. వారు తమ చేష్టితములు ఈయీ విధములుగనుండునని చెప్పుచుందురు - ఇట చెప్పుచున్నాడు - ఇట్టి ఐశ్వర్యము (మహిమ) లేని సందర్భమున ఆ విధముగ చేసినచో వారు పాపాత్ములని తెలియవలెనని భావము. (కృష్ణునికిగల ఈశ్వరత్వమువంటి ఈశ్వరత్వము లేకున్నను కృష్ణునివలె ప్రవర్తించుట పాపమగును). 39

శ్లో॥ బ్రహ్మరాత్ర ఉపావృత్తే వాసుదేవానుమోదితాః ।
అనిచ్ఛంత్యో యయుర్గోప్యస్స్వగృహాన్ భగవత్ప్రియాః ॥ 40

తా. బ్రహ్మ ముహూర్తము ప్రాప్తింపగ కృష్ణుని యనుజ్ఞపొంది ఆ భగవానునకు ప్రేమాస్పదులైన గోపస్త్రీలు, అయిష్టముగనే తమతమ ఇండ్లకు వెడలిపోయిరి. 40

టీ:- బ్రహ్మరాత్ర ఇతి. బ్రహ్మరాత్రే బ్రాహ్మే ముహూర్తే. ఉపావృత్తే ప్రాప్తే. 40

శ్లో॥ విక్రీడితం వ్రజవధూభిరిదం చ విష్ణోః
శ్రద్ధాన్వితోను శృణు యాదనువర్ణయేద్యః ।
భక్తిం హరౌ భగవతి ప్రతిలభ్య కామం
హృద్రోగమాశ్వపహినోత్యచిరేణ ధీరః ॥ 41

టీ:- భగవతః కామవిజయరూప రాసక్రీడా శ్రవణాదేః కామవిజయ మేవ ఫలమాహ - విక్రీడితమితి. అచిరేణ ధీరస్సన్ హృద్రోగం కామం ఆశు అవహినోతి పరిత్యజతీతి. 41

**శ్రీ మద్భాగవతే, మహాపురాణే దశమస్కంధే,**
**త్రయస్త్రింశోఽధ్యాయః**

టీ:- బ్రాహ్మీముహూర్తము రాగానే - (రాత్రియొక్క చివరి యామము నందలి ముహూర్తకాలము) 40

తా. వ్రజస్త్రీలతో కృష్ణుని రాసక్రీడను శ్రద్ధతో వినువాడును, వర్ణించు వాడును విష్ణుభగవానుని యందు భక్తిని పొంది, హృదయజాడ్యమైన కామమును శీఘ్రముగ విడిచిపెట్టిన ధీరుడగును. 41

టీ:- భగవానుని కామవిజయరూపమగు రాసక్రీడను వినుట, చెప్పుట మున్నగువానిచేత కామవిజయమే ఫలముగ చెప్పుచున్నాడు, 'విక్రీడతం' అని, అచిరకాలముననే ధీరుడగుచు హృద్రోగం - కామమును వెంటనే అవహినోతి - పరిత్యజించును- అని. 41

**అని శ్రీమద్భాగవతమున దశమస్కంధమందు**
**ముప్పది మూడవ అధ్యాయము సమాప్తము.**

## చతుస్త్రింశోఽధ్యాయః

**శ్రీ శుక ఉవాచ**

శ్లో॥ ఏకదా దేవయాత్రాయాం గోపాలా జాతకౌతుకాః ।
అనోభిరనడుద్యుక్తైః ప్రయయుస్తేఽంబికావనమ్ ॥ 1

శ్లో॥ తత్ర స్నాత్వా సరస్వత్యాం దేవం పశుపతిం ప్రభుమ్ ।
ఆనర్చురర్హణైర్భక్త్యా దేవీం చ నృపతేఽంబికామ్ ॥ 2

టీ:- శ్లో."చతుస్త్రింశేఽహినా గ్రస్తం నందం హరిర మూముచత్, విద్యాధ్రం చాంగిరశ్శాపాచ్ఛంఖచూడం తథావధీత్. రాసాపదేశతః కామం కిం కరీకృత్య కామతః; అనుగృహ్ణన్ వశం నిన్యే తథా విద్యాధరాధిపం. తదేవం కామానుగ్రహముఖేన కామజయం ప్రతిపాద్య. తథైవ విద్యాధరజయం ప్రతిపాదయితుం తత్రప్రసంగం దర్శయతి- ఏకదేతి. (1-2)

## 34వ అధ్యాయము

తా. ఒక సమయమునందు దేవతాయాత్ర చేయవలెయునని కుతూహలము కలిగిన గోపాలురు బండ్లు, ఎడ్లు సిద్ధముచేసుకొని అంబికావనమునకు పయనించుటకు బయలుదేరిరి. 1

తా. రాజా! అచట సరస్వతీనదియందు స్నానముచేసి ప్రభువైన శంకరుని, అమ్మవారిని, అనేక ఉపచారములు సమర్పించుచు భక్తితో పూజించిరి. 2

టీ:- ఈ ముప్పదినాలుగవ అధ్యాయమున-సర్పముచేత పట్టుకొన బడిన నందుని శ్రీకృష్ణుడు విడిపించుటయు, ఆంగీరసుల శాపమును పొందిన విద్యాధరుని, గోపకాంతలను కొనిపోయిన శంఖచూడుని సంహరించుట వర్ణింపబడినది. రాసక్రీడ వ్యాజముతో ఉద్దేశ పూర్వకముగ కాముని (మన్మథుని) కింకరునిగ చేసుకొని, విద్యాధర పతిని అనుగ్రహించుచు అతనిని తన వశమునకు దెచ్చుకొనెను. కృష్ణుడీ విధముగ కాముని అనుగ్రహించుట ద్వారా కాముని జయించుటను ప్రతిపాదించి అట్లే విద్యాధరజయమున ప్రతిపాదించుయటకు ఆ ప్రసంగమును చూపుచున్నాడు. 'ఏకదా' అని. (1-2)

శ్లో॥ గావో హిరణ్యం వాసాంసి మధు మధ్వన్నమాదృతాః ।
బ్రాహ్మణేభ్యో దదుస్సర్వే దేవో నః ప్రియతామితి ॥ 3

తా. ఆవులను, బంగారమును, వస్త్రములను, తీపిపదార్థములను, తేనె కల్పిన అన్నమును, ఆదరణ పూర్వకముగ బ్రాహ్మణులకిచ్చిరి. దేవతలందఱును సంప్రీతులయ్యెదరుగాక అను భావముననిచ్చిరి. 3

టీ:- గావ ఇతి గావః గాః మధుమధురం మధ్వన్నం మధునా సన్నిహితమన్నం. 3

టీ:- గావః - ఆవులు - మధు - తియ్యనివస్తువులు. మధ్వన్నం - తేనెతో కూడిన అన్నము- 3

శ్లో॥ ఊషుస్సరస్వతీ తీరే జలం ప్రాశ్య యతవ్రతాః ।
రజనీం తాం మహాభాగస్సనందా నందకాదయః ॥ 4

తా. నియతమైన ఉపవాసవ్రతము గలవారై ఆ రాత్రి సరస్వతీ నదీ తీరమున నీటిని మాత్రము త్రాగి నందునితో కూడ నందకుడు మొదలగు వారందఱును అచట (నిద్రించిరి) నే ఉండిరి. 4

టీ:- ఊషురితి. జలమాత్రం ప్రాశ్య ఉపోషితాః. తాం నిశాం తత్ర ఊషుర్వ్యవసన్. 4

టీ:- జలమాత్రం ప్రాశ్య - నీటిని మాత్రము త్రాగి - ఉపవసించిరి - ఆ రాత్రి అచటనే ఉండిరి. ఊషుః - వసించిరి. 4

శ్లో॥ కశ్చిన్మహానహిస్తస్మిన్ విపన్నేఽతిబుభుక్షితః ।
యదృచ్ఛయాగతో నందం శయానమురగోఽగ్రసత్ ॥ 5

తా. ఆ అరణ్యమున మిక్కిలి ఆకలిగొనియున్న ఒకానొక పెద్దపాము దైవవశమున అటకు వచ్చి, పరుండియున్న నందుని పట్టుకొనెను. 5

శ్లో॥ స చుక్రోశాహినా గ్రస్తః కృష్ణ కృష్ణ మహానయమ్ ।
సర్పో మాం గ్రసతే తాత ప్రపన్నం పరిమోచయ ॥ 6

తా. నాయనా! కృష్ణా! ఈ పెద్ద సర్పము నన్ను మ్రింగనున్నది. నీ రక్షణలోనున్నవాడను, త్వరగావచ్చి ఈ అజగరము బారినుండి నన్ను విడిపింపుము. (అని నందుడు ఆక్రోశించెను) 6

టీ:- కశ్చిదితి. మహానహిరజగరః ఉరగః ఉరసాగచ్ఛతీత్య లక్షితత్వ ముక్తం. అగ్రసజ్జగ్రాస. (5-6)

శ్లో॥ తస్యచాక్రందితం శ్రుత్వా గోపాలాస్సహసోత్థితాః ।
గ్రస్తం చ దృష్ట్వా సంభ్రాంతాస్సర్పం వివ్యధురుల్ముకైః ॥ 7

టీ:- తస్యేతి. వివ్యధుస్తాడయామాసుః. ఉల్ముకైర్జ్వలత్కాష్ఠైః. 7

శ్లో॥ అలాతైర్దహ్యమానోఽపి నాముంచత భుజంగమః ।
తమస్పృశత్పదాభ్యేత్య భగవాన్ సాత్త్వతాం పతిః ॥ 8

టీ:- అలాతైరితి. అలాతైః ఉల్ముకైరేవ. 8

శ్లో॥ స వై భగవతశ్శ్రీమత్పాద స్పర్శహతా శుభః ।
భేజే సర్పవపుర్హిత్వా రూపం విద్యాధరార్చితమ్ ॥ 9

టీ:- మహాన్ అహిః - కొండచిలువ - ఉరగః - రొమ్ముతో పోవునది దారి (లక్ష్యము) చూడజాలనిదని చెప్పబడినది - అగ్రసత్ జగ్రాస - ముందు భాగమును పట్టుకొనెను. (5-6)

తా. నందుని ఆక్రందనము విని, గోపాలురు వెంటనే లేచి, అజగరము నందుని పట్టుకొనియుండుట చూచి భయాశ్చర్యములను పొంది, ఆ సర్పమును కొఱవులతో కొట్టసాగిరి. 7

టీ:- వివ్యధుః - కొట్టసాగిరి - ఉల్ముకైః - కాలుచున్న కఱ్ఱలతో 7

తా. కొఱవులతో కొట్టబడినను ఆ సర్పము అతనిని విడువకుండెను. అప్పుడు యదుకులపతియగు శ్రీకృష్ణుడు తన పాదములతో ఆ సర్పమును స్పృశించెను. 8

టీ:- అలాతైః - ఉల్ముకములతోనే - కొఱవులతోనే. 8

తా. భగవానుడగు శ్రీకృష్ణుని మంగళకరమైన పాదముల స్పర్శచేత అతని అశుభములన్నియు నశించిపోగా ఆ సర్పరూపమును విడిచి అతడు విద్యాధరుల పూజలందుకొను విద్యాధరపతిగా మారిపోయెను. 9

టీ:- స ఇతి. విద్యాధరేష్వర్చితం పూజితం. 9

టీ:- విద్యాధరార్చితాం - విద్యాధరులలో పూజింపబడువానిగ (రూపుదాల్చెను). 9

శ్లో॥ తమపృచ్ఛద్ధ్రృషీకేశః ప్రణతం సముపస్థితమ్ ।
దీప్యమానేన వపుషా పురుషం హేమమాలినమ్ ॥ 10

తా. సువర్ణహారములు ధరించి, మిక్కిలిగ ప్రకాశించుచు, తనకు నమస్కరించుచున్న ఆ పురుషుని హృషీకేశుడగు కృష్ణుడు ఈ విధముగ అడిగెను. 10

టీ:- తమితి. గోపేష్వాత్మన ఐశ్వర్యం ప్రకాశయితుమవిద్వానివ. తమపృచ్ఛత్. దీప్యమానేన వపుషా సమవస్థితం. 10

టీ:- గోపాలురతో తన ఐశ్వర్యము ప్రకాశింపజేయుటకు పామరుని వలె, దేదీప్యమానముగ వెలుగుచున్న శరీరముచేత అటనుండిన ఆ పురుషుని ఇట్లు ప్రశ్నించెను? 10

శ్లో॥ కో భవాన్ పరయా లక్ష్మ్యా శోభతే శుభలక్షణ ।
కథం జుగుప్సితామేతాం గతిం వా ప్రాపితోఽవశః ॥ 11

తా. ఓ శుభలక్షణములుగలవాడా! మిక్కిలి ఐశ్వర్యముతో వెలుగొందుచున్న నీవు ఎవరవు? అసహ్యకరమైన ఈ గతిని అవశుడవై ఎట్లు ప్రాప్తించితివి? (పొందితివి?) 11

సర్ప ఉవాచ

శ్లో॥ అహం విద్యాధరః కశ్చిత్సుదర్శన ఇతిశ్రుతః ।
శ్రియానురూప సంపత్త్యా విమానేనాచరన్ దిశః ॥ 12

తా. నేను ఒకానొక విద్యాధరుడను. సుదర్శనుడు అని పిలువబడు వాడను. నా సంపదననుసరించిన వైభవముతో విమానముపై ఇటునిటు తిరుగుచుండువాడను. 12

టీ:- క ఇతి.యః పరయా శోభయా ప్రకాశతే సభవాన్ క ఇతి. (11-12)

టీ:- ఎవడు శ్రేష్ఠమైన శోభతో ప్రకాశించుచున్నాడో - అట్టి నీవు ఎవరవు? అని. (11-12)

శ్లో॥ ఋషీన్ విరూపానంగిరసః ప్రాహ సంరూప దర్పితః ।
తైరిమాం ప్రాపితోయోనిం ప్రలబ్ధైస్స్వేన పాప్మనా ॥ 13

తా. నా సౌందర్యముతో గర్వించినవాడనై, కురూపులైన అంగిరస ఋషులను ఒకనాడు అపహాస్యము చేసితిని. ఇట్టి నా పాపముల వలన - ఆ ఋషులచే శపింపబడి ఈ సర్పయోనిలో పుట్టితిని. 13

టీ:- ఋషీనితి. ప్రాహసం అపహసితవానస్మి. ప్రలబ్ధైరుపహసితైః మదీయేనైవ పాప్మనా నిమిత్తేన. 13

టీ:- ప్రాహసం - అపహసించితిని. అట్టి అపహాస్యములచే నాచేతనే పొందబడిన పాపకారణముచేత- 13

శ్లో॥ శాపో మేనుఽగ్రహాయైవ కృతస్తైః కరుణాత్మభిః ।
యదాహం లోకగురుణా పదా స్పృష్టో హతాశుభః ॥ 14

తా. కరుణాళువులైన వారి శాపము నన్ననుగ్రహించుట కొఱకే అయ్యెను. ఏలయనగా నేను, లోకములకు గురువులగు తమ పాదముచే స్పృశింపబడి, అశుభములు నశించినవాడైతిని. 14

టీ:- శాప ఇతి. యత్ యతః శాపాత్. 14

టీ:- యత్ శాపాత్ - శాపము వలన-14

శ్లో॥ తం త్వాహం భవభీతానాం ప్రపన్నానాం భయాపహమ్ ।
ఆపృచ్ఛే శాప నిర్ముక్తః పాద స్పర్శాదమీవహన్ ॥ 15

తా. ఓ దుఃఖవినాశకా! సంసారమువలన భయపడుచున్నవారి యొక్క, నీ శరణుపొందినవారి యొక్కయు భయమును తొలగించునట్టి నీ ఆ పాదస్పర్శ వలన నేను శాపవిముక్తుడనైతిని. ఇప్పుడు స్వలోకము నకు తిరిగి పోవుటకు నీ అనుమతి అడుగుచున్నాను. 15

శ్లో॥ ప్రపన్నోఽస్మి మహాయోగిన్ మహాపురుష సత్పతే ।
అనుజానీహి మాం కృష్ణ సర్వలోకేశ్వరేశ్వర ॥ 16

తా. నీ శరణము నొందియున్నవాడను. మహాయోగీ! లోకేశ్వరేశ్వరా! కృష్ణా! పురుషోత్తమా! నాకు అనుజ్ఞనిమ్ము. 16

శ్లో॥ బ్రహ్మ దండాద్విముక్తోఽహం సద్యస్తేఽచ్యుతదర్శనాత్ ।
యన్నామ గృహ్ణన్నఖిలాన్ శ్రోతౄనాత్మానమేవ చ ॥ 17

శ్లో॥ సద్యః పునాతి కిం భూయస్తస్య స్పృష్టః పదాహి తే ।
ఇత్యనుజ్ఞాప్య దాశార్హం పరిక్రమ్యాభివంద్య చ ।
సుదర్శనోదివం యాతః కృచ్ఛ్రాన్నందశ్చ మోచితః ॥ 18

తా:- అచ్యుతుడవగు నీ దర్శనముచేత ఇప్పుడే బ్రాహ్మణ శాపము నుండి విముక్తుడనైతిని. నీ దర్శనమనగా సమస్తమును పొందుట యగును. నిన్ను వినువారికి ఆత్మనే పొందుటయగును. వినెడివారిని, అప్పటికప్పుడే పవిత్రముచేసి ఉద్ధరించును. ఇకనేమి? అట్టి అచ్యుతుని పాదములచే నేను స్పృశింపబడితిని. 'ఇక నా ముక్తికి సందేహమేమి? అని యిట్లు శ్రీకృష్ణునకు ప్రదక్షిణముచేసి, నమస్కరించి అతని అనుజ్ఞవడసి, సుదర్శనుడు తన లోకమునకు బోయెను. నందుడును ఈ సంకటమునుండి విముక్తుడయ్యెను. (17-18)

శ్లో॥ నిశామ్యకృష్ణస్య తదాత్మ వైభవం
వ్రజౌకసో విస్మిత చేతసస్తతః ।
సమాప్య తస్మిన్నియమం పునర్వ్రజం
గోపా యయుస్తత్కథయంత ఆదృతాః ॥ 19

తా. కృష్ణుని అద్భుతమైన ఈ ప్రభావమునుచూచి, వ్రజవాసులు మిక్కిలి ఆశ్చర్యమునొందిన బుద్ధిగలవారై అటు పిమ్మట అచటి (అంబికా వనమునందలి) నియమములన్నియు పూర్తిచేసుకొని, కృష్ణునియందు అత్యంతమైన ఆదరముగలవారై ఆతని అచ్చటి లీలను కీర్తించుచు తిరిగి వ్రజమునకు బ్రోయిరి. 19

టీ:- తమితి. ఆపృచ్ఛే స్వం లోకం గంతుం అనుజ్ఞాం యాచే. అమీవహన్ దుఃఖనాశన. (15-19)

టీ:- ఆపృచ్ఛే-నా లోకమునకు పోవుటకు అనుజ్ఞను వేడుచున్నాను. అమీవహన్ దుఃఖనాశకా'అమీవం పాప దుఃఖయో'ఇతికోశాత్15-19

శ్లో॥ కదాచిదథగోవిందో రామాశ్చాద్భుతవిక్రమః ।
విజహ్రతుర్వనే రాత్ర్యాం మధ్యే గోవ్రజ యోషితామ్ ॥ 20

తా. పిదప ఒకానొక సమయమున కృష్ణుడును, అమిత విక్రముడైన బలరాముడును, రాత్రివేళ, ఆవులు, వ్రజస్త్రీల మధ్యన విహరించుచుండిరి. వనమునందు విహరించుచుండిరి. 20

టీ:- శ్లో. అహి దేహం నిహత్యైవం ప్రాగున్మత్తం సుదర్శనమ్. తద్వదున్మాదినం కృష్ణ శంఖచూడమతాడయత్. శ్రీధరీయోఽయం శ్లోకః. తత్ప్రసంగమాహ-కదాచిదితి. 20

టీ:- ఈ విధముగ సర్పదేహమున ఉన్మత్తుడై యుండిన సుదర్శనుని శాపగ్రస్తమైన ఆ దేహమును భంగముచేసి అట్లే ఉన్మాదియైన శంఖచూడుని కృష్ణుడు భజించెను. (ఈ భావము శ్రీధరీయ శ్లోక సంబంధము) ఆ ప్రసంగమును చెప్పుచున్నాడు. 20

శ్లో॥ ఉపగీయమానౌ లలితం స్త్రీజనైర్బద్ధ సౌహృదైః ।
స్వలంకృతానులిప్తాంగౌ స్రగ్విణౌ విరజోఽంబరౌ ॥ 21

తా. చక్కగా అలంకరించుకొనియున్నవారును, పరిమళభరితమైన మైపూతలనలందు కొనియున్నవారును, అందమైన పూలదండలు కంఠమునందు వ్రేలాడుచున్నవారును, ప్రకాశించుచున్న పట్టు వస్త్రములు ధరించియున్నవారును అయిన కృష్ణబలరాములు, గాఢమైన ప్రేమానురాగములతో కూడిన వ్రజస్త్రీలతో-శ్రావ్యమైన గీతములాలపించుచుండిరి. (వారి వన విహారమటుల సాగుచుండెను). 21

టీ:- ఉపగీయమానావితి. విరజోఽంబరావితి. విరజసీ నిర్మలే అంబరే యయోః. 21

టీ:- విరజసీ - నిర్మలమైన వస్త్రములు ఎవరివో వారు విరజోఽంబరులు. 21

శ్లో॥ నిశాముఖం మానయంతావుది తోడుపతారకమ్ ।
మల్లికా గంధమత్తాళిజుషం కుముద వాయునా ॥ 22

తా. ఉదయించిన చంద్రుడు, తారకలు కలదియును, మల్లెపూల పరిమళముచే మత్తెక్కియున్న తుమ్మెదలు కలదియును, తెల్లకలువల సువాసనగల గాలిచే సుఖించినదియునైన సంధ్యానంతరకాలమను వారిరువురు సత్కరించిరి. 22

టీ:- నిశేతి. కించ నిశా ప్రవేశం సత్కుర్వంతౌ. ఉదిత ఉడుపః. తారకాశ్చ యస్మిన్ తత్. మల్లికాగంధేన మత్తా అళయో యస్మిన్ తత్. 22

టీ:- మరియు రాత్రి ప్రదేశమును సత్కరించుచున్నారు. ఉదయించిన చంద్రుడు, తారకలు దేనియందో అది, మల్లెల పరిమళముచేత మదించిన తుమ్మెదలు దేనియందో అది (ఆ నిశాముఖము) 22

శ్లో॥ జగతుస్సర్వభూతానాం మనశ్శ్రవణమంగళమ్ ।
తౌ కల్పయంతౌ యుగపత్స్వరమండల మూర్ఛితమ్ ॥ 23

తా. సమస్త భూతములయొక్క మనస్సులకును, వినుటకును శుభంకరమగునట్లు, కృష్ణబలరాములిద్దఱును ఒకేసారి (ఒకేశ్రుతిలో) రాగాలాపనచేయుచు, ఆ రాగస్వరముల ఆరోహణ, అవరోహణములను శ్రావ్యమగు మూర్ఛనలుగ గానము చేసిరి. 23

టీ:- జగతురితి. అనిబద్ధత్వాదనైర్యుగపత్కల్పయితుమశక్యమపి తౌ సర్వమండలమూర్ఛనం యుగపత్కల్పయంతౌ. మనశ్శ్రవణయోర్మంగళం యథా భవతి తథా. జగతుః అగాయతామితి. 23

టీ:- ఇతరులచే ఇదమిద్ధమగు స్వరనిర్ణయము చేయబడి యుండక పోవుటచే ఇద్దఱును ఒకే సమయమున ఒకేవిధముగ ఆలపించుట అసాధ్యమైనను వారిరువురు స్వరమండల మూర్ఛనను ఒకే విధముగ చేయుచు, మనస్సులకును, చెవులకును మంగళము కలుగునట్లు పాడిరి అని. 23

శ్లో॥ గోప్యస్తద్గీతమాకర్ణ్య మూర్ఛితానావిదన్నృప ।
స్రంసద్దుకూలమాత్మానం స్రస్తకేశస్రజం తతః ॥ 24

తా. రాజా! గోపికలు ఆ గానమునువిని మూర్ఛిల్లిరి. తమ జారి పోయిన వస్త్రమును, శరీరమును, తలవెంట్రుకల నుండి పడిపోయిన పూలదండను గమనింపనేరకనే తన్మయులైరి. 24

శ్లో॥ ఏవం విక్రీడతో స్స్వైరం గాయతో స్సంప్రమత్తవత్ ।
శంఖచూడ ఇతి ఖ్యాతో ధనదానుచరో౽భ్యగాత్ ॥ 25

తా. ఈ విధముగ స్వేచ్ఛగా విహరించుచు మిక్కిలి తన్మయత్వముతో పాడుచుండగా శంఖచూడుడు అనుపేరుగల కుబేరుని అనుచరుడొకడు అచటికి వచ్చెను. 25

టీ:- గోప్య ఇతి. మూర్ఛితాః తద్గీతలీనచిత్తాః. స్రంసద్భ్రశ్యత్ దుకూలం యస్మాత్. తమాత్మానం దేహం. స్రస్తాః కేశేభ్యస్స్రజో యస్య తం చ తతో నావిదన్. (24-25)

టీ:- మూర్ఛితాః- ఆ గీతమున లీనమైన చిత్తము గలవారైరి - స్రంసత్ - జారుచున్న - దుకూలం - వస్త్రము- ఏ దేహము నుండియో - తం ఆత్మానాం -అ ట్టి తన శరీరమును - స్రస్తాః - జరిపోయిన - తలవెంట్రుకల నుండి పూలదండ దేనిదో అట్టి కొప్పును - లేక దండను - అప్పుడు - తెలిసికొనజాలక - (లీనమైరి) (24-25)

శ్లో॥ తయోర్నిరీక్షతో రాజం స్తన్నాథ ప్రమదాజనం ।
క్రోశంతం కాలయామాస దిశ్యుదీచ్యామశంకితః ॥ 26

తా. రాజా! అతడు, బలరామకృష్ణులిరువురు చూచుచుండగనే, వారే రక్షకులుగా గల గోపస్త్రీలను, హఠాత్తుగ ఉత్తరదిక్కువైపునకు, వారు కేకలు వేయుచుండగా, తరుముకొని పోయెను. నిర్భయముగ తీసుకొనిపోయెను. 26

టీ:- తయోరితి. నిరీక్షతోర్నిరీక్షమాణయోః, తౌ నాథౌ యస్య తం. కాలయామాస హఠాత్ప్రేరయామాస. 26

టీ:- నిరీక్షతః - ఇరువురు చూచుచుండగ - వారే రక్షకులుగాగల ఆ స్త్రీ జనమును - కాలయామాస - హఠాత్తుగ ప్రేరేపించెను. 26

శ్లో॥ క్రోశంతం కృష్ణ రామేతి విలోక్య స్వపరిగ్రహమ్ ।
యథా గా దస్యునా గ్రస్తాభ్రాతరావన్వధావతామ్ ॥ 27

తా. కృష్ణా! రామా! అనివారు కేకలు వేయుచుండగా చూచి, ఎవడో తమ గోధనమును దొంగిలించుకొని పోవుచున్నట్లు భావించిన వారివలె సోదరులిరువురును ఆ శంఖచూడని వెనుక పరుగుతీసిరి. 27

టీ:- క్రోశంతమితి. దుస్యునా వ్యాఘ్రేణ. 27

టీ:- దస్యునా - పులిచేత- 27

శ్లో॥ మాభైష్టేత్య భయారావౌ సాలహస్తౌ తరస్వినౌ ।
నిషేదతుస్తం తరసా త్వరితం గుహ్యకాధమమ్ ॥ 28

తా. "భయపడకుడు" అని అభయమునిచ్చు వాక్యములను బిగ్గరగా నరచుచున్నవారును, చెట్లనే ఆయుధములుగ చేతులతో ధరించియున్న వారును, మిక్కిలి వేగముగలవారునై బలరామకృష్ణులు - త్వరపడుచు పోవుచున్న అతనిని, ఆ నీచుడైన గుహ్యకుని కంటెను వేగముగ బోవుచు అతనిని చేరిరి. 28

శ్లో॥ స వీక్ష్య తావనుప్రాప్తౌ కాలమృత్యూ ఇవో ద్విజన్ ।
విసృజ్య స్త్రీజనం మూఢః ప్రాద్రవజ్జీవితేచ్ఛయా ॥ 29

తా. అతడు బలరామకృష్ణులిరువురు సమీపించుట చూచి, యముడు, మృత్యువు కలిసి వచ్చినట్లు ఉద్వేగము పొందుచు, ఆ మూఢుడు (శంఖచూడుడు) గోపస్త్రీలను వదిలిపెట్టి బ్రతుకుమీది ఆశతో పరుగెత్తి పోయెను. 29

శ్లో॥ తమన్వధావద్గోవిందో యత్ర యత్ర స ధావతి ।
జిహీర్షుస్తచ్ఛిరోరత్నం తస్థౌ రక్షం స్త్రియోబలః ॥ 30

టీ:- మాభైష్టేతి. మాభైష్ట భయం మా ప్రాప్నువతేత్యభయవాచౌ. (28- 30)

శ్లో॥ అవిదూర ఇవాభ్యేత్య శిరస్తస్య దురాత్మనః ।
జహార ముష్టినైవాంగ సహ చూడామణిం విభుః ॥ 31

శ్లో॥ శంఖచూడం నిహత్యైవం మణిమాదాయ భాస్వరమ్ ।
అగ్రజాయాదదాత్ప్రీత్యా పశ్యంతీనాం చ యోషితామ్ ॥ 32

టీ:- అవిదూర ఇతి. శిరసా సహ చూడామణిం జహారేత్యర్థః. (31-32)

**శ్రీ మద్భాగవతే, మహాపురాణే దశమస్కంధే,**
**చతుస్త్రింశోఽధ్యాయః**

తా. కృష్ణుడు శంఖచూడుని శిరోరత్నమును హరింపదలచినవాడై అతడెచ్చటికి పరుగెత్తుచుండెనో అచటికి అతనిని వెంబడించుచు పరుగెత్తెను. ఇక బలరాముడు స్త్రీల రక్షణకై అచటనే ఉండెను. 30

టీ :-"భయపడకుడు" అని అభయమునిచ్చు వాక్యములను పలుకుతూ. (28-30)

తా. రాజా! శ్రీకృష్ణప్రభువు సమీపమునందే అతనిని పట్టుకొని, ఒక్క పిడుగ్రుద్దుతో చూడామణితో బాటుగ, ఆ దుర్మార్గుని తలను కూడ హరించెను. 31

తా. ఇట్లు శంఖచూడుని సంహరించి, ప్రకాశవంతమైన ఆ మణిని దెచ్చి, మిక్కిలి ప్రీతితో, స్త్రీలందఱును చూచుచుండగా తన అన్నయగు బలరామునకిచ్చెను. 32

టీ:- తలతోకూడ చూడామణిని కూడ హరించెనని యర్థము. (31-32)

**అని శ్రీమద్భాగవతమున దశమస్కంధమందు**
**ముప్పది నాలుగవ అధ్యాయము సమాప్తము.**

## పంచత్రింశోఽధ్యాయః

**శ్రీశుక ఉవాచ**

శ్లో॥ గోప్యః కృష్ణే వనం యాతే తమనుద్రుత చేతసః ।
కృష్ణ లీలాః ప్రగాయంత్యో నిన్యుర్దుఃఖేన వాసరాన్ ॥ 1

టీ:- శ్లో." పంచత్రింశే వనం యాతే కృష్ణే గోకులయోషితః, యుగ్మశ్లోకానుగీతేన నిన్యుర్దుఃఖేన వాసరాన్." ఏవం రాత్రిషు కృష్ణేన స్వైరం అభిరమితానాం. దివా తద్విరహితానామనుగీతేన దిన విస్తార ప్రకారమాహ - గోప్య ఇతి. దుఃఖేన కృచ్ఛ్రేణ. 1

**గోప్య ఊచు**

శ్లో॥ వామ బాహుకృత వామ కపోలో
వల్గిత భ్రురధరార్పితవేణుః ।
కోమలాంగుళిభిరాశ్రితమార్గం గోప్య
ఈరయతి యత్ర ముకుందః ॥ 2

## 35వ అధ్యాయము

**శ్రీశుకుడిట్లనెను.**

తా. కృష్ణుడు అరణ్యమునకు పోయిన పిదప గోపికలు అతని వెంటనే పరుగిడిన బుద్ధిగలవారై, ఆతని లీలలను పాడుచు, దుఃఖముతో దినములు గడిపిరి. 1

టీ:- "ఈ ముప్పది ఐదవ అధ్యాయమున, కృష్ణుడు వనమునకు పోయిన పిదప గోకులమునందలి స్త్రీలు, జంటలుగ శ్లోకములను (కృష్ణస్తుతులను) పాడుచు దుఃఖముతో దినములు గడిపిరి". ఇట్లు రాత్రులందు కృష్ణునితో క్రీడించినవారి - పగలు అతని విరహముతో నున్నవారి యొక్క, జంట గీతములను ఆలపించుచుండుట చేత వారికి దినములు దీర్ఘ సమయములు గలవి యెటులయ్యెనో చెప్పుచున్నాడు - దుఃఖేన - క్లేశములతో. 1

**గోపికలు ఇట్లనిరి**

తా. ఎడమ భుజముపై ఎడమ చెక్కిలిని ఆనించి, నర్తించు కను బొమ్మలు గలవాడై, క్రింది పెదవినలంకరించిన వేణువుగలవాడై, మృదులములైన వ్రేళ్లతో ఆశ్రయింపబడిన స్వరమార్గము (వేణు రంధ్రములు) గలవాడై ఎచట కృష్ణుడు మురళిని వాయించుచుండునో అచట ఈ గోపస్త్రీలు. 2

టీ:- వామబాహుకృత వామకపోల ఇత్యాదీని ద్వాదశ యుగళాని. వామేతి. హే గోప్యః వామే బాహౌ తన్మూలే కృతః. అర్పిత వామః కపోలో యేన సః. వల్గితే నర్తితే భ్రువౌ యేన స వల్గిత భ్రుః ముకుందః అధరేఽర్పితం వేణుం కోమలాభిరంగుళీభిరాశ్రితా మార్గాః సప్తస్వర ఛిద్రాణి యస్య తం. యత్ర యదా. ఈరయతి వాదయతి. 2

టీ॥ ఎడమ భుజముపై ఎడమ చెక్కిలిని ఆనించి, నర్తించు కనుబొమ్మలు గలవాడై, క్రింది పెదవినలంకరించిన వేణువుగలవాడై, మృదులములైన వ్రేళ్లతో ఆశ్రయింపబడిన (సప్త) స్వరమార్గము (వేణురంధ్రములు) గలవాడై ఎచట కృష్ణుడు మురళిని వాయించుచుండునో అచట ఈ గోపస్త్రీలు.. (2)

శ్లో॥ వ్యోమయాన వనితాస్సహసిద్ధై
ర్విస్మితాస్తదుపధార్య సలజ్జాః ।
కామమార్గణసమర్పితచిత్తాః
కశ్మలం యయురపస్మృతనీవ్యః ॥ 3

తా. ఆకాశమార్గమున విమానములలో పయనించుచున్న స్త్రీలు, సిద్ధులతోకూడి ఆశ్చర్యచకితులై ఆ మురళీగానమునాలకించి, మన్మథుని బాణములకు అప్పగించిన చిత్తములుగలవారై, సిగ్గుతోకూడినవారై తమచీరల, రవికలముడులు విడిపోవుచుండుటను గమనింపక మనోవైకల్యమును పొందిరి. 3

టీ:- వ్యోమయానేతి. తదా వ్యోమయానానాం సిద్ధానాం. వనితాః, సిద్ధైః. స్వపతిభిస్సహ వర్తమానా అపి. తద్వేణీశ్వరణం ఉపధార్య ఆకర్ణ్య ప్రథమం విస్మితాః తతః. కామకార్గణేభ్యః సమర్పితాని చిత్తాని యాభిస్తాః తత్పరవశా ఇత్యర్థః. సలజ్జాస్సత్యః కశ్మలం మోహం. యయుః. అత్ర లింగం. అపస్మృతాః విస్మృతా నీవ్యో యాభిరితి. అత ఏవం భూతస్య కృష్ణస్య. విరహం కథం సహేమ ఇతి సర్వత్ర వాక్యశేషః. 3

టీ:- అప్పుడు ఆకాశయానముననున్న సిద్ధస్త్రీలు, తమ భర్తలతోకూడనున్నప్పటికిని ఆ వేణునాదమును ఆలకించి మొదట ఆశ్చర్యపడిరి. పిదప-మన్మథబాణములకొఱకు సమర్పింపబడిన చిత్తములు ఎవరిచేతనో వారు దానికి పరవశులై అని యర్థము. సిగ్గుతో కూడినవారగుచు-కశ్మలం-మోహమును, యయుః-పొందిరి. దీనికి గుర్తు-అపస్మృతాః - మఱచిన - నీవ్యః - ముడులు - ఎవరిచేతనో వారు అని - అందువలన ఇట్టి కృష్ణుని విరహమును ఎట్లు సహింతుము? అని అంతటను వాక్యశేషము. 3

శ్లో॥ హంతచిత్రమబలాశ్శృణుతేదం హారహాస ఉరసి స్థితవిద్యుత్ ।
నందసూనురయమార్తజనానాం నర్మదోయర్హి కూజితవేణుః ॥4

తా. ఆశ్చర్యము! చెలులారా! ఈ విచిత్రమైన విషయమును వినుడు. కృష్ణుని వక్షఃస్థలమునందు హారము అనెడి నవ్వు మెరుపుతీగవలె స్థిరముగనున్నది. ఆ నందనందనుని వేణునాదమెప్పుడు వినబడునో అప్పుడది ఆర్తజనులకు హాసమునిచ్చునదగును. (క్షణికమైనమెరుపు స్థిరముగనుండుట, దుఃఖితులకు నవ్వు పుట్టించుటయు విచిత్రములే కదా!) 4

టీ:- హంతేతి. హంత. హే అబలాః, ఇదం చిత్రం. శృణుత. హారహాసః హారవ ద్విశదో వాసో యస్య సః. యద్వా-వేణువాదనే అధోవదనేన హసతః. హారేషు స్ఫురన్ హాసో యస్య. హారవద్వా వక్షసి శోభమానో హాసో యస్య సః. యద్వా. హారాణాం హాస ఇవ విశదా స్ఫూర్తిర్యస్మిన్నురసీతి. ఉరసి స్థితా విద్యుదివ లక్ష్మీర్యస్య సః యర్హి యదా. కూజితవేణుర్నాదితవేణుర్భవతి. 4

టీ:- ఓ అబలలారా! ఈ చిత్రమును వినుడు, హారహాసః-హారము వలె ప్రకాశించెడు నవ్వు ఎవరికో వాడు, లేక-వేణువువాయించునపుడు క్రిందుమోముతో నవ్వు వాని యొక్క హారములయందు స్ఫురించెడి నవ్వు ఎవరిదో వాడు-లేక-హారమువలె వక్షస్థలమున శోభమానమైన నవ్వు ఎవనికోవాడు-లేక- హారములయొక్క నవ్వువలె తెల్లని స్ఫూర్తి ఏ వక్షమునందో-అని. ఉరోభాగముననున్న-విద్యుత్ ఇవ - లక్ష్మివలె ఎవనికోవాడు యర్హి - ఎప్పుడు - మ్రోగించు మురళియగునో- 4

శ్లో॥ బృందశో వ్రజవృషామృగగావో
వేణువాద్యహృతచేతస ఆరాత్ ।
దంతదష్టకబళా ధృతకర్ణా
నిద్రితాలిఖిత చిత్రమివాసన్ ॥ 5

తా. గుంపులు గుంపులుగనున్న వ్రజమునందలి ఆంబోతులు, మృగములు, ఆవులు, కృష్ణుని మురళీనాదముచేత ఆకర్షింపబడిన బుద్ధిగలవియై, దూరము నుండియే, దంతములచే నములబడిన గ్రాసములు కలవియై, లేవనెత్తబడిన చెవులు గలవియునై, నిద్రించిన వానివలె, చిత్తరువులలోని బొమ్మలవలె ఉండిపోనవి. 5

టీ:- బృందశ ఇతి. తదా వ్రజే. యే వృషాః. మృగాః గావశ్చ వేణువాద్యేన హృతాని చేతాంసి యేషాం తే. ఆరాద్దూరాదేవ. దంతైర్దష్టాః కబళా గ్రాసాః యైస్తే. ధృతా ఉత్తంభితాః కర్ణాః యైస్తే. నిద్రితా ఇవ లిఖిత చిత్రమివ చాసన్. అవిదుషాం తిరశ్చామివేదమతి చిత్రమిత్యర్థః (5)

టీ:- అప్పుడు వ్రజమునందు ఏ ఆంబోతులు, మృగములు, ఆవులును వేణువాద్యముచేత హరింపబడిన మనస్సులు కలవో అవి - ఆరాత్ - దూరమునుండియే - దంతములచేత నమలబడిన కబళములు వేనిచేతనో అవి - ధృతాః - లేవనెత్తినబడిన, చెవులు వేనిచేతనో అవి. నిద్రించిన యున్నవానివలె - గీయబడిన చిత్తరువువలె ఉండెను. తెలియని వారికి - జంతువులకువలె - ఇది మిక్కిలి విచిత్రమైనది అనియర్థము. 5

శ్లో॥ బర్హిణస్తబకధాతు పలాశై
ర్బద్ధ మల్ల పరిబర్హ విడంబః ।
కర్హిచిత్సబల ఆళి సగోపై
ర్గాస్సమాహ్వయతి యత్ర ముకుందః ॥ 6

తా. ఓ సఖీ! నెమలి పింఛముల గుత్తులు, గైరికాది ధాతువులు, వివిధములైన చిగురుటాకులచేతను కట్టబడిన శ్రేష్ఠమైన రాజార్హములగు ఛత్రచామరాదులను బోలిన అలంకరణముగలవాడై, తోటిగోపాలురతో, బలరామునితోను కలిసి (వేణునాదముతో) కృష్ణుడు ఆవులను ఎచట పిలుచుచుండునో-6

టీ:- కించ అచేతనాసు సరిత్సు తదతి విచిత్రమిత్యాహుః-బర్హి ణ ఇతి. హే ఆళి సఖి బర్హిణో మయూరస్య. స్తబకాః బర్హగుచ్ఛాః ధాతవో గైరికాదయశ్చ పలాశాని పల్లవాశ్చ. తైర్బద్ధశ్చాసౌ మల్లానాం పరిబర్హః పరికరః తం విడంబయతి అనుకరోతి తథా. స ముకుందః అనుగైర్గోపైస్సహ వేణునేత్యుపరితనం అత్రాపి జ్ఞాతవ్యం. యత్ర యదా. గాః సమాహ్వయతి. 6

టీ:- ఇంకనూ అచేతనములైన నదులయందు అది మిక్కిలి విచిత్రమైనదని చెప్పుచున్నాడు -హే అళి-ఓ సఖీ! నెమలి యొక్క ఈకల గుత్తులు, గైరికము మొదలగునవియు-పలాశాని-చిగుళ్లను, వానిచేత కట్టబడిన రాజలాంఛనముల పరికరమును అనుకరించుచున్న (అలంకరణముతో) ఆ ముకుందుడు గోపాలురతోకూడ-వేణువుతో అని పై అర్థము ఇచటకూడ తెలిసికొనదగినది. యత్ర-ఎప్పుడు- ఆవులను పిలుచునో. 6

శ్లో॥ తర్హి భగ్నగతయస్సరితో వై
తత్పదాంబుజరజోనిల నీతమ్ ।
స్పృహయతీర్వయమివా బహుపుణ్యాః
ప్రేమవేపిత భుజా స్తిమితాపః ॥ 7

తా. అప్పుడు కృష్ణుని పాదపద్మముల రజస్సు, గాలిచే కొనిరాబడగా దానిని స్పృశించుకొఅకు అనినట్లు నదుల వేగము తగ్గినవయ్యెను. మనవలెనే అవియును భాగ్యహీనలై ప్రేమాతిశయమున కంపించిన భుజములు(తరంగములు)గలవియై స్తంభించిన నీరుగలవి అయ్యెను. 7

టీ:- తర్హీతి. తర్హి తదా. తద్ధ్వనిశ్రవణాత్. అనిలేన నీతం. తస్య పదాంబుజరజః స్పృహయంత్య ఇవ. భగ్నగతయః సరితః వై నిశ్చితం వయమివ. తా అప్యబహుపుణ్యాః. యతో న ప్రాప్నువంతి. కేవలం ప్రేమ్ణా వేపితా భుజాస్తరంగా యాసాం తాః. స్తిమితాః నిశ్చలాః ఆపో యాసాం తాః. గోప్యోఽపి లోచనయోః స్తిమితజలా భవంతీతి. 7

టీ:- తర్హి–అప్పుడు–ఆ ధ్వని వినుటవలన, గాలిచే కొనిరాబడినదై అతని పాదపద్మముల పరాగమును స్పర్శించుచున్నవి యనునట్లు ప్రవాహవేగము తగ్గినవై నదులు–నిశ్చయముగ మనవలె అవియును ఎక్కువ పుణ్యములను పొందలేనందువలన కేవలము ప్రేమచేత కంపమానములైన – భుజాః – తరంగములు వేనికో ఆ నదులు – స్తిమితాః –నిశ్చలమైన – ఆపః – నీరు – వేనికో అవి – గోప స్త్రీలుకూడ కన్నుల నీరు నిశ్చలముగా స్తంభింతురు అని. 7

శ్లో॥ అనుచరైస్సమనువర్ణితవీర్య
ఆదిపూరుష ఇవాచల భూతిః ।
వనచరో గిరి తటేషు చరంతీ
ర్వేణునాహ్వయతి గాస్సయదా హి ॥ 8

తా. తోటివారగు గోపాలకులచేత వర్ణింపబడు పరాక్రమము గలవాడును, ఆదిపురుషునివలె నిశ్చలమైనవాడును, అరణ్యములలో సంచరించుచుండువాడును, కొండకోనలలో తిరుగుచు, వేణునాదము చేత నాతడు ఆవులను పిలుచునప్పుడు. 8

టీ:- స్థావరేష్వప్యతిచిత్రం దృశ్యత ఇత్యాహుః - అనుచరైరితి. అనుచరైర్గోపైః. దేవాదిభిర్వా. ముగ్ధానాం వాక్యం ఆదిపురుష ఇవేతి. అచల భూతిః నిశ్చలశ్రీః వేణునాతత్తన్నామ్నాం గానేన. 8

శ్లో॥ వనలతాస్తరవ ఆత్మని విష్ణుం
వ్యంజయంత్య ఇవ పుష్ప ఫలాఢ్యాః ।
ప్రణతభారవిటపా మధుధారాః
ప్రేమహృష్టతనవో వవృషుస్మ్స ॥ 9

టీ:- వనలతా ఇతి. తథా ప్రణతాః భారేణ విటపాః శాఖాయాసాం తాః. వనగతా లతాః స్వస్మిన్ విష్ణుం ప్రకాశమానం సర్వభూతాంతర్యామిత్వాత్ అస్మాస్వపి విద్యత ఇతి సూచయంత్య ఇవ మధుధారాః వవృషుః. స్మేతి విస్మయే. తరవశ్చ తథా తత్పతీనామపి తథైవానంద ఇతి భావః. 9

టీ:- స్థావరములయందును చాలా విచిత్రముగ కనపడునని చెప్పుచున్నాడు. అనుచరైః - గోపాలురచేత- లేక దేవతలు మొదలగు వారిచేత-ఆదిపురుషునివలె' అనునది మోహమునందియున్నవారి వాక్యము. అచల భూతిః - నిశ్చలశోభ - వేణువుచేత వానివాని పేర్లను పాడుటచేత. 8

తా. అడవి తీగలు, చెట్లు, తమలోని పరమాత్మను వ్యక్తీకరించుచున్న వానివలె, పువ్వులు, పండ్లు మున్నగువానితో ఒప్పిదములై, నమస్కరించుచున్న భావముగలవానివలె వంగిన కొమ్మలుగలవియై, ప్రేమతో హర్షమును పొందిన శరీరములు గలవియై తేనెధారలను వర్షించుచున్నవి. ఆశ్చర్యము. 9

టీ:- ప్రణతాః - బరువుతోవంగిన - విటపాః- శాఖలు, వేనియందో గలవో అవి - వనమునందున్న తీగలు తమయందు - విష్ణుం- ప్రకాశుడైన వానిని - భూతములన్నింటియందును అంతర్యామిగ ఉండుటవల్ల మా యందుకూడ ఉన్నాడని సూచించుచున్నవానివలె మధుధారలను వర్షించెను. స్మ అని ఆశ్చర్యమునందు, చెట్లుకు, వాని పతులకు, అదే విధముగ ఆనందము అని భావము. 9

శ్లో॥ దర్శనీయతిలకో వనమాలా
దివ్యగంధ తులసీ మధుమత్తైః ।
అళికులైరలఘు గీత మభీ
ష్టమాద్రియన్ యర్హి సంధితవేణుః ॥ 10

టీ:- ఏతాని విష్ణువ్యక్తిలక్షణాని కించ సరాసి కమల వనేషు. విహరతాం పక్షిణామపి మన ఆకర్షకం తద్గీతం కిం పునరన్యే షా మిత్యాహుః. దర్శనీయేతి. దర్శనీయస్తిలకో యస్య యస్య దర్శనీయానాం సుందరాణాం మధ్యే ముఖ్య ఇతి వా. వనమాలాసు యా దివ్యగంధా తులసీ. తస్యాః మధునా మత్తైరళికులై. అలఘు. ఉచ్చైరభీష్టమనుకూలం గీతం. ఆద్రియన్ ఆదరేణ గృహ్ణన్. యర్హి అధరే సంధితవేణుర్భవతి. (10)

తా. చూడదగిన వారిలోశ్రేష్ఠుడు (లేక చూడదగినతిలకముగలవాడు) వనమాలలయందు, దేవతాసంబంధమైన తులసియు - దాని తేనెచేత మదించిన తుమ్మెదల సమూహముల చేత, ఉచ్చైస్స్వరమున అనుకూలమైన ఝుంకారగీతమును ఆదరముగ స్వీకరించుచు పెదవిపై వేణువును సంధించినప్పుడు... 10

టీ:- ఇవి విష్ణువు యొక్క ప్రకటములగు లక్షణములు, మరియు- సరస్సునందలి తామర, వనములందు విహరించుచుండెడి పక్షులకు కూడ మనస్సునకు ఆకర్షకమై ఆ పాట విలసిల్లుననినచో నిక ఇతరులకు ఆకర్షణీయముకాకపోవుటయేమి? అని చెప్పుచున్నారు-దర్శనీయమగు తిలకముఎవనికో-దర్శనీయులలో-సుందరులలో ముఖ్యుడనియును- వనమాలలయందు ఏ దివ్య పరిమళముగలదో అది - మరియు తులసియు, దానియొక్క మధువుచేత మదించిన తుమ్మెదల సమూహములచేత - అలఘు - బిగ్గరగా - అభీష్టం-అనుకూలమైనట్లుగ పాడబడు గీతమును (ఝుంకారమును) ఆదరముగ స్వీకరించుచు (లేకశ్రుతిగా స్వీకరించుచు) ఎప్పుడు క్రింది పెదవిపై సంధింపబడిన వేణువు గలవాడగునో- 10

శ్లో॥ సరసి సారస హంస విహంగా
శ్చారు గీతహృతచేతస ఏత్య ।
హరిముపాసత తే యత చిత్తా
హంత మీలితదృశో ధృత మౌనాః ॥ 11

టీ:- సరసీతి. తర్హి యే సరసి సారసా హంసాః. అన్యే చ విహంగాః చారుణా గీతేన హృత చేతసః. ఏత్య ఆగత్య. హరిం ఉపాసత అభజంత. తత్సమీపే ఉపవివిశుర్వా. హంతేతి విషాదే. 11

తా. కొలనులోని బెగ్గురుపక్షులు, హంసలు, ఇతరపక్షులును ఆ శ్రావ్యమైన గీతముచే హరింపబడిన మనస్సుగలవియై అచటికేతెంచి- అయ్యో! కనులు మూసుకొని మౌనము వహించి ఏకాగ్రచిత్తముతో విష్ణుభగవానుని ఉపాసించును. 11

టీ:- అప్పుడు సరస్సునందు ఏ బెగ్గురు పక్షులు, హంసలు, ఇతరములైన పక్షులు కూడ కలవో అవి ఆ వినసొంపైన పాటచేత హరింపబడిన బుద్ధిగలవియై - ఏత్య - వచ్చి- హరిని ఉపాసించెను. భజించినవి - లేక - అతని సమీపమునందు చేరినవి అనియు. హంత అని విషాదమున (ప్రయోగము). 11

శ్లో॥ సహబలస్రగవతం సవిలా
సస్సానుషు క్షితిభృతో వ్రజదేవ్యః ।
హర్షయన్ యర్హి వేణురవేణ
జాతహర్ష ఉపరంభతి విశ్వమ్ ॥12

టీ:- మేఘోఽపి హరిం సేవత ఇత్యాహుః-సహబల ఇతి. వ్రజదేవ్యో గోప్యః.సహబలః సరామః కృష్ణః. స్రగ్భిర్నిర్మితాభ్యామవతంసాభ్యాం కర్ణ భూషణాభ్యాం విలాసో యస్య. యద్వా. ముక్తాఫలస్రగాపీడేన

తా. బలరామునితో కూడియున్నవాడును, పూలదండలచే చేయబడిన కర్ణాభరణములతోడి విలాసముగలవాడును అయిన కృష్ణుడు, పర్వతముల పైని, సమభూములయందు, వేణునాదముతో తాను ఆనందించుచు, వ్రజస్త్రీలను ఆనందపరచుచు, సమస్త విశ్వమును కూడ ఆనందపరచునప్పుడు. 12

టీ:- మేఘుడుకూడ హరిని సేవించునని చెప్పుచున్నాడు-వ్రజదేవ్యః -గోపికలను-బలరామునితో కూడ కృష్ణుడు, పూలదండలచేత సిద్ధము చేయబడిన కర్ణభూషణములతో విలాసము ఎవనికో - లేక-

విలాసో యస్యేతి. క్షితిభృతః సానుషు గిరేస్తటేషుః వర్తమానః స్వయం జాత హర్షః. విశ్వం హర్షయన్. యదా వేణురవేణోపరంభతి నినాద యతి. నాదేన ఆపూరయతీత్యర్థః. 12

ముత్యాలదండ వ్రేలాడుచుండుటచేత విలాసము ఎవనికోవాడు అని– గిరితటముల యందు వర్తించుచున్నవాడై – స్వయముగ సంతోషము కలిగినవాడై – విశ్వమును సంతోషింపజేయుచు – వేణురవముచేత నాదమునింపునో – అని యర్థము. 12

శ్లో॥ మహదతిక్రమ విశంకితచేతా
మంద మందమనుగర్జతి మేఘః ।
సుహృదమభ్య వర్షత్సుమనోభిశ్ఛా
యయా చ విదధత్ప్రతపత్రమ్ ॥ 13

తా. మహాత్ములను అతిచరించుంట, దోషమగునను శంకతో మెల్ల మెల్లగ కదులుచు అచట ఆగి, అతని వేణుగానమునకు ఆటంకప్రాయ ముగనుండునేమో అనుశంకతో (ఆ గానమునకు తాళప్రాయముగ) మెల మెల్లగనే ఉరుముచు, మేఘుడు, తన ఆత్మీయుడగు కృష్ణునిపై సన్నని తుషారమును వర్షించెను. పుష్పరాగముచే వర్షించెను. అతనిని తాపమునుండి కాపాడుటకు గొడుగుపట్టినట్లు తానే నిలిచెను. 13

టీ:– మహదితి. తదా మేఘః మహతః శ్రీకృష్ణస్య. అతిక్రమేణ శంకితం చేతో యస్య సః న పునః పురతో యాతి న చోచ్చైర్గర్జయతి. కింతు తత్రైవ స్థితస్సన్ వేణురవమను. మందం గర్జతి. కించ. సుహృదం విశ్వార్తి హరణాది సామ్యాత్సుహృత్కృష్ణః. తం సుమనోభిరభ్య వర్షదితి. అదృశ్యైర్దేవైః క్రియమాణం కుసుమవర్షం మేఘే కల్పయిత్వోక్తం తుషారో వా కుసుమతయా కల్పితః స ఏవ వా దేవతారూపోఒభ్యవర్షదితి. ప్రతపాదాతపాత్ త్రాయత ఇతి ప్రతపత్రం ఛత్రం. తత్ ఛాయయా కుర్వన్నితి. 13

టీ:– అప్పుడు మేఘుడు–మహతాః–మహాత్ముడగు కృష్ణునియొక్క అతిక్రమణము (దాటిపోవుట–అతిచారము) చేత తన దోషమును శంకించిన మనస్సు ఎవనికోవాడు (మేఘుడు) ఇంకను ముందునకు పోవక, అతిమాత్రముగ గర్జింపకనుండెను. కాని అచటనే నిలిచి వేణునాదము ననుసరించి మెల్లగ గర్జించుచు, మరియు–స్నేహితుని– విశ్వముయొక్క ఆర్తిని మొదలగువానిని హరించు సామ్యముచేత స్నేహితుడగు కృష్ణుడు – అతనిని పుష్పములచేత అభిషేకించెను అని. కనపడని దేవతలచేత చేయబడుచున్న పూలవాన మేఘమునందు

శ్లో॥ వివిధ గోప చరణేషు విదగ్ధో
వేణువాద్య ఉరుధా నిజశిక్షాః ।
తవసుతస్సతి యదాధరబింబే
దత్త వేణురనయత్స్వర జాతీః ॥14

టీ:- అపి చ మహదేతదాశ్చర్యమిత్యాహుః - వివిధేతి. హే సతి యశోదే తవసుతః. నానాగోపక్రీడాను విదగ్ధో నిపుణః. వేణువాద్య విషయే నిజైవ శిక్షాం యాసు తాః సోత్ప్రేక్షితాః న త్వన్యతః శ్రుతా ఇత్యర్థః. స్వరజాతీర్నిషాదర్షభాది స్వరాలాప భేదాన్ అనయత్ ఉన్నీతవాన్. 14

కల్పించి చెప్పబడినది. తుంపరయే పువ్వులుగా కల్పింపబడినది. లేక మేఘుడే దేవతారూపుడై వర్షించుచున్నాడు అనియు-వేడినుండియు ఎండనుండియు కాపాడు నది కావున 'ప్రతపత్రం' - గొడుగు - దానిని ఛాయగా చేయుచు అని- (నీడను కల్పించుచు). 13

తా. యశోదామాతా! నీ కుమారుడగు శ్రీకృష్ణుడు గోపాలుర వివిధ క్రీడలలో నిపుణుడు ఇక వేణువాద్యమునందు వివిధరాగములను హృదయంగముగ పలికించు ప్రావీణ్యమును తనకుతానే పొందినవాడు దొండపండు వంటి తన క్రింది పెదవిపై వేణువును నిలిపి వాయించుట ప్రారంభింపగనే క్రమముగ స్వరజాతులన్నియు స్వయముగ కొనివచ్చు చుండెను. 14

టీ:- మరియును - ఇది మిక్కిలి ఆశ్చర్యమని చెప్పుచున్నారు-ఓ సతీ యశోదా! నీ కుమారుడు వివిధములైన గోపక్రీడలయందు నిపుణుడు. వేణువాద్య విషయమున తనదేయైన నేర్చుకొనుటలోని మెలకువలు తనచేతనే ఊహింపబడినవి. ఇతరుల వలన విని యుండినవి కావు. స్వర జాతిః - నిషాదము, ఋషభము మొదలగు స్వరముల ఆలాప భేదములను - అనయత్ - తెచ్చిన వాడయ్యెను. (యథా శ్రావ్యముగ పలికించెను) 14

శ్లో॥ సవనశః తదుపధార్య సురేశా
శ్శక్ర శర్వ పరమేష్ఠి పురోగాః ।
కవయ ఆనమితకంధరచిత్తాః
కశ్మలం యయురనిశ్చిత తత్త్వాః ॥ 15

తా. దేవతాప్రముఖులగు ఇంద్రుడు, రుద్రుడు, బ్రహ్మదేవుడు మొదలగు సంగీతకోవిదులు ఆ వేణువాద్యమును మాటిమాటికిని మెడలు వంచిన చిత్తములుగలవారై శ్రద్ధగా విని దాని తత్త్వము బోధపడక మోహమునొందిరి. 15

టీ:- సవనశ ఇతి. తత్తు తాః స్వరజాతీః. సవనశః వారం వారం మంద్ర మధ్యమ తార భేదేన క్రమశో వా యతో గీతధ్వని రాగతః తత్ర ఆనమితా కంధరా చిత్తం చ యేషాం తే. ఉపధార్య సమ్యగాకర్ణ్య. కవయః కోవిదా అపి తే. అనిశ్చితం తత్త్వం తద్భేదో యైస్తే. కశ్మలం మోహం యయురితి. 15

టీ:- ఆ స్వరజాతులను - సవనశః - మఱల మఱల (సోమలతను దంచునట్లు) మంద్ర, మధ్యమ, తారస్థాయిల భేదములతో - లేక క్రమముగనో - ఎచట గీతనాదము వినబడుచుండెనో అచట, వంచబడిన కంఠములు, మనస్సుకూడ,- ఎవరికో వారు (దేవతలు) ఉపధార్య - బాగుగ విని - కవయః - శాస్త్రజ్ఞులైనవారు కూడ - అనిశ్చితమైన తత్త్వము - ఆ భేదము తెలియనిది ఎవరికో వారు- (తత్త్వము తెలియబడని అనిశ్చిత స్థితి గలవారై) కశ్మలం - మోహమును - పొందిరి అని. 15

శ్లో॥ నిజ పదాబ్జ ధరైర్ధ్వజ వజ్రై
ర్నీరజాంకుశ విచిత్ర లలామైః ।
వ్రజభువః ప్రశమయన్ ఖురతో
దంవర్ష్మధుర్యగతిరీరిత వేణుః ॥16

తా. తన పాదపద్మములచే ధరింపబడిన ధ్వజ, వజ్ర, పద్మ అంకుశాది విచిత్రమైన చిహ్నములతో, వ్రజమునందలి నేలకు పశువుల గిట్టలవలన పుట్టిన బాధను, శమింపజేయుచు, ఏనుగు వంటి నడక గలవాడై వేణువును వాయించుచు కృష్ణుడు (పోవుచుండెను). 16

టీ:- అస్మాకం తు మోహం కిం బ్రూమ ఇత్యాహుః-నిజేతి. ధ్వజాదీని విచిత్రాణి లలామాని చిహ్నాని యేషాం తైః. నిజాని పదాన్యేవాబ్జదళాని తైః. వ్రజ భువః ఖురతోదం ఖురాక్రమణ వ్యథాం శమయన్. వర్ష్మణా ధుర్యో గజస్తద్వద్గతిర్యస్య స కృష్ణః. వాదితవేణుస్సన్ వ్రజతీతి యత్. 16

టీ:- ధ్వజము మొదలగువాని విచిత్రములైన చిహ్నములు గలవానితో - తనపాదములే పద్మదళములుగ ఎవరికో - అట్టివానితో వ్రజ భూమియొక్క - ఖురతోదం - గిట్టల నడక వలన కలిగిన వ్యథను తొలగించుచు - వర్ష్మధుర్యః - శరీరముచేత బరువును మోయునది - ఏనుగు - దాని నడకవంటి నడకగల ఆ కృష్ణుడు వాయింపబడుచున్న వేణువుగలవాడై ఏ పోవుచుండుటగలదో-16

శ్లో॥ వ్రజతితేన వయం సవిలాస
ప్రేక్షణార్పిత మనోభవ వేగాః ।
కుజగతిం గమితానవిదామః
కశ్మలేన జవసనం కబరీం వా ॥17

తా. అతడు ఆ విధముగ పోవుచుండెను. దానిచేత మేము విలాసముగ మన్మథుని వేగముచేత అతనికి చూపులనర్పించిన వారమై, ముందుకు పోవు భావనతో వృక్షమువలె కదలకలేనివారమై, మోహముచేత, మా వస్త్రములను, కొప్పులను (అవి సడలి పోవుచున్నను) తెలిసికొనలేక పోవుచున్నాము. 17

టీ:- వ్రజతీతి. తేన నిమిత్తేన సవిలాసవీక్షణేనార్పితో మనోభవవేగో యాసు తాః. వయం కుజా వృక్షాస్తేషాం గతిం గమితాస్సత్యః మోహేన న విదామః కబరీం వా వసనం వేతి. 17

టీ:- ఆ కారణముచేత, విలాసముతో కూడిన చూపులనర్పించిన మన్మథవేగము గలవారమైన మేము వృక్షముల వేగమువంటి వేగము గలవారమై పోవుచు మోహముచే కొప్పును, కట్టు వస్త్రమును గమనింప లేకపోయితిమి. 17

శ్లో॥ మణిధరః క్వచిదాగణయన్ గా
మాలయాదయితగంధతులస్యాః ।
ప్రణయినోఽనుచరస్య యదాంసే
ప్రక్షిపన్ భుజమగాయత యత్ర ॥ 18

తా. మణులను ధరించినవాడు, తనకు ప్రియమైన పరిమళముగల తులసిమాలతో ఒకానొకప్పుడు ఆవులను లెక్కించుచు, తన అనుచరుడగు ఇష్టసఖుని గళమునందు తన భుజమునుఉంచి ఎచట పాడెనో- 18

టీ:- మణిధర ఇతి. కించ. మణిధరః. మణీన్ గ్రథితాన్ గోగణార్థం ధరతీతి మణిధరః క్వచిద్దేశే తైర్మణిభిరాసమంతాద్గాః గణయన్. తథా దయితగంధా యా తులసీ తస్యా మాలయా సహ వర్తమానః ప్రణయినః ప్రియస్యానుచరస్యాంసే భుజం ప్రక్షిపన్. 18

టీ:- మరియు-మణిధరః-ఒక్కచోగూర్పబడిన మణులు - ఆవుల సమూహమును లెక్కించుటకు గ్రథితములైన మణులను ధరించువాడు కావున మణిధరుడు, ఒకానొక ప్రదేశమున ఆ మణులచే అంతటను గల ఆవులను లెక్కించుచు-అట్లే ప్రియమైన పరిమళముగల ఏ తులసి గలదో దాని మాలతో కూడినవాడై వర్తించుచు తన ప్రియమైన అనుచరుని భుజముపై చేయివేసి-ఎప్పుడో ఒకప్పుడు పాట పాడెనో. **18**

శ్లో॥ క్వణితవేణురవ వంచిత చిత్తాః
కృష్ణమన్వసత కృష్ణగృహిణ్యః ।
గుణగణార్ణవమనుగమ్య హరిణ్యో
గోపికా ఇవ విముక్తగృహాశాః ॥ 19

తా. మ్రోగింపబడిన వేణునాదముచేత హరింపబడిన మనస్సులు గలవియై జింకల భార్యలగు ఆడజింకలు గుణసమూహముల సముద్రమగు కృష్ణుని వెంటపోయి గోపికలవలె ఇంటి ఆశను వదిలిపెట్టి కృష్ణునితోడనే వసించుచుండెను. అతనినే అనువర్తించు చుండెను. 19

టీ:- క్వణితేతి. తదా. క్వణితస్య వేణోః రవేణ. వంచితాన్యపహృతాని చిత్తాని యాసాం తాః కృష్ణస్య హరిణస్య గృహిణ్యో భార్యాః గుణ గణార్ణవం గుణ గణసముద్రం కృష్ణమనుగమ్య ప్రాప్య. తాః కృష్ణమేవాన్వసత అన్వాసత న. న్యవర్తంతేత్యర్థః. కుతః. యతో విముక్తా గృహాశాః యాభిస్తాః గోపికా ఇవ తా అపిహ్యేవమేనాన్వాసతేతి. 19

టీ:- ప్రోగింపబడిన (వాయింపబడిన) మురళీనాదముచేత అపహరింపబడిన చిత్తములు వేనికో అవి - కృష్ణస్య - హరిణము యొక్క పత్నులు-గుణగణముల సముద్రుని కృష్ణుని అనుగమ్య-పొంది- అవి కృష్ణుని వెంటనే ఉండెను. వెంటుండుటయేకాదు- అనువర్తించెనని యర్థము - ఎందువలన? ఎవరి (వేని)చేత గృహశలు విడువబడెనో- గోపికలవలె అనియును ఇతనిననువర్తించుచునే ఉండును. 19

శ్లో॥ కుందదామకృతకౌతుకవేషో
గోప గోధనవృతో యమునాయామ్ ।
నందసూనురనఘే తవ వత్సో
నర్మదః ప్రణయినాం విజహార ॥ 20

తా. ఓ పాపరహితవగు యశోదాదేవీ! మొల్లదండలతో సంరంభముగ నలంకరించు కొనినవాడును, గోపికలచేత, గోధనము చేతను ఆవరింపబడినవాడును అయిననందనందనుడు, నీ పుత్రుడగు కృష్ణుడు యమునా తీరమున, ప్రేయసీ జనములతో పరిహాసములాడుచు క్రీడించుచున్నవేళ.. 20

టీ:- తదేవం బృందావనప్రదేశేషు క్రీడిత్వా. సాయాహ్నే గోధనాని పరావృత్య. యయునాయాం క్రీడతస్తస్య సౌభాగ్యమనువర్ణయంతి- కుందేతి. గోపీనాముత్సవాయ. కుందదామభిః. కృతకౌతుకేనోత్సవేన వేషోఽలంకారో యేన సః. హే అనఘే యశోదే. తవ వత్సః పుత్రః నందసూనుః కృష్ణః. యద్వా. సహైవ బహ్వ్యః కథయంత్యః. కాశ్చిత్తవ వత్స ఇతి. కాశ్చిన్నందసూనురితి చాహుః. నర్మదః హర్షదస్సన్ యదా విజహార క్రీడతి స్మ. 20

టీ:- ఆ బృందావన ప్రదేశములందు క్రీడించి-సాయంకాలమున ఆవుల మందలను మళ్ళించి, ఉత్సవముతోడి అలంకారము చేసికొనిన వాడై-ఓ అనఘే! యశోదా! నీ పుత్రుడు-నందకుమారుడును అగు కృష్ణుడు-లేక-కలిసి అందఱును చెప్పుటచే కొందఱు నీ పుత్రుడు అని కొందఱు నందనందనుడని ఒకేమారు చెప్పుటచే (అటుల వినబడెను) సంతోషింపచేయువాడగుచు ఎప్పుడు క్రీడించెనో- 20

శ్లో॥ మందవాయురనువాత్యనుకూలం
మానయన్మలయజస్పర్శేన ।
వందిన స్తముపదేవగణా యే
వాద్యగీతబలిభిః పరివవ్రుః ॥ 21

టీ:- మందవాయురితి. తదా. మలయజస్య చందనస్యేవ సురభిః శీతలశ్చ. యః స్పర్శః. తేన తం కృష్ణం మానయన్ననుకూలం యథా తథా అనువాతి వీజయతి. యద్వా. మలయజో దక్షిణవాయుః. యద్వా- మలయజస్య కృష్ణేన స్వాంగేఽనులిప్తస్య. స్పర్శేన మానయన్నితి కించ. వందిన ఇవ స్తావకాస్సంతః. గంధర్వాదిగణ వాద్య గీతపుష్పవర్షాదిభిః పరివవ్రుః పరిత ఉపాసత. 21

తా. చందనస్పర్శతోకూడి మెలమెల్లగ అనుకూలమైన గాలివీచుచు అతనిని సమ్మానించెను. (లేక-అతనినిసన్మానించుచు చందన పరిమళ ముతో మందమారుతము వీచెను. గంధర్వాది దేవజాతులు అతనిని స్తోత్రము చేయుచున్నవారై, వాద్యములు వాయించుచు, గీతములను పాడుచు, నివేదనలనుసమర్పించుచు ఉపాసించిరి. 21

టీ:- అప్పుడు - మలయపర్వతమున పుట్టిన చందనముయొక్క పరిమళము, చల్లదనముల ఏ స్పర్శకలదో దానిచేత ఆ కృష్ణుని సమ్మానించుచు ఎట్లు అనుకూలమో అట్లు గాలివీచుచున్నది, లేక- మలయజః-దక్షిణపుగాలి-లేక-మలయజస్య-తన శరీరమునకు లేపనము చేసుకొనిన చందనముయొక్క స్పర్శచేత అతనిని గౌరవించుచు మరియు-వందిమాగధుల వలె స్తోత్రము చేయుచు గంధర్వులు మొదలగాగల దేవతా సమూహములు, వాద్యములు, గీతములు, పుష్పవర్షములు మున్నగువానితో-పరివవ్రుః-చుట్టును ఉపాసించిరి. 21

శ్లో॥ వత్సలో వ్రజగవాం యదగధ్రోవంద్యమానచరణః పథి వృద్ధైః ।
కృత్స్నగోధనముపోహ్య దినాంతే గీతవేణురనుగేడితకీర్తిః ॥22

తా. వ్రజమునందలి ఆవులపై మిక్కుటమగు ప్రేమగలవాడును, (ఆ కారణముగ) గోవర్ధనగిరినెత్తినవాడును అయిన కృష్ణుడు, దారిలో బ్రహ్మాదులచేత నమస్కరింపబడిన పాదములుగలవాడై, అశేషమగు గోవులను సమీకరించి, సాయంకాల సమయమున వేణువును పాడుచు,

అనుచరులగు గోపాలురచేత స్తుతింపబడుచున్న కీర్తికలవాడగుచు (వచ్చుచున్నాడు). 22

టీ:- ఆయాంతమాలోక్య హృష్యంత్యః పరస్పరమూచుః. వత్సల ఇతి. వ్రజస్య గవాం చ. యద్వా. వ్రజే నిబద్ధానాం గవాం. అనుకంప్యానామస్మాకమిత్యర్థః. వత్సలో హితకృత్ కుతః యద్యస్మాత్. అగధ్రః అగం ధరతీతి గోవర్ధనోద్ధరణః బహుశో రక్షణస్యోపలక్షణమేతత్. వృద్ధైః బ్రహ్మాదిభిః. పథి సేర్వ్యం శీఘ్రమాగంతుం న దదతీతి. ఉపోహ్య ఏకీకృత్య గీత యుక్తో వేణుర్యస్య సః. 22

టీ:- వచ్చుచున్న శ్రీకృష్ణునిచూచి - సంతోషించుచు - పరస్పరము సంభాషించుకొనిరి. 'వత్సలః' అని. వ్రజముయొక్క ఆవులకు - లేక- వ్రజమునందు కట్టివేయబడియున్న ఆవులను-ప్రేమింపదగిన మన ఆవులనుఅని యర్థము. వత్సలుడు-హితము చేయువాడు-ఎందులకు? ఎందువలననగా-అగధ్రః-అగమును (పర్వతమును) ధరించువాడు- గోవర్ధనగిరినెత్తినవాడు-ఇది రక్షణ సమయమున-వృద్ధైః-బ్రహ్మ మొదలగువారిచేత పథి-మార్గమున-పాదాభివందన చేయబడుచు- సహసములేనివాడై, త్వరగావచ్చుటకు (వ్రజమునకు) బ్రహ్మాదులు ఇచ్చగింపరని వితర్కించుకొని - ఒక నిశ్చయముచేసికొని - మురళీ గానమును విడిచినవాడై - లేక వేణుగాన యుక్తుడై. 22

శ్లో॥ ఉత్సవం శ్రమరుచాపి దృశీనా
మున్నయన్ ఖుర రజశ్ఛురిత సక్ ।
దిత్సయైతిసుహృదాశిష ఏష
దేవకీ జఠర భూరుడురాజః ॥ 23

తా. శ్రమతో నున్నను కాంతితోకూడిన కన్నులలో హర్షమును పైకి కనబరుచుచు, పశువుల గిట్టలవలన ఎగసిపడిన ధూళినిండిన పూలదండలతో, స్నేహితులమైన మనకు అభీష్టములిచ్చు కోరికతో, దేవకీగర్భమున పుట్టినవాడు, చంద్రుడును అగు కృష్ణుడు వచ్చుచున్నాడు. 23

టీ:- ఉత్సవమితి. శ్రమయుక్తయాపి కాంత్యా. నేత్రాణాం హర్ష మున్నయన్ ఉచ్చైః ప్రాపయన్. ఖుర రజోభిశ్చురితా వ్యాప్తాః స్రజోయస్య. సుహృదామస్మాకం. అశిషో మనోరథస్య. దిత్సయా దాతుమిచ్ఛయా. దేవక్యా జఠరే భవతీతి తథా స ఏవ ఉడురాజశ్చంద్రః నిర్వృతి హేతుత్వేన స ఏష్యతీతి. 23

టీ:- శ్రమతో కూడియున్నను, కాంతితో, కన్నులకు హర్షం- సంతోష మును - ఉన్నయన్ - పైకి ప్రాప్తించుచు - గిట్టల ధూళిచే వ్యాప్తములై యున్న పూలదండలు ఎవనికో - సుహృదాం - స్నేహితులమైన మనకు- ఆశిషః - మనోరథముయొక్క - దిత్సయా - ఇచ్చు కోరికతో - దేవకీగర్భమున పుట్టిన వాడు,ఉడురాజః-చంద్రుడు నిర్వృత్తిహేతువు కొఱకు అతడే వచ్చుచున్నాడు, అని. 23

శ్లో॥ మదవిఘూర్ణితలోచన ఈష
న్మానదస్స్వసుహృదాం వనమాలీ ।
బదరపాండువదనో మృదుగండం
మండయన్ కనకకుండలలక్ష్మ్యా ॥ 24

తా. ఇంచుక మదముచే (సంతోషముచే) కూరుకుపాటు పడుచున్న ట్లున్న కన్నులుగల వాడును, తన స్నేహితులకు గౌరవమిచ్చు వాడును, వనమాలధరించి యున్నవాడును, రేగుపండువలె పసుపు, తెలుపు కలిసియున్నట్లున్న వన్నెగలవాడును - అట్టి వన్నెగల ముఖము గల వాడును, కోమలమైన చెక్కిళ్ళు గలవాడును, బంగారు కుండలముల శోభతో ప్రకాశించు మృదువైన చెక్కిళ్ళుగల వాడును అయిన... 24

టీ:- అతిసంభ్రమేణ కాశ్చిత్సమీపమాయాంతం కథయతి - మదేతి. ఈషన్మదేన విఘూర్ణితే విహ్వలితే లోచనే యస్య సః. బదర పాండువదనః ఈషత్పక్వబదరవత్పాండురం వదనం యస్య సః. అత్ర హేతుః. కనక కుండలయోర్లక్ష్మ్యా కాంత్యా. మృదూకోమలౌ గండౌ. యస్మిన్ తద్వదనం. మండయన్ కోమలం గండస్థలం వా శోభయన్నితి. 24

టీ:- అతిసంభ్రమముతో నించుక సమీపమునకు వచ్చిన వానిని గూర్చి చెప్పుచున్నారు. కొంచెము మదముచే విహ్వలమగుచున్న కన్నులు ఎవనికోవాడు, బదరపాండురవదనః - ఇంచుక పండిన రేగుపండువలె పసుపు తెలుపు కలిసిన వన్నెగల మోముగలవాడు - ఇట కారణము- బంగారు కుండలముల శోభచేత కోమలములైన చెక్కిళ్లుగలవాడు - వాని యందు అతని వదనము శోభించుచు చెక్కిళ్ళను శోభింపజేయు చున్నది అని. 24

శ్లో॥ యదుపతిర్ద్విరద రాజ విహారో
యామినీ పతిరివైష దినాంతే ।
ముదిత వక్త్ర ఉపయాతి దురంతం
మోచయన్ వ్రజగవాం దినతాపమ్ ॥ 25

తా. శ్రీకృష్ణుడు గజరాజువలె విహరించువాడు. సంధ్యాకాలము నందలి చంద్రునివలె ప్రకాశించువాడు. వ్రజమునందలి ఆవులను బాధించు వేడిమిని తొలగించుచు - భరింపరాని తాపము నుండి వానిని ముక్తముచేయుచు, హర్షవదనుడై వచ్చును. 25

టీ:- యదుపతిరితి. యదుపతిరితి దేవకీ జఠర భూరితిచ . శ్లో. 'ప్రాగయం వసుదేవస్య క్వచిద్ జ్ఞాతస్తవాత్మజ' ఇత్యాది గర్గవాక్య ప్రసిద్ధ్యోక్తం. యద్వా. శ్లో. 'సఖ ఉదేయివాన్సాత్త్వంతాం కుల' ఇతివత్. జ్ఞాత్వా కాశ్చిద్వదంతీతి. గజేంద్రస్యేవ గతిః. చంద్ర ఇవ ప్రసన్నవదనః. వ్రజగవామస్మాకమనంతం దిన తాపం చ శమయన్ ప్రణుదన్నుపయాతి ఏష సమీపమాయాతీతి. 25

టీ:- యదువంశీయుల పతియని, దేవకీ గర్భసంభవుడు అనియు- "మొదట నీ కొడుకు ఒకప్పుడు వసుదేవుని కుమారుడుగ తెలియబడెను' అను మొదలుగ గర్గుని వాక్యముగ ప్రసిద్ధముగ చెప్పబడినది. లేక సఖా! సాత్వతుల కులమున అవతరించెను" అను విధమున కొందఱు చెప్పుదురు. అని గజేంద్రుని వంటి నడక - చంద్రునివంటి ప్రసన్నమైన ముఖము కలిగియున్నవాడై, వ్రజమునందలి ఆవులకుకలుగు దుర్భరమైన దిన తాపమును శమింపజేయుచు సమీపమునకు వచ్చును. (25)

శ్రీశుక ఉవాచ

శ్లో॥ ఏవం వ్రజ స్త్రియో రాజన్ కృష్ణలీలానుగాయతీః ।
రేమిరేఽహస్సు తచ్చిత్తాస్తన్మనస్కా మహోదయాః ॥ 26

శ్రీశుకుడిట్లనెను.

తా. పరీక్షిత్! ఈ విధముగ వ్రజస్త్రీలు కృష్ణలీలలను పాడుచు, అదే చిత్తముగలవారై, అదే మనస్సుగలవారై, మహోత్సాహముగలవారై పగళ్ళయందును క్రీడించిరి. 26

టీ:- ఏవమితి ఏవం విరహ దుఃఖేనాపి. ను అహో. కృష్ణలీలా ఏవ గాయతీః గాయంత్యః. తస్మిన్ చిత్తం చేతనా జీవితం యాసాం తాః. తస్మిన్నేవ మనస్సంకల్ప వికల్పరూపం యాసాం తాః. అత ఏవ మహానుదయః ఉత్సవో యాసాం తాః. అహస్స్వపి రేమిరే. 26

శ్రీ మద్భాగవతే, మహాపురాణే దశమస్కంధే,

పంచత్రింశోఽధ్యాయః

టీ:- ఈ విధముగ విరహదుఃఖముతోను అహో! కృష్ణుని లీలనే పాడుచున్నవారై, దానియందే చిత్తము, జీవితము గలవారై - దానియందే మనస్సంకల్ప వికల్ప, అందువలననే మహోత్సాహముగల వారై, పగళ్ళ యందును క్రీడించిరి. 26

అని శ్రీమద్భాగవతమున దశమస్కంధమందు

ముప్పది ఐదవ అధ్యాయము సమాప్తము.

## షట్త్రింశోఽధ్యాయః

### వృషభాసుర వధఘట్టః

**శ్రీశుక ఉవాచ**

శ్లో॥ అథతర్హ్యాగతో గోష్ఠమరిష్టో వృషభాసురః ।
మహీం మహాకకుత్కాయః కంపయన్ ఖురవిక్షతామ్ ॥ 1

టీ:- శ్లో.“షట్త్రింశే నిహతేఽరిష్టే నారదోక్త్యా బలాచ్యుతౌ,వసుదేవ సుతౌ జ్ఞాత్వా కంసోఽక్రూరం సమాదిశత్. గోపీరాసాంతరాయాంతం శంఖచూడం నిహత్య సః, అహన్ గోపీమహానందాసహం దుష్ట మరిష్టకం. అథేతి. ఏవం దేవగంధర్వాదేర్నృత్యగీతవాద్య కుసుమ వర్షాదిభిః. కృష్ణం ప్రాప్తం దృష్ట్వా వ్రజస్య పరమోత్సవే వర్తమానే. తద్విరుద్ధార్థాంత రాధికారార్థం. అథ శబ్దః తర్హి తథా. వృషభాకృతిరసురః తం వర్ణయతి - మహీమిత్యాది. సార్ధత్రయేణ. మహాంతౌ కకుత్ కాయౌ యస్య సః. ఖురైః విక్షతాం దారితాం. మహీం కంపయన్. 1

## 36వ అధ్యాయము

**శ్రీశుకుడిట్లనెను.**

తా. అటు పిమ్మట-అప్పుడు వ్రజమునకు వృషభుడు అను దుష్ట రాక్షసుడు - పెద్దమూపురము వంటి శరీరము గలవాడు, తన గొరిసెలతో నేలను ఛేదించుచు-వచ్చెను. వణికించుచు వచ్చెను. 1

టీ:- ఈ ముప్పదియాఱవ అధ్యాయమున, బలరామకృష్ణులు శంఖచూడుని చంపుటను, వారు వసుదేవుని కుమారులని, నారదుని వాక్యముచేత కంసుడు తెలిసికొని, అక్రూరుని ఆదేశించి వారివద్దకు పంపుట వర్ణింపబడుచున్నది.. గోపికల రాసక్రీడ సమయమున వచ్చిన శంఖచూడుని చంపి, కృష్ణుడు, గోపీజనమహానందమును సహింపని దుష్టుడగు అరిష్టుని కూడ వధించెను-ఈ విధముగ దేవతలు, గంధర్వులు మున్నగువారి నృత్యములు, గీతములు, వాద్యములు, పుష్పవర్షములు మున్నగు వానిచేత కృష్ణుని ప్రాప్తించుటచూచి - వ్రజము నందలి మహోత్సవమున సంరంభము జరుగుచుండగా - దానికి విరుద్ధముగ - మఱియొక ప్రయోజనమునందలి అధికారము కొఱకు అథ శబ్దము - తర్హి - అప్పుడు - వృషభాకారముననున్న రాక్షసుడు - అతనిని వర్ణించుచున్నాడు. మూడున్నరశ్లోకములతో- గొప్పనైన మూపురము వంటి శరీరము ఎవనికో - వాడట్లుచెప్పబడెను, గొరిసెలచేత ఛేదింపబడు భూమిని వణికించుచు- 1

శ్లో॥ రంభమాణః ఖరతరం పదాభ్యాం విలిఖన్మహీమ్ ।
ఉద్యమ్య పుచ్ఛం వప్రాణి విషాణాగ్రేణ చోత్ క్షిపన్ ॥ 2

టీ:- రంభమాణ ఇతి. రంభమాణః వృషభజాతి శబ్దం కుర్వన్ విలిఖన్ విదారయన్. ఉద్యమ్య ఊర్ధ్వం కృత్వా వప్రాణి తటాని. ఉత్ క్షిపన్. 2

శ్లో॥ కించిత్కించిచ్ఛకృన్మూత్రముత్సృజం స్తబ్ధలోచనః ।
యస్య నిర్హ్రాదితేనాంగం నిష్ఠురేణ గవాం నృణామ్ ॥ 3

టీ:- కించిదితి. కించిత్కించిత్, శకృత్. మధ్యే మధ్యే ఈషదీషత్పు రీషం ముంచన్. తథా మూత్రముత్సృజన్. స్తబ్ధలోచనః. 3

శ్లో॥ పతంత్యకాలతో గర్భాస్స్రవంతి స్మభయేన వై ।
నిర్విశంతి ఘనా యస్య కకుద్యచల శంకయా ॥ 4

తా. ఇంద్రియములను క్షోభపెట్టుటకన్న మించిన ధ్వనితో అంకె వేయుచు, పాదములతో నేలను ద్రవ్వుచు, తోకను పైకెత్తి, తటములను కొమ్ముల కొనలతో పైకి ఎగద్రోయుచు-2

టీ:- రంభమాణః - వృషభజాతి శబ్దము చేయుచు-(అంకెవేయుచు) విలిఖన్ - చీల్చుచు - ఉద్యమ్య - పైకెత్తి - వప్రాణి - తటములను- ఉత్క్షిపన్ - త్రోయుచు. 2

తా. కొంచెము కొంచెముగా పేడ, మూత్రము వదులుచు, బిరుసైన చూపులుకలవారై, ఎవ్వని నోరు-శరీరము, పరుషమైన ధ్వనిచేయుట చేత, ఆవులయొక్కయు, మనుష్య స్త్రీల యొక్కయు-3

టీ:- కొంచెము కొంచెముగా పేడను-మధ్యమధ్య కొంచెకొంచెముగా మూత్రమును వదలుచు-బిరుసైన చూపులు గలవాడై-3

తా. భయవశమున అకాలముగా గర్భస్థపిండములు పతనమగుచు (నాలుగు నెలలలోపున నుండు పిండములు స్రవించి పోవుచును, ఐదు ఆరు నెలల పిండములు పడిపోవుటయు, ఆ పైననుండు గర్భములు ప్రసవముద్వారా బయటకు వచ్చుటననియు విభాగము)

స్రవించి పోవుచును ఉండెను. అతని మూపురము పర్వతమేమో అను శంకతో మేఘములు దానిపై ప్రవేశించుచుండెను. 4

శ్లో॥ తంతీక్ష్ణశృంగముద్వీక్ష్య గోప్యో గోపాశ్చ తత్రసుః ।
పశవో దుద్రువూ రాజన్ సంత్యజ్య నిజగోకులమ్ ॥ 5

తా. రాజా! హింసింపగల కొమ్ము(లు)న్న అతనిని చూచి గోపికలు, గోపాలురు భయపడిరి. పశువులు తమ గోకులమును విడిచి పరుగుతీసెను. 5

టీ:- పతంతీతి. యస్య ధ్వనీనాకర్ణ్య.గవాం నారీణాం చ తత్ర. శ్లో. ఆచతుర్థాద్భవేత్స్రావః పాతః పంచమషష్ఠయోః, అత ఊర్ధ్వం ప్రసూతిస్స్యాదితి విభాగః. కకుది గళ పృష్ఠశృంగే. (4-5)

టీ:- ఎవని ధ్వనులు విని ఆవులయొక్క స్త్రీలయొక్కయు గర్భములు పడిపోవుచుండెనో-కరుది-మెడవెనుక భాగమున గల కొమ్మువంటి మూపురమునందు-(మేఘములు ప్రవేశించుచుండెను). (4-5)

శ్లో॥ కృష్ణ కృష్ణేతి తే సర్వే గోవిందం శరణం యయుః ।
భగవానథ తద్వీక్ష్య గోకులం భయవిహ్వలమ్ ॥ 6

తా. వారందఱును కృష్ణా! కృష్ణా! అని కృష్ణుని శరణుపొందిరి. భగవానుడును, భయముతో విహ్వలించి పోయిన గోకులమును చూచి. (6)

శ్లో॥ మాభైష్టేతి గిరాశ్వాస్య వృషాసురముపాహ్వయత్ ।
స బాలైః పశుభిర్మందత్రాసితైః కిమసత్తమ ॥ 7

తా. "భయపడకుడు" అను వాక్యముతో వారిని ఓదార్చి, వృషాసురుని బిగ్గరగా సమీపమునకు పిలిచి "ఓరీ మూర్ఖుడా ! దుర్మార్గుడా! బాలురతో, పశువులతో, భయపడినవారితో నీకేమి పని? బాలురను, పశువులను ఎందుకు భయపెట్టుచున్నావు? అని. 7

టీ:- కృష్ణేతి. కృష్ణ కృష్ణ రక్షేత్యాధావంతః. (6-7)

టీ:- "కృష్ణా! కృష్ణా! రక్షింపుము" అని కేకలు వేయుచు పరుగెత్తుకొని వచ్చిన వారైరి. (6-7)

శ్లో॥ బలదర్పహాహం దుష్టానాం త్వద్విధానాం దురాత్మనామ్ ।
ఇత్యాస్ఫోట్యాచ్యుతోఽరిష్టం తలశబ్దేన కోపయన్ ।
సఖ్యురంసే భుజాభోగం ప్రసార్యావస్థితో హరిః ॥ 8

తా. నీవంటి దుష్టులయొక్కయు, దురాత్ములయొక్కయు బల గర్వమును హరించు వాడను నేను. అని అరచేతితో తన బాహువును చఱచి కోపించుచు కృష్ణుడు ఆ రాక్షసుని బెదరించుచు. స్నేహితుని మూపున తన 'చేతిపడగ' ను ప్రసరించి, కృష్ణుడు అతని యుద్ధసన్నద్ధుని చేసెను. 8

టీ:- బలేతి. ఇత్యేవం వదన్. ఆస్ఫోట్యకర తలేన బాహుమాహత్య తేన తలశబ్దేన కోపయన్ భుజాభోగం భుజా భుజః సైవ భోగః సర్పదేహకారం భుజమిత్యర్థః. స్వయమచ్యుతః అన్యాన్ దుష్టాన్ హరతీతి హరిః. 8

టీ:- భుజాభోగం-భుజమేపడగ-సర్పదేహాకారము గల భుజము అని యర్థము. కృష్ణుడు స్వయముగా ఇతర దుష్టులను హరించును కావున 'హరి' 8

శ్లో॥ సోఽప్యేవం కుపితోఽరిష్టః ఖురేణావనిముల్లిఖన్ ।
ఉద్యత్పుచ్ఛ భ్రమన్మేఘః క్రుద్ధః కృష్ణముపాద్రవత్ ॥ 9

తా. ఆ రాక్షసుడు ఈ విధముగ కుపితుడై, తన గిట్టలతో నేలను దున్నుచు, తోకను లేవనెత్తి, మేఘమా అనెడి భ్రమగొల్పుచు, మిక్కిలి కోపించినవాడై కృష్ణునివైపు పరుగిడెను. 9

టీ:- స ఇతి. ఉద్యతా ఊర్ధ్వం గచ్ఛతా పుచ్ఛేన భ్రమంతో మేఘా యస్మాత్సః. 9

టీ:- ఉద్యతా - పైకిలేచుచున్న - పుచ్ఛేన - తోకతో - ఎవనినుండి మేఘములు తిరుగుచున్నవో అతడు-9

శ్లో॥ అగ్రన్యస్త విషాణాగ్రస్తబ్ధాసృగ్లోచనోఽచ్యుతమ్ ।
జటాక్షిప్యాద్రవత్తూర్ణమింద్ర ముక్తాశనిర్యథా ॥ 10

టీ:- అగ్రన్యస్తేతి. అగ్రేన్యస్తే విషాణాగ్రే యేన సః. స్తబ్ధే అసృక్తుల్యే లోచనే యస్య సః. కటాక్షేణ తిర్యక్ నిరీక్ష్య. 10

తా. కొమ్ముల కొనలు ముందుకు ఉంచి, బిరుసైన ఎఱ్ఱని కన్నులు గలవాడై, జూలు జడలను సాచి, వేగముగ ఇంద్రునిచేత విడువబడిన వజ్రాయుధమువలె ఆ రాక్షసుడు, కృష్ణునిపైకి ఉరికెను. 10

టీ:- ముందునకు ఉంచబడిన కొమ్మలకొనలు ఎవరికోవాడు-బిరుసైన, రక్తమువలె ఎఱ్ఱనైనవి అయిన కన్నులు ఎవనికోవాడు-కొస చూపులను అడ్డముగా చూచుచు. 10

శ్లో॥ గృహిత్వా శృంగయోస్తం వా అష్టాదశపదాని సః ।
ప్రత్యపోవాహ భగవాన్ గజః ప్రతిగజం యథా ॥ 11

టీ:- గృహిత్వేతి. ప్రత్యపోవాహ ప్రతిలోమం వ్యనుదత్. 11

తా. కృష్ణుడు, తనచేతులతో దాని రెండు కొమ్ములను పట్టుకొని, పదునెనిమిది అడుగుల వఱకు దాదాపుగ వెనుకకు నెట్టి - ఒక ఏనుగు తన శత్రువైన ఏనుగువలె - పడగొట్టెను. 11

టీ:- ప్రత్యపోవాహ - వెనుకకు త్రిప్పి పడగొట్టెను. 11

శ్లో॥ సోఽపవిద్ధో భగవతా పునరుత్థాయ సత్వరమ్ ।
ఆపతత్స్విన్న సర్వాంగో నిశ్శ్వసన్ క్రోధమూర్ఛితః ॥ 12

టీ:- స ఇతి. అపవిద్ధః అపక్షిప్తః ఆపతత్ ఆద్రవత్. ఆ ఈషత్. స్విన్నాని స్వేదయుక్తాని సర్వాణి అంగాని యస్య సః. క్రోధమూర్ఛితః క్రోధేన వ్యాప్తః. 12

తా. కృష్ణునిచేత ప్రతిలోమముగ త్రోయబడిన ఆరాక్షసుడు తొందరగా లేచి, చెమటతో తడిసిన సర్వాంగములు గలవాడై, క్రోధము నిండినవాడై, నిశ్వాశసము చేయుచు కృష్ణుని పైకి ఉరికెను. 12

టీ:- అపవిద్ధః - తలక్రిందులుగ పడగొట్టబడినవాడై - ఆపతత్-పైకి ఉరికెను-ఆ-కొంచెము స్విన్నాని-చెమటతో తడిసిన-సర్వాంగములు ఎవనికోవాడు-క్రోధముతో వ్యాప్తి చెందినవాడై-12

శ్లో॥ తమాపతంతం స నిగృహ్య శృంగయోః
పదాసమాక్రమ్య నిపాత్య భూతలే ।
నిష్పీడయామాస యథార్ద్రమంబరం
కృత్వా విషాణేన జఘానసోఽపతత్ ॥13

తా. పైన పడుటకు పరుగున వచ్చుచున్న ఆ రాక్షసుని కొమ్ములతో పట్టుకొని, కాళ్ళతో ఆక్రమించి నేలమీదనే అతనిని తడిబట్టనుగాచేసి పిండివేసెను. ఆతని కొమ్మునే పెరికి దానితోనే అతనిని చంపెను. ఆతడు పడిపోయెను. 13

టీ:- తమితి. కృత్వా విషాణముత్పాట్యతేనైన జఘానస చ అపతత్. (13)

టీ:- అతని కొమ్మును శరీరమునుండి పెకలించి దానితోడనే పొడిచెను - ఆ రాక్షసుడు మరణించి పడిపోయెను. 13

శ్లో॥ అసృగ్వమన్ మూత్రశకృత్సముత్సృజన్
క్షిపంశ్చ పాదాననవస్థితేక్షణః ।
జగామ కృచ్ఛ్రం నిరృతేరథ క్షయం
పుష్పైః కిరంతో హరిమీడిరే సురాః ॥ 14

తా. నెత్తురుగ్రక్కుచు, మూత్రపురీషములు వదులుచు, పాదములు త్రోయబడి, అస్తవ్యస్తములైన చూపులు గలవాడై, కష్టముగా మృత్యు స్థానమునకు బోయెను. దేవతలు కృష్ణుని స్తుతించుచు పుష్ప వర్షము కురిపించిరి. 14

టీ:- అసృగితి. మూత్రశకృత్. మూత్రం చ శకృచ్చ ఏకవద్భావః. తదుభయం సముత్సృజన్నిత్యర్థః. పాదాన్ క్షిపన్ ఇతస్తతశ్చాలయన్. అనవస్థితేక్షణః ప్రచలితనేత్రః. కృచ్ఛ్రంకష్టం జగామ. అథ నిరృతేః మృత్యోః క్షయం నివాసం జగామ కృచ్ఛ్రం యథా భవతి తథా మృత ఇతి వా. 14

టీ:- మూత్రశకృత్-మూత్రము, పేడ, ఏకవద్భావము-ఆ రెంటిని విసర్జించుచు అని యర్థము - పాదాన్క్షిపన్ - కాళ్ళను ఇటునటు కొట్టుకొనుచు - అవస్థితేక్షణః - విశేషచలనముతోడి కన్నులు గలవాడై, కృచ్ఛ్రం - కష్టమును - పొందెను- అటుపై - నిరృతేః - మృత్యువు యొక్క - క్షయం - నివాసము - జగామ - పొందెను. - (పోయెను)- కష్టము ఎట్టుల గునో అటుల - లేక అటుల మరణించెను అని. 14

(నారదమహర్షి బోధితేన కంసేన
శ్రీకృష్ణ బలరామాహ్వానాయాక్రూరప్రేషణాదిఘట్టః)

శ్లో॥ ఏవం కకుద్మినం హత్వాస్తూయమానస్స్వజాతిభిః ।
వివేశ గోష్ఠం సబలో గోపీనాం నయనోత్సవః ॥ 15

తా. ఈ విధముగ వృషభరూపముననున్న అరిష్టాసురుని సంహరించి దేవతలతోను, వ్రజవాసులతోను స్తుతింపబడుచు, గోపికలకు నేత్రోత్సాహము కలిగించు కృష్ణుడు, బలరామునితో కూడ గోష్ఠమును ప్రవేశించెను. 15

టీ:- ఏవమితి. నయనోత్సవః నయనానాం మూర్తిమానుత్సవః. 15

టీ:- నయనోత్సవః - కన్నులకు మూర్తీభవించిన ఉత్సవము. 15

శ్లో॥ అరిష్టే నిహతేగోష్ఠే కృష్ణేనాద్భుత కర్మణా ।
కంసాయ ప్రాహ భగవాన్నారదో దేవదర్శనః ॥ 16

తా. ఆశ్చర్యము కలిగించునట్టి కర్మలుచేయు కృష్ణునిచేత గోష్ఠమునందు అరిష్టాసురుడు చంపబడగా, భగవానుడును దేవ దర్శనుడును (దేవునిగా కన్పట్టువాడు - లేక - దేవునిదర్శింపజేయువాడు) అయిన నారదుడు కంసునితో ఇట్లు చెప్పెను. 16

టీ:- శ్లో. కామం వ్రజే వసంతం తం కృష్ణం తేన తు విస్మృతం, నారదః స్మారయమాస కంసం దూతగిరేవ తు. శ్రీధరీయోఽయం శ్లోకః. తదాహ - అరిష్ట ఇతి. దేవదర్శనః దేవర్షిః. యద్వా - ఏవంకృతే భవిష్యతీతి సాక్షాద్దేవదర్శనం జ్ఞానం యస్య సః. 16

టీ:- "వ్రజమునందు నివసించుచున్న మన్మథుని వంటి కృష్ణుని- కంసునిచే మఱచిపోబడినవానిని, నారదుడు కంసునకు దూత వాక్యమువలె జ్ఞాపకము చేసెను". (ఇది శ్రీధరీయశ్లోకభావము)-దేవదర్శనః-దేవర్షి-లేక ఇట్లు కృతయుగమునందలివాడు కావున సాక్షాత్తుగ దేవదర్శనమే- దైవసంబంధజ్ఞానము ఎవరికి కలదో అట్టివాడు. 16

శ్లో॥ యశోదాయాస్సుతాం కన్యాం దేవక్యాః కృష్ణమేవ చ ।
రామం చ రోహిణీ పుత్రం వసుదేవేన బిభ్యతా ।
న్యస్తౌ స్వమిత్రే నందే వై యాభ్యాం తే పురుషా హతాః ॥ 17

తా. "నీ(కంసుని) భయమువలన వసుదేవుడు దేవకి సంతానమైన కృష్ణుని, రోహిణి పుత్రుడైన బలరాముని తన మిత్రుడగు నందుని వద్ద నుంచెను. వారి చేతనే నీ రాక్షసయోధులు చంపబడిరి. ఇక నీవు యశోద కుమార్తెయగు కన్యను, దేవకి యొక్క అష్టమ సంతానముగ భ్రమించితివి". 17.

టీ:- ఆప్తేనైవ నారదేనోక్తమాహ - యశోదాయా ఇతి. దేవక్యా అష్టమ గర్భత్వేన ప్రసిద్ధాం కన్యాం.యశోదాయాః సుతమాహ - యశోదాయాః సుతత్వేన ప్రసిద్ధం కృష్ణంచ. దేవక్యాః సుతమాహ రోహిణీపుత్రం రామం చ, దేవక్యాః సప్తమం సుతమాహ - యద్వా. నందసుతత్వేన ప్రసిద్ధం రామం చ. వసుదేవ భార్యాయాః రోహిణ్యాః పుత్రమాహ - వసుదేవసుతౌ చేత్కథం వ్రజం గతౌ తత్రాహ - వసుదేవనేతి. 17

టీ:- ఆప్తుడేయగు నందునిచే చెప్పబడినది చెప్పుచున్నాడు. దేవకి యొక్క అష్టమగర్భమున ప్రసిద్ధమైన కన్యను యశోదయొక్క కుమారుడు అని చెప్పుచున్నాడు - యశోదయొక్క కొడుకుగా ప్రసిద్ధుడైన కృష్ణుని - కూడ- దేవకి యొక్క కుమారుడు అని చెప్పుచున్నాడు. రోహిణీ పుత్రుడైన బలరాముని దేవకి యొక్క ఏడవ సంతానముగ చెప్పుచున్నాడు - లేక-నందుని కుమారుడుగ ప్రసిద్ధుడైన బలరాముని వసుదేవుని భార్యయగు రోహిణీ పుత్రుడని చెప్పుచున్నాడు. వసుదేవుని పుత్రులైనచో వ్రజమునకెట్లు పోయిరి? ఇట చెప్పినాడు. 17

శ్లో॥ నిశమ్య తద్భోజపతిః కోపాత్ప్రచలితేంద్రియః ।
నిశాతమసిమాదత్త వసుదేవ జిఘ్నాంసయా ॥ 18

తా. నారదుని ఈ మాటలు విని కంసుడు కోపముతో ఇంద్రియము లన్నియు చలించినవాడయ్యెను. వసుదేవుని చంపుటకై ఒక వాడియైన ఖడ్గము లేవనెత్తెను. 18

టీ:- నిశమ్యేతి. తత్. నారదోక్తం వాక్యం నిశాంతం తీక్షణం అసిం చంద్రహాసం. 18

టీ:- నిశాతం - తీక్షణమైన - అసిం - చంద్రహాసమును - తత్- నారదుడు చెప్పినదానిని (విని) 18

శ్లో॥ నివారితో నారదేన తత్సుతౌ మృత్యుమాత్మనః ।
జ్ఞాత్వా లోహమయైః పాశైర్బబంధ సహ భార్యయా ॥ 19

తా. నారదుడు అతనిని నివారించెను. తన మృత్యువునకు కారణము వారి కుమారులే కాని వారుకాదుకదా అని తెలసికొని కంసుడు, వసుదేవుని అతని భార్యతోకూడ ఇనుప త్రాళ్లతో బంధించెను. 19

శ్లో॥ ప్రతియాతే తు దేవర్షౌ కంస ఆహూయ కేశినమ్ ।
ప్రేషయామాస భవతా హన్యేతాం రామమాధవౌ ॥ 20

తా. దేవర్షియైన నారదుడు వెడలిపోయిన పిదప కంసుడు కేశి అనువానిని పిలిపించి, "నీవు బలరామకృష్ణులనిరువురిని వధింపుము" అని ఆజ్ఞాపించి పంపెను. 20

శ్లో॥ తతో ముష్టిక చాణూరశలతో సలకాదికాన్ ।
ఆమాత్యాన్ హస్తిపాంశ్చైవ సమాహూయాహ భోజరాట్ ॥21

తా. అప్పుడు కంసుడు-ముష్టితుడు,చాణూరుడు,శలుడు, తోసలుడు మున్నగు మల్లులను, మంత్రులను మావటి వాండ్రను రావించి. 21

శ్లో॥ భో భో నిశమ్యతామేతద్వీరచారుణముష్టిక ।
నందవ్రజే కిలాసాతే సుతావానక దుందుభేః ॥ 22

తా. "వీరవరులారా! చాణూరా! ముష్టికా! వసుదేవుని కుమారులిరువురు నందవ్రజమున నున్నారట!" 22

టీ:- నివారిత ఇతి.హతే వసుదేవేతౌ. పలాయేతాం. అతోన వధ్యతామపి తు బధ్యతామితి మంత్రంవదతా నారదేన నివారిత ఇతి. (19-22)

టీ:- వసుదేవుడు హతుడైనచో వారిరువురు పారిపోయెదరు - అందువలన అతనిని చంపవలదు. అయినను బంధింపవలయునని(అది చాలునని) మంత్రము చెప్పిన నారదునిచే నివారింపబడెను అని. (19-22)

శ్లో॥ రామకృష్ణౌ తతో మహ్యం మృత్యూకిల నిదర్శితౌ ।
భవద్భ్యామిహ సంప్రాప్తౌహన్యేతాం మల్లలీలయా ॥ 23

టీ:- రామకృష్ణావితి. మహ్యంమమ. నిదర్శితౌ. ధాత్రా నారదేన వా. వ్రజం గంతుం ఉద్యతౌ తావాహ-భవద్భ్యామితి. 23

శ్లో॥ మంచాః క్రియంతాం వివిధా మల్లరంగపరిశ్రితాః ।
పౌరజానపదాస్సర్వే పశ్యంతు స్వైరసంయుగమ్ ॥ 24

టీ:- మంచా ఇతి. మంచా ఉత్తుంగస్తభాదిరచితస్థానాని. (24-57)

శ్లో॥ మహామాత్రని బోధేదం వచో మమ మహామతే ॥ 25

శ్లో॥ గజః కువలయాపీడః ప్రభిన్నకటకాముఖః ।
సంస్థాప్యో ద్వారి రంగస్య కరారోపితముద్గదః ॥ 26

తా. ఆ బలరామకృష్ణులిరువురును నాకు మృత్యుప్రదులని చెప్ప బడినారు. వారిటకు రాగానే మీరు ఇరువురును వారిరువురిని బాహాబాహి యుద్ధముతో చంపి వేయవలెను. 23

టీ:- మహ్యం - నాకు - నిదర్శిత్ - చూపబడిరి, ధాత్రా - నారదుని చేత అని.-23

తా. మల్లయుద్ధ రంగమునకు ఉపయుక్తులైన చప్పరముల వంటి వేదికలు సిద్ధము చేయుడు. పౌరులు, జానపదులును అందఱును ఆ బాహు యుద్ధమును చూడగలుగునట్లు ఏర్పాటు గావింపుడు. 24

టీ:- మంచాః - ఎత్తైన స్తంభములు మున్నగువానితో నిర్మింపబడిన రంగస్థలములు. (24-57)

తా. మావటీలలో ప్రధానుడా! గొప్పబుద్ధిశాలీ! నా ఈ మాటను జాగ్రత్తగా వినుము. 25

తా. కొండనడుమ రెండుగ చీలినట్లున్న ముఖముగల కువలయా పీడుడు అను ఏనుగు రంగస్థలము యొక్క ద్వారమున నిలుప వలయును. దాని తొండముననొక ఇనుపగుదియ నుంచవలయును, (తొండముపైన ఇనుప గుదియగల ఏనుగును రంగస్థల ద్వారము వద్ద నుంచవలయును). 26

శ్లో॥ తేన తౌ తత్ర హంతవ్యౌ సుతావానకదుందుభేః ।
ఇత్యుక్త్వా తం మహామాత్రం కంసస్తత్రైవ దుర్మతిః ॥ 27

తా. "వసుదేవుని కుమారులగు బలరామకృష్ణులిరువురును అచటనే చంపబడవలయును". అని ఆ ముఖ్యమైన మావటికి చెప్పి దుర్మతి యగు కంసుడు అచటనే. 27

శ్లో॥ ఉవాచ భూయో వచనం సమేతాన్ జ్ఞాపయన్నృప ॥ 28

తా. రాజా! తనతో నున్న వారితో - విషయమును జ్ఞాపకము చేయుచు మఱల ఇట్లు చెప్పెను. 28

కంస ఉవాచ

శ్లో॥ శృణుధ్వమేతద్వచనం మయోదితం
నిశమ్య సర్వం యది ధారయంతు తత్ ।
యేనాహ మేతేష్వ సుహృత్త్వమాదిత
శ్చరామి బంధుష్వపి తత్ర కారణమ్ ॥ 29

కంసుడిట్లనెను.

తా. ఈ నా చెప్పెడి విషయమును వినుడు. విని, దానిని ధారణ చేయుడు - దేనివలన నే నీ శత్రుసమానులైన బంధువులలో ఉన్నానో- దానికి కారణమేమిటో - మొదటినుండియు ఈ శత్రుభావమెందుల కేర్పడియున్నదో మీరు అంతయు వినుడు. 29

శ్లో॥ మాతా మమ మహాభాగా కదాచిత్కమలేక్షణా ।
విచరంతీ గృహోద్యానే మంద మారుత వీజితే ॥ 30

తా. తామర రేకుల వంటి కన్నులుగల, సౌభాగ్యవతియగు నా తల్లి ఒకనాడు, చల్లని గాలివీచుచుండగా ఇంటితోటలో విహరించు చుండెను. 30

శ్లో॥ ప్రోత్ఫుల్లాశోక వకుళ పూగ పున్నాగ శోభితే ।
భ్రమద్భ్రమరసంఘాత కూజత్కోకిల సంయుతే ॥ 31

తా. చక్కగా వికసించిన అశోక, పొగడ, పోక, సురపొన్నలతో శోభించునది, ఇటునటు తిరుగుచున్న తుమ్మెదల సమూహములు గలది, కూయుచున్న కోకిలలతో కూడినదియునైన (ఆ తోటలో విహరించుచుండెను). 31

శ్లో॥ నృత్యచ్ఛిఖండినివహే మర్కటాటోపసుందరే ।
వసంతసమయే రమ్యే సాల మండల మండితే ॥ 32

తా. నాట్యమాడు నెమళ్ళ సమూహములుగలది, కోతుల సంభ్రమముతో అందమైనదియు వసంతకాలమగుట వలన రమ్యమైనదియు, చెట్ల సమూహములతో అలంకరింపబడినదియునైన తోటలో విహరించుచుండెను. 32

శ్లో॥ చరంతి తత్ర మే మాతా చింతయామాస సువ్రతా ।
భర్తారం కామసంతప్తా ఋతుస్నాతా స్వలంకృతా ॥ 33

తా. సువ్రతయు, ఋతుస్నాతయు, చక్కగా అలంకరించుకొనినదియు నైన నా తల్లి ఆ తోటలో విహరించుచు కామసంతప్తయై తన భర్తనుగూర్చి ఆలోచించెను. 33

శ్లో॥ అత్రైవ కశ్చిద్గంధర్వో ద్రమిడో నామ నామతః ।
చరన్నంతర్హితః కాలే దృష్ట్వా తామేకచారిణీమ్ ॥ 34

తా. అదే సమయమున ద్రమిడుడు అను పేరుగల గంధర్వుడొకడు అంతర్హితుడుగా తిరుగుచూ, తోటలో ఆమె ఒంటరిగ తిరుగుచుండగ చూచి–34

శ్లో॥ విజ్ఞాయ చింతితం తస్యాస్సర్వ సత్త్వాశయార్థవిత్ ।
ఉగ్రసేనవపుర్బిభ్రత్సస్మితాలాపవీక్షితః ॥ 35

తా. ప్రాణులన్నింటి అంతర్యములను తెలిసికొనగలిగిన ఆ గంధర్వుడు, ఆమె ఆలోచించు విషయమును కూడ గ్రహించి, ఉగ్రసేనుని రూపమును ధరించి, చిరునవ్వుతో సంభాషించువాడుగ కన్పట్టుచున్నవాడై–35

శ్లో॥ తామాససాద కామార్తాం కామయానః పతివ్రతామ్ ।
అజానమానా సాభ్యేత్య రేమే తేన సమం వనే ॥ 36

తా. కోరిన చోటికి పయనింపగల ఆతడు కామముతో తపించుచున్న ఆమెను సమీపించెను. అతడెవరో తెలియనేరక ఆమె అతనినిచేరి ఆ వనమున రమించెను. అతనితో క్రీడించెను. 36

శ్లో॥ సాతం విదిత్వా రమణేతరం సతీ
నితాంతఖేదావిల లోచనాశయా ।
ఉవాచ కస్త్వం కితవార్యగర్హితం
దురాత్మనా యేన కృతం త్వయేదృశమ్ ॥ 37

తా. ఎట్టకేలకు ఆమె, అతనిని తన భర్తకాదని తెలిసికొని, మిక్కిలి దుఃఖముతో కలకబారిన కన్నులతో, హృదయముతో "నీవెవ్వడవు? మోసగాడా! దురాత్ముడవైన నీ చేత ఆర్యులు గర్హించుకొనునిట్టి పని ఏలచేయబడెను? 37

శ్లో॥ ఇతి బ్రువంతీ పరిసాంత్వయన్ శనై
స్సదీర్ఘబాహుర్ద్రమిడోఽభ్య భాషత ।
వయం హి గంధర్వకులోద్భవాఽబలే
గీర్వాణ తుల్యామర వల్లభానుగాః ॥ 38

తా. అని యిట్లు ప్రశ్నించుచున్న ఆమెను మెల్లగా ఓదార్చుచు దీర్ఘ బాహుడైన ద్రమిడుడు ఇట్లు చెప్పెను. "అబలా! మేము గంధర్వ కులమున బుట్టినవారము. దేవతలతో సమానులము. ఇంద్రుని అనుచరులము. 38

శ్లో॥ భవాదృశీనాం మనుజాంగనానాం
జానీహి భద్రే సులభా వయం న చ ।
జరావినాశాద్యఖిలాధిభాగినాం
నృణాం సురాణామ్మహదంతరం శుభే ॥ 39

తా. పుణ్యవతీ! మీ వంటి మనుష్యస్త్రీలకు, మా వంటి దేవతలు లభించుట సులభముకాదని తెలియుము. ముసలితనము, వినాశము మొదలగు సమస్తమైన దోషములకు భాక్కులైన మనుష్యులకు, దేవతలకు చాలా భేదము. 39

శ్లో॥ ఇతి బ్రువంతం సా భూయః క్రోధపర్యాకులేంద్రియా ।
కిం మాం సాంత్వయసే భూయః కృత్వేత్థం దుష్టచేష్టితమ్ ॥40

తా. ఇట్లు చెప్పుచున్న అతనితో ఆమె క్రోధముతో కాకావికలములైన ఇంద్రియములు గలదియై, ఏమీ! నన్ను మఱల ఓదార్చుచుంటివా? ఇట్టి దుష్టకార్యముచేసి నన్ను సమాశ్వాసించుచుంటివా? 40

శ్లో॥ ఇమానతిక్రమ్య మహీజలాగ్ని
సమీరణా కాశనిశేశసూర్యాన్ ।
దిక్కాల ధర్మాంశ్చ తథైవ సంధ్యే
దురాత్మనేత్థం మలినీకృతాహమ్ ॥ 41

తా. ఈ భూమి, అగ్ని, జలము, వాయువు, ఆకాశము, చంద్రుడు, సూర్యుడు, దిక్కులు, కాలము, ధర్మములు, అట్లే సంధ్యలు, అనునిట్టి ప్రకృతి భూతములనతిక్రమించి ఈ దుష్టునిచేత నేను అపవిత్రము చేయబడితిని. 41

శ్లో॥ గజేనేవ మదాంధేన పద్మినీ వనమధ్యగా ।
విశృంఖలేన విమలా యేనాహం మలినీకృతా ॥ 42

తా. గర్వముచేత గ్రుడ్డిదై, అదుపు తప్పిన ఏనుగు నీటి మధ్యనగల పవిత్రమైన తామరపువ్వును మలినము చేసినట్లు నీవు నన్ను మలినము చేసితివి. 42

శ్లో॥ స త్వం కిమితి మాం భూయస్సాంత్వ యస్యమరాధమ ।
ఇతి బ్రువంతీం ప్రోవాచ సభయశ్శాప శంకితః ॥ 43

తా. అట్టి నీవు మఱల నన్నేమని ఓదార్చుచున్నావు. దేవతాధమా! అని ఆమె కోపించుచుండగనే శాపమిచ్చునేమో అను శంకతో ద్రమిడుడు భయముతో ఇట్లనెను. 43

ద్రమిడ ఉవాచ

శ్లో॥ అనులోమస్తు కంజాక్షి మనుష్యాసుదివౌకసామ్ ।
నరాణాం దేవకాంతసు ప్రతిలోమో హి సంగమః ॥ 44

ద్రమిడుడు ఇట్లనెను.

తా. తామరరేకుల వంటి కన్నులు గలదానా! మనుష్యస్త్రీలయందు దేవపురుషుల సంగమము అనులోమము, తద్భిన్నముగ దేవకాంతల యందు మనుష్యుల సంభోగము ప్రతిలోమము. ( అనులోమము – క్రమము గలది, ప్రతిలోమము – అక్రమము)44

శ్లో॥ జానీహి మామనాగ స్కృత్తేహి పంకజగంధిని ।
తస్మాత్తే జాయతాం పుత్రోమద్వీర్యం న వృథా భవేత్ ॥ 45

తా. ఓ తామరపువ్వు పరిమళము గలదానా! నేనిది తెలిసియే వర్తించితినని తెలిసికొనుము. అందువలన నీకు ఒక పుత్రుడు కలుగును. నా వీర్యము వ్యర్థము కాదు. 45

శ్లో॥ శ్రీమాన్ ధీమాన్ మహోత్సాహో న మే వాగ్జాయతే మృషా ।
ఇత్యేవం వాదినం క్రుద్ధా మమ మాతా యశస్వినీ ॥ 46

తా. అతడు ధనవంతుడు, బుద్ధిమంతుడు, గొప్ప ఉత్సాహము గలవాడును అగును. నా మాట అబద్ధము కాదు. ఇట్లు మాట్లాడుచున్న అతని మాటలు విని మా తల్లి, యశస్విని క్రుద్ధురాలయ్యెను. 46

శ్లో॥ ప్రాహ సంత్యజ్య సంశప్తా పాతివ్రత్యం సుదుర్లభమ్ ।
నిస్సేతోర్భిన్నవృత్తస్య పాపస్యోన్మాదవర్తినః ॥ 47

తా. ఉత్తమురాలైన ఆమె, కట్టులేనివాడు, భ్రష్టచరిత్రుడు, పాపి, ఉన్మాదవర్తనుడునైన ద్రమిడుడని వలన దుర్లభమైన పాతివ్రత్యమును కోల్పోయినదై ఇట్లనెను. 47

శ్లో॥ క్రూరస్తే తనయో భూయాత్సాహసీ నిర్గుణోదయః ।
నానుగ్రాహ్యో దేవతానాం ద్విజానాం చ తపస్వినామ్ ॥ 48

తా. నీ కుమారుడు క్రూరుడు, అనాలోచితముగ వర్తించువాడు, సద్గుణశూన్యుడు, దేవతల, బ్రాహ్మణుల, తపస్వులయొక్క అనుగ్రహము పొందనేరని వాడును అగుగాక. 48

శ్లో॥ ఇత్థం వదంత్యాం తస్యాం సః క్రుద్ధాయాం శాప శంకితః ।
తావకానాం భవేచ్ఛత్రురిత్యుక్త్వాంతరధీయత ॥ 49

తా. ఇట్లు చెప్పుచున్న ఆ కోపించియున్న ఆమె శపించునేమో యను శంకకలిగినవాడై, నీకు సంబంధించిన వారికి – నీ బంధుజనులకు మాత్రము శత్రువగును. అని చెప్పి వెంటనే అంతర్హితుడయ్యెను. 49

శ్లో॥ గతే తస్మిన్ గృహోద్యానాన్మాతా మమ యశస్వినీ ।
కేనాప్య జ్ఞాత వృత్తాంతా గృహినేవాభ్యపద్యత ॥ 50

తా. గంధర్వుడు వెడలి పోయిన పిమ్మట నాతల్లి గృహోద్యానము నుండి లోనికి పోయి ఆ యశస్విని ఎవరి చేతను తెలియబడరాని వర్తనము గలదియై గృహస్థురాలివలె – లోలోన తన తప్పునకు కుములుచు ఉండిపోయెను. 50

శ్లో॥ తతస్సా గర్భిణీకాలే కాలేనైవ సుషావ మామ్ ।
ఇతి మే నారదః ప్రాహ కదాచిద్భగవానృషిః ॥ 51

తా. అప్పుడు ఆమె కొంతకాలము గర్భవతిగా నుండి నన్ను కనెను. ఈ విషయమును నాకు ఒకప్పుడు, భగవానుడు, ఋషియైన నారదుడు చెప్పెను. 51

శ్లో॥ తథా ప్రభృత్యహం ద్వేష్మి తానేతాన్ బంధుదుర్జనాన్ ।
యూయం తత్ర ప్రమాణం హి ద్విషంతే తేఽపి మాం సదా॥52

తా. అది మొదలుకొని నేను, బంధువులను దుర్జనులుగ భావించుచు ద్వేషించుచున్నాను. వారు కూడా నన్ను ఎల్లప్పుడును ద్వేషించు చున్నారు. ఇట్టి పరస్పర ద్వేషమునకు మీరే ప్రమాణము గదా! 52

శ్లో॥ ఉగ్రసేనం చ దుర్బుద్ధిం దేవకం చ దురాశయమ్ ।
వసుదేవం చ కితవమన్యాంశ్చ తదుపాశ్రయాన్ ॥ 53

తా. దుర్బుద్ధిగలవాడైన ఉగ్రసేనుని, దుష్టహృదయుడగు దేవకుని, కపటియైన వసుదేవుని, వీరలనాశ్రయించియున్న ఇతరులను

శ్లో॥ హత్వా న జాయతే దోషో మమ గంధర్వ జన్మనః ।
తేనాదేక్ష్యామి పరుషం హన్యేతామితితావహమ్ ॥ 54

చంపినచో, గంధర్వునకు పుట్టిన నాకు దోషము కలుగదు. అందుచేతనే నేను మీకు, కఠినమైన ఆదేశములిచ్చుచున్నాను. బలరామ కృష్ణులను చంపుమని ఆదేశించుటయు అందులకే. (53-54)

శ్లో॥ తాభ్యాం హతాభ్యాం బాలాభ్యాం కుంజరేణ బలీయసా ।
కృత్వా భద్రాత్మికీం పూజాం యాంతు తత్పదవీమిమే ॥ 55

తా. బలిష్ఠమైన ఏనుగుచేత చంపబడిన ఆ ఇరువురు బాలుర కొఱకు శ్రేయస్కరమగు పూజచేసి, మీరందఱు ఉత్తమస్థానముల నొందెదరు గాక. 55

శ్లో॥ వసుదేవోగ్రసేనౌ చ తథా తౌ నందదేవకౌ ।
గోపాలా యాదవాశ్చైవ యేచాన్యేతావ సువ్రతాః ॥ 56

శ్లో॥ పశ్యంతు వివిధైర్నేత్రైర్హన్యమానౌ స్వదారకౌ ।
ఆహూయంతాం జానపదాః పశ్యంతు స్వైరసంయుగమ్ ॥57

తా. వసుదేవ ఉగ్రసేనులు, ఆ నందదేవకులు, గోపాలురు, యాదవులు ఇంకను వారిననుసరించి యున్నవారు, తమ అనేకమైన కన్నులతో తమ ఇద్దఱు పిల్లలు చంపబడుచుండగా చూచెదరు గాక. జనపదమునందున్నవారినందఱిని ఆహ్వానింపుడు. ఆ స్వేచ్ఛా యుద్ధము (ముష్టియుద్ధమును) వారందఱు చూచెదరు గాక. (56-57)

శ్లో॥ మహామాత్రత్వయా భద్రరంగద్వార్యుపనీయతామ్ ।
ద్విపః కువలయాపీడోజహి తేన మమాహితౌ ॥ 58

తా. మావటీలలో పెద్దవగు భద్రా! కువలయాపీడుడను ఏనుగును మల్లయుద్ధరంగస్థలద్వారమువద్దకు తీసుకొనిరమ్ము. దాని సహాయమున నా ఇద్దరు శత్రువులగు రామకృష్ణులను కడతేర్పుము. 58

అత్ర మహామాత్ర నిబోధేత్యారభ్య. "మహామాత్ర త్వయా భద్రే"

ఈ కంసుని జన్మవృత్తాంతమునకుసంబంధించిన నేపథ్యమున

తి పర్యంతో గ్రంథః నైకస్మిన్నపి వ్యాఖ్యానే వ్యాఖ్యాతః. నాప్యత్రత్య మూల గ్రంథేషు స్థితః. తథాపి కాశీదేశాదానీత మూలగ్రంథేషు బహుషు స్థితత్వాద్విషయసామంజస్యాచ్చ సోఽప్యత్ర సంయోజితః. (58)

'మహామాత్రనిబోధేదం' అను25వ శ్లోకము నుండి ఈ 57వశ్లోకము వఱకును గల గ్రంథ భాగమునకు ఏ వ్యాఖ్యాన గ్రంథమునను వ్యాఖ్యానము లేదు. మూల గ్రంథములలో కూడ కొన్నింటిలో ఈ భాగము కన్పట్టదు. కాశీ దేశము నుండి తేబడిన అనేక గ్రంథములలో ఈ భాగము ఉండుటచే దీనికి ఇచట తాత్పర్యము మాత్రము వ్రాయబడినది. (58)

శ్లో॥ ఆరభ్యతాం ధనుర్యాగశ్చతుర్దశ్యాం యథా విధి ।
విశసంతు పశూన్మేధ్యాన్ భూతరాజాయ మీఢుషే ॥ 59

తా. చతుర్దశినాడు శాస్త్రవిధి ననుసరించి ధనుర్యాగము ప్రారంభింపుడు. భూతరాజు, వరమునిచ్చువాడును అయిన భైరవుని కొఱకు ఆరోగ్యవంతమైన పశువులను విశసనము (యజ్ఞార్థముగ చేయబడు పశువధ) చేయుడు. 59

టీ:- ఆరభ్యతామితి మీఢుషే వరదాయ. 59

టీ:- మీఢుషే - వరమిచ్చువాని కొఱకు -59

శ్లో॥ ఇత్యాజ్ఞాప్యార్థ తంత్రజ్ఞ ఆహూయ యదుపుంగవమ్ ।
గృహీత్వా పాణినా పాణిం తత్రాక్రూరమువాచ హ ॥ 60

తా. ఇట్లాజ్ఞాపించి, రాచకార్యములు బాగుగ తెలిసినవాడునైన కంసుడు యదువుల మధ్య శ్రేష్ఠుడు అయిన అక్రూరుని పిలిచి, అతని చేతిని తన చేతిలోనికి తీసికొని నిట్లుచెప్పెను. 60

టీ:- ఇతీతి. అర్థసిద్ధాంతమేవ జానతీత్యర్థ తంత్రజ్ఞః. 60

టీ:- అర్థ సిద్ధాంతమును తెలిసినవాడు అర్థతంత్రజ్ఞుడు. (రాజనీతి శాస్త్రము నెఱిగినవాడు) 60

శ్లో॥ భో భో దాశపతే మహ్యం క్రియతాం మైత్రమాదృతః ।
నాన్యస్త్వత్తోహితతమో విద్యతే భోజ వృష్ణిషు ॥ 61

తా. ఓ దాశపతీ! అక్రూరా! నీవు నాకొఱకు ఒక మిత్రోచితమైన సహాయ కార్యమును చేయవలయును. భోజ వృష్ణులయందు నీ కంటే అన్యుడైన హితకారి లేదు-61

శ్లో॥ అతస్త్వామాశ్రితస్సౌమ్య కార్య గౌరవ సాధనే ।
యథేంద్రో విష్ణుమాశ్రిత్య స్వార్థమభ్యగమద్విభుః ॥ 62

తా. సౌమ్యుడా! చేయవలసిన పని దొడ్డదియగుట కారణముగ నిన్ను ఆశ్రయించితిని. ఇంద్రుడు విష్ణువునాశ్రయించి తన ప్రయోజనమును సాధించు కొనినట్లు నేను నిన్నాశ్రయించితిని. 62

శ్లో॥ గచ్ఛ నందవ్రజం తత్ర సుతావానకదుందుభేః ।
ఆసాతే తావిహానేన రథేనానయమాచిరమ్ ॥ 63

తా. నందవ్రజమునకు బొమ్ము. అచట వసుదేవుని కుమారులగు బలరామకృష్ణులుందురు. వారిని ఈ రథముపై నెక్కించుకొని ఇచటికి శీఘ్రముగ తోడ్కొని రావలయును. 63

టీ:- భోభో ఇతి. దాశపతే హే అక్రూర మైత్రం మిత్రకృత్యం. త్వయా క్రియతాం. త్వత్తోఽన్యః ఆదృతః సాదరో హితతమశ్చ. న విద్యత ఇతి. (61-63)

టీ:- దాశపతే - ఓ అక్రూరా! - మైత్రం - మిత్రకృత్యం - నీ చే చేయబడుగాక - నీ కన్న నితరుడు - ఆవృతః - ఆదరముతో కూడినవాడు - మేలు చేయువారితో శ్రేష్ఠుడు-లేదు-(61 -63)

శ్లో॥ విసృష్టః కిలమే మృత్యుర్దేవైర్వైకుంఠ సంశ్రయైః ।
తావానయ సమంగోపైర్నందాద్యైస్సాభ్యుపాయనైః ॥ 64

తా. వీరిద్దరి కారణముగ నాకు మృత్యువు కలుగునని విష్ణువునాశ్రయించియున్న వారిచే నిశ్చితమైనదట. అందుకే వారిని, వారితో బాటుగ గోపాలురను, కానుకలనిచ్చి నందాదులను కూడ ఇటకు తోడ్కొని రమ్ము. 64

టీ:- విసృష్ట ఇతి.తౌ. మే మృత్యుర్నితరాంసృష్టః. వైకుంఠసంశ్రయైః విష్ణుసంశ్రయైర్దేవైః. 64

టీ:- తౌ ఆనయ - వారిరువురిని తెమ్ము. నా మరణము దృఢముగ నిశ్చితమైనది - వైకుంఠ సంశ్రయైః - విష్ణునాశ్రయించియుండు దేవతలచే. 64

శ్లో॥ ఘాతయిష్య ఇహానేన కాలకల్పేన హస్తినా ।
యదిముక్తౌ తతో మల్లైర్ఘాతయే వైద్యుతోపమైః ॥ 65

తా. వారిచటికి వచ్చిన పిదప మృత్యువుతో సమానమైన కువలయాపీడ మనెడి ఏనుగుతో వారలను మట్టుబెట్టించెదను. ఒకవేళ అట తప్పించుకొనినచో వజ్రాయుధముల వంటి మల్లులచేత చంపించెదను. 65

శ్లో॥ తయోర్నిహతయోర్తప్తాన్ వసుదేవ పురోగమాన్ ।
తద్బంధూన్నిహనిష్యామి వృష్ణి భోజ దశార్హజాన్ ॥ 66

తా. గర్వితులైన ఆ ఇరువురు చంపబడిన పిమ్మట, వసుదేవుడు మొదలైన వారిని , వారి బంధువులను, వృష్ణి, భోజ, దశార్హులను అందిటిని సంహరించెదను. 66

శ్లో॥ ఉగ్రసేనం మత్పితరం స్థవిరం రాజ్యకాముకమ్ ।
తద్భ్రాతరం దేవకం చ యే చాన్యే విద్విషో మమ ॥ 67

తా. వృద్ధుడును, రాజ్యకాంక్షగల వాడును, కాముకుడను అయిన నా తండ్రియగు ఉగ్రసేనుని, అతని సోదరుడైన దేవకుని, నాకు శత్రువులైన ఇతరులను కూడ వధించెదను. 67

టీ:- కిం తతస్తత్రాహ - ఘాతయిష్య ఇతి. కాలకల్పేన మృత్యుతుల్యేన. వైద్యుతోపమైరశనితుల్యైః. (65-67)

టీ:- అప్పుడేమి జరుగునో చెప్పుచున్నాడు - కాల కల్పేన - మృత్యువుతో సమానమైన దానిచేత - వైద్యుతోపమైః- వజ్రాయుధముతో సమానముగ వారి (చాణూర ముష్టికుల) చేత- (65 -67)

శ్లో॥ తతశ్చైషా మహీమహ్యం భవిత్రీ నష్టకంటకా ।
జరాసంధో మమ గురుర్ద్వివిధోదయితస్సఖా ॥ 68

తా. అప్పుడు ఈ భూమి (రాజ్యము) నా కొఱకు నిష్కంటకమగును. (శత్రుశేషము లేనిదగును) జరాసంధుడు నా గురువు. రెండు విధములైన వాడు - ఇష్టుడు, స్నేహితుడును. 68

శ్లో॥ శంబరో నరకో బాణో మయ్యేవ కృత సౌహృదాః ।
తైరహం సురపక్షీయాన్ హత్వా భోక్ష్యే మహీం నృపాన్ ॥ 69

తా. శంబరుడు, నరకుడు, బాణుడును నా యందే స్నేహభావము కలిగియున్నారు. వారితో కలిసి ఈ దేవతా పక్షమువారిని చంపి రాజులను, రాజ్యమును అనుభవింతును. 69

శ్లో॥ ఏతద్ జ్ఞాత్వానయ క్షిప్రం రామకృష్ణావిహార్భకౌ ।
ధనుర్మఖ నిరీక్షార్థం ద్రష్టుం యదుపురశ్రియమ్ ॥ 70

తా. ఇది తెలిసికొని, బాలురగు బలరామకృష్ణులను-ధనుర్యాగము చూచుట కొఱకనునట్లు, యదువంశీయుల రాజధానియగు మధుర యొక్క శోభను తిలకించు కొఱకనున్నట్లు శీఘ్రముగ తోడ్కొనిరమ్ము. (70)

టీ:- తత ఇతి. నష్టకంటకా నష్టశత్రుః. నను కతిపయాసుహృద్వధేన నష్టకంటకా కథంస్యాత్తత్రాహ - జరాసంధ ఇతి. (68-70)

టీ:- నష్టకంటకా -నశించిన శత్రువులు గలది. అయినను కొంత మంది శత్రువులను మాత్రము చంపుటచేత నిష్కంటక మెట్లగును? ఇట చెప్పుచున్నాడు. 'జరాసంధః' అని- (68 - 70)

**అక్రూర ఉవాచ**

**అక్రూరుడిట్లనెను.**

శ్లో॥ రాజన్ మనీషితం సధ్ర్యక్తవ స్వావద్యమార్జనమ్ ।
సిద్ధ్యసిద్ధ్యోస్సమో భయాద్దైవం హి ఫలభావనమ్ ॥ 71

తా. రాజా! నీ మృత్యువు గుఱించి, నీ అరిష్ట క్షాళనము గుఱించియు లెస్సగా ఆలోచించితివి. ఇక ఫలము సిద్ధించుటయు, సిద్ధింపక పోవుటయు సమానముగ, దైవము మీద ఆధారపడియున్నవి. లేక ఫలము కలుగుట యనునది దైవభావనమే. 71

టీ:- రాజన్నితి. మనీషితం విచారితం. సధ్ర్యక్ సమ్యక్ స్వావద్యం మరణం. తన్మార్జనం. తథాప్యేతావానభినివేశో న కార్య ఇతి. భవిష్యత్సూచయన్నాహ - సిద్ధ్యసిద్ధ్యోరితి. 71

టీ:- మనీషితం-విచారింపబడినది. సధ్ర్యక్ - లెస్సగా - స్వావద్యం- మరణము - తన్మార్జనం - అట్లైనను ఇట్టివానిని నిపుణతలేనివాడు చేయ రాదు. భవిష్యత్తును సూచించుచు 'సిద్ధి అసిద్ధుల'అని చెప్పు చున్నాడు. 71

శ్లో॥ మనోరథాన్ కరోత్యుచ్చైర్జనో దైవహతానపి ।
యుజ్యతే హర్షశోకాభ్యాం తథాప్యాజ్ఞాం కరోమితే ॥ 72

తా. మనుష్యుడు, దైవము ప్రతికూలముగనున్న కోరికలను కూడ పెద్దగా కోరుచుండును. ఫలితముగ హర్షమును శోకమును అనుభ వించుచుండును. అటులైనను నీ ఆజ్ఞను నేను పాలించెదను. 72

శ్రీశుక ఉవాచ

శ్లో॥ ఏవమాదిశ్య చాక్రూరం మంత్రిణశ్చ విసృజ్య సః ।
ప్రవివేశ గృహం కంసస్తథా క్రూరస్స్వమాలయమ్ ॥ 73

శ్రీశుకుడిట్లు చెప్పెను.

తా. అక్రూరుని ఇట్లు ఆజ్ఞాపించి మంత్రులకు కూడ ఆదేశములిచ్చి క్రూరుడైన ఆ కంసుడు తన మందిరమున ప్రవేశించెను. 73

టీ:- పురుషకారస్యవ్యభిచారి తామాహ-మనోరథానితి. (72-73)

టీ:- మనుష్య ప్రయత్నముయొక్క వివిధత్వమును చెప్పుచున్నాడు -"మనోరథాన్" అని- (72 -73)

శ్రీ మద్భాగవతే, మహాపురాణే దశమస్కంధే,
షట్త్రింశోఽధ్యాయః

అని శ్రీమద్భాగవతమున దశమస్కంధమందు
ముప్పది ఆరవ అధ్యాయము సమాప్తము.

## సప్తత్రింశోఽధ్యాయః

## కేశిసంహారఘట్టః

**శ్రీశుక ఉవాచ**

శ్లో॥ కేశీ తు కంసప్రహితః ఖురైర్మహీం
మమత్తయా నిర్జరయన్ మహాహయః ।
సటావధూతాభ్ర విమాన సంకులం
కుర్వన్నభో హేషిత భీషితాఖిలః ॥ 1

## 37వ అధ్యాయము

**శ్రీశుకుడిట్లు చెప్పెను.**

తా. కంసుని చేత పంపబడిన కేశి అను రాక్షసుడు పెద్దగుఱ్ఱము రూపము గలవాడై గిట్టలతో నేలను చీల్చుచు, మనోవేగము గలవాడై తన జూలు విదల్చుచుండుటచేత అస్తవ్యస్తమగుచున్న ఆకాశమునందలి విమానముల సమూహములు గలవాడై, విమానములను సంకీర్ణములు గజేయుచు, ఆకాశమునంతను తన సకిలింపుల ధ్వనితో భయము గొల్పుచున్నవాడై- 1

శ్లో॥ విశాలనేత్రో వికటాస్య కోటరో
బృహద్గళో నీలమహాచలోపమః ।
దురాసదః కంసహితం చికీర్షన్
వ్రజం సనందస్య జగామ కంపయన్ ॥ 2

తా. వెడల్పయిన కన్నులు గలవాడు, చెట్టుతొఱ్ఱవలె వికటమైన నోరు గలవాడు, స్థూలముగను, మిక్కిలి పొడవుగను ఉన్న మెడ గలవాడును, నల్లని పెద్దకొండవలె నున్నవాడను, అసాధ్యుడును అయిన ఆ కేశియను వాడు కంసునికి మేలుచేయుచు, నందవ్రజమును వణికించుచు అచటికిబోయెను. 2

టీ:- శ్లో. "సప్తత్రింశే హతే కేశిన్యచ్యుతో భావికర్మభిః, నారదేన స్తుతః క్రీడన్ వ్యోమాసురమథాధీత్. వృషవేషాసురం యద్వత్కేశినం హయవేషిణం, కంసప్రాణసమం హత్వా కంసం వ్యసుమివాకరోత్. కేశీతి. ప్రథమ శ్లోకేన య ఏవం భూతః కేశీత్యనూద్య. తం భగవాను

టీ:- ముప్పదిఏడవ అధ్యాయమున... 'కేశి' చంపబడినవాడు కాగ, కృష్ణుడు తన భవిష్యత్కర్మలచేత నారదునిచేత స్తుతింపబడి, క్రీడించుచు, అటు పిమ్మట వ్యోమాసురుని సంహరించెను. కంసునకు ప్రాణసమాను డైన గుఱ్ఱము వేషముననున్న కేశిని వృషాసురుని సంహరించినట్లు

పాహ్వ యదితి. తృతీయేనాన్వయః. మహాహయన్సన్ మహీం నిర్జరయన్ శ్లథయన్ విదారయన్నిత్యర్థః. సటాభిః కేసరైరవధూతాని ఇతస్తతః క్షిప్తాన్యభ్రాణి విమానాని చ. తైః సంకీర్ణం నభః కుర్వన్ హేషితైరశ్వజాతి శబ్దైః భీషితమఖిలం విశ్వం యేన. (1-2)

గనే-చంపపి కంసుని-ప్రాణరహితునిగ చేసెను. మొదటి శ్లోకముచేత కేశి ఇట్టివాడని - వచించి- అట్టి వానిని భగవానుడు సమీపమునకు పిలిచెను అని మూడవ శ్లోకముతో అన్వయము. గొప్పగుఱ్ఱము రూపము గలవాడగుచు - మహీం - భూమిని - నిర్జరయన్ - చీల్చుచు - సటాభిః - జూలుతో అవధూతాని - ఇటునటు చిందరవందర చేయుచు - ఆకాశమునందలి మేఘములను, విమానములను కూడ - వానితో ఆకాశము సంకీర్ణము చేయుచు - కేశితైః - సకిలింపులతో - అఖిల విశ్వము ఎవనిచే భయపెట్టబడెనో అట్టివాడు. (1-2)

శ్లో॥ తం త్రాసయంతం భగవాన్ స్వగోకులం
తద్ధేషితైర్వాలవిఘూర్ణితాంబుదమ్ ।
ఆత్మానమాజౌమృగయంతమగ్రణీ
రూపాహ్వయత్సవ్యవదన్మృగేంద్రవత్ ॥ 3

తా. తన గోకులమును భయపెట్టుచున్నవాడును, తన సకిలింపుల తోను, తోకను విదల్చుటద్వార మేఘములను కదలించుచున్నవాడును, యుద్ధమునకు తనను వెదకుచున్నవాడును అయిన కేశిని ప్రధానుడైన భగవానుడు చెంతకు పిలిచి, సింహమువలె గర్జించెను. 3

టీ:- తమితి. తద్ధేషితైః తైరతి నిష్ఠురైర్హేషితైః వాలైః పుచ్ఛరోమభిః. విఘూర్ణితాః పరిభ్రామితా అంబుదా యేన తం ఆజౌ. సంగ్రామార్థం ఆత్మానాం కృష్ణం అగ్రణీః పురతో నిర్గతస్సన్ ఉపాహ్వయత్ స్వ సమీపమాజుహావ. స చ కేశీ తం నిశమ్య మృగేంద్రవన్నాదమకరోత్. 3

టీ:- తద్ధేషతైః-తైః+అతినిష్ఠురై+హేషితైః-అతనియొక్క కఠోరమైన సకిలింపులతో - వాలైః - తోకకు గల వెంట్రుకలతో - విఘూర్ణితాః- పరిభ్రమింపబడుచున్నవాడై - అంబుదాః - మేఘములు ఎవని చేతనో అతనిని - ఆజౌ - యుద్ధము కొఱకు - ఆత్మానం - తనను -కృష్ణుని అగ్రణీః - ముందుగా - పోయిన వాడగుచుండగా - ఉపాహ్వయత్ - తన సమీపమునకు పిలిచెను - అతడును - కేశి అతనిని సమీపించి - సింహరాజము వలె గర్జించెను. 3

శ్లో॥ స తం నిశామ్యాభిముఖోముఖేన ఖం
పిబన్ని వాభ్యద్రవదత్యమర్షణః ।
జఘాన పద్భ్యామరవిందలోచనం
దురాసదశ్చండరవో దురత్యయః ॥ 4

తా. అతడు కృష్ణునికి అభిముఖముగా నిల్చి, ముఖములో ముఖముగ చూచి, ఆకాశమును త్రాగువానివలె మిక్కిలి కోపించినవాడై, అసాధ్యుడు, భయంకరమైన ధ్వని కలవాడును, ఎదురులేనివాడై తన రెండు కాళ్లతో ముందునకు కదిలెను. 4

టీ:- స ఇతి. తతః స కేశీ. తం కృష్ణం దృష్ట్వా. ముఖేన ఖం పిబన్నివ ముఖం వ్యాదాయ వివృత్య అభిముఖమభ్యా జగామ. కించ. అత్యమర్షణః. అతికుపితః అత్యంతమసహమానో వా. ప్రత్యక్ పద్భ్యాం జఘాన. దురాసదః అన్యైరభిభవితుమశక్యః. దురత్యయః ఉద్యతస్సన్. దురతిక్రమః అత్ర హేతుః - చండరవః. 4

టీ:- అప్పుడు ఆ కేశి, ఆ కృష్ణుని చూచి నోటితో ఆకాశమును త్రాగుచున్నవాని వలె ముఖమును చాచి పైకెత్తి - తెరచి ఎదురుగ వచ్చెను. మరియు మిక్కిలి కోపముగలవాడై లేక-అత్యంతముగ అసహనము గలవాడై, వెనుక కాళ్లతో ముందుకు వచ్చెను - దురాసదః - ఇతరులచే పరాభవింపబడుటకు శక్యము కానివాడు -దురత్యయః - పూనిక గలవాడగుచు- దురతిక్రముడు-కారణము- భయావహమైన ధ్వని గలవాడు. 4

శ్లో॥ తద్వంచయిత్వా తమధోక్షజో రుషా
ప్రగృహ్య దోర్భ్యాం పరిపీడ్య పాదయోః ।
సావజ్ఞముత్సృజ్య ధనుశ్శతాంతరే
యథోరగం తార్క్ష్యసుతో వ్యవస్థితః ॥ 5

తా. వాని చర్యను సాగనీయకుండజేసి, కృష్ణుడు కోపముతో వాని కాళ్ళను రెండింటిని తన రెండు చేతులతో గట్టిగా పట్టుకొని, గిరగిర త్రిప్పి - అవమానింపబడిన ఆ కేశిని నూరు ధనస్సుల దూరమునకు, గరుడుడు, సర్పమును పట్టి త్రిప్పినట్లుగ త్రిప్పి - విసరికొట్టి - యథా పూర్వముగ ఉండిపోయెను. 5

టీ:- తదితి. తత్ హననం. వంచయిత్వా. తం చ హననాయ ప్రసారిత యోః పాదయోర్హస్తాభ్యాం గృహీత్వా పరివిధ్య భ్రామయిత్వా వ్యవస్థితః. తథైవ స్థితో బభూవ. 5

టీ:- వాని హనన ప్రయత్నమును వంచించి - వానిని చంపుటకు - చాచిన రెండుకాళ్ళను చేతులతో పట్టుకొని పరివిధ్య-త్రిప్పి- (నూరు ధనుస్సుల దూరమునకు విసరి) ఉండిపోయెను. అట్లే ఉండిపోయిన వాడయ్యెను. 5

శ్లో॥ స లబ్ధసంజ్ఞః పునరుత్థితో రుషా
వ్యాదాయ కేశీ తరసాపతద్ధరిమ్ ।
సోఽప్యస్య వక్త్రే భుజముత్తరం స్మయన్
ప్రవేశయామాస యథోరగం బిలే ॥ 6

తా. అతడు కొంతసేపటికి చైతన్యమును పొంది, మఱల లేచి, కోపముతో నోరుతెరచి వేగముగా కృష్ణుని మీద వచ్చిపడెను. కృష్ణుడు కూడ నవ్వుచు తన యెడమచేతిని అతని నోటిలోనికి - సర్పము బిలములోనికి దూరునట్లు ప్రవేశపెట్టెను.. 6

టీ:- స ఇతి. వ్యాదాయ ముఖం ప్రసార్య. వేగేన హరిం ప్రత్యాద్రవత్. సోఽపి హరిర్హసన్ ఉత్తరం సవ్యం. భుజం. నిర్భయత్వే దృష్టాంతః. యథోరగం బిల ఇతి. 6

టీ:- వ్యాదాయ - నోరుతెరచి వేగముగ కృష్ణునివైపు పరుగెత్తెను. హరికూడ నవ్వుచు తన ఉత్తరం - ఎడమ - భుజమును - నిర్భయత్వ మున దృష్టాంతము. బిలములోనికి ప్రవేశించినట్లు అని - 6

శ్లో॥ దంతా నిపేతుర్భగవద్భుజస్పృశ
స్తే కేశినస్తప్తమయస్పృశో యథా ।
బాహుశ్చతద్దేహగతో మహాత్మనో
యథామయస్సంవవృధేహ్యుపేక్షితః ॥ 7

తా. కృష్ణుని బాహుస్పర్శ వలన కేశియొక్క దంతములు ఊడి పడిపోయెను. ఆ కృష్ణుని భుజము కేశి పాలిటి బాగుగ కాల్చిన లోహపు గుదియ వలెనుండెను. ఇక అతని భుజము కేశి దేహమున ప్రవేశించిన పిదప, ఉపేక్షింపబడిన జలోదర వ్యాధివలె పెరిగిపోయెను. 7

టీ:- తతః కిం తదాహ - దంతా ఇతి. చర్వణాయ భగవద్భుజం స్పృశంతీతి తథా. తే వ్యాదానేన యే వివృతాః అయో లోహం స్పృశంతీతి స్పృశః. యద్వా - తప్తమయం అతితప్తం లోహాది స్పృశంతో యథేతి. ఆమయో జలోదరః. 7

టీ:- అప్పుడేమి జరిగెనో చెప్పుచున్నాడు-నమలుట కొఱకుగాను భగవానుని భుజమును స్పృశించునవి కనుక దంతములు భుజస్పర్శ కలిగినవిగ చెప్పబడినవి. అవి నోరు తెరచుటచేత వ్యాప్తి చెంది ఉండుటచే లోహదండమును స్పృశించినట్లున్న స్పర్శ కలిగినది. లేక - తప్తమయం - కాల్చబడిన లోహము మదలగు వానిని తాకినట్లుగ అని. ఆమయః - జలోదరము..7

శ్లో॥ సమేధమానేన స కృష్ణబాహునా
నిరుద్ధవాయుశ్చరణాంశ్చ విక్షిపన్ ।
ప్రస్విన్నగాత్రః పరివృత్తలోచనః
పపాత లండం విసృజన్ క్షితౌ వ్యసుః ॥ 8

తా. కృష్ణుని బాహువుచేత పీడింపబడుచున్నవాడై, కేశి, శ్వాస నిరోధింపబడి, కాళ్ళు కొట్టుకొనుచు, చెమటతో తడిసిన శరీరము గలవాడును, తిరిగిపోయిన కనుగ్రుడ్లు గలవాడై, మలవిసర్జన చేయుచు నేలబడి అసువులు బాసెను. 8

టీ:- సమేధమానేనేతి. లండం పురీషముత్సృజన్. 8

టీ:- లండం - మలము - విసర్జించుచు 8

శ్లో॥ తద్దేహతః కర్కటి కాఫలోపమా
ద్వ్యసోరపాకృష్య భుజం మహాభుజః ।
అవిస్మితో యత్న హతారిరుత్స్మయైః
ప్రసూన వర్షైర్ది విషద్భిరీడితః ॥ 9

తా. విగత ప్రాణుడైన కేశి యొక్క దేహమునుండి, దోసపండువలె తన భుజమును బయటకు లాగి, మహాభుజుడైన కృష్ణుడు, ఆశ్చర్యము లేకుండ, అప్రయత్నముగనే శత్రువును సంహరించినవాడై యుండగా, దేవతలు మిక్కిలి ఆశ్చర్యపడుచు అతనిపై పుష్పవర్షములు కురిపించుచు స్తోత్రము చేసిరి. 9

టీ:- తదితి. కర్కటికాఫలం హి పక్వం సదత్యంతం విశీర్ణం భవతి. తద్వద్విదీర్ణాత్తస్య దేహాత్. విగతప్రాణాత్. అవిస్మితో గర్వ రహితః అయత్నేన హతోఽరిర్యేన సః. 9

టీ:- దోసపండు పండిపోయినచో మిక్కిలిగ విశీర్ణమగును. ఆ విధముగనే విశీర్ణమైన అతని దేహమునుండి - గతప్రాణుడైన అతని శరీరమునుండి - ఆశ్చర్యపడక - గర్వరహితుడై - అప్రయత్నముగ చంపబడిన శత్రువు ఎవరిచేతనో అతడు - ఆ కృష్ణుడు-9

శ్లో॥ దేవర్షిరుపసంగమ్య భగవత్ప్రవణో నృప ।
కృష్ణమ క్లిష్ట కర్మాణం రహస్యేతదువాచ హ ॥ 10

తా. రాజా! భగవానుని ఆశ్రయించియున్న దేవర్షియగు నారదుడు, అనాయాసముగ అద్భుత కర్మలు చేయు కృష్ణుని వద్దకు చేరి ఏకాంత మున ఈ విషయమును చెప్పెను. 10

టీ:- కంసాయ కృష్ణమాదిశ్య తద్రహస్యాదిపైశున్యైః, కంసఘాతాది కృష్ణస్య కార్యమావేదయన్మునిః శ్రీధరీయోఽయంశ్లోకః. తదాహ - దేవర్షిరిత్యాదినా. దేవర్షిరితి. న చాయమనర్థ సూచకః. కింతు సర్వసుహృది త్యాహ - భగవత్ప్రవణ ఇతి. 10

టీ:- కంసునకు కృష్ణుని గూర్చి చెప్పి - అతని రహస్యములు మున్నగు దుష్టకార్యములతో చేయబోవు అపకారములు మొదలగు వానిగూర్చి కృష్ణుడు చేయవలసిన కార్యములను నారదుడు కృష్ణునకు విన్న వించెను. ఈ భావముగల శ్లోకము శ్రీధరులది - ఇది అనర్థ సూచకము కాదు. అందఱికి కేలు కలిగించునది. అని చెప్పుచున్నాడు - 'భగవత్ప్రణః' అని. 10

శ్లో॥ కృష్ణ కృష్ణాప్రమేయాత్మన్ యోగేశ జగదీశ్వర ।
వాసుదేవాఖిలావాస సాత్త్వతాం ప్రవరప్రభో ॥ 11

తా. కృష్ణా! ఓ కృష్ణా! యథార్థముగ నెఱగదగిన ఆత్మయై యున్నవాడా యోగేశా! జగత్తులకు ఈశ్వరుడా! వాసుదేవా! సమస్తముననున్నవాడా! సాత్త్వతులలో శ్రేష్ఠుడా! ప్రభూ! 11

టీ:- అస్మద్రహస్యం వైరిణి కంసే కథం. సూచితవానితి మాశంకీ రీత్యాహ - కృష్ణ కృష్ణేతి. అయం భావః త్వమీశ్వరో భూభారత దైత్య సంహారాయావతీర్ణోఽసి. అత స్తదనురూపాచరణేన విశ్వం పరిపాల యేతి. తత్ర త్వయి తావద్భయశంకైవ నాస్తీత్యాహ - అప్రమేయాత్మన్ అపరిచ్ఛిన్నస్వరూప. యోగేశ అచింత్య ప్రభావ జగదీశ్వర విశ్వ నియంతః వాసుదేవ సర్వభూతేషు వర్తమాన అఖిలావాస సర్వస్యాశ్రయ. సంప్రతి సాత్త్వతాం ప్రవరశ్రేష్ఠ. ప్రభో సర్వశక్తే. 11

టీ:- మన రహస్యమును శత్రువగు కంసునకు ఎట్లు సూచించితివి? అని శంకింపకుము. అని చెప్పుచున్నాడు. "కృష్ణకృష్ణ" అని - దీని భావమిది. "నీవు ఈశ్వరుడవు, భూమికి భారమగు రాక్షసులను సంహరించుట కొఱకు అవతరించితివి. అందువలన దానికి తగిన విధముగ ఆచరించుచుండుట చేత విశ్వమును పరిపాలింపుము - అని - ఈ సందర్భమున నీకు భయశంకలేవియులేవు - అని చెప్పు చున్నాడు. అప్రమేయాత్మన్ - అపరిచ్ఛిన్నమైన స్వరూపము గలవాడా! యోగేశ - చింతింపరాని ప్రభావము గలవాడా! జగదీశ్వర విశ్వమును నియమించువాడా! - వాసుదేవ - అన్ని భూతముల యందున్నవాడా! అఖిలావాస - అందఱికిని ఆశ్రయమైనవాడా! ఇప్పుడు సాత్త్వతులలో శ్రేష్ఠుడా! ప్రభో - సకల శక్తులు గలవాడా! 11

శ్లో॥ త్వమాత్మా సర్వభూతానామేకో జ్యోతిరివైధసామ్ ।
గూఢో గుహాశయస్సాక్షీ మహాపురుష ఈశ్వరః ॥ 12

తా. సమిధల (కట్టెల) లో జ్యోతివలె, సర్వభూతములలో నీవు ఒక్కడవే ఆత్మగనున్నావు. అదృశ్యముగ, రహస్యముగనున్నావు. బుద్ధియనెడు గుహలో అవ్యక్తముగ నున్నావు. విశ్వమంతటికి సాక్షిగనున్నావు. నీవు మహాపురుషుడవు. నియామకుడవు. 12

టీ:- కథమేవం రూపోఽహమితి చేదత ఆహ - త్వమితి. న హి త్వం జీవవత్పరిచ్ఛిన్నః కింతు సర్వభూతానామంతః ఏకః అనుస్యూత ఆత్మా అంతరనుస్యూతత్వే దృష్టాంతః. ఏధసాం కాష్ఠానాం అంతర్జ్యోతి

టీ:- నేను ఇట్టి రూపముగలవాడనెట్లు? అను విషయమును చెప్పు చున్నాడు. 'నీవు జీవునివలె పరిచ్ఛిన్నుడవు కావు. కాని సకల భూతములకు అంతర్భాగమున ఒక్కడవే ఎడతెగనిరీతిగ ఆత్మవై

రివేతి. భూతేషు స్థితోఽపి తైర్న దృశ్యస ఇత్యాహ–గూఢ ఇతి. అత్ర హేతవః గుహాశయః బుద్ధేరప్యంతరః. కిం చ సాక్షీ. న హి సాక్షీ దృశ్యత ఇత్యర్థః అపి చ. మహాపురుషః. అతః పరిచ్ఛిన్నమతిభిర్న జ్ఞాయస ఇత్యర్థః. తర్హి సర్వాంతరత్వే కిం ప్రమాణమత ఆహ – ఈశ్వర ఇతి. న హి ఈశ్వరం వినా. పరతంత్రాణాం జీవానాం ప్రవృత్తిర్ఘటత ఇత్యర్థః. 12

యున్నావు లోపల ఎడతెగని లక్షణమునకు దృష్టాంతము. ఏధసాం – కట్టెలయొక్క – అంతః – లోపల – జ్యోతిరివ – అగ్నివలె – అని – భూతములయందు వ్యవస్థితుడవై యున్నావు. ఆ భూతములకు కనపడవు, అని చెప్పుచున్నాడు. గూఢః' అని, ఇట కారణములు – గుహాశయః – బుద్ధి లోపలకూడ 'లోపల' ఉన్నావు – మరియు సాక్షిగ ఉన్నావు – సాక్షి కనపడడు అని యర్థము. ఐనను – మహాపురుషుడవు – అందువలన పరిచ్ఛినమై, బుద్ధులకు తెలియబడవు అని యర్థము. అయినచో సకలాంతర్వర్తి యనుటకు ప్రమాణమేమి? చెప్పుచున్నాడు. 'ఈశ్వరః' అని. ఈశ్వరునకు తప్ప పరతంత్రులైన జీవులకు 'ప్రవృత్తి' ఘటింపదు గదా – అని యర్థము. 12

శ్లో॥ ఆత్మనాత్మశ్రయః పూర్వం మాయయా సస్సృజే గుణాన్ ।
తైరిదం సత్యసంకల్పస్సృజస్యత్స్యవసీశ్వరః ॥ 13

తా. పరమాత్మా! మొదట స్వతంత్రుడవై మాయచేత గుణములను సృష్టిచేసితివి. ఆ గుణములతో ఈ విశ్వమును సృష్టించితివి. సత్య సంకల్పుడవు కావున సృష్టింతువు, సంహరింతువు – పాలింతువు, అందుకే ఈశ్వరుడవు. 13

టీ:– అహమీశ్వరః అన్యత్సర్వమీశితవ్యమిత్యేతదేవ కుతః. అత ఆహ– ఆత్మనేతి. సాధనాంతర నిరపేక్ష ఏవ. ఆత్మాశ్రయః స్వతంత్రః. మాయయా శక్త్యా గుణాన్ భవాన్ సస్సృజే సృష్టవాన్ తైః సృష్టైర్గుణైః. ఇదం విశ్వం. సృజసి అత్సి సంహరసి. అవసి పాలయసి. నను

టీ:– నేను ఈశ్వరుడను. ఇతరమైనదంతయు పాలింపదగినది అనునది ఎందులకు? చెప్పుచున్నాడు. ఇతర సాధనములేవియు లేకుండగనే నిన్ను నీవే ఆశ్రయించు వాడవు కావున స్వతంత్రుడవు. మాయ అనెడు శక్తిచేత నీవు గుణములను సృజింతువు – అత్సి –

సృష్ట్యాది క్రియాషట్ కారకసాధ్యైవ దృష్టేత్యత ఆహ - సత్య సంకల్ప ఇతి. న హి సంకల్పైకసాధ్యే బహిస్సాధనాపేక్షేతి భావః అతస్త్వమీశ్వర ఇత్యుపసంహారః. 13

సంహరింతువు - అవసి - పాలింతువు - నిశ్చయముగ సృష్టిమొదలగు క్రియ, ఆరు కారకములతో సాధింపదగినదిగ కనబడుచున్నది గదా అని ఇట చెప్పుచున్నాడు, 'సత్యసంకల్పం' అని - కేవలము సంకల్ప మాత్రముననే సాధ్యమగుచుండగ, బయటి సాధనముల ఆపేక్షలేదని భావము. అందువలననే నీవు ఈశ్వరుడవు అనిఉపసంహారము. 13

శ్లో॥ స త్వం భూధర భూతానాం దైత్య ప్రమథ రక్షసామ్ ।
అవతీర్ణో వినాశాయ సాధూనాం రక్షణాయ చ ॥ 14

తా. దేవతలకు శత్రువులగు దైత్యులు, మిక్కిలిగ బాధపెట్టువారు, రాక్షసులు, ఇట్టివారిలో రాజులవంటి వారును అయిన క్రూరులను నశింపజేయుట కొఱకు సాధువులను రక్షించుట కొఱకును అట్టి నీవు అవతరించితివి. 14

శ్లో॥ దిష్ట్యాద్య నిహతో దైత్యో లీలయాయం హయాకృతిః ।
యస్య హేషిత సంత్రస్తాస్త్యజన్త్య నిమిషాదివమ్ ॥ 15

తా. ఈ గుఱ్ఱము రూపముగనున్న రాక్షసుడు లీలగ ఈనాడు చంపబడుట ఆనందదాయకము. అతని సకిలింపులతో భయపడిన వారైన దేవతలు స్వర్గమును విడుచుచున్నారు. అట్టి రాక్షసుడు నేడు చంపబడుట సంతోషము. 15

టీ:- ప్రస్తుతమాహ - స ఇతి. భూధర భూతానాం భువం ధరంతీతి భూధరా రాజానస్తద్రూపాణాం. (14-15)

టీ:- ప్రస్తుతమును చెప్పుచున్నాడు - భూధర భూతానాం - భూమిని ధరించువారు భూధరులు, రాజులు - అట్టి రాజుల రూపమున నున్న వారి - (వినాశమునకు) (14-15)

శ్లో॥ చాణూరం ముష్టికం చైవ మల్లానన్యాంశ్చ హస్తినమ్ ।
కంసం చ నిహతం ద్రక్ష్యే పరశ్వోహని తే విభో ॥ 16

టీ:- చారూణమితి. పరశ్వః అహనీతి. అద్యైవ అక్రూర ఏష్యతి శ్వో మధురాం గంతాసి. పరశ్వశ్చాణూరాదీన్ త్వయా నిహతాన్ ద్రక్ష్యామీతి సిద్ధవన్నిర్దేశో విజ్ఞాపన ప్రకారవిశేషః. 16

తా. ప్రభూ! ఎల్లుండి చాణూరుడు, ముష్టికుడు, ఇతర మల్లయుద్ధ నిపుణులు, కువలయాపీడుడు అను గజము, కంసుడుకూడ నీచే చంపబడుటను చూచెదను. 16

టీ:- ఈ దినముననే అక్రూరుడు వెడలును. (నందవ్రజమునకు) రేపు మధురకు చేరును. ఇక ఎల్లుండి చాణూరుడు మొదలగువారు నీచే చంపబడగా చూచెదను - అవి - అనుకున్నట్లు జరిగిపోవునని సూచించుట విజ్ఞాపనము చేయుటలో ఒక విశేషమైన పద్ధతి. 16

శ్లో॥ తస్యాను శంఖ యవన మురాణాం నరకస్య చ ।
పారిజాతాపహరణమింద్రస్య చ పరాజయమ్ ॥ 17

తా. అటు పిమ్మట, శంఖాసురుడు, కాలయవనుడు, మురుడు, నరకాసురుడు మున్నగువారి సంహారము స్వర్గమునుండి నీచే పారిజాతవృక్షము తీసికొని రాబడుటకు ఇంద్రుడు ఓడింపబడుట (చూచెదను) 17

శ్లో॥ ఉద్వాహం వీర కన్యానాం వీర్యశుల్కాది లక్షణమ్ ।
నృగస్య మోక్షణం శాపాద్ద్వారకాయాం జగత్పతే ॥ 18

తా. శౌర్యమే సుంకముగ చెల్లించుట మొదలగు లక్షణములుగల వీరకన్యల వివాహము, జగద్భర్తవైన ఓ కృష్ణా! అటు పిమ్మట ద్వారక యందు నృగుని శాపము నుండి విముక్తుని చేయుట..18

టీ:- తస్యేతి. తస్యానుతదనంతరం. శంఖాదీనాం శంఖః పంచజనః తదాదీనాం వధం ద్రక్ష్యామీతి శేషః. భావినిర్దేశమాత్రమేతన్నత్వానంతర్యం వివక్షితం. (17-18)

టీ:- తస్య+అను-తదనంతరము,శంఖుడు - పంచభూతముల వలన పుట్టినవాడు మొదలుకొనియున్నవారి సంహారమును చూచెదనని శేషము - (ఊహ్యము) ఇది భవిష్యత్తు నిర్దేశమే - తరువాతిది చెప్పుట కాదు.(17-18)

శ్లో॥ స్యమంతకస్య చ మణేరాదానం సహ భార్యయా ।
మృతపుత్రప్రదానం చ బ్రాహ్మణస్య స్వధామతః ॥ 19

తా. జాంబవంతుని కుమార్తెయగు జాంబవతియనునామెను భార్యగా చేసికొని ఆమెతో బాటుగ స్యమంతకమణిని తీసికొని వచ్చుట, బ్రాహ్మణుని మృతపుత్రులను వారి ధామము నుండి తెచ్చి అతని కిచ్చుట. 19

శ్లో॥ పౌండ్రకస్య వధం పశ్చాత్కాశీ పుర్యాశ్చ దీపనమ్ ।
దంతవక్త్రస్య నిధనం చైద్యస్య చ మహాక్రతౌ ॥ 20

తా. అటు పిమ్మట పౌండ్రకుని - మిథ్యావాసుదేవుని వధించుట - కాశీ పట్టణమును ప్రజ్వలింపజేయుట యుధిష్ఠిరుని రాజసూయ యాగమున చేది రాజుగు శిశుపాలుని, దంతవక్త్రుని సంహరించుటయు. 20

టీ:- స్యమంతకస్యేతి. భార్యయా జాంబవత్యా సహ. స్వధామతః మహాకాలపురాత్. (19-20)

టీ:- భార్యయా - జాంబవతితో కూడా - స్వధామతః - మహాకాలుని పురము నుండి (19-20)

శ్లో॥ యానిచాన్యాని వీర్యాణి ద్వారకాయా వసన్ భవాన్ ।
కర్తా ద్రక్ష్యామ్యహం తాని గేయాని కవిభిర్భువి ॥ 21

తా. ఈ భూమి యందు కవులచే గానము చేయదగిన ఏయే వీరకృత్యములు ద్వారకలో నివసించుచున్నప్పుడు నీచే చేయబడునో వానినన్నింటిని నేను తిలకింతును. 21

టీ:- యానీతి. ద్వారకాయావసన్ ద్వారకాయాం వసన్. కర్తా కరిష్యతి. 21

టీ:- ద్వారకాయా వసన్ - ద్వారకయందు నివసించుచు - కర్తా - చేయువాడవు అయ్యెదవో -21

తా. ఇక కాలరూపుడైన, ఈ విశ్వచైతన్యమునకు ప్రళయ రూపమున శాంతిని కలుగజేయు నీవు ఓ పార్థసారధీ! అక్షౌహిణుల సైన్యమును మట్టుపెట్టించుటను కూడ నేను చూచెదను. 22

శ్లో॥ అథ తే కాలరూపస్య క్షపయిష్ణోరముష్య వై ।
అక్షౌహిణీనాం నిధనం ద్రక్ష్యామ్యర్జున సారథే ॥ 22

టీ:- అథేతి. అముష్య విశ్వస్య భూభారస్య. వా. 22

టీ:- అముష్య విశ్వస్య - భూమియొక్క భారమునకు అనియు-22

శ్లో॥ విశుద్ధ విజ్ఞానఘనం స్వసంస్థయా
సమాప్తసర్వార్థమమోఘ వాంఛితమ్ ।
స్వతేజసా నిత్యనివృత్తమాయయా
గుణప్రవాహం భగవంతమీమహి ॥ 23

తా. విశుద్ధజ్ఞానమే (జ్ఞేయనిరపేక్షమైన జ్ఞానమే) స్వరూపముగ కలవాడవు, పరమానంద స్వరూపుముచేత సకల ప్రయోజనములు పొందినవాడవు, (ఆప్తకాముడవు), వ్యర్థముకాని సంకల్పములు గలవాడవు, (సత్యసంకల్పుడవు) స్వీయతేజస్సుచేత ఎల్లప్పుడును నివర్తింప బడుచున్న మాయచేత గుణప్రవాహ రూపమైన ప్రపంచము గలవాడవు, (గుణప్రవాహ రూపమైన మాయామయప్రపంచములో ఎప్పుడును నివర్తింపబడియుండు వాడవు) షడ్గుణైశ్వర్య సంపన్నుడవును అయిన నిన్ను శరణుపొందుచున్నాను. 23

టీ:- ఏవం విజ్ఞాప్య. కృతాభివందనం భగవతం నమస్యతి- ద్వయేన. విశుద్ధేతి. కేవలజ్ఞానైకమూర్తిం. అత ఏవ స్వసంస్థయా స్వరూప సమ్యక్ స్థిత్యైవ. పరమానందరూపయా. సమ్యగాప్తాః ప్రాప్తాః. సర్వే అర్థా యేన తం. ఆప్తకామతోక్తా. సత్యసంకల్పతామాహ - అమోఘవాంఛిత మితి. నను వాంఛాచేత్. తర్హ్యస్తి దుర్నివారా సంసృతిః. అత ఆహ- స్వతేజసేతి. స్వతేజసా చిచ్ఛక్త్యా నిత్యనివృత్తో మాయాకార్యరూపో గుణప్రవాహో యస్మాత్తం. అతో భగవతం. నియతిశయైశ్వర్యం. ఈమహి శరణం వ్రజే మేతి. 23

శ్లో॥ త్వామీశ్వరం స్వాశ్రయమాత్మ మాయయా
వినిర్మితాశేష విశేష కల్పనమ్ ।
క్రీడార్థమద్యాత్త మనుష్య విగ్రహం
నతోఽస్మి ధుర్యం యదువృష్ణిసాత్త్వతామ్ ॥ 24

టీ:- ఇట్లు విజ్ఞాపనము చేసి, కృతజ్ఞతాపూర్వకముగ అభినందన మాచరించుచు భగవానునకు నమస్కరించుచున్నాడు - రెండు శ్లోకము లతో - కేవలముగ జ్ఞానైక మూర్తిని, అందువలననే స్వసంస్థయా - యథోచితమైన స్వరూపముతో నుండుట చేతనే - పరమానందరూప ముతో-చక్కగాపొందిన సకలమైనఅర్థములు (ప్రయోజనములు) కల వాడెవడో అతనిని-ఆప్తకామత్వము చెప్పబడినది. సత్యసంకల్ప త్వమును చెప్పుచున్నాడు.'అమోఘవాంఛితం' అని - వాంఛ ఉన్న యెడల అప్పుడు దుర్నివార్యమైనట్టి సంసారము ఉండును - అందుకు చెప్పుచున్నాడు. 'స్వతేజసా'అని - స్వతేజసా - చిచ్ఛక్తిచేత- నిత్య నివృతమైన మాయాకార్య రూపమగు గుణప్రవాహము (ప్రపంచము) ఎవరివలననో అతనిని- అందువలన భగవంతుని-నిరతిశయమైన ఐశ్వర్యముగల వానిని - ఈమహి - శరణు పొందుదును. అని. 23

తా. సమస్త విశ్వమును నియమించువాడవు, నిన్ను నీవే ఆశ్రయించు సర్వతంత్రస్వతంత్రుడవు, నీ మాయచేత నిర్మింపబడిన సమస్తములైన విశేషముల కల్పనము గలవాడవు, క్రీడకొఱకే పొందిన మనుష్య రూపము గలవాడవు యదువులలో, వృష్ణి వంశీయులలో, సాత్త్వతులలో అగ్రగణివైన నీకు నమస్కరించుచున్నాను. 24

శ్రీశుక ఉవాచ

శ్లో॥ ఏవం యదుపతిం కృష్ణం భగవత్ప్రవరో మునిః ।
ప్రణిపత్యాభ్యనుజ్ఞాతో యయౌ తద్దర్శనోత్సుకః ॥ 25

శ్రీశుకుడిట్లనెను.

తా. ఈ విధముగ దేవర్షియైన నారదుడు యదుపతియైన కృష్ణునకు నమస్కరించి అతనినుండి సెలవుగైకొని, అతని దర్శనము వలన కలిగిన ఉత్సాహముతో వెడలిపోయెను. 25

శ్లో॥ భగవానపి గోవిందో హత్వా కేశినమాహవే ।
పశూంశ్చాపాలయద్బాలైః ప్రీతైర్వ్రజసుఖావహః ॥ 26

తా. భగవానుడైన కృష్ణుడు కూడ యుద్ధమునందు కేశిని వధించి, ఆవులను మేపుకొనుచు, సంతుష్టులైన గోపబాలురతోకూడి వ్రజమునకు ఆనందము కలిగించుచు ఉండెను. 26

టీ:- నను త్రికాలజ్ఞస్త్వం కథమేతత్ప్రపంచం న జానాసి? జానాసి చేత్కథమగుణప్రవాహం బ్రవీషి తత్రాహ – త్వామితి. ఈశ్వరం అనన్య వశయితారం. స్వాశ్రయం అన్యస్యావశం. అత ఆత్మాధీన మాయా వినిర్మితా అశేష విశేషామహదాద్యాయాదవాదిరూపా వా కల్పనా యేన తం ధుర్యం శ్రేష్ఠం నతోఽస్మీతి. (24-26)

టీ:- త్రికాలజ్ఞానుడవగు నీవు ఈ ప్రపంచమును గూర్చి తెలియ జాలకపోవుట యెట్లు? తెలిసినచో గుణప్రవాహమును గూర్చి ఎట్లు చెప్పుచున్నావు? –చెప్పుచున్నాడు–ఈశ్వరం–ఇతరమును వశీకరరించు కొనియుండి వానిని–స్వాశ్రయం–ఇతరుల వశమున నుండనివానిని, అందువలన తన అధీనమున నున్న మాయచేత నిర్మింపబడిన సమస్త ములైన విశేషములు, మహత్తు మొదలగునవి. లేక యాదవాది రూపమైనది అయిన కల్పనము ఎవని చేతనో అట్టి వానిని–ధుర్యం– శ్రేష్ఠుడైన వానిని–నతోస్మి–నమస్కరించుచున్నాను–అని. (24-26)

శ్లో॥ ఏకదా తే పశూన్ బాలాశ్చారయంతోఽద్రి సానుషు ।
చక్రుర్నిలాయన క్రీడాం చోరపాలాపదేశతః ॥ 27

తా. ఒకసారి గోపబాలురు పర్వతముల మీది సమభూమి గల ప్రదేశములలో పశువులను చరింపజేయుచు, "దొంగ-రక్షకుడు" అను దాగుడుమూతల వంటి ఆటను ఆడుచుండిరి. 27

శ్లో॥ తత్రాసన్ కతిచిచ్చోరాః పాలాశ్చ కతిచిన్నృప ।
మేషాయితాశ్చ తత్రైకే విజహ్రురకుతోభయాః ॥ 28

తా. అచట కొందఱు గోపాలురు దొంగలుగను, మరికొందఱు రక్షకులుగను, ఇంకను కొందఱు మేకలవలెను నిర్భయముగ విహరించుచుండిరి. 28

టీ:- ప్రాతరేవం కేశవధానంతరం నారదోక్తమంగీకృత్య పునస్తథైవ పశూన్ చారయతా. వ్యోమోహతః. యద్వా. వ్యోమవధః పూర్వమేవ వృత్తోఽపి వేషధారివధ ప్రసంగాదత్రోచ్యత ఇతి ద్రష్టవ్యం. కేచిత్తునః శంఖచూడ వధాత్పూర్వమేవ పఠంతి తమాహ - ఏకదేతి. (27-28)

టీ:- ఈ విధముగ ఉదయము కేశివధ పిదప-నారదుని మాట నంగీకరించి మఱల ఎప్పటివలెనే పశువులను మేపుచున్న కృష్ణునిచేత వ్యోమాసురుడు వధింపబడెను. లేక-వ్యోమునివధ, పూర్వమే జరిగినను, వేషధారి ప్రసంగ వశమున ఇచట చెప్పబడినదని గ్రహింపదగినది. మఱికొందఱు శంఖచూడుని వధకు పూర్వమే వ్యోమ వధను పఠించుచున్నారు. దానిని ఇచట చెప్పుచున్నాడు-ఏకదా అని. 27-28

శ్లో॥ మయపుత్రో మహామాయోవ్యోమో గోపాలరూపభృత్ ।
మేషాయితానపోవాహ ప్రాయశ్చోరాయితో బహూన్ ॥ 29

తా. మయుని పుత్రుడు, గొప్ప మాయావియునైన వ్యోమాసురుడు, గోపాలరూపము ధరించి, ఆటలో తఱచుగ దొంగగా ప్రవర్తించుచు, మేకలవలె ప్రవర్తించుచు గోపాలురను చాలామందిని దొంగిలించి దాచుచుండెడివాడు. 29

టీ:- మయేతి. మేషవదాచరితాన్ స్వయం చోరవదాచరితస్సన్. ఆపోవాహ అపకృష్య నినాయ. 29

టీ:- మేకలవలె వర్తించువారిని - తాను స్వయముగ దొంగగ వర్తించుచున్నవాడై వారిని దూరముగ కొనిపోయి-అపహరించుకొని పోయి. 29

శ్లో॥ గిరిదర్యాం వినిక్షిప్య నీతం నీతం మహాసుర ।
శిలయా పిదధే ద్వారం చతుః పంచావశేషితాః ॥ 30

తా. తెచ్చినవానిని తెచ్చినట్లుగ గోపాలురనందఱిని, ఆ రాక్షసుడు పర్వతబిలములోదాచి, ఆ బిలద్వారమును ఒకపెద్దఱాతితో మూత వేసెను. అతడిట్లుచేయగా గోపాలురలో కేవలము నలుగురైదుగురు మాత్రము మిగిలిరి. 30

టీ:- గిరీతి. పిదధే ఛాదితవాన్. 30

టీ:- పిదధే - మూసివేసెను. 30

శ్లో॥ తస్య తత్కర్మ విజ్ఞాయ కృష్ణశ్శరణదస్సతామ్।
గోపాన్నయంతం జగ్రాహ వృకం హరిరివౌజసా ॥ 31

తా. ఆ రాక్షసుని పనిని తెలిసికొని, సత్పురుషులకు ఆశ్రయమిచ్చు కృష్ణుడు గోపాలురను కొనిపోవుచున్న ఆ వ్యోమాసురుని - సింహము, తోడేలును బలిమితో పట్టుకొనినట్లు పట్టుకొనెను. 31

శ్లో॥ స నిజం రూపమాస్థాయ గిరీంద్రసదృశంబలీ ।
ఇచ్ఛన్ విమోక్తుమాత్మానం నాశక్నోద్గ్రహణాతురః ॥ 32

తా. అతడు తన 'నిజ' స్వరూపమును పొంది, పర్వత శ్రేష్ఠమువలె బలిష్ఠుడైయును, తననుతాను విడిపించుకొనవలెనని కోరుచును, కృష్ణుని పట్టు వలన పీడింపబడుచున్న వాడగుటచే అందుకు శక్తుడు కాకపోయెను. 32

టీ:- తస్యేతి. శరణదః ఆశ్రయప్రదః హరిః సింహ ఇవ. (31-32)

టీ:- శరణదః - ఆశ్రయమునిచ్చువాడు - హరిః - సింహమువలె - (31-32)

శ్లో॥ తం నిగృహ్యాచ్యుతో దోర్భ్యాం పాతయిత్వా మహీతలే ।
పశ్యతాం దివి దేవానాం పశుమారమమారయత్ ॥ 33

తా. కృష్ణుడు అతనిని చేతులతో గట్టిగ బిగించి పట్టుకొని నేలమీద పడగొట్టి, పశువులను చంపువానినివలె చంపివేసెను. ఆకాశము నుండి దేవతలు చూచుచుండగనే అతనిని సంహరించెను. 33

టీ:- తమితి. పశుమారం పశుమారో యథా భవతి తథా. అవిశ్వాస మిత్యర్థః. 33

టీ:- పశుమారం - పశువులను చంపువాడెట్లో అట్లు - విశ్వాసము లేని వానిని అని యర్థము. 33

శ్లో॥ గుహ పిధానం నిర్భిద్య గోపాన్నిస్సార్య కృచ్ఛ్రతః ।
స్తూయమానస్సురైర్గోపైః ప్రవివేశ స్వగోకులమ్ ॥ 34

తా. గుహకు కప్పబడియున్న శిలాకవటము వంటి దానిని భేదించి, కృష్ణుడు గోపాలురందఱిని ఆ సంకటమునుండి బయటకుతీసి, దేవతలతోను, గోపాలురతోను స్తుతింపబడుచున్నవాడై వ్రజమును చేరెను. 34

టీ:- గుహేతి. భువి గోపైః స్తూయమానః. ఉపరి వైమానికైర్దేవైరితి. 34

టీ:- భూమియందు గోపాలురచే స్తుతింపబడుచు ఆకాశమున - వైమానికైః - దేవతలచే అని. 34

**శ్రీ మద్భాగవతే, మహాపురాణే దశమస్కంధే,**
**సప్తత్రింశోఽధ్యాయః**

**అని శ్రీమద్భాగవతమున దశమస్కంధమందు**
**ముప్పది ఏడవ అధ్యాయము సమాప్తము.**

## అష్టత్రింశోఽధ్యాయః

### శ్రీకృష్ణబలరామానయనార్థమక్రూరస్య నందగోకులప్రవేశఘట్టః

శ్లో॥ అక్రూరోఽపి చ తాం రాత్రిం మధుపుర్యాం మహామతిః ।
ఉషిత్వా రథమాస్థాయ ప్రయయౌ నందగోకులమ్ ॥ 1

శ్లో॥ గచ్ఛన్ పథి మహాభాగో భగవత్యంబుజేక్షణే ।
భక్తిం పరాముపగత ఏవమేతదచింతయత్ ॥ 2

టీ:- శ్లో."అష్టత్రింశే యథాధ్యాయన్నక్రూరోగోకులం గతః, తత్రైవ రామకృష్ణాభ్యాం గృహం నీత్వా సుసత్కృతః. ప్రాతః కేశివధే వృత్తే ద్వాదశ్యాం నిర్గతే మునౌ, తతో వ్యోమే హతేఽక్రూరస్సాయం గోకులమాగత్." తదేవం నారదేన కంసవధాదికార్యే విజ్ఞాపితే. శ్రీకృష్ణో మధురాం గంతుముద్యతో వర్తతే తదా అక్రూరోఽపి గోకులమాగమదిత్యాహ-అక్రూరోఽపీతి. అపీతి సంభావవాయాం. (1-2)

## 38వ అధ్యాయము

తా. గొప్ప బుద్ధిమంతుడైన అక్రూరుడు కూడ ఆ రాత్రి మధురలో గడిపి - ఉదయముననే రథమునధిరోహించి నందగోకులమునకు బోయెను. 1

తా. మాహాభాగ్యశాలియగు అక్రూరుడు మార్గమున బోవుచు పద్మలోచనుడై భగవానునియందు పరాభక్తిని పొంది, ఈ విషయమును ఇట్లు చింతించెను. 2

టీ:- ఈ ముప్పదిఎనిమిదవ అధ్యాయమున.. నిర్ణయించుకొనినట్లుగ అక్రూరుడు గోకులమునకు పోయెను. అట్లే బలరామకృష్ణులచేత ఇంటికి కొనిపోబడి చక్కగా సత్కరింపబడెను. ఉదయము కేశివధ జరుగగా ద్వాదశినాడు నారదుడు వెడలిపోవగా - అప్పుడు వ్యోమాసురుడుకూడ చంపబడగా - అక్రూరుడు సాయంకాలమున గోకులమునకు వచ్చెను. (ఇది శ్రీధరీయశ్లోకభావము) నారదుడు కంసవధాది కార్యమును గూర్చి ఈ విధముగ విజ్ఞాపనము చేయగా - శ్రీకృష్ణుడు మధురకు పోవుటకు సిద్ధపడియుండెను. అక్రూరుడు కూడ గోకులమునకు వచ్చెను. అపి అనునది ప్రసిద్ధియందు-(1-2)

శ్లో॥ కిం మాయాచరితం భద్రం కిం తప్తం పరమం తపః ।
కిం వాథాప్యర్హతే దత్తం యద్ద్రక్ష్యామ్యద్య కేశవమ్ ॥ 3

తా. నేను ఏమి శుభమాచరించితిని? ఏ గొప్పతపస్సు చేసితిని? ఏ మహత్తరమైన దానమును ఏ పూజ్యునకు ఇచ్చితిని? ఫల స్వరూపముగ నే నీనాడు శ్రీకృష్ణుని దర్శనమును చేసికొనబోవు చున్నాను? 3

టీ:- కిమితి. అర్హతే యోగ్యాయ. 3

టీ:- అర్హతే - యోగ్యునికొఱకు -3

శ్లో॥ మమైతద్దుర్లభం మన్యే హ్యుత్తమశ్లోకదర్శనమ్ ।
విషయాత్మనో యథా బ్రహ్మకీర్తనం శూద్రజన్మనః ॥ 4

తా. విషయాసక్త చిత్తుడైన శూద్రునకు వేదమును ఉచ్చరించు భాగ్యమెట్లో అట్లే నాకును దుర్లభమైన ఉత్తమశ్లోకుడగు కృష్ణుని దర్శనము లభింపబోవుచున్నదని తలంచుచున్నాను. 4

టీ:- స్వస్య కృష్ణదర్శనే. అసంభవ మాశంక్య పునస్సంభావయతి. -ద్వాభ్యాం. మైమతదితి. విషయాత్మనః విషయావిష్ట చిత్తస్య శూద్రాజ్జన్మ యస్య. బ్రహ్మకీర్తనం వేదోచ్చారణం యథేతి. 4

టీ:- తనకు కృష్ణదర్శనమగుటలో అసంభవత్వమును ఆశంకించి మఱల రెండు శ్లోకములతో సంభావించుచున్నాడు - విషయాత్మనః - విషయములతో ఆవేశింపబడిన చిత్తముగలవానికి - అట్టి శూద్రజన్మ గలవానికి - బ్రహ్మకీర్తనం - వేదోచ్చారణము ఎట్లో అట్లు-అని. 4

శ్లో॥ మైవం మమాధమస్యాపి స్యాదేవాచ్యుతదర్శనమ్ ।
హ్రియమాణః కాలనద్యా క్వచిత్తరతి కశ్చన ॥ 5

తా. అటులకాదు, అధముడనగు నాకు కూడ కృష్ణదర్శనము కావచ్చును. ఏలయన కాలము అను ప్రవాహముచేత కొనిపోబడు చున్న జీవులలో ఎవరో ఒకరు ఎప్పుడో ఒకప్పుడు సంసారమును తరించిపోవును 5

టీ:- మైవమితి. యద్వా-మైవం. కింతు. అధమస్యాపి నీచస్యాపి. మమ స్యాదేవ. కుత ఇత్యత ఆహ - హ్రియమాణః కాలనద్యేతి. అయం భావః. యథా నద్యా హ్రీయమాణానాం తృణాదీనాం మధ్యే. కశ్చిత్కదా చిత్తరతి తథా కర్మవశేన కాలేన హ్రీయమాణానాం జీవానాం మధ్యేఽపి. కశ్చిత్తరేదితి సంభవతీతి. 5

శ్లో॥ మామాద్యామంగళం నష్టం ఫలవాంశ్చైవ మే భవః ।
యన్నమస్యే భగవతో యోగి ధ్యేయాంఘ్రి పంకజమ్ ॥ 6

టీ:- మమేతి. అతోఽనయా ప్రవృత్త్యైవ మమామంగళం ధ్రువం నష్టమేవేతి జ్ఞాయతే. భవో జన్మ చ సఫలం జాతమితి యత్. యతః నమస్యే నమస్కరిష్యామి. 6

శ్లో॥ కంసో బతాద్యాకృతమేఽత్యనుగ్రహం
ద్రక్ష్యేఽంఘ్రిపద్మం ప్రహితోఽమునా హరేః ।
కృతావతారస్యదురత్యయం తమః
పూర్వేఽతరన్ యన్నఖమండలత్విషా ॥ 7

టీ:- లేక-ఇట్లుకాదు కాని - నీచునకు కూడ - నాకైనను సంభవింప వచ్చును. ఎందులకన చెప్పుచున్నాడు-'హ్రియమాణః కాలనద్యా' అని - దీని భావము - నదిచేత ఎట్లు కొనిపోబడుచున్న గడ్డిపరకలు మొదలగు వాని మధ్య ఏదో ఒకటి ఎప్పుడో ఒకసారి దాటిపోవును - అట్లే కర్మవశమున కాలముతో కొనిపోబడుచున్న జీవులలో కూడ ఎవడో ఒకడు తరించుట సంభవించును అని. 5

తా. నేడు నా పాపమనెడు అశుభమంతయు నశించిపోయినది. నా జన్మము ఫలవంతమైనది, ఏలయన యోగులకు ధ్యానగమ్యము మాత్రమే అయిన భగవంతుని పాదపద్మములను నేను ఈనాడు సాక్షాత్తుగ దర్శించుకొని నమస్కరింతును. 6

టీ:- అందువలన ఈ నా ప్రవృత్తి చేతనే కలుగుచున్న నా అమంగళము నిశ్చయముగ నశింపనున్నది. అని తెలియబడుచున్నది- భవః - జన్మము - కూడ సఫలమైనదిగ తెలిసినది, ఏ కారణముననో-6

తా. అహో! ఈనాడు కంసుడు నన్ను మిక్కిలిగ అనుగ్రహించినాడు. అతడు నన్ను ఈ నందగోకులమునకు పంపుటచేతనే, ఈ భూతలమున అవతరించిన భగవానుని పాదపద్మములను దర్శించుకొనగలుగు చున్నాను. అది దుర్లభము. అతని గోళ్ళమీది కాంతి చేతనే పూర్వులు అసాధ్యమైన అంధకారమును దాటగలిగిరి. 7

టీ:- అమంగళనాశే సూచనాంతరమాహ-కంస ఇతి. బతేత్యాశ్చరే. అతి ఖలః కంసోఽపి. మమాత్యంతమనుగ్రహం. అకృత కృతవాన్ యతోఽమునా ప్రహితో హరే రంఘ్రిపద్మం. ద్రక్ష్యే ద్రక్ష్యామీతి. పూర్వే అంబరీషాదయః. తమః సంసారమతరన్. తీర్ణాః. 7

టీ:- అమంగళ వినాశమునకు మరియొక సూచనను చెప్పుచున్నాడు 'బత' అని ఆశ్చర్యమునందు - మిక్కిలి దుర్జనుడైన కంసుడు కూడ నా యందు మిక్కిలి అనుగ్రహమును చూపెను. ఏలయన ఇతనిచే పంపబడినవాడనై కృష్ణుని పాదపద్మములను చూడబోవగలుగు చున్నాను. పూర్వే - అంబరీషుడు మొదలగువారు - తమః- సంసారమను చీకటిని - అతరన్ - దాటిరి. 7

శ్లో॥ యదర్చితం బ్రహ్మభవాదిభిస్సురై
శ్రియా చ దేవ్యా మునిభిశ్చ సాత్త్వతైః ।
గోచారణా యానుచరైశ్చరద్వనే
యద్గోపికానాం కుచకుంకుమాంకితమ్ ॥ 8

తా. ఏ పాదము బ్రహ్మ, శంకరుడు మొదలగు దేవతలచేత, లక్ష్మీదేవి చేత, మునులచేత, సాత్త్వతులచేతను ఆవులను మేపుచు వాని ననుసరించి అడవులలో తిరుగుచుండెడి గోపాలురచేతను పూజింప బడినదో, ఏది గోపికల యొక్క కుచముల కుంకుమమే చిహ్నముగ ధరించియున్నదో- (అట్టి కృష్ణుని పాదములను దర్శింపనున్నాను). 8

టీ:- యదితి. అంఘ్రిపద్మం విభావయదితి బ్రహ్మాదిభిరర్చితమితి పరమైశ్వర్యమాహ - శ్రియాచేతి సౌభాగ్యాతిశయం. మునిభిర్భక్తి సహితైరితి పరమపురుషార్థత్వం. గోచారణాయేతి. కృపాళుత్వం. యద్గోపికానామితి ప్రేమమాత్ర సులభత్వం. 8

టీ:- పాదపద్మము మిక్కిలి ప్రకాశించినదని - బ్రహ్మాదులచే అర్చింప బడినది అని - పరమైశ్వర్యమును చెప్పుచున్నాడు - లక్ష్మీదేవిచేత అని, అతిశయమైన సౌభాగ్యము-మునులచేత అని, భక్తితో కూడిన వారి చేత, గోవులను చరింపజేయుట కొఱకు అని పరమపురుషార్థత్వ మును కృపాళుత్వము, గోపికల యొక్క ప్రేమమాత్ర సులభత్వమును అని - భక్తులకు పరమపురుషార్థత్వమును (ప్రతిపాదించినాడు). 8

శ్లో॥ ద్రక్ష్యామి నూనం సుకపోలనాసికం
స్మితావలోకారుణ కంజలోచనమ్ ।
ముఖం ముకుందస్య గుడాలకా వృతం
ప్రదక్షిణం మే ప్రచరంత్యమీ మృగాః ॥ 9

తా. అందమైన చెక్కిళ్లు, ముక్కు; చిఱునవ్వుతో కూడిన చూపులుగల, ఎఱ్ఱని తామరవంటి కన్నులు, ఉంగరములవలె వంకరలు తిరిగియున్న కురులును కలిగిన కృష్ణుని ముఖమును నేడు తప్పక చూచెదను. ఏలయన మృగములు (లేళ్లు) నా ఎడమవైపునుండి కుడివైపునకు తిరుగుచున్నవి. (ఇది శుభశకునము) 9

టీ:- మనోరథాంతరం కరోతి–ద్రక్ష్యామీతి. శోభనౌ కపోలౌ నాసికా చ యస్మిన్ తత్. స్మితసహితః అవలోకో యస్మిన్. అరుణకంజవల్లోచనే యస్మిన్ తచ్చ తచ్చ ముఖం గుడాలకావృతం వక్ర కేశావృతం తదాని మేవ శుభసూచకం దృష్ట్వా. అతిహృష్యన్నాహ–ప్రదక్షిణమితి. 9

టీ:- మఱియొక కోరిక కోరుచున్నాడు. సుందరములైన చెక్కిళ్ళు, ముక్కు దేని యందు గలవో అది (ముఖము) చిరునవ్వుతో కూడిన చూపు, దేనియందో – ఎఱ్ఱని తామరవంటి కన్నులుదేని యందో అది – ముఖము – గుడాలకావృతం – వంకరలు తిరిగిన కురులతో ఆవరింపబడియున్న యది – అప్పుడే కలిగిన శుభసూచన చూచి మిక్కిలి సంతోషించుచు చెప్పుచున్నాడు –“ప్రదక్షిణం” అని–9

శ్లో॥ అప్యద్య విష్ణోర్మనుజత్వమీయుషో
భారావతారాయ భువో నిజేచ్ఛయా ।
లావణ్యధామ్నో భవితోపలంభనం
మహ్యంన న స్యాత్ఫలమంజసా దృశః ॥ 10

తా. మరియును, తన ఇచ్ఛచేత పుడమి బరువును దింపుటకై విష్ణుదేవుని యొక్క మనుష్యత్వమును పొందుటయు, అతని సుందరరూపము యొక్క దర్శనము నాకు కలుగుటయు అను కారణములచే నా చూపునకు (కన్నులకు) వెంటనే ఫలము కలుగకుండనుండదు. 10

టీ:- పునరప్యచ్చింతయతి–అపీతి. ఈయుషః ప్రాప్తవతః లావణ్యస్య

టీ:- మఱల వేఱొకదానిని గూర్చి ఆలోచించుచున్నాడు–ఈయుషః

ధామ ఆశ్రయః. తస్య విష్ణోః. యద్వా – విష్ణోర్లావణ్యయుక్తం యద్ధామ వపుః. తస్యోపలంభనం దర్శనం భవితా భవిష్యతి. అపి యద్యేవం స్యాత్తర్హి మహ్యం మమదృశో లోచనస్య. ఫలం న స్యాదితి న. అపి తు స్యాదేవేత్యర్థః. 10

– పొందినవాని యొక్క – లావణ్యవ్యధామ – లావణ్యము గలవాని యొక్క వాసస్థానము – ఆ విష్ణువుయొక్క నివాసము – లేక – విష్ణువు యొక్క లావణ్యముతో కూడిన – యద్ధామవపుః– శరీరముగలదో – తస్య ఉపలంభనం – దాని దర్శనము – భవితా – కాగలదు– ఇంకను ఒకవేళ ఇట్లు సంభవించినచో అప్పుడు – మహ్యం– నా యొక్క – దృశః– కనుచూపునకు ఫలం న స్యాదితి న – ఫలము కలుగదని, మరియు – కలుగుననియే అర్థము. 10

శ్లో॥ య ఈక్షితాహం రహితోఽప్యసత్సతో
స్స్వతేజసాపాస్తతమోభిదాభ్రమః ।
స్వమాయయాత్మన్ రచితైస్తదీక్షయా
ప్రాణాక్ష ధీభిస్సదనేష్వభీయతే ॥ 11

తా. అహం రహితుడై ఎవడు ఈ కార్యకారణరూప ప్రపంచమును సాక్షిమాత్రుడగ వీక్షించుచుండునో–తన తేజస్సుచే భేద భ్రమయనెడు చీకటిని పటాపంచలు చేయునో, తన మాయచేత, తనయందే, తన చూపుతోనే రచింపబడిన, ప్రాణములు, ఇంద్రియములు, బుద్ధులు మున్నగు వానిచే, జీవులుగ సదనములలో ప్రతీయమానుడగును. 11

టీ:– య ఈక్షితేతి చతుర్భిః కుళకం–తత్రైవం శంకా. అస్మదాదివదేవ కర్తృత్వ భోక్తృత్వాదిధర్మైర్త్ర తత్ర ప్రతీయమానస్య కథం విష్ణుత్వమితి. ఇమామాశంకాం శ్లోకత్రయేణాపాకుర్వంశ్చతుర్థేన తమహం ద్రక్ష్యామీతి మనోరథం కరోతి – తథాహి. య ఇతి. య ఈక్షితా ఈక్షణమాత్రకర్తా. అసత్సతోః కార్యకారణయోః ఈక్షణాదికర్తాపి అహంరహితః. అహంకార హీనః. తథా అపాస్తతమోభిదాభ్రమః. తమస్త్వజ్ఞానం. తతో భిదా

టీ:– య ఈక్షితా అను శ్లోకముతో–నాలుగు శ్లోకములతో కుళకము (ఏక వాక్యతగలశ్లోకనము దాయముకుళకము) ఇచట ఒక శంక – ఏమన – మన వంటివారివలెనె కర్తృత్వము, భోక్తృత్వము మొదలగు లక్షణములతో అచ్చటచ్చట కనబడుచున్న వానిని విష్ణుత్వమెట్లు? అని. ఈ సందేహమును మూడు శ్లోకములతో తొలగించుచు నాలుగవ శ్లోకముతో అట్టి వానిని నేను చూచెదనని ఆశంసించుచున్నాడు, అది యుక్తమే–య ఈక్షితా–ఎవడు చూచుట మాత్రమైన కర్మగలవాడో–

భేదః. తతో భ్రమః అభినివేశాదిః. అపాస్తా అపాకృతాస్తమఆదయో యస్మిన్ సః.కుత ఏతత్తత్రాహ - స్వతేజసా చిచ్ఛక్త్యా. నిత్యస్వరూప సాక్షాత్కారేణ. తతాపి స్వమాయయా స్వాధీనమాయయా తదీక్షయా తస్యైవేక్షయా ప్రాణాక్షధీభిస్సహితైః ఆత్మన్ ఆత్మని. స్వస్మిన్నేవ. రచితైర్జీవైస్సదనేషు బృందావనతరుషు. గోపీగృహేషు చ లీలయా కర్మాణి కుర్వన్ సక్తవదభీయతే ఆభిముఖ్యేన ప్రతీయతే. 11

అసత్సతోః-కార్యకారణములయొక్క-ఈక్షణమాత్రమైన కర్మగలవాడైనను-అవయవములు లేనివాడు-అహంకారములేనివాడు-మరియు తొలగించిన భేదభ్రమయనెడు చీకటిగలవాడు, తమస్సు-అజ్ఞానము దానివలన భిదాభేదము-దానివలన భ్రమ- విషయసంగము మొదలగునవి-తొలగింపబడిన అజ్ఞానము మొదలగునవి ఎవనియందో వాడు అపాస్తతమః-దేనితో? ఇట చెప్పుచున్నాడు. స్వతేజసా - చిచ్ఛక్తి చేత-నిత్యమును తన రూపమగు ఆత్మను తానే సాక్షాత్కరింపజేసికొనుట చేత - అట్లయ్యును తన మాయచేత-తన అధీనముననున్న మాయచేత -తదీక్షయా-తనదేయైన చూపుతో-ప్రాణములు, ఇంద్రియములు, బుద్ధి, మొదలగువానితో కూడినవారిచేత (జీవులచేత) ఆత్మన్-ఆత్మయందు-తనయందే-రచింపబడిన జీవునిచేత - సదనేషు - బృందా వనము నందలిచెట్లయందు-గోపికల గృహములయందు లీలగా కర్మములుచేయుచు సక్తునివలె - సంగముగలవానివలె (లిప్తుని వలె) అభీయతే - అభిముఖముగా ప్రతీతుడగును. 11

శ్లో॥ యస్యాఖిలామీవహాభిస్సుమంగళై
ర్వాచో విమిశ్రాగుణకర్మ జన్మభిః ।
ప్రాణంతి శుంభంతి పునంతి వై జగ
ద్యాస్తద్విరక్తాశ్శవ శోభనా మతాః ॥ 12

తా. సమస్తమైన పాపములు నశించిపోవుటవలన పునీతులై మంగళప్రదులైన వారిచేత మాట్లాడబడు మాటలు-వారి కరుణ మొదలగు గుణములతో, దానము మొదలగు కర్మలతోను, ఉత్తమమైన జన్మసంస్కారములచేతను, సమ్మిళితములై జగత్తును ప్రాణవంతము చేయును. శోభింపజేయును. పవిత్రీకరించును. దీనికి విరుద్ధములైన వారి వస్త్రవపూర్వాక్కుల అలంకారములు శవాలంకారములు. 12

టీ:- నను సర్వదాహంకార రహితస్యాత్మారామస్య లీలాపి కత ఇత్యాశంక్యాపరానుగ్రహార్థేత్యాశయేనాహ - యస్యేతి. అఖిలాని అఖిలస్య వా. అమీవాని పాపానిఘ్నంతీత్యఖిలామీవహాని. తైః తథా సుమంగళైః శోభనాని మంగళాని యేభ్యస్తైః. గుణాః కరుణాదయః కర్మాణి జన్మాని చ తైర్విమిశ్రాయుక్తా వాచః జగత్ ప్రాణంతి జీవయంతి శుంభంతి శోభయంతి. పునంతి పవిత్రయంతి. వ్యతిరేకమాహ - యా ఇతి. తైర్విరక్తాః రహితాః. తాస్తు స్వలంకృతా అపి వస్త్రాద్యలంకృత శవవచ్ఛోభమానాః. మతాః సతాం సమ్మతాః. 12

టీ:- నిశ్చయముగ ఎల్లప్పుడును అహంకార రహితుడైన ఆత్మారాముని లీల కూడ ఎందులకు? అని ఆశంకించి - పరులను అనుగ్రహించుట కొఱకే అను ఆశయముతోచెప్పుచున్నాడు అని విజ్ఞుల మతము - అన్నియు - లేక అన్నింటి యొక్క - అమీవాని - పాపములను - ఘ్నంతి - నశింపజేయునవి కావున అఖిలామీవహాని - వానిచేత ఆ విధముగ శోభనములు మంగళములు ఎవరి చేతనో వారిచేత - గుణాః - కరుణ మొదలగునవి - కర్మములు, జన్మములు కూడ - వానిచేత కలసిన వాక్కులు జగత్తును జీవింపజేయును. శుంభంతి - శోభింపజేయును. పవిత్రముచేయును. - వ్యతిరేకమును చెప్పుచున్నాడు. వానితో వర్తకులైనవారు - లేనివారు వారైతే చక్కగా అలంకరించుకొన్నను - వస్త్రాదులచే అలంకరింపబడిన శవములవలె శోభించుచుందురు - మతాః - విజ్ఞులకు సమ్మతమైనది ఈ అభిప్రాయము. 12

శ్లో॥ స చావతీర్ణః కిల సాత్త్వతాన్వయే
స్వ సేతుపాలామరవర్యశర్మ కృత్ ।
యశో వితన్వన్ వ్రజ ఆస్త ఈశ్వరో
గాయంతి దేవా యదశేష మంగళమ్ ॥ 13

తా. తాను రచించిన కట్టుబాట్లను (వర్ణాశ్రమధర్మములను) తానే పాలించువాడును, దేవతాశ్రేష్ఠులకు సుఖము కలిగించు వాడగుచును, సాత్త్వతుల వంశమున అవతరించినాడంట. ప్రభువైన కృష్ణుడు తన కీర్తిని విస్తృతపరచుకొనుచు వ్రజమున నివసించుచున్నాడట - అతని సమస్తములైన శుభలీలను దేవతలు కీర్తించుచున్నారు. 13

టీ:- స ఇతి. స్వయం రచితాన్ సేతూన్ వర్ణాశ్రమధర్మాన్ పాలయ తామమరవర్యాణాం సుఖకర్తా సన్నవతీర్ణః యత్ యశః. 13

టీ:- స్వయం రచితాన్ సేతూన్ - వర్ణాశ్రమ ధర్మములను పాలించు వాడు - దేవతా ముఖ్యులకు సుఖమును కూర్చువాడు, అగుచు అవతరించినాడు. యత్ - యశము - కీర్తి -13

శ్లో॥ తం త్వద్య నూనం మహతాం గతిం గురుం
త్రైలోక్యకాంతం దృశిమన్మహోత్సవమ్ ।
రూపం దధానం శ్రియ ఈప్సితాస్పదం
ద్రక్ష్యేమమాసన్నుషసస్సుదర్శనాః ॥ 14

తా. మహాత్ములకు ఆశ్రయమైనవాడు, సమస్తమునకు గురువు, ముల్లోకములకు ప్రభువు, కనులున్నవారికి తన సౌందర్యముతో మహోత్సవమును కలిగించువాడు, అట్టి అందమైన రూపమును ధరించియున్నవాడు, సంపదను అపేక్షించు వారికి స్థానమైనవాడును అయిన ఆ కృష్ణుని ఈనాడు దర్శింతును. ఏలయన నేడు నాకు ఉదయము నుండియే శుభశకునములు కన్పట్టుచున్నవి. 14

టీ:- తమితి. త్రైలోక్యే ఏకమేవ కాంతం. దృశిర్దృష్టిః తద్వతాం మహానుత్సవో యస్మాత్. యద్వా. మహానుత్సవ ఏవ. శ్రియా ఈప్సిత మాస్పదం. ఏవంభూతం రూపం శ్రీమూర్తిం దధానం. తమీశ్వరం ద్రక్ష్యామీతి. అత్ర లింగం ఉషసః ప్రభాతసమయాః. సుదర్శనాః సుఖం ప్రభాత రజస్యః. శుభసూచకా బభూవురిత్యర్థః. 14

టీ:- ముల్లోకములయందు ఇతడొక్కడే ఆకర్షణీయమైన ప్రభువు-అట్టి వానిని-దృశిః-చూపు-అదికలవారికి-గొప్ప ఉత్సవము ఎవరి వలననో అట్టి వానిని-లేక-చూచువారికి ఉత్సవమే యైన వానికి లక్ష్మిః-ఆమె కోరికకు స్థానమైన వానిని-ఇట్టి రూపము గలవానిని-సంపద్యుక్తమైన ఆకారమును ధరించియున్నవానిని-అట్టి ఈశ్వరుని దర్శింతును-అని దీనికి సూచకము-ఉషసః-ప్రభాతసమయములు సుదర్శనాః-సుఖ వంతమైనప్రభావములు-ఎట్టని కాంతితో కూడినవి. శుభసూచకము లయ్యెనని అర్థము. 14

శ్లో॥ అథావతీర్ణస్సపదీశ యోరథా
త్ప్రధానపుంసోశ్చరణం స్వలబ్ధయే ।
ధియా ధృతం యోగిభిరప్యహం ధ్రువం
నమస్య ఆభ్యాం చ సఖీన్ వనౌక సః ॥ 15

తా. బలరామకృష్ణులను చూచిన వెంటనే రథమునుండి దిగి ఆ ప్రధానపురుషులైన ప్రభువుల చరణపద్మములకు ఆత్మలబ్ధి కొఱకు నమస్కరింతును. మహాత్ములైన యోగులచేత కేవలము బుద్ధితో ధారణ చేయబడు వారి పాదములకు నేను నిశ్చయముగ సాక్షాత్తుగ నమస్కరింతును. వారి అనుచరులైన గోపాలురకును, అచట వనమున నివసించు వారలకందఱికిని నమస్కారము చేయుదును. 15

టీ:- అథేతి. కించ. అథ దర్శనానంతరం. సపది తత్ క్షణమేవ. రథాదవతీర్ణస్సన్. ప్రధానయోః పురుషయోః రామకృష్ణయోః చరణం యోగిభిరప్యాత్మలాభాయ కేవలం ధియైవ ధృతం. సాక్షాదహం నమస్యామి. ఆభ్యాం సహానయోః సఖీన్ గోపాంశ్చ నమస్యామీతి. 15

టీ:- మరియు-అథ-దర్శనము తరువాత-సపది-తత్క్షణమే-రథావతీర్ణస్సన్-రథమునుండి దిగినవాడనై, ప్రధాన పురుషులగు రామకృష్ణులయొక్కపాదమును-యోగులచేత ఆత్మలాభము కొఱకు, కేవలము బుద్ధిచేత మాత్రమే ధారణ చేయబడిన దానిని - నేను సాక్షాత్తుగ నమస్కరింతును. వీరి యొక్క పాదములతో బాటుగ - వీరి స్నేహితులైన గోపాలురను కూడ నమస్కరింతును అని. 15

శ్లో॥ అప్యంఘ్రిమూలే పతితస్య మే విభు
శ్శిరస్యాధాస్యన్నిజహస్త పంకజమ్ ।
దత్తాభయం కాలభుజంగరంహసా
ప్రోద్వేజితానాం శరణైషిణాం నృణామ్ ॥ 16

తా. నేను అతని పాదమూలమున పడగానే ఆతడు నా శిరస్సుపై తన కర పద్మమునుంచును. కాలమనెడు సర్పముచేత - దానిగమన వేగముచేత మిక్కిలిగ భయమునొందినట్టి మనుష్యులకు - తనను శరణు కోరివచ్చిన వారికి అభయమిచ్చిన ఆ చేతిని - అట్టి మహత్తరమైన చేతిని - నా తలపైనుంచును. 16

టీ:- అపీతి. కించ అధాస్యత్ ఆధాస్యతి. తద్విభావయతి. దత్తాభయ మితి సార్ధేన. 16

టీ:- అదియునుగాక - అధాస్యత్ - ఉంచును. దానిని భావన చేయుచున్నాడు. 'దత్తాభయం' అను సగము శ్లోకముతో -16

శ్లో॥ సమర్హణం యత్ర విధాయ కౌశిక
స్తథా బలిశ్చాప జగత్త్రయేంద్రతామ్ ।
యద్వా విహారే వ్రజయోషితాం శ్రమం
స్పర్శేన సౌగంధిక గంధ్యపానుదత్ ॥ 17

తా. ఏ చేతిని ఇంద్రుడు పూజించెనో-ఏ చేతియందు నీటిని వదిలి బలి మూడడుగుల నేలను దానము చేసి ముల్లోకముల ఇంద్రత్వము నొందెనో - లేక - ఏ కలువల పరిమళములవంటి పరిమళము గల చేయి, రాసక్రీడయందు, స్పర్శమాత్రముచేత వ్రజస్త్రీల శ్రమను పోగొట్టెనో - (ఆ చేతిని నా తలపై నుంచును). 17

టీ:- సమర్హణమితి. బలినా తావత్పద త్రయ పరిమిత భూదాన సమయే తస్య హస్తే ఉదకం నిహితం. కౌశిక ఇంద్రః తేనాపి కదా చిత్కించిన్నిహితమితి జ్ఞాతవ్యం ముముక్షూణాం సంసార భయ నివర్తకం సకామనామభ్యుదయ ప్రదం చేత్యుక్తం. అనురక్తానాం పరమసుఖదం చేత్యాహ - యద్వేతి. నాశబ్దో వితర్కే విహారే రాసక్రీడాయాం సౌగంధికస్య గంధ ఇవ గంధో యస్య తత్సౌగంధిక గంధి. 17

టీ:- బలి చక్రవర్తియైన మూడడుగుల భూమిని దానమిచ్చు సమయమున అతని (వామనుని) హస్తమునందు నీరు పోయబడినది -కౌశికః-ఇంద్రుడు-అతనిచేకూడ ఎప్పుడో ఒకసారి కొంచెము నీరు ఉంచబడినదని తెలియదగును. మోక్షమునుకోరువారికి సంసార భయమును పోగొట్టునది-కోరికలుగలవారికి అభ్యుదయము నిచ్చునది, అనియుచెప్పబడినది, అనురాగముగలవారికి మిక్కిలి సుఖమునిచ్చు నదికూడ అని చెప్పుచున్నాడు, 'వా' అను శబ్దము వితర్కమున- విహారే-రాసక్రీడయందు-కలువయొక్కను వాసనవంటి సువాసన దేనికో అది సౌగంధిక గంధి-17

శ్లో॥ నమయ్యుపైష్యత్యరిబుద్ధిమచ్యుతః
కంసస్య భృత్యః ప్రహితోఽపి విశ్వదృక్ ।
యోఽన్తర్బహిశ్చేతస ఏతదీహితం
క్షేత్రజ్ఞ ఈక్షత్యమలేన చక్షుషా ॥ 18

తా. "నేను కంసుని సేవకుడను. అతనిచేత పంపబడినాను" అని నా మీద కృష్ణుడు శత్రుభావనతో నుండడు. ఏలయన అతడు విశ్వమనంతయు చూడగలవాడు. ఈ నా చర్య నా బుద్ధి యొక్క అంతర్బహిస్సులనాశ్రయించి రెండు విధములుగ నున్నది. (బహిస్సున కంసుడు పంపగా వచ్చిన వాడనియు అంతస్సున కృష్ణుని శరణు పొందుటకు వచ్చిన వాడనియు) క్షేత్రజ్ఞుడైన కృష్ణుడు పవిత్రమైన దృష్టితోనే చూచును. 18

టీ:- ఏవం పరమానుగ్రహం సంభావ్య. పునరప్యసంభవమాశంక్య పరిహరతి–నేతి. యద్యప్యహం కంసేన ప్రహితః. అతస్తస్య దూతః. తథాపి. మయి అరిరయమితి బుద్ధిం నోపైష్యతి న కరిష్యతీత్యర్థః. యతః విశ్వదృక్ సర్వజ్ఞః అతో మమ చేతసః. అంతశ్చ బహిశ్చ. యదీహితం చేష్టితం ఏతత్ యః క్షేత్రజ్ఞః. అంతర్యామీ. నిత్యజ్ఞానేనేక్షతే. అయం భావః. చేతసో బహిరేవ కంసమనువర్తే అంతస్తు కృష్ణమేవ తదేవ తదసౌ హృదిస్థోజానాతీతి. యద్వా – ఏతస్య జగత ఈహితమితి. అతః. 18

టీ:- ఇట్లు కృష్ణుని అనుగ్రహమును సంభావించి–మఱల అది సంభవము కాదేమో అని ఆశంకించి, దానిని పరిహరించుచున్నాడు– నేను కంసునిచే పంపబడినవాడనైనను–అందుకే అతని దూతనైనను– అట్లైనను నాయందు"ఈతడు శత్రువు" అను బుద్ధిని కలిగియుండడు. అని అర్థము. ఎందువలన? అతడు విశ్వదృక్–సర్వజ్ఞుడు కనుక. అందువలన నా మనస్సు యొక్క ఆంతర్యము, బహిరమునైన ఈ నా చేష్టితము అతడు క్షేత్రజ్ఞుడు–అంతర్యామి–కావున నిత్యజ్ఞానముతో చూచును. దీని భావమిది. మనస్సు బయట కంసుని అనువర్తింతును. లోపలనైనచో కృష్ణునే అనువర్తించి యుందును. ఈ విషయమును కృష్ణుడు మనస్సుననుండువాడై తెలిసికొనగలుగును. లేక – ఈ జగత్తుయొక్క చేష్టితమును అని–అందువలన– 18

శ్లో॥ అప్యంఘ్రిమూలేఽవహితం కృతాంజలిం
మామీక్షితా సస్మితయార్ద్రయా దృశా ।
సపద్యపధ్వస్త సమస్త కిల్బిషో
వోఢా ముదం వీతవిశంక ఊర్జితామ్ ॥ 19

తా. అతని పాదములచెంతనే వినమ్రభావముతో అంజలి ఘటించి యున్న నన్ను చిరునవ్వుతో కూడిన ఆర్ద్రమైన చూపులతో చూచును. అప్పటికప్పుడే నా సమస్తములైన పాపములు నశించును. మహత్తరమైన ఆనందమును పొందెదను. నాలోని బలమైన శంకలు పటాపంచ లగును. 19

టీ:- అపీతి. అపి యది. అంఘ్రిమూలే చరణోపాంతే అవహితం సంయతం. కృపామృతేన ఆర్ద్రయా దృశా. మాం ఈక్షితా ద్రక్ష్యతి. తర్హి, సపద్యేవ వినష్టాఖిల కిల్బిషః పరాం ముదం. వోఢా ప్రాప్స్యామీతి. 19

టీ:- అపి - ఒకవేళ- అంఘ్రిమూలే - చరణసమీపమున - అపహితం - సావధానుడనైయున్న నన్ను - దయాబుద్ధితో కూడిన ఆర్ద్రమైన చూపుతో-నన్ను చూచును. అప్పుడు - తక్షణమే సమస్త పాపములు నశించిపోయినవాడనై అమితమైన ఆనందమును - వోఢా - పొందెదడు - అని. 19

శ్లో॥ సుహృత్తమం జ్ఞాతిమనన్యదైవతం
దోర్భ్యాంబృహద్భ్యాం పరిరప్స్యతేఽథ మామ్ ।
ఆత్మాహి తీర్థీక్రియతే తదైవ మే
బంధశ్చ కర్మాత్మక ఉచ్ఛ్వసిత్యతః ॥ 20

తా. గాఢమైన స్నేహభావముగలవాడును, బంధువును, వేఱొక దైవము లేనివాడను అయిన కృష్ణుడు, తన ఆజానుబాహువులతో నన్ను అలింగనము చేసికొనును. అతడు ఆత్మయే గదా! అందువలన నన్ను పవిత్రీకరించును. నా జన్మజన్మల కర్మరూపమైన బంధమును ఈ జీవతత్త్వమునుండి తుడిచిపెట్టును, పీల్చివేయును. 20

టీ:- సుహృదితి. అథ మాం పరిరప్స్యతే ఆలింగిష్యతి. యదా తదైవమే ఆత్మా దేహః. తీర్థీక్రియతే అతిపవిత్రీకరిష్యతే. ఉచ్ఛ్వసితి శ్లథో భవిష్యతి. అతో దేహాత్. 20

టీ:- ఆపై నన్ను ఆలింగనము చేసికొనును. ఎప్పుడట్లు చేయునో అప్పుడే నా దేహము మిక్కిలి పవిత్రముగ చేయును. ఉచ్ఛ్వసితి - శిథిలీకరించును అతః-దేహమునుండి (జీవత్వమునుండి) 20

శ్లో॥ లబ్ధాంగసంగం ప్రణతం కృతాంజలిం
మాం వక్ష్యతేఽక్రూర త తేత్యురుశ్రవాః ।
తథా వయం జన్మభృతో మహీయసా
నై వాదృతో యోఽధిగముష్య జన్మ తత్ ॥ 21

తా. అతని శరీర స్పర్శ పొందినవాడనై, తలవంచుకొని, అంజలి ఘటించి నిలబడియున్న నన్ను చూచి కృష్ణుడు ఓయీ అక్రూరా! నాయనా! అని పలుకరించును. అప్పుడు మేము సంభాషించుకొనుటకు ఉపక్రమింతుము. మనుష్యుడుగా జన్మించిన ఆ దేవదేవునితో ఆదరింపబడని వారి జన్మకు ధిక్కారము. 21

టీ:- లబ్ధేతి. తత భో తాతేతి. తదా జన్మభృతః సఫల జన్మానః. అన్యథా. తజ్జన్మైవ న భవతీత్యాహ- మహీయసేతి. మహీయసా కృష్ణేన యోఽనాదృతః. తస్య జన్మ ధిక్. అముష్య జంతోః. 21

టీ:- తాత-ఓ నాయనా! అని-అప్పుడు-జన్మభృతః-సఫలజన్ముడైన-లేకున్న-అతనికి జన్మయే సంభవింపదు అని చెప్పుచున్నాడు. మహీయసా-కృష్ణునిచేత-ఎవడు ఆదరింపబడకుండునో అతని జన్మ ధిక్కారమగును. (హేయము) అముష్య-అట్టి ప్రాణియొక్క (ఆ జన్మ వ్యర్థమైనది). 21

శ్లో॥ న తస్య కశ్చిద్దయితస్సుహృత్తమో
న చాప్రియోద్వేష్య ఉపేక్ష్య ఏవ వా ।
తథాపి భక్తాన్ భజతే యథా తథా
సురద్రుమో యద్వదుపాశ్రితార్థదః ॥ 22

తా. ఆ కృష్ణునకు ఏ ఒక్కడేని ప్రియతముడు కాకున్నను అతనితో గాఢమైన స్నేహముకలవాడు కాకున్నను, లేక అప్రియుడైనను, శత్రువైనను, అతని ఆపేక్షకు పాత్రుడు కానివాడైనను, అతడెట్టివాడైనను-కల్పవృక్షము తనను ఆశ్రయించిన వానికి కోరినదెల్ల ఇచ్చునట్లుగ-అతడేది కోరునో అది యిచ్చును. (శత్రుత్వమును కోరిన శత్రుత్వమునిచ్చును, ప్రేమను కోరిన ప్రేమనే ఇచ్చును-భక్తులు వారు కోరినట్లు వారిని భజించును). 22

టీ:- నను. సుహృదాదిషు పరిష్వంగ సంప్రశ్నాదయో జీవ ధర్మాః కథమీశ్వరే సంగచ్ఛంతే అత ఆహ-నేతి. దయితః ప్రియః తద్విపరితో ఽప్రియః సుహృత్తమోహితః. తద్విపరితో ద్వేష్యః ఏతత్సర్వ వ్యతిరిక్తః ఉపేక్ష్య ఇతి. సత్యం తథాపి భగవాన్ భక్తాన్ భజతే. తత్ర చ. మే యథా భక్తాః తాన్ తథా భజతే. శ్లో. 'యే యథా మాం ప్రపద్యం తే తాంస్తథైవ భజామ్యహమి'తి భగవద్వచనాత్. అవిషమత్వేఽపి విభక్తేభ్య ఏవ ఫలం దదాతీత్యత్ర దృష్టాంతః. యద్వత్సురద్రుమ ఇతి. 22

టీ:- కాని స్నేహితులు మున్నగువారియందు, ఆలింగనములు, కుశలప్రశ్నలు, మొదలగునవి జీవధర్మములు ఈశ్వరుని యందివి ఎట్లు పొసగును? అను ప్రశ్నకు చెప్పుచున్నాడు-దయితః-ప్రియుడు-దానికి వ్యతిరేకమైనవాడు అప్రియుడు. సుహృత్తముడు హితుడు-దానికి విపరీతమైనవాడు ద్వేషుడు. ఈ అన్నింటికిని వ్యతిరిక్తుడు ఉపేక్ష్యుడు అని. సత్యమే-అట్లైనను భగవానుడు భక్తులను భజించును. ఆ సందర్భమున నా భక్తులెట్టివారో వారిని అటుల భజింతును. "యే యథా మాం ప్రపద్యంతే తాంస్తథైవ భజామ్యహమ్" అని భగవానుడు చెప్పుటవలన-విషయత్వము లేకున్నను విభక్తులకే ఫలమునిచ్చునని కల్పవృక్ష దృష్టాంతము. (విభక్తేభ్యః-ప్రత్యేకమైనవారి కొఱకు-లేక విశేషమైన భక్తులైన వారి కొఱకు). 22

శ్లో॥ కిం వాగ్రజోమావనతం యదూత్త
మః స్మయన్ పరిష్వజ్య గృహీతమంజలౌ ।
గృహం ప్రవేశ్యాప్తసమస్తసత్కృతం
సంప్రేక్ష్యతే కంసకృతం స్వబంధుషు ॥ 23

తా. యదూత్తముడైన బలరాముడు కూడ నమ్రుడనైయున్న నన్ను నవ్వుచు ఆలింగనముచేసికొని, రెండుచేతులతో ఇంటికి తీసుకొనిపోయి సమస్తములైన సత్కారములు అందుకొనిన వానిని కాగా అట్టి నన్ను తన బంధువులతో, కంసుని వ్యవహారమెటులున్నదని ప్రశ్నించునో యేమో! 23

టీ:- కిమితి. యో మయాంజలిః కరిష్యతే. తస్మిన్నేవ గృహీతం మాం. ఆప్తాని సమస్తాన్యర్ఘ్యార్చాది సత్కృతాని యేన. తం మాం. 23

టీ:- ఏ అంజలి ఘటించియుంటినో దానితోనే తోడ్కొని పోబడిన నన్ను-పొందబడిన సమస్తములైన అర్ఘ్యము, అర్చన మొదలగు సత్కారములు ఎవరిచేతనో అట్టి నన్ను-23

**శ్రీశుక ఉవాచ**

శ్లో॥ ఇతి సంచింతయన్ కృష్ణం శ్వఫల్క తనయోఽధ్వని ।
రథేన గోకులం ప్రాప్తస్సూర్యశ్చాస్తగిరిం నృప ॥ 24

**శ్రీశుకుడిట్లనెను**

తా. రాజా! ఇట్లు కృష్ణునిగూర్చి ఆలోచించుచు, శ్వఫల్కుని కుమారుడగు అక్రూరుడు, మౌనముగా - లేక ధ్వని లేని రథమున నందగోకులమునుచేరెను. సూర్యుడు కూడ అస్తాచలనము చేరెను. 24

టీ:- ఇతీతి. స తు మార్గమపి న వేద. తథాపి రథేన ప్రాప్త ఇతి. 24

టీ:- అతనికి త్రోవకూడ తెలియదు. అయినను రథముతో బాటుగ ప్రవేశించెను అని. 24

శ్లో॥ పదాని తస్యాఖిల లోకపాల కిరీటజుష్టామల పాదరేణోః ।
దదర్శ గోష్ఠేక్షితి కౌతుకాని విలక్షితాన్యబ్జయవాంకుశాద్యైః ॥25

తా. సమస్తములైన లోకపాలకుల యొక్క కిరీటములతో సేవింపబడిన పాదధూళిగల అతని (కృష్ణుని) పాదముల ముద్రలు-పద్మము, యవలు, అంకుశము మొదలగు చిహ్నములతో, విలక్షణములైనవి, కుతూహల జనకములును అయిన పాదముద్రలు, గోష్ఠమున, భూమిపైనను అక్రూరుడు చూచెను. 25

టీ:- పదానీతి. అఖిలైర్లోకపాలైః. కిరీటేషు జుష్టాః అమలాః పాద రేణవో యస్య తస్య. క్షితి కౌతుకాని క్షితేరలంకారరూపాణి. 25

టీ:- అందరు లోకపాలకులచేత - కిరీటములయందు పడిన పవిత్రములైన పాదరేణువులు ఎవనివో అతని యొక్క - క్షితికౌతుకాని - భూమికి అలంకారరూపములుగ నున్నట్టివి. 25

శ్లో॥ తద్దర్శనాహ్లాద వివృద్ధ సంభ్రమః
ప్రేమ్ణోర్ధ్వరోమాశ్రుకళాకులేక్షణః ।
రథాదవస్కంద్య సతేష్వచేష్టత
ప్రభోరమూన్యంఘ్రి రజాంస్యహో ఇతి ॥ 26

తా. ఆ పాదములు(ముద్రలు) చూచుట వలన కలిగిన ఆనందము చేత పెరిగిన వేగిరపాటు గలవాడై, ప్రేమాతిశయముచే రోమాంచము కలిగినవాడై, కన్నీటి లేశములతో వ్యాకులపాటు చెందిన చూపుగలవాడై, రథమునుండి దిగి అక్రూరుడు, ఆ పాదముల యందు పడి పొర్లాడుచు, అహో ఇవి ప్రభువు పాదధూళులు! అని సంబరపడెను. 26

టీ:- తదితి. తద్దర్శనేన య ఆహ్లాదః. తేన వివృద్ధః సంభ్రమో యస్య సః ప్రేమ్ణా ఊర్ధ్వాణి రోమాణి యస్య సః. అశ్రూణాం కళాభిః లేశైరాకులే ఈక్షణే యస్య సః. అవస్కంద్యావప్లుత్య. తేషు పదేష్వచేష్టత వ్యలుంఠత్. అహో ఇతి దుర్లభతాం భావయన్. 26

టీ:- ఆ పాదదర్శనముతో ఏ ఆనందము కలిగినో దానితో పెరిగిన సంభ్రమము ఎవరికో అతడు-ప్రేమతోనే వేసిన పులకాంకురములు ఎవరికో అతడు-కన్నీటియొక్క లేశములచేత వ్యాకులపాటు చెందిన కన్నులు-చూపులు ఎవరికో అతడు-అవస్కంద్య-క్రిందకి లంఘించి ఆ పాదములయందు-అచేష్టత-పొర్లాడెను (ప్రేమ సంభ్రమమున మర్యాద తప్పెడు ఉద్దేశము లేదని చెప్పుచున్నాడు) అహో అని దుర్లభత్వమును భావించుచు. 26

శ్లో॥ దేహం భృతామియానర్థో హిత్వా దంభం భయం శుచమ్ ।
సందేశాద్యోహరేర్లింగదర్శన శ్రవణాదిభిః ॥ 27

తా. కంసుడు సందేశమిచ్చుట మొదలుకొని, అక్రూరుని చిత్తవృత్తిలో శ్రీహరి చిహ్నములను దర్శించుట, వినుట మొదలగువానిచే ఏ స్థితి కలిగినదో-అదియే-దంభము,భయము,శోకమువదలిన దేహధారులకు పరమ పురుషార్థము-(అక్రూరుని చిత్తవృత్తి పరమ పురుషార్థ సాధనకు ఉపాదేయమైన ఆదర్శము). 27

శ్లో॥ చిరమావేష్ట్య చోత్థాయ రథమారుహ్యా వేగతః ।
కృతి ష్ఠతి గవేశానః కృష్ణో రామ ఇతి బ్రువన్ ॥ 28

తా. చాలాసేపు అటులే ఉండి, లేచి, రథమునధిరోహించి వేగముగ బయలుదేరెను. 'రామకృష్ణ' అని జపించుచు అన్వేషణ చేయువాడు ఎవడు ఒక్కచో నిలిచి యుండును? 28

శ్లో॥ గోష్ఠమధ్య ఇతి శ్రుత్వాతరుస్థైర్గోపదారకైః ।
కృష్ణ సందర్శనాకాంక్షీ ప్రకాశేసవితుస్సతి ॥ 29

తా. చెట్టుపైనున్న గోపబాలుర చేత – కృష్ణబలరాములు గోష్ఠ మధ్యమున నున్నారని విని, కృష్ణ దర్శనమును కోరుచున్న అక్రూరుడు – సూర్యుడు ప్రకాశించుచుండగనే..29

టీ:– నను కిమర్థమేవం వ్యలుంఠత్ నాస్తి ప్రేమసంభ్రమే ఫలోద్దేశ ఇత్యాహ–దేహభాజామేతావానేవ పురుషార్థః. కంసస్య సందేశాదారభ్య హరేర్లింగదర్శన శ్రవణాదిభిర్యో యమక్రూరస్య వర్ణిత ఇతి. సందేశ ఆద్యః యస్యార్థస్య సః. యావానక్రూరస్య జాత ఇతి వా. (27–29)

టీ:– అక్రూరుడు ధూళిలో ఏలపొర్లాడెను? ప్రేమ సంభ్రమమున మర్యాద తప్పుట అను ఉద్దేశము లేదని చెప్పుచున్నాడు.దేహధారులకు ఇంతమాత్రమైనదే పురుషార్థము. కంసుని సందేశము మొదలుకొని హరి చిహ్నములను చూచుట, వినుట మొదలగువానిచేత ఏ ఈ అక్రూరుని వర్ణన కలదో – అని సందేశము మొదలు ఏ ప్రయోజనము నకు ఆతడు – అక్రూరునకెంతటి భావనలు కలిగినవో – అనియు. (27–29)

శ్లో॥ దదర్శ రామంకృష్ణం చ వ్రజేగోదోహనం గతౌ ।
పీతనీలాంబర ధరౌ శరదంబురుహేక్షణౌ ॥ 30

తా. ఆవులకు పాలు పితుకు స్థానమునకు వచ్చిన రామకృష్ణులను, అక్రూరుడు వ్రజమునందు చూచెను. వారు శరత్కాలమునందలి తామరల వంటి కన్నులు కలిగి, పసుపుపచ్చని, నీలివర్ణపు వస్త్రములు ధరించి యుండిరి. 30

శ్లో॥ కిశోరౌ శ్యామలశ్వేతౌ శ్రీనికేతౌ బృహద్భుజౌ ।
సుముఖౌ సుందరవరౌ బాలాద్విరదవిక్రమౌ ॥ 31

తా. బాలురు, ఒకరు చామన ఛాయ, ఒకరు తెలుపు వన్నెలో నున్నవారు, సౌభాగ్యము (సౌందర్యము) రాశి పోసినట్లున్నవారు, అందమైన ముఖములు గలవారు, సుందరులలో శ్రేష్ఠులు, ఏనుగు పిల్లలవలె పరాక్రమశాలురు (అయిన కృష్ణబలరాములను అక్రూరుడు చూచెను). 31

టీ:- దదర్శేతి. తతః. కృష్ణం రామం చ దదర్శ. గావో దుహ్యంతే అస్మిన్నితి గోదోహనం తత్ స్థానం గతౌ ప్రాప్తౌ. (30-31)

టీ:- అప్పుడు కృష్ణుని, రాముని చూచెను-ఆవులను, దీని యందు పాలు పితుకుదురు కావున అది గోదోహనము ఆ స్థానమునకు వచ్చిన ఆ యిరువురిని (అక్రూరుడు చూచెను). (30-31)

శ్లో॥ ధ్వజ వ్రజాంకుశాం భోజైశ్చిన్హితైరంఘ్రిభిర్వ్రజమ్ ।
శోభయంతౌ మహాత్మానౌ సానుక్రోశస్మితేక్షణౌ ॥ 32

తా. పతాకము,వజ్రాయుధము,అంకుశము,పద్మము మున్నగు చిహ్నములతో అలరారు పాదములతో వ్రజభూములను శోభాయమానము చేయుచుండువారును, మహాత్ములును, దయతోకూడిన చిరునవ్వుతో ప్రకాశించుచూపులు గలవారును (అయిన కృష్ణబలరాములను అక్రూరుడు చూచెను). 32

టీ:- ధ్వజేతి. అనుక్రోశః అనుకంపా. తద్విలసిత స్మితయుక్త వీక్షణం యయోస్తౌ. 32

టీ:- అనుక్రోశః-అనుకంపా-దయ-దానితో విలసిల్లు చిరునవ్వుతో కూడిన చూపు ఎవరికో వారు. 32

శ్లో॥ ఉదారరుచిరక్రీడౌ స్రగ్విణౌ వనమాలినౌ ।
పుణ్యగంధానులిప్తాంగౌ స్నాతౌ విరజవాససౌ ॥ 33

తా. ఔన్నత్యముగలవి, మనోహరములైనవి యునైన ఆటలాడు వారును, రత్నహారములు ధరించియున్న వారును, వనమాలలను అలంకరించుకొనిన వారును, ఆహ్లాదకరములైన పరిమళమును శరీరమునకు పులుముకొనిన వారును, అప్పుడే స్నానముచేసి ప్రకాశ వంతమైన వస్త్రములు ధరించిన వారును (అయిన వారిని చూచెను)33

టీ:- ఉదారేతి. ఉదారా రుచిరా క్రీడా యయోస్తౌ. స్రగ్విణౌ రత్నస్రగ్భి రలంకృతౌ. 33

టీ:- ఉదారా - ఔన్నత్యముగలవి, మనోహరములైనవియునైన ఆటలాడు వారును - రత్నస్రగ్భిరలంకృతౌ - రత్నహారములు ధరించియున్న వారును. (33)

శ్లో॥ ప్రధానపురుషావాద్యౌ జగద్ధేతూ జగత్పతీ ।
అవతీర్ణౌ జగత్యర్థే స్వాంశేన బల కేశవౌ ॥ 34

తా. ప్రధానులైన పురుషులను, ఆద్యులను, జగత్తుకు కారణులైన వారును, జగత్తునకు పతులును, జగత్తు కొఱకు అవతరించిన వారును -మూర్తిభేదములచే నేర్పడిన బలరామకృష్ణులను-34

టీ:- ప్రధానేతి. ప్రధానభూతౌ పురుషౌ. ప్రకృతి పురుషాత్మకౌ వా. కుతః? ఆద్యౌ. తదపి కుతః? జగద్ధేతూ. అత ఏవ. జగత్పతీ విపరీతో వా చతుర్ణాం పదానాం హేతు హేతుమద్భావః. జగత్యర్థే పృథివ్యాః భారాపనయనాయ. స్వాంశేన మూర్తిభేదేన బలకేశవౌ సంతౌ. 34

టీ:- ప్రధానభూతులైన పురుషులను - లేక ప్రకృతి పురుషాత్మకులగు వారిని-ఎందువలన? ఆద్యులగుటవలన-అదియును ఎందులకు? జగత్కారణులగుట వలన-అందులకే జగత్పతులు-లేక మరియొక విధముగ-నాలుగు పదములకు కారణకార్యభావము-జగత్యర్థే-పుడమి భారమును తగ్గించుటకు-స్వాంశేన-మూర్తిభేదముచేత-బలరామ కృష్ణులు ఉండగా-34

శ్లో॥ దిశో వితిమిరా రాజన్ కుర్వాణౌ ప్రభయా స్వయా ।
యథా మరకతశ్శైలోరౌప్యశ్చ కనకాచితౌ ॥ 35

తా. రాజా! వారు తమ కాంతిచేత, అంధకార మయములైన దిక్కులను ప్రకాశింపజేయుచు, హరిన్మణి వలె, బంగారు కాంతి వ్యాపించియున్న వెండికొండ వలె వెలుగుచుండిరి. 35

శ్లో॥ రథాత్తూర్ణమవప్లుత్యసోఽక్రూర స్స్నేహ విహ్వలః ।
పపాత చరణోపాంతే దండవద్రామ కృష్ణయోః ॥ 36

తా. స్నేహముతో వివశుడై అక్రూరుడు, వెంటనే రథమునుండి క్రిందకు దూకి బలరామకృష్ణులచెంత దండమువలె పడి - వారికి సాష్టాంగ నమస్కారము చేసెను. 36

టీ:- దిశ ఇతి. స్వ ప్రభయా విగత తిమిరా దిశః కుర్వాణౌ కనకాచితౌ సువర్ణవ్యాప్తావితి సాలంకారయోః శైలసాదృశ్యార్థముక్తం. (35-36)

టీ:- తమ కాంతిచేత దిక్కుల చీకటిని తొలగించుచు-కనకాచితౌ- బంగారు(వన్నె) వ్యాపించియున్న అని అలంకారములు గల వారికి, కొండతో పోలికగల అర్థము చెప్పబడినది. (35-36)

శ్లో॥ భగవద్దర్శనాహ్లాద బాష్ప పర్యాకులేక్షణః ।
పులకాంచితాంగ ఔత్కంఠ్యాత్స్వాఖ్యానేనాశకన్నృప ॥ 37

తా. రాజా! భగవానుని దర్శనము వలన కలిగిన ఆనందముతో వెలువడిన కన్నీటి వలన కంగారుపడిన చూపులుగలవాడై, అక్రూరుడు పులకరించిపోయి, ఉత్కంఠ వలన తనపేరు తాను చెప్పుకొనుటకు అశక్తుడయ్యెను. (గోత్రప్రవరములతో అభివాదము చేయుటకు శక్తి లేని వాడయ్యెను). 37

టీ:- భగవదితి. భగవద్దర్శనాహ్లాదేన యద్బాష్పం. తేన పర్యాకులే ఈక్షణే యస్య సః పులకైరాచితం వ్యాప్తం అంగం యస్య సః. స్వాఖ్యేనే అక్రూరోఽహం నమస్కరోమీతి. కథనేనాశక్నోత్. 37

టీ:- భగవానుని దర్శనము వలన ఏ కన్నీరు వెలువడుచుండెనో దానిచేత వ్యాకులపాటు చెందిన చూపులు ఎవనికో వాడు-పులకలచేత వ్యాప్తమైన శరీరము ఎవనికో వాడు-స్వాఖ్యానే-"నేను అక్రూరుడు, నమస్కరించుచున్నాను" అని చెప్పుటకు శక్తుడు కాకపోయెను. 37

శ్లో॥ భగవాంస్తదభిప్రేత్య రథాంగాంకిత పాణినా ।
పరిరేభ్యేఽభ్యుపా కృష్య ప్రీతః ప్రణత వత్సలః ॥ 38

తా. కృష్ణభగవానుడు అక్రూరుని ఆంతర్యమును గ్రహించి, చక్ర చిహ్నముగల తనచేతితో తనవైపునకు లాగికొని మిక్కిలి సంతోషించి, నమస్కరించువారిపై వాత్సల్యమును చూపు భక్తవత్సలుడు అతనిని ఆలింగనము చేసికొనెను. 38

టీ:- భగవానితి. అభిప్రేత్య అక్రూరోఽయమేవ తదర్థమాగత ఇతి జ్ఞాత్వా. కంసహనన సామర్థ్యం ద్యోతయన్నివ. రథాంగేన చక్రేణాంకితో యః పాణిః తేనాభ్యుపాకృష్య తమాలింగితవాన్. 38

టీ:- అభిప్రేత్య - "ఇతడు అక్రూరుడు" - ఈ అర్థము వచ్చినది అని తెలిసికొని -కంసుని సంహరించు సామర్థ్యమును ప్రకటించుచున్న వాని వలె - రథాంగేన - చక్ర చిహ్నితమైన ఏ చేయి గలదో దానితో అతనిని లాగి కౌగలించుకొనెను. 38

శ్లో॥ సంకర్షణశ్చ ప్రణతముపగూహ్య మహామనాః ।
గృహీత్వా పాణినా పాణీ అనయత్సానుజో గృహమ్ ॥ 39

తా. బలరాముడు కూడ ఆ నమస్కరించిన అక్రూరుని, చేతితో తన చేతులను కలిపి ఆలింగనము చేసికొని, గొప్ప మనస్వియై తన తమ్మునితో బాటుగ అక్రూరుని కూడ ఇంటికి తోడుకొని పోయెను. 39

టీ:- సంకర్షణ ఇతి. పాణీ అంజలి రూపేణ సంహతావేవ. గృహీత్వా. 39

టీ:- పాణీ - అంజలి రూపముగ దృఢముగ పట్టుకొని - కొనిపోయి - 39

శ్లో॥ పృష్ట్వాథ స్వాగతం తస్మై నివేద్య చ వరాసనమ్ ।
ప్రక్షాళ్య విధివత్పాదౌ మధుపర్కార్హమాహరత్ ॥ 40

తా. ఇంటికి కొనిపోయిన పిదప, కుశలప్రశ్నలువేసి, స్వాగతము పలికి, శ్రేష్ఠమైన ఆసనముపై అతనిని కూర్చుండజేసి యథా విధిగ అతని పాదములు కడిగి మధుపర్కముతో పూజించిరి. 40

శ్లో॥ నివేద్య గాం చాతిథయే సంవాహ్య శ్రాంతమాదృతః ।
అన్నంబహుగుణం మేధ్యం శ్రద్ధయోపాహరత్ప్రభుః ॥ 41

తా. అతిథియైన అక్రూరునకు గోవునిచ్చి, ఆదర పూర్వకముగ పాదములొత్తి అతని అలసటను తగ్గించి, కృష్ణుడు అనేక విధములైన స్వచ్ఛమైన ఆహార పదార్థములను శ్రద్ధగా అతనిచే ఆరగింపజేసెను. 41

శ్లో॥ తస్మై భుక్తవతే ప్రీత్యా రామః పరమధర్మవిత్ ।
ముఖవాసైర్గంధమాల్యైః పరాం ప్రీతిం వ్యధాత్పునః ॥ 42

తా. అక్రూరుడు ప్రీతితో భోజనము చేసిన తరువాత, పరమధర్మము తెలిసిన బలరాముడు అక్రూరునకు నోటిని పరిమళభరితముచేయు తాంబూలాదులను, సువాసనల పూలదండలను పరమ ప్రీతితో నిచ్చెను. 42

టీ:- దృష్ట్వేతి. మధుపర్క ఏవార్హః అర్హణం పూజా. తస్మిన్ వా యదుచితమర్హణం ఆహరత్ ఆనీయ సమర్పితవానిత్యర్థః. (40-42)

టీ:- మధుపర్కమే పూజగా - లేక - అతని యందు ఏ పూజ అర్హమైనదో -ఆహరత్-తెచ్చి సమర్పించెను అని అర్థము. (40-42)

శ్లో॥ ప్రపచ్ఛ సత్కృతం నందః కథం స్థ నిరనుగ్రహే ।
కంసే జీవతి దాశార్హ సౌనపాలా ఇవావయః ॥ 43

తా. అటుల సత్కారమునందిన అక్రూరుని, నందుడు, దశార్హ వంశీయుడవైన అక్రూరా! కఠిన హృదయుడగు కంసుడు జీవించి యుండగా మీరు అతని ఏలుబడి క్రింద - కసాయివాని పాలనలో మేకలవలె - ఎట్లు జీవించుచుంటిరి? 43

టీ:- పప్రచ్ఛేతి. సత్కృతం సంమానితం నిరనుగ్రహేఽక్రూరే కథం కేన ప్రకారేణస్థ. జీవథేత్యర్థః. సౌవః పశుఘాతీ. సఏవ పాలకో యేషాం అనీనాం మేషాణాం త ఇవ తత్తుల్యా ఇత్యర్థః. 43

టీ:- సత్కృతం - సంమానిడుని - నిరనుగ్రహే - క్రూరుడైనవాడు - జీవించి యుండగా మీరు ఏ విధముగ జీవించుచుంటిరి? సౌ వః - పశువులను వధించువాడు. అతడే - అవీనాం - మేకలకు పాలకుడై నప్పుడు అతనితో సమానుడైన కంసుని పాలనలో మీరెట్లు జీవించుచున్నారు? అని యర్థము. 43

శ్లో॥ యోఽవధీత్స్వస్వ సుస్తోకాన్ క్రోశంత్యా అసుతృప్ఖలః ।
కిం నుస్విత్తత్ప్రజానాం వః కుశలం విమృశామ హే ॥ 44

తా. ఆ దుర్మార్గుడు తన చెల్లెలి పిల్లలనే వారు ఏడ్చుచుండగా చంపినవాడు - ప్రాణములు తీయుటే వానికి తృప్తికలిగించును. అట్టి వానిచే పరిపాలింపబడుచున్న మీ క్షేమమును గూర్చి ఏమి ప్రశ్నింతుము. 44

టీ:- నిరనుగ్రహతామాహ-యోఽవధీదితి. తోకాన్ తోకాని. అసుతృప్ అసూనేవ తర్పయతి. యః. అతః ఖలః తస్య కంసస్య ప్రజానాం హే అక్రూర. ఏషాం జీవనమాత్రమపి దుర్లభం తేషాం వః

టీ:- కంసుని నిరనుగ్రహత్వమును చెప్పుచున్నాడు-తోకాన్- సంతానములను - అసుతృప్ - ప్రాణములను తర్పణము చేయువాడు - అందువలన దుష్టుడు - అట్టి కంసుని ప్రజలకు - ఓ అక్రూరా!

కిం ను కుశలం విచారయామేతి. 44

జీవించుట మాత్రమైనను దుర్లభమగునట్టి మీకు కుశలమును ఏమి విచారింతుము? అని. 44

శ్లో॥ ఇత్థం సూనృతయా వాచా నందేన సుసభాజితః ।
అక్రూరః పరిపృష్టేన జహావధ్వ పరిశ్రమమ్ ॥ 45

తా. నందునిచే ఇట్లు మధుర వాక్యములతో గౌరవింపబడిన అక్రూరుడు - అతని ఆత్మీయమైన ప్రశ్నలతో మార్గాయాసము నుండి తేలికపడెను. 45

టీ:- ఇత్థమితి. మధురయా వాచా. ఇత్థం సత్కృతః తయైవ వాచా పరిపృష్టేన ప్రశ్నేన. అధ్వపరిశ్రమం సంసారశ్రమం. 45

టీ:- మధురమైన వాక్యములచేత ఈ విధముగ సత్కరింపబడినవాడై - అనే వాక్యములచేత - పరిపృష్టేన - ప్రశ్నచేత అధ్వపరిశ్రమం - సంసారశ్రమను - (దింపుకొనవాడయ్యెను). 45

**శ్రీ మద్భాగవతే, మహాపురాణే దశమస్కంధే,**
**అష్టత్రింశోఽధ్యాయః**

**అని శ్రీమద్భాగవతమున దశమస్కంధమందు**
**ముప్పది ఎనిమిదవ అధ్యాయము సమాప్తము.**

## ఏకోనచత్వారింశోఽధ్యాయః

**శ్రీశుక ఉవాచ**

శ్లో॥ సుఖోపవిష్టః పర్యంకే రామకృష్ణోరుమానితః ।
లేభే మనోరథాన్ సర్వాన్ పథియాన్ స చకార హ ॥ 1

శ్లో॥ కిమలభ్యం భగవతి ప్రసన్నే శ్రీనికేతనే ।
తథాపి తత్పరారాజన్నహి వాంఛతి కించన ॥ 2

శ్లో॥ సాయంతనాశనం కృత్వా భగవాన్ దేవకీసుతః ।
సుహృత్సువృత్తిం కంసస్య పప్రచ్ఛాన్యచ్చికీర్షితమ్ ॥ 3

టీ:- శ్లో. నవత్రింశే పురీం గచ్ఛత్యచ్యుతే గోపికోక్తయః, అక్రూరేణాథ కాళింద్యాం విష్ణులోకస్య దర్శనమ్. భక్తానాం మనోరథాః సత్యా భవంతీతి ద్యోతయన్నాహ - సఖోపవిష్ట ఇతి. రామ కృష్ణాభ్యామురు అధికం మానితః(1-3)

## 39వ అధ్యాయము

**శ్రీశుకుడిట్లనెను.**

తా. బలరామకృష్ణులచేత గొప్పగా సత్కారము చేయబడిన అక్రూరుడు పడక మంచముపై హాయిగ కూర్చుండెను. తాను త్రోవలో కోరుకొనిన కోరికలన్నింటిని కూడ అతడు పొందగలిగెను. 1

తా. లక్ష్మీదేవికి స్థానమైన భగవానుడు ప్రసన్నుడైనప్పుడు లభింపని దేమి? అయినను రాజా! అతడు ప్రసన్నుడైన వేళ భక్తులు తత్పరులై యుండుటచే ఏమియు కోరకుందురు. 2

తా. దేవకీ నందుడైన కృష్ణుడు, సాయంకాల భోజనముచేసిన పిదప, అక్రూరునితో, స్వజనుల యెడ కంసుడు వ్యవహరించు తీరును, అతని భవిష్యత్కార్యమును గూర్చి ప్రశ్నించెను. 3

టీ:- ఈ ముప్పదితొమ్మిదవ అధ్యాయమున కృష్ణుడు మధురానగరికి పోవుట, గోపికల ఉక్తులు అటుపైన అక్రూరునిచే యమునానదియందు విష్ణులోకదర్శనము (వర్ణింపబడును) భక్తుల కోరికలు సత్యములగును అని సూచించుచు చెప్పుచున్నాడు - రామకృష్ణులచేత ఘనముగ సత్కరింప బడినవాడై...(1-3)

**శ్రీభగవానువాచ**

శ్లో॥ తాత సౌమ్యాగతః కంసాత్స్వాగతం భద్రమస్తువః ।
అపి స్వజ్ఞాతిబంధూనామనమీవమనామయమ్ ॥ 4

టీ:- తాతేతి. హేతాత హేసౌమ్య. స్వాగతం. యథా తథా ఆగతః. స్వజ్ఞాతి బంధూనాం స్వే సుహృదః జ్ఞాతయః. సపిండాః బంధవః. అసపిండాః సంబంధినః తేషామపి కిం అనమీవం అపాపం. అదుః ఖం సుఖమితి యావత్. అనామయమారోగ్యం. 4

**భగవానుడు పలికెను.**

తా నాయనా! సౌమ్యుడా! కంసుని నుండి వచ్చిన నీకు స్వాగతము. నీకు కళ్యాణమగు గాక, శుభమగు గాక! మీ ఆత్మీయులు, సపిండులైన జ్ఞాతులు, అసపిండులైన బంధువులు సుఖముగ నున్నారు గదా! ఆరోగ్యవంతులుగ నున్నారు గదా ! 4

టీ:- నాయనా! సౌమ్యా! నీకు స్వాగతము. ఇటకు వచ్చితివి. స్వజ్ఞాతి బంధూనాం-స్వే-నీ వారు-స్నేహితులు జ్ఞాతయః-సపిండులు-బంధవః-అసపిండులు-సంబంధించినవారు. వారికిని-కిం అనమీవం -పాపరహితస్థితియే కదా!-దుఃఖరహితులే కదా! అని-అనామయం-ఆరోగ్యము. 4

శ్లో॥ కిన్నువః కుశలం పృచ్ఛే హ్యేధమానే కులామయే ।
కంసే మాతులనామ్న్యంగ స్వానాం న స్తత్ప్రజాసు వై ॥ 5

టీ:- ఏవం ప్రశ్నోఽపి మమ నాతీవ సంగత ఇత్యాహ-కిన్నితి. అంగ హే అక్రూర. పృచ్ఛే పృచ్ఛామి నః అస్మాకం కులస్యామయే రోగే. నః మాతుల ఇతి నామ యస్య తస్మిన్. నః స్వానాం జ్ఞాతీనాం. తస్య ప్రజాసు చ. 5

తా. అక్రూరా! పేరుకు మాత్రము మేనమామయగు కంసుడు, మాకులము నందొక వ్యాధి రూపమున ఎదుగుచున్నప్పుడు, స్వీయమైన వారి యొక్కయు, వారి సంతానముల యొక్కయు క్షేమమునేమి అడుగగలము. 5

టీ:- అంగ-ఓ అక్రూర!పృచ్ఛే-అడడుగగలను? మా కులము యొక్క రోగముగ-మా యొక్క మేనమామ అను పేరు ఎవరిదో అట్టివాడు పాలకుడుగనుండగ మా బంధువులయొక్క-వారి బిడ్డలయొక్క కుశలమెట్లు ప్రశ్నించును. 5

శ్లో॥ అహో అస్మదౌభూద్భూరి పిత్రోర్వృజినమార్యయోః ।
యద్ధేతోః పుత్ర మరణం యద్ధేతోర్బంధనం తయోః ॥ 6

టీ:- అహో ఇతి. అస్మదస్మన్నిమిత్తం. వృజినం దుఃఖం ఆర్యయోః నిరపరాధయోః యద్ధేతోర్యోఽహమేవ హేతుః తస్మాత్. 6

తా. అహో! పూజ్యులైన మా తల్లిదండ్రులకు గొప్ప దుఃఖము కలిగినది. నా కారణముగనే వారి పుత్రుల మరణము, వారికి బంధనము కలిగినవి. 6

టీ;- అస్మత్-మా నిమిత్తముగ-నృజినం-దుఃఖము-ఆర్యయోః -నిరపరాధులకు-యద్ధేతోః-నేనే కారణమును-అందువలన-6

శ్లో॥ దిష్ట్యాద్య దర్శనం స్వానాం మమవస్సౌమ్యకాంక్షితమ్ ।
సంజాతం వర్ణ్యతాం తావత్తవాగమన కారణమ్ ॥ 7

టీ:- దిష్ట్యేతి. హే సౌమ్య స్వానాం వో దర్శనం అద్య మమ సంజాతం దిష్ట్యా భద్రం. 7

తా. ఓ సౌమ్యుడా! మా వారైన మీలో ఎవరైనను వత్తురేమో అనెడి నా కోరిక నేడు మీ దర్శనముతో తీరినది. ఆనందము కలిగినది. ఇంతకును మీ రాకకు కారణమేమిటో సెలవిండు. 7

టీ:- సౌమ్యుడా! మావారైన మీ దర్శనము నేడు నాకు శుభము, ఆనందము కలిగించినది. 7

### శ్రీ శుక ఉవాచ

శ్లో॥ పృష్టో భగవతా సర్వం వర్ణయామాస మాధవః ।
వైరానుబంధం యదుషు వసుదేవవధోద్యమమ్ ॥ 8

టీ:- పృష్ట ఇతి. మాధవః మధోర్వంశజః. 8

### శ్రీశుకుడు ఇట్లుపలికెను

తా. కృష్ణునిచే ఇట్లు ప్రశ్నింపబడిన మధువంశజుడైన అక్రూరుడు కంసుని వృత్తాంతము చెప్పదొడగెను. యదువంశీయులయందు కంసుడు పగబూని యున్నాడు. వసుదేవుని చంపుటకు ఉద్యమించుచున్నాడుకూడ. 8

టీ:- మాధవః-మధువుయొక్క వంశమున జన్మించినవాడు. 8

శ్లో॥ యత్సందేశో యదర్థం వా దూతస్సం ప్రేషితస్స్వయమ్ ।
యదుక్తం నారదేనాస్య స్వజన్మానక దుందుభేః ॥ 9

తా. తాను తెచ్చిన కంసుని సందేశమేదియో – తననే స్వయముగ దూతగా పంపుట యెందులకో – కృష్ణుని జననము వసుదేవుని వద్దనేయని నారదుడు చెప్పుట మొదలైనవన్నియు అక్రూరుడు వివరించెను. 9

టీ:– యదితి. యః ధనుర్మఖఛద్మా సందేశో యస్య. యదర్థం చాణూరాదిభిః ఘాతనార్థం. అస్య కృష్ణస్య స్వజన్మ కృష్ణ జన్మ ఆనక దుందుభేస్సకాశాత్. 9

టీ:– ధనుర్యజ్ఞము మిషతో రామకృష్ణులను మధురకు రమ్మని కంసుని ఆహ్వాన సందేశము, చాణూరుడు మొదలగువారిచేత రామకృష్ణులను చంపించుట యనెడు కారణమును, ఈ కృష్ణుని జన్మ వసుదేవుని వద్ద–అని. 9

శ్లో॥ శ్రుత్వాక్రూర వచః కృష్ణో బలశ్చ పరవీరహా ।
ప్రహస్య నందం పితరం రాజ్ఞోద్దిష్టం విజజ్ఞతుః ॥ 10

తా. శత్రువీర దమనులగు కృష్ణుడు బలరాముడును అక్రూరుని మాటలువిని, బిగ్గరగ నవ్వి, తండ్రియగు నందునకు కంసునియొక్క ఉద్దేశమును తెలిపిరి. 10

టీ:– శ్రుత్వేతి. విజజ్ఞతుః విశేషేణ జ్ఞాపయామాసతుః. 10

టీ:– విజజ్ఞతుః – విశేషముగ ఎఱింగించిరి. 10

శ్లో॥ గోపాన్ సమాదిశత్సోఽపి గృహ్యతాం సర్వ గోరసః ।
ఉపాయనాని గృహ్ణీధ్వం యుజ్యంతాం శకటాని చ ॥ 11

తా. నందుడు కూడ గోపాలురను ఆజ్ఞాపించెను. "పాలు, పెరుగు మొదలగు గో రసములు, వివిధములైన కానుకలు, మధురకు తీసికొని పోవుటకు సిద్ధము చేయుడు. బండ్లు కట్టి ప్రయాణ సన్నాహములు చేయుడు". అని. 11

టీ:- గోపానితి సోఽపి నందోఽపి. గోపాన్ సమాదిశత్. తదేవ దర్శయతి-గృహ్యతామిత్యాదినా. గోరసః క్షీరాదిః. ఉపాయనాని ఉత్తమ వస్తూని. 11

టీ:- సః+అపి-నందుడుకూడ-గోపాలురనాజ్ఞాపించెను-దానినే చూపుచున్నాడు. 'గృహ్యతాం' (తీసికొనుడు) మొదలగు మాటలతో- గోరసః-పాలు మొదలగునవి-ఉపాయనాని-ఉత్తమ వస్తువులను-11

శ్లో॥ యాస్యామశ్శ్వో మధుపురీం దాస్యామో నృపతే రసాన్ ।
ద్రక్ష్యామస్సుమహత్సత్రం యాంతి జానపదాః కిల ॥ 12

తా. రేపు ప్రాతఃకాలముననే మనము మధురానగరమునకు చేరవలెను. గోరసమును రాజుగారికీయవలెను. అచట జరుగు గొప్ప ధనుర్యాగమును మనము కూడ చూతుము. పల్లెజనము కూడ అచటికి వత్తురట! 12

టీ:- యాస్యామ ఇతి. రసాన్ ఘృతాదీన్. శబ్దచ్ఛలేనేదం సూచయతి - అచికిత్స్య రోగస్య చికిత్సార్థం శ్రీ కృష్ణజన్మరసాన్ దాస్యామ ఇతి. 12

టీ:- రసాన్-నేయి మొదలగు వానిని-మాటల మిషతో ఈ విషయమును సూచిచించున్నాడు-'చికిత్సకు లొంగని రోగమునకు చికిత్స చేయుట కొఱకు శ్రీకృష్ణుని జన్మము అనెడు రసములను (ఔషధములను) ఇత్తము' అని- 12

శ్రీ శుక ఉవాచ

శ్లో॥ ఏవమాఘోషయత్ క్షత్రానందగోపస్స్వ గోకులే ।
గోప్యస్తాస్తదుపశ్రుత్య బభూవుర్వ్యథితా నృప ।
రామకృష్ణౌ పురీం నేతుమాక్రూరం వ్రజమాగతమ్ ॥ 13

శ్రీశుకుడిట్లనెను.

తా. పరీక్షిన్మహారాజా! ఈ విధముగ నందుడు వ్రజ రక్షకునిచేత నందగోకులమునందంతటను చాటింపు వేయించెను. ఇక గోపికలు, అక్రూరుని ఆగమనమును విని (కృష్ణుడు మధురకు పోవునేమో అని) వ్యథ చెందిరి. బలరామకృష్ణులను మధురకు తీసికొనిపోవుటకై అక్రూరుడు వ్రజమునకు వచ్చెనని (విని గోపికలు వ్యధితులైరి). 13

టీ:- ఏవమితి. క్షత్రా వ్రజరక్షాధికృతేన ఆఘోషయత్ సర్వతో ఘోషితవాన్. తాః కృష్ణైకజీవనాః గోప్యః. తత్తదా. అక్రూర మాగత ముపశ్రుత్యేతి. 13

టీ:- క్షత్రీ-వ్రజరక్షకుని మూలమున-అఘోషయత్-అంతటను చాటింపు వేయించెను. ఆకృష్ణైక జీవనులగు గోపికలు-అక్రూరుడు వచ్చుట విని-అని. 13

శ్లో॥ కాశ్చిత్తత్కృత హృత్తాపశ్వాసమ్లాన ముఖశ్రియః ।
స్రంసద్దుకూల వలయ కేశబంధాశ్చ కాశ్చన ॥ 14

తా. ఆ వినుట చేత కొందఱు గోపికలు, హృదయ తాపము వలని శ్వాసతో ముఖ సౌందర్యములు గలవారై, కట్టుకొనిన వస్త్రములు సడలిపోవుట, ధరించిన కంకణములు జారిపోవుట, ముడిచిన సిగముడులు విడిపోవుటయును గమనింపలేకపోయిరి. 14

టీ:- వ్యధాలింగాన్యాహ-పంచభిః. కాశ్చిదితి. తేన శ్రవణేన కృతో హృత్తాపః. తేన యః శ్వాసస్తేన మ్లానా ముఖశ్రీ ర్యాసాం తాః. బభూవురితి దుకూలాని చ వలయాని చ కేశగ్రంథ యశ్చ స్రంసంతో దుకూలాదయో యాసాం తథా భూతాః కాశ్చన బభూవురిత్యర్థః. 14

టీ:- వారి వ్యధ్య యొక్క చిహ్నములను ఐదుశ్లోకములతో చెప్పు చున్నాడు - ఆ వినుటచేత చెలరేగిన హృదయమునందలి తాపము చేత వెలువడు ఏ శ్వాసగలదో దానిచేత వాడిపోయిన ముఖవర్చస్సు ఎవరియందో వారు-అయిపోయిరి అని-వస్త్రములు, కంకణములు, సిగముడులు-జారిపోవుచున్న వస్త్రాదులు ఎవరియందో అట్టివారు -కొందఱు-అయిరి, అని యర్థము. 14

శ్లో॥ అన్యాశ్చ తదనుధ్యాన నివృత్తాశేష వృత్తయః ।
నాభ్యజానన్నిమం లోకమాత్మ లోకం గతా ఇవ ॥ 15

తా. మఱికొందఱు కృష్ణుని గుఱించిన ఆలోచనతో తక్కిన అన్ని పనులు మానివేసినవారై, ఈ లోకమును గూర్చి ఏ స్పృహయులేక ముక్తులవలె నుండిపోయిరి. 15

టీ:- అన్యా ఇతి. తస్య శ్రీకృష్ణస్యానుధ్యానేన నివృత్తా అశేషాశ్చక్షురాది వృత్తయో యాసాం తాః. ఇమం లోకం. దేహమపి న జానంతి స్మ ముక్తా ఇవేతి. 15

టీ:- ఆ శ్రీకృష్ణుని ధ్యానముచేత తొలగిపోయిన (అశేషములైన, కన్నులు మొదలగు) ఇంద్రియవృత్తు లెవరికో వారు-ఇమంలోకం -దేహమును కూడ తెలియనేరక ముక్తులవలె (నిష్క్రియులైరి). 15

శ్లో॥ స్మరంత్యశ్చాపరాశ్శౌరేరనురాగస్మితేరితాః ।
హృది స్పృశశ్చిత్రపదాగిరస్సంముముహుః స్త్రియః ॥ 16

తా. ఇంకను కొందఱు గోపాంగనలు, కృష్ణుని అనురాగపు చిరునవ్వును స్మరించుకొనుచు, ఆ స్మరణతో ప్రేరేపింపబడినవారై, హృదయములను స్పృశించు చిత్రమైన పదములతో మాట్లాడుచు తన్మయులైరి. 16

శ్లో॥ గతిం సులలితాం చేష్టాం స్నిగ్ధహాసావలోకనమ్ ।
శోకాపహాని కర్మాణి ప్రోద్దామచరితాని చ ॥ 17

తా. కృష్ణుని అందమైన నడకను, అతని చేష్టలను, చక్కని నవ్వుతో కూడిన చూపును, దుఃఖమును పోగొట్టు కర్మలను, సాహసోపేతమైన చర్యలను, స్వేచ్ఛాచరణమును-(స్మరించుచుండిరి- తరువాతి శ్లోకముతో అన్వయము) 17

టీ:- స్మరంత్య ఇతి. అపరాః స్త్రియః శౌరేర్గిరః స్మరంత్యః సంముముహుః. కథంభూతాః. అనురాగేణ యత్ స్మితం తేన ఈరితాః హృది స్పృశంతీతి హృదిస్పృశః మనోజ్ఞాః చిత్రాణి పదాని యాసు తాః. (16-17)

టీ:- మఱికొందఱు స్త్రీలు కృష్ణుని మాటలు తలచుచు మోహము నొందిరి. ఎట్టివారు? అనురాగము, చిరునవ్వుగలదో-దానితో ప్రేరితులై - హృదయమును స్పృశించు మనోజ్ఞమైన విచిత్రములైన పదములు ఎవరియందో వారు. (16-17)

శ్లో॥ చింతయంత్యో ముకుందస్య భీతా విరహకాతరాః ।
సమేతాస్సంఘశః ప్రోచురశ్రుముఖ్యోఽచ్యుతాశయాః ॥ 18

టీ:- చింతయంత్య ఇతి. విరహేణ కాతరాః విహ్వలాః. అచ్యుతే ఆశయః చిత్తం యాసాం తాః. 18

గోప్య ఊచుః

శ్లో॥ అహో విధాతస్తవ న క్వచిద్దయా
సంయోజ్య మైత్ర్యాప్రణయేన దేహి నః ।
తాంశ్చాకృతార్థాన్ వియునంక్ష్య పార్థకం
విచేష్టితం తేఽర్భకచేష్టితం యథా ॥ 19

టీ:- కృష్ణ సంగతిం విధాయ విఘటయతీతి విధాతారం ప్రత్యేవమాక్రోశంత్య ఆహుః. అహో ఇతి. మైత్ర్యాహితాచరణేన ప్రణయేన స్నేహేన చ. అకృతార్థాన్ అప్రాప్తభోగానపి. తాన్ వియునంక్షి వియోజయసి. తస్మాన్న తావద్దయా, బాలిశోఽపి త్వమిత్యాహుః-అపార్థకమితి. 19

తా. కృష్ణుని ఈ గత్యాదులు స్మరించుచు, అతని విరహమునూహించి భయపడుచున్నవారై, అందఱును ఒక్కచోగూడి, కన్నీరుగార్చుచున్న ముఖములుగలవారై, కృష్ణ హృదయులై ఇట్లనిరి. 18

టీ:- విరహముతో భయపడుచు విహ్వలురై-కృష్ణునియందే చిత్తము గలవారైన ఆ గోపస్త్రీలు-18

**గోపస్త్రీలిట్లనిరి.**

తా. అయ్యో! ఓ బ్రహ్మదేవా! నీకు కొంచెమైనను దయలేదు కదా! ఏలయన స్నేహము, ప్రేమ అను వానిచే మనుష్యులను కలిపి-వారు కృతార్థులు కాకముందే విడగొట్టుచున్నావు. అప్రయోజనకరమగు ఈ నీ దుశ్చర్య పిల్లచేష్టవలెనున్నది సుమా. 19

టీ:- కృష్ణునితో సాన్నిహిత్యము నేర్పరచి-మఱల వేఱు పఱచుచున్నాడిని బ్రహ్మదేవునుద్దేశించి ఈ విధముగ దుఃఖించుచు చెప్పుచున్నారు-హితాచరణము చేతను, స్నేహముచేతను-సకృతార్థాన్-భోగము ప్రాప్తింపని వారనైనను - వారిని విడగొట్టుచున్నావు, అందువలన నీకు ఎంత మాత్రము దయలేదు. నీవు అజ్ఞానివి అని చెప్పుచున్నారు -'అపార్థం' అని- 19

శ్లో॥ యస్త్వం ప్రదర్శ్యాసితకుంతలావృతం
ముకుందవక్త్రం సుకపోలమున్నసం ।
శోకాపనోదస్మితలేశసుందరం
కరోషి పారోక్ష్యమసాధు తే కృతమ్ ॥ 20

టీ:- విగర్హితం చ తవేదం కర్మేత్యాహుః. య ఇతి. శోకమపనుదతీతి శోకాపనోదః స చాసౌస్మితలేశశ్చ. గూఢహాసః. తేన సుందరం ముకుందస్య వక్త్రం. నకృత్ప్రదర్శ్య. పునస్తస్య పారోక్ష్యమదృశ్యతాం కరోషి. అత స్తవ కృతం కర్మ అసాధు నింద్యమిత్యర్థః. 20

శ్లో॥ క్రూరస్త్వమక్రూరసమాఖ్యయాస్మ న
శ్చక్షుర్హి దత్తం హరసే బతాజ్ఞవత్ ।
యేనైకదేశేఽఖిలసర్గ సౌష్ఠవం
త్వదీయమద్రాక్ష్మవయం మధుద్విషః ॥ 21

తా. నల్లని కురులతో ఆవరింపబడినది, చక్కని చిక్కని చెక్కిళ్లు గలది, శోకమును తొలగింపగల సన్నని చిరునవ్వుతో అందమైనది యునైన శ్రీకృష్ణుని ముఖమును ఒకసారి చూపించి, మఱల వెంటనే కనబడకుండ చేయుచుంటివి. ఈ నీ చర్య అనుచితమైనది సుమా. 20

టీ:- నీవుచేసిన ఈ పని మిక్కిలి గర్హింపదగినది. అని చెప్పుచున్నారు-శోకమును తొలగించునది కావున శోకాపనోదః -అదియును -స్మితలేశ చః-గూఢమైన నవ్వు-దానితో అందమైన శ్రీ కృష్ణుని ముఖమును-సకృత్ప్రదర్శ్య-ఒకసారి చూపి, మఱల దానియొక్క -పారోక్ష్యం-అదృశ్యత్వమును-చేయుచున్నావు. అందువలన నీవు చేసిన పని-అసాధు-నింద్యము-అనియర్థము. 20

తా. విధాతా! నీవు అక్రూరుని పేరుతో వచ్చిన క్రూరుడవు. ఏ కనులతో శ్రీకృష్ణుని ఏకదేశమునందే (కన్ను, ముక్కు మొదలగు కృష్ణుని ఏ ఒక్క అంగమునందైనను) నీయొక్క సమస్త సృష్టి నైపుణ్యమును చూడగలిగితిమో అట్టి కన్నులను మాకిచ్చియు తిరిగి అజ్ఞునివలె అపహరించితివి. అయ్యో! 21

టీ:- కించ దత్తాపహారిత్వేనాతిక్రూరస్త్వమిత్యాహుః. క్రూర ఇతి. నన్వ క్రూరోహరతి నాహమితి చేదత ఆహుః-అక్రూరసమాఖ్యయేతి. న హ్యేవం కర్తుమన్యః ప్రభవతి. అతో నామాంతరేణ స్మ ధ్రువం త్వమేవాగతోఽసి. కృష్ణం హరామి న యుష్మచ్చక్షురితి చేత్. న యేన త్వద్దత్తేన చక్షుషా. మధుద్విషః ఏకదేశే నేత్రవక్త్రాదౌ త్వదీయం సమగ్రం సృష్టినైపుణ్యమద్రాక్ష్మ దృష్టవత్యో వయం. తచ్చక్షుః. అయం భావః. తవ సర్వం రహస్యమస్మాభిర్జ్ఞాతమత అమర్షేణేవ కృష్ణం నియోజయన్నస్మా నంధీకరోషీతి. 21

టీ:- మరియు-ఇచ్చిన వస్తువులను మఱల తీసికొనుట అను లక్షణముచేత నీవు మిక్కిలి క్రూరుడవు అని చెప్పుచున్నారు.-అక్రూరుడే హరించును. నేను కాదు. అనినచో అది సరికాదు. చెప్పుచున్నారు. ఇట్లు చేయుటకు మఱియొక డెవ్వడునుపుట్టడు. అందువలన మఱి యొక పేరుతో-నిశ్చయముగ నీవే వచ్చితివి. కృష్ణుని తీసికొనిపోవుదువు. మీ కన్నులను కాదు-అనినచో అదియును సరికాదు. నీవిచ్చిన కన్నులతో కృష్ణుని ఏకదేశమందు-కన్ను, ముఖము మొదలగువాని యందు నీదైన సమగ్రమైన సృష్టినైపుణ్యమును-అద్రాక్ష్మ-మేము చూచితిమి. అట్టి కన్నులను నీవు తిరిగి తీసికొంటివి. దీనిభావమేమన-నీ రహస్యమంతయు మేము తెలిసికొంటిమి. అందువలన-కోపముతో- కృష్ణుని నియత్రించి-(మానుండి దూరముచేసి) మమ్ము అంధులను చేయుచున్నావు. 21

శ్లో॥ స నందసూనుః క్షణభంగ సౌహృద
స్సమీక్షతే నస్స్వకృతాతురాబత ।
విహాయ గేహాన్ స్వజనాన్ సుతాన్ సతీన్
స్వదాస్యమద్ధోపగతానవప్రియః ॥ 22

తా. అయ్యో! ఈ కృష్ణుడు క్షణికమైన స్నేహభావమును కలిగి, తన వలెవననే పరవశులనుగా చేయబడిన మనను చూడడు కదా! సాక్షాత్తుగ తన సేవ కొఱకే మనము, మన ఇండ్లను, బంధువులను, పుత్రులను, భర్తలను వదలిపెట్టి ఇటకు చేరితిమి. కాని ఆతడు క్రొత్తవారిని కోరుచుండును. కావున మనను కానడు. 22

టీ:- విధాతారం విహాయ పరస్పరమూచుః. స నందసూనురితి. బతేతి ఖేదే. క్షణభంగం అస్థిరం. సౌహృదం యస్య సః. గేహాదీన్ విహాయ. అద్ధా సాక్షాత్. తస్యైవ దాస్యముపాగతాః స్వకృతాతురాః తత్కృతేనైవ స్మితాదినా పరవశా అపి. నః అస్మాన్న సమీక్షతే నవం నవం ప్రియం యస్య సః అత ఏవం నివారయామ ఇతి భావః. 22

టీ:- బ్రహ్మదేవుని విడిచి తమలో తాము చెప్పుకొనుచున్నారు-బత అనునది దుఃఖమునందు ప్రయోగింపబడినది-క్షణభంగం-అస్థిరమైన -స్నేహము ఎవనికోవాడు-ఇండ్లు మొదలగు వానిని వదలి-అద్ధా-సాక్షాత్తుగ-అతని సేవకొఱకే వచ్చితిమి-తత్కృతేనైన-అతని చిరునవ్వు మొదలగు వానితోనే పరవశులమై యుండినను మనను చక్కగా చూడుడు. క్రొత్త క్రొత్తవి ఎవనికి ప్రియమో వాడు-అందువలన ఈ స్థితిని నివారించెదము అని భావము. 22

శ్లో॥ సుఖం ప్రభాతా రజనీయమాశిష
స్సత్యా బభూవుః పురయోషితాంధ్రువమ్ ।
యాస్సంప్రవిష్టస్య ముఖం వ్రజస్పతేః
పాస్యంత్యపాంగోత్కలితస్మితాసవమ్ ॥ 23

తా. ఈ రాత్రికి సంబంధించిన ఆశాసనముతో మధురానగరిలో నుండిన స్త్రీలకు సుఖవంతమైన ఉదయము(లు) కలుగును, ఏలయన వారు శ్రీకృష్ణుని ఉజ్జృంభితమైన చిరునవ్వు అనెడి మత్తుతో కూడిన ముఖమును త్రాగుదురు లేక మధురలోనికి ప్రవేశించిన కృష్ణుని కొస చూపులతో విజృంభించిన చిరునవ్వు అనెడి మదిరను గ్రోలెదరు. 23

టీ:- సేర్ష్యమూచుః. సుఖమితి. వ్రజస్పతేః శ్రీకృష్ణస్య ముఖం పాస్యంతిన ఆదరేణ ద్రక్ష్యంతి కథంభూతం అపాంగేన నేత్రాంతే నోత్కలితం ఉజ్జృంభితం స్మిత మేవ ఆసవో యస్మిన్ తత్. యద్వా. అపాం గోత్కలితస్మితేనాసవ రూపం యన్ముఖం. తతశ్చ పానం ముఖ్యమేవ సంభావయంతి. 23

టీ:- ఈర్ష్యతో చెప్పుచున్నారు-వ్రజస్పతేః-శ్రీకృష్ణునియొక్క-ముఖము ను త్రాగుదురు - ఆదరముతో చూచెదరు - ఎట్టిది? అపాంగేన - నేత్రాంతములతో - ఉత్కలితః - విజృభించిన చిరునవ్వే శీధువై దేని యందుగలదో అట్టి ముఖమును-లేక-కొసచూపులతో విజృభించిన -చిరునవ్వే శీధువైన రూపములుగల ఏ ముఖము గలదో-దానినుండి పానము చేయుట. ముఖసంబంధమే అని భావించుచున్నవారు. 23

శ్లో॥ తాసాం ముకుందో మధు మంజుభాషితై
ర్గృహీతచిత్తః పరవాన్ మనస్వ్యపి ।
కథం పునర్నః ప్రతి యాస్యతేఽబలా
గ్రామ్యాస్సలజ్జస్మిత విభ్రమైర్భ్రమన్ ॥ 24

టీ:- నను ద్విత్రాణి దినాని తథా భవతునామ. తథాప్యస్మత్స్నేహా కృష్ణః పిత్రాదిభిశ్చ పరావర్తిత ఆగమిష్యతీత్యాశంక్యాహుః. తాసామితి. హేఽబలాః. తాసాం మధువన్మంజుభిర్భాషితైర్వశీకృతచిత్తః తథా, తాసాం సలజ్జస్మితైర్విభ్రమైర్భ్రమన్. పరవాన్ పిత్రాది పరతంత్రోఽపి యద్వా. వ్రజేపరే అన్యే బంధవః సంతి యస్య స తథా మనస్వీ ధీరోఽపి. గ్రామ్యా అవిదగ్ధాః. నః కథం ప్రతియాస్యతే ప్రత్యేష్యతి న కథంచిదిత్యర్థః. 24

తా. కృష్ణుడు అచటి స్త్రీల యొక్క తీయని అందమైన మాటలచే ఆకర్షింపబడిన చిత్తము గలవాడై, సిగ్గులతో కూడిన చిరునవ్వుల విలాసములతో భ్రమించుచు, పరతంత్రుడే ఐనను, ధైర్యము గలవాడే యైనను, మఱల ఓ అబలలారా! అంతగా నేర్పురులము కాని మన గ్రామీణ స్త్రీల వద్దకు ఎట్లు వచ్చును? (రాకుండునేమో!). 24

టీ:- ఒకటి రెండు దినములు అట్లగుగాక! అట్లైనను మన స్నేహముతో ఆకర్షింపబడినవాడై-నందుడు మొదలగు వారిచేతకూడ మరలింపబడినవాడై ఇచటికి రావచ్చును అని ఆశంకించి చెప్పు చున్నారు ఓ అబలలారా! వారియొక్క (మధురానగర స్త్రీలయొక్క) తేనె వంటి అందమైన మాటలతో వశీకరింపబడిన చిత్తము గలవాడై, వారి సిగ్గుతో కూడిన విలాసములచేత మైకము చెందుచు - పరవాన్ - తండ్రి మొదలగు పెద్దల అదుపులో నుండిన వాడైయును (పర తంత్రుడైనను) - లేక - వ్రజము నందలి ఇతర బంధువుల అదుపాజ్ఞలలో నున్న వాడైనను - మనస్వీధీరుడైనను - గ్రామ్యాః- అవిదగ్ధులమైన (నేర్పరితనములేని వారమైన) మన వద్దకు ఎట్లు తిరిగి వచ్చును? ఎట్లైనను అనియర్థము. 24

శ్లో॥ అద్య ధ్రువం తత్ర దృశో భవిష్యతే
దాశార్హ భోజాంధక వృష్ణి సాత్త్వతామ్ ।
మహోత్సవ శ్రీరమణం గుణాస్పదం
ద్రక్ష్యంతి యే చాధ్వని దేవకీ సుతమ్ ॥ 25

టీ:- కించ. అస్మదుత్సవభాజోఽన్యా ఏవాద్య భవిష్యంతీత్యాహుః- అద్యేతి. తత్ర పురే. దాశార్హాదీనాం దృశః దృష్టేః మహానుత్సవో భవిష్యతే భవిష్యతి. యే దేవకీసుతం ద్రక్ష్యంతి తథా యే చాన్యే అధ్వని గచ్ఛంతం ద్రక్ష్యంతి. తేషామపి దృశో భవిష్యతీతి. యద్వా. దృశ ఇతి ద్వితీయా. తేషాం దృశో నేత్రాణి మహానుత్సవః భవిష్యతే ప్రాప్స్యతి. ప్రాప్త్యర్థస్య భవతేరాత్మనేపదిత్వాత్. 25

శ్లో॥ మైతద్విధస్యాకరుణస్య నామ
భూదక్రూర ఇత్యేతదతీవ దారుణః ।
యోఽసావనాశ్వాస్య సుదుఃఖితం జనం
ప్రియాత్ప్రియం నేష్యతి పారమధ్వనః ॥ 26

తా. నేడు నిశ్చయముగ అచట మధురాపురిలోని దాశార్హుల, భోజుల, అంధకుల, వృష్ణివంశీయులగు యాదవుల కన్నులకు మహదానందము, మహోత్సవము కలుగనున్నది. ఏలయన వారు అందఱును శ్రీపతియు, గుణములకు ఆస్పదమైన వాడును అగు శ్రీకృష్ణుని చూచెదరు. ఇంకను మార్గమధ్యమున కూడ ఆ దేవకీ నందనుని దర్శించుకొందురు. 25

టీ:- మరియు మన ఉత్సవ భాక్కులు ఈనాడు ఇతరులే అగుచున్నారు అని చెప్పుచున్నారు - తత్ర - ఆ మధురాపురియందు-దాశార్హులు మొదలగువారి చూపునకు మహోత్సవము కలుగును-ఎవరైతే దేవకీ సుతునిచూచెదరో-అట్లే ఇతరులు కూడ-మార్గమున పోవు వానిని ఎవరు చూచెదరో - వారికికూడ నేత్రపర్వమగునుఅని -లేక- దృశః -అని ద్వితీయవిభక్తి-వారియొక్క దృశః-నేత్రములు- మహోత్సవము పొందును. ప్రాప్యర్థములగు భవతియొక్క ఆత్మనేపదిత్వమువలన. 25

తా. ఇట్టి నిర్దయునకు అక్రూరుడు అను పేరు సరికాకుండును. ఏలయన క్రూరునకు అక్రూరుడను పేరుండుట దారుణమైనది. అట్టివాడు దుఃఖితులైయున్న మనలను కనీసముగ ఓదార్పకుండనే మనకు ప్రియాతిప్రియమైన కృష్ణుని, మనకు దృగోచరము కానంత దూర ప్రదేశమునకు కొనిపోవును గదా! 26

టీ:- అక్రూరం శపంత్య ఆహుః-మేతి. ఏషా విధా విధానం కర్మయస్య అత ఏవ నిష్కృపస్యాక్రూర ఇతి శోభనం నామ మాభూత్. తత్ర హేతుః. అతీవ దారుణ ఇత్యాది. ప్రియత్ప్రాణాదపి ప్రియతరం కృష్ణం. అధ్వనః పారం అస్మద్దృగ్గోచరత్వాదతి దూరదేశం నేష్యతి. 26

టీ:- అక్రూరుని శపించుచు చెప్పుచున్నారు. ఇట్టి క్రూర కర్మ ఎవనికో -అందులకే కరుణలేని వానికి అక్రూరుడు అను శుభప్రదమైన పేరు ఉండదు. కారణము? మిక్కిలి క్రూరమైనవాడు కావున-లేక అట్టి అక్రూరుడను మంచిపేరు ఉండుట దారుణము-ప్రియాతి ప్రియమైన -ప్రియతరుడైన కృష్ణుని - అధ్వ నః పారం - మనకు కనబడనంత దూరదేశమునకు కొనిపోవును? 26

శ్లో॥ అనార్ద్రధీరేష సమాస్థితో రథం
తమన్వమీ చ త్వరయంతి దుర్మదాః ।
గోపా అనోభిః స్థవిరైరుపేక్షితం
దైవం చ నోఽద్య ప్రతికూలమీహతే ॥ 27

తా. ఈ కృష్ణుడు కూడ కఠినుడే సుమా! రథమునెక్కి కూర్చొనినాడు. ఈ దుర్మాదులైన గోపాలురు తమ బండ్లతోసహా ప్రయాణమునకు సిద్ధమై అతనిని త్వరపెట్టుచున్నారు. వీరిని త్వరపాటు వృద్ధులచేత మాత్రము ఉపేక్షింపబడినది. ఇక దైవము మనయెడల ప్రతికూలమునే కోరుచున్నాడు. 27

టీ:- అహోధిగస్మజ్జీవితమిత్యాహుః-అనార్ద్రధీరితి. అనార్ద్రా కఠినా ధీరస్య సః. తావదేవ కృష్ణో రథమారూఢః. అస్యా వినయమాలక్ష్య స్థవిరైశ్చోపేక్షితం. తేన నివారయంతీత్యర్థః. కించ. దైవతం చేతి. అయం భావః యద్యస్మాకం దైవమనుకూలం భవేత్తర్హి విఘ్నైః కశ్చిదేతేషాం మధ్యే ప్రతిహన్యేత. అకస్మాద్వజ్రపాతో వా భవేత్. అన్యద్వా కించిదనిష్టం స్యాత్ న తు కించిదస్తీతి. 27

టీ:- అహో! మన జీవితమతిరస్కార్యమని చెప్పుచున్నారు. అనార్ద్రధీః (కఠినమైన బుద్ధిగలవాడు) అని, కఠినమైన బుద్ధి యెవనికి కలదో వాడు అనార్ద్రధీః- కృష్ణుడు ఇప్పటికే రథమునెక్కినాడు - ఇతని అవినయమును చూచి వృద్ధులుఉపేక్షవహించినారు, వారు దానిని తొలగింతురని యర్థము - మరియు 'దైవతం' - అని - దీనిభావము. ఒకవేళ మనయెడ దైవము అనుకూలమైన యెడల - అప్పుడు

శ్లో॥ నివారయామస్సముపేత్య మాధవం
కిం నో కరిష్యన్ కులవృద్ధ బాంధవాః ।
ముకుందసంగాన్నిమిషార్ధమస్త్య
జాద్దైవేన విధ్వసిత దీనచేతసామ్ ॥ 28

టీ:- పరస్పరం సంమత్ర్య సాహసమధిరుహ్యాహుః - నివారయామ ఇతి అకరిష్యన్ కిం కరిష్యంతి నిమిషార్ధదుస్త్యజాన్ముకుంద సంగాద్వి ధ్వంసితాని వియోజితాని. అత ఏవ దీనాని చేతాంసి యాసాం తాసాం. ఏవభూతానామస్మాకం న మృత్యోరపి భయమిత్యర్థః. 28

విఘ్నములచేత వీరిలో ఎవడో ఒకడు కొట్టబడును. హఠాత్తుగ పిడుగుపాటో సంభవింపవచ్చును-లేక ఏదైనను అనిష్టము జరుగవచ్చును. కాని అదేమియు లేదు అని. 27

తా. కృష్ణుని సమీపించి మనమే అతనిని ఆపివేయుదుము-కులము నందలి పెద్దలు, వృద్ధులును మననేమి చేయుదురు? సగము నిమిషమైనను కృష్ణుని సాంగత్యము విడువజాలనందువలన, దైవముచేత ధ్వంసము చేయబడిన దీనహృదయము గలవారిని (అన్నింటికి తెగించిన వారిని) ఎవరేమి చేయగలరు? 28

టీ:- ఒకరితో నొకరు బాగుగా ఆలోచించి, సాహసమును చేసి చెప్పుకొనుచున్నారు.- అకరిష్యన్ - ఏమి చేయుదురు? సగము నిమిషమైనను కృష్ణుని సాన్నిహిత్యమును విడిచియుండజాలని గాఢమైన సంగమును విధ్వంసము చేసిన - వియోగమును కలిగించిన - అందువలననే దీనమైన మనస్సులు ఎవరికో వారు (మనము) అట్టి మనకు ఈ మృత్యువు నుండి కూడ భయము లేదని అర్థము. 28

శ్లో॥ యస్యానురాగ లలితస్మితవల్గు మంత్ర
లీలావలోకపరిరంభణ రాసగోష్ఠ్యామ్ ।
నీతాస్స్మనః క్షణమివ క్షణదావినాతం
గోప్యః కథన్వతితరేమ తమో దురంతమ్ ॥ 29

టీ:- ఇతోఽపి కారణాదేవ అవశ్యం సాహసమేవాలంబనీయ మిత్యాహుః - యస్యేతి. హే గోప్యః. యస్య లలితం స్మితం వల్గు మంత్రశ్చ లీలావలోకశ్చ. పరిరంభణం చ అనురాగేణైతాని యస్యాం రాసగోష్ఠ్యాం రాసక్రీడాసభాయాం నః అస్మాభిః క్షణదారాత్రయః. క్షణమివానీతాః. తమముం కృష్ణం వినా. దురంతం తమః విరహ దుఃఖం కథం ను అతితరేమ? న కథంచిదిత్యర్థః. 29

తా. ఎవని అనురాగము, మృదువైన చిరునవ్వు అందమైన ఆలోచనలు విలాసవంతమైన చూపులు ఆలింగనములు - వీనితో కూడిన రాసగోష్ఠియందు కృష్ణునితో మన గోపికల యొక్క రాత్రులు క్షణమువలె గడిచినవి. ఇక ఇపుడు కృష్ణుడు లేని ఈ గాఢమైన చీకటిని-విరహ దుఃఖమును ఎట్లు దాటగలము?. 29

టీ:- ఈ కారణముతోనే తప్పక సాహసమే అవలంబింపదగినది అని చెప్పుచున్నాడు. ఓ గోపస్త్రీలారా! ఎవని అందమైన చిరునవ్వు, సుందరమైన ఆలోచన, విలాసపూర్వకమైనచూపు, కౌగిలియు - అనురాగముతో కూడిన ఇవి ఏ రాసగోష్ఠియందు మనచే - క్షణదాః - రాత్రులు క్షణమువలె గడుపబడినవో అట్టి ఈ కృష్ణుడు లేని దురంతమైన చీకటిని - విరహ దుఃఖమును ఎట్లు దాటగలము? ఎట్లును దాట జాలమని అర్థము. 29

శ్లో॥ యోఽహ్నః క్షయే వ్రజమనంత సఖః పరీతో
గోపైర్విశన్ ఖుర రజశ్ఛురితాలక స్రక్ ।
వేణుం క్వణన్ స్మితకటాక్షనిరీక్షణేన
చిత్తం క్షిణోతి తమృతే ను కథం భవేమ ॥ 30

తా. సాయంకాలమగుటతోడనే అసంఖ్యాకులైన గోపాలురతో కూడినవాడై గోపికలతో చుట్టుముట్టబడినవాడై గోధూళిచే ధూసరితమైన కురులు, దండలు గలవాడై, వేణువును వాయించుచు , చిరునవ్వుల కొసచూపుతో ఎవడు వ్రజమును ప్రవేశించుచుండునో అట్టి కృష్ణుని చూచి చిత్తము హరించి పోవును. అట్టి కృష్ణుడు లేక మనమెట్లు జీవింపగలము? 30

టీ:- కించ. ఆస్తాం తమోతితరణం జీవనమేవ కథం స్యాత్? ఇత్యాహుః - య ఇతి. అహ్నః క్షయే దినావసానే ఖుం రజోభిః ఛురితా ధూసరా అలకాః స్రజశ్చయస్య సః. వ్రజంవిశన్ స్మితేన యత్ కటాక్షనిరీక్షణం తేన నశ్చిత్తం క్షిణోతి హరతి. అముం కృష్ణం వినా కథం భవేమజీవేమేతి. 30

టీ:- చీకటిని తరించుట అటుండనిండు జీవించుట ఎట్లు జరుగును? అని అనుచున్నారు. అహ్నః క్షయే-దినము యొక్క అవసానమున-గిట్టల ధూళులచేత-ఛురితాః-ధూసరములైన-కురులు దండలును ఎవనికో అతడు వ్రజమునకు ప్రవేశించుచు-చిరునవ్వుతో ఏ కడకంటి చూపుగలదో దానిచేత-మన చిత్తములు-క్షిణోతి-హరింప బడుచున్నవి. ఈ కృష్ణుని వినా-కథంభవేమ-ఎట్లు జీవింతుము? 30

**శ్రీశుక ఉవాచ**

శ్లో॥ ఏవ్రం బ్రువాణా విరహాతురా భృశం
వ్రజస్త్రియః కృష్ణ విషక్త మానసాః ।
విసృజ్య లజ్జాం రురుదుస్మ్ససుస్వరం
గోవింద దామోదర మాధవేతి ॥ 31

**శ్రీశుకుడిట్లనెను.**

తా. ఇట్లు చెప్పుచు వ్రజ స్త్రీలు మిక్కిలిగ విరహముచే బాధ నొందుచు, సిగ్గువిడిచి, కృష్ణుని యందు బద్ధ మనస్కులై గోవిందా! దామోదరా! మధవా! అని సుస్వరముగ రోదించిరి. 31

టీ:- ఏవమితి. కృష్ణవిషక్తాని మానసాని యాసాం సుస్వరముచ్చైః. శ్లో. క్రూరమక్రూరత శ్రృత్వా కంసం కంస నిషూదనః, గోపీమనోరథా రామస్సరామస్తత్పురం యయౌ. శ్రీధరీయః. 31

టీ:- కృష్ణునియందు విశేషమగు సంగమునొందిన మనస్సులు ఎవరికో వారు-సుస్వరం-బిగ్గరగ (ఏడ్చిరి) "కంసుని క్రూరమైన వార్తను కంస విధ్వంసియగు కృష్ణుడు అక్రూరుని వలన విని, గోపికల కోరికలను ఆస్పదభూతుడైన కృష్ణుడు బలరామునితో కూడి ఆ మధురానగరము నకు బ్రోయెను" -శ్రీధరీయ శ్లోక భావమిది 31

శ్లో॥ స్త్రీణామేవం రుదంతీనాముదితే సవితర్యథా ।
అక్రూరశ్చోదయామాస కృతమైత్రాదికో రథమ్ ॥ 32

తా. స్త్రీలు ఇట్లు ఏడ్చుచుండగనే - సూర్యుడు ఉదయింపగ అక్రూరుడు సంధ్యోపాసనాది కర్మను పూర్తిచేసుకొని రథమును మధురవైపు నడిపించుటకు ఉపక్రమించెను. 32

టీ:- స్త్రీణామితి. తాః అనాదృత్య. కృతమైత్రాదికః మైత్రం మిత్ర దైవత్యం సంధ్యోపాసనం తదాదికం కర్మ కృతం యేన సః. 32

టీ:- వారిని లక్షముచేయకుండ - కృతమైత్రాదికః - మైత్రం - మిత్ర దైవత్యం - సంధ్యోపాసనము మొదలగు కర్మ ఎవరిచే చేయబడెనో అతడు -(అక్రూరుడు)-32

శ్లో॥ గోపాస్తమన్వసజ్జంత నందాద్యాశ్శకటైస్తతః ।
ఆదాయోపాయనం భూరి కుంభాన్ గోరస సంభృతాన్ ॥ 33

తా. గోపాలురు అతనిని అనుసరించి వెడలిరి. నందుడు మొదలగు వారు బండ్లతోకూడ అనుసరించిరి. ఆవుల పాలు, పెరుగు, నేయి, వెన్న మొదలగు గోరసములతో నిండిన పాత్రలు ఉపాయనములుగ తీసుకొని వెడలిరి. 33

టీ:- గోపా ఇతి. అన్వసజ్జంత అన్వగచ్ఛన్. 33

టీ:- అన్వసజ్జంత - వెంట వడలిరి. 33

శ్లో॥ గోప్యశ్చదయితం కృష్ణమనువ్రజ్యాను రంజితాః ।
ప్రత్యాదేశం భగవతః కాంక్షంత్యశ్చావస్థిరే ॥ 34

తా. గోపస్త్రీలు తమకు అత్యంత ప్రీతిపాత్రుడగు కృష్ణునివెంట కొంత దూరము నడచి-అతడు తమవైపు చిరునవ్వుచూపు చూచుటచేత నేమో కొంత ఆనందించిరి. దుఃఖింపవలదని వారించునేమోయని ఆశించుచు అచటనే ఉండిపోయిరి. 34

టీ:- గోప్య ఇతి. అనురంజితాః పరావృత్య నిరీక్షణాదిభిః కించి దానందితాః. ప్రత్యాదేశం ప్రత్యాఖ్యానం. 34

టీ:- అనురంజితాః - వెనుకకు మఱలి చూచుట మొదలగు కృష్ణ చేష్టితముల వలన కొంచెము ఆనందించిరి. ప్రత్యాదేశం - వలదని వారించుట- 34

శ్లో॥ తాస్తదాతప్యతీర్వీక్ష్య స్వప్రస్థానే యదూత్తమః ।
సాంత్వయామాస వచనైరాయాస్య ఇతి దౌత్యకైః ॥ 35

తా. కృష్ణుడు తన ప్రయాణము వలన పరితపించుచున్న గోపికలను చూచి శీఘ్రముగనే తిరిగి వచ్చెదనని దూత వాక్యముల చేత వారిని ఓదార్చెను. 35

టీ:- తా ఇతి. తప్యతీః సంపత్యమానాః. తాః ఆయాస్యే శీఘ్ర మాగమిష్యామీతి దూతవాక్యైః. 35

టీ:- తప్యతీః - మిక్కిలి తపించుచున్న - తాః - వారిని - ఆయాస్యే - శీఘ్రమే వచ్చెదను - అని దూతవాక్యములచే - 35

శ్లో॥ యావదాలక్ష్యతే కేతుర్యావద్రేణూ రథస్య చ ।
అనుప్రస్థాపితాత్మానో లేఖ్యానీవోపలక్షితాః ॥ 36

తా. రథముపై నున్న పతాకము, రథచక్రముల కింద నుండి వెడలు ధూళి కనిపించుచుండు వరకు ఆ గోపస్త్రీలు - కృష్ణునితో పయనించి పోవుచున్న చిత్తములు గలవారైనను - చిత్తరువుల వలె ఆగిపోయి కన్పట్టుచుండిరి. 36

శ్లో॥ తా నిరాశా నివవృతుర్గోవిందవి నివర్తనే ।
అహాని నిన్యుర్గాయంత్యో విశోకాః ప్రియచేష్టితమ్ ॥ 37

తా. కృష్ణుడు వెంటనే తిరిగి రాకపోయినందువలన గోపస్త్రీలు నిరాశగా తమ యిండ్లకుబోయిరి. కృష్ణుని లీలలను బాడుకొనుచు, లీలలను అనుకరించుచు విరహ దుఃఖమునుండి శమము పొందుచు దినములు గడిపిరి. 37

శ్లో॥ భగవానపి సంప్రాప్తో రామాక్రూరౌ తథా నృప ।
రథేన వాయువేగేన కాళిందీమఘనాశనీమ్ ॥ 38

తా. రాజా! భగవానుడైన కృష్ణుడు కూడ, బలరాముడు అక్రూరుడు కలసిరాగా, వాయువేగముతో పరుగెత్తిన రథమునందు ప్రయాణముచేసి పాపనాశనియగు యమునా నదికి చేరిరి. 38

టీ:- యావదితి. కృష్ణమనుప్రస్థాపితా ఆత్మానశ్చితాని యాభిస్తాః. లేఖ్యానీవ లేఖ్యమయపుత్రికా ఇవ నిశ్చలాః. (36-38)

టీ:- కృష్ణునివెంట పంపబడిన చిత్తములు ఎవరిచేతనో వారు - లేఖ్యని ఇవ - చిత్రింపబడిన బొమ్మలవలె నిశ్చలురై - (36-38)

శ్లో॥ తత్రోపస్పృశ్య పానీయం పీత్వామృష్ట మణి ప్రభమ్ ।
వృక్ష షండముపవ్రజ్య స రామో రథమావిశత్ ॥ 39

తా. అచట శుద్ధము చేయబడిన మణివలె ప్రకాశించు నీటిని ఆచమనముచేసి, నీరు త్రాగి చెట్లసమూహము వద్దకుపోయి, బలరామునితో కూడ కృష్ణుడు మరల రథమునందు ప్రవేశించెను. 39

టీ:- తత్రేతి. వృక్షాణాం షండం సమూహముపవ్రజ్య. 39

టీ:- వృక్షాణాం షండం-చెట్ల సమూహము వద్దకు-సమీపించి-39

శ్లో॥ అక్రూరస్తావుపామంత్ర్య నివేశ్య చ రథోపరి ।
కాళింద్యా హ్రదమాగత్య స్నానం విధివదాచరత్ ॥ 40

తా. అక్రూరుడు బలరామ కృష్ణులను దగ్గరకు పిలిచి, వారిరువురుని రథముపై కూర్చుండజేసి యమునా నదియొక్క బ్రహ్మతీర్థమునకు వచ్చి, విధిపూర్వకముగ స్నానము చేసెను. 40

టీ:- అక్రూర ఇతి.రథోపరి నివేశ్య. 40

టీ:- రథముపై ప్రవేశింపజేసి -40

శ్లో॥ నిమజ్జ్య తస్మిన్ సలిలే జపన్ బ్రహ్మసనాతనమ్ ।
తావేవాపశ్యదక్రూరో రామ కృష్ణౌ సమన్వితౌ ॥ 41

తా. ఆ నీటియందు మునిగి, వేదమును జపించుచు, అక్రూరుడు రామకృష్ణుల నిరువురిని చూచెను. 41

శ్లో॥ తౌ రథస్థౌ కథమిహ సుతావానక దుందుభేః ।
తర్హిస్విత్స్యందనేనస్త ఇత్యున్మజ్జ్యవ్యచష్ట సః ॥ 42

తా. "వసుదేవుని కుమారులగు రామకృష్ణులు రథముపైననే ఉండిరి కదా! మఱి ఇచట కనబడుచుండిరేల? ఇచట కనబడుచున్నవారు రథముపైన కూడ ఉన్నారా? ఉండకపోవచ్చును" అని అనుకొనుచు అక్రూరుడు నీటినుండి తలను పైకి తేల్చి రథమువైపు చూచెను. 42

శ్లో॥ తత్రాపి చ యథా పూర్వమాసీనౌ పునరేవ సః ।
న్యమజ్జద్దర్శనం యన్మే మృషా కిం సలిలే తయోః ॥ 43

తా. వారు అచట పూర్వమువలెనే కూర్చొనియుండిరి. అక్రూరుడు మఱల నీటిలో మునిగెను. "నీటిలో కనబడిన దృశ్యము భ్రమ జనితమా" అని తలచుచు మునిగెను. 43

టీ:- నిమజ్జ్యేతి. బ్రహ్మ వేదం జపన్. శ్లో. "క్వేమౌ బాలౌ క్వతౌ మల్లావితి శంకిత చేతసే, అక్రూరయ జలే ధూపమత్యాశ్చర్యం వ్యదర్శయత్." శ్రీధరీయోఽయం శ్లోకః. (41-43)

టీ:- బ్రహ్మ - వేదమును-జపించును-"ఈ బాలురెక్కడ? ఆ మల్లులెక్కడ? అని శంకించుచున్న మనస్సుగల అక్రూరునకు ఆశ్చర్యముగ నీటిలో తావిగల పొగ కనబడెను."శ్రీధరీయశ్లోక భావమిది.(41 -43)

శ్లో॥ భూయస్తత్రాపి సోఽద్రాక్షీత్ స్తూయమానం మహేశ్వరమ్ ।
సిద్ధైర్గంధర్వపతిభిరసురైర్నతకంధరైః ॥ 44

తా. అక్రూరుడు మఱల అచటకూడ స్తోత్రము చేయబడుచున్న ఆ జగత్పతిని చూచెను. సిద్ధులు, గంధర్వులు, రాక్షసులు మున్నగువారు తలలవంచి స్తుతింపుచున్న ప్రభువును చూచెను. 44

టీ:- భూయ ఇతి. సిద్ధాదిభిః స్తూయమానం. 44

టీ:- సిద్ధులు మొదలగువారిచేత స్తుతింపబడుచున్నవానిని - (చూచెను). 44

శ్లో॥ సహస్ర శిరసం దేవం సహస్రఫణమౌళినమ్ ।
నీలాంబరం బిస శ్వేతం శృంగైశ్శ్వేతమివ స్థితం ॥ 45

తా. వేయి తలలుగలవాడు, ప్రకాశించుచుండువాడును, వేయి పడగలపైన కిరీటములు గలవాడును, నీలపువన్నె వస్త్రములను ధరించియున్నవాడును, తామరతూడు వంటి తెల్లని వన్నెగలవాడును, తెల్లని శిఖరములతో నున్న కైలాస పర్వతమువలెనున్నవాడును. 45

టీ:- సహస్రేతి. సహస్రం శిరాంసి యస్య తం. సహస్ర ఫణేషు మౌళయోఽస్య సంతీతి తథా తం. నీలేఽ ంబరే యస్య తం. బిసవత్ కమలకందవత్ శ్వేతం శృంగైఃశిఖరైః శ్వేతం కైలాసమివ స్థితం. 45

టీ:- వేయి తలలు ఎవనికోవానిని, వేయి పడగలపై కిరీటములు ఎవనికో వానిని, నీలపు వన్నె వస్త్రములుకల వానిని, తామరతూడువలె తెల్లని శిఖరములతోనున్న కైలాసమువలెనున్న అతనిని-(చూచెను)45

శ్లో॥ తస్యోత్సంగే ఘనశ్యామం పీతకౌశేయవాససం ।
పురుషం చతుర్భుజం శాంతం పద్మ పత్రాయ తేక్షణమ్ ॥ 46

తా. అతని ఒడియందు-మేఘశ్యాముడు, పీతాంబరుడు (పచ్చని పట్టువస్త్రములు ధరించినవాడు) పురుషరూపమున నున్నవాడును, నాలుగు భుజములు కలవాడును శాంతుడును, తామరరేకులవంటి కన్నులు గలవాడును. 46

టీ:- తస్యేతి. సత్యోత్సంగే కుండలీకృతదేహార్ధే విలోక్యేత్యేకాదశ శ్లోకే నాన్వయః. 46

టీ:- తస్యోత్సంగే-అతనియొక్క చుట్టుచుట్టుకొని యున్న సగము శరీరమునందు-విలోక్య (చూచి) అని పదకొండవశ్లోకముతో అన్వయము. 46

శ్లో॥ చారు ప్రసన్న వదనం చారుహాసనిరీక్షణం ।
సుభ్రూన్నసం చారుకర్ణం సుకపోలారుణాధరమ్ ॥ 47

టీ:- చార్వితి. శోభనే భ్రువౌ యస్య ఉన్నతా నాసికా యస్య. తం చ తంచ. 47

శ్లో॥ ప్రలంబపీవర భుజం తుంగాంసోరస్థలశ్రియం ।
కంబుకంఠం నిమ్ననాభిం వళిమత్పల్లవోదరమ్ ॥ 48

టీ:- ప్రలంబేతి.తుంగావంసౌ యస్య. ఉరస్థలే శ్రీర్యస్య. తం చ తం చ. వళిమత్పల్లవోదరం. వళయః తిర్యక్ నిమ్నా రేఖా యస్య సంతి తద్వళిమత్. తచ్చ తత్పల్లవవత్. అశ్వత్థదళ సదృశముదరం యస్య తం.48

శ్లో॥ బహుత్కటితట శ్రోణికరభోరుద్వయాన్వితం ।
చారుజానుయుగం చారుజంఘాయుగళ సంయుతమ్ ॥ 49

తా. సుందరమై వికసించినమోమువాడును, అందమైన నవ్వుతో కూడిన చూపులు గలవాడును, తీర్చినట్లున్న కనుబొమ్మలు, చక్కని ముక్కు, మనోహరమైన చెవులు, రమణీయమైన చక్కిళ్ళును, ఎఱ్ఱని పెదవియును -(కలవానిని) 47

టీ:- శోభనములైన కనుబొమ్మలు, ఉన్నతమైన ముక్కు ఎవనికో అట్టి వానిని - 47

తా. మోకాళ్ళ వఱకును వ్రేలాడు బలిష్ఠమైన బాహువులును, ఎగుభుజములు, లక్ష్మీనివాసముగనున్న వక్షఃస్థలము, శంఖము వంటి కంఠము, లోతైన బొడ్డు-(నాభి) రేఖలతో నలరుచున్న చిగురువంటి మృదువైన కడుపు (కలవానిని) 48

టీ:- ఎత్తైన భుజములు ఎవనికో-వక్షఃస్థలమున లక్ష్మియెవనికో - వానిని - చిగురులవలె - రావి చిగురుల వంటి కడుపు ఎవనికో వాటనిని - అట్టివానిని 48

తా. గొప్ప నడుము ప్రదేశము, మొలభాగము, ముంజేతులు, తొడలు, అందమైన మోకాళ్లు, అందమైన మీగాళ్లు మొదలగు సుందరమైన అవయవములుగల వానిని- (ద్వయం-యుగళం- యుగం-రెండేసి) (49)

టీ:- బృహదితి. కటితటం చ. శ్రోణిశ్చ. కరభసదృశమూరుద్వయం చ. బృహచ్చ. తత్కటితటశ్రోణికరభోరుద్వయం చ. తేనాన్వితం. యద్వా - బృహద్భ్యాం కటితటశ్రోణిభ్యాం. కరభోరుద్వయేన చాన్వితం. 49

టీ:- నడుము-మొల-ఏనుగుతొండమువంటి రెండుతొడలు-గొప్పవియైన కటితము, పిరుదులు, తొడలు, ముంజేతులు వీనితో కూడిన వానిని - లేక - గొప్పవియైన కటితట, శ్రోణులచేత, ఏనుగు తొడము వంటి తొడలచేత కూడినవానిని- 49

శ్లో॥ తుంగగుల్ఫారుణ నఖవ్రాతదీధితిభిర్వృతం ।
నవాంగుళ్యంగుష్ఠదళైర్విలస త్పాదపంకజం ॥ 50

తా. ఎత్తైన చీలమండలు, ఎఱ్ఱనిగోళ్లసమూహము యొక్క కాంతుల చేత ఆవరింపబడియున్న వానిని,కోమలమైనవ్రేళ్లు,ఆకులవంటి అంగుష్ఠములచేత విలసిల్లు పాదములనెడు తామరపువ్వులు గలవానిని. 50

టీ:- తుంగేతి. తుంగౌ ఈషదున్నతౌ గుల్ఫౌ అరుణ నఖవ్రాతశ్చ తేషాం దీధితిభిః తథా. నవాః కోమలాః. అంగుళ్యః అంగుష్ఠే చ తాన్యేన దళాని తైశ్చ విలసచ్ఛోభమానం పాదపంకజం యస్య తం. 50

టీ:- తుంగౌ-సమున్నతములైన-పిక్కలు, ఎఱుపు వన్నెగల గోళ్ళ సముదాయము-వానియొక్క కాంతులచేత ఆవరింపబడినవానిని - మరియు - నవాః - కోమలములైన - వ్రేళ్ళు, పెద్దవ్రేళ్ళు అనెడి దళములచేత శోభమానములైన పాదములు అనెడు తామర పువ్వులు ఎవనికో-అట్టివానిని 50

శ్లో॥ మహార్హమణిక వ్రాతకిరీటకటకాంగదైః ।
కటి సూత్ర బ్రహ్మ సూత్ర హార నూపురకుండలైః ॥ 51

తా. అమూల్యములైన మణుల సమూహములతో కూర్చిన కిరీటము, కంకణములు, కేయూరములు (బాహుపురుల) తోను మొలనూలు, యజ్ఞోపవీతము, హారములు, కుండలములు మున్నగువానితో - 51

శ్లో॥ భ్రాజమానం పద్మకరం శంకచక్రగదాధరం ।
శ్రీవత్సవక్షసం భ్రాజత్కౌస్తుభం వనమాలినమ్ ॥ 52

తా. ప్రకాశమానుడు, చేతిలో పద్మముగలవాడు, శంఖము, చక్రము, గద అను వానిని ధరించియున్నవాడు శ్రీవత్సము అను పుట్టుమచ్చగలవాడు, కౌస్తుభము అను మణిని, వనమాలను ధరించినవాడునైన ఆ దేవుని - 52

శ్లో॥ సునందనందప్రముఖైః పార్షదైస్సనకాదిభిః ।
సురేశైర్బ్రహ్మరుద్రాద్యైర్నవభిశ్చ ద్విజోత్తమైః ॥ 53

తా. సునందుడు, నందుడు మొదలగు పార్షదులచేత, సనక సనందనాది పరమర్షులచేతను, దేవేశ్వరులైన బ్రహ్మ,రుద్రుడు మొదలగువారి చేతను, మరీచి మొదలగు బ్రాహ్మణోత్తములచేతను- 53

టీ:- మహార్హేతి. మహార్హాః సుమణివ్రాతా యేషు తైః కిరీటాదిభిః. (51-53)

టీ:- మహార్హాః-మేలైన మణుల సమూహములు వేనియందో అట్టి కిరీటములు మొదలగు వానిచేత- (51-53)

శ్లో॥ ప్రహ్లాదనారదావసు ప్రముఖైర్భాగవతోత్తమైః ।
స్తూయమానం పృథగ్భావైర్వచోభిరమలాత్మభిః ॥ 54

తా. ప్రహ్లాదుడు, నారదుడు, వసువులు మొదలగు భాగవతోత్తములచేతను, పవిత్రాత్మలగు పెక్కురు చేతను, వేర్వేరు ప్రదేశములనుండి స్తోత్రము చేయబడుచున్న (ఆ దేవదేవుని) 54

టీ:- స్తూయమానం సనకాదిభిర్బ్రహ్మేతి. బ్రహ్మాద్యైర్మహేశ్వర ఇతి మరీచ్యాదిభిర్ద్విజోత్తమైః పరం ప్రజాపతిరితి. వసురుపరిచరః. ప్రహ్లాద నారదవసవః ప్రముఖా ముఖ్యా యేషాం తైః. పరం దైవమితి చ.

టీ:- వేర్వేరు అభిప్రాయములు ఎవరివోవారిచేత - అచ్చుటి పార్షదులచేత, స్వామీ!అని స్తుతింపబడుచున్న వానిని, సనకాదులచేత 'బ్రహ్మ' అని బ్రహ్మాదులచేత 'మహేశ్వర' అనియు, మరీచి మొదలగు

శ్రేష్ఠైర్వచోభిః పృథగ్భావైర్వచోభిరితి వా. 54

బ్రాహ్మణోత్తములచేత పరమైన 'ప్రజాపతి' అనియు-వసువు-ఆకాశమున చరించువాడు-ప్రహ్లాదుడు, నారదుడు,వసువు మొదలగు ముఖ్యులచేత పరమమైన దైవమనియు-శ్రేష్ఠములైన వాక్కులచేత-లేక వేర్వేరు భావములుగల వాక్కులతో-అని- 54

శ్లో॥ శ్రియా పుష్ట్యా గిరా కీర్త్యా కాంత్యాతుష్ట్యేలయోర్జయా ।
విద్యయాఽవిద్యయా శక్త్యా మాయయా చ నిషేవితమ్ ॥ 55

తా. శ్రీ, పుష్టి, వాక్కు,కీర్తి, కాంతి, తుష్టి, భూమి, శక్తి, విద్య, అవిద్య, ఊర్జ, మాయ మొదలగు వానిచేత సేవింపబడుచున్న వానిని - (దేవదేవుని) 55

టీ:- శ్రియేతి. విద్యావిద్యేజీవానాంముక్తిసంసృతిహేతూ. మాయా తయోః కారణం శక్తిః హ్లాదినీ. సంవిత్ జ్ఞానం. అభిరన్యాభిశ్చ నిషేవితం. 55

టీ:- విద్య - జీవులముక్తి కారణము - అవిద్య జీవులకు సంసార కారణము - మాయా - ఆ రెండింటికి కారణమగు శక్తి యగు హ్లాదిని- సంవిత్ - జ్ఞానము-వీనిచేతను, ఇతరమైనవాని చేతను సేవింపబడువానిని - 55

శ్లో॥ విలోక్య సుభృశం ప్రీతో భక్త్యాపరమయా యుతః ।
హృష్యత్తనూరుహోభావపరిక్లిన్నాత్మ లోచనః ॥ 56

తా. చూచి, మిక్కిలి ప్రీతుడై, పరమ భక్తితో కూడిన వాడై, హర్షాతిరేకముతో పులకితగాత్రుడై, భావోద్రేకముచేత కన్నులు చెమర్చినవాడై, అక్రూరుడు- 56

శ్లో॥ గిరా గద్గదయాస్తౌషీత్సత్త్వమాలంబ్య సాత్త్వతః ।
ప్రణమ్య మూర్ధ్నా వహితః కృతాంజలి పుటశ్శనైః ॥ 57

తా. సాత్త్వతుడైన అక్రూడు, సత్త్వమునవలంబించి, శిరస్సువంచి నమస్కరించి, మెల్లగా అంజలి పుటమును ఘటించి, గద్గదస్వరముతో ఆ దేవదేవుని స్తోత్రము చేసెను. 57

టీ:- విలోక్యేతి. విలోక్య సుభృశం ప్రీతః. అస్మత్కృష్ణోఽసావేవం భూతః పరమేశ్వర ఇతి. జ్ఞాత్వేతి. (56-57)

టీ:- చూచి, అతిశతయించిన ప్రీతి గలవాడై-మాకృష్ణుడే ఇతడు-ఈ విధముగనున్నాడు. పరమేశ్వరుడు అని తెలిసికొకొని-అని (56-57)

**శ్రీ మద్భాగవతే, మహాపురాణే దశమస్కంధే,**
**ఏకోనచత్వారింశోఽధ్యాయః**

**అని శ్రీమద్భాగవతమున దశమస్కంధమందు**
**ముప్పది తొమ్మిదవ అధ్యాయము సమాప్తము.**

## చత్వారింశోఽధ్యాయః

### అక్రూరకృత కృష్ణ స్తుతిః

1 శ్లో॥ నతోఽస్మ్యహం త్వాఖిల హేతు హేతుం
నారాయణం పూరుషమాద్యమవ్యయమ్ ।
యన్నాభిజాతాదరవిందకోశా
ద్బ్రహ్మావిరాసీద్యత ఏష లోకః. ॥

టీ॥శ్లో.“చత్వారింశే తతోఽక్రూరః కృష్ణం మత్వేశ్వరేశ్వరమ్, ప్రణమ్య భక్త్యా తుష్టావ సగుణా గుణభేదతః. శ్రీకృష్ణం ప్రణమతిః నతోఽస్మీతి. హేకృష్ణ. త్వా త్వాం నతోఽస్మి. త్వమస్మత్పితృవ్యః కుతో మాం బాలం నతోఽసి? తత్రాహ ఆద్యం పురుషం. అవ్యయం చ. అనాదినిధనమిత్యర్థః కుత ఏతత్? అఖిలహేతూనాం పంచమహాభూతానాం హేతుం. స తు నారాయణో నాహమితి చేత్తత్రాహ నారాయణం త్వాం. కిం నారాయణ ఇతి మాం స్తౌషి కాత్ర స్తుతిః ? సత్యమేవేత్యాహ యన్నాబి జాతాదితి. యస్య నాభిజాతాత్ అరవిందకోశాత్ బ్రహ్మా ఆవిరాసీత్ యతో బ్రహ్మణః. ॥1॥

## నలుబదియవ అధ్యాయము

### అక్రూరుడిట్లనెను.

తా॥ సమస్తమైన కారణములకును మూలకారణమైనవాడవు, నారాయణుడవు, ఆదిపురుషుడవు,అవినాశివి ఏ నీ నాభి నుండి పుట్టిన తామర కోశము నుండి ఆవిర్భవించిన బ్రహ్మ వలన ఈ లోకమంతయు కలిగెనో అట్టి నీకు నమస్కరించుచున్నాను. (1)

టీ॥ నలుబదియవ అధ్యాయమున అక్రూరుడు, కృష్ణుని ఈశ్వరేశ్వరు నిగ భావించి, అతనికి భక్తితో నమస్కరించి, అతని సగుణ నిర్గుణ తత్త్వములను స్తుతించెను. శ్రీకృష్ణునకు నమస్కరించుచున్నాడు ‘నతోస్మి’ అనుచు ఓ కృష్ణా! త్వా – నిన్ను(నీకు) నమస్కరించుచున్నాను. నీవు నా తండ్రి తోబుట్టువువు బాలుడనైన నాకు ఎందులకు నమస్కరించుచున్నావు? చెప్పుచున్నాడు. ఆద్య పురుషుడవు అవ్యయు డవు కూడ అనాదినిధనుడని అని యర్థము ఇది యెందువలన? అన్నింటకి కారణములైన పంచమహాభూతములకు కారణమవు. నేను నారాయణుడను కాను అనినచో చెప్పుచున్నాడు–‘నారాయణం త్వాం’ నారాయణుడవు అని నన్నెందుకు స్తోత్రము చేయుచున్నావు?” ఇట ఇది ఏమిస్తుతి ? సత్యమే అని చెప్పుచున్నాడు. ఎవని నాభి నుండి పుట్టిన తామరకోశము నుండి బ్రహ్మదేవుడు ఆవిర్భవించెనో– ఆ బ్రహ్మదేవుని నుండి లోకమావిర్భవించెను. (1)

2శ్లో ॥ భూస్తోయమగ్నిః పవనః ఖమాది
ర్మహానజాదిర్మన ఇంద్రియాణి ।
సర్వేంద్రియార్థా విబుధాశ్చ సర్వే
యే హేతవస్తేజగతోఽంగభూతాః ॥

తా॥ భూమి, నీరు, అగ్ని, గాలి, ఆకాశము, అహంకారము, మహత్తు, మాయ మొదలగునవవి, ఇంద్రియములు, సమస్తమైన ఇంద్రియ విషయములు, వివిధములైన అన్నియును నీ కారణముగానే ఏర్పడినవి, నీ ఈ జగత్తునకు అంగభూతములు, అంగము నుండి ఆవిర్భవించినవి. (2)

టీ॥ అఖిల హేతు హేతుత్వం ప్రపంచయతి. భూరితి. ఆదిరహంకారః అజా మాయా. తస్యాః ఆదిః పురుషః ఏతే యే జగతో హేతవస్తే సర్వే. తే తవాంగభూతాః. అంగాత్ శ్రీమూర్తేర్భూతాః జాతాః ఉపసర్జనభూతా వా. ॥2॥

టీ॥ సమస్తమైన కారణములకు కారణమును చెప్పుచున్నాడు- ఆదిః - అహంకారము. అజా-మాయ దాని యొక్క ఆది పురుషుడు - ఇవి జగత్తు యొక్క ఏతత్త్వములు గలవో అవి అన్నియు నీ యొక్క -అంగాత్ - శ్రీమూర్తి నుండి కలగినవి. పుట్టినవి లేక అప్రధానములు. (2)

3 శ్లో ॥ నైతేస్వరూపం విదురాత్మనస్తే
అజాదయో నాత్మతయా గృహీతాః ।
అజోఽనుబద్ధస్సగుణై రజాయా
గుణాత్పరం వేద న తే స్వరూపమ్ ॥

తా॥ నీదైన (నీవేయైన) ఈ ఆత్మస్వరూపమును (ఎవరును) తెలియలేరు. మాయా మొదలగు పదార్థములనన్నియు అనాత్మలుగ తెలియబడుచున్నవి. బ్రహ్మదేవుడును మాయ చేత గుణములతో బద్ధుడై యుండుట చేత గుణములకు అతీతమైన నీ స్వరూపమును తెలియజాలకున్నాడు. (3)

టీ॥ నన్వతిస్తుతిః కథం క్రియతే. అహమేవాన్యత ఉత్పన్నః. తత్పరతంత్రశ్చేతి చేదిత్యాశంక్య. తవైషా మాయా త్వత్పారమార్థ్యం తు. న

టీ॥ "అతిస్తుతినెట్లు చేయుచున్నావు? నేనే ఇతరుల వలన పుట్టియున్నాను. అందువలన పరతంత్రుడను" అని అందువేమో అని

కోఽపి వేదేత్యాహ - నేతి. ఏతే అజా ఆదిర్యేషాం తే. ఆత్మనస్తే స్వరూపం న విదుః. అనాత్మతయా జడత్వేన కారణేన. జడత్వే హేతుః గృహీతాః ప్రత్యక్షాదిభిర్దృష్టాః. న హ్యజడో హృద్గోచర ఇతి భావః. నను జడాః మాం మాజానంతు. జీవస్తు జ్ఞాస్యతీత్యత ఆహ అజ ఇతి. స అజో బ్రహ్మాపి. అజాయా గుణైరనుబద్ధ ఆవృతః గుణాతీతం తే స్వరూపం న వేద. అతః. అన్యః కుతో జ్ఞాస్యతీతి. యద్వా. ప్రకృత్యాదయః ఆత్మనఃస్వరూపం. తవ స్వరూపం న విదుః. జడత్వాదేవ జీవస్తు తాన్ ఆత్మానం చ. వేత్తి న పునస్త్వత్స్వ రూపమితి యథోక్తం హంసగుహ్యే. శ్లో. దేహోఽసవోక్షామనవోఽభూతమాత్రానాత్మా నమన్యం చ విదుః పరం యత్, సర్వం పుమా వేద గుణాంశ్చ తద్ జ్ఞోన్ న వేద సర్వజ్ఞమనంతమీడ ఇతి. ॥3॥

ఆశంకించుకొని - నీ ఈ మాయను, నీ పరమార్థత్వమును ఎవరును తెలసికొనజాలరు అని చెప్పుచున్నాడు- ఇవి-మాయ మొదలుగా గల వానిని ఆశ్రయముగ జేసికొని యున్నవారు ఆత్మవైన నీ స్వరూపమును తెలియజాలరు. అనాత్మత్వము వలన - జడత్వకారణము చేత - జడత్వమునకు కారణము - గృహీతాః ప్రత్యక్షము మొదలగు ప్రమాణముల చేత చూడబడునవి. అట్లు చూచుటకు అలవాటు పడినవారు అజడమైన ఆత్మపదార్థమును హృదయగోచరము చేసికొన లేరు అని భావము సరియే - జడములు నన్ను తెలిసికొన లేకపోవును గాక. జీవుడు తెలిసికొనును గదా- ఆ సందర్భమున చెప్పుచున్నాడు బ్రహ్మదేవుడు కూడ మాయ చేత గుణములచే ఆవరింపబడి గుణాతీతుడవైన నీ స్వరూపమును తెలియజాలకున్నాడు. అందువలన ఇతరుడెట్లు తెలియగలడు? అని - లేక - ప్రకృతి మొదలగునవి ఆత్మ యొక్క అనగా నీ యొక్క స్వరూపమును తెలిసికొన లేవు - జడత్వము వలననే - ఇక జీవుడైతే ఆ ప్రకృతి వస్తువులను ఆత్మను కూడ తెలుయజాలడు, ఇక ఆత్మ 'స్వరూపము' మాట చెప్పనేల? అవి హంస గుహ్యము నందు చెప్పబడినట్లు "దేహము, ప్రాణములు, ఇంద్రియములు, అంతఃకరణములు, పంచమహాభూతములు, పంచ తన్మాత్రలు, కనబడు తన స్వరూపము, ఇంద్రియ వర్గము, వీని కంటె భిన్నమైన దేవతా వర్గము తెలియజాలవు. కాని జీవుడు చేతనుడు

కావున, గుణమయమైన ఈ సర్వప్రకృతిని, గుణములను, వాని వాని మూల భూతములను తెలసికొనగలడు. అటుల తెలిసిన వాడైనను సర్వజ్ఞుడవైన నిన్ను తెలసికొనజాలడు. అట్టి అనంతుని స్తుతించు చున్నాను." (హంసగుహ్యము అను పేరు గల స్తోత్రము దక్షకృతము. చూ . షష్ఠస్కందము – చతుర్థోఽధ్యాయము. 25 వ శ్లోకము) (3)

4శ్లో ॥ త్వాం యోగినో యజంత్యద్ధా మహాపురుషమీశ్వరమ్ ।
సాధ్యాత్మం సాధిభూతం చ సాధిదైవం చ సాధవః ॥

తా॥ మహాపురుషుడవు, ఈశ్వరుడవు అయిన నిన్ను, సాధువులు, యోగులును సాక్షాత్తుగ, లోపలనున్న 'అంతర్యామి' రూపమునను, భౌతిక పదార్థము లందు వ్యాపించి యున్న 'సర్వాత్మక రూపముగను', ఆయా ఇష్టదేవతలలో నుండు దేవతారూపమునను ఉపాసించు చుందురు. (4)

టీ॥ నను యది కేఽపి న జానంతి. కథం తర్హి సంసార నివృత్తిర్జీవానా మిత్యాశంక్య సాక్షాదగోచరత్వేఽపి యేన కేనాపి మార్గేణ భజతాం త్వం గమ్యోఽసీత్యాహ త్వామితి. హైరణ్యగర్భాదయః. ఆధ్యాత్మాధి భూతాధిదైవ సాక్షిణం. మహాపురుషం. తదంతర్యామి స్వరూపమీశ్వరం నియంతారం చ. యజంతి. ॥4॥

టీ॥ ఎవరును తెలిసికొన జాలనియెడల మఱి జీవులకు సంసార నివృత్తి ఎట్లు కలుగును? (ఉపాసన ఎట్లు ఘటించును) అని ఆశంకించి, సాక్షాత్తుగ గోచరము కాకున్నను, ఏదో ఒక మార్గమున నిన్ను భజించు వారికి గమ్యము లభించును అని చెప్పుచున్నాడు – బ్రహ్మ మొదలగు వారు. అధ్యాత్మ, అధిభూత, అధిదైవ సాక్షియు, మహాపురుషుడును, ఆయా పదార్థములలోని అంతర్యామి స్వరూపమున గల ఈశ్వరుని నియంతను నిన్ను పూజింతురు. (4)

5శ్లో ॥ త్రయ్యా చ విద్యయా కేచిత్త్వాం వై వైతానికా ద్విజాః ।
యజంతే వివిధైర్యజ్ఞైర్నానా రూపామరాఖ్యయా ॥

టీ॥ తదేవం సాంఖ్యయోగావేకీకృత్యోక్త్వా త్రయీమార్గం కర్మజ్ఞానభేదేన దర్శయతి– ద్వాభ్యాం. త్రయ్యాచేతి. వైతానికాః కర్మయోగినః. త్వాం వై త్వామేవ యజంతి. నను. తే ఇంద్ర వరుణవాయ్వాదీన్ యజంతే న తు మామిత్యత ఆహ – నానేతి. నానా వజ్రహస్తాదీని రూపాణి యేషాం తే. యే అమరాస్తేషామాఖ్యయా నామ్నా త్వామేవ యజంత ఇతి. అయం భావః. ఇంద్రవరుణాదిసూక్తైరింద్రాదయః సర్వైశ్వర్యేణ ప్రకాశ్యంతే. న చ సర్వేశ్వరా బహవస్సంభవంతి. అతో నామ భేదేన త్వామేవ యజంత ఇతి. తథా చ శ్రుతిః. శ్రు. "స ప్రథమస్సంకృతిర్విశ్వకర్మా. స ప్రథమో మిత్రో వరుణో అగ్నిః. స ప్రథమో బృహస్పతిశ్చికిత్వాన్. తస్మా ఇంద్రాయ సుతమాజుహోమీ" తి. ॥5॥

తా॥ యాజ్ఞీకులైన (కర్మప్రధానవాదులైన) బ్రాహ్మణులు వేద విద్య చేత, వివిధములైన యజ్ఞముల చేత, వివిధములైన దేవతల పేర్ల చేత నిన్నే పూజింతురు. (5)

టీ॥ ఉపాసనను ఈ విధంగ సాంఖ్యము,యోగము ఒక్కటిగా చేసిన ఉక్తి చేత వేద మార్గమును, కర్మజ్ఞాన భేదము చేత రెండు శ్లోకములచే చూపుచున్నాడు. వైతానికాః – కర్మయోగులు – త్వాంవై – నిన్నే – యజంతి – పూజించుచున్నారు – కాని వారు ఇంద్రుడు, వరుణుడు, వాయువు మొదలగు వారిని పూజించుచున్నారు. నన్ను కాదు అనినచో చెప్పుచున్నాడు – నానా – వజ్రహస్తుడు మొదలగు రూపములు ఎవరికో వారు– ఏ దేవతలు గలరో– వారి పేర్లచేత– నిన్నే పూజించుచున్నారు. అని – దీని భావమిది – ఇంద్ర వరుణాది సూక్తముల చేత ఇంద్రుడు మొదలగువారు సర్వైశ్వర్యములతో ప్రకాశించుచున్నారు. కాని సర్వేశ్వరులు చాలామంది లేరు, అందువలన నామ భేదము చేత నిన్నే ఉపాసించుచున్నారు. శ్రుతి కూడ అట్లే చెప్పుచున్నది. "అతడు మొదటి వాడు – సోమ సంస్కారరూపుడు, విశ్వకర్మ, అతడు ఆద్యుడు, సూర్యరూపుడు, వరుణరూపుడు, అగ్నిరూపుడు. అతడు ప్రథముడు, అతడు బృహస్పతి (వేదములకుపతి) జ్ఞానస్వరూపుడు – అందుచే అట్టి పరమేశ్వరుని కొఱకు సోమమును హోమము చేయుదును' అని.(5)

6శ్లో॥ ఏకే త్వాఖిలకర్మాణి సన్న్యస్యోపశమం గతాః ।
జ్ఞానినో జ్ఞానయజ్ఞేన యజంతి జ్ఞానవిగ్రహమ్.॥

తా॥ కొందఱు సర్వకర్మలను విడిచిపెట్టి శాంతిని పొందుదురు. అట్టి జ్ఞానులు, జ్ఞాన యజ్ఞముతో జ్ఞానస్వరూపుడవైన నిన్ను ఉపాసింతురు. (6)

టీ॥ ఏక ఇతి. జ్ఞానయజ్ఞేన సమాధినా. ॥6॥

టీ॥ జ్ఞాన యజ్ఞేన – సమాధిచేత. (6)

7శ్లో॥ అన్యే చ సంస్కృతాత్మానో విధినా విహితేన తే ।
యజంతి త్వన్మయాస్త్వాం వై బహు మూర్త్యేక మూర్తికమ్ ॥

తా॥ ఇతరులు శాస్త్ర విహితమైన రీతిగ దీక్షితులై ఆత్మచింతకులై ఒకే మూర్తివైన నిన్ను అనేక రూపములుగ విభజించుకొని సేవించు చున్నారు. (7)

టీ॥ సాంఖ్యయోగ త్రయీ మార్గా ఉక్తాః. వైష్ణవ శైవ మార్గావాహ–ద్వయేన . అన్యే చేతి. సంస్కృతాత్మానః వైష్ణవ శైవ దీక్షయా దీక్షితాస్సంతః . తే త్వయా అభిహితేన పాంచరాత్రాదివిధినా. త్వన్మయాః త్వన్మయత్వే నాత్మానం చింతయంతః. త్వదేక ప్రధానా ఇతి వా. వాసుదేవ సంకర్షణ ప్రద్యుమ్నా నిరుద్ధ భేదేన బహురూపం. నారాయణ రూపేణైకమూర్తికం చ త్వామేవ యజంతి. ॥7॥

టీ॥ సాంఖ్యము, యోగము, వేదమార్గము చెప్పబడినవి. వైష్ణవ, శైవ మార్గములను రెండు శ్లోకముల చేత చెప్పుచున్నాడు. సంస్కృతాత్మానః –వైష్ణవ శైవ దీక్షలతో దీక్షితులై – నీ చేత చెప్పబడిన పాంచ రాత్రము మొదలగు విధి చేత, తన్మయత్వము చేత ఆత్మను గూర్చి చింతన చేయుచు – నీ వొక్కడవే ప్రధానుడవను భావన గలవారై అనియును – వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ అను భేదము లతో నున్న బహురూపుడవగు నిన్ను – నారాయణ రూపముగ నొకే మూర్తిగ నున్న వానిని – నిన్నే – పూజింతురు. (7)

8శ్లో ॥ త్వామేవాన్యే శివోక్తేన మార్గేణ శివరూపిణం ।
బహ్వాచార్య విభేదేన భగవన్ సముపాసతే ॥

తా॥ శివుడు చెప్పిన మార్గమున, వేర్వేఱు ఆచార్యుల విభేదములతో భగవన్ ! శివరూపుడవైన నిన్ను ఉపాసించుచున్నారు ఇతరులు.(8)

టీ॥ త్వామితి. బహ్వాచార్య విభేదేనేతి నానా భేద శైవ పాశు పతాది మార్గేణ. ॥8॥

టీ॥ బహ్వాచార్య విభేదేన – అని అనేక భేదములు గలదైన – పాశుపతము మొదలగు మార్గమున అను అర్థము. (8)

9శ్లో॥ సర్వ ఏవ యజంతి త్వాం సర్వదేవమయేశ్వరమ్ ।
యే నానా దేవతా భక్తా యద్యప్యన్యధియః ప్రభో ॥

తా॥ ప్రభూ! వివిధ దేవతల భక్తులు ఎవరున్నారో ,వేర్వేఱు దేవతల యందు బుద్ధిగలవారైనప్పటికిని వారందఱును సర్వదేవమయుడవైన నిన్నే పూజించుచున్నారు. (9)

టీ॥ యేఽపి క్షుద్రదేవతా భక్తాః. తేఽపి త్వామేవ యజంతీత్యాహ – సర్వఏవేతి. హే సర్వదేవమయ నన్వేతే పరస్పర దేవతాధిక్షేప కలహ వ్యాకుల చిత్తాః. కథమేకమేవ యజంతీత్యుచ్యతే. తత్రాహ – యద్యప్య న్యధియ ఇతి బుద్ధిమాత్రభేదో న వస్తుభేద ఇత్యర్థః. ॥9॥

టీ॥ క్షుద్రదేవతల భక్తులైనను,వారు కూడ నిన్నే పూజించుచున్నారని చెప్పుచున్నాడు. ఓ సకలదేవతామయుడవగు దేవా! వీరు కొందఱు ఒకరి దేవతనొకరు అధిక్షేపించుట, కలహించుకొనుట వంటి వానితో వ్యాకులమైన చిత్తము గల వారు ఒక్కరినే ఎట్లు పూజింతురు? అను ప్రశ్నకు చెప్పుచున్నాడు – ఇతర బుద్ధిగల వారైనను – అని బుద్ధి మాత్ర భేదమే కాని వస్తుభేదము లేదని యర్థము. (9)

10శ్లో ॥ యథాద్రి ప్రభవా నద్యః పర్జన్యాపూరితా విభో ।
విశంతి సర్వతస్సింధుం తద్వత్త్వాం గతయోఽంతతః ॥

తా॥ ప్రభూ! పర్వతములందు పుట్టిన నదులు, మేఘముల చేత నీరు నింపబడినవియై, అంతటను, తిరిగి అవి సముద్రము నందు చేరును, అట్లే మార్గములన్నియు చివరకు నిన్నే చేరును. (10)

టీ॥ తస్మాత్సర్వే మార్గాస్త్వయ్యేవ. పర్యవస్యంతీతి సదృష్టాంతమాహ- యథేతి. అద్రేస్సకాశాత్పర్వతః ప్రభవంతి. యాః నద్యః తాః పునః పర్జన్యేనా పూరితా బహుస్రోతసస్సత్యః సర్వత స్సింధుమేవ విశంతి యథా తద్వత్ ఏతా గతయః. మార్గాః అంతతస్త్వామేవ విశంతీతి.॥10॥

టీ॥ అందు వలన అన్నిమార్గములు నీయందే పర్యవసించును అని దృష్టాంతముతో చెప్పుచున్నాడు. పర్వతము నుండి పుట్టుచున్న ఏ నదులు గలవో అవి మఱల మేఘముల చేత నింపబడి-అనేక ఉప నదులను కలుపుకొని అంతటను సముద్రమునందే ప్రవేశించుచున్నవి. అటులే ఈ మార్గములు చివరకు నిన్నే చేరును. అని అర్థము. (10)

11శ్లో ॥ సత్త్వం రజస్తమ ఇతి భవతః ప్రకృతేర్గుణాః ।
తేషు హి ప్రాకృతాః ప్రోతా ఆబ్రహ్మ స్థావరాదయః ॥

తా॥ సత్త్వము, రజస్సు, తమస్సు అని నీ ప్రకృతి యొక్క గుణము లున్నవి వాని యందే ప్రకృతి కార్యోపాధులన్నియు బ్రహ్మ మొదలు కొని స్థావరముల వఱకు - ప్రవేశించుచున్నవి. (11)

టీ॥ అత్ర హేతుమాహ - సత్త్వమితి. భవతః శక్తిర్యా ప్రకృతిః. తస్యాస్సత్త్వాదయో గుణాః. అతః ప్రాకృతాః ప్రకృతికార్యోపాధయః. బ్రహ్మపర్యంతాః స్థావరాదయో జీవాః స్వోపాధిద్వారా. తేషు గుణేషు ప్రోతాః ప్రవిష్టాః. తే చ ప్రకృతౌ సా చ త్వయీతి. అతః క్రమేణోపాధి లయాధిత్సర్వేఽపి. త్వామేవ ప్రవిశంతీతి. యద్వా భవతః ప్రకృతేర్గుణేషు ప్రోతాః బ్రహ్మాదయో భవద్వ్యతిరిక్తా న సంతి. అతస్త్వమేవ సర్వదేవ మయ ఇతి. ॥11॥

టీ॥ ఇచట కారణము (మార్గములు నిన్నే చేరును అనుటకు)చెప్పు చున్నాడు. నీ శక్తియగు ఏ ప్రకృతి కలదో దాని యొక్క సత్త్వము మొదలగు గుణములు- అందువలన ప్రాకృతములు - ప్రకృతి కార్యమగు ఉపాధులు - జడములు మొదలుకొని బ్రహ్మ వఱకును- జీవులు తమ ఉపాధి (శరీరము) ద్వారా ఆ గుణముల యందు ప్రవేశించుచున్నవి. అవి ప్రకృతి యందు - ఆ ప్రకృతి నీ యందును (చేరుచున్నది) అని అందువలన క్రమముగా ఉపాధిలయముతో అన్ని యును నిన్నే చేరుచున్నవి. లేక -నీ యొక్క ప్రకృతి గుణముల యందు ప్రవేశించిన బ్రహ్మ మొదలుకొని అన్నియును నీ కంటె భిన్నములు కావు. అందువలన నీవే సర్వదేవమయుడవు అని అర్థము. (11)

12 శ్లో ॥ తుభ్యం నమస్తేష్వవిషక్తదృష్టయే
సర్వాత్మనే సర్వధియాం చ సాక్షిణే ।
గుణప్రవాహోఽ యమవిద్యయాసకృత్
ప్రవర్తతే దేవనృతిర్యగాత్మసు. ॥

తా॥ నిర్లిప్తమైన దృష్టిగలవాడవు, సర్వాత్మకుడవు, అన్ని బుద్ధులకు సాక్షివియునైన నీకు నమస్కరించుచున్నాను. దేవతలు, మనుష్యులు, పశువులు మున్నగు శరీరములయందభిమానము గలవారి యందు, అవిద్య చేత, ఈ గుణప్రవాహమనునది ఒకసారి ప్రవర్తించుచున్నది. 12

టీ॥ నను భవతః ప్రకృతేరితి వదన్ మమాపి ప్రకృతి సంబంధం బ్రవీషి. తతశ్చ తేషాం మమ చ కో విశేషస్స్యాదిత్యాశంక్య విశేషమాహ- తుభ్యమితి. అవిషక్తదృష్టయే అవిలిప్తబుద్ధయే కుతః. సర్వాత్మనే స్వ వ్యతిరిక్తా భావాదవిషక్తదృష్టిస్త్వమిత్యర్థః. కించ సర్వధియాం సాక్షిణే సర్వబుద్ధిసాక్షిత్వాన్న క్వాపి బుద్ధిలేప ఇత్యర్థః. ఇతరే తు సంసరంతీత్యాహ - గుణప్రవాహ ఇతి. దేవనృతిర్యంచ ఆత్మానో యేషాం తేషు దేవాదిశరీ రాభిమానిష్విత్యర్థః. త్వదవిద్యయా కృతోఽయం గుణప్రవాహః ప్రవర్తతే. అతో మహాన్ విశేష ఇత్యర్థః. ॥12॥

టీ॥ నీ ప్రకృతి వలన అని చెప్పుచు, నాకు కూడ ప్రకృతి సంబంధమును చెప్పుచున్నావేల? అని-అప్పుడు ప్రకృతి సంబంధము గలవానికిని, నాకును మధ్య విశేషమేమి కలదు? అని ఆశంకించుకొని విశేషమును చెప్పుచున్నాడు అవిలిప్తమైన బుద్ధిగలవాడవగు నీకు- ఎందువలన? సర్వాత్మకుడవు కావున - నీ కన్న భిన్నమైన వస్తువు లేనందువలన నిర్లిప్తమైన దృష్టి గలవాడవు నీవు అని యర్థము. మరియు అన్ని బుద్ధులకును సాక్షివి - అట్టి నీకు - బుద్ధులన్నింటికిని సాక్షిత్వము వహించి యుండుట చేత ఏ బుద్ధితోను లిప్తత లేదని తాత్పర్యము. ఇతరములన్నియును సంసారమునందున్నవని యర్థముగా చెప్పుచున్నాడు. దేవతలు, మనుష్యులు, పశువుల శరీరములు ఎవరికి గలవో వారి యందు - ఆ యా శరీరాభిమానుల యందని యర్థము- నీ అవిద్య చేత చేయబడినది ఈ గుణప్రవాహము- అది ప్రవర్తించుచున్నది. అందువలన గొప్ప విశేషము(భేదము) కలదని యర్థము. (12)

13 శ్లో ॥ అగ్నిర్ముఖం తేఽవని రంఘ్రిరీక్షణం
సూర్యో నభో నాభిరథో దిశః శ్రుతిః ।
ద్యౌః కంసురేంద్రాస్తవ బాహవోఽర్ణవాః
కుక్షిర్మరుత్ప్రాణ బలం ప్రకల్పితమ్. ॥

తా॥ అగ్నియే నీ ముఖము; భూమి, పాదములు; సూర్యచంద్రులు కన్నులు; ఆకాశము నాభి; దిక్కులు చెవులు; స్వర్గము శిరస్సు; దేవేంద్ర గణము నీ బాహువులు; సముద్రములు గర్భము; వాయువు ప్రాణము; అదియే బలముగ కల్పింపబడినది. (విశ్వము నందలి పదార్థాలు ఈశ్వరుని అవయవములుగ వర్ణింపబడినవి.) (13)

టీ॥ సర్వాత్మన ఇత్యనేనోక్తం సగుణం రూపం స్తౌతి - ద్వాభ్యాం అగ్నిర్ముఖమితి. అగ్న్యాదీననూద్య ఈశ్వరావయవతా విధీయతే. యోఽయమగ్నిః స తవ ముఖమిత్యాది వచనవ్యక్త్యా. ఈక్షణం చక్షుః శ్రుతిశ్శ్రవణేంద్రి యం. కం మూర్ధా ప్రాణశ్చ బలం చ తత్. ॥13॥

టీ॥ సర్వాత్ముడని ఇతనిచే చెప్పబడినట్టి పరమాత్ముని సగుణ రూపము ను. రెండు శ్లోకముల చేత స్తుతింపుచున్నాడు. అగ్ని మొదలగు వానిని అనువదించి వానికి ఈశ్వరుని అవయవత్వములను నిర్ణయించు చున్నాడు. ఏ ఈ అగ్ని కలదో అది నీ ముఖము మొదలగు మాటలతో వ్యక్తీకరించుట ద్వారా - ఈక్షణ - కన్నులు-శ్రుతిః-శ్రవణేంద్రియము కం -శిరస్సు. ప్రాణః-బలము కూడ. (13)

14 శ్లో ॥ రోమాణి వృక్షౌషధ యశ్శిరోరుహా
మేఘాః పరస్యాస్థి నఖాని తేఽద్రయః ।
నిమేషణం రాత్ర్యహనీ ప్రజాపతి
ర్మేఢ్రస్తు వృష్టిస్తవ వీర్యమిష్యతే ॥

తా॥ వృక్షములు, ఓషధులు నీ రోమములు; మేఘములు, తల వెంట్రుకలు; పర్వతములు నీ ఎముకలు,గోళ్ళు; కనురెప్పవేయుట, మూయుట రాత్రి, తెరచుట పగలు; ప్రజాపతి జననేంద్రియము; వీర్యమే వర్షము.(14)

టీ॥ రోమాణీతి. అద్రయః పరస్య తే అస్థినఖాని. ॥14॥

టీ॥ పర్వతములు - పరస్య - నీయొక్క - ఎముకలు గోళ్ళు-(14)

15శ్లో ॥ త్వయ్యవ్యయాత్మన్ పురుషే ప్రకల్పితా
లోకాస్సపాలా బహుజీవసంకులాః ।
యథా జలే సంజహతే జలౌకసో౽ప్యు
దుంబరే వా మశకా మనోమయే ॥

టీ॥ న కేవలమేతావదేవ. కింతు. సర్వో౽ప్యయం ప్రపంచస్త్వద వయవభూతఏవేతి వదన్నేవం సత్యపి ప్రపంచస్య వికారాస్త్వయి న ప్రసజ్యంతే తస్య త్వయి కల్పితత్వాదిత్యాహ – త్వయీతి. అవ్యయాత్మన్ అవ్యయాత్మని. పురుషే పూర్ణే. లోకాదయః సంజహతే ప్రచలంతి. హే అవ్యయాత్మన్నితి వా. కథంభూతే త్వయి మనోమయే మనః ప్రధానే మనోవృత్తి వ్యంగ్యే.శ్రు. "దృశ్యతేత్వగ్ర్యయా బుద్ధ్యా మనసైవానుద్రష్టవ్య మి" త్యాదిశ్రుతేః. జలే యథా జలౌకసః సూక్ష్మప్రాణ్యండరాశయః యథా వా ఉదుంబరాంతః కేసరేషు మశకాః పరస్పరవార్తాన భిజ్ఞాః ఏవమనంతాని బ్రహ్మాండాని త్వయి చరంతీత్యర్థః. ॥15॥

తా॥ ఓ అవ్యయాత్మ! నీ యందు – మనోవృత్తివ్యంజించు – పూర్ణ పురుషుడవగు నీ యందు అనేక విధములగు జీవరాసులతో కూడిన లోకములు – లోకపాలకులతో సహా కల్పింపబడినవి. నీటి యందు సూక్ష్మ ప్రాణులు, అండరాశులు మొదలగునవి – మేడిపండ్లలో దోమల వలె కల్పింపబడినవి. (15)

టీ॥ కేవలము ఇంతమాత్రమే కాదు.కాని–ఈ ప్రపంచ మంతయును నీ అవయవ ప్రాయమే అని చెప్పుచు ఇటులుండగ కూడ ప్రపంచము యొక్క వికారములన్నియును నీయందు పుట్టినవికావు–ఏలయన నీ యందు ప్రపంచము కల్పితమైనందు వలన – అనిచెప్పుచున్నాడు. అవ్యయాత్మన్ – అవ్యయాత్మవగు నీయందు పురుషే – పూర్ణమైన వాని యందు–లోకములు మొదలగునవి– సంజహతే– కదులుచున్నవి. లేక – ఓ అవ్యవాత్మ! అని (సంబోధనయు కావచ్చును) ఎట్టి నీ యందు?– మనోమయే–మనస్సు ప్రధానమైన వానియందు – మనోవృత్తి వ్యంగ్యమగుచున్నవానియందు. శ్రుతి– "అగ్రస్థానమున నున్న బుద్ధి చేత చూడబడును. కాని మనస్సు చేతనే పరిశీలింపవలెను" మొదలగు శ్రుతి వలన – ఎట్లు నీటి యందు జలచరములు సూక్ష్మప్రాణులు, అండరాసులు – లేక – మేడిపండు లోపలి కేసరముల యందు దోమలు(వంటివి) ఒకరి వృత్తి ఇంకొకరికి తెలియనివియై– ఇట్లు అనంతములైన బ్రహ్మాండములు నీయందు కదులుచున్నవి అని అర్థము. (15)

16శ్లో॥ యాని యానీహ రూపాణి క్రీడార్థం త్వం బిభర్షి హి ।
త్తైరామృష్టశుచో లోకా ముదా గాయంతి తే యశః ॥

తా॥ దేవాధిదేవా ! ఈ భూమిపై నీవు యే రూపములను ధరించి అవతరించితివో వానితో తమ శోకములనన్నింటిని క్షాళనము చేసికొనిన వారందరును మిక్కిలి సంతోషముతో నీ కీర్తిని గానము చేచుందురు. 16

టీ॥ స్యాదేవం భూతం తవ స్వరూపం దురవగాహమితి త్వదవతార కథామృతమేవ సంతస్సేవంత ఇత్యాహ – యానీతి. ఆమృష్టా పరిమార్జితా శుక్ యేషాం తే. ॥16॥

టీ॥ నీ స్వరూపమిట్టిది – అయినను అవగాహనకందనిది, – అని నీ అవతార కథామృతమునే సత్పురుషులు సేవించుచుందురని చెప్పుచున్నాడు – ఆమృష్టాః – కడుగబడిన శోకము ఎవరికో వారు.(16)

17శ్లో॥ నమః కారణమత్స్యాయ ప్రళయాబ్ధి చరాయ చ ।
హయశీర్ష్ణే నమస్తుభ్యం మధుకైటభ మృత్యవే ॥

తా॥ వేదములను కాపాడుటకు చేప రూపమును ధరించిన నీకు నమస్కారము. ప్రళయకాలమునందలి సముద్రమున చరించిన నీకు నమస్కారము. మధు కైటభులను రాక్షసులను సంహరించిన హయగ్రీవునకు నమస్కారము. (17)

టీ॥ అతః స్వయమప్యవతారాన్నమస్యతి – నమ ఇతి. హయశీర్ష్ణే హయగ్రీవాయ మధుకైటభయోః మృత్యవే నిహంత్రే. ॥17॥

టీ॥ అందువలన తాను కూడ (అక్రూరుడు) అవతారములకు నమస్కరించు చున్నాడు – హయశీర్ష్ణే – హయగ్రీవుని కొరకు– మధు కైటభులిరువురికిని మృత్యువైన వానికి – సంహరించిన వానికి. (17)

18శ్లో॥ అకూపారాయ మహతే నమో మంథర ధారిణే ।
క్షిత్యుద్ధార విహారాయ నమస్సూకర మూర్తయే ॥

తా॥ మంథరపర్వతమును ధరించిన కూర్మావతారునకు, భూమిని ఉద్ధరించు లీలను చేయుటకై అవతరించిన వరాహ రూపునకును నమస్కారములు. (18)

19శ్లో॥ నమస్తేఽద్భుతసింహాయ సాధులోక భయాపహ ।
వామనాయ నమస్తుభ్యం క్రాంత త్రిభువనాయ చ ॥

తా॥ సాధుజనముల భయమును తొలగించువాడా! ఆశ్చర్యమును కలిగించు నరత్వసింహత్వ రూపముల కలయికతో అవతరించిన నీ నరసింహ స్వరూపమునకు నమస్కారము- త్రిభువనములను ఆక్రమించిన వామనునకు నమస్కారము. (19)

టీ॥ అకూపారాయేతి. అకూపారాయ కూర్మాకారాయ. క్షిత్యుద్ధారో విహారో యస్య తస్మై. ॥18,19॥

టీ॥ అకూపారాయ - తాబేలు రూపము గలవానికి. భూమి ఉద్ధరణమే విహారముగాగల వాడెవడో వానికి. (18,19)

20శ్లో॥ నమో భృగూణాం పతయే దుష్ట క్షత్ర వన చ్ఛిదే ।
నమస్తే రఘువర్యాయ రావణాంతకరాయ చ ॥

తా॥ దుష్టులైన క్షత్రియులనెడి వనమును విచ్ఛిన్నము చేసిన భృగువులకు పతియగు పరుశురామునకు నమస్కారము.రావణుని అంతము చేసిన రఘువంశ శ్రేష్ఠుడవగు శ్రీరామునకు నమస్కారము. (20)

టీ॥ నమ ఇతి. భృగూణాం పతయే పరుశురామాయ. ॥20॥

టీ॥ భృగూణాంపతయే - భృగువంశీయుల పతియగు పరశురామునకు. (20)

21శ్లో॥ నమస్తే వాసుదేవాయ నమస్సంకర్షణాయ చ ।
ప్రద్యుమ్నాయానిరుద్ధాయ సాత్త్వతాం పతయే నమః ॥

తా॥ వాసుదేవునకు నమస్కారము - సంకర్షణునకు నమస్కారము, ప్రద్యుమ్నునకు నమస్కారము - అనిరుద్ధునకు నమస్కారము, ఇట్లు చతుర్వ్యూహ రూపమున భక్తుల నేలుకొను శ్రీకృష్ణునకు నమస్కారము. (21)

22శ్లో॥ నమశ్శుద్ధాయ బుద్ధాయ దైత్య దానవ మోహినే ।
మ్లేచ్ఛప్రాయ క్షత్ర హంత్రే నమస్తే కల్కిరూపిణే ॥

తా॥ శుద్ధుడవు, బుద్ధుడవు, దైత్యులు, దానవులు అను రాక్షస జాతులను మోహింపజేసిన వాడవు, శిష్టాచారరహితుల వంటి క్షత్రియులను సంహరించెడు కల్కిరూపుడవు అగు నీకు నమస్కారము. (22)

టీ॥ సంకర్షణం రామం చతుర్వ్యూహరూపేణ ప్రణమతి. నమస్తే వాసుదేవాయేతి. ॥21,22॥

టీ॥ సంకర్షణం - యోగులు రమించు చతుర్వ్యూహరూపముగా నమస్కరించుచున్నాడు. (21,22)

23శ్లో॥ భగవన్ సర్వలోకోఽయం మోహితస్తవ మాయయా ।
అహం మమేత్యసద్గ్రాహో భ్రామ్యతే కర్మవర్త్మసు ॥

తా॥ భగవానుడా! ఈ సమస్తమైన లోకము నీ మాయచేత మోహింపజేయ బడుచున్నది. నేను, నాది అను అసత్పదార్థముల యందలి కోరిక అనునది కర్మ మార్గములందు లోకమును త్రిప్పుచున్నది. (23)

టీ॥ ఏవం స్తుత్వా బంధమోక్షం ప్రార్థయితుమాహ. భగవన్నితి అసతి దేహాదౌ గ్రాహ ఆగ్రహో యస్య సః. అసన్ గ్రాహో యస్యేతి వా.॥23॥

టీ॥ ఇట్లుస్తుతించి సంసార బంధము నుండి విముక్తి నిమ్మని ప్రార్థించుటకు చెప్పుచున్నాడు - అసతి - సత్ పదార్థము కాని దాని యందు - దేహము మొదలగువాని యందు. గ్రాహః - ఆగ్రహము- కోరిక ఎవనికో వాడు - లేక - హేయమైన దాని యందు కోరిక ఎవనికో వాడు. (23)

24శ్లో॥ అహం చాత్మాత్మ జాగార దారార్థ స్వజనాదిషు ।
భ్రమామి స్వప్న కల్పేషు మూఢస్సత్యధియా విభో ॥

తా॥ నేను, దేహము, పుత్రులు, ఇల్లు, ఇల్లాలు, ధనము, బంధువులు మొదలగు నంశముల యందు, స్వప్నము నందలి పదార్థములందు స్వప్నమునందు వలె మూఢ విశ్వాస బుద్ధితో సత్యమని భ్రమించు చున్నాను ప్రభూ! (24)

టీ॥ న కేవలమయం లోకః. అహమపి తథైవేత్యాహ - అహం చేతి. ॥24॥

టీ॥ కేవలము ఈ లోకము మాత్రమే కాదు. నేను కూడ అటులే అని చెప్పుచున్నాడు. (24)

25శ్లో॥ అనిత్యానాత్మ దుఃఖేషు విపర్యాసమతిర్హ్యహమ్ ।
ద్వంద్వారామస్తమోవిష్టో న జానే త్వాత్మనః ప్రియమ్ ॥

తా॥ జీవునకు దుఃఖదాయకములును అనిత్యములును అగు కర్మ ఫలం యందు - ఈ దేహము శాశ్వతమని, ఈ ఫలములు శాశ్వతములనియు, విపర్యాస బుద్ధి గలవాడనై, నేను సుఖ దుఃములనెడు ద్వంద్వములతో క్రీడించుచున్నవాడనై, అజ్ఞానపు చీకటితో ఆచ్ఛాదింపబడి ఆత్మ ప్రియమైన వస్తువును తెలియలేకున్నాను. (25)

టీ॥ మూఢత్వమేవ ప్రకటయతి - అనిత్యేతి. విపర్యస్తమతిః అనిత్యే కర్మఫలే నిత్యమితి. అనాత్మని దేహాదావాత్మేతి దఃఖరూపే గృహాదౌ సుఖమితి. విపరీతమతిరిత్యర్థః. ద్వంద్వేషు సుఖదుఃఖాదిషు. ఆరామః క్రీడా యస్య సః. నను దుఃఖే కథం రతిస్తత్రాహ - తమోవిష్టః తమసా వ్యాప్తః అత ఆత్మనః ప్రియం ప్రేమాస్పదం త్వాం న జాన ఇత్యర్థః. ॥25॥

టీ॥ మూఢత్వమునే ప్రకటించుచున్నాడు-విపర్యస్తమతిః-అనిత్యమైన కర్మఫలమును నిత్యమని-అనాత్మ యందు - దేహాదులయందు ఆత్మబుద్ధి కలిగి-దుఃఖ రూపమగు గృహాదులయందు సుఖములని భావించుచు, విపరీతమైన బుద్ధికలిగి అని యర్థము - ద్వంద్వేషు - సుఖ దుఃఖాదులయందు ఆరామః- క్రీడ ఎవనికో వాడు-అయినను దుఃఖము నందు కోరిక ఎందులకు? చెప్పుచున్నాడు - తమోవిష్టః- చీకటి యందు వ్యాపించిన వాడై - అందువలన ఆత్మకు ప్రేమాస్పదమైన నిన్ను తెలసికొన జాలకున్నాను అని అర్థము. (25)

26శ్లో॥ యథా బుధో జలం హిత్వా ప్రతిచ్ఛన్నం తదుద్భవైః ।
అభ్యేతి మృగతృష్ణాం వై హిత్వాహం త్వాపరాఙ్ముఖః॥

తా॥ తెలియనివాడు నీటి కొలకు వెడలి, అచట నీటి నుండి పుట్టిన గడ్డి మున్నవానిచే కప్పబడియుండుట చూచి అచట నీరు లేదని అనుకొని ఎండమావి వైపు పరిగెత్తినట్లు – నేను నీకు పరాఙ్ముఖుడనై సంసార విషయముల వైపు పరిగెత్తుతున్నాను. (26)

టీ॥ తదేవ సదృష్టాంతమాహ యథేతి. తస్మాజ్జలాద్భవంతీతి తదుద్భవాని తృణాదీని తైః తథా మాయాఛన్నం త్వా త్వామహం హిత్వా. పరాఙ్ముఖోవర్త ఇతి. ॥26॥

టీ॥ అదియే దృష్టాంతమును చెప్పుచున్నాడు – తదుద్భవాని – ఆ జలముల నుండి పుట్టిన – గడ్డి మొలగునవి వాని చేత కప్పబడి యున్నట్లు మాయచేత కప్పబడి నిన్ను విడచి నేను విముఖుడనై వర్తించుచున్నాడు. (26)

27శ్లో॥ నోత్సహేఽహం కృపణధీః కామకర్మహతం మనః ।
రోద్ధుం ప్రమాదిభిస్సాక్షైర్హ్రియమాణ మితస్తతః ॥

తా॥ విషయవాసనాసక్తమైన బుద్ధిగలవాడను, కోరికలచేత, వాని కొరకు చేయు కర్మల చేత క్షోభచెందుచు, బలవంతములైన ఇంద్రియ ముల విషయాసక్తి చేత మథింపబడుచు ఇటు నటు ఆకర్షింపబడు చున్న మనస్సును నియంత్రించుటకు శక్తుడనుకాకున్నాను. (27)

టీ॥ నన్వేవం జానతః కుతో విషయాభిముఖతా తత్రాహ నోత్సహ ఇతి. కృపణా విషయవాసనాయుక్తా ధీర్యస్య సః. అతఏవ. కామ కర్మభ్యాం హతం క్షుభితం. ఇంద్రియైశ్చ బలిభిర్వషయసంయుక్తైరి తస్తత ఆకృష్యమాణం మనః. రోద్ధుం నియంతుం న శక్నోమీతి. ॥27॥

టీ॥ ఇట్లు తెలిసిన వానికి కూడ విషయముల వైపు ఉన్ముఖత్వము ఎందువలన నేర్పడు చున్నది? చెప్పుచున్నాడు – కృపణా – విషయ వాసనాయుక్తమైన – ధీః–బుద్ధి – ఎవనికోవాడు – అందువలననే కామకర్మల చేత క్షుభితమైన –ఇంద్రియములచేత కూడ –బలవంతమైన వానిచేత– విషయములతో కూడుకొనిన వాని చేత – ఇటు అటు

28శ్లో॥ సోఽహం తవాంఘ్ర్యుపగతోస్మ్యసతాం దురాపమ్
తచ్చాప్యహం భగవదనుగ్రహ ఈశ మన్యే ।
పుంసోభవేద్యర్హి సంసరణాపవర్గస్త్వ
య్యబ్జనాభసదుపాసనయా మతిస్స్యాత్ ॥

టీ॥ స ఇతి. తదేవమస్వతంత్రో యః సోఽహం. తవాంఘ్రి ముపగతః శరణం ప్రాప్తః. నన్వింద్రియ పరతంత్రస్యైతదపి కుతస్త్రాహ తచ్చాపీతి. హే ఈశ అంతర్యామిన్. తవాంఘ్ర్యుపగమనం చాసతాం దురాపం. అతో భవతోఽనుగ్రహ ఏవేత్యహం మన్యే. అనుగ్రహే సతీతి వా. నను సతాం సేవయైవం భవతి కిం మదనుగ్రహేణేత్యత ఆహ - పుంస ఇతి. జీవస్య సంసారస్యాపవర్గః సమాప్తిర్యదా త్వత్కృపయా భవేత్. సంభావనాస్పదం భవతి హే అబ్జనాభ తదా సదుపాసనా సంపద్యతే. తయా తర్హ్యేవ త్వయి మతిర్భవేత్. న త్వత్కృపాం వినా సత్సేవా న నితరాం త్వన్మతిః న తేషాం ముక్తిరిత్యర్థః ॥28॥

ఆకర్షింపబడుచున్న మనస్సును నియంత్రించుటకు అశక్తుడను అని అర్థము. (27)

తా॥ ఈశ్వరా! అట్టి నేను, అసత్పురుషులకు దుర్లభమైన నీ పాదముల చెంతకు వచ్చితిని పద్మనాభా! పురుషుడు ఎప్పుడు సంసారము నుండి మోక్ష స్థితిని చేరబోవుచున్నాడో అప్పుడు నీ ఉపాసన చేతనే అది జరుగునను కొందురు. (28)

టీ॥ అట్టి అస్వతంత్రుడనగు నేను నీ పాదములను శరణుపొందితిని ఇంద్రియపరతంత్రుడనగు నాకు ఇది కూడ దేని వలన సంభవించినది? చెప్పుచున్నాడు. ఓ ఈశ్వరా! అంతర్యామి! నీపాదములచెంతకు వచ్చుట అసత్పురుషులకు దుర్లభమైనది. అందువలన దానికి నీ అనుగ్రహమే కారణమని నేననుకొందును. అనుగ్రహమే కలుగుచుండగా అనియు- సత్పురుషుల, సేవ చేతనే ఇది ఘటింపుచుండగా నా అనుగ్రహముచే కలుగుననుటయేమి? అనినచో చెప్పుచున్నాడు, జీవునకు సంసారియై యున్నవానికి - మోక్షప్రాప్తి యనునది నీ అనుగ్రహమువలన మాత్రమే ఎప్పుడు కలుగునో ఓ పద్మనాభా! సదుపాసన సంపన్నమైనప్పుడు అది సంభావ్యమగుచున్నది గదా! దానిచేత అప్పుడే నీయందు బుద్ధి కలుగును నీకృప లేకుండ సత్సేవ గాని- బొత్తిగా నీయందు బుద్ధిగాని- వారికి ముక్తిగాని లభింపదు గదా యని యర్థము. (28)

29శ్లో॥ నమో విజ్ఞాన మాత్రాయ సర్వ ప్రత్యయహేతవే ।
పురుషేషు ప్రధానాయ బ్రహ్మణేఽనంతశక్తయే ॥

తా॥ విజ్ఞానమే మూర్తిగా గల వాడవు, సమస్త జ్ఞానమునకు కారణమైన వాడవు, పురుషునకు సుఖ దుఃఖప్రాపకములైన కాలకర్మ స్వభాములు మున్నగు వానికి ప్రధానుడవు, బ్రహ్మవు, అనంతములైన శక్తులు గల వాడవు అయిన నీకు నమస్కారము. (29)

టీ॥ పాదయోః పతన్ ప్రార్థయతేద్వయేన. నమ ఇతి. విజ్ఞానమేవ మాత్రా మూర్తిర్యస్య తస్మై. అత ఏవ సర్వప్రత్యయహేతవే సమస్త జ్ఞాన కారణాయ. కించ. పురుషేశప్రధానాయ పురుషస్య యే ఈశాః సుఖదుఃఖప్రాపకాః కాలకర్మ స్వభావాదయః. తేషాం ప్రధానాయ నియంత్రే. కుతః బ్రహ్మణే పరిపూర్ణాయ కించ. అథవా ప్రధానం ప్రకృతిః పురుషస్తత్ప్రవర్తకః ఈశః కాలః. ఏతత్త్రితయాత్మనే బ్రహ్మణే వక్ష్యతి చ. భగవాన్ ప్రకృతిర్యదుపాదానమాధారః పురుషః పరః. సతోఽభివ్యంజకః కాలో బ్రహ్మ తత్త్రితయం త్వహ మితి. ॥29॥

టీ॥ పాదముల మీద పడుచు, రెండుశ్లోకములతో ప్రార్థించు చున్నాడు విజ్ఞానమే ఎవనికి మూర్తియో అతనికి – అందుకే సర్వ ప్రత్యయ హేతవే సమస్త జ్ఞానమునకు కారణమైన నీకు – ఇంకను, పురుషేశప్రధానాయ– పురుషునకు ఏ ప్రభువులు గలరో – సుఖ దుఃఖాదులను కలిగించు కాలకర్మస్వభావాదులు – వానిని నియంత్రించు వానికి,ఎందువలన? బ్రహ్మణే– పరిపూర్ణుని కొరకు –ఇంకను అనంతశక్తయే – అనంతములైన శక్తులు ఎవనికో వానికి – లేక– అనంతమైన మాయ అనుశక్తి ఎవనికో వాని కొరకు –లేక ప్రధానం– ప్రకృతి – దానిని ప్రవర్తింపజేయువాడు ప్రభువు – కాలము– ఈ మూడింటి రూపము గల బ్రహ్మకు – భగవానుడు చెప్పును కూడ– "ప్రకృతి ఏదైతే ఉపాదానమో – ఆధారమో – పురుషుడు పరుడు–సత్త్వముచే అభివ్యంజక మైన కాలము, బ్రహ్మ – ఈ మూడును నేనే" అని అర్థము. (29)

30శ్లో॥ నమస్తే వాసుదేవాయ సర్వభూతక్షయాయ చ ।
హృషీకేశ నమస్తుభ్యం ప్రపన్నం పాహిమాం విభో ॥

తా॥ వాసుదేవునకు (వసుదేవుని కుమారునకు సర్వజగన్నివాసునకు) సర్వభూతముల అహంకారాధిష్ఠాత అగు సంకర్షణునకు, హృషీకేశునకు నమస్కరించుచున్నాను. ప్రభూ శరణాగతుడనైన నన్ను కాపాడుము. నీకు నమస్కారము చేయుచున్నాను. (30)

టీ॥ సర్వ ప్రత్యయ హేతుత్వమభివ్యంజయన్ స్తౌతి – సమస్త ఇతి. వాసుదేవాయ చిత్తాధిష్ఠాత్రే సర్వభూత క్షయాయ క్షయ ఆశ్రయః అహంకారశ్చ ప్రాణినామాశ్రయః తతశ్చాహంకారాధిష్ఠాత్రే సంకర్షణా యేత్యర్థః. హృషీకేశేతి. బుద్ధిమనసోరధిష్ఠాత్రోః ప్రద్యుమ్నా నిరుద్ధయోరేకీ కృత్య గ్రహణం శరణాగతం మాం పాహీతి ప్రార్థనం. ॥30॥

టీ॥ పరమాత్ముని సర్వ జ్ఞానమునకు కారణమును వ్యంజింప జేయుచు స్తుతించుచున్నాడు. వాసుదేవాయ చిత్తమునకు అధిష్ఠాతయైన వానికి – సర్వభూత క్షయాయ – క్షయ – ఆశ్రయము – అహంకారము ప్రాణులకు ఆశ్రయము – అటుల అహంకారమునకు అధిష్ఠానమైన సంకర్షణుని కొఱకు అని యర్థము హృషీకేశా! – బుద్ధికి మనస్సునకు అధిష్ఠానమగు వాని కొఱకు – ప్రద్యుమ్నుని అనిరుద్ధుని కలిపి గ్రహింప బడు నిన్ను శరణుకోరిన నన్ను రక్షింపుము అని ప్రార్థనము. (30)

శ్రీ మద్భాగవతే, మహాపురాణే దశమస్కంధే,
చత్వారింశోఽధ్యాయః

అని శ్రీమద్భాగవతమున దశమస్కంధమందు
నలుబదియవ అధ్యాయము సమాప్తము.

## ఏకచత్వారింశోఽధ్యాయః

**శ్రీశుక ఉవాచ**

1శ్లో॥ స్తువత స్తస్య భగవాన్ దర్శయిత్వా జలే వపుః ।
భూయస్సమాహరత్కృష్ణో నటో నాట్యమివాత్మనః ॥

2శ్లో॥ సోఽపి చాంతర్హితం వీక్ష్యజలాదున్మజ్జ్య సత్వరః ।
కృత్వాచావశ్యకం సర్వం విస్మితో రథమాగమత్ ॥

3శ్లో॥ తమ పృచ్ఛద్ధృషీకేశః కిం తే దృష్టమిహాద్భుతమ్ ।
భూమౌ వియతి వా తోయే తథా త్వాం లక్షయామహే ॥

టీ॥ శ్లో. "ఏకచత్వారింశకేఽహన్ రజకం ప్రవిశన్ పురీమ్, తతో వరానదాత్తుష్టః సుదామ్నోనాయకస్య చ. సశంకమక్రూర మనః ప్రమోద్య స్వధామ సందర్శనతః కృపాళుః, స్వరాజధానీం మధురామపశ్యదలం కృతానంత మహోత్సవాఢ్యాం. ॥1-3॥

## నలుబది ఒకటవ అధ్యాయము

**శ్రీశుకుడిట్లనెను.**

తా॥ భగవానుడైన శ్రీకృష్ణుడు స్తుతింపుచున్న అక్రూరునకు నీటిలోనే తన స్వరూపమును చూపి వెంటనే తన రూపమును - నటుడు నాట్యమును వలె - అంతర్హితము చేసెను. (1)

తా॥ అక్రూరుడు, అదృశ్యమైన విష్ణుభగవానుని చూచి, నీటి నుండి బయటకు వచ్చి, త్వరత్వరగా తన ఆవశ్యకమైన కర్మను అంతయును పూర్తి చేసికొని,ఆశ్చర్యమునొందిన వాడై రథము వద్దకు వచ్చెను.(2)

తా॥ "ఇచట ఏ అద్భుతమును చూచితివి?" అని కృష్ణుడు అక్రూరు నడిగెను భూమిపైనగాని, ఆకాశమునగాని, జలము నందుగాని నీకేదైన అద్భుతము కనపడినదా? నిన్ను చూచిన అట్లు కన్పట్టు చున్నది. (3)

టీ॥ నలుబది యొకటవ అధ్యాయమున – మధురానగరము నందు ప్రవేశించిన కృష్ణుడు, కంస పక్షపాతియైన ఒక చాకలిని వధించెను, అటు పిమ్మట సుదాముడను నాయకునికి వరదానము చేసి సంతోషించెను, శంకతో నున్న అక్రూరుని సంతసింపజేసి, కృపాళువైన కృష్ణుడు, తన స్థానమును చూచుట వలన, తమ రాజధాని యగు మధురానగరమును, అలంకారములతో, సంరభముతో నొప్పుచున్న ఆ నగరమును చూచెను. (1-3)

**అక్రూర ఉవాచ:**

4శ్లో॥ అద్భుతానీహ యావంతి భూమౌ వియతి వా జలే ।
తం త్వానుపశ్యతో బ్రహ్మన్కిం మే దృష్టం విపశ్యతః ॥

టీ॥ అద్భుతానీతి. భూమౌ వియతి జలే వా యావంత్యద్భుతాని. తాని త్వయ్యేవ సంతి. తం త్వాం. విపశ్యతో మే కిమద్భుతమదృష్టం. అపి తు సర్వం దృష్టమేవేత్యర్థః. ॥4॥

**అక్రూరుడిట్లనెను.**

తా॥ ఇచట భూమి పైన గాని, ఆకాశమున గాని,నీటి యందుగాని ఏ అద్భుతములున్నవో వానిని - దేవా! నిన్ను చూడక - చూడని నాతో ఏమి చూడబడును? (4)

టీ॥ భూమిపై, ఆకాశమున, జలమునగాని ఎన్ని అద్భుతములు గలవో అవియన్నియు నీ యందే కలవు. అట్టి నిన్ను చూడనేని నాకు ఏ అద్భుతము కనబడును? అయినను అంతయును నాచే చూడబడినది అని అర్థము. (4)

5శ్లో॥ యత్రాద్భుతాని సర్వాణి భూమౌ వియతి వాజలే ।
తం త్వానుపశ్యతో బ్రహ్మన్కింమే దృష్టమిహాద్భుతమ్ ॥

టీ॥ నను మత్ప్రాప్తేః పూర్వమేవ త్వం విస్మితముఖో లక్షి_తోసి. అతో భూమౌ వియతి జలే వా కిమప్యద్భుతం దృష్టం వదేత్యత ఆహ- యత్రేతి. యత్ర త్వయి. సర్వాణ్యద్భుతాని తం త్వామిహ పశ్యతో మే. అన్యత్ర భూమ్యాదౌ కిమద్భుతం దృష్టం. త్వాం వినా న తత్ర కించిద ద్భుత మిత్యర్థః. హే బ్రహ్మన్ పరమేశ్వరేత్యర్థః. బ్రహేతి వా పాఠః .॥5॥

తా॥ బ్రహ్మన్! భూమిపై, ఆకాశమున, జలముననున్న అద్భుతము లన్నియు నీవు చూడకుండ, నేనేమి అద్భుతము చూచితిని. (5)

టీ॥ నన్ను ప్రార్థించుటకు పూర్వమే నీవు ఆశ్చర్యము కలిగిన ముఖముతో కూడి కన్పట్టితివి. ఇప్పుడు భూమి మీద ఆకాశమున, జలమునందేమి అద్భుతమును చూచితివో చెప్పుమనిన, చెప్పుచున్నాడు. ఎచట నీ యందు సమస్తములైన అద్భుతములు గలవో అట్టి నిన్ను చూచు చుండగ నాకు ఇతర స్థలముల యందు, భూమి మొదలగు వాని యందు ఏమి అద్భుతము కనబడినది? నీవు తప్ప వేరే అద్భుతము కించిత్తైనను లేదు. ఓ పరమేశ్వరా! బ్రహ్మ అనియు ఒక పాఠము.(5)

6శ్లో॥ ఇత్యుక్త్వా చోదయామాస స్యందనం గాందినీ సుతః ।
మధురామనయద్రామం కృష్ణం చైవ దినాత్యయే ॥

తా॥ అని చెప్పి గాందినీ సుతుడైన అక్రూరుడు,రథమును ముందుకు సాగించెను. దినము గడిచిన తరువాత రాముని, కృష్ణుని మధురా నగరమునకు తోడ్కొని వచ్చెను. (6)

టీ॥ ఇతీతి. గాందినీ సుతః. అక్రూరః. ॥6॥

టీ॥ గాందినీ సుతః-గాందినీ అను నామె కుమారుడగు అక్రూరుడు (6)

7శ్లో॥ మార్గే గ్రామజనా రాజన్ తత్ర తత్రోపసంగతాః ।
వసుదేవసుతౌ దృష్ట్వా ప్రీతా దృష్టిం చ నాదదుః ॥

తా॥ రాజా! పట్టణమునందలి దారిలో అచ్చటచ్చట గుమిగూడి యున్న గ్రామ ప్రజలు, వసుదేవుని కుమారులైన బలరామకృష్ణులను చూచి, సంతోషించినవారై దృష్టి మరల్చక వారినే తిలకించుచుండిరి.(7)

టీ॥ మార్గఇతి. దృష్టిం నాదదుః పశ్యంత ఏవ స్థితాః ఇత్యర్థః. ॥7॥

టీ॥ దృష్టిం నాదదుః - చూచుచునే ఉండిరని అర్థము. (7)

8శ్లో॥ తావద్వ్రజౌకసస్తత్ర నంద గోపాదయోఽగ్రతః ।
పురోపవనమాసాద్య ప్రతీక్షంతోఽవతస్థిరే ॥

తా॥ అంతవఱకే వచ్చి యున్న నంద గోపాది వ్రజవాసులు, పురము నందలి ఒక ఉపవనమును చేరి, ఎదురు చూచుచుండిరి. (8)

టీ॥ తావదితి.రామకృష్ణాగమనం ప్రతీక్షమాణాః స్థితాః.॥

టీ॥ రామకృష్ణుల రాక కొఱకు నిరీక్షించుచుండిరి. (8)

9శ్లో॥ తాన్ సమేత్యాహ భగవానక్రూరం జగదీశ్వరః ।
గృహీత్వా పాణినా పాణిం ప్రశ్రితం ప్రహసన్నివ ॥

తా॥ వారిని సమీపించి, భగవానుడైన కృష్ణుడు, అక్రూరుని చేతిని తన చేతిలోనికి తీసుకొని, మిక్కిలి వినయముగ నున్న అతనితో నవ్వుచున్నట్లు ఇట్లనెను. (9)

టీ॥ తానితి. ప్రశ్రితం వినీతం. ॥9॥

టీ॥ ప్రశ్రితం - వినీతుడైయున్న వానిని. (9)

10శ్లో॥ భవాన్ ప్రవిశతాదగ్రే సహయానః పురీం గృహమ్ ।
వయంత్విహావముచ్యాథ ప్రాతర్ద్రక్ష్యామహే పురీమ్ ॥

తా॥ ముందుగ మీరు రథముతో కూడ పట్టణము లోనికి, ఇంటికిని వెడలురు. మేము ఇచట విశ్రమించి రేపు ఉదయ కాలమున పట్టణమును చూతుము. (10)

అక్రూర ఉవాచ

11శ్లో॥ నాహం భవద్భ్యాంరహితః ప్రవేక్ష్యే మధురాపురీమ్ ।
త్యక్తుం నార్హసి మాం నాథ భక్తం తే భక్తవత్సల ॥

అక్రూరుడిట్లనెను.

తా॥ మీరు లేకుండా నేను మధురాపురి లో ప్రవేశించను. ప్రభూ! భక్తవత్సలా! నీ భక్తుడనైన నన్ను విడువకుము(వదులుటకు తగవు)(11)

టీ॥ భవానితి. స్వగృహం చ ప్రవిశతాత్ ప్రవిశతు అవముచ్య ఉత్తార్య. విశ్రామ్యేత్యర్థః. ॥10,11॥

టీ॥ మీ ఇంటికి కూడ పోవుదురు కాక - అవముచ్య - దిగి - విశ్రమించి అని అర్థము. (10,11)

12శ్లో॥ ఆగచ్ఛయామ గేహం నస్సనాథా కుర్వధోక్షజ ।
సహాగ్రజ స్సగోపాలైస్సుహృద్భిశ్చ సుహృత్తమ ॥

తా॥ అధోక్షజా! మా యింటికి పోవుపుదము. బలరాముడు, గోపాలుడు, మీరందఱును ఆత్మీయులు. ఓ ఉత్తమోత్తమమైన స్నేహితుడా! కృష్ణా! మీరందఱును మా యింటిని యజమాని కల దానినిగ చేయుడు (యజమానులు కలదానినిగ ఓ కృష్ణా! నీవు చేయుము.) (12)

టీ॥ ఆగచ్ఛేతి. సాగ్రజః సహ గోపాలైరిత్యర్థః. ॥12॥

టీ॥ సాగ్రజః - అన్నయగు బలరామునితో కూడ - సహ గోపాలైః -గోపాలురతో సహ (సాగ్రజః - సబలః నీ పరివారమంతటితో కూడ) (12)

13శ్లో॥ పునీహి పాదరజసా గృహాన్నో గృహమేధినామ్ ।
యచ్ఛౌచేనానుతృప్యంతి పితరస్సాగ్నయస్సురాః ॥

తా॥ మీ పాద ధూళితో ఇండ్లను పావనము చేయుడు. గృహస్థులకు లభించు ఇట్టి పవిత్రతతో పితరులు, అగ్నులు, దేవతలు తృప్తినందెదరు. (13)

టీ॥ పునీహీతి. యచ్ఛౌచేన యస్య పాద రజసః క్షాళ నోదకేన గృహాంగణ స్థితేన. ॥13॥

టీ॥ యత్ +శౌచేన-ఎవని పాదధూళి కణములతో- గృహాంగణము న గల స్థలమున కడిగిన నీటితో. (13)

14శ్లో॥ అవనిజ్యాంఘ్రియుగళమాసీచ్ఛ్లోక్యోబలిర్మహాన్ ।
ఐశ్వర్యమతులం లేభే గతిం చైకాంతినాం తు యా ॥

తా॥ స్థితి ప్రళయములకు కారణములగు నీ పాదముల వలననే మహాత్ముడైన బలి చక్రవర్తి పుణ్యశ్లోకుడయ్యెను అంతే కాక సాటి లేని ఐశ్వర్యమును, ఏకాంతభక్తులకు లభించు స్థితిని పొందెను. (14)

టీ॥ అవనిజ్యేతి. శ్లోక్యః పుణ్యకీర్త్యర్హః ఏకాంతభక్తానాం. యా గతిస్తాం చ లేభే. ॥14॥

టీ॥ శ్లోక్యః - పుణ్యకీర్తికి అర్హుడు - ఏకాంతభక్తులకు ఏగతి ప్రాప్తించెనో దానిని ప్రాప్తించెను. (14)

15శ్లో॥ ఆపస్తేఽంఘ్ర్యవనేజన్యస్త్రిలోకాన్ శుచయోఽపునన్ ।
శిరసాధత్తయాశ్శర్వస్స్వర్యాతాస్సగరాత్మజాః. ॥15॥

తా॥ లోక రక్షణ కొఱకు జనించిన నీ పాద జలము గంగానది రూపమున మిక్కిలి పవిత్రమై ముల్లోకములను పునీతము చేసినది. భగవానుడగు శివునిచే శిరస్సున ధరింపబడినది. సగర పుత్రులను స్వర్గమునకు చేర్చినది. (15)

టీ॥ ఆప ఇతి. అపునన్ పవిత్రీకృతవత్యః యాభిరద్భిః. స్వః స్వర్గం ప్రాప్తాః. ॥15॥

టీ॥ అపునన్ – పవిత్రము చేసినదై – యాభిః – వానిచేత – స్వః – స్వర్గమును – యాతాః – కొనిపోబడిన వారైరి. (15)

16శ్లో॥ దేవ దేవ జగన్నాథ పుణ్యశ్రవణ కీర్తన ।
యదూత్తమోత్తమ శ్లోక నారాయణ నమోఽస్తు తే ॥

తా॥ ఓ దేవదేవా! జగన్నాథా! పుణ్యమును కలిగించు శ్రవణము, కీర్తనము గలవాడా! యదు వంశీయులలో ఉత్తముడా! ఉత్తమమైన ప్రశంస గలవాడా! నారాయణా! నీకు నమస్కారమగు గాక. (16)

టీ॥ ప్రార్థయమానో నమస్కరోతి. దేవ దేవేతి. అతః పరమన్యత్ శ్రేయో నాస్తీతి మత్వా బహుధా సంబోధయతి. ॥16॥

టీ॥ ప్రార్థించుచున్నవాడై నమస్కరించుచున్నాడు. దేవ దేవ అని. అందులకే ఇతరమైన శ్రేయము వేరేది లేదని తలచి అనేక విధములుగ కృష్ణుని సంబోధించుచున్నాడు. (16)

శ్రీ భగవానువాచ

17శ్లో॥ ఆయాస్యే భవతో గేహమహమార్య సమన్వితః ।
యదుచక్రద్రుహం హత్వా వితరిష్యే సుహృత్ప్రియమ్ ॥

శ్రీభగవంతుడనెను.

తా॥ పెద్ద వాఱందరితో కూడ మీ ఇంటికి వత్తును. యదువంశీయులకు ద్రోహము చేసిన కంసుని వధించి ఆత్మీయులందరికి సంతోషమును పంచెదను. (17)

టీ॥ ఆయాస్య ఇతి. ఆదౌ తావత్ యదుచక్రాయ ద్రుహ్యతీతి యదుచక్ర ద్రుక్. తం కంసం హత్వా. సుహృదాం ప్రియం వితరిష్యే. దాస్యామి. ॥17॥

టీ॥ మొదట యదువుల సమూహమెంత వఱకు కలదో అంతవఱకును ద్రోహము చేసినవాడు కనుక యదు చక్ర దృహ్, అట్టి కంసుని సంహరించి – సుహృదాం – స్నేహితులకు బంధువులకు ప్రియమును కలిగించెదను. (17)

18శ్లో॥ ఏవముక్తో భగవతో సోఽక్రూరోవిమనా ఇవ ।
పురీం ప్రవిష్టః కంసాయ కర్మావేద్య గృహం యయౌ ॥

తా॥ ఇట్లు కృష్ణునిచే చెప్పబడి, అక్రూరుడు ఇష్టము లేని వాని వలె మధురాపురి లోనికి ప్రవేశించెను. కంసునకు తాను చేసిన పనిని నివేదించి స్వగృహమునకు పోయెను. (18)

టీ॥ ఏవమితి. రామకృష్ణావానీతావితి స్వకృతం కర్మావేద్య సమర్ప్యేతి. ॥18॥

టీ॥ రామకృష్ణులిరువురు తీసుకొనిరాబడినారు అని తాను చేసిన పనిని విన్నవించి (ఇంటికిపోయెను) (18)

### శ్రీకృష్ణ బలరామయోర్మధురా నగర ప్రవేశ ఘట్టః.

### శ్రీకృష్ణ బలరాముల మధురా నగర ప్రవేశ ఘట్టము.

19శ్లో॥ అథాపరాహ్ణే భగవాన్ కృష్ణస్సంకర్షణాన్వితః ।
మధురాం ప్రావిశద్గోపైర్దిదృక్షుః పరివారితః ॥

తా॥ అటు పిమ్మట మూడవ జామున భగవానుడగు శ్రీకృష్ణుడు, బలరామునితో కూడినవాడై తనపరివారముతో కూడ గోపాలురతో కూడ మధురానగరమును చూడ నిచ్ఛ గలవాడై పుర ప్రవేశము చేసెను. (19)

టీ॥ అథేతి. గోపైః పరివారితః పరివృతః ప్రావిశత్. ॥19॥

టీ॥ గోపైః పరివారితః – గోపాలురతో చుట్టుముట్టబడినవాడై ప్రవేశించెను. (19)

20శ్లో॥ దదర్శతాం స్ఫాటిక తుంగ గోపుర
ద్వారాం బృహద్ధేమకవాట తోరణామ్ ।
తామ్రారకోష్ఠాం పరిఘా దురాసదా
ముద్యాన రమ్యోప వనోప శోభితామ్ ॥

తా॥ స్ఫటికముతో చేయబడిన ఎత్తైన పుర ద్వారములు కలదియు, గొప్పవియైన బంగారపు తలుపులతో తోరణములతో శోభించునదియు, చుట్టును దుర్గమమైన అగడ్తలు గలదియు, దూర దూరముగ నున్న తోటలు, రమణీయములైన ఉపవనములతోను శోభించుచున్న మధురా పురిని కృష్ణుడు చూచెను. (20)

టీ॥ శ్రీకృష్ణ దృష్టాం పురీమనువర్ణయతి చతుర్భిః - దదర్శేతి. స్ఫాటికాని తుంగాని గోపురాణి పురద్వారాణి అన్యాని గృహద్వారాణి చ యస్యాం తాం. బృహంతి. హేమమయాని కవాటాని తోరణాని చ యస్యాం తాం. తామ్రాం చ ఆరః ఆరకూటశ్చ తన్మయాః కోష్ఠా ధాన్యాగారా అశ్వశాలాదయశ్చ యస్యాం తాం. పరిఘాః పరితః ఖాతగర్తాస్తాభిర్దురాసదాం దుర్గమాం. ఉద్యానాని దూరస్థాని వనాని రమ్యాణ్యుపవనాని చ నికటస్థాని. తైరుపశోభితాం. ॥20॥

టీ॥ శ్రీకృష్ణుని చేత చూడబడిన మధురను వర్ణించుచున్నాడు. నాలుగు శ్లోకములలో - స్ఫటిక నిర్మితములైన ఎత్తైన గోపురములు- పురద్వారములు కూడ దేని యందు గలవో దానిని - గొప్పవియైన బంగారపు తలుపులు, తోరణములు దేనియందో అట్టి పురిని - రాగి, ఇత్తడి - వానితో నిర్మితములైన ధాన్యాగారములు, అశ్వశాలలు మొదలగునవి దేని యందు గలవో దానిని - పరిఘాః- చుట్టు అగడ్తల కందకముల చేత చొరరానిదియు, ఉద్యానాని - దూరముగనున్న తోటలు, అందమైన ఉపవనములు (గృహోద్యానములు) మొదలగు వానితో శోభించుచున్న మధురా పట్టణమును (చూచెను). (20)

21శ్లో॥ సౌవర్ణశృంగాటకహర్మ్యనిష్కుటై
శ్శ్రేణీసభాభిర్భవనైరుపస్కృతామ్ ।
వైదూర్యవజ్రామలనీలవిద్రుమై
ర్ముక్తా హరిద్భిర్వలభీషు వేదిషు ॥

తా॥ అందమైన వన్నెలతో విరాజిల్లుచున్నచతుష్పథములు, వానికి ఇరుప్రక్కలైన తోటలచేతను, ఒకే రకముగ నిర్మితములైన సభా మండపముల వరుసల చేతను, భవనముల చేతను అలంకరింపబడి యున్నదియును, గృహములకు కప్పులై ఉన్న వక్రదారువుల యందు వేదికల యందును పొదగబడిన వైడూర్యములు, వజ్రములు, స్ఫటికములు, నీలములు, పగడములు, ముత్యములు, మరకతములు మున్నగు వానితో శోభించుచున్న పట్టణమును (చూచెను). (21)

టీ॥ సౌవర్ణేతి. సౌవర్ణాః శృంగాటకాః చతుష్పథాః హర్మ్యాణి ధనినాం గృహాణి చ తేషు నిష్కుటాః గృహోచితా ఆరామాశ్చ తైః. శ్రేణీనామేకరూప శిల్పోపజీవినాం. సభాభిరుపసంవేశనస్థానైశ్చ. భవనైరన్యగృహైశ్చోప స్కృతాం అలంకృతాం. అమలః స్ఫటికః హరితో మరకతాః. ॥21॥

22శ్లో॥ జుష్టేషు జాలాముఖరంధ్ర కుట్టిష్వా
విష్ట పారావత బర్హి నాదితామ్ ।
సంసిక్తరథ్యాపణ మార్గచత్వరాం
ప్రకీర్ణ మాల్యాంకుర లాజ తండుతామ్ ॥

టీ॥ జుష్టేష్వితి. వైడూర్యాదిరత్నైర్జుష్టేషు వలభ్యాదిషు ఆవిష్టైః రుపవిష్టైః పారావతైః బర్హిభిశ్చ నాదితాం. తత్ర వలభ్యో గృహపురోభాగ స్తంభ నిహి తఛాదనావష్టంభ వక్ర దారూణి వేదయో వలభీనామధోదేశే విరచితా వష్టంభవేదికాః జాలాముఖ రంధ్రాణి గవాక్ష ఛిద్రాణి. కుట్టిమాని మణిబద్ధా భూమయస్తేష్వితి. రథ్యాః రాజమార్గా ఆపణాః

టీ॥ శృంగాటకాః - చతుష్పథములు. సౌవర్ణాః - సువర్ణము కలిగినవి- హర్మ్యాణి - ధనికుల భవనములు, తేషు నిష్కుటాః- వాని యందు గల ఆరామములు - వానిచేత - శ్రేణిని - ఒకే రూపమున గల శిల్పములచే నున్న వాని యొక్క సభల చేత - సమావేశ స్థానముల చేతను - ఉపస్కృతాం - అలంకరింపబడియున్న దానిని- అమలః - స్ఫటికము - హరితః - మరకతములు. (21)

తా॥ వైఢూర్యాదులచే నలంకృతములైన వక్ర దారువుల యందు, గవాక్షముల యందు, శిలాదుల చేత మణుల చేతను కట్టబడిన నేలల యందును చేరి కూర్చుండి యున్న పావురములు, నెమిళ్ళు మున్నగు పక్షుల కూజితములు కలదియు, చక్కగా తడుపబడిన రాజమార్గములు, అంగడివీధులు, ఇతరమైన మార్గములు, ముంగిళ్ళు కలదియు, చల్లబడిన పూలు, మొలకలు, పేలములు, బియ్యము మొదలగునవి కలదియును (అయిన మధుర) (22)

టీ॥ వైడూర్యములు మొదలగు రత్నముల చేత పొదగబడిన వక్ర దారులు మొదలగు వాని యందు - ఆవిష్టైః - కూర్చుని యున్న పావురముల చేత, నెమిళ్ళ చేతను ధ్వనులు చేయబడుచున్నదియు, అచట ఇండ్ల ముందరి భాగమున గల స్తంభముల యందు ఉంచబడిన, ఆచ్ఛాదన నిమిత్తముగ కట్టబడిన వంకర కఱ్ఱలు, వాని క్రింది భాగమున

పణ్యవీథయః మార్గా అన్యే చ. చత్వరాణ్యంగణాని. సంసిక్తాని రథ్యాదీని యస్యాం తాం. ప్రకీర్ణాః మాల్యాదయో యస్యాం తాం. ॥22॥

నేర్పరుచబడిన, రచింపబడిన వేదికలు, గవాక్షచ్ఛిద్రములు, మణి బద్ధమైన ప్రదేశములు-వీని యందు - అని - రాజ మార్గములు అంగడి వీధులు, ఇతర మార్గములు, ముంగిళ్ళు, చక్కగా చల్లబడిన రాజమార్గాదులు దేని యందో దానిని - చల్లబడిన పూలు, దండలు మొదలగునవి దేని యందో దానిని (ఆ మధురానగరమును) (22)

23శ్లో॥ ఆపూర్ణకుంభైర్దధిచందనోక్షితైః
ప్రసూన దీపావళిభిస్స పల్లవైః ।
సవృంతరంభాక్రముకైస్సకేతుభి
స్స్వలంకృత ద్వార గృహాంస పట్టికైః ॥

తా॥ పెరుగు, చందనములతో కలుపబడిన నిండు కలశములతోను, పువ్వులు, దీపముల సమూహములు, చిగుళ్ళతో కూడిన వాని చేతను, తొడిమలతో కూడిన అరటి, పోకకొమ్మలు, పతాకములతోను, పట్టు వస్త్రముల అంచులతోను చక్కగా అలంకరింపబడిన ద్వారములు గల గృహములు కలదియునైన (ఆ పట్టణమును). (23)

టీ॥ ఆపూర్ణేతి. తథా స్వలంకృతాని ద్వారాణి యేషాం తే గృహాః యస్యాం తాం. కైః ఆపూర్ణైః అద్భిః పూర్ణైః కుంభైః దధ్నా చందనేన చ ఉక్షితైః సిక్తైః. ప్రసూనానాం దీపానాం చావళయో యేషు తైః వృంతైః ఫలగుచ్ఛైరుపలక్షితా రంభాః క్రముకాశ్చ తత్సహితైస్సకేతుభిః కేతవోధ్వజా స్తత్సహితైః. పట్టికాః వితస్తి విస్తార పట్టవస్త్రాణిత త్సహితైః. అత్రేయం రీతిః ద్వారేషూభయత స్తండులానాముపరి కుంభాః తత్పరితః ప్రసూనావళయః కంఠే పట్టికాః. ముఖే చూతాదిపల్లవాః తదుపరిపా త్రాంతరే దీపావళయః తత్సన్నిధౌ రంభాః క్రముకాః కేతవస్తోరణాని

టీ॥ మరియు చక్కగా అలంకరింపబడిన ద్వారములు గల ఇండ్లు దేని యందు గలవో దానిని- వేని చేత? ఆ పూర్ణైః - నీటిచే నింపబడిన- కలశములచేత - పెరుగుచేత - చందనము చేత చిలకరింపబడినవి వానిచే పూల యొక్క, దీపముల యొక్కయు సమూహములు వేనియందో వాని చేత - వృంతైః - పండ్ల గుత్తుల చేత కూడినవిగా చూడ బడు తొడిమల చేత - అరటి, పోక చెట్ల కొమ్మల చేత - పతాకములతో కూడ - పట్టికాః - జానెడు వెడల్పు గల పట్టు బట్టలు- వానితో కూడిన వాని చేత - ఇచట దీని విధానము

చేతి. ॥23॥

– ద్వారముల యందు రెండు వైపుల బియ్యము పైన కలశములు – వాని చుట్టును పూవుల సమూహములు కంఠము నందు పట్టికలు ముఖమున మామిడి మొదలగు వాని చిగుళ్ళు ఆపైన వ్యవధానము నందు దీప సమూహములు – వానికి దగ్గరగా అరటి, పోకకొమ్మలు, పతాకములు, తోరణములు మొదలగునవి. (23)

24శ్లో॥ తాం సంప్రవిష్టౌ వసుదేవ నందనౌ
వృతౌ వయస్యై ర్నరదేవవర్త్మనా ।
ద్రష్టుం సమీయుస్త్వరితాః పురస్త్రియో
హర్మ్యాణిచైవారురుహుర్నృపోత్సుకాః ॥

తా॥ స్నేహితులతో కలసి రాజ మార్గముగా మధురాపురిని ప్రవేశించిన వసుదేవుని కుమారులగు బలరామ కృష్ణులను చూచుట కొఱకు, మానవ సహజమైన కుతూహలము గలవారైన నగర స్త్రీలు త్వరపాటుతో ఒక్కచో చేరి గుంపులుగ భవనముల పై అంతస్థుల మీదికి ఎక్కిరి. (24)

టీ॥ తామితి. నర దేవవర్త్మనా రాజమార్గేణ తాం పురీం సంప్రవిష్టౌ వితి ద్వితీయాంతః. ॥24॥

టీ॥ నర దేవర్త్మనా – రాజమార్గము ద్వారా – ఆ పురమును – ప్రవిష్టౌ – ప్రవేశించిన వారిని – ద్వితీయా విభక్త్యంతము. (24)

25శ్లో॥ కాశ్చి ద్విపర్యగ్ధృత వస్త్రభూషణా
విస్మృత్య చైకం యుగళేష్వథా పరాః ।
కృతైక పత్ర శ్రవణైక నూపురా
నాఙ్క్వా ద్వితీయం త్వపరాః స్వలోచనమ్ ॥

తా॥ ఒక స్త్రీ త్వర పాటు వలన, వస్త్రములను, ఆభరణములను తలక్రిందులుగా ధరించెను. మరియొక స్త్రీ జతగా ధరింపదగిన కుండలములు, కంకణములు మొదలగునవి ఒకటి ధరించి ఒకటి మరిచి పోయెను ఇంక ఒక స్త్రీ ఒక వైపు చెవ్వాకును మాత్రమే

టీ॥ ఔత్సుక్యమేవాహ – ద్వయేన. కాశ్చిదితి. విపర్య విపరీతం ధృతాని వస్త్రాణి భూషణాని చ యాభిస్తాః. యుగళేషు యుగళ ధార్యేషు కుండల కంకాణాదిషు. ఏకం విస్మృత్య సమీయుః కృతమేకమేక పత్రం యయోస్తే శ్రవణే యాసాం ఏకమేవ నూపురం చరణా భరణం యాసాం తాశ్చనాజ్య్వా అనజ్య్వా ఏకస్మిన్నేవ లోచనే కజ్జలం నిధాయ. ॥25॥

26శ్లో॥ అశ్నంత్య ఏకాస్తదపాస్య భోజనం
చాభ్యజ్యమానా అకృతోపమజ్జనాః ।
స్వపంత్య ఉత్థాయ నిశమ్య నిస్వనం
నిపాయయంతోౖ ర్భమపోహ్యా మాతరః ॥

టీ॥ అశ్నంత్య ఇతి. తద్భోజనం హిత్వా. అభ్యజ్యమానాః సఖీభిః క్రియమాణ తైలాభ్యంగాః. అకృతస్నానాః అపోహ్యా నిరస్య. ॥26॥

ధరించెను మరియొక స్త్రీ ఒక కాలికి మాత్రమే చిరు గజ్జెల పట్టీ వేసికొనెను. ఇంకొక అంగన ఒక కంటికి మాత్రమే కాటుక పెట్టుకొని బయలు దేరెను. (25)

టీ॥ ఉత్సుకత్వమునే చెప్పుచున్నాడు రెండు శ్లోకములతో. – విపర్యక్ – తలకిందులుగ – ధరింపబడిన వస్త్రములు, ఆభరణములు ఎవరిచేతనో వారు – యుగళేషు – జంటలుగ ధరింపదగిన – కుండలములు కంకణములు మొదలగు వాని యందు. ఒకటి మరచి ఒక దానిని ధరించిరి– ఒకే పత్రము ఎవరిచే చేయబడినదో వారు చెవియందు – ఎవరియందు ఒకే చరణా భరణము గలదో వారు – నాజ్య్వా – (కాటుక) దిద్దక ఒకే కంటికి కాటుకను పెట్టుకొని. (25)

తా॥ భోజనము చేయుచున్న కొందరు స్త్రీలు భోజనమును విడిచి పెట్టి, అభ్యంగనస్నానము చేయుచున్న కొందరు అభ్యంగన మాచరింప కుండనే, పడుకొనియున్నవారు కలకలము విని లేచి, పిల్లలకు పాలిచ్చు చున్న తల్లులు వారిని వదిలించుకొని చూచుటకు పరిగెత్తిరి. (26)

టీ॥ తిండి తినుచున్న వారు తిండిని వదిలి – అభ్యజ్యమానాః– సఖీజనముతో చేయుచున్న తైలాభ్యంగనము గలవారు – స్నానము చేయకయే – అపోహ్యా – నిరసించి. (26)

27శ్లో॥ మనాంసి తాసా మరవిందలోచనః
ప్రగల్భలీలాహసితావలోకనైః ।
జహార మత్తద్విరదేంద్ర విక్రమో
దృశాం దధచ్ఛ్రీరమణాత్మనోత్సవమ్ ॥

టీ॥ మనాంసీతి. ప్రగల్భాః లీలాః తాభిః, హసితానీక్షణాని చ తైః శ్రియం రమయతీతి శ్రీరమణః తేనాత్మనా వపుషా. తాసాం దృశాం ఉత్సవం దధత్. మనాంసి జహార. ॥27॥

తా॥ తామర రేకుల వంటి కన్నులు గల వాడు, మదించిన శ్రేష్ఠమైన ఏనుగు వంటి పరాక్రమము గలవాడును, శ్రీరమణుడును అయిన కృష్ణుడు తన ప్రతిభ తో నిర్వహించిన లీలల పాటవము తోడి నవ్వుల చూపుల చేత, వారి చూపులకు ఉత్సవమును కలిగించుచు, ఆ స్త్రీల మనస్సులను హరించెను. (27)

టీ॥ ప్రగల్భములు, లీలలు, వానిచేత; నవ్వు చూపులు, వానిచేత; లక్ష్మీదేవితో క్రీడించును కావున శ్రీరమణుడు అట్టి తన శరీరము చేత వారి చూపులకు ఆనందమును పెంచుచు - మనస్సులను హరించెను. (27)

28శ్లో॥ దృష్ట్వా ముహుశ్శ్రుత మమను ద్రుతచేతస
స్తం తత్ప్రేక్షణోస్మిత సుధోక్షణ లబ్ధమానాః ।
ఆనందమూర్తి ముపగూహ్య దృశాత్మ లబ్ధం
హృష్యత్త్వచో జహురనంతమరిందమాధిమ్ ॥

తా॥ ఓ శత్రుదమనా! (కామమును జయించినవాడా) పరీక్షిద్రాజా! మఱల మఱల అతని గూర్చి వినియుండిన కారణము చేత కృష్ణుని చూచి అతనితో నిండిన హృదయము గలవారై, అతనిని చూచి, అతని చూపును, పైకి కన్పట్టుచున్న అతని చిరునవ్వును చూచి - అదియే అమృతముగా నుండిన దాని చేత తడుపబడి, దానిచే పొందిన గౌరవము గలవారై, - కన్నుల చేత, మనస్సున (పొందిన) ఆ ఆనంద మూర్తిని కౌగలించుకొని మిక్కిలి సంతసించిన స్పర్శతో కూడిన శరీరములు (త్వక్కులు) గలవారై, ఎంతో కాలముగ పీడించుచున్న వ్యధను పోగొట్టుకొనిరి. (28)

టీ॥ దృష్ట్వేతి. ముహుః శ్రుతత్వాత్ తద్గతచేతసస్సత్యః తం దృష్ట్వా తస్య ప్రేక్షణం చ ఉత్మ్రితం చ తదేవ సుధా తయా సుధాయా ఉక్షణం సేచనం. తేన లబ్ధో మానో యాభిస్తాః దృశా ఉద్ఘటితేన నేత్ర ద్వారేణ ఆత్మని మనసి లబ్ధం ప్రాప్తం పరిష్వజ్య తదప్రాప్తి జనితం అనంతం ఆధిం వ్యధాం జహుః. హే అరిందమ నిర్జితకామేతి సంబోధనం. శృంగారరసే నిమగ్నో మాభూదితి. ॥28॥

టీ॥ మఱల మఱల విని యుండుట వలన అతని తో నిండిన మనస్సులు గలవారై అతనిని చూచి అతని చూపును ఉబుకుచున్న చిరునవ్వును అదియే అమృతముగా తడపుట చేత పొందిన గౌరవము గలవారైన ఆ స్త్రీలు తమ చూపు చేత పైకెత్తబడిన నేత్రముల ద్వారా ఆత్మని మనస్సు నందు ప్రాప్తించిన కృష్ణుని కౌగలించి అతనిని పొందకుండుట చే కలిగిన ఎనలేని వ్యధను విడిచి – హే అరిందమ!– కామమును జయించినవాడా! అని సంబోధనము 'శృంగార రసమున మునుగకుము' అని (మునుగ కుందువు గాక అని) (28)

29శ్లో॥ ప్రాసాదశిఖరారూఢాః ప్రీత్యుత్ఫుల్లముఖాంబుజాః ।
అభ్యవర్షన్ సౌమనస్యైః ప్రమదా బల కేశవౌ ॥

తా॥ భవనముల యొక్క ఉన్నతోన్నముల భాగముల పైకి ఎక్కి, ప్రీతి తో వికసించిన ముఖ పద్మములు కలవారై, మధురానగర స్త్రీలు, బలరామ కృష్ణుల మీద పూల సమూహములతో తమ సుమనస్సులతో వర్షము కురిపించిరి. (29)

30శ్లో॥ దధ్యక్షతైస్సోద పాత్రై స్రగ్గంధై రప్యుపాయనైః ।
తావానర్చుః ప్రముదితా స్తత్ర తత్ర ద్విజాతయః ॥

తా॥ బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య జాతుల వారు అచ్చటచ్చట, వారిద్దరిని, పెరుగు అక్షతలు, నీటితో నింపిన కలశములు, పూలదండలు, దివ్య గంధములు, వివిధములగు కానుకలు సమర్పించుచు హృష్ట మనస్కులై పూజించిరి. (30)

టీ॥ ప్రాసాదేతి. సౌమనస్యైః కుసుమసమూహై శ్శోభన మనో భావై ర్వా. ॥29,30॥

టీ॥ సౌమనస్యైః – పువ్వుల సమూహముల చేత – లేక శోభన మనోభావముల చేత . (29, 30)

31శ్లో॥ ఊచుః పౌరా అహో గోప్య స్తపః కిమచరన్మహత్ ।
యా హ్యేతావనుపశ్యంతి నరలోక మహోత్సవౌ ॥

తా॥ అహో! గోపస్త్రీలారా! మీరు ఏ గొప్ప తపస్సు చేసితిరో దాని వలన మానవ లోకమునకు మహోత్సవ స్వరూపులగు ఈ బలరామ కృష్ణులు మీ వైపే చూచుచున్నారు అని పౌరులనిరి. (31)

టీ॥ ఊచురితి. పౌరాః పుర స్త్రియః. ॥31॥

టీ॥ పౌరాః – పుర స్త్రీలు. (31)

**రజక వధ, వాయక, సుదామ, త్రివక్రాదీనాం సమ్మాన ఘట్టః**

**రజకుని వధ, వాయక, సుదామ, త్రివక్రాదుల సమ్మాన ఘట్టము.**

32శ్లో॥ రజకం కంచిదాయాంతం రంగకారం గదా గ్రజః ।
దృష్ట్వాయా చ త వాసాంసి ధౌతాన్యత్యుత్తమాని చ ॥

తా॥ వస్త్రములకు వన్నెలు కలుగజేయు చాకలి వానిని చూచి కృష్ణుడు అతనిని, తెల్లనివి ఉత్తమోత్తమములైన బట్టలను తనకు కావలెనని అడిగెను.(32)

33శ్లో॥ దేహ్యావయో స్సముచితాన్యంగ వాసాంసి చార్హతోః ।
భవిష్యతి పరం శ్రేయో దాతుస్తేనాత్ర సంశయః ॥

తా॥ మా ఇరువురికిని యోగ్యమైన శరీరమున ధరించు వస్త్రముల నిమ్ము అర్హులైన వారికి వస్త్రముల నిచ్చిన నీకు గొప్ప శ్రేయము కలుగ గలదు సందేహము లేదు. (33)

టీ॥ రజకమితి. రజకః వస్త్ర నిర్ణేజకః. స ఏవ వస్త్రాణాం రాగమపి కుర్వన్ రంగకారః. ॥32,33॥

టీ॥ రజకః – బట్టలను శుభ్రము చేయువాడు – అతడే బట్టలకు వన్నె చేయువాడు కావున రంగకారుడు. (32,33)

34శ్లో॥ స యాచితో భగవతా పరిపూర్ణేన సర్వతః ।
సాక్షేపం రుషితః ప్రాహ భృత్యో రాజ్ఞస్సుదుర్మదః ॥

తా॥ అన్నింటను పరిపూర్ణుడైన భగవానుని చేత యాచింపబడిన రజకుడు, మిక్కిలి గర్వించి యున్న రాజ సేవకుడైన ఆ రజకుడు కోపించిన వాడై ఆక్షేపముతో కృష్ణుని గూర్చి ఇట్లు పలికెను. (34)

టీ॥ స ఇతి. రుషితః కుపితః. ॥34॥

టీ॥ రుషితః – కోపించిన వాడై. (34)

35శ్లో॥ ఈదృశాన్యేవ వాసాంసి నిత్యం గిరి వనే చరాః ।
పరిధత్త కిముద్వృత్తా రాజ ద్రవ్యాణ్యభీప్సథ ॥

తా॥ పర్వత ప్రాంతములలోను, అడవులలోను తిరిగెడి మీరు నిత్యమును ఇట్టి వస్త్రములనే ధరింతురా? ఉద్ధతి (గర్వము)తో ఇట్లు రాజుల వస్తువులను కోరుదురా ఏమి?.(35)

టీ॥ ఈదృశానీతి. గిరౌ వనే చరథ. యే. తే. యూయం నిత్యం పూర్వం పరిధత్తేతి. సంభావానాయాం లోట్. అభీప్సథ ప్రార్థయథ.॥35॥

టీ॥ కొండలపై, అడవులలో తిరుగువారగు మీరు ప్రతి దినమును ఇట్టి వస్త్రములనే ధరింతురా! ప్రసిద్ధి యందు 'లోట్' – అభీప్సథ – ప్రార్థించెదరు గాక.? (35)

36శ్లో॥ యా తాశు బాలిశానైవం ప్రార్థ్యం యది జిజీవిషా ।
బధ్నంతి ఘ్నంతి లుంపంతి దుష్టాన్ రాజ కులాని వై ॥

తా॥ మూర్ఖులారా! త్వరగా పొండు, బ్రతుకు పై ఆశ గల వాడు ఇట్లు యాచింపకూడదు. రాజభటులు ఇట్టి దుర్మార్గులను బంధింతురు. మీ వస్తువులను లాగు కొందురు. (36)

37శ్లో॥ ఏవం వికత్థమానస్య కుపితో దేవకీ సుతః ।
రజకస్య కరాగ్రేణ శిరః కాయాదపా హరత్ ॥

తా॥ ఈ విధముగ రాజసంబంధమైన పొగడ్త చేయుచున్న చాకలి వానిని, కోపించిన దేవకీ సుతుడు చేతి ముందు భాగముతో వాని తలను మొండెము నుండి అపహరించెను. (తొలగించెను) (37)

టీ॥ యాతేతి. రాజకులాని రాజకీయాః లుంపంతి నిస్స్వం కుర్వంతి. ॥36,37॥

టీ॥ రాజ కులాని – రాజుకు సంబంధించిన వారు – లుంపంతి – మీ వస్తువులు, మీకు లేకుండ చేయుదురు. (36,37)

38శ్లో॥ తస్యానుజీవినస్సర్వే వాసః కోశా విస్పృజ్య వై ।
దుద్రువుస్సర్వతో మార్గం వాసాంసి జగృహేఽచ్యుతః ॥

తా॥ ఆ రజకుననుసరించి జీవించు వారందఱును బట్టల మూటలన్నియును విడిచి పెట్టి అన్ని త్రోవల గుండా పరిగెత్తి పోయిరి. శ్రీకృష్ణుడు వస్త్రములను తీసికొనెను. (38)

39శ్లో॥ వసిత్వాత్మ ప్రియే వస్త్రే కృష్ణస్సంకర్షణ స్తథా ।
శేషాణ్యదత్త గోపేభ్యో విస్పృజ్య భువి కాని చిత్ ॥

తా॥ కృష్ణ బలరాములు, తమకు ప్రియమైన వస్త్రములను ధరించి, మిగిలినవి గోపాలుర కిచ్చి, ఇంకను కొన్నింటిని అచటనే నేలపై వదిలి – ముందునకు సాగిరి. (39)

టీ॥ తస్యేతి. వాసః కోశా వస్త్ర పుటకా. ॥38,39॥

టీ॥ వాసః – కోశాన్ – బట్టల పొత్తికలు. (38,39)

40శ్లో॥ తతస్తు వాయకః ప్రీతస్తయోర్వేష మకల్పయత్ ।
విచిత్ర వర్ణై శ్చైలేయై రాకల్పై రనురూపతః ॥

తా॥ అప్పుడు ఒక నేత పని వాడు సంతోషించి, చిత్రమైన వన్నెలు గల వస్త్రముల చేత రామ కృష్ణులకు సరిపోవునట్లుగ – వారి వేషములను చక్కగా కల్పించెను. (40)

41శ్లో॥ నానా లక్షణ వేషాభ్యాం కృష్ణ రామౌ విరేజతుః ।
అలంకృతౌ బాల గజౌ పర్వణీవ సితేతరౌ ॥

తా॥ అనేక విధముల లక్షణములు గల వేషములతో రామ కృష్ణులు– ఉత్సవ దినమందు అలంకరింప బడిన తెల్లని, నల్లని వన్నెలతో గల గజ కిశోరముల వలె ప్రకాశించిరి. (41)

టీ॥ తత ఇతి. వాయకః తంతువాయవిశేషః. వేషం అలంకారం. చైలేయైర్వస్త్ర మయైరాకల్పై ర్భూషణైః. ॥40,41॥

టీ॥ వాయకః – ఒక విధమగు నేత పని వాడు – వేషం – అలంకారము – చైలేయైః – వస్త్రములతో కూడిన వాని చేత – ఆకల్పైః – భూషణముల చేత. (40,41)

42శ్లో॥ తస్య ప్రసన్నో భగవాన్ప్రాదాత్సారూప్య మాత్మనః ।
శ్రియం చ పరమాం లోకే బలైశ్వర్యస్మృతీంద్రియమ్ ॥

తా॥ ఆ నేత పని వాని నేర్పరి తనమునకు భగవానుడు మిక్కిలి సంతసించి, అతనికి ఇహమునందు, శ్రేష్ఠసంపదను, బలమును, అధికారమును, బుద్ధిబలమును, ఇంద్రియ పటుత్వమును; పరమున తన సారూప్య ముక్తిని ఇచ్చెను. (42)

43శ్లో॥ తతస్సుదామ్నో భవనం మాలాకారస్య జగ్మతుః ।
తౌ దృష్ట్వా సహసోత్థాయ ననామ శిరసా భువి ॥

తా॥ అచట నుండి రామ కృష్ణులు సుదాముడను మాలాకారుని గృహమునకు వెడలిరి. వారిని చూచి అతడు లేచి నిలబడి, నేలపై తలనానిచి నమస్కరించెను. (43)

44శ్లో॥ తయోరాసన మానీయ పాద్యం చార్ఘ్యార్హణాదిభిః ।
పూజాం సానుగయోశ్చక్రే స్రక్తాంబూలా నులేపనైః ॥

తా॥ వారికి ఆసనములను దెచ్చి కూర్చుండ జేసి పాద్యము, అర్ఘ్యము మొదలగునుపచార సమర్పణముతో పూజ చేసి, వాని ననుసరించి వచ్చిన వారికి కూడ పూలదండలు, తాంబూలములు, చందనపు పూతలు మొదలగు వానితో సత్కరించెను. (44)

45శ్లో॥ ప్రాహ నస్సార్థకం జన్మ పాలితం చ కులం ప్రభో ।
పితృదేవర్ష యో మహ్యం తుష్టాహ్యో గమనేన వామ్ ॥

తా॥ "ప్రభూ! మా జన్మ సార్థకమైంది. మా కులము రక్షించబడినది. మీరాకతో పితృదేవులు, దేవతలు, ఋషులు తుష్టి చెందినారు" అని సుధాముడు వినయంగా పలికెను. (45)

టీ॥ తస్యేతి. ఇహలోకే పరమాం శ్రియం బలం చ ఐశ్వర్యం చ స్మృతిం చ ఇంద్రియం చ తత్పాటవం చ. ॥42-45॥

టీ॥ ఇహమునందు ఉత్తమమైన సంపదను, బలమును, ఐశ్వర్యమును స్మృతిని, ఇంద్రియశక్తిని, వాని పటుత్వమును. (42-45)

46శ్లో॥ భవంతౌ కిల విశ్వస్య జగతః కారణం పరమ్ ।
అవతీర్ణా విహాంశేన క్షేమాయ చ భవాయ చ ॥

తా॥ మీరు ఇరువురును సమస్త విశ్వమునకు పరమకారణులు ఈ విశ్వ క్షేమము కొఱకు - అభయము కొరకును ఉద్భవము కొఱకును మీ అంశల చేత అవతరించినారు. (46)

టీ॥ భవంతావితి. క్షేమాయ అభయాయ ఉద్భవాయ. ॥46॥

టీ॥ క్షేమాయ - అభయము కొఱకు - భవాయ - ఉద్భవము కొఱకు (పుట్టుక కొఱకు). (46)

47శ్లో॥ న హి వాం విషమా దృష్టి స్సుహృదోర్జగదాత్మనోః ।
సమయోస్సర్వ భూతేషు భజంతం భజతోఽపి ॥

తా॥ ప్రేమమయమైన మీకు విషమ దృష్టి లేదు. (ఒకరెక్కువ ఒకరు తక్కువ అను భేద దృష్టి లేదు) జగత్తుకు ఆత్మలైన మీకు సమస్తమైన భూతములును సమానమే. మిమ్ము భజించు వారు, భజించని వారు మీకు సర్వసములే. (47)

48శ్లో॥ మామాజ్ఞాపయతం భృత్యం కిమహం కరవాణి వాహమ్ ।
పుంసస్త్వనుగ్రహో హ్యేష భవద్భ్యాం యన్ని యుజ్యతే ॥

తా॥ మీ సేవకుడనగు నన్ను - మీ కొరకు ఏమి చేయ వలయునో ఆజ్ఞాపింపుడు. మీ చేత ఏది నియోగింపబడునో అది పురుషునకు ఒక అనుగ్రహము కదా!. (48)

టీ॥ రజక వధేన వాయకానుగ్రహేణ చ యువయోః విషమ దృష్టి తయా అనీశ్వరతానాశంకనీయేత్యాహ - న హీతి. అత్ర హేతుస్స మయో రితి. అత్రాపి హేతుద్వయం సుహృదోః జగదాత్మనోరితి చ. ॥47,48॥

టీ॥ చాకలి వానిని చంపుటచేతను, నేతపని వానిని అనుగ్రహించుట చేతను మీకు విషమ దృష్టిత్వముతో అనీశ్వరత్వము కలుగుచున్నదేమో అని సందేహము కలుగుచుండగా - చెప్పుచున్నాడు. "నహి" అని, కారణము మీరు సమదృష్టి కలవారు అని, ఇచట కూడ రెండు కారణములు మీరు సుహృత్తులు, జగదాత్మరూపులు-అని. (47,48)

**శ్రీశుక ఉవాచ**

49శ్లో॥ ఇత్యభిప్రేత్య రాజేంద్ర సుదామా ప్రీత మానసః ।
శస్తైస్సు గంధ కుసుమై ర్మాలా విరచితా దదౌ ॥

**శ్రీశుకుడు చెప్పుచున్నాడు.**

తా॥ రాజేంద్రా! ఇట్లు తన ఉద్దేశముతో వారలను సంప్రీతులను జేసి సుదాముడు తానును సంతుష్ట మనస్కుడై - ప్రశస్తమైనవియు, పరిమళ భరితములైనవి యునైన పుష్పముల చేత తాను కట్టిన పెద్ద మాలను బహూకరించెను. (49)

50శ్లో॥ తాభిస్స్వలంకృతౌ ప్రీతౌ కృష్ణ రామౌ సహానుగౌ ।
ప్రణతాయ ప్రసన్నాయ దదతుర్వరదౌ వరాన్ ॥

తా॥ బలరామకృష్ణులు తమ అనుచరులగు గోపాలకులతో కూడ ఆ పూలదండలతో నలంకరించుకొని సంప్రీతురైరి. వరదులైన రామకృష్ణులు, సంతోషముతో నమస్కరించుచున్న సుదామునకు వరములిచ్చిరి. (50)

51శో॥ సోఽపి వవ్రేఽచలాం భక్తిం తస్మిన్నే వాఖిలాత్మని ।
తద్భక్తేషు చ సౌహార్దం భూతేషు చ పరాం దయామ్ ॥

తా॥ అతడు కూడ అఖిలాత్ముడైన కృష్ణుని యందు చలింపని భక్తిని, తన భక్తుల యందు ప్రేమ భావమును మరియు సమస్త భూతముల యందు పరిపూర్ణమైన దయను తనకు అనుగ్రహింపుమని కోరెను. (51)

టీ॥ ఇతీతి. ఇత్యేవం విజ్ఞాపయన్ అభిప్రేత్య తన్మతం జ్ఞాత్వా. ॥49-51॥

టీ॥ అని ఈ విధముగ విజ్ఞాపనము చేయుచు - వారి అభిప్రాయమును తెలిసికొని (అభిప్రేత్య). (49-51)

52శ్లో॥ ఇతి తస్మై వరాన్ దత్వా శ్రియం చాన్వయ వర్ధనీమ్ ।
బలమాయుర్యశః కాంతిం నిర్జగామ సహాగ్రజః ॥

తా॥ వంశమును వృద్ధి చేయ గల సంపదను, బలమును, చిరాయువును, కీర్తిని, తేజమును సుదామునకు వరములుగా నిచ్చి కృష్ణుడు బలరామ సహితుడై అటు నుండి వెడలిపోయెను. (52)

టీ॥ ఇతీతి. అన్వయవర్ధనీం వంశవృద్ధిమతీం. శ్లో. స్వైరం చర మధు పురే రజకం నికృత్య కృష్ణః ప్రదాయ చ వరానథ వాయకాయ, మాలాకృతం సమనుకంప్య చకార కుబ్జామృజ్వీం ధనుశ్చ సహసోన్నమయన్ బభంజ. శ్రీధరీయోఽయం శ్లోకః. ॥52॥

టీ॥ అన్వయవర్ధనీం - వంశమును వృద్ధిచేయు దానిని - "మధురాపురిలో స్వేచ్ఛగా తిరుగుచు - చాకలి వానిని వధించి కృష్ణుడు, నేత పని వానికి వరములిచ్చి, మాలాకారుడైన సుదామునను(గ్రహించి కుబ్జను చక్కని దానిని చేసెను." ధనుస్సును, బాణము సంధించి వంచుచు భంజించెను. (ఇది శ్రీధరీయ శ్లోక భావము). (52)

**శ్రీ మద్భాగవతే, మహాపురాణే దశమస్కంధే,**
**ఏకచత్వారింశోఽధ్యాయః**

**అని శ్రీమద్భాగవతమున దశమస్కంధమందు**
**నలుబది ఒకటవ అధ్యాయము సమాప్తము.**

## ద్విచత్వారింశోఽధ్యాయః

### శ్రీశుక ఉవాచ

1శ్లో॥ అథ వ్రజ రాజపథేన మాధవ
స్త్రియం గృహీతాంగ విలేపభాజనామ్ ।
విలోక్య కుబ్జాం యువతీం వరాననాం
పప్రచ్ఛ యాంతీం ప్రహసన్ రస ప్రదః ॥

టీ॥ శ్లో. "ద్విచత్వారింశకే కుబ్జోన్నమనం ధనుషోభిదా, వధస్తద్రక్షిణాం కంసారిష్ట రంగోత్సవాది చ. అథేతి. అంగ విలేపాశ్చందనాదయః. గృహీతాని అంగలేప భాజనాని యయా తాం. రస ప్రదః సుఖప్రదః. ॥1॥

2శ్లో॥ కా త్వం వరోర్వ్యేత దిహానులేపనం
కస్యాంగనేవా కథయస్వ సాధు నః ।
దేహ్యావయోరంగవిలేపముత్తమం
శ్రేయస్తతస్తేనచిరాద్భవిష్యతి ॥ ॥2॥

## నలుబది రెండవ అధ్యాయము

### శ్రీశుకడు పలుకుచున్నాడు

తా॥ పిమ్మట, రాజమార్గమున పోవుచు కృష్ణుడు, చందనాది అంగ విలేపముల పాత్రలను తీసికొని పోవుచున్న కుబ్జ అనునొక సుందరమైన ముఖముగల యువతిని చూచి, రసప్రదుడైన అతడు నవ్వుచు ఆమెను అడిగెను (నవ్వుచే – ఆమెను అనుగ్రహించుటకు వెలువరించిన జాలి నవ్వు.) (1)

టీ॥ నలుబది రెండవ అధ్యాయమున కుబ్జను ఉద్ధరించుట, ధనస్సును భేధించుట, దాని రక్షకులను వధించుట, కంసుని అరిష్టమునకు సంబంధించిన సమావేశములు, ఉత్సవములు మొదలగునవి వర్ణింపబడినవి (ఇది శ్రీధరీయ శ్లోక భావము) అంగ విలేపాః – చందనము మొదలగునవి – తీసుకొనబడిన అంగ లేపన ముల పాత్రలు ఎవరి చేతనో ఆమెను – రసప్రదః – సుఖము నిచ్చు వాడు. (1)

తా॥ గొప్ప ఊరువులు గల ఓ సుందరీ! నీవెవరవు? ఈ అంగ లేపనము లెవరికి? మాకు ఉన్నది యున్నట్లుగ చెప్పుము మా కిరువుర కును శ్రేష్ఠమైన అంగలేపనము నిమ్ము నీకు తొందరలోనే శ్రేయస్సు కలుగును. (2)

టీ॥ కేతి. హే అంగనే వరోరు ఇతి సోపహాసం సంబోధ్య పృచ్ఛతి. త్వం కా? ఏతదను లేపనం కస్య వా? ఉహ ఇతి నిపాతో భ్రూవిక్షేప యుక్తే వితర్కే. అస్మత్సేవా సద్యః ఫలదేత్యాహ న చిరాదితి. ॥2॥

టీ॥ హే అంగనే – ఓ స్త్రీ! వరోరు! అని నవ్వుచు సంబోధించి అడుగుచున్నాడు. నీవెవరవు? ఈ అనులేపనము ఎవరికి? 'ఉహ' అను నిపాతము కనుబొమలు ఎగరవేయుచు వితర్కించుట యందు ప్రయుక్తము మాకు చేసిన సేవ అప్పటికప్పుడే ఫలమిచ్చునది అని చెప్పుచున్నాడు 'న చిరాత్' (వెంటనే) అని అర్థం. (2)

సైరంధ్ర్యువాచ:

3శ్లో॥ దాస్యస్మ్యహం సుందర కంస సంమతా
త్రివక్రనామా హ్యనులేప కర్మణి ।
మద్భావితం భోజపతే రతి ప్రియం
వినా యువాం కోఽన్యతమస్త దర్హతి ॥

అంతఃపురము కొలవుకత్తె (కుబ్జ) ఇట్లనెను.

తా॥ ఓ సుందరా! నేను ఒక దాసిని. కంసునకు నమ్మకమైన దానిని నా పేరు త్రివక్ర అనులేపన కర్మ యందు నేను చేసిన లేపన ద్రవ్యములు భోజపతి యగు కంసునకు మిక్కిలి ప్రియమైనవి అయినను ఈ ద్రవ్యములకు మీ ఇరువురు తప్ప ఇంకెవరు అర్హులయ్యెదరు?. (3)

టీ॥ దాసీతి. తిస్రః గ్రీవోరః కటయో వక్రా ఇతి త్రివక్రేతి నామ యస్యాస్సా. అను లేపన క్రియాయాం కంసస్య బహుమతా దాస్యస్మి.॥3॥

టీ॥ తిస్రః – మూడు – మెడ, వక్షము, నడుము – వంకరగనుండుట చేత త్రివక్రయను పేరు ఎవరికో ఆమె అనులేపన క్రియ యందు కంసుని యొక్క ఆదరము పొందిన దానిని. (3)

4శ్లో॥ రూప పేశల మాధుర్య హసితాలాప వీక్షితైః ।
ధర్షితాత్మా దదౌ సాంద్రముభయో రనులేపనమ్ ॥

తా॥ కృష్ణ బలరాముల రూపము, సౌకుమార్యము, రసికత్వము, నవ్వు, మాటలు, చూపులు మొదలగు వానితో మోహిత చిత్తురాలై, కుబ్జ వారిరువురికిని ఘనమైన అనులేపనముల నిచ్చెను. (4)

టీ॥ రూపేతి. రూపం అంగసౌష్ఠవం. పేశలం చ సౌకుమార్యం. మాధుర్యం చ రసికతా. హసితం చ ఆలాపశ్చ. వీక్షితం చ తైర్ధర్షితాత్మా మోహితచిత్తా సాంద్రం ఘనం.॥4॥

టీ॥ రూపము - అంగ సౌష్ఠవము - పేశలం - సుకుమారత్వము - మాధుర్యం - రసికత - నవ్వు, మాటనేర్పరితనము - చూపు - వీనితో - ధర్షితాత్మా- మోహితచిత్తురాలై - సాంద్రం-ఘనమైన.(4)

5శ్లో॥ తతస్తావంగ రాగేణ స్వవర్ణేతర శోభినా ।
సంప్రాప్త పర భాగేన శుశుభాతేఽనురంజితౌ ॥

తా॥ అప్పుడు వారిరువురు, తమ శరీరవర్ణముల కంటే భిన్నమైన వర్ణముతో శోభింప జేయు అంగలేపనముతో శ్రేష్ఠమైన శరీర వర్ణములతో శోభాతిశయమున ప్రకాశించిరి. (5)

టీ॥ తత ఇతి. స్వవర్ణేతరశోభినా రామకృష్ణ యోర్వర్ణాభ్యామితరః పీతాదివర్ణస్తేన శోభితం శీలం యస్య తేన. సంప్రాప్తపరిభాగేన సంప్రాప్తః పరో నాభేరుపరితనో భాగో యేన. యద్వా. సంప్రాప్తః పరభాగః శోభాతిశయో యేనేతి వా. తేనానురంజితౌ. ॥5॥

టీ॥ స్వవర్ణేతర శోభినా - రామకృష్ణుల యొక్క మేని వన్నెల కన్న ఇతరమైన - పసుపు వన్నెతో ప్రకాశింపజేయు స్వభావము దేనికో - అట్టి అంగరాగము చేత - సంప్రాప్త పరభాగేన- పొందబడిన -పరః నాభి కంటె పైన గల శరీరభాగము- లేక పొందబడిన శోభాతిశయము దేనిచేతనో అని - దానిచే ప్రకాశించిరి. (5)

6శ్లో॥ ప్రసన్నో భగవాన్ కుబ్జాం త్రివక్రాం రుచిరాననామ్ ।
ఋజ్వీం కర్తుం మనశ్చక్రే దర్శయన్ దర్శనే ఫలమ్ ॥

తా॥ కృష్ణుడు ప్రసన్నుడై, సుందరవదనయు, త్రివక్రయునైన కుబ్జను చక్కని దానినిగా చేయవలయునని, తన దర్శన ఫలమును చూపించుచు - సంకల్పించెను.(6)

టీ॥ ప్రసన్న ఇతి. స్వదర్శనే సద్యః ఫలం దర్శయన్. ॥6॥

టీ॥ స్వదర్శనే సద్యః ఫలం దర్శయన్ - తన దర్శనమున అప్పుడే ఫలమును చూపుచు. (6)

7శ్లో॥ పద్భ్యామాక్రమ్య ప్రపదే ద్ర్యంగుళోత్తాన పాణినా ।
ప్రగృహ్య చుబుకేఽధ్యాత్మ ముదనీనమదచ్యుతః ॥

తా॥ కృష్ణుడు తన పాదములను ఆమె పాదములపై మోపి, గట్టిగా ఆక్రమించి తన వెల్లికిల చేసిన చేతి రెండు వ్రేళ్ళతో ఆమె గదువ క్రింద, మీది వైపునకు నొక్కబడునట్లు అమర్చుకొని ఆమె దేహమును పై దిక్కునకు గట్టిగా నొక్కెను. (7)

టీ॥ పద్భ్యామితి. తస్యాః ప్రపదే పాదాగ్రద్వయం. పద్భ్యామాపీడ్య. ద్వే అంగుళ్యఉత్తానే ఉన్నతే యస్మి పాణౌ తేన. చుబుకే ముఖస్యాధో భాగే అధ్యాత్మం దేహం ఉన్నమయామాస. ॥7॥

టీ॥ ఆమె పాదములపై భాగములను తన రెండు పాదముల అగ్ర భాగములతో నొక్కిపట్టి - రెండు వ్రేళ్ళు చాచినవి ఏ చేతి యందో దాని చేత - చుబుకే - ముఖమునకు క్రింది భాగమున(గద్దువక్రింద) అమర్చి - ఆధ్యాత్మం దేహమును ఊర్ధ్వ భాగము వైపు నొక్కెను. (7)

8శ్లో॥ సా తదర్జు సమానాంగీ బృహచ్ఛ్రోణి పయోధరా ।
ముకుంద స్పర్శనాత్సద్యో బభూవ ప్రమదోత్తమా ॥

తా॥ ఆమె(కుబ్జ) వెంటనే నిటారైన సమానములైన అవయవములు కలదై, నిండైన పిఱుదులు, నిండైన స్తనములు కలదై, కృష్ణుని స్పర్శ వలన, వెంటనే సౌందర్యవతియగు స్త్రీ అయ్యెను. (8)

9శ్లో॥ తతో రూప గుణౌదార్య సంపన్నా ప్రాహ కేశవమ్ ।
ఉత్తరీయాం తమాకృష్య స్మయంతీ జాతహృచ్ఛయా ॥

తా॥ అప్పుడు కుబ్జ సుందరరూపము, ఉత్తమగుణము, ఉదారతతో కూడినదై, తన చీరచెంగు కొనను ఒక చేతితో సవరించుకొని, చిరునవ్వు నవ్వుచు, హృదయము మీద చేయివేసికొని కృష్ణునితో ఇట్లనెను. (9)

10శ్లో॥ ఏహి వీర గృహం యావో న త్వాం త్యక్తు మిహోత్సహే ।
త్వయోన్మథిత చిత్తాయాః ప్రసీద పురుషర్షభ ॥

తా॥ వీరుడా! మా యింటికి పోవుదుము రండు మిమ్ము వదిలి పెట్టుటకు నేను ఇష్టపడుట లేదు ఓ పురుష శ్రేష్ఠుడా! నీ చేత మథింపబడిన చిత్తము గలదాననైన నాయెడ ప్రసన్నుడవు కమ్ము.(10)

11శ్లో॥ ఏవం స్త్రియా యాచ్యమానః కృష్ణో రామస్య పశ్యతః ।
ముఖం వీక్ష్యానుగానాం చ ప్రహ సంస్తా మువాచ హ ॥

తా॥ ఇట్లు ఆ స్త్రీతో ప్రార్థింపబడుచున్న వాడైన కృష్ణుడు బలరాముడు చూచుచుండగ అనుచరుల ముఖమును చూచి, నవ్వుచు ఇట్లనెను. (11)

టీ॥ నేతి. తదైవ ఋజు సమానమంగం యస్యాస్సా. బృహంతౌ శ్రోణి పయోధరౌ యస్యాస్సా ముకుందస్పర్శనాదితి ముఖ్యకారణం. ॥8-11॥

టీ॥ తదా+ఋజు-తదర్జు-అప్పుడే చక్కని సమానమైన అంగములు ఎవతెకు కలిగెనో ఆమె - బృహంతౌ శ్రోణి పయోధరౌ - బలిసిన పిఱుదులు, కుచములు ఎవతెకో ఆమె ముకుందుని స్పర్శ వలన అనునది ముఖ్య కారణము. (8-11)

12శ్లో॥ ఏష్యామి తే గృహం సుభ్రు పుంసామాధివికర్శనమ్ ।
సాధితార్థో౽గృహాణాం నః పాంథానాం త్వం పరాయణమ్॥

తా॥ సుందరీ! (అందమైన కనుబొమలు కలదానా!) ఒకానొక ప్రయోజనమును సాధించిన తరువాత మీ ఇంటికి వచ్చెదను. మీ వంటి వారి ఇల్లు పురుషులకు మనః పీడనుపశమింప జేయునది. గృహస్థులు కానట్టి మా వంటి బాటసారులకు ఆశ్రయము నీవే కదా! (12)

టీ॥ ఏష్యామీతి. ఆధివికర్శనం. మనః పీడాశమనం. కంస వధేన సాధితః అర్థః సుహృదాం ప్రయోజనం యేన సః అగృహాణాం అకృతదారాణాం పాంథానాం ప్రవాసినాం పరం అయనం ఆశ్రయ స్త్వం. ॥12॥

టీ॥ ఆధివికర్శనం – మనస్సున గల బాధను శమింపజేయునది కంస వధ చేత సాధింపబడిన ప్రయోజనము గలవాడనై – ఆత్మీయులకు ప్రయోజనము ఎవరిచేతనో అట్టివాడనై – అగృహాణాం – గృహస్థులు కాని వారికి (పెండ్లి కాని వారికి) బాటసారులకు, ఇతర ప్రాంతముల వారికి– శ్రేష్ఠమైన ఆశ్రయ స్థానమవు నీవు. (12)

13శ్లో॥ విసృజ్య మధ్వ్యా వాణ్యా తాం వ్రజ మార్గే వణిక్పథే ।
నానోపాయన తాంబూల స్రగ్గంధైస్సా గ్రజోఽర్చితః ॥

తా॥ మధురమైన వాక్కుతో ఆమెను వదలి ముందునకు సాగుచు మార్గ మధ్యమున అంగడి వీధిలో కృష్ణుడు అన్నయగు బలరామునితో సహా వివిధములైన కానుకలతో, తాంబూలములతో, పూలమాలలతో చందనములతో పూజింపబడెను. (13)

టీ॥ విసృజ్యేతి. మధురయా గిరా తాం ప్రస్థాప్య వ్రజ వణిక్పథే వణిగ్భిః అర్చితః. ॥13॥

టీ॥ తీయని మాటలతో ఆమెను పంపివేసి – పోవుచు అంగడి వీధిలో వర్తకులతో పూజింపబడెను. (13)

14శ్లో॥ తద్దర్శన స్మర క్షోభాదాత్మానం నావిదం స్త్రియః ।
విస్రస్త వస్త్ర కబర వలయా లేఖ్య మూర్తయః ॥

తా॥ కృష్ణుని చూచుటచే కలిగిన మన్మథ తాపముచే బాధింపబడు చున్న స్త్రీలు, తమను తాము తెలసికొన జాలక, జారిపోవుచున్న కట్టు వస్త్రములను, శిరోజ బంధములను(కొప్పులను) కంకణములను సరిచేసి కొననేరక, చిత్తరువులుగా గీచిన బొమ్మల రూపమున నుండి పోయిరి. (14)

టీ॥ తదితి. లేఖ్యాః చిత్రన్యస్తా ఇవ మూర్తయో యాసాం తాః.॥14॥

టీ॥ చిత్రముల యందు వ్రాయదగిన ఆకారములు ఎవరికో వారు (స్త్రీలు ఎక్కడి వారక్కడ స్తంభించిరి). (14)

15శ్లో॥ తతః పౌరా పృచ్ఛమానో ధనుషస్థ్సాన మచ్యుతః ।
తస్మిన్ ప్రవిష్టో దదృశే ధనురైంద్రమివాద్భుతమ్ ॥

తా॥ అటుపై, కృష్ణుడు ధనుర్యాగమునకు సంబంధించిన యాగ శాలను గూర్చి పురజనులను అడుగుచు - దానిలో ప్రవేశించిన వాడై, అచట ఇంద్రధనుస్సు వంటి అద్భుతమైన ధనుస్సును చూచెను.(15)

టీ॥ తత ఇతి. ధనుర్మఖశాలాం పృచ్ఛన్. ॥15॥

టీ॥ ధనుర్యాగశాలను గూర్చి ప్రశ్నించుచు. (15)

16శ్లో॥ పురుషై ర్బహుభిర్గుప్త మర్చితం పరమర్ధిమత్ ।
వార్యమాణోనృభిః కృష్ణః ప్రసహ్య ధనురాదధే ॥

తా॥ చాలా మంది పురుషులతో రక్షింపబడుచున్నదియు, గొప్ప సంపదతో పూజింపబడినదియు నైన ధనుస్సును, కృష్ణుడు, పెక్కురు వారించుచున్నను బలాత్కారముగ లేవనెత్తెను. (16)

టీ॥ పురుషైరితి. ప్రసహ్య బలాత్కారేణ. ॥16॥

టీ॥ ప్రసహ్య - బలాత్కారముతో. (16)

17శ్లో॥ కరేణ వామేన సలీల ముద్ధృతం
సజ్జం చ కృత్వా నిమిషేణ పశ్యతామ్ ।
నృణాం వికృష్య ప్రబభంజ మధ్యతో
యథేక్షు దండం మదకర్యురుక్రమః ॥

తా॥ అల్లెత్రాడుతో నున్న ఆ ధనుస్సును కృష్ణుడు తన ఎడమ చేతితో అవలీలగ నెత్తిన వాడై అందరును చూచుచుండగనే అడ్డు వచ్చిన వారిని ముందునకు త్రోసివేసి - మదించిన ఏనుగు విజృంభించి చెఱుకుగడను విరిచినట్లు తృటిలో నడిమికి విరిచివేసెను. (17)

18శ్లో॥ ధనుషో భజ్యమానస్య శబ్దః ఖం రోదసీ దిశః ।
పూరయామాస యం శ్రుత్వా కంస స్త్రాస ముపాగమత్ ॥

తా॥ ధనుస్సు విరుగుటచేత కలిగిన చప్పుడుచే ఆకాశము, రోదసి, దిక్కులు నిండిపోయెను. అది విని కంసుడు భయము నొందెను.(18)

టీ॥ కరేణేతి. నిమిషేణ అతిశీఘ్రం. మదకరీ మత్తహస్తీ. ॥17,18॥

టీ॥ నిమిషేణ – అతిశీఘ్రముగ – మదకరీ – మదించిన ఏనుగు. (17,18)

19శ్లో॥ తద్రక్షిణ స్సానుచరాః కుపితా ఆతతాయినః ।
గృహీతు కామా ఆవవ్రు ర్గృహ్యతాం బధ్యతామితి ॥

తా॥ దాని రక్షణ చేయువారు, వారి అనుచరులు, చంపుటకు ఉద్యుక్తులైన వారును కోపించి కృష్ణుని నిర్భందింపదలచిన వారై పట్టుకొనుడు, బంధింపుడు అని అరచుచు చుట్టును మూగిరి. (19)

టీ॥ తదితి. గృహ్యతాం బధ్యతామితి వదంతో జిఘృక్షవః ఆవృత వంతః. ॥19॥

టీ॥ పట్టుకొనుడు బంధింపుడు అని అనుచు అతనిని ఆవరించిరి (జుఘృక్షవః – పట్టుకొన నిచ్ఛగల వారు) (19)

20శ్లో॥ అథ తాన్ దురభిప్రాయాన్ విలోక్య బల కేశవౌ ।
క్రుద్ధౌ ధనుష ఆదాయ శకలే తాంశ్చ జఘ్నతుః ॥

తా॥ అప్పుడు ఆ దుష్టమైన ఆలోచన గల ఆ ఆకతాయులను చూచి బలరామ కృష్ణులు కోపించినవారై ఆ ధనుస్సు యొక్క విరిగిన ముక్కలను తీసికొని, వానితో, వారిని చంపివేసిరి. (20)

టీ॥ అథేతి. న కేవలం క్రుద్ధౌ కింతు భగ్నస్య ధనుషః శకలే గృహీత్వా జఘ్నతుశ్చేతి. ॥20॥

టీ॥ వారిద్దరును కోపించినవారు మాత్రమే కాక విరిగిన ధనుస్సు యొక్క భాగములను తీసికొని వారిని వధించిరి అని. (20)

21శ్లో॥ బలం చ కంసప్రహితం హత్వా శాలాముఖాత్తతః ।
నిష్క్రమ్య చేరతుర్హృష్టౌ నిరీక్ష్య పుర సంపదః ॥

టీ॥ బలమితి. పరతః ప్రాతర్గంతవ్యమితి శాలా ముఖాదేవ పునర్ని ష్క్రమ్య. ॥21॥

22శ్లో॥ తయోస్తదద్భుతం వీర్యం నిశామ్య పురవాసినః ।
తేజః ప్రాగల్భ్యం రూపే చ మేనిరే విబుధోత్తమౌ ॥

టీ॥ తయోరితి. తేజః ప్రభావం ప్రాగల్భ్యం ధృష్టతాం. ॥22॥

23శ్లో॥ తయోర్విచరతోస్స్వైరమాదిత్యోఽస్తముపేయి వాన్ ।
కృష్ణ రామౌ వృతౌ గోపైః పురాచ్ఛకట మీయతుః ॥

టీ॥ తయోరితి. శకటం శకట విమోచన స్థానం. ॥23॥

తా॥ కంసుని చేత పంపబడిన సైన్యమును కూడ వధించి రామ కృష్ణు లిరువురును యజ్ఞశాల ముఖద్వారము నుండి వెలుపలకు వచ్చి, మిక్కిలి సంతోషించిన వారై, మధురాపురి వైభవములను చూచుచు విహరింప సాగిరి. (21)

టీ॥ మఱియొక ద్వారమునుండి, ఉదయము పోవలెనని యెంచి మఱల యజ్ఞశాల ముఖద్వారము నుండియే బయల్వెడలి. (21)

తా ॥ వారి అద్భుతమైన పరాక్రమమును, తేజస్సును, ప్రజ్ఞను, రూపమును చూచి, పురజనులు వారిని దేవతా శ్రేష్ఠులనుకొనిరి. (22)

తా॥ తేజః – ప్రభావము – ప్రాగల్భ్యం – దిట్టతనమును. (22)

తా॥ బలరామకృష్ణులు మధురాపురిలో ఇట్లు విహరించుచుండగా సూర్యాస్తమయమయ్యెను. అప్పుడు వారిరువురు గోపాలకులతో కూడి పురము నుండి తమ బండ్లు గల చోటికి పోయిరి. (23)

టీ॥ శకటం – విడిచిన స్థలము – (పట్టణమునకు వెలుపల). (23)

24శ్లో॥ గోప్యో ముకుంద విగమే విరహాతురాయా
ఆశాసతాశిష ఋతా మధుపుర్యభూవన్ ।
సంపశ్యతాం పురుష భూషణ గాత్ర లక్ష్మీం
హిత్వేత రాంస్తు భజతశ్చకమేనుయాం శ్రీః ॥

తా॥ కృష్ణుని మధురానగర ప్రయాణమునకు ముందు విరహాతురలైన గోపాంగనలు తమ ఆశీస్సులతో దేనిని ఆశంసించిరో, మధురలో అది సత్యమే అయ్యెను. ఏలయన లక్ష్మి, ఇతరులనందఱిని విడిచి శ్రీకృష్ణునే ఆశ్రయించెను గదా! అట్టి కృష్ణుని శరీరము నాశ్రయించి యున్న సౌందర్య లక్ష్మిని కృష్ణుడు అను పురుషశ్రేష్ఠుని ఆశ్రయించి యున్న లక్ష్మిని మధురానగరవాసులు ఆనందముతో చూచుచుండిరి. (24)

టీ॥ గోప్య ఇతి. ముకుందస్య విగమే ప్రజాన్నిర్గమన సమయే. యా ఆశిషః ఆశాసత. సుఖం ప్రభాతా రజనీయం అద్య ధ్రువం తత్ర దృశో భవిష్యత ఇత్యాదియదుక్తవత్యః. ఋతాః సత్యాః బభూవుః పురుష భూషణస్య శ్రీకృష్ణస్య గాత్ర లక్ష్మీం దేహ శోభాం కథం భూతస్య గాత్రస్య? ను అహో. ఇతరా బ్రహ్మాదీ హిత్వా యదయనం ఆశ్రయం శ్రీః కామయామాస. యాం గాత్ర లక్ష్మీమితి వా. ॥24॥

టీ॥ ముకుందస్య విగమే- వ్రజము నుండి కృష్ణుడు పోవునపుడు - ఏ ఆశీస్సుతో గోపస్త్రీలు కోరిరో - ఉదయములు సుఖము, రాత్రి సంబంధముగను సుఖము - నేడు నిశ్చయముగ - అచటి చూపులు అగును - ఇత్యాది ఏది వారు చెప్పియుండిరో - ఋతాః-సత్యము లయ్యెను - పురుష శ్రేష్ఠుడగు కృష్ణుని యొక్క - గాత్ర లక్ష్మీం- దేహ శోభను - ఎట్టి దేహము యొక్క? ను - అహో! - ఇతరాన్- బ్రహ్మ మొదలగు వారినిః-హిత్వా-విడిచి యత్+అయనం -ఏ ఆశ్రయమును -శ్రీః- లక్ష్మి - కోరెనో - అట్టి దేహ లక్ష్మిని - శోభను - అని. (24)

25శ్లో॥ అవనిక్తాంఘ్రి యుగళౌ భుక్త్వా క్షీరో పసేచనమ్ ।
ఊషతుస్తాం సుఖం రాత్రిం జ్ఞాత్వా కంస చికీర్షితమ్ ॥

తా॥ ఇరువురును పాద ప్రక్షాళనము చేసికొని, పాలు కలిపిన అన్నము తిని, కంసుడు ఏమి చేయబోవునది తెలిసికొని ఆ రాత్రి సుఖముగా నుండిరి. (25)

టీ॥ అవనిక్తేతి. అవనిక్తం క్షాళితం అంఘ్రి యుగళం యయోస్తౌ. క్షీర మిశ్రమన్నం భుక్త్వా. సుఖం న్యవసతాం. ॥25॥

టీ॥ అవనిక్తం - కడగబడిన - పాద ద్వంద్వము ఎవరికో వారు - పాలు కలిపిన అన్నము తిని - సుఖముగ నుండిరి. (25)

26శ్లో॥ కంసస్తు తద్ధనుర్భంగం రక్షిణాం స్వబలస్య చ ।
వధం నిశమ్య గోవింద రామ విక్రీడితం పరమ్ ॥

తా॥ కంసుడు, ఆ ధనుర్భంగమును, ఆ ధనుస్సును రక్షించుటకు తన సైన్యము నుండి ఏర్పరచిన వారిని రామకృష్ణులు వధించుట గూర్చి విని - అది వారి విశేషమైన క్రీడగ భావించెను. (26)

టీ॥ కంస ఇతి. పరం కేవలం గోవింద రామయోర్విక్రీడితం తత్. న తు పరాక్రమః కశ్చిత్. ॥26॥

టీ॥ పరం - కేవలము బలరామ కృష్ణుల ఆటయే అది - కాని పరాక్రమము కాదు. (26)

27శ్లో॥ దీర్ఘ ప్రజాగరో భీతో దుర్నిమిత్తాని దుర్మతిః ।
బహూన్య చష్టోభయథా మృత్యోర్దౌత్య కరాణి చ ॥

తా॥ దుర్బుద్ధియగు కంసుడు దీర్ఘకాలముగ రాత్రులందు నిద్రలేని వాడై, భయావహుడై, ఇటు మగత నిద్రలోను అటు స్వప్నములోను - లేక దైహికముగను, బాహిరముగను, మృత్యువు రాయబారమునకు వచ్చినట్టి దుశ్శకునములను అనేకములను చూచెను, అవి భయము గొల్పునవిగ నుండెను. (27)

టీ॥ దీర్ఘేతి. ఉభయథా స్వప్నజాగరితభేదేన ప్రత్యేకం మృత్యోర్దౌత్య కర్మాణి చ. తథా చ మంత్రః. శ్రు. "ఇత్థాదులూక ఆపప్తత్. హిరణ్యాక్షో అయోముఖః. రక్షసాం దూత ఆగతః. తమితో నాశయాగ్నే" ఇత్యాది.

టీ॥ ఉభయథా - జాగ్రత్స్వప్న భేదముల చేత - ముఖ్యముగ మృత్యువు యొక్క దూత సంబంధ కర్మలును మంత్ర మటులే యున్నది. శ్రుతి- "వంట చెఱుకు నుండి ఆ గుడ్లగూబ ప్రకటమయ్యెను పచ్చని

తథా యదేతద్భూతాన్యన్వా విశ్య. దైవీం వాచం వదసీత్యాదిశ్చ. ॥27॥

కండ్లు కలది - ఇనుప చుంచువు గలది రాక్షసుల దూత వచ్చెను, రాత్రితో అగ్ని యొక్క వినాశము చేయుము - "మొదలగునది మరియు ఇట్టివి ఇతరములు కూడ ఆవేశించి - ఒక దాని వెంట ఒకటి ఆవేశించి 'అదృష్ట' వాక్యమును పలికెదవు" అను మొదలగునని కూడ. (27)

28శ్లో॥ అదర్శనం స్వశిరసః ప్రతిరూపే చ సత్యపి ।
అసత్యపి ద్వితీయే చ ద్వైరూప్యం జ్యోతిషాం తథా ॥

తా॥ తన శిరస్సు కనబడక పోవుట, ఉన్న ఒక్కొక్క వస్తువునకు రెండేసి కనబడుట, లేని వస్తువు ఉన్నదిగా కనబడుట, చంద్రుడు మొదలగు ప్రకాశ వస్తువులు రెండు రెండుగ కనబడుట (జరుగు చుండెను). (28)

టీ॥ తాన్యేవ దర్శయతి శ్లోక త్రయేణ - అదర్శనమితి. జలాదౌ ప్రతిరూపే దృశ్యమానేఽపి స్వశిరసస్తత్రాదర్శనం అసత్యపి ద్వితీయే చక్షుషోఽంతర్ధానేఽంగుల్యాదౌ జ్యోతిషాం చంద్రాదీనాం ద్విత్వం. ॥28॥

టీ॥ వానినే చూపు చున్నాడు - నీరు మొదలగు వాని యందు ప్రతి రూపము కనబడుచున్నను అచట తన తల కనబడక పోవుట, లేని వస్తువునకు ప్రతి రూపము కనబడుట, కన్నులు అంతర్ధానమై వ్రేళ్లు మొదలగువాని యందు - జ్యోతిషాం-చంద్రుడు మొదలగు వాని యొక్క రెండేసి రూపములు కనబడుచుండుట. (28)

29శ్లో॥ ఛిద్ర ప్రతీతిశ్ఛాయాయాం ప్రాణ ఘోషానుపశ్రుతిః ।
స్వర్ణ ప్రతీతిర్వృక్షేషు స్వపదానామ దర్శనమ్ ॥

తా॥ నీడ యందు రంధ్రమున్నట్లు కనబడుట, ప్రాణ ఘోష వినబడుట, చెట్ల యందు బంగారమున్నట్లు ప్రతీతి కలుగుట, తన పాదములు కనబడకుండుటయు (ఘటించుచుండెను). (29)

టీ॥ ఛిద్రేతి. ఛాయాయాం ప్రతిబింబే ఛిద్రప్రతీతిః పిహిత కర్ణ పుటకయోః అంతః శ్రూయమాణో ధ్వనిః ప్రాణఘోషః తస్య అశ్రవణం వృక్షేషు స్వర్ణవర్ణప్రతీతిః రజః కర్దమాదిషు స్వపదానామ దర్శనం ఏతాని జాగరితజాని దుర్నిమిత్తాని. ॥29॥

టీ॥ ఛాయాయాం- ప్రతిబింబము నందు-ఛిద్రప్రతీతిః - రంధ్రము ఉన్నయట్లు - మూయబడిన కర్ణపుటముల యొక్క లోపలి భాగమున వినబడుచున్న ధ్వని ప్రాణఘోష - దానిని విను చుండకపోవుట - చెట్ల యందు బంగారపు ప్రతీతి - ధూళి, బురద మున్నగు వాని యందు తన పాదములు (ముద్రలు) కనబడకుండుట ఇవి యన్నియు జాగ్రదవస్థలోని దుశ్శకునములు. (29)

30శ్లో॥ స్వప్నే ప్రేత పరిష్వంగః ఖర యానం బిసాదనం ।
యాయాన్నలదమాల్యేకస్తై లాభ్యక్తో దిగంబరః ॥

తా॥ స్వప్నమునందు చనిపోయిన వారిని కౌగలించుకొనుట, గాడిద మీద నెక్కి ప్రయాణము చేయుట, తామర తూండ్లు భుజించుట, (నిషాదనమ్ అని పాఠాంతము) దాసాని పూల దండను ధరించుట, శరీరమునకు నూనె పట్టించి యుండుట, దిగంబరముగ (నగ్నముగ) నుండుట- (చూచెను). (30)

31శ్లో॥ అన్యాని చేత్థం భూతాని స్వప్న జాగరితాని చ ।
పశ్యన్ మరణసంత్రస్తో నిద్రాం లేభే న చింతయా ॥

తా॥ ఇట్లు ఇంకను ఇతరములైన దుశ్శకునములను జాగ్రత్స్వ ములలో చూచుచు, కంసుడు, మరణభయము గల వాడై, చింతతో వ్యాకులుడై నిద్రకు వెలియై యుండెను. (31)

టీ॥ స్వాప్నాన్యాహ - స్వప్న ఇతి. ప్రేతైః మృతైః పరిష్వంగః ఖరమారుహ్య యానం బిసభక్షణం నలదమాలీ జపాకుసుమ మాలీ యాయాదితి యత్. తదప్యేకం దుర్నిమిత్తమితి. ॥30,31॥

టీ॥ స్వప్నమునందలి దుశ్శకునములను చెప్పుచున్నాడు, ప్రేతైః- మృతులతో - పరిష్వంగః - కౌగిలి, గాడిద నెక్కి పయనించుట, తామరతూండ్లు తినుట - జపాకుసువవు (దాసాని) మాలను ధరించుట - అది కూడ ఒక దుశ్శకునము అని అర్థము. (30,31)

32శ్లో॥ వ్యుష్టాయాం నిశి కౌరవ్య సూర్యేచాద్భ్య స్సముత్థితే ।
కారయామాస వై కంసో మల్ల క్రీడామహోత్సవమ్ ॥

తా॥ దహించి వేసిన ఆ రాత్రిని ఏదో విధముగ గడిపి, కంసుడు సూర్యుడు (నీటినుండి) ఉదయింపగనే మల్లయుద్ధ క్రీడకు సంబంధించిన గొప్ప ఉత్సవమును చేయించెను. (32)

33శ్లో॥ ఆనర్చుః పురుషో రంగం తూర్యభేర్యశ్చ జఘ్నిరే ।
మంచాశ్చాలం కృతాస్రగ్భిః పతాకా చేలతోరణైః ॥

తా॥ రాజపురుషులు మల్లయుద్ధమునకు రంగస్థలమునలంకరించిరి వాద్యములు, ఢంకాలు మ్రోగినవి వీక్షకుల ఆసనములును పూలదండలతో అలంకరింపబడినవి పతాకములతో తోరణములతోను కూర్పబడినవి. (33)

టీ॥ వ్యుష్టాయామితి. వ్యుష్టాయాం కష్టేన కథంచిత్ ప్రభాతాయాం పునః సూర్యే చాద్భ్యః సముత్థిత ఇతి. తథా చ శ్రుతిః. "య ఉదగాన్మహతోఽర్ణవాద్విభ్రాజమానస్సరిరస్య మధ్యాత్సమావృషభో లోహితాక్ష స్సూర్యో విపశ్చిన్మనసా పునాత్వి" తి చ. ॥32,33॥

టీ॥ వ్యుష్టాయా – కష్టముతో ఏదో విధముగ(గడిపి)–ప్రభాతాయాం– సూర్యుడు నీటినుండి ఉదయింపగనే అని శ్రుతి అట్లే చెప్పుచున్నది, "ఎవరు మహాసముద్రము నుండి మిక్కిలి ప్రకాశించుచు, కదలుచు,పైకి వచ్చెనో అతని మధ్యనుండి, కాలరూపమైన సంవత్సరములు, కర్మ రూపమైన ధర్మములు కలిగెనో అతడు ఎఱుపు వన్నె కన్నులు గల సూర్యభగవానుడు. అతడు విద్వాంసుడు (దోషజ్ఞుడు) మనస్సుచే అతడు పవిత్రీకరించుగాక" అని అర్థము. (32,33)

34శ్లో॥ తేషు పౌరా జానపదా బ్రహ్మ క్షత్ర పురోగమాః ।
యథోపజోషం వివిశూ రాజానశ్చ కృతాసనాః ॥

తా॥ వాని యందు పురజనులు, గ్రామీణులు, బ్రాహ్మణులు, క్షత్రియులు మొదలగువారు యథా సుఖముగ కూర్చుండిరి, రాజులు, రాజవంశీయులును యథోచితమైన ఆపనముల పై సుఖాసీనులైరి.(34)

35శ్లో॥ కంసః పరివృతోఽమాత్యై రాజమంచ ఉపావిశత్ ।
మండలేశ్వర మధ్యస్థో హృదయేన విదూయతా ॥

తా॥ కంసుడు, మంత్రులతో కూడి, మండలేశ్వరుల మధ్యన అతని కొఱకు ఉద్దేశింపబడి యున్న రాజసింహాసనము పై కూర్చుండెను. కాని మనస్సులో కొంత దిగులుగనుండెను. (35)

టీ॥ తేష్వితి. యథోపజోషం యథాసుఖం. ॥34,35॥

టీ॥ యథోపజోషం - ఎట్లు సుఖముగనుండునో అట్లు. (34,35)

36శ్లో॥ వాద్యమానేషు తూర్యేషు మల్లతాళోత్తరేషు చ ।
మల్లాస్స్వలంకృతా దృప్తాస్సోపాధ్యాయాస్స మావిశన్ ॥

తా॥ మ్రోగుచున్న వాద్యముల యందు మల్లయుద్ధమునకు అనుకూలించు రీతిగ మరింత బిగ్గరగా మ్రోగుచుండగ మల్లురు ఠీవిగా అలంకరించుకొని గర్వముగ తమ ఉపాధ్యాయులతో కూడి వచ్చి చేరిరి. (36)

టీ॥ వాద్యమానేష్వితి. మల్లతాళాః ఉత్తరేఉపరి ఉచ్చైః శ్రూయంతే యేషు తేషు తూర్యేషు ఉపాధ్యాయః మల్లాచార్యః. ॥36॥

టీ॥ మల్లతాళాః-మల్లయుద్ధమునకు అనుకూలమైన తాళములు- ఉత్తరే-పెంచిన నాదములతో బిగ్గరగా ఏవి వినబడుచుండెనో - వాని మధ్య మల్లురు, మల్లాచార్యులును వచ్చి సమావేశమైరి. (36)

37శ్లో॥ చాణూరో ముష్టికః కూటశ్శలస్తోశల ఏవ చ ।
త ఆసేదురుపస్థానం వల్గువాద్య ప్రహర్షితాః ॥

తా॥ చాణూరుడు, ముష్టికుడు, కూటుడు, శలుడు, తోశలుడు మొదలగు ముఖ్యులైన యుద్ధ నిపుణులు శ్రావ్యమైన ఆ వాద్య ధ్వనితో ఉత్సహితులై మల్లరంగ స్థలములకు చేరిరి. (37)

టీ॥ చాణూర ఇతి. ఉపస్థానం మల్లరంగం. ॥37॥

టీ॥ ఉపస్థానం - మల్లయుద్ధరంగము. (37)

38శ్లో॥ నందగోపాదయో గోపా భోజరాజసమాహుతాః ।
నివేదితోపాయనాస్త ఏకస్మిన్మంచ ఆవిశన్ ॥

తా॥ నందగోపుడు మొదలగు గోపాలురు, భోజరాజగు కంసునిచే ఆహ్వానింపబడిన వారందఱును కానుకలు సమర్పించినవారై, వారి కొఱకు ఏర్పాటు చేయబడిన మంచము వంటి ఆసనముపై అందఱును ఒకే చోట కూర్చుండిరి. (38)

టీ॥ నందేతి. సమాహుతాః సమాహూతాః నివేదితాని ఉపాయనాని యైస్తే. ॥38॥

టీ॥ సమాహూతాః – ఆహ్వానింపబడినవారు నివేదింపబడిన కానుకలు ఎవరి చేతనో వారు. (38)

**శ్రీ మద్భాగవతే, మహాపురాణే దశమస్కంధే,**
**ద్విచత్వారింశోఽధ్యాయః**

**అని శ్రీమద్భాగవతమున దశమస్కంధమందు**
**నలుబది రెండవ అధ్యాయము సమాప్తము.**

## త్రిచత్వారింశోऽధ్యాయః

1శ్లో॥ అథ రామశ్చ కృష్ణశ్చ కృతశౌచౌ పరంతప ।
మల్లదుందుభినిర్ఘోషం శ్రుత్వా ద్రష్టుముపేయతుః ॥

టీ॥ శ్లో."త్రిచత్వారింశకే హత్వా గజేంద్రం రామకృష్ణయోః, రంగ ప్రవేశసౌభాగ్యం చాణూరేణానుభాషణమ్. అథేతి. పూర్వేద్యురేవ కృతం శౌచం శుద్ధత్వం నిరపరాధత్వం యాభ్యాం తౌ. ఏతదుక్తం భవతి ధనుర్భంగాదినా ఆవాభ్యాం నిజైశ్వర్యే సూచితేऽపి పితరౌ స ముంచతి ఆవాం పునః జిఘాంసతి అతోऽస్య మాతులస్య వధేనావయోర్దోష ఇత్యేవం కృతాపరాధపరిహారావితి. మల్లానాం దుందుభీనాం చ ఘోషం. మల్లతాళిదుందుభిఘోషం వా. ॥1॥

2శ్లో॥ రంగద్వార ముపాసాద్య తస్మిన్గజమివ స్థితం ।
పశ్యన్ కువలయాపీడం కృష్ణోऽంబష్ఠ ప్రచోదితమ్ ॥

## నలుబది మూడవ అధ్యాయము

తా॥ రాజా! పిమ్మట బలరామకృష్ణులిరువురు స్నానాదులు పూర్తి చేసుకొని,బాహుయుద్ధమునకు సంబంధించిన భేరీ వాద్య ధ్వని విని, చూచుటకు అచటికి చేరిరి. (1)

టీ॥ నలుబది మూడవ అధ్యాయమున, కువలయాపీడుడు అను ఏనుగును వధించి - రామకృష్ణుల యొక్క మల్ల రంగ ప్రవేశ సౌభాగ్యము, చాణూరునితో సంభాషించుట వర్ణింపబడినవి - పూర్వ దినమునే పూర్తి చేసికొనబడిన పరిశుద్ధత్వము - నిరపరాధత్వము ఎవరిచేతనో వారు- ఇది చెప్పబడినదే యగుచున్నది - ధనుర్భంగము మున్నగు వానితో మా యొక్క ఆధిక్యములు సూచింపబడి యున్న ప్పటికిని, పితరులు (తల్లిదండ్రులు) వదిలిపెట్టరు. మమ్ము మఱల శత్రు భావమున ఉసిగొల్పుదురు. అందువలన ఈ మేనమామ యొక్క సంహారము చేత మాకు దోషమని, యిట్లు చేయబడు అపరాధమునకు పరిహారము చేసికొనిరి మల్లానాం దుందుభినాంచ ఘోషః మల్లుర యొక్కయు భేరి వాద్యముల యొక్కయు ధ్వని. (1)

తా॥ మల్లరంగ ద్వారమును సమీపించి అందు ఏనుగు ఒకటి ఉన్నట్లు గమనించి, కృష్ణుడు అది అంబష్ఠునిచే (మావటి వానిచే) ప్రేరేపింపబడిన కువలయా పీడము అను మదించిన ఏనుగుగా గ్రహించెను. (2)

టీ॥ రంగేతి, అంబష్ఠోహస్తిపః తేన ప్రచోదితం. ॥2॥

టీ॥ మావటివానిచే తీసికొనిరాబడిన ఏనుగు-హస్తిపః-మావటి.(2)

3శ్లో॥ బద్ధ్వా పరికరం శౌరిస్సమూహ్య కుటిలాలకాన్ ।
ఉవాచ హస్తిపం వాచా మేఘనాద గభీరయా ॥

తా॥ ఉత్తరీయమును నడుము నందు బిగించి, వంకరలు యున్న కురులను ఒక్కచో చేర్చి, ఉరిమినట్లుగ గంభీరమైన నాదముతో ఆ మావటిని ఉద్దేశించి ఇట్లనెను. (3)

4శ్లో॥ అంబష్ఠాం బష్ఠమార్గం నో దేహ్యపక్రామ మాచిరమ్ ।
నోచేత్సకుంజరం త్వాద్యనయామి యమసాదనమ్ ॥

తా॥ మావటీ! ఓ మావటీ! మా ఇరువురకు దారినిమ్ము, శీఘ్రముగా తొలగుము లేనియెడల ఈ ఏనుగును ఈవేళ యమ స్థానమునకు- నిన్ను కూడ - పంపించి వేయుదును. (4)

టీ॥ బధ్వేతి. పరికరం యుద్ధోచితం పరిధానం కృత్వా సమూహ్య బద్ధ్వా. ॥3,4॥

టీ॥ పరికరం - యుద్ధమునకు యోగ్యమైన కట్టు వస్త్రము - నడుమున గట్టి - సమూహ్య - ఒక్కచో చేర్చికట్టి. (3,4)

5శ్లో॥ ఏవం నిర్భర్త్సితోఽంబష్ఠః కుపితః కోపయన్ గజమ్ ।
చోదయామాస కృష్ణాయ కాలాంతక యమోపమమ్ ॥

తా॥ మావటివాడు ఈ విధముగ బెదరింపబడినవాడై ఆగ్రహించి, కాలాంతకుడైన యముని వలెనున్న ఏనుగును క్రోధముతో రెచ్చి పోవునట్లు చేసి కృష్ణుని వైపు పరిగెత్తించెను. (5)

టీ॥ ఏవమితి. అంతకో మృత్యుః కాలస్తన్నిమిత్తం. యమస్తన్నియంతా తైరుపమా యస్య తం. ॥5॥

టీ॥ అంతకః-మృత్యువు-కాలః-దానికి ఒకనిమిత్తము(కారణము) యముడు నియంత(నియామకుడు) వానితో పోలిక ఎవనికో వానిని.(5)

6శ్లో॥ కరీం ద్రస్తమభిద్రుత్య కరేణ తరసా గ్రహీత్ ।
కరాద్విగళితస్సోఽముం నిహత్యాంఘ్రిష్వలీయత ॥

తా॥ మదించిన ఆ ఏనుగు కృష్ణుని వైపు పరిగెత్తి, వెంటనే తొండముతో తీసికొనెను. కాని కృష్ణుడు తొండము నుండి క్రిందకు జారి ఆ ఏనుగును ఒక్క గ్రుద్దు గ్రుద్ది దాని పాదముల మధ్య దాగి యుండెను. (6)

టీ॥ కరీంద్ర ఇతి. విగళితో విచ్యుతః. సః ముష్టినా నిహత్య అలీయత అదృశ్యో బభూవ. ॥6॥

టీ॥ విగళితః – విడువబడిన వాడై – అతడు పిడికిలితో దానిని బలముగా కొట్టి – అలీయత – అదృశ్యుడయ్యెను (దాగెను). (6)

7శ్లో॥ సంక్రుద్ధస్తమచక్షాణో ఘ్రూణ దృష్టి స్స కేశవమ్ ।
పరామృశత్పుష్కరేణ స ప్రసహ్యా వినిర్గతః ॥

తా॥ ఆ కువలయాపీడుడు అతనిని కానక కోపగించిన వాడై వాసనతో పసిగట్టి తన తుండాగ్రముతో కృష్ణుని ఉనికిని తెలసికొని పట్టుకొనెను కాని కృష్ణుడు బలాత్కరించి విడిపించుకొనెను. (7)

టీ॥ సంక్రుద్ధ ఇతి. అచక్షాణః అపశ్యన్ ఘ్రూణం ఆఘ్రూణం తేన దృష్టిః దర్శనం యస్య సః. లోచనాగోచరమపి పశవో హి ఘ్రూణేన జానంతీతి ప్రసిద్ధం. పరామృశత్ ధృతవాన్. పుష్కరేణ శుండాగ్రేణ. సకృష్ణః ప్రసహ్యా బలేన. ॥7॥

టీ॥ అచక్షాణః – చూడక – ఘ్రూణం – వాసనతో – అతనిచే చూడబడెను – (వాసనచేతనే చూడబడుట ఎవనికో వాడు ఆ ఏనుగు) కన్నులకు కనబడకున్నను పశువులు ముక్కుతో వాసన చూచి తెలిసి కొనును అనునది ప్రసిద్ధము పరామృశత్– పట్టుకొనెను –పుష్కరేణ –తొండము కొనతో–కృష్ణుడు– ప్రసహ్యా–బలముగా (విడివడెను)(7)

8శ్లో॥ పుచ్ఛే ప్రగృహ్యాతి బలో ధనుషః పంచవింశతిమ్ ।
విచకర్ష యథా నాగం సుపర్ణ ఇవ లీలయా ॥

తా॥ బలశాలియైన కృష్ణుడు, ఏనుగు తోకను గట్టిగా చుట్టి పట్టుకొని, (లీలగా) సర్పమును గరుడుడు లాగికొని పోవునట్లు ఇరువదియైదు విల్లులు దూరమునకు లాగికొనిపోయెను. (8)

టీ॥ పుచ్ఛఇతి. ధనుషః ధనుషాం పంచవింశతిర్యావత్ తావంతం దేశం. గజం విచకర్ష ఆకృష్య నీతవాన్. కంక ఇవ విచకర్ష. యథానాగం సర్పవద్వర్తమానం గజం సుపర్ణ ఇవ స్వయమితి. శ్లో. ఆవిరాసీద్యథా ప్రాచ్యాం దిశీందురివ పుష్కల ఇతివత్. ॥8॥

టీ॥ ధనుషః – విల్లులు ఇరువదియైదు ఎంత వఱకు ఉండునో అంత వఱకు గల ప్రదేశమునకు ఏనుగును లాగికొని పోయెను. ఆకర్షించి కొనిపోయెను. రాంబులుగు వలె లాగెను – యథా నాగం– సర్పము వలె నున్న ఏనుగును గరుడుని వలె స్వయముగ– కృష్ణుడు తూర్పుదిక్కున చంద్రుని వలె పూర్ణ పురుషుడు ఆవిర్భవించినాడు (తూర్పు అనెడి దేవకి యందు). (8)

9శ్లో॥ సపర్యా వర్తమానేన సవ్యదక్షిణతోఽచ్యుతః ।
బభ్రామ భ్రామ్యమాణేన గోవత్సేనేవ బాలకః ॥

తా॥ ఆ ఏనుగు ఎడమకు, కుడికి తిరుగుచుండగా – అది ఎడమకు తిరిగినప్పుడు తాను కుడికి త్రిప్పుచు – అది కుడికి తిరిగినప్పుడు తాను ఎడమకు త్రిప్పుచు – కృష్ణుడు ఏనుగు తోకను చుట్టి పట్టి దానితో బాటుగ తానును ఇట్లు వ్యత్యస్తముగ తిరిగెను. లేగదూడతో బాలకుడు తిరగినట్లు తిరిగెను. (9)

టీ॥ సఇతి. పుచ్ఛగ్రాహిణం కృష్ణం గృహీతుం యది దక్షిణతః పరివర్తతే గజస్తర్హి సవ్యతో భ్రామయతి. యదా సవ్యతః పరివర్తతే తదా దక్షిణతో భ్రామయన్ తేన సహ బహు బభ్రామ గోవత్సేన భ్రామ్యమాణేన బాలకః స హి కృష్ణో యథా అన్యో వా బాలక ఇవేతి వా. ॥9॥

టీ॥ తన తోకను పట్టుకొనిన కృష్ణుని పట్టుకొనుటకై ఏనుగు కుడికి తిరిగినచో అప్పుడు తాను ఎడమకు త్రిప్పును, ఎడమ వైపునకు అది తిరిగినప్పుడు తాను కుడికి దానిని త్రిప్పుచు దానితో బాటుగ తానును మిక్కిలిగ తిరిగెను గోవత్సముతో – తిరుగుచున్న దానితో బాలకుడుగ నున్న కృష్ణుడు – లేక వేరొక బాలకుడు తిరిగినట్లు. (9)

10శ్లో॥ తతోఽభిముఖ మభ్యేత్య పాణినాహత్య వారణమ్ ।
ప్రాద్రవన్ పాతయామాస స్పృశ్యమానః పదే పదే ॥

తా॥ అప్పుడు కృష్ణుడు, ఏనుగు ముందు భాగమునకు వచ్చి, చేతితో దానిని బలముగ కొట్టి దాని ముందు నుండియే మాటి మాటికి దానిని స్పృశించుచు, పరుగెత్తుచు, దానిని పడగొట్టెను. (10)

టీ॥ తతఇతి. వారణం గజం ప్రాద్రవన్ ప్రకర్షేణ సమంతతో ధావన్ పాతయామాస. స యథాపతతి తథా తం వంచయన్ ప్రాద్రవదిత్యర్థః ॥10॥

టీ॥ వారణం - ఏనుగును - వంకర దారిగ చట్టును పరిగెత్తుచు పడగొట్టెను. అది పడిపోగానే దానిని వంచించుచు, వక్రమార్గమున పరుగెత్తెనని యర్థము. (10)

11శ్లో॥ స ధావన్క్రీడయా భూమౌ పతితస్సహసోత్థితః ।
తం మత్వా పతితం క్రుద్ధో దంతాభ్యాం నాహనత్ క్షితిమ్ ॥

తా॥ ఆ ఏనుగు, బాధతో నేలపై పడుచు, వెంటనే మఱల లేచి, మిక్కిలి క్రోధముతో, కృష్ణుడు పడిపోయెనని భావించి తన దంతముల చేత నేలను పొడిచెను. (కృష్ణుని పొడుచు కోపముతో నేలను పొడిచెను) (11)

12శ్లో॥ స్వ విక్రమే ప్రతిహతే కుంజరేంద్రోఽత్యమర్షితః ।
చోద్యమానో మహామాత్రైః కృష్ణమభ్యద్రవద్రుషా ॥

తా॥ తన పరాక్రమము క్షీణించుకొలది ఆ గజేంద్రము అతి మాత్రముగ క్రోధము నొందిన దయ్యెను. మావటీల చేత ప్రేరేపింప బడుచు మరింత కోపముతో కృష్ణుని వైపు పరిగెత్తెను. (12)

13శ్లో॥ తమాపతంతమాసాద్య భగవాన్ మధుసూదనః ।
నిగృహ్య పాణినా హస్తం పాతయామాస భూతలే ॥

తా॥ పడిపోయిన ఏనుగును సమీపించి భగవానుడైన మధుసూదనుడు, దాని తొండమును తన చేతితో బిగించి పట్టి దానిని నేల మీద పడగొట్టెను. (13)

14శ్లో॥ పతితం తం పదాక్రమ్య మృగేంద్ర ఇవ లీలయా ।
దంతముత్పాట్య తేనేభం హస్తిపాంశ్చాహనద్ధరిః ॥

టీ॥ స ఇతి. కించ అహనత్ అహన్. ॥11-14॥

తా॥ పడి పోయిన ఏనుగును తన పాదములతో అణచిపట్టి సింహము వలె లీలగా త్రొక్కిపట్టి దాని దంతమును ఊడ బెఱికి ఆ ఏనుగును మరియు మావటి వారిని కూడ ఆ కృష్ణుడు వధించెను. (14)

టీ॥ మరియు అహనత్ - క్రుమ్మెను. (11-14)

## చూణూర ముష్టికాది మల్ల వధ కథా ప్రారంభ ఘట్టః

15శ్లో॥ మృతకం ద్విపముత్సృజ్య దంతపాణిస్సమావిశత్,
అంసన్యస్తవిషాణోఽసృఙ్మద బిందుభిరంకితః
విరూఢ స్వేద కణిక వదనాంబురుహో బభౌ. ॥15॥

టీ॥ మృతకమితి. రంగం సమావిశత్. తదా వీరశ్రియా బభౌ. కథంభూతః అంసే న్యస్తం విషాణం గజదంతో యేన సః. అసృజో రక్తస్య మదస్య చ బిందుభిః పరితోఽంకితః విరూఢాః ఉద్ధతాః స్వేద కణికాస్తాభి రుపలక్షితం వదనాంబురుహం యస్య సః. ॥15॥

## చూణూర ముష్టికాది మల్ల వధ కథా ప్రారంభ ఘట్టము

తా॥ చచ్చిన ఆ ఏనుగును అట్లే వదిలి, దాని దంతమును బట్టుకొని, దానిని భుజముపైన ఆనిచ్చి పెట్టుకొని దాని రక్తము, మదము బిందులుగా పడుటచే ఆ మరక గుర్తులతో శోభించుచు కృష్ణుడు మల్ల రంగమున ప్రవేశించెను. ఉద్ధతములైన చెమట బిందువులచే గుర్తింపబడు ముఖపద్మము గలవాడయ్యెను. (15)

టీ॥ రంగమున ప్రవేశించెను, అప్పుడు అతడు వీర శోభతో ప్రకాశించెను ఎట్టివాడై? భుజముపై నుంచబడిన ఏనుగు దంతము ఎవని చేతనో అట్టివాడు రక్తము యొక్క మదము యొక్క బిందువులచేత చుట్టును మరకలు చేయుబడినవాడు, ఉద్ధతములైన చెమట బిందువులచే ఉపలక్షితుడును, అట్టి చెమట తో గుర్తింపబడు ముఖ పద్మము ఎవనికో అట్టివాడు (ఏనుగుతో పరుగులు తీయుట వలనను చెమట పట్టినది) (15)

16శ్లో॥ వృతౌ గోపైః కతిపయైర్బలదేవ జనార్దనౌ ।
రంగం వివిశతూ రాజన్ గజ దంత వరాయుధౌ ॥

తా॥ కొంత మంది గోపాలకులతో కూడి బలరాముడు, కృష్ణుడును శ్రేష్ఠమైన గజదంతములు ఆయుధములుగ గలవారై మల్ల రంగ స్థలమును ప్రవేశించిరి. (16)

టీ॥ న కేవలం సా గ్రజస్స ఏవ రంగం సమావిశత్. కింతు. వృతౌ గోపైరితి. ॥16॥

టీ॥ కేవలము తన అన్నతో మాత్రమే కాక, కొందఱు గోపాలురతో సహా కృష్ణుడు రంగమున ప్రవేశించెను.(16)

17శ్లో॥ మల్లానామశనిర్న్ృణాం నరవరస్స్త్రీణాం స్మరో మూర్తిమాన్
గోపానాం స్వజనోఽసతాం క్షితిభుజాం శాస్తా స్వపిత్రోశ్శిశుః
మృత్యుర్భోజపతేర్విరాడవిదుషాం తత్త్వంపరం యోగినాం
వృష్ణీనాం పరదేవతేతి విదితో రంగం గతస్సాగ్రజః ॥

తా॥ మల్లురకు వజ్రాయుధము, మనుష్యులకు మానవశ్రేష్ఠుడు, స్త్రీలకు మూర్తిమంతుడైన మన్మథుడు, భోజరాజైన కంసునకు మృత్యువు, అవిద్వాంసులకు విరాట్టు, యోగులకు పరమతత్త్వము, గోపాలురకు ఆత్మబంధువు, దుష్టులైన రాజులకు శాసకుడు, తన తండ్రికి శిశువు, వృష్ణి వంశీయులకు పరదేవతగా తెలియబడు కృష్ణభగవానుడు,తన అన్నయగు బలరామునితో కూడి మల్లరంగమున కేతెంచెను. (17)

టీ॥ తత్ర శృంగారాది సర్వ రస కదంబమూర్తిర్భగవాన్ తత్తద భిప్రాయానుసారేణ బభౌ న సాకల్యేన సర్వేషామిత్యాహ మల్లానామితి. మల్లాదీనాం దశానాం ద్రష్టౄణాం అశన్యాదిరూపేణ దశధా విదితస్సన్ సాగ్రజో రంగం గత ఇత్యన్వయః. మల్లాదిష్వభివ్యక్తా రసాః క్రమేణ శ్లోకేన నిబధ్యంతే. శ్లో. "రౌద్రోఽద్భుతశ్చ శృంగారో హాస్యం వీరో దయా తథా, భయానకశ్చ భీభత్సశ్శాంతస్సప్రేమభక్తికః. అవి దుషాం

టీ॥ అచట, శృంగారము మొదలుగ రసములన్నీ మూర్తీ భవించి యున్న భగవానుడు వారి వారి అభిప్రాయములననుసరించి ప్రకటమయ్యెను అందఱికిని సాకల్యముగ కాదు అని చెప్పుచున్నాడు మల్లురు మొదలగు పదుగురు చూచువారలకు వజ్రాయుధ రూపముగ పది విధములుగ తెలియబడుచున్న వాడై అన్నతో కూడ రంగమును చేరెను అని అన్వయము. మల్లురు మొదలగు వారి యందు

వారాట్ వికలః అపర్యాప్తో రాజత ఇతి తథా. అనేన భీభత్స ఉక్తః వికలత్వం చ క్వ వజ్రసారసర్వాంగావిత్యాదినా వక్ష్యతి. ॥17॥

18శ్లో॥ హతం కువలయాపీడం దృష్ట్వాతావపి దుర్జయౌ ।
కంసోమనస్యపి తదా భృశముద్విజే నృప ॥

టీ॥ హతమితి. ఉద్విజే భీతో బభూవ. ॥18॥

19శ్లో॥ తౌ రేజతూరంగ గతౌ మహాభుజౌ
విచిత్ర వేషాభరణ స్రగంబరౌ ।
యథా నటా వుత్త మవేషధారిణౌ
మనః క్షిపంతౌ ప్రభయానిరీక్షతామ్ ॥

టీ॥ తావితి. యథా నటావితి నిర్భయత్వం దర్శితం. ॥19॥

అభివ్యక్తమైన రసములు క్రమముగ శ్లోకమున నిబద్ధింపబడినవి శ్లోక భావము రౌద్రము, అద్భుతము, శృంగారము, హాస్యము, వీరము, దయ, భయానకము, భీభత్సము, శాంతము, ప్రేమ, భక్తి. అవిద్వాంసులకు విరాట్ వికలః రాజత ఇతి అపర్యాప్తమైన ప్రకాశము గలవాడు దీనితో భీభత్సము చెప్పబడినది వికలత్వము ఎచ్చటిది? వజ్రసార రూపమైన సర్వాంగములు అని మొదలుగ చెప్పుచున్నాడు. (17)

తా॥ రాజా! చంపబడిన కువలయాపీడుని(ఏనుగును) దుర్జయులైన కృష్ణ బలరాములను కూడ చూచి కంసుడు మనస్సు నందు అప్పుడు మిక్కిలి ఉద్వేగమును పొందెను. (18)

టీ॥ ఉద్విజే భయపడినవాడయ్యెను(ఉద్విగ్నుడయ్యెను). (18)

తా॥ కృష్ణ బలరాములిరువురును రంగమును ప్రవేశించినవారై, మహాభుజులుగ, చిత్రమైన వేషములు గలిగి, ఆభరణములు, పూలదండలును, అమూల్య వస్త్రములును ధరించియున్నవారై, ఉత్తమ వేషధారులైన నటుల వలె, తమ కాంతితో చూచు వారి మనస్సులను ఆవరించుచున్నవారై ప్రకాశించిరి. (19)

టీ॥ నటులెట్లో అట్లు అని వారి నిర్భయత్వము చూపబడినది. (19)

20శ్లో॥ నిరీక్ష్య తా వుత్తమపూరుషౌ తథా
మంచస్థితా నాగర రాష్ట్రకా నృపాః,
ప్రహర్షవేగోత్కలితేక్షణాననాః
పపుర్నతృప్తానయనైస్తదాననమ్ ॥

తా॥ అప్పుడావిధమైన ఆ ఉత్తమపురుషులుగు కృష్ణ బలరాములను చూచి, మంచస్థితులైన నగరవాసులు, ఆ రాష్ట్రమున నివసించు ప్రజలు, రాజులును మిక్కిలి సంతసించి వేగముతో వికసించిన చూపులు గల ముఖములు గలవారై వారి ముఖ సౌందర్యములను నేత్ర చషకములతో త్రాగియు తృప్తినొందకుండిరి. (20)

టీ॥ నిరీక్ష్యేతి. ప్రహర్ష వేగేన ఉత్కలితాన్యుజ్జృంభితానీక్షణాన్యాననాని చ యేషాం తే. తయోరాననం వపుః పరం న తు తృప్తాః నిరాకాంక్షా న బభూవురిత్యర్థః. ॥20॥

టీ॥ సంతోషపు వేగము చేత – ఉత్కలితాని వికసించిన చూపులుగల ముఖములు ఎవరికో వారు వారి రామ కృష్ణుల ముఖము, శరీరము ఎంత చూచినను తృప్తి చెందకుండిరి – నిరాకాంక్షులు కాలేకపోయిరి అని అర్థము. (20)

21శ్లో॥ పిబంత ఇవ చక్షుర్భ్యాం లిహన్త ఇవ జిహ్వయా ।
జిఘ్రంత ఇవ నాసాభ్యాం శ్లిష్యంత ఇవ బాహుభిః ॥

తా॥ కన్నులతో త్రాగువారి వలె, నాలుకతో నాకుచున్న వారి వలె ముక్కులతో వాసన చూచుచున్న వారి వలె, బాహువులతో ఆలింగనము చేసికొనుచున్న వారివలె (చూడబడిరి) (21)

టీ॥ తదేవాహ పిబంత ఇవేతి. శ్లిష్యంతః పరిష్వంగం కుర్వంత ఇవ లక్షితా ఇత్యర్థః. ॥21॥

టీ॥ దానినే చెప్పుచున్నాడు శ్లిష్యంతః ఆలింగనము చేసి కొనుచున్న వారి వలె చూడబడిరి అని యర్థము. (21)

22శ్లో॥ ఊచుః పరస్పరం తే వై యథా దృష్టం యథా శ్రుతమ్ ।
తద్రూప గుణ మాధుర్య ప్రాగల్భ్యస్మారితా ఇవ ॥

తా॥ వారి రూపములు, గుణములు, నవ్వులతో గూడిన సంభాషణలు, వారి ప్రతిజ్ఞలు, తాము స్మరించి యున్నట్లుగ, విని యున్నట్లుగ చూచియున్నట్లుగ, ఒకరికొకరు చెప్పుకొనుచుండిరి. (22)

టీ॥ ఊచురితి. యథాదృష్టం ధనుర్భంగాది యథా శ్రుతం గోవర్ధనోద్ధరణాది. తత్తదనతిక్రమ్య తదనురూపమిత్యర్థః. ప్రత్యక్షం చ తయోః రూపం గజదంతాది యుక్తం. గుణాః శౌర్యాదయః. మాధుర్యం హసితాలాపాది. ప్రాగల్భ్యం ధార్ష్ట్యం. తైః స్మారితా ఇవ స్మరణం ప్రాపితా ఇవేత్యర్థః. ॥22॥

టీ॥ యథా దృష్టం - ధనుర్భంగాదులు యథా శ్రుతం - గోవర్ధనోద్ధరణాదులు ఆయా లీలను అతిక్రమింపక వానికి అనుగుణముగ అని యర్థము-ఇక ప్రత్యక్షముగ వారి రూపము- గజదంతాయుధములు మొదలగు వానితో కూడి యున్నట్టిది - గుణాః - శౌర్యము మొదలగునవి మాధుర్యం - హసితాలాపములు మొదలగునవి ప్రగల్భ్యం - దిట్టతనము తైః స్మారితా ఇవ - వారిచేత స్మరణము పొందినట్లు వలె అని యర్థము. (22)

23శ్లో॥ ఏతౌ భగవతస్సాక్షాద్ధరేర్నారాయణస్య హి ।
అవతీర్ణా విహాంశేన వసుదేవస్య వేశ్మని ॥

తా॥ వీరిరువురును సాక్షాత్తుగ భగవానుడు, హరియునగు నారాయణుని అంశ చేత వసుదేవుని ఇంటి యందు అవతరించిన వారు ఈ లోకమున అవతరించినారు. (23)

టీ॥ విస్మితానాం వాక్యాన్యాహాష్టభిః. - ఏతావితి. ॥23॥

టీ॥ ఆశ్చర్యముతో చూచుచున్న వారి వాక్యములను ఎనమిదిశ్లోకములతో చెప్పుచున్నాడు. (23)

24శ్లో॥ స ఏష కిల దేవక్యాం జాతో నీతశ్చ గోకులమ్ ।
కాలమేతం వసన్ గూఢో వవృధే నందవేశ్మని ॥

తా॥ దేవకి యందు జన్మించి నందగోకులమునకు తీసికొనిపోబడిన వాడు ఇతడేనట! ఇంత కాలమును రహస్యముగ నందుని గృహముననే నివసించుచు అచటనే పెరిగినాడట. (24)

టీ॥ స ఇతి. కిలేతి సర్వత్రాన్వయః. ॥24॥

టీ॥ కిల - అట అని అంతటను అన్వయము. (24)

25శ్లో॥ పూతనానేన నిహతా చక్రవాతశ్చ దానవః ।
అర్జునౌ ధేనుకః కేశీ గుహ్యకోఽన్యే చ తద్విధాః ॥

తా॥ పూతన, సుడిగాలి రూపమున వచ్చిన రాక్షసుడు, ధేనుకుడు, కేశి, శంఖచూడుడు, అఘాసురుడు మున్నగు వారు ఇతని చేతనే చంపబడిరట, యమళార్జునుల నుద్ధరించినది ఇతడేనట. (25)

26శ్లో॥ గావ స్సపాలా ఏతేన దవాగ్నేః పరిమోచితాః ।
కాళీయోదమితస్సర్ప ఇంద్రశ్చ విమదః కృతః ॥

తా॥ గోవులు, గోపాలురును ఇతని చేతనే కార్చిచ్చు నుండి విడిపింప బడిరట, కాళీయుడు అను సర్పము ఇతని చేతనే అణచబడెనట, ఇతని చేతనే ఇంద్రుని గర్వము అడగింపబడినదట. (26)

27శ్లో॥ సప్తాహమేక హస్తేన ధృతోఽద్రి ప్రవరోఽమునా ।
వర్షవాతా శనిభ్యశ్చ పరిత్రాతం చ గోకులమ్ ॥

తా॥ ఏడు దినముల వఱకు గోవర్ధనము అను పర్వత శ్రేష్ఠము ఇతని వలననే ధరంపబడినదట, గాలి వానలు, పిడుగులు మున్నగు ఉపద్రవముల నుండి, గోకులము ఇతని వలననే రక్షింపబడినదట.(27)

టీ॥ పూతనేతి. గుహ్యకః శంఖచూడః. అస్య చ అఘాసురాదయః ॥25-27॥

టీ॥ గుహ్యకః శంఖచూడుడు అనే అఘాసురుడు మొదలగు ఇతరులు. (25-27)

28శ్లో॥ గోప్యోఽస్య నిత్య ముదితా హసిత ప్రేక్షణం ముఖమ్ ।
పశ్యంత్యో వివిధాస్తాం స్తాం స్తరంతిస్మ శ్రమం ముదా ॥

తా॥ గోపస్త్రీలు ప్రతి దినమును లేవగానే ఇతని చిఱునవ్వు చూపుల ముఖమును చూచుచు, ఆపై వివిధములైన ఆయా కార్యములను శ్రమలేకుండ పూర్తి చేయుచుండెడి వారట సంతోషముగ ఆయా తాపములను దాటు చుండెడి వారట. (28)

టీ॥ గోప్యఇతి. అశ్రమం ఈషచ్ఛ్రమయుక్తం ముఖం అశ్రమం సుఖమితి వా. యద్వా అశ్రమం యథా భవతి తథా తరంతి స్మేతి. ॥28॥

టీ॥ అశ్రమం - కొంచెము శ్రమతో కూడుకొనినదిగ లేక - ముఖం - శ్రమలేని ముఖమును లేక శ్రమలేకుండ ఏవిధముగ సంభవమగునో ఆ విధముగ దాటుచుండిరట అని అర్థము. (28)

29శ్లో॥ వదంత్యనేన వంశోఽయం యదోస్సు బహు విశ్రుతః ।
ప్రియం యశో మహత్త్వం చ లప్స్యతే పరిరక్షితః ॥

తా॥ ఇతని వలననే ఈ యదువంశము మిక్కిలిగ ప్రసిద్ధమయ్యెనని, ప్రేమాస్పదమైనదని, కీర్తిమంతమైనదని, ఇతడు రక్షించుచుండుట చేతనే గొప్పదనమును పొందినదనియు చెప్పుదురు. (29)

టీ॥ వదంతీతి. అనేన పరిరక్షితో యదోర్వంశః సుబహు విశ్రుత స్సన్. శ్ర్యాదిలప్స్యత ఇతి వదంతీతి. ॥29॥

టీ॥ ఇతనిచే రక్షింపబడినదై యదువంశము మిక్కిలి ప్రసిద్ధమగుచు సౌభాగ్యాదులు పొందెనని చెప్పుదురు. (29)

30శ్లో॥ అయం చాస్యా గ్రజ శ్రీమాన్ రామః కమల లోచనః ।
ప్రలంబో నిహతోఽనేన వత్సకో ధేనుకాదయః ॥

తా॥ ఇదిగో ఈతడు కృష్ణుని అన్నగారు భాగ్యశాలియగు బలరాముడు తామర(స) నేత్రుడు ఇతని చేతనే ప్రలంబుడు చంపబడెను అట్లే వత్సకుడు, ధేనుకుడు మొదలగువారు కూడ. (30)

టీ॥ అయమితి. ధేనుక బక వత్సాసురేషు విపర్యయోక్తిర్జనవాదేషు అనిశ్చయాత్. ॥30॥

టీ॥ ధేనుక, బక, వత్సాద్యసురుల యందు, జనవాదముల విపర్య యోక్తి వలన అనిశ్చయత్వము వలన (30)

శ్రీ శుక ఉవాచ:

31శ్లో॥ జనేష్వేవం బ్రువాణేషు తూర్యేషు నినదత్సు చ ।
కృష్ణరామౌ సమాభాష్య చాణూరో వాక్యమబ్రవీత్ ॥

**శ్రీ శుకుడు ఇట్లు అనెను**

తా॥ జనులీవిధముగ మాట్లాడుకొనుచుండగా, ఒక వైపు వాద్యములు మ్రోగుచుండగా, కృష్ణ రాములను సంబోధించి చాణూరుడు ఇట్లనెను. (31)

32శ్లో॥ హే నందసూనో హే రామ భవంతౌ వీర్య సంమతౌ ।
నియుద్ధ కుశలౌ శ్రుత్వా రాజ్ఞా హూతౌ దిదృక్షుణా ॥

తా॥ ఓ నందకుమారా! ఓ బలరామా! మీరలిరువురును, వీరులకు ఆదరణీయులు, బాహు యుద్ధ నిపుణులు ఈ విషయమును విని చూడవలెనను ఇచ్ఛతో రాజు మిమ్ము ఆహ్వానించి యున్నాడు. (32)

33శ్లో॥ ప్రియం రాజ్ఞః ప్రకుర్వంత్య శ్రేయో విందంతి వై ప్రజాః ।
మనసా కర్మణా వాచా విపరీతమతోఽన్యథా ॥

తా॥ మనస్సు చేత, కర్మ చేత, వాక్కు చేతను రాజునకు ప్రజలు ప్రియము చేసిన యెడలనే శ్రేయస్సును పొందెదరు. కాని దానికి విరుద్ధముగ ప్రవర్తించినచో విరుద్ధ ఫలములే పొందెదరు. (33)

34శ్లో॥ నిత్యం ప్రముదితా గోపా వత్సపాలా స్తథా స్ఫుటమ్ ।
వనేషు మల్లయుద్ధేన క్రీడంతశ్చారయంతి గాః ॥

తా॥ ప్రతిదినము గోపాలకులు, లేగలను మేపువారును ఆనందముతో, అడవుల యందు మల్లయుద్ధములతో ఆడుకొనుచు ఆవులను (లేగలను) మేపు చుందురని అందరికిని విదితమే. (34)

టీ॥ జనేష్వితి. జనేష్వేవంబ్రువాణేషు సత్సు తదసహమానశ్చాణూరోఽబ్రవీదితి. ॥31-34॥

టీ॥ జనులీవిధముగ మాట్లాడుచుండగ దానిని సహింపజాలక చాణూరుడిట్లనెను. (31-34)

35శ్లో॥ తస్మాద్రాజ్ఞః ప్రియం యూయం వయం చ కరవామహే ।
భూతాని నః ప్రసీదంతి సర్వ భూతమయో నృపః ॥

తా॥ అందువలన మీరు, మేము రాజునకు ప్రియమాచరింతుము సర్వ భూతమయుడగు రాజు ప్రసన్నుడగుచుండగా! భూతములన్నియు ప్రసన్నములగును. (35)

36శ్లో॥ తన్నిశమ్యా బ్రవీత్కృష్ణో దేశ కాలోచితం వచః ।
నియుద్ధమాత్మనోఽభీష్టం మన్యమానోఽభినంద్య చ ॥

తా॥ ఆ మాట విని కృష్ణుడు దేశకాలోచితమైన రీతిగా ఇట్లనెను బాహు యుద్ధము మాకును ఇష్టమైనదే అనుచు చాణూరుని అభినందించి అతని ప్రతిపాదనకు తన అంగీకారమును తెలిపెను.(36)

37శ్లో॥ ప్రజా భోజపతేరస్య వయం చాపి వనేచరాః ।
కరవామ ప్రియం నిత్యం తన్నః పరమనుగ్రహః ॥

తా॥ మేము కూడ ఈ భోజరాజు యొక్క వనచర ప్రజలము తప్పకుండ ఎప్పుడును ప్రియమునే చేయుదము అది మాకును రాజానుగ్రహమును కలిగించునదే కదా ! (37)

టీ॥ తస్మాదితి. హే కృష్ణ ప్రియం కరవామేతి. రాజ్ఞి ప్రీతే భూతాని చ ప్రసీదేయుః. ॥35-37॥

టీ॥ ఓ కృష్ణా! ప్రియమును చేయుదము రాజు ప్రీతుడగుచుండ భూతములును ప్రసన్నములగును. (35-37)

38శ్లో॥ బాలా వయం తుల్యబలైః క్రీడిష్యామో యథోచితమ్ ।
భవేన్నియుద్ధం మాధర్మస్స్పృశేన్మల్ల సభా సదః ॥

తా॥ మేము బాలకులము అందుచేత యథా యోగ్యముగ సమానమైన బలము గలవారి తోనే మేము ఈ మల్ల యుద్ధ క్రీడను నెరిపెదము. మల్ల యుద్ధ క్రీడ జరుగును - ఈ క్రీడా సభ్యులు అధర్మమును స్పృశింపకుందురు గాక.(38)

టీ॥ బాలా ఇతి. యథోచితం నియుద్ధం బాహు యుద్ధం భవేత్. మల్లసభాధికృతాన్ అధర్మో మాస్పృశేత్ నస్పృశేదిత్యేతదర్థం. హే మల్లేతి వా. ॥38॥

టీ॥ యథోచితముగ బాహుయుద్ధము జరుగును - మల్ల సభాధికారులు అధర్మమును స్పృశింపకుందురు గాక, స్పృశింపకుండవలయునని దీని అర్థము లేక ఓ మల్ల సభాసదులారా!( అని వారిను ద్దేశించి) (38)

చాణూర ఉవాచ:

39శ్లో॥ న బాలో న కిశోరస్త్వం బలశ్చ బలినాం వరః ।
లీలయే భో హతో యేన సహస్ర ద్విపసత్త్వభృత్ ॥

చాణూరుడిట్లనెను

తా॥ కృష్ణా! నీవు బాలుడవు కావు కిశోరుడవు కావు, బలశాలురలో శ్రేష్ఠుడవు వేయి ఏనుగుల బలము గల కువలయాపీడుడు లీలగా నీచే చంపబడినాడు కదా! (39)

టీ॥ నేతి. సహస్రద్విపానాం సత్త్వం బలం బిభర్తి తథా. ॥39॥

టీ॥ వేయి ఏనుగుల యొక్క బలమును కలిగియున్నట్టిది (కువలయాపీడము) (39)

40శ్లో॥ తస్మాద్భవద్భ్యాం బలిభిర్యోద్ధవ్యం నానయోఽత్ర వై ।
మయా విక్రమవార్ష్ణేయ బలేన సహ ముష్టికః ॥

తా॥ అందువలన మీరు మీవంటి బలశాలురతోనే యుద్ధము చేయవలయును. ఇందులో అన్యాయము ఏమియు లేదు కృష్ణా! నీవు నాతో తలపడుము ముష్టికుడు బలరామునితో యుద్ధము చేయును. (40)

టీ॥ తస్మాదితి. తథా బలిభిర్మాదృశైస్సహ. అనయః అధర్మః. విక్రమం పరాక్రమం కురు. ముష్టికో విక్రమతాదితి. ॥40॥

టీ॥ మరియు - బలిభిః - మా వంటి వారితో కూడి - అనయః అధర్మము విక్రమం - పరాక్రమము చేయుము ముష్టికుడు బలరామునితో విక్రమించును గాక అని అర్థము. (40)

శ్రీ మద్భాగవతే, మహాపురాణే దశమస్కంధే,
త్రిచత్వారింశోఽధ్యాయః

అని శ్రీమద్భాగవతమున దశమస్కంధమందు
నలుబది మూడవ అధ్యాయము సమాప్తము.

## చతుశ్చత్వారింశోఽధ్యాయః

శ్లో॥ ఏవం చర్చిత సంకల్పో భగవాన్ మధుసూదనః ।
ఆససాధాథ చాణూరం ముష్టికం రోహిణీ సుతః ॥ ॥1॥

శ్లో॥ ఆస్ఫోట్య హస్తౌ హస్తాభ్యామూరూ చైవ పునః పునః ।
విసృజ్య భూయస్సంగృహ్య పరిక్రమ్య పరస్పరమ్ ॥ ॥2॥

శ్లో॥ హస్తాభ్యాం హస్తయోర్బధ్వా పద్భ్యామేవ చ పాదయోః ।
విచకర్షతు రన్యోన్యం ప్రసహ్య విజిగీషయా ॥ ॥3॥

టీ॥ శ్లో“ చతుశ్చత్వారింశకే తు మల్ల కంసాది మర్దనమ్, కంస యోషిత ఆశ్వాసస్తాభ్యాం పిత్రోశ్చదర్శనం” ఏవమితి. చర్చితః నిశ్చిత ఏవ స్వసంకల్పో యస్య సః. (1-3 )

## నలుబది నాల్గవ అధ్యాయము

తా॥ ఈ విధముగ కృష్ణుడు తనలో తానును, బలరాముని తోను తర్కించి, ఒక సంకల్పము గలవాడై, చాణూరుని తాను, ముష్టికుని బలరాముడును మల్ల యుద్ధ ప్రత్యర్థులుగ పొందిరి. (1)

తా॥ చేతులతో చేతులను, తొడలను చఱచి, పరస్పరము మఱల మఱల చఱచుచు, విడిచి, మఱల పట్టుకొని ఒకరినొకరు పాద విక్షేపములు చేయుచు. (2)

తా॥ చేతులతో చేతులను బంధించి, ఒక్కొక్కసారి పాదములతో పాదములను బిగించి, (కాళ్ళతో కాళ్ళను,పట్టి) ఒకరినొకరు జయింప వలెనను ఇచ్ఛతో మిక్కిలి బలముగా ముందునకు నెట్టుచుండిరి.(3)

టీ॥ నలుబది నాల్గవ అధ్యాయమున మల్లురను, కంసుడు మొదలగు వారిని వధించుట, కంసునికి సంబంధించిన స్త్రీలను ఓదార్చుట, వారి చేత వసుదేవుని దర్శనము- వర్ణింపబడినవి. చర్చితః- నిశ్చిత మైన తన సంకల్పము ఎవనికో (1-3)

శ్లో॥ అరత్నీ ద్వే అరత్నిభ్యాం జానుభ్యాం చైవ జానునీ ।
శిరశ్శీర్ష్ణోరసో రస్తావన్యోన్య మభి జఘ్నతుః ॥ ॥4॥

టీ॥ అరత్నీ ఇతి బాహు మూలాత్ బాహుమధ్యాత్ కనిష్ఠాంగుళి వ్యతిరేకేణ కృతముష్టిహస్తోఽరత్నిః॥4॥

శ్లో॥ పరిభ్రామణ విక్షేప పరిరంభావ పాతనైః ।
ఉత్సర్పణాపసర్పైస్తావన్యోన్యం ప్రత్యరుంధతామ్ ॥ ॥5॥

టీ॥ పరిభ్రామణేతి పరిభ్రామణం హస్తాదిశు గృహీత్వా పరితశ్చాలనం. విక్షేపోనోదనం. పరిరంభో బాహుభ్యాం నిష్పీడనం అవపాతనం అధః క్షేపః ఉత్సర్పణం ఉత్సృజ్య పురతో గమనం అపసర్పణం అపసృజ్య పృష్ఠతో గమనం , ఏతైః ప్రత్యరుంధతాం ప్రతావృతవంతౌ. ॥5॥

తా॥ (అరత్ని= చాచిన చిటికెన వ్రేలు గల పిడికిలితో రెండు అరత్నులను, రెండు మోకాళ్ళతో రెండు మోకాళ్ళను, తలతో తలను, ఱొమ్ముతో ఱొమ్మును, పరస్పరము చఱచుకొనిరి. (4)

టీ॥ అరత్నీ- బాహుమూలము తో బాహువును ఉద్దీప్తము చేసెను. చిటికెనవ్రేలు తప్పించి బిగింపబడిన పిడికిలి గలచేయి. అరత్ని. ॥4॥

తా॥ చుట్టును త్రిప్పుట, బలముగా విసరి వేయుట, బాహువులతో గట్టిగా పీడించుట, క్రింద పడవేయుట, అవకాశమిచ్చి ముందునకు బోవుట, ప్రచ్ఛన్నముగ తిరుగుచు వెనుకనుండి పోవుట, మున్నగు వానితో ఒకరినొకరు ఆవరించుచుండిరి. (5)

టీ॥ పరిభ్రామణం- చేతులు మొదలగు వానితో పట్టుకొని చుట్టును త్రిప్పుట, విక్షేపః- విసరివేయుట, పరిరంభః- బాహువులతో పీడించుట, (పిండివేయుట) అవపాతనం- క్రిందపడవేయుట, ఉత్సర్పణం- విడిచి ముందుకుపోవుట,అపసర్పణం- రహస్యముగ వెనుకనుండి పోవుట, ఇట్టివానితో ఒకరినొకరు ఆక్రమించిరి. ॥5॥

శ్లో॥ ఉత్థాపనై రున్నయనైశ్చాలనై స్థాపనైరపి ।
పరస్పరం జిగీషం తావప చక్రతురాత్మనః ॥ ॥6॥

తా॥ క్రింద పడిన వానిని పైకి లేపుటలచే, పడిన వానిని చేతులతో లేవనెత్తి తీసుకొని పోవుటల చేత, కదలించుటల చేత, కాళ్ళు చేతులను పిండీకరించి ఒక్కచో స్థాపించుట చేత, ఒకరినొకరు గెలువ నిచ్ఛ గలవారై దేహమునకు అపకారము చేయుచుండిరి. (6)

టీ॥ ఉత్థాపనైరితి. ఉత్థాపనం – పాదౌ జానునీ పిండీకృత్య పతితస్యో చ్ఛాటనం. ఉన్నయనం హస్తాభ్యాముద్ధృత్య నయనం చాలనం కంఠాది లగ్నస్య నిస్సారణం, స్థాపనం పాణిపాదాది పిండీకరణం ఏవం పరస్పరమాత్మనో దేహస్యాపచక్రతుఃఅపకారం కృతవంతౌ. ॥6॥

టీ॥ ఉత్థాపనం – రెండు కాళ్ళను మోకాళ్ళను ముద్దగా జేసి పడిపోయిన వానిని లేవనెత్తుట, ఉన్నయనం– రెండు చేతులతో లేవనెత్తి కొనిపోవుట, చాలనం– కంఠము మున్నగు వానిని తగుల్కొని యున్న వానిని దూరముగ విదల్చుట, స్థాపనం– కాళ్ళు చేతులు మొదలగు వానిని ముద్దగా చేయుట, ఈ విధముగ ఒకరి దేహమున కొకరు అపకారమును చేసిరి. ॥6॥

శ్లో॥ తద్బలాబలవద్యుద్ధం సమేతాస్సర్వయోషితః ।
ఊచుః పరస్పరం రాజన్ సానుకంపాశ్చ యూథశః ॥ ॥7॥

తా॥ రాజా! ఆ మల్లయుద్ధరంగ ప్రాంతములందు స్త్రీలందరును గుంపులు గుంపులుగ చేరి, ఇది బలవంతులకును, బలహీనులకును మధ్య జరగుచున్న యుద్ధము" అని వారిలో వారు కరుణాహృదయులై మాట్లాడుకొను చుండిరి. (7)

టీ॥ తదితి. తద్యుద్ధం బలాబలవత్ ఏకతో బలం అన్యతః అబలం తద్యుద్ధం విషమమిత్యూచురిత్యర్థః. ॥7॥

టీ॥ ఈ యుద్ధము బలవంతులకు, అబలవంతులకు మధ్య–ఒకవైపు బలము– మరియొకవైపు బలరాహిత్యము– ఇట్టి యుద్ధము విషమము' అని చెప్పుకొనుచుండిరని యర్థము. ॥7॥

శ్లో॥ మహానయం బతాధర్మ ఏషాం రాజసభాసదామ్ ।
యే బాలబలవద్యుద్ధం రాజ్ఞో౽న్విచ్ఛంతి పశ్యతః ॥ ॥8॥

తా॥ అయ్యో! ఇది ఈ రాజ సభాసదులకు గొప్ప అధర్మము, అన్యాయము కదా! రాజు పక్షమునకు అధర్మమే కదా! బాలురకు బలవంతులకు మధ్య ఇట్టి యుద్ధమును చూచుటకు ఇష్ట పడుచున్నారు. (8)

టీ॥ తదేవ దర్శయతి – మహానితి యద్వా. తత్ బాలబలవతోర్యుద్ధం దృష్ట్వా మహానయమధర్మ ఇత్యూచురిత్యన్వయః. బాలయోర్బలవతోశ్చ యుద్ధం రాజాచేత్పశ్యేత్స్వయం వారణీయః ఏతే తు రాజ్ఞః పశ్యతః స్వయమప్యన్విచ్ఛంతి అనుమన్యంత ఇతి మహానధర్మః ఇత్యర్థః॥8॥

టీ॥ దానినే చూపుచున్నాడు.“మహా”అని – లేక బాలురకు బలవంతు లకు మధ్య జరుగు యుద్ధమును చూచి ఇది మహా అన్యాయము, అధర్మము అని ముచ్చటించు కొనుచుండిరి అని అన్వయము. బాలురకు బలవంతులతో యద్ధము, రాజైనచో చూచిన వెంటనే స్వయముగ నివారింపవలసి యుండెను. వీరైతే, రాజు చూచుచుండగనే స్వయముగ కూడ ఇష్టపడుచున్నారు. అనుమతించుచున్నారు. అది గొప్ప అధర్మము అని అర్థము. ॥8॥

శ్లో॥ క్వ వజ్రసార సర్వాంగౌ మల్లౌ శైలేంద్ర సమ్మతౌ ।
క్వ చాతి సుకుమారాంగౌ కిశోరౌ నాప్త యౌవనౌ ॥ ॥9॥

తా॥ అవయవములన్నియు వజ్రసారమువలె మిక్కిలి కఠినముగా నున్న వారును, పర్వత శ్రేష్ఠములతో సమానమైన వారును అగు మల్లురెక్కడ! మిక్కిలి సుకుమారమైన అంగములు గల వారును, యౌవ్వనము రాని బాలురెక్కడ!! (9)

టీ॥ బలా బలవద్యుద్ధతాం ప్రపంచయతి పంచభిః క్వేతి వజ్రసారాణి వజ్రవత్కఠినాని. సర్వాణ్యంగాని యయోస్తౌ ॥9॥

టీ॥ బలవంతులకు బలహీనులకు మధ్య జరుగుచున్న యుద్ధమును గూర్చి ఐదు శ్లోకములలో చెప్పుచున్నాడు– వజ్రసారిణి, వజ్రమువలె

కాఠిన్యము గలవి. సమస్తమైన అంగములు ఎవరికో వారిరువురు- (కిశోర-పదునైదులోపు వయస్సు) ။9॥

శ్లో॥ ధర్మవ్యతిక్రమో హ్యస్య సమాజస్య ధ్రువం భవేత్ ।
యత్రా ధర్మస్సముత్తిష్ఠేన్న స్థేయం తత్ర కర్హిచిత్ ॥ ॥10॥

తా॥ ఈ సభకు అధర్మ ఫలము నిశ్చయముగ కలుగును. ఎచట అధర్మము కూడ ధర్మముతో సమానముగ నుండునో అచట ఎట్టి పరిస్థితులలో నిలువరాదు. (నిలిచిన వారు పాప భాక్కులగుదురు)(10)

టీ॥ ధర్మేతి. సమాజస్య సభాయాః ॥10॥

టీ॥ సమాజస్య- సభకు ॥10॥

శ్లో॥ న సభాం ప్రవిశేత్ప్రాజ్ఞ స్సభ్యదోషానను స్మరన్ ।
అబ్రువన్విబ్రువన్నజ్ఞో నరః కిల్బిష మశ్నుతే ॥ ॥11॥

తా॥ బుద్ధిమంతుడు సభ్యుల దోషములను స్మరించును - ఆ సభలో ప్రవేశింపరాదు. అధర్మమును గురించి చెప్పకుండినగాని, విపరీతముగ చెప్పిన గాని, దాని గూర్చి తెలియకుండిన గాని మానవుడు పాపమును పొందును. (11)

టీ॥ అపరా ఊచుః నేతి అబ్రువన్ జ్ఞాత్వాపి తూష్ణీం తిష్ఠన్. విబ్రువన్. విపరీతం బ్రువన్ అజ్ఞః న జానామీతిబ్రువన్ అతః ప్రాజ్ఞస్సభాం న ప్రవిశేదితి. ॥11॥

టీ॥ మరికొందరు చెప్పుచున్నారు; అబ్రువన్- తెలిసి కూడ ఊరక నుండుచు; విబ్రువన్- విపరీతముగ చెప్పు; అజ్ఞః- నాకు తెలియదు అని చెప్పువాడు; అందువలన ప్రాజ్ఞుడు సభలోనికి ప్రవేశింపరాదు. అని. ॥11॥

శ్లో॥ వల్గత శ్శత్రుమభితః కృష్ణస్య వదనాంబుజమ్ ।
వీక్ష్యతాం శ్రమవార్యుప్తం పద్మకోశ మివాంబుభిః ॥ ॥12॥

టీ॥ వల్గత ఇతి. వల్గతః శత్రుమభితః శత్రోస్సర్వతో ధావతః కృష్ణస్య శ్రమవారిణా ఉప్తం వ్యాప్తం వదనాంబుజం దృశ్యతామ్॥12॥

శ్లో॥ కిం న పశ్యత రామస్య ముఖమాతామ్రలోచనమ్ ।
ముష్టికం ప్రతి సామర్షం హాస సంరంభ శోభనమ్ ॥ ॥13॥

టీ॥ అన్యా ఊచుః కిమితి సామర్షం సక్రోధం. హాసేన సంరంభః ఆవేశః తేన శోభనం. ॥13॥

శ్లో॥ పుణ్యా బత వ్రజ భువో యదయం నృలింగగూఢః
పురాణ పురుషో వన చిత్ర మాల్యః ।
గాః పాలయన్ సహబలః క్వణయన్ స్వవేణుం
విక్రీడయాంచతి గిరిత్ర రమార్చితాంఘ్రిః ॥ ॥14॥

తా॥ శత్రువును, చుట్టును ముట్టడించుచున్న కృష్ణుని ముఖమును చూడుడు– స్వేదముతో వ్యాప్తమై, నీటి బిందువులచే వ్యాప్తమై యున్న పద్మ కోషము వలె నున్న అతని ముఖమును చూడుడు. (12)

టీ॥ వల్గతః– చుట్టుమట్టుచు– శత్రువును– అభితః– శత్రువు యొక్క అన్నివైపుల నుండి పరుగెత్తుచున్నట్టి కృష్ణుని– చెమట నీటితో వ్యాప్తమైన తామరపువ్వు వంటి ముఖము చూతురు గాక!! ॥12॥

తా॥ ఎఱ్ఱని కండ్లతో ముష్టికుని వైపు కోపముగా చూచుచున్న కండ్లతో నున్న బలరాముని ముఖము చూచుట లేదా ఏమి? కోప దృష్టి యున్నను నవ్వుతో కూడిన ఆవేశముతో సుందరమై ఒప్పుచున్నది. (13)

టీ॥ మఱికొందరు చెప్పుచుండిరి– సామర్షం– క్రోధముతో కూడినదై, నవ్వుతో– సంరంభః– ఆవేశము గలదై, దానితో అందముగ నున్నట్టిది (అయిన రాముని ముఖము మీరు చూచుట లేదా?) ॥13॥

తా॥ మనుష్య దేహముతో గూఢముగ నున్న పురాణపురుషుడు. అడవి యందలి విచిత్రమైన పూలదండలు ధరించినవాడై, ఆవులను కాపాడుచు, బలరాముడు తోడు కాగా, తన వేణువును శ్రావ్యముగ మ్రోగించుచు వివిధములైన క్రీడలతో ఏ నేలపై తిరుగు చుండునో,

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

టీ॥ అన్య ఊచుః పుణ్యా ఇతి. నృలింగేన మనుష్య దేహేన గూఢః వనస్థాని చిత్రాణి మాల్యాని యస్య సః గిరిత్రః శివః రమా చ తాభ్యా మర్చితావంఘ్రీ యస్య సః అయం భావః. ధిగిమాం సభాం. యస్యా మయం పరా భూయతే తాస్తు వ్రజభువో ధన్యాః యత్ యాసు అయం కృష్ణో వివిధ క్రీడయా అంచతి గచ్ఛతీతి. ॥14॥

శ్లో॥ గోప్య స్తపః కిమచరన్ యదముష్య రూపం
లావణ్య సారమసమోర్ధ్వమనన్యసిద్ధమ్ ।
దృగ్భిః పిబంత్యనుసవాభినవం దురాప
మేకాం తథామ యశసశ్శ్రియ ఈశ్వరస్య ॥ ॥15॥

ఎవని పాదములు శివుని చేతను, లక్ష్మి చేతను అర్చింపబడుచుండునో అట్టి శ్రీకృష్ణుడు తిరుగుచుండు వ్రజ భూములు అహో! ధన్యములు కదా!(14)

టీ॥ ఇతరులు కొందరు చెప్పుచున్నారు; నృలింగేన - మనుష్య దేహము చేత-గూఢః- గుప్తముగ నున్నవాడు, ఆవుల యందుండెడు విచిత్రమైన పూలమాలలు ఎవనికో వాడు; గిరిత్రః - శివుడు, లక్ష్మియు వారి చేత పూజింపబడిన పాదద్వయము ఎవనికో వాడు; దీని భావమిది. ఈ సభను ధిక్కరింతము గాక! ఏ సభ యొక్క వ్యాధిని (అధర్మమును) అణచి వేయువారు పుట్టిన వ్రజ భూములు ధన్యములు. వాని యందే ఈ కృష్ణుడు వివిధములైన క్రీడలతో తిరుగుచుండును. (అట్టి వ్రజ భూములు ధన్యములు) అని. ॥14॥

తా॥ గోపస్త్రీలు ఏమి తపమాచరించిరో! ఏలయన ఇతని లావణ్య సారము, అసమానము. ఇతరులెవరికిని లేనిదియునైన రూపము. నిత్య నవీనమైన సుందర రూపమును చూపులతో త్రాగుచున్నారు. ఇతరులకు పొందరానిది, తనదేయైన యశస్సు యొక్క, సౌభాగ్యము యొక్క, ఐశ్వర్యము యొక్క, ఏకాంతస్థానమును చూచుచున్నారు. (15)

టీ॥ అహో కష్టమల్ప పుణ్యా వయం యతోఽస్మాభిరనవసరే దృష్టోఽ యం కృష్ణః గోప్యస్తు బహుపుణ్యా ఇత్యాహుస్త్రిభిః - గోప్య ఇతి. అముష్య శ్రీకృష్ణస్య. రూపం అంగం లావణ్యేన సారం శ్రేష్ఠం కించ. అసమోర్ధ్వం న విద్యతే సమమూర్ధ్వమధికం చ యస్య తత్ తదపినాన్యేన ఆభరణాదినాసిద్ధం. కింతు. స్వత ఏవ యశసః శ్రియః ఈశ్వరస్య ఏకాంతధామ ఐశ్వర్యస్య చ అవ్యభిచారిస్థానం పాఠాన్తరే- అముష్యేశ్వరస్యేత్యన్వయః. ఏవంభూతం అనుసవాభి నవం నిత్య నవీనం రూపం యాః నేత్రైః పశ్యంతీతి. ॥15॥

టీ॥ అహో! కష్టము! మేము స్వల్పమైన పుణ్యము గలవారము. ఏలయన అసమయమున మాత్రమే కృష్ణుడు మాచే చూడబడినాడు. గోపస్త్రీలు గొప్ప పుణ్యము గలవారు, అని మూడు శ్లోకములతో చెప్పుచున్నారు. ఈ శ్రీకృష్ణుని యొక్క రూపము, లావణ్యము చేత మిక్కిలి శ్రేష్ఠమైనది. మరియు అసమోర్ధ్వం- సమానముగ గాని, అంత కంటె ఎక్కువ గాని సౌందర్యము, ఎవని కంటె ఇతరము లేదో అట్టి సౌందర్యము, అదియును ఆభరణాదులచే సిద్ధించినది కాదు. స్వతః సిద్ధము, కీర్తి యొక్క, సౌభాగ్యము యొక్క, ఈశ్వరత్వము యొక్క ఏకాంతధామ, ఐశర్యము యొక్క, అవ్యభిచారిస్థానము. పాఠాంతరమున ఇతని ఈశ్వరుని అని అన్వయము. ఇట్టి అనుసవాభినవము నిత్య నూతనమైన రూపమును, ఎవరు కన్నులతో చూచుచుందురో అని. 15)

శ్లో॥ యా దోహనేఽవహననే మథనోపలేప
ప్రేంఖేం ఖనార్భ రుదితో క్షణమార్జనాదౌ ।
గాయంతి చైన మనురక్తధియోఽశ్రు కంఠ్యో
ధన్యా వ్రజస్త్రియ ఉరుక్రమ చిత్తయానాః ॥ ॥16॥

తా॥ పాలు పితుకుతున్నప్పుడు, పెరుగు చిలుకునపుడు, ధాన్యము దంచునపుడు, ఇల్లలుకునపుడు, బాలురు ఏడ్చునపుడు, ఊయల లూపునపుడు, ఏడ్చు వారిని బుజ్జగించునపుడు, వారికి స్నానము చేయించినపుడు, నిద్ర పుచ్చునపుడు, ఇల్లు ఊడ్చునపుడు, ఈ మొదలగు పనులన్నియు చేయునపుడు, గోపస్త్రీలు కృష్ణుని యందు అనురాగబుద్ధితో, గద్గద కంఠముతో కృష్ణుని గూర్చియే పాడుచుందురు. కృష్ణ చిత్తముతో కాలముగడుపు వ్రజస్త్రీలు ధన్యులుగదా! (16)

టీ॥ యా ఇతి కించ. యాః దోహనాదిష్వేనం గాయంతి. తాః వ్రజస్త్రియో ధన్యాః ప్రేంఖేం ఖనం డోళాందోళనం. ఉక్షణం సేచనం కథంభూతాః ఉరుక్రమ చిత్తయానాః ఉరుక్రమే చిత్తం తేనైవ యానం సర్వవిషయ ప్రాప్తిరస్యాం తాః పాఠాన్తరే – ఉరుక్రమం చింతయంత్య ఇత్యర్థః కుతః అనురక్తధియః ఆర్ద్రధియః తత్ర లింగం అశ్రుకంఠ్యః ॥16॥

టీ॥ మరియు ఎవ్వతెలు పాలుపితుకుట మొదలగు పనుల యందు కృష్ణుని గూర్చి పాడుచుందురో వారు – ఆ వ్రజస్త్రీలు ధన్యులు. ప్రేంఖేం ఖనం– ఊయల ఊపుట, ఉక్షణం– తడుపుట, ఎట్టివారు? ఉరుక్రమ చిత్తయానాః ఉరుక్రమే– కృష్ణుని యందు మనస్సు కలిగి, దానితోనే, యానం– సర్వ విషయ ప్రాప్తి ఎవరి యందో వారు; పాఠాంతరమున ఉరుక్రమం– కృష్ణుని గూర్చి చింతన చేయుచున్న వారై అని అర్థము. ఎందువలన– అనురక్తధియః ఆర్ద్రమైన బుద్ధి గల వారు– దానికి గుర్తు, గద్గదకంఠము గలవారై. ॥16॥

శ్లో॥ ప్రాత ర్వ్రజాద్వ్రజత ఆవిశతశ్చ సాయం
గోభిస్సమం క్వణయతోఽస్య నిశమ్య వేణుమ్ ।
నిర్గమ్య తూర్ణమబలాః పథి భూరి పుణ్యా
పశ్యంతి సస్మిత ముఖం సదయావలోకమ్ ॥ ॥17॥

తా॥ ఉదయమున వ్రజము నుండి బయలుదేరునపుడును, సాయం కాలము తిరిగి వ్రజమునకు ప్రవేశించునప్పుడును, ఆవులతో సహా వేణువును వాయించుచు నిట్లు పోవుచు వచ్చుచున్న వానిని వేణు నాదమున, మార్గముననున్న వానిని – కృష్ణుని చూచుటకు వ్రజ స్త్రీలందరును త్వరగా బయటకు వచ్చి ఆతని చూచుచుందురు. కృష్ణుని చిరునవ్వుతో కూడిన ముఖమును దయతో కూడిన ఆతని చూపును, ఇట్లు చూచు వ్రజ స్త్రీలు గొప్ప పుణ్యశాలురు. (17)

టీ॥ అపిచ ప్రాతరితి యా అబలాః. అస్య వేణుం నిశమ్య గృహాత్తూర్ణం నిర్గమ్య పథి సస్మిత ముఖం పశ్యంతి తాః భూరిపుణ్యా ఇతి. ॥17॥

టీ॥ ఇంకను ఏ అబలలు ఇతని వేణువును విని ఇంటి నుండి త్వరగా బయటకు వచ్చి మార్గమున ఆతని చిరునవ్వు ముఖమును చూచెదరో. వారు గొప్ప పుణ్యము గలవారు అని. ॥17॥

శ్లో॥ ఏవం ప్రభాషమాణాసు స్త్రీషు యోగేశ్వరో హరిః ।
శత్రుం హంతుం మనశ్చక్రే భగవాన్ భరతర్షభ ॥ ॥18॥

తా॥ రాజా! ఈ విధముగ స్త్రీలు మాట్లాడుకొనుచుండగా భగవానుడైన కృష్ణుడు శత్రువును వధించుటకు నిశ్చయించు కొనెను. (18)

టీ॥ ఏవమితి. ఏవం సభయం బ్రువాణాసు స్త్రీషు తాసాం భయనివృత్తయే కృష్ణః శత్రుం హంతుం మనశ్చక్రే. ॥18॥

టీ॥ ఈ విధముగ భయపడుచు స్త్రీలు చెప్పుకొనుచుండగా, వారిలోని భయమును నివర్తింప జేయుటకు కృష్ణుడు శత్రువును చంపుటకు సంకల్పించెను. ॥18॥

శ్లో॥ ఉపశ్రుత్య గిరస్త్రీణాం పుత్రస్నేహ శుచాతురౌ ।
పితరావన్వతప్యేతాం పుత్రయో రబుధౌ బలమ్ ॥ ॥19॥

తా॥ సభ యందలి స్త్రీల మాటలను వినిన బలరామకృష్ణులు, పుత్రులకు (తమ తల్లుల యందుగల) పితరుల యందుండెడి ప్రేమచేత, కలిగిన దుఃఖము చేత విహ్వలురై, పుత్రుల బల మింతటిదని తెలియ జాలని దేవకీ వసుదేవులు కూడ ఆ స్త్రీల మాటలు విని కృష్ణబలరాములను గూర్చి పరితాపమును చెందిరి. శోక విహ్వలురైరి. ॥19॥

శ్లో॥ తైస్తైర్నియుద్ధ విధిభిరుభౌ చాణూర కేశవౌ ।
యుయుధాతే యథాన్యోన్యం తథైవ బలముష్టికౌ ॥ ॥20॥

తా॥ కృష్ణుడు, చాణూరుడు ఇరువురును ఆ యా బాహు యుద్ధ నియమములను పాటించుచు ఒకరితో నొకరు పోట్లాడిరి. వీరివలెనే బలరాముడు ముష్టికుడును తలపడిరి. (19)

టీ॥ ఉపశ్రుత్యేతి. సభయాః స్త్రీణాం గిరశ్శృత్వా పుత్రయోః స్నేహేన యా శుక్ తయా ఆతురౌ విహ్వలౌ. పుత్రయోర్బలమజానంతౌ పితరావనుతాపం ప్రాప్తావితి. ॥19,20॥

టీ॥ సభయందలి స్త్రీల మాటలు విని పుత్రులయందలి ప్రేమచేత ఏ శోకము గలదో దానిచేత ఆతురులై, పుత్రుల బలము తెలియని వారై రామకృష్ణుల తల్లి దండ్రులు అనుతాపమును పొందిరి.॥19,20

శ్లో॥ భగవద్గాత్రనిష్పాతైర్వజ్రనిష్పేషనిష్ఠురైః ।
చాణూరో భజ్యమానాంగో ముహుర్గ్లానిమవాప హ ॥ ॥21॥

తా ॥ వజ్రాయుధము వలన కలుగు కఠినములైన దెబ్బల వంటి తాకిడులు కృష్ణుని శరీరము వలన తాకగా అట్టి ఘాతముల చేత చాణూరుడు క్షతగాత్రుడై మఱల మఱల బాధ నొందెను. (21)

టీ॥ భగవదితి తథా భగవతో గాత్రాణాం అరత్నిజాన్వాదినాం, నిష్పాతైః ప్రహారైః, వ్రజస్యనిష్పేషః తీవ్రః పాతః తద్వన్నిష్ఠురైః. భజ్యమానాంగః శ్లథద్గాత్రః. ॥21॥

టీ॥ అట్లే కృష్ణుని అవయవముల పిడికిళ్ళు మొదలగు వాని యొక్క తాకిడి వలన, దెబ్బల వలన – వజ్రాయుధము తాకిడి వంటి తీవ్రమైన, కఠినమైన దెబ్బల చేత భజ్యమానాంగః శిథిలమైన శరీరము గలవాడై. ॥21॥

శ్లో॥ స శ్యేనవేగ ఉత్పుత్య ముష్టీకృత్య కరావుభౌ ।
భగవంతం వాసుదేవం క్రుద్ధో వక్షస్య బాధత ॥ ॥22॥

తా॥ చాణూరుడు, డేగ వేగము వంటి వేగముతో పైకి ఎగసి, రెండు చేతుల పిడికిళ్ళు బిగించి, భగవంతుడగు వాసుదేవుని వక్షఃస్థలముపై కోపముతో చఱచి బాధించెను. (22)

శ్లో॥ నాచలత్తత్ప్రహారేణ ప్రజాహత ఇవద్విపః ।
బాహ్వోర్నిగృహ్య చాణూరం బహుశోభ్రామయన్ హరిః॥23॥

తా॥ కృష్ణుడు ఆ దెబ్బకు ఇంచుకైనను చలింపక, చిన్న పిల్లల దెబ్బలకు చలించని ఏనుగువలె నిశ్చలుడై యుండెను. తన బాహువులతో, చాణూరుని పట్టుకొని అనేక విధములుగ త్రిప్పెను. త్రిప్పుచు.. (23)

టీ॥ సఇతి. శ్యేస స్యేవ వేగో యస్య సః చాణూరః, అబాధత అతాడయత్. ॥22,23॥

టీ॥ డేగవేగము వంటి వేగము ఎవనికో వాడు చాణూరుడు అబాధత – చఱచెను. ॥22,23॥

శ్లో॥ భూ పృష్ఠే పోథయామాస తరసా క్షీణ జీవితమ్ ।
విస్రస్తాకల్ప కేశస్రగింద్రధ్వజ ఇవా పతత్ ॥ ॥24॥

తా॥ వెంటనే క్షీణించిన జీవితముగల ఆ చాణూరుని నేలపై విసరి కొట్టెను, వాని అలంకారము, వెంట్రుకలు దండలు అన్నియు చెల్లా చెదరై ఇంద్ర ధ్వజము వలె పడిపోయెను. (24)

శ్లో॥ తథైవ ముష్టికః పూర్వం స్వముష్ట్యాభిహతేన వై ।
బలభద్రేన బలినా తలేనాభిహతో భృశమ్ ॥ ॥25॥

తా॥ అదే విధముగా ముష్టికుడు కూడా మొదట, బలరాముని తన పిడికిటి దెబ్బతో కొట్టెను. బలశాలియైన బలరాముడు అటుపైన మిక్కిలి బలముగా వానిని తన ముష్టి ఘాతమునకు గుఱి చేసెను. (25)

టీ॥ భూపృష్ఠ ఇతి భూపృష్ఠే భువః ఉపరి పోథయామాస ఆస్ఫోటయత్. ఇంద్ర ధ్వజో వజ్రం యద్వా ఇంద్రధ్వజో నామ గౌడ దేశేషు ప్రసిద్ధః. కస్మింశ్చిదుత్సవే మహాన్ స్తంభో ధ్వజపతాకాద్యలంకృతః పురుషాకృతి రుచ్ఛ్రయతే. స యథా పతతి తద్వదితి. ॥24,25॥

టీ॥ భూపృష్ఠే- భూమి యొక్క పైభాగమున, పోథయామాస నేలకు కొట్టెను. ఇంద్రధ్వజః వజ్రాయుధం లేక ఇంద్ర ధ్వజము అను పేరుతో గౌడ దేశముల యందు ప్రసిద్ధము చెందిన ఒకానొక ఉత్సవము నందు పొడవైన ఒక స్తంభము- ధ్వజము పతాకము మొదలగు వానితో అలంకరింపబడి, పురుషుని ఆకృతిగ చేసి ఎగుర వేయబడును అనగా ఆవిష్కరింపబడును. అది యెట్లు పడిపోవునో అట్లే చాణూరుని దేహము పడిపోయెను అని. ॥24,25 ॥

శ్లో॥ ప్రవేపిత స్సరుధిర ముద్వహన్ ముఖతోఽర్దితః ।
వ్యసుః పపాతోర్వ్యుపస్థే వాతా హత ఇవాంఘ్రిపః ॥ ॥26॥

తా॥ మిక్కిలిగ వణుకుచు, రక్తము క్రక్కుచు, ముఖముతో బాధను వ్యక్తముచేయుచు, ప్రాణములు కోల్పోయి తీవ్రమైన గాలికి పడిపోయిన చెట్టువలె నేలగూలెను. (26)

శ్లో॥ తతః కూటమను ప్రాప్తం రామః ప్రహరతాం వరః ।
అవధీల్లీలయా రాజన్ సావజ్ఞం వామముష్టినా ॥ ॥27॥

తా॥ రాజా! అప్పుడు కూటుడు అను మల్ల యోధుడు ముందునకు రాగా యోధులలో శ్రేష్ఠుడగు బలరాముడు లీలగా నిర్లక్ష్యముగను, వానిని తన ఎడమచేతి పిడికిలి దెబ్బతో వధించెను.॥27॥

శ్లో॥ తర్హ్యేవ హి శలః కృష్ణ పదాప హత శీర్షకః ।
ద్విధాకీర్ణస్తో సలక ఉభావపి నిపేతతుః ॥ ॥28॥

తా॥ అప్పుడే శ్రీకృష్ణుని పదా ఘాతముచేత శలుడు అను మల్లుడు తల, మొండెము వేరై హతమైయ్యెను తోసలకుడు రెండు భాగములుగ చీలిపోయెను ఇద్దరును పడిపోయిరి. ॥28॥

శ్లో॥ చాణూరే ముష్టికే కూటే శలేతో సలకే హతే ।
శేషాః ప్రదుద్రువుర్మల్లా స్సర్వే ప్రాణపరీప్సవః ॥ ॥29॥

తా॥ చాణూరుడు, ముష్టికుడు, కూటుడు, శలుడు, తోసలకుడు వధింపబడగా, మిగిలిన మల్లుఅందరును తమ ప్రాణములు కాపాడుకొను నిచ్ఛతో అచటి నుండి పరుగెత్తి పోయిరి. (29)

టీ॥ ప్రవేపిత ఇతి. ఆర్దితః పీడితః. ఉర్వ్యుపస్థే భూతలే॥26-29॥

టీ॥ అర్దితః పీడింపబడినవాడై - ఉర్వుపస్థే భూతలము నందు. ॥26-29॥

శ్లో॥ గోపాన్వయస్యా నాహూయ తైస్సంసృజ్య విజహ్రతుః ।
వాద్యమానేషు తూర్యేషు వల్గంతౌరుత నూపురౌ ॥ ॥30॥

తా॥ రామ కృష్ణులిరువురు తోటివారైన గోపాలురను పిలిచి, వారితో ఒక ఆట కల్పించుకొని, వాద్యములు మ్రోగుచుండగా, కాలి యందియలు తాళానుగుణముగ సవ్వడి చేయుచుండగా నృత్యము చేయుచు క్రీడించిరి (30)

టీ॥ గోపానితి, వల్గంతౌ నృత్యాదికుర్వంతౌ. ॥30॥

టీ॥ వల్గంతౌ - నృత్యము మొదలగునవి చేయుచు. ॥30॥

శ్లో॥ జనాః ప్రజహృషు స్సర్వే కర్మణా రామ కృష్ణయోః ।
ఋతే కంసం విప్రముఖ్యా స్సాధవ స్సాధు సాధ్వితి ॥ ॥31॥

తా॥ అచటి ప్రజలందరును రామ కృష్ణుల ఈ సంరంభమును చూచి మిక్కిలి ఆనందపడిరి. ఒక్క కంసుడు తప్ప తక్కిన వాఱందరును, సాత్వికులైన బ్రాహ్మణ ప్రముఖులును, భళీభళీ" అని హర్షధ్వానములు చేయుచు సంతసించిరి. (31)

శ్లో॥ హతేషు మల్లవర్యేషు విద్రుతేషు చ భోజరాట్ ।
న్యవారయత్స్వ తూర్యాణి వాక్యం చేదమువాచ హ ॥ ॥32॥

తా॥ మల్లయోధులందరును పరుగెత్తి పోవగా, కంసుడు తాను ఏర్పాటు చేసిన వాద్య ఘోషలను ఆపివేయించి ఈ విధముగ ప్రకటన చేసెను. (32)

శ్లో॥ నిస్సారయత దుర్వృత్తౌ వసుదేవాత్మజౌ పురాత్ ।
ధనం హరత గోపానాం నందం బధ్నీత దుర్మతిమ్ ॥ ॥33॥

తా॥ ఈ దుర్మార్గులను (కృష్ణ బలరాములను) బయటకు వెడల గొట్టుడు! ఈ వసుదేవ కుమారులను నగరము నుండి పంపివేయుడు! గోపాలకుల సొమ్మునంతయును కొల్లగొట్టుడు! దుర్మతియైన నందుని బంధింపుడు. ॥33॥

శ్లో॥ వసుదేవస్తు దుర్మేధా హన్యతా మాశ్వసత్తమః ।
ఉగ్రసేనః పితాచాపి సానుగః పరపక్షగః ॥ ॥34॥

తా॥ వసుదేవుడు కూడా దుర్బుద్ధి కలవాడు దుష్టుడు. మా తండ్రి యగు ఉగ్రసేనుడు కూడా వారిననుసరించుచు శత్రుపక్షమున నున్నాడు - అందుచే, ఈ ఇద్దఱిని శీఘ్రముగ వధింపుడు. ॥34॥

టీ॥ జనా ఇతి. సాధుసాధ్వితి వదంతః. ॥31 -34॥

టీ॥ సాధుసాధ్వితి వదంతః- బాగు బాగు అని చెప్పుచు ॥31-34॥

## కంసవధఘట్టః

శ్లో॥ ఏవం వికత్థమానే వై కంసే ప్రకుపితోఽవ్యయః ।
లఘిమ్నోత్పత్య తరసామంచముత్తుంగ మారుహత్ ॥ ॥35॥

శ్లో॥ తమాపతంతమాలోక్య మృత్యుమాత్మన ఆసనాత్ ।
మనస్వీసహసోత్థాయ జగృహే సోఽపి చర్మణీ ॥ ॥36॥

టీ॥ ఏవమితి అవ్యయః అశ్రమః లఘిమ్నా లాఘవేన. ॥35,36॥

శ్లో॥ తం ఖడ్గపాణిం విచరంతమాశు
శ్యేనం యథా దక్షిణ సవ్యమంబరే ।
సమగ్రహీద్దుర్విషహోగ్రతేజా
యథోరగం తార్క్ష్యసుతః ప్రసహ్య ॥ ॥37॥

టీ॥ తమితి, దుర్విషహ మసహ్యం ఉగ్రం. తేజో యస్య సః కృష్ణః ॥37॥

## కంస వధ ఘట్టము

తా॥ ఇట్లు బడ బడ వాగుచున్న కంసుని యెడ మిక్కిలి కోపము నొందిన కృష్ణుడు, లాఘవముతో లంఘించి, (వెంటనే) అచట చేరువలో ఎత్తైన మంచము పైకి (ప్రేక్షకాసనము పైకి) ఎక్కెను. (35)

తా॥ మృత్యురూపుడగు కృష్ణుడు తనపై పడుచుండుటను గమనించిన కంసుడు బుద్ధిగల వాడై తన ఆసనముపై నుండి సత్వరుడై లేచి తాను కూడ ఖడ్గము, కేడెము (డాలు) తీసికొనెను. ॥36॥

టీ॥ అవ్యయః శ్రమలేనివాడై లఘిమ్నా లాఘవముతో ॥35,36॥

తా॥ ఆకాశమునందు కుడికి ఎడమకు వేగముగ తిరుగు డేగవలె, ఖడ్గమును చేతబట్టుకొని అటునిటు ఉద్రేకముగ తిరుగుచున్న ఆ కంసుని దుష్టమైన విషమును గూడ హరించివేసెడి తీక్ష్ణమైన తేజస్సుగల శ్రీకృష్ణుడు, గరుత్మంతుడు బలముగా సర్పమును పట్టుకొనినట్లు పట్టుకొనెను. (37)

టీ॥ దుర్విషహః సహింపరానిది- తీక్ష్ణమైన తేజస్సు ఎవనికో ఆ కృష్ణుడు ॥37॥

శ్లో॥ ప్రగృహ్యా కేశేషు చలత్కిరీటం
నిపాత్య రంగోపరి తుంగమంచాత్ ।
తస్యోపరిష్టాత్స్వయమబ్జనాభః
పపాత విశ్వాశ్రయ ఆత్మ తంత్రః ॥38॥

తా॥ కంసుని తలవెంట్రుకల యందు పట్టుకొని, అందుచేత కదలు చున్న కిరీటము గల కంసుని, ఎత్తైన మంచముపై నుండి, మల్ల రంగముపై పడగొట్టి కృష్ణుడు స్వయముగ అతనిపై బడెను. అతడు విశ్వమంతటికిని అశ్రయమైన వాడు. సర్వతంత్ర స్వతంత్రుడు గదా!38

శ్లో॥ కంసం పరేతం విచకర్ష భూమౌ
హరిర్యథేభం జగతో విపశ్యతః ॥
హా హేతి శబ్దస్సుమహాంస్తదా భూ
దుదీరితస్సర్వ జనైర్నరేంద్ర ॥ ॥39॥

తా॥ రాజా! (కృష్ణుడు పైబడుట తోడనే కంసుడు మృతిచెందెను) మరణించిన కంసుని దేహమును జగత్తంతయు చూచుచుండగా శ్రీకృష్ణుడు నేల మీదుగా లాగెను. జనులందఱును 'హాహా' అని గొప్ప శబ్దము చేసిరి. ॥39॥

శ్లో॥ స నిత్యదోద్విగ్న ధియాతమీశ్వరం
పిబన్నదన్వా విచరన్ స్వపన్ శ్వసన్ ।
దదర్శ చక్రాయుధమగ్రతో యత
స్తదేవ రూపం దురవాపమాప ॥ ॥40॥

తా॥ కంసుడు నిరంతరమును భయోద్విగ్నుడై విహ్వలమనస్కుడై, త్రాగుచు, తినుచు, తిరుగుచు, మాటాడుచు, నిద్రించుచు, శ్వాసించు చును కూడ ఆ ఈశ్వరుని, చక్రధారియైన ఆ దేవదేవుని రూపమును చూచుచుండెను. కావున ఇతరులకు అంత సులభముగ లభింపని 'సారూప్యముక్తి' అతనికి లభించెను. ఏ రూపమును నిత్యము దర్శించు చుండెనో ఆ రూపమునే అతడు పొందెను.॥40॥

టీ॥ ప్రగృహ్యేతి. గరిష్ఠత్వాయ విశ్వాశ్రయత్వముక్తం తత్ర హేతుః. అబ్జనాభః కుతస్తస్యోపర్యేవ పపాత యతః ఆత్మతంత్రః.॥38-40॥

టీ॥ గొప్పదనము కొఱకు విశ్వాశ్రయత్వము చెప్పబడినది. కారణము కృష్ణుడు అతని పైననే పడెను. ఎందువలన? స్వతంత్రుడు కనుక ॥38 -40॥

శ్లో॥ తస్యానుజా భ్రాతరోఽష్టౌ కంకన్యగ్రోధకాదయః ।
అభ్యధావన్నితి క్రుద్ధా భ్రాతుర్నిర్వేశకారిణః ॥41॥

తా॥ కంకుడు, న్యగ్రోధుడు మొదలగు కంసుని అన్నదమ్ములు ఎనమండుగురు, మిక్కిలి కోపము నొంది తమ తోబుట్టువు యొక్క మరణమునకు ఋణము తీర్చుటకొఱకై రామ కృష్ణుల వైపునకు పరుగెత్తిరి. (41)

టీ॥ తస్యేతి. నిర్వేశో నిష్కృతిః అనృణ్యమిత్యర్థః. తత్కారిణ స్సంత స్తేఽభ్య ధావన్॥41॥

టీ॥ నిర్వేశః – నిష్కృతి– ఋణమును తీర్చుకొనుట అని యర్థము. అట్లు చేయగోరువారై ముందునకు ఉరికిరి. ॥41॥

శ్లో॥ తథాతిరభసాం స్తాంస్తు సంయతాన్ రోహిణీ సుతః ।
అహన్ పరిఘముద్యమ్య పశూనివ మృగాధిపః ॥ ॥42॥

తా॥ ఆ విధముగ మిక్కిలి వేగముతో వచ్చుచున్న వారిని, చంపుటకు ఉద్యుక్తులైన వారిని, బలరాముడు, పరిఘను (ఇనుపకట్ల గుదియను) ఎత్తి సింహము పశువులను చంపునట్లు చంపెను. (42)

శ్లో॥ నేదుర్దుందుభయో వ్యోమ్ని బ్రహేశాద్యా విభూతయః ।
పుష్పైః కిరంతస్తం ప్రీతాశ్శశంసు ర్ననృతు స్స్త్రియః ॥ ॥43॥

తా॥ ఆకాశమున దుందుభులు మ్రోగెను. పరమాత్మ యొక్క విభూతులగు బ్రహ్మ ఈశ్వరుడు మొదలగు వారు సంప్రీతులై పుష్పములను కురుపించుచు స్తోత్రములు చేసిరి. అప్సరస స్త్రీలు నాట్యముచేసిరి. (43)

శ్లో॥ తేషాం స్త్రియో మహారాజ సుహృన్మరణ దుఃఖితాః ।
తత్రాభ్యయుర్వినిఘ్నంత్యశ్శీర్షాణ్యశ్రు విలోచనాః ॥ ॥44॥

తా॥ మహారాజా! వారి యొక్క స్త్రీలు, స్నేహితులు (కంసుని ఆత్మీయులు) అతని మరణమునకు దుఃఖించుచు తలలు బాదుకొనుచు కన్నీళ్ళు కార్చుచున్న కన్నులతో అచటికి వచ్చిరి. ॥44॥

టీ॥ తథేతి. తథా తాదృక్ అతి రభసో వేగో యేషాం తాన్. సంయుక్తాన్ ఉద్యుక్తాన్. ॥42 - 44॥

టీ॥ తథా - అట్టి - అతిరభసః- మిక్కిలి వేగము ఎవరికో వారిని - సంయతాన్ - సిద్ధపడి యున్నవారిని. ॥42 - 44॥

శ్లో॥ శయానాన్ వీర్య శయ్యాయాం పతీనాలింగ్య శోచతీః ।
విలేపుస్సు స్వరం నార్యో విసృజంతో ముహుశ్శుచః ॥ ॥45॥

తా॥ స్త్రీలు వీరశయ్యల యందు పరుండి యున్న తమ తమ భర్తలను ఆలింగము చేసికొనుచు ఏడ్చుచు మాటి మాటికి విలపించుచు ఉచ్చై స్వరమున శోకించుచు మఱల మఱల కన్నీరు కార్చుచుండిరి. (45)

టీ॥ శయానానితి. శోచంత్యో విలాపాంశ్చక్రుః శుచః అశ్రూణి॥45॥

టీ॥ శోచంత్యః - విలాపములు చేసిరి. శుచః- కన్నీరు. ॥45॥

శ్లో॥ హా నాథ ప్రియ ధర్మజ్ఞ కరుణానాథ వత్సల ।
త్వయా హతేన నిహతా వయం తే సగృహ ప్రజాః ॥ ॥46॥

తా॥ హా నాథా! ఓ ప్రియా! ధర్మజ్ఞా! దయామయా వాత్సల్యము గలవాడా నీవు చంపబడుటతో మేమును చంపబడితిమి. మేము గృహముతో కూడ పిల్లలతో కూడ నిహతులమైతిమి. (46)

టీ॥ హానాథేతి. ధర్మజ్ఞేత్యాదీని విలాపే ప్రేమ సంబోధనాని. ॥46॥

టీ॥ ధర్మజ్ఞా అను మొదలగునవి దుఃఖము నందలి ప్రేమ సంబోధనములు. ॥46॥

శ్లో॥ త్వయా విరహితా పత్యా పురీయం పురుషర్షభ ।
న శోభతే వయమివ నివృత్తోత్సవ మంగళా ॥ ॥47॥

తా॥ ఓ పురుష శ్రేష్ఠా! పతివైన నీవు లేక ఈ మధురానగరము సమస్త శుభములను కోల్పోయి మా వలెనే శోభారహితమై పోవును. (47)

టీ॥ త్వయేతి. త్వదీయా వయమితి త్వయా పత్యా విరహితా పురీయం న శోభత ఇతి స్వదృష్ట్యాభిధానం. ॥47॥

టీ॥ నీకు సంబంధించిన మావలె, పతివైన నీవు లేకుండుట వలన ఈ పట్టణము శోభింపదు, అని తమ దృష్టితో పేర్కొనుట. ॥47॥

శ్లో॥ అనాగసాం త్వం భూతానాం కృతవాన్ ద్రోహముల్బణమ్ ।
తేనేమాం భో దశాం నీతో భూతధ్రుక్కో లభేత శమ్ ॥ ॥48॥

తా॥ స్వామీ! నిరపరాధులైన ప్రాణులకు నీవు గొప్ప ద్రోహము చేసితివి. అందుచేతనే నీకు ఈ గతి కలిగినది. ప్రాణులకు ద్రోహము చేయు వానికి ఎవనికి సుఖము లభించును? (48)

టీ॥ అనాగసామితి. అనాగసామితి తు పరమార్థాభిధానం. ॥48॥

టీ॥ 'అనాగసాం' అని పరమార్థమును పేర్కొనుట. ॥48॥

శ్లో॥ సర్వేషామేవ భూతానామేష హి ప్రభవాప్యయః ।
గోప్తా చ తదవధ్యాయీ న క్వచిత్సుఖమేధతే ॥ ॥49॥

తా॥ పరమాత్ముడైన ఈకృష్ణుడు సమస్త భూతముల యొక్క ఉత్పత్తి ప్రళయములకు ఆశ్రయుడైయున్నాడు. రక్షించుచుండువాడును, ఆతడే కావున అతనిని అవజ్ఞ చేయువాడెప్పుడును సుఖమును పొందజాలడు. (49)

**శ్రీశుక ఉవాచ:**

శ్లో॥ రాజ యోషిత ఆశ్వాస్య భగవాన్భూతభావనః ।
యామాహుర్లౌకికీం సంస్థాం హతానాం సమకారయత్ ॥ ॥50॥

తా॥ భూతభావనుడగు భగవానుడు రాజ స్త్రీలను ఓదార్చి, చనిపోయిన వారికి చేయబడు 'లౌకికసంస్థ' యనబడు కర్మాదికములను చేయించెను. (లౌకికసంస్థ- లోకాచారము) ॥50॥

టీ॥ సర్వేషామితి. ఏష కృష్ణః ప్రభవంత్యస్మాదితి ప్రభవః. అపియంతి లీయంతేఽస్మిన్నిత్యప్యయః స చ స చ తస్య అవధ్యానం అవజ్ఞానం కర్తుం శీలం యస్య సః. ॥49,50॥

టీ॥ ఈ కృష్ణుడు - ఇతని నుండి ప్రభవింతురు కావున ప్రభవః అపియంతి - ఇతని యందు లీనమగుదురు కావున, అప్యయః ఆయా వ్యక్తులు అతని అవధ్వానం అవజ్ఞానము చేయు స్వభావము గలవాడు "అవధ్యాయి". ॥49-50॥

శ్లో॥ మాతరం పితరం చైవ మోచయిత్వాథ బంధనాత్ ।
కృష్ణ రామౌ వవందాతే శిరసా స్పృశ్య పాదయోః ॥ ॥51॥

తా॥ కృష్ణ బలరాములు, తమ తల్లిదండ్రులైన దేవకీ వసుదేవులను బంధనముల నుండి విడిపించి, శిరస్సు వంచి పాదముల నంటి నమస్కారము చేసిరి. (51)

టీ॥ మాతరమితి. ఆస్పృశ్య ఈషత్ స్పృష్టా. ॥51॥

టీ॥ ఆస్పృశ్య – కొంచెముగ తాకి – (అంతటను స్పృశించి) ॥51॥

శ్లో॥ దేవకీ వసుదేవశ్చ విజ్ఞాయ జగదీశ్వరౌ ।
కృతసంవందనౌ పుత్రౌ సస్వజాతే న శంకితౌ ॥ ॥ 52॥

తా॥ దేవకీ వసుదేవులు తమకు వందన మాచరించిన వారిరువురు జగదీశ్వరులని తెలిసికొని, వారు పుత్రులని భావించుటకు శంకించి వారిని హృదయమునకు హత్తుకొనలేక పోయిరి. (52)

టీ॥ దేవకీతి. పుత్రభ్రాంతిం విహాయ జగదీశ్వరావితి జ్ఞాత్వా. శంకితౌ సంతౌ నసస్వజాతే నాలింగిత వంతౌ కింతు బద్ధాంజలీ తస్థతురిత్యర్థః ॥52॥

టీ॥ పుత్ర భ్రాంతిని వదిలి జగదీశ్వరులని తెలిసికొని –శంకించుచు ఆలింగనము చేసికొనకుండిరి. కాని అంజలి ఘటించి యుండిరి అని అర్థము. ॥52॥

టీ॥ శ్లో "ప్రసహ్య హత్వా హస్తీంద్రం మల్లేంద్రాన్ మల్లలీలయా భీభత్సచరితం కంసం స భీభత్సమమారయత్, శ్రీధరీయోఽయంశ్లోకః

"కువలయాపీడుడు అను గజశ్రేష్ఠమును చంపి మల్లలీలతో మల్ల యోధులను సంహరించి, భీభత్సమైన చరిత్రగల కంసుని భీభత్సముగనే వధించెను". (శ్రీధరీయ శ్లోకమునకు ఇది తాత్పర్యము)

**శ్రీ మద్భాగవతే, మహాపురాణే దశమస్కంధే,**
**చతుశ్చత్వారింశోఽధ్యాయః**

**అని శ్రీమద్భాగవతమున దశమస్కంధమందు**
**నలుబది నాలుగవ అధ్యాయము సమాప్తము.**

## పంచచత్వారింశోఽధ్యాయః

### శ్రీ శుక ఉవాచ:

శ్లో॥ పితరావుపలబ్ధార్థౌ విదిత్వా పురుషోత్తమః ।
మాభూదితి నిజాం మాయాం తతాన జనమోహినీమ్ ॥ ॥1॥

## నలుబది ఐదవ అధ్యాయము

### శ్రీశుకుడు ఇట్లు పలికెను

తా॥ తల్లిదండ్రులగు దేవకీ వసుదేవులు, తనను ఈశ్వరుడుగా గుర్తించుట యను అర్థమును పొందినవారు. అను విషయమును తెలిసికొని కృష్ణుడు 'అప్పుడే వారు అట్లు తెలిసికొన కుందురు గాక' అని జనములను సమ్మోహనము చేయు తన మాయను వ్యాపింప జేసెను. (తన లీలకు పోషకముగ స్వజనులను మోహితులనుగా నుంచుటయే దీని ప్రయోజనము) (1)

టీ॥ శ్లో"పంచచత్వారింశకేఽథ పితౄనందాదిస్వాంతనమ్,ఉగ్రసేనాభిషేకశ్చ గురౌ వాసాత్పురాగమః" పితరావితి. ఉపలబ్ధార్థౌ విదిత్వేతి – అయమర్థః ఉప సమీపే ఆవయోః పుత్రబుధ్యా సాంసారిక పరమసుఖభోగాత్పూర్వమేవ లబ్ధార్థౌ లబ్ధః. ఆవామీశ్వరావితి ప్రాప్తః పరమజ్ఞానరూపః. అర్థః యాభ్యాం తథా తౌ తౌ జ్ఞాత్వా మయి ప్రసన్నే సత్యనయోర్జ్ఞానం నామ కిం దుర్లభం స్యాత్. దుర్లభం తు మయి పుత్రప్రేమ అత ఇదానీమేవ తత్త్వజ్ఞానం మాభూదితి నిజాం స్వాధీనాం మాయాం తయోః ప్రసారితవానితి. ॥1॥

టీ॥ ఈ నలుబదిఐదవ అధ్యాయమున నందుడు మొదలగు వారిని కృష్ణుడు సాంత్వనపూర్వకముగ వ్రజమునకు పంపుట, ఉగ్రసేనుని పట్టాభిషేకము, గురుకులవాసము నుండి కృష్ణబలరాముల మధురా పురాగమనము వర్ణింపబడినవి. 'ఉపలబ్ధార్థౌవిదిత్వా' అను మాటకు అర్థమిది; ఉప– సమీపమున– మాయందలి పుత్రబుద్ధి చేత సాంసారికమైన పరమ సుఖభోగముల ననుభవించుటకు ముందే పరమ ప్రయోజనమును పొందిన వారైరి. లబ్ధార్థౌ– మేము ఈశ్వరులము అని తెలిసి కొనుట పరమ జ్ఞానరూపము– అది పొందిన ప్రయోజనము ఎవరి చేతనో– వారిరువురు (తల్లిదండ్రులు) ఆ విధముగ వారు తెలిసికొని –నేను ప్రసన్నుడను కాగా ఇక వీరి జ్ఞానమునకు

దుర్లభమైన దేమి కలదు? నాయందు వారికి ఉండవలసిన పుత్రప్రేమ' మాత్రము దుర్లభమగును. అందువలన ఇప్పుడే వీరికి తత్వజ్ఞానము కలుగరాదు. అని - నిజాం- తన అధీనముననున్న -మాయను వారి యందు ప్రసరింపజేసెను అని. ॥1॥

శ్లో॥ ఉవాచ పితరావేత్య సాగ్రజస్సాత్త్వతర్షభః ।
ప్రశ్రయావనతః ప్రీణన్నంబ తాతేతి సాదరమ్ ॥ ॥2॥

తా॥ యదువంశ శ్రేష్ఠుడగు కృష్ణుడు తన అన్నతో కలిసి తమ తల్లిదండ్రుల వద్దకు పోయి వినయపూర్వకముగ, అవనతుడై, ఆదరముతో వారిని సంతోషింప జేయుచు “అమ్మా నాన్నా” అని సంబోధించి యిట్లనెను. (2)

టీ॥ తదేవ దర్శయత్యష్టభిః ఉవాచేతి. ప్రీణన్ ప్రీణయన్ సాదరం అబ్రవీత్. ॥2॥

టీ॥ దానినే ఎనిమిది శ్లోకములతో చూపుచున్నాడు. ప్రీణన్-ప్రీతి కలిగించుచు - ఆదరముతో ఇట్లనెను. ॥2॥

శ్లో॥ నాస్మత్తో యువయోస్తాత నిత్యోత్కంఠితయోరపి ।
బాల్య పౌగండకైశోరాః పుత్రాభ్యామభవన్ క్వచిత్ ॥ ॥3॥

తా॥ నాయనా! మీ పుత్రులమైన మా కొఱకు నిరంతరమును ఆసక్తులై యుండినప్పటికిని మా బాల్యము పౌగండము కిశోర వయస్సు లందు మా ప్రేమ సుఖమును మీరు పొందలేక పోయితిరి. (3)

టీ॥ నేతి అస్మత్తః అస్మన్నిమిత్తం నిత్యముత్కంఠితయోరపి యువయోః పుత్రాభ్యాం కృత్వా బాల్యపౌగండకైశోరాః తత్తదవస్థానుభవ సుఖానీత్యర్థః యువయోర్నాభవన్నితి. అస్మత్తః పుత్రాభ్యామితి సామానాధికరణ్యం వా. ॥3॥

టీ॥ మా నిమిత్తముగ నిత్యము ఉత్కంఠితులై యున్నప్పటికిని మీకు పుత్రులనుండి -పుత్రులకు సంబంధించి, బాల్య పౌగండ కిశోరమందు, ఆయా అవస్థలననుభవించు సుఖము మీకు కలుగకుండినది. అస్మత్తః పుత్రాభ్యాం అని (మా పుత్రుల వలన) అని సమానాధికరణము కూడ

శ్లో॥ న లబ్ధో దైవహతయోర్వాసో నౌ భవదంతికే ।
యాం బాలాః పితృ గేహేస్థాః విందంతే లాలితా ముదమ్ ॥4॥

టీ॥ కించ ఆవామేవ దైవహీనావిత్యాహ నేతి. పితృ గేహస్థాః యాం ముదం విందంతే సా చ న లబ్ధేతి. ॥4॥

శ్లో॥ సర్వార్థ సంభవో దేహో జనితః పోషితో యతః ।
న తయోర్యాతి నిర్వేశం పిత్రోర్మర్త్యశ్శతాయుషా ॥ ॥5॥

టీ॥ ఏవం తావత్ శ్లోక ద్వయేన యువయోరావయోశ్చ కామహానిర్జాతేత్యుక్తం ఆవయోః పునర్యుష్మత్పరిచర్యాలోపేన ధర్మహానిరపి జాతేత్యాహ సర్వేతి. సర్వేషాం ధర్మాద్యర్థానాం సంభవో యస్మిన్ స దేహః. యతః యాభ్యాం జనితః పోషితశ్చతయోః పిత్రోః నిర్వేశమానృణ్యమిత్యర్థః. మర్త్యః శతసంవత్సర మాత్రేణాయుషా న ప్రాప్నోతి. ॥5॥

చెప్పవచ్చును. (బాల్యము 8ఏండ్లలోపు - పౌగండము-10ఏండ్లలోపు- కిశోరుడు 15 ఏండ్లలోపు) ॥3॥

తా॥ తండ్రి ఇంటనున్న బాలురు ఏ లాలనా పూర్వకమైన సంతోషమును పొందుదురో అట్టి (మీ ఇంటనుండెడి) ఆనందము దురదృష్టవశులమైన మాకు లభింపలేదు. (4)

టీ॥ మరియు మాకే , అదృష్టహీనులమైన మమ్మే' అనిచెప్పుచున్నాడు తండ్రి ఇంటనున్న బాలురు ఏ సంతోషమును పొందుదురో అది మాకు లభింపలేదు అని. ॥4॥

తా॥ ధర్మము మొదలగు పురుషార్థములు లభింపజేయునది దేహము. అట్టి దేహము ప్రభవించినదియు, పోషింపబడినదియు, తల్లిదండ్రుల చేతనే, మనుష్యుని నూరు సంవత్సరముల ఆయుర్దాయము నందైనను తల్లిదండ్రుల ఋణము తీరదు. (5)

టీ॥ ఈ విధముగ ఇంతవరకు రెండు శ్లోకములతో మీ యొక్కయు మా యొక్కయు ఆకాంక్షలు నష్టమైనవి అని చెప్పబడినది. ఇక మాకు (మఱల) మీ యొక్క సేవాలోపము చేత ధర్మహాని కూడ సంభవించినది. అని చెప్పుచున్నాడు. ధర్మము మొదలైన సమస్తమైన పురుషార్థముల సంభవము దేనియందో అది దేహము అని. యతః ఎవరి చేత

పోషింపబడినదో అట్టి తల్లిదండ్రులకు నిర్వేశం, ఋణవిముక్తి అనియర్థము. మనుష్యుడు నూరేండ్ల ఆయువుచేత కూడ పొందనేరడు. (ఋణము తీర్చుకొనజాలడు) ॥5॥

శ్లో॥ యస్తయోరాత్మజః కల్యః ఆత్మనా చ ధనేన చ ।
వృత్తిం న దద్యాత్తం ప్రేత్య స్వమాంసం ఖాదయంతి హి॥ ॥6॥

తా॥ ఏ తల్లిదండ్రుల కుమారుడు, సమర్థుడైయుండియు, తన దేహముచేతను, ధనముచేతను వారికి జీవికను ఈయడో అతని చేత పరలోకమున స్వమాంసమును తినిపింతురు. (యమదూతలు) (6)

టీ॥ య ఇతి. తన్మధ్యే పితుర్యః పుత్రః కల్యః సమర్థస్సన్నపి. దేహేన ధనేన చ పిత్రోర్వృత్తిం జీవికాం న సంపాదయేత్ తం ప్రేత్య లోకాంతరే యమదూతాః స్వస్యైవ మాంసం ఖాదయంతి హి శ్వమాంసమితి వా. ॥6॥

టీ॥ వారి మధ్యన ఏ తల్లిదండ్రుల పుత్రుడు కల్యః-సమర్థుడైనప్పటికి దేహముచేతను, ధనముచేతను, వారికి జీవికను సంపాదింపడో అతనిని ప్రేత్య - లోకాంతరమున యమదూతలు తనదే అయిన మాంసమును తినిపించెదరు. శ్వమాంసమితివా, లేక కుక్క మాంసమును అనియు ॥6॥

శ్లో॥ మాతరం పితరం వృద్ధం భార్యాం సాధ్వీం సుతం శిశుమ్ ।
గురూన్ విప్రం ప్రపన్నం చ కల్యోఽబిభ్రచ్ఛ్వసన్మృతః ॥ ॥7॥

తా॥ తల్లిని, తండ్రిని, వృద్ధుని, సాధ్వియైన భార్యను శిశువైన కుమారుని, గురువులను, బ్రాహ్మణుని శరణుకోరిన వారిని, సమర్థుడైయుండియు ఎవడు భరింపడో వాడు శ్వాశించుచును మృతిచెందిన వాడే. (7)

టీ॥ కించ. మాత్రాది శుశ్రూషామకుర్వన్ విఫలజీవితశ్చ భవతీత్యాహ – మాతరమితి. అబిభ్రత్ అపుష్ణన్ శ్వసన్నపి మృతతుల్య ఏవేత్యర్థః ॥7॥

టీ॥ మఱియు తల్లి మొదలగు వారి సేవ చేయక విఫలమైన జీవితము గలవాడగునని చెప్పుచున్నాడు అభిభ్రత్, పోషింపక శ్వసన్నపి – శ్వాసించుచును, చచ్చిన వానితో సమానమైన వాడని అర్థము.॥7॥

శ్లో॥ తన్నావకల్యయోః కంసాన్నిత్య ముద్విగ్న చేతసోః ।
మోఘమేతే వ్యతిక్రాంతా దివసా వామనర్చతోః ॥ ॥8॥

తా॥ అందువలన, నిత్యమును కంసుని వలన ఉద్విగ్నమైన మనస్సు గలవారమై మిమ్ము సేవింప జాలక పోవుట చేత అసమర్థులమైన మా దివములు వ్యర్థముగ గడిచినవి. (8)

టీ॥ తదితి. తత్తస్మాన్నౌ ఆవయోః. మోఘం వ్యర్థం అనర్చతోః.॥8॥

టీ॥ నౌ – మా యొక్క, మోఘము, వ్యర్థము, అనర్చతోః – సేవింపని మా ఇరువురి యొక్క. ॥8॥

శ్లో॥ తత్ క్షంతు మర్హథ స్తాత మాతర్నౌ పరతంత్రయోః ।
అకుర్వతోర్వాం శుశ్రూషాం క్లిష్టయోర్దుర్హృదా భృశమ్ ॥ ॥9॥

తా॥ తండ్రి! అమ్మా! మీరిరువురు మమ్ము క్షమింపుడు, దుర్మార్గుడైన కంసుని చేత మిక్కిలి బాధనొందియున్న మీకు, పరతంత్రులమైయున్న మేము సేవ చేయజాలకపోయినందుకు మమ్ము మన్నింపుడు. (9)

శ్లో॥ ఇత్థ మ్మాయా మనుష్యస్య హరే ర్విశ్వాత్మనో గిరా ।
మోహితా వంకమారోప్య పరిషజ్యాపతు ర్ముదమ్ ॥ ॥10॥

తా॥ ఇట్లు మాయా మానుష విగ్రహుడు, విశ్వాత్ముడును అయిన కృష్ణుని మాట చేత దేవకీ వసుదేవులిరువురును మోహితులై అతనిని వొడిలో కూర్చుండ బెట్టుకొని, కౌగలించుకొని మిక్కిలి ఆనందించిరి. (10)

శ్లో॥ సించంతావశ్రుధారాభిస్స్నేహ పాశేన చావృతౌ ।
న కించిదూచతూ రాజన్బాష్పకంఠౌ విమోహితౌ ॥ ॥11॥

తా॥ రాజా! దేవకీవసుదేవులు మిక్కిలి మోహితులై 'ఖిన్నకంఠులై' ప్రేమపాశమున బంధింపబడి కృష్ణుని కన్నీళ్ళతో తడుపుచు ఏమియు మాట్లాడక మౌనము వహించి యుండిరి. (11)

టీ॥ తదితి. దుర్హృదా కంసేన ॥9 -11॥

టీ॥ దుర్హృదా- దుష్టహృదయముగల కంసుని చేత. ॥9 -11॥

శ్లో॥ ఏవమాశ్వాస్య పితరౌ భగవాన్ దేవకీ సుతః ।
మాతామహంతూగ్రసేనం యదూనామకరోత్పతిమ్ ॥ ॥12॥

తా॥ ఈ విధముగ కృష్ణభగవానుడు తల్లిదండ్రులను ఓదార్చి, దేవకీ కుమారుడైన కృష్ణుడు, దేవకి తండ్రియగు, తన తాత ఉగ్రసేనుని యదువంశీయులకు రాజుగ చేసెను. (12)

టీ॥ ఏవమితి. ఆశ్వాస్య సాంత్వయిత్వా. ॥12॥

టీ॥ ఆశ్వాస్య, స్వాంతన పరచి, ఓదార్చి. ॥12॥

శ్లో॥ ఆహ చాస్మాన్మహారాజ ప్రజాస్త్వాజ్ఞప్తు మర్హసి ।
యయాతిశాపాద్య దుభిర్నాసితవ్యం నృపాసనే ॥ ॥13॥

తా॥ ఉగ్రసేన మహారాజా! ప్రజలమైన మమ్ము ఆజ్ఞాపించుటకు తాము తగియున్నారు. యయాతి శాపము వలన యదువులు సింహాసనము నధిరోహించుటకు అర్హులు కారు. (ఐనను మీకు దోష మంటదు) (13)

టీ॥ ఆహేతి. త్వమేవాజ్ఞాపయేతి మావదేత్యాహ - యయాతి శాపాదితి. తవ తు యాదవత్వేఽపి మదాజ్ఞయా న దోష ఇతి భావః ॥13॥

టీ॥ 'నీవే ఆజ్ఞాపింపుము' అనవలదు అని చెప్పుచున్నాడు. నీకు యాదవత్వమున్నను నా ఆజ్ఞచేత దోషమేమియు కలుగదు. అని భావము. ॥13॥

శ్లో॥ మయి భృత్య ఉపాసీనే భవతో విబుధాదయః ।
బలిం హరంత్యవనతాః కిముతాన్యే నరాధిపాః ॥ ॥14॥

తా॥ నేను సేవకుడనై నీ వద్ద కూర్చొని యుండగా, దేవతలు మొదలగు వారందరును, శిరస్సు వంచి వినయముగ కానుకలు సమర్పింతురు. ఇక ఇతర రాజుల సంగతి చెప్పనేల? (14)

శ్లో॥ ఇత్యుక్త్వాహూయ పవన ముగ్రసేనాయ భూభుజే ।
సుధర్మాఖ్యాం సభాం శక్రాదాహరేత్యాహ కేశవః ॥ ॥15॥

తా॥ అని చెప్పి భూమి వంటి మూఁపులు గల వాయుదేవుని, ఉగ్రసేనుని కొఱకు ఆహ్వానించి కృష్ణుడు "సుధర్మ" అను పేరుగల సభను ఇంద్రుని నుండి హరించి తీసికొనిరమ్ము, అని ఆజ్ఞాపించెను. (15)

శ్లో॥ మారుతశ్చ తథాహేంద్రం వాసుదేవస్య శాసనాత్ ।
ప్రాయచ్ఛద్దేవరాజోఽపి సభాం కృష్ణానుభావవిత్ ॥ ॥16॥

తా॥ వాయుదేవుడు కూడ ఇంద్రునకా విషయము నెఱిగింపగా, కృష్ణుని ప్రభావమును తెలిసిన ఇంద్రుడు కూడ సుధర్మయను ఆ సభను కృష్ణుని శాసనము వలన వాయువునకు ఇచ్చెను. (16)

టీ॥ మమ తాదృశీ శక్తిర్నాస్తీతిచేత్తత్రాహ మయీతి. మత్ప్రసాదేన సర్వం భవిష్యతీత్యర్థః. ॥14-16॥

టీ॥ నాకు ఆ విధమైన శక్తిలేదు అనినచో చెప్పుచున్నాడు. నా అనుగ్రహముచే అంతయును జరుగును అని యర్థము. ॥14 -16॥

శ్లో॥ సర్వాన్ స్వజ్ఞాతి సంబంధాన్ దిగ్భ్యః కంస భయాద్గతాన్ ।
యదు వృష్ణ్యంధక మధు దాశార్హ కుకురార్యకాన్ ॥ ॥17॥

శ్లో॥ సభాజితాన్ సమాశ్వాస్య విదేశావాస కర్శితాన్ ।
న్యవాసయత్స్వ గేహేషు విత్తైస్సంతర్ప్య విశ్వదృక్ ॥ ॥18॥

తా॥ కంసుని భయము వలన వేర్వేరు ప్రదేశములకు వెడలిపోయిన తన సంబంధులను యదు, వృష్ణి, అంధక, మధు, దాశార్హ, కుకుర, ఆర్యక శాఖల వారిని పిలిపించి కృష్ణుడు, విదేశ నివాసము వలన బాధ పడియున్న వారందరిని సత్కరించి, ఓదార్చి, సంపదలనిచ్చి సంతృప్తి పరచి వారిని తమ తమ ఇండ్లలో నివసింపజేసెను. (17,18)

టీ॥ సర్వానితి. స్వాన్ జ్ఞాతీన్ సంబంధినశ్చ దిగ్భ్యః ఆనాయ్యేతి. ॥17,18॥

శ్లో॥ కృష్ణ సంకర్షణ భుజైర్గుప్తాలబ్ధ మనోరథాః ।
గృహేషు రేమిరే సిద్ధాః కృష్ణ రామ గత జ్వరాః ॥ ॥19 ॥

టీ॥ కృష్ణేతి. సిద్ధాః పూర్ణాః కృష్ణరామాభ్యాం గతో నివృత్తో జ్వరస్తాపో యేషాంతే. ॥19॥

శ్లో॥ వీక్ష్యంతోఽహరహః ప్రీతా ముకుంద వదనాంబుజమ్ ।
నిత్యం ప్రముదితం శ్రీమత్స దయ స్మిత వీక్షణమ్ ॥ ॥20॥

టీ॥ వీక్షంత ఇతి. సదయస్మితం వీక్షనం యస్మిన్ తత్. ॥20॥

శ్లో॥ తత్ర ప్రవయసోఽప్యాసన్ యువానోఽతి బలౌజసః ।
పిబంతోఽక్షైర్ముకుందస్య ముఖాంభోజ సుధాం ముహుః ।21।

టీ॥ తనకు సంబంధించిన బంధువులను వేర్వేరు దిక్కుల నుండి రావించి. ॥17-18॥

తా॥ కృష్ణ బలరాముల భుజముల చేత రక్షింపబడినవారై వారు కోరికలన్నియు పొందినవారైరి, పూర్ణులై కృష్ణ బలరాములచే తాపమును పోగొట్టుకొని తమ తమ ఇండ్లలో ఆనందముగ నివసించుచుండిరి(19)

టీ॥ సిద్ధాః- పూర్ణులు- కృష్ణరాములచేత, గతః- నివృత్తమైన జ్వరః - తాపము ఎవరికో వారు. ॥19॥

తా॥ ప్రతిదినము శ్రీకృష్ణుని ముఖపద్మమును చూచుచు ప్రీతులగుచుండిరి. నిత్యమును సంతోష శోభతోనిండి దయతో కూడిన చిరునవ్వు చూపుగల కృష్ణ దర్శనముతో వారు తృప్తులగుచుండిరి. (20)

టీ॥ దయతో కూడిన చిరునవ్వు, చూపు దేని యందో అట్టి కృష్ణుని ముఖము. ॥20॥

తా॥ అచట మధురానగరమున వయోవృద్ధులు, యువకులును మంచి బలశాలురుగ, ఉత్సాహవంతులుగ నుండిరి వారు తమ తమ రెండు కండ్లతోనూ కృష్ణుని ముఖపద్మము నుండి ప్రకటమగు అమృతమును మరల మరల గ్రోలుచుండిరి. (21)

శ్రీశుక ఉవాచ:

శ్లో॥ అథ నందం సమాసాద్య భగవాన్ దేవకీ సుతః ।
సంకర్షణశ్చ రాజేంద్ర పరిష్వజ్యేద మూచతుః ॥ ॥22॥

శ్రీశుకుడు చెప్పుచున్నాడు:

తా॥ ఓ రాజేంద్రా! అటు పిమ్మట దేవకీ సుతుడైన కృష్ణభగవానుడు, బలరాముడును, నందుని సమీపించి ఆతనిని ఆలింగనము చేసుకొని ఇట్లనిరి. (22)

టీ॥ తత్రేతి. ప్రవయసోవృద్ధా అపి అతిశయితం బలమోజశ్చ యేషాం తే. ॥21,22॥

టీ॥ ప్రవయసః, వృద్ధులు కూడా, అతిశయించిన బలము, ఓజస్సు ఎవరి యందో వారు. ॥21,21 ॥

శ్లో॥ పితుర్యువాభ్యాం స్నిగ్ధాభ్యాం పోషితౌ లాలితౌ భృశమ్ ।
పిత్రోరభ్యధికా ప్రీతిరాత్మజేష్వాత్మనోఽపి హి ॥ ॥23॥

తా॥ తండ్రీ! ప్రేమాస్పదులైన మీ ఇరువురిచేత మిక్కిలి గారాబముతో పోషింపబడితిమి. తమ తల్లిదండ్రుల మీది కంటెను తమ దేహముల మీది కంటెను (తమ మీది కంటెను) కొడుకు మీది ప్రేమ అధిక తరమైనది గదా!. (23)

టీ॥ పితరితి. భృశం ఆత్మనోఽప్యాధిక్యేనపోషితౌ. న చాశ్చర్య మేతదిత్యాహ పిత్రోః ఆత్మనో దేహాదప్యాత్మజేషు అభ్యధికా హి ప్రీతిరితి.॥23॥

టీ॥ భృశం, తమ మీది కంటెను కూడ అధికతరమైన ప్రేమతో మా ఇరువురిని పోషించితిరి. ఇది ఆశ్చర్యమును కాదని చెప్పుచున్నాడు. తల్లిదండ్రుల కంటె, ఆత్మనః తమ దేహమునందు కంటె అధికతరమైన ప్రీతి, అని. ॥23॥

శ్లో॥ స పితా సాపి జననీ యౌ పుష్ణీత స్వపుత్రవత్ ।
శిశూన్ బన్ధుభిరుత్సృష్టా నకల్పైః పోషరక్షణే ॥ ॥24॥

తా॥ పోషించుటయందును, రక్షించుటయందును అసమర్థులైన తల్లిదండ్రుల చేతను, బంధువుల చేతను విడిచిపెట్టబడిన శిశువులను ఏ ఇరువురు పోషించిరో వారిలో అతడే తండ్రి, ఆమెయే తల్లి. (24)

శ్లో॥ యాత యూయం వ్రజం తాత వయం చ స్నేహ దుఃఖితాన్ ।
జ్ఞాతీన్ వో ద్రష్టుమేష్యామో విధాయ సుహృదాం సుఖమ్॥25॥

తా॥ తండ్రీ! ఇక మీరు వ్రజమునకు పొండు! మేము మాయందత్యంతమైన ప్రేమ గలిగి , మా ఎడబాటు వలన దుఃఖితులగు వ్రజవాసులను, బంధువులను చూచుటకు తరువాత వచ్చెదము. ఇచటి మా స్నేహితులకు సుఖమునేర్పరచి వత్తుము. ॥25॥

టీ॥ దేవకీ వసుదేవయోః పుత్రౌ యువాం నాస్మత్పుత్రావితి న వాచ్యమిత్యాహ స పితేతి. ॥24,25॥

టీ॥ మీరు దేవకీ వసుదేవుల పుత్రులు – మా పుత్రులు కారు అని చెప్పవలదు. అని చెప్పుచున్నాడు. ॥24,25॥

శ్లో॥ ఏవం సాంత్వయ్య భగవాన్నందం స వ్రజమచ్యుతః ।
వాసోఽలంకారకుప్యాద్యై రర్హయామాస సాదరమ్ ॥ ॥26॥

తా॥ భగవానుడగు శ్రీకృష్ణుడు, వ్రజవాసులందరితో సహా నందుని ఓదార్చి, వారికి వస్త్రములు, అలంకారములు, రాగి, కంచు, మొదలగు పాత్రలు ఇచ్చి, వారిని సాదరముగ పూజించెను. (26)

శ్లో॥ ఇత్యుక్తస్తౌ పరిష్వజ్య నందః ప్రణయ విహ్వలః ।
పూరయన్నశ్రుభిర్నేత్రే సహగోపైర్వ్రజం యయౌ ॥ ॥27॥

తా॥ కృష్ణుడిట్లు చెప్పిన పిదప బలరామ కృష్ణులిరువురును వారిని ఆలింగనము చేసికొనిరి. నందుడు, వారియందలి ప్రేమాతిశయమును పట్టజాలక ఉద్విగ్నుడై, కన్నులలో నీరునింపుకొనుచు గోపాలురతో కూడి వ్రజమునకు బోయెను. ॥27॥

టీ॥ ఏవమితి. సవ్రజం వ్రజవాభిస్సహితం కుప్యాని స్వర్ణరజతాతి రక్తకాంస్య పాత్రాదీని. తత్ప్రభృతిభిః. ॥26,27॥

టీ॥ స వ్రజం– వ్రజవాసులతో కూడ, కుప్యాని– బంగారు, వెండి, కాక తక్కిన లోహముల పాత్రలు మొదలగునవి. ॥26,27॥

శ్రీకృష్ణరామయోః ఉపనయన వేద శాస్త్రాధ్యయన గురు పుత్రానయనాది కథా ప్రారంభఘట్టః

శ్లో॥ అథ శూరసుతో రాజన్ పుత్రయోస్సాధ్వకారయత్ ।
పురోధాస బ్రాహ్మణైశ్చ యథావద్ద్విజ సంస్కృతిమ్ ॥ ॥28॥

టీ॥ అథేతి. పురోధసా గర్గాచార్యేణ ద్విజ సంస్కృతిం ఉపనయనం. ॥28॥

శ్లో॥ తేభ్యోఽదాద్దక్షిణా గావో రుక్మమాలా స్స్వలంకృతాః ।
స్వలంకృతేభ్య స్సంపూజ్య సవత్సాః క్షౌమ మాలినీః ॥ ॥29॥

టీ॥ తేభ్యః గావో గాః రుక్మస్య మాలా విద్యంతే యాసాం తాః క్షౌమ వస్త్ర మాలావతీః. ॥29॥

శ్లో॥ యాః కృష్ణరామ జన్మర్క్షేమనో దత్తా మహాద్యుతిః ।
తాశ్చాదదా వనుస్మృత్య కంసేనాధర్మతో హృతాః ॥ ॥30॥

శ్రీకృష్ణ బలరాముల ఉపనయన - వేద శాస్త్ర అధ్యయనము మొదలుగాగల కథా ప్రారంభ ఘట్టము:

తా॥ రాజా! పిమ్మట వసుదేవుడు పురోహితుడైన గర్గాచార్యులను, బ్రాహ్మణులను రావించి వారిచేత తన పుత్రులైన బలరామకృష్ణులకు యథా విధిగ ఉపనయన సంస్కారము చేయించెను. (28)

టీ॥ పురోధసా- పురోహితుడైన గర్గాచార్యునిచే, ద్విజ సంస్కృతి- బ్రాహ్మణ సంస్కారమగు ఉపనయనమును. ॥28॥

తా॥ వస్త్రాభరణాదులచే అలంకరింపబడియున్న వారిని పూజించి, (బ్రాహ్మణులను) బంగారు మాలలచే అలంకరింపబడిన ఆవులును, వెలి(తెల్లని) పట్టు వస్త్రముల మాలలు గల దూడలతో బాటుగ ఇచ్చి, దక్షిణలు కూడ ఇచ్చెను. (29)

టీ॥ ఆవులు- బంగారు మాలలు వేనియందు గలవో వానిని, వెలి (తెల్లని) పట్టు వస్త్రములుగల లేగలును. ॥29॥

తా॥ తేజశ్శాలియు, బుద్ధిమంతుడును అగు వసుదేవుడు, కృష్ణ బలరాముల జన్మనక్షత్రము లందు లోగడ బ్రాహ్మణులకు దాన మిచ్చుటకు సంకల్పించిన ఆవులను - కంసుడు అన్యాయముగ హరించి యుండెను. వానిని కూడా ఇప్పుడు జ్ఞాపకము చేసికొని తెప్పించి, వారికి ఇచ్చివేసెను. (30)

టీ॥ యా ఇతి యాః పూర్వం మనోదత్తా ఆసన్. తా ఏవాదదాత్. నను తాః కంసేన అపహృతాః సత్యం రాజగోష్ఠాదాచ్ఛిద్యదత్తా ఇత్యాహ - కంసేనాధర్మత ఇతి. ॥30॥

టీ॥ వేనిని పూర్వము ఇచ్చెదనని సంకల్పింపబడినవై ఉండెనో- వానినే ఇచ్చెను. అవి కంసుని చేత అపహరింపబడి యుండుట సత్యము. వానిని రాజ గోష్ఠము నుండి వేరు చేసి ఇచ్చెనని చెప్పు చున్నాడు. "కంసేనాధర్మతః అని. ॥30॥

శ్లో॥ తతశ్చ లబ్ధసంస్కారౌ ద్విజత్వం ప్రాప్య సువ్రతౌ ।
గర్గాద్యదుకులాచార్యాద్గాయత్రం వ్రతమాస్థితౌ ॥ ॥31॥

తా॥ ఇక కృష్ణ బలరాములిద్దఱును ఉపనయన సంస్కారమును పొంది, ద్విజత్వమును లభింప జేసికొని యదుకులమునకు ఆచార్యుడగు గర్గుని నుండి గాయత్రీమంత్రమును స్వీకరించి బ్రహ్మచర్యవ్రతమున నుండిరి. (31)

టీ॥ తత ఇతి గాయత్రం వ్రతం బ్రహ్మచర్యం. ॥31॥

టీ॥ గాయత్రం వ్రతం - బ్రహ్మచర్యమును. ॥31॥

శ్లో॥ ప్రభవౌ సర్వవిద్యానాం సర్వజ్ఞౌ జగదీశ్వరౌ ।
నాన్యసిద్ధామలం జ్ఞానం గూహమానౌ నరేహితైః ॥ ॥32॥

తా॥ సర్వవిద్యలకు ఉత్పత్తిస్థానభూతులు, సర్వజ్ఞులు, జగత్తులకు ప్రభువులును అయిన కృష్ణబలరాములు, అనితరసిద్ధమగు పవిత్ర జ్ఞానమును మనుష్యలీలా కాంక్షులై దాచివుంచిరి. (32)

శ్లో॥ అథో గురుకులే వాసమిచ్ఛంతావుపజగ్మతుః ।
కాశ్యాం సాందీపనం నామ అవంతీపుర వాసినమ్ ॥ ॥33॥

తా॥ ఇక గురుకులవాసము చేయు నిచ్ఛగలవారై కృష్ణబలరాములు, కాశీనగరమున విద్యనభ్యసించిన లేక కాశ్యపస గోత్రుడైన ఉజ్జయినిలోని అవంతీ పట్టణమున నివసించుచున్న 'సాందీపని' అను ముని వద్దకు పోయిరి. (33)

టీ॥ ప్రభవావితి ప్రకర్షేణ భవంత్యాభ్యామితి ప్రభవౌ. అత ఏవ సర్వజ్ఞౌ స్వతః సిద్ధం అమలం జ్ఞానం ప్రచ్ఛాదయంతౌ నరచేష్టితైః ॥32,33॥

టీ॥ ప్రకర్షముగ వీరి నుండి పుట్టును కావున ప్రభవౌ - అందు వలననే సర్వజ్ఞులు - స్వతస్సిద్ధమైన నిర్మల జ్ఞానమును గూఢముగ దాచి వుంచిరి. మనుష్యలీల చేత. ॥32,33॥

శ్లో॥ యథోపసాద్య దాంతౌ తౌ గురౌ వృత్తిమనిందితామ్ ।
గ్రాహయంతా వుపేతౌ స్మ భక్త్యా దేవమివాదృతౌ ॥ ॥34॥

తా॥ అచటకు చేరినప్పటి నుండియు వారు బ్రహ్మచర్య క్లేశములను అనుభవించుచు గురువునందును భక్తి శ్రద్ధలు కలిగి సుశ్రూశ చేయుచు బోధనమును గ్రహించుచు గురువుకు సన్నిహితులై ఆయనను దేవుని వలె ఆదరించుచు ఆయన చేత కూడా అంతే ప్రేమతో ఆదరింపబడు చుండిరి. (34)

టీ॥ యథేతి. యథా యథావత్ ఉపసాద్య ప్రాప్య గురౌ వృత్తిమన్యాన్ గ్రాహయంతౌ శిక్షయంతౌ గురుముపేతౌ ఉపగతౌ సేవితవంతావిత్యర్థః ॥34॥

టీ॥ యథా, ఎట్లో అట్లు, ఉపసాద్య, చేరి, గురువు నందు ప్రత్యయ ముతో ఆయన చెప్పిన వానిని ఇతర ఛాత్రులకు కూడా వారు గ్రహించు విధమున బోధించుచు, నేర్పుచు గురుని చేరి సేవించుచుండిరని అర్థము. ॥34॥

శ్లో॥ తయోర్ద్విజవర స్తుష్ట శ్శుద్ధ భావానువృత్తిభిః ।
ప్రోవాచ వేదానఖిలాన్ సాంగోపనిషదో గురుః ॥ ॥35॥

తా॥ గురువైన సాందీపని ముని ఆ ద్విజవరులగు కృష్ణబలరాములకు వారి పరిశుద్ధమైన అనుకూల వర్తనముచే సంతృప్తి నొంది వారికి సమస్తమైన వేదములు, ఉపనిషత్తులు, వేదషడంగములతో సహా బోధించెను. (35)

టీ॥ తయోరితి. శుద్ధో భావో యాసు తాభిరనువృత్తిభిః. సాంగోప నిషదః అంగాని శిక్షాదీని తైరుపనిషద్భిశ్చ సహితాన్. ॥35॥

టీ॥ శుద్ధమైన భావము ఎవరియందో వారి అనుకూల వర్తనముల చేత స + అంగ + ఉపనిషదః = శిక్ష మొదలగు అంగములు వానితో ఉపనిషత్తులతో కూడినట్టి వానిని. ॥35॥

శ్లో॥ సరహస్యం ధనుర్వేదం ధర్మాన్న్యాయ పథాం స్తథా ।
తథాచాన్వీక్షకీం విద్యాం రాజనీతించ షడ్విధామ్ ॥ ॥36॥

తా॥ రహస్యముతో (మంత్రదేవతా జ్ఞానములతో ) కూడిన ధనుర్వేదము, ధర్మములను, మనువు మొదలగు వారి ధర్మశాస్త్రములు, న్యాయ మార్గములు, తర్కవిద్య, ఆరు విధములైన రాజనీతిని గురువు బోధించెను. (36)

టీ॥ సరహస్యమితి. సరహస్యం మంత్రదేవతాజ్ఞాన సహితం. ధర్మాన్ మన్వాది ధర్మ శాస్త్రాణి న్యాయ పథాన్ మీమాంసాదీన్. అన్వీక్షకీం తర్కవిద్యాం షడ్విధాం"సంధిర్నావిగ్రహో యాన మాసనం ద్వైధ మాశ్రయ" ఇత్యేవం షడ్విధాం. రాజనీతిం. ॥36॥

టీ॥ స రహస్యము - అస్త్రములకు సంబంధించిన మంత్రములు, దేవతలు మొదలగువానితో కూడా, ధర్మాన్ - మనుధర్మశాస్త్రాదులు, న్యాయ పథాన్ - మీమాంసాశాస్త్రము మొదలగునవి. అన్వీక్షకీం- తర్కవిద్యను షట్ విధాం రాజనీతిం -సంధి, విగ్రహము, యానము, ఆసనము, ద్వైధము, ఆశ్రయము అని ఆరు విధముల రాజనీతి.॥36॥

శ్లో॥ సర్వం తద్విబుధ శ్రేష్ఠౌ సర్వవిద్యా ప్రవర్తకౌ ।
సకృన్నిగద మాత్రేణ తౌ సంజగృహతుర్నృప ॥ ॥37॥

తా॥ రాజా! సర్వవిద్యలను ప్రవర్తింపజేయు ఆ దేవతా శ్రేష్ఠులగు రామకృష్ణులు ఒక్క పర్యాయము చెప్పినంత మాత్రమున సర్వమును గ్రహించిరి. (37)

టీ॥ సర్వమితి, సకృన్నిగద మాత్రేణ ఏక వారం గురూచ్చారణ మాత్రేణ. ॥37॥

టీ॥ సకృన్నిగద మాత్రేణ - ఏక వారం - ఒక్కసారి గురువు ఉచ్చరించిన మాత్రమున. ॥37॥

శ్లో॥ అహోరాత్రైశ్చతుష్షష్ట్యా సంయ తౌ తావతీః కలాః ।
గురు దక్షిణయాచార్యం ఛందయామాసతుర్నృప ॥ ॥38॥

తా॥ రాజా! అరువదినాలుగు దినములు అరువదినాలుగు రాత్రులలో నియమశీలురై కృష్ణబలరాములిరువురును అరువదినాల్లు కళలు చక్కగా నేర్చుకొనిరి. దానితో వారి శిక్షణ సంపన్నమయ్యెను. ఇక శిష్యులిరువురును గురుదక్షిణ ఏమి కావలెనో చెప్పుడని సాందీపని మునిని అడిగిరి. (38)

టీ॥ అహోరాత్రైరితి తావతీః చతుష్షష్టికళాః తాశ్చ శైవతంత్రప్రోక్తా లిఖ్యంతే. యథాగీతం. వాద్యం నృత్తం నాట్యం. ఆలేఖ్యం. తిలకం, నానారచనా. విశేషః భేద్యం. తండుల కుసుమ బలి వికారాః. పుష్పాస్తరణం. ఆదర్శనం. వసనాంగరాగాః. మణిభూమికాకర్మ. శయన రచనం. ఉదకవాద్యముదకఘాతః. చిత్రయోగాః మాల్యగ్రథనవికల్పాః శేఖరాపీడయో. జననైపథ్యయోగాః. కర్ణపత్రయోగాః సుగంధ శుద్ధి భూషణయోజనం. ఐంద్రజాలం కౌచుమారయోగః. హస్తలాఘవం. చిత్రశాకా పూప ముఖ భక్ష్యవికార క్రియాః. పానక రసరాగాసవ యోజనం. సూచీపాన కర్మ. సూత్రక్రీడా. సర్వవస్తు ప్రకృతి నిర్మాణం. వీణాడమరుకవాద్యానిప్రహేళికా, స్వస్మిన్నరూపరచనా. దుర్వంచక

టీ॥ తావతీః- అన్నియే, అనగా అరువదినాల్గు కళలు ఒక శైవ తంత్రము నందు చెప్పబడిన ఆ కళలు ఇచట వ్రాయబడుచున్నవి ఎట్లనగా! గీతం. వాద్యం నృత్తం నాట్యం. ఆలేఖ్యం. తిలకం, నానా రచన, విశేష. భేద్యం. తండుల కుసుమ బలి వికారములు పుష్పాస్తరణం. ఆదర్శనం. వసనాంగరాగములు మణి భూమికాకర్మ. శయన రచన. ఉదకవాద్య ముదక ఘాతము. చిత్ర యోగాలు మాల్యగ్రథన వికల్పాలు. శేఖరాపీడ జననైపథ్యయోగాలు. కర్ణపత్ర యోగాలు సుగంధశుద్ధి భూషణ యోజనం. ఐంద్రజాలం కౌచుమార యోగము, హస్తలాఘవం. చిత్ర శాకాపూప ముఖ భక్ష్య వికార క్రియలు. పానక రస రాగాసవయోజనం. సూచీపానకర్మ. సూత్రక్రీడ. సర్వవస్తు

యోగాః, పుస్తకవాచనం. నాటకాఖ్యాయికాదర్శనం. కావ్యసమస్యా పూరణం పట్టికావేత్ర బాణవికల్పాః, తక్షకర్మాణి తక్షణం, వాస్తువిద్యా, రూప్యరత్నపరీక్షా, ధాతువాదః. మణిరాగజ్ఞానం. ఆకరజ్ఞానం. వృక్షాయుర్వేదయోగాః. మేష కుక్కుటలావుక యుద్ధ విధిః శుకశారికా ప్రలాపనం. ఉత్సాదనం, కేశమార్జనకౌశలం, అక్షర ముష్టికా కథనం. మ్లేచ్ఛితక వికల్పః, దేశభాషాజ్ఞానం. పుష్పశకటికా, నిమిత్తజ్ఞానం. యంత్ర మాతృకా ధారణమాతృకా సంవాచ్యం మానసీకావ్యక్రియా, అభిధానకోశః. ఛందోజ్ఞానం, క్రియాకల్పాః, ఛలిత యోగాః, వస్తు గోపనాని, ద్యూత విశేషః, ఆకర్షక్రీడా, బాలక్రీడనకాని, వైనాయికానాం వైజయికానాం చ వైయాసికానాం చ విద్యానాం జ్ఞానాని, ఇతి చతుష్షష్టికలాః గృహీత విద్యౌతౌ గురుదక్షిణయా ఆచార్యం ఛందయా మాసతుః ఉపలోభితవంతౌ. ॥38॥

ప్రకృతి నిర్మాణం. వీణా డమరుక వాద్యాలు ప్రహేళిక, స్వస్మిన్నరూప రచన. దుర్వంచకయోగాలు, పుస్తకవాచనం. నాటకాఖ్యాయికా దర్శనం. కావ్య సమస్యా పూరణం పట్టికావేత్ర బాణవికల్పాలు, తక్ష కర్మములు (తక్షణం,) వాస్తువిద్య, రూప్య రత్న పరీక్ష, ధాతువాదము. మణిరాగ జ్ఞానం. ఆకర జ్ఞానం. వృక్షాయుర్వేదయోగాలు. మేష కుక్కుట లావుక యుద్ధ విధి శుక శారికా ప్రలాపనం. ఉత్సాదనం, కేశ మార్జన కౌశలం, అక్షర ముష్టికా కథనం. మ్లేచ్ఛితక వికల్పము, దేశభాషాజ్ఞానం. పుష్పశకటికా, నిమిత్త జ్ఞానం. యంత్రమాతృకా ధారణ మాతృకా సంవాచ్యం మానసీకావ్యక్రియ, అభిధానకోశము. ఛందోజ్ఞానం, క్రియాకల్పాలు, ఛలిత యోగాలు, వస్తుగోపనములు, ద్యూత విశేషము, ఆకర్షక్రీడ, బాలక్రీడనకములు, వైనాయికల, వైజయికుల వైయాసికుల విద్యల జ్ఞానములు, లని అరువదినాల్గు కళలు. విద్యా స్వీకారము పూర్తి చేసుకొని గురుదక్షిణతో ఆచార్యుని – ఛందయా మాసతుః కోరుటకు అర్థించిరి. ॥38॥

శ్లో॥ ద్విజస్తయోస్తన్మహిమానమద్భుతం
సంలక్ష్య రాజన్నతిమానుషీంమతిమ్ ।
సమ్మంత్ర్యపత్న్యాస మహార్ణవే మృతం
బాలం ప్రభాసే వరయాంబభూవ ॥ ॥39॥

తా॥ రాజా! సాందీపని ముని వారిరువురి అద్భుతమైన మహిమను, అతి మానుషమైన బుద్ధిని గమనించి, తన భార్యతో సమాలోచన చేసి, ప్రభాసక్షేత్రమున మహాసముద్రము నందు చనిపోయిన తమ పుత్రుని తెచ్చి యిండు అని కోరెను. (39)

టీ॥ ద్విజ ఇతి. ప్రభాసే క్షేత్రే మహార్ణవే మృతం బాలం వరయామాస. ॥39॥

టీ॥ ప్రభాసక్షేత్రమున మహాసముద్రము నందు చనిపోయిన తమ బాలుని కోరెను. ॥39॥

శ్లో॥ తథేత్యథారుహ్య మహారథౌ రథం
ప్రభాస మాసాద్య దురంత విక్రమౌ ।
వేలాముపవ్రజ్య నిషేదతుః క్షణం
సింధుర్విదిత్వార్హణ మాహరత్తయోః ॥ ॥40॥

తా॥ మహారథులైన కృష్ణ బలరాములు, సరియే మంచిది" అని గురువు గారి ఆజ్ఞతీసికొని రథముపై నధిరోహించి దురంతపరాక్రములై ప్రభాసక్షేత్రమును చేరి, సముద్ర తటమునకు బోయి క్షణకాలము కూర్చుండిరి. అంతలోనే సముద్రుడు, పరమేశ్వరులు వచ్చిరని తెలిసికొని, వారిని పూజించుటకై పూజాద్రవ్యములతో కూడ ప్రకటమయ్యెను. (40)

శ్లో॥ తమాహ భగవానాశు గురుపుత్రః ప్రదీయతామ్ ।
యోఽసావిహత్వయా గ్రస్తో బాలకో మహతోర్మిణా ॥ ॥41॥

తా॥ వెంటనే భగవానుడు సముద్రునితో నిట్లనెను."గురుపుత్రుని" ఇమ్ము అతడు ఇచ్చట నీ గొప్ప తరంగములుగల నీచే పట్టుకొనబడెను. బాలకుడగుటం జేసి నీవాతనిని మ్రింగితివి. ॥41॥

టీ॥ తథేతి. ఈశ్వరావితి విదిత్వా జ్ఞాత్వా సముద్రస్తయోరర్హణ మాజహారేతి. ॥40,41॥

టీ॥ ఈశ్వరులు అని తెలిసికొని సముద్రుడు వారికి పూజా ద్రవ్యములను గొని వచ్చెను. ॥40,41॥

**సింధురువాచ:**

శ్లో॥ నాహార్షం తమహం దేవ దైత్యః పంచజనో మహాన్ ।
అంతర్జలచరః కృష్ణ శంఖ రూపధరోఽసురః ॥ ॥42॥

**సముద్రుడిట్లనెను:**

తా॥ దేవా కృష్ణా! అతనిని నేను హరింపలేదు, నీటి లోపలి భాగమున సంచరించుచుండు శంఖరూపధరుడైన ఒకానొక గొప్ప రాక్షసుడు హరించినాడు. (42)

శ్లో॥ ఆస్తే తేనాహృతో నూనం గురు పుత్రస్తవ ప్రభో ।
జలమావిశ్య తం హత్వా గృహ్యతామిత్యువాచ హ ॥ ॥43॥

తా॥ ప్రభూ! మీ గురుపుత్రుడు నిశ్చయముగ ఆ పంచజనుని చేత దొంగిలింపబడి యున్నాడు. నీటి లోనికి ప్రవేశించి ఆతనిని వధించి మీ బాలకుని తీసికొనుడు. అని సముద్రుడు చెప్పెను.(43)

శ్లో॥ తదసౌ జలమావిశ్య హత్వా తం జలవాసినం
విదార్య జఠరం తస్య నాపశ్య దుదరేఽర్భకమ్
తదంగ ప్రభవం శంఖ మాదాయ రథమావిశత్ ॥ ॥44॥

తా॥ వెంటనే నీటి లోనికి ప్రవేశించి కృష్ణుడు ఆ నీటిలో నుండు శంఖరూప రాక్షసుని చంపి, ఆతని కడుపు చీల్చియు ఆతని గర్భమున బాలకుని కానకుండెను. అతని శరీరమున పుట్టిన శంఖమును గొని రథమునధిరోహించెను. (44)

శ్లో॥ తతస్సంయమనీం నామ యమస్య దయితాం పురీమ్ ।
గత్వా జనార్దన శ్శంఖం ప్రదధ్మౌ స హలాయుధః ॥ ॥45॥

తా॥ అప్పుడు 'సంయమని' అను పేరు గల యముని ప్రియమైన పట్టణమునకు, బలరామునితో సహా శ్రీకృష్ణుడు పోయి అచట శంఖమును పూరించెను. (45)

టీ॥ నేతి పంచజనస్త్వసురః ఆహార్షీత్ స చ మహాన్ మమాసాధ్య ఇత్యర్థః. ॥42 - 45॥

టీ॥ పంచజనః అసురుడు హరించెను, అతడు చాల పెద్ద వాడు నాకు అసాధ్యుడు అని యర్థము. ॥42 - 45॥

శ్లో॥ శంఖ నిర్హ్రాదమాకర్ణ్య ప్రజా సంయమనో యమః ।
తయోస్సపర్యాం మహతీం చక్రే భక్త్యుపబృంహితామ్ ॥ ॥46॥

తా॥ శంఖ ధ్వానమును విని సకలప్రాణి శాసకుడగు యమధర్మరాజు కృష్ణ బలరాములకు మహాపూజను, అతిశయించిన భక్తి ప్రపత్తులతో చేసెను. (46)

టీ॥ శంఖేతి. సపర్యాం పూజాం. ॥46॥

టీ॥ సపర్యాం- పూజను. ॥46॥

శ్లో॥ ఉవాచావనతః కృష్ణం సర్వభూతాశయాలయమ్ ।
లీలా మానుషయో ర్విష్ణోర్యువయోః కరవామ కిమ్ ॥ ॥47॥

తా॥ సమస్త ప్రాణుల హృదయ గుహలలో నివసించుచుండు కృష్ణుని గూర్చి యముడిట్లనెను. "లీలామానుషరూపులగు మీ ఇరువురకు నేనేమి సేవ చేయవలెను?" (47)

టీ॥ ఉవాచేతి. సర్వేషాం భూతానామాశయాః అంతఃకరణాని. తాన్యాలయో నివాసో యస్య తం. ॥47॥

టీ॥ సర్వేషాం భూతానామాశయాః – అన్ని ప్రాణుల యొక్క అతః కరణములు అవి ఎవనికి ఆలయమో, నివాసమో అతడు అతనిని ॥47॥

**శ్రీభగవానువాచ:**

శ్లో॥ గురుపుత్ర మిహానీతం నిజకర్మ నిబంధనమ్ ।
ఆనయస్వ మహాభాగ మచ్ఛాసనపురస్కృతః ॥ ॥48॥

**భగవానుడు చెప్పుచున్నాడు:**

తా॥ తన కర్మనియతి ననుసరించి మా గురుపుత్రుడు ఇటకు కొనిరాబడి నాడు. మహాభాగా! యమరాజా! నా శాసనమును పురస్కరించుకొని ఆ బాలుని ఇటు తోడ్కొని రమ్ము. (48)

శ్లో॥ తథేతి తేనోఽపనీతం గురుపుత్రం యదూత్తమౌ ।
దత్త్వా స్వగురవే భూయో వృణీష్వేతి తమూచతుః ॥ ॥49॥

తా॥ అట్లే చేయుదునని, యమునిచే కొనిరాబడిన గురుపుత్రుని తీసికొని, కృష్ణబలరాములు, అతనిని తమ గురువునకప్పగించి, గురుదక్షిణగా ఇంకేమి చేయవలెనో ఆజ్ఞ ఇండని గురువునడిగిరి.(49)

టీ॥ గురుపుత్రమితి. నిజం కర్మైవ నిబంధనం యస్య తం తథా భూత మపి మదాజ్ఞా పురస్కారేణ ఆనయస్తేన దోష ఇత్యర్థః.॥48,49॥

టీ॥ తన కర్మయే నిబంధనమెవనికో (ఆతనిని) అట్టివాడైనను నా ఆజ్ఞా పురస్కారము చేత తీసికొని రమ్ము. దానిచే దోషము లేదు. అని యర్థము. ॥48,49॥

గురురువాచ:

శ్లో॥ సమ్యక్సంపాదితో వత్స భవద్భ్యాం గురు నిష్క్రయః ।
కోను యుష్మద్విధగురోః కామానామవశిష్యతే ॥ ॥50॥

గురువు చెప్పుచున్నాడు.

తా॥ వత్సా! మీరు గురుసత్కారమును లెస్సగా చేసితిరి. మీ వంటి ఉత్తములగు శిష్యులుండగా గురువునకు ఏ కోరికలు మిగులును?(50)

శ్లో॥ గచ్ఛతం స్వగృహం వీరౌ కీర్తిర్వామస్తు పావనీ ॥ ॥51॥

తా॥ వీరులారా! ఇక మీరు మీ గృహములకు పొండు. మీకు పవిత్రమైన కీర్తికలుగు గాక! (51)

టీ॥ సమ్యగితి వత్సేతి ప్రాధాన్యేన ఏకస్య సంబోధనం. గురోర్నిష్క్రియః గురుదక్షిణా. యుష్మద్విధ గురోః కామానాం మధ్యే కోఽను కామోఽవశిష్యతే న కోఽపీతి. ॥50,51॥

టీ॥ మీ వంటి వారి గురువునకు – కోరికల మధ్య – ఏ కోరిక (తీరకుండ) మిగిలి యుండును? ఏదియునుండదు అని. (50,51)

శ్లో॥ గురుణైవమనుజ్ఞాతౌ రథేనానిలరంహసా ।
ఆయాతాం స్వపురం తాత పర్జన్యనినదేన వై ॥ ॥52॥

తా॥ నాయనా పరీక్షిత్! ఈ విధముగ గురువు చేత అనుజ్ఞ వడసి రామ కృష్ణులిరువురు వాయు వేగముగల రథమునధిరోహించి, మేఘ గంభీర ధ్వనితో మధురానగరమునకు వచ్చిరి. (52)

టీ॥ గురుణేతి అనిలవద్రంహో యస్య తేన. పర్జన్యో మేఘః తద్వన్నినదో యస్య తేన. ॥52॥

టీ॥ గాలి వంటి వేగము దేనికో దానితో – మేఘగర్జన వంటి ధ్వని దేనికో దానితో. ॥52॥

శ్లో॥ సమనందన్ ప్రజాస్సర్వాః దృష్ట్వా రామజనార్దనౌ ।
అపశ్యంత్యో బహ్వహాని నష్ట లబ్ధధనా ఇవ ॥ ॥53॥

తా॥ బలరామకృష్ణులను చూచి ప్రజలందఱును చాల దినములుగ చూడని వారుగ నుండుటచే పోయిన ధనము తిరిగి లభించిన వారివలె ఆనందించిరి. (53)

టీ॥ సమనందన్నితి. నష్టం అదృష్టం తత్పునర్లబ్ధం ధనం యాభిస్తా ఇవేతి. ॥53॥

టీ॥ కనుమరుగై పోయిన ధనము తిరిగి లభించిన వారి వలె – అని. ॥53॥

శ్రీ మద్భాగవతే, మహాపురాణే దశమస్కంధే,
పంచచత్వారింశోఽధ్యాయః

అని శ్రీమద్భాగవతమున దశమస్కంధమందు
నలుబది ఐదవ అధ్యాయము సమాప్తము.

## షట్చత్వారింశోఽధ్యాయః

### గోకులం ప్రతి ఉద్ధవప్రేషణాదికథాప్రారంభఘట్టః

శ్రీశుక ఉవాచ:

శ్లో॥ వృష్ణీనాం ప్రవరో మంత్రీ కృష్ణస్యదయితస్సఖా ।
శిష్యోబృహస్పతేస్సాక్షాదుద్ధవో బుద్ధి సత్తమః ॥ ॥1॥

టీ॥ శ్లో"షట్చత్వారింశకే ఘోషముద్ధవం ప్రేష్య తద్గిరా, యశోదా నందయోశ్చక్రే కృష్ణశ్శోకాపనోదనమ్, కామచారం ద్విజాతిస్సన్ పరిత్యజ్యాతి సంయతః, గురోర్జ్ఞానమనుప్రాప్య సఖ్యా గోపీరుపాదిశత్" గోపీనాం సాంత్వనమతి రహస్యం సన్మంత్రిసాధ్యమితి తదర్థముద్ధవం విశినష్టి – వృష్ణీనామితి. ప్రవరః ఉచ్చకులత్వాత్. మంత్రీ విశ్వాసాస్పదత్వాత్. శ్రీకృష్ణస్య అతివల్లభత్వా ద్యాదవైర్వృష్ణిభిశ్చాదరణీయః. బుద్ధి సత్తమః బుధ్యా అతిశ్రేష్ఠః. ॥1 – 3॥

## నలుబది ఆరవ అధ్యాయము

శుకయోగి ఇట్లనెను:

తా॥ వృష్ణికులజుల యందు శ్రేష్ఠుడు, మంత్రియు, కృష్ణునకు మిక్కిలి ప్రియమైనవాడు, స్నేహితుడు, సాక్షాత్తుగా బృహస్పతి శిష్యుడు బుద్ధి చేత మిక్కిలి శ్రేష్ఠుడును, ఐనవాడు ఉద్ధవుడు. (1)

టీ॥ నలుబది ఆఱవ అధ్యాయమున–కృష్ణుడు ఉద్ధవుని వ్రజమునకు పంపి అతని మాటల ద్వారా యశోదా నందుల దుఃఖమును మాన్పెను. ఉపనీతుడైన కృష్ణుడు స్వేచ్ఛాచరణమును విడిచి జితేంద్రియుడై గురువు ఉపదేశించిన జ్ఞానమును పొంది తన స్నేహితుడైన ఉద్ధవుని చేత గోపస్త్రీలను సాంత్వనపరచుటకై సాంత్వనము పొందుటకై ఆదేశించెను. గోపికల సాంత్వనము మిక్కిలి రహస్యమైనది. బుద్ధిమంతుడైన మంత్రి చేతనే సాధ్యమని దాని కొఱకు ఉద్ధవుని ప్రత్యేకతను గూర్చి చెప్పుచున్నాడు, ప్రవరః– అగ్రకులత్వము వలన, మంత్రి – విశ్వాస పాత్రుడగుట వలన – శ్రీకృష్ణుని యొక్క మిక్కిలి ప్రేమ పాత్రుడగుట వలన యాదవుల చేత, వృష్ణికులము వారి చేత ఆదరింపదగిన వాడు. బుద్ధి సత్తమః – బుద్ధిచే శ్రేష్ఠుడు.॥1–3॥

శ్లో॥ తమాహ భగవాన్ప్రేష్ఠం భక్తమేకాంతినం క్వచిత్ ।
గృహీత్వా పాణినా పాణిం ప్రపన్నార్తిహరోహరిః ॥ ॥2॥

తా॥ ఒకానొక సమయమున ప్రపన్నుల దుఃఖములను తొలగించు వాడును, భగవానుడును అయిన కృష్ణుడు; భక్తుడు, ప్రేమగలవాడు, అయిన ఉద్ధవుడు ఏకాంతముగనుండగా అతని చేతిని తన చేతిలోనికి తీసికొని అతనితో నిట్లనెను.॥2॥

శ్లో॥ గచ్ఛోద్ధవ వ్రజం సౌమ్య పిత్రోర్నః ప్రీతిమావహ ।
గోపీనాం మద్వియోగాధిం మత్సందేశైర్విమోచయ ॥ ॥3॥

తా॥ సౌమ్యుడా! ఉద్ధవా! నీవు వ్రజమునకు పోయి మా తల్లిదండ్రులగు యశోదా నందులకు ప్రీతిని కలిగింపుము. ఇక గోపికలకు నా సందేశము అందించి, నా వియోగము వల్ల కలిగిన వ్యధను కూడా తొలగింపుము. (3)

శ్లో॥ తా మన్మనస్కామత్ప్రాణా మదర్థేత్యక్తదైహికాః ।
మామేవ దయితం ప్రేష్ఠమాత్మానం మనసా గతాః ॥ ॥4॥

తా॥ వారు నేనే మనస్సుగా గలవారు, నేనే ప్రాణముగా గలవారు, నా కొఱకు దైహిక సంబంధములను విడిచినవారు, నన్నే ప్రియతముడుగ, ప్రేమాస్పదునిగ ఆత్మనుగా మనస్సుచే పొందియున్నారు. (4)

టీ॥ గోపీనాం విశేష తస్సందేశే కారణమాహ తా ఇతి. మయ్యేవ సంకల్పాత్మకం మనః యాసాం తాః అహమేవ ప్రాణా యాసాం తాః . మమ ప్రాణభూతా ఇతి వా. మదర్థే త్యక్తా దైహికాః పతిపుత్రాదయః భోజన పాన వస్త్రభూషణస్రక్తాంబూలాదయో వా యాభిస్తాః. ॥4॥

టీ॥ గోపికలకు ప్రత్యేకమైన సందేశమునకు కారణమును చెప్పుచున్నాడు. నా యందే సంకల్పాత్మకమైన మనస్సు ఎవరికో వారు నేనే ప్రాణములుగ ఎవరి యందో వారు, లేక నాకు ప్రాణతుల్యమైన వారు, నా కొఱకు విడవబడిన దైహికాః- భర్త పుత్రుడు మొదలైనవారు -తినుట, త్రాగుట, వస్త్రములు, భూషణములు, పూలదండలు, తాంబూలములు, అన్నియు ఎవరిచేతనో వారు. ॥4॥

శ్లో॥ యేత్యక్తలోక ధర్మాశ్చ మదర్థేతాన్ బిభర్మ్యహమ్ ॥ ॥5॥

తా॥ వారు లోకధర్మములన్నియు విడిచిరి. నా కొఱకై వారిచే విడువబడిన లోక ధర్మములుకల వారిని, నేను భరించుచున్నాను.(5)

టీ॥ తతః కిమత ఆహ – య ఇతి. మన్నిమిత్తం త్యక్తా లోకధర్మా ఇహాముత్ర సుఖే తత్సాధనాని చ యైస్తాన్ బిభర్మి పుష్ణామి సుఖయామీత్యర్థః. ॥5॥

టీ॥ నా కారణముగ విడువబడిన లోక ధర్మములు గల వారు, ఇహ పర సుఖము నందు– దాని సాధనములు ఎవరి చేతనో వానిని బిభర్మి–పోషించుచున్నాను. సుఖింపజేయుచున్నాను అని యర్థము.॥5॥

శ్లో॥ మయి తాః ప్రేయసాం ప్రేష్ఠే దూరస్థే గోకులస్త్రియః ।
స్మరంత్యోంగ విముహ్యంతి విరహౌత్కంఠ్యవిహ్వలాః ॥ ॥6॥

తా॥ ఉద్ధవా! గోకులము నందలి స్త్రీలు దూరముగ నున్న, ప్రేమగల వారిలో అతిశయమైన ప్రేమగలవాడనగు నా యందు విరహము చేత మిక్కిలి ఉత్కంఠగలవారై, దాని వలన ఉదిగ్నులై నన్నే స్మరించుచు మోహితలగుచుందురు. (6)

టీ॥ తాసాం వియోగాధిం దర్శయతి – శ్లోకద్వయేన. మయీతి. విరహేణౌత్కంఠ్యం తేనవిహ్వలాః పరవశాః. ॥6॥

టీ॥ వారి యొక్క వియోగ వ్యథను రెండుశ్లోకములలో చూపుచున్నాడు విరహము చేత ఉత్కంఠత దాని చేత విహ్వలాః–పరవశులు. ॥6॥

శ్లో॥ ధారయంత్యతి కృఛ్రేణ ప్రాయః ప్రాణాన్కథంచన ।
ప్రత్యాగమన సందేశైర్వల్లవ్యో మే మదాత్మికాః ॥ ॥7॥

తా॥ వారు ఎటులో చాలా కష్టముగ ప్రాణధారణ చేయుచున్నారు, మఱల వెంటనే తిరిగి వచ్చెదను అను సందేశముల చేత నా ప్రేయసులగు ఆ గోపికలు నేనే వారి ఆత్మలుగ బ్రతుకుచున్నారు.(7)

టీ॥ ధారయంతీతి. గోకులాన్నిర్గమన సమయే శీఘ్రమాగమిష్యామీతి యే ప్రత్యాగమనసందేశాస్తైః మే మదీయా వల్లవో గోప్యః మదాత్మికా ఇతి తాసామాత్మా స్వదేహే యదిస్యాత్తర్హి విరహతాపేన దహ్యేతైవ తస్య మయి వర్తమానత్వాత్కథంచిజ్జీవంతీతి భావః॥7॥

టీ॥ గోకులము నుండి మధురకు బయలుదేరు సమయమున, తొందరగా తిరిగి వచ్చెదనని ఏ తిరిగిరాక గూర్చిన వాగ్దానము గలదో దాని చేత నా ప్రేమాస్పదులగు గోపికలు "మదాత్మికలు" అని వారి యొక్క ఆత్మ వారి దేహముననే ఉండిన యెడల అప్పుడు వారు విరహతాపము చేత దహింపబడి యుందురు. అది నా యందే ఉండుటచేత ఎట్లో జీవించుచున్నారని భావము.॥7॥

**శ్రీశుక ఉవాచ:**

శ్లో॥ ఇత్యుక్త ఉద్ధవో రాజన్ సందేశం భర్తురాత్మనః ।
ఆదాయ రథమారుహ్య ప్రయయౌ నందగోకులమ్ ॥ ॥8॥

**శ్రీశుకుడిట్లనెను:**

తా॥ రాజా! ఉద్ధవుడు ఇట్లు చెప్పబడి కృష్ణుని సందేశమును మనస్సునకు ఆకలింపు చేసుకొని రథము నధిరోహించి నంద గోకులమునకు పోయెను.(8)

టీ॥ ఇతీతి. సందేశం భవతీనాం వియోగో మే న హి సర్వాత్మనా క్వచిదిత్యాదికం. ॥8॥

టీ॥ సందేశము- మీ వియోగము నాకు సర్వాత్మనా ఒక్కొక్కప్పుడు కలుగునది కాదు (నిరంతరమైనది) అని మొదలగు విధమున ఉండునని ఊహ్యము. ॥8॥

శ్లో॥ ప్రాప్తో నందవ్రజంశ్రీమాన్నిమ్రోచతి విభావసౌ ।
ఛన్నయానః ప్రవిశతాం పశూనాం ఖుర రేణుభిః ॥ ॥9॥

తా॥ సూర్యుడు అస్తమించుచున్న సమయమున మహాభాగుడైన ఉద్ధవుడు నందవ్రజము చేరెను. పశువుల గిట్టలవలన లేచుచున్న ధూళి రేణువులు ప్రవేశించుటచే అతని రథము దానితో కప్పబడెను అట్టిరథము గలవాడై ఉద్ధవుడు వ్రజమునకు వచ్చెను. ధూళితో కప్పబడిన రథము ఎవడికో వాడు. (9)

టీ॥ ప్రాప్త ఇతి. నిమ్రోచతి అస్తం గచ్ఛతి సతి. ఛన్నం యానం యస్యేతి. తదా గోపీభిరజ్ఞాతత్త్వేన నందసంగం లబ్ధవానితి సూచయితుం. ॥9॥

టీ॥ నిమ్రోచతి- అస్తమించుచుండగా అప్పుడు గోపస్త్రీలచే అతని రాక తెలియబడక నందునితోనే అతడు కలిసికొనుట జరిగెనని సూచించుటకు.॥9॥

శ్లో॥ వాశితార్థేఽభియుధ్యద్భిర్నాదితం శుష్మిభిర్వృషైః ।
ధావంతీభిశ్చ వాస్రాభిరూధోభారైస్స్వవత్సకాన్ ॥ ॥10॥

తా॥ ఋతుమతులైన ఆవుల కొఱకు పరస్పరము పోట్లాడుకొనుచున్న మదించిన కోడె లేగలచేత వేయబడు అంకెల ధ్వనులతో నిండినదియు, పొదుగుల బరువులతో తమతమ లేగదూడల వైపు పఱుగెత్తుచున్న ఆవులచే శోభించునదియు. (10)

టీ॥ వ్రజం వర్ణయతి - పంచభిః. వాశితార్థ ఇతి. వాశితాః పుష్పవత్యో గావః తన్నిమిత్తమభితో యుధ్యద్భిః శుష్మిభిర్మత్తైర్గోవృషై ర్నాదితం. వాస్రాభిః ధేనుభిః స్వవత్సకాన్ ప్రతి. ॥10॥

టీ॥ ఐదు శ్లోకములతో వ్రజమును వర్ణించుచున్నాడు, వాసితాః- పుష్పవతులైన ఆవులు వాని కొఱకు, అభితః- అంతటలో, యుధ్యద్భి, శుష్మిభిః- పోట్లాడుచున్న కోడె దూడలచే, నాదితం- అంకెలు వేయబడుచున్నదియు, వాస్రాభిః - ఆవుల చేత తమ లేగలను గూర్చి పరుగెత్త బడుచున్నదియును (వ్రజము). ॥10॥

శ్లో॥ ఇతస్తతో విలంఘద్భిర్గోవత్సైర్మండితం సితైః ।
గోదోహ శబ్దాభిరవం వేణూనాం నిస్వనేన చ ॥ ॥11॥

తా॥ ఇటునటు గంతులు వేయుచు తిరుగుచున్న గోవత్సల చేత శోభించునదియు, పాలు పితికెడు ధ్వనులచే వ్యాపించినదియు, పిల్లన గ్రోవుల నాదములచే హోరెత్తుచున్నదియును (వ్రజము) (11)

టీ॥ ఇతస్తత ఇతి. విలంఘద్భిరుత్పతద్భిః గోదోహశబ్దైః సహాభితో రవాః ముంచ మాముంచ నయ ఆనయ గృహాణ దేహీత్యాదయో యస్మిన్ తత్. వేణూనాం నిస్వనేచ. ॥11॥

టీ॥ విలంఘిద్భిః– ఎగురుచు దుముకుచున్న (లేగదూడలతో)– గో దోహశబ్దైః, సహాభిరవైః– పాలు పితుకుచున్న ధ్వనులతో సహా 'విడువువిడువు' 'వలదువలదు' తీసికొనిరమ్ము, ఇది తీసికొనుము, ఇమ్ము మొదలగు శబ్దములు దేనియందో అది – వేణువాద్యముల మ్రోతల చేత కూడా. ॥11॥

శ్లో॥ గాయంతీభిశ్చ కర్మాణి శుభాని బలకృష్ణయోః ।
స్వలంకృతాభిర్గోపీభిర్గోపైశ్చ సువిరాజితమ్ ॥ ॥12॥

తా॥ బలరామకృష్ణుల శుభ లీలలను గానము చేయుచున్న గోపస్త్రీల చేతను, చక్కగా అలంకరించుకొని యున్న గోపయువతుల చేతను కళకళలాడుచున్నదియును (వ్రజము) (12)

టీ॥ గాయంతీభిరితి. గాయంతీభిర్గోపైశ్చ సువిరాజితమ్. ॥12॥

టీ॥ పాటలు పాడుచున్న గోపస్త్రీలచేత శోభించుచున్నది వ్రజము. 12

శ్లో॥ అగ్న్యర్కాతిథి గో విప్ర పితృదేవార్చనాన్వితైః ।
ధూప దీపైశ్చ మాల్యైశ్చ గోపావాసైర్మనోరమమ్ ॥ ॥13॥

తా॥ అగ్ని, సూర్యుడు, అతిథులు, గోవులు, బ్రాహ్మణులు, పితృదేవతలు, మొదలగు వారికి ధూపములు దీపములు పూలదండలు, మొదలగు ఉపచారములతో కూడిన పూజలతో శోభించుచున్న గోపాలుర నివాసములతో వ్రజము హృదయంగమముగ నుండెను.(13

టీ॥ అగ్నీతి. అగ్న్యాద్యర్చనాన్వితైర్గోపగృహైర్ధూప దీపాదిభిశ్చ మనోరమం. ॥13॥

టీ॥ అగ్ని మొదలగు వాని అర్చనలతో నున్న గోపగృహములు ధూప దీపములతో మనోహరమై యుండెను. ॥13॥

శ్లో॥ సర్వతః పుష్పితవనం ద్విజాళి కులనాదితమ్ ।
హంస కారండవాకీర్ణైః పద్మషండైశ్చ మండితమ్ ॥ ॥14॥

తా॥ అంతటను పుష్పించిన వనములు, పక్షులు, తుమ్మెదలు, మొదలగు వాని కిలకిలారావములు, ఝుంకార నాదములును, హంసలు, కన్నె లేడులు, మొదలగు పక్షులతో సంకీర్ణమును, తామర సమూహములతో శోభించు సరస్సులు మొదలగు వానితో కూడి వ్రజము మిక్కిలి ఆహ్లాదకరముగ నుండెను. (14)

టీ॥ సర్వత ఇతి. షండాస్సమూహాః. ॥14॥

టీ॥ షండాః –సమూహములు. ॥14॥

శ్లో॥ తమాగతం సమాగమ్య వృష్ణస్యానుచరం ప్రియమ్ ।
నందః ప్రీతః పరిష్వజ్య వాసుదేవధియార్చయత్ ॥ ॥15॥

తా॥ కృష్ణుని ప్రియమైన అనుచరుడగు ఉద్ధవుడు వచ్చెనని తెలిసి నందుడు ఆతనికెదురేగి మిక్కిలి ప్రీతుడై, ఆతనిని ఆలింగనము చేసికొని కృష్ణునే పూజించుచున్నట్లాతనిని పూజించెను. (15)

శ్లో॥ భోజితం పరమాన్నేన సంవిష్టం కశిపౌ సుఖమ్ ।
గతశ్రమం పర్యపృచ్ఛత్పాదసంవాహనాదిభిః ॥ ॥16॥

తా॥ ఉద్ధవుడు శ్రేష్ఠమైన భోజనముచేసి, మంచముపై సుఖోపవిష్టుడై ,ప్రయాణపు బడలికనుండి విడుదల పొందినపిదప నందుని పరిచారకులు అతనికాళ్ళుఒత్తుట, వీజనములు వీయుట మున్నగు ఉపచారములు చేయుచుండగా నందుడాతనిని ఇట్లుకుశల ప్రశ్నలడిగెను. (16)

శ్లో॥ కచ్చిదంగ మహాభాగ సఖా నశ్శూరనందనః ।
ఆస్తే కుశల్యపత్యాద్యైర్యుక్తో ముక్తస్సుహృద్వృతః ॥ ॥17॥

తా॥ మహాభాగా! ఉద్ధవా! మాస్నేహితుడైన వసుదేవుడు, ఇప్పుడు నిర్బంధమునుండి ముక్తుడైనపిదప తనపుత్రాదులతో గూడి, మిత్రులతో కలిసి కుశలముగ నున్నాడు కదా! (17)

టీ॥ తమితి, అర్చయత్ పూజయామాస. ॥15-17॥

టీ॥ అర్చయత్- పూజించెను. ॥15-17 ॥

శ్లో॥ దిష్ట్యా కంసో హతః పాపః సానుగస్స్వేన పాప్మనా ।
సాధూనాం ధర్మశీలానాం యదూనాం ద్వేష్టి యస్సదా ॥ ॥18॥

తా॥ సజ్జనులకు సంతోషము కలిగించునట్లు పాపియగు కంసుడు హతమయ్యెను. సాధువులను, ధర్మశీలురను, యదువులను, ఎల్లప్పుడును ద్వేషించుచుండు కంసుడు తన వెంటనే వచ్చు తన పాపముతో తానే వధింపబడెను. (18)

టీ॥ దిష్ట్యేతి. సాధూనామిత్యాదికర్మణి షష్ఠీ. ॥18॥

టీ॥ సాధూనాం ఇత్యాదిగ గలది కర్మణి ప్రయోగమున షష్ఠీవిభక్తి.(18

శ్లో॥ అపి స్మరతి నః కృష్ణో మాతరం సుహృదస్సఖీన్ ।
గోపాన్ వ్రజం చాత్మనాథాన్ గావో బృందావనంగిరిమ్ ॥ ॥19॥

తా॥ మా కృష్ణుడు మధురలో నున్నను, తల్లియగు యశోదను, స్నేహితులను, గోపికలను, గోపాలురను, వ్రజమును, తాను చేసిన లీలలను, లేక తానే నాథుడుగ గలవారిని, ఆవులను, బృందావనమును, గోవర్ధనగిరిని స్మరించుచుండు ననుకొందును.(19)

టీ॥ అపీతి. గావో గాః గిరిం గోవర్ధనం. ॥19॥

టీ॥ గావః- ఆవులను- గిరిం-గోవర్ధనమును ॥19॥

శ్లో॥ అప్యాయాస్యతి గోవిందస్స్వజనాన్ సకృదీక్షితుమ్ ।
కర్హి ద్రక్ష్యామ తద్వక్త్రం సునాసం సుస్మితేక్షణమ్ ॥ ॥20॥

తా॥ తన వారిని చూచుటకు కృష్ణుడు ఒకసారి ఇటకు వచ్చునను కొందును. ఆ అందమైన నాసిక, సుందరమైన చిరునవ్వుల చూపులు గల ఆ ముఖమును ఎప్పుడు చూచెదమో! (20)

టీ॥ అపీతి. ఆప్యాయాస్యతి ఆగమిష్యతి కిం? ॥20॥

టీ॥ అప్యాయాస్యతి?- ఇచ్చుటికి వచ్చునా? ॥20॥

శ్లో॥ దవాగ్నేర్వాతవర్షాచ్చ వృష సర్పాచ్చ రక్షితాః ।
దురత్యయేభ్యో మృత్యుభ్యః కృష్ణేన సుమహాత్మనా ॥ ॥21॥

తా॥ కార్చిచ్చు నుండి, ఝంఝూ మారుతము నుండి, కుంభవర్షము నుండి ,వృషాసురుని నుండి, కొండచిలువల నుండి, అనేక విధము లుగ, అనివార్యములుగ, సంభవించిన మృత్యువుల నుండి మహాత్ముడైన కృష్ణుడు మమ్ము రక్షించెను. (21)

టీ॥ శ్రీకృష్ణోపకారస్మరణాదిభి రనుపమానందే నాభిభూయమాన ఆహ - దవాగ్నేరితి. వాతద్వర్షాచ్చేతి వృషాత్సర్పాచ్చేతి ఆన్యేభ్యః దురతిక్రమేభ్యో మృత్యుభ్యః శ్రీకృష్ణేన రక్షితాః స్మః. ॥21॥

టీ॥ శ్రీకృష్ణుని ఉపకారములను స్మరించుట మున్నగు వానిచే సాటి లేని ఆనందముతో తనకు తాను న్యూనతను పొందుచు చెప్పుచున్నాడు. దవాగ్ని నుండి అని గాలి నుండి వర్షము నుండి, వృషాసురుని నుండి సర్పము నుండి ఇతరములైన అతిక్రమింపరాని మృత్యువుల నుండి శ్రీకృష్ణుని చేత రక్షింపబడి యున్నాము. ॥21॥

శ్లో॥ స్మరతాం కృష్ణవీర్యాణి లీలాపాంగ నిరీక్షితమ్ ।
హసితం భాషితం చాంగ సర్వా నశ్శిథిలాః క్రియాః ॥ ॥22॥

తా॥ ఉద్ధవా! కృష్ణుని పరాక్రమములు లీలతో కూడిన ఆతని కటాక్ష వీక్షణములు, అతని నవ్వు, అతని మాట, అన్నియును జ్ఞాపకము చేసుకొనుచుందుము. ఇప్పుడు మా పనులన్నియు శిథిలములైనవి సుమా!. (22)

టీ॥ కించ. స్మరతామితి. లీలయా అపాంగేన నిరీక్షితం. అంగ హే ఉద్ధవ. ॥22॥

టీ॥ ఇంకను లీలగా ఆతడు చూచు కడగంటిచూపు అంగ - ఓ ఉద్ధవా! ॥22॥

శ్లో॥ సరిచ్ఛైలవనోద్దేశాన్ ముకుంద పద భూషితాన్ ।
ఆక్రీడానీక్షమాణానాం మనో యాతి తదాత్మతామ్ ॥ ॥23॥

టీ॥ న కేవలం శిథిలా ఏవ కింతు శనైరుపరమంతీత్యాహ– సరిదితి. సరితశ్చ శైలాశ్చ వనోద్దేశాశ్చ తాన్. ఆక్రీడాన్ క్రీడాస్థానాని.॥23॥

శ్లో॥ మన్యే కృష్ణం చ రామం చ ప్రాప్తావిహ సురోత్తమౌ ।
సురాణాం మహదర్థాయ గర్గస్య వచనం యథా ॥ ॥24॥

టీ॥ మన్య ఇతి. సురాణామర్థాయ మహద్గంభీరం గర్గస్య వచనం యథా. ॥24॥

శ్లో॥ కంసం నాగాయుతప్రాణం మల్లాన్ గజపతిం తథా ।
అవధీత్తాన్ లీలయైవ పశూనివ మృగాధిపః ॥ ॥25॥

టీ॥ న కేవలం తద్వచనానుసారేణైవ వ్యవహారసంబంధాదపీత్యాహ కంసమితి. ॥25॥

తా॥ కృష్ణుని పాదములచే భూషితములై నదులు, కొండలు, వనములు, యెత్తైన ప్రదేశములు, ఆట స్థలములు ఇట్టివి చూచునప్పుడు మనస్సంతయు కృష్ణమయమే అగుచుండును. (23)

టీ॥ కేవలము శిథిలములగుటయే కాక మెల్లమెల్లగా స్థంభించుచున్నవి అని చెప్పుచున్నాడు. నదులు, పర్వతములు వనోద్దేశములు – వానిని ఆక్రీడాన్– క్రీడాస్థానములను. ॥23॥

తా॥ గర్గాచార్యులు చెప్పినట్టు, ఏదో దేవకార్యము కొఱకు, ఏదో గొప్ప ప్రయోజనము సాధించుటకు కృష్ణ బలరాములు అను ఇఱువురు దేవతా శ్రేష్ఠులు ఇచటకు వచ్చియున్నారు. (24)

టీ॥ సురాణామర్థాయ– దేవతల ప్రయోజనము కొఱకు, మహత్– గంభీరమైన, గర్గుడు చెప్పినట్లు. ॥24॥

తా॥ పదివేల ఏనుగుల బలముగల కంసుని ప్రాణములు, చాణూర ముష్టికాది మల్లురను, కువలయాపీడుడు అను మహాగజమును సింహము పశువులను చంపినట్లు, లీలగా చంపివేసెను. (25)

టీ॥ కేవలము గర్గుని మాట ననుసరించియే కాదు వ్యవహార సంబంధము వలన కూడా అని చెప్పుచున్నాడు. ॥25॥

శ్లో॥ తాళత్రయం మహాసారం ధనుర్యష్టిమివేభరాట్ ।
బభంజైకేన హస్తేన సప్తాహమదధాద్గిరిమ్ ॥ ॥26॥

తా॥ మిక్కిలి దృఢమైన మూడు తాటి చెట్లంత ధనుస్సును, గజరాజు తన తొండముతో కట్టెను విరిచినట్లుగా ఒకే చేతితో విరిచి వేసెను– గోవర్ధన గిరిని ఏడుదినములు ఒకే చేతితో ధరించి యుండెను. (26)

శ్లో॥ ప్రలంబ ధేనుకారిష్ట తృణావర్త బకాదయః ।
దైత్యాస్సురాసుర జితో హతాయేనేహ లీలయా ॥ ॥27॥

తా॥ ప్రలంబుడు, ధేనుకు, అరిష్టుడు, తృణావర్తుడు, బకాసురుడు మొదలగు రాక్షసులను, దేవతలను కూడా జయించిన మహాబలశాలురైన రాక్షసులను లీలగా అతడు వధించి వేసెను. (27)

<u>శ్రీ శుక ఉవాచ:</u>

శ్లో॥ ఇతి సంస్మృత్య సంస్మృత్య నందః కృష్ణానురక్తధీః ।
అశ్రుకంఠో౽ భవత్తూష్ణీం ప్రేమప్రసర విహ్వలః ॥ ॥28॥

తా॥ ఇట్లు స్మరించి స్మరించి నందుడు కృష్ణుని యందు ప్రేమాతిశయము గల బుద్ధిగలవాడై అప్పకప్పుడే ఊరక కృష్ణుని యందు ప్రేమప్రసరించుటచే ఉద్విగ్నుడై గద్గదకంఠము గలవాడైయ్యెను. (28)

శ్లో॥ యశోదా వర్ణ్యమానాని పుత్రస్య చరితాని చ ।
శృణ్వంత్య శ్రూణ్యపాస్రాక్షీత్స్నేహ స్నుత పయోధరా ॥ ॥29॥

తా॥ నందునిచే వర్ణింపబడుచుండిన, పుత్రుని చరిత్రలు వినుచున్న యశోద కన్నుల నుండి కన్నీరు కార్చుచుండెను స్నేహవశమున, పాలు కారుచున్న స్తనములు గలది యయ్యెను. (29)

శ్లో॥ తయోరిత్థం భగవతి కృష్ణే నంద యశోదయోః ।
వీక్ష్యానురాగం పరమం నందమాహోద్ధవో ముదా ॥ ॥30॥

తా॥ ఇట్లు భగవానుడైన కృష్ణుని యందు యశోదా నందుల అనురాగాతి శయమును చూచి ఉద్ధవుడు మిక్కిలి ఆనందముతో నందునితో ఇట్లు చెప్పెను. (30)

**ఉద్ధవ ఉవాచ:**

శ్లో॥ యువాం శ్లాఘ్యతమౌ నూనం దేహినామిహ మానద ।
నారాయణేఽఖిలగురౌ యత్కృతారతిరీదృశీ ॥ ॥31॥

టీ॥ తాళత్రయమితి. ఇభరాట్ యష్టిమివ. తాళత్రయ ప్రమాణం ధనుః బభఞ్జ. ॥26-31॥

శ్లో॥ ఏతౌ హి విశ్వస్య చ బీజయోనీ
రామో ముకుందః పురుషః ప్రధానమ్ ।
అన్వీయ భూతేషు విలక్షణస్య
జ్ఞానస్య చేశాత ఇమౌ పురాణౌ ॥ ॥32

టీ॥ అఖిల గురుత్వమేవ జనకత్వేన నియంతృత్వేన చాహ - ఏతావితి. రామో ముకుందశ్చైతౌ విశ్వస్య బీజయోనీ నిమిత్తోపాదానే. నను పురుష ప్రధానయోర్బీజయోనిత్వం ప్రసిద్ధమత ఆహ - పురుషః ప్రధానమితి. పురుషోఽంశః ప్రధానం శక్తిః అతః ప్రధాన పురుషావప్యేతావేవేత్యర్థః

**ఉద్ధవుడు చెప్పుచున్నాడు.**

తా॥ మానదా! మీరిరువులు నిశ్చయముగా ఈ లోకమున ప్రాణులలో కెల్లను శ్రేష్ఠతములు ఏలయన సమస్త విశ్వమునకు గురువగు నారాయణుని యందు ఈ విధమగు ఉత్తమోత్తమమైన ప్రేమ కల్గియున్నారు. (31)

టీ॥ గజరాజు కఱ్ఱను వలె మూడు తాటిచెట్ల ప్రమాణముగల ధనుస్సును విఱిచెను. ॥26-31॥

తా॥ బలరామ కృష్ణులిరువురే విశ్వమునకు బీజయోనులు (నిమిత్తోపాదానములు) అంశ శక్తులు, అందువలన ప్రధానము పురుషుడు. అనువారు వీరే. ఇట్లు జనకత్వమున్నను భూతముల యందు అనుప్రవేశము చేసి, విలక్షణమైన (నానా భేద) జ్ఞానమునకు, జీవునకును నియంతలై ఉండు అనాది కారణులు. (32)

టీ॥ సమస్తమునకును గురుత్వమునే, జనకత్వముచేత, నియంతృత్వము చేతను చెప్పుచున్నాడు. బలరాముడు కృష్ణుడు వీరు విశ్వమునకు బీజము యోనియును- నిమిత్త ఉపాదానములు- నిమిత్తము. పురుషుడు ప్రధానము అనురెండింటికి బీజయోనిత్వములు ప్రసిద్ధము.

ఏవం జనకత్వముక్తం కించ అన్వీయభూతేషు భూతేష్వనుప్రవిశ్య భూతానాం మధ్యే తదుపహితస్య విలక్షణస్య నానా భేదస్య జ్ఞానస్య చ జీవస్య చ ఈశాతే ఈశ్వరౌ నియంతారౌ భవతః కుతః పురాణౌ అనాదీ అనాదిత్వాత్కారణత్వం తతశ్చ నియంతృత్వమిత్యర్థః. ॥32॥

అందుకు చెప్పుచున్నాడు. పురుషుడు- అంశ, ప్రధానము- శక్తి కావున ప్రధానము పురుషుడు వీరేఅనిఅర్థము. ఇట్లు జనకత్వము చెప్పబడినది. మరియు అన్వీయ భూతేషు భూతముల యందు ప్రవేశించి, భూతముల మధ్య తన ఉనికి యొక్క విలక్షణమైన వివిధత్వము యొక్క జ్ఞానమునకు జీవునకు- ఈశ్వరులు నియంతలునై, ఎందువలన? పురాణౌ అనాది యగు వారు. అనాదిత్వము వలన కారణత్వము, దాని వలన నియంతృత్వము అని అర్థము. ॥32॥

శ్లో॥ యస్మిన్ జనః ప్రాణవియోగ కాలే
క్షణంసమావేశ్య మనో విశుద్ధమ్ ।
నీర్హృత్య కర్మాశయమాశు యాతి
పరాంగతిం బ్రహ్మమయోఽర్కవర్ణః ॥ ॥33॥

తా॥ మనుష్యుడు ప్రాణావసాన కాలమునందు ఒక్క క్షణకాలము మనస్సు పరిశుద్ధము గావించుకొని సమాహితత్వముతో తన కర్మను వాసనలను అతని యందు వదలి పెట్టినచో అతడు స్వస్వరూపజ్ఞానము కలవాడై శుద్ధసత్వమూర్తియై ఆ పరమపదమును పొందును. (33)

టీ॥ నను సృష్ట్యాదికర్మావేశాన్మనుష్యాదిజన్మ దర్శనాచ్చ తస్యాన్యేభ్యః కో విశేష ఇత్యాశంక్యాహ- ద్వాభ్యాం - యస్మిన్నితి. కర్మాశయం కర్మవాసనాం నిర్హృత్య త్యక్త్వా బ్రహ్మమయః స్వరూపజ్ఞానవాన్. అర్కవర్ణః శుద్ధసత్త్వమూర్తిస్సన్. పరాం గతిం తత్పరం పదం యాతి. ॥33॥

టీ॥ సృష్టి మొదలుకొని కర్మలు చేరుట వలన మనుష్యాది జన్మలు కన్పట్టుచున్నందు వల్ల, ఇక ఇతరములైనవాని విశేషమేమి అని ఆశంకించి రెండు శ్లోకములచే చెప్పుచున్నాడు. కర్మాశయం, కర్మ వాసనల యొక్క సమూహమును- నిర్హృత్య-త్యజించి బ్రహ్మమయః స్వరూపజ్ఞానము కలవాడై, అర్కవర్ణః- శుద్ధసత్వమూర్తియై, పరాంగతిం - ఆ పరమపదమును పొందును. ॥33॥

శ్లో॥ తస్మిన్భవంతావఖిలాత్మ హేతౌ
నారాయణే కారణమర్త్యమూర్తౌ ।
భావంవిధత్తో నితరాం మహాత్మన్
కిం వావశిష్టం యువయోస్తు కృత్యమ్ ॥ ॥34॥

టీ॥ తస్మిన్నితి. అఖిలస్యాత్మా చ హేతుశ్చతస్మిన్ కారణేన మనుష్యాకృతౌ మహాత్మన్ మహాత్మని పరిపూర్ణే భవంతౌ భక్తిం కురుతః. అతః కృతవానిత్యర్థః ॥33॥

తా॥ అఖిలాత్ముడు, పరమకారణుడు, మనుష్యరూపమును ధరించిన కారణజన్ముడును అయిన ఆ నాయణుని యందు మీరిరువురును - సర్వాత్మనా ఆ మహాత్ముని యందు మిక్కిలి భక్తి భావమును కలిగి యుండిన యెడల నిక మీకు చేయదగినదేమి మిగులును? చేయున దేమియు నుండదు. (34)

టీ॥ సమస్తమునకు ఆత్మ, కారణము - అతని యందు ఏదో కారణమున మనుష్య రూపము నందు గల మహాత్ముని యందు- పరిపూర్ణుని యందు భక్తిని నెరపుదు. దాని వలన ధన్యులగుదురని యర్థము. ॥34॥

శ్లో॥ ఆగమిష్యత్యదీర్ఘేణ కాలేన వ్రజమచ్యుతః ।
ప్రియంవిధాస్యతే పిత్రోర్భగవాన్ సాత్త్వతాం పతిః ॥ ॥35॥

తా॥ కృష్ణుడు త్వరలోనే వ్రజమునకు వచ్చును. తలిదండ్రులకు ప్రియమును చేయును. సాత్వతులకు పతియైన కృష్ణభగవానుడు మీకు ప్రీతిని కలిగించును. (35)

టీ॥ ప్రస్తుతమాహ. ఆగమిష్యతీతి. పిత్రోర్యువయోః. ॥35॥

టీ॥ ప్రస్తుతమును చెప్పుచున్నాడు.- పిత్రోః -తల్లిదండ్రులగు మీకు.॥35॥

శ్లో॥ హత్వా కంసం రంగమధ్యే ప్రతీపం సర్వసాత్త్వతామ్ ।
యదాహ వస్సమాగమ్య కృష్ణస్సత్యం కరోతి తత్ ॥ ॥36॥

తా॥ యాదవులందరికిని శత్రువైన కంసుని రంగ ప్రదేశమున చంపి, కృష్ణుడు మీ వద్దకు వచ్చి ఏది చెప్పెనో దానినతడు తప్పక చేయును.(36

శ్లో॥ మా ఖిద్యతం మహాభాగౌ ద్రక్ష్యథః కృష్ణమంతి కే ।
అంతర్హృది స భూతానామాస్తేజ్యోతిరివైధసి ॥ ॥37॥

తా॥ భాగ్యశాలులారా! (యశోదానందులారా!) దుఃఖింపకుడు. మీరు శ్రీకృష్ణుని మీసమీపముననే చూచెదరు. కట్టెయందు అగ్నివ్యాప్తమై యుండునట్లు కృష్ణుడు సమస్తప్రాణుల హృదయముల లోపలనున్నాడు. (37)

టీ॥ హత్వేతి.“యాత యూయం వ్రజం తాత వయం చ స్నేహ దుఃఖితాన్, జ్ఞాతీన్ వో ద్రష్టుమేష్యామో విధాయ సుహృదాం సుఖ”మితి యదాహ కృష్ణస్తత్సత్యం కరిష్యతీతి. కాలవిలంబమసహమానౌ ప్రత్యాహ – మాఖిద్యతమితి. హే మహాభాగౌ అంతికే ఇదానీమేవ సమీపే కుత ఇత్యత ఆహ – అంతర్హృదీతి. తర్హి సర్వైః కిమితి న దృశ్యతే? తత్రాహ – జ్యోతిరివైధసీతి. జ్యోతిరివ జ్యోతిర్యథా మథనం వినా న దృశ్యతే తథా భక్తిం వినా శ్రీకృష్ణోఽపీతి భావః. ॥36.37॥

టీ॥ “మీరు వ్రజమునకు పొండు, తండ్రీ! మేము స్నేహ దుఃఖితులైన బంధువులను, స్నేహితులను ఓదార్చి వారికి స్వాస్థ్యము కలిగించి మిమ్ము చూచుటకు మఱల వ్రజమునకు వచ్చెదము” అని కృష్ణుడు ఏది చెప్పెనో దానిని సత్యముగా చేయును–ఆలస్యమును సహింప జాలని యశోదా నందులను గూర్చి చెప్పుచున్నాడు. ‘మాఖిద్యతం’ అని. ఓ భాగ్యశాలులారా! ఇప్పుడే సమీపముననే అని చెప్పుచున్నాడు. అయినచో అందఱికిని ఎందుకు కనబడడు? చెప్పుచున్నాడు. జ్యోతిరివైధసి అని–మథనము లేకుండ –అగ్ని కనబడనట్లు, భక్తిలేక శ్రీకృష్ణుడును కనబడడు అని భావము. (36–37)

శ్లో॥ నహ్యస్యాతి ప్రియః కశ్చిన్నాప్రియో నాస్త్యమానినః ।
నోత్తమో నాధమో వాపి సమానస్య సమోపి వా ॥ ॥38॥

తా॥ ఇతనికి ప్రియుమైనవాడు, లేక అప్రియుమైనవాడు, గౌరవింపదగిన వాడు అనియు లేక ఉత్తముడు, అధముడు అను వారెవ్వరును ప్రత్యేకముగ లేరు. అతడు అందరికి సమానుడు.– అట్టి సమభావము గల అతనికి సమానుడు కూడా లేడు. (38)

శ్లో॥ న మాతా న పితా తస్య న భార్యా న సుతాదయః ।
నాత్మీయో నాపరశ్చాపి న దేహో జన్మచైవ వా ॥ ॥39॥

తా॥ అతనికి తల్లి లేదు, తండ్రి లేదు, భార్య లేదు, పుత్రులు మొదలగు వారు లేరు, తన వాడు, పరుడు అనునట్టి భేద భావము లేదు. అతనికి దేహమే లేదు. కావున జన్మకూడ లేదు. (39)

టీ॥ అహో ఆస్తామేత్ తస్య త్విహాగమనం స్వస్యాతిప్రియాన్ పిత్రాదీన్ విహాయ న సంగచ్ఛత ఇతి మన్యే. తత్రాహ – నేతి. అస్య ప్రియాదయో న హి సంతి. తత్ర హేతుః అమానినః సమానస్యేతి చ॥ (38,39)

టీ॥ అహో! యట్లుండనిండు అతనికి ఇచటికి వచ్చుట యనునది తనకు అత్యంత ప్రియమైన తల్లిదండ్రులు మొదలగువారిని విడిచి వెడలడని యనుకొందును. అతనికి ప్రియమైనవారు, మొదలగు స్థితులు ఉండవు కారణము సమానునకు అమానులుండరు అని. ॥38,39॥

శ్లో॥ న చాస్య కర్మ వా లోకే సదసన్మిశ్ర యోనిషు ।
క్రీడార్థస్సోఽపి సాధూనాం పరిత్రాణాయ కల్పతే ॥ ॥40॥

తా॥ అతనికి ఏ కర్మయులేదు, అయినను సాధువులను రక్షించుట కొఱకు, లీలకొఱకుగాను, సాత్విక, రాజస, తామస, మిశ్ర యోనుల యందు ఆవిర్భవించుచుండును. (40)

టీ॥ నేతి. సోఽపి జన్మకర్మాది రహితోఽపి క్రీడాప్రయోజనస్సన్. సాధూనాం పరిపాలనాయ సదసన్మిశ్రయోనిషు సాత్విక రాజస తామస మిశ్ర యోనిషు యద్వా. దేవాది మత్స్యాది నృసింహాది యోనిషు. కల్పతే ఆవిర్భవతీత్యర్థః. ॥40॥

టీ॥ అతడు జన్మకర్మ మొదలగునవి లేని వాడైనను లీలయే ప్రయోజనముగా గల వాడగుచు సాధువు యొక్క రక్షణ కొఱకు సదసన్మిశ్ర యోనిషు –సాత్విక, రాజస, తామస, మిశ్రయోనుల యందు లేక దేవతలు మొదలగు వాని యందు, మత్స్యములు మున్నగు వాని యందు నరసింహాది యోనులయందు –కల్పతే – ఆవిర్భవించును. అని అర్థము. ॥40॥

శ్లో॥ సత్త్వం రజస్తమ ఇతి భజతే నిర్గుణో గుణాన్ ।
క్రీడన్నసీహోఽపి గుణైస్సృజత్యవతి హంత్యజః ॥ ॥41॥

తా॥ నిర్గుణుడేయైనను సత్వ రజస్తమములు అను గుణములను భజించుచుండును. ఏ కోరిక లేని వాడే యైనను జన్మలేని పరమాత్ముడు గుణములతో క్రీడించుచు సృష్టి స్థితి లయములను చేయుచుండును. (41)

టీ॥ నను జన్మకర్మాదిరహితస్య కుత ఏతదిత్యత ఆహ - సత్త్వమితి. క్రీడాయామనీహోఽపి క్రీడన్. తథాపి మాయాగుణై ర్ఘటత ఇత్యర్థః ॥41॥

టీ॥ జన్మకర్మాదులు లేని వానికి ఇది అంతయునెందులకు? చెప్పు చున్నాడు క్రీడించుట యందు కోఱిక లేకున్నను క్రీడించుచు- అట్లయినను మాయా గుణముల చేత చేష్టలు చేయును అని అర్థము. 41

శ్లో॥ యథా భ్రమరికాదృష్ట్యా భ్రామ్యతీవ మహీ తథా ।
చిత్తే కర్తరి తత్రాత్మా కర్తేవాహంధియా స్మృతః ॥ ॥42॥

తా॥ తిరుగుచున్న తుమ్మెద దృష్టితో భూమియే తిరుగుచున్నట్లుగ భావింపబడునో అట్లే చిత్తము కర్తకాగా అచటి అహంబుద్ధి నేనే కర్తను అను బుద్ధితో నుండునట్లు చెప్పబడుచున్నది. (42)

టీ॥ అత్రావిద్యోపాధేర్జీవస్య కర్తృత్వం దృష్టాంతీ కుర్వన్ తస్యావిద్యయైవ కర్తృత్వమితి సదృష్టాంతమాహ - యథేతి. భ్రమరికా పరిభ్రమణం తయోపలక్షితయా దృష్ట్యా భూరపి భ్రామ్యతీవ యథా ప్రతీయతే. ఏవం చిత్తే కర్తరిసతి తత్రచిత్తే అహంధియా ఆత్మాధ్యాసేన ఆత్మా కర్తా స్మృతో యథా తద్వదితి. ॥42॥

టీ॥ ఇచట అవిద్యోపాధియే జీవుని కర్తృత్వము గల వానిగ చేయు చున్నది అను విషయమును దృష్టాంతముగ చేయుచు, అతని అవిద్య చేతనే కర్తృత్వము అని దృష్టాంతముతో చెప్పుచున్నాడు. తుమ్మెద తిరుగుట దాని దృష్టితో భూమి కూడ తిరుగుచున్నట్లు ఎట్లు ప్రతీతమగునో అట్లే చిత్తము కర్త యగుచుండగా ఆ చిత్తము నందలి అహం బుద్ధి చేత ఆత్మాధ్యాస చేత ( చిత్తమునే ఆత్మయని భ్రమించుట చేత) ఆత్మయే కర్తగా చెప్పబడుట ఎట్లో ఆవిధముగ అని ॥42॥

శ్లో॥ యువయోరేవ నైవాయమాత్మజో భగవాన్ హరిః ।
సర్వేషామాత్మజో హ్యాత్మా పితామాతా స ఈశ్వరః ॥ ॥43॥

టీ॥ కించ యువయోరేవ నాయమాత్మజః కింతు సర్వేషామపి. తత్రాపి నాత్మజ ఏవ కింతు శత్రుమిత్రాదిరూపోఽపీతి సర్వాత్మ నిరూపణేన మోహ నివృత్తయే సంబంధమనైకాంతికం కరోతి ద్వాభ్యాం. యువయోరితి. ॥43॥

తా॥ తన నుండి తానే పుట్టిన భగవానుడగు హరి మీకు మాత్రమే కాక సమస్త ప్రాణులకును ఆత్మయే అగుచున్నాడు. అంతే కాదు అతడే తల్లి అతడే తండ్రి అతడే ఈశ్వరుడు.(43)

టీ॥ మరియు మీకు మాత్రమే ఇతడు కొడుకు కాడు. అందరికిని కూడ అట్లైనను ఆత్మజుడే కాదు కాని, శత్రు మిత్రాది రూపుడు కూడ అని సర్వాత్మ నిరూపణము చేత, మోహ నివృత్తి కొఱకు సంబంధమును బాహుళ్యమును కూర్చుచున్నాడు రెండు శ్లోకముల చేత. ॥43॥

శ్లో॥ దృష్టం శ్రుతం భూతభవద్భవిష్య
త్స్థాస్నుశ్చరిష్ణుర్మహదల్పకం వా ।
వినాచ్యుతాద్వస్తు తరాం న వాచ్యం
స ఏవ సర్వం పరమార్థభూతః ॥ ॥44॥

టీ॥ దృష్టమితి. అచ్యుతాద్వినాతరాం నితరాం తత్వతో వాచ్యం నిర్వచనార్హం వస్తు నాస్తీతి. ॥44॥

తా॥ చూచినది, వినినది, గడిచినది, జరుగుచున్నది, రాబోవునది స్థావరము, జంగమము, గొప్పది, అల్పమైనది, అయిన ఏ పదార్థమైనను కృష్ణుని కంటె ఇతరమైనది కృష్ణుని కంటె వేఱుగ నిర్వచింపదగినది ఏదియు లేదు. అతడు ఒక్కడే పరమార్థ భూతుడు. (44)

టీ॥ అచ్యుతాద్వినాతరాం– కృష్ణుని తప్పించి బొత్తిగ తత్త్వతః చెప్పదగినది నిర్వచింపదగిన వస్తువు లేదు అని. ॥44॥

*శ్రీశుక ఉవాచ:*

శ్లో॥ ఏవం నిశా సా బ్రువతోర్వ్యతీతా
నందస్యకృష్ణానుచరస్య రాజన్ ।
గోప్యస్సముత్థాయ నిరూప్యదీపా
న్వాస్తూన్ సమభ్యర్చ్య దధీన్యమంథన్ ॥ ॥45॥

*శ్రీశుకుడిట్లనెను.*

తా॥ రాజా! ఈ విధముగ కృష్ణుని అనుచరుడగు ఉద్ధవుడు, నందుడును, మాట్లాడుకొనుచుండగా ఆ రాత్రి గడిచిపోయెను. అప్పుడు గోపికలు లేచి దీపములు వెలిగించి కడపలు మున్నగు వానిని పూజించి పెరుగును చిలికిరి. (45)

టీ॥ ఏవమితి దీపాన్ నిరూప్య ప్రజ్వాల్య వాస్తూన్ దేహళ్యాదీన్॥45॥

టీ॥ దీపాన్ నిరూప్య - దీపములను వెలిగించి - వాస్తూన్ -కడప మున్నగు వానిని ॥45॥

శ్లో॥ తా దీపదీప్తైర్మణిభిర్విరేజూ
రజ్జూ వికర్ష ద్భుజ కంకణ స్రజః ।
చలన్నితంబ స్తన హారకుండల
త్విషత్కపోలారుణ కుంకుమాననాః ॥ ॥46॥

తా॥ ఆ దీపపు కాంతిలో మణులతో కూడి యున్న ఆ గోపస్త్రీలు, కాంచీ (మొలనూలు) త్రాళ్ళు విప్పుచు, భుజముల ఆభరణములు విప్పుచు, కంకణములు, పూల దండలు, విడుచుచును, కదలుచున్న పిరుదులు, స్తనములు, హారములు, గలవారై కుండలముల మెఱుపు లతోడి చెక్కిళ్ళు గలవారై, ఎఱ్ఱని కుంకుమ రాగముతో ప్రకాశించు ముఖములు గలవారై మిక్కిలి అందముగా ప్రకాశించిరి. (46)

శ్లో॥ ఉద్గాయతీనామరవిందలోచనం
వ్రజాంగనానాం దివమస్పృశద్ధ్వనిః ।
దధ్నశ్చ నిర్మంథన శబ్దమిశ్రితో
నిరస్యతే యేన దిశామమంగళమ్ ॥ ॥47॥

తా॥ శ్రావ్యముగ ఉచ్చై స్వరమున కృష్ణుని గూర్చి పాడుచున్న గోప స్త్రీల యొక్క గానము ధ్వని, వారు పెరుగు చిలుకుచున్న ధ్వనితో సమ్మేళనమును పొంది అది స్వర్గమును తాకు చుండెను. ఆ మిశ్రధ్వని దిక్కులనన్నింటిని వ్యాపించి ఆయా దిక్కుల యందలి అశుభముల నన్నింటిని తొలగించుచున్నది. (47)

శ్లో॥ భగవత్యుదితే సూర్యే వ్రజద్వారి వ్రజౌకసః ।
దృష్ట్వా రథం శాతకుంభం కస్యాయమితి చాబ్రువన్ ॥ ॥48॥

తా॥ సూర్యభగవానుడు ఉదయింపగానే వ్రజ వాసులు, వ్రజ ద్వారమున నొక బంగారు రథమును చూచి -ఈ రథము ఎవరిదై యుండవచ్చును? అని ఒకరితోనొకరు ప్రశ్నించుకొనుచుండిరి. (48)

టీ॥ తా ఇతి. మణిభిః కాంచ్యాదిషు స్థితైః రజ్జుర్వికర్షత్సు భుజేషు కంకణానాం స్రజో యాసాం తాః. చలంతో నితంబాః స్తనాహారాశ్చ యాసాం. కుండలైస్త్విషంతః స్ఫురంతః కపోలాః యాసాం అరుణాని కుంకుమాని యేషు తాని ఆననాని యాసాం. తా ఏవ. తాశ్చ తాశ్చ.॥ ॥46-48॥

టీ॥ మణులచేత, కాంచి మొదలగు వాని యందున్న త్రాళ్ళు వదలించుచు, భుజముల యందు కంకణముల యొక్క దండలు ఎవరి యందో వారు, కదలుచున్న నితంబములు, స్తనములు వాని యందలి హారములు, ఎవరి యందో వారు, కుండలముల చేత మెఱయుచున్న చెక్కిళ్ళు ఎవరియందో వారు, ఎఱ్ఱని కుంకుమలు వేని యందో అట్టి ముఖములు ఎవరి యందో వారే - వారు వారు (ఆయా స్త్రీలు) (46-48)

శ్లో॥ అక్రూర ఆగతః కిం వా యః కంసస్యార్థ సాధకః ।
యేన నీతో మధుపురీం కృష్ణః కమల లోచనః ॥ ॥49॥

తా॥ కంసుని ప్రయోజనమును సాధించువాడగు అక్రూరుడు మఱల వచ్చెనా యేమి? కమలలోచనుడగు కృష్ణుడు అతనిచేతనే మధురాపురికి తరలింపబడెను కదా! (49)

టీ॥ తదా వ్రజౌకసో గోప్యః సక్రోధమాహుః అక్రూర ఇతి. అర్థం సాధితవానిత్యర్థః సాధకః తదాహుః యేన నీత ఇతి. ॥49॥

టీ॥ వ్రజమునందుండు గోప స్త్రీలు కోపముతో అనిరి.- ప్రయోజనమును సాధించెను గదా! అని అర్థము. సాధకుడు, కృష్ణుని మధురకు తీసికొని పోయెను. అని ఆ గోపస్త్రీలు అనిరి. ॥49॥

శ్లో॥ కిం సాధయిష్యత్యస్మాభిర్భర్తుః ప్రీతస్య నిష్కృతిమ్ ।
తత స్త్రీణాం వదంతీనాముద్ధవోఽగాత్కృతాహ్నికః ॥ ॥50॥

తా॥ చనిపోయిన కంసుని ప్రీతి కొఱకు మన చేత ఏమి సాధింప జేయును?- స్త్రీలు ఆ విధముగ చెప్పుకొనుచుండగా, సంధ్యావందనాది కృత్యములు ముగించుకొని ఉద్ధవుడు వచ్చెను. (50)

టీ॥ కంసం ఘాతయిత్వా పునః కిమర్థమాగత ఇత్యాశంక్య కార్యం సంభావయంతి కిమితి. తదా సాధితేన కార్యేణ ప్రీతస్యభర్తుః పాఠాంతరే ప్రేతస్య మృతస్య కంసస్య నిష్కృతం ఔర్ధ్వదైహికమస్మాభిః కృత్వా సాధయిష్యతే కిం అస్మన్మాంసైః కిం పిండాన్ కృత్వా దాస్యతీత్యర్థః ఏవం వదంతీనాం స్త్రీణాం. తతస్తస్మిన్నవసరే కృతస్నానాదినియమ ఉద్ధవ ఆగాత్ ఆగతః. ॥50॥

టీ॥ కంసుని చంపించి మఱల ఎందుకు వచ్చెను? అని మొదలుగ శంకించి కార్యమును సంభావించుచుండిరా ఏమి? –అప్పుడు సాధించిన కార్యము చేత ప్రీతుడైన కంసుని యొక్క –పాఠాంతరమున ప్రేతస్య – మృతుడైన కంసుని యొక్క నిష్కృతిని – ఉత్తరక్రియను మన చేత చేయించి సాధింపజేయునా ఏమి? మన మాంసముల చేత పిండము లేమైనను చేసి ఆ ప్రేతకు ఇచ్చునా ఏమి? అని అర్థము – ఇట్లు మాట్లాడుచున్న స్త్రీలకు – అప్పుడు ఆసమయమున, స్నానము మొదలగు కృత్యములు చేయవలసిన నియమము ఉండగా ఉద్ధవుడు వచ్చెను. ॥50॥

**శ్రీ మద్భాగవతే, మహాపురాణే దశమస్కంధే,**
**షట్చత్వారింశోఽధ్యాయః**

**అని శ్రీమద్భాగవతమున దశమస్కంధమందు**
**నలుబదియారవ అధ్యాయము సమాప్తము.**

## సప్తచత్వారింశోఽధ్యాయః

### శ్రీశుక ఉవాచ

శ్లో॥ తం వీక్ష్య కృష్ణానుచరం వ్రజం స్త్రియః
ప్రలంబబాహుం నవకంజ లోచమ్ ।
పీతాంబరం పుష్కరమాలినం లస
న్ముఖారవిందంపరిమృష్ట కుండలమ్ ॥ ॥1॥

టీ॥ శ్లో" సప్తచత్వారింశకేఽనాథ కృష్ణాదేశేన గోపికాః బోధయి త్వోద్ధవ స్తత్త్వమనుజ్ఞాప్యాగమత్పురీం". ॥1॥

శ్లో॥ శుచిస్మితః కోఽయమపీచ్యదర్శనః
కుతశ్చ కస్యాచ్యుత వేశభూషణః ।
ఇతీవ సర్వాః పరివవ్రురుత్సుకా
స్తముత్తమశ్లోక పదాంబుజాశ్రయః ॥ ॥2॥

## నలువదిఏడవ అధ్యాయము

### శ్రీశుకులు ఇట్లు పలికిరి

తా॥ వ్రజమునందలి స్త్రీలు కృష్ణుని అనుచరుడు, ఆజానుబాహువు క్రొత్త తామర రేకుల వంటి కన్నులు గలవాడు పీతాంబరమును ధరించిన వాడు, మెట్ట తామర పూవుల మాలను ధరించి యున్న వాడు, వికాసవంతమైన తామర వంటి ముఖము గలవాడు, పరిశుద్ధము చేయబడిన కుండలములు ధరించి యున్న వాడును అయిన ఉద్ధవుని చూచి. (1)

టీ॥ ఇక నలువదిఏడవ అధ్యాయమున-కృష్ణుని ఆదేశము చేత గోపికలకు ఉద్ధవుడు తత్త్వమును బోధించి వారి నుండి సెలవు తీసుకొని తిరిగి మధురకు వచ్చెను (అనునది వర్ణింపబడినది) ॥1॥

తా॥ స్వచ్ఛమైన నవ్వు గల ఈతడు ఎవరు? సుందరముగ కన్పట్టు చున్న ఈతడు ఎక్కడి నుండి వచ్చినాడు? ఎవరికి సంబంధించిన వాడు? కృష్ణుని వలెనే వేష భూషణాదులు ధరించియున్న ఈతడు ఎచ్చటి వాడు? అని ఇట్లు తమలో తాముగా మాట్లాడుచూ గోపస్త్రీ లందును ఉత్తమ శ్లోకుడైన కృష్ణుని పాదపద్మముల నాశ్రయించి యున్న ఉద్ధవుని చుట్టును మూగిరి. (2)

శ్లో॥ తం ప్రశ్రయేణావనతాస్సుసత్కృతం
సవ్రీడహాసేక్షణ సూనృతాదిభిః ।
రహస్య పృచ్ఛన్నుపవిష్ట మాసనే
విజ్ఞాయ సందేశహరం రమాపతేః ॥ ॥3॥

తా॥ శ్రీకృష్ణుని నుండి సందేశమును కొనివచ్చిన వాడుగ అతనిని తెలుసుకొని, మిక్కిలి వినయముతో అవనతలై, సిగ్గుతో నవ్వుతో కూడిన చూపులతో, ఆహ్లాదకరమైన మాటలు మొదలగు వానితో అతనిని సత్కరించి, ఏకాంత స్థలమున ఆసనము నందు కూర్చుండజేసి గోప స్త్రీలు ఉద్ధవునితో నిట్లనిరి. ॥3॥

టీ॥ శుచిస్మిత ఇతి అపీచ్యం సుందరం దర్శనం యస్య సః అచ్యుతస్యేవ వేషో భూషణాని చ యస్య సః కోఽయం కుతో వాకస్య వేతి వదంత్యస్తం పరివవ్రుః. ॥2,3॥

టీ॥ అపీచ్యం - సుందరముగ దర్శనము ఎవనికో వాడు- కృష్ణుని వలెనే వేషభూషణాదులు ఎవనికో వాడు- ఇతడెవరు? ఎటనుండి వచ్చినాడు?ఎవరికి సంబంధించిన వాడు? అని మాటాడుకొనుచు అతని చుట్టును ఆవరించిరి. ॥2,3॥

శ్లో॥ జానీమస్త్వాం యదుపతేః పార్షదం సముపాగతమ్
భర్త్రేహప్రేషితః పిత్రోర్భవాన్ ప్రియచికీర్షయా ॥ ॥4॥

తా॥ శ్రీకృష్ణుని సేవకునిగా నిన్ను గుర్తించుచున్నాము-స్వామి చేత పంపబడిన వాడవై తలిదండ్రులగు యశోదా నందులకు ప్రీతి కలుగజేయ నిచ్ఛతో ఇచటికి వచ్చిన వానిగా తెలిసికొనుచున్నాము.(4)

టీ॥ జానీమ ఇతి పార్శదం సేవకం. ॥4॥

టీ॥ పార్షదం - సేవకునిగా - ॥4॥

శ్లో॥ అన్యథా గోవ్రజే తస్య స్మరణీయం న చక్ష్మహే ॥ ॥5॥

తా॥ లేని యెడల గో వ్రజమునందు అతనికి జ్ఞాపకమున నుంచుకొన దగినది మరియేదియును గానము. (5)

టీ॥ అన్యథేతి పిత్రోః ప్రియచికీర్షయేత్యత్ర హేతుః-అన్యథేతి. ॥5॥

టీ॥ తల్లిదండ్రులకు ప్రియమాచరించుటయే (ఇచటి) కారణము. లేకున్న మఱేమి? అని. ॥5॥

శ్లో॥ స్నేహానుబంధో బంధూనాం మునేరపి సుదుస్త్యజః ।
అన్యేష్వర్థకృతా మైత్రీ యావదర్థ విడంబనా ॥ ॥6॥

తా॥ తల్లిదండ్రులవంటి ఆత్మీయ బంధువుల స్నేహానుబంధములు, మునులకు కూడ విడువరానివి. ఇక ఇతరుల అనుబంధములన్నియు ఏదో ఒక ప్రయోజనము నాశించియుండును. అవి ఆ ప్రయోజన సిద్ధి కొఱకైన నటన వఱకే కొనసాగును. (6)

టీ॥ స్నేహబంధ ఇతి. అన్యథా గోవ్రజేత్యస్యేత్యత్ర హేతుః అన్యేష్వితి అర్థకృతా కార్యనిమిత్తా విడంబనమనుకరణమాత్రం. న తు తాత్వికీ మైత్రీ.॥6॥

టీ॥ ఇతరుల యందు కార్యనిమిత్తమైనవి. - విడంబనం-అనుకరణ - మాత్రము-కాని అది తాత్వికీ మైత్రికాదు.॥6॥

శ్లో॥ పుంభిస్త్రీషు కృతా యద్వత్సుమనస్స్వివ షట్పదైః ।
నిస్స్వంత్యజంతి గణికా అకల్యం నృపతిం ప్రజాః ॥ ॥7॥

తా॥ పురుషుల చేత స్త్రీలయందు చేయబడు ప్రేమానుబంధము. తుమ్మెదల చేత పూవుల యందు చేయబడు ప్రేమానుబంధము వంటిది. వేశ్యలు దరిద్రుని విడిచిపెట్టుదురు. అసమర్థుడైన రాజును ప్రజలు వదలిపెట్టుదురు. (7)

టీ॥ పుంభిరితి. పుంభిరితి దృష్టాంతః అస్యైవార్థస్య దర్శనే దృష్టాంత ప్రపంచః నిస్స్వమిత్యాదినా॥ 7॥

టీ॥ పురుషులచేత' అను నీ దృష్టాంతము ఈ అర్థమును తెలుపుటకే -నిస్స్వం"- 'ఏమియులేని వానిని' అను మొదలగు వాని చేత దృష్టాంతములు చెప్పుటయే- ॥7॥

శ్లో॥ అధీత విద్యా ఆచార్య మృత్విజో దత్త దక్షిణం
ఖగా పీత ఫలం వృక్షం భుక్త్వా చాతిథయో గృహమ్ ।
దగ్ధం మృగాస్తథారణ్యం జారో భుక్త్వా రతాం స్త్రియమ్॥ ॥8॥

తా॥ విద్యాభ్యాసము పూర్తియైన పిమ్మట శిష్యులు ఆచార్యునివిడిచి పోవుదురు. దక్షిణఇచ్చిన తరువాత, ఋత్విక్కులు, యజమానిని విడిచి పోవుదురు. ఫలరసమును పీల్చివేసిన పిదప పక్షులు, వృక్షమును విడిచి ఎగిరిపోవును. భోజనమైన పిమ్మట అతిథులు, ఇల్లు విడిచి తమ దారిన పోవుదురు. కార్చిచ్చుతో కాలిపోయిన అడవిని విడిచి మృగములు పారిపోవును. జారుడు అనుభవించిన పిమ్మట అసంతృప్తురాలైన స్త్రీని విడిచి పోవును. (8)

టీ॥ అధీతేతి. దత్తా దక్షిణా యేన తం పక్షిణో పీత ఫలం వృక్షం. రతాం అనురతాం అతృప్తామిత్యర్థః. ॥8॥

టీ॥ ఎవరిచేత దక్షిణ ఈయబడినదో వానిని (యజమానిని)–పక్షులు త్రాగి వేసిన రసము గల ఫలముతో నున్న వృక్షమును – రతాం – అనురతాం – తృప్తి చెందని స్త్రీని అని అర్థము.॥8॥

**శ్రీశుక ఉవాచ:**

శ్లో॥ ఇతి గోప్యాహి గోవింద గత వాక్కాయ మానసాః ।
కృష్ణదూతే వ్రజం యాతే ఉద్ధవేత్యక్త లౌకికాః ॥ ॥9॥

**శ్రీశుకుడిట్లనెను.**

తా॥ ఇట్లు గోపికలు, కృష్ణమయమైన వాక్కు, శరీరము, మనస్సు గలవారై కృష్ణుని దూత యగు ఉద్ధవుడు వ్రజమునకు వచ్చిన తరువాత లౌకికవ్యవహారములన్నియు విడిచి పెట్టిరి. (9)

టీ॥ ఇతీతి. త్యక్తలౌకికాః త్యక్తలోకవ్యవహారాః. ॥9॥

టీ॥ త్యక్తలౌకికాః – లోకవ్య వహారములను విడిచిన వారై. ॥9॥

శ్లో॥ గాయంత్యః ప్రియకర్మాణి రుదంత్యశ్చ గతహ్రియః ।
తస్య సంస్మృత్య సంస్మృత్య యాని కైశోర బాల్యయోః ॥ ॥10॥

తా॥ తమకు ఇష్టమైన కృష్ణలీలను గానము చేయుచు, లజ్జలు విడిచి ఏడ్చుచు కృష్ణుని బాల్యములందలి, కిశోర వయస్సునకు సంబంధించిన కృష్ణుని లీలలను స్మరించి స్మరించి అతనిని ప్రశ్నించిరి. (10)

టీ॥ గాయంత్య ఇతి. ప్రియస్య కర్మాణి గాయంత్యః. తథా తస్య బాల్యకైశోరయోర్యాణి కర్మాని తాని సంస్మృత్య సంస్మృత్య గత హ్రియస్సత్యోరుదంత్యశ్చ తమపృచ్ఛన్నితి పూర్వక్రియయైవ సంబంధః ॥10॥

టీ॥ ప్రియుని యొక్క కర్మలను పాడుచున్న వారై - అట్లే అతని బాల్యమునందలి కిశోరావస్థయందలి ఏ లీలలు గలవో వానిని, తలచుకొని తలచుకొని- సిగ్గులువిడిచిన వారై, ఏడ్చుచు- అతనిని అడిగిరి అని పూర్వ శ్లోకమునందలి క్రియతో అన్వయము.॥10॥

## భ్రమరగీతాదికథాప్రారంభఘట్టః

శ్లో॥ కాచిన్మధుకరం దృష్ట్వా ధ్యాయంతీ కృష్ణ సంగమమ్ ।
ప్రియ ప్రస్థాపితం దూతం కల్పయిత్వేదమబ్రవీత్ ॥ ॥11॥

## భ్రమర గీతాది కథా ప్రారంభ ఘట్టము.

తా॥ ఒకానొక గోపిక తుమ్మెదను చూచి, కృష్ణుని తోడి తన సంగమమును తలచుకొనుచున్నదై ఇతడు (ఈ తుమ్మెద లేక ఈ ఉద్ధవుడు) ప్రియుని చేత పంపబడిన దూత అని కల్పించుకొని ఇట్లనెను. ॥11॥

టీ॥ కాచిదితి. ప్రియేణ శ్రీకృష్ణేన మాం ప్రసాదయితుం ప్రస్థాపితోఽయం దూత ఇతి కల్పయిత్వా బ్రవీత్. యద్వా తస్మిన్ ప్రియ ప్రస్థాపితే ఉద్ధవే దృష్టిం కృత్వా మధుకరాపదేశేనోద్ధవ మేవాబ్రవీదిత్యర్థః ॥11॥

టీ॥ ప్రియుడైన కృష్ణుని చేత నన్ను సంతోషింపజేయుటకు పంపబడిన దూత ఇతడు. అని కల్పన చేసి ఇట్లు చెప్పెను. లేక ప్రియుని చేత నిజముగానే పంపబడిన ఉద్ధవుని యందు దృష్టి నుంచి, తుమ్మెద నెపముతో ఉద్ధవుని గూర్చియే ఇట్లనెనని అర్థము. ॥11॥

గోపికోవాచ

శ్లో॥ మధుప కితవ బంధో మాస్పృశాంఘ్రిం సపత్న్యాః
కుచ విలులిత మాలా కుంకుమశ్మశ్రుభిర్నః ।
వహతు మధుపతిస్తన్మానినీనాం ప్రసాదం
యదుసదసి విడంబం యస్య దూతస్త్వమీదృక్ ॥ ॥12॥

గోపిక ఇట్లనెను.

తా॥ తుమ్మెదా! ధూర్తబంధూ! సవతుల కుచములచే మర్దింపబడిన కృష్ణుని వనమాలకు గల ఈ కుంకుమతో కూడిన మీసముల చేత నా పాదములు స్పృశింపకుము. ఆ స్త్రీల యొక్క ప్రసాదమునే మధుపతి వహించును గాక, యదువంశీయుల సభలో హాస్యాస్పదముగ - కృష్ణుని దూతగ నీవు ఇట్టివాడవై వున్నావు.! (12)

టీ॥ మధుపేతి హే మధుప కితవస్య ధూర్తస్య బంధో. నోఽస్మాకం అంఘ్రిం మాస్పృశ. మా మాంనంస్కారేణ ప్రార్థయేదిత్యర్థః. తత్కిమిత్య పేక్షాయాం కృష్ణవర్ణస్య తస్య శ్మశ్రూణాం లోహితత్వే కారణ ముత్ప్రేక్షమాణాహ - స పత్న్యాః కుచాభ్యాం విలులితా సంమర్దితాయా శ్రీకృష్ణస్య వనమాలా అత ఏతస్యాః కుంకుమం యేషు తైః శ్మశ్రుభి రుపలక్షితః కింతు తాసామేవ మానినీనాం ప్రసాదం మధుపతిర్వహతు కిమస్మత్ప్రసాదేన తస్య యదుసదసి విడంబం ఉపహాసాస్పదం. కుతః యస్య దూతస్త్వమీదృగీ దృశః. ॥12॥

టీ॥ ఓ తుమ్మెదా! కితవస్య- ధూర్తుని యొక్క- బంధూ! నః-మా పాదములు తాకకుము. మమ్ము నమస్కారములతో ప్రార్థింపకుము. అది ఏమి అను అపేక్ష యందు - నల్లని వర్ణము గల అతని మీసములకు, ఎఱుపుదనమునకు కారణము నూహించుచు చెప్పు చున్నది. సవతి యొక్క స్తనముల చేత- విలలుతా- సమ్మర్దింపబడుట చేత శ్రీకృష్ణుని వనమాల - అందువలన ఈమె కుంకుమము వేని యందు గలదో అట్టి మీసముల చేత చూడబడుచున్నాడు. కాని, ఆ స్త్రీల యొక్క అనుగ్రహమునే మధుపతి వహించునుగాక - మా అనుగ్రహముతో అతనికేమి పని ? యదువుల సభలో ఉపహాసాస్పదుని ఎందుకు అతని దూతగాజేయబడిన వాడవు నీవు ఇట్టివాడవు! ॥12॥

శ్లో॥ సకృదధరసుధాం స్వాం మోహినీం పాయయిత్వా
సుమనస ఇవ సద్యస్తత్యజేఽస్మాన్భవా దృక్ ।
పరిచరతి కథం తత్పాదపద్మం ను పద్మా
అపిబత హృతచేతాహ్యుత్తమశ్లోకజల్పైః ॥ ॥13॥

తా॥ ఒక్కసారి తన అధరామృతమును త్రాగించి, ఆ మోహింపజేయు అమృతమును రుచి చూపించి, వెంటనే అప్పటికప్పుడే మమ్ము వదలి వేయును. మకరందమును పీల్చుకొని పుష్పములను విడిచిపెట్టు నీ వంటి వాడే ఆతడు, ఆ లక్ష్మి అతని పాదపద్మముల చుట్టును ఎట్లు తిరుగునో? అయినను అయ్యో! ఉత్తమశ్లోకుడగు కృష్ణుని యొక్క మిథ్యా కథల చేత హరింపబడిన మనస్సు కలది అయినది ఆ లక్ష్మి! (13)

టీ॥ నను కిమిత్యేవం తమవజానీథ. కింవస్తేనాపకృతమత ఆహ-సకృదితి. భవాదృక్ త్వాదృశో దుర్మనాః సుమనసః కుసుమాని యథా త్యజతి తద్వత్ తత్యజే త్యక్తవాన్. అహోబత అకృతజ్ఞస్య పాదపద్మం శ్రీః కథం సేవతే విదితం మయేత్యాహ-అపీతి, బతేతిఖేదే. ఉత్తమశ్లోకస్య జల్పైః మిథ్యాకథాభిః. ప్రాయో హృతచేతాః. వయం తు న లక్ష్మీవదవిచక్షణా ఇతి భావః. ॥13॥

టీ॥ అతనిని ఇట్లు ఎందుకు అవమానింతురు? మీకు అతడేమి అపకారము చేసెను? ఆవిషయము చెప్పుచున్నాడు నీవంటి దుష్ట మనస్కుడు-సుమనసః- పుష్పములను ఎట్లు విడిచివేయునో అట్లే అతడు వదలిపెట్టెను అయ్యో! ఆకృతఘ్నుని పాదపద్మములను లక్ష్మీ దేవి ఎట్లు సేవించును? ఆహా! నాకు తెలిసినది అని చెప్పుచున్నాడు బత' అని ఖేదమునందు-ఉత్తమశ్లోకుని యొక్క 'జల్పైః'-మిథ్యా కథలచే ప్రాయికముగ హరింపబడిన మనస్సు గలది- మేము మాత్రం లక్ష్మీ వలె అవిచక్షణులము కాము అని భావము. ॥13॥

శ్లో॥ కిమిహ బహు షడంఘ్రే గాయసి త్వం యదూనా
మధిపతి మగృహాణా మగ్రతో నః పురాణమ్ ।
విజయ సఖి సఖీనాం గీయతా తత్ర సంగః
క్షపిత కుచ రుజస్తే కల్పయంతీష్టమిష్టాః ॥ ॥14॥

తా॥ భ్రమరమా! ఆటవిక జీవనులమైన మా ముందు, మాకు పాతవాడే అయిన కృష్ణుని గూర్చి ఏల పాడుచున్నావు? కృష్ణుని ఇప్పటి స్నేహితురాండ్ర ముందు ఈ పాటల ప్రసంగము చేయుడు. వారు చేష్టలుడిగిన స్తనముల జాడ్యములతో ఉన్న వారు కావున వారిముందు కృష్ణ ప్రశంస చేసినచో నీ కిష్టమైన కోరికలను తీర్చెదరు. ॥14॥

టీ॥ ఝుంకారాన్ బహుధా కుర్వంతం అస్మత్ప్రసాదలాభాయ కృష్ణం గాయంతీతి మత్వాహ – కిమితి. పురాణం పురాతనం బహుశోఽనుభూతం. విజయ సఖస్య కృష్ణస్య సాంప్రతం యాస్సఖ్యః తాసామగ్రతః తత్ప్రసంగో గీయతాం. ఇష్టాః కృష్ణస్య ప్రియాః తేన పూజితా ఇతి వా. తేనాలం గీతేన అనేన క్షపితా కుచ రుక్ యాసాం తాః. తవేష్టమపేక్షితం దాస్యంతీతి.॥14॥

శ్లో॥ దివి భువి చ రసాయాం కాస్స్త్రియస్తద్దురాపాః
కపటరుచి రహాస భ్రూ విజృంభస్య యా స్స్యుః ।
చరణ రజ ఉపాస్తే యస్య భూతిర్వయం కా
హ్యపి చ కృపణ పక్షే హ్యుత్తమశ్లోక శబ్దః ॥ ॥15॥

టీ॥ ఝుంకారములను అనేక విధముగా చేయుచున్న తుమ్మెదను మా అనుగ్రహ లాభము కొఱకు కృష్ణుని గూర్చి పాడుచున్నాడని భావించి చెప్పుచున్నది – పురాణము – ఎన్నియో విధములుగా అనుభవింపబడిన వాడు విజయ సఖస్య – కృష్ణుని యొక్క – ఇప్పటి ఏ సేహితురాం(డ్రుగలరో వారి ముందు ఈ ప్రసంగమును గానము చేయుము కృష్ణునికి ప్రియమైన ఆ స్త్రీలు–లేక అతనిచే పూజింపబడిన ఆ స్త్రీలు – అందువలన మా ముందు ఈ గానము చాలును. అచట వారి ముందు ఈ గానము సాగించినచో– చేష్టలు దక్కియున్న కుచ జాడ్యములతో వారు బాధపడుచున్నారు కావున ఈ నీ గానము విని నీ కిష్టమైన ఏదైననూ ఇచ్చెదరు –అని. ॥14॥

తా॥ ఆకాశమునందును (స్వర్గమునందును), భూమి యందును రసాతలము యందును ఏ స్త్రీలు వసించుచున్నారో వారిలో ఏ స్త్రీ అతని కపటముతో కూడిన నవ్వుతో కనుబొమ్మల కదలికలతో అతనికి పొందరానిదియై యుండును? అందరునూ అతని చరణ ధూళిని ఉపాసించు వారే, మాలో కూడా ఒక్కతెయూ అతని ఐశ్వర్యమునందు గుర్తింపదగిన స్థానముగలదా? అయిననూ ఉత్తమశ్లోకుడు అను శబ్దము మాత్రము దీనుల పక్షము వహించువానికే సార్థకము సుమా! (15)

టీ॥ భో మాతర్మైవంవోచస్త్వా మనుస్మృత్యానుస్మృత్య అనంగ విక్లబ స్త్వాం ప్రసాదయితుం మామాదిష్టవానిత్యత ఆహ-దివీతి. దివి భువి రసాతలే చ యాః స్త్రియః స్యుః. తాః కా నామ దురాపాః? న కాశ్చన. తదిత్యవ్యయం. తస్యేత్యర్థః. కపటేన రుచిరేణ హాసేన భ్రూ విజృంభో యస్య తస్య హే కపటేతి వా. కించ. యస్య చరణ రజః శ్రీః సేవతే తత్ర వయం కాః. అపి చ యద్యప్యేవం, తథాపి కృపణ పక్షే కృపణానుకంపిని పురుషే ఉత్తమశ్లోక శబ్దో భవతీతి తథా కథనీయం త్వయేతి. ॥15॥

టీ॥ ఓ తల్లీ అటుల చెప్పకుము నిన్ను స్మరించి స్మరించి మన్మథ బాధితుడై నిన్ను అనుగ్రహించుటకై నన్ను ఆదేశించెను అని చెప్పుచున్నాడు - దివి యందు భువి యందు రసాతలమునను ఏ స్త్రీలు ఉన్నారో వారు పొందుటకు సాధ్యము కానివారనగా నేమి? అట్టి స్త్రీ ఒక్కరైనను లేరు. తత్ అనునది అవ్యయము - అతని యొక్క అని అర్థము, కపటముతో - సుందరమైన నవ్వుతో కనుబొమ్మల విజృంభణము ఎవనికో అతని- లేక ఓ కపటము గలవాడా! అనియూ - ఇంకనూ-ఎవని పాద ధూళిని లక్ష్మి సేవించునో అచట మేమెంత వారము? అట్లైనను - కృపణ పక్షే -దీనుల యందు దయచూపు పురుషుని యందు ఉత్తమ శ్లోకుడు అనుమాట సార్థకము అని మీ చేత అటుల చెప్పదగి యున్నది, అని. ॥15॥

శ్లో॥ విసృజ శిరసి పాదం వేద్మ్యహం చాటుకారై
రనునయవిదుషస్తేఽ భ్యేత్య దౌత్యైర్ముకుందాత్ ।
స్వకృత ఇహ విసృష్టాపత్య పత్యన్యలోకా
వ్యసృజ దకృత చేతాః కిం ను సంధేయమస్మిన్ ॥ ॥16॥

తా॥ నీ తలపై పెట్టుకొనిన నా పాదమును విడువుము. నాకు తెలియును దూత కార్యమును నిర్వర్తించు వారు, అనునయము చేయుట యందు పండితుడైన శ్రీకృష్ణుని నుండి ఆ విద్యను నేర్చుకొని -ప్రియోక్తి రచనల చేత వంచించు చుందురు. ఆ కృష్ణుని కొఱకే భర్తలను సంతానమును, ధర్మసాధ్యములైన ఇతర ఉత్తమలోకములను మేము విడిచిపెట్టి యుంటిమి - ఇక అతడేమో దేనికిని కట్టుబడని చిత్తము గలవాడై మమ్ము వదలెను. ఇప్పుడు ఏమి చేయవలెను.? ఏమనుకొనవలెను?॥16॥

టీ॥ పాదమూలే ప్రవిశంతం క్షమాపయిష్యంతమివ మత్వాహ- విసృజేతి. శిరసిన్యస్తం పాదం విసృజ. తథాప్య ముంచంతమాహ - వేద్మీతి. ముకుందాదభ్యేత్య తతః శిక్షిత్వేత్యర్థః. దౌత్యైర్దూతకర్మభిః. చాటుకారైః ప్రియోక్తి రచనాభిః అనునయ విదుషః ప్రార్థనా చతురస్య. తే సర్వమహం వేద్మి ముకుందవత్ త్వమప్య విశ్వసనీయ ఇతి భావః నను తేన తే కిమపరాధం? తత్రాహ- స్వకృత ఇతి. స్వకృతే తదర్థమేవ విసృష్టాః అపత్య పత్యన్యలోకాః అపత్యాని పతయశ్చేతీహ లోకః అన్య లోకో ధర్మ సాధ్యశ్చ యాభిస్తాః నః అకృత చేతాః అసంయత చిత్తః యో వ్యసృజత్ అతః అస్మిన్ కిం ను సంధాతవ్యమితి. ॥16॥

టీ॥ పాదము క్రింద భాగమునకు ప్రవేశించుచున్న తుమ్మెదను, క్షమాపణ కోరుచున్న వానిగ భావించి చెప్పుచున్నది. నీ తలపై పెట్టుకొనిన నా పాదమును విడువుము. అట్లైనను పాదమును వదలని తుమ్మెదను ఉద్దేశించి ఇట్లు చెప్పుచున్నది. ముకుందుని నుండి నేర్చుకొని - బాగుగ శిక్షణను పొంది అని అర్థము. దూత కర్మలచే! ప్రియ వాక్య రచనల చేత ప్రార్థనా చతురుని యొక్క -అది అంతయు నాకు తెలియును. శ్రీకృష్ణుని వలె నీవు కూడ నమ్మదగిన వాడవు కావు. ఐనను అతడేమి అపరాధము చేసెను? చెప్పుచున్నాడు, అతని కొఱకే, మా సంతానములను భర్తలను అన్యలోకములను,(ధర్మముతో సాధింపదగిన) ఉత్తమలోకములను వదిలితిమి, అకృతచేతాః- కట్టుబాటు లేని చిత్తము కలవాడై అతడు మమ్ము వదిలెను. ఇక ఇప్పుడేమి చేయగలము? ॥16॥

శ్లో॥ మృగయురివ కపీంద్రం వివ్యధే లుబ్ధధర్మా
స్త్రియమకృతవిరూపాం స్త్రీజితః కామయానామ్ ।
బలిమపి బలి మత్త్వా వేష్టయద్ధ్వాంక్షవద్య
స్తదలమసిత సఖ్యై ర్దుస్త్యజస్తత్కథార్థః ॥ ॥17॥

తా॥ మృగములను చంపు వేటగాని వలె కపి శ్రేష్ఠుడైన వాలిని వధించెను క్రూరమైన ధర్మము గలిగిన వాడై, శూర్పణఖయను స్త్రీని ముక్కు చెవులు కోసి కురూపిని చేసెను. అదియును సీతాపరవశుడై, కోరిన చోటికి ప్రయాణింపగల ఆ స్త్రీని విరూపిని చేసెను, బలిని కూడా అతడిచ్చిన పూజను స్వీకరించి, ఇచ్చిన నైవేద్యమునారగించి కాకి వలె అతనిని బంధించెను కృష్ణుని స్నేహము చాలును, కాని అతని కథార్థములు విడువరాని వగుచున్నవి. ॥17॥

టీ॥ కించ కృష్ణస్య పూర్వాణి కర్మాణి అనుసందధానా బిభేమ్యమస్మాదిత్యాహ- మృగయురితి. మృగయుర్లుబ్ధక ఇవ. యః కపీంద్రం వాలినం వివ్యధే అవిధ్యత్ లుబ్ధధర్మా క్రౌర్యధర్మవాన్ అలుబ్ధ ధర్మేతి వా. లుబ్ధకో హి తన్మాంసమత్తుకామో విధ్యతి. అయం తు న తథా అతో వృధాకఠిన ఇత్యర్థః. తథాస్త్రియం చ శూర్పణఖాం స్త్రీజితః సీతాపరతంత్రః. కామ ఏవ యానం ప్రాప్తి సాధనం యస్యాస్తాం విరూపాం ఛిన్న కర్ణ నాసికా మకరోద్దాశరథి రూపేణ. తథా బలిమపి తద్దత్తబలిం అత్వా భక్షయిత్వా. ధ్వాంక్షవత్కాకవదవేష్టయత్ బబంధ వామన రూపేణ. బలిమపి బలిమత్వాధోక్షిప ద్విష్టపాదితి పాఠే బలిం పూజాం గృహీత్వా విష్టపాత్స్వర్గాదధః అక్షిపదిత్యర్థః. తత్తస్మాదసి తస్య కృష్ణస్య. సఖ్యైరలం. ఏవం చేత్కిమితి తం నిత్యం గాయథ? తత్రాహ - దుస్త్యజ ఇతి తస్య కథా రూపోఽర్థః ఇత్యపి చ జానీమ ఏవేతి. ॥17॥

టీ॥ కృష్ణుని పూర్వావతారముల కర్మలు అనుసంధించుచు దీని వలన నేను భయపడుచున్నాను అని చెప్పుచున్నది- లుబ్ధకునివలె- ఎవడు కపిశ్రేష్ఠుడైన వాలిని చంపెనో-క్రూరధర్ముడై లుబ్ధుడుకూడా చంపిన జంతువు యొక్కమాంసమునపేక్షించి చంపును కానీ ఇతడు అట్లు కాదు అందువలన వ్యర్థముగనే ఇతడు కఠినుడైయున్నాడు అని అర్థము. అట్లే స్త్రీని - శూర్పణఖను-స్త్రీజితః సీతాపరతంత్రుడై- కామమేప్రాప్తి సాధనమెవరికో ఆమెను వికారరూపముగల దానిగా ఛేదించిన చెవి ముక్కుగల దానిగ చేసెను రాముని రూపమున-అట్లే బలిని కూడా- అతడిచ్చిన బలిని భక్షించి - ధ్వాంక్షవత్ కాకివలె అవేష్టయత్ - బంధించెను వామన రూపముతో - బలిని కూడా 'బలమత్వధోక్షపద్విష్టపాత్' అను పాఠమున- పూజను స్వీకరించి స్వర్గము నుండి కిందకు తోసివేసెనని అర్థము. అందువలన కృష్ణుని నల్లని ఆ కృష్ణుని స్నేహము చాలును ఇటులైనచో అతనిని గూర్చి నిత్యము ఎందుకు పాడుచున్నారు? అందువేమో? చెప్పుచున్నది దుస్త్యజః అని. అతని కథారూపమైన అర్థమనియును యెరుంగుదుమనియే అని. (అతని కథలు విడువరానివగుచున్నవి) ॥17॥

శ్లో॥ యదనుచరిత లీలా కర్ణ పీయూష విప్రుట్
తృకృదదన విధూత ద్వంద్వ ధర్మా వినష్టాః ।
సపది గృహ కుటుంబం దీన ముత్సృజ్య దీనా
బహవ ఇవ విహంగా భిక్షు చర్యాం చరంతి ॥ ॥18॥

తా॥ ఏ కృష్ణుడు అనుసరించిన లీలలే చెవులకు అమృతప్రాయమై దానిని క్షణికముగనైను ఒకసారి పానము చేసినచో రాగద్వేషాది ద్వంద్వ స్వభావములను తొలగించుకొని, అప్పటికప్పుడే సాంసారిక బంధము లతో దీన స్థితిలో నున్న తమ గృహములను కుటుంబములను విడిచి పెట్టి, దరిద్రులైన అనేకుల వలె దిక్కులేని పక్షులవలె భిక్షజేసికొనుచు దేహయాత్రను సాగింతురు. (విరక్తజీవనులగుదురు) (18)

టీ॥ తత్కథాపి త్రివర్గ లతా మూలోన్మూలినీ తథాపి న త్యక్తుం శక్నుమః కిం కుర్మ ఇత్యాహ - యదితి. యస్యానుచరితమేవ లీలా. తదేవ కర్ణపీయూష్యం. విప్రుట్ కణికా తస్యాః. సకృదదనం సేవనం తేన విధూతాః నిరస్తాః ద్వంద్వ ధర్మాః రాగాదయో యేషాం తే. అత ఏవ వినష్టాః. అసత్తుల్యాః దీనం దుఃఖితం గృహ కుటుంబం విహాయ దీనాః భోగహీనాః విహంగా ఇవ భిక్షుచర్యాం ప్రాణవృత్తి మాత్రం చరంతి. అతస్త్యాజ్యః. తథాపి. త్యక్తుం న శక్నుమ ఇతి నిందాపర్వతే వాచకోఽర్థః దుస్త్యజత్వే ఆర్థికోఽయమర్థః విధూతద్వంద్వ ధర్మా ఇత్యంతః సమాసః పూర్వవత్ తతస్తేచ అవినష్టాశ్చేతి సమాసః. ఇతరే పునర్ద్వంద్వ ధర్మాణో వినష్టా ఏవ. సపది తత్క్షణమేవ దీనం తుచ్ఛం. గృహ సహితం కుటుంబం విహాయ దీనా ఇవా కించనాః ధీరా ఇతి వా పాఠః బహవః విహంగా హంసా ఇవ సారాసార వివేక చతురాః భిక్షుచర్యాం పారమహంస్యం చరంతి. తస్మాదేవం పరమ పురుషార్థ

టీ॥ కృష్ణుని కథ కూడా ధర్మార్థ కామములనెడు తీగ యొక్క వేఱును పెకిలించి వేయునది. అట్లయినను దానిని విడిచిపెట్టుటకు సమర్థులము కాలేక పోవుచున్నాము ఏమి చేయగలము? అని చెప్పుచున్నది ఎవని చర్యయే లీలయో అదియే చెవులకు అమృతము- విప్రుట్-క్షణికము -దానియొక్క ఒకసారి సేవించుటచేత విధూతాః- నిరస్తమై- ద్వంద్వ ధర్మాః - రాగద్వేషాది లక్షణములు ఎవరికో వారు దాని వలననే ద్వంద్వమైన ప్రవృత్తిని తొలగించుకొని శూన్యప్రాయులై దుఃఖితమైయున్న గృహమును కుటుంబమును వదలి భోగహీనులై పక్షులవలె భిక్షచర్య యందు ప్రాణవృత్తి మాత్రముగ చరింతురు అందువలన (సంసారము) వదల తగినది. అటులైనను వదులటుకు అశక్తులమౌచున్నాము అని, నిందాపరత్వము నందు శాబ్దికమైన అర్థము విడుచుటకు సాధ్యము కాని లక్షణము నందు ప్రయోజనము నాశించి చెప్పెడు అర్థమిది- విధూత ద్వంద్వ ధర్మా-అను వరకు సమాసము

రూపత్వాద్దుస్త్యజ ఏతత్కథార్థ ఇతి. ॥18॥

శ్లో॥ వయమృతమివ జిహ్మవ్యాహృతం శ్రద్దధానాః
కుళికరుతమివాజ్ఞాః కృష్ణవధ్వో హరిణ్యాః ।
దదృశిమ సకృదేతత్తన్న ఖస్పర్శతీవ్ర
స్మరరుజ ఉపమంత్రిన్ భణ్యతామన్యవార్తా ॥ ॥19॥

టీ॥ నను కింబ్రూషే. పూర్వం త్వయైవసాకం రహసి కిమేవం నావోచదిత్యత ఆహ-వయమితి. హే ఉపమంత్రిన్ దూత. ఆస్తామియం వార్తా. యతః కుళికస్య మృగయోః రుతం గీతం అజ్ఞాయథా ఋతం

పూర్వము చెప్పినట్లే అక్కడి నుండి 'అవినష్టాః' అనియును సమాసము ఇతరములైన ద్వంద్వ ధర్మ లేశములు తొలగినవి కావు లేక లేశ మాత్రములే తొలగినవి. తత్క్షణమే తుచ్ఛమైన గృహ సహితమైన కుటుంబమును వదలి దీనులవలె అకించనులవలె – ధీరాః అనియు పాఠము అనేకములైన పక్షులు హంసలవలె సారాసార వివేక చతురులై –భిక్షుచర్యాం– పరమహంస చర్య యందు చరింతురు అందువలన ఈ విధముగా పరమపురుషార్థ రూపమైన మోక్షప్రాప్తిత్వ లక్షణముచే కృష్ణ కథార్థత్వము విడుచుటకు సాధ్యము కానిది అని. ॥18॥

తా॥ ఓ దూతా ! వేటగాండ్రు చేయు మృగ ధ్వనుల వంటి ధ్వనులే ఆజ్ఞగా గలవియైన, కృష్ణసారమనెడు నల్లని జింక యొక్క భార్యలగు లేళ్ళు, ఆ ధ్వని నిజమైనదని నమ్మి ఎట్లు మోసపోవునో అట్లే మేము కూడా అతని కపట వాక్యములు సత్యములని మిక్కిలి శ్రద్ధతో నమ్మి ఈ నఖ క్షతములతో తీక్ష్ణమైన మన్మథబాధను ఒకసారి చూచితిమి. –ఇక అతని విషయము మాని మఱియేదైన వార్తను చెప్పుము. (19)

టీ॥ ఇటుల ఎందుకు చెప్పెదవు. పూర్వము నీ చేతనే ఏకాంతమున నున్నపుడు ఎందుకు చెప్పబడలేదు? అను ప్రశ్నకు చెప్పుచున్నాడు. హే ఉపమంత్రిన్ – ఓ దూతా ! ఈ వార్త అటుండనిమ్ము –

సత్యమితి శ్రద్దధానాః కృష్ణస్య హరిణస్య వధ్వః భార్యాః హరిణ్యః శరైః క్షతాస్సత్యో రుజో దదృశుః ఏవం జిహ్మస్య కుటిలస్య తస్య వ్యాహృతం ఋతమివ శ్రద్దధానాః స్పృహయంత్యో వయం సకృదేతదదృశిమ కింతత్. తస్య నఖైః స్పర్శః తేన తీవ్రః స్మరః. తేన రుజః పీడాః తస్మాదన్య వార్తా. భణ్యతాం కథ్యతామితి. ॥19॥

ఎందులకనగా మృగముల ధ్వనియే (ఆజ్ఞగా) ఏ విధముగ సత్యమని శ్రద్ధ వహించి, కృష్ణ సారము యొక్క మగలేడి యొక్క వధ్వః భార్యలగు లేళ్ళు బాణములచే కొట్టబడి గాయపడెనో రోగగ్రస్తమై కన్పట్టెనో- అట్లే జిహ్మస్య - కుటిలుడైన అతని (కృష్ణుని) మాటను సత్యమునువలె శ్రద్ధ వహించి నమ్మినవారమై మేము ఒకసారియే చూచితిమి, ఏమి చూచితిమి? అతని గోళ్ళచేత స్పర్శ కలిగి దానితో తీవ్రమైన మన్మథుని పీడ కలిగెను. అందువలన వేరొక వార్తను చెప్పుము. ॥19॥

శ్లో॥ ప్రియసఖ పునరాగాః ప్రేయసా ప్రేషితః కిం
వరయ కిమనురుంధే మాననీయోఽసి మేఽంగ ।
నయసి కథమిహాస్మాన్ దుస్త్యజద్వంద్వపార్శ్వం
సతతమురసి సౌమ్య శ్రీర్వధూస్సాకమాస్తే ॥ ॥20॥

తా॥ కృష్ణుని ప్రియ సఖుడా! మఱలవచ్చితివా ? ప్రియునిచే మఱల పంపబడితివా ? మా కొఱకు దూతగా వచ్చిన ఓ భ్రమరమా నీవు మాకు పూజ్యుడవు, మా నుండి నీ వేమికోరెదవో కోరుకొనుము. ఇచట నున్న మా గోపకాంతలను - విడుచుటకు సాధ్యము కాని ఆ ద్వంద్వ స్వభావుని ప్రక్కకు మమ్ము కొని పోయెదవా? ఎట్లు? ఓ సౌమ్యుడా ! అచట అతని వక్షస్థలమున అతని భార్యయగు లక్ష్మి నిరంతరము అతనితో ఉండును గదా ! (20)

టీ॥ పరావృత్యగత్వా పునరాగతం ప్రత్యాహ - ప్రియసఖేతి. హే ప్రియస్య సఖే ప్రేయసా శ్రీకృష్ణేన పునః ప్రేషితః కిం త్వమాగతోఽపి అంగ హే దూత. మే మాననీయః పూజ్యోసి అతో భగవాన్ కిమనురుంధే

టీ॥ వెనుకకు తిరిగిపోయి మఱల వచ్చిన వానిని ఉద్దేశించి చెప్పు చున్నది ఓ ప్రియుని సఖుడా ! శ్రీకృష్ణుని చేత మఱల పంపబడితివా ఏమి ? మఱల వచ్చితివి - అంగ - ఓదూతా ! నాకు నీవు పూజ్యుడవు

ప్రాప్తమిచ్ఛతీత్యర్థః తద్వరయ వృణీష్వ. సంమానితం ప్రత్యాహ- నయసీతి. ఇహసతీః అస్మాన్ దుస్త్యజం ద్వంద్వం మిథునీభావో యస్య తస్య పార్శ్వం సమీపం. కథం నయసి నేష్యసి. తథాహి హే సౌమ్య. శ్రీర్నామవధూస్సాకం సహైవ సతతమాస్తే తత్రాప్యురసి వక్షస్యేవ. ॥20॥

అందువలన భగవానుడా ! ఏమి కావలెనని కోరుకొనెదవో దానిని కోరుకొనుము – సమ్మానితుని గూర్చి చెప్పుచున్నది. ఇచటి గోపస్త్రీలను మమ్ము –విడుచుటకు సాధ్యము కానివాడైన ద్వంద్వస్వభావమెవనికో అతని పార్శ్వమునకు–సమీపమునకు మమ్ము ఎట్లుతీసికొని పోయెదవు అది యుక్తమే –ఓ సౌమ్యా ! లక్ష్మి అనెడు అతని భార్యతో కూడ- తోడనే ఎల్లప్పుడు వుండును. అదియును వక్షఃస్థలముననే !! ॥20॥

శ్లో॥ అపి బత మధుపుర్యా మార్య పుత్రోఽధునాస్తే
స్మరతి స పితృ గేహాన్ సౌమ్య బంధూశ్చ గోపాన్ ।
క్వచిదపి స కథా నః కింకరీణాం గృణీతే
భుజ మగరు సుగంధిం మూర్ధ్న్యధా స్యత్కదా ను ॥ ॥21॥

తా॥ సౌమ్యా ! భ్రమరా ! అహో ! ఇప్పుడు కృష్ణుడు మధురా నగరమున నున్నాడు కదా ! ఎప్పుడైనను ఈ వ్రజమున నున్న యశోదా నందులను ఇండ్లను, బంధువులను గోపాలురను తలచుకొను చుండునా ? ఎప్పుడైన ఆతని సేవకురాండ్రగు మమ్ము గూర్చి ఏమైనను చెప్పునా? అగరు సువాసనగల అతని భుజమును మా తలలపై ఎప్పుడైనా వుంచునా ? (21)

టీ॥ తేన సమంతితా సతీ బ్రూతే అపీతి. బత హర్షే. హే. సౌమ్య. గురుకులాదాగత్య. ఆర్యపుత్రః కృష్ణః అధునా కిం మధుపుర్యాం వర్తతే? కదాచిదపి నోఽస్మాకం వార్తాః కిం బ్రూతే? అగరు వత్సుగంధిం భుజం నో మూర్ధ్నికదానుధాస్యతి? ఇతి.॥21॥

టీ॥ బత ! అను మాట హర్షము నందు – ఓ సౌమ్యా ! గురుకులము నుండి వచ్చి, కృష్ణుడు ఇప్పుడు మధురా నగరమున నివసించుచున్నాడా యేమి ? ఎప్పుడేని మమ్ము గురించిన వార్తలు ఏమైనను ఏమి చెప్పును? అగరు సుగంధమువంటి సుగంధముగల భుజమును మా తలపైన ఎప్పుడు ఉంచునో ? ॥21॥

**శ్రీశుక ఉవాచ**

శ్లో॥ అథోద్ధవో నిశమ్యైవం కృష్ణదర్శన లాలసాః ।
సాంత్వయన్ప్రియసందేశైర్గోపీరిద మభాషత ॥ ॥22॥

**శ్రీశుకుడిట్లనెను**

తా॥ కృష్ణుని చూడవలెననెడి బలమైన కోరికగల గోప స్త్రీల మాటలన్నియు విని, ఉద్ధవుడు వారిని కృష్ణుని సందేశములతో నోదార్చుచు, వారితో నిట్లనెను. (22)

టీ॥ అథేతి శ్రీకృష్ణ దర్శనోత్సుకాః గోపీః ప్రియస్య సందేశైః సాంత్వయన్ ప్రథమం తావదిదమభాషిత. ॥22॥

టీ॥ శ్రీకృష్ణదర్శనము నందు ఉత్సుకులైన గోప స్త్రీలను వారి ప్రియుడగు కృష్ణుని సందేశములతో ఓదార్చుచు మొదట ఆ మేఱకు ఇట్లు పలికెను. ॥22॥

**ఉద్ధవ ఉవాచ**

శ్లో॥ అహోయూయం స్మ పూర్ణార్థా భవత్యో లోక పూజితాః ।
వాసుదేవే భగవతి యాసా మత్యర్పితం మనః ॥ ॥23॥

**ఉద్ధవుడిట్లుపలికెను**

తా॥ అహో! మీరు కృతార్థులు, మీరు లోకపూజితులు, భగవానుడగు వాసుదేవుడి యందు ఎవరి యొక్క మనస్సు సంపూర్ణముగా సమర్పితమైనదో అట్టి మీరు లోక పూజితులుకదా! (23)

టీ॥ తదాహ – షడ్భిః అహో ఇతి స్మ నూనం యూయం పూర్ణార్థాః కృతార్థాః. ॥23॥

టీ॥ ఆరు శ్లోకములచే అది చెప్పుచున్నాడు. స్మ – నిశ్చయముగా మీరు కృతార్థులు. ॥23॥

శ్లో॥ ధ్యాన వ్రత తపో హోమ జప స్వాధ్యాయ సంయమైః ।
శ్రేయోవిధిభిరన్యైశ్చ కృష్ణే భక్తిర్హి సాధ్యతే ॥ ॥24॥

తా॥ ధ్యానము, వ్రతము, తపస్సు, హోమము, జపము, వేదాధ్యయనము ఇంకను నియమ నిష్ఠలు మొదలగువాని చేతను, ఇతరములైన శ్రేయస్సాధనకు సంబంధించిన విధానములచే గాని, కృష్ణుని యందలి భక్తియే సాధింపబడును. (24)

టీ॥ ధ్యానేతి. శ్రేయోవిధిభిః శ్రేయస్సాధనైః. ॥24॥

టీ॥ శ్రేయో విధిభిః-శ్రేయస్సాధనములచేత॥24॥

శ్లో॥ భగవత్యుత్తమశ్లోకే భవతీభిరనుత్తమా ।
భక్తిః ప్రవర్తితా దిష్ట్యా మునీనామపి దుర్లభా ॥ ॥25॥

తా॥ ఉత్తమశ్లోకుడైన భగవానుని యందు మీ చేత అత్యుత్తమమైన భక్తియే ప్రవర్తించినది. మీ ఈభక్తి మునులకు కూడా లభింపజాలనిది, ఆనంద పూర్వకమైనది. (25)

టీ॥ భగవతీతి అనుత్తమా అతిశ్రేష్ఠా. ॥25॥

టీ॥ అనుత్తమా - అతిశ్రేష్ఠమైనది (అంతకంటే ఉత్తమమైనది మరియొకటి లేనిది) ॥25॥

శ్లో॥ దిష్ట్యా పుత్రాన్పతీన్ దేహాన్ స్వజనం చ గృహాం స్తథా ।
హిత్వా వృణీత యూయం యత్కృష్ణాఖ్యం పురుషం పరమ్॥26॥

తా॥ మీరందరును సంతోషముగనే మీ మీ పుత్రులను, భర్తలను, దేహములను (దేహభావములను) ఆత్మ బంధువులను, గృహములను విడిచి కృష్ణుడు అను పేరుగల పరమపురుషుని వరించితిరి. (26)

టీ॥ దిష్ట్యేతి. అవృణీత వృతవ్యతః. ॥26॥

టీ॥ ఆవృణీత - వరించితిరి. ॥26॥

శ్లో॥ సర్వాత్మభావోఽధికృతో భవతీనామధోక్షజే ।
విరహేణ మహాభాగా మహాన్మేఽనుగ్రహః కృతః ॥ ॥27॥

తా॥ మీకు శ్రీకృష్ణుని యందు ఏకాంత భక్తి ప్రాప్తించినది. గొప్ప భాగ్యశాలురైన మీకు కృష్ణుని విరహము చేత అతనిని నిరంతరము స్మరించు ఉత్కృష్టమైన భక్తి సిద్ధించినది. భగవత్ప్రేమ దర్శనము చేత నన్నుకూడా అనుగ్రహించితిరి. (27)

టీ॥ సర్వేతి. సర్వాత్మభావః ఏకాంతభక్తిః. అధికృతః ప్రాప్తః భగవత్ప్రేమ దర్శనేన మమ చ మహాననుగ్రహః కృత ఇతి. ॥27॥

టీ॥ సర్వాత్మ భావః - ఏకాంత భక్తి - అధికృతః -పొందబడినది - భగవంతుని ప్రేమ దర్శనము చేత నాకు కూడా గొప్ప అనుగ్రహము కలిగించితిరి. ॥27॥

శ్లో॥ శ్రూయతాం ప్రియ సందేశో భవతీనాం సుఖావహః ।
యమాదాయాగతో భద్రాహ్యహం భర్తూరహస్కరః ॥ ॥28॥

తా॥ కృష్ణుని రహస్య కార్యకర్తనగు నేను మీ కొఱకు, మీకు సుఖమును కలిగించునట్టి ప్రియ సందేశమును తీసుకొని వచ్చితిని, కళ్యాణులారా! దానిని వినుడు. (28)

టీ॥ శ్రూయతామితి. భర్తుః కృష్ణస్య రహస్కరః రహస్యకార్యకర్తా॥28॥

టీ॥ భర్తుః- కృష్ణుని యొక్క- రహస్కరః-రహస్యకార్యకర్తను.॥28॥

**శ్రీభగవానువాచ**

శ్లో॥ భవతీనాం వియోగో మే న హి సర్వాత్మనా క్వచిత్
యథా భూతాని భూతేషు ఖం వాయ్వగ్నిర్జలం మహీ
తథా హంచ మనః ప్రాణ బుద్ధీంద్రియగుణాశ్రయః ॥ ॥29॥

**శ్రీకృష్ణుడు(తనసందేశమును) ఇట్లుచెప్పెను**

తా॥ మీ వియోగము నాకు ఎప్పుడును లేదు. సర్వ భూతముల యందును ఎట్లు ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృథ్వి, అను పంచభూతములు అవిభాజ్యములై వుండునో, అట్లే నేను కూడా మీ మనస్సును, బుద్ధిని, ప్రాణమును, ఇంద్రియములను, గుణములను, ఆశ్రయించి యుందును. (29)

టీ॥ భవతీనామితి భవతీనాం మే మయా సహ వియోగో నాస్తి కుతః సర్వాత్మనా సర్వస్యోపాదాన కారణేవ. అత ఏవ సర్వేషు మన

టీ॥ మీతో నాకు వియోగము లేదు. అన్ని ఉపాదాన కారణముల యందును - అందువలననే మనస్సు మొదలగు అన్ని ఇంద్రియముల

ఆదీని కార్యేష్వహమనుగతత్వేన స్థిత ఇతి సదృష్టాంత మాహ-యథేతి. భూతేషు చరాచరేషు మహాభూతాని. యథా వాయ్వగ్నిః వాయు సహితోగ్నిః వాయుశ్చ అగ్నిశ్చేత్యర్థః. తథాహంచేతి. మన ఆదీని కార్యాణి. గుణాః కారణం తేషామాశ్రయత్వేనానుగత ఇత్యర్థః.॥29॥

యందును నేను అనుగతిత్వముతో స్థితుడనై యున్నాను. అని దృష్టాంతముతో చెప్పుచున్నాడు. చరాచర భూతములయందు పృథివ్యాది పంచమహాభూతములు (ఎటుల) - వాయువు అగ్ని మొదలగునవి ఉన్నట్లు నేను కూడా అని- మనస్సు మొదలగు వాని కార్యములు, గుణాః - కారణమును- వాని యొక్క ఆశ్రయత్వము చేత అనుగతుడనై (ఉన్నాను) అని అర్థము. ॥29॥

శ్లో॥ ఆత్మన్యేవాత్మనాత్మానం సృజే హన్మ్యనుపాలయే ।
ఆత్మ మాయానుభావేన భూతేంద్రియ గుణాత్మనా ॥ ॥30॥

తా॥ నా యందే నా చేతనే నన్ను నేనే సృజించుకొనుచు, లయము చేసికొనుచు, పాలించుకొనుచుందును. భూతములు, ఇంద్రియములు, గుణములు అనువాని రూపమున నా మాయ యొక్క ప్రభావము చేత సృష్ట్యాదులు జరుగును. (30)

టీ॥ నను కారణత్వే సర్వానుగతత్వే చ కార్యకారణభేదః స్యాదత ఆహ - ఆత్మన్యేవేతి. నను నిత్యసిద్ధస్య కుతః సృజ్యాదిరూపతా? అత ఆహ - భూతేంద్రియగుణాత్మనా. బుద్ధీంద్రియేతి, వా పాఠః తద్రూపేణేతి. నను నిర్వికారస్య కుతస్తద్రూపతేతి తత్రాహ- ఆత్మ మాయానుభావేతి. ॥30॥

టీ॥ కారణత్వమున్నను, సర్వానుగతత్వమున్నను, కార్యకారణ భేదము ఉండును. ఆ విషయమును చెప్పుచున్నాడు. నిశ్చయముగ నిత్య సిద్ధునికి సృష్ట్యాది రూపములెందుకు ? చెప్పుచున్నాడు- భూతేంద్రియ గుణాత్మనా - బుద్ధీంద్రియ అనియు పాఠము. ఆ రూపము చేత అని- అన్నింటికి కారణమైన వానికి ఆ రూపత్వమెందులకు ? అను ప్రశ్నకు చెప్పుచున్నాడు - ఆత్మమాయా ప్రభావము చేత అని . ॥30॥

శ్లో॥ ఆత్మజ్ఞాన మయశ్శుద్ధో వ్యతిరిక్తో గుణాన్వయః ।
సుషుప్తి స్వప్న జాగ్రద్భిర్మాయా వృత్తిభిరీయతే ॥ ॥31॥

తా॥ ఆత్మజ్ఞానమయుడు పరిశుద్ధుడు, అతిశయించిన అధికుడు, గుణములను అనుసరింపనివాడు, మాయా కార్యములైన మనోవృత్తులచే సుషుప్తి (నిద్ర), స్వప్నము, జాగృత్ అను అవస్థలలో ప్రతీతమగును. ॥31॥

టీ॥ నన్వానాత్మనో భూతాది రూపత్వే తద్దోష ప్రసంగస్తత్రాహ– ఆత్మేతి. ఆత్మా తు శుద్ధః. కుతః అగుణాన్వయః. న గుణేష్వన్వేతీతి తథా. తత్కుతః వ్యతిరిక్తః తదపి కుతః. జ్ఞానమయః జ్ఞాన స్వరూపః నన్వహంప్రత్యయే స్వసంవేద్యమేవాత్మనో నానావస్థత్వమితి కుతః శుద్ధతేతి. తత్రాహ – సుషుప్తీతి. మయా కార్యమనోవృత్తిభిర్విశ్వ తైజస ప్రాజ్ఞ రూపేణ ప్రతీయతే న స్వత ఇత్యర్థః.॥31॥

టీ॥ ఈ ఆత్మకు భూతాది రూపత్వము వలన దోష ప్రసంగము– దానిని గూర్చి చెప్పుచున్నాడు. ఆత్మ శుద్ధమైనది. ఎందువలన ? అగుణాన్వయః గుణమునను సరింపదు. కావున అట్లు చెప్పబడినది. అదియు ఎందువలన ? వ్యతిరిక్తః (వి+అతిరిక్తః–అతిరిచ్యతేస్మ అతిరిక్తః –విశేషమైన అధిక్యము గలది) అదియును ఎందులకు ? జ్ఞానమయము కావున–అహం ప్రత్యయము నందు తనను తాను తెలిసికొన దగిన లక్షణమే ఆత్మకు నానావస్థాత్వము.–ఎందుకు ? చెప్పుచున్నాడు– మాయా కార్యములగు మనోవృత్తులచేత విశ్వుడు, తైజసుడు, ప్రాజ్ఞుడు (జాగ్ర త్స్వప్న, సుషుప్తులు) అనురూపమున ప్రతీతమగుచున్నాడు– స్వతః కాదు అని యర్థము. ॥31॥

శ్లో॥ యేనేంద్రియార్థాన్ ధ్యాయేత మృషాస్వప్నవదుత్థితః ।
తం నిరుంధ్యాదింద్రియాణి వినిద్రః ప్రత్యపద్యత ॥ ॥32॥

తా॥ మనుష్యుడు తన మనస్సు చేత స్వప్నమునందలి వస్తువులను, జాగ్రదవస్థ లోనికి వచ్చిన పిదప మిథ్యాప్రాయములుగ భావించును. ఆ మనస్సును ఆ ఇంద్రియములను నిరోధింపవలెను, అనగా

జాగ్రదవస్థలోని ఇంద్రియ విషయములు కూడా మృషా ప్రాయములే అని నిశ్చయించుకొనవలెను. ఏ మనో బుద్ధీంద్రియముల చేత జాగ్రత్స్వప్నములలోని విషయములను గూర్చి మిథ్యా ప్రాయములని భావించునో అవియే మనోబుద్ధీంద్రియములను సుషుప్తి యందును నిరోధించి ఇంద్రియార్థముల మిథ్యాత్వమును నిరూపించుకొనును.(32

టీ॥ కుతః మనోనిరోధేతదభావాదితి వ్యతిరేకం దర్శయితుం మనో నిరోధం విధత్తే– యేనేతి. ఉత్థితః పుమాన్ యథా మిథ్యాభూతమేవ స్వప్నం ధ్యాయేత్ ఏవం బాధితానపీంద్రియార్థాన్ శబ్దాదీన్. యేన మనసా ధ్యాయేచ్చింతయేత్. ధ్యాయంశ్చయేనేంద్రియాణి ప్రత్యపద్యత ప్రాప. తన్మనః వినిద్రః అనలసస్సన్ నిరుంధ్యాత్ నియచ్ఛేదితి.॥32॥

టీ॥ మనస్సును నిరోధించిన పిదప – ఇంద్రియ విషయముల అభావము వలన అని దాని ఆధిక్యమును చూపుటకు మనో నిరోధమును విధించుచున్నాడు – మేల్కొనిన పురుషుడు ఏ విధముగ స్వప్నమును మిథ్యా భూతమని భావించునో అట్లే ఇంద్రియార్థములు (విషయములు ) శబ్దాదులు బాధితములైనను వానిని ఏ మనస్సు చేత చింతించునో – చింతించుచును– ఏ మనస్సుచేత ఇంద్రియము లను పొందెనో ఆ మనస్సు విశేష నిద్ర యందు లీనమైనదై అలసత్వము లేనిదై నిరోధింపవలెను. ॥32॥

శ్లో॥ ఏతదంతస్సమామ్నాయో యోగస్సాంఖ్యో మనీషిణామ్ ।
త్యాగస్తపో దమస్సత్యం సముద్రాంతా ఇవాపగాః ॥ ॥33॥

తా॥ సముద్రమే అంతముగాగల నదులవలె బుద్ధిమమంతులకు, వేదము, యోగము, సాంఖ్యము, త్యాగము, తపస్సు, ఇంద్రియ నిగ్రహము, సత్యము, అను సాధనలకు మనస్సును నిరోధించుటయే పర్యవసానము. (33)

టీ॥ తావతా చ కృతార్థో భవతీత్యాహ – ఏతదంత ఇతి, ఏష మనో నిరోధః అంతః సమాప్తిః ఫలం యస్య సః సమామ్నాయో వేదః. స తత్ర పర్యవస్యతీత్యర్థః. యోగో౭ష్టాంగః సాంఖ్యః ఆత్మానాత్మ వివేకః త్యాగః సన్యాసః తపః స్వధర్మః దమః ఇంద్రియ దమనం. మార్గభేదే ౭ప్యేకత్ర పర్యవసానే దృష్టాంతః– సముద్రాంతా ఆపగా నద్య ఇవేతి. ॥33॥

టీ॥ అంత వఱకు కృతార్థుడగునని చెప్పుచున్నాడు– మనోనిరోధమే చిట్టచివరిది– సమాప్తి ఫలము దేనికో అది, సమామ్నాయః– వేదము అది అచటపర్యవసించునని అర్థము–యోగః – అష్టాంగము–సాంఖ్యః ఆత్మ, అనాత్మ, వివేకము,–త్యాగః–సన్యాసము–తపః–స్వధర్మము – దమః – ఇంద్రియ నిగ్రహము – మార్గము వేరయినను ఇచట పర్యవసానము నందు దృష్టాంతము సముద్రమే అంతముగా గలది ఆపగాః – నదులు – ఆ విధముగ. ॥33॥

శ్లో॥ యత్త్వహం భవతీనాం వై దూరే వర్తే ప్రియో దృశామ్ ।
మనసస్సన్నికర్షార్థం మదనుధ్యాన కామ్యయా ॥ ॥34॥

తా॥ గోపకాంతలారా ! మీకు అత్యంత ప్రియుడనగు నేను మీ చూపులకు, దూరముగా నుండుటకు కారణము, మీరు నన్ను నిరంతరము ధ్యానించుట కొఱకే సుమా! అంతియేకాక ఆ ధ్యానము చేత మీ మనస్సులకు సన్నిహితముగ నుండుట కొఱకై . (34)

టీ॥ నను కిమన్యాని వాస్మాన్ ఆత్మ విద్యయా ప్రలోభయసి. వయం తు సర్వ సుందర సర్వ గుణ గణాలంకృతేన త్వయా విరహం నైవ సహామ ఇతి చేదత ఆహ – యదితి. దృశాం దూరే యద్వర్తే. తన్మ దనుధ్యానార్థం తచ్చ ధ్యానం మనసః సన్నికర్షార్థమితి. ॥34॥

టీ॥ ఇతరమైన వానిచేత మమ్ము ఆత్మవిద్య చేత ఎందుకు ప్రలోభ పెట్టుచున్నావు? మేము సర్వసుందరుడును, సర్వగుణ గణాలంకార శోభితుడును ఐన నీతో ఓకృష్ణా ! విరహమును ఎంత మాత్రము సహింపజాలము, అనినచో చెప్పుచున్నాడు– చూపులకు దూరముగా నా ఉనికి ఏది కలదో అది నన్ను మీరు ధ్యానించుచుండుట కొఱకే ఆ ధ్యానముకూడా మీ మనస్సులో కలిసి ఉండుటకొఱకే అని. ॥34॥

శ్లో॥ యథా దూరే చరే ప్రేష్ఠే మన ఆవిశ్యవర్తతే ।
స్త్రీణాం చ న తథా చేతస్సన్నికృష్టేఽక్షి గోచరే ॥ ॥35॥

తా॥ స్త్రీలకు- దూరముగ వర్తించుచుండు ప్రియతముడు, మనస్సు నందే ప్రవేశించి వర్తించుచుండినట్లుగా, కనులకు కనిపించునట్లు, సన్నిహితుడై ఉండినపుడు ఉండజాలడు. (35)

శ్లో॥ మయ్యావేశ్య మనః కృత్స్నం విముక్తాశేష వృత్తయః ।
అనుస్మరంత్యో మాం నిత్యమచిరాన్మాముపైష్యథ ॥ ॥36॥

తా॥ మనస్సును సంపూర్ణముగ నా యందే నిలిపి, తక్కిన వృత్తుల నన్నిటినీ వదిలి, నిత్యమును నన్నే స్మరించుచున్నవారై శీఘ్రముగనే నన్ను పొందుదురు. 36

టీ॥ ఏతదుపాదయతి త్రిభిః - యథేతి. ॥35,36॥

టీ॥ మూడు శ్లోకములతో దీనిని ఉపపాదించుచున్నాడు.॥35,36॥

శ్లో॥ యా మయా క్రీడతా రాత్ర్యాం వనేఽస్మిన్ వ్రజ ఆస్థితాః ।
అలబ్ధరాసాః కల్యాణ్యో మాపుర్మద్వీర్య చింతయా ॥ ॥37॥

తా॥ కళ్యాణులారా! ఈ బృందావనమున రాత్రి యందు నేను రాసక్రీడ జరుపుచున్నప్పుడు, ఏదో కారణముగ క్రీడలో పాల్గొనజాలక వ్రజము నందే ఉండిపోయిన వారు కూడ, నా లీలనను చింతన చేయుచుండిన వారు అగుటచే నన్నే పొందుదురు. 37

టీ॥ ఉపైష్యథేతి, మాధుర్యమాత్రమితి చేదత ఆహ-యా ఇతి. హే కల్యాణ్యః స్వభర్తృభిః ప్రతిబద్ధాః యాః వనే క్రీడతా మయా సహ అలబ్ధ క్రీడాః, తాస్తథైవ మా మాం ఆపుః ప్రాపుః. ॥37॥

టీ॥ పొందుదురు అనునది మాధుర్య మాత్రమని అనినచో చెప్పు చున్నాడు ఓ కళ్యాణులారా! ఎవరైతే తమ తమ భర్తల చేత ప్రతిబద్ధులై వనము నందు క్రీడించుచున్న నాతో కూడ క్రీడను పొందని వారై యుండిరో వారు కూడ - మా + ఆపుః- మాం ప్రాపుః- నన్నే పొందుదురు.॥37॥

**శ్రీశుక ఉవాచ**

శ్లో॥ ఏవం ప్రియతమాదేశ మాకర్ణ్యవ్రజయోషితః ।
తా ఊచురుద్ధవం ప్రీతాస్తత్సందేశాగత స్మృతీః ॥॥38॥

టీ॥ ఏవమితి. తస్య సందేశేనాగత స్మృతిర్యాసాం తాః ప్రథమార్థే ద్వితీయా. ॥38॥

**శ్రీశుకుడిట్లనెను.**

తా॥ ఈ విధముగ ప్రియతముడగు కృష్ణుని ఆదేశమును విని వ్రజస్త్రీలు కుపితులై బాహ్య స్మృతిలోకి వచ్చిన వారై ఉద్ధవునుద్దేశించి ఇట్లనిరి. (38)

టీ॥ ఆతని సందేశము చేత, తిరిగి వచ్చిన స్మృతి ఎవరికో వారు ప్రథమా విభక్త్యర్థమున ద్వితీయా విభక్తి ప్రయుక్తమైది.॥38॥

**గోప్య ఊచుః**

శ్లో॥ దిష్ట్యా హితో హతః కంసో యదూనాం సానుగోఽఘకృత్ ।
దిష్ట్యాప్తైర్లబ్ధ సర్వార్థైః కుశల్యాస్తేఽచ్యుతోఽధునా ॥ ॥39॥

టీ॥ దిష్ట్యేతి. యదూనామహితః శత్రుః. అఘకృత్ దుఃఖదః. దిష్ట్యేత్యానందే. ఆప్తైః ప్రాప్తైః, హి తైర్వా సహ. ॥39॥

**గోపికలు ఇట్లనిరి.**

తా॥ తన అనుచరులతో కూడ యదువంశీయులకు తీరని దుఃఖమును కలిగించు అహితుడైన కంసుడు ఆనందదాయకముగ చంపబడెను. ఇప్పుడు శ్రీకృష్ణుడు, సర్వ ప్రయోజనములను నెరవేర్చుకొన్న వాడై తన ఆప్తులతో కూడి ఆనందముగ కుశలముగ నున్నాడు కదా ! (39)

టీ॥ యదూనాం అహితః-యదువంశీయులకు శత్రువు-అఘకృత్-దుఃఖము కలిగించినవాడు - దిష్ట్యా అనుమాట ఆనందమున ప్రయుక్తము - ఆప్తైః - పొందిన వారితో - లేక హితులతో - ॥39॥

శ్లో॥ కచ్చిద్గదాగ్రజ స్సౌమ్యః కరోతి పురయోషితామ్ ।
ప్రీతిం న స్నిగ్ధ స వ్రీడ హాసో దారేక్షణార్చితః ॥ ॥40॥

తా॥ కృష్ణుడు మాకు కలిగింపదగిన ప్రీతిని మధురానగర స్త్రీలకు కలిగించుచున్నాడా ? అప్పుడు స్నేహపూరితమైన సిగ్గు నవ్వుల తోడి ఉదారపు చూపులతో మాచే అర్చింపబడుచుండెడి వాడు. ఇప్పుడు కూడా మధురాపుర స్త్రీలచే అటులే పూజింపబడుచున్నాడా ? (40)

టీ॥ అన్యా ఊచుః కచ్చిదితి. నోస్మాకం కరణీయాం ప్రీతిం. కచ్చిత్పురయోషితాం కరోతి స్నిగ్ధం చ తత్సవ్రీడహాసేనోదార మీక్షణం చ తేనార్చితః తాభిరస్మాభిర్వా. ॥40॥

టీ॥ ఇతర స్త్రీలు కొందరిట్లనిరి. నః–మాకు–కలిగింపదగిన ప్రీతిని నగర స్త్రీలకు కలిగించుచున్నాడా ?–చిక్కనిది సిగ్గుతోకూడినది ఐన నవ్వుతో కూడిన ఉదారపు చూపులతో అర్చింపబడువాడు మా చేత, వారిచేత కూడా అర్చింపబడుచున్నాడా ? ॥40॥

శ్లో॥ కథం రతి విశేషజ్ఞః ప్రియశ్చ పురయోషితామ్ ।
నానుబధ్యేత తద్వాక్యై ర్విభ్రమైశ్చానుభాజితః ॥ ॥41॥

తా॥ కృష్ణుడు రతి విశేషములు తెలిసిన పండితుడు – స్త్రీలందరి చేతను ప్రేమింపబడుచుండువాడు. ఇక మధుర యందలి స్త్రీల వాక్యముల చేత , విలాసముల చేత, ఆకర్షింపబడి వారికి ఏల బద్ధుడు కాకుండును? (41)

టీ॥ పునరన్యా ఊచుః. కథమితి తాసాం వాక్యైర్విభ్రమైశ్చాను భాజితః ॥41॥

టీ॥ ఇతర గోపికలు ఇట్లు పలికిరి – వారి వాక్యములచే, హావ భావములచే సమ్మానింపబడిన వాడై.. ॥41॥

శ్లో॥ అపిస్మరతి నస్సాధో గోవిందః ప్రస్తుతే క్వచిత్ ।
గోష్ఠీ మధ్యే పురస్త్రీణాం గ్రామ్యాస్స్వైరకథాంతరే ॥ ॥42॥

తా॥ సాధూ! కృష్ణుడు నగర స్త్రీల గోష్ఠి యందు, వారి స్వేచ్ఛా పూరితమైన ప్రేమ సంభాషణల సందర్భమున, ప్రసంగ వశమున నైనను మా గ్రామీణ స్త్రీల గుఱించి ఎప్పుడైనను స్మరించునా ? (42)

టీ॥ పునరన్యా ఊచుః – అపీతి. కిమనయా చింతయా నః అస్మాన్ క్వచిత్ ప్రస్తుతేస్మరతి కిం గ్రామ్యాః అవిదగ్ధాః. ॥42॥

శ్లో॥ తాః కిం నిశాస్స్మరతి యాసు తథా ప్రియాభిః
బృందావనే కుముదకుంద శశాంకరమ్యే ।
రేమే క్వణచ్చరణ నూపుర రాసగోష్ఠ్యా
మస్మాభిరీడితమనోజ్ఞకథః కదాచిత్ ॥ ॥43॥

టీ॥ అన్యా ఊచుః– తా ఇతి కుముదైః కుందైః శశాంకేన చ రమ్యే బృందావనే క్వణంతి చరణనూపురాణి యస్యాం తస్యాం. రాసగోష్ఠ్యాం అస్మాభిః ప్రియాభిరీడితా మనోజ్ఞాఃకథా యస్య సః. తథా యాసు నిశాసు రేమే, తాః కదాచిత్ కింను స్మరతి వా నవేతి. ॥43॥

టీ॥ మరికొందరు గోపికలిట్లనిరి. ఈ చింతతో ఎప్పుడైనను ప్రసంగ వశాత్తుగ గ్రామ్య స్త్రీలమగు మమ్ము స్మరించునా– గ్రామ్యాః– నేర్పరులు కానివారు (అమాయికలు) ॥42॥

తా॥ మొల్లలు, తెల్లకలువలు, చంద్రుడు మొదలయిన వానితో ఆహ్లాదకరమైన ఆ రాత్రులను–మా కాళ్ళ చిరుగజ్జెల సవ్వడులతో, గోపస్త్రీలతో కలసి రాసక్రీడలాడుచూ, మాచేత తనకీర్తిని గూర్చి, లీలలను గూర్చి స్తోత్రములు చేయుచు పాడబడుచున్న గీతములకనుకూలముగ మా కాలి అందియలు మ్రోగుచుండగా మనోజ్ఞమైన కథలు గల ఆతడు ప్రకాశించుచున్న ఆ రాత్రులు– మధురలోని తన ప్రియురాండ్రతో కలసియున్నప్పుడు ఆ కృష్ణుడు బృందావనములోని ఆ కమ్మని రాత్రులను ఎపుడైనను స్మరించుచుండునా? (43)

టీ॥ మరికొందరు గోపికలు ఇట్లనిరి– తెల్ల కలువ పూల చేత, మొల్ల పూవుల చేత, చంద్రుని చేత కూడ హృదయంగముగ ప్రకాశించు బృందావనమున– ధ్వనించుచున్న కాలి అందియలు దేనియందో దాని యందు– రాసగోష్ఠి యందు ప్రియురాండ్రమైన మాచే స్తుతింపబడు మనోజ్ఞమైన కథల యందు ఏ రాత్రులు ప్రకాశించినవో– వానిని ఎప్పుడైనను అతడు స్మరించునా లేదా? అని. ॥43॥

శ్లో॥ అప్యేష్యతీహ దశార్హ స్తప్తాస్స్వ కృతయా శుచా ।
సంజీవయంస్తు నో గాత్రైర్యథేంద్రో వనమంబుదైః ॥ ॥44॥

తా॥ ఉద్ధవా మేము తెచ్చుకొనిన కృష్ణుని విరహముతోడి దుఃఖముతో తపించి పోవుచున్న మమ్ము -ఇంద్రుడు తన మేఘములతో వనమును వికసింపజేయునట్లు - తన అవయవముల స్పర్శతో పునర్జీవింపజేయుటకు ఇచటికి ఎప్పుడైనను వచ్చునా ? (44)

టీ॥ అపీతి. స్వ నిమిత్తేన శోకేన తప్తాః నః అస్మాన్ గాత్రైః కరస్పర్శాదిభి స్సంజీవయన్. కింను ఇహైష్యతీతి. ॥44॥

టీ॥ మఱికొందరు గోపికలిట్లనిరి- మాకొఱకే మేము దుఃఖముతో తపించుచున్న మమ్ము గాత్రైః కరస్పర్శలు మున్నగు వానిచేత పునర్జీవింపజేయుటకు ఇటకు వచ్చునా ? అని. ॥44॥

శ్లో॥ కస్మాత్కృష్ణ ఇహాయాతి ప్రాప్తరాజ్యో హతాహితః ।
నరేంద్రకన్యా ఉద్వాహ్య ప్రీతస్సర్వ సుహృద్వృతః ॥ ॥45॥

తా॥ శత్రువులను సంహరించిన వాడై, రాజకన్యలను వివాహమాడిన వాడై స్నేహితులందరితో కూడినవాడై , కోరికలన్నియు తీరుటచే ప్రీతుడై వున్న కృష్ణుడు ఇటకెందుకు వచ్చును. (45)

టీ॥ అన్యా ఊచుః- కస్మాదితి. అనన్యగతిత్వేన పూర్వమత్రావసన్ సంప్రతి మహదైశ్వర్యం ప్రాప్తః కస్మాదిహాగమిష్యతీతి.॥45॥

టీ॥ మఱికొందరిట్లనిరి - వేరొక స్థానము లేనందున పూర్వము ఇచట నుండెను. ఇప్పుడు గొప్ప ఐశ్వర్యమును పొందియున్నాడు గదా ! ఇచటికి ఏల వచ్చును? అని. ॥45॥

శ్లో॥ కిమస్మాభిర్వనౌకోభిరన్యాభిర్వా మహాత్మనః ।
శ్రీపతే రాప్త కామస్య క్రియతేఽర్థః కృతాత్మనః ॥ ॥46॥

తా॥ శ్రీపతియు, ఆప్తకాముడును, చేయవలసిన పనులన్నియు పూర్తిచేసిన వాడును, ఐన శ్రీకృష్ణునకు, మాతోగాని, ఈ ఆటవిక జీవనులతో గాని, ఇంకను ఇతర స్త్రీలతో గాని ఆ మహాత్మునకు చేయదగిన ప్రయోజన మేమి కలదు.? వారితో అతడింకేమి ప్రయోజనమును సాధించును ? (46)

టీ॥ అన్యాస్తు పరమార్థ మూచుః. కిమితి. వనచరీభిరస్మాభి రన్యాభిర్వా రాజ కన్యాభిః మహాత్మనో ధీరస్య. కించ. శ్రీపతేః తదప్యాస్తాం స్వత ఏవాప్తకామస్య. అత ఏవ కృతాత్మనః పూర్ణస్య. కిం కోఽర్థః క్రియతే. నకశ్చిదితి. ॥46॥

టీ॥ ఇతర స్త్రీలు పరమార్థమును చెప్పుచున్నారు. అడవిలో చరించువారమగు మా చేత - ఇతర స్త్రీలచే గాని, రాజకన్యలచే గాని - మహాత్మనః - ధీరునికి - మరియు శ్రీకిపతియైన వానికి- అది అట్లుండనిమ్ము - స్వతః కామములన్నియు పొందియున్న వానికి ,అందువలననే కృతాత్మనః పూర్ణుడైన వానికి ఏ ప్రయోజనమును నిర్వర్తింప వలసి యుండును? ఏదియు లేదు - అని. ॥46॥

శ్లో॥ పరం సౌఖ్యం హి నైరాశ్యం స్వైరిణి ప్రాహ పింగళా ।
తజ్జానతీనాం నః కృష్ణే తథా ప్యాశా దురత్యయా ॥ ॥47॥

తా॥ నైరాశ్యమే పరమ సౌఖ్యము, అని పింగళ అను వేశ్య చెప్పెను. పింగళ స్వైరిణియైనను సత్యమే చెప్పినది. ఆ సత్యము మాకు తెలిసి యున్నను మేము కృష్ణుని రాక మీద ఆశవదలలేకున్నాము. 47

టీ॥ యతః అఘటమానా యా కృష్ణసంగతిః సైవాస్మానాకులయతి. అతో నైరాశ్యమేవ పరమం సుఖం. తచ్చాతిదుష్కరమిత్యాహుః- పరమితి. స్వైరిణి.॥47॥

టీ॥ కృష్ణునితో కలయిక ఘటింపదని తెలిసియు అదియే మమ్ము వ్యాకుల పెట్టుచున్నది, అందువలన నైరాశ్యమే మిక్కిలి సుఖకరము- అదియు మాకు దుష్కరమగుచున్నది అని చెప్పుచున్నారు.॥47॥

శ్లో॥ క ఉత్సహేత సంత్యక్తుముత్తమశ్లోక సంవిదమ్ ।
అనిచ్ఛతోఽపి యస్య శ్రీరంగాన్నచ్యవతే క్వచిత్ ॥ ॥48॥

తా॥ ఉత్తమశ్లోకుని ఏకాంతవార్తను విడిచిపుచ్చుటకు ఎవడు ఉత్సహించును ? ఆతడు (కృష్ణుడు) కోరకున్నను, లక్ష్మి, అతని అంగ సంగమును ఎప్పుడును విడిచి యుండదు. (48)

టీ॥ క ఇతి. సంవిదం ఏకాంతవార్తాం. ॥48॥

టీ॥ సంవిదం - ఏకాంత వార్తను. ॥48॥

శ్లో॥ సరిచ్ఛైల వనోద్దేశా గావో వేణురవా ఇమే ।
సంకర్షణ సహాయేన కృష్ణేనాచరితాః ప్రభో ॥ ॥49॥

తా॥ ఉద్ధవా! ఈ నదులు, ఈ కొండలు, ఈ వనభూములు, ఈ ఆవులు,ఈ వేణు నాదములును బలరామునితో కలిసి శ్రీకృష్ణుడు చరించినవియే, మేపినవియే - వాయించినవియే. (49)

శ్లో॥ పునః పునస్స్మారయంతి నందగోప సుతం బత ।
శ్రీనికేతైస్తత్పదకైర్విస్మర్తుం నైవ శక్నుమః ॥ ॥50॥

తా॥ శోభామయములైన ఆయన పాదముల చేత ఇక్కడి ప్రతి అణువు కృష్ణుని జ్ఞాపకము చేయుచున్నవి. అందుచే ఆతనిని మరచుటకు శక్యము కాకున్నది. 50

టీ॥ కించ తద్విస్మృతౌ న తావద్దుఃఖమస్తి సాపి నాస్మాకం సంభవతీత్యాహు స్త్రిభిః- సరిదితి. ఆచరితాః సేవితాః॥49,50॥

టీ॥ మరియు వారిరువురు మరిచిపోయిరి. ఆ మేఱకు వారికి దుఃఖమేమియును లేదు. ఆ విస్మృతి మాకు సంభవించుటలేదు. అని మూడు శ్లోకములతో చెప్పుచున్నారు. ఆచరతాః-సేవింప బడినవి. (49,50)

శ్లో॥ గత్యా లలితయోదార హాస లీలావలోకనైః ।
మాధ్వ్యా గిరా హృతధియః కథం తం విస్మరామహే ॥ ॥51॥

తా॥ సుందరమైన నడకతో చక్కనైన నవ్వుల విలాసపు చూపులతో, తీయని మాట చేతను, దొంగిలింపబడిన బుద్ధులు గల ఆ కృష్ణుని ఎట్లు మరువగలము.? 51

శ్లో॥ హేనాథ! హేరమానాథ! వ్రజనాథార్తినాశన ।
మగ్నముద్ధర గోవింద! గోకులం వృజినార్ణవాత్ ॥ ॥52॥

తా॥ ఓస్వామీ లక్ష్మీనాథా ! మా పాలిటి వ్రజ ప్రభూ ఆర్తిని హరించు శ్యామసుందరా ! గోవిందా ! దుఃఖ సముద్రమున మునిగియున్న వ్రజమును ఆసముద్రము నుండి ఉద్ధరింపుము. 52

టీ॥ గత్యేతి, హే ఉద్ధవ తం కథం విస్మరామహే. ॥51,52॥

టీ॥ ఓ ఉద్ధవా ! ఆతనినెట్లు మరిచెదము ? అని. ॥51,52॥

**శ్రీశుక ఉవాచ**

శ్లో॥ తతస్తాః కృష్ణ సందేశైర్వ్యపేత విరహ జ్వరాః ।
ఉద్ధవం పూజయాం చక్రు ర్జ్ఞాత్వాత్మానమధోక్షజమ్ ॥ ॥53॥

**శ్రీశుకుడు ఇట్లనెను.**

తా॥ పరీక్షిన్మహారాజా! అపుడు గోపస్త్రీలు కృష్ణుని సందేశములచేత తమ విరహతాపములను వదలిన వారై ఉద్ధవుని పూజించిరి, కృష్ణుని ఆత్మగా తెలిసికొని – తమ ఆత్మగా, ఉద్ధవుని ఆత్మగా అందరి ఆత్మగా గ్రహించిన వారై ఉద్ధవుని కృష్ణ భావనతో పూజించిరి. (53)

టీ॥ తతి ఇతి. కృష్ణమధోక్షజం జ్ఞాత్వా తం చ స్వాత్మానం జ్ఞాత్వా. ॥53॥

టీ॥ కృష్ణుని ఇంద్రియములను అధఃకరించి అవతరించిన వానిగను, అతనిని తమ ఆత్మగా తెలిసి కొని. ॥53॥

శ్లో॥ ఉవాస కతిచిన్మాసాన్గోపీనాం వినుదన్ శుచః ।
కృష్ణలీలా కథాం గాయన్ రమయామాస గోకులమ్ ॥ ॥54॥

తా॥ ఉద్ధవుడు గోపికల దుఃఖమును తొలగించుచు, కృష్ణలీలల కథలను గానముచేయుచు, గోకులమును రంజింపచేయుచు కొన్ని మాసముల వఱకు అచటనే వుండెను. 54

శ్లో॥ యావంత్య హాని నందస్య వ్రజేఽవాత్సీత్స ఉద్ధవః ।
వ్రజౌకసాం క్షణప్రాయాణ్యాసన్ కృష్ణస్య వార్తయా ॥ ॥55॥

తా॥ నందవ్రజమున ఉద్ధవుడు ఎన్ని దినములు ఉండెనో అన్ని దినములు కృష్ణుని లీలను గుఱించి వ్రజవాసులతో చర్చించుచు గడిపెను. వారికి అన్ని దినములు క్షణప్రాయముగ గడిచెను. (55)

టీ॥ ఉవాసేతి. వినుదన్ అపనయన్. ॥54,55॥

టీ॥ వినుదన్–తొలగింప జేయుచు. ॥54,55॥

శ్లో॥ సరిద్వనగిరి ద్రోణీర్వీక్షన్ కుసుమితద్రుమాన్ ।
కృష్ణం సంస్మారయన్ రేమే హరిదాసో వ్రజౌకసామ్ ॥ ॥56॥

తా॥ నదులు, వనములు, కొండలు, కాలువలు, పుష్పించి యున్న చెట్లు, మొదలగునవి చూచుచు, వ్రజవాసులకు కృష్ణుని జ్ఞాపకము చేయుచు కృష్ణుని సేవకుడగు ఉద్ధవుడు అచట విహరించెను. (56)

టీ॥ సరిదితి. సరిద్వనగిరినద్యాదిషు ప్రత్యేకం కృష్ణం తల్లీలాసం ప్రశ్నాదిభిః సంస్మారయన్ రేమే. ॥56॥

టీ॥ నదులు, వనములు, కొండలు, పర్వతబిలములు మొదలగు వాని యందు ప్రత్యేకముగ కృష్ణుని లీలలను గూర్చిన ప్రశ్నలతో ఆతనిని గుర్తుచేయుచు విహరించెను. ॥56॥

శ్లో॥ దృష్ట్వైవమాది గోపీనాం కృష్ణావేశాత్మ విక్లబమ్ ।
ఉద్ధవః పరమప్రీతస్తా నమస్యన్నిదం జగౌ ॥ ॥57॥

తా॥ గోపికల కృష్ణావేశము వలని, ఆత్మ విహ్వాలత్వమును ఇట్లు చూచి ఉద్ధవుడు మిక్కిలి సంతోషించిన వాడైవారికి నమస్కరించుచు ఇట్లనెను. (57)

టీ॥ దృష్ట్వేతి. కృష్ణావేశేనాత్మనో మనసః. విక్లబం వైక్లబ్యం. తాః గోపీర్నమస్యన్ నమస్కరిష్యన్. ఉత్తమస్యాత్మనో గోపస్త్రీనమస్కృతి రపి న్యాయ్యా భవతీతి దర్శయితుం. తాసాం మహత్త్వం. పంచభిర్జగౌ ఉవాచ:(57)

టీ॥ కృష్ణుని యందలి ఆవేశముచేత మనస్సుయొక్క విహ్వాలత్వమును చూచి, ఆ గోపికలకు నమస్కరించుచు ఉత్తమమైన హృదయము గల వానికి, గోపికలకు నమస్కరించుట కూడ న్యాయమే యగునని చూపుటకు, వారి గొప్పదనమును ఐదు శ్లోకములతో చెప్పినాడు.॥57॥

శ్లో॥ ఏతాః పరం తనుభృతో భువి గోపవధ్వో
గోవింద ఏవమఖిలాత్మ నిరూఢభావాః ।
వాంఛంతి యద్భవ భియో మునయో వయం చ
కిం బ్రహ్మ జన్మభిరనంత కథా రసస్య ॥ ॥58॥

తా॥ ఈ విధముగ కృష్ణుడే అఖిలాత్ముడు అను దృఢమైన భావము గల గోపస్త్రీల శరీరధారణము, ఈ భూమిపైన అన్నింటి కంటెను శ్రేష్ఠమైనది. మఱల మఱల జన్మించుచుండెడు సంసార భయముతో మోక్షమును కోరుచుండు మునులు. మా వంటి భక్తులు వాంఛించు చుండునది ఇదియే కదా ! ఆ అనంతుని కథా రసానుభూతి లభింపని అగ్రవర్ణ జన్మలతో మాత్రము ప్రయోజన మేమి? ఈ కాలచక్ర భ్రమణము నందు ఎన్నియో బ్రహ్మ జన్మల నెత్తినను ఏమి ఫలము? **58**

టీ॥ ఏతావితి. ఏతాః కేవలం తనుభృతః సఫలజన్మానః రూఢభావాః పరమప్రేమవత్యః. యదితి యం రూఢ భావం. భవభియో ముముక్షవః మునయో ముక్తాఅపి వాంఛతి. వయం చ భక్తా అపి అతః అనంతస్య కథాసు రసో రాగో యస్య తస్య బ్రహ్మజన్మభిః విప్ర సంబంధిభిః శౌక్లసావిత్రయాజ్ఞికైస్త్రిభిర్జన్మభిః. కింశోఽతిశయః. యత్ర తత్ర జాతః స ఏవ సర్వోత్తమ ఇత్యర్థః. యద్వా అనంత కథాసు రసో యస్య తస్య బ్రహ్మ జన్మభిశ్చతుర్ముఖ జన్మభిరపి కిం కోఽర్థః. యద్వా అనంత కథాసు అరసస్య బ్రహ్మజన్మభిః కిం. ॥58॥

టీ॥ వీరు సఫల జన్ములు – రూఢభావాః – పరమప్రేమగల వారు– ఏ రూఢ భావమును సంసారభీతి గల ముముక్షువులు, మునులు, ముక్తులు కూడ వాంఛింతురో – వయం–భక్తులమైన మావంటివారు కూడ కోరుదురో– అందువలన అనంతుని యొక్క కథల యందలి రసము, రాగము ఎవనికో అతనికి – బ్రాహ్మణ జన్మాదుల చేత– శౌక్ల, సావిత్ర, యాజ్ఞిక అను మూడువిధముల జన్మల చేతను–కిం?– ఏమి అతిశయము కలదు? అదియే సర్వోత్తమము అని అర్థము – లేక అనంతుని కథల యందలి రసము ఎవనికి ప్రాప్తించునో వానికి– బ్రహ్మ జన్మలచేత– చతుర్ముఖుడుగా పుట్టుటచేత కూడ–కిం? ఏమి ప్రయోజనము? లేక –అనంతుని కథల యందలి రసానుభూతి పొందజాలని వానికి బ్రహ్మ జన్మల చేత ఏమి ఫలము? ॥58॥

శ్లో॥ క్వేమాః స్త్రియో వచనచరా వ్యభిచారశీలాః
కృష్ణే క్వచైవ పరమాత్మ నిరూఢ భావః ।
నన్వీశ్వరోఽను భజతో విదుషోఽపి సాక్షా
చ్ఛ్రేయస్తనోత్యగద రాజ ఇవోపయుక్తః ॥ ॥ 59

తా॥ సంచారశీలురగు ఈ ఆటవిక స్త్రీలెక్కడ? పరమాత్మయగు శ్రీకృష్ణుని యందు అనన్యమైన ప్రేమ, భక్తి ఎక్కడ? అమృతము, దాని ప్రభావము తెలియక త్రాగినను అమరత్వము ప్రసాదించునట్లు, అజ్ఞానియైన వాడు భజించినను ఈశ్వరుడు సాక్షాత్తుగ శ్రేయస్సునే ఇచ్చును సుమా! (59)

టీ॥ కించ ఈశ్వర ప్రసాదో మహత్త్వే కారణం. తస్య చ న జాతి రాచారో జ్ఞానం వా కారణం. కింతు కేవలం భజనమేవేత్యాహ –

టీ॥ మరియు ఈశ్వరుని అనుగ్రహము మహత్త్వము నందు కారణమగును. దానికి జాతి గాని, ఆచారము గాని జ్ఞానము గాని కారణములు కావు, కాని కేవలము భజనమే–సేవయే కారణమని

క్వేతి. సాక్షాద్భజతః పుంసః. అహో ఉపయుక్తః సేవితః. అగదరాజః అమృతం యథేతి. ॥59॥

శ్లో॥ నాయం శ్రియోఽఙ్గ ఉ నితాంత రతేః ప్రసాద
స్స్వర్యోషితాం నళినగంధరుచాం కుతోఽన్యాః ।
రాసోత్సవేఽస్య భుజదండగృహీత కంఠ
లబ్ధాశిషాం య ఉదగాద్వ్రజ వల్లవీనామ్ ॥ ॥60॥

టీ॥ అత్యంతాపూర్వాశ్చాయం గోపీషు భగవతః ప్రసాద ఇత్యాహ-నేతి. అంగే వక్షసి. ఉ అహో. నితాంతరతేః ఏకాంతరతిమత్యాః శ్రియోఽపి నాయం ప్రసాదః అనుగ్రహో నాస్తి నళినస్యేవ గంధో రుక్ కాంతిశ్చ యాసాం తాసాం స్వర్గాంగనానా మప్సరసామపి నాస్తి అన్యతః పునర్దూరతో నిరస్తాః రాసోత్సవే శ్రీకృష్ణ భుజదండాభ్యాం గృహీతః ఆలింగితః కంఠస్తేన లబ్ధా ఆశిషో యాభిస్తాసాం గోపీనాం. య ఉదగాత్. ఆవిర్బభూవ. ॥60॥

చెప్పు చున్నాడు. సాక్షాత్తుగ సేవించుపురుషునకు-అహో! సేవింపబడిన -అగదరాజః- అమృతము ఎట్లో అట్లు - (అమరత్వమిచ్చునట్లు భగవత్సేవ నిఃశ్రేయసము నిచ్చును) ॥59॥

తా॥ పరీక్షిన్మహారాజా! ఏకాంతరతి భాగ్యమును పొందిన గోపికా స్త్రీల వలె కృష్ణుని అనుగ్రహము అహో! లక్ష్మీదేవికి కలుగలేదు. తామర పూల వాసనలను, అట్టి కాంతియు గల దేవతా స్త్రీలకును కలుగలేదు, ఇక ఇతర స్త్రీలగురించి చెప్పునదేమి? రాసక్రీడోత్సవమునందు తన బాహుదండములతో వారి కంఠములను ఆలింగనము చేసికొనిన అదృష్టము, ఆయన ఆశీస్సులు పొందిన వ్రజస్త్రీలకు కృష్ణుని అనుగ్రహము కలిగినది.(60)

టీ॥ మిక్కిలి ఆశ్చర్యకరమైనది, అపూర్వమైనది గోపికలయందు భగవానుని అనుగ్రహము అని చెప్పుచున్నాడు-అంగే -వక్షఃస్థలమున- ఉ - అహో! - నితాంతరతేః-ఏకాంతరతి గల గోపికలకు కలిగిన ఈ అనుగ్రహము లక్ష్మీదేవికి కూడా కలుగలేదు-తామర పరిమళము, కాంతియు ఎవరి యందో అట్టి స్వర్గము నందలి స్త్రీలగు అప్సరసలకు కూడా కలుగలేదు ఇక ఇతర స్త్రీలు దూరముగ త్రోసివేయ బడినవారే, రాసోత్సవము నందు శ్రీకృష్ణుని భుజదండము చేత ఆలింగనము చేసికొన బడిన కంఠములు గలవారైన వారు ఆశీస్సులు పొందినవారైన గోపికలకు-యః-ఏ అనుగ్రహము-ఉదగాత్-ఆవిర్భవించెను. ॥60॥

శ్లో॥ ఆసామహో చరణ రేణుజుషామహం స్యాం
బృందావనే కిమపి గుల్మ లతౌషధీనామ్ ।
యా దుస్త్యజం స్వజన మార్యపథం చ హిత్వా
భేజుర్ముకుంద పదవీం శ్రుతిభిర్విమృగ్యామ్ ॥ ॥61॥

తా॥ అహో! నేను, ఈ గోపికల పాద ధూళిని సేవించి యున్న ఈ బృందావనము నందలి ఏదో ఒక పొదనో, తీగనో, ఓషధినో అయి వుండి నచో ఎంతభాగ్యవంతుడనై యుండెడివాడను!! ఏలయన వీరు విడుచుటకు శక్యముకాని ఆత్మీయులను, బంధువులను, ఆర్య ధర్మ మార్గములను విడిచి - శ్రుతుల చేత కూడ విశేషముగ వెదుకదగిన శ్రీకృష్ణుని పదవిని సేవించిరి. 61

టీ॥ కించ ఆస్తాం తావద్గోపీనాం భాగ్యం మమ త్వేతావత్ప్రార్థ్య మిత్యాహ ఆసామితి. గోపీనాం చరణరేణుభాజాం గుల్మాదీనాం మధ్యే యత్ కిమప్యహం స్యామిత్యాశంసా. కథం భూతానాం యా ఇత్యాది. ఆర్యాణాం మార్గం ధర్మంచ హిత్వా. ॥61॥

టీ॥ మరియు గోపికల భాగ్యము అటుండ నిమ్ము, నేను మాత్రము ఇంత వఱకు ప్రార్థించుచున్నాను అని చెప్పుచున్నాడు.- గోపస్త్రీల పాద ధూళి యొక్క రేణువులను సేవించిన పొదలు మొదలగు వాని యొక్క మధ్యన ఏదో ఒకదాని రూపమున నేను కూడ ఉండియున్నచో- అని కోరిక - ఎట్టివాని - వారి యొక్క ? ఆర్యుల మార్గమును, ధర్మమును వదలివేసి. ॥61॥

శ్లో॥ యా వై శ్రియార్చిత మజాదిభిరాప్తకామై
ర్యోగీశ్వరైరపి యదాత్మని రాసగోష్ఠ్యామ్ ।
కృష్ణస్య తద్భగవతశ్చరణారవిందం
న్యస్తం స్తనేషు విజహుః పరిరభ్యతాపమ్ ॥ ॥62॥

తా॥ లక్ష్మీదేవి, బ్రహ్మ మొదలగు దేవతలు, ఆప్తకాములు యోగీశ్వరులు మొదలగువారు తమ హృదయముల యందే పూజించు కృష్ణుని పాదారవిందమును, రాసగోష్ఠి యందు, గోపికలు తమ స్తనముల యందుంచుకొని ప్రత్యక్షముగా కౌగిలించుకొని తమ తాపమును పోగొట్టుకొనిరి. 62

టీ॥ పునస్తా ఏవ విశినష్టి యా ఇతి యోగీశ్వరైరప్యాత్మన్యేవార్చితం స్తనేషు న్యస్తం. పరిరభ్య తాపం జహురితి.॥62॥

టీ॥ మరల వారినే విశేషించి చెప్పుచున్నాడు -యోగీశ్వరుల చేత కూడ హృదయమునందే పూజింపబడిన పాదారవిందములు-గోపికలచే తమ స్తనములందుంచుకొనబడినవి. కౌగిలించుకొని తాపమును బాపికొనిరి. ॥62॥

శ్లో॥ వందే నంద వ్రజస్త్రీణాం పాదరేణుమభీక్ష్ణశః ।
యాసాం హరికథోద్గీతం పునాతి భువన త్రయమ్ ॥ ॥63॥

తా॥ ఏ గోపస్త్రీల హరికథాగానము ముల్లోకములను పవిత్రీకరించునో అట్టి నంద వ్రజము నందలి స్త్రీల పాదరేణువులకు నేను ఎల్లప్పుడు నమస్కరించుచుందును. (63)

టీ॥ ఏవం మహత్త్వం ప్రతిపాద్య నమస్కరోతి వంద ఇతి. ॥63॥

టీ॥ ఇట్లు వారి గొప్పతనమును ప్రతిపాదించి నమస్కరించుచున్నాడు."వందే" అని. ॥63॥

శ్రీశుక ఉవాచ

శ్లో॥ అథ గోపీరనుజ్ఞాప్య యశోదా నందమేవ చ ।
గోపానామంత్ర్య దాశార్హో యాస్యన్నారురుహే రథమ్ ॥ ॥64॥

శ్రీశుకుడిట్లు పలికెను.

తా॥ అటు పిమ్మట ఉద్ధవుడు, గోపస్త్రీల నుండి, యశోదానందుల నుండి సెలవు తీసికొని అచటి గోపాలురందఱికిని వీడ్కోలు చెప్పి మధురకు పయనించుటకై రథము నెక్కెను. 64

శ్లో॥ తం నిర్గతం సమాసాద్య నానోపాయన పాణయః ।
నందాదయోఽనురాగేణ ప్రావోచన్నశ్రులోచనాః ॥ ॥65॥

తా॥ నందుడు మొదలగువారు, బయలుదేరిన ఉద్ధవుని సమీపించి, అనేక విధములైన కానుకలు తమ తమ చేతులలో ధరించిన వారై, మిక్కిలి అనురాగముతో, కన్నీరు కార్చుచు ఇట్లనిరి. (65)

టీ॥ అథేతి. అనుజ్ఞాప్య అనుజ్ఞాం యాచిత్వా. ఆమన్త్ర్య పృష్ట్వా ॥64,65॥

టీ॥ అనుజ్ఞాప్య - ఆజ్ఞ (సెలువు) తీసికొని. (64-65)

శ్లో॥ మనసో వృత్తయో నః స్యుః కృష్ణ పాదాంబుజాశ్రయాః ।
వాచోభిధాయినీ ర్నామ్నాం కాయస్తత్ప్రహ్వణాదిషు ॥ ॥66॥

తా॥ మా మనోవృత్తులన్నియు కృష్ణుని పాదారవిందములను ఆశ్రయించి నవియై యుండునుగాక, మా వాక్కులన్నియు, కృష్ణుని నామముల ఉచ్ఛారణ చేయుచుండునుగాక, మా శరీరములు కృష్ణునకు నమస్కారాదులు చేయుటయందు నిమగ్నమై యుండును గాక, (త్రికరణములును కృష్ణుని ధ్యాస యందే ఉండవలెనని కోరిక) 66

టీ॥ మనస ఇతి నోఽస్మాకం మనసో వృత్తయః కృష్ణ పాదాంబుజాశ్రయాః స్యుః అభిధాయినీః అభిధాయిన్యః స్యుః. ॥66॥

టీ॥ నః మా మనోవృత్తులన్నియు కృష్ణుని పాదాంబుజముల నాశ్రయించి యుండవలెను. అభిదాయినీః నామోచ్ఛారణములు గలవిగ నుండవలయును, (శరీరములు నమస్కారాదులయందు) ॥66॥

శ్లో॥ కర్మభిర్భ్రామ్యమాణానాం యత్ర క్వాపీశ్వరేచ్ఛయా ।
మంగళాచరితై ర్దానై రతిర్నః కృష్ణ ఈశ్వరే ॥ ॥67॥

తా॥ కర్మలచేత జన్మ చక్రమున తిరుగుచున్న మాకు ఎక్కడనో ఒక తావున ఈశ్వరేచ్ఛ చేత, శుభములాచరించుట యందు, పుణ్యములు చేయుట యందు, దానములు మొదలగు సత్కర్మలాచరించుటయందు, ప్రభువగు కృష్ణుని యందు భక్తికలుగు గాక. (67)

శ్లో॥ ఏవం సభాజితో గోపైః కృష్ణభక్త్యా నరాధిప ।
ఉద్ధవః పునరాగచ్ఛన్మధురాం కృష్ణపాలితామ్ ॥ ॥68॥

తా॥ పరీక్షిన్మహారాజా! ఈ విధముగ గోపాలకుల చేత సత్కారము నొందినవాడై ఉద్ధవుడు, వారి కృష్ణభక్తి చేత ఆనందము నంది, కృష్ణునిచే పాలింపబడు మధురా పట్టణమునకు తిరిగి వచ్చెను.(68)

టీ॥ కర్మభిరితి. నః కృష్ణే రతిః స్యాదితి. ॥67.68॥

టీ॥ మాకు కృష్ణుని యందు కోరిక (భక్తి) కలుగు గాక! ॥67,68॥

శ్లో॥ కృష్ణాయ ప్రణి పత్యాహ భక్త్యుద్రేకం వ్రజౌకసామ్ ।
వాసుదేవాయ రామాయ రాజ్ఞే చోపాయనాన్యదాత్ ॥ ॥69॥

తా॥ ఉద్ధవుడు శ్రీకృష్ణునికి ప్రణామము చేసి, వ్రజవాసుల భక్త్యావేశముల గూర్చి నివేదించి, కృష్ణునకు బలరామునకు, ఉగ్రసేనునకు తాను వ్రజమునుండి తెచ్చిన కానుకలను సమర్పించెను. (69)

టీ॥ కృష్ణాదిభ్యో భక్త్యుద్రేకమాహ ఉపాయనాని చాదాదితి॥69॥

టీ॥ కృష్ణుడు మొదలగువారికి, వ్రజవాసుల భక్తి ఉద్రేకములను వివరించెను.- కానుకలనిచ్చెను. ॥69॥

శ్రీ మద్భాగవతే, మహాపురాణే దశమస్కంధే,
సప్తచత్వారింశోఽధ్యాయః

అని శ్రీమద్భాగవతమున దశమస్కంధమందు
నలుబదిఏడవ అధ్యాయము సమాప్తము.

## అష్టచత్వారింశోఽధ్యాయః

*శ్రీశుక ఉవాచ:*

శ్లో॥ అథ విజ్ఞాయ భగవాన్ సర్వాత్మా సర్వదర్శనః ।
సైరంధ్ర్యాః కామతప్తాయాః ప్రియమిచ్ఛన్ గృహం యయౌ॥ 1॥

టీ॥ "శ్లో" అష్టచత్వారింశకేఽథ కృష్ణః కుబ్జామరీరమత్, అక్రూరస్య గృహం గత్వా తం గజాహ్వయమాదిశత్. సైరంధ్రీకామమాపూర్య పూరయిత్వా మనోరథాన్, అక్రూరస్య తతః కృష్ణః తేన పార్థానసాంత్వయత్. ।1॥

శ్లో॥ మహార్హోపస్కరాఢ్యం వై కామోపాయోప బృంహితమ్
ముక్తాదామ పతాకాభిర్వితాన శయనాసనైః
ధూపైస్సురభిభిర్దీపైస్స్రగ్గంధై రపి మండితమ్॥ 2॥

## నలువదిఎనమిదవ అధ్యాయము

*శ్రీశుకుడిట్లనెను:*

తా॥ సర్వాత్ముడు, సర్వదర్శనుడును, అయిన శ్రీకృష్ణుడు , అలంకారాదులు చేయునదియు, కామముతో తపించి పోయినదియునైన కుబ్జ యొక్క వ్యథ నెఱింగిన వాడై, ఆమెకు ప్రియమును కలుగజేయదలచి ఆమె ఇంటికి పోయెను. (1)

టీ॥ నలుబది ఎనమిదవ అధ్యాయమున, కృష్ణుడు కుబ్జను రమింపజేసెను. అక్రూరుని ఇంటికి పోయి, అతనిని హస్తినాపురమునకు పోవుటకై ఆదేశించెను, సైరంధ్రి(కుబ్జ) కామమును తీర్చి తక్కిన మనోరథములన్నింటిని తీర్చి అక్రూరుని కోరికలను తీర్చి అతనిచే- అతని ద్వారా పాండవులను ఓదార్చెను. ॥1॥

తా॥ అమూల్యములైన గృహోపకరణములతో నొప్పుచుండునదియు, కామోద్దీపనము కలిగించు చిత్రములతో నిండియున్నట్టిదియు, ముత్యాల హారములు, పతాకములు మేలుకట్టులతో, అలంకరింపబడిన పాన్పులు, ఆసనములు, పరిమళభరితములైన ధూపములు, దీపములు, పూలమాలలు, చందనములు, మొదలగు వానితో ఆ గృహము అలంకరింపబడి యుండెను. (2)

టీ॥ మహార్హేతి. మహార్హైః అనర్ఘైః ఉపస్కరైః గృహోపకరణైః అన్వితం కామోపాయైః తదుద్దీపకైః సురతబంధాదిలేఖ్యైః ఉపబృంహితం॥2॥

టీ॥ మహార్హైః- మిక్కిలి వెలకలిగిన- ఉపస్కరైః -గృహోపకరణముల చేత- కూడినది- కౌమోపాయైః- కామమును ఉద్దీపింప జేయగల రతిబంధనముల చిత్రములచేత విస్తరింప బడియున్నది. ॥2॥

శ్లో॥ గృహం తమాయాంత మవేక్ష్య సాసనా
త్సద్యస్సముత్థాయ హి జాతసంభ్రమా ।
యథోప సంగమ్య సఖీభిరచ్యుతం
సభాజయామాస తదాసనాదిభిః ॥ ॥3॥

తా॥ కృష్ణుడు ఇంటికి వచ్చుట చూచి, కుబ్జ ఆసనము నుండి లేచి సంభ్రమము కలిగినదియై, చెలులతో కూడ కృష్ణుని సమీపించి ఆసనాది సత్కారములతో అతనిని సంభావించెను. (3)

శ్లో॥ అథోద్ధవస్సాధు తయాభిపూజితో
న్యషీ దదుర్వ్యా మభిమృశ్య చాసనమ్
కృష్ణోఽపి నూత్నం శయనం మహాధనం
వివేశ లోకాచరితాన్య సువ్రతః ॥ ॥4॥

తా॥ పిమ్మట ఉద్ధవుడు కూడా కుబ్జ చేత యథోచితముగ పూజింప బడియు, తన కొఱకు ఉద్దేశింపబడిన ఆసనమును స్పృశించి నేలపైననే కూర్చుండెను (కృష్ణునితో సమానముగ ఆసనముపై కూర్చుండుట ఉచితము కాదని భావించెను కాబోలు) కృష్ణుడు మాత్రము చాలా విలువగల కొత్త మంచముపైన లోకాచారము ననుసరించుచున్నవాడై కూర్చుండెను. (4)

టీ॥ గృహమితి. యథా యథోదితం. ॥3,4॥

టీ॥ యథా - ఉచితరీతిని. ॥3,4॥

శ్లో॥ సా మజ్జనా లేప దుకూల భూషణ
స్రగ్గంధ తాంబూల సుధాసవాదిభిః ।
ప్రసాధితాత్మోపససార మాధవం
సవ్రీడ లీలోత్స్మిత విభ్రమేక్షితైః ॥ ॥5॥

తా॥ కుబ్జ, స్నానము, అంగరాగము, వస్త్రములు, ఆభూషణములు, పూలమాలలు,సుగంధములు, తాంబూలము, సుధాసవము, మొదలగు వానితోతనను తానుచక్కగా అలంకరించుకొని ఇంచుకసిగ్గు, విలాసము పైకి ఉబికిన చిరునవ్వు, విభ్రమముతో కూడిన చూపులతో కృష్ణునికి దగ్గరగా వచ్చెను. (5)

టీ॥ సేతి. ప్రసాధితః యోగిత్వాం ఆపాదితః ఆత్మా దేహః యయా సా. సవ్రీడం యత్ లీలయా ఉద్గతం స్మితం తత్ ఏషు భ్రమేషు తద్యుక్తైరీక్షితైరుపలక్షితా.॥5॥

టీ॥ ప్రసాధితః – యోగ్యత నాపాదించిన – ఆత్మా–దేహము ఎవరికో ఆమె సిగ్గుతో కూడ –లీలగా ఉబికివచ్చిన చిరునవ్వు గలదియై– విలాసములతో కూడిన చూపులతో గుర్తింపబడుచున్నదై. ॥5॥

శ్లో॥ ఆహూయ కాంతాం నవ సంగమహ్రియా
విశంకితాం కంకణ భూషితే కరే ।
ప్రగృహ్య శయ్యా మధివేశ్య రామయా
రేమేఽనులేపార్పణ పుణ్యలేశయా ॥ ॥6॥

తా॥ క్రొత్తకలయిక వలన కలుగు సిగ్గుతో సందేహించుచున్న ఆ కుబ్జను దగ్గరకు పిలిచి, కృష్ణుడు కంకణములతో అలంకరింప బడియున్న ఆమె రెండు చేతులను పట్టుకొని, శయ్యపైకి ప్రవేశించి ఆమెతో క్రీడించెను. లోగడ కృష్ణునకు అనులేపనము నిచ్చిన పుణ్యలేశము యొక్క ఫల స్వరూపమే ఈ ఘటన. (6)

టీ॥ ఆహూయేతి. అనులేపార్పణాదన్యస్తస్యాః పుణ్యం నాస్తీతి దర్శయితుం పుణ్యలేశయేత్యుక్తం. న తు పుణ్యస్యాల్పత్వవివక్షయా॥6॥

టీ॥ అనులేపనము సమర్పించి యుండుటకంటె ఇతరమైన పుణ్యము ఆమెకు ఏదియు లేదని చూపుటకు పుణ్య 'లేశము గల దానితో' (క్రీడించెను) అని చెప్పబడినది. ॥6॥

శ్లో॥ సానంగతప్త కుచయో రురసస్తథాక్ష్ణో
ర్జిఘ్రంత్యనంతచరణేన రుజో మృజంతీ ।
దోర్భ్యాంస్తనాంతరగతం పరిరభ్యకాంత
మానందమూర్తిమజహాదతి దీర్ఘతాపమ్ ॥ ॥7॥

తా॥ మన్మథతాపము నొందియున్న తన కుచములకు, వక్షఃస్థలమునకు, కన్నులకును, కృష్ణుని పాదముతో రాపిడి కలిగించుచు, కన్నుల కద్దికొనుచు, చరణ పరిమళములను ఆఘ్రాణించుచు, తాప వ్యాధిని క్షాళనము చేసి, తన స్తనమధ్యమున నతుకుకొని యున్న ఆనంద స్వరూపుడగు కాంతుని తన బాహువులతో కౌగిలించుకొని తన దీర్ఘ కాలపు తాపమును బాపుకొనెను.(7)

టీ॥ సేతి. కుచాదీనాం రుజో మృజంతీ జిఘ్రంతీ చరణం.॥7॥

టీ॥ ఈ విధముగ ప్రాకృత దృష్టితో కుబ్జ కామమునే యాచించెను. గోపికల వలె కృష్ణ నిష్ఠను కాదు.-కుచములు మొదలగు వాని యొక్క తాపమును బాపుకొనుచు-ఆతని పాదమును ఆఘ్రాణించుచు- ॥7॥

శ్లో॥ సైవం కైవల్యనాథం తం ప్రాప్య దుష్ప్రాపమీశ్వరమ్ ।
అంగరాగార్పణేనాహో దుర్భగైన మయాచత ॥ ॥8॥

తా॥ ఆమె ఈ విధముగ కైవల్యమునకు ప్రభువగు కృష్ణుని పొంది, పొందుటకు శక్యముకాని వానిని పొంది, అహో! అంగరాగమును మాత్రము సమర్పించుట చేత దుర్భగయైన కుబ్జ ఆతనిని తన కామ తాప శాంతిని యాచించెను.(8)

శ్లో॥ అహోష్యతామిహ ప్రేష్ఠ దినాని కతిచిన్మయా ।
రమస్వ నోత్సహేత్యక్తుం సంగం తేఽ ంబురు హేక్షణ ॥ ॥9॥

తా॥ ప్రియతమా! కృష్ణా! కొన్ని దినముల వఱకు ఇచటనే ఉండుము. కమలలోచనా! నాతో క్రీడింపుచు నాతో ఇచట నుండుము - నీ సహవాసము విడుచుటకు మనసు రాకున్నది. (9)

టీ॥ సేతి. ఏనం కామమేవ ప్రాకృతదృష్ట్యా అయాచత న తు గోప్య ఇవ సా తన్నిష్ఠేతి దుర్భగేత్యుక్తం కృతార్థత్వే తు తస్యాః న సందేహః ॥8,9॥

టీ॥ పామర దృష్టితో ఆమె తన కామ శాంతినే కామించెను. గోపికల వలె కృష్ణుని యందు సర్వాత్మనా నిష్ఠను కలిగియుండుటను, కోరలేదు అందుచేతనే ఆమె 'దుర్భగ' అనిచెప్పబడినది. ఆమె యొక్క కృతార్థత్వము నందు సందేహమేమియును లేదు. ॥8,9॥

శ్లో॥ తస్యై కామవరం దత్వా మానయిత్వా చ మానదః ।
సహోద్ధవేన సర్వేశస్స్వధామాగమదృద్ధిమత్ ॥ ॥10॥

తా॥ సర్వేశ్వరుడు, బుద్ధిమంతుడు, మానదుడును ఐన శ్రీకృష్ణుడు ఆమెను సమ్మానించి కామమునే వరముగా నిచ్చి ఉద్ధవునితో కూడ తనమందిరమునకు బోయెను. 10

టీ॥ తస్యా ఇతి, కామఏవ వరః తం దత్వా మానయిత్వా చ అలంకారాది దానైః॥10॥

టీ॥ కామమే వరము – దానిని ఇచ్చి – మానయిత్వా– అలంకారాది దానములచే సమ్మానించి. ॥10॥

శ్లో॥ దురారాధ్యం సమారాధ్య విష్ణుం సర్వేశ్వరేశ్వరమ్ ।
యా వృణీత మనోగ్రాహ్య మసత్వాత్కుమతిర్హ్యసౌ ॥ ॥11॥

తా॥ ఈశ్వరులకే ఈశ్వరుడును, వస్తుతః పూజించుటకే సాధ్యము కాని వాడును, అయిన విష్ణుభగవానుని పూజించి, ఆ కుబ్జ మనస్సు చేత మాత్రమే గ్రహింపదగిన ఆతనిని, తుచ్ఛమైన విషయసుఖమును వరముగ నిమ్మని కోరెను. – ఆమె దుర్బుద్ధి కలదియే కదా! (11)

టీ॥ దురారాధ్యమితి మనోగ్రాహ్యం విషయసుఖం అసత్వాత్ తుచ్ఛత్వాత్. ॥11॥

టీ॥ మనస్సుతో మాత్రమే తెలిసికొన దగిన పరమాత్ముని తుచ్ఛత్వము వలన విషయ సుఖమును కోరెను.॥11॥

శ్లో॥ అక్రూర భవనం కృష్ణస్సహ రామోద్ధవః ప్రభుః ।
కించిచ్చికీర్షయన్ ప్రాగా దక్రూర ప్రియ కామ్యయా ॥ ॥12॥

తా॥ ఒకనాడు ప్రభువైన శ్రీకృష్ణుడు, బలరాముడు ఉద్ధవుడును వెంట రాగా, అక్రూరునికి ప్రియము చేయదలచి, అతనితో చిన్నపని చేయింపదలచి అక్రూరుని గృహమునకు వెడలెను. (12)

టీ॥ అక్రూరేతి. కించిచ్చికీర్షయన్ హస్తినపుర ప్రస్థానం కారయితు మిచ్ఛన్నిత్యర్థః అక్రూరప్రియకామ్యయా చ. ॥12॥

టీ॥ కించిచ్చికీర్షయన్ – చిన్నపని చేయింపదలచి –హస్తినాపుర మునకు ప్రయాణము చేయింప దలచి అని అర్థము – అక్రూరునికి ప్రియము చేయదలచియు– ॥12॥

శ్లో॥ సతాన్నరవరశ్రేష్ఠానారాద్వీక్ష్య స్వబాంధవాన్ ।
ప్రత్యుత్థాయ ప్రముదితః పరిష్వజ్యాభ్య నందత ॥ ॥13॥

తా॥ మనుష్య శ్రేష్ఠులలో శ్రేష్ఠులును, సత్పురుషులును, తనకు బంధువులును, అగు రామకృష్ణులు, ఉద్ధవుడును, తనింటివైపే వచ్చు చుండుటను దూరమునుండియే చూచి, అక్రూరుడు ప్రత్యుత్థానము చేసి మిక్కిలి సంతోషించినవాడై, వారిని ఆలింగనము చేసికొని అభినందించెను. (13)

శ్లో॥ ననామ కృష్ణం రామం చ స తైరప్యభివాదితః ।
పూజయామాస విధివత్కృతాసన పరిగ్రహాన్ ॥ ॥14॥

తా॥ అక్రూరుడు, కృష్ణునకు, బలరామునకు నమస్కరించెను. అతడును వారిరువురి చేత నమస్కరింపబడెను. రామకృష్ణులిరువురిని ఆసనముపై కూర్చుండజేసి యథా విధిగ అక్రూరుడు వారిని పూజించెను.॥14॥

టీ॥ స ఇతి. ఆరాత్ దూరత ఏవ. ॥13,14॥

టీ॥ ఆరాత్ – దూరము నుండియే– ॥13,14॥

శ్లో॥ పాదావనేజనీరాపశ్శిరసా ధారయన్నృప ।
అర్హణేనాంబరైర్దివ్యైర్గంధ స్రగ్భూషణోత్తమైః ॥ ॥15॥

తా॥ రాజా! అక్రూరుడు కృష్ణుని పాదములు కడిగి ఆ పాదోదకమును శిరస్సునందు చల్లుకొనెను. దివ్యమైన వస్త్రములు, సుగంధ ద్రవ్యములు పూలమాలలు, ఉత్తమములైన భూషణములు మున్నగు వాని పూజల చేత. (15)

శ్లో॥ అర్చిత్వాశిరసా నమ్య పాదావంక గతౌ మృజన్ ।
ప్రశ్రయావనతోఽక్రూరః కృష్ణరామావభాషత ॥ ॥16॥

తా॥ పూజించి, శిరస్సువంచి నమస్కరించి, పాదములను ఒడిలో నుంచుకొని వస్త్రముతో తుడుచుచు, అక్రూరుడు భక్తి ప్రపత్తులతో వినమ్రుడై కృష్ణ బలరాములతో ఇట్లనెను. (16)

టీ॥ పాదేతి. ఆ అప ఇతి ఛేదః. ఉదకాని ఆ సర్వతో ధారయన్ని త్యన్వయః. ॥15,16॥

టీ॥ ఆ+ఆపః అని పరిచ్ఛేదము – ఉదకములను – ఆ – అంతటను –ధరించుచు అని అన్వయము. ॥15,16॥

శ్లో॥ దిష్ట్యా పాపో హతః కంసః సానుగో వా మిదం కులమ్ ।
భవద్భ్యాముద్ధృతం కృచ్ఛ్రా ద్దురంతాచ్చ సమేధితమ్ ॥ ॥17॥

తా॥ సంతోషకరముగ పాపాత్ముడగు కంసుడు హతుడగుట జరిగినది. అతని అనుచరులు కూడ తుదముట్టింపబడినారు. ఈ మన వంశము మీచేత దురంతముల నుండి, క్లేశములనుండి, ఉద్ధరింప బడినది. అట్లే ఉన్నతీకరింపబడినది. వృద్ధి చేయబడుచున్నది. (17)

టీ॥ దిష్ట్యేతి. వాం యువయోరిదం కులం. ఉద్ధృతం. సమేధితం చ॥17॥

టీ॥ వాం – మీ – ఈ కులము ఉద్ధరింపబడినది. వృద్ధిచేయబడినది కూడ. ॥17॥

శ్లో॥ యువాం ప్రధాన పురుషౌ జగద్ధేతూ జగన్మయౌ ।
భవద్భ్యాం న వినా కించి త్పరమస్తి న చాపరమ్ ॥ ॥18॥

తా॥ మీరిరువురును ప్రధాన పురుషులు, జగత్తుకు కారణమైనవారు, జగత్తంతయును మీలోనే నిబిడమైయున్నది. మీ కంటె ఇతరమైనది గాని శ్రేష్ఠమైనదిగాని ఏదియును లేదు. (18)

టీ॥ వామిదం కులమిత్యాదివ్యవహారదృష్ట్యోక్త్వా. పరమార్థమాహ యువామితి. జగన్మయౌ యువాం. కుతః? జగద్ధేతూ తదపి కుతః? ప్రధాన పురుషౌ తదస్మాకౌ అతో భవద్భ్యాం వినా. పరం కారణం అపరం కార్యం చ నాస్తీతి. ॥18॥

టీ॥ మీ కులము మొదలగునది వ్యవహార దృష్టితో చెప్పబడినది- ఇక పరమార్థమును చెప్పుచున్నాడు. జగన్మయౌ - జగత్తుతో నిండిన వారు-ఎందువలన? జగద్ధేతూ - జగత్తునకు కారణమైనవారు- అదియునెందులకు ? ప్రధాన పురుషులు కావున - పరమాత్మ స్వరూపులు కావున - అందువలన మీ కంటె పరమకారణము గాని మరియొక కార్యము గాని - లేదు-అని. ॥18॥

శ్లో॥ ఆత్మసృష్టమిదం విశ్వమన్వావిశ్య స్వ శక్తిభిః ।
ఈయతే బహుధా బ్రహ్మన్ శ్రుతిప్రత్యక్ష గోచరమ్ ॥ ॥19॥

తా॥ ఓ పరమాత్మా! ఈ విశ్వమంతయును నీ చేతనే సృష్టింపబడినది. నీ శక్తుల చేత ఆ యా విశ్వపదార్థములలో అనుప్రవేశముచేసి యుండుట చేత వినికిడిచేతను చూచియును తెలిసికొనబడుచున్న అనేకములైన పదార్థముల రూపమున ఇది ప్రతీతమగుచున్నది. (19)

టీ॥ నను ప్రత్యక్షాది సిద్ధం కథం నాస్తీత్యుచ్యత ఇత్యత ఆహ - ఆత్మేతి హే బ్రహ్మన్ పరమేశ్వర బ్రహ్మేతి పాఠః అజాదిభిః స్వశక్తిభిః ఆత్మనైవ సృష్టమిదం విశ్వం అన్వావిశ్య కారణత్వాత్ అనుప్రవిష్టోసి అనుప్రవిశ్యైవ స్థితః శ్రుతి ప్రత్యక్ష గోచరం యథా భవతి తథా.॥19॥

టీ॥ ప్రత్యక్షము మొదలగు ప్రమాణముల చేత సిద్ధముగ గోచరించుచున్న దానిని లేదని ఎట్లు చెప్పనగును? అను ప్రశ్న కలుగగా చెప్పుచున్నాడు. హే బ్రహ్మన్! పరమేశ్వరుడు బ్రహ్మ అని పాఠము- బ్రహ్మదేవుడు మొదలగు స్వశక్తుల చేత ఆత్మ చేతనే (నీ చేతనే) ఈ విశ్వమంతయు సృష్టింపబడినది - అన్వావిశ్య కారణత్వాత్-

శ్లో॥ యథా హి భూతేషు చరాచరేషు
మహ్యాదయో యోనిషు భాంతి నానా ।
ఏవం భవాన్ కేవలమాత్మయోని
ష్వాత్మాత్మతంత్రో బహుధా విభాతి ॥ ॥20॥

టీ॥ బహుధా భవానేవ ప్రతీయతే ఏకస్యైవ బహుధా ప్రతీతౌ దృష్టాంతమాహ యథేతి యోనిషు స్వస్యైవ రూపాంతరేణాభివ్యక్తిస్థానేషు చరాచరేషు భూతేషు యథా మహీప్రముఖాని కారణాన్యేవ. నానా భాంతి ఆత్మయోనిషు స్వకారణకేషు. జీవోఽపి నర మృగాది శరీరేషు. బాలయువాద్యవస్థాసు చ. తథా తథా ప్రతీయత ఇతి తద్వ్యవచ్ఛేదార్థ మాత్మతంత్రగ్రహణం. ॥20॥

అనుప్రవేశము చేయకున్నను, అనుప్రవేశము చేసి యున్నట్లు ఉన్న వాడవు. వినిన పదార్థములను గూర్చియు, చూచిన పదార్థముల గూర్చియు ఎట్లు బోధ కలుగునో అట్లు–(అనుప్రవేశము చేయకున్నను, అను భావమును అర్థము చేసికొనుటకు, "అహమేవా సమేకాగ్రేనాన్యద్య త్సదసత్పరమ్ – పశ్చాదహం యదేతచ్చ యోఽవశిష్యేత సోఽస్మ్య హమ్" అను శ్లోక భావమును క్షుణ్ణముగా గమనింపదగును) ॥19॥

తా॥ సకల జంగమ స్థావర రూపమునగల భూతముల యందు, వానికి కారణతత్వములగు పృథివ్యాదులు ఏ విధముగ నానా రీతులలో ప్రతీతమగుచుండునో అదే విధముగ, నీవే కారణతత్వముగా గల జడ చేతనాది పదార్థములు, నీ శక్తియే ఐన మాయా శక్తి వశమున అనేక విధములుగ కన్పట్టుచున్నవి. (20)

టీ॥ అనేక విధములుగ నీవే ప్రతీతమగుచున్నావు. ఒకే వస్తువు యొక్క వివిధత్వ ప్రతీతికి దృష్టాంతమును చెప్పుచున్నాడు–యోనిషు– నీవే కారణమైన వానియందు – భూత భౌతికముల యందు, జీవుడు కూడ – మనుష్యులు, మృగములు మొదలగు శరీరములందు, బాల్య యౌవ్వనా వస్థల యందును, ఆయా విధములుగ ప్రతీతమగుచుందువు, వీని భిన్నత్వమును తెలుపుటకే 'ఆత్మతంత్రము' అనుమాట గ్రహింప బడినది. ॥20॥

శ్లో॥ సృజస్యథో లుంపసి పాసి విశ్వం
రజస్తమ స్సత్త్వగుణైస్స్వశక్తిభిః ।
న బధ్యసే తద్గుణకర్మభిర్వా
జ్ఞానాత్మనస్తే క్వచ నైవ హేతుః ॥ ॥21॥

తా॥ సత్త్వ రజస్తమో గుణములనెడి నీ శక్తులతో ఈ విశ్వమును సృష్టించుచున్నావు. పాలించుచున్నావు. లుప్తము చేయుచున్నావు. ఐనను ఆ గుణముల చేత గాని వాని కర్మల చేత గాని లిప్తుడవు కావు నీవు జ్ఞానాత్ముడవు - అట్టి నీకు లిప్తుడవుకా గల కారణమేదియును లేదు. (21)

టీ॥ నను సృష్ట్యాది కర్తృత్వేన సగుణత్వేన చ. మమ కిం జీవవద్బంధ ఉక్తః న హి న హీత్యాహ - సృజతీతి. తద్గుణకర్మభిర్వా. తైః గుణైః కర్మభిర్వేత్యర్థః. యతః క్వ చ కదాచిదపి. బంధహేతురవిద్యా తవ నైవాస్తి కుత ఇత్యత ఆహ - జ్ఞానాత్మన ఇతి మాయాయాః ఆశ్రయానా వారకత్వాది భావః. ॥21॥

టీ॥ మఱి ఈ సృష్టి మొదలగు వాని కర్తృత్వము చేత, సగుణత్వము వలనను, నాకు జీవునకు వలె బంధము ఉండునని చెప్పబడినదా? లేదు లేదు అని చెప్పుచున్నాడు. ఆ గుణములచేగాని, వాని కర్మలచే గాని, ఎప్పుడును లేదు - అవిద్యయే బంధమునకు కారణము. అది నీ కెన్నడును లేదు. ఎందులకు? చెప్పుచున్నాడు-జ్ఞానాత్మనః అని- మాయ యొక్క ఆశ్రయము నివారింపలేకపోవుట అనునది లేనందు వలన అని భావము (మాయ యొక్క అనివార్యత్వము జీవులకే-కాని ఈశ్వరునికి కాదు) ॥21॥

శ్లో॥ దేహాద్యుపాధేరనిరూపితత్వా
ద్భవోపి సాక్షాన్నభిదాత్మనస్స్యాత్ ।
అతో న బంధస్తవ నైవ మోక్ష
స్స్యాతాం నికామ స్త్వయి నోఽ వివేకః ॥ ॥22॥

తా ॥ స్థూల సూక్ష్మాది దేహములు మొదలగు ఉపాధులు నిరూపింప రాని వగుటచే ఆత్మ వస్తువునకు పుట్టుక మరణము మొదలగు నవియు, ఇతరమైన భేదములు లేనికారణమున, దానికి బంధమోక్షము లని లేవు. అందువలన అట్టివి నీ యందు ఊహించుట మా అవివేకమే.(22)

టీ॥ కించ ఆస్తాం తావత్తవ బంధశంకా యతః అవిద్యోపాధేర్జీవాత్మనోఽపి. న వస్తుతో బంధోస్తీత్యాహ - దేహాద్యుపాధేరితి. భవోజన్మ. తన్మూలా భిదా చ. సాక్షాత్స్వరూపతో న స్యాదితి. నను మమ బాధాభావం వదతా త్వయా కిం మోక్షోఽంగీకృతః. ఓమితి చేత్తర్హి బంధాభావే మోక్షా సంభవాదాపన్నో బంధోఽపీత్యాశంక్యాహ - అత ఇతి. యతో నావిద్యా అతో న బంధః మోక్షశ్చ ఏవముభౌ న స్యాతామిత్యర్థః. నను ఉలూఖలే మాం బద్ధం శ్రుతవాన్ యమునాహ్రదే తు ముక్తం దృష్టవానసి. అతః కథముభయం నాస్త్యత ఆహ - నికామ ఇతి. స్వాభిప్రాయానురూపస్త్వయి నోఽస్మాక మవివేక ఏవ పరమేవం భూత ఇతి. యద్వా. నః అవివేకత ఏవ తవోభౌ స్యాతామితి. ॥22॥

టీ॥ నీ యందు బంధము గలదేమో అనుశంక అటుండనిమ్ము- అవిద్యయే ఉపాధిగా గల జీవాత్మకు కూడ వస్తుతః బంధములేదు. అని చెప్పుచున్నాడు-భవః - జన్మము-దానికి మూలములైన భేదములు లేవు - సాక్షాత్ స్వరూపతః లేదు అని నాకు బంధాభావమును చెప్పెడి నీకు మోక్షము కలదని అంగీకరించినట్లేనా? అంగీకరించినట్లయినచో అప్పుడు -బంధము లేకున్నచో మోక్షము కూడ సంభవము కాకుండుట వలన -బంధము కూడ ఉండదని శంకించి చెప్పుచున్నాడు- అవిద్య లేనందు వలన బంధముకూడ లేదు. అట్లేమోక్షము కూడ లేదు. ఇట్లు రెండును లేవు. అని అర్థము. నన్ను రోటికి బంధింపబడిన వానిగ వినిన వాడవై, యమునా హ్రదమున విడువబడిన వానినిగ చూచి కూడ అందుచే రెండును లేవని ఎట్లందువు.? అనినచో చెప్పుచున్నాడు -స్వీయాభిప్రాయమునకు అనురూపముగ నీ యందలి మా అవివేకమే ఇట్లు నిర్ణయించుకొనుటకు కారణమని - లేక-మా అవివేకమే నీకు బంధ మోక్షములుండనగునని తెలిపినది - అని. ॥22॥

శ్లో॥ త్వయోదితోఽయం జగతో హితాయ
యదా యదా వేద పథః పురాణః ।
బాధ్యేత పాషండపథై రసద్భిః
స్తదా భవాన్ సత్త్వగుణం భిభర్తి ॥ ॥23॥

తా॥ జగత్కల్యాణము కొఱకు నీచే చెప్పబడిన సనాతనమైన వేద మార్గమునకు, దుష్టములైన నాస్తిక సంప్రదాయములచే క్షతి కలుగునప్పుడు నీవు శుద్ధసత్వగుణ ప్రధానమైన శరీరమును ధరింతువు.(23)

టీ॥ నను తర్హి మమావతారాస్తచ్చరిత్రాణి చ. శుక్తి రజతవదవిద్యా కల్పితాన్యేవ కిం న హి నహీయం తు తవ లీలేత్యాహద్వయేన. త్వయేతి. ॥23॥

టీ॥ అయినచో నా అవతారములు, వాని చరిత్రములును ముత్యము చిప్పలోని వెండి వలె అవిద్యా కల్పితములేనా? కాదుకాదు, ఇది నీ లీలయే అని రెండు శ్లోకములతో చెప్పుచున్నాడు. ॥23॥

శ్లో॥ సత్త్వం ప్రభోఽద్య వసుదేవ గృహేఽవతీర్ణ
స్స్వాంశేన భారమపనేతు మిహాసి భూమేః ।
అక్షౌహిణీ శత వధేన సురే తరాణాం ।
రాజ్ఞామముష్య చ కులస్య యశో వితన్వన్ ॥ ॥24॥

తా॥ ప్రభూ! భూ భారమును తొలగించుటకై నేడు వసుదేవుని యింట స్వీయాంశ చేత అవతరించి యున్నావు. రాక్షసవృత్తి గల రాజుల వందల వందల అక్షౌహిణుల సైన్యములను వధించుట ద్వారా ఈ యాదవ వంశము యొక్క కీర్తిని విస్తరించుచు బలరామునితో సహా అవతరించి యున్నావు. (24)

టీ॥ స ఇతి. సురేతరాంశాయే రాజానః, తేషామక్షౌహిణీశతానాం వధేన. భూమేర్భార మపనేతుం. స్వాంశేన రామేణ సహావతీర్ణోఽసీతి. ॥24॥

టీ॥ దేవతల కంటె ఇతరమైన అంశలచే జనించిన ఏ రాజులు గలరో వారి యొక్క నూర్ల కొలది అక్షౌహిణుల బలములను సంహరించుట చేత భూమి యొక్క భారమును తొలగించుటకు స్వాంశేన బలరామునితో సహా అవతరించి యున్నావు అని. ॥24॥

శ్లో॥ అద్యేశ నో వసతయః ఖలు భూరిభాగా
యస్సర్వ దేవ పితృ భూత నృదేవ మూర్తిః ।
యత్పాద శౌచసలిలం త్రిజగత్పునాతి
స త్వం జగద్గురురధోక్షజ యాః ప్రవిష్టః ॥ ॥25॥

తా॥ ఈశ్వరా! సమస్తమైన దేవతల యొక్కయు, పితృదేవతల యొక్కయు, రాజుల యొక్కయు, స్వరూపుడవైన నీవు, ప్రవేశించినందు వలన ఈనాడు మా గృహములన్నియు గొప్ప భాగ్యమును సంతరించు కొనినవి. నీ పాదములు కడిగిన నీరు ముల్లోకములను పవిత్రము చేయును. అట్టి నీవు జగత్తునంతటికిని గురువువు. అధోక్షజుడవు, భగవానుడవైన నీవు మాగృహములకేతెంచితివి ఎంతటి భాగ్యమో!(25)

టీ॥ అత ఏవంభూతస్య తవాగమనేన కృతార్థోస్మీత్యాహ శ్లోకత్రయేణ. అద్యేతి, హే ఈశ. అద్య నో వసతయో గృహాః తపోవనాదపి బహుపుణ్యాః కుతః. యా వసతీః త్వం సాక్షాత్ప్రవిష్టః కథంభూతః. యస్య తవ. పాద శౌచ సలిలమేవ గంగా త్రిజగత్పునాతి. యశ్చ త్వం పంచయజ్ఞదేవతా మూర్తిః సత్వం జగద్గురురితి.॥25॥

టీ॥ అందువలన ఇట్టి నీ రాక చేత కృతార్థుడనైతినని చెప్పుచున్నాడు. మూడు శ్లోకముల చేత – ఓ ప్రభూ! నేడు మా గృహములు తపోవనము కంటెను మిక్కిలి పుణ్యము కలవి యైనవి. ఎందువలన? ఏ ఇండ్ల లోనికి నీవు సాక్షాత్తుగ ప్రవేశించితివో–నీవు ఎట్టివాడవు? ఏ నీ యొక్క పాదములు కడిగిన నీరు మూడు లోకములను పవిత్రము చేయునో– ఏ నీవు పంచయజ్ఞదేవతా మూర్తివో అట్టి నీవు జగద్గురువువు. ॥25॥

శ్లో॥ కః పండితస్త్వదపరం శరణం సమీయా
ద్భక్తప్రియాదృతగిర స్సుహృదఃకృతజ్ఞాత్ ।
సర్వాన్ దదాతి సుహృదో భజతోఽభి కామా
నాత్మానమప్యుపచయాపచయౌ నయస్య ॥ ॥26॥

తా॥ భక్త ప్రియుడవు, సత్య వచనుడవు, కృతజ్ఞుడవు, అయిన నిన్ను కాక , నీ కంటె ఇతరుడైన వానిని ఏ పండితుడు శరణువేడును? మనస్సుతో నిన్ను భజించు వానికి అన్ని కోర్కెలను ఇచ్చెదవు. వృద్ధి క్షయాది పరిణామములు లేని ఆత్మను కూడ (నిన్ను నీవు కూడ) ఇచ్చుకొందువు. (26)

టీ॥ స్వ మనోరథః పరిపూరిత ఇతి తుష్యన్నాహ. క ఇతి. ఋతగిరః సత్యవాచః. త్వత్తః అపరం శరణం, కః పండితస్సమీయాత్ గచ్ఛేత్? యతో భవాన్ భజతస్సర్వానభితః కామాంశ్చ. దదాతి ఆత్మానమపీతి. ॥26॥

టీ॥ తన కోరిక తీరినదని సంతోషించుచు చెప్పుచున్నాడు. ఋత గిరః సత్య వాక్కులు గలవాడవు అగు నీ కంటె ఇతరుని ఏ పండితుడు శరణువేడును? ఎందులకనగా నీవు, నిన్ను సేవించువానికి సమస్తము లైన కోరికలను ఇచ్చెదవు అని. ॥26॥

శ్లో॥ దిష్ట్యా జనార్దన భవానిహ నః ప్రతీతో
యోగీశ్వరైరపి దురాప గతిస్సురేశైః ।
ఛింధ్యాశు నస్సుతకళత్ర ధానాప్త గేహ
దేహాదిమోహరశనాం భవదీయ మాయామ్ ॥ ॥27॥

తా॥ ఓ జనార్దనా! మాకు ఆనందము కలిగించుచు, యోగీశ్వరులకు, దేవతాశ్రేష్ఠులకును పొందరాని ఉత్తమస్థితిని కలిగించుచు ప్రకటమైతివి మా పుత్రులపైని, భార్యలపైని, ధనముపైని, ఆప్తులపైని, గృహములపైని దేహాదులపైని, వ్యామోహమనెడి త్రాడును శీఘ్రముగ త్రెంచి వేయుము. నీకు సంబంధించిన మాయను నిశ్శేషముగ పారద్రోలుము. (27)

టీ॥ దిష్ట్యేతి. నః అవివేకినాం తత్రాపి ఇహ గృహ ఏవ॥27,28॥

టీ॥ మా అవివేకుల యొక్క అదియును ఇచట గృహము నందే. ॥27,28॥

శ్రీశుక ఉవాచ:

శ్లో॥ ఇత్యర్చితస్సంస్తుతశ్చ భక్తేన భగవాన్ హరిః ।
అక్రూరం సస్మితం ప్రాహ గీర్భిసంమోహయన్నివ ॥ ॥28॥

తా॥ భగవానుడైన శ్రీకృష్ణుడు ఈ విధముగ భక్తుడైన అక్రూరునిచేత పూజింపబడి, స్తోత్రము చేయబడినవాడై, చిరునవ్వుతో సమ్మోహనము చేయుచున్నవానివలె మాట్లాడుచు అక్రూరునుద్దేశించి యిట్లనెను. (28)

శ్రీ భగవానువాచ:

భగవానుడు ఇట్లుపజూాఆను.

శ్లో॥ త్వం నో గురుః పితృవ్యశ్చ శ్లాఘ్యో బంధుశ్చ నిత్యదా ।
వయం తు రక్ష్యాః పోష్యాశ్చ అనుకంప్యాః ప్రజా హి వః ॥ 29

తా॥ నీవు మాకు పెద్దవాడవు, పినతండ్రివి, ప్రశంసించదగిన వాడవు బంధువువు, నిత్యహితైషివి, ఇక మేము నీచే రక్షింపదగిన వారము. దయ చూపదగిన వారము పుత్రులము. (29)

టీ॥ త్వమితి. వః యుష్మాకం ప్రజాః పుత్రా హి వయమితి. ॥29॥

టీ॥ వః – మీ యొక్క – ప్రజాః పుత్రులము(మేము). ॥29॥

శ్లో॥ భవద్విధా భగవతా నిషేవ్యా అర్హసత్తమాః ।
శ్రేయస్కామైర్నృభిర్నిత్యం దేవాస్స్వార్థా న సాధవః ॥ ॥30॥

తా॥ మీ వంటి భాగవతులు సేవింపదగినవారు, పూజ్యులలో శ్రేష్ఠులు, శ్రేయస్సునుకోరు మనుష్యుల చేత మీరు నిత్యము పూజింపదగిన వారు దేవతలు స్వార్థులు - స్వకార్య సాధనపరులు, సాధు పురుషులు, అట్లు కాదు- వారు పరానుగ్రహపరులు. (30)

టీ॥ నను నృభిర్దేవాస్సేవ్యా ఇతి ప్రసిద్ధం తత్రాహ - భవదితి. దేవా ఇతి. త ఏవ సేవ్యా ఇత్యర్థః. ॥30॥

టీ॥ మనుష్యుల చేత దేవతలు సేవింపదగినవారు. అనునది ప్రసిద్ధము ఆ విషయమును గూర్చి చెప్పుచున్నాడు. దేవతలు స్వార్థులు- తమ ప్రయోజనమును నెరవేర్చుకొనుచుండుట యందు తత్పరులు, సాధువులు మాత్రము కేవలము పరులయందనురాగమును చూపుట యందే తాత్పర్యము గలవారు. పరమార్థమున సాధువులే దేవతలు. వారే సేవింపదగినవారు అని అర్థము. ॥30॥

శ్లో॥ న హ్యమ్మయాని తీర్థాని న దేవా మృచ్ఛిలామయాః ।
తే పునంత్యురుకాలేన దర్శనాదేవ సాధవః ॥ ॥31॥

తా॥ జలమయములైన తీర్థములు, మట్టి, ఱాయి, మొదలగువాని విగ్రహములుగ (రూపములుగ) నున్న దేవతలు దీర్ఘకాలమునకు పవిత్రీకరించును. సాధువులు దర్శన మాత్రముననే పవిత్రీకరింతురు. (31)

టీ॥ తర్హి మృచ్ఛిలాదిమయాః దేవాదయః సేవ్యాః నైవేత్యత ఆహ. నహీతి. అమ్మయాని తీర్థాని. మృణ్మయాః శిలామయాశ్చ దేవా న పునంతీతి న. అపి తు పునంత్యేవ తథాపి సాధూనాం తేషాం చ మహదంతరమిత్యాహ. దర్శనాదేవ తే పునంతీతి. ॥31॥

టీ॥ అయినచో మట్టి, ఱాయి, మొదలగువాని మూర్తుల రూపమున నున్న దేవతలు మొదలగువారు సేవింపదగినవారా? కాదా? ఆ విషయమును చెప్పుచున్నాడు. నీటితో నిండిన తీర్థములు, మట్టితో నిండిన, ఱాతితో నిండిన దేవతలు పవిత్రీకరింపరని కాదు. అయినను

అవి పవిత్రీకరించినను, సాధువులకు దేవతలకు చాలా భేదమున్నదని చెప్పుచున్నాడు సాధువులు దర్శనము చేతనే పవిత్రీకరింతురు అని.(31

శ్లో॥ స భవాన్ సుహృదాం వై నశ్శ్రేయాన్ శ్రేయశ్చికీర్షయా ।
జిజ్ఞాసార్థం పాండవానాం గచ్ఛస్వ గజసాహ్వయ్ ॥ ॥32॥

తా॥ అట్టి నీవు మాకు హితైషులలో సర్వశ్రేష్ఠులు. పాండవులకు శ్రేయస్సును కూర్చుటకును, వారి కుశల వార్తను తెలిసికొనుట కొఱకును నీవు హస్తినాపురమునకు పోవలెను.(పొమ్ము) (32)

టీ॥ కించిచ్చికీర్షయన్ ప్రాగాదితి యదుక్తం తత్ కార్యమాదిశతి స ఇతి - నః సుహృదాం మధ్యే భవాన్ శ్రేష్ఠః అతః పాండవానాం శ్రేయశ్చికీర్షయా గజసాహ్వయం హస్తినాపురం గచ్ఛస్వ గచ్ఛేతి. యద్వా స్వేతి పృథక్ పదం. హేస్వ ఆత్మీయేత్యర్థః. ॥32॥

టీ॥ కొంచెము నీతో పని చేయింపగోరి వచ్చితినని ఏది చెప్పబడెనో అట్టి కార్యమును ఆదేశించుచున్నాడు. మా ఆత్మీయులలో నీవు శ్రేష్ఠుడవు - అందువలన పాండవులకు శ్రేయస్సును కూర్చుటకు నీవు హస్తినాపురమునకు పొమ్ము - అని. ॥32॥

శ్లో॥ పితర్యుపరతే బాలాస్సహ మాత్రా సుదుఃఖితాః ।
ఆనీతాస్స్వపురం రాజ్ఞా వసంత ఇతి శుశ్రుమః ॥ ॥33॥

తా॥ తండ్రియగు పాండురాజు దివంగతుడైన పిదప బాలురైన పాండవులు తల్లియగు కుంతీదేవితో సహా మిక్కిలి దుఃఖితులై యుండిరనియు, ధృతరాష్ట్రుడు వారిని హస్తినాపురమునకు కొనివచ్చె ననియు, ఇప్పుడు వారచ్చటనే వసించియున్నారనియు వింటిమి.(33)

టీ॥ పితరీతి రాజ్ఞాధృతరాష్ట్రేణ. వసంతే నివసంతీతి శుశ్రుమః శ్రుతవంతో వయం॥33॥

టీ॥ రాజ్ఞా - రాజగు - ధృతరాష్ట్రుని చేత - వసంతే - నివసించు చున్నారని - శుశ్రుమః - మేమువింటిమి. ॥33॥

శ్లో॥ తేషు రాజాంబికాపుత్రో భ్రాతృ పుత్రేషు దీనధీః ।
సమో నవర్తతే నూనం దుష్పుత్ర వశగోఽంధదృక్ ॥ ॥34॥

తా॥ అంబికా పుత్రుడైన ధృతరాష్ట్రరాజు, సోదరుని పుత్రులగు, పాండవుల యందు, అంధుడగుటచేతను, దుష్టులగు తన పుత్రుల వశమున నుండుట చేతను దీనమైన బుద్ధిగలవాడై తన పుత్రుల యందు వలె సమబుద్ధితో ప్రవర్తింపకున్నాడు. ఇరువురయెడ సమముగా వ్యవహరింపకున్నాడు. (34)

శ్లో॥ గచ్ఛ జానీహి తద్వృత్తమధునా సాధ్వసాధువా ।
విజ్ఞాయ తద్విధాస్యామో యథా శం సుహృదాం భవేత్ ॥ ।35।

తా॥ ఇప్పుడే నీవచటికి పోయి అచట వారి పరిస్థితి బాగున్నదా? లేదా అను విషయమును తెలిసికొనుము. అది తెలిసికొని ఆత్మీయులైన పాండవులకు సుఖమును కలిగించు పద్ధతిని యోచింతము. (35)

శ్లో॥ ఇత్యక్రూరం సమాదిశ్య భగవాన్ హరిరీశ్వరః ।
సంకర్షణోద్ధవాభ్యాం వై తతస్స్వభవనం యయౌ ॥ ॥36॥

తా॥ అని ఇట్లు అక్రూరుని ఆదేశించి భగవానుడు, ఈశ్వరుడైన శ్రీకృష్ణుడు, బలరామునితో, ఉద్ధవునితోను కలిసి తన భవనమునకు వెడలెను. (36)

టీ॥ తేష్వితి. దుష్టా యే పుత్రాః దుర్యోధనాదయః. తద్వశేన గచ్ఛతీతి తథా. యతః. అంధదృక్ అంధనేత్రః. ॥34-36॥

టీ॥ దుష్టులగు పుత్రులు - దుర్యోధనాదులు వారివశమై వర్తించును కావున అటుల చెప్పబడెను. ఎందువలననగా అంధ దృక్- గ్రుడ్డి వాడైనందు వలన. ॥34-36॥

**శ్రీ మద్భాగవతే, మహాపురాణే దశమస్కంధే,**
**అష్టచత్వారింశోఽధ్యాయః**

**అని శ్రీమద్భాగవతమున దశమస్కంధమందు**
**నలుబది ఎనిమిదవ అధ్యాయము సమాప్తము.**

## ఏకోనపంచాశత్తమోఽధ్యాయః

<u>శ్రీశుక ఉవాచ:</u>

శ్లో॥ స గత్వా హస్తినపురం కౌరవేద్ర యశోంకితమ్ ।
దదర్శత త్రాంబికేయం స భీష్మం విదురం పృథామ్ ॥ ॥1॥

టీ॥ శ్లో"ఊనపంచాశత్తమే తు గత్వాక్రూరో గజాహ్వయం. రాజ్ఞ స్స్వభ్రాతృ పుత్రేషు బుధ్వా వైశమ్యమాగతమ్" స ఇతి కౌరవేంద్రాణాం యశోభిరంకితం తత్కృతదేవ బ్రాహ్మణాయతనాది భిరంకిమిత్యర్థః ॥1॥

శ్లో॥ సపుత్రం చైవ బాహ్లీకం భారద్వాజం సగౌతమమ్ ।
కర్ణం సుయోధనం ద్రౌణిం పాండవాన్ సుహృదోపరాన్॥2॥

టీ॥ సపుత్రమితి బాహ్లీకపుత్రః సోమదత్తః భారద్వాజః ద్రోణః గౌతమః కృపః॥2॥

## నలువదితొమ్మిదవ అధ్యాయము

<u>శ్రీశుకుడిట్లు చెప్పెను:</u>

తా॥ అక్రూరుడు కౌరవుల కీర్తికి అంకితమైయున్న హస్తినాపురమునకు బోయి, అచట ధృతరాష్ట్రుని, భీష్ముని, విదురుని, కుంతిని చూచెను.(1)

టీ॥ నలుబది తొమ్మిదవ అధ్యాయమున అక్రూరుడు హస్తినాపురమునకు పోయి, తమ సోదర పుత్రులగు పాండవులపై ధృతరాష్ట్రుని వైశమ్యమును గూర్చి తెలుసుకొని వచ్చెను. కౌరవేంద్రుల యొక్క యశస్సులచే అంకితమైన, వారిచే చేయబడిన, దేవతలకు యజ్ఞాదులు, బ్రాహ్మణులకు అగ్రహారాది ప్రదానములు, మందిర నిర్మాణములు, ఉద్యానవనములు మొదలగు వానితో గుర్తింపబడుచున్నట్టిది అని అర్థము. ॥1॥

తా॥ పుత్రుడైన సోమదత్తునితో కూడా బాహ్లీకుని, ద్రోణుని, కృపుని, కర్ణుని, సుయోధనుని, అశ్వత్థామను, పాండవులను, ఇతరులైన మిత్రులను కూడా అక్రూరుడు కలిసికొనెను. (2)

టీ॥ బాహ్లీకుని పుత్రుడు సోమదత్తుడు- భారద్వాజః- ద్రోణుడు- గౌతమః కృపాచార్యుడు. ॥2॥

శ్లో॥ యథావదుపసంగమ్య బంధుభిర్గాందినీ సుతః ।
స పృష్టస్తైస్సుహృద్వార్తాం స్వయంచాపృచ్ఛదవ్యయమ్ ॥ ॥3॥

టీ॥ యథావదితి. అవ్యయం కుశలం. ॥3॥

శ్లో॥ ఉవాస కతిచిన్మాసాన్ రాజ్ఞో వృత్తదిదృక్షయా ।
దుష్ప్రజస్యాల్పసారస్య ఖలచ్ఛందానువర్తినః ॥ ॥4॥

టీ॥ ఉవాసేతి. దుష్ప్రజస్య అసత్పుత్రస్య అల్పసారస్య మందధృతేః ఖలానాం కర్ణాదీనాం ఛందమిచ్ఛామనువర్తితుం శీలం యస్యతథా తస్య. ॥4॥

తా॥ గాందినీ పుత్రుడగు అక్రూరుడు బంధువులతో మిత్రులతో కలసినప్పుడు వారు మధురానగరములోని తమ తమ బంధుమిత్రులను గూర్చి వారి కుశల వార్తలను గూర్చి ప్రశ్నించిరి. వారికి సమాధానములు చెప్పుచు అక్రూరుడు హస్తినలోని తన వారి కుశలమును గూర్చియు అడిగెను. (3)

టీ॥ అవ్యయము - కుశలము. ॥3॥

తా॥ దుర్మార్గులైన పుత్రులుగల వాడును, సాహసించి నిర్ణయములు తీసుకొనజాలనివాడును, దుష్టులైన వారి ఇచ్ఛననుసరించి ప్రవర్తించువాడును అయిన ధృతరాష్ట్రుని ప్రవర్తన, పాండవుల యెడ ఎట్లున్నదో తెలిసికొనుట కొఱకు అక్రూరుడు కొన్ని మాసములు హస్తినలోనే ఉండెను. (4)

టీ॥ దుష్ప్రజస్య- దుష్టులైన కుమారులు గలవాని యొక్క- అల్పసారస్య - కొద్దిపాటి ధైర్యము మాత్రమే కలవాని - శీలము- స్వభావము- ఎవనికో - అట్టివాని యొక్క - ఖలానాం - కర్ణుడు మొదలగు వారి - ఛందము- ఇచ్ఛను - అనువర్తితం- అనుసరించి వర్తించుటకు - శీలం - స్వభావం ఎవనికో అట్టివాని యొక్క (ధృతరాష్ట్రుని యొక్క) ॥4॥

శ్లో॥ తేజ ఓజో బలం వీర్యం ప్రశ్రయాదీంశ్చ సద్గుణాన్ ।
ప్రజానురాగం పార్థేషు న సహద్భిశ్చికీర్షితమ్ ॥ ॥5॥

తా॥ పాండవుల యొక్క ప్రతాపము, శస్త్రాది నైపుణ్యము, శౌర్యము, వినయము, మొదలగు సద్గుణములను, ప్రజలఅనురాగమును చూచి సహింపజాలని దుర్యోధనాదుల చేత వారియెడ చేయు దుశ్చేష్టితము లును, అక్రూరుడు చూచుటకు అచ్చట వుండెను. వానిని గూర్చి కుంతి, విదురుడు అతనికి చెప్పిరి. (5)

టీ॥ తేజ ఇతి తేజః ప్రతాపం ఓజః శస్త్రాదినైపుణ్యం వీర్యం న సహద్భిరసహమానైః చికీర్షితం తదుపరి కర్తుమిష్టం. ॥5॥

టీ॥ తేజః-ప్రతాపము, ఓజః-శస్త్రాదినైపుణ్యము, వీర్యం-శౌర్యం, నసహద్భిః-సహింపజాలనివారిచే, చికీర్షితః-తదుపరి చేయుటకు ఇచ్ఛ. ॥5॥

శ్లో॥ కృతం చ ధార్తరాష్ట్రైర్యద్గరదానాద్య పేశలమ్ ।
ఆచఖ్యౌ సర్వమేవాస్మై పృథా విదుర ఏవ చ ॥ ॥6॥

తా॥ కౌరవుల చేత చేయబడిన కర్కశమైన పనులను, పాండవులకు విషమిచ్చుట వంటి వానిని, కుంతి, విదురుడును అక్రూరునకు తెలియ చెప్పిరి. (6)

టీ॥ కృతమితి గరస్య విషస్య దానాది అపేషలం అన్యాయం తేజ ఓజ ఇత్యాది సర్వం కథయామాస. ॥6॥

టీ॥ గరస్య- విషము యొక్క - ఇచ్చుట మొదలగు- అపేశలం- అన్యాయమైన పని - తేజస్సు, ఓజస్సు మొదలైన అన్ని విషయములను చెప్పిరి. ॥6॥

శ్లో॥ పృథా తు భ్రాతరం ప్రాప్తమక్రూరముపసృత్యతమ్ ।
ఉవాచ జన్మనిలయం స్మరంత్యశ్రుకలేక్షణా ॥ ॥7॥

తా॥ సోదరుడగు అక్రూరుడు వచ్చుట తోడనే కుంతి అతనిని సమీపించి, కన్నులు చెమర్చుచుండగా తన జన్మస్థానమును స్మరించు చు ఇట్లనెను. (7)

టీ॥ తత్కథనాత్ పూర్వతరం పృథాయా వృత్తాంతమాహ - పృథేతి అశ్రూణాం కులాః లేశాః యయోస్తే ఈక్షణే నేత్రే యస్యాస్సా. ॥7॥

టీ॥ ఆ కథనము ద్వారా పూర్వతరము నందలి పృథ(కుంతి) యొక్క వృత్తాంతమును చెప్పుచున్నాడు. అశ్రూణాం కలాః - కన్నీటి యొక్క లేశములు వేనికో ఆ నేత్రములు గలది. ॥7॥

శ్లో॥ అపి స్మరంతి నస్సౌమ్య పితరౌ భ్రాతరశ్చ యే ।
భగిన్యో భ్రాతృ పుత్రాశ్చ జామయస్సఖ్య ఏవ చ ॥ ॥8॥

తా॥ సౌమ్యా! సోదరా! తల్లిదండ్రులు, సోదరీ సోదరులు, అక్కలు చెల్లెండ్రు సోదర పుత్రులు, కులస్త్రీలు, స్నేహితురాండ్రు, నన్ను జ్ఞాపకము చేయుచున్నారా? (8)

టీ॥ అపీతి. అపి కిం జామయః కులస్త్రియః ॥ ॥8॥

టీ॥ అపి-ఏమి? జామయః - కులస్త్రీలు. ॥8॥

శ్లో॥ భ్రాత్రేయో భగవాన్ కృష్ణః శరణ్యో భక్తవత్సలః ।
పైతృష్వసేయాన్ స్మరతి రామశ్చాంబురుహేక్షణః ॥ ॥9॥

తా॥ నా తోబుట్టువైన వసుదేవుని కుమారుడును, శరణువేడదగిన వాడును, భక్తవత్సలుడును, భగవానుడును, అయిన కృష్ణుడు తన తండ్రి తోబుట్టువునైన నన్ను నా కుమారులను ఎప్పుడైన స్మరించునా? తామర రేకుల వంటి కన్నులుగల బలరాముడు కూడ మమ్మెపుడైన జ్ఞాపకము చేయునా? (9)

టీ॥ భ్రాత్రేయ ఇతి పైతృష్వసేయాన్ మత్పుత్రానిత్యాశయః. ॥9॥

టీ॥ సైతృష్వసేయాన్ - నా కుమారులగు పాండవులను అని. (9)

శ్లో॥ స పత్నమధ్యే శోచంతీం వృకాణాం హరిణీమివ ।
సాంత్వయిష్యతి మాం వాక్యైః పితృహీనాంశ్చ బాలకాన్ ॥ ॥10॥

తా॥ తోడేళ్ళ మధ్యన లేడివలె, శత్రువుల మధ్యన దుఃఖించుచున్న నన్ను గాని, తండ్రిలేని పిల్లలైన పాండవులను గాని ఎప్పుడైనను మాటలతోనైన ఆతడు ఓదార్చునా? (10)

టీ॥ స పత్నేతి. సాంత్వయిష్యతి కిం. ॥10॥

టీ॥ సాంత్వయిష్యతి కిం?- ఓదార్చునా? (ప్రశ్నార్థకముగ గ్రహింప నగును) ॥10॥

శ్లో॥ కృష్ణ కృష్ణ మహాయోగిన్విశ్వాత్మా విశ్వభావన ।
ప్రపన్నాం పాహి గోవింద శిశుభిశ్చావసీదతీమ్ ॥ ॥11॥

తా॥ కృష్ణా! ఓ కృష్ణా! మహాయోగీ! విశ్వమంతయు ఆత్మగాకలవాడా! విశ్వమందలి భావనయంతయును నీవేయైనవాడా! గోవిందా! శిశువులతో కూడ దుఃఖితురాలనై నిన్నే శరణు వేడుచున్న నన్ను రక్షింపుము. (11)

టీ॥ కుంత్యప్యధిగతపరమార్థా శ్రీకృష్ణం స్తౌతి-కృష్ణేతి హే మహాయోగిన్ మహాన్ యోగ ఉపాయో మాయాఖ్యోఽస్యాస్తీతి. హే విశ్వాత్మన్ సర్వాంతర్యామిన్. హే విశ్వభావన విశ్వపాలక. ప్రపన్నాం శరణాగతాం. అవసీదతీం దుర్యోధనాదికృతైరపకారైః క్లిశ్యంతీం॥11॥

టీ॥ ఓ మహాయోగీ- గొప్ప యోగఉపాయము అగు, మాయయను పేరు గలది ఇతనికి కలదు అని- హే విశ్వాత్మన్! సర్వాంతర్యామి! హే విశ్వ భావనా! విశ్వమును పాలించువాడా! ప్రపన్నా శరణాగతు రాలనైన నన్ను- అవసీదతీం దుర్యోధనాదులచే చేయబడు అపకార ముల చేత బాధపడుచున్న దాననైన నన్ను- ॥11॥

శ్లో॥ నాన్యత్తవ పదాంభోజాత్పశ్యామి శరణం నృణామ్ ।
బిభ్యతాం మృత్యు సంసారాదీశ్వరస్యాపవర్గికాత్ ॥ ॥12॥

తా॥ మనుష్యులకు నీ పాదపద్మములకన్న వేఱొక ఆశ్రయింపదగిన స్థానము లేదని నా విశ్వాసము. మృత్యువుతో నిండియున్న సంసారము నుండి, ఈశ్వరుని యొక్క మోక్షప్రదానము నుండియు భయపడు వారికి నీ పాదపద్మము కంటె వేఱొక శరణ్యమును చూడను. (12)

టీ॥ నేతి. అపవర్గికాత్ మోక్షప్రదాత్. ॥12॥

టీ॥ అపవర్గికాత్ - మోక్షమిచ్చుట నుండి. ॥12॥

శ్లో॥ నమః కృష్ణాయ శుద్ధాయ బ్రహ్మణే పరమాత్మనే ।
యోగేశ్వరాయ యోగాయ త్వామహం శరణం గతా ॥ ॥13॥

టీ॥ నమ ఇతి. శుద్ధాయ ధర్మాత్మనే, బ్రహ్మణే అపరిచ్ఛిన్నాయ. పరమాత్మనే జీవసఖాయ. యోగేశ్వరాయ. అణిమాదియుక్తాయ. యోగాయ జ్ఞానాత్మనే. ॥13॥

శ్లో॥ ఇత్యనుస్మృత్య స్వజనం కృష్ణం చ జగదీశ్వరమ్ ।
ప్రారుదద్దుఃఖితా రాజన్భవతాం ప్రపితామహీ ॥ ॥14॥

టీ॥ ఇతీతి. ప్రపితామహః పాండుః తస్య భార్యా ప్రారుదత్ ప్రరురోద. ॥14॥

శ్లో॥ సమ దుఃఖ సుఖోఽక్రూరో విదురశ్చ మహాయశాః ।
సాంత్వయామాసతుః కుంతీం తత్పుత్రోత్పత్తిహేతుభిః ॥ ॥15॥

తా॥ శుద్ధుడవు, బ్రహ్మవు, పరమాత్మవు, యోగేశ్వరుడవు, యోగ రూపుడవు, కృష్ణుడవు, అగు నీకు నమస్కారము. కృష్ణా! నిన్ను నేను శరణు పొందినాను. (13)

టీ॥ శుద్ధాయ – ధర్మాత్ముని కొఱకు, బ్రహ్మణే – అపరిచ్ఛిన్నుని కొఱకు, పరమాత్మనే – జీవ సఖుని కొఱకు, యోగేశ్వరాయ– అణిమాది సిద్ధులతో కూడుకొని యున్న వాని కొఱకు, యోగాయ – జ్ఞానాత్మయైన వాని కొఱకు (నమస్కారము). ॥13॥

తా॥ రాజా! ఇట్లు స్వజనమును, కృష్ణుని– జగదీశ్వరుడగు కృష్ణుని, తలచుకొని, మీ ప్రపితామహి(తాతమ్మ) మిక్కిలి ఖేదముతో రోదించెను. (14)

టీ॥ పాండురాజు ప్రపితామహుడు, అతని భార్యయగు కుంతి– ప్రారుదత్ – మిక్కిలిగ రోదించినది. ॥14॥

తా॥ సుఖ దుఃఖముల యందు సమభావము గల అక్రూరుడు, మహాకీర్తిమంతుడైన విదురుడును, ధర్మరాజు మొదలగు పాండు కుమారులు ధర్మ సంస్థాపన కొఱకు దేవతాంశలచే పుట్టినవారని, వారు కారణ జన్ములనియు, వారి పుట్టుకకు సంబంధించిన ఆయా కారణములను వివరించుచు కుంతిని ఓదార్చిరి. (15)

టీ॥ సమేతి. పృథయా సహసమం దుఃఖం సుఖం చ యస్య సః తస్యాః పుత్రాణాముత్పత్తిహేతుభిః జనకైః ధర్మానిలేంద్రాదిభిః తత్కథనైరిత్యర్థః. ॥15॥

టీ॥ కుంతీతో సహా దుఃఖము, సుఖము ఎవరికో అతడు–ఆమె యొక్క పుత్రుల జన్మమునకు గలకారణములచేత వారి తండ్రులగు, యముడు, వాయువు, ఇంద్రుడు మొదలగువారి కథను చెప్పుట చేత, అని అర్థము. ॥15॥

శ్లో॥ యాస్యన్రాజానమభ్యేత్య విషమం పుత్రలాలసమ్ ।
అవదత్సుహృదాం మధ్యే బంధుభిస్సౌహృదోదితమ్ ॥ ॥16॥

తా॥ అక్రూరుడు మధురకు పోబోవుచు, పుత్రలాలసుడు, విషమ ప్రవృత్తి గల వాడును, అయిన ధృతరాష్ట్రుని వద్దకు పోయి, స్నేహితుల మధ్య గల అతనితో – రామ కృష్ణాది బంధువులచే సుహృద్భావముతో చెప్పబడిన విషయమును చెప్పెను. (16)

టీ॥ యాస్యన్నితి. బంధుభిః రామకృష్ణాదిభిః సౌహృదేన ఉదితం ఉక్తం యత్ తదవదత్. ॥16॥

టీ॥ బంధుభిః రామ కృష్ణాదులచేత – సౌహృదేన – స్నేహముతో – ఉదితః – చెప్పబడిన దానిని – చెప్పెను. ॥16॥

అక్రూర ఉవాచ:

శ్లో॥ భోభో విచిత్రవీర్యత్వం కురూణాం కీర్తివర్ధన ।
భ్రాతర్యుపరతే పాండావధునాసనమాస్థితః ॥ ॥17॥

అక్రూరుడిట్లు చెప్పెను.

తా॥ విచిత్రవీర్యుల కుమారుడగు ఓ ధృతరాష్ట్రరాజా! కౌరవవంశము యొక్క కీర్తిని వృద్ధి చేయువాడా! నీ తోబుట్టువగు పాండురాజు మరణించిన తరువాత ఇప్పుడు రాజ్య సింహాసనము నధిష్టించితివి. **17**

టీ॥ భోభో ఇతి. భ్రాతర్యుపరత ఇతి పాండోః పుత్రేషు సత్సు రాజాసనం త్వమాస్థిత ఇతి కటాక్షః. ॥17॥

టీ॥ పాండురాజు దివంగతుడైన పిదప – అనగా పాండుపుత్రులు ఉంటూ ఉండగా రాజ్యసింహాసనముపై నీవు కూర్చుంటివి. అని కడగంటి చూపు– (ఈ చూపు సాభిప్రాయము) ॥17॥

శ్లో॥ ధర్మేణ పాలయన్నుర్వీం ప్రజాశ్శీలేన రంజయన్ ।
వర్తమానస్సమం స్వేషు శ్రేయః కీర్తిమవాప్స్యసి ॥ ॥18॥

తా॥ ధర్మముతో రాజ్యమును పాలించుచు, చక్కని స్వభావముతో ప్రజలను రంజింప జేయుచును, నీవారి యందు సమభావముతో వర్తించుచుండుట వలన శ్రేయస్సును, కీర్తిని పొందెదవు. శ్రేయస్సు అనునది పారమార్థికమగు గమ్య (మోక్షము) స్థానము. కీర్తి లౌకికమైన వాచ్యత) (18)

టీ॥ భవతు తథాప్యేనం వర్తమానః శ్రేయోఽవాప్స్యసీత్యాహ. ధర్మేణేతి. ॥18॥

టీ॥ అగుగాక! అట్లైనను ఇట్లు ప్రవర్తించు వాడవైనచో శ్రేయస్సును కీర్తిని పొందెదవు.అని చెప్పుచున్నాడు. ॥18॥

శ్లో॥ అన్యథాత్వాచరన్ లోకే గర్హితో యాస్యసే తమః ।
తస్మాత్త్వమత్వే వర్తస్వ పాండవేష్వాత్మజేషు చ ॥ ॥19॥

తా॥ దీనికి విరుద్ధముగ ప్రవర్తించిన యెడల లోకమున గర్హింప బడుటయే కాక నరకప్రాప్తియు నగును. అందువలన, పాండు పుత్రుల యందును నీ పుత్రుల యందును సమభావమున వ్యవహరింపుము. **19**

టీ॥ అన్యథేతి. తమః నరకం. ఇహ చ మహద్దుఃఖమితి భావః ॥19॥

టీ॥ తమః - నరకము. ఇహలోకమునను గొప్ప దుఃఖము ననుభవింపవలసి వచ్చునని భావము. ॥19॥

శ్లో॥ నేహచాత్యంత సంవాసః కస్యచిత్కేన చిత్సహ ।
రాజన్నపి స్వదేహేన కిము జాయాత్మజాదిభిః ॥ ॥20॥

తా॥ రాజా! ఎవ్వరికైనను, ఎవ్వరితోనైనను, నిత్యమును కలిసి ఉండుట జరుగదు. ఇక జీవుడు దేహముతో కలిసి ఉండుట, లేక మనుష్యుడు భార్యా పుత్రాదులతో కలిసి ఉండుటను గూర్చి చెప్పునదేమి? (20)

టీ॥ నన్వాత్మజానాత్మజాదిషు కథం సమత్వం స్యాత్తత్రాహ-నేతి. అత్యంతం నిత్యం సంవాసః సమ్యగవస్థితః. ॥20॥

శ్లో॥ ఏకః ప్రసూయతే జంతురేక ఏవ ప్రలీయతే ।
ఏకోఽనుభుంక్తే సుకృతమేక ఏవ చ దుష్కృతమ్ ॥ ॥21॥

టీ॥ తత్ర తావదుత్పత్తి మరణయోస్సుఖ దుఃఖయోశ్చ కేనాపి సాహిత్యం నాస్తీత్యాహ ఏక ఇతి. ॥21॥

శ్లో॥ అధర్మోపచితం విత్తం హరంత్యన్యేఽల్ప మేధసః ।
సంభోజనీయాపదేశైర్జలానీవ జలౌకసః ॥ ॥22॥

టీ॥ కించ. యదా చ సహ వసంతి. తదాపి క్లేశోపార్జితవిత్తాప హారితయా పుత్రా నామ శత్రవ ఏవ జ్ఞేయా ఇత్యాహ- అధర్మేతి. సంభోజనీయాః పోష్యాః పుత్రాదయ ఇతి వ్యపదేశైః. అల్పమేధసో మూఢస్య విత్తం హరంతి జలౌకసో మత్స్యః. జీవనభూతాని జలాని-

టీ॥ తాము కన్న వారికి, ఇతరులు కన్న వారికిని సమానత్వము ఎటుల కలుగును- చెప్పుచున్నాడు "న" అని. అత్యంతం- నిత్యము- సంవాసః- చక్కగా సహవసించుట. ॥20॥

తా॥ జీవుడు ఒక్కడే పుట్టుచున్నాడు. ఒక్కడే మరణించుచున్నాడు. పుణ్యకర్మ ఫలమును ఒక్కడే అనుభవించుచున్నాడు- పాపకర్మఫలము కూడా ఒక్కడే అనుభవించుచున్నాడు. (21)

టీ॥ జననమరణములందు, సుఖ దుఃఖానుభవములందును ఎవరి తోడును ఉండదని చెప్పుచున్నాడు. ॥21॥

తా॥ మూఢుని చేత అధర్మముగ సంపాదింపబడిన ధనము," మేము అనుభవింపదగినవారము" అను నెపమున పుత్రాదులచే- నీటిలోని మత్స్యాదులచే నీరువలె అపహరింపబడును. (సంపాదన ఒకరిది అనుభవము ఇతరులది) (22)

టీ॥ మఱియు సహవసించువారైనను కష్టముతో సంపాదింపబడిన ధనమును అపహరించుటచేత పుత్రులనగ శత్రువులే అని తెలుసు కొనవలెను అని చెప్పుచున్నాడు. సంభోజనీయాః – పుత్రులు మొదలగు వారు- అనెడి నెపము చేత -అల్పమేధసః- మూఢుని యొక్క ధనమును

యథా తత్పుత్రా హరంతి. తద్వదితి భావః. ॥22

శ్లో॥ పుష్ణాతి యానధర్మేణ స్వబుధ్యా తమపండితమ్ ।
తే కృతార్థం ప్రహిణ్వంతి ప్రాణారాయస్సుతాదయః ॥ ॥23॥

టీ॥ కించ యానేవం పుష్ణాతి తే ధనమాదాయ మృతా జీవంతోఽపి వా తం పరిత్యజంతీత్యాహ– పుష్ణాతీతి. స్వబుద్ధ్యాస్వీయా ఇత్యభిమానేన రాయః అర్థాః. అకృతార్థం అప్రాప్తభోగం. ॥23॥

శ్లో॥ స్వయం కిల్బిషమాదాయ తైస్తక్తోఽనర్థ కోవిదః ।
అసిద్ధార్థో విశత్యంధం స్వధర్మ విముఖస్తమః ॥ ॥24॥

హరించుచున్నారు. జలౌకసః – చేప యొక్క – జీవనప్రాయములైన జలములు– దాని సంతానమెట్లు హరింతురో అట్లు. ॥22॥

తా॥ ఏ ప్రాణములను, ధనములను, పుత్రులు మొదలగు వారిని, ఇవి తనవి, వీరు తనవారు అనుబుద్ధితో, అధర్మముతో (అధర్మ సంపాదనతో) పెంపు చేయును అట్టి అపండితుని ఆ ప్రాణాదులు వారి పోషించుటలో కృతార్థుడైన వానిని – విడిచి వేయును (నిర్దాక్షిణ్యముగ వదలిపెట్టును). (23)

టీ॥ ఎవ్వారలను ఈ విధముగ పోషించునో, అట్టివారు ధనము తీసుకొని –మరణించి లేక జీవించుచున్నను ఆ అపండితుని వదలి వేయుదురని చెప్పుచున్నాడు– స్వబుద్ధ్యా – తనకు చెందినవి– తనకు చెందినవారు అనెడి అభిమానము చేత– రాయః– ధనములు అకృతార్థః భోగము ప్రాప్తింపని వానిని (కృతార్థుని– అకృతార్థుని కూడ ప్రాణాదులు, విడుచుట తథ్యము) ॥23॥

తా॥ అట్టి అనర్థ నిపుణుడు ( పాపములు చేయుటలో పండితుడు) స్వధర్మవిముఖుడగుటచేత, తనవారిచేత వదలివేయబడి, లౌకికముగను పూర్తికాని మనోరథము గలవాడై, స్వయముగ పాపమును పొంది నరకముకు పోవును(ఇహపరములకు చెడునని తాత్పర్యము). (24)

టీ॥ స పునః పాపైకపాథేయో నరకం విశతీత్యాహ– స్వయమితి. అసిద్ధార్థః అపూర్ణమనోరథః॥24॥

టీ॥ అతడు పాపమే దారి భత్యముగా గలవాడై నరకమును ప్రవేశించునని చెప్పుచున్నాడు – అసిద్ధార్థః– పూర్తికాని కోఁతిక కలవాడై. ॥24॥

శ్లో॥ తస్మాల్లోకమిమం రాజన్ స్వప్నమాయా మనోరథమ్ ।
వీక్ష్యాయమ్యాత్మనాత్మానం సమశ్శాంతో భవ ప్రభో ॥ ॥25॥

తా॥ రాజా! అందువలన ఈ లోకము ఒక కల, ఒకమాయ, ఒక కోరిక (వాస్తవము కానిది) ఈ స్థితిని చూచి నిన్ను నీవే నియంత్రించుకొని సమభావము కలవాడవై– రాజా! శాంతుడవు కమ్ము. (25)

టీ॥ తస్మాదితి. స్వప్నశ్చ మాయా చ మనోరథశ్చ తత్ తేన తుల్యం ఆయమ్య నియమ్య. శాంతస్సన్ సమో భవేతి. ॥25॥

టీ॥ కల, మాయ, కోరిక (మనఃకల్పనము) – దానితో సమానము– ఆయమ్య – నియమించి– నియంత్రించి శాంతుడవైనచో సమబుద్ధి కలవాడవయ్యెదవు. ॥25॥

ధృతరాష్ట్ర ఉవాచ:

శ్లో॥ యథా వదతి కళ్యాణీం వాచం దానపతే భవాన్ ।
తథా న యా నతృప్యామి మర్త్యః ప్రాప్య యథామృతమ్ ॥ 26

ధృతరాష్ట్రుడిట్లు చెప్పెను.

తా॥ ఓ దానపతీ! అక్రూరా! నీవు నా శ్రేయస్సును కోరి చెప్పుచున్న ఈ మాటతో నేను తృప్తిని పొందలేక పోవుచున్నాను.(నాకీ ఉపదేశము సరిపోవుట లేదు ఇంకను ఎంతచెప్పినచో నాలో నీవాశించిన మార్పు కలుగునో?) మరణించు స్వభావముగల మనుష్యునకు అమృతము లభించినను ఎట్లు తృప్తుడు కాకుండునో అట్లే నేను కూడా– నీ వాక్యము అమృతమే అయినను సరిపుచ్చుకొనుట లేదు. (26)

టీ॥ యథేతి. హే దానపతే అక్రూర. న తృప్యామి అలమితి న మన్యే. ॥26॥

శ్లో॥ తథాపి సూనృతా సౌమ్య హృదినస్థీయతే చలే ।
పుత్రానురాగవిషయే విద్యుత్సౌదామినీ యథా ॥ ॥27॥

టీ॥ తథేతి. సూనృతా ప్రియవాక్ చలే అస్థిరేహృది. నస్థీయతే న తిష్ఠతీత్యర్థః. సుదామా నామ పర్వతః తత్రభవా తటిదివ. తస్మిన్ స్ఫటిక శిలామయే సహసైవాతిస్ఫురితా విద్యుత్ యథా లీయతే తద్వ దిత్యర్థః. యద్వా. సుదామామాలా. తస్యా ఇయం సౌదామినీ మాలాకారే త్యర్థః. ॥27॥

టీ॥ హే దానపతే- అక్రూరా! (హితవాక్య ప్రదానపతీ!) న తృప్యామి - చాలునని అనుకొనుట లేదు( హితబోధ,బలమైన జన్మ సంస్కారము లను మార్చ గలుగునా?). ॥26॥

తా॥ అట్లయినను ఓ సౌమ్యా! నీవు వెలువరించిన సుభాషితములు చంచలమైన నా హృదయమునందు పుత్రానురాగ విషయమున స్థిరముగ నిలువజాలకున్నవి. సుదామము అను స్ఫటిక పర్వతము పైన మెఱుపు మెరిసి తత్ క్షణమే అందు లీనమై, కనబడకుండ పోవునట్లు నీ మంచిమాటలు నా మనస్సు నందు క్షణిక స్థితి గలవే అగుచున్నవి. (27)

టీ॥ సూనృతాః- ప్రియవాక్యములు, చలే-అస్థిరమైన- హృదయము నందు- న స్థీయతే- నిలకడగనుండుట లేదు- సుదామా అను పర్వతము నందు మెరిసిన మెరుపువలె దాని యందలి స్ఫటిక శిలా మయమైన దాని యందు హఠాత్తుగా మిక్కిలిగ ప్రకాశించి ఏ విధముగ వెంటనే దానిలో లీనమగునో ఆ విధముగ అని అర్థము. లేక, సుదామా అనునది ఒక మాల, దానిలో ఈమెరుపు అదే మాలయొక్క ఆకారము పొందినట్లు అని అర్థము. ॥27॥

శ్లో॥ ఈశ్వరస్య విధిం కోను విధునోత్యన్యథా పుమాన్ ।
భూమేర్భారావతారాయ యోఽవతీర్ణో యదోః కులే ॥ ॥28॥

టీ॥ నన్వేవం జానతోపి కథమయం మహామోహ ఇతి చేత్తత్రాహ-ఈశ్వరస్యేతి, విధిం విధానం మాయామితి యావత్. కః పుమాన్ విధునోతి న కోఽపీత్యర్థః. ॥28॥

తా॥ ఈశ్వరుని నిర్ణయము ఎవడు మాత్రము దులిపి వేయగలడు? భూమి యొక్క భారమును దించుటకు యదువంశమున కృష్ణుడుగా అవతరించిన అతడి శాసనమును ఎవడు ఉల్లంఘింపజాలును? (28)

టీ॥ ఇది అంతయును తెలిసిన వానికిని ఈ మహామోహము ఎట్లు కలుగుచున్నది? అనినచో చెప్పుచున్నాడు. విధిః - విధానమును - మాయను అని భావము. ఏపురుషుడు దులిపి వేయగలడు? ఎవడును అతిక్రమింపజాలడని అర్థము. ॥28॥

శ్లో॥ యోదుర్విమర్శ పథయా నిజ మాయయేదం
సృష్ట్వా గుణాన్ విభజతే తదనుప్రవిష్టః ।
తస్మై నమో దురవబోధ విహారతంత్రం
సంసారచక్రగతయే పరమేశ్వరాయ ॥ ॥29॥

టీ॥ అతస్తమేవ నమస్యతి-య ఇతి. దుర్విమర్శపథయా అవితర్క్య మార్గయా గుణాన్ కర్మాణి తత్ఫలాని చ. విభజతే వివిచ్య దదాతి. దురవబోధో యో విహారః క్రీడారసః తంత్రం ప్రధానం ముఖ్యకారణం యస్య సంసారచక్రస్య అత ఏవ తస్య గతిర్యస్మాత్తస్మై నమ ఇతి. ॥29॥

తా॥ ఏ పరమేశ్వరుడు విమర్శించుటకు శక్యము కాని మార్గమున, తన మాయతో ఈ సంసార పదార్థములను సృష్టించి, వానిలో అనుప్రవేశము చేయునో, కర్మలు, కర్మఫలాదులను విభజించునో, ఈ ప్రపంచ చక్రమును నిరాఘాటముగా త్రిప్పుచుండునో, దురవగాహమైన లీలా శక్తితో ఇది అంతయును నడుపు చుండునో అట్టి పరమాత్మకు నమస్కారము. (29)

టీ॥ దుర్విమర్శ పథయా - తర్కింపరాని మార్గమున, గుణాన్ - కర్మములు, కర్మఫలములు - విభజతే - వేరుచేసి - ఇచ్చును - దురవగాహమైన ఏ విహారము - క్రీడారసము. తంత్రం -ప్రధానం -ముఖ్యకారణము గలదో -ఏ సంసార చక్రమునకు -అందువలననే అతని గమనము ఎవని వలననో, అతనికి నమస్కారము అని.॥29॥

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

శ్రీశుక ఉవాచ:

శ్లో॥ ఇత్యభిప్రేత్య నృపతే రభిప్రాయం స మాధవః ।
సుహృద్భిస్సమనుజ్ఞాతః పునర్యదుపురీమగాత్ ॥ ॥30॥

శ్రీశుకుడిట్లనెను:

తా॥ ఈ విధముగ ధృతరాష్ట్రుని అభిప్రాయము, కృష్ణుని గూర్చిన అతని ఆంతర్యమును తెలిసికొని, అక్రూరుడు స్నేహితులతోను బంధువులతోను అనుమతిని పొంది మరల మథురానగరమునకు పోయెను. (30)

శ్లో॥ శశంస రామ కృష్ణాభ్యాం ధృతరాష్ట్రవిచేష్టితమ్ ।
పాండవాన్ ప్రతి కౌరవ్య యదర్థం ప్రేషితస్స్వయమ్ ॥ ॥31॥

తా॥ ధృతరాష్ట్రుని వ్యవహార శైలిని, పాండవుల యెడ కౌరవులు ప్రవర్తించు విధానమును- దేనిని తెలిసి కొని వచ్చుటకై తనను శ్రీకృష్ణుడు హస్తినకు పంపెనో అది అంతయును రామకృష్ణులకు అక్రూరుడు నివేదించెను. ॥31॥

టీ॥ ఇతీతి. అభిప్రేత్య జ్ఞాత్వా. ॥30 -31॥

టీ॥ అభిప్రేత్య- తెలిసికొని. ॥30-31॥

శ్రీ మద్భాగవతే, మహాపురాణే దశమస్కంధే,
ఏకోనపంచాశత్తమోఽధ్యాయః
దశమస్కంధః పూర్వభాగః సమాప్తః

అని శ్రీమద్భాగవతమున దశమస్కంధమందు
నలుబది తొమ్మిదవ అధ్యాయము సమాప్తము.
దశమస్కంధ పూర్వభాగము సమాప్తము.

సదానందో విజయతే

జయ కృష్ణానంద

మదనానందో విజయతే తరామ్

జయ మాధవానంద

# శ్రీగురుమదనానందసరస్వతీపీఠము

## రాంపురం, తొగుట మం., మెదక్ జిల్లా



పరమహంస పరివ్రాజకాచార్య

**శ్రీశ్రీశ్రీ మాధవానందసరస్వతీస్వామివారు**

సాధనాత్ సాధ్యతే సర్వమ్ సాధనాత్ సాధ్యతే సర్వమ్ సాధనాత్ సాధ్యతే సర్వమ్ సాధనాత్ సాధ్యతే సర్వమ్ సాధనాత్ సాధ్యతే సర్వమ్ సాధనాత్ సాధ్యతే సర్వమ్